## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

వీరగాథలు—1

# కాటమరాజు కథలు

మొదటి సంపుటము

[ఎపుల పలురాజు కథ, పంపాద్రి కథ, పెద్దిరాజు కథ, పోలురాజు కథ, [illegible] [illegible], కాటమరాజు పట్టం కట్టిన కథ, కరిమహారాజు కథ, [illegible] కథ]

సంపాదకుడు :
డా. తంగిరాల వెంకట సుబ్బారావు, M.A., Ph.D.
సహాయకుడు :
డా. చన్నాప్రగడ తిరుపతిరావు, M.A., Ph.D.




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు—4.

ప్రథమ ముద్రణ
నల—197౮
ప్రతులు-1,100

మూల్యము రు. 30
ముప్పది రూపాయలు

ముద్రణ :
నాగలక్ష్మి ఆర్టు ప్రింటర్సు,
బషీర్‌బాగ్, హైదరాబాద్-500 029.

# తొలి పలుకు

ప్రపంచపు ప్రముఖ సాహిత్యము లన్నింటియందు వలెనే, తెలుగు సాహిత్యముననూ, 'వీరగాథలు' ఒక ప్రత్యేక ప్రక్రియగ, జనానీకపు ఆదరణను, అందును ముఖ్యముగ జానపదుల మన్ననను, విరివిగ ఆర్జించినవి. ఈ విషయమున తెలుగు సాహిత్యమునకు సంబంధించినంతవరకు, ఒక ప్రత్యేక విశిష్టత కన్పట్టుచున్నది. తక్కిన ప్రపంచ సాహిత్యములలో ఎచటను ఈ సాహిత్య ప్రక్రియ అగ్రశ్రేణికి చెందిన కవులను ఆకర్షించినట్లు కన్పట్టదు. కాని తెలుగు దేశపు మేటి కవులలో ఒకడుగ చారిత్రక ఖ్యాతిని ఆర్జించి, కవి సార్వభౌముడుగ ప్రశంసితుడైన శ్రీనాథుని సంతతి వానిని ఈ 'వీరగాథా' ప్రక్రియ ఆకర్షించినది. ఆయన రచించిన 'పల్నాటి యుద్ధము' నాడును నేడును పండిత పామర రంజకమై తెలుగు సాహిత్యమున వన్నెకెక్కినది. అంతేకాదు; ప్రపంచమున ఇప్పటికి వివిధ సాహిత్యములలో లభ్యములగుచున్న వీరగాథలను పరిశీలించి చూడగ, కాలరీత్యా, ప్రాచీనతయందు దీనిని అధిగమించిన వీరగాథ కనరాదని పండితుల అభిప్రాయము.

శ్రీనాథుని తరువాత ఎందరో కవులు వివిధ ప్రాంతీయ చారిత్రక సంఘటనలను ఆధారములుగ గ్రహించి అనేక వీరగాథలను రచించిరి. ఇవి యన్నియు జానపదులందు మౌఖిక ప్రచారమున మాత్రమే నిలచి ఉన్నవి. పాడుటకు అనుకూలముగ ఉండు జానపదీయ గీతశైలిలో రచితములగు ఈ గాథలు కొన్ని ప్రత్యేక ఉత్సవ సందర్భాదులందు, సాంప్రదాయిక గాథాగాయకులచేత పాడబడుచు జనులనురంజింపజేయుచున్నవి. కాని ఆధునిక నాగరికత సంఘమున తెచ్చిన మార్పులవలన అట్టి గాథాగాయకుల సంఖ్య నానాటికి క్షీణించుచున్నది. కావున, క్రమముగ అవి లుప్తములగు పరిస్థితి ఏర్పడు అవకాశము కలదు. అట్టి దురవస్థ సంఘటిల్లక మునుపే వానికి ముద్రితరూపములను కల్పించవలసిన ఆవశ్యకత ఏర్పడినది.

ఇదివరలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారివంటి పండితులు ఈ గాథలందు ఒకటి రెండింటిని, తగు పీఠికలతో ముద్రింపజేసినను అవి సమగ్రములు కావనుట సుస్పష్టము. వీరగాథలను అన్నింటిని, వాని వివిధ పాఠాంతరములను, కాటమరాజు కథలవంటి కథాచక్రములోని గాథలన్నింటిని సేకరించి, సంస్కరించి ప్రకటించుటకు వారికి ఆనాటికి అవకాశము లేకుండెను. అందువలన దొరికిన ఏ ఒకటి రెండింటినో వారు ప్రచురించిరి. ఈ లోపమును పూరించుటకై ఈ వీరగాథలను అన్నింటిని సేకరింపజేసి, సుసంస్కృతరూపములతో, విమర్శనాత్మక పీఠికలతో ప్రచురించుటకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ నిర్ణయించినది. ఆ నిర్ణయానుసారము జరిగిన కృషిలో తొలుతటిది ఈ కాటమరాజు కథలు; ఇది రెండు సంపుటముల గ్రంథము, అందిపుడు వెలువడినది ప్రథమ సంపుటము.

ఈ గ్రంథ సంకలన కర్తలు డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారు జానపద వాఙ్మయ రంగమున పరిశోధకులుగ సుప్రసిద్ధులు. ఈ వీరగాథలను, వాని వివిధ పాఠాంతరములను సేకరించుటకు ఆంధ్రప్రదేశమంతట వీరు, వ్యయ ప్రయాసలకు ఓర్చి పర్యటించి, లభ్యములగు తాళపత్ర గ్రంథములను, సాంప్రదాయిక గాథాగాయకులనుండి లభ్యములగు గాథారూపములను సవిమర్శముగ పరిశీలించి ఈ సంపుటములను సమకూర్చుటయేగాక, దాదాపు [illegible] పుటల పైబడిన పీఠికలను రచించి, వీరగాథల పుట్టుపూర్వోత్తరములను, ఆంధ్ర సాహిత్యమున వానికి గల ప్రాముఖ్యమును సాకల్యముగ చర్చించిరి. ఇటుల బహుశ్రమకోర్చి 'కాటమరాజు కథలు'ను డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన సిద్ధము చేసిరి. ఇందులకై వారికి అకాడమీ సదా కృతజ్ఞతాబద్ధము.

ఈ గ్రంథముద్రణను చక్కగ సకాలమున నిర్వహించిన నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు వారికి మా కృతజ్ఞతలు.

హైదరాబాదు

7-8-76

దేవులపల్లి రామానుజరావు

కార్యదర్శి

# అంకితము

అన్నెమూ పున్నెమూ ఎరుగని అచ్చం దేవుడిలాంటి అమాయకుడు
సంసారంపట్టని తామరాకుమీది నీటిబొట్టు సర్వసంగ పరిత్యాగి తండ్రి సుబ్బన్న-
అత్తమామల ఆరళ్ళ అదక త్తెరలో చిక్కుకున్న పలుచని పోకచెక్క-
నరకయాతనలను తాల్మితో సహిస్తున్న సాధ్వీమతల్లి కన్నతల్లి సీతమ్మ-
అత్తింటికి వెళ్ళవలసిన అక్కలు ఇంతలు అంతలు తమ్ములు-
ధృతరాష్ట్రుడు జగ్గన్నతాత దుర్యోధనాదులు మేనత్తలు-
చుట్టూ కోరలు చాచిన క్రూరసమాజం చుట్టాలు నక్కలూ తోడేళ్ళూ-
గోతులూ గొప్పలూ గుచ్చుకునే సూదిరాళ్లు చిమ్మచీకట్ల తుమ్మముళ్లు-
కీచురాళ్ళ ఈతరుప్పలు బెకబెకల బోదురు కప్పలు-
పామరత్వం ప్రవహించే పంటకాలువ పొంత బ్రహ్మజెముడు డొంకల పుంత -
సుడిగుండాల నడిగోదాట్లో చిక్కిన చుక్కాని విరిగిన కుటుంబం తొట్టిపడవ-
ఈ దారుణ పరిస్థితులన్నింటినీ ధైర్యంగా ఎదిరించి నాయకత్వాన్ని వహించి
తన లేతనెత్తురు కాగడాకొసని ప్రతిభను వెలిగించి పౌరుషాన్ని మండించి
చీకట్లో తడుముకుంటున్న తమ్ముళ్ళకు వెలుగుబాటలు చూపించి ముందడుగు
వేయించి
తన నియమబద్ధ గాంధేయ జీవితాన్ని చుక్కానిచేసి నిత్యం త్యాగంతో తెడ్డువేసి
నావ దరిజేర్చిన మొనగాడు ! కష్టాల మత్స్యయంత్రాన్ని కూల్చిన విలుకాడు !
అనుజన్ముల అభ్యుదయాన్ని చూసి అనుక్షణం పొంగిపోయే అభినవ ధర్మరాజు

మా అన్నయ్య

మా పాలిటి కన్నయ్య

**శ్రీ తంగిరాల వెంకట కృష్ణ సోమయాజుల**

పాదపద్మములకు

భక్తి ప్రపత్తులతో......

—పెద్ద తమ్ముడు

(తంగిరాల వెంకట సుబ్బారావు)

# పీఠికలు - విషయసూచిక

## పీఠిక I

## జానపద విజ్ఞానము - వీరగాథలు

విషయము | పుట

## పీఠిక II

## కాటమరాజు కథాచక్రము

18. 'గుడారుగుట్ట'
(తమకము చింత ప్రక్కన కాటమరాజు
గుడారము వేసికొనిన ప్రదేశము)
19. దొనకొండ గంగగుడికి ఎదురుగానున్న
'కల్లి అరుగులు' లేక 'రాయబారపు అరుగులు'
20. పాలేటి మధ్యనున్న బీరిసీడు విగ్రహము—
చేతిలో కొంగ వాలుకత్తి
(ఎఱగడ్డపాడు)
21. దొనకొండ గంగగుడిలోని
ఒంటికొమ్ము బొల్లావు (కంచుతో చేసినది)
22. దొనకొండ గంగగుడిలోని ఒంటికొమ్ము
బొల్లావు [కొయ్యతో చేసినది]
23. అగుమంచి బావి [గంగ దొనకొండ]
24. అగుమంచిబావి [గంగదొనకొండ]
25. ఆగుమంచిబావి యొద్దున గల
'అగుమంచి బొడ్డు'
[అగుమంచి పూజించిన శివలింగము]
26. పెయ్యల తిప్పలోనున్న 'బత్తిరన్న గవి'
27. చంపుడు కట్టపైనున్న "అగుమంచి పాదాలు"
[దొనకొండ గంగగుడి]
28. అగుమంచి సాగుమానము చేసిన గుండము
[దొనకొండ గంగగుడి]

## పీఠిక - 1

# జానపద విజ్ఞానము - వీరగాథలు

నేడు ప్రపంచమున అనేక విశ్వవిద్యాలయములందు 'జానపద విజ్ఞానము' (Folklore) అను విషయమును గూర్చిన పరిశోధనలు విరివిగా కొనసాగు చున్నవి. ఇది యొక ప్రత్యేక శాస్త్రముగా అభివృద్ధి చెందుచు, పండితుల మన్న నలను పొందుచున్నది. అంతే కాదు, ఇది అత్యంతావశ్యకమైన ఒక అధ్యయన విషయముగా కూడ గౌరవమును సముపార్జించుకొనుచున్నది.

ఒక దేశముయొక్క నాగరకతలో జానపద విజ్ఞానము, కీలకస్థానమును ఆక్రమించుకొని యుండును. అది కోటాను కోట్ల ప్రజల నమ్మకములను, అభి ప్రాయములను, దృక్పథములను, నైతిక విలువలను ప్రతిబింబించుచుండును. ఒక దేశమును, దాని ప్రజలను, వారి సంస్కృతిని సంపూర్ణముగా అర్థము చేసి కొనుటకు జానపద విజ్ఞానాధ్యయనమే మనకు శరణ్యము.

### 1. జానపద విజ్ఞానము (Floklore) :

Folklore' అనునది ఒకే శబ్దము కాదు. అది 'Folk' మరియు 'Lore' అను రెండు శబ్దముల కలయికచే నేర్పడిన సమాసము[1]. ఈ సమాసమును మొట్ట మొదట 'W.J. Thoms' అను పరిశోధకుడు క్రీ. శ. 1846లో సూచించి నాడు. అతని దృష్టిలో 'Folk' అనగా నిరక్షర కుక్షులైన రైతులు (unlettered peasantry) ; 'Lore' అనగా పాండిత్యము లేక విజ్ఞానము

---

1. అందు వలననే దీనిని మొదటి రోజులలో 'Folk-lore' అని విడదీసి వ్రాయుచుండెడి వారు. కాని యిప్పుడు 'Folklore', అని ఒకే పదముగా వ్రాయుట పరిపాటియైనది.

(Learning or knowledge). కావున Folklore అనగా 'అక్షరజ్ఞానము లేని పల్లెప్రజల సాంప్రదాయిక విజ్ఞానము'. అదియే జానపద విజ్ఞానము[2].

ఈ జానపద విజ్ఞానమును పల్లెపట్టులందే కాదు పట్టణములలో సహితము ఒక గుంపుగా కూడి పనిచేయు ప్రజల మధ్య కూడ పరిశీలింప వచ్చునని ఆధునిక జానపద విజ్ఞాన వేత్తల(Folklorists) అభిప్రాయము. మనము పరిశీలింపవలసినది జానపదుని కాదు;జానపద మనస్తత్వమును. అది విద్యావంతులలో కూడ నుండవచ్చునని ఆధునిక వేత్తల నమ్మకము. జానపద జీవితము (Folk-life) నకు సంబంధించిన సమస్త విషయ ములను జానపద విజ్ఞాన పరిధిలోనికి వచ్చి చేరును. "Folklore means Folklearning ; it comprehends all knowledge that is transmitted by word of mouth and all crafs and techniques that are learned by imitation or example, as well as the products of these crafts[3]. దీనినే వేరొక రీతిగా చెప్ప వలెనన్నచో; సంస్కృతికి సంబంధించిన ఏ యే విషయములు, భిన్న భిన్న రూప ములలో, మౌఖిక ప్రసరణమునకాని లేదా ఆచార పూర్వకమైన ఉదాహరణముగా కాని ఏ గుంపునకు చెందిన వ్యక్తులయందైనను సాంప్రదాయికముగా ప్రవాహ

---

2. కన్నడములో ప్రముఖ జానపద శాస్త్రవేత్తయైన ప్రొ. H. M. నాయక్ గారు 'Folklore'ను 'జానపదము' అని భాషాంతరీకరణము చేసిరి. జనపదమునకు సంబంధించిన సమస్త విషయములును ఇందు గర్భితము లగునని వారి అభిప్రాయము. కన్నడిగులు 'జనపద'అనునది విశేషణముగా వాడుకున్నారు.(ఉదా॥ జనపద గీతము,జనపద కథ, జనపద కళ,ఇత్యాది).

3. William Bascom, International Encyclopaedia of Social Sciences, Vol. 5, P. 496.

మగుచుండునో, ఆ విషయములన్నియు జానపద విజ్ఞానము[4], అని నిర్వచింప వచ్చును. దీనినిబట్టి ఈ జానపద విజ్ఞానమునకు అయిదు ముఖ్యలక్షణము లుండు నని తెలుచున్నది. 1. సాంప్రదాయిక ప్రచారమును పొందుట; 2. భిన్నభిన్న పాఠాంతరములను కలిగియుండుట; 3. శాబ్దిక కళలగుచో (Verbal arts) మౌఖిక ప్రసారమున వ్యాపించుట. 4. శాబ్దికేతర కళలగుచో(Non-verbal arts) ఆచారపూర్వకమగు ఉదాహరణముగా వ్యాపించుట; 5. సమాజములో ఏ వర్గమునకు చెందిన వ్యక్తులమధ్య యైనను కనబడుట. ఇటీవలRichard M. Dorson వంటి కొందరు వేత్తలు జానపద విజ్ఞానమునే "జానపద జీవితము" (Folklife) అని పిలచుచున్నారు.

'Folklore' శబ్దము ఇటీవలి వరకును ఒక్క జానపదుల ఆచార వ్యవహారములకు మాత్రమే పరిమితమై యుండెడిది. కాని నేడు దాని అర్థము అతివిస్తృతమై జానపదులకు సంబంధించిన ప్రతి విషయమును సమీకరించుకొని జానపద సాహిత్యమును కూడ కలుపుకొని ఒక మహాసాగర మైనది[5].

---

4. (By Folklore it is meant) "those materials in culture that circulate traditionally among members of any group, in different versions, whether in the oral form or by means of customary example".
—Jan Harold Brunvand,The Study of American Folklore.

5. Folklore includes folk art, folk crafts, folk tools, folk costume, folk custom,folk belief, folk medicine, folk recipes, folk music, folk dance, folk games, folk gestures, and folk speech as well as those verbal forms of expression which have been called folk literature but which are better described as verbal art. Verbal art which includes such forms as folk tales, legends, myths, proverbs, riddles and poetry, has been primary concern of folklorists from both the humanities and social sciences since the beginnings of folklore as a field of study".
—William Bascom. International Encyclopaedia of Social Sciences, Vol. 5. PP 496-97.

జానపదుల కళలు, చేతిపనులు, పనిముట్లు, దుస్తులు, ఆచార వ్యవహారములు, మూఢవిశ్వాసములు, మంత్రతంత్రములు, చిలుకజోస్యము, నాటు వైద్యము, వంటవార్పులు, సంగీతము, నృత్యము, ఆట పాటలు, వినోదములు, పండుగలు—పబ్బములు, వేషభాషలు, హావభావములు, పరిహాసమాటలు—వీని అన్నింటితోపాటు 'జానపద సాహిత్యము' (Folk-literature) అని పిలువబడుచున్న నిరక్షరాస్యులైన పల్లెప్రజల శాబ్దిక వ్యక్తీకరణము కూడ జానపద విజ్ఞానముకే చేరును. ఈ జానపద సాహిత్యమును 'శాబ్దిక కళ' (verbal art) అని పిలుచుట ఎక్కువ సమంజసము కాగలదు. ఇందు జానపద కథలు లేక కట్టుకథలు (Folktales), ఐతిహ్యములు (legends), పుక్కిటి పురాణములు (myths), జానపద గేయములు (Folk-songs), జానపద గేయకథలు లేదా వీరగాథలు (ballads), పొడుపు కథలు (riddles), సామెతలు (proverbs) అను వివిధ శాఖలు కలవు. జానపద విజ్ఞానములో ఈ సాహిత్య విభాగము అత్యంత ప్రధానమైనదిగా భావింపబడుచు, మొదటి నుండియు జానపద విజ్ఞానవేత్తల దృష్టిని ఇది మిక్కిలి ఆకట్టుకొన్నది. ఆ వేత్తలు సాహిత్యమునకు సంబంధించిన వారైనను, సామాజిక శాస్త్రములకు సంబంధించిన వారైనను ఈ విభాగమునే ఎక్కువగ విశ్లేషించుచు వచ్చిరి.

ఇటీవలి కాలమున కొందరు విమర్శకులు జానపదులు తమ నిత్యజీవితములో ఉపయోగించెడి వస్తుపరికరముల (Folk accessories) ను కూడ జానపద విజ్ఞానములో చేర్చవలసిన ఒక ముఖ్యాంశముగా పరిగణించుచున్నారు. వీనినే వారు జానపదుల భౌతిక సంస్కృతి లేదా వస్తుసంస్కృతి (Material culti-ure) అనుచున్నారు. వీనిని పూర్వ విమర్శకులు విస్మరించియున్నారు.

---

6. "Folklore (is the) generic name used to denote those traditional beliefs, superstitions, manners, customs and observances of ordinary people which have persisted from earlier into later periods ..... , in some cases down to the modern times. Folk tales, traditional ballads, folk songs and proverbs also come under this heading and, by a recent extension of meaning, certain aspects of material culture originally excluded by definition".

—Encyclopaedia Britannica Vol. 9, P-518.

చదువుసంధ్యలు లేని వెనుకబడిన సమూజములలోను. లిపి లేని భాషా సమాజములోను జానపదవిజ్ఞానము ఆ సమాజముల సంస్కృతితో అభిన్నమైనదిగా నుండును. కాని అక్షరాస్య పారిశ్రామిక సమాజములో జానపద విజ్ఞానము ఆ సమాజ సంస్కృతిలో ఒక భాగము మాత్రమే. సామూహికముగా సృష్టింపబడిన వస్తువులు, పుస్తకముల మూలమునగాని లేదా నియమిత విద్యాభ్యాసము వలన గాని పొందిన విజ్ఞానము సమాజసంస్కృతిలో ఒక భాగమనుట సత్యమే. కాని అవి జానపద విజ్ఞానము మాత్రము కానేరవు[7]. మానవ శాస్త్రజ్ఞులు(Anthropologists) ను, వాఙ్మయ పరిశోధకులు (Humanists) ను జానపద విజ్ఞానమును వేరువేరుగా నిర్వచించియుండిరి. (మానవ శాస్త్రజ్ఞుల దృష్టిలో జానపద విజ్ఞానము జానపద సంస్కృతిలో ఒక భాగము మాత్రమే. గ్రంథస్థము కాకుండ మౌఖిక సంప్రదాయమున వ్యాపించు జానపద సాహిత్యము మాత్రమే జానపద విజ్ఞానము. జానపదుల నమ్మకములు, ఆచార వ్యవహారములు, వేడుకలు, వినోదములు మొదలగునవి జానపద సంస్కృతికి చేరును కాని జానపద విజ్ఞానమునకు చేరవు. వాఙ్మయ పరిశోధకుల మతమున జానపద విజ్ఞాన మనునది జానపద సంస్కృతితో అభిన్నమైనది.) అయినను వ్రాతమూలకమున సంపాదించిన విజ్ఞానము మాత్రము జానపద విజ్ఞానము కానేరదని ఈ రెండు మతములవారును అంగీకరించి యుండిరి.

---

7. "Objects which are mass produced and knowledge which is acquired through books or formal education are a part of culture, which includes total body of learning, but they are not folklore. In non-literature socities folklore is virtually identical with culture, but in literature-industrialized societies it is only a fragment of culture. Anthropologists and humanists have defined folklore differently, but their defiintions are in fundamental agreement in excluding all learning that is transmitted by writing".

—William Bascom

International Encyclopaedia of Social Sciences Vol.5. PP 496-497.

పైన తెల్పిన విషయముల నన్నింటిని పరిశీలింపగా జానపద విజ్ఞానములో ఐదు ప్రధాన భాగము లున్నవని తేలుచున్నది.

1. జానపద సాహిత్యము లేక "శాబ్దికకళలు" (Folk literature or verbal artse)
2. జానపద భాష (Folk language)
3. జానపద కళలు లేక శాబ్దికేతర కళలు (Folk arts or non-verbal arts)
4. జానపద శాస్త్రములు (Folk sciences)
5. వస్తు సంస్కృతి లేదా జానపద పరికరములు (Material culture or Folk accessories)

కథలు (tales). గేయములు (songs), గేయకథలు (ballads) అనునవి జానపద సాహిత్యమునకు చేరును. అవి శాబ్దిక కళలు.

వ్యక్తుల పేర్లు, గ్రామముల పేర్లు, మాండలిక భాషలు, జానపద రూప నిష్పత్తి (Folk etymology), నుడికారము, సామెతలు, పొడుపు కథలు, తిట్లు, ఒట్లు మొదలగునవి జానపద భాషకు సంబంధించినవి.

జానపదుల సంగీతము, నృత్యము, నాటకము, చిత్రకళ, శిల్పకళ, వాస్తు కళ, వరికుప్పలు గడ్డిమేటులు వేయుట, చేతిపనులు, పచ్చబొట్లు పొడుచుట, సింగారించుకొనుట మొదలగునవి శాబ్దికేతర కళలు.

జానపదుల మూఢ విశ్వాసములు, ఆచార వ్యవహారములు, మంత్ర తంత్రములు, చిలుకజోస్యము, సోదె, పూజాపునస్కారములు, నాటు వైద్యము, వంటకములు మొదలగునవి శాస్త్ర విభాగమునకు చెందును.

జానపదుల నిత్యజీవితము నఉపయోగించెడి పరికరములు, చెంబులు, గిన్నెలు, మంచములు. కంచములు, నగలు,న్కట, దుస్తులు, సింగారము చేసికొనుటకు ఉపయోగించెడి వస్తువులు పదార్థములు, మొదలగునవి వస్తు సంస్కృతి అగును.

## 2. జానపద సాహిత్యము (Folk-literature):

జానపద సాహిత్యమును లేదా శాబ్దిక కళలను మొదట రెండుగా విభజింపవచ్చును. గద్యాఖ్యానము (Prose narrative), కవిత్వము (Poetry). ఈ కవిత్వమునకు శుద్ధ గీతము (Pure songs) కథన గీతములు (Narrative-

songs) అని మరల రెండుగా విడదీయవచ్చును. ఇందలి శుద్ధ గీతములనే మనము పల్లెపాటలు లేదా జానపద గేయములు (Folk songs) అని పిలుచు చున్నాము. కథన గీతములను 'వీర గాథలు' (Ballads) అనవచ్చును. పొడుపు కథలు సామెతలు అనునవి నిజమునకు జానపద భాషకు సంబంధించినవెయైనను, వానిలో హృదయావర్జకమగు రమ్యత ప్రధానముగా నున్నది. కావున వానినికూడ సాహిత్యభాగమున చేర్చికొని అభ్యసించుట పరిపాటియైనది. ఇట్లు చేసినచో జానపద సాహిత్యమున అయిదు ముఖ్య వర్గములు బయటపడును. గద్యాఖ్యానము, జానపద గేయములు, వీర గాథలు, పొడుపు కథలు, సామెతలు. ఈ వర్గములందు కూడ మరల అంతర్భాగములను చూపవచ్చును. ఉదాహరణమునకు గద్యాఖ్యానములో మూడు అంతశ్శాఖలున్నవి : పుక్కిటి పురాణములు (Myths), ఐతిహ్యములు (Legends), 'జానపద కథలు' (Folk tales). ఈ జానపద కథలనే 'జనప్రియ కథలు' (Popular tales), అనియు, 'కిన్నెర కథలు' (Fairy tales) అనియు, 'కట్టు కథలు' (Marchen) అనియు పిలుచుట కలదు. జానపద గేయములలో వలపు పాటలు (Love songs), కన్నీటి పాటలు (Planctus), పిల్లల పాటలు, వేడుక పాటలు, స్త్రీల పాటలు, శ్రామికుల పాటలు, హాస్యపు పాటలు, తత్త్వములు మొదలగు అంతర్భాగములను గుర్తింపవచ్చును. వీరగాథలను లఘు వీరగాథలు (Balladlings), వీర గాథలు (Ballads), వీరగాథా చక్రములు (Ballad-cycles) అని మూడుగా విడదీసి చూపవచ్చును. ఈ వీరగాథలలోను, జానపద కథాదులలోను ఉండెడి రచనా శిల్పమును ఆఖ్యానాంశములను నేడు Tale-type Index, Motif-Index అను అంతర్జాతీయ ప్రసిద్ధిని పొందిన గ్రంథముల నాధారముగా చేసికొని విశ్లేషించి చూపుచున్నారు. (ఇట్టి విశ్లేషణాత్మక విమర్శ తెలుగులోకూడ ప్రారంభము కావలసిన అవసర మెంతేని కలదు)

పొడుపు కథలలో పోలికలు చెప్పబడును కావున ఆ పోలికలను ఆధారముగా చేసికొని వానిని అయిదు రకములుగా వర్గీకరింపవచ్చును. మనుష్యుడో లేక జంతువో స్పష్టముగా తెలియని ప్రాణితో పోలిక చెప్పబడిన పొడుపుకథలు; 2. జంతువుతో పోలిక చెప్పబడిన పొడుపు కథలు; 3. మనుష్యునితో పోలిక చెప్పబడిన పొడుపు కథలు; 4. చెట్టుతో పోలిక చెప్పబడిన పొడుపు కథలు. 5. వస్తువుతో పోలిక చెప్పబడిన పొడుపు కథలు.

సామెతల వర్గీకరణమున మూడు రీతులు అనుసరింపబడుచున్నవి: 1. సామెతలోని మొట్టమొదటి మాటను ఆధారముగా చేసికొని అకారాదిగా సమకూర్చుట; 2. సామెతలోని అతిముఖ్యమైన పదమును తీసికొని అకారాదిగా కూర్చుట; 3. సామెతలోని విషయమును ఆధారముగా చేసికొని వర్గీకరించుట. ఈ మూడు రకముల వర్గీకరణములలోను మూడవది ప్రశస్తమైనది. దీనివ, దానిలో భావ సాదృశ్యముగల సామెతలన్నియు ఒక చోట చేరుటకు అవకాశమున్నది. ఈ పద్ధతిలో మొదట విశాల విభాగమును సూచించి పిమ్మట దానిలో ఉపవిభాగము లను, అందు వివిధ సామెతల స్థానములను చక్కగా నిరూపింప వచ్చును.

ఇట్లు జానపద విజ్ఞానమున జానపద సాహిత్యము ఒక ప్రధాన విభాగమ నియు, అందుగల ఐదు శాఖలలో వీరగాథలు ఒకటి అనియు నిరూపింప వచ్చును. (చూడుడు పట్టీ–1; ఎదుటి పుట) ఇప్పుడు తెలుగులోని వీరగాథలను గూర్చి దిఙ్మాత్రముగా తెలిసికొందము : -

## 3. వీరగాథలు (Ballads) :

ప్రపంచమున వీరులు లేని దేశములేదు; వీరగాథలు (Ballads) లేని సాహిత్యమును లేదు. డెన్మార్క్ దేశమందును, 'ఫేరో' ద్వీపము లందును కవిత్వ మంతయు వీరగాథలతోనే నిండిపోయినది. పోర్చుగీసు సాహిత్యమున వీరగాథలు తప్ప వేరొక ప్రక్రియ కానరాదు. 'సిసిలీ' ద్వీపమున ఏడు వేల వీరగాథ లున్న వని పరిశోధకుల నిర్ణయము. స్పెయిన్, స్కాట్లండు దేశముల వీరగాథా సంపద ప్రత్యేకముగా నెన్నదగినది. మన భారతదేశమున శూరకుల నిలయమగు రాజ స్థానము వీరగాథల పుట్టినిగడ్డ; హిందీ సాహిత్య చరిత్ర వీరగాథాయుగముతోనే శ్రీకారము చుట్టుకొన్నది. మహారాష్ట్రము, పంజాబు, ఆంధ్రప్రదేశములు వీర గాథల కాటపట్టులు.

ఆంధ్ర సాహిత్యమున మనము గర్వింపదగినన్ని వీరగాథలున్నవి. ఇవి మన సాహిత్యమునగల 'మార్గ–దేశి' విభాగములలో దేశికి చెందినవి. దేశి సాహిత్య మందలి కవిత్వము నిబద్ధమనియు అనిబద్ధమనియు మరల రెండు విధములు. ఇందు వీరగాథలు 'అనిబద్ధ దేశి'కి చెందును. దీనినే 'శుద్ధదేశి' అనియు పిలువ వచ్చును. (ద్విపద కావ్యములు, శతకములు, యక్షగానములు, హరికథలు, వీథి నాటకములు మొదలగునవి 'నిబద్ధ దేశికి' చెందును). ఇంకను సూక్ష్మ పరిశీలన ముచే అనిబద్ధదేశిలో 'పామరదేశి' (జానపదదేశి), 'జాతిదేశి' అని మరి రెండు

పట్టీ-1



జానపద విజ్ఞానము
(Folklore)
జానపద సాహిత్యము
(Folk literature)
జానపదభాష
(Folk language)
జానపద కళలు
(Folk arts)
జానపద శాస్త్రములు
(Folk sciences)
జానపద వస్తు సంస్కృతి
లేదా; వస్తు సంస్కృతి
(Folk accessories)
(material culture)
గద్యాఖ్యానము
(Prose narrative)
జానపద గేయములు
(Folk songs)
వీర గాథలు లేదా
జానపద గేయ కథలు
(Ballads)
పొడుపు కథలు
(Riddles)
సామెతలు
(Proverbs)
పుక్కిటి
పురాణములు
(Myths)
ఐతిహ్యములు
(Legends)
జానపద
కథలు
(Folk tales)
లఘు
వీరగాథలు
(Balladlings)
వీరగాథలు
(Ballads)
వీరగాథా చక్రములు
(Ballad-cycles)

శాఖలను గుర్తింపవచ్చును. ఇందు వీరగాథలు పామరదేశికి చేరును. పల్లెపాటలు లేక జానపద గేయములు (Folk-songs) వీని సోదరశాఖ. (స్త్రీల పాటలు, రామదాసు భజన కీర్తనలు, బ్రహ్మంగారి తత్త్వములు మొదలగునవి జానిదేశికి చేరును). (వివరములకై చూ : పట్టి-2; ఎదుటి పుట).

ఈ వీరగాథలు మార్గ కవిత్వములోని ఇతిహాస ప్రక్రియకు మూలకందముగా భావింపబడుచున్నవి. (మహాభారతము 'జయము' అనెడి వీరగాథనుండి పరిణమించినదని విమర్శకుల అభిప్రాయము). జానపద విజ్ఞానము(Folklore) నుండి జానపద భాషను, జానపద శాస్త్రములను, జానపద కళలను, వస్తుసంస్కృతి (Material Culture)ని తప్పించినచో జానపద సాహిత్యము (Folk-literature)మిగులును. ఈ జానపద సాహిత్యమున కథలు(Tales), గేయములు(Songs), గేయకథలు(Ballads) అను మూడు ప్రధాన ప్రక్రియలున్నవి. ఇందలి గేయ కథా ప్రక్రియయే ఈ నా వ్యాసములోని వీరగాథలు.

4. వీరగాథా నిర్వచనము :

'Ballad' శబ్దము 'Ballare' అను లాటిను శబ్దమునుండి పుట్టినది. దీనికి మొదట 'నృత్త గీతము' (dance song)అను అర్థమున్నను, నేడు ఆ యర్థము నశించి 'గేయ రూపమున నున్న కథ' అను అర్థము వ్యాపించియున్నది. Ballad అనునది బాహ్యరూపమున lyric ను అంతర స్వరూపమున epic ను పోలియుండునని పాశ్చాత్య విమర్శకులు నిర్ణయించిరి. ఇది గేయరూపమునునున్న చిన్న ఇతిహాసము, లేదా కథాత్మకమగు పెద్ద గేయము. Ballad శబ్దమునకు సరియైన తెలుగు శబ్దము 'వీరగాథ'. 'జానపద గేయ రూపమునునుండి, వీరరస ప్రధానమగు కథను చెప్పుచు, సంచార గాయక భిక్షువుల (minstrels) చే పాడబడు సరళ కథాగేయమే వీరగాథ' అని తెలుగున నిర్వచింప వచ్చును. బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, ముగ్గురు మరాటీల కథ, సర్వాయి పాపడుకథ మొదలగునవి దీనికి చక్కని లక్ష్యములు.

ఈ వీరగాథలు గాయక భిక్షువులచే రెండు మూడు రాత్రులు పాడదగిన పరిమాణములో నుండును. ఇట్టి వీరగాథలు కొన్ని ఒక ప్రముఖ వీరుని చుట్టును అల్లబడి, అతని గూర్చియు, అతని బంధువులను గూర్చియు పెక్కు కథలను వర్ణించుచుండును. ఒక్కొక్కప్పుడు ఒక కులదైవమునకు ప్రాధాన్యమిచ్చి, ఆ

పట్టీ-2



తెలుగు దేశి కవిత్వము
అనిబద్ధ దేశి (శుద్ధ దేశి)
నిబద్ధ దేశి
పామర దేశి
(జానపదదేశి)
జాతి దేశి
సాహిత్య ప్రధానములు
సంగీతో ద్దేశకములు
(ఉదా: త్యాగరాజు కీర్తనలు)
అభినయో ద్దేశకములు
(ఉదా॥ క్షేత్రయ్య పదములు, జావళులు)
ప్రదర్శనో ద్దేశకములు
(వీధి నాటకములు, యక్ష గానములు, హరికథలు)
పల్లె పాటలు
(జానపద గేయములు)
వీరగాథలు
(జానపద గేయ కథలు)
గేయము
(ఉదా॥అన్నమాచార్యుల కీర్తనలు పెద తిరుమలాచార్యుల వచనములు, సింహగిరి నరహరి వచనములు, ఆధ్యాత్మరామాయణము మొ॥)
పాఠ్యము
(ఉదా॥ద్విపద కావ్యములు, శతకములు, అష్టకములు, ఉదాహరణములు మొ॥)
స్త్రీల పాటలు
రామదాసు భజన కీర్తనలు
ముక్తకములు
కథలు

ద్వీపమును గెలిచిన రాజుల వృత్తాంతములను అనేక వీరగాథలలో ఒక వరుస క్రమమున పెద్ద ఇతిహాసమువలె చెప్పబడుచుండును. ఇట్టి వీరగాథల సమూహమును 'వీరగాథా చక్రము' (Ballad-cycle) అందురు. తెలుగులో పల్నాటి వీరకథలును, కాటమరాజు కథలును వీరగాథా చక్రములకు సరియైన ఉదాహరణములు. ఈ వీరగాథా చక్రములను గాథాకారులు (minstrels) నెలల తరబడి పాడుచుందురు. ఇవియే నిజమగు ఇతిహాసము (epics) లనియు, రామాయణ, మహాభారతాదులు కృత్రిమేతిహాసములనియు కొందరు అమెరికను విమర్శకుల మతము.

మరికొన్ని వీరగాథలు మిక్కిలి హ్రస్వముగ నుండి, జానపదులచే పని పాటలయందుగాని, గాయక భిక్షువులచే పగటిపూట భిక్షమెత్తుకొనునప్పుడుగాని పాడబడుచుండును. ఇవి ఒక గంటలోపుననే పూర్తియగును. వీనిలో కొన్ని కథాత్మకములుగను, మరికొన్ని కేవల కథా సూచకములుగను ఉండును. ఇట్టి వానిని 'వీరగాథానికలు' లేక 'లఘు వీరగాథలు' (Balladlings) అందురు. తెలుగులో గుజ్జాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, బుర్హా వెంగళరెడ్డి పాట, బందోళ్ళ కురుమలన్న పాట మున్నగునవి లఘు వీరగాథలకు చక్కని ఉదాహరణములు.

5. వీరగాథల ప్రాచీనత :

గిరిగహ్వర వాసియగు ప్రాక్తన మానవుని లయాత్మక భాషణమునుండి కాని, నృత్తగీతమునుండికాని కవిత్వము పుట్టియుండును. దీని ప్రాథమికరూపము శుద్ధగేయము. దీనితో కథాకథనము కలిసి వీరగాథ యేర్పడియుండును. ఈ గేయములు, కథాగేయములు పద్య కవిత్వముకన్న ప్రాచీనములనుటలో సందేహము లేదు. గేయముల ఛందస్సులో పద్యముల ఛందస్సు కన్న నియమములు తక్కువగ నుండుట కూడ గేయముల ప్రాచీనతకు పోషకమగుచున్నది. క్రీ.పూ. 3000 సంవత్సరములనాడు ఆర్యులు మనదేశమునకు వచ్చుట ప్రారంభించిరి. అప్పటికి మనదేశమునందున్న నల్లజాతులతో-ముఖ్యముగా ద్రావిడులతో-ఆర్యులు యుద్ధములు చేసిరి. ఈ ఆర్య ద్రావిడ సంఘర్షణలో అనేక వీరగాథలు పుట్టియుండును. అట్టివానిలో రామాయణ మొకటి. ఆర్యుల అంతఃకలహములలో (రాజవంశములోని అంతఃకలహములలో) మహాభారతము, వర్గ కలహములలో

(పురోహిత వర్గము-రాజవర్గముల కలహము) హరిశ్చంద్రుని కథ పుట్టినవని చెప్పవచ్చును. క్రీ.పూ. 5000-4000 సంవత్సరములకు చెందిన మన వేద ములలో వీరగాథా బీజములున్నవి. ఈ వేదములు ప్రాచీనార్యుల జానపద విజ్ఞాన (Folklore) మని విమర్శకుల తలంపు. ఇందలి ఉపాఖ్యానములు వీరగాథలే. వేదములలో వీరగాథలు 'గాథా', 'నారాశంశీ' అను పేర్లతో వ్యవహరింపబడినవి. త్రేతాయుగమున రచింపబడిన రామాయణము, క్రీ.పూ. 3100 ప్రాంతమున రచింపబడిన మహాభారతము- ఈ రెండును ప్రాచీన వీర గాథలనుండి 'ఐతిహాసిక క్రమము' (epic-process)న ఏర్పడియుండును. నలునికథ, హరిశ్చంద్రునికథ ఈ రామాయణ మహాభారతముల కన్న ప్రాచీన ములైనవి.ఇవి భారతదేశమందంతటను వ్యాప్తినొందిన ఐతిహ్యములు(legends). వీర శబ్ద ప్రాచీనతను బట్టి కూడ వీరగాథలు ప్రాచీనములని తలంపవచ్చును. వివిధ ప్రాకృతములలో వీరగాథ లుండియుండును. అపభ్రంశములోని 'రాసములు' వీరగాథలు కావచ్చును. క్రీ. శ. మొదటి శతాబ్దమునాటి గుణాఢ్యుని 'బృహత్కథ' పిశాచములనబడు జానపదుల ముఖస్థ సాహిత్యమునుండి నిర్మింప బడియుండును. ఈ పిశాచములు ఆదిమ ద్రావిడులని అనుమానింప వీలున్నది. కాళిదాసు కాలమున వత్సరాజగు ఉదయనుని సాహసగాథలు పల్లెలలో ప్రచార మందున్నవి. క్రీ. పూ. రెండవ శతాబ్దము నుండియు రాజస్థానులో వీరగాథ లున్నవని తలంపవచ్చును. గ్రీకు, లాటిను, ఆంగ్లోశాక్షను, జర్మను, హీబ్రూ, చైనీస్ మున్నగు ప్రాచీన విదేశ సాహిత్యములందుగూడ వీరగాథ లున్నవనుటకు సాక్ష్యములున్నవి. భారతదేశమున తమిళము, కన్నడము, పంజాబీ, అస్సామీ భాషలలో ప్రాచీన వీరగాథలున్నవని తెలియుచున్నది. సంగీత నాట్యశాస్త్ర గ్రంథములలోని దేశిరాగములయు, గేయములయు ప్రసక్తినిబట్టికూడ వీరగాథల ప్రాచీనత తెలియనగును. తెలుగులో ప్రాఙ్నన్నయ యుగమున గేయములు, వీరగాథలు గలవనుటకు తార్కాణములున్నవి.

6. వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు :

వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు వివాదగ్రస్తమైనవి. పాశ్చాత్య విమర్శకులలో కొందరు, వీరగాథలు అతిప్రాచీన కాలమున జానపద సంఘ ములచే నృత్యమునందు ఆశువుగా సృజింపబడినవని సిద్ధాంతము చేసినారు. మరి

కొందరు ఈ సిద్ధాంతమును ఖండించి, వీరగాథలు మధ్యయుగములలో గాథాకారులచేతను, ప్రత్యేక కవుల చేతను రచింపబడినవనియు, వానికి మూలము ప్రాచీన శిష్ట సాహిత్యమనియు వాదించుచున్నారు.

ప్రాక్తన మానవుని నృత్తగీతముల భావాత్మకమగు చిన్నపాట పుట్టును గాని, కథాకథనముతో గూడిన పెద్దపాట పుట్టుట స్వభావవిరుద్ధము. కావున వీరగాథ జానపద గేయముకన్న ప్రాచీనమైనది కాజాలదు. ఇతిహాసములకు మూలము వీరగాథలు కావచ్చును. అయినను, క్రీ. శ. పండెండవ శతాబ్దముకన్న ప్రాచీనమైన వీరగాథలు ప్రపంచములో ఏ దేశమందును లభించుటలేదు.

అన్ని వీరగాథలును ఒకే విధముగా పుట్టవు. తెలుగులో కొన్ని వీరగాథలు శ్రీనాథాది ప్రత్యేక కవులచే రచింపబడినవి; మరికొన్ని వీరగాథలు జనసమూహ ఆశు రచనలుగా పుట్టినవి. వీరగాథ యీ రెండు విధములలో ఏ విధముగా పుట్టినను, సిసలైన వీరగాథా స్వరూప మేర్పడుటకు అది కొంతకాలము ప్రజలలో మౌఖిక సంప్రదాయము (oral tradition)న నలిగి తీరవలెను.

నాగరకత వీరగాథోత్పత్తికి పరమ శత్రువు. ఆంధ్ర దేశమున నాగరకములైన మాగాణి ప్రాంతములకన్న, అనాగరకములైన మెట్ట ప్రాంతములలో వీరగాథ లధికముగా పుట్టుచున్నవి. దేశ నైసర్గిక స్వరూపము, జాతి మనస్తత్త్వము, కుల స్వభావము మున్నగునవి వీరగాథోత్పత్తులలో కీలకస్థానమును వహించును.

## 7. విదేశ భాషలు— వీరగాథలు :

ప్రపంచమున డెన్మార్కు, ఫేరోద్వీపములు (Faeroe islands), స్కాట్లండు, పోర్చుగల్, సిసిలీ ద్వీపము, స్పెయిన్ దేశములలో వీరగాథ లత్యధికముగా నున్నవి. డెన్మార్కు దేశమందును, తత్సంబంధమగు ఫేరోద్వీపము లందును కవిత్వమంతయు వీరగాథలతోనే నిండిపోయినది. ఒక్క డెన్మార్కునకే కాక తక్కిన స్కాండినేవియా దేశముల (నార్వే, స్వీడన్, ఐస్లాండ్ దేశముల) కన్నింటికిని వీరగాథలు గర్వకారణమగు సాహిత్యముగా పరిణమించి భాసిల్లుచున్నవి. స్పెయిన్ సాంప్రదాయిక వీరగాథలు (traditional ballads) వీనిని తలదన్నినవిగా నున్నవి. పోర్చుగీసు సాహిత్యమున వీరగాథలు తప్ప వేరొక ప్రక్రియ కానరాదు. ఇటలీదేశ విభాగమగు సిసిలీ (Sicily) ద్వీపమున

ఏడు వెల వీరగాథలున్నవని 'పిత్రె' (Pitre) వంటి పరిశోధకులు నిర్ణయించినారు. ప్రపంచమున కొద్దియో గొప్పయో వీరగాథలు లేని దేశము లేదని చెప్పవచ్చును.

## 8. భారత భాషలు — వీరగాథలు :

భారత దేశమున రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, పంజాబు రాష్ట్రములలో వీరగాథలు కొల్లలుగా నున్నవి. వీరగాథా సంపదలో డెన్మార్కు, స్పెయిన్ దేశములతో పోల్చదగినది రాజస్థాన్. హిందీ సాహిత్య చరిత్రమున వీరగాథలకొక ప్రత్యేక యుగమును సంతరింప జేసినది రాజస్థానీ మాండలికమే. వీరగాథను రాజస్థాన్‌లో 'రాసో' అనియు 'చారణ గీత్' అనియు పిలుతురు. 'పృథ్వీరాజ రాసో' ప్రాచీనమును ప్రశస్తమును అగు వీరగాథ. మహారాష్ట్రమున శివాజీనిగురించి ఎన్నియో వీరగాథలున్నవి. మహారాష్ట్రులు వీరగాథను 'పొవాడే' అందురు. పంజాబీయులు వీరగాథను 'వార్' అందురు. 'నాదిర్‌షాదీ వార్' పంజాబీలో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన వీరగాథ. కన్నడమున వీరగాథను 'లావణి' అనుచున్నారు. ఇందు కుమార రాముని కథె, కిత్తూరు చెన్నవ్వరాజ కథె, కరిబంటన కథె, కెరెగె హార్, గోవినహాడు మొదలగునవి ప్రసిద్ధ లావణులు. భారత దేశమున ఇతర భాషలందును వీరగాథలు పుష్కలముగా గలవు.

## 8. తెలుగులో వీరగాథలు :

భరత ఖండమున వీరగాథా సంపదలో రాజస్థాన్‌తో తులదూగగల రాష్ట్రము మన ఆంధ్రదేశము. పౌరాణికములు, చారిత్రకములు, సాంఘికములు మున్నగు విభాగముల క్రిందికి వచ్చు వీరగాథలు తెలుగులో కోకొల్లలుగా నున్నవి. సంఖ్యా బలముననే కాక ప్రాశస్త్య ప్రాచీనతలలో గూడ నివి వన్నెకెక్కినవి. పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు క్రీ.శ. 12, 13 శతాబ్దముల నాటికే తెనుగు గడ్డపై మారుమ్రోగుచుండినవి. మన బొబ్బిలి కథ ప్రపంచమున వేళ్ళపై లెక్కింపదగిన అత్యుత్తమ వీరగాథలలో నొకటి. ప్రాక్పశ్చిమ విమర్శకులు చెప్పిన వీరగాథా లక్షణము లన్నింటిని పుణికి పుచ్చుకొనిన పరమ ప్రశస్త వీరగాథ మన బొబ్బిలి యుద్ధకథ. తెలుగు సాహిత్యమున వీరగాథ లెక్కువగా నుండుటయే కాక, వీరగాథా చక్రములు (Ballad-cycles) ను ఎక్కువగా నుండుట మరియొక విశేషము:

(తక్కిన భారత భాషలలో నిట్టి సుదీర్ఘ చారిత్రక వీర గాథా చక్రములు కానరావు) పౌరాణికములలో పరశురాముని కథాచక్రము, అస్పష్ట చారిత్రికములలో అంకమ్మ కథా చక్రము, చారిత్రకములలో పల్నాటి వీరకథా చక్రము, కాటమరాజు కథా చక్రము మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి. బొబ్బిలి కథ, దేశింగురాజు కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ, ముగ్గురు మరాటీల కథ, లక్ష్మమ్మ కథ, కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, చిన్నమ్మ కథ, చిరుతలమ్మ కథ, ఎరుకల నాంచారి కథ, పసల బాలుడు కథ, సర్వాయి పాపడు కథ, చిన్నపరెడ్డి కథ, సదాశివరెడ్డి కథ, కర్నూలు నవాబు కథ, రావులమ్మ కథ, బళ్లారి కొండప్రలంయని కథ, బంగారు తిమ్మరాజు కథ, కొమారరాముని కథ, గాంధారి కథ – మున్నగునవి తెలుగు నేలపై తరతరములనుండి పాడుకొనిపోయిన వీరగాథలు, తెలుగు గాలిలో చిరకాలముగా మారు మ్రోగుచున్న వీరగాథలు! తెలుగు రక్తములో జీర్ణించిపోయిన వీరగాథలు!!

ప్రాచీనకవులలో నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు, క్రీడాభిరామ కర్త, పాలవేకరి కదిరీపతి (శుకసప్తతి), అయ్యలరాజు నారాయణామాత్యుడు (హంస వింశతి) మున్నగువారు జానపద సాహిత్య ప్రసక్తి నెక్కువగా దెచ్చినారు. ఆంధ్ర వాగ్గేయకారుల రచనలు కొన్ని జానపద కవితానుకరణములు. తెలుగు దేశి రాగముల ప్రసక్తియు, గేయముల ప్రసక్తియు కొన్ని సంగీత లక్షణ గ్రంథములలో సహితము గలదు. ఊహానుబట్టి పరిశీలించినచో తెలుగు భాష సుస్థిర రూపమును దాల్చినప్పటినుండియు, అనగా క్రీ.శ. 6,7 శతాబ్దములనుండియు వీర గాథ లుండియుండవలెను. ప్రాచీన కవుల ప్రసక్తినిబట్టి పరిశీలించినచో నన్నయకు పూర్వము నుండియు వీరగాథలు కలవని తెలియుచున్నది. ఉపలబ్ధములను బట్టియు, చారిత్రక సంఘటనలను బట్టియు పరిశీలించినచో తెలుగులో 'పల్నాటి వీరచరిత్ర'యను వీరగాథా చక్రము ప్రాచీనమైనదిగా కన్పట్టుచున్నది. ఇందలి యితివృత్తము క్రీ.శ. పండ్రెండవ శతాబ్ది చతుర్థ పాదమున (క్రీ.శ. 1178-1182 మధ్యకాలమున) జరిగిన చారిత్రక సంఘటనము. ఉత్తర హిందూదేశమున క్రీ.శ. 12వ శతాబ్దమునాటి 'పృథ్వీరాజ రాసో' అను రాజస్థానీ వీరగాథను, క్రీ.శ. 18వ శతాబ్దమునాటి 'తుగ్లక్‌షా ఖుష్రోన్‌ఖాన్ వార్' అను పంజాబీ వీరగాథను తప్పించినచో, మిగిలినవన్నియును పదునేనవ శతాబ్దమునకు తరువాతివే. తెలుగులో

క్రీ.శ. 12వ శతాబ్దమున 'సిరి యాళని' కథ, 13వశతాబ్ది ఉత్తరార్ధమున పల్నాటి వీరకథలు, పరశురాముని కథలు విరివిగా పాడబడుచుండినట్లు ప్రబల సాక్ష్యములున్నవి.

## 10. వీరగాథా లక్షణములు :-

డా॥బి. రామరాజుగారు జానపద గేయ (folk-song) పరముగాచెప్పిన పదిలక్షణములలోను 'మౌఖిక ప్రచారము, సహజ శైలి, పాడుటకు వీలుగా నుండుట, పునరావృత్తి, జనసామాన్య పరిచిత వస్తువును కలిగియుండుట; ఆశు రచనలు'-అను ఆరు లక్షణములు వీరగాథలకు గూడ వర్తించుచున్నవి: బ్లిస్ పెర్రీ' (Bliss Perry) అను పాశ్చాత్య విమర్శకుడు వీరగాథల నిస్సందేహ లక్షణములను విడమర్చి చెప్పినాడు. మొత్తముపై వీరగాథలకు అతిప్రధానము లైన పదిలక్షణము లుండునని విశ్వయింప వచ్చును: వీరగాథ గేయస్వరూప మున నుండును- ఇది ప్రథమ లక్షణము. సరళచ్ఛందము, పునరావృత్తి (refrain), గానయోగ్యత- అనునవి ఇందలి ఉపలక్షణములు. వీరగాథ కథాఖ్యానాత్మ కముగా నుండును- ఇది ద్వితీయ లక్షణము. నియమిత పరిమాణము, యథార్థ సంఘటనా జన్యత్వము, దేశీయేతివృత్తము, నాయకాభేదత, వీరరస ప్రాధా న్యము, కథా సారళ్యము, హఠాత్ప్రారంభత్వము, సంభాషణా సహితత్వము, వచన రాహిత్యము, విషాదాంతత, అభివర్ధిత పునరుక్తి (incremental repetition) అను పదునొకండును ద్వితీయ లక్షణములోని ఉపలక్షణములు, గాయక భిక్షువుల ఆశుకవనమున జనించుట వీరగాథ యొక్క తృతీయ లక్షణము. కవినామము తెలిసినను వీరగాథ అప్రధాన కర్తృకముగా నుండుట తృతీయ లక్షణములోని అవాంతర లక్షణము. మౌఖిక ప్రసరణము (oral transmission)న దేశమంతయు వ్యాపించుట,మౌఖిక సంప్రదాయము(oral tradition) న తరతరములు జీవించుట వీరగాథల నాల్గవ లక్షణము. బహుజనాదర పాత్రత లేక జనప్రియత్వము (popularity) ఇందలి అవాంతర లక్షణము. వీరగాథ నాటకమువంటి శుద్ధ పరాశ్రయ కవిత్వము (objective poetry)-ఇది దీని ఐదవ లక్షణము.

వీరగాథలలో భాషయేకాక భావములును సరళముగా నుండును. వీరగాథ లలో కొన్ని పడికట్టు పదములు వర్ణనలు పదేపదే ప్రయోగింప బడుచుండును.

వీనిని 'వీరగాథల వారానువర్తనములు' (ballad common places) అందురు. ఇట్టి శైలీ సారళ్యమును, వారానువర్తనమును కలిగియుండుట వీర గాథల ఆరవ లక్షణము. ఎంతటి ప్రతిభా వ్యుత్పత్తులు గల కవియైనను సాంప్ర దాయిక వీరగాథను తనంత తాను సృజింప లేడు. వీరగాథ ప్రజలలో సహజ ముగా పుట్టును: తరువాత దీనిపై కవిచేయి పడవచ్చును. ఇట్లు అనితర సాధ్యము లుగా నుండుట వీరగాథల ఏడవ లక్షణము. ప్రపంచమున వివిధ దేశముల వీరగాథలలో ఒక ఏకసూత్రము కాన్పించును. అందుచే వీరగాథలు ప్రాకృత మానవ సంఘమును, వసుధైక కుటుంబమును నిరూపింప సమర్థములని చెప్ప వచ్చును. ఇట్టి అద్వితీయ గుణము (unique character) ను గలిగి యుండుట వీరగాథల ఎనిమిదవ లక్షణము. వీరగాథలు నీతిని వాచ్యముగా బోధింపకున్నను, ధ్వనింపజేయును. 'విధి బలీయము, మానవుడు నిమిత్త మాత్రుడు' అనునదియే వీనియందు ధ్వనితమగు నీతి. ఇట్టి నీతిని ధ్వనింపజేయుట వీరగాథల తొమ్మిదవ లక్షణము. వీరగాథలు జీవన సంగ్రామమును సామాన్యమైనదానివలె యథాతథముగా [illegible] [illegible] వస్తువును [illegible] ప్రతిధ్వనింపజేయును. ఇది వీరగాథల పదియవ లక్షణము. ఈ పది లక్షణములలోను కొన్ని వీరగాథలందు ఎక్కువగా వర్తించును; మరికొన్ని వీరగాథానుకరణలందు ఎక్కువగా వర్తించును. వీరగాథలలో ఇతిహాస లక్షణములును, వీరగాథానుకరణలలో జానపద గేయ లక్షణములును హెచ్చుగా కానవగును.

వీరగాథల ప్రాశస్త్యమును తెల్పు లక్షణములే కాక, వాని లోపములను తెలుపు లక్షణములును కొన్ని కలవు: సామూహిక రసానందమునే కాని వ్యక్తిగత రసానందమును ఈయలేక పోవుట; పదములు వర్ణనలు పదేపదే పునరుక్తము లగుట: కేవల పఠనమువలన ఇందలి కవిత్వము రసతృప్తి నీయకుండుట సంఘటనలు ఘోరాతిఘోరముగా వర్ణింపబడుట; ఒకే పక్షము వారిని అభి మానించుచు రచన సాగుట; పర్యవసానమున ఏవిధమగు పరమార్థమును సాధింపకుండుట; ఛందో వైవిధ్యము లేకుండుట; మిక్కిలి పరిమితమగు పదజాల మును కలిగియుండుట— మున్నగునవి వీరగాథల ప్రధాన లోపములు.

వర్తమాన కాలమున తెలుగు దేశిసాహిత్యమున విజృంభించిన బుఱ్ఱకథలు వీరగాథానుకరణములేకాని సాంప్రదాయిక వీరగాథలు కానేరవు. ఈ బుఱ్ఱకథ

లకు పైనచెప్పిన ముఖ్య లక్షణము లేవియు వర్తింపవు. కన్నడ దేశిసాహిత్య మందలి లావణీలను, మరాటీ సాహిత్యమందలి 'పొవాడే' అను మన బుఱ్ఱకథలతో పోల్చవచ్చును.

## 11. వీరగాథల వర్గీకరణము :-

ఏ సాహిత్యమందైనను వీరగాథలు ప్రధానముగా రెండు వర్గములుగా నుండును: తరతరములనుండి మౌఖిక సంప్రదాయమున వచ్చుచున్న వీరగాథలు మొదటి వర్గము. వీనిని 'సాంప్రదాయిక వీరగాథలు'(Traditional Ballads) అనియు, 'జనప్రియ వీరగాథలు' (Popular Ballads) అనియు పిలుతురు. ఈ సాంప్రదాయిక లేదా జనప్రియ వీరగాథలకు అనుకరణములుగా ప్రత్యేక కవులచే రచింపబడిన వీరగాథలు రెండవ వర్గము. వీనిని 'సాహిత్య వీరగాథలు' (Literary Ballads) అందురు. (తెలుగులో ద్విపదకావ్యము లిట్టివి): ఇందు మొదటి వర్గము మాత్రమే ప్రధానముగా పరిశీలింపబడుచున్నది. వీరగాథలనగా సాంప్రదాయిక వీరగాథలనియే భావము. ఇట్టి వీరగాథలను ఛందస్సునుబట్టి వర్గీకరించుటకన్న ఇతివృత్తములనుబట్టి వర్గీకరించుట సమంజసము. Prof. Louise Pound, Francis B. Gummese మున్నగు పాశ్చాత్య విమర్శకులు వీరగాథల యితివృత్తములనే ప్రధానముగా గైకొని వర్గీకరించిరి.

తెలుగు విమర్శకులలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, హరి ఆదిశేషువుగారు, ప్రొ॥ బి. రామరాజుగారు, నేదునూరి గంగాధరంగారు, పింగళి లక్ష్మీకాంతంగారు- వీరగాథల వర్గీకరణ విధానమును కొంతలో కొంత సూచించి వారు. ఇందు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి వర్గీకరణము ప్రశస్తమైనది. వీరు 1953లో సూచించిన వర్గీకణముకన్న 1961లో చేసిన వర్గీకరణము మరింత హేతుబద్ధముగానున్నది. వీరు జానపద గేయవాఙ్మయము నంతటిని విడిగేయములు', 'కథా గేయములు' అను రెండు ప్రధాన భాగములుగా విభదీసిరి. (ఇవి పాశ్చాత్యులు చేసిన 'Folk-songs: Ballads' అను విభాగములకు సరిగా అన్వయించును). ఇందు కథా గేయములలో 'జంగంకథలు, బొబ్బిలిపాటవంటివి, పదములు, స్త్రీల కథాగేయములు'- అను నాలుగు విభాగములను సూచించిరి.

తెలుగు వీరగాథలను వర్గీకరించుటలో మౌఖిక సంప్రదాయము కొంత ప్రమాణము, భాషా మాండలిక విభాగములు, ఇతివృత్తములు, ఛందస్సు, గాథా కారులు, పునరావృత్తి, జానపద వాద్యములు, ప్రధాన వీరులు, కులదైవములు, దర్శనములు—మున్నగువానిని ఆధారముగా చేసికొనవలెనని నా అభిప్రాయము. అయినను ఈ వర్గీకరణములో అతిముఖ్యమైన జానపద వ్యవహారమును విస్మరింపరాదు. నాయభిప్రాయమున జానపద కవిత్వము (Folk poetry)ను పల్లె పాటలు లేక జానపద గేయములు (Falk-songs)— జానపద గేయ కథలు లేక వీరగాథలు (Ballads)అని రెండు ప్రధాన భాగములుగా విభజింపవచ్చును. ఇందు వీరగాథలలో మరల రెండు రకములున్నవి: సాంప్రదాయిక వీరగాథలు (Traditional Ballads), లేక 'జనప్రియ వీరగాథలు' (Popular Ballads)—'వీరగాథానుకరణములు' (Ballads of imitation). ఇందు సాంప్రదాయిక వీరగాథలను మూడు ప్రధాన విభాగములుగా విడదీయవచ్చును: వీరగాథా చక్రములు (Ballad-cycles), వీరగాథలు (Ballads), వీరగాథానికలు లేక లఘు వీరగాథలు (Balladlings). వీనిలో మొదటి విభాగమైన వీరగాథా చక్రములలో ఇతివృత్తములను బట్టి 'శక్తికథాచక్రము, పల్నాటి వీరకథా చక్రము, కాటమరాజు కథాచక్రము, వెలకంటి వీరుని కథాచక్రము,' అను శాఖలను గుర్తింపవచ్చును. 'ఎల్లమ్మ కథాచక్రము, అంకమ్మ కథాచక్రము, చౌడమ్మ పాటలు, ఇతర శక్తికథలు' శక్తికథాచక్రములోని అంతశ్శాఖలు.

రెండవ ప్రధాన విభాగమైన వీరగాథలు ఛందస్సును బట్టి 'బొబ్బిలి వరుస కథలు, పదములు, జంగంకథలు' అను మూడు వర్గములుగా విడిపోవును. ఇందు పదములలో 'హరిహరీ పదములు, శారద పదములు' అను అంతర్భేదములు కానవచ్చును. బొబ్బిలికథ, దేసింగురాజుకథ, బాలనాగమ్మకథ, కాంభోజ రాజుకథ, ముగ్గురు మరాటీల కథ, సొమ్ములు చిన్నమ్మ కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మకథ, సర్వాయి పాపడుకథ, చిన్నపరెడ్డి కథ, సదాశివరెడ్డి కథ, కామార రాజుగారి కథ— మొదలగునవి 'బొబ్బిలి వరుస కథ' లకు ఉదాహరణములు. లక్ష్మణ మూర్ఛ, గంగా విలాసము, శ్రీకంఠ రామాయణము, కుశలవులకథ, కన్యకాపరమేశ్వరి చరిత్ర (పాముపాట)— మున్నగునవి హరిహరీ పదములు. శారద [illegible]. శారద [illegible], శారద సారంగధర— మున్నగునవి శారద [illegible] [illegible] కుమారరాజు చరిత్ర, కళ్యాణ రాయ చరిత్ర, నిజ

శ్రీంగ చిక్కయ్య కథ, విరాటపర్వము, వామన విజయము, దేవయాని చరిత్ర మొదలగునవి జంగం కథలకు ఉదాహరణములు.

పైన తెల్పిన మూడవ ప్రధాన విభాగమైన వీరగాథానికలకు (లఘు వీర గాథలకు) 'గజ్జాం గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, ఉయ్యాలవాడ నారసింహా రెడ్డి పాట, బుడ్డా వెంగళరెడ్డి పాట, ఓబులరెడ్డి పాట, గోరుమన్న పాట, విరూపాక్ష రెడ్డి పాట, ఈడిగ రామన్న పాట, బండోళ్ళ కురుమలన్న పాట, రాచోటి రామయ్య పాట, గడేకల్లు నాగిరెడ్డిపాట, మల్లన్న పాట, ధర్మాపురం నరసింహుని పాట' మొదలగునవి ఉదాహరణములు. ఇవన్నియును కొలది నిముషములలో పాడబడు కథాత్మక లేదా కథాసూచక వీరగేయములు. వీరగాథా చక్రములు నెలలకొలది పాడబడు. సుదీర్ఘకథనమును కలిగియుండును. వీరగాథలు రెండు మూడు రాత్రు లలో పూర్తియగును. కాబట్టి వీరగా చక్రములు, వీరగాథలు, లఘువీరగాథలు అను త్రివిధ వర్గీకరణము కొంతవరకును కాలప్రమాణమునుబట్టి చేయబడినదని చెప్పవచ్చును. ఇవన్నియును సాంప్రదాయిక వీరగాథలు.

ఈ సాంప్రదాయిక వీరగాథలను అనుకరించుచు నేడు బయలుదేరిన బుఱ్ఱకథలు, జముకుల కథలు, సుద్దుల కథలు, తందనాన కథలు, బ్రతుకమ్మ. పాటలు' అనునవి 'వీరగాథానుకరణము' లనబడును. వీనిలో బుఱ్ఱకథలు- బొబ్బిలివరుస కథలకును జంగం కథలకును అనుకరణములు. జముకుల కథలు హరిహరీ పదములకు అనుకరణములు. సుద్దుల కథలు- కాటమరాజు కథలకును తందనాన కథలు— బొబ్బిలి వరుస కథలకును; బ్రతుకమ్మపాటలు— ప్రాచీనము లైన బ్రతుకమ్మ పాటలకును అనుకరణములని చెప్పవచ్చును. (చూడుడు: పట్టీ-8 ప్రక్క పుట)

ఇప్పుడు 'శక్తికథలు, పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు, అను తెలుగు వీరగాథా చక్రములను గూర్చియు, బొబ్బిలివరుస కథలు, పదములు, జంగం కథలు; అను వీరగాథలను గూర్చియు; వీరగాథానికలు లేక లఘువీర గాథలను గూర్చియు, బుఱ్ఱకథాది వీరగాథానుకరణ ప్రక్రియలను గూర్చియు కొంత వివరముగా తెలిసికొందము.

## 12. శక్తి కథా చక్రము:-

శక్త్యారాధనము భారతదేశమున అతిప్రాచీన కాలమునుండియు గలదు; శక్తులు అనంత విధములు. ఇవి యన్నియును ఆదిశక్తియొక్క వివిధావతారములే.

జానపదులు ఎల్లమ్మ, అంకమ్మ, గంగమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మ మున్నగు క్షుద్రశక్తుల నారాధింతురు. ఈ యారాధనా రూపములే మన పల్లెలలో జరుప బడు గ్రామదేవతల జాతరలు. ఈ జాతరలతో ఆ యా శక్తుల కథలను మాల మాదిగలు గానము చేయుచుందురు. ఎల్లమ్మకథలు, అంకమ్మకథలు, చౌడమ్మ పాటలు, పోలేరమ్మ కథ, మాతపురాణము, ఆదిపురాణము లేక ఆరంజోతి కథ మున్నగునవి తెలుగులో వ్యాప్తియందున్న శక్తిపీరగాథలు. వివిధ శక్తులన్నియు ఆదిశక్తియొక్క అపరరూపములే కావున ఈ వీరగాథ లన్నింటిని ఒకే ఒక వీరగాథా చక్రముగా భావించుట యుక్తము. ఈ గాథా చక్రమునకు 'శక్తికథా చక్రము' అని పేరిడవచ్చును; ఇట 'శక్తి' అనగా ఆదిశక్తి అనియర్థము. ఈ శక్తి కథాచక్రములో ఎల్లమ్మకథలు, అంకమ్మకథలు తమతమ ప్రత్యేకతను చూపుచున్నవి. ఇవి కూడ ప్రత్యేక కథాచక్రములుగా ఏర్పడియున్నవి.

నేను పరిశోధించినంతవరకును ఎల్లమ్మ కథాచక్రమున తొమ్మిది గాథలును, అంకమ్మ కథాచక్రమున మూడుగాథలును, కలవని తెలియుచున్నది. 'మర్రిచెట్టు కథ, జలగన్న పార్వతికథ, రేణుక పుట్టుక, రేణుక కల్యాణము లేక రేణుక రాయబారము, గిరిరాజు యుద్ధము లేక రేణుక యుద్ధము, పరశురాముని జననము, పరశురాముని యుద్ధము, గవరమ్మ గాజులు లేక గొంతెమ్మకథ, (గొంతాలమ్మ కథ), జంపన్న వెలుగొండ వెళ్ళుట'- అనునవి ఎల్లమ్మ కథాచక్రములోని వివిధ వీరగాథలు. వీనిని 'పరశురాముని కథలు' అనియు, 'గౌతు పురాణము' అనియు పిలుచుచుందురు. 'అంకమ్మ కథ, రపద్దేవిరాజు కథ, గంగురాజు కథ, అనునవి అంకమ్మ కథాచక్ర సంబంధులైన వీరగాథలు. వీనికి 'అంకమ్మ పొంగెము,' అని జానపదులలో వ్యవహారము కలదు. ఈ రెండు కథాచక్రములను ఆదిశక్తి కథాచక్రములోని అంతశ్శాఖలుగా తలంపవలెను. చౌడమ్మ పాటలు లఘువీర గాథలనవచ్చును. ఈ లఘుకథ లన్నింటిని వరుసక్రమమున కూర్చి ఒకే పెద్ద ద్విపద పురాణముగా వ్రాయబడిన తాళపత్ర గ్రంథమును నేను చూచితిని. దానికి "చోడు పురాణము" అని పేరు. అదియును వీరగాథా చక్రమే. పోలేరమ్మ కథ వంటివి విడిగానున్న శక్తి కథలు.

## 13. పల్నాటి వీరకథా చక్రము:

వీరగాథా చక్రముల సర్వలక్షణములను పుణికి పుచ్చుకొన్నది పల్నాటి వీరకథా చక్రము. ప్రాచీన తాళపత్ర గ్రంథములలో ఈ కథా చక్రమునకు

పటీ-5



అనుగురాజు
(ముగ్గురు భార్యలు)
పెంపుడు కొడుకు
పెద్దన్న బాదరాజు
(దొడ్డనాయని జ్యేష్ఠపుత్రుడు)
(మైలమదేవికి)
నలగామరాజు
కూతురు
రత్నాలి పేరమ్మ
(భర్త : అలరాజు)
(భూరమా దేవికి)
కామరాజు
నరసింగ
రాజు
పెరుమాళ్ళ
రాజు
ఝుట్టిరాజు
(వీరవిజ్జల దేవికి)
పెదమలిదేవుడు
(భార్య : సిరాదేవి)
బిరుదురాజు
పినమలి దేవుడు
బాలమలి
దేవుడు

పలనాటి వీర భాగవతము అను పేరు కానవచ్చుచున్నది. 'పల్నాటి వీర చరిత్ర' అను పేరు ఆధునికులు పెట్టినట్టిది. జానపదులు ఈ కథాచక్రమును 'చెన్నుని కథ' అని పిలుచుచున్నారు. ఇది ఆంధ్రుల చారిత్రక వీరగాథా చక్రము. క్రీ.శ. 12 వ శతాబ్దమున జరిగిన సంఘటనమిది. తెలుగున లభ్యమగుచున్న వీరగాథలలో ఇది ప్రాచీనతమమైనది. ఇంతకన్న ప్రాచీనములైన వీరగాథలు ఇతర భారత సాహిత్యములందును కానరావు. పండ్రెండవ శతాబ్దముకంటె ప్రాచీనమైన వీరగాథలు ప్రపంచమందెచ్చటను లేవని పాశ్చాత్య విమర్శకులు నిర్ణయించినారు. దీనినిబట్టి మన పల్నాటి వీరగాథల ప్రాశస్త్యము మరింత ప్రస్ఫుటమగుచున్నది.

పల్నాడు నేటి గుంటూరుమండలములో నొక ప్రాంతము. దీనిని క్రీ.శ. 12 వ శతాబ్దమున హైహయవంశపు రాజులు పాలించిరి. వీరు కార్త వీర్యార్జునుని సంతతివారు. పల్నాటి సీమను పాలించుటచే వీరిని పల్నాటి హైహయు లందురు. వీరు ఆత్రేయ గోత్రజు లనియు, ఇంటిపేరు 'చాగి' (సాగి) వారనియు తెలియుచున ది. ఈ పల్నాటి హైహయ వంశము క్రీ.శ. 1108 ప్రాంతమున 'మందడి రేవినాయకుడు' అను సామంతునిచే స్థాపింపబడెను. ఈ వంశమున తెలియవచ్చు మొదటి పాలకుడు సాగి బేతరాజు (క్రీ.శ. 1108-1110).

ఈ పల్నాటిసీమను క్రీ.శ. 1134 నుండి 1147 వరకును 'అనుగు రాజు' (అలుగు రాజు) అను హైహయుడు పాలించెను. ఇతని పుత్రులే నలగామ రాజు, మలిదేవరాజు. వీరు సవతితల్లుల బిడ్డలు. అనుగురాజు మరణానంతరము పల్నాటిరాజ్యము విభక్తమయ్యెను నలగాముడు గురజాలను, మలిదేవుడు మాచెర్లను పాలింపదొడగిరి. శాసనములను బట్టి నలగామని పాలనాకాలము క్రీ.శ. 1147-1162. వీరగాథలనుబట్టి యితడు 1182 తరువాత గూడ నుండెనని చెప్పవచ్చును. 'నాయకురాలు' 'నామాంతరముగల నాగమ్మ నలగామని మంత్రిణి. బ్రహ్మనాయడు మలిదేవుని మంత్రి. నాగమ్మయు బ్రహ్మనాయుడును పరస్పరము స్పర్ధాళువు లగుటచే అంతర్యుద్ధము (Civil war) జరిగెను. ఈ అంతర్యుద్ధము క్రీ.శ. 1178-1182 మధ్యకాలమున జరిగెనని చారిత్రకులు నిర్ణ యించిరి. ఇంకను కొందరు క్రీ.శ. 1181-82 వ సంవత్సరములో జరిగెనని నిర్ధారించిరి. (చూడుడు : పట్టీలు—4,5,6)

అనుగురాజునకు తన కూతురు మైలమదేవినిచ్చి పెండ్లిచేసి, పల్నాటి సీమను అరణముగా నిచ్చిన 'చందవోలు రాజు'- వెలనాటి రెండవ గొంకరాజు (రెండవ కులోత్తుంగ చోడ గొంకరాజు)గా చారిత్రకులు నిర్ణయించిరి. ఇతని కాలము క్రీ.శ. 1132-1161. ఇతని పుత్రుడు వెలనాటి చోడుడని నామాంతరము గల రెండవ చోడరాజు (రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడయ). ఇతని కాలము క్రీ.శ. 1161-1181. ఇతడు నలగామని మేనమామ. పిల్లనిచ్చిన మామకూడ కావచ్చును. యుద్ధమున నితడు నలగామునకు సహాయము చేసినట్లు తెలియుచున్నది.

మలిదేవునకు పిల్లనిచ్చిన 'వీరసోముడు' కల్యాణము నేలిన కలచూరి బిజ్జలుని పుత్రుడగు సోమేశ్వరుడని చారిత్రకుల మతము. 'సోవిదేవ'. 'రాయ మురారి' అనునవి యాతని బిరుదములు. ఈ కలచూరి సోమేశ్వరుని కాలము క్రీ.శ. 1165-1177. మలిదేవుని మామయగు ఈ వీరసోమునకు కొమ్మరాజు అను పుత్రుడును, 'అలరాజు' అను పుత్రుడును గలరని వీరగాథలను బట్టి తెలియుచున్నది. కాని చరిత్రలో కలచూరి సోమేశ్వరుని సోదరుల ప్రసక్తి యున్నది కాని పుత్రపౌత్రులను గూర్చిన వివరము లేవియును లేవు. కనీసము నామములైనను లేవు. నాకు లభించిన తాళపత్ర గ్రంథములలో వీరసోముడు "చోడవంశమునందు శోభిల్లు రాజు, కాశ్మీర గోత్రమునకు ఘనమైన రాజు" అని వర్ణింపబడినాడు.

పల్నాటి వీరకథలలో ఎక్కువభాగము బ్రహ్మనాయనియందు పక్షపాతమును జూపుచు వ్రాయబడినట్టివే. ఇవి బ్రహ్మనాయని అవతార పురుషునిగా చిత్రించినవి. ఈ చిత్రణము నమ్మదగినది కాదు. బ్రహ్మనాయనియందును కొన్ని లోపములున్నవి. అతని శీలమునందును కొన్ని నీలినీడలు కానవచ్చుచున్నవి, ఇట్టి నీలినీడలను ప్రదర్శించు వీరగాథలు నాకు లభించినవి. బ్రహ్మనాయడు. అనుగురాజును, తనతండ్రియగు దొడ్డనాయని సంహరించి, నలగాముని సింహాసన మెక్కించెనని Sewell అను చరిత్రకారుడు వ్రాసినాడు. దీనిని సమర్థించు వీరగాథ నాకు లభించినది. ఇట్లే అలరాజు మరణమునకు బ్రహ్మనాయడే ముఖ్య కారకుడని నిరూపించు వీరగాథ కూడ నాకు పల్నాటిలో లభించినది. బ్రహ్మనాయుడు తన కంటెను తన అన్నయగు పెద్దన్న బాదరాజు

కంపెను మహాబలశాలియగు అలరాజును ఏ విధముగా నైనను చంపించవలెనను కుట్రతో అతనిని గురిజాల రాయబారమునకు పంపినాడని యీ వీరగాథలో నున్నది.

నాగమ్మ, వీరగాథలలో చిత్రింపబడినట్లు దుష్టురాలుగ, క్రూరురాలుగ గాదు. ఆమె అసామాన్యమగు రాజకీయ ప్రజ్ఞ కలిగిన బుద్ధిశాలిని. 'నాయకురాలు' ఆమెకు అన్వర్థ నామధేయము. ఈ నాయకురాలికిని బ్రహ్మనాయునికిని మధ్యగల రాజకీయ స్పర్థలే పల్నాటి యుద్ధమునకు మూలకారణములు కాని, శైవ వైష్ణవ మత భేదము లెంత మాత్రమును కాజాలవు. అసలు అట్టి భేదములు ఆ కాలములో లేవు. బ్రహ్మనాయుడు శివుని బంగారు పువ్వులతో పూజించు అగ్రశ్రేణికి చెందిన శివభక్తుడు.

వీరగాథలను బట్టి బ్రహ్మనాయుడు జయించినట్లుగా కనబడుచున్నను స్థానిక చరిత్రలను బట్టి నలగాముడే జయించినట్లు తెలియుచున్నది. యుద్ధావసానమున బ్రహ్మనాయుడు నలగామునకు మరల పట్టము కట్టినట్లుగ కొన్ని వీరగాథలలో గలదు. మరికొన్ని వీరగాథలలో నలగాముడు కొమ్మరాజుచే చంపబడెననియు, యుద్ధానంతరము బ్రహ్మనాయుడు, కన్నమదాసు - వీరివురే మిగిలిరనియు బ్రహ్మనాయుడు యుద్ధమున మరణించిన వీరులందరిని బ్రతికించి వారితో గుత్తికొండ బిలమును ప్రవేశించెననియు గలదు. ఈ యుద్ధముతో పల్నాటి హైహయ వంశము అంతరించెనని చెప్పవచ్చును. తరువాత ఈ పల్నాటి ప్రాంతమును కాకతీయులు ఆక్రమించిరి.

ఈ యుద్ధమున మలిదేవుని పక్షమున పోరిన పెద్దన్న, కొమ్మరాజు, బ్రహ్మనాయుడు, కన్నమదాసు, బాలచంద్రుడు మున్నగు వీరులకు మాత్రమే 'పల్నాటి వీరులు' అని పేరు. నలగాముని పక్షమున పోరిన వీరులకు ఈ పదము వర్తింపదు. ఈ పల్నాటి వీరుల సంఖ్య అరువదియారు అనుటకు ఎక్కువ ప్రమాణము లున్నవి.

పల్నాటి వీరకథాచక్రములో ఒక్క బాలచంద్రుని కథ మాత్రమే పండిత లోకమునకు పరిచితమైనది. దీనిని మొట్టమొదట ప్రకటించిన వారు అక్కిరాజు ఉమాకాంతంగారు. ఇది శ్రీనాథ విరచితము. పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్క-
రించిన పల్నాటి వీరచరిత్రలో పదునొకండు వీరగాథలున్నవి. కాని నా పరిశోధ

నొయుపలన ఈ కథాచక్రమున సుమారు ఇరువదియైదు వీరగాథలున్నవని తేలినది. వీనిలో పెక్కు కథలు తాళపత్ర గ్రంథములందు చిపికిపోవుచు, గాథాకారుల జిహ్వాగ్రములందు కొనయూపిరితో నున్నవి. శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ్య అను కవులు రచించిన వీరగాథలు కొన్ని నేడు లభించుచున్నవి. ఈ కవులలో ఒక్కొక్కరు ప్రత్యేకముగా ఈ గాథాచక్రమంతటిని వ్రాసియుందురు. కాని యిట్లు ప్రత్యేకముగా ఒకే కవి విరచితముగా నున్న సంపూర్ణ గాథాచక్రమేదియు నేడు లభించుటలేదు. కొన్ని వీరగాథలు ఒక కవివి, మరికొన్ని వీరగాథలు వేరొక కవివి లభించుచున్నవి. నాకు శ్రీనాథ విరచితములై వరుస క్రమమున నున్న పదికథలు లభించినవి. అక్కిరాజువారికి పై ముగ్గురు కవులు రచించిన మూడు రకముల బాలచంద్రుని కథలు లభించినవి.

1862 ప్రాంతమున పల్నాటిలోనున్న మువిగొండ వీరభద్రకవి అనునతడు, పల్నాటి వీరగాథల నన్నింటిని అనుసరించి 'వీరభాగవతము' అను పద్యకావ్యమును రచించెను. పల్నాటి వీరకథా చక్రముయొక్క సంపూర్ణేతివృత్తమును తెలిసికొనుటకు ఈ పద్యకావ్యము మిక్కిలిగ తోడ్పడుచున్నది. మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమునను, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ లిఖితపుస్తక భాండాగారమునను, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయమునను, గుంటూరు నెల్లూరు మండలములలోనున్న 'వీరవిద్యావంతు' లనెడి గాథాకారులకడను పల్నాటి వీరగాథలకు సంబంధించిన తాళపత్ర గ్రంథములు పెక్కు గలవు.

గుంటూరు నెల్లూరు మండలములలో పర్యటింపగా నాకు ఇరువది వీరగాథలున్న మూడు పెద్దపెద్ద తాళపత్ర గ్రంథములు లభించినవి. వీనిలో పెక్కు గాథలు సాహిత్యలోకమునకు పరిచయములేని వినూత్న వీరగాథలు: పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్కరించిన విజయవాడ విశాలాంధ్ర ప్రచురణాలయము వారు 1961లో ప్రకటించిన. పల్నాటి వీరచరిత్రలో 'కల్లుప్రతిష్ఠ' 'బాలచంద్రుని యుద్ధము' అను రెండు వీరగాథలుతప్ప తక్కిన వన్నియును మిక్కిలి సంక్షిప్త రూపములు. ఇవి విశ్వసింపదగినవి కావు. వీనికిని, జానపదులలో వ్యాప్తియందున్న పల్నాటి వీరగాథలకును ఏ విధమగు సంబంధమును లేదు. నేను పరిశీలించినంత వరకును, పల్నాటి వీరకథా చక్రమున ఈ క్రింది వీరగాథ లున్నవని తెలియుచున్నది :—

19. బాలునీ యుద్ధము- ఉత్తరకాండము- మరణము
20. గుఱ్ఱాల సవరణ లేక గుఱ్ఱాల చాటువ
21. అమ్మవారి పుటక
22. కొమ్మరాజు యుద్ధము
23. పేర్నీడు సన్నిగళ్ళ యుద్ధము
24. కన్నమనీడు చింతపల్లి యుద్ధము
25 కల్లిపాడు కథ లేక కల్లి ఒరుగు (బ్రహ్మన్న విరుగు)

ఈ పల్నాటికథలను పిచ్చుకుంట్లు పాడుదురనుట తప్పు. పిచ్చుకుంట్లకు ఈ కథలను పాడెడి హక్కులేదు. వీనిని పాడువారు 'వీర విద్యావంతులు' అన బడెడి మాలలు. వీరిని 'పల్నాటి వారు' అనియు పిలుచుట కలదు. వీరు గుంటూరు, నెల్లూరు మండలములలో వ్యాపించి యున్నారు. ఈ వీరగాథా గాన మున వీరజోడు (పంబజోడు), తిత్తి, కత్తి, డాలు ఉపయోగింతురు. ప్రధాన గాయకుడు పల్నాటివీరునివలె పంబ్రడెండు బిరుదములతో వేషమును ధరించును. ఈ వీర విద్యావంతులకు యుద్ధక్షేత్రమగు కారెంపూడిలో గురుపీఠము కలదు. పిడుగువారను నియోగి బ్రాహ్మణులు దీనికి అధిపతులు. వీరిని "పల్నాటి వీరా చార పీఠాధిపతులు" అందురు. పల్నాటి వీరారాధనము ఒక ప్రత్యేకమతముగా ఆచరింపబడుచున్నది : ఈ వీరారాధకులు అన్ని కులములలోను గలరు. వీరిని "ఆచారవంతులు" అందురు. వీరందరికిని పీఠాధిపతియే గురువు. యుద్ధక్షేత్ర మగు కారెంపూడిలో పల్నాటివీరుల గుడి యున్నది. దీనిదగ్గర ప్రతి సంవత్సర మును కార్తికమాసములో వీరోత్సవము జరుగును.

## 14. కాటమరాజు కథాచక్రములు :

ప్రాచీనమును ప్రశస్తమును అగు చారిత్రక వీరగాథలలో పల్నాటి వీర కథల తరువాత ఎన్నదగినవి కాటమరాజుకథలు. ఇవి యొక సుదీర్ఘ కథాచక్ర ముగా నేర్పడి యున్నవి. కాని, పల్నాటి వీరకథలను గూర్చి జరిగినంత పరి శోధనము వీనినిగూర్చి జరగలేదు. అందుచే ఈ వీరగాథా వృత్తములోని పెక్కు గాథలు సాహిత్యలోకమునకు అపరిచితములుగ నుండిపోయినవి. తెలుగు వీర గాథలలో ఇంత పెద్ద 'గాథావృత్తము' (Ballad-cycle) మరియొకటి లేదు.

... మొత్తము ముప్పదిరెండు. వీరగాథలు కలపి నా పరిశీలనమువలన తెలిసి కొంటిని. యథాక్రమముగ వాని నామములు :-

1. పల్లురాజుకథ (పలురాజు కథ లేక అవుల పలురాజు కథ)
2. పంపాద్రి కథ
3. పెద్దిరాజు కథ
4. సింహాద్రిరాజు కథ
5. ఎరనూకరాజు కథ
6. నల్లనూకరాజు కథ
7. పోలురాజు కథ : దీనిలో మరల ఆరు అంతర్భాగాలున్నవి :
   (1) చంద్రగుప్తుని దాటువ
   (2) మల్లికాదేవి దాటువ
   (3) ముక్కంటి దాటువ లేక బ్రాహ్మణ దాటువ
   (4) జంగాల దాటువ
   (5) కపోత దాటువ
   (6) గయుడు దాటువ
8. బల్లికురువ పోట్లాట
9. కాటమరాజుకు పట్నం కట్టిన కథ లేక కాటమరాజు పట్టాభిషేకము.
10. కటియావులరాజు కథ
11. పాపనూక కథ
12. అవుల మేపు : (దీనికి మూడు నామాంతరములు కలవు: 'ఉత్తరాది అవులమేపు'- 'కాటమరాజు ఉత్తరాది అవులమేపు' 'అవుల మేపులు : ఉత్తరకాండము')
13. పాతేటి కథ లేక గంగతర్కము లేక గంగ - కాటమరాజు తరక వాదము
14. ఎఱ్ఱయ్య తరకవాదము

15. జిన్నివాడ కథ: దీనికి నామాంతరము లున్నవి
'దక్షిణాది ఆవుల మేపు' - 'ఆవుల మేపులు; దక్షిణ కాండము'- 'చదరంగం కథ'-'పుల్లరి కథ')

16. ఉద్దు రాయబారము లేక కల్లి రాయబారము
17. కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ
18. బొంగరాల కథ : (దీనికి మూడు నామాంతరములు గలవు :
'మున్మయ్య పోచయ్య బొంగరాలు', 'వేడుక బొంగరాల కథ', 'అలుగుల పోలు')
19. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట : దీనిలో ఏడు కాండలున్నవి :
(1) చల్లవారి జగడము, లేక 'ఈర్లమాని కథ', లేక తిక్కనామాత్యుని కథ'
(2) బొల్లావు జగడము
(3) వీర్నీడు యుద్ధము
(4) కరియావులరాజు యుద్ధము
(5) బాలరాజుల యుద్ధము
(6) ఆవుల యెద్దుల జగడము - ఎఱ్ఱయ్యల యుద్ధము
(7) కాటమరాజు యుద్ధము
20. అగుమంచి కథ
21. భక్తిరన్న కథ

ఈ కథలన్నియు తాళపత్ర రూపమున యాదవ గాథాకారుల యిండ్లలో నున్నవి. ఇవికాక "పాపనూక వలపోత", "అగుమంచి వలపోత" 'పల్లికొండ పుటక', 'గంగ పుటక', 'భైరవకురువ యుద్ధము'— అను కథలుకూడ పచారమున నున్నట్లు తెలియుచున్నది.

కాటమరాజు చంద్రవంశ క్షత్రియుడు. ఇతడు విష్ణుమూర్తికి డెబ్బది నాల్గవ తరము వాడనియు, శ్రీకృష్ణునికి ఇరువదిమూడవ తరము వాడనియు కొన్ని వీరగాథలలో నున్న వంశవృక్షముననుబట్టి తెలియుచున్నది. ఈ సుదీర్ఘ వీరగాథా చక్రమున కాటమరాజు పితామహుడగు ఆవుల వలురాజునుండి కాటమ రాజు వరకును- మూడు తరములకు సంబంధించిన ముప్పదిరెండు వీరగాథ

ఉన్నవి. ఈ వీరగాథలన్నియు పరస్పర సంబంధము కలిగి వరుసక్రమముతో ఒక పెద్ద యితిహాసము (epic) వలె నున్నవి.

'ఎలమంచి'ని పాలించెడి 'కవులావుల గంగురాజు'నకు 'గంగమ్మ' యను భార్యయందు 'వలురాజు' హరిపాలుడు, నందగోపాలుడు' 'గోవర్ధనుడు' అను నల్వురు పుత్రులు కలిగిరి. వీరందరును 'ఖండెమొండెముల కోట' నేలు 'కలభూత గంగురాజు' తో యుద్ధము చేసి మరణించిరి. అవుల వలురాజుభార్య 'వల్లమ్మ' ఈ. దంపతులకు సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎరనూకరాజు, నలనూక రాజు, పోలురాజు అను ఐదుగురు పుత్రులును కొమరమ్మ లేక కొమరక్క లేక కొమరగిరి అను కుమార్తెయు పుట్టిరి. వల్లురాజు తరువాత జ్యోతిష్కుల ఆదేశమునుబట్టి ద్వితీయ పుత్రుడగు పెద్దిరాజు సింహాసనమెక్కెను. ఇతడు ఎలమంచిని పదేండ్లు పాలించెను. తరువాత ఇతడు సోదరులతో కలిసి పంపాద్రికి తరలి వచ్చెను. పంపాద్రిలో ఏడేండ్లు పాలించెను.

పెద్దిరాజునకు తప్ప తక్కిన అన్నదమ్ములందరకును సంతానము కలిగెను. పెద్దిరాజును అతని భార్య పెద్దమ్మయు సంతానార్థమై కల్యాణ పట్టణములో నున్న సోమేశ్వరుని సేవింపబోయిరి. అటు పెద్దిరాజునకు 'పాటమరాజు' అను పుత్రుడును. 'పాపనూక' అను పుత్రికయు కలిగిరి. పాపనూక దుష్ట నక్షత్రమున జన్మించినది. అందుచే పెద్దిరాజు వాలికేతువ రాజుతో యుద్ధముచేసి 'అర్లపెంట' రణరంగమున నిహతుడయ్యెను. ఏడేండ్ల, బాలుడైన పాటమరాజు వాలికేతువ రాజుపై దండెత్తి, అతనిని చంపి, తండ్రిపగ తీర్చుకొనెను. పెద్దమ్మ సహగమనము చేసెను.

సరిగా పెద్దరాజు మరణించు సమయముననే అతని సోదరులు నలుగురును. వివిధ స్థలములలో, పరోపకారార్థము యుద్ధములుచేసి తమతమ శరీరములను త్యజించిరి. సింహాద్రిరాజు శ్రీకూర్మముపై దండెత్తి సింధుళళ్యాని రాజుతో పోరి చనిపోయెను, ఎరనూకరాజు ఏనుగనాథుని కొండకుపోయి ఎర్ర భూపతితో యుద్ధముచేసి చనిపోయెను. నలనూకరాజు నున్న బెజవాడకు పోయి దానిని పాలించు నందికేశవ రాజుతో పోరి మరణించెను. పోలురాజు చెఱుకూరి దగ్గర, శ్రీరంగపట్టణ మేలు చోడానిచే పంపబడిన ముక్కంటితో యుద్ధముచేసి మడిసెను.

సింహాద్రిరాజు భార్య సింహాద్రి సీత. ఈ దంపతులకు 'కరియావుల రాజు' అను కొడుకును 'చిట్టి నూక' అను కూతురును పుట్టిరి. కరియావుల రాజు ఓరుగంటి ప్రతాపరుద్రుని సేనానియగు బేతాళునితో ఏకాంగి కయ్యము చేసి జయించెను. ఇతని భార్యపేరు 'నాగమాంబిక లేక కరియావుల నాగ' చిట్టినూక భర్తపేరు 'కల్లందుల పోలినేడు'. ఇతడు భైరవ కురువ యుద్ధములో చనిపోయి నాడు. చిట్టినూక భర్తతో సాగుమానము చేసినది. ఈ దంపతులకు 'పోచయ్య' అను పుత్రుడు గలడు.

ఎరనూకరాజుభార్య 'ఎరనూక సీత'. పుత్రుడు 'ఖట్టావుల రాజు. 'ఇతడు ఓరుగల్లులో బేతాళుని తమ్మునితో ఎక్కటి కయ్యముచేసి అతనిని పరిమార్చి నాడు. ఇతని భార్యపేరు 'సూరమ్మ' లేక 'సూరమాంబిక'.

నలనూక రాజుభార్య 'నలనూక సీత'. వీరి కొడుకు 'పెయ్యల ఎల్లయ్య'. ఇతడు పాలేటికడ గంగతో వాదించెను. ఇతని భార్య 'ఖయ్యమాంబిక.'

పోలురాజు భార్య 'సిరిదేవి' వీరికి 'బ్రహ్మన్న, అయితమరాజు, ముమ్మయ్య' అను ముగ్గురు కొడుకులును, 'అగుమంచి' లేక 'అక్కన్న' అనుకూతురునుగలరు. 'పల్లికొండ' పోలురాజునకు మంత్రి. పోలురాజు చెరుకూరికడ మరణింపగా పల్లి కొండ బాలరాజులను తీసికొని పంపాద్రికి పోవుచుండెను. మార్గమధ్యమున బల్లి కురువ దగ్గర ముక్కంటి మనుమలు బాలరాజుల నెదిరించిరి. పల్లికొండ బొల్లా వును ప్రార్థింపగా అది వచ్చి శత్రువులను తరమివేసినది.

పోలురాజుపుత్రులలో అయితమరాజు దొనకొండకు పాలకుడయ్యెను. పెద్దవాడగు బ్రహ్మన్న ('బత్తినన్న' అని జానపదుల ఉచ్చారణ) కాశికి పోవుచు. కల్యాణ పట్టణములో నున్న కాటమరాజును పాపనూకను తెచ్చి దొనకొండలో నుంచెను. విష్ణు స్వరూపుడగు కాటమరాజునకు గోగణము నంతటిని ఇచ్చి పట్టము కట్టిరి. అతడు శ్రీశైల ప్రాంతమున పశువులను మేపుకొనుచుండెను. పెయ్యల యెల్లయ్య, పద్మరాఘవుడు అతనితో నుండిరి. పాపనూక దుష్ట నక్షత్రమున జన్మించుటచే ఆమెను దొనకొండ నగరము బయట నొక మేడలో నుంచిరి.

బ్రహ్మన్నభార్య 'నల్లమేడ' లేక 'నల్లమాంబ'. ఈ బ్రహ్మన్న కాశికిబోయి వల్లురాజునకును, పెద్దిరాజాదులకును, వారివారి భార్యలకును, మంత్రులకును, మంత్రుల భార్యలకును గయలో పిండప్రదానము చేసెను. ఇతడు కాశిలో నుండగా

కోటమరాజాదులు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో కూలిరని తెలిసి, వెంటనే సపరివార ముతో దొనకొండకు వచ్చి, పాపనూకను మేడనుండి తప్పించి, యాదవస్త్రీ లందరికిని సహగమనము చేయ నాజ్ఞాపించి, తాను ఎఱ్ఱగడ్డపాటికి పోయి, సోదరులకును ఇతర బంధువులకును పాలేటిలో పిండప్రదానము చేసెను.

అయితమరాజు దొనకొండకు పాలకుడు. ఇతని భార్య "నేతివారి పోతు". ఈ దంపతులకు "అల్లు దాడెన్న" అను కొడుకును, "సిరిగిరమ్మ" అను కూతురును గలరు. యుద్ధసమయమున తమ వంశాంకురమును నిలుపుకొనుటకై యాదవులు ఈ అల్లు దాడెన్నకు కొంత సైన్యమును సహాయముగా నిచ్చి కటక మునకు పంపివేసిరి. అయితమరాజు తన పుత్రికయగు సిరిగిరమ్మను చిట్టిమాక కుమారుడగు పోచయ్యకిచ్చి పెండ్లి చేసెను. పోలురాజు తృతీయ పుత్రుడగు ముమ్మయ భార్యపేరు "చిన్నమల్లు". ఈ ముమ్మయ్యయు పోచయ్యయు యుద్ధ సమయమున దొనకొండలో బొంగరము లాడుచుండిరి.

పోలురాజుపుత్రిక యగు అగుమంచి లోకోత్తర సౌందర్యవతి. ఈమె భర్తపేరు పుత్తమరాజు. ఇతడు ఈమెకు మేనత్త కొడుకు. (కొమరమ్మ పుత్రుడు). ఈ పుత్తమరాజు ఓరుగల్లుకో ప్రతాపరుద్రుని పెండ్లి... సవారీచేసిన వీరుడు. అగుమంచి-పుత్తమరాజుల పెంపుడుకొడుకు పోచయ్య. పోచయ్య పసిబాలుడుగా నున్నప్పుడు అతని తల్లియగు చిట్టిమాక భర్తతో సహగమనము చేసినది. అందుచే ఆ బాలుని అగుమంచి పెంచి పెద్దచేసినది.

పెద్దిరాజాదుల సోదరియగు కొమరక్క లేక కొమరమ్మ భర్తపేరు "పందుముల పాపినాయుడు". ఇతడు పోలురాజుకడ మంత్రి. పల్లికొండ ఈ కొమరక్కకు పెంపుడుకొడుకు. "పుత్తమరాజు", "నాచకూళ్ళనాయుడు", కొమరక్కకు నిజపుత్రులు. "చట్టువారి ఎఱ్ఱయ్య", "పుల్లావుల కేశవయ్య" అను మరి యిరువురు కూడ ఈమె పుత్రులుగా వీరగాథలను బట్టి తెలియు చున్నారు. కొమరమ్మ సంతతిలో పల్లికొండ వరపుత్రుడు. ఇతడు మొదట వల్లురాజునకును. తరువాత పోలురాజునకును, పిమ్మట అయితమరాజునకును మంత్రిగా నున్నట్టు తెలియుచున్నది. చట్టువారి ఎఱ్ఱయ్య కోటపాడునుండి తాడి వృక్షమును పెకలించి తెచ్చిన మహావీరుడు. నాచకూళ్ళనాయుడు పాపనూకను పెండ్లాడవలసిన వాడు. కాని ఆమె దుష్టనక్షత్రమున జన్మించుటచే ఆ పెండ్లి తప్పిపోయినది.

శ్రీశైలముకడ ఆవులను మేపుచున్న కాటమరాజు, అక్కడ క్షామము వచ్చుటచే దక్షిణభూములకు తరలి వచ్చుచుండెను. కనిగిరిసీమలో పాలేటి యొడ్డున గంగతో కాటమరాజు తర్కవాదమును జరపినాడు. మొదట వ్యతిరేకించినను చివరకు ఆమెకు చేయెత్తి మ్రొక్కినాడు. ఆలమందతో నెల్లూరిసీమను ప్రవేశించి, నల్లసిద్ధిరాజుతో పుల్లరి ఒప్పందము చేసికొనెను. తన ఆలమందకు బోయలచే నష్టము వాటిల్లుటచే, నల్లసిద్ధికి పుల్లరినీయక, తిరిగి ఎఱ్ఱగడ్డపాటికి వచ్చెను. నల్లసిద్ధిరాజు పంపిన భట్టురాయబారము ఫలింపలేదు. ఎఱ్ఱగడ్డపాడులో జరిగిన ఘోరయుద్ధములో కరియావులరాజు- ఎఱ్ఱసిద్ధిరాజుతోను, భట్టావులన్న-పాపసిద్ధిరాజుతోను, అయితమరాజు- గంగగోపాలరాజు కస్తూరిరాజులతోను, ముమ్మయ్య-ఉండవెల్లి విరిగోపుతోను, నాచకూళ్ళనాయడు- గుత్తిభీమునితోను, పోచయ్య-తిర్జమల తిప్పయ్యతోను, కాటమరాజు- నల్లసిద్ధిరాజుతోను పోరాడిరి. కడకు యుద్ధమున యాదవులు జయించిరి. కాటమ రాజు తన పగ తీర్చుకొనెను.

ఈ కథాచక్రమున నల్లసిద్ధిరాజు, ఖడ్గతిక్కన చారిత్రకవ్యక్తులు. ఓరుగంటి ప్రతాపరుద్రుని ప్రసక్తికల వీరగాథలను నాకు లభించినవి. పల్నాటి యుద్ధము క్రీ.శ. 12వ శతాబ్ది చతుర్థపాదమున జరుగగా, కాటమరాజు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట క్రీ.శ. 13వ శతాబ్ది చతుర్థపాదమున జరిగినది. ఇది కాకతీయ మహారాణి రుద్రమదేవి పాలనాకాలము చివరిభాగమున, అనగా ప్రతాపరుద్రుడు యువరాజుగా నున్నప్పుడు జరిగినదని శాసనాధారములనుబట్టియు వీరగాథలను బట్టియు తెలియుచున్నది. అనగా కాటమరాజు- నల్లసిద్ధిరాజుల యుద్ధము క్రీ.శ. 1280-1297 మధ్యకాలములో జరిగినది. మనుమసిద్ధియే నల్లసిద్ధియనుట సరికాదు. మనుమసిద్ధి పుత్రుడు నల్లసిద్ధి. ఇతడు నెల్లూరును పాలించిన తెలుగు చోళుడు. ప్రతాపరుద్రుని యౌవరాజ్యకాలమే (క్రీ.శ. 1280-1296) నల్లసిద్ధి కాలము. ఈ నల్లసిద్ధియే కాటమరాజునకు ప్రత్యర్థి.

నెల్లూరు రాజ్యములోని పచ్చికబీళ్ళలో తన గోగణమును మేపుకొనుటకు కాటమరాజు నల్లసిద్ధితో పుల్లరి ఒడంబడికను చేసికొనెను. నెల్లూరిసీమలో నున్నంతకాలము తన మందలో పుట్టిన కోడెదూడలను నల్లసిద్ధికి ఇత్తునని ఒప్పుకొనెను. కాని అతడు ఒడంబడికను మీరి పచ్చికబీళ్ళనేకాక, వరిపొలములను సహితము మేపివైచెను. నల్లసిద్ధిభార్య కుందమాదేవి, బోయలచే కాటమరాజు

గారి ఆలమందను పొడిపించెను. నల్లసిద్ధికి ఈ విషయము తెలియదు. ఈ గోహత్య నల్లసిద్ధియే చేయించెనని కాటమరాజు భావించి, దానికి ప్రతిక్రియగా పుల్లరి నెగవేసెను. అందుచే ఇరుపురకును యుద్ధము సంభవించెను.

ఈ కాటమరాజుకథాచక్రమును శ్రీనాథుడు రచించినట్లుగా ఊహింపబడుచున్నది. కొందరు గాథాకవుల వాక్యములను సాక్ష్యమిచ్చుచున్నవి. కాని శ్రీనాథుని పేరుతోనున్న వీరగాథ ఒక్కటి కూడ నేను లభింపలేదు. గంగుల పిన యెల్లయ్య రచించిన ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటను వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిరి. ఇందు మూడు వీరగాథలున్నవి. మద్రాసు, తిరుపతి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములలో ఐదు కథలు మాత్రమే కలవు. తక్కిన కథలన్నియును ప్రజలలోనే యున్నవి. నేను సుమారుగ ఇరువది కథలకు సంబంధించిన తాళపత్ర గ్రంథములను సంపాదించితిని. ఈ ప్రయత్నవలన పైన తెల్పిన గంగుల పినయెల్లయ్యతోపాటు మరి ఆరుగురు ప్రాచీన జానపద కవులు వెలుగునకు వచ్చిరి. వారి పేర్లు: "మద్దులేటి కవి, మల్లయ, కనకబండి ముట్టయ్య, కట్టెబోయిన మారయ్యకవి, కదిరిమంగళము (మంగళపురి) వెంకటాద్రి, జరుగుపల్లె చెన్నయ్య".

ఈ కాటమరాజుకథలను 'కొమ్ముల వారు' అను మాదిగలు పాడుచుందురు. వీరు యాదవులను యాచించి జీవింతురు. యాదవులలో కొన్ని శాఖల వారు కూడ ఈ కథలను పాడుచున్నారు. వీరిని 'సుద్దుల గొల్లలు', 'తెరచీర భక్తులు' అను నామములతో వ్యవహరింతురు.

యాదవుల కులదైవము గంగ. ఈమె ఆంధ్రదేశమున గల ప్రధాన గ్రామదేవతలలో నొకతె. కొన్ని గ్రామములలో ఈ గంగకు జాతరలు అతి వైభవముగా జరుపుదురు. ఇట్టి గంగజాతరలలో కాటమరాజు కథలను పాడుట ఆచారము.

బల్లమ్మకథలు, అంకమ్మకథలు, పల్నాటి వీరకథలు, కాటమరాజుకథలు-అను ఈ నాలుగు వీరగాథా చక్రములతోను సంవాది సంఘటనలు పెక్కుగా నున్నవి. తెలుగులో ఈ నాలుగు గాథాచక్రములతో పాటు రాయలసీమలో జంగములు పాడుచున్న 'వెలకంటి వీరుని కథాచక్ర' మొకటి వ్యాప్తియందున్నదని తెలియుచున్నది.

15. బొబ్బిలివరుస కథలు :—

నెలల తరబడి పాడబడు వీరగాథా చక్రముల తరువాత, రెండు మూడు రాత్రులలో పాడబడు వీరగాథలను పరిశీలింపవలసి యున్నది ఈ వీరగాథలలో "బొబ్బిలివరుసకథలు, పదములు, జంగంకథలు' అనుమూడు ప్రధాన విభాగములను గుర్తింపవచ్చును. బొబ్బిలికథవరుసలోను (8 + 8 + 9 లేదా 10 మాత్ర లోక పాదము), తద్భేదములోనుఁ (8 + 8 గాను లేదా 8 + 9 (10) గాను) ఉండు వీరగాథ లన్నియును 'బొబ్బిలివరుస కథలు' అనబడును. ఇవి యెక్కువగా చారిత్రక సాంఘిక సంఘటనా జనితములు. "హరిహరీ నారాయణాదినారాయణా! కరుణించి మమ్మేలు కమలలోచనుడా!" అను జంపెవరుసలో నుండు కథలును శారద వరుసలో (3 + 5 + 5 + 3 మాత్ర లోక పాదముగా) నుండు కథలును 'పదములు' అనబడును. రగడలు, పద్యములు, దరువులు, కీర్తనలు కలిగి, యక్షగానములను, హరికథలను పోలిన రచనలు జంగంకథలు. పదములు, జంగంకథలు ప్రధానముగా పౌరాణికేతివృత్తములను కలిగియుండును.

బొబ్బిలివరుస కథలను నాలుగు వర్గములుగా విభజింపవచ్చును: 'చారిత్రకములు, సాంఘికములు, జానపదములు, పౌరాణికములు.' ఇందు చారిత్రకములలో 'స్పష్ట చారిత్రకములు, అస్పష్ట చారిత్రకములు' అను రెండు అంతశ్శాఖలు గలవు. అట్లే యితివృత్తములనుబట్టి సాంఘిక వర్గములో 'పేరంటాండ్రు, సాహసికులు, బందిపోట్లు, గజదొంగలు, గ్రామకక్షలు-హత్యలు, కుటుంబ కలహములు, లేచిపోవుటలు' అను ఏడు అంతశ్శాఖలను గుర్తింపవచ్చును.

బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, జగపతిరాజు కథ లేక పెద్దపురం కోడిపుంజుల కథ, 'కౌమార రాముడి కథ, రాణీ శంకరమ్మ కథ, సదాశివరెడ్డి కథ, నల్లి సోమనాద్రి కథ లేక గద్వాల సోమనాద్రి కథ, రాజా రామేశ్వరరావు కథ, కర్నూలు నవాబు కథ, ఉయ్యాలవాడ నరసింహారెడ్డి కథ - మొదలగునవి స్పష్ట చారిత్రక వీరగాథలు. బంగారు తిమ్మరాజు కథ లేక దేవరాయలు కథ, ముగ్గురు మరాటీల కథ లేక ఆరె మరాటీల కథ, బాలనాగమ్మ కథ, కుంటి మల్లారెడ్డి కథ, వేమన కథ, ఖిల్లారి కొండ్రాయుడి కథ మొదలగునవి అస్పష్ట చారిత్రక వీరగాథలు.

కన్యకామ్మవారి కథ, కామమ్మ కథ, సన్యాసమ్మకథ, మండపేట పాపమ్మ కథ, శృంగవరపుకోట ఎరుకమ్మ కథ, లక్ష్మమ్మ కథ, సాసూలు

చిన్నమ్మ కథ, వీరరాజమ్మ కథ, సర్వరంగాశ్ కథ, తిరుపతమ్మ కథ, ఎరుకల నాంచారి కథ, రాపులమ్మ కథ, సరోజని కథ, [illegible] కథ, అంజమ్మ కథ, ఉయ్యూరు వీరమ్మ కథ లేక గొల్లల వీరమ్మ కథ, గూడూరు నారాయణమ్మ కథ మున్నగునవి సాంఘిక వీరగాథలలో పేరంటాండ్ర శాఖకు చెందినవి. సర్వాయి పాపడు కథ, చిన్నపరెడ్డి కథ సాహసికుల శాఖకు చెందును, బందిపోట్ల శాఖలో మంగర దాలెపాలు కథ పేర్కొనదగినవి. [illegible] కథ, పండుగ శాయన్న కథ, నక్కపల్లి రాముడు కథ, సుబ్బన్న చోర పాట- ఇత్యాదులు గజదొంగల శాఖకు చెందును. 'గ్రామకక్షలు-హత్యలు' అను శాఖలో కుంటి పుల్లారెడ్డి కథ, యల్లమందనాయుడు కథ, చెన్నకృష్ణారెడ్డి కథ, బొర్రిపాడు వెంకటరెడ్డి కథ, పతిగ రామకృష్ణారెడ్డి కథ, సుబ్బిరెడ్డి కథ, ఒడ్డుకింద భయ్యారెడ్డి కథ, పేర్కొనదగినవి. కందెపు సుబ్బయ్యగారి కథ 'కుటుంబ కలహములు' అను శాఖకును, మందలోడు కథ 'లేచిపోవుట' (Elopement) అను శాఖకును చెందును.

గాంధారి కథ, కాంభోజరాజు కథ, కమ్మవారి పణతి-పసలబాలుడు కథ, ఎలనాగిరెడ్డి కథ, రక్తకొమారుడు కథ, రత్నాంగి కథ, కాశీమజిలీ కథలు మొదలగునవి జానపద వీరగాథలు. రామకథా సుధార్ణవము, అండాళ్ చరిత్రము లేక శ్రీరంగ మాహాత్మ్యము, వరాహావతార చరిత్రము లేక పందికథ, పెద్ద కాపుగారికథ, వేంకటేశ్వరుని కథ, మల్లిక దేవమ్మ కథ, జరాసంధుని కథ, కౌశాంబిరాజు కథ, పర్వతాల మల్లారెడ్డి కథ, కొమిరెల్లి మల్లన్న కథ-ఇత్యాదులు పౌరాణిక వర్గమునకు చెందిన బొబ్బిలివరుస కథలు,

(చూడుడు పట్టీ-7; ఎదుటి పుట)

మొత్తముపై బొబ్బిలివరుస కథలలో అర్ధభాగము కవిత్వము, అర్ధ భాగము సంగీతము ఉండును. అందుచే వీనికి పాడునప్పుడు ఉన్నంత రసపుష్టి చదువునప్పుడు ఉండదు. పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను సంగీతముకన్న సాహిత్యమునకు ఎక్కువ ప్రాధాన్యము ముండుటచే, అవి పాడునప్పుడే కాక, చదువునప్పుడును రసవంతములుగనే ఉండును, బొబ్బిలివరుస కథలిట్లుగాక, తంబుర శ్రుతితో గుమ్మెట్ల లయతో పాడునప్పుడు మాత్రమే హృదయావర్జకములుగ నుండును. కథాప్రధానము లగుటచే వీనిలో రసవద్ఘట్టములుకూడ అక్కడక్కడ మాత్రమే గోచరించును.

పట్టీ-౯



వీరగాథలు
బొబ్బిలి వరుస కథలు
పదములు
జంగం కథలు
కోరికోరి పదములు
శారద పదములు
చారిత్రకములు
సాంఘికములు
జానపదములు
పౌరాణికములు
స్పష్ట చారిత్రకములు
అస్పష్ట చారిత్రకములు
పేరంటాండ్రు
సాహసికులు
బందిపోట్లు
గజదొంగలు
గ్రామరక్షలు-హత్యలు
కుటుంబ కలహములు
తేచిపోవుటలు

## 16. పదములు—జంగంకథలు :-

వీరగాథలలో బొబ్బిలికథవంటి కథల తరువాత ఎన్నదగినవి 'పదములు-జంగంకథలు.' ఇందు పదములు రెండు విధములు: 'హరిహరీ పదములు', 'శారద పదములు' 'హరిహరీనారాయణా ఆదినారాయణా. కరుణించిమమ్మేలు కమలలోచనుడా' అను వరుసతోను, పునరావృత్తితోను ఉండునవి హరిహరీపదములు. ఇవి ఖండగతి ద్విపదచ్ఛందముల సమ్మేళనమున ఏర్పడినవని చెప్పవచ్చును. ఈ వరుసలో పాదమునకు రెండు దళము లుండును. మొదటి దళమున మాత్రల క్రమము 5 + 5 + 5 + 5 గాను, రెండవ దళమున 5 + 5 + 5 + 3 గాను ఉండును. హరిహరీ పదములన్నియును పౌరాణికేతివృత్తమును గలిగియుండును. ముఖ్యముగా రామాయణ సంబంధములు ఎక్కువ. ఈ పదములు పాడునప్పుడేకాక చదువునప్పుడు సహితము రసతృప్తి నిచ్చగల కవితాపుష్టిగల రచనలు. ఇవి దేశిసాహిత్యమునకు శిరోభూషణములని విమర్శకుల మెచ్చుకోలు. పసగాద సన్యాసివంటివారు ఉత్తమ పదకవులు: ఈ హరిహరీ పదములు క్రీ.శ. 1850 నుండి విశాఖమండలమున విజృంభించినవి.

శారద పదములు, హరిహరీ పదములంత యున్నతమైనవి కావు. ఇవి వృత్తప్రధానమగు దరువులు. అంత్యప్రాస నియమముతో పాదమునకు 3 + 5 + 5 + 3 మాత్రలతో సాగు రచనలు(కొన్ని పాదములు 5 + 5 + 3గా సాగుట కూడ గలదు). ఇవి ఎక్కువగా అటతాళమున పదు నడకను గలిగి యుండును. ఈ శారద పదములను తెలంగాణమున శారదకాండ్రు పాడుచుందురు.

జంగంకథలో ప్రధానకథాభాగము 'రగడ' అను ఛందమున సాగును. బొబ్బిలి కథలోని వరుసకు యతిప్రాసలు బిగించుటచే ఈ జంగంరగడ ఏర్పడినదని నా నమ్మకము. ఈ రగడలో పాదమునకు 8 + 6 + 9 మాత్ర లుండును. మన జంగంకథలు మహారాష్ట్రుల కాలక్షేపములకు ప్రతిబింబములని కొందరు విమర్శకుల తలంపు. ఈ జంగంకథలు హరిహరీ పదములంత ప్రాచీనమైనవి కావు. ఈ శతాబ్ది ప్రారంభమున గుంటూరు మండలమున తలయెత్తినవి. జంగంకథకు హరికథతోను, యక్షగానముతోను, తెలంగాణయందలి చిరుతలకథతోను సన్నిహిత సంబంధ మున్నదని చెప్పవచ్చును. ముద్రితములైన జంగంకథలు కొల్లలు.

కవిత్వవిషయమున మాత్రము ఇవి గుల్లలు; రసవద్రచన నూటికిని కోటికిని ఒకటి ప్రత్యక్ష మగుచుండును. తంబుర గుమ్మెటల ఆర్భాటముతో పాడునప్పుడు మాత్రమే యివి రసవంతములు. వీనిని చదివి ఆనందించుట కష్టము.

17. వీర గాథానికలు లేక లఘు వీరగాథలు:

ఒక గంట లోపులోగాని, లేదా కొలది నిముషములలోగాని పాడబడు గేయకథలు 'వీర గాథానికలు, లేక లఘు వీరగాథలు (balladlings). వీనిని జానపదులు 'పదములు' 'పాటలు' అను పేర్లతో వ్యవహరింతురు కాని, వీరగాథలకు వలె వీనికి 'కథలు' అను నామమును ఉపయోగింపరు. నేను మౌఖిక ప్రచార మున నున్న లఘు వీరగాథలను సుమారు ఎనుబదివరకును సేకరించితిని. కథా ఖ్యానముయొక్క నిడివిని బట్టి. వీనిని ప్రధానముగా రెండు వర్గములుగా విడ దీయవచ్చును: (1) కథాత్మకములు, (2) కథాసూచకములు. బుడ్డా వెంగళరెడ్డి పాట, అప్పలాపురం చెన్నురెడ్డి పాట, చిన్న మొన్నెమ్మ పాట, చాకలి దుడుమన్న పదము, వాసదేవుని పాట మున్నగునవి కథాత్మకములగు వీరగాథానికలు. ఇవి ఒక గంటలోపులో పాడబడును. గుజ్జాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, నారసింహారెడ్డి పాట మున్నగునవి కథాసూచకములగు వీర గాథానికలు. ఇవి కొలది నిముషములలో పూర్తియగును.

ఇతివృత్తమును బట్టి పరిశీలించినచో లఘు వీరగాథలలో ఆరు వర్గములు గోచరించును: చారిత్రకములు, విప్లవ కావ్యములు, సాంఘికములు, దానవీర ప్రశంసలు, జానపదములు, పౌరాణికములు. చారిత్రకములలో 'వీర మరణములు, వీర ప్రశంసలు' అను రెండు అంతశ్శాఖలు గలవు. అట్లే సాంఘికములును వర్గములో 'గ్రామకక్షలు-హత్యలు, స్వైరిణులు - భర్తృహంతలు, పందెములు- - స్పర్ధలు,ఆత్మత్యాగములు-కట్టపదములు,విధి వైపరీత్యములు-ప్రమాదములు-' అను ఐదు అంతశ్శాఖలను గుర్తింపవచ్చును.

దొరవారి నరసింహారెడ్డి పాట, ధర్మాపురం నరసింహుని పాట, చిన్నప రెడ్డి పాట, అల్లూరి సీతారామరాజు పాట- మున్నగునవి వీరమరణములకు చెందిన చారిత్రక గాథానికలు. పిచ్చుకుంట్లు పాడు నారసింహారెడ్డి పాట, మరుట్ల చిన్న మల్లేశుని పాట, ఉయ్యాలరెడ్డి కోలాటపు కోపు, పెనుగొండ కోట మున్నగునవి వీర ప్రశంస చేయు చారిత్రక గాథానికలు.

నల్లగొండ మండలమునను, దాని పరిసరములందును వ్యాపించియున్న పాటలు-ముఖ్యముగా రేణికుంట రామిరెడ్డి పాట, చిలకమ్మ పాట, పసునూరి వెంకటరెడ్డి పాట, యలకపల్లి యాదగిరి పాట, గొముక్కుల గోపాలరెడ్డి పాట, కొంత కొండలరెడ్డి పాట,దొడ్డి కొమరయ్య పాట మొదలగునవి విప్లవ యుగ్మములగు వీర గాథానికలు, (తెలంగాణా విప్లవము : 1945-49).

సాంఘికములలో గుత్తాల గోపిరెడ్డి. మానంది రెడ్డి, గడేకల్లు నాగిరెడ్డి, బండోళ్ళ కురుమలన్న, గుడిపాటి చలమయ్య, మల్లారెడ్డి, సలపల అప్పనాయుడు మున్నగువారిపై గల పాటలు గ్రామకక్షలకు హత్యలకు సంబంధించినవి. అద్దాల సుబ్బులు పాట, చిన్న మునెమ్మ పాట, వీరసోమి పాట, గుంటూరు అచెమ్మ పాట మున్నగునవి 'స్వైరిణులు-భర్తృహంతలు' అను విభాగమునకు చెందును. అప్పలాపురం చెన్నారెడ్డి పాట, గొర్రెపోతుల పందెము మొదలగునవి 'పందెములు - స్పర్థలు' అను అంతశ్శాఖలోనివి. లలికట్ట పదము, ఒద్దిరాజుల పాట, బోన కాటపరెడ్డి పాట, ముసలమ్మ గండి. వరదరాజమ్మ పాట ఇత్యాదులు ఆత్మత్యాగముతో కూడిన కష్టపదములు. ఎల్లలచెరువు పొంగిన పాట, మూసి పొంగిన పాట, షల్నాటి ప్రళయము, పెన్నేటి పొంగు, అల్లూరి పాట, జనగామ రైలు ప్రమాదము జడ్చెర్ల రైలు ప్రమాదము మొదలగునవి 'విధి వైపరీత్యములు - ప్రమాదములు అను అంతశ్శాఖకు చెందిన లఘు వీరగాథలు.

బుడ్డా వెంగళరెడ్డి, సుద్దపల్లి లక్ష్మమ్మ, యాదాళ్ళ నాగమ్మ, చిన్న అండ్లూరు శివమ్మ, డొక్కా సీతమ్మ మున్నగు వారినిగూర్చి అల్లబడిన పాటలు దానవీర ప్రశంసలు. ఎఱ్ఱపాప పాట, చాకలి దుడుమన్న పదము లేక వీర నాగమ్మ పదము, వానదేవుని పాట, భూపతిరాజు పదము, బొత్తుదు పాట, ఒలియ పొచ్చావు పాట మున్నగునవి జానపదములు. రాముల పాట, మాయలేడి పాట, సీతమ్మ చెర, గరుడ పచ్చి పాట, అశోక వనము, ముద్దుటుంగరము లక్ష్మణ మూర్ఛ, కుశలవుల పుట్టుక, మంగమ్మ పాట, తురక బూబమ్మ పాట, జాలోలి గంగ, చెంచీత పాట మున్నగునవి పౌరాణికములు.

ఈ వీర గాథానికలలో చారిత్రక వీర మరణములు, విప్లవ వీర మరణములు, గ్రామకక్షల మూలమున సంభవించిన హత్యలు. ఆత్మత్యాగములతో కూడిన కష్టపదములు, ప్రకృతి తెచ్చిన ప్రమాదములు-ఇవి కరుణ రసప్రధాన

ములు. ఇట్టిపాటలను పాశ్చాత్యులు 'Planetus' లేక 'lamenting ballads' అందురు, మన విమర్శకులు వీనికి 'జాలి పాటలు', 'కన్నీటి పాటలు' అని పేర్లు పెట్టిరి. వీర ప్రశంసలగు గాథానికలలో వీరము, పందెములతు సంబంధించిన గాథానికలలో పట్టుదల, శర్మ్రహాంతలగు స్వైరిణుల పాటలలో వారి కార్యగర్హణ మును ద్యోతకమగును, దాన వీర ప్రశంసలలో ప్రజలకు వారియెడ గల కృతజ్ఞత వెల్లడి యగును. జానపదములలో అద్భుతరసము, పౌరాణికములలో భక్తి రసము హెచ్చు. (చూడుడు పట్టీ-8; ప్రక్క- పుట)

వీర గాథానుకరణములు-బుఱ్ఱ కథలు :-

మీద చర్చింపబడిన వీరగాథా చక్రములు, వీరగాథలు, వీర గాథానికలు-అను మూడు వర్గములును తెలుగు సాంప్రదాయిక వీరగాథా కవిత్వమునకు చెందినవి. ఈ సాంప్రదాయిక వీరగాథా కవిత్వములోని కొన్ని ప్రక్రియలను అనుకరించుచు ఆధునిక కాలమున 'బుఱ్ఱకథలు, జముకుల కథలు, సుద్దుల కథలు, తందనాన కథలు, బ్రతుకమ్మ పాటలు' - అనునవి బయలుదేరినవి. ఈ అనుకరణ ప్రక్రియలలో నేడు బుర్ర కథలు విశేష ప్రచారమున నున్నవి. ఇవి బొబ్బిలిపరున కథలనుండియు జంగం కథలనుండియు రాజకీయ ప్రబోధము కొరకు 1942 ప్రాంతమున ప్రభవించినవి. గుంటూరుమండలము వీని పుట్టిల్లు.

తంత్రి + బుఱ్ఱ=తంబుఱ' ఈతంబుఱతో చెప్పుకథలు 'తంబుఱ కథలు.' ఈ సమాసములో 'తం' లోపించి, శకటరేఫకు పూర్వపు ద్విత్వము వచ్చి, 'బుఱ్ఱకథలు' అను నామము ఏర్పడియుండును, లేదా గుమ్మెటలకు 'బుఱ్ఱలు' అను వ్యవహారము గుంటూరుమండలమున గలదు. బుఱ్ఱలు కొట్టుచు చెప్పు కథలు కావున 'బుఱ్ఱకథలు' అయియుండవచ్చును.

ఈ బుఱ్ఱకథలలో సాధారణముగా జంగం రగడ, ముగ్గురు మరాఠీల కథలోని సైసైవరుస, కాంభోజరాజు కథలోని తందనాన వరుసలు ప్రయోగింపబడుచుండును. సర్వాయి పాపని కథవరుస (ఏల వరుస), జముకుల వరుస (హరి హరీ పదముల వరుస), శారద వరుసలు కూడ బుఱ్ఱకథలలో అచ్చటచ్చట ప్రవేశపెట్టబడుచుండును. శ్రీయుతులు సుంకర సత్యనారాయణ, వారణాసి సత్యనారాయణ శాస్త్రి, మున్నగువారు చేయితిరిగిన బుఱ్ఱకథా రచయితలు. బుఱ్ఱకథా గానమున గుంటూరులోని శ్రీ షేక్ నాజర్ అమోఘ ప్రజ్ఞాశాలి.

# వీర గాథానికలు లేక లఘు వీరగాథలు

(Balladlings)

- చారిత్రకములు
  - వీర మరణములు
  - వీరప్రశంసలు
- విప్లవ జన్యములు
- సాంఘికములు
  - క్షలు-హత్యలు
  - స్వైరిణులు-భర్తృహంతలు
  - పందెములు-స్పర్ధలు
  - ఆత్మత్యాగములు-కష్టపదములు
  - విధి వైపరీత్యములు-ప్రమాదములు
- దానవీర ప్రశంసలు
- జానపదములు
- పౌరాణికములు

1946-49 మధ్యకాలమున భారత జాతీయ నాయకులపై బుఱ్ఱకథలు అసంఖ్యాకముగా బయలుదేరినవి. రాజమహేంద్రవరములోని కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్సు, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ మున్నగు గ్రంథ ప్రకాశకులు బుఱ్ఱకథలను కోకొల్లలుగా ముద్రించుచున్నారు.

ఈ బుఱ్ఱకథలలో ప్రబోధాత్మకములు హెచ్చు. చారిత్రకములు, పౌరాణికములు. వీరగాథా జన్యములు–అను వర్గములకు చెందు బుఱ్ఱకథలును గలవు. ప్రబోధాత్మకములగు బుఱ్ఱకథలలో రాజకీయ, సాంఘిక, జాతీయ ప్రబోధనములకు ఉద్దేశించినవియును, ప్రభుత్వ ప్రచారమునకు ఉద్దేశించినవియును గలవు.

హరిహరీ పదములను అనుకరించుచు పుట్టిన ఆధునిక ప్రక్రియ 'జముకుల కథలు'. 'సుద్దుల కథలు' కాటమరాజుకథలకు అనుకరణములు. తెలంగాణమున బొబ్బిలివరుస కథలను అనుకరించుచు 'తందనాన కథలు'ను, సాంప్రదాయికములగు బ్రతుకమ్మ పాటలను అనుకరించుచు ఆధునికములగు బ్రతుకమ్మ పాటలును బయలుదేరినవి. (చూడుడు: పట్టీ-9 ; ప్రక్క పుట)

ఇక మీదట వీరగాథల రసపోషణ, వీరగాథా కవిత్వములోని వారాను వర్ణనములు, వీరగాథల భాష, వీరగాథల ఛందోరీతులు వీరగాథా గానమునందలి సంగీతము–అను విషయములు చర్చింపబడును.

19. వీరగాథలు — రసపోషణ :-

వీరగాథలలో వీరము ప్రధాన రసముగా నుండును. లాక్షణికులును, విమర్శకులును వీరరసములో ఇరువదినాలుగు ప్రభేదములను గుర్తించిరి. ఈ ప్రభేదము లన్నింటికిని వీరగాథలలో ఉదాహరణములు లభించుచున్నవి. అయినను వీరగాథలలో యుద్ధవీరమే ప్రచురముగా కాననగును. 'వీరము' అనగా 'యుద్ధవీరము' అనియే పలువురు లాక్షణికుల అభిప్రాయము. బాలచంద్రుని కారెంపూడియుద్ధము యుద్ధవీరమునకు మహోత్కృష్టమగు ఉదాహరణము. రౌద్ర బీభత్స, కరుణ, భయానక, హాస్య, శృంగార, అద్భుత రసములు వీరగాథలలో ఆయా స్థలములలో నాయకుని వీరమునకు పోషకముగా వర్ణింపబడుచుండును. శాంతరస మెల్లప్పుడును వీరమునకు విరోధిరసమే; శాంతరస ప్రధానమగు గేయ కథలు వీరగాథా నామమునకు అనర్హములు. లాక్షణికులు తెల్పిన నాలుగు విధముల వీరరసాభాసములకు కూడ వీరగాథలలో దృష్టాంతములున్నవి.



వీర గాథానుకరణములు
బుఱ్ఱకథలు
జముకుల కథలు
గొల్లసుద్దులు లేక సుద్దుల కథలు
తందనాన కథలు
బ్రతుకమ్మ పాటలు
ప్రబోధాత్మకములు
చారిత్రకములు
పౌరాణికములు
వీరగాథా జన్యములు
రాజకీయ ప్రబోధములు
జాతీయ ప్రబోధములు
సాంఘిక ప్రబోధములు
ప్రభుత్వ ప్రచారకములు
పౌరాణికములు
వీరగాథా జన్యములు
సాంఘికములు
రాజకీయములు

వీరగాథలలో వీరరసమే ప్రధానమైనను, కరుణరస ప్రధానములగు కథలు కూడ కాలక్రమమున నేర్పడినవి. పేరంటాండ్ర కథలన్నియును ఇట్టివే. బాలనాగమ్మ కథ, గాంధారి కథ, ధర్మాంగద చరిత్ర- పాముపాట మున్నగు వీరగాథలలో వీరరసముకన్న అద్భుతరసమే ప్రాధాన్యమును వహించుచున్నదని చెప్పవచ్చును. బీభత్స హాస్యరసములు రెండును నాయకవీరమునకు పోషకములుగా మాత్రమేకాక, ప్రత్యేకముగా కూడా వీరగాథలలో వర్ణింపబడుచుండుట గమనింపవచ్చును.

20. వీరగాథా కవిత్వము - వారానువర్తనములు :-

మార్గసాహిత్యమున ప్రబంధములవలె, దేశిసాహిత్యమున వీరగాథలన్నియును ఒకే మూసలో తయారయినట్లుండును. వీరగాథలన్నింటను ఒకే రకమగు కథాప్రణాళిక, ఒకే రకమగు వర్ణనలు, అలంకారములు, పదబంధములు ఉండును. ఇట్లు వీరగాథలలో తరచుగా కానవగు సమానాంశములను 'వీరగాథల వారానువర్తనములు' (Ballad commonplaces) అందురు.

తెలుగు వీరగాథల కథాప్రణాళికలో వీరుడు తన తల్లిదండ్రులకు లేక లేక కలుగుట, బొంగరము లాడుట, ఆ యాటలో అతని శౌర్యము ప్రకోపింపబడుట, శత్రువులపై దండెత్తి వెడలుట- మున్నగునవి సాధారణముగా నుండును. ఈ కథాప్రణాళికకు, ముఖ్యముగా బొంగరాలాటకు, పల్నాటి వీరకథాచక్రములోని బాలచంద్రుని కథ మూలమై యుండును.

ఇట్లు కథాకథనములో అతిప్రధానమైన ఒక కనిష్ఠాంశమును ఆంగ్లమున 'Motif' అందురు. (దీనిని కన్నడములో 'ఆశయ', 'ప్రేరక', 'కథనఘటక' అని భాషాంతరీకరణము చేసినారు). ఈ 'మోటిఫ్' నకు కథాగమనమును మార్చగలిగిన శక్తి యుండును. కథను చెప్పువాడు దీనిని మరచుటకు వీలులేదు. ఈ మోటిఫ్ పైన చెప్పినట్లు బొంగరాలాటవంటి ఒక సంఘటన కావచ్చును. లేదా సవతితల్లి, పేదరాసి పెద్దమ్మ, కడగొట్టు కొడుకు, లేక కూతురు (వీరు సాధారణముగా మూడవ వారుగాకాని, ఏడవ వారుగాకాని ఉందురు), విశేషమైన శక్తులు కలిగిన చిలుక, కుక్క (బాలనాగమ్మ కథ), పాము (ధర్మాంగద చరిత్ర), గుఱ్ఱము (పల్నాటి వీరకథలలో అలరాజు గుఱ్ఱము 'నవరాల జిమ్మడు', పెద్దన్న బ్రహ్మనాయుడు...) - no

పాత్రలు కావచ్చును. లేదా మంత్రదండము, చంద్రాయుధము, ఎగిరెడి చెప్పు కంబళి, చెప్పులు, చావురానీయని తులసి వనమాల (బ్రహ్మనాయుడు అలరాజు మెడలో వేసినట్టిది) మొదలగు వస్తురూపమున నుండవచ్చును. ఉదాహరణకు 'రాముడు క్రొత్త దుస్తులు ధరించి ఊరికి వెళ్ళెను' అను వాక్యము సాధారణ వాక్యము. దీనిలో మోటిఫ్స్ లేవు. అట్లుకాక "బాలనాగమ్మ కొడుకు ఏడు సముద్రములు దాటివెళ్ళి మఱ్ఱిచెట్టుతొఱ్ఱలో నున్న చిలుకను పట్టితెచ్చెను." అను వాక్యములో విశేషాంశములు కలవు. ఏడు సముద్రములు దాటుట, మఱ్ఱిచెట్టు, చిలుక అనునవి యిందలి 'కథన ఘటకములు' (motifs). ఇవి ఎరిగాని కన్న జానపద కథలలో ఎక్కువగా నుండును. ప్రపంచములోని వివిధ కథలలో 'మోటిఫ్స్' ను అన్నిటిని సేకరించి 'Motif Index of Folk-literature' అను పేరుతో Stith Thompson అను అమెరికను జానపద విజ్ఞానవేత్త అరు సంపుటములను ప్రకటించినాడు.

ఈ కథన ఘటకములు ఒక్కొక్కప్పుడు పదప్రయోగమునకు సంబంధించియు నుండవచ్చును. ఏ వీరగాథలలోనైనను కోపమును వర్ణించునప్పుడు సాధారణముగా 'తెల్లని గుడ్లకు తెచ్చె రకతంబు' అను వారానువర్ణనము ప్రయోగింపబడుచుండును. శోకములు వివరించునప్పుడు "కుడికంటి వుదకాలు కుంభవర్షము లాయె, ఎడమకంటి వుదకాలు ఏరులై పారె" అని వర్ణింపబడుచుండును. ఇట్లే 'గక్కున నవ్వె' 'అగ్రుడై మండి', 'కండ్ల జూచు', 'వినవయ్య చెప్పెద విశదంబుగాను' 'అప్పుడు-అదె నొకమాట' వంటి పదములు వాక్యములు ప్రతి వీరగాథలోను కానవచ్చును. 'కలికి కలికి గాంధారివేళ, రాయి రాలు కరిగే వేళ' ఇత్యాదిగా రాత్రి వర్ణన కొనసాగును. ఇట్టివానిని 'శబ్దకథన ఘటకములు' (word motifs) అందురు.

విశేషణములు, విశేష్యములు త్రిప్పిత్రిప్పి చెప్పబడుచుండును. (ఉదా॥ "ఎండిదే బొంగరము పైడిదేజాలె, పైడిదే బొంగరము ఎండిదే జాలె") ఎరుకలసాని వేషము, జంగము వేషము, చాల తరుచుగా వర్ణింపబడుచుండును. ప్రాచీనమైన సైన్యవర్ణనములో కూడ 'పరాసువారు, తుపాకులు, ఫిరంగులు' చెప్పబడును. యుద్ధవర్ణన, రణరంగ బీభత్సవర్ణన ఏ వీరగాథలోనైనను ఒకే విధముగా నుండును. నరుకుత వుంటే నల్ల శిరసులు రాలుట, పొడుస్త వుంటే పొట్టపేగులు

పడుట, అప్పుడు తీన్నా పప్పుఅన్నమూ కుప్పలు తెప్పలగుట' ఇత్యాది వర్ణనలు ప్రతి వీరగాథలోను నుండును. (ఈ వర్ణన లన్నింటికిని బొబ్బిలికథ మూలముగా కన్పట్టును) వీరపత్నులకు, వీరమాతలకు దుస్స్వప్నములు వచ్చినట్లు చెప్పబడును- (ఇదియును 'కథన ఘటక'మే). వీరులు 'ఎండలకు ఎండిపట్టు దేరాలు, నీడలకు నీలిపట్టు దేరాలు' ఎత్తినట్లు పదేపదే చెప్పబడుచుండును. (word motifs).

వీరుడు ఒక ప్రయాణము చేయునప్పుడు మార్గమధ్యమున నున్న ఊళ్ళ పేర్లన్నియును ఏకరువు పెట్టబడును. వీరుని సేవకుల పేర్లు,సంగాతకాండ్ర పేర్లు, జంతువుల పేర్లు వరుసగా పెద్ద పట్టికగా చెప్పబడును. సంఖ్యా వాచకములలో 'ఏడు' శబ్దమునకు ప్రాచుర్యము కాననగును (number motif). కొన్ని వస్తువుల పేర్లు (చంద్రాయుధము, వెండికట్ల కిన్నెర మొ॥) కొన్ని పట్టణముల పేర్లు (వాలుగొండ,దేవగిరి,ఓరుగల్లు మొ॥) పదేపదే వచ్చుచుండును. స్త్రీల స్నాన వర్ణన, అలంకరణవర్ణన మున్నగునవి కూడా వారానువర్తనములే.

అలంకారములలో ఉపమాలంకారము హెచ్చు. తెలుగు భాషలోని సిసలైన సామెతలు, జాతీయములు, పలుకుబడులు, వీరగాథా కవిత్వమున కొల్లలుగా నుండును. ఇట్లు అన్ని వీరగాథలకును సమానమగు వారానువర్తనములేకాక, ఒక్కొక్క వర్గమునకు ప్రత్యేకమైన వారానువర్తనములును గలవు. వీరగాథల వారానువర్తనములవలన నిరక్షర కుక్షులైన గాథాకారులు అనేక గాథలను జ్ఞప్తి యందుంచుకొన గలుగుచున్నారు.

21. వీరగాథల భాష :-

'వీరగాథల భాష జానపదుల వ్యావహారిక భాష. ఇది సహజమై, సూటియై, సుందరమై, మధురాతి మధురమై దేశీయతను పుక్కిలించు జీవద్భాష. "అల్పాక్షరముల ననల్పార్థరచన కావించుటయె కాదె కవి వివేకంబు" అను పాల్కురికి సోమనాథుని సూక్తికి వీరగాథల భాష చక్కని యుదాహరణము. ఇది వ్యాకరణాలంకార నియమములకు కట్టువడక, అలతి యలతి పదములలో అప్రయత్నముగా వెడలెడు వ్యావహారిక భాష.

వీరగాథలలో అర్థాలంకారములే కాని శబ్దాలంకారము లుండవని చెప్పవచ్చును. అర్థాలంకారములలోకూడ ఉపమాలంకారమే హెచ్చుగా వాడబడు

చుండును. ఈ ఉపమాలంకారములు జానపదుల నిత్యజీవితములో తాకియున్నవి. దృష్టాంతము, రూపకము, స్వభావోక్తి, అప్రస్తుతప్రశంస మొదలగు అలంకారములు చెదురుమదురుగా నుండును.

వీరగాథలలో ఇంపైన సామెత లెన్నియో కలవు. ఈ సామెతలును, రెండింతలు జాతీయములు నున్నవి. పలుకుబడులు, నుడికారములు, సామెతలు వీర గాథలలో అడుగడుగునను ప్రత్యక్షమగుచుండును. పలనాటిసీమలో నున్న పలుకుబడులు కెక్కని అపూర్వ దేశ్యపదము లెన్నియో కలవు. వైరిసమాసములును, గ్రామ్యప్రయోగ ములును కాననగును. వ్యావహారిక రూపముల ననుసరించియే సంధిసమాస వ్యాకరణాంశములు కన్పట్టుచుండును. ఇంత వైవిధ్యము గల వీరగాథల భాషను భాషాశాస్త్రజ్ఞులు ప్రత్యేకముగా పరిశోధింపవలసి యున్నది.

## 22. వీరగాథల ఛందస్సు :—

వీరగాథల ఛందస్సు లక్షణగ్రంథములకు అందునది కాదు. తెలుగులో ద్విపదవికారములును రగడవికారములును అగు వీరగాథాఛ్ఛందము లున్నవి. శాసన ప్రమాణమునుబట్టి తెలుగు ఛందస్సులలో తరువోజ ప్రాచీనమైనదిగా కన్పట్టును. కాని, ఛందఃపరిణామమునుబట్టి పరిశీలించినచో "కిటతకిట, కిటతకిట, కిటతకిట, కిటతకిట" అని సాగు ఖండగతి అన్నిటికంటెను ప్రాచీనమైనదిగా తోచును. పూర్వకాలమున వీరగాథలన్నియు ఈ ఛందస్సులోనే ఉండెడివి. ఈ ఖండగతినుండి మంజరీ ద్విపద, ఈ మంజరీ ద్విపదనుండి ద్విపద, ఈ ద్విపద నుండి తరువోజ, తరువోజనుండి సీసము పరిణమించియుండును.

శక్తికథలలో ఖండగతి, పల్నాటివీరకథలలో మంజరీ ద్విపద, కాటమ రాజు కథలలో ద్విపద బహుళముగా గానవచ్చుచున్నది. వీరగాథలలోని ద్విపద కాని, మంజరీ ద్విపదకాని లాక్షణికులు చెప్పినట్లుగా ఇంద్ర సూర్యగణముల ప్రకారముండవు. ఒక్కొక్క పాదమునకు ఐదుమాత్రల గణములు మూడు, మూడు మాత్రల గణము ఒకటి (5 + 5 + 5 + 3) చొప్పున వీని రచన సాగును. యతిప్రాసలు ఐచ్ఛికములేగాని నియతములు కావు; కాని, యతి సర్వత్ర పాటింపబడినదని చెప్పవచ్చును. ఇంద్రగణములలో 'భ'గణము, 'నల'గణము నాలుగు మాత్రలవే కావున, వీనికొక మాత్రను చేర్చి, 'భల', 'నలల' అను

రీతిలో వీరగాథలలో ప్రయోగింపబడుచుండును. ఒక్కొక్కప్పుడు ఈ ద్విపద మంజరీ ద్విపదలు శిథిలములై ఖండగతిగా మారిపోవుచుండును. ఈ ఖండగతి కూడ శిథిలమై మరింత సాగిపోవుటయు గలదు.

బొబ్బిలివరుసలో ఒక్కొక్క పాదమున 8 + 8 + 9 (10) మాత్ర లుండును. యతిప్రాసలు కాకతాళీయములేకాని నిబద్ధములు కావు. ఈ బొబ్బిలి వరుసనుండి 8 + 8 మాత్రలొక పాదముగా ఒక వరుస, 8 + 9 (10) మాత్ర లొక పాదముగా వేరొక వరుస పరిణమించినవి కాంభోజరాజు కథ, వరాహావతార చరిత్ర (పందికథ), చిన్నపరెడ్డి కథ మున్నగునవి 8 + 8 మాత్రలొక పాద ముగా సాగు వీరగాథలు. బాలనాగమ్మ కథ, లక్ష్మమ్మ కథ, కమ్మవారి పణతి-పసల బాలరాజుకథ మున్నగునవి 8 + 9 (10) మాత్రలొక పాదముగా సాగు వీరగాథలు.

ముగ్గురు మరాటీల కథలోని వరుస, సర్వాయి పాపని కథలోని వరుప ప్రత్యేకములు. ముగ్గురు మరాటీల కథవరుసను "సైసై వరుస" అందురు. ఇందు పాదమునకు 12 మొదలుకొని 15 మాత్రల వరకును ఉండునట్లుగా కొన్ని పాదములు చెప్పి, చివర 14 మొదలుకొని 16 వరకును మాత్రలుండునట్లుగా ఒక్క పాదములో ముక్తాయింపు చేయబడును. ఈ వరుసలోని పూర్వపాదములు ఇట్లు విరుగుచుండును: 8 + 4 = 12; 8 + 5 = 13; 9 + 5 = 14. 10 + 5 = 15; ఈ వరుసలోని ముక్తాయింపు పాదము ఇట్లు విరుగును: 8 + 6 = 14; 9 + 6 = 15; 10 + 6 = 16. వీనిలో 8 మాత్రల గణము 3 + 5 గా కాని, 4 + 4 గా కాని, విరుగును. 9 మాత్రల గణము 3 + 3 + 3 గా విరుగును. 10 మాత్రల గణము 5 + 5 గా విరుగును.

ఇక సర్వాయిపాపని కథవరుసను "ఏల వరుస" యని చెప్పవచ్చును; ఇందు 7 + 7 = 14 మాత్రలొక పాదముగా రెండు పాదములును, 7 + 9 = 16 మాత్రలొక పాదముగా మరి రెండు పాదములును చెప్పబడును. మూడవ పాదము చివర 9 మాత్రల సంబోధన మొకటి అధికముగా నుండును. యక్ష గానములలో సుంకరి కొండడు - గొల్లభామం ఏలలు ఇట్లే ఉండును.

ఒక ఖండగతి పాదము, ఒక ద్విపదమంజరిపాదము కలిసి హరిహరీ పదముల వరుస యేర్పడినది. దీనిని "జంపె వరుస" అనియు, "జముకుల వరుస" అనియు పిలుతురు. దీని గణముల నిట్లు నిరూపింపవచ్చును:

5 + 5 + 5 + 5

5 + 5 + 5 + 3 (లేదా 4)

యతి ప్రాసలును, ప్రాస యతులును ఇందు గాననగును.

3 + 5 + 5 + 3 మాత్రలొక పాదముగా అంత్యప్రాసలతో అపరిమితముగ సాగెడి రచనలు "శారద పదము" లనబడును. ఈ శారదపదములలో ఒక్కొక్కప్పుడు మొదటి మూడు మాత్రల గణము లోపించి 5 + 5 + 3 గా రచన సాగుటయు గలదు.

8 + 8 + 9 (లేదా 10)అను బొబ్బిలి వరుసకు యతి ప్రాసలు, అంత్యప్రాసలు ఏర్పరచుటచే "జంగం రగడ" ఏర్పడియుండును. లేదా మహారాష్ట్రుల గజల్, డోరా, డోరాగజల్ మట్టు" అను ఛందస్సుల ప్రభావముచే ఈ జంగం రగడ పుట్టి యుండవచ్చును. యక్షగానములలో ప్రయుక్తములైన పై ఛందస్సులు అచ్చముగా జంగం రగడవలెనే యున్నవి.

వీర గాథానుకరణములగు బుఱ్ఱకథలలో బొబ్బిలివరుస - తద్భేదములు, సైసై వరుస, సర్వాయి పాపనివరుస,జముకుల వరుస, శారదపదరుస మున్నగునవి అన్నియును గానవచ్చుచున్నవి.

తెలంగాణమున ప్రసిద్ధికెక్కిన మియాసాబు కథ, కొమిరెల్లి మల్లన్న కథ మున్నగువానిలో త్రిశ్రగతి (3 + 3 + 3 + 3) కాననగును. నల్లతంగాళ్ కథ కూడ త్రిశ్రగతిలోనే సాగినది. సుబ్బిరెడ్డికథ రూపకగతి (6 + 6 + 6 + 6) లో నున్నది.

వీరగాథానికలలో త్రిశ్ర, చతురశ్ర, ఖండ, రూపక, మిశ్ర ఆది గతు లన్నింటికిని ఉదాహరణములు లభించుచున్నవి. గుంటూరు అదెమ్మ పాట, మరుట్ల చిన్నమల్లేశు పాట, గడేకల్లు నాగిరెడ్డిపాట మున్నగునవి త్రిశ్రగతిలో నున్నవి. సిద్దాపురం కట్టపదము చతురశ్రగతి (4 + 4 + 4 + 4), ఖండగతి (5 + 5 + 5 + 5)లో నున్న,లము వీరగాథలు పెక్కు గలవు.లికట్ట పదము, వానదేవుని పాట, సీతమ్మచెర. నల్లగొండపాట మున్నగునవి అన్నియును ఖండగతి లోనే సాగినవి. త్రిశ్రగతికి రెట్టింపు రూపకగతి. అద్దాల సుబ్బులుపాట, అల్లుడు పాట, మల్లన్నపాట మొదలగునవి రూపకగతికి ఉదాహరణములు. మిశ్రగతి (7 + 7 + 7 + 7)లో నడచిన పాటలు 'అప్పలాపురం చెన్నారెడ్డిపాట, గుత్తాం గోపిరెడ్డిపాట మొదలగునవి. బుడ్డా వెంగళరెడ్డిపాట పోట్ల బూదయ్యపాట ఇత్యాదులు అదిగతి (8 + 8 + 8 + 8)కి చెందినవి. చతురశ్రగతికి రెట్టింపుఆది గతి,

లాక్షణికులు చెప్పిన నవవిధ రగడలకును వీరగాథల వరుసలకును మిక్కిలి సన్నిహిత సంబంధమున్నది. హయప్రచార, తురగవల్గన రగడలు-త్రిశ్రగతికిని; మధురగతి, హరిగతి రగడలు-చతురశ్రగతికిని; ద్విరదగతి, జయభద్ర రగడలు—ఖండగతికిని; హరిణగతి, వృషభగతిరగడలు—మిశ్రగతికిని సరిగా సరిపోవును. ఈ రగడలకు కన్నడిగుల షట్పదులతోగూడ పోలికలున్నవి[8].

---

8. i. శర షట్పది: 4 + 4
4 + 4
4 + 4 + 4 + 2
ఇట్లే ఉత్తరార్ధము

ii. కుసుమ షట్పది : 5 + 5
5 + 5
5 + 5 + 5 + 2
..............

iii. భోగ షట్పది : 3 + 3 + 3 + 3
3 + 3 + 3 + 3
3 + 3 + 3 + 3 + 3 + 2
....................

iv. భామినీ షట్పది : 3 + 4 + 3 + 4
3 + 4 + 3 + 4
3 + 4 + 3 + 4 + 3 + 4 + 2
..........................

v. పరివర్ధినీ షట్పది : 4 + 4 + 4 + 4
4 + 4 + 4 + 4
4 + 4 + 4 + 4 + 4 + 4 + 2
..........................

vi. వార్ధక షట్పది : 5 + 5 + 5 + 5
5 + 5 + 5 + 5
5 + 5 + 5 + 5 + 5 + 5 + 2
..........................

పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలోను యతిప్రాసలు తప్పకుండా పాటింపబడినవి. కొన్ని కథలలో మాత్రాగణములు ఉపయోగింపబడినను యతి ప్రాసలకు భంగము వాటిల్లలేదు. యతిభంగముగా తోచు పదములలో జానపదుల ఉచ్చారణను పరిగణింపవలసి యున్నది. యతిభంగమును నివారించుటకై జానపద కవులు అపశబ్దములను సహితము ప్రయోగించినట్లు స్పష్టమగుచున్నది. అఖండయతి, స్వరప్రాస, త్రిప్రాస, మున్నగునవి వీరగాథలలో అక్కడక్కడ కానవచ్చును.

## 23. గాథా గానము – సంగీతము :-

పాడబడుట వీరగాథల ప్రధాన లక్షణము. కాని గాథా గానమున గొంతు మంద్రస్థాయినుండి తారస్థాయి కెత్తినను ఎక్కువ రాగభేదములను చూపక, ఛందస్సును సూచించు వైవిధ్యముతో మాత్రమే పాడవలెను. స్వరములతో అక్షరములను మ్రింగివేయక స్పష్టముగా నుచ్చరింపవలెను. వీరగాథలు గేయ రూపమున నున్నను, వీనిలో 'ధాతువు' (సంగీతాంశము) కన్న 'మాతువు (సాహిత్యాంశము) ప్రధానమైనది. వీరగాథల ఛందస్సంతయు సంగీతశాస్త్రము లోని 'గతి' లేక 'జాతి' భేదములలో ఇమిడిపోవును. కావున వీరగాథలు తాళ ప్రధానములని చెప్పవచ్చును. స్వరములలో సప్తస్వరము లుండవుగాని, ఒకటి రెండు స్వరములుండును.

వీరగాథలు ఎక్కువగా అట (ఆట) తాళములోను ఆదితాళములోను సాగుచుండును. యుద్ధ ఘట్టములందు ఏకతాళము పడును. జంపె, త్రిపుట, రూపకము, జుల్వ కురుజంపె మొదలగు తాళములును సందర్భానుసారముగా ప్రయోగింపబడుచుండును. ఇట్లు వీరగాథలు తాళప్రధానము లగుటచే వీనిని పాడుటకు తట్టువాద్యములను విశేషముగా నుపయోగింతురు. పంబజోడు, గుమ్మెటలు మొదలగునవి వీరగాతలలోని తాళమును, తిత్తి, తంబురవంటి వాద్య ములు విరగాథల శ్రుతిని నిలుపుచుండును.

సాంప్రదాయిక వీరగాథలలో ఆయా పేర్లతో రాగములు లేకపోయినను, రసానుగుణముగా వరుసలను మార్చుట కలదు. జంగంకథలలోను బుఱ్ఱకథలలోను రాగచ్ఛాయలు స్పష్టముగా నున్నవి. విషయప్రధానమగు ఘట్టములలో దేవగాంధారి రాగమును, ఏడ్చుటకు ముందుండెడి విచారమును సూచించుటలో తోడిరాగమును, దుర్భరశోకమును వ్యక్తమొనర్చునప్పుడు ఫీలురాగమును; రౌద్రరస పోషణములో శ్రీరాగమును; బీభత్స భయానక రసములలో మోహనరాగమును; సంతోషమును సూచించునప్పుడు శంకరాభరణ, ఆనందభైరవి రాగములను ఉపయోగించుట పరిపాటి. జంగంకథలలో అటతాళము, బుఱ్ఱకథలలో ఆదితాళము హెచ్చుగా కానవచ్చుచున్నది.

సంగీతాంశమునుబట్టి వీరగాథలను మూడు విధములుగా వర్గీకరింప వచ్చును : (1) ఒకే వ్యక్తి పాడు వీరగాథలు, (2) ఒక వ్యక్తి పాడుచుండగా ఇద్దరు ముగ్గురు వంతపాడు వీరగాథలు, (3)అందరును కలిసి పాడు వీరగాథలు. తెలుగు వీరగాథలలోఎక్కువభాగము రెండవ వర్గమునకు చెందునని చెప్పవచ్చును. కిన్నెర కథలు, జాగటకథలు మొదటి వర్గమునకును; కోలాటపు కోపులుగా పాడు భము వీరగాథలు మూడవ వర్గమునకును ఉదాహరణములు. తక్కినవన్నియును రెండవవర్గమునకే చెందును. వీరగాథలలోని సంగీతమున గూర్చి సంగీతవిద్వాంసు లింకను శోధింపవలసి యున్నది. పాశ్చాత్య దేశములలోవలె వీరగాథల సంగీత మును చిత్రించి చూపుటకూడ అత్యావశ్యకము.

ఇక వీరగాథల వైశిష్ట్యమును గూర్చియు, ఆంధ్రదేశములోని వివిధ గాథాకారులను గూర్చియు, వీరగాథల క్షీణతా కారణములను గూర్చియు వీర గాథల సేకరణము-పరిరక్షణములను గూర్చియు స్థూలముగా చర్చింతము.

24. వీరగాథల వైశిష్ట్యము :-

వీరగాథల వైశిష్ట్యమును అనేకవిధములుగా నెన్నవచ్చును. వీరగాథా ప్రక్రియ ప్రపంచమున ప్రతి సాహిత్యమందును స్వతంత్రముగా పుట్టిన ప్రక్రియ. ఇది యితిహాస కవిత్వము (Epic poetry)నకు మూలకందము. వీరగాథలు నిసర్గమనోహరములు. సహజత్వమే వీనికి ప్రాణము. ఒక దేశములోని వీరగాథ లన్నియును ఆ దేశసంస్కృతిని పట్టియిచ్చు జాతీయతా చిహ్నములుగా నుండును. దేశస్వాతంత్ర్యమును కాపాడుకొనుటకు ప్రజలలో వీరగాథాగానము అత్యవస

రము వీరగాథలు దేశమునకు గర్వకారణములు. ఇవి ప్రజాజీవితమును మణి దర్పణముల వలె ప్రతిబింబింపజేయును.

నవరసములలోకెల్ల విశిష్టమైన వీరరసముచే వీరగాథలు నిండియుండును. ఎన్నడో చనిపోయిన వీరులు గాథాగానముచే మరలపునరుజ్జీవితులగుదురు; శ్రోతల మనోనేత్రములకు ప్రత్యక్షమగుదురు. తెలుగు సాహిత్యమంతయు సంస్కృత పరివర్తనమే అను నిందను బాపగల ఒకే సాధనము వీరగాథా కవిత్వము.

వీరగాథలకు మూడు మహత్తర శక్తులున్నవి: (1) సర్వజనాకర్షణ శక్తి—ఇవి సరళముగా నుండి సర్వజనులను ఆకర్షించును. (2) సంఘ సంచాలక శక్తి—వీరగాథలు సంఘమును సంచలింపజేసి మహావిప్లవములను సృజింప గలవు. (3) విచిత్రానుభూతి దాయక శక్తి—ఇవి శ్రోతలకు విచిత్రమగు ఆత్మీయానుభూతి నొసంగ గలవు.

దేశ దేశములలో వీరగాథలచే శిష్టకవులు ప్రభావితులైనారు. వీరగాథల వలన భాషకు సహజత్వము జీవము కలుగును. కొన్ని సాంఘిక ప్రయోజన ములను నెరవేరగలవు. వీరగాథలు 'విధి బలీయము, మానవుడు నిమిత్త మాత్రుడు' అను నీతిని నిశ్శబ్దముగా ధ్వనింపజేయును.

25. గాథాకారులు :-

వీరగాథలను పాడు దేశద్రిమ్మరులైన గాయక వివిధ భాషలలో భిక్షువు లను 'గాథాకారు'లనియు 'గాథకు' లనియుపిలువవచ్చును. ఈ గాథాకారులకు వివిధ నామములున్నవి: Minstrels(English), Jongleurs(French), Scops (Old English), Bards(Irish), Skald(Scandinavian), Minne-singers (German), Troubadours (Spanish), రావి (అరేబియన్). చారణులు (హిందీ), భోపాలు, మిరోగీలు (రాజస్థానీ), రావత్ (మధ్యప్రదేశ్), వృత్తిగాయకరు (కన్నడము), జంగములు (తెలుగు).

నేడు బిచ్చగాండ్రుగా మారిన ఈ గాథకుల చరిత్రలో నాలుగు ఘట్టము లున్నవి. మొదట వీరశిఖామణులగు రాజులు తమ సాహస కృత్యములను తామే గానమొనర్చుకొనెడివారు. తరువాత తమ సాహసములను కీర్తించుటకు ప్రత్యేక ముగా భట్టులను నియమించుకొనిరి. కాలక్రమమున రాజ్యము లంతరింపగా,

ఈ భట్టులును వందిమాగధులును రాజ్యములను కోల్పోయిన ఆయా కులముల వారిని యాచించుచు 'యాచకు' లను పేరుతో వ్యవహరింప బడుచుండెడివారు. పాశ్చాత్య నాగరికతా ప్రభావమున ఈ యాచకులకు మన సంఘములో నీచస్థాన మేర్పడి అనాదరణము హెచ్చినది. ఫలితముగా వీరు అన్ని కులముల వారిని యాచించుచు, సంచార గాయక భిక్షువులుగా మారిపోయిరి. కొందరు తమ కుల వృత్తిని విడనాడి అన్యవృత్తులను స్వీకరించిరి.

ఆంధ్రదేశమున ఈ సంచార గాయక భిక్షువులు పలురకముల వారున్నారు: బవనీలు, పంబలవారు, వీరవిద్యావంతులు, కొమ్ములవారు, పిచ్చుకుంట్లు, పూసల బలిజలు, శారదకాండ్రు వీరముష్టులు, జంగములు, దాసరులు, గరుడ స్తంభం దాసరులు, భాగవతులు, బీరన్నలవారు,సుద్దుల గొల్లలు, గంగిరెద్దులవారు, బాలసంతువారు, బుడబుక్కలవారు, చిందు మాదిగలు, జోగులవారు, జక్కులవారు హాట్కారులు,దక్కలవారు. మాష్టీలు, బొమ్మలాటగాండ్రు మొదలగువారు కలరు. ఈ గాథాకారులు అతి ప్రాచీనకాలము నుండియు తెనుగునాట వ్యాపించి యుండిరనుటకు శ్రీనాథుని క్రీడాభిరామము, పాలవేకరి కదిరీపతి (1650) 'శుకస ప్తతి', అయ్యలరాజు నారాయణామాత్యుని (1750) 'హంస వింశతి' మున్నగు కావ్యములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఈ గాథకులయందు ముఖస్థరూపమున ఎన్నియో వీర గాథ లున్నవి. నాగరకతా ప్రభావముచే అవి నశింపకముందే రక్షించుకొనవలసిన బాధ్యత ప్రతి ఆంధ్రసాహిత్య తపస్వికిని గలదు.

26. క్షీణతా కారణములు :-

ఆధునిక కాలమున వీరగాథలు నశించిపోవుచున్నవి. ఈ నశింపునకు అనేక కారణము లున్నవి. ప్రౌఢకావ్యములను మరగిన పండితుల అలక్ష్యము దీనికి ప్రథమ కారణము. పండితులు దేశికవితలను నిరసించుట ప్రాచీనకాలమునుండియు గలదు. ఇట్టి నిరసనము వలననే మన ప్రాజ్నన్నయయుగములోని దేశికవితలు రూపుమాసినవి వీరగాథలయెడ పండిత పరిహాసము పాశ్చాత్య దేశములందును గానవచ్చుచున్నది. ప్రాచీనులలో కొందరు మాత్రము వీని ప్రాశస్త్యమును గుర్తించినారు. మొత్తముపై వీరగాథలను పొగడిన వారికన్న తెగడినవారి సంఖ్యయే యెక్కువ. వీరగాథలుకూడ సాహిత్యమున నొక ప్రధానభాగమని

మరచుటచేతను, నిరక్షరాస్యుల నుద్దేశించి చెప్పబడిన జానపద కవిత్వమును ప్రౌఢకవిత్వముతో పోల్చిచూచుట వలనను వీరగాథలయెడ విద్వాంసుల కిట్టి నిరసన భావము కలిగియుండును.

మహాకవులు వీరగాథారచనము కావించకుండుట వీరగాథల క్షీణతా కారణములలో రెండవది. తెలుగులో ఒక్క శ్రీనాథుడు, ఆంగ్లమున ఒక స్కాట్ మాత్రమే వీరగాథారచన చేసిన మహాకవులు. తక్కిన కవులెవ్వరును ఇట్టి ప్రయత్నము చేసినట్లు కానరాదు. వీరగాథలను ప్రకటించుటలో పండితులు అనేకము లగు మార్పులను చేయుటవలన కూడ అవి నశించుచున్నవని చెప్పవచ్చును. ముద్రించుటవలన వీరగాథలు నశించిపోవునని తలంచు విమర్శకులు పాశ్చాత్య దేశములలోను ప్రాచ్య దేశములలోను గూడ గలరు. కాని నాకిది సమంజసముగా తోపదు. వీరగాథలోని సాహిత్యాంశమును మాత్రమే ముద్రించినచో వారు చెప్పిన నష్టము కలుగునుగాని, సంగీతాంశమును సహితము పదిలపరచినచో అట్టి నష్టము కలుగజాలదు.

నాగరకత వీరగాథలకు పరమశత్రువు. నందుచు నాగరకమైనకొలది అందలి జానపద కవిత్వము నశించును. నేటి చలనచిత్రములు, నిమ్నజాతులలో క్రైస్తవమత ప్రబోధము, జాతరలను కోడిపందెములను ప్రభుత్వము నిషేధించుట, మౌలిక వీరగాథలను ప్రకటించుటకు ఇష్టపడని గాథాకారుల మూర్ఖత్వము, విశ్వ విద్యాలయముల మౌనము ఇత్యాదులు వీరగాథల క్షీణతా కారణములలో మరి కొన్నియని నా విశ్వాసము.

27. సేకరణ–పరిరక్షణ :-

జానపద సాహిత్య పరిశోధన మనగా మాటలు కాదు. వీరగాథా సంచయనము అష్టకష్టములతో కూడిన పని. నిరక్షర కుక్షులును మూర్ఖులును, దేశ ద్రిమ్మరులును, విపరీతమగు త్రాగుబోతులును అగు గాథాకారులతో వేగుటకు ఓర్పు కావలెను. భారతదేశములోని వివిధ ప్రాంతముల జానపద సాహిత్యమును ఉద్ధరించుటలో శ్రీరామ నరేశ్ త్రిపాఠీగారును, తెలుగు జానపద గేయములను సేకరించుటలో ఆచార్య బి. రామరాజుగారును ఎన్నికష్టములకు లోనయిరో నేను

అనుభవ పూర్వకముగా తెలిసికొంటిని. ఎన్ని కష్టములున్నను వీరగాథా సంచయనము కొనసాగింప వలసినదే. లేనిచో ఈ సాహిత్యమంతయు నశించి పోగల ప్రమాదమున్నది.

జానపద సాహిత్య సంచయనమున మిక్కిలి మెలకువను ప్రదర్శింపవలెను. H.M. Belden అను అమెరికను విమర్శకుడు జానపద సాహిత్యమును సేకరించువారు ముఖ్యముగా గమనింపవలసిన ఆరు విషయములను తెల్పినాడు:-

1. గాథకుని నోటినుండి పాట లేదా వీరగాథ ఎట్లు వచ్చినదో సరిగా అట్లే వ్రాయవలెను.

(తప్పులు, అర్థము లేని మాటలు మొదలగునవి యథాతథముగా వ్రాయవలెను)

2. పాటను లేదా వీరగాథను ఎప్పుడు ఎక్కడ ఎవరినుండి సంపాదించితిమో గుర్తింపవలెను.

3. వీరగాథను గాథాకారుడు, పాడుచుండగా వ్రాసితిమో, లేక చదువుచుండగా వ్రాసితిమో, లేక ఏదైన వ్రాతప్రతినుండి వ్రాసితిమో తెలుపవలెను

4. ఆ గాథాకారుడు ఈ వీరగాథను ఎక్కడ ఎవరినుండి నేర్చెనో తెలిసికొనవలెను.

5. గాథకుని కులమును, పూర్వికులను, స్వస్థలమును గుర్తింపవలెను.

6. గాథకుడు ముద్రిత వీరగాథనుగూర్చి తెలిసికొనెనో లేదో పరిశీలింపవలెను.

ఈ ఆరు విషయములను దృష్టియందుంచుకొనినపుడే వీరగాథలను నిర్దుష్టముగా సేకరింపగలము.

రామనరేశ్ త్రిపాఠీగారు, ఆచార్య దేవేంద్ర సత్యార్థిగారు భారతదేశమున వివిధ ప్రాంతముల జానపద సాహిత్యమును సేకరించినారు. తెలుగులో మొట్ట మొదట వీరగాథలను సేకరించిన మహానుభావుడు సి.పి. బ్రౌను దొర. ఇతడు క్రీ.శ. 1842లో ఒక జంగమును నెలరోజుల పాటు తన యింట నుంచుకొని, అతనిచే బొబ్బిలి కథను. కొమారరాముడి కథను, కామమ్మకథను పాడించి వ్రాయించినాడు. 1874లో J.A. Boyle దొరగారు సర్వాయి పాపడు కథను సేకరించినారు. 19వ శతాబ్ది ఉత్తరార్ధమునుండి వీరగాథలు ముద్రింపబడుట

ప్రారంభమైనది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, నేదునూరి గంగాధరంగారు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, చేపమ్మ కామేశ్వరరావుగారు, హరి ఆదిశేషువుగారు, ఆచార్య బి. రామరాజుగారు, ఆచార్య తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు, ఆచార్య తూమాటి దొణప్పగారు, డా. నాయని కృష్ణకుమారిగారు తెలుగు వీరగాథలనుగూర్చి ప్రశస్తమగు కృషిని సల్పియున్నారు. ప్రస్తుతము అమెరికాలోని విస్కాన్‌సిన్ విశ్వవిద్యాలయమునకు చెందిన శ్రీ జీన్. హెచ్. రోఘేర్ (Gene. H. Roghair) అను నాతడు పల్నాటి వీరకథలనుగూర్చి కూలంకషముగా పరిశోధన చేయుచున్నాడు. రేడియో శాఖవారు కూడ తెలుగు జానపద సాహిత్యమును ప్రత్యేకశ్రద్ధతో ప్రోత్సహించు చున్నారు.

ఈ మహత్తర జానపద సాహిత్యమును సంరక్షించుకొనుటకై పెద్దలు కొన్ని సూచనలు చేసియున్నారు. వీరగాథలను సేకరించుటలో కేవలము సాహిత్యమునేకాక సంగీతాంశమును కూడ పదిలపరుచుకొనవలెను. సంప్రదాయములు నశించిపోకుండ నుండుటకై తద్గాయక భిక్షుకులను ప్రోత్సహింపవలెను. ముద్రించుటచే వీరగాథలు నశించిపోవునని కొందరి భయము. కాని కేవలము సాహిత్యమునేకాక సంగీతాంశమునుగూడ ముద్రించినచో ఈ భయమునకు తావుండదు. ప్రభుత్వము, సాహిత్యసంస్థలు వీరగాథల సేకరణమునకు నడుము కట్టవలెను.

'జ్ఞాన భారతి' —తంగిరాల వెంకట సుబ్బారావు
బెంగుళూరు,
9-9-1975

# కాటమరాజు కథాచక్రము

తెలుగు వీరగాథా సంపదలో పల్నాటి వీరకథల తరువాత పేర్కొన దగినవి 'కాటమరాజు కథలు'. వీనికి 'యాదవరాజుల కథలు', 'యాదవ భారతము', 'యదు శాస్త్రము' అను నామాంతరములు కలవు. ఇవి ఆంధ్రదేశము నందంతటను పాడబడుచున్నను, నెల్లూరు ప్రకాశము మండలములలో ముఖ్యముగా దర్శి, కనిగిరి, కందుకూరు, ఉదయగిరి ప్రాంతములందు ఈ కథలకు విశేషప్రచారమున్నది. గుంటూరు. కడప, కర్నూలు మండలములందును కాటమరాజు కథలకు ఆదరము మెండు. పల్నాటి వీరకథలవలెనే, ఇవియును చారిత్రక వీరగాథలు. పల్నాటి వీరకథలు క్రీ.శ. పంద్రెండవ శతాబ్దమున జరిగిన సంఘటనలు కాగా, ఈ కాటమరాజు కథలు పదమూడవ శతాబ్దమునాటివి. ఇవి మొత్తము ముప్పదిరెండు కథలున్నవని యాదవ గాథాకారుల వలన తెలియుచున్నది. ఈ కథలన్నియు కాటమరాజునకును, ఆతని సోదర సోదరీమణులకును, పితృ పితామహులకును సంబంధించిన ప్రశస్త సాంప్రదాయిక వీరగాథలు. ఈ ముప్పదిరెండు వీరగాథలును, చక్కని వరుసక్రమమున ఒక పెద్ద కథాచక్రముగా నేర్పడియున్నవి. దీనిని 'కాటమరాజు కథాచక్రము' (The Ballad-cycle of Katamaraju) అని పిలువవచ్చును. ఈ కథాచక్రము ఐతిహాసిక దశకు మిక్కిలి దగ్గరలో నున్నది.

'కాటమరాజు కథ', 'కాటమరాజు కథ' అనుటయే కాని దీనిని గూర్చిన సంపూర్ణవిషయము లేవియు తెలుగు సాహిత్యలోకమునకు నేటివరకును తెలియవు. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున ఆరు కథలున్నవి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనవలన ఇందలి కథల్లు నాలుగు ముద్రింప

బడినవి. శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు 1937 లో 'పలనాటి చరిత్ర', 'శక్తి కురువ యుద్ధము' అను కథలను 1970 లో 'పోలురాజు చరిత్ర'ను ప్రకటించి యున్నారు. ఇవితప్ప తక్కినవేవియును ఆంధ్ర సాహిత్య సంసేవకులకు తెలియవు.

!. కథల సంఖ్య :-

'కాటమరాజు కథ' అను ఏకవచన ప్రయోగము తప్పు. ఎందుకనగా, అది ఒక్క కథ కాదు; ముప్పదిరెండు కథల సుమహారాల చక్రము. ఈ చక్రములోని ప్రధానవ్యక్తి కాటమరాజైనను, ఈ ముప్పదిరెండు కథలలోను ఏ కథకును 'కాటమరాజు కథ' అని పేరు లేకపోవుట ఆశ్చర్యకరము. అది వీరగాథా చక్రమని సూచించుటకే కాబోలును, జానపదులు 'కాటమరాజు కథలు' అను బహువచన రూపమునే వాడుచున్నారు. పల్నాటి వీరకథలును, కాటమరాజు కథలును వీరగాథా వృత్తములని తెలిసియే కాబోలు బ్రౌను దొరగారు వీని పేరిట 'చరిత్ర' అను శబ్దమును చేర్చి ప్రయోగించినారు. ('పల్నాటి వీరచరిత్ర', 'కాటమరాజు చరిత్ర') వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "కాటమరాజు కథ" అను పేరుతో సంకలితము చేసినది నిజమునకు "ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట" అను ఒక్క వీరగాథ మాత్రమే. వేటూరివారి ఛాత్రులు ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు ఈ "కాటమరాజు కథ" కాటమరాజు చరిత్రమును సంపూర్ణముగా అభివర్ణించు గ్రంథమని ప్రశంసించిరి.[1] ఇది ప్రామాదికము. వేటూరివారిచే పరిష్కరింపబడి "కాటమరాజు కథ"గా ప్రకటితమైన ఈ కథ సుదీర్ఘమగు కాటమరాజు కథా చక్రమున ఒక భాగము మాత్రమే. ఈ కథాచక్రము కాటమరాజు పితామహుడగు "ఆవుల పలురాజు" కథతో ప్రారంభమై, కాటమరాజు సోదరుడగు 'శక్తి బొల్లు కథ'తో అంతమగును. ఈ రెండు కథలకును మధ్య అనేక కథలున్నవి. వానిలో

1. చూ. వారి "కాటమరాజు కథ" అను వ్యాసము, ఆంధ్రపత్రిక, విజయ సంవత్సరాది సంచిక (1953-54), పుటలు 33-56. "వీనిలో కాటమ రాజు కథ యనునది కాటమరాజు చరిత్రమును సంపూర్ణముగా నభివర్ణించు గ్రంథము.." (పుట 36)

"గంగుల పినయెల్లయ రచించిన కాటమరాజుకథ,కథావృత్తాంతమును దొలి నుండి తుదివాక నభివర్ణించుచుండగా/........" (పుట-44)

"ఎఱ్ఱిగడ్డపాటి పోట్లాట" ఒకటి. ఇదియే కాటమరాజు వృత్తాంతమును సంపూర్ణ ముగా అభివర్ణించుననుట పొసగదు.

ఈ కాటమరాజు కథాచక్రమున ముప్పదిరెండు కథలున్నవని చెప్పుటయే కాని, ఆ ముప్పదిరెండు కథల నామములను వరుసగా చెప్పగలిగిన గాథాకారు డెవ్వడును నాకు తటస్థపడలేదు. మదరాసు ప్రభుత్వ పుస్తక భాండాగారమున పల్నాటి వీరకథ లెక్కువగా నున్నవికాని కాటమరాజుకథలు మాత్రము మిక్కిలి తక్కువగ నున్నవి. ఇందున్న మొత్తము కథలు ఆరు మాత్రమే. గురువర్యులు డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక (1-53-54)లో మదరాసు గ్రంథాలయమున గల ఈ ఆరుకథలను గూర్చి విపులముగ చర్చించియున్నారు. వేటూరివారు పరిష్కరించిన 'కాటమ రాజుకథ'ను 1953 లో మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత భాండాగారమువారు ప్రకటించిరి. దీనికి మల్లంపల్లి సోమశేఖర శర్మగారు పీఠిక వ్రాయుచు ఈ కథాచక్రమున ఇంకను మరికొన్ని కథలు ఉండియుండుననియు, అవి మదరాసు గ్రంథాలయమందు సహితము లేవనియు ఒక చక్కని ఊహను వెల్లడించిరి:

"The story proper or the section, dealing with the original agreement and the cause of the quarrel, is not found here in this work. Hence, it seems that there should be some more sections in this work which even the government oriental library does not possess" [2]

సత్యాన్వేషణము పరిశోధకుల లక్షణము. అట్టి అన్వేషణమున నూటికి నూరపాళ్లు కృతార్థులైనవారు మల్లంపల్లివారు వారు. పైన వెలిబుచ్చిన ఊహయే నాకు కరదీపిక కాగా, ఈ కథాచక్రము నందలి తక్కిన వీరగాథలను సంపా దించుటకు నడుముకట్టి ఆంధ్రదేశమంతయు శోధించితిని. యాదవ వృద్ధు లనే కులను సంప్రదించితిని. ఆంధ్రదేశమున వివిధ ప్రాంతములందు గల గాథా కారులను కలసికొంటిని. సుమారు ఇరువది వరకును తాళపత్ర గ్రంథములను సంపాదించితిని.

2. కాటమరాజు కథ, ఆంగ్ల పీఠిక; పుట vii

ఈ త్రివిధ పరిశీలనముతో ఈ కాటమరాజు కథాచక్రమునగల వన్నెం రెండు వీరగాథల నామములను చాల భాగము నిర్ణయింప గలిగితిని. నాకు తెలిసినంతవరకును కాటమరాజు కథాచక్రమున ఈ క్రింది వీరగాథలున్నవి :-

1. ఆవుల వలురాజు కథ (లేక వలురాజు కథ లేక వల్లురాజు కథ)
2. పంపాద్రి కథ.
3. పెద్దిరాజు కథ.
4. సింహాద్రిరాజు కథ.
5. ఎఱనూకరాజు కథ.
6. నలనూకరాజు కథ.
7. పోలురాజు కథ లేక శివపురాణము. దీనిలో ఆరు చాటువలు కలవు.
   (1) చంద్రగుప్తుని చాటువ.
   (2) మల్లికాదేవి చాటువ.
   (3) ముక్కంటి చాటువ లేక బ్రాహ్మణచాటువ.
   (4) జంగాల చాటువ.
   (5) కపోత చాటువ.
   (6) గయుని చాటువ.
8. బల్లికురువ పోట్లాట
9. కాటమరాజుకు పట్నంకట్టిన కథ లేక కాటమరాజు పట్టాభిషేకము.
10. కరియావుల రాజు కథ.
11. పాపనూక కథ.
12. 'ఆవుల మేపు'- నామాంతరములు : 'ఉత్తరాది ఆవుల మేపు'; 'కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు', 'ఆవుల మేపులు - ఉత్తర కాండము'. (ఇక్కడ 'ఉత్తర' అనగా 'ఉత్తర దిక్కు' అని అర్థమే కాని 'తరువాతది' అని అర్థము కాదు. అందువలననే దక్షిణ సీమలో మేపిన ఆవుల మేపునకు 'దక్షిణకాండము' అని పేరు పెట్టినారు).

13. పాలేటి కథ లేక గంగతర్కము లేక గంగ — కాటమరాజు తరకవాదము.

14. ఎఱ్ఱయ్య తరకవాదము.

15. జన్నివాడ కథ – దీనికి నాలుగు నామాంతరములు : దక్షిణాది ఆవుల మేపు, ఆవుల మేపులు– దక్షిణ కాండము, చదరంగం కథ, పుల్లరి కథ.

16. భట్టు రాయబారము లేక కల్లి రాయబారము

17. కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ

18. బొంగరాల కథ– దీనికి మూడు నామాంతరములు: ముమ్మయ్య-పోచయ్య బొంగరాలు, వేడుక బొంగరాల కథ, అలుగుల పోలు.

19. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట– దీనిలో ఏడు కాండలున్నవి :

(1) చల్లవారి జగడము లేక ఈర్లమాని కథ లేక తిక్కనామాత్యుని కథ

(2) బొల్లావు జగడము

(3) బీర్నీడు యుద్ధము

(4) కటిసూపుల రాజు యుద్ధము

(5) బాలరాజుల యుద్ధము

(6) ఆవుల ఎద్దుల జగడము– ఎఱ్ఱయ్యల యుద్ధము

(7) కాటమరాజు యుద్ధము

20. అగుమంచి కథ

21. భక్తిరన్న కథ

పై కథలలో సింహాద్రిరాజు కథ, ఎఱనూకరాజు కథ, నలనూకరాజు కథ– అను మూడు వీరగాథలు తప్ప తక్కినవన్నియును నాకు లభించినవి. ఈ మూడు కథలకును ప్రచారము తక్కువ. అందుచే లభించుట కష్టము. ఇంకను "అగుమంచి వలపోత, పాపనూక వలపోత, గంగ పుట్టుక, పల్లికొండ పుట్టుక" అను మరి నాలుగు వీరగాథలున్నవని తెలియుచున్నది. ఇవి నిజముగా ప్రచారములో నున్నవో లేవో చెప్పలేను. కాటమరాజు కథలతో

పాటు యాదవ గాథాకారులు తరచుగా పాడుచుండు 'కంసుడు కథ' లేక 'కృష్ణ భాగవతము' లేక 'విష్ణు భాగవతము' ను కూడ దీనికి చేర్చవలెనని కొందరు చెప్పుచున్నారు. కాటమరాజు విష్ణుమూర్తి అవతారమే కావున కృష్ణభాగవతము కాటమరాజు యొక్క పూర్వజన్మకథ యగును.

ఈ విధముగా పైన తెల్పిన 21 కథలకు అగుమంచి వలపోత, పాపనూక వలపోత, గంగ పుట్టుక, పల్లికొండ పుట్టుక, కంసుడు కథ- అను ఐదు వీర గాథలను చేర్చినచో మొత్తము ఇరువదియారు వీరగాథలగును. ఇంకను ఆరు కథలు తగ్గుచున్నవి. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలోని ఏడుకాండలను ఏడు ప్రత్యేక వీరగాథలుగా భావించినచో ఈ చిక్కు తొలగిపోవును. (ఈ కాండలేడును ప్రత్యేక వీరగాథల వలెనే పాడబడుచుండును). అప్పుడు కాటమరాజు కథా చక్రములోని మొత్తము వీరగాథలు ముప్పదిరెండగును. లేదా, అగుమంచి వలపోత మొదలగు నాలుగు కథలును, ఈ కథాచక్రమున లేవనియు, కంసుడు కథ దీనికి చేర్చరాదనియు భావించినచో, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటను ఏడు ప్రత్యేక గాథలుగా నిర్ణయించుటతోఁబాటు పోలురాజు కథను గూడ ఆరు ప్రత్యేక గాథలుగా దలంపవలెను. అప్పుడు కథాచక్రమున ముప్పదిరెండు కథల సంఖ్య సరిపోవును. కాని పోలురాజు కథలోని చాటువులు ప్రత్యేక కథ గావలసినంత పెద్దవి కావు. బొంగరాల కథలోను, భక్తిరన్న కథలోను ప్రసక్తి యిట్టి "భైరవ కురువ యుద్ధము"- అను వీరగాథ వలదను ... చున్నది. ఇది చిట్టినూకభర్తయగు కల్లందుల పోర్లిగాడు చేసిన దుష్టపరాక్రమమును దెలుపు కథయై యుండును.

1909 లో ఐత్తుల లక్ష్మయ్యగారు రచించిన 'రాజవంశ ప్రదీపిక' అను గ్రంథమును బేతపూడి జోగి సూర్యప్రకాశరావుగారు (తెనాలి) ప్రకటించినారు. ఇందు కాటమరాజు కథాచక్రమున వచ్చు యాదవవీరుల ప్రసక్తి కొంత కలదు. 1917లో 'కాటమరాజు కథ' అను ద్విపదకావ్యము ముద్రింపబడెనని ఆంధ్ర వాఙ్మయ సూచి (పుట. 94)ని బట్టి తెలియుచున్నది. ఇది "నందుల కాటమరాజు" అను కవిచే రచింపబడి, యం. సంజీవకవిచే పరిష్కరింపబడినది. ఇది అలభ్యము. 1926వ సంవత్సరమున ఆంధ్ర యాదవ సంఘమువారు (ఎదవూరు) గుఱ్ఱముకొండ భక్తవత్సలకవి రచించిన "కరియావుల కాటమరాజు చరిత్ర"

అను పద్యకావ్యమును ప్రకటించిరి. ఇందు పెద్దిరాజుకథ మాత్రమే చెప్పబడినది. ముదిగొండ వీరభద్రకవి తన పద్యకావ్యమున పల్నాటి వీరచరిత్ర నంతటిని వ్రాసినట్లుగా ఈ కవి కాటమరాజు సంపూర్ణచరిత్రను తన పద్యకావ్యమున వ్రాయకపోవుట విచారకరము

1947 జనవరినెలలో శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు క్రీ॥శ॥ 1000 - 1500 మధ్యకాలమున ఆంధ్రదేశమును పాలించిన సామంత రాజవంశముల చరిత్రను గూర్చి అద్భుతమగు పరిశోధన చేసి ఆ పరిశోధనా వ్యాసమును మద్రాసు విశ్వవిద్యాలయమునకు సమర్పించిరి. అందు ఎఱ్ఱగడ్డపాడు అలవులపాడులను పాలించిన యాదవులను గూర్చి నెల్లూరు నేలిన తెలుగు చోడు లను గూర్చి చక్కగా వివరించిరి.

హరి ఆదిశేషువుగారు మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయములోని కాటమరాజు కథలనుగూర్చి 1953 లో కొంత విమర్శ చేసిరి (చూ: జానపద గేయ వాఙ్మయ పరిచయము, పుటలు 23-29) దీనిలో వీరు ఖడ్గతిక్కన యుద్ధ మును మాత్రమే ఎక్కువగ చర్చించినారు. ఈ కథ క్రీ. శ. 1170 లో జరిగిన దనియు, ఇది పల్నాటియుద్ధముకన్న ప్రాచీనమైనదనియు వీరు వ్రాయుట సహే తుకముగా లేదు. ఇదే సంవత్సరము ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు మదరాసులోని కాటమరాజు కథా ప్రతులను గూర్చియు, ఇతర విశేషాంశములను గూర్చియు ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో నొక అత్యుత్తమ వ్యాసమును ప్రకటించిరి. ఇందు కాటమరాజు కథ, భట్టు రాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ,ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, వల్లురాజు యుద్ధము, ఆగుమంచి కథ-అను ఆరు వీరగాథలను గూర్చి వీరు సాకల్యముగా చర్చించిరి (మదరాసు గ్రంథా లయమునగల కథలు ఈ ఆరు మాత్రమే. ఇందలి చివరి రెండు కథలును నేడు తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనాసంస్థవారి లిఖిత గ్రంథాలయమునకు తరలింబడినవి). డా. కోదండరామయ్యగారు తమ వ్యాస మునకు వేరొక అనుబంధమును భారతిలో ప్రకటించినారు. ఈ అనుబంధవ్యాస ములో వారు కాటమరాజు యుద్ధకాలమును గూర్చి చర్చించినారు.

మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయమువారు వేటూరివారు పరిష్కరించి యుంచిన కాటమరాజుకథను మల్లంపల్లి సోమశేఖర శర్మగారి పీఠికతో 1953

లోనే ప్రకటించిరి. ఇందొక ప్రధాన కథ మూడనుబంధకథలు గలవు. ప్రధాన కథకు 'కాటమరాజు కథ' అని పేరిడిరి.కాని ఇది నిజముగకు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'. అనుబంధ కథలలో భట్టురాయబారము, కోటిపాటి తాటివృక్షం తెచ్చే కథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట అను మూడు కథలున్నవి. ఈ అనుబంధములందలి ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటకును ప్రధాన కథకును సంబంధము లేదు. ఇవి రెండును భిన్నకవుల రచనలు. ప్రధాన కథారచయిత కొమనాల గోత్రమునకు చెందిన గంగుల పిన యెల్లయ. ఇతని తండ్రి యెల్లయ, సోదరుడుసర్వన, అనుబంధముల లోని కథారచయితల పేళ్లు తెలియుట లేదు. జానపద గేయములను గూర్చివిశేష పరిశోధన చేసిన ఆచార్య. బి. రామరాజుగారు ఈ ముద్రిత గ్రంథములోని నాలుగు కథలను మాత్రమే ముచ్చటించి యూరకొనిరి. (చూ: వారి 'తెలుగు జానపద గేయ సాహిత్యము' పుటలు 202-218). వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పుత్రులు శ్రీ ఆనందమూర్తి 1955 లో 'పరిశోధన' సంచికలలో (5,6,7) మదరాసు గ్రంథాలయములోని అగుమంచి కథను పరిష్కరించి ప్రకటించిరి. ఇది కాటమరాజు కథాచక్రమున చివరి భాగమునకు చెందినది. 1959 లో ఆరుద్ర గారు అగుమంచి పాత్రను గురించి ఒక చిన్నవ్యాసమును ప్రకటించిరి. (చూ. 'అగుమంచి అబ్బురపు పాత్ర,' భారతి 1957 ఆగష్టు సంచిక) ఈ ఆరుద్రగారే 1960 లో వేరొక వ్యాసమును వ్రాయుచు నెల్లూరిరాజులతో పోరాడిన కాటమ రాజు విశాఖమండలమునకు చెందినవాడని నిరూపించిరి (చూ. ఆంధ్రప్రభ, సారస్వతానుబంధము, 27-11-1960)

1962 లో శ్రీ గోవుల నాగేశ్వరకవి 'మదన కుంభినీ యుద్ధము అను పెద్దిరాజు నాటకము'ను రచించెను. దీనిని కనిగిరికి చెందిన మద్దిబోయిన రోశయ్యగారు ప్రకటించిరి. ఇదికూడ భక్తవత్సలకవి పద్యకావ్యము వలెనే పెద్దిరాజుకథను మాత్రమే వర్ణించుచున్నది. (ఇందు పంపాద్రికథలోని చివరి భాగము కూడ కొంత ప్రసక్తమైనది).

10-5-1967 లో ఆంధ్ర యాదవ సంఘ ప్రధాన కార్యదర్శియు, ఉత్తమ సంన్యాసియు, వృద్ధ యాదవుడును అగు ఆరాధ్యుల పిచ్చయ్య గారు (తెనాలి తాలూకా, ఎడపూరుగ్రామము) 'వలురాజు చరిత్ర' అను వీరగాథను ప్రకటించిరి.ఇది కాటమరాజు కథాచక్రమున మొట్టమొదటి వీరగాథ.దీని రచయిత

'మద్దులేటి కవి'అని తెలియుచున్నది. మదరాసు గ్రంథాలయమున వల్లురాజు యుద్ధమను పేరగల కథ నిజమునకు వల్లురాజుకథ కాదు. అది ఆద్యంత రహితమైన పోలురాజుకథ మాత్రమే. 19-7-1967 లో ఆరాధ్యుల పిచ్చయ్య గారు 'బల్లికురువ యుద్ధము'అను కథను, 5-10-1970 లో 'పోలురాజు చరిత్ర' అను కథనుకూడ ప్రకటించిరి. కాటమరాజు కథాసాహిత్యమునకు పిచ్చయ్యగారు చేసిన సేవ అమూల్యమైనది.

1969 'ప్రగతి' వారపత్రికలో (1-8-69 నుండి 24-10-69 వరకు) ఆరుద్రగారు 'కాటమరాజు కథ' అనుపేరుతో ఒక నాటికను వ్రాసిరి. ఇందు పుల్లరి కథ, భట్టు రాయబారము, తిక్కనామాత్యుని కథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట అను వీరగాథలలోని ఇతివృత్తమును ఆరుద్రగారు చక్కగ నుపయోగించుకొని నారు.

2. చారిత్రకాంశములు :—

కాటమరాజు-నల్లసిద్ధులను గూర్చిన చారిత్రకాంశములను మొట్టమొదట తడవినవారు శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు. ఈమె 1947లో రచించిన తన పరిశోధక వ్యాసమున అలవులపాడు యాదవులనుగూర్చియు, ఎఱ్ఱగడ్డపాడు యాదవులను గూర్చియు చర్చించిరి[3]. కాని యశోదాదేవిగారు కేవలము గుండ్ల పాలెములో లభించిన ఒక శాసనమునుబట్టియు, ఇతర స్థానిక చరిత్రలను బట్టియు, ఈ యాదవచరిత్రలను చర్చించిరి. కాటమరాజునకు సంబంధించిన వీరగాథలను ఈమె పరిశీలించినట్లుగా లేదు (1947 నాటికి కాటమరాజు వీర గాథలేవియు ముద్రింపబడలేదు). అందుచే ఈమె యిచ్చిన అంశములలో కొన్ని తప్పులు దొరలినవి. నెల్లూరు చోళరాజ్యములోనే యున్న అలవులపాడును వల్లురాజు, అల పోలురాజు పాలించిరనియు,ఎఱ్ఱగడ్డపాడును కాటమరాజు పాలించె ననియు వ్రాసిరి. అల పోలురాజు నెల్లూరునేలిన తెలుగుచోళులలో మూడవ మనుమసిద్ధితో పుల్లరివిషయమై పోరాడెననియు, ఆ యుద్ధము క్రి. శ. 1259లో లింగాలకొండ ఎఱ్ఱగడ్డపాడు దగ్గర జరిగెననియు, నల్లసిద్ధి అనినను మనుమసిద్ధి

3. చూ. రాజమంద్రి ఆంధ్ర చారిత్రక పరిశోధక సంఘమువారి పత్రిక,సంపు టము 28, పుటలు 12-14

అనినను ఒక్కరే అనియు అతని కాలము క్రీ. శ. 1248-1267 అనియు యశోదాదేవిగారు తెల్పియున్నారు. ఇది యంతయు అలవలపాడు యాదవుల గూర్చిన వృత్తాంతములో నిచ్చిరి. మరల ఎఱ్ఱగడ్డపాడు యాదవప్రభువులగూర్చి వ్రాయుచు కాటమరాజు, మూడవ మనుమసిద్ధి లేక మూడవ నల్లసిద్ధితో పుల్లరి విషయమై పోరాడెనని తెల్పిరి. వల్లురాజుకూడ మనుమసిద్ధితో పోరాడెనని చెప్పిరి. కాని వల్లురాజునకును అలపోలురాజునకును గల సంబంధమును గూర్చి కాని, వీరిరువురితో కాటమరాజునకు గల సంబంధమునుగూర్చికాని తనకు తెలియదనిరి. ఎఱ్ఱగడ్డపాడు అనునది గుంటూరుమండలమున ఒంగోలుతాలూకాలో నున్నదనిరి. వ్యక్తుల నామములుకూడ తప్పుగా నిచ్చిరి. ఆవుల పోలురాజు 'అల పోలు రాజు' అనియు, కరియావుల రాజును 'కరెయొరరాజు' (Kareoraraja) అనియు, కాటమరాజును 'కంటమరాజు' (Kantamaraja) అనియు చెప్పిరి. అల పోలు రాజు, కాటమరాజు కాకతి గణపతిదేవుని కాలమువారని చెప్పిరి. పంచపాలెము శిలాశాసనములో ప్రతాపుని పేరుండుట పొరపాటనిరి. గణపతిదేవుడు ఎఱ్ఱగడ్డ పాటి పోట్లాటలో ఆవుల పోలురాజునకు సహాయముచేసెనట.

కాటమరాజు కథాచక్రమును పరిశీలించినచో యశోదాదేవిగారు వెలిబుచ్చిన అభిప్రాయములు చాలవరకు నిలువజాలవు. వల్లురాజు (ఆవుల వలురాజు లేదా వలరాజు) కాటమరాజునకు పితామహుడు. ఇతడు యలమంచిని పాలించెనుగాని అలవలపాడును పాలించినవాడు కాడు. ఈ యలమంచి నేటి విశాఖమండలమున 'ఎలమంచిలి' అను పేరుతో నున్నది కావచ్చును. వలురాజుకొడుకు పెద్దిరాజు, పెద్దిరాజుకొడుకు కాటమరాజు. పోలురాజు కాటమరాజునకు పినతండ్రి. (పెద్దిరాజునకు కడగొట్టు తమ్ముడు). ఇతడు సిద్ధిరాజుతో యుద్ధమొనర్చెననుట సరి కాదు. పోలురాజు నల్లసిద్ధిపూర్వుడైన చోడానితో పోరాడి చనిపోయెను. నల్లసిద్ధితో యుద్ధము చేసినది కాటమరాజు ఒక్కడే. అతని తాత వలురాజును పినతండ్రి పోలురాజును నల్లసిద్ధితో పోరిరనుట అసంగతము. వీరు నల్లసిద్ధికంటె పూర్వులు. తమ పితామహుడగు ఆవుల వలురాజు పేరుతో కాటమరాజాదులే – అలవలపాడు గ్రామమును నిర్మించియుందురు. ఇది ఎఱ్ఱగడ్డపాడునకు మిక్కిలి సమీపమున నున్నది. కాబట్టి అలవలపాడు నేలిన యాదవులు వేరనియు ఎఱ్ఱగడ్డపాడును పాలించిన యాదవులు వేరనియు భావించుట సరికాదు.

కాటమరాజు పాలించిన ఎఱ్ఱగడ్డపాడు కనిగిరి తాలూకాలో పెద అలవల పాడునకు సమీపమున గల పంచలింగాల కొండకు ఉత్తరభాగముననున్న పాలేటి తీరమే కాని ఒంగోలుతాలూకాలో నున్న ఎఱ్ఱగడ్డపాడు గ్రామమనుట సరికాదు. యుద్ధభూమియగు ఎఱ్ఱగడ్డపాడు కనిగిరిసీమలో పంచలింగాలకొండ ప్రక్కనే యున్నది. కాని గుంటూరు మండలమున లేదు. మెకంజీ వ్రాతప్రతులలో రణరంగము గుంటూరు మండలమున అమరావతి దగ్గర నని యున్నది.[4] ఇది మరింత హాస్యాస్పదము. కనిగిరికి తూర్పుగా పది పంద్రెండు మైళ్ల దూరములో పంచలింగాల కొండ యున్నది. ఆ కొండ దిగువనే కాటమరాజుకోట యుద్ధభూమి యగు ఎఱ్ఱగడ్డపాడును గలవు.

యశోదాదేవిగారు మనుమసిద్ధియే నల్లసిద్ధియనుట, యుద్ధకాలము క్రీ. శ. 1259 అనుట, ఇది గణపతిదేవుని కాలమున జరిగెననుట, ఎఱ్ఱగడ్డపాటి యుద్ధమున ఈ గణపతిదేవుడు ఆవుల పోలురాజునకు సహాయము చేసెననుట సంశయాస్పదవిషయములు :

"The date of battle is A.D. 1259. Nallasiddha is identical with Nallasiddha III alias Manmasiddha III (A.D. 1248-1267) and Siddiraja of the Gundlapalem record is identical with Manmasiddha III. Sewell is wrong in placing Siddhiraja and the Yadavas in the 12th century A.D...... The Kakatiya ruler in this period was Ganapati. Pratapa in the Gundlapalem inscription is a mistake for Ganapati. Probably, Alapolu had the support of the Kakatiyas in opposing Manmasiddha III". (J.A.H.R.S. Vol xxiii, P. 13)

---

4. "Mackenzie Mss. say that Katamaraju was the ruler of Amaravathi and Yerragaddapadu and that the site of the battle field was located in the vicinity of Amaravathi"

—J.A.H.R.S., vol xxiii P.14 (Taylor Mac.cat PP. 725-727).

చోడతిక్క ని పుత్రుడైన మనుమసిద్ధికి ముగ్గురు కొడుకులనియు, అందు రెండవవాడు నల్లసిద్ధి అనియు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు తెలుపుచున్నారు. (చూ. కాటమరాజుకథ పీఠిక, పుట xxvii). గుంటూరుజిల్లా నరసరావుపేట శాసనము కూడ దీనిని బలపరచుచున్నది. వీరగాథలలో నెచ్చటను మనుమసిద్ధి పేరు లేదు; 'నల్లసిద్ధి' అనియే కలదు. కాబట్టి మనుమసిద్ధి కుమారుడైన నల్లసిద్ధి కాలములోనే (క్రీ.శ. 1280-1297) ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట జరిగినదని చెప్ప వలెను. క్రీ.శ. 1282 యుద్ధకాలమని దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు నిర్ణ యించినారు (భారతి, జూలై 1966). కాటమరాజును నల్లసిద్ధియు కాకతీయ ప్రతాపరుద్రుని కాలము వారనుటకు గుండ్లపాలెము శాసనమే కాక 'కరియావుల రాజు కథ' అను వీరగాథయు సాక్ష్యమిచ్చుచున్నది. (ఈ వీరగాథ యొక్క తాళపత్ర ప్రతులు రెండు నాకు లభించినవి.) తెలుగు చోళులు మొదట పల్లవ సామంతులైనను తరువాత కాకతీయ సామంతులు. ముఖ్యముగ చోడ తిక్క రాజును (క్రీ.శ. 1209 - 1258). అతని పుత్రుడు మనుమసిద్ధియు (క్రీ.శ.1258-1290) కాకతీయ గణపతిదేవునకు విశ్వాసపాత్రులగు సామంతులు. వీరికి వ్యతిరేకముగా గణపతిదేవుడు యాదవులకు సహాయము చేసెననుట సరి కాదు. యాదవులకును కాకతీయులకును అనాదిగా వైరములున్నవి. గణపతిదేవుని తండ్రిని పెదతండ్రినికూడ దేవగిరియాదవులు చంపిరి. కాబట్టి శ్రీమతి వారణాసి యశోదాదేవిగారిచ్చిన చారిత్రక విషయములు— ముఖ్యముగా యాదవులకు సంబంధించినవి- సందిగ్ధముగా నున్నవి కాని స్పష్టముగా లేవని చెప్పవలెను. ఈమె వీరగాథలను పరిశీలింపకుండుటయే ఈ సందిగ్ధతకు కారణము.

## 8. చారిత్రక సంశయములు :—

చారిత్రక విద్వాంసులు విమర్శకులు కాటమరాజు కథాచక్రముయొక్క చారిత్రకమగు విలువను శంకించుట విచారకరము. మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు కాటమరాజు కథలను గూర్చి యిట్లనినారు ;

"Though the story is very interesting it lacks historicity. Except the names of Nallasiddhi and Annaga Tikkana there is nothing historical in this work.

The story migt be true; but there is no evidence to prove its historicity. Nor is there any evidence to show that the persons mentioned either on the side of Katamaraju or on the side of King Nallasiddhi are historical"

చారిత్రకులు ఇట్లు అనుమానించుటకు కారణమున్నది. ఈ కథాచక్రమున ముప్పదిరెండు వీరగాథలుండగా, ఈ చారిత్రకులకు పండితులకు తెలిసిన కథలు మూడు నాలుగు మాత్రమే. ఈ సుదీర్ఘ కథాచక్రమందలి వివిధ కథలను వ్యక్తులను పరిశీలించి నిర్ణయము చేయవలెను కాని, ఏవియో రెండు మూడు కథలను బట్టి సిద్ధాంతములు చేయరాదు. నాకు లభించిన 'కరియావుల రాజు కథ' అను వీరగాథలో ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమున అయితమరాజు, పల్లికొండ, కరియావులరాజు అను ముగ్గురు యాదవ వీరులు శంభుని తిరునాళ్లను జూచుటకై ఓరుగల్లునగరమునకు వచ్చిరనియు, అచట సాహసకృత్యములను చేసిరనియు, ప్రతాపరుద్రుడు వారిని చంప యత్నించెననియు స్పష్టముగానున్నది. దీనినిబట్టి కాటమరాజుకథలు కాకతీయ ప్రతాపరుద్రుని కాలమునాటి వనుట నిస్సంశయము కదా!

ఆంధ్రదేశ చరిత్రలో ప్రధాన రాజవంశములను గూర్చియే ఇంతవరకును పరిశోధన జరిగినది కాని, సామంత రాజవంశములకును చిన్న చిన్న రాజవంశములకును సంబంధించిన చరిత్ర చీకటిలోనే మూలుగుచున్నది. శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు సామంత రాజన్యుల చరిత్రపై పరిశ్రమించినట్లుగా, నేటి చరిత్రకారులు ఒక్కొక్క మండలమును గూర్చి సమగ్ర పరిశోధన జరుపవలెను. అప్పుడుకాని వీరగాథలలోని సంఘటనలకు చారిత్రక ప్రామాణ్యము లభింపదు. వీరగాథలన్నియును స్థానిక సంఘటనలపై ఆధారపడి పుట్టునుగాని, పెద్దపెద్ద రాజవంశముల మహాయుద్ధములపై వీరగాథ లేర్పడవు (బొబ్బిలియుద్ధముపై వీరగాథ యున్నది కాని, తళ్లికోట యుద్ధముపై వీరగాథ లేదు కదా!) కావున ఇట్టి సూక్ష్మ చారిత్రక పరిశోధనము అత్యవసరము. అట్టి పరిశోధన జరుగువరకును, కాటమరాజుకథల చారిత్రక ప్రామాణ్యమును శంకించుటకు ఏ చరిత్రకారునకును అధికారము లేదు!

---

౬. కాటమరాజు కథ, ఆంగ్ల పీఠిక, పుట xi.

వీరగాథలు కేవలము పుక్కిటి పురాణములైనచో ప్రజల హృదయముల నుఱ్ఱూత లూగించుచు, వీరరసావేశమున శివమెత్తించు శక్తి వానికుండదు. పౌరాణిక గాథను పాడునప్పుడు స్థానిక చారిత్రక వీరగాథను పాడునప్పుడున్నంత రసావేశముండదు. వీరగాథలలో నెక్కువ భాగము చారిత్రకములే. అవి చక్రవర్తులకు సంబంధించిన చరిత్రలు కాకపోవచ్చును. తెనుగుగడ్డపై స్థానికముగా ప్రసిద్ధికెక్కిన కొందరు సామంత రాజన్యుల, పాళెగాండ్ర, జమీందారుల, శూరుల, సాహసుల, బందిపోట్ల వీర సాహస కృత్యముల నభివర్ణించు చరిత్రలనుటలో మాత్రము సందేహమూ లేదు.

నల్లసిద్ధి చోడరాజని చరిత్రలోను, కైఫీయతులలోను నుండగా, గాథాకర్త నల్లసిద్ధిని పల్లవరాజనుట పొరపాటు కావచ్చును. మన కవులకు ఉత్తరాది రాజులందరును, అయోధ్యరాజులైనట్లే, దక్షిణాది రాజులందరును పల్లవులుగనే కాన్పింతురు. గాథాకర్త చోళుడైన నల్లసిద్ధిని పల్లవరాజుగా పేర్కొనుటకుగల కారణమును రామరాజుగారు చక్కగా నూహించిరి: "ఖడ్గతిక్కన నల్లసిద్ధిని పలుమారు గేయమున 'పల్లవ నలసిద్ధి పట్టాభిరామ' అని సంబోధించి యున్నది. నల్లసిద్ధి నిజముగా చోళుడు. చోళులు పల్లవవంశముల తరువాత అధికారమునకు వచ్చినారు. మొదట వీరు పల్లవులకు సామంతులై వారి బిరుదములను దాల్చి యుందురు. ఇదియున్నగాక ఆంధ్రదేశమందలి సామంతరాజ కుటుంబము లెన్నియో పల్లవులచే స్థాపింపబడినవని తెలియవచ్చుచున్నది. వారి గౌరవ సూచముగ పల్లవ బిరుదమును తెలుగు చోళులు దాల్చి యుందురు. మొదటి కాకతీయులు తమ ఏలికలైన పశ్చిమ చాళుక్య చక్రవర్తుల బిరుదావళిని దాల్చుట మన మెరిగిన విషయమే"[6]

### 4. కథా ప్రసక్తి – శాసన ప్రమాణము :—

కాటమరాజునకు నల్లసిద్ధికిని జరిగిన యుద్ధమునుగూర్చి మెకంజీ స్థానిక చరిత్రలు(Local Records)పదునెన్మిదవ సంపుటములో విపులముగా నున్నది. దీనిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెలుగు ద్విపదకావ్యములను గురించిన విశేష వివరణ గ్రంథ పట్టిక (Descriptive Catalogue)లో నిచ్చియున్నారు. దీనినే మల్లంపల్లి సోమశేఖర శర్మగారు మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక

6. తెలుగు జానపద గేయ సాహిత్యము; పుట 207.

భాండాగారము వారు ప్రకటించిన 'కాటమరాజు కథ' పీఠికలో నిచ్చియున్నారు. ఇందు కాటమరాజు తన విస్తారమైన గోగణమును కడప, కర్నూలు మండలములో లంకమల,పాలకొండ, నల్లమల మొదలగు పర్వత ప్రదేశములందు మేపుకొనుచు, నట వర్షాభావముచేత కసవు లభింపమి నెల్లూరు మండలమునకు వచ్చి, నల్లసిద్ధి చోళమహారాజునకు పుల్లరిగా తమ మందలో పుట్టెడి కోడెదూడలను కొన్ని యిచ్చు నట్లు నిర్ణయించుకొని పశువులను మేపుకొనసాగెనని కలదు. ఈ స్థానిక చరిత్రలో యుద్ధకారణములు మూడు చెప్పబడినవి: 1. నెల్లూరు సీమలో గూడ క్షామము వ్యాపింపగా, కాటమరాజు తన గోవులకు బీళలో పచ్చిక సరిగా దొరకనందున నెల్లూరురాజ్యమందలి పంట పొలములనుగూడ మేపసాగెను. ఇది నల్లసిద్ధికి కోపకారణ మయ్యెను. 2. అరణ్యములోని క్రూరమృగములను యాదవులు వేటాడుచుండుట వలనను, వారి మందల విస్తార సంరంభమువలనను అరణ్యమం దలి మృగములు నశించి, మృగవధయే వృత్తిగాకల కిరాతకులకు జీవనభృతి కష్టమై,వారు కాటమరాజునందు ద్వేషులై యుండిరి. 3. ఇదికాక, నల్లసిద్ధి రాజు గారుంచుకొనిన భోగముదాని పెంపుడు చిలుకను కాటమరాజుపినతండ్రి పోలు రాజు బాణముతో గొట్టి చంపెను. ఈ విషయమును కిరాతు లామెతో చెప్పిరి. ఆమె మిక్కిలి కోపించి మృగములను వేటాడు మిషతో కాటమరాజుయొక్క ఆలమందను చంపుమని కిరాతులను ప్రోత్సహించెను. వారి చర్యలను గ్రహించి, కాటమరాజుగ్రుడై ఆ కిరాతులను చంపి, నల్లసిద్ధికి పుల్లరినిచ్చుట మానివేసెను.

ఇంకను కొన్ని చారిత్రక చరిత్రలలో కాటమరాజు విషయమున్నది. వానినిబట్టి యుద్ధము చిత్రభాను సంవత్సరమున జరిగినట్లు తెలియుచున్నది.

ఈ కాటమరాజు కథాచక్రమునకు సంబంధించిన విషయములు స్థానిక చరిత్రలలోనేకాక, నెల్లూరు మండలములోని కందుకూరుతాలూకా 'గుండ్లపాలెము' గ్రామములో, బ్రహ్మేశ్వరస్వామి ఆలయముదగ్గర ఒక శిలమీద చెక్కిన శాసన ములో గూడ స్పష్టముగా నున్నవి. ఈ శాసనమును బట్టర్వర్త్, వేణుగోపాల శెట్టిగార్లు సంపాదించి, "తమ నెల్లూరు మండల శాసనములు"—రెండవ సంపుటి ములో ప్రకటించిరి. వీరు దీనిని క్రీ.శ. 1258-59 సంవత్సరమునకు చెందినదిగా ననుమానించిరి. ఇందు వైశంపాయనుడు పరీక్షిత్తునకు చెప్పినట్లుగా యాదవ వంశమంతయు అభివర్ణింప బడుటయేకాక, కాటమరాజునకు నల్లసిద్ధితో తగవునకు

కారణము, యుద్ధకాలము మున్నగునవి తెలుపబడినవి. ఈ శాసనము మొదటి ప్రక్క 55 పంక్తులు, రెండవప్రక్క 54 పంక్తులు, మూడవ ప్రక్క 42 పంక్తులు, నాల్గవప్రక్క 34 పంక్తులు గలవు. ఇది పైకి గద్యశాసనముగా కానవచ్చినను అచ్చటచ్చట కొన్ని పద్యములును గలవని తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారు నిరూపించియున్నారు. (చూ: వారి వ్యాసము కాటమరాజు కథ; ఆంధ్రపత్రిక, విజయ సంవత్సరాది సంచిక, 1953-54)

ఈ గుండ్లపాలెము శాసనములోని కథలో స్థానిక చరిత్రలోని కథవలె వివరములు లేవు. స్థానిక చరిత్రలలో నల్లసిద్ధికిని కాటమరాజునకు యుద్ధము చిత్రభాను సంవత్సరమున జరిగినట్లుండగా, ఈ శాసనములో శాలివాహన శక వర్షంబులు 1170 అగు కాళయుక్తి సంవత్సరమున జరిగినట్లున్నది.[7] (అనగా క్రీ.శ. 1248).

కాటమరాజు యుద్ధవిషయము, ముఖ్యముగా ఖడ్గతిక్కన యుద్ధమట్టము, పట్టపురావి కైఫీయతులో నున్నది. ఇందు కాటమరాజు కోడెదూడలను పుల్లరిగా నిచ్చుట కంగీకరించుట; యాదవులు మొదట అరణ్యమందును పచ్చిక బీడు లందును పశువులను మేపుకొనుచు వర్షాభావముచే కసవు చాలక నెల్లూరురాజ్యములోని పరిపొలములను గూడ మేపుట; ఖడ్గతిక్కన యుద్ధము చేసి పట్టపురావి గ్రామ సమీపమున మరణించుట తెలుపబడినవి.[8]

---

7. ఈ శకవర్షంబులనే శ్రీ హరి ఆదిశేషువుగారు క్రీస్తు శకముగా భ్రమించి కాటమరాజు యుద్ధము పల్నాటియుద్ధముకన్న ముందు జరిగినదని తమ జానపద గేయ వాఙ్మయ పరిచయమున వ్రాసిరి. ఇది ప్రామాదికము. పల్నాటి యుద్ధము క్రీ.శ. 1181 ప్రాంతమున జరిగినదని పలువురు చారిత్రకులు నిర్ధయించినారు. కాటమరాజుయుద్ధము దీని తరువాత సుమారు వంద సంవత్సరములకు జరిగి యుండవలెను. కాటమరాజు చెలికాడు పద్మనాయడను వెలమ ఈ వీర గాథలలో తరచుగా పేర్కొనబడెను. ఇతడు పల్నాటి పాలకుడు. నలగామరాజాదులు హైహయ వంశస్థులు. ఈ హైహయవంశము తరువాత పద్మనాయకులు పల్నాటిరాజ్యము నాక్రమించిరి. ఈ విషయముకూడ కాటమరాజు కథలు పల్నాటి కథలకన్న అర్వాచీనములని ధ్రువపరచుచున్నది.

8. చూ. 'కాటమరాజు కథ'కు మల్లంపల్లివారు వ్రాసిన పీఠిక. పుటలు xviii, xix.

## ౯. ఓరుగంటి ప్రతాపుని కాలమే కాటమరాజుకాలము !-

గుండ్లపాలెము శాసనములో కాటమరాజు ఓరుగంటి ప్రతాపుని కాలము వాడని స్పష్టముగా నున్నది. రాజవంశ ప్రదీపిక ననుసరించి శ్రీకృష్ణుని ముని మనుమడగు వజ్రునితో ద్వాపరయుగ మంతమై ఆ వజ్రుని పుత్రుడగు ప్రతి బాహునితో కలియుగము ప్రారంభమైనది.

ఆ ప్రతిబాహునినుండి కాటమరాజు వరకును పదునేడుమంది యాదవరాజు లున్నారు. "శ్రీకృష్ణుడు- ప్రద్యుమ్నుడు-అనిరుద్ధుడు-వజ్రుడు-ప్రతిబాహుడు- సుబాహుడు-ఉగ్రసేనుడు-శృతసేనుడు-ఉపనందుడు - అమృతాంభోజుడు-విజ యాంభోజుడు-కనకాంభోజుడు-గజాంభోజుడు-రాయాంభోజుడురత్నాంభోజుడు- వీరవిజయుడు-పద్మరాజు-కూర్మరాజు-సింహాద్రిరాజు - గంగురాజు - వలరాజు- పెద్దిరాజు-కాటమరాజు." ఈ వరుసలోని విజయాంభోజునినుండి కాటమరాజువర కును గల రాజన్యుల కాలములు గుండ్లపాలెము శాసనములో తులనాత్మకముగా నిరూపింపబడినవి. ఒక్కొక్క రాజు ఎన్నేండ్లు పాలించెనో కూడ చెప్పబడినది. ఇందు కాటమరాజు ఓరుగంటి ప్రతాపుని కాలమున ముప్పదిరెండు సంవత్సరములు రాజ్యముచేసి, లింగాలకొండ, ఎఱ్ఱగడ్డపాడులో నల్లసిద్ధిరాజుతో యుద్ధముచేసి మరణించినట్లుగా నీశాసనములో స్పష్టముగా నున్నది. కాటమరాజు యుద్ధమున మరణించునాటికి కలియుగముచొచ్చి ౪౪౨౮ సంవత్సరములైనదని ఈ శాసనము నిరూపించుచున్నది.

"......... కలియుగాబ్దాః సూద్రికిరాజు కాలమున విజయాంబోజాబ్దాః ౨౫౦ కనకాంబోజాబ్దాః ౪౯౦ విక్రమార్కుని కాలమున గజయాంబోజాబ్దాః ౪౫౦ రాయాంబోజాబ్దాః ౪౭౦ రత్నాంబోజాబ్దాః ౪౦౭ వీరజయుఃరాజాబ్దాః ౩౯౦ శాలివాహనుని కాలమున పద్మనరాజాబ్దాః ౩౨౪ శ్రీకూర్మిరాజాబ్దాః ౩౪౦ భోజ రాజుకాలమున సింహాద్రిరాజాబ్దాః ౫౦౦ చోడానికాలమున వల్లురాజాబ్దాః ౧౯౨ పోలురాజాబ్దాః ౮౭ వోరుగంటి ప్రతాపుని కాలమున కాటమరాజు ౩౭ రాజ్యం సేసి లింగాలకొండ యఱ్ఱగడ్డపాటను నల్లసిద్ధిరాజుంగూడి యుద్ధంబు సేసి బడుగులవారు చనిపొయ్యే నాటికి కలియుగం చొచ్చి ౩౯౬౨ యేండ్లాయెను ............."[9]

9. గుండ్లపాలెము శిలాశాసనము, రెండవప్రక్క, పంక్తులు 42 మొదలు 44 వరకును.

ఇందు ప్రసక్తమైన 'ఓరుగంటి ప్రతాపుడు' ఎవరో తెలిసికొనినచో కాటమ రాజుకాలము తెలియును. ఓరుగల్లురాజ్యము నేలిన కాకతీయవంశమున ఇద్దరు ప్రతాపరుద్రులు కలరని చెప్పుట వాడుక. కాని ఇది చాల తప్పుడువాడుక యని కాకతీయ వంశముపై సమగ్ర పరిశోధన చేసిన ఆంధ్ర చారిత్రక విద్వాంసులు డా. మారేమండ రామారావుగారు తెల్పియున్నారు. వాడుకలోనున్న మొదటి ప్రతాపరుద్రుడు 'రుద్రదేవుడు'. ఇతని కాలము క్రీ. శ. 1158-1195. పల్నాటి యుద్ధము ఈతని కాలమున జరిగినది. కాటమరాజింత ప్రాచీనుడు కాడు. ఈ రుద్రదేవునకు 'రుద్రదేవ మహారాజు' అను పేరు శాసనములలో వాడబడు చున్నది కాని, 'ప్రతాపరుద్రు'డను నామమెచ్చటను లేదని రామారావుగారు నిరూ పించినారు. ఇక వాడుకలో రెండవ ప్రతాపరుద్రుడుగా నున్నవాడే అసలు ప్రతాపరుద్రుడు. ఇతని పాలనాకాలము క్రీ.శ. 1296-1323. ఇతడు రుద్రమ దేవి దౌహిత్రుడు. రుద్రమదేవికాలము క్రీ.శ. 1262-1296. ఈ ప్రతాపరుద్రుడు 1296 లో రాజ్యమునకు వచ్చినను, 1280 నుండియు యువరాజుగా నుండి, తిరుగుబాట్లు చేయుచున్న సామంతరాజుల నణచుటలో రుద్రమదేవికి తోడ్పడు చుండెను. కాబట్టి క్రీ.శ. 1280 నుండియు ఈ ప్రతాపరుద్రుని నామము కాకతీయ రాజకీయ వ్యవహారములతో మిక్కిలి పరిచయమున్నది. కావున కాటమరాజు కూడా క్రీ.శ. 1280-1323 మధ్యకాలమున ఉండియుండును. పై శాసనము క్రీ.శ.1258-59 నాటిదికాగా, 1280 నాటి ప్రతాపరుద్రుని ప్రశంస దానిలో ఉండుట అసంబద్ధము కదా! కాని గుండ్లపాలెముయొక్క కాలము నిర్ధరించిచెప్పినది కాదు. దాని పరిష్కర్తలు శ్రీయుతులు బట్టర్వర్త్, వేణుగోపాలశెట్టిగారలు, శాసనకాలమును క్రీ.శ. 1258-59 అని వ్రాసి, దాని తర్వాత నొక ప్రశ్నార్థ కము నుంచిరి. మల్లంపల్లివారు ఈ గుండ్లపాలెముశాసనము తప్పులతడక యనిరి. కావున దీని ప్రాచీనతను అంగీకరింపలేము. ఇది ప్రతాపరుద్రుని కాల మునకు తరువాతిదియై యుండును. ఈ గుండ్లపాలెముశాసనము 28-10-1483 నాటిదని దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారును (భారతి, మే, 1965); 15 వ శతాబ్ది ఉత్తరభాగమునకు చెందినదని ఆరుద్రగారును (భారతి, డిసెంబర్, 1960) క్రీ.శ. 1632-1672 మధ్యకాలమునకు చెందినదని మల్లంపల్లివారును (కాటమ రాజు కథ, పీఠిక) భావించినారు.

ఈ గుండ్లపాలెము శాసనము మూడవ ప్రక్కకూడ పుల్లరి ఒడంబడిక, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటప్రతాపరుద్రుని కాలముననే జరిగినట్లు మరల చెప్పబడినది-: కాటమరాజు కథే తివృత్తమంతయు ఇందు స్పష్టముగానున్నది. "(అ) రుంటలకోన అమరవతి సింహ్యాసె యెలమంచ్చి యేలెను వల్లురాజులె ఆలవల్లపురము అచట కొన్నాళ్లు అడిదెవిచేలెను ఆలు పోలురాజు ప్రతాపునికాలమున యెదుకులాత్మజులు దనుముకొండ్డ మందలుడ, పినయెర్వ పెదయెర్వ యేలంగగ యెర్వలకు అనాప్రివిష్టి దాంకి ధేనువులకు మేంతలేదని రాజున్ పద్మనాధుండున్ వివరించ్చుకొని ధేనువులున్ దాకు కదిలిరి పాంకనాడు సిద్ధిరాజుకు పుల్లరి వొడంబడి భూమి చొచ్చి మేపిరి మెపుత నలనన్న ధేనువులుం దాను మరిలి దినసిధుల మీందం గదలి వచ్చి పెన్నవెంట విడిసిరి. నలసిద్ధివారు యెద్దుల యెసిరి ఆదవుల వందను ఆండం తరుచాయ అడవుల వంక్క రంతువదె నెల్లూర ధేనువులుం దారు వదిలి యరగడ్డపాట నిలిచెను నలసిద్ధిరాయభారి పుల్లరికి వచ్చెను వట్టించి రాయభారిని పుల్లరిలేదు పొమ్మనిరి లేదుపొమ్మంటేను నెల్లూరి నలసిద్ధిరాజు యరగడ్డపాటికి యెత్తివచ్చెను......"[10] కాబట్టి కాటమరాజు కాకతీయ ప్రతాపరుద్రుని కాలము వాడనుట నిస్సంశయము. వీరగాథలును ఈవిషయమును బలపరుచుచున్నవి.

కాటమరాజు కథాచక్రములోని కరియావులరాజు కథలో ప్రతాపరుద్రుని ప్రసక్తి పలుతావులందు వచ్చినది. అయితమరాజు 'పల్లికొండ, పుత్తమరాజు, కరియావులరాజు, పుల్లావుల కేశవయ్య మొదలగు యాదవవీరులు ఓరుగల్లులో జరగు శంభుని తిరునాళ్ళకు పోయిరి. అప్పుడు ప్రతాపరుద్రుడు వారి కెదురేగి ఆహ్వానించినట్లుగా నాకు లభించిన తాళపత్ర గ్రంథమున కలదు:

"ఎల్లచేనుగమీద రైతాంగ మాయెను పతాబ్రిరుద్రుడు
పుట్టకోట బైటకి భూపతి యెదురేగి వచ్చెను
సాధండ పాలకీలు తగ్గించినారు
పరపేనిగను దిగెను పతాబ్రిరుద్రుండు
స్త్రీరమందులవారు దిగిరి పాలకలు

---

10. గుండ్లపాలెము శిలాశాసనము, మూడవప్రక్క, పంక్తులు 20-42.

బిసుకాదీణము పరపించి చదురు ఏరుపరచి
వారిచేతి తాంబూలము వీరందు కొనిరి
అంతట పతాబ్రిరుద్రుడు ఆడె నొకమాట
మీరున్ను మేమున్ను గోత్రదాయాదులము
ఆవుల పోలురాజు మాకు అయ్య గావలెను
అయితమరాజు మాకన్న గావలెను
స్త్రిరమందుల పల్లికొండ మాకు బావ గావలెను
పుత్తమరాజు మాకు మరది కావలెను
అని వరుసక్రమాలు అటు దెల్పుకోని
సౌధంధ పాలకీలు తర్లిచ్చుకోని
వోరుగంటి పట్నానకి వచ్చిరి రాజులు"[1]

ఈ కరియావులరాజుకథలో వోరుగంటి ప్రతాపరుద్రునకును, యాదవ రాజులకును జరిగిన అనేక సంఘర్షణలు చిత్రింపబడినవి. ప్రతాపరుద్రుడు యాదవరాజులను చంపుటకు విషాన్నము పెట్టుటకు కత్తులతో మనుషులను ఏర్పాటు చేయుటయు; ఘుండి గుఱ్ఱమును స్వారి చేయుడని కోరుట. అయితమరాజును పుత్తమరాజును విఘ్నస్వరూపడగు పల్లికొండసహాయమున ఈ ఉపద్రవములన్నిటిని సురక్షితముగా దాటుదురు. కరియావులరాజు ప్రతాపరుద్రుని సేనాధిపతి యగు బేతాలునితో-ద్వంద్వయుద్ధము చేసి అతని ఖడ్గమున్నియును గైకొనుట ఈ వీరగాథలోని ప్రధాన ఇతివృత్తము. "బేతాలుడు" లేక "బేతాంరెడ్డి" కాకతీయ ప్రతాపరుద్రుని సైన్యాధ్యక్షుడనుట చారిత్రక సత్యము. వేదమువారి నాటకమున కూడ ఈ బేతాలుని ప్రసక్తి యుండుట గమనింప దగినది. కావున కాటమరాజు కాకతీయ ప్రతాపరుద్రుని కాలము వాడని ఈ వీరగాథయును సాక్ష్య మిచ్చుచున్నది. "జున్నివాడ కథ" అను వీరగాథలో కూడా ప్రతాపరుద్రుని ప్రసక్తి యున్నది. నాకు కృష్ణామండలమున లభించిన ఈ కథయొక్క తాళపత్ర ప్రతిలో ఈక్రింది విధముగా నున్నది:

---

1. కరియావులరాజు కథ,-పెదకందిపల్లె తాళపత్ర ప్రతి,పుటలు 2,8.

"అవేళ ఓరుగంటి ప్రతాపరుద్రుండు పంపిన పరిచారకులును"
(పత్రము 26)

"అందుకు ప్రతాపరుద్రుండును మహా సంతోషించి యిట్లగని పలికె
ఓయీ గొల్లరాజా! ఇప్పటి వారిలోకి
నీవు భక్తుండ వైతివి ఆ నీలకంఠునికి
మెచ్చితినోలు గొల్లరాజుకి ఇచ్చెను పచ్చల పల్లకి
ఆ ప్రతాపరుద్రుని మాట రాజు మనసుకు దెచ్చుకోని
గొల్లరాజు పొడవమన్న మాట విని సిద్ధిరాజు పొలపొల పొక్కెను"
(పత్రము 27)

కాబట్టి,కాటమరాజు కాకతీయ ప్రతాపరుద్రునకు సమకాలికు డనుటలో సందేహము లేదు. శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు కాటమరాజు కాకతీయ గణపతిదేవుని కాలమువాడనిరి [12]; కాని దీనిని ఏ ప్రమాణముతో చెప్పిరో తెలియకున్నది.

6. మనుమసిద్ధి - నల్లసిద్ధి - ఖడ్గతిక్కన :-

పల్నాటి యుద్ధమునకు శైవ,వైష్ణవ మత భేదములు కారణములను దుర భిప్రాయము వ్యాపించినట్లుగనే, కాటమరాజుతో యుద్ధము చేసిన రాజు 'నెల్లూరు మనుమసిద్ధి' అని ఒకతప్పుడు ప్రచారము తెలుగుదేశమున కొనసాగుచున్నది. కాటమరాజునకును మనుమసిద్ధికిని ఎట్టి సంబంధమును లేదు. కాటమరాజు కథా చక్రమున గల ముప్పది రెండు కథలలోను ఏ ఒక్క కథయందును మనుమసిద్ధి ప్రసక్తి లేదు. కాటమరాజుతో పోరినది నల్లసిద్ధి రాజు; అతని తమ్ములు పాప

12. " ... ఇక దక్షిణమున గణపతి దేవుని సమకాలికుడగు నల్లసిద్ధి ఎఱ్ఱ గడ్డపాటి పోట్లాటలో చచ్చిపోయినాడు. విజయిమైన కాటమరాజు కథ ఈ పేరితో మాత్రమే కాక భట్టు రాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చేకథ, వల్లురాజు యుద్ధము,ఆగుమంచి కథ వంటి అనేక రూపాలుగా వచ్చింది."—కిన్నెర, డిసెంబర్, 1953, పుట 555

సిద్ధి, ఎఱ్ఱసిద్ధి, కొండిక సిద్ధి, కొమార సిద్ధిరాజులని వీరగాథలలో నున్నారు. ఈ నల్లసిద్ధి రాజెవరో నిరూపించుట చారిత్రకుల పని. యశోదా దేవిగారు మనుమసిద్ధికిని, నల్లసిద్ధికిని అభేదమును పాటించిరి. మల్లంపల్లివారు మనుమసిద్ధి తండ్రి కొడుకు నల్లసిద్ధి యనిరి.

కాటమరాజు కథాచక్రమున 'నల్లసిద్ధి' రాజు,' 'ఖడ్గతిక్కన' లేక 'రణ తిక్కన' (పట్టపురావి కైఫీయతులో నితనికి 'కార్య తిక్కన' అని మరియొక పేరు కానవచ్చుచున్నది) ఈ ఇరువురును ప్రసిద్ధ చారిత్రక వ్యక్తులు. నల్లసిద్ధి పల్లవ రాజని, ముక్కంటి సంతతివాడని, భారద్వాజ గోత్రుడని, సూర్యవంశపు రాజని, 'భట్టు రాయబార'మను వీరగాథలోనున్నది. ఈ ముక్కంటి పల్లవుడు, ధరణికోట అమరలింగమునకు ఒక బ్రాహ్మణ కన్యవలన పుట్టినట్లున్నది. (చూ. మదరాసు ప్రా. లి. గ్రం. వారి కాటమరాజు కథ, పుట 169) నెల్లూరు జిల్లా తల్పగిరి కైఫీయతులో త్రిలోచనుడను పల్లవరాజు బ్రాహ్మణకన్యను జన్మించిన ట్లున్నది. (అసలు ఈ పల్లవరాజు లందరును బ్రాహ్మణులనియు, ద్రోణుని పుత్రుడగు అశ్వత్థామ సంతతి వారనియు, చారిత్రకులలో ఒక సిద్ధాంతమున్నది ) ఈ త్రిలోచన పల్లవుని గురించిన గాథ లనేకములు కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు కృష్ణా మండలముల స్థానిక చరిత్రల వలన తెలియుచున్నవి. ఇతడు కరికాల చోళునిసమకాలికునిగా నున్నాడు. కాటమరాజు కథలలో చెప్పబడిన ముక్కంటి పల్లవుడును, ఈ స్థానిక చరిత్రలలోని త్రిలోచన పల్లవుడును ఒకరే యని చెప్పవచ్చును. కాని పల్లవరాజుల శాసనములలో మ్రాత్రము ఇతని పేరు కానవచ్చుట లేదు. పల్లవులు భారద్వాజస గోత్రులైనను సూర్య వంశోద్భవులు మాత్రము కారు.

"ముక్కంటిని గురించిన విశేషములు కాటమరాజు కథలో తెలుపబడ లేదు" అని మల్లంపల్లివారు వాపోయినారు. (చూ. కాటమరాజు కథ, పీఠిక, పుట xxiv) కాని ఇది సరికాదు. మల్లంపల్లివారికి తెలిసిన కాటమరాజుకథలు మూడు నాలుగు మాత్రమే. నాకు లభించిన 'పోలురాజు కథ' (లేక శివపురాణము) అను తాళపత్ర గ్రంథములో ఈ ముక్కంటి పుట్టుపూర్వోత్తరములను చెప్పు నొక అంతర్గాథ చాటువ కలదు. దీనికి 'ముక్కంటి చాటువ' లేక 'బ్రాహ్మణ చాటువ' అని పేరు.

స్థానిక చరిత్రల ననుసరించి నల్ల సిద్ధిరాజు చోళకులజుడు. సూర్య వంశోద్భవుడు. శాసనములనుబట్టి ఈ తెలుగుచోళులు కాశ్యప గోత్రులు. కరికాల చోలుని సంతతివారు. ఖడ్గతిక్కన చోళుల కొలువులోని వాడేకాని పల్లవుల కొలువులో నుండిన వాడు కాదు. ఖడ్గతిక్కన, అతని తండ్రి సిద్ధన, సోదరులు భాస్కర, కేతనలు, పినతండ్రియగు కొమ్మన కుమారుడైన తిక్కన–వీరందరును నెల్లూరును పాలించిన చోళరాజుల కొలువు లోని వారే; కావున వీరగాథా రచయిత నల్లసిద్ధిని పల్లవరాజనుట పొరపాటు. ఈ తెలుగుచోళులు మొదట పల్లవుల సామంతులనుటలో మాత్రము సందేహము లేదు. గణపతిదేవుని కాలమునుండి కాకతీయ సామంతులు. నేటివరకును లభించు చున్న నెల్లూరు తెలుగుచోళుల శాసనములనుబట్టి చారిత్రకులు వారి వంశక్రమము నిట్లు చూపిరి:

(చూ : ప్రక్కపుట)

శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు నెల్లూరు తెలుగు చోళుల కాలములను చక్కగా నిచ్చిరి కాని వంశక్రమమున కొందరు రాజులను విస్మరించిరి. మూడవ మనుమసిద్ధికిని నల్లసిద్ధికిని అభేదము పాటించిరి. ఇదిసరికాదు. మూడవ మనుమ సిద్ధికి గల ముగ్గురు పుత్రులలో ద్వితీయ పుత్రుడు నల్లసిద్ధి. ఇతడే కాటమరాజు ప్రత్యర్థి. మనుమ గండ గోపాలుడు మనుమసిద్ధికి పుత్రుడనుటయు సరికాదు. ఇతడు నల్లసిద్ధి కుమారుడు. మనుమసిద్ధికి మనుమడు. 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'లో నీ మనుమ గండ గోపాలుడును పాల్గొనినాడు. నల్లసిద్ధియు, మనుమ గండ గోపాలుడును మనుమసిద్ధికి పుత్ర పౌత్రులను విషయము గుంటూరుజిల్లా నర్సా రావుపేట శాసనములో స్పష్టముగా నున్నది: (చూ. భారతి, జూలై 1966, కల గూరగంప)



నెల్లూరి తెలుగు చోళుల వంశక్రమము

శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు:- 1947 (J.A.H.R.S., Vol xxiii: PP 61-114) లో నెల్లూరి తెలుగుచోళుల వంశక్రమమును క్రింది విధముగా జూపిరి.

కటికాల చోళుఁడు
⋮
మధురాంతక పొత్తపి చోళుదు
⋮
తెలుగు విద్య లేక బిజ్జ

- 1. సిద్ధి లేక మొదటి మనుమసిద్ధి (క్రీ.శ. 1175-1192)
- బేత
  - 2. దాయ భీమ (1187-1214)
  - 2. నల్లసిద్ధ (1187-1214)
  - 3. ఎఱ్ఱ సిద్ధ (1195-1217)
    - 4. రెండవ మనుమసిద్ధి (1198-1210)
      - 6. మొదటి తిక్క (1209-1248)
        - మూడవ మనుమసిద్ధి లేక నల్లసిద్ధి (1248-1267)
          - రెండవ తిక్క (1265-1281)
          - మనుమ గండ గోపాల (1281-1299)
        - విజయ గండ గోపాల (?)
      - అత్తిగ
    - బేత
    - 5. తమ్ము సిద్ధ (1205-1209)

యశోదాదేవిగారిచ్చిన వంశక్రమములో తెలుగువిద్య తరువాత 'దాయభీమ' అను నతడును రెండవ మనుమసిద్ధికి అగ్రజుడగు నల్లసిద్ధియును, మూడవ మనుమసిద్ధియొక్క ద్వితీయ తృతీయ పుత్రులగు 'నల్లసిద్ధి, గోపినాథ' అను వారును సూచింపబడలేదు. ఈ లోపముల నన్నిటిని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పూరించిరి. శర్మగారు నెల్లూరు తెలుగు చోళుల వంశక్రమము నీ క్రింది విధముగా చూపిరి:-

కీ.శే. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు–1953 (కాటమరాజు కథ, పీఠిక, పుట xxvii)



ఈ వంశవృక్షములో ముగ్గురు నల్లసిద్ధి రాజులున్నారు. వీరిలో నే నల్లసిద్ధి రాజు కాటమరాజుతో యుద్ధము చేసెనో పరిశీలింపవలసి యున్నది. 1956 మార్చినెల భారతిలో దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారిచ్చిన నెల్లూరు చోడవంశము పై దానికన్న కొంచెము భిన్నముగ నున్నది.

దేవరపల్లివారు రెండవ మన్మసిద్ధియొక్క తండ్రిని ఎఱ్ఱసిద్ధిగా గాక రాజేంద్రచోడునిగా పేర్కొనిరి. యశోదా దేవిగారు 'విజయ గండ గోపాల' నామము మూడవ మన్మసిద్ధి నామాంతరమో లేక ఆ మూడవ మన్మసిద్ధి సోదరుని నామమో తేల్చుకొనలేకపోయిరి. దేవరపల్లివారు తెలుగు చోడుల శాసనములలో చాల తఱచుగా కానవచ్చు గండగోపాల శబ్దముల కొక చక్కని సమన్వయము సాధించిరి.

దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు: 1965 [భారతి, మార్చి, 1965, పుట 78]

వీరు క్రీ.శ. 1214 నాటి దూబగుంట శాసనమును 1257 నాటి నందలూరు శాసనమును, నరసరావుపేట శాసనమును ఆధారముగా జేసికొని నెల్లూరు చోడవంశ క్రమము ఈ క్రింది విధముగా నిర్మించిరి :

(చూ : ఎదుటి పుట)

ఖడ్గతిక్కన తండ్రియగు సిద్ధన చోడతిక్క నృపాలుని ప్రధానమంత్రి. నెల్లూరి రాజ్యముపై సేవణసైన్యముదండెత్తి వచ్చినపుడు ఖడ్గతిక్కనకు తమ్ముడును, సిద్ధనద్వితీయపుత్రుడును అగు 'బాచడు' అను 'భాస్కరమంత్రి' ఎదుర్కొని యుద్ధము చేసి ఆ సైన్యమును సంహరించెనని కేతన దశకుమార చరిత్రలోని పద్యమువలన తెలియుచున్నది. [13] ఈ సేవణ దేశాధీశ్వరుడగు సింఘణదేవుని పరిపాలనా కాలము క్రీ.శ. 1210-1247 కావున ఖడ్గతిక్కనయు సమకాలము వాడు

13. "ఉరవడి నుగ్రసేవణ పయోనిధి బాడబవహ్ని బాడ్పునన్
దరికొని కుంభజన్ము క్రియ ద్రాగి రఘు క్షితినాథు మాడ్కి న
చ్చెరువుగ నింక జేసెనని చెప్ప జనప్రకరంబు విక్రమా
భరణుని సిద్ధనార్యసుతు బాచని నన్నన గంధవారణున్"


రాజేంద్ర చోడ
మన్మసిద్ధి
తంగదేవరాజు క్రీ.శ. 1214
తిక్కరాజు క్రీ.శ. 1282
(?) విజయాదిత్యరాజు
ఇమ్మడి గండ గోపాలుడు
క్రీ.శ. 1260
(?) తిక్కరాజు
వీర గండ గోపాలుడు
క్రీ.శ. 1253
మన్మసిద్ధి
గండ గోపాలుడు
క్రీ.శ. 1257-63
తిక్కరాజు
నల్లసిద్ధి
మన్మ గండ గోపాలుడు
క్రీ.శ. 1297

కావలెను. (భాస్కర మంత్రి క్రీ.శ. 1275-77 ప్రాంతమువాడని వేపపల్లి వెంకటకృష్ణారెడ్డిగారి భావన) చోడ తిక్కనను మించిన ఉపశ్లోక విస్తారంతో మనకు పని లేదు. క్రీ.శ. 1250 సంవత్సరమునకు చెందిన మనుమ సిద్ధిని చెప్పు శాసనములు కొన్ని లభించుచున్నవి. కాని ఆ మనుమసిద్ధి కాంచీపుర ప్రాంత మువాడు. నెల్లూరి నేలిన నల్లసిద్ధియే మనకు ప్రసక్తుడు. కావున నా పల్లవ నల్ల సిద్ధితో మనకు పనిలేదు. కాని ఆచార్య మారేమంద రామారావుగారు నెల్లూరి సామంతులైన ఈ తెలుగుచోళుల రాజ్యము దక్షిణమున కాంచీపురము వరకును కలదని చెప్పుచున్నారు. కాంచీనగరముకూడ నెల్లూరి రాజ్యములోనిదని భావన. ఇదే రామారావుగారి అభిప్రాయము. చోడ తిక్కరాజును అతని పుత్రుడగు మనుమ సిద్ధియు, నెల్లూరు కాంచీపురములను రెండింటిని పాలించిరని వీరు వ్రాసిరి. "తిక్కరాజునకు పిదప నెల్లూరు, కాంచీనగరములను పాలించినవాడు అతని కుమారుడగు మనుమసిద్ధ దేవచోళుడు" (తెలుగు విజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము, పుట 231). పాండ్యులనేక పర్యాయములు ఈ కాంచీపురము నాక్ర మింపగా, కాకతీయులు వచ్చి తెలుగుచోడులను పునః ప్రతిష్ఠించిరి. ఇట్లు తెలుగు చోడులు మిక్కిలి దక్షిణ ప్రాంతమగు కాంచీపురమును పాలించుటచేతనో గాథాకర్త వీరిని పల్లవరాజులని సంబోధించి యుండును.

సిద్ధన కొలిచిన చోడ తిక్కరాజు శాసనములు క్రీ.శ. 1209-10 నుండి కానవచ్చుచున్నవి. చోడ తిక్కరాజు కుమారుడగు మనుమసిద్ధి శాసనములు క్రీ.శ. 1249-50 నుండి లభించుచున్నవి. కాబట్టి చోడ తిక్కరాజుకాలము క్రీ.శ. 1209-1249 అని చెప్పవచ్చును. ఇదియే సిద్ధన కాలము. కావున సిద్ధన కుమారుడగు ఖడ్గతిక్కన 13వ శతాబ్దము వాడని నిస్సంశయముగా చెప్పవచ్చును. క్రీ.శ.1258లో సుందరపాండ్యుడు నెల్లూరి రాజ్యముపై దండెత్తి చోడ తిక్క రాజును చంపెనని ఆచార్య మారేమంద రామారావుగారు తెలుపుచున్నారు. అందుచే చోడతిక్కని కాలము క్రీ.శ. 1209-1258 అని చెప్పవచ్చును.

సిద్ధన చోడతిక్కరాజుకడ ప్రధానమంత్రిగా నుండగా అతని పుత్రులు ఖడ్గతిక్కన, బాచడు అనువారు సైన్యాధ్యక్షులుగా ఉండిరని తెలియుచున్నది. చోడతిక్కరాజు మనుమసిద్ధి రాజ్యమునకు రాగ, కవితిక్కన ప్రధానమంత్రి యయ్యెను; ఖడ్గతిక్కన సైన్యాధ్యక్షుడుగా నుండెను. నిర్వచనోత్తర రామాయణ మున మనుమసిద్ధిని స్మరించిన కవితిక్కన మహాభారతమున అతనిని విస్మరించి

నాడు. అనగా తిక్కన భారతరచనా కాలమునాటికి మనుమసిద్ధి చనిపోయినాడు. ఇతని మరణముతో కవితిక్కన మంత్రిపదవిని త్యజించి, యజ్ఞముచేసి, సోమయాజియై మహాభారత రచనకు ఉపక్రమించెనని సాహిత్య విమర్శకులు చెప్పుచుందురు. మనుమసిద్ధి మరణానంతరము అతని పుత్రుడు నల్లసిద్ధి రాజయ్యెను (ఇది క్రీ.శ. 1290లో జరిగియుండును). కవితిక్కన మంత్రిపదవిని త్యజించుటచే ఖడ్గతిక్కన సైన్యాధ్యక్ష పదవితోపాటు మంత్రిపదవినిగూడ నిర్వహించెనని నా అభిప్రాయము. దీనికి కాటమరాజుకథలలో పెక్కు సాక్ష్యము లున్నవి :

"మనుజేశు నలసిద్ధి మంత్రియైనట్టి
కరుణాకటాక్షుండు గాంభీర్య ఘనుడు
స్థిరకీర్తి యగునట్టి తిక్కన పొగడ"[14]

యుద్ధమునకు వివిధ రాజన్యులను ఆహ్వానించుచు సిద్ధన కుమారుడగు తిక్కనయే లేఖలు వ్రాసినట్లు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'లో గలదు. ఇది ప్రధాన మంత్రి చేయుపని.

"సిద్ధన్న తిక్కన్న శీఘ్రమే పిలిచి
లేఖలుద్దగిరికి లిఖియించు మనెను
కోట్ల పర్యంతము కూడును దండు
చీట్లు వ్రాయించుమీ శీఘ్రాన తిక్క
... ... ... ... ... ...
అనిన తిక్కనమంత్రి యన్నిదిక్కులకుఁ
గడు వేగమునఁ బంపెఁ గమ్మ రమ్మనుచు"[15]

ఇట్లు ప్రధానమంత్రి బాధ్యతలను నిర్వహించిన సిద్ధనతిక్కనయే, మరల చల్లవారి దండును జూచి భయపడుచున్న నల్లసిద్ధిరాజుతో సైన్యాధ్యక్షునివలె పౌరుషవాక్యములాడును :

పల్లవ నల్లసిద్ధి పట్టాభిరామ !
చల్లవారిని జూచి సన్నుతించకుము

14. భట్టు రాయబారము, కాటమరాజు కథ అనుబంధము, పుట 159.
15. కాటమరాజుకథ, పుట 10.

మనముందు వారెంత మూర్ఖులు గారు
చల్లవారెంత ? యీ సైన్యం బదెంత ?
యాదవ బలమది యంతయు నెంత !
ఓ సిద్ధిరాజ ! నే నొకడనే పోయి
సమయించి వత్తును శత్రుసైన్యంబు
గహ్వారంబున రాజు గద్దించినట్లు
చల్లవారందఱిని సమయించి వత్తు
జక్కగా నణుకుదు సమరంబులోను
పల్లవాధిప ! రాజ ! పంపుము నన్ను."[16].

లేఖలు వ్రాయుటలో మంత్రిగా వ్యవహరించిన ఖడ్గతిక్కనయే. ఇట మనకు సైన్యాధ్యక్షుడుగా ప్రత్యక్షమగుచున్నాడు. కాబట్టి మనుమసిద్ధి కాలమున వేసల సైన్యాధిపతిగా నున్న ఖడ్గతిక్కన, నల్లసిద్ధి కాలమున ప్రధానమంత్రి పదవిని గూడ నిర్వహించెనని ఊహించుట కవకాశ మున్నది.

చోడతిక్కరాజును ఖడ్గతిక్కన తండ్రియగు సిద్ధన మంత్రియును ఒకతరము వారు. చోడతిక్కన పుత్రుడగు మనుమసిద్ధియు, కవితిక్కన, ఖడ్గతిక్కన, బాచనలు రెండవ తరమువారు. నల్లసిద్ధి మూడవ తరము వాడు. రెండవతరము లోనున్న ఖడ్గతిక్కనయే మరల మూడవ తరమున కూడ మంత్రి దళవాయి పదవుల నిర్వహించియుండునా అని అనుమానము వచ్చుట సహజము. ఈ ఖడ్గ తిక్కన, మనుమసిద్ధికి మంత్రిగానున్న కవితిక్కనకు పెదతండ్రి కుమారు డగుటచే ఈ యనుమానము మరింత బలపడుచున్నది. పెదతండ్రికుమారుడగుటచే ఈ ఖడ్గతిక్కన, కవితిక్కనకంటె వయసులో పెద్దవాడై యుండునని ఈ సంశయాస్పదుల నమ్మకము. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మనుమసిద్ధి కుమారుడగు నల్లసిద్ధియే కాటమరాజునకు సమకాలికుడని యొకప్రక్క నిర్ణయించి యు పై అనుమానముచే దానిని మరల కొట్టివేసిరి చూడుడు :

"చోడతిక్క భూపతియు, అతని కుమారుడు మనుమసిద్ధ భూనాథు డును క్రీ.శ.1209-10, 1249-50 సంవత్సరములనుండి పాలించినట్లు వారి

16. కాటమరాజుకథ, పుటలు 15, 16.

శాసనములవలనఁ దెలియుచున్నట్లిదివఱకే చెప్పఁబడినది. అట్లైనచో కాటమరాజు కథలోని నల్లసిద్ధి, మనుమసిద్ధి ద్వితీయపుత్రుఁడైనఁ గావలెను; లేదా చోడతిక్క-రాజు పెదతండ్రియో, పెదతాతయోయైన నల్లసిద్ధియైనఁ గావలెను. ఖడ్గతిక్కన తండ్రియైన సిద్ధనామాత్యుఁడు చోడతిక్కరాజుమంత్రియైనప్పుడు, ఖడ్గతిక్కన చోడతిక్కరాజు పూర్వులైన నల్లసిద్ధి భూవరుల యొద్దనుండుట యసంభవము. మనుమ గండ గోపాలుఁడు క్రీ.శ. 1297 ప్రాంతమున నున్నవాడగుటచేత అతని తండ్రియు, చోడతిక్క భూపతిమనుమడును అయిన నల్లసిద్ధిరాజు క్రీ శ. 1270-1275 ప్రాంతమున నుండవలెను. కాని, కవితిక్కన పెదతండ్రి కుమారుడగు ఖడ్గతిక్కన, మనుమసిద్ధి కుమారుఁడైన నల్లసిద్ధికి మంత్రి యగునా యని సంశయము''.[17]

ఈ సంశయము నిరాధారమైనదనియు, అనావశ్యకమనియు నిరూపించుటకు నేను రెండు ప్రధాన కారణములను చూపుచున్నాను. అందొకటి చారిత్రకమైనది; రెండవది లోకజ్ఞాన సంబంధమైనది. మనుమసిద్ధి కాలానుగుణముగా మరణించినచో ఆతని తరములోనున్న ఖడ్గతిక్కన్న తరువాతితరమున మంత్రిత్వ సైన్యాధ్యక్ష పదవులను నిర్వహించుట కవకాశము లేదు కాని, మనుమసిద్ధి యుద్ధమున అకాల మరణము నొందినాడు. ఇది క్రీ. శ. 1290 ప్రాంతమున రుద్రమదేవికాలమున జరిగినది. ఈ మనుమసిద్ధి దుర్మరణమునకు కారకుడు ఓరుగంటి ప్రతాపరుద్రుడు. మనుమసిద్ధి మొదటినుండియు కాకతీయ సామంతుడు. ఒకప్పుడు పాండ్యులచే రాజ్యము కోల్పోయి, గణపతిదేవుని దయవలన మరల పొందినాడు. కవితిక్కన గణపతిదేవుని దర్శించి, తన భారతమును వినిపించి మనుమసిద్ధికి రాజ్య మిప్పించినట్లుగా జనశ్రుతియు గలదు. (రుద్రమదేవిపాలనా కాలమున గణపతిదేవు డుండునా అని సంశయింప పనిలేదు. రాజ్య వ్యవహారములను రుద్రమదేవి చూచుకొనుచుండగా, 'కృష్ణా, రామా' యనుకొనుచు భారతాది గ్రంథములయందాసక్తుడై వృద్ధునిగా గణపతిదేవు డుండుటలో అసంభవ మేమియును లేదు.) ఇది క్రీ. శ. 1260 లో జరిగినది. 1262 లో గణపతిదేవుడు మరణించెను. 1290 ప్రాంతమున మనుమసిద్ధి

---

17. కాటమరాజు కథ, పీఠిక, పుట xxviii

మారల పాండ్యులచే తరుమబడెను. కాకతి చక్రవర్తిని మొదట అంబదేవుడను సేనానిని నెల్లూరుకు పంపెను. ఆ అంబదేవుడు మనుమసిద్ధితోను పాండ్యులతోను కుట్రపన్ని రుద్రమదేవిపై తిరుగబడగా, యువరాజుగా నున్న ప్రతాపరుద్రుడు వచ్చి, అంబదేవుని ఓడించి, ఈ మనుమసిద్ధిని చంపి, పాండ్యులను తరిమివేసినాడు. ఈ చారిత్రకాంశములను మల్లంపల్లివారు గమనించినట్లు లేదు. కాకతీయ రాజవంశమును గూర్చి గొప్ప పరిశోధన చేసిన మారేమండ రామారావుగారు, యువరాజుగానున్న ప్రతాపరుద్రుడు మనుమసిద్ధిని చంపుటనుగూర్చి యిట్లు వ్రాసినారు.

"క్రీ. శ. 1290 ప్రాంతమున దక్షిణదిశను పాండ్యులు విజృంభించి, కాంచీ నెల్లూరులను వశపరచుకొని, కాకతీయ సామంతుడగు మనుమసిద్ధిని తరిమివేసిరి. అంబదేవుడీ పాండ్యులను వెడలించి తిరిగి మనుమసిద్ధిని నెల్లూరున ప్రతిష్ఠించెను, కాని ఈ యంబదేవుడు ఏ కారణమువలననో, పాండ్యులతోను యాదవులతోను చేరి, మనుమసిద్ధితో కూడ రుద్రాంబపై తిరుగుబాటు చేసెను. ఈ ప్రమాదమును ఎదుర్కొనుటకై యువరాజగు ప్రతాపరుద్రదేవుడు ససైన్యముగా దక్షిణదిశకు ఏగెను. గోన విఠలనాథుడను సేనాని బళ్ళారిమండలము ప్రవేశించి యాదవులను ఓడించి పెక్కు దుర్గములను జయించెను. అడిదమ్మ యను మరియొక సేనాని మనుమసిద్ధిని చంపి, అంబదేవుని ఓడించెను. ప్రతాపరుద్ర దేవుడు స్వయముగ పాండ్యులపై బడి వారిని పారద్రోలెను."[18]

దీనినిబట్టి, అడిదమ్మ యను కాకతీయ సేనానిచే క్రీ. శ. 1290 ప్రాంతమున మనుమసిద్ధి చంపబడెనని స్పష్టమగుచున్నది. మనుమసిద్ధి కాటమరాజుతో పోరి మరణించెననుట ఎంత అసంగతమో దీనివలన తెలియుచున్నది. మనుమసిద్ధి మరణము నాటికి రుద్రమదేవి కాకతీయ సామ్రాజ్యమునకు మహారాజ్ఞి. ప్రతాపరుద్రుడు యువరాజు. ఇట్లు మనుమసిద్ధి అకాల మరణము నొందుటచే [illegible] అతని [illegible] సైన్యాధ్యక్షుడును ప్రధాన మంత్రియు [illegible] సంభవముగుచున్నది. [illegible] క్రీ. శ. 1290 ప్రాంతమున [illegible] క్రీ. శ. 1270-75 ప్రాంతమున నుండియుండునని మల్లం

18. విజ్ఞాన సర్వస్వము, సంపుటము. 3, పుట. 288.

పల్లి వారూహించిరి, ఆ ఊహాగానముకన్న ఇతడు క్రీ. శ. 1290 ప్రాంతమున సింహాసన మెక్కెనని పై చర్చనుబట్టి నిశ్చయింపవచ్చును. చోడతిక్కరాజు క్రీ. శ. 1209–10 నుండి 1249–5) వరకును పాలించెనని శాసనములనుబట్టి తెలియుచున్నను, ఇతడు 1258 లో సుందరపాండ్యునిచే చంపబడుటనుబట్టి ఇతని కాలము క్రీ. శ. 1209–1258 అని నిశ్చయముగా చెప్పవచ్చును. ఇతని పుత్రుడగు మనుమసిద్ధి క్రీ. శ. 1258–1290 వరకును పాలించెనని స్పష్ట మగుచున్నది. మనుమసిద్ధి పుత్రుడగు నల్లసిద్ధి క్రీ. శ. 1290 ప్రాంతమున సింహాసన మెక్కెను. నల్లసిద్ధి పుత్రుడగు మనుమ గండ గోపాలుడు క్రీ. శ. 1297 ప్రాంతమున నున్నట్లుగా ఒక శాసనమువలన తెలియుచున్నదని మల్లంపల్లివారు సెలవిచ్చిరి. కాబట్టి నల్లసిద్ధి క్రీ. శ. 1290–97 వరకును నెల్లూరును పాలించెనని చెప్పవచ్చును. మనుమసిద్ధి అకాల మరణము నొందుటచే అతని కొలువులో నున్న ఖడ్గతిక్కనయే నల్లసిద్ధిని కూడ సేవించియుండుట అసంభావ్యము కానేరదు.

ఇక లోకవృత్తమును పరిశీలించినచో, పెదతండ్రి కుమారుడైనంత మాత్రమున వయస్సులో పెద్దవాడుగా నుండుననియు, పినతండ్రికుమారుడైనంత మాత్రమున పిన్నవాడుగ నుండుననియు చెప్పజాలము. ఖడ్గతిక్కన కవితిక్కనకన్న చిన్నవాడగుటయు సంభవమే. సిద్ధనమంత్రికి తన తమ్ముడగు కొమ్మనకంటె సంతాన మాలస్యముగా కలిగియుండవచ్చును. లేదా కొందరు పుత్రికలు ముందుపుట్టి తరువాత ఖడ్గతిక్కన జనియించి యుండవచ్చును. కొమ్మనకు కవితిక్కనయే జ్యేష్ఠపుత్రుడుగా పుట్టియుంతవచ్చును. మేనమామల కంటె మేనల్లుండ్రును, పెదతండ్రి కుమారులకంటె పినతండ్రి కుమారులును వయస్సులో పెద్దవారుగా నుండుట లోకమున మనము చూచుచునే యున్నాము. కాబట్టి కవితిక్కనకంటె అతని పెదతండ్రికుమారుడైన ఖడ్గతిక్కన వయస్సులో చిన్నవాడై యుండును. అందుచే నల్లసిద్ధికాలమున కవితిక్కనకు వయసు మళ్లియుండును; (లేదా కవితిక్కన మరణించియుండును); ఖడ్గతిక్కన నడివయసులో నుండియుండును. ఈతడు యాదవులతో పోరిన తీరు చూడగా చిక్కని శరీరధార్ఢ్యముగల యోధాగ్రేసరుడుగా కాన్పించును. కావున ఖడ్గతిక్కన మనుమసిద్ధికాలమున యువకుడుగను నల్లసిద్ధికాలమున నలుబదియేండ్ల నడి

వయస్కుడుగను ఉండియుండునని నా నమ్మకము. మనుమసిద్ధికాలమున మంత్రిగానున్న కవితిక్కన నల్లసిద్ధికాలమున గతించియుండును.

ఈ కాటమరాజుయుద్ధము మనుమసిద్ధికాలమున (క్రీ.శ. 1250-1290) కాక, అతని కుమారుడగు నల్లసిద్ధికాలమున (క్రీ.శ. 1290-1297) జరిగిన దనియు, అప్పటికి మనుమసిద్ధియేకాక కవితిక్కనయు మరణించెననియు తెల్పుట కొక ప్రమాణ మున్నది. కాటమరాజు కథాచక్రమునకు సంబంధించిన వీరగాథలలో 'జన్నివాడ కథ' యొకటి. దీని తాళపత్ర ప్రతి నాకు లభించినది. ఇది ఎఱ్ఱగడ్డ పాటి పోట్లాటకు కొంచెము పూర్వము జరిగిన కథ. ఇందు పుల్లరి యొప్పందము, కాటమరాజు 'జన్నివాడ' గ్రామమున గుడారము లెత్తించి, పద్మనాయనితో పగడసాలాడుచు నెల్లూరి సీమలో పశువులను మేపుట వర్ణితమైనది. కాటమరాజును పద్మనాయడును కూర్చుండి పగడసాలాడిన ఒక పెద్దగుండుఱాతిని జన్నివాడ గ్రామమున నేటికిని ప్రజలు చూపుచున్నారు. ఈ 'జన్నివాడ' నేటి నెల్లూరి ప్రక్కననున్న జొన్నవాడ. దీని అసలు పేరు 'జన్నవాడ'. ఇది కవి తిక్కన జన్నము చేసిన ప్రదేశము కావున "జన్నవాడ" అయినది. ఈ 'జన్నవాడ' యను గ్రామము కాటమరాజు కాలమునాటికే ఏర్పడినదని పై వీరగాథను బట్టి తెలియుచున్నది. మనుమసిద్ధి మరణానంతరము తిక్కన యజ్ఞము చేసి భారతరచన ప్రారంభించె ననికదా జనశ్రుతి! అనగా కాటమరాజు పుల్లరికథ నాటికే మనుమసిద్ధి మరణించుట, తిక్కన యజ్ఞము చేయుట, ఆ ప్రదేశమున నొక గ్రామము వెలయుట జరిగిపోయినది. కావున కాటమరాజు యుద్ధకాలము నాటికి కవితిక్కన ఉండియుండడు. ఉన్నచో, పదునైదుపర్వముల మహాభారతమును రచించిన ఈ మహాకవి, తన పినసోదరునికై దుఃఖించుచు, కనీసమొక కందపద్యమైనను చెప్పియుండును కదా! ఇట్లు కవితిక్కన తన సోదరుడగు ఖడ్గతిక్కన ప్రసక్తి తీసికొనిరాకపోవుట కూడ, యుద్ధకాలమున అతడు లేడని నిరూపించుచున్నది. కవితిక్కన, ఖడ్గతిక్కనకన్న వయసులో పెద్దవాడై, అతనికన్న ముందే గతించియుండును. క్రీ.శ. 1290 ప్రాంతమున మనుమసిద్ధి చంపబడెను. తరువాత నాలుగైదు సంవత్సరములలో కవితిక్కనయు గతించియుండును. ఆ పిమ్మటనే ఈ కాటమరాజుయుద్ధము (ఖడ్గతిక్కన మరణము) సంభవించియుండును.

చోడతిక్కరాజు శాసనములు క్రీ.శ. 1209-10 నుండి లభించుచున్నవి. క్రీ.శ. 1258 లో చోడతిక్కరాజు సుందరపాండ్యునిచే చంపబడెనని తెలియు చున్నది. మనుమసిద్ధిశాసనములు క్రీ.శ. 1249-50 నుండి లభ్యమగుచున్నవి. కాటమరాజు ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమువాడని గుండ్లపాలెము శిలా శాసనము సాక్ష్యమిచ్చుచున్నది. మనుమసిద్ధి క్రీ.శ. 1290 ప్రాంతములో కాక తీయ సేనానియగు అడిదమ్మచే చంపబడెనని స్పష్టముగా తెలియుచున్నది. ఖడ్గతిక్కన తమ్ముడగు బాచడు సేవణ సైన్యములను జయించినట్లు ఒక చాటు పద్యము చెప్పుచున్నది. ఈ బాచడు క్రీ.శ. 1275-1277 ప్రాంతమువాడని దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు నిర్ణయించినారు (చూ. భారతి, మార్చి 1965). మనుమసిద్ధి కుమారుడగు నల్లసిద్ధి క్రీ.శ. 1270-1275 ప్రాంతమున నుండి యుండునని మల్లంపల్లివారు నిర్ణయించియున్నారు. మనుమసిద్ధి మనుమడును, నల్లసిద్ధికుమారుడును అగు మనుమ గండ గోపాలుడు క్రీ.శ. 1297 ప్రాంతమున నున్నట్లు తెలియుచున్నది. ఈ మనుమ గండ గోపాలుడును కాటమరాజుయుద్ధ మున పాల్గొన్నాడు. కఱియావుల రాజు ఎఱసిద్ధిరాజుతోను, భట్టావుల వల్లభన్న పాపసిద్ధిరాజుతోను, అయితమరాజు గండగోపాలరాజుతోను యుద్ధము చేసినట్లుగా ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో గలదు.[19] కాటమరాజు సోదరుడగు కఱియావులరాజు ఓరుగంటి ప్రతాపరుద్రుని సేనానియగు బేతాళుని ద్వంద్వయుద్ధమున జంపినట్లుగా నున్న వీరగాథ లభ్యమగుచున్నది. ఇన్ని విషయములు ప్రబల సాక్ష్య మిచ్చు చుండగా కాటమరాజుకథల చారిత్రకత్వమును శంకించు ప్రబుద్ధుల నేమనవలెనో తెలియకున్నది.

పై విషయములనుబట్టి కాటమరాజుకథలలో వచ్చు ఖడ్గతిక్కన, నల్లసిద్ధి రాజు, కాటమరాజు, గండగోపాలుడు చారిత్రక పురుషులనియు, ఈ యుద్ధము ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమున-ముఖ్యముగా 13 వ శతాబ్దిచివరి భాగములో, క్రీ.శ. 1290-97 మధ్యకాలమున జరిగినదనియు నిస్సంశయముగా జెప్ప వచ్చును. పై చర్చనుబట్టి నల్లసిద్ధిరాజు పితృ పితామహులయొక్కయు, వారి వారి మంత్రులయొక్కయు కాలము లిట్లుండును:

---

19. చూ. కాటమరాజు కథ, వేటూరి పరిష్కృతము, పుటలు 104,105.




**ఆచార్య మారేమండ రామారావుగారి సిద్ధాంత ప్రకారము**
**కాకతీయ చక్రవర్తుల వంశక్రమము**

మొదటి బేతరాజు (క్రీ.శ. 1000-1030)
|
మొదటి ప్రోలరాజు (1030-1075)
|
రెండవ బేతరాజు (1075-1110)
|
రెండవ ప్రోలరాజు (1110-1158)
|

- రుద్రదేవ మహారాజు (1158-1195) [పల్నాటి యుద్ధము ఈతని కాలమున జరిగినది. ఇతడు నలగామునకు సహాయముగా కొంత సైన్యమునుబంపెను.]
- మహాదేవ రాజు (1195-1198)
  |
  - గణపతి దేవుడు (1198-1262)
  - కుందాంబిక (భర్త: నతవాడి రుద్రరాజు)

గణపతి దేవుడు

(1198–1262)

[చోడ తిక్కరాజును అతని పుత్రుడు మనుమసిద్ధియు నితని సామంతులు. ఇతడు 1260లో పాండ్యుల దాడినుండి మనుమసిద్ధిని రక్షించెను]



రుద్రాంబ (1262–1296) — గణపాంబ

[మనుమసిద్ధి ఈమెకు సామంతుడు. కాని 1290 లో అతడు పాండ్యులతో చేరి కుట్ర పన్నెను. అందుచే యువరాజు ప్రతాపరుద్రుడు అతనిని చంపివేసెను]



ముమ్మడంబ — రుయ్యంబ

ప్రతాపరుద్ర దేవుడు (1296–1323) — అన్నమ దేవుడు (?)

[నల్లసిద్ధియు, అతని పుత్రుడు మనుమ గండ గోపాలుడును ఇతని సామంతులు. ఇతడు యువరాజుగా నున్నప్పుడు 1290 ప్రాంతమున మనుమసిద్ధిని చంపెను. కాటమరాజు నల్లసిద్ధుల ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట యితని కాలమున జరిగినది.]

కావున కాటమరాజు క్రీ.శ. 1290-97 మధ్యకాలములో ఎప్పుడో నల్లసిద్ధితో యుద్ధముచేసి మరణించియుండును. కాకతీయ సామంతులగు తెలుగు చోళుల కాలమును దెలిసికొనుటకు కాకతీయ చక్రవర్తుల వంశక్రమమును పరిశీలించుట యవసరము. (చూ: పై వంశక్రమము)

"ముక్కంటి కొమరుండు మొగి జనోధీరుడు
జనోధీరుని కుమారుడు మనోధీరుడు
మనోధీరుని కుమారుడు మన్మసిద్ధిరాజు"[23]

తెలుగుచోళుల శాసనములనుబట్టి మనుమసిద్ధి, చోడతిక్కరాజు ద్వితీయ పుత్రుడు.

7. యుద్ధకాల నిర్ణయము :-

నల్లసిద్ధిరాజు నెల్లూరును పాలించిన కాలము క్రీ.శ. 1290-97 అని పైన నిరూపించితిని. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట యీ మధ్యకాలములోనే జరగి యుండ వలెను. అది యే సంవత్సరమో నిరూపించుటకు విమర్శకులు కొంత ప్రయత్నము చేసియున్నారు.

ఖడ్గతిక్కన-బ్రహ్మరుద్రయ్యల యుద్ధము (ఇదియే యాదవుల ఎఱ్ఱిగడ్డపాటి పోట్లాటకు నాంది) మాఘ బహుళ అమావాస్య మంగళవారము నాడు జరగినట్లుగా 'చల్లవారి జగడము' అను వీరగాథలో గలదు.[24] నాకు లభించిన 'ఆవుల మేపులు' అను తాళపత్ర గ్రంథమున ఎఱ్ఱగడ్డపాటిలో యాదవులు చిత్రభాను సంవత్సరమున చెల్లగలరని బ్రహ్మదేవుడు చెప్పినట్లుగా కలదు:

"ఏటిమీద ఆరునెలలకు ఎద్దులు యాదవులు
చిత్రభాను సంవత్సరాన చెల్లనున్నారు"

స్థానిక చరిత్రలలో కూడ ఈ యుద్ధము చిత్రభాను సంవత్సరంబున జరగినట్లగనే యున్నది. ఈ చిత్రభాను సంవత్సరమునకు సరియైన శకవర్షములు నాలుగున్నవి: 1024, 1084, 1144, 1204 ఈ నాల్గింటిలో దేనిలో మాఘ బహుళ అమావాస్య మంగళవారము నాడయ్యెనో పరిశీలించినచో అదియే యీ యుద్ధము జరిగిన సంవత్సర మగును. ఈ పరీక్ష ఒక్క 1084 కు మాత్రమే సరిపోవుచున్నది. అనగా శకవర్షము 1084 + 78 = క్రీ.శ. 1162 ఖడ్గతిక్కన

---

23. కాటమరాజుకథ, అనుబంధము, పుట. 150

24. కాటమరాజు కథ, పుట 28.

యుద్ధకాల మగుచున్నది. కాని ఇది సరికాదు అప్పటికి ఖడ్గతిక్కన కాదు కదా, అతని తండ్రి సిద్ధనమంత్రికూడ నుండియుండుట సవకాశము లేదు. కావున చిత్రభానుసంవత్సరమును బట్టి యుద్ధకాల నిర్ణయము చేయజాలము.

గుండ్లపాలెముశాసనములో నొకచోట యుద్ధకాలము శకవర్షము 1170 కాళయుక్తి సంవత్సర కార్తికశుద్ధ పంచమి గురువారమని కలదు: "స్వస్తిశ్రీ శాలివాహన శకవర్షంబులు ౧౧౭౦ అగు నేంటి కాళయుక్తి సంవత్సర కార్తిక శు౫గు నెల్లూరి నలసిద్ధిరాజు సర్వసన్నాహం మెరసి లింగాలకొండ చెంబగడ్డపాటి కూడలిసోమేశ్వరుని సందలిసనాన ఆత్రియగోత్ర యాదవ క్షత్రియ మధురాపుర మందీశ్వర శ్రీవిష్ణు యోగమాయ దివ్య శ్రీపాదక ప్రకట శాత్రవభంజన నచ్చెర వుంది పౌత్రలాయత్తసం గౌరవ పౌరవుండు ద్వారకాపురి గోపికా వల్లభుని పౌత్రుండు వల్లురాజు లతనిసుతులు పోలురాజు వారి పుత్రులు మొదలైన యాదవులు నలసిద్ధింగూడి యుద్ధము సేసి మృతులైరి."[25]. ఈ శాసన విషయమును బట్టి కాటమరాజు – నల్లసిద్ధిరాజుల యుద్ధము శకవర్షము 1170 అనగా క్రీ.శ. 1248 లో జరిగెనని చెప్పవలెను. కాని యిందు చెప్పబడిన శకవర్షంబునకును, తిథివార సంవత్సర నామములకును పొత్తు కుదురుటలేదు. ఈ శాసనములోని యుద్ధకాల సంవత్సరమును గూర్చి మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఇట్లు సెలవిచ్చినారు: "ఇది కూడ సరియైన తేదిగఁ గనఁబడదు; ఎందువల్ల ననఁగా శకవర్షము 1170 కి సరియైన బార్హస్పత్య మానాబ్దము కీలక కాని, కాళయుక్తి కాదు. కాళయుక్తియే సరియైన సంవత్సరమని, శకవర్ష సంఖ్యయే తప్పుగా చెక్కఁబడియుండునని యనుకొన్నచో, దానికి సరియైన శకవర్షము 1180 అగును. ఈ 1180, కాళయుక్తి సంవత్సరమున కార్తిక శు ౫ గురువారము నాఁడయినదేమో విచారింప వలసియున్నది. ఆ సంవత్సరమున అధికమాసము వచ్చినది. ఇది కార్తికమే, అధిక కార్తికమున నైనను శుద్ధపంచమితిథి శనివార మయినది కాని, గురువారము కాలేదు, నిజకార్తికమున నైనను శుద్ధపంచమి శనివారమే అయినది. అందువలన శకవర్షము 1180 కార్తిక శుద్ధపంచమీ గురువారము కూడ సరియయిన తేదిగాఁ గన్పట్టదు. శకవర్షము 1170 సరియైనదేమో యనుకొన్న నా సంవత్సరముననైనను కార్తిక

---

25. గుండ్లపాలెము శిలాశాసనము, నాల్గవప్రక్క, పంక్తులు 1-17.

శు ౬ శుక్రవారమైనది కాని గురువారము కాలేదు. అందువలన నీ గుండ్లపాలెము శాసనము నందిచ్చిన యుద్ధకాలము కూడ సరియైనది కాదు. అందువలన నెల్లూరి నల్లసిద్ధిరాజునకును కాటమరాజునకు యుద్ధ మెప్పుడు జరిగినదియు నిప్పటికి గల యాధారములతో నిర్ణయించుటకు వీలు కాదు." 26 ఒకవేళ ఇందలి తిథి వార పక్షములను నమ్మకుండ, శకవర్షమునే ప్రమాణముగా గ్రహింతమన్నచో, క్రీ.శ. 1248 నాటికి, నల్లసిద్ధిపాలన కాదుకదా అతని తండ్రియగు మనుమసిద్ధి పాలన కూడ ప్రారంభము కాలేదు. అది కాకతీయ గణపతిదేవుని కాలము. నెల్లూరును చోడతిక్కరాజు పాలించుచుండెను. కాని కాటమరాజు ప్రతాపరుద్రుని కాలమువాడుగా ఈ గుండ్లపాలెము శాసనములోనే రెండు మూడు తావులందున్నది. చోడతిక్కని కుమారుడగు మనుమసిద్ధి కాకతీయ గణపతిదేవుని కాలమున కొంత, రుద్రమదేవికాలమందు మరికొంత జీవించినవాడు. (గణపతిదేవుని 'కాలము క్రీ.శ. 1198-1262; రుద్రమదేవి కాలము క్రీ. శ. 1262-1296; మనుమసిద్ధి కాలము క్రీ శ. 1250-1290) నల్లసిద్ధియు అతని ప్రత్యర్థియగు కాటమరాజును రుద్రమదేవి చివరికాలమందును, ప్రతాపరుద్రుని యౌవరాజ్య కాలమందును జీవించియుందురు. అనగా క్రీ.శ. 1290-1297. ఈ మధ్య కాలమందే యుద్ధము జరిగియుండును.

ఈ గుండ్లపాలెము శాసనములోనే రెండవప్రక్క 40-44 పంక్తులలో కాటమరాజు ఓరుగంటి ప్రతాపుని కాలమున ముప్పదిరెండు సంవత్సరములు రాజ్యముచేసి, పంచలింగాలకొండ దగ్గరనున్న ఎఱ్ఱగడ్డపాటిలో నల్లసిద్ధిరాజుతో యుద్ధము చేసి చనిపోవునాటికి కలియుగము ప్రవేశించి 3965 ఏండ్లాయెనని యున్నది. దీనినిబట్టికూడ యుద్ధకాలమును నిశ్చయింపవచ్చును. క్రీ.పూ. 3101లో కురుక్షేత్ర మహాసంగ్రామము జరిగినదనియు, అదియే కలియుగ ప్రారంభమనియు పండితులు చెప్పుదురు. కావున కాటమరాజుయుద్ధము 3965-3101 = క్రీ శ. 864లో జరిగి యుండవలెను. ఇది మిక్కిలి అసమంజసముగా నున్నది. ఈ యుద్ధమింత ప్రాచీనమనుట హాస్యాస్పదము,

సి పి. బ్రౌనుదొరగారు కాటమరాజుయుద్ధము క్రీ.శ. 1159లో జరిగినదని భావించిరి. వీరు 1842 ఆగస్టు 1[?]వతేదీని వ్రాయించిన "భట్టురాయబార" మను

---

26. కాటమరాజుకథ, పీఠిక, పుటలు xxix, xxx

ప్రతిలో ముఖపత్రమున దొరగారు స్వహస్తములతో నిట్లు లిఖించియున్నారు : "The occurrences described in this poem took place at the time when Bhuja Bala vīra NallaSiddha Dēva Chola Maharaz (a little baron with a long name) ruled Nellore. And it has been ascertained that this was in the year 1081 of Sālivahana or A.D, 1159".[27] ఇందు సంఘటన నల్లసిద్ధికాలముననే జరిగినట్లుగా చెప్పబడినను, యుద్ధకాలము మాత్రము సరిగా నీయబడలేదు. క్రీ.శ. 1159 నాటికి ఖడ్గతిక్కనతండ్రికూడ పుట్టియుండడు.

స్యూయల్ (Sewell) చరిత్రకారుడు సిద్ధిరాజును యాదవులను క్రీ.శ. 12వశతాబ్దమువారుగా నిరూపించెను. ఇది సరికాదు. శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట క్రీ.శ. 1259లో జరిగినదని వ్రాసిరి[28]. మూడవ మనుమసిద్ధి క్రీ.శ. 1248-1267 మధ్య నుండుటయే దీనికి ప్రమాణము కావలెను. వీరగాథలలో చెప్పబడినట్లుగా మనుమసిద్ధి యీ యుద్ధమున చనిపోలేదనియు, క్రీ.శ. 1267 వరకును అతని శాసనములు లభించుచున్నవనియు ఈమె తెల్పియున్నారు. మనుమసిద్ధికిని నల్లసిద్ధికిని అభేదమును పాటించుటచే ఈమె యిచ్చిన యుద్ధకాలము విశ్వసింపదగినది కాదు. ఇందు ఒక తరము వెనుకబడినది. మెకంజీ వ్రాతప్రతులలో ఈ యుద్ధము క్రీ.శ. 1268 లో జరిగినట్లుగా చెప్పబడినది.[29] క్రీ.శ. 1259ని యుద్ధకాలముగా భావించిన యశోదాదేవిగారు 1268ను కూడ కొంతవరకు అంగీకరించుచున్నారు. ఏమైనను ఈ యుద్ధము కాకతి గణపతిదేవుని కాలముననే జరిగినదని ఈమెగారి వాదము : "This battle evidently took place in Ganapathi's reign and not in Prataparudra's as Manmasiddhi, contemporary of Ganapathi, figures as the king in the battle. The

---

27. మద్రాసు ప్ర.ప్రా. లి. పు. భాం. లోని ప్రతి, డి. నెం. 1048.
28. చూ. J.A.H.R.S. Volume xxiii, P. 13.
29. Taylor : Mac. Cat, P. 727, details of battle A.D, 1157.

battle is placed in A.D. 1263 and Manmasiddhi along with Tikka is said to have lost his life in it. Even accepting the date of the battle as A.D. 1263 Manma–siddha did not lose life in that year, as his records attest his rule till A.D. 1267".[30] మనుమసిద్ధి గణపతిదేవునకు సామంతుడనుటలో సందేహము లేదు కాని, కాటమరాజుతో యుద్ధము చేసినది మాత్రము మనుమసిద్ధి కాదు; అతని కుమారుడు నల్లసిద్ధి. ఇతడు ప్రతాప రుద్రుడు యువరాజుగా నున్నప్పుడు నెల్లూరు నేలినవాడు; రుద్రాంబకు సమ కాలికుడు. అందుచే యశోదాదేవిగారి వాదము పరాస్త మగుచున్నది. కాటమరాజు యుద్ధము గణపతిదేవుని కాలమున కాదు, ప్రతాపరుద్రుని కాలముననే జరిగినది. బహుశః ప్రతాపరుద్రుడు యువరాజుగానున్న కాలమున జరిగియుండును. దీనికి గల సాక్ష్యములను నేను వెనుక వివరించియుంటిని.

యశోదాదేవిగారు కాని, మల్లంపల్లివారు కాని కాటమరాజు వీరగాథ లన్నింటిని పరిశీలింప లేదు. అందుచే ఈ చారిత్రకులు కాటమరాజు యుద్ధకాల మును సరిగా అంచనా వేయలేకపోయిరి. యశోదాదేవిగారైనను ఒక సంవత్సరము (క్రీ.శ. 1259) నిచ్చిరి కాని, మల్లంపల్లివారు యుద్ధకాలమును నిర్ణయించుటకే వీలుకాదని నిస్పృహచెందిరి : ''...... గుండ్లపాలెము శాసనము నందిచ్చిన యుద్ధకాలము సరియైనది కాదు. అందువలన నెల్లూరి నల్లసిద్ధిరాజునకును కాటమ రాజునకును యుద్ధ మెప్పుడు జరిగినదియు నిప్పటికిఁ గల యాధారములతో నిర్ణయించుటకు వీలు కాదు".[31] కాటమరాజు కథాచక్రమున ముప్పదిరెండు వీర గాథ లుండగా, ఒక్క గుండ్లపాలెము శిలాశాసనమును మాత్రమే ఆధారముగా గ్రహించుట పాడికాదు. తాళపత్రములలో చివికిపోవుచున్న ఆ వీరగాథలలోని చారిత్రకాంశములను గూడ పరిశీలింపవలసియున్నది. అప్పుడే కాలనిర్ణయము సమగ్ర పరిశీలనమగును. ఇట్టి సమగ్ర పరిశీలనము చేసినవారు దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు. ఈ రెడ్డిగారు తమయొద్దనున్న తాళపత్ర గ్రంథములను ఆధార ముగా చేసికొని, ముఖ్యముగా 'ఆవుల మేపు' అను వీరగాథను తీసికొని, కాటమ

30: J.A.H.R.S., Volume xxiii, P. 14.

31, కాటమరాజు కథ, పీఠిక, పుట xxx

రాజు నల్లసిద్ధితో గావించుకొన్న పుల్లరియొడంబడికను, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటను తారీఖులతో సహా నిర్ణయించినారు :

"కాటమరాజుపుల్లరియుద్ధకాలము నిర్ణయించుటకు గుంటూరుజిల్లా సర్వా రావుపేటశాసనము చక్కగా తోడ్పడుచున్నది. అందలి నెల్లూరు చోడవంశము, కాలము పనికివచ్చును.



మన్మ గండ గోపాలుడు, క్రీ.శ. 1297.

ఈ నెల్లూరి చోడవంశమందలి 'నల్లసిద్ధి'యే కాటమరాజుతో పుల్లరి యుద్ధము కావించినట్లు ద్విపదచరిత్ర సూచించుచున్నది.

"తనర వ్రాయించ్చిరి తిక్కనచాత
విరుషు సంవత్సరకాలము కార్తిక
యా శుద్ధ విదియ యలమి గురువారము
... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ...
యిలలోన నలసిద్ధిరాజిచ్చిన కవులు"

(ఆవులమేపు 1—59 దాటి మూకు)

ఈ ద్విపదలో శకవర్షములు చెప్పకపోయినను. శాసనమందలి శా.శ. ౧౨౧౮ అగు, హేమలంబి కాలముకంటే కొంచెము ముందు కాల మనుట కాక్షేపము లేదు. కాకతీయ 'ప్రతాపరుద్ర భూపతి' కాలమునాటిదన వీలున్నది. కాబట్టి, నెల్లూరి పుల్లరికవులు శా.శ. 1208 అగు విషు సంవత్సర కార్తిక శుద్ధ ౨ గురువారము- అనగా 16-10-1281 తేది నెల్లూరు కరణము తిక్కన వ్రాసినట్లు స్పష్టమగుచున్నది. క్రీ.శ. 1281 నాటికి నెల్లూరుచోడరాజు నల్లసిద్ధి రాజ్యము సాగినట్లున్నది. క్రీ.శ. 1282 చిత్రభానులో పుల్లరియుద్ధమూ పరిసమాప్తమయి నట్లు ద్విపద కాలచరిత్ర తెల్పుచున్నది:

'చిత్రభాను సంవత్సరము చెలగి కార్తీక
చెతుర్దశి దినమున శనివారమునాడు
ఆ రాత్రి వేగిన ఆవుల పబ్బమూ'

(ఆవులమేపు, 1-32 తాటి మాకు)

శా. శ. 1204 అగు చిత్రభాను సంవత్సరము కార్తిక బ14 శనివారము 17-8-1282 తేదీతో సమకాలమగుచున్నది." [32]

పైవిధముగా తెల్పిన దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారి అభిప్రాయముతో ఏకీభవించుటకు నాకెట్టి అభ్యంతరమును లేదు. వీరు కేవలము శాసనములనేకాక వీరగాథలను కూడ పరిశీలించిన మనిషి. వీరిది సమగ్ర పరిశీలనము. కాని, క్రీ.శ. 1290 ప్రాంతమున కాకతీయ యువరాజగు ప్రతాపరుద్రుడు నెల్లూరిపై దండెత్తి కుట్రపన్నిన మనుమసిద్ధిని చంపెనని తెల్పు ఆచార్య మారేమండ రామారావుగారి వాక్యములు వెంకట కృష్ణారెడ్డిగారు నిర్ణయించిన కాలమునకు కొంచెము బాధకముగా నున్నవి. దీని నొక విధముగా తొలగింపవచ్చును. మారేమండ రామారావుగారు ప్రతాపరుద్రుడు మనుమసిద్ధిని చంపినది క్రీ. శ. 1290 ప్రాంతమనిరి కాని. సరిగా 1290అని నిర్ధరించ లేదు. అది 1290కి ముందు కావచ్చును,లేదా తరువాత గావచ్చును. ఏమైనను, కాటమరాజుయుద్ధము మనుమసిద్ధి మరణానంతరము జరగినది. మనమగండ గోపాలుడు రాజ్యమునకు వచ్చుటకు ముందు జరిగినది. మనుమగండ గోపాలుడు క్రీ. శ. 1297 ప్రాంతమున నున్నట్లుగా శాసనాధారమున్నది. క్రీ. శ. 1267 వరకును మనమసిద్ధి శాసనములు లభించుచున్నవని యశోదాదేవిగారు తెల్పుచున్నారు. కాబట్టి యీ యుద్ధము క్రీ. శ. 1267-1297 మధ్యకాలములో ఎప్పుడో జరగియుండును. ఇది ప్రతాపరుద్రుని కాలమున జరగెనని గుండ్లపాలెము శాసనమును, వీరగాథలును తెల్పుచున్నవి. ప్రతాపరుద్రుని పాలనాకాలము క్రీ. శ. 1296-1323. కాని యితడు యువరాజుగానున్నప్పుడు మనుమసిద్ధిని చంపెనని మారేమండ రామారావుగారు తెల్పుచున్నారు. ఇతడు రుద్రమదేవి పాలనాకాలము (1262-1296)లో క్రీ. శ. 1280 లో యౌవరాజ్య పట్టాభిషిక్తు డయ్యెను. అందుచే కాటమరాజు-నల్లసిద్ధిరాజుల యుద్ధము క్రీ. శ.

32. 'కాటమరాజు : పుల్లరి యుద్ధకాలము', కలగూరగంప, భారతి, జూలై 1966, పుట 76.

1267-1297 మధ్య జరగెననుట కన్న క్రీ. శ. 1280-1297 మధ్య జరగెన నుట మరింత సమంజసము. ఆ యుద్ధము జరిగిన సంవత్సరము దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు చెప్పినట్లుగా క్రీ. శ. 1282 కావచ్చును. అదియే చిత్రభాను సంవత్సరమగుట వీరివాదమునకు మరింత బలము నొసంగుచున్నది. క్రీ. శ. 1290 ప్రాంతమున మనుమసిద్ధి ప్రతాపరుద్రునిచే చంపబడెనను మారేమండ రామారావు గారి వాక్యములనే ఆధారముగా గైకొన్నచో, ఈ యుద్ధము క్రీ. శ. 1290-97 మధ్యకాలములో జరిగియుండునని చెప్పవలెను.[33]. మొత్తమునను ఈ యెఱ్ఱగడ్డ పాటి పోట్లాట క్రీ. శ. 1280-1297 మధ్యకాలము (అనగా రుద్రమదేవి చివరి కాలము - ప్రతాపరుద్రుని యౌవరాజ్య కాలము)లో జరగెననుట నిస్సంశయము. చిత్రభాను సంవత్సరమునకు క్రీ. శ. 1282 సరిగా సరిపోవుటవలన అదియే యుద్ధకాలము కావచ్చును.

8 యుద్ధకారణములు : -

కాటమరాజు కడప కర్నూలు మండలములలో లంకమల, పాలకొండ, నల్లమల మున్నగు పర్వతారణ్య ప్రదేశములందు తన విస్తారమైన గోగణమును మేపుకొనుచు, అచ్చట అనావృష్టిచే పశువులకు కసవు లభింపమి నెల్లూరుసీమకు వచ్చి, నల్లసిద్ధిరాజుతో తన మందలో పుట్టెడి కోడెదూడలను పుల్లరిగా నిర్ణయించుకొని, నెల్లూరిసీమలోని పచ్చిక బీళ్లను మేపుకొనుచు, ఒడంబడికకు విరుద్ధముగా వరిపైరులను గూడ మేపివైచుట; యాదవులు అరణ్యములలోని కిరాతుల జీవన భృతికి అడ్డుతగులుట; నల్లసిద్ధిరాజు ఉంచుకొనిన భోగముదాని పెంపుడు చిలుకను కాటమరాజు బంధువులు చంపుట- అను మూడు కారణములచే యుద్ధము సంప్రాప్తమైనదని స్థానిక చరిత్రలు పదునెన్మిదవ సంపుటములో వివరముగా నున్నది.[34].

---

33. రాజవంశ ప్రదీపికాకర్తయగు బత్తుల లక్ష్మయ్యగారు కాటమరాజు యుద్ధము క్రీ. శ. 1300లో జరిగినదని వ్రాసిరి (చూ. రాజవంశ ప్రదీపిక, పుట. 188). కాని దీనికి గల ప్రమాణమును మాత్రము వారు చూపలేదు.

34. చూ. కాటమరాజుకథ, మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పీఠిక, పుటలు xii,xiii,

కాటమరాజు, పుల్లరి ఒప్పందము తరువాత, నెల్లూరు రాజ్యములోని అరణ్యములందు పశువులను మేపుకొనుచు, అచ్చట కూడ అనావృష్టిచే కసవు లభ్యము కాకపోగా, నెల్లూరుసీమలోని పైరుచేలను మేపినట్లుగాను, అదియేయుద్ధకారణమైనట్లును పట్టపురావి కైఫీయతులలో గలదు: " ....... ఈ ప్రకారం కొన్ని దినములు జరిగిన తరువాతను నెల్లూరిసీమలోను మహత్తు అయిన క్షామం వచ్చి వర్షంలేక పచ్చికపట్లు యెండిపోయి అరణ్యములయందున్న కసవులేక కాటమరాజువారి గోసంరక్షణ అయ్యేది బహు ప్రయాసము కాగా నెల్లూరిసీమలో కపిల బావుల ఆసరాను యేరుల ఆసరాను యెక్కడెక్కడ ఆకరం చేసిన పైరు వుండగా కాటమరాజువారు గోగణమును ఆ పైరులకు తోలుక పోయి పొలాలు మేపినారు. అందువల్ల నెల్లూరి నల్లసిద్ధదేవ చోళ మహారాజులవారికిన్ని కాటమరాజువారికిన్ని విరోధంపుట్టి......" 35.

నల్లసిద్ధిరాజు వేశ్యయొక్క పెంపుడు చిలుకను చంపినది కాటమరాజు పినతండ్రియగు పోలమరాజు (పోలురాజు) అని స్థానిక చరిత్రలలో గలదు. ఇది అసమంజసము. కాటమరాజు నెల్లూరిసీమలో పశువులను మేపుకొనుచున్నప్పుడు పోలురాజు లేడు. పెద్దిరాజు మరణించినప్పుడే ఆతని నల్వురు సోదరులును వివిధ ప్రదేశములలో చనిపోయినట్లు వీరగాథలలో గలదు . పోలురాజు చిలుకమఱ్ఱి రాజ్యమున ముక్కంటిచే హతుడయ్యెను. ఆ పోలురాజుపగ తీర్చుకొనుటకే కాటమరాజు సిద్ధిరాజు రాజ్యమున ప్రవేశించెను. సిద్ధిరాజు వేశ్యయొక్క పెంపుడు చిలుకను పల్లికొండ వారించుచున్నను వినక, కాటమరాజే స్వయముగా చంపెనని గాథాకారులు చెప్పుచుందురు. నాకు లభించిన తాళపత్ర గ్రంథమున చిలుకను చంపినది పద్మరాఘవుడని యున్నది.

సాంప్రదాయికముగా కాటమరాజుకథలను గానముచేయు గాథాకారులు యుద్ధకారణములను మరియొక రీతిగా చెప్పుచున్నారు: నల్లసిద్ధి నల్లమల ప్రాంతారణ్యమున కొంత భూమిని తన సోదరియగు కుందమాదేవికి అరణముగానిచ్చెను. కాటమరాజు, వర్షాభావమువలన కరవేర్పడగా తన గోవులకు పూరియు నీరునులేక, పద్మనాయని ప్రోత్సాహముతో నల్లసిద్ధి ఆస్థానమునకువచ్చి, అతని బీడులలో

35. కాటమరాజు కథ, మల్లపల్లి సోమశేఖరశర్మగారి పీఠిక, పుట. xix

తన పశువులను మేపుకొనుటకు అనుమతినీయవలసినదని ప్రార్థించెను. అందుల కుగా సంవత్సరమున కింతయని పుల్లరి యిత్తునని ఆతడొప్పుకొనెను. కార్యావసర మును బట్టి తనసోదరికి తరువాత తెలుపుకొనవచ్చునని ఆపెపక్షమున తానే కాట మరాజు కడ కవులు పత్రములు వ్రాయించి పుచ్చుకొనెను. నల్లసిద్ధి సోదరికి ఈ విషయము తెలియదు. కాటమరాజు ఆ నాటి నుండియు నల్లమల ప్రాంత భూము లలో తన పశువులను మేపుకొన దొడగెను. తన యనుమతి లేనిదే తన భూము లలో కాటమరాజు పశువులను మేపుకొనుచున్నాడని తెలిసి కుందమాదేవి మిక్కిలి కోపించి, ఆతని పశువులకు నష్టము కలిగింపవలసినదని అచటి బోయలకాజ్ఞాపిం చెను. వారును అట్లు చేయుచుండగా, కాటమరాజు నల్లసిద్ధియే యిట్లు తన పసవు లను చంపించుచుండెనని భావించి, ఆతనియెడ మిక్కిలి కుపితుడై యుండెను. ఇంతలో సంవత్సరము మితి గడచినది. కాటమరాజు కడనుండి పుల్లరి వచ్చునే మోయని నల్లసిద్ధి యెదురు చూచుచుండెను. ఆతడు పుల్లరి చెల్లించు ప్రయత్నము నను లేడని తెలిసి నల్లసిద్ధి ఆతని కడకు రాయశృంగారపతియను నొక భట్టును పంపెను. కాని కాటమరాజు, నల్లసిద్ధి అనుమతినిచ్చినట్లేయిచ్చి, అడవులలో మేయుచుండిన తన పశువులను వధియించెననియు, అతనికి తాము ఈయవలసిన పుల్లరికిని–తమకు కలిగిన నష్టమునకును సరిపోయినదనియు, అందుచే ఆతనికి చెల్లింప వలసినదేమియు లేదనియు భట్టునకు దెలిపెను. రాయబారము విఫలము కాగా, భట్టు నెల్లూరికి తిరిగి వచ్చెను. కాటమరాజు గోవులమందలో నష్ట మేర్పడిన విషయము తనకు తెలియకపోవుటచే, పుల్లరి నెగవేయుటకే కాటమరాజు ఆ యెత్తు వేసినాడని నల్లసిద్ధి భావించి, ఆతని మిదికి యుద్ధమునకుబోవ నిశ్చయించెను.[36]

కుందమాదేవి కారణముగా కాటమరాజును నల్లసిద్ధియు ఒకరిపైనొకరు అపోహపడిరని పైన తెల్పిన విషయమునుబట్టి తెలియుచున్నది. కాని యీ కారణ ములో రెండు అసంగతములున్నవి. పుల్లరి వ్రాయించుకొనిన విషయము నల్లసిద్ధి తన సోదరికి సంవత్సరాంతము వరకును చెప్పకుండుట; పరిస్థితి యుద్ధము వరకు

---

౩౬. ఈ కారణమును ఆచార్య తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు తమ వ్యాస ములో సుట్టకించియున్నారు. కాని నల్లసిద్ధికి బదులు మనుమసిద్ధి నామమును ప్రయోగించి వ్రాసిరి. [చూ. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1953-54). పుట 33].

వచ్చినను కుందమాదేవి తాను పశువులను ప్రవేయించిన విషయము తన సోదరునకు తెలుపకుండుట. ఈ రెండును అసమంజస విషయములు. అసలు కుందమాదేవి నల్లసిద్ధి చెల్లెలుగా ఏ వీరగాథలోను లేదు. ఈమె నల్లసిద్ధి రెండవ భార్య యనియు, తన పెంపుడు చిలుకను కాటమరాజు పరివారములోని వారు చంపుటచే, బోయలను ప్రోత్సహించి వారి పశువులను ప్రవేయించెననియు, కాటమరాజువారు కోపించి, బోయలను చంపి, పుల్లరి నెగవేసిరనియు వీరగాథలలో గలదు. స్థానిక చరిత్రలలో కుందమాదేవి పేరు లేదు కాని 'నల్లసిద్ధిరాజుగారి బోగంది' అని కలదు.

యుద్ధ కారణములను గూర్చి కనిగిరి సీమలోని గాథాకారులు నాకు ఈ క్రింది విషయములను జెప్పిరి:-

కాటమరాజు నల్లసిద్ధిరాజు సభలోనికి పోయి, పచ్చిక బీళ్లను పుల్లరి కిమ్మని కోరగా, యాదవులు వెట్టివారనియు, వారి దగ్గరనుండి అత్యధికముగా ధనమును గుంజ వచ్చుననియు నల్లసిద్ధి తలచి, పుల్లరి ఒడంబడికలో ఎక్కువ నియమముల నుంచెనట: నల్లసిద్ధిరాజు యాదవులను జూచి—

"ఆకు రాసే కరణానికి ఆరువేల వరహాలు
ఎఱసిద్ధిరాజుకు ఏడువేల వరహాలు
పాపసిద్ది రాజుకు పదివేల వరహాలు
కొండికసిద్ధిరాజుకు కోటివేల వరహాలు
కుందమాదేవులకు కుంకుమ పసుపులకు
పదివేల వరహాల పైక మిచ్చేరా ?"[37]—అని ప్రశ్నించినాడట.

"ఆరుపుట్ల నేయి మాది, ఆవుకు పుట్టిన కోడెల్ల మాది" అని కూడ నియమమును జెప్పెనట. కాటమరాజు ఆతని దురాశను గ్రహించి, తెలివిగా మరియొక నియమమును జెప్పెనట: "ఆవుకు పుట్టిన కోడెల్లమీది, నీరున పుట్టిన పూరెల్లమాది" అని ప్రకటించెనట. నల్లసిద్ధిరాజు అందులకు అంగీకరించెను. ఈ ఒప్పందముచే పచ్చిక బీళ్లేకాక, వరి పొలములును యాదవులవే యగుచున్నవి. వరి కూడ నీరున పుట్టినదేకదా ! అందుచే వరి పొలములను మేపుకొనుటకు కూడ యాదవు

37. నెల్లూరు జిల్లా, దర్శితాలూకా, గంగదొనకొండ గ్రామమునకు చెందిన పూజారి సుబ్బయ్య అను వృద్ధగాథాకారుడు 12-9-1966న నాకు పాడి వినిపించినది.

లకు హక్కున్నదట! పైగా, కుందమాదేవి 'చుండి'[38] బోయలచే కాటమరాజు యొక్క ఆవులను చంపించిన తరువాతనే యాదవులు కోపముతో పైరుచేలను మేపినారట. అంతకు పూర్వము పచ్చిక బీళ్లలోనే మేపుకొనుచుండిరట. "సీరున పుట్టిన పూరెల్ల మాది" అనుటచే పరిపాలనములేకాక, నెల్లూరి ప్రజలును యాదవుల సొత్తే యగుదురని యీ గాథాకారులు వాదింతురు. మానవుడును నీటిలోనుండిపుట్టిన వాడే సట! "ఆవుకు పుట్టిన కోడెల్ల మీది, సీరున పుట్టిన పూరెల్ల మాది" అని యాదవులు రాగి శాసనము వ్రాయించుకొనిరి. దేవసాక్షులను బెట్టుకొనిరి. అందుచే కాటమరాజుగారి తప్పేమియు లేదని కనిగిరి సీమలోని గాథాకారులు వాదించు చున్నారు.

ఈ పుల్లరి ఒడంబడికను, యుద్ధమునకు దారి తీసిన కారణములను సమగ్రముగా చర్చించు వీరగాథ 'జన్నివాడ కథ'. దీనికి 'పుల్లరి కథ, దక్షిణాది ఆవుల మేపు, ఆవుల మేపులు-దక్షిణకాండము, చదరంగము కథ' అను నామాంతరములున్నవి. ఈ కథ గల తాళపత్ర గ్రంథము నాకు కృష్ణామండలమున 1964 లో లభించినది. అందు కనిగిరి సీమలోని యాదవ గాథాకారులు పైన చేసిన వాదమును పూర్వ పక్షము చేయు అంశములు అనేకములున్నవి. చుండి బోయలు ఆవులను వ్రేయుటకు ముందుగానే కాటమరాజు పైరుచేలను మేపినట్లుగా ఈ కథలో నున్నది. స్థానిక చరిత్రలు పదునెన్మిదవ సంపుటములో కూడ ముందు కాటమరాజు నెల్లూరి సీమలోని వరిపైరును మేపినట్లును, తరువాత కుందమాదేవి చిలుకను యాదవులు చంపినట్లును, ఆమె ఆలమందను పొడిపించి నట్లును గలదు. వర్షాభావముచే పచ్చికబీళ్లు ఎండిపోగా కాటమరాజు నెల్లూరు రాజ్యములోని వరిచేలను మేపినట్లుగా పట్టపురావికైఫీయతు కూడ సాక్ష్యమిచ్చు చున్నది. కుందమాదేవి ఆవులను చంపెనను కోపముతో యాదవులు వరిచేలను మేపినట్లుగా ఎచ్చటను లేదు. "సీరున పుట్టిన పూరెల్ల మాది" అను ఒప్పందముచే

---

38. 'చుండి' అనునది ఒక బోయపల్లె. కనిగిరినుండి నెల్లూరుకు పోవు మార్గములో పామూరు - నెల్లూరు మధ్యకలదు. ఈ బోయపల్లె పాలకులను 'బోయ దొరలు' అందురు. కుందమాదేవి యీ గ్రామమునుండి బోయలను రప్పించి, కాటమరాజు యొక్క ఆలమందను పొడిపించెనని గాథా కారులు పాడుచుందురు.

వరిచేలును, కడకు నెల్లూరి ప్రజలును యాదవుల సొత్తగుననుట పిడివాదము. పచ్చిక బీళ్లవరకే యాదవులహక్కు పైగా,కాటమరాజు నల్లసిద్ధితో ఏదోవిధముగా తగువు పెట్టుకొని, పోలురాజునాటి పగలు తీర్చుకొనవలెనను సంకల్పముతోనే నెల్లూరి సీమకు వచ్చినట్లుగా 'జన్ని వాడ కథ'లో స్పష్టముగా నున్నది. కాటమ రాజు తన విస్తారమైన పశుగణమును మేపుకొనుచు, దేశమంతయును పరి భ్రమించుచు, తన తండ్రులనాటి పగలను తీర్చినట్లుగా ఈ కథలో చెప్పబడినది. ఈ కథా ప్రారంభమున కాటమరాజు తన సోదరులను పిలిచి, తమ తండ్రి తాతల పగవారి నందరిని తాను చంపితిననియు, ఇక పోలురాజు పగవాడైన ముక్కంటి వంశములోని వాడగు నల్లసిద్ధితో పోరాడవలెననియు, అతనితో పొందు చేసికోరాదనియు నిట్లు చెప్పెను:

"ముందు మన పెద్దలు మూడు లోకములు
కద నిల్పె వలురాజు ఘనుడు మనతాత
అతని కుమాళ్లు ఎంచితే అతిబాలదేవులు
పంచమవేదాంతులు బల్లిదు రేగుకను
మించిన దేశాధిపతులు మెచ్చికొనియాడ
వంచితమ్ముగ కవులావులు పాళ్ల పంచుకోని
అంచితమ్ముగ పుణ్యులై అటుచెల్లినారు
వారిని చంపిన వారిని తాజెప్పెద వినుడి
ముత్తాత పగవాణ్ణి మొత్తివేసితిని
తమ తాత పగవాణ్ణి సంహరించితిని
సింహాద్రిరాజు పగవాణ్ణి చేరవేసితిని
పెద్దిరాజు పగవాణ్ణి పెరికి వేసితిని
ఎఱనూక రాజు పగవాణ్ణి ఏపణగించితిని
నలనూక రాజు పగవాణ్ణి నరికివేసితిని
పోలురాజు పగవచ్చె తమ్ములారా ! పోరాదు మనము
వాడు దగ్గరకు వచ్చెను సిద్ధిరాజుల వారికి మనకు
పొందులు చేసికొని పోరాదు మనము"[39]

39. 'జన్ని వాడ కథ', తాళపత్ర గ్రంథము, కుచ్చికాయలపూడి ప్రతి, ఆకులు 1,2.

దీనినిబట్టి నల్లసిద్ధిరాజు తాతచోడ తిక్కయో, లేక తండ్రి మనుమసిద్ధియో, కాటమరాజు పినతండ్రియగు పోలురాజును చంపెనని చెప్పవచ్చును. చోడ తిక్కరాజే చంపియుండును. దీనికొక దృష్టాంతము కలదు. ... శాసనములో "చోడాని కాలమున పల్లురాజాద్యా ... పోలురాజాద్యా ..." అని కలదు. కావున చోడ తిక్కరాజు పోలురాజును సమకాలికుడుగా చెప్పబడు చున్నాడు. 'చోడాని' పంపిన 'ముక్కంటి'చే పోలురాజు హతుడయ్యెనని పోలు రాజు కథలో గూడా నున్నది. కాబట్టి చోడతిక్కరాజే (క్రీ.శ. 1200-48) పోలురాజును చంపి యుండునని నేను ఊహించుచున్నాను. కాని ఈ చోడాని శ్రీరంగ పట్టణము నేలుచున్నట్లుగాను కావేరికి కట్టకట్టించినట్లుగాను పోలురాజు కథలోనున్నది ఇది నల్లసిద్ధి పల్లవరాజులకంటె ... కావచ్చును. [చరిత్రలోని త్రిలోచనపల్లవుడే పోలురాజుకథలో 'ముక్కంటి' గాను, కరికాల చోళుడే 'చోడాని'గాను పేర్కొనబడినారని అనుమానించుటకు వీలున్నది. కాని వారి కాలములు అతుకవు] ఈ జన్నివాడ కథలో కుందమాదేవి నల్లసిద్ధిరాజునకు రెండవ భార్యగా చెప్పబడినది. ఈమె ... చిలుక ... లోనికి వచ్చి కూయుచుండగా కాటమరాజు అలుకుచు బెదరగనియు, ఆయనచే పద్మనాభుడు (కాటమరాజు చెలికాడు) దానిని బాణముతో కొట్టినాడనియు ఈ కథలో గలదు.

8. న్యాయాన్యాయములు :-

ఇరు పక్షములవారును ఎవరికివారు తమదే న్యాయమనియు, ఎదుటివారిది అన్యాయమనియు భావించినప్పుడే యుద్ధము వచ్చును. ఏ యుద్ధమందును ఒక పక్షమువారిది న్యాయమనియు, మరియొక పక్షమువారిది అన్యాయమనియు మనము చెప్పలేము. పాక్షిక దృష్టితో వ్రాయబడిన కావ్యములనుగాని, పాడబడు వీరగాథలనుగాని నమ్మరాదు. రామాయణ మహాభారతములవంటి గొప్ప ఇతి హాసములే పాక్షిక దృష్టితో వ్రాయబడినవని కొందరు విమర్శకుల అభిప్రాయము. ఈ దృష్టి వీరగాథలలో మరింత స్పష్టముగా గోచరించును. పల్నాటి వీరకథలు బ్రహ్మనాయని పక్షమువైపు మొగ్గుచూపి, అతనిని సాక్షాత్తు విష్ణుమూర్తిగా చిత్రించుచు రచింపబడినవి. ఇందు నాగమ్మ బహు దుష్టురాలుగా చూపబడినది. నిజమున కామె గొప్ప రాజకీయ ప్రజ్ఞాధురంధరురాలు. బొబ్బిలికథ బొబ్బిలి రాజుల యందభిమానము చూపుచు వ్రాయబడనది. ఇందు విజయరామరాజు పాత్ర

చాల సీచముగ చిత్రించబడినవి. ఇదీ సత్యదూరమగు చిత్రణము. కాని కాటమ రాజు కథలు వీరగాథా కవిత్వమున తప్ప బుట్టినవని చెప్పవచ్చును. కటియావుల రాజు కథలో ఆతని శౌర్యసాహసము లెట్లు కీర్తింపబడెనో, చల్లవారి జగడములో ఖడ్గతిక్కన శౌర్యసాహసములును అట్లే చిత్రింపబడినవి. చల్లవారి జగడమునకు 'తిక్కనామాత్యుని కథ' అను నామాంతరము కూడ కలదు. ఇది యాదవ గాథా కారుల యొక్కయు, కవుల యొక్కయు హృదయ వైశాల్యమునకు గీటురాయి. లేగ దూడలవంటి అమాయకులైన యాదవుల నిర్మల హృదయమించు ప్రత్యక్ష మగుచున్నది: కావున యుద్ధములోని న్యాయాన్యాయములను విచారించుటకు నిష్పక్షపాతముగా రచింపబడిన యాదవరాజుల వీరగాథలే మనకు సాక్ష్యములు.

నల్లసిద్ధి రాజ్యములోని వరిపైరులన్నియును కాటమరాజు యొక్క గోగణ ముచే నాశనమైనవి-ఇది సత్యము. కాటమరాజు యొక్క ఆలమంద బోయలచే పొడువబడినది-ఇదియును సత్యమే. ఇట్లిరువురకును నష్టము వాటిల్లి నను మొదట చేసికొనిన ఒడంబడికను మీరుట మాత్రము పాడికాదు. తమకు నష్టము వాటిల్లిన దని తెలిసికొనిన మరుక్షణమే ఒడంబడికను రద్దు చేసికొని, అప్పటివరకును ఒడంబడికలో నున్న ప్రకారము పాటించి, ఎవరిదారిని వారు పోయినచో యుద్ధము జరిగెడిదికాదు. కాని కాటమరాజు అట్లు చేయలేదు. తనకు కలిగిన నష్టమును పుల్లరిని ఎగవేయుట ద్వారా 'భర్తీ' చేసికొన్నాడు. ఇది ఒడంబడికకు విరుద్ధము. ఒడంబడిక రద్దు చేసికొని తిరిగి పోవునాటి వరకును, లేదా బోయలు పశువులను చంపు నాటి వరకును నల్లసిద్ధికి చెందవలసిన కోడెదూడల నిచ్చియుండవలసినది. కాని కాటమరాజు నెల్లూరిసీమ నుండి వెడలిపోవుచు, ఒడంబడిక ప్రకారము నల్ల సిద్ధికి చెందవలసిన కోడెదూడలను సహితము తరలించుకొని పోయినాడు. ఈ విష యము పట్టపురావికై ఫీయతులో స్పష్టముగా నున్నది: "......నెల్లూరి నల్లసిద్ధ దేవ చోళ మహారాజుల వారికిన్ని కాటమరాజు వారికిన్ని విరోధం పుట్టి కాటమ రాజువారు తమ గోగణమును అదివరకు మందలో వున్న కోడెదూడలు సహా మళ్లించుకుని నెల్లూరిసీమ విడిచి పట్టపురావికిన్ని పినాకినీ నదికిన్ని వుత్తర భాగ మందుల పైన వ్రాసిన పర్వత ప్రదేశముకు లేచి వస్తుండగా ......"[40], పుల్లరి

---

40. చూ. కాటమరాజు కథ, పీఠిక, పుట xix

యొడంబడిక ప్రకారము 'అడివరకు మందలో వున్న కోడెమావలు' నల్లసిద్ధికి చెందును. వానిపై కాటమరాజునకు హక్కులేదు. అతడు తన గోగణమును మాత్రమే మరలించుకొని పోవుట బాగుండును. కాని కాటమరాజు 'అడివరకు మందలో వున్న కోడెమావలు సహా మళ్లించుకొని' పోయినాడు. ఇది సంధ్యమునకు కాలుదువ్వుటయగునంటిని. మొదట, ఒడంబడిక ప్రకారము పుల్లరి నిచ్చి కసి, తరువాత తనకింత నష్టము వచ్చినదనియు, దానికి పరిహారము చెల్లింపవలసినదనియు నల్లసిద్ధిని కోరియుండవచ్చును. లేదా మధ్యవర్తులను నియమించి న్యాయము చేయ హా ర్పుడని యడుగవచ్చు; రాయబారము పంపవచ్చును. ఇట్లు చేయక పోవుట కాటమరాజులోని తొందరపాటు సూచించును. ఈ తొందరపాటునకు కారణము పోలురాజు నాటి ప్రాత పగయే కావచ్చును.

అట్లే ఒక ప్రక్క పుల్లరిని చేసికొనుచు, తన రాజ్యమున మేయుచున్న గోగణముల క్షేమమునరయకుండుట నల్లసిద్ధి తప్పు. ఒకదానినుండి ఫలితమును పొంద గోరినప్పుడు దానిని సంరక్షింపవలసిన బాధ్యతయు మనపైనుండును గదా! కుందమాదేవి చుండిబోయలచే గోహత్య చేయించునప్పుడు, నల్లసిద్ధి దానిని ముందుగా తెలిసికొని వారించియుండవలసినది. అతడట్లు చేయలేదు. గోహత్య నుపేక్షించుట ఈ రాజు కావించిన మహానేరము!

కాటమరాజును నల్లసిద్ధియు తమతమ విద్వేషములను వితర్కించుకొని సర్దుకొనెడి వారే! కాని కుందమాదేవి వారిరువురిమధ్యను స్పర్థను రగుల్కొల్పిన ట్లుగా కనబడుచున్నది. కాటమరాజునకు "కుదిరితే అరామడ చెదిరితే పన్నెండామడ" విస్తరించియుండు గోగణమున్నది. క్షామమేర్పడి నప్పుడు ఇంత పెద్ద గోగణమును పోషించుట ఎంత కష్టమో ఊహించుకొనుడు. అతడు శ్రీశైల ప్రాంతమున క్షామము వచ్చుటచే నెల్లూరి సీమకు తరలి వచ్చినాడు. అతని దురదృష్టముచే ఈ నెల్లూరిసీమయందును వర్షాభావముచే పశువులకు కసవు కరవయ్యెను. ఆకలిచే నకనకలాడు ఆ పశువులను పట్టుట దుర్భరమై వరిపొలములపైకి వదలియుండును. లేదా ఆ పశువులే పొరపాటున, పాలకుల ప్రమత్తత వలన పైరు చేలలో పడియుండవచ్చును. ఈ కారణముచే అతని ఆలమందను పొడిపించుట మహాపాపము! 'పశువులను జాగ్రత్త పరచుకొనుము' అని హెచ్చరించినచో సరిపోయె

డిది. ఈదుష్కార్యమును కుందమాదేవి చేయించినది. దీనిని నల్లసిద్ధియే చేయించి నాడని కాటమరాజు ఆపోహపడినాడు. కావున ఈయుద్ధమునకు ప్రధాన కారణము కుందమాదేవియే. కాటమరాజు-నల్లసిద్ధి : ఈయిరువురును నిర్దోషులేయని నా నమ్మకము.

ఈ దుష్కార్యము చేసిన కుందమాదేవికిని ఒక కారణమున్నది. తన పెంపుడు చిలుకను యాదవులు చంపినారనుట యీ కారణము. ఇది బలమైన కారణము కాదు. పెంపుడు చిలుకను చంపినంత మాత్రమునగోహత్యకు పూనుకొనుట మహాపాపము. అది పెంపుడుచిలుక యని యాదవులకు తెలియదు. దాని కూతలకు గోవులు మేతలు మాని బెదరి లేగలను త్రొక్కుకొనుచు పారిపోవుచున్నవి. అట్టి పరిస్థితులలో పశులకాపరులు దానిని కూల్చుట తప్పుకాదు. బాణప్రయోగము జరిగిన తరువాత మాత్రమే అది పెంపుడు చిలుకయని యాదవులు గ్రహించిరి.

10. జయాపజయములు :-

పల్నాటి వీరకథలలో బ్రహ్మనాయడు విజయుడైనట్లుగనే కాటమరాజు కథలలో యాదవులే విజయులైనట్లుగా వర్ణింపబడినది. యుద్ధానంతరము కాటమరాజును అయితమరాజును సజీవులైయున్నట్లు కలదు. దేవతలు పుష్ప వర్షము కురిపింపగా, మరణించిన యాదవవీరులును, ఆవులును, ఎద్దులును తిరిగి బ్రతికినట్లుగా వర్ణింపబడినది. (చూ. కాటమరాజుకథ, వేటూరి వారి పరిష్కృతము, పుట 152) కాని స్థానిక చరిత్రలనుబట్టి నల్లసిద్ధియే విజయుడని తెలియుచున్నది. మల్లంపల్లి సోమశేఖరశర్మగారును ఈయభిప్రాయమునే వ్యక్తము చేసిరి :

Finally, thus Yadavas are said to have become victorious according to this work; but Local Records say that the King Nallasiddhi carried the day[41]

11. కాటమరాజు వంశవృక్షము :-

కాటమరాజు చంద్రవంశ క్షత్రియుడు. చంద్రుని నుండి కవులాపుల గంగురాజువరకును పూర్వవంశము; అక్కడ నుండి కాటమరాజువరకును ఉత్తర

41. Katamaraju Katha, Preface- p. xi

వంశము. పూర్వవంశము పౌరాణికము; ఉత్తరవంశము చారిత్రకము. యాదవుల పూర్వవంశ వృత్తాంతమంతయు గుండ్లపాలెము శాసనములో వివరముగానున్నది. ఇది వైశంపాయనుడు పరీక్షిత్తునకు చెప్పినట్లుగాగలదు.- ఆదిలో కశ్యపుడను వైవస్వతమనువు జన్మించెను. ఆ వైవస్వతమనువునకు యముడు, శనేశ్వరుడు అను ఇర్వురు కుమారులును; యమున, తపతి అను ఇద్దరు కూతుండ్రును; బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులైన మానవులును పుట్టిరి. ఈ చతుర్విధ మానవులకు నేత ప్రముఖులైన రాజు లెనమండుగురు జన్మించిరి. - ఇక్ష్వాకుతో ఈ వంశక్రమము తెగిపోయినది. దీని తరువాత 'ఆ ముని పుత్రికయైన ఇలగన్యకు, సోమపుత్రుడైన బుధునకు పురూరవ చక్రవర్తి పుట్టె' అని కలదు. ఇచట 'ఆ ముని' అనగా ఎవరో తెలియరాదు. కశ్యపుడు కావచ్చును. చంద్రుని నుండి వంశక్రమము ఈ క్రింది విధముగానున్నది:

"చంద్రుడు - బుధుడు (భార్య: ఇలగన్య) - పురూరవ చక్రవర్తి - ఆయువు నహుషుడు — యయాతి - యదువు - ఆసూరుసుడు - వసుదేవుడు - కృష్ణుడు - వజ్రధరుడు — దధిసంగుడు; కృష్ణుని రెండవకుమారుడు అప్పల గోపాలుడు - - ౦ - ఉపనందు - అమృతాంభోజుడు - వినయాంభోజుడు - వరకాంభోజుడు - గజాయాంభోజుడు — రాయాంభోజుడు - రత్నాంభోజుడు - వీరవిజయురాజు - పద్మనరాజు - శ్రీకూర్మిరాజు - సింహాద్రిరాజు - వల్లురాజు - పోలురాజు - కాటమరాజు".

కాని యీ శాసనములో తప్పులు మెండుగా నున్నవి. యాదవుల పూర్వ వంశమే కొంత విపరముగా చెప్పబడినదికాని ఉత్తరవంశము మిక్కిలి అసమగ్ర ముగ నున్నది. వలురాజు పుత్రులు పౌత్రులు సరిగా చూపబడలేదు. వలురాజు తరువాత పోలురాజును, అతని తరువాత కాటమరాజును గలరు. కాటమరాజునకు పోలురాజు పినతండ్రియేకాని తండ్రికాదు. కాటమరాజు తండ్రి పెద్దిరాజు. వలు రాజునకైదుగురు పుత్రులుండగా, ఐదవ వాడగు ఒక్కపోలురాజు మాత్రమే చెప్పబడినాడు. పెద్దిరాజాదులులేరు. అట్లే వలురాజు తండ్రియగు గంగురాజును ందులేడు. పూర్వవంశమున గూడ కృష్ణుని తరువాత ఉపనందుని వరకును ంశక్రమము సరిగాలేదు.

యాదవుల పూర్వవంశమును గూర్చి 'రాజవంశ ప్రదీపిక'లో సర్వ సమగ్రముగ నున్నది. ఇందు నారాయణమూర్తి - బ్రహ్మ - అత్రి - చంద్రుడు - బుధుడు - పురూరవుడు మున్నగువారు మొదలుగా కలియుగ ప్రారంభమునగల పరీక్షిన్మహారాజు వరకునుగల 617 మంది చంద్ర వంశజుల నామములు, పుత్ర పౌత్రాది బాంధవ్యములు సంపూర్ణముగా నీయబడినవి. ఇది మొదటి భాగము. రెండవ భాగమున కలియుగములోని చంద్రవంశ క్షత్రియులు తెలుపబడినారు. అందు యదు వంశ క్షత్రియులను గురించి వ్రాయబడిన విషయములను ఈ క్రింది విధముగా చూపవచ్చును : -



బత్తుల లక్ష్మయ్యగారు రచించిన రాజవంశ ప్రదీపికలో మూడు దోష ములు కొట్టవచ్చినట్టు కనబడుచున్నవి: (i) వీరగాథలనుబట్టి, కవులావుల గంగు రాజునకు నల్గురు పుత్రులనియు, వారిలో ఆవుల వలురాజు జ్యేష్ఠుడనియు, ఆ వలురాజునకుసింహాద్రిరాజాదులైదుగురుతనయులనియు తెలియుచుండగా, రాజవంశ ప్రదీపికలో ముగ్గురు వలరాజులు,ఇద్దరుగంగురాజులుచెప్పబడిరి.సింహాద్రిరాజునకు గంగురాజు మూడు తరముల పైవానిగా చూపబడినాడు. ఇది సరికాదు. సింహాద్రి రాజు పితామహుడే గంగురాజు. ఈ గంగురాజు తండ్రి మరల వలరాజని లక్ష్మయ్యగారువ్రాసిరి. దీనికేమి ప్రమాణమున్నదో తెలియదు. నాకు లభించిన తాళపత్రగ్రంథము (జన్నివాడకథ) లో గంగురాజుతండ్రి 'యమాద్రి' అని యున్నది. గోవుల నాగేశ్వర కవిగారు తమ పెద్దిరాజు నాటకమున గంగురాజు తండ్రి సింహాద్రిరాజని వ్రాసిరి. శాసన ప్రమాణమును బట్టియు, పురాణములను బట్టియు గంగురాజుతండ్రి సింహాద్రిరాజు, సింహాద్రిరాజు తండ్రి శ్రీకూర్మరాజు.

కాటమరాజు కథాచక్రమున మొట్టమొదటికథ 'వల్లురాజుకథ' ('వలరాజు' అను శబ్దమే జనవ్యవహారమున'వల్లురాజు'గను, 'వలురాజు'గను మారియుండును) ఈ వల్లురాజును 'ఆవుల వలురాజు' అందురు. ('ఆవుల' ఇంటిపేరు కానోపును) ఇతడు కవులావుల(=కవిలావుల)గంగురాజు–గంగమ్మ అను దంపతులకు పుట్టె ననియు, ఇతనికి హరిగోపాలుడు, నందగోపాలుడు, గోవర్ధనుడు అను ముప్పురు తమ్ములుగలరనియుఇతనిపుత్రులేసింహాద్రి–పెద్ది–ఎఱనూక–నలనూక–పోలురాజు లనియు నాకు లభించిన'వలురాజుకథ' తాళపత్రగ్రంథములో స్పష్టముగానున్నది. పిచ్చయ్యగారు ప్రకటించిన 'వలురాజుచరిత్ర' యందును ఇట్లేయున్నది. (చూ. పుటలు 1,2). కాబట్టి లక్ష్మయ్యగారిచ్చిన కవులావుల గంగురాజు –వలరాజు (ముగ్గురుతమ్ములు)–గంగురాజు–ఆవులవలరాజు–సింహాద్రి పెద్దిరాజా దులు' అను వంశక్రమము తప్పు. హరిగోపాలాదులను సోదరులుగా కలిగిన 'వలరాజు'ను,సింహాద్రి పెద్దిరాజాదులను పుత్రులుగా గలిగిన'ఆవుల వలరాజు'ను తొక్కరే. వీరిరువురను వేర్వేరుగా చూపి, వీరిమధ్య మరలనొక గంగురాజును చూపుట అసంగతముగా నున్నది. కావున ఈ చారిత్రక వంశక్రమ ప్రారంభము ఇట్లు చూపవలెను:–




(ii) బత్తుల లక్ష్మయ్యగారు, సింహాద్రిరాజు కుమారుడగు కఱియావుల రాజును, సింహాద్రిరాజు పుత్రికయగు చిటినూకను, నలనూకరాజు సంతానముగా జూపిరి (చూ. రాజవంశప్రదీపిక, పుట. 136). ఇది రెండవతప్పు. కఱియావుల రాజును అతని చెల్లెలు చిట్టినూకయు సింహాద్రిరాజు సంతానముకాని, నలనూక రాజు సంతానము కాదు. నలనూకరాజునకు ఎఱ్ఱయ్య ఒక్కడే కొడుకు.

(iii) కాటమరాజు కథాచక్రమునుబట్టి, పోలురాజునకు ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె. భత్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య అనువారు పుత్రులు. అగుమంచి పుత్రిక. ఈ అగుమంచి, కాటమరాజు మేనత్తయగు కొమరమ్మ పుత్రుడగు పుత్తమరాజును వివాహమాడెను. కాని బత్తుల లక్ష్మయ్య గారు "బత్తినిరాజు, అయితవరాజు, ముమ్మరాజు, అగుమంచిరాజు- యీనలుగురు కుమాళ్లు. వీరిలో బత్తినిరాజు అనువాడు శ్రీశైలమఠములో నున్నాడు. తక్కినవారందరు యఱ్రగడ్డపాటి యుద్ధముతో చనిపోయినారు"[42] అని వ్రాసిరి. ఇది మూడవతప్పు. అగుమంచి స్త్రీయేకాని పురుషుడుకాడు.

42. రాజవంశ ప్రదీపిక, పుట 138.

లక్ష్మయ్యగారు నలసిద్ధిరాజు సోదరులనుగూడ సరిగా చూపలేదు. "నల సిద్ధిరాజు, ఎఱసిద్ధిరాజు, పాపసిద్ధిరాజు, కొండికసిద్ధిరాజు, కొమారసిద్ధిరాజు" అను నైదుగురన్నదమ్ములను గాథాకారులు తరచు పేర్కొనుచుందురు. కాని లక్ష్మయ్యగారు కొండికసిద్ధిరాజును పేర్కొనక, 'మనుమసిద్ధి' నామమును ప్రథమమున చేర్చిరి. మొత్తముమీద బత్తుల లక్ష్మయ్యగారు కాటమరాజు పూర్వీకుల పురాణవంశవృక్షమును విపులముగా నిచ్చిరికాని, చారిత్రక వంశ వృక్షమును తప్పుల తడకగా జేసిరి.

1953-54 లో ఆచార్య రిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలో ప్రకటించిన వ్యాసములో యాదవరాజుల వంశ క్రమము నిచ్చిరి. వీరు చారిత్రక వంశక్రమమును (వీరగాథల నాధారముగా జేసికొని చెప్పినది) చక్కగా వివదీసిరి కాని, పురాణ వంశక్రమమును సరిగా చర్చింపలేదు. వీరిచ్చిన పురాణ వంశక్రమ మిట్లున్నది: "ఆనందగోపాలుడు-వసు దేవుడు-శ్రీకృష్ణుడు-మన్మథుడు-అనిరుద్ధుడు-ఇంద్రదేవుడు-శ్రీజవుడు - సాత్య- కురవలుడు-కవులావుల గంగురాజు". ఈ వంశక్రమము తప్పుదారులు పరెనున్నది. కురవలుని కుమారుడే గంగురాజనుట అసమంజసము. ఈ గంగురాజు శ్రీకృష్ణునకు ఏడవతరమువాడనుట హాస్యాస్పదము. వీరిచ్చిన యీ వంశక్రమమంతయును తప్పు. దీనిని వీరు ఎక్కడ సంపాదించిరో తెలియదు.

తాళపత్రగ్రంథములలోని వీరగాథల నాధారముగా జేసికొని, 1962 లో గోవుల నాగేశ్వరకవిగారు 'మదనకుంభినీ యుద్ధమను పెద్దిరాజు నాటకము'ను రచించిరి. ఈనాటకాంతమున వీరు 'యదువంశక్రమము'ను విపులముగా నిచ్చి యున్నారు:— "మొదట విష్ణువు, ఆయనకు బ్రహ్మ, ఆపిమ్మట క్రమంబుగా అత్రి, చంద్రుడు, బుధుడు, పురూరవుడు, ఆయువు, నహుషుడు, యయాతి, యదువు, క్రోష్టువు, వృజినవంతుడు, శ్వాహితుడు, బేరుశేకుడు, చిత్రరథుడు, శశిబిందుడు, పృథుశ్రవుడు, ధర్ముడు, ఉశనుడు, రుచికుడు, జ్యామఘుడు, విదర్భుడు, కుంతి, దృష్టి, నిర్వృతి,దశార్హుడు, వ్యోముడు,జీమూతుడు, వికృతి, భీమరథుడు, నవరథుడు, దశరథుడు, శకుని, కుంతి, దేవరాతుడు, దేవక్షత్రుడు, మధువు, కురువశుడు, వసువు, పురహోత్రుడు, అంశువు, సాత్వతుడు, భజ మానుడు, అంధకుడు, విదూరథుడు, భోజుడు, హృదికుడు, దేవమీఢుడు,శూరుడు,

వసుదేవుడు, కృష్ణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, వజ్రుడు, ప్రతిబాహుడు, ఉగ్రసేనుడు, శ్వేతసేనుడు, ఉపనందుడు, అమృతాంభోజుడు, విజయాంభోజుడు, కనకాంభోజుడు, గజాంభోజుడు, రాయాంభోజుడు, రత్నాంభోజుడు, వీరవిజయుడు, పద్మరాజు, కూర్మరాజు, సింహాద్రిరాజు, గంగురాజు, వలరాజు, పెద్దిరాజు, కాటమరాజు."

దీనినిబట్టి కాటమరాజు విష్ణుమూర్తికి డెబ్బది నాల్గవతరమువాడు; శ్రీకృష్ణునకు ఇరువది మూడవతరమువాడు. కాటమరాజునకు సంబంధించిన పురాణవంశక్రమములలో ఇది మిక్కిలి సమంజసముగా నున్నది. గుండ్లపాలెము శిలాశాసనము కూడ దీనిని బలపరుచుచున్నది.

కాటమరాజు కథాచక్రమున కొన్ని వీరగాథలలో ఈ వంశక్రమ వర్ణనలున్నవి. ప్రకాశం మండలమున కనిగిరిసీమలో 'కంకణంపాడు' అను గ్రామములో 1966 లో నాకు లభించిన 'పోలురాజు కథ' అను తాళపత్ర గ్రంథమున చివరి యాకులలో కాటమరాజు వంశక్రమ వర్ణనము ఈ క్రింది విధముగా నున్నది:

"ఆది నారాయణ వంశంబు గనుక
వేదాంత ముఖ్యుండు ఆది బ్రహ్మంబు
ఆదిబ్రహ్మము సుతుడు అరుకులరాజు
తేజరిల్లగ మహాదేవేంద ఘనుడు
ఆ యింద్రునకు సుతుడు కాలయముండు
తొడబడ అతనికి దుందుమారుండు"

ఈ దుందుమారునకు సూర్యవంశంబు వరుసగా "త్రిశంకుడు-హరిశ్చంద్రుడు-లోహితుడు-పునోరవుడు-ఇక్ష్వాకురాజు - సూరప్రముఖుండు - అమరుడు-అరణ్యుడు-అజవు - రఘువు - దశరథుడు - శ్రీరాములు-కుశలవులు - లవునకు ప్రతాపుడు" పుట్టినట్లుగా వర్ణింపబడినది. ఆతరువాత, దుందుమారునకు సోమవంశంబున గలిగిన రాజుల వంశక్రమము చెప్పబడినది:

"అంతట సోమ వంశంబున సూర్యప్రమణ
సూర్యప్రమణ కొమారుడు పూరుడు
పూరుని తమ్ముడు యదుండు
యదునకు శీలగోపాలు
శీలగోపాలుని కొమారుడు శూరసేనుడు
శూరసేనుని కొమారుడు వసుదేవుడు
వసుదేవుని కొమారుడు శ్రీకృష్ణుడు
శ్రీకృష్ణుని కొమారుడు మన్మథుడు
మన్మథుని కొమారుడు అంభజుడు
అంభజుని కొమారుడు రాయంభోజు
రాయంభోజుని కొమారుడు రత్నాంభోజు
రత్నాంభోజు కొమారుడు విభూతి భాస్కరుడు
విభూతి భాస్కరుని కొమారుడు జడల శంకరయ్య
జడల శంకరయ్య కొమారుడు విరిజ్జపరాజు
విరిజ్జపరాజు కొమారుడు అగ్గణాల వొలురాజు
అగ్గణాల వొలురాజు కొమారుడు ఆవుల వొలురాజు
ఆవుల వొలురాజు కొమారుడు పెద్దరాజు
పెద్దిరాజు కొమార ! సద్గుణాకార
కదయంత మందున వోరన్న కాటమరాజా !"

ఇందలి వంశక్రమమునకును, గోవుల నాగేశ్వరకవి గారిచ్చిన వంశక్రమమునకును భేదమున్నది. కాటమరాజు సోమవంశమువాడు కాగా, ఇందు సూర్యసోమ వంశములు రెండును చెప్పబడినవి. నాగేశ్వరకవి శ్రీకృష్ణునినుండి కాటమరాజు వరకును ఇరువదిమూడు తరములు చెప్పగా, ఈ తాళపత్ర గ్రంథమున పండ్రెండు తరములు మాత్రమే చెప్పబడినవి. పేర్లుకూడ భిన్నముగా నున్నవి. ఆవుల వలురాజు తండ్రి గంగురాజనియు, తాత సింహాద్రిరాజనియు, ముత్తాత కూర్మరాజనియు నిత్యాదిగా నాగేశ్వరకవి నాటకమున నుండగా, ఈ

తాళపత్ర గ్రంథమున ఆవుల వలురాజుతండ్రీ అగ్గణాల వలురాజనియు, తాత విరిజ్జపరాజనియు, ముత్తాత జడల శంకరయ్య అనియు నిత్యాదిగా నున్నది.

నాకు కృష్ణామండలమున కైకలూరు తాలూకా 'పెరికగూడెం' గ్రామములో లభించిన (1964 లో) 'జన్నివాడ కథ' అను తాళపత్రగ్రంథమున యదువంశక్రమము పై రెండింటికన్నను భిన్నముగా నున్నది. ఇందు సూర్య సోమవంశములు రెండును సుదీర్ఘముగా వర్ణింపబడినవి. కాటమరాజు నెల్లూరు పచ్చిక బీళ్ళలో పశువులను మేపుచుండగా నెల్లూరిలోని పల్లికొండపెరుమాళ్లు బ్రాహ్మణరూపమున వచ్చి అతనితో యాదవ వంశక్రమము నిట్లు చెప్పును:

"మందరాద్రి సముద్రము దరవంగ మరి గోవు పుట్టె
గోవుల వెంటనే గోవుల రక్షకుడు పుట్టె
గోవుల రక్షకుండు తెచ్చిన అమృతము
హరి దేవాది దేవతలకు పంచిపెట్టించెను
ఆయుగం పొడిమారి ఆదియందుండెను
గోవుల రక్షకునికి జయంత్రుడు అని ఒక కుమారుడు జన్మించెను
ఆకుమారునికి అగసనందనుండు ఒక కుమారుడు జన్మించెను.
ఆ మహారాజుకి అగసనందన కుమారుడు సింహానందనుడు
సింహానందను కుమారుడు అగసనందనుడు
అగసనందను కుమారుడు ఆదినారాయణుండు
అదినారాయణుని కుమారుడు బ్రహ్మ
బ్రహ్మకుమారుడు భృంగుమహాముని
భృంగుమహాముని కుమారుడు అమృతుండు
అమృతుని కుమారుడు ఆదివిశ్వబ్రహ్మ"

ఈ అది విశ్వబ్రహ్మనుండి రాజులు తండ్రికొడుకుల వరుసలో నిట్లు చెప్పబడిరి: "ఆది విశ్వబ్రహ్మ కుమారుడు సూర్యుడు-శనేశ్వరుడు-నయనేంద్రుండు-కాలశంకరుండు-త్రిశంకరుండు - హరిశ్చంద్రుండు- లోహితాస్యుండు-దుందుభానుండు-యవనాశ్వుండు-మహాంధాత - కృతాసంధనుండు - జాత్వసంద

నుండు-కనస్తుండు - కల్మషపాంథపుండు - అమితసార్వుండు - అంబరీషుండు-సోమంతు-డిల్లీబు-బగిరాజు-రఘు-భాస్కరుడు-అగ్నిపరుండు - శ్రీఘుగాయండు-బసాసు-పుగిలి-పులివారి-ధీరుడు-యక్షధియందు-పుక్షి- వినవుక్షి-విస్సట -హరిహర్షుడు-దశరథుడు-శ్రీరామపుండు-కుశలపులు- కుంచగోపాలసుందు - సర్వేశ్వరుండు-కేశగోపాలకుండు - ఆనందగోపాలకుండు - వసుదేవుడు - శ్రీకృష్ణుడు-మన్మథుడు-ఇంద్రదేవుడు-ఆనంద సేనుండు - అంభోది-ఘుష్టంభోది - పీరంభోది-విజయంభోది-రాయంభోది-చుంచుంభోది-జలంభోది-కనకంభోది-యయ్యాద్రి-"

"యయ్యాద్రి కుమారుడు కవులావుల గంగురాజు
కవులావుల గంగురాజు కుమారుడు అవుల భూపతి
అవుల భూపతి కుమారుడు అవుల అమృతయ్య
అవుల అమృతయ్య కుమారుడు అవుల వలురాజు
వలురాజు కుమారులు ఐదుగురు వారు ఎవరెవరంటే
౧ సింహాద్రిరాజు ౨ పెద్దరాజు ౩ ఎరనూకరాజు
౪ నలనూకరాజు ౫ పోలురాజు......"[43]

మహాభారతము ప్రపంచ ప్రసిద్ధికెక్కిన యితిహాసము. ఇందలి శ్రీకృష్ణుడు దైవాంశ సంభూతుడు. ఇతడు చంద్రవంశ క్షత్రియుడగు యాదవుడు. శ్రీకృష్ణ భగవానుని నుండి కాటమరాజు వరకుసుగల తరములను పరిశీలించుట ఆసక్తికము. పల్నాటి వీరకథాచక్రమున బ్రహ్మనాయుడు కృష్ణుని అవతారముగా భావింపబడి 'నీలవర్ణు'నిగా పలుమారులు సంబోధింపబడెను. అట్లే యాదవ భారతమని పిలువబడు కాటమరాజుకథా చక్రమున కాటమరాజుకూడ కృష్ణుని అవతారముగా చెప్పబడి 'నలనన్న' అను పేరుతో తరచు ప్రసక్తుడగుచుండును. మహాభారతమున శ్రీకృష్ణుడే అపరనిష్ఠుడగుట ప్రసిద్ధము. (భారత భాగవతముల లోని శ్రీకృష్ణపాత్ర ప్రాముఖ్యమును చూచి జానపదకవులు బ్రహ్మనాయని పాత్రను కాటమరాజు పాత్రను అలౌకిక శక్తులతో తీర్చిదిద్దియుందురని నా యను

---

43. 'జన్నివాడ కథ', పెరికగూడెము తాళపత్రప్రతి, అకులు 8,9,10,11.

మానము). కావున శ్రీకృష్ణుడు-కాటమరాజు అను ఈ రెండు అవతారముల మధ్యను ఎన్నితరములు దొరలినవో గమనించుట ముఖ్యము. (చూ. Cxxviii, Cxxix పుటలోని పెద్ద పట్టిక).

ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు శ్రీకృష్ణునినుండి కాటమ రాజువరకును పదునొకండు తరములను మాత్రమే గుర్తించినారు. ఇందు 'శత్రుజుడు, సాత్య, కురవలుడు' అనునవి నూతన నామములు. ఇవి యే యితర పట్టికలోను లేవు. ఇందు చాల తరములు వదలివేయబడినవి.

కంకణంపాడు తాళపత్రప్రతి (పోలురాజుకథ)లో పండ్రెండు తరము లున్నవి. ఇందు కవులావుల గంగురాజు పేరు లేదు. ఆవుల వొలురాజు తండ్రి పేరు 'అగ్గణాల వొలురాజు' అని యున్నది.

గుండ్లపాలెము శిలాశాసనములో పదునేడు తరములు చెప్పబడినవి, ఇందు శ్రీకృష్ణునినుండి ఉపనందుని వరకును వంశక్రమము అస్తవ్యస్తముగా నున్నది. కంకణంపాడు ప్రతిలోవలెనే దీనియందును ఆవుల వలురాజుతండ్రియగు కవు లావుల గంగురాజు పేర్కొనబడలేదు. కాటమరాజుతండ్రి పెద్దిరాజు కాగా, ఇందు పినతండ్రియగు పోలురాజు ప్రముఖముగా పేర్కొనబడెను.

పెరికగూడెము తాళపత్ర ప్రతియగు 'జన్నివాడ కథ'లో శ్రీకృష్ణుని నుండి కాటమరాజు వరకును పందొమ్మిది తరములు పేర్కొనబడినవి. కాని 'అనిరుద్ధుడు, వజ్రుడు, ప్రతిబాహుడు, సుబాహుడు' మున్నగు వారిందులేరు. 'భోజుడు' అనుశబ్దమిందు 'భోది' అని యున్నది. ఈ 'భోది' నామాంతమునగల రాజు లిందెక్కువగా నున్నారు. ఆవుల వలురాజుతండ్రి 'కవులావుల గంగురాజు' అని వ్యవహారమునను, వల్లురాజుకథ అను వీరగాథలోను నుండగా, ఈ జన్ని వాడకథలో గంగురాజు-వలురాజులమధ్య ఆవుల భూపతి, ఆవుల అమృతయ్య అను మరి యిద్దరు రాజులున్నట్లుగా కలదు.

గోవుల నాగేశ్వర కవిగారు తమ నాటకములో నిచ్చిన యదువంశ క్రమము కొంత హేతుబద్ధముగా నున్నది. ఇందు కాటమరాజు శ్రీకృష్ణునకు ఇరువది మూడవ తరమువాడుగా చూపబడినాడు.

- కవులావుల గంగురాజు (భార్య : గంగమ్మ)
  - ఆవుల వలురాజు (వల్లమ్మ)
    - సింహాద్రిరాజు (సింహాద్రిసీత)
      - కటియావుల రాజు
      - చిట్టి నూక
    - పెద్దిరాజు (పెద్దమ్మ)
      - కాటమరాజు (ఇతడే కథానాయకుడు)
      - పాపనూక
    - ఎఱనూకరాజు (ఎఱనూకసీత)
      - భట్టావులరాజు
    - నలనూకరాజు (నలనూకసీత)
      - చట్టువారి
    - పోలురాజు (సిరిదేవి)
      - యెట్టయ్య
      - భక్తిరన్న
      - అయితమ రాజు
        - అల్లుదాడెన్న
      - ముమ్మయ్య
      - అగు మంచి × ఉత్తమరాజు
        - పోచయ్య
    - కొమరమ్మ
  - హరిపాలుడు
  - నందగోపాలుడు
  - గోవర్ధనుడు

పోచయ్య — కొమరమ్మ:
- పల్లికొండ
- ఉత్తమరాజు × అగుమంచి
- నాచకూళ్ళ నాయుడు



'బల్లికురువ పోట్లాట' అను వీరగాథలో కూడ యతి స్థానమున రెండు చోట్ల ఈ 'పుత్తమరాజు' శబ్దమున్నది:

"పుత్తన్న నగ్నికి పొసగ నర్పింతు"
"పుత్తన్న నేతివారి ముద్దన్న ఘనుడు"

పోచయ్యను, అగుమంచికిని పుత్తమరాజునకును జన్మించిన పుత్రునిగా చూపుట తిమ్మావజ్ఝలవారి పట్టికలోని రెండవతప్పు, పోచయ్య, సింహాద్రిరాజు కూతురును కటియావులరాజు చెల్లెలును అగు చిట్టినూక పుత్రుడు. ఇతని తండ్రిపేరు 'కల్లందుల పోలినేడు'. ('కన్నందుల పోల్నేడు' అని రాజవంశ ప్రదీపిక). ఈ పోలినేడు పోలురాజు మంత్రులలో నొకడగు కల్లందుల మారినేని కుమారుడు. ఈ వీరుడు భైరవుని కురువదగ్గర జరిగిన యుద్ధములో మరణించెను. 45 అప్పు డీతని భార్యయగు చిట్టినూక సహగమనము చేయబోవుచు, తన పుత్రుడును ఏడు నెలల పసిబాలుడును అగు పోచయ్యను అగుమంచికి అప్పగించెను. అప్పటి నుండియు పోచయ్యను అగుమంచియే పెంచినది. ఇతడు అగుమంచికి పెంపుడు కొడుకు మాత్రమే. ఈ విషయము 'వేడుకబొంగరాల కథ' అను వీరగాథలో స్పష్టముగా నున్నది. పోచయ్యయే స్వయముగా తన జన్మ వృత్తాంతమును దెల్పును. కాబట్టి పోచయ్య అగుమంచికి పెంపుడుకొడుకే కాని, గర్భవాసమున కన్నవాడు కాడు. కావున తిమ్మావజ్ఝలవారు తమ వ్యాసములో అగుమంచిని గూర్చి వ్రాయుచు-"ఉత్తమ రాజు ఈమె భర్త. పోచయ్య యీామె కుమారుడు" అని వ్రాయుట అవిచార మూలకమని చెప్పవలసి వచ్చుచున్నది. ఇట్లే ఆరుద్రగారు తమ 'కాటమరాజు'

---

45. పోలినేని తండ్రియగు మారినేడు బల్లికురువ పోట్లాటలో మరణించినాడు. అప్పటికి పోలినేడు పసివాడు. అందుచే భైరవకురువను బల్లికురువగా పొరపడరాదు. బల్లికురువ వేరు, భైరవకురువ వేరు. మొదటిదానిదగ్గర తండ్రియగు మారినేడును, రెండవదానిదగ్గర పుత్రుడగు పోలినేడును వీరస్వర్గ మలంకరించినారు.

నాటికలో పోచయ్యపాత్రచే "అందుకే అభిమన్యు ప్రాణాలు అర్పించుకొని నేలకూలాడు. ఆ అప్రతిష్ఠ తొలగించడానికే ఈనాడు ఈ అనుమంచి తిర్మలరాజు కుమారుడయి ఈ అభిమన్యుడు పుట్టాడు. పద మూహా!"[46] అనిపించుట రెండవ తప్పే!

కోదండరామయ్యగారు పల్లికొండను కొమరమ్మకు తమ్ముడుగా చూపినారు. ఇది సరికాదు. పోచయ్య అనుముంచికి పెంపుడుకొడుకైనట్లుగనే, పల్లికొండ కొమరమ్మకు పెంపుడు కొడుకు; నిజపుత్రుడు కాడు. పల్లికొండ వర ప్రసాది. ఆవుల వలురాజును అతని మంత్రియగు తిరుమలయ్య పుత్రరాజును ఒకనాడు వేటకు పోగా, అట అరణ్యమున నొక సరస్సులో కమలమున నొక బాలుడు కనపడెను. వలురాజు ఆ బాలుని తెచ్చి, అప్పటికి సంతానములేని తన కుమార్తె కొమరమ్మకిచ్చెను. ఆమె ఆ బాలుని పెంచి పెద్దచేసినది. అతడే పల్లి కొండ. అతని బుద్ధి కుశలతకు,అద్భుతశక్తికి మెచ్చి వలురాజు అతనిని మంత్రిగా నియమించెను. ఆ వలురాజుతరమునుండి కాటమరాజుతరమువరకును యాదవులకు ఈ పల్లికొండయే మహామంత్రి. యాదవులు ఇతనిని విష్ణుమూర్తి అవతారముగా భావించి, ఇతని ఆజ్ఞను శిరసావహించుచుండిరి. ఇతడు యాదవులకు 'హరిసమువు' (భక్తిరన్న "శివగురువు") కావున పల్లికొండ పంచములు పాపినాయని భార్య యగు కొమరమ్మకు పెంపుడుకొడుకు మాత్రమే. (ఈ పల్లికొండ పుట్టుక ఆవుల వలురాజుకథలో వచ్చును). దీనిని కోదండరామయ్యగారి పట్టికలోని మూడవతప్పుగా గాక, పైన తెల్పిన రెండవ తప్పులోని అంతర్భాగముగా పరిగ ణించుచున్నాను. ఇక శ్రీవారి మూడవతప్పును గూర్చి దిగువ ముచ్చటించు చున్నాను:—

కోదండరామయ్యగారిచ్చిన వంశవృక్షములో నలమాకరాజు పుత్రుడు చట్టువారి ఎఱ్ఱయ్య" అని కలదు. వారి వ్యాసములో వేరొకచోట 'పసుపులేటి ఎఱ్ఱయ్య'ను గూర్చి వ్రాయుచు "ఈతనికే చట్టువారి యెఱ్ఱయ్యయని నామాంత రము కలదు. ఇతడు నలనూక రాజుయొక్క కుమారుడు" అని వ్రాసిరి. దీనిని

---

46. ఆరుద్ర, 'కాటమరాజు' నాటిక, ప్రగతి సచిత్రవారపత్రిక.

బట్టి 'చట్టువారి యెల్లయ్య' అనినను "పయ్యావుల యెల్లయ్య" అనినను ఒకరే నని శ్రీవారి భావముగా స్పష్టమగుచున్నది. ఇది సరికాదు. ఈ యిర్వురు ఎల్లయ్యలును వేరువేరు వ్యక్తులు. నలనూకరాజు కొడుకుపేరు "పయ్యావుల యెల్లయ్య" లేక 'పెయ్యల యెల్లయ్య'. ఇతనికి 'బెజవాడ బెబ్బులి' అని బిరుదు. ఇతడు కాటమరాజునకు సోదరుడు (పితృవ్యపుత్రుడు). అందుచే నితనికి 'నలనన్న యెల్లయ్య' అనియు నామాంతరమున్నది. ఇతడెప్పుడును కాటమరాజుయొక్క ఆలమందలతో నుండువాడు. "చట్టువారి యెల్లయ్య" వేరు. ఇతడు కాటమరాజునకు మరదియగును (పల్లికొండకు సోదరుడు కావచ్చును). కోటపాడునుండి తాటి వృక్షమును పెరికి తెచ్చిన వీరుడు ఈ చట్టువారి యెల్లయ్యయే.

ఈ యిరువురు ఎల్లయ్యలును వేరనుటకు "ఎల్లగడ్డపాటి పోట్లాట" అను వీరగాథలో "ఆవుల యెద్దుల జగడము" అను కాండమున స్పష్టమగు నిదర్శన మున్నది. మంత్రి పల్లికొండ ద్వారా యిరువురు ఎల్లయ్యలకును పంపు లేర్పరుపగా, కాటమరాజు వీరిలో నొకరిని తమ్ముఁనిగాను, వేరొకరిని మరదిగాను సంబోధించి, ఉత్సాహమునిచ్చి, యుద్ధము చేయుటకు అనుజ్ఞ నొసఁగును:

"పేర్వేర నలనన్న పిలిచె నందఱిని
తమ్ముని నెర్రయ్య దాయంగఁబిలిచి
మఱదిని నెర్రయ్య మఱి వేగఁ బిలిచి
యిద్దరు నిలిచియు యుద్ధంబు సేయుఁ
డని చెప్పి యిరువురి నటు కౌగిలించి
'మాకోటెక్క పగఱపై మనసు రంజిల్ల
మించి పగతుర మెదడు మేదిని మీఁదఁ
గుప్పలుగ రాలంగ ఘోర యుద్ధంబు
ఓ తమ్ముఁడా ! మఱఁది! యుక్తయాస్త్రమానము
సీతాపతి కృపను చేయుఁ డాలంబు"[47].

అని కాటమరాజు సెలవీయఁగా, బెజవాడ బెబ్బులియగు పెయ్యల యెల్లయ్యయు, చట్టువారి యెల్లయ్యయు యుద్ధ సన్నద్ధులై వెడలినట్లుగా గలదు.

---

47. కాటమరాజుకథ, పుటలు 130,131.

దీనినిబట్టి ఎఱ్ఱయ్యలు ఇరువురున్నారనియు; అందు [illegible] పుత్రుడును, కాటమరాజు సోదరుడును, బెజవాడబెబ్బులి బిరుదాంకితుడు అగువాడు 'పెద్దపుల్లి యెఱ్ఱయ్య' అనియు; కాటమరాజునకు మరదియు, పల్లెరాయని తమ్ముడును అగువాడు 'చట్టువాని యెఱ్ఱయ్య' అనియు స్పష్టమగుచున్నది. 'ఎఱ్ఱయ్య తర్కవాదము' అను వీరగాథలో గంగతో తర్కవాదము జరిపినవాడు పెద్దపుల్లి యెఱ్ఱయ్య; 'కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ' అను వీరగాథలో పోలురాజు [illegible]గామునకు దోఖు, అనేక వీరులను జయించి తాటిచెట్టును తెచ్చినవాడు చట్టువాని యెఱ్ఱయ్య.

తిమ్మావజ్ఝల వారు పెద్దిరాజుతరములోని రాణివాసము నిట్లు గుర్తించిరి: సింహాద్రిరాజు భార్య సింహాద్రి సీత, పెద్దిరాజు భార్య పెద్దమ్మ, ఎఱనూక రాజు భార్య ఎఱనూక సీత, నలనూక రాజు భార్య నలనూక సీత, పోలురాజు భార్య సిరిదేవి. కాని గుఱ్ఱము కొండ భక్తవత్సల కవి రచించిన 'పల్నాటి కాటమ రాజు చరిత్ర' అనుపద్యకావ్యమున సింహాద్రిరాజు, ఎఱనూక రాజు, నలనూక రాజుల భార్యల పేళ్లు భిన్నముగానున్నవి. సింహాద్రిరాజు భార్య 'సరసాంబ' అనియు, ఎఱనూక రాజు భార్య 'ఎఱ్ఱాంబ' అనియు, నలనూకరాజు భార్య 'నల్లాంబ' అనియు ఈ పద్యకావ్యమున నున్నది, పెద్దమ్మ సిరికేవు నామములు మాత్రము యథాతథముగానే యున్నవి. 'రాజవంశ ప్రదీపిక'లో సింహాద్రిరాజు భార్య పేరు చెప్పబడలేదు. పెద్దిరాజు భార్య 'పెద్దమ్మ' అనియు, ఎఱనూకరాజు భార్య 'సీతమ్మ' అనియు, నలనూకరాజు భార్య 'సీతాంబ' అనియు, పోలురాజు భార్య 'సిరిదేవి' అనియు గలదు. మొత్తమునకు పెద్దమ్మ, సిరిదేవి, కొమరక్కల పేళ్లు ప్రసిద్ధమైనట్లుగా తక్కినవారి పేళ్లు అంత ప్రసిద్ధములు కావు. వీరగాథలలో కానవచ్చు గంగురాజు భార్య గంగమ్మ, వల్లురాజు భార్య వల్లమ్మ, పెద్దిరాజు భార్య పెద్దమ్మ—ఇత్యాది నామములను పరిశీలించినచో, భర్త నామము ననుసరించియే భార్య నామమును ఉండుట ఆనాటి సంప్రదాయముగా కానవచ్చు చున్నది. అట్లే 'సింహాద్రిసీత, ఎఱనూకసీత, నలనూకసీత' మొదలగు పేళ్లనుబట్టి 'సీత' అను శబ్దము భార్యా శబ్దపర్యాయముగా వాడబడినట్లు కూడ తెలియుచున్నది.

ఇట్లు కోదండ రామయ్యగారిచ్చిన వంశవృక్షమున తప్పులేకాక, దానికి చేర్పవలసిన అంశములును కొన్నిగలవు. కాటమరాజు మేనత్తయగు కొమరమ్మకు

'పల్లికొండ, ఉత్తమరాజు, నాచకూళ్లనాయుడు' అనుముగ్గురు పుత్రులు గలరని వారు చూపినారు. ఇందు పల్లికొండ కొమరమ్మకు పెంపుడు కొడుకనియు, ఉత్తమరాజు పేరు పుత్తమరాజుగా నుండవలెననియు పైన నిరూపించితిని. కొమరమ్మభర్త పందుముం పాపినాయుడు. ఇతడు పోలురాజు మంత్రి. ఈ దంప తులకు పల్లికొండయను పెంపుడు కొడుకుతో పాటు 'పుత్తమరాజు, నాచకూళ్ల నాయుడు, పుల్లావులకేశవయ్య, చట్టువారి యెల్లయ్య' అను నలువురు నిజ పుత్రులును గలరు. ఇందు పుల్లావుల కేశవయ్యను కోదండరామయ్యగారు గుర్తించ లేదు. చట్టువారి యెల్లయ్యను నలనూకరాజు పుత్రునిగా భ్రమించిరి. పుల్లావుల కేశవయ్య ప్రసక్తి కఱియావులరాజు కథలో వచ్చును. ఇతడు కఱియావుల రాజు నకు చెలికాడు, మంత్రి. ఈ బావమరదులిద్దరును పగడసాలాడుచుందురు. చట్టు వారి యెల్లయ్య విషయము కోటపాటి తాటివృక్షం తెచ్చే కథలో వచ్చును.

అయితమరాజునకు అల్లుదాడెన్న అను పుత్రుడేకాక 'సిరిగిరమ్మ' అను పుత్రికయు గలదు. ఈమె ప్రసక్తి 'అగుమంచి కథ'లో వచ్చును. ఈ సిరిగి రమ్మ అగుమంచి పెంపుడుకొడుకగు పోచయ్య భార్య. అగుమంచికథలో ఆమెకు తలంటి పోసినది ఈ సిరిగిరమ్మయే. ఈమెను కోదండరామయ్యగారు గుర్తింపలేదు.

తిమ్మావఝ్ఝల వారు పెద్దిరాజు తరములలోని రాణులను మాత్రమే గుర్తించిరి. నేను కాటమరాజుతరములోని రాణివాసమునుగూడ గుర్తించితిని. కాటమరాజు భార్యపేరు 'మర్లవారి గంగ'. కఱియావులరాజు భార్య 'నాగమాంబిక' లేక 'కఱి యావుల నాగ'. భట్టావుల రాజుభార్య 'సూరమ్మ' లేక 'సూరమాంబిక'. పెయ్యల యెల్లయ్యభార్య 'భవమ్మమాంబిక'. భక్తిరన్న భార్య 'నల్లమేడ' లేక 'నల్లమాంబ' అయితమరాజు సతీమణి 'నేతివారి పోతు'. ముమ్మయ్య సతి 'చినమల్లు', పుత్తమ రాజుభార్య అగుమంచి. పోచయ్య భార్య సిరిగిరమ్మ. వీరందరును అగుమంచి కథలో ప్రసక్తమగుదురు. అగుమంచికి 'అక్కమ్మ' అను నామాంతరము కూడ కలదు.

నేను సూచించిన పై సవరణలతో కాటమరాజు వంశవృక్షము ఇట్లుండవలెను :-(చూ. ఎదుటి పుటలోని పట్టి).

## 12. యాదవుల రాజధానులు :-

ఈ యాదవరాజులు 'ఎలమంచి, పంపాద్రి, అర్ధవీడు, ధనుసు కొండ' అను నగరములను రాజధానులుగా చేసికొని రాజ్యము చేసినట్లుగా [illegible] తెలియుచున్నది. కవులాపురం గంగరాజును, అనుములయ్యరాజును ఎలమంచిని పాలించిరి. (అప్పుడు వలురాజు కనిగిరి ప్రాంతమును పెద్ద [illegible]ను పాలించెనని కొందరందురు). వలురాజు తరువాత పెద్దిరాజు ఎలమంచిని పదేండ్లు పాలించి, పిమ్మట సోదరులతో కలసి పంపాద్రికి వచ్చెను. పంపాద్రిలో ఏడేండ్లు పాలించిన తరువాత పెద్దిరాజు సంతానముకొరకు కల్యాణపట్టణమునకు పోగా, తక్కిన సోదరులందరును చెదరి తలయొక దిక్కునకు పోయిరి. అప్పుడు పట్టము కట్టబడిన పోలురాజు తన రాజ్యభారమును అర్ధవీటిలో ఉంచి తాను మందలతో కలసి శ్రీ రంగమువరకును పోయెను. ఈ పోలురాజు సుతుడైన అయితమరాజు ధనుసుకొండను పాలించెను. కాటమరాజు నిరంతరము ఆలమందలతో గలసి దేశభ్రమణము కావించుచున్నట్లుగా తెలియుచున్నది. ఇతడు బాల్యమున కల్యాణపట్టణములో నుండెను. తరువాత ధక్కిరన్నచే ఎలమంచికి తేబడెను. పిమ్మట శ్రీశైల ప్రాంతమున ఆలమందను మేపెను. అటనుండి కనిగిరి సీమకు, నెల్లూరి సీమకు వచ్చెను. ఇతని కోట కనిగిరి దగ్గర పంచలింగాలకొండ దిగువున నున్నది. ఈ యాదవరాజుల రాజధానులలో ఎలమంచి పంపాద్రి అనునవి నేటి విశాఖ మండలమున గలవు. అర్ధవీడు, కర్నూలుజిల్లా కంభము తాలూకాలో నున్నది. ఇట పల్లికొండ బాలరాజులతో ఒక్క రాత్రి మాత్రమే గడపెనందురు. నేటి ప్రకాశంజిల్లా దర్శి తాలూకాలోని గంగవరపు కొండయే నాటి ధనముకొండ లేక ధనుసుకొండ. ఇట అయితమరాజు కోట శిథిలములు నేటికిని గలవు. అట్లే పంచలింగాలకొండ దగ్గర కాటమరాజుకోటపు గుర్తులు కనబడుచున్నవి.

13. కాటమరాజు జననము :-

ధాతనామసంవత్సర ఫాల్గున శుద్ధ పంచమి గురువారమునాడు కల్యాణ నగరమున సోమేశ్వరుని వరముచే పెద్దిరాజు పెద్దమ్మ దంపతులకు కాటమరాజు జన్మించెను. ఈ విషయము పెద్దిరాజు కథలోను, పాపనూక కథలోను గాథాకారులు కొందరు పాడుచున్నారు. ఫాల్గున శుద్ధ పంచమి యాదవులకు నేటికిని పర్వదినముగా నున్నది.

14. కాటమరాజు కులగోత్రములు :-

కాటమరాజు యదుకులమునకు చెందిన చంద్రవంశ క్షత్రియుడు; ఆత్రేయ గోత్రజుడు. 'అమ్మగారివారు, అయ్యగారివారు, దేవాదుల్లవారు, మారాచపువారు, బడుగులవారు, శివగణము-దేవగణము' అను షడ్దర్శనములలో కాటమరాజు బడుగుల దర్శనమునకు చెందినవాడు. అందువలననే వీరగాథలలో పలుతావులందు కాటమరాజు 'బడుగుల రాజు'గా స్తుతింప బడినాడు. ఈతని కుల దైవము ఆదిశక్తి యొక్క అవతారమగు గంగ. 'వల్లవులు- సిరమందులు' అను యాదవ ప్రధానశాఖలలో కాటమరాజు వల్లవులశాఖకు చెందినవాడు. ఈ వల్లవులు రాజ్యమును పాలించువారు. సిరమందులవారు వీరికడ మంత్రిత్వమును నెరపుచుందురు.

15. కాటమరాజు ఇంటిపేరు :-

గుత్తికొండ భక్తవత్సలకవి వ్రాసిన పద్యకావ్యమునుబట్టి కాటమరాజు ఇంటిపేరు 'కటియావులవారు'. వల్లురాజుకథ అను వీరగాథనుబట్టి కాటమరాజు ముత్తాత 'కవులావుల గంగురాజు'. ఇందు 'కవులావుల' అనునది యింటిపేరుగా కానవచ్చుచున్నది. ఈ కవులావుల నామమునే భక్తవత్సలకవి 'కటియావుల'గా మార్చియుండును. లేదా కాటమరాజు పెదతండ్రి కుమారుడగు 'కటియావులరాజు' పేరునే గృహనామముగా భ్రమించియుండును. కాటమరాజు తాత 'ఆవుల వలురాజు'. ఇందు 'ఆవుల' అనునది గృహనామముగా కన్పట్టుచున్నది. వలురాజు తండ్రికాలములో 'కవులావుల' అను ఇంటిపేరు, వలురాజు కాలములో "ఆవుల"

గా మారియుండును. కావున నాల [illegible] పేరు [illegible] ఇంటిపేరు మొదట 'కవులావులవారు' ([illegible] అవులవారు) గా [illegible], అది క్రమముగా "ఆవులవారు"గా మారినదనియు చెప్పుచున్నారు. [illegible] విస్తారమైన గోగణముచే ఇట్టి ఇంటిపేర్లుండుట సహజమే. [illegible] చెప్పిన "కటియావుల" అను ఇంటిపేరు పలనాటిలో ఎక్కడను కానుపించుటలేదు.

16. కాటమరాజు పేర్లు :-

కాటమరాజునకు మొత్తము పది పేర్లున్నట్లుగా [illegible] తెలియుచున్నది. అవి : "[illegible], [illegible], [illegible], [illegible], కాటమరాజు, కర్తేయుడు, [illegible]దేవుడు". [illegible] అనియు, [illegible] కాచుటచే ఆవులన్న అనియు, పసువులను [illegible] పసువులన్న అనియు నామములు కలిగినవి. [illegible] 'కాటకోటేశ్వరుడు, కాటమరాజు, కర్తేయుడు, [illegible]దేవుడు' అను పేర్లు [illegible].

17. కాటమరాజు బిరుదులు :-

కాటమరాజునకు దెబ్బదియేడు బిరుదులున్నవని [illegible]. "అంభోజబిరుదు, ప్రళయకాలబిరుదు, [illegible] తోరణాలు, [illegible] సింగిణీలు, విష్ణు బిరుదు, చంద్ర బిరుదు, గరుడ శార్దూల, కనక పతాకలు, పిగిలి తలాటము, పిగిలి కుచ్చులు, పంచలోహ తలాట, భస్మశంకర"- ఇత్యాది దెబ్బదియేడు బిరుదు లున్నవి.

18. కాటమరాజు ఆలమంద :-

యాదవులకు గోగణమే ప్రధానసంపద. కాగా యాదవచక్రవర్తియొక్క గోసంపదనుగూర్చి ప్రత్యేకముగా చెప్ప పనిలేదు. కాటమరాజు ఆలమంద అతి విస్తారమైనది. దీని అసంఖ్యాకత్వమును వర్ణించుచు గాథాకారులు ఒక చక్కని ప్రమాణమును చెప్పుచుందురు: "ఘనుడు కాటమరాజు ఆవులమంద కదిలితే ఆరామడ చెదిరితే పన్నెండామడ" అని పాడుచుందురు. జానపదులు కెంతటి అద్భుత కవితాశక్తి యున్నదో తెలుపుటకు ఈ ఒక్క వాక్యము చాలును. 'కదిలితే ఆరామడ చెదిరితే పన్నెండామడ' అనునది తలచిన కొలదియు పరవశత్వమును

# కాటమరాజు వంశవృక్షము (వీరగాథలను బట్టి)



కలిగింప ప్రయోగము: అతి విస్తారమైన కాటమరాజు గోగణము దగ్గరగా కుదిరి యున్నచో ఆరామడల వైశాల్యముగల భూమి నాక్రమించునట: ఆ గోవులు తమ యిచ్ఛవచ్చినరీతి చెదరి మేయసాగినచో పండ్రెండామడల వైశాల్యముగల భూమి నాక్రమించునట: ఈ ప్రయోగమే నాకు లభించిన "జన్నివాడ కథ" అను తాళపత్రగ్రంథములో నిట్లున్నది :

"కుదురు ఆరామడ కదులు పన్నెండామడ

కదలినవోయి కామధేనువులు: కాంభోధిమేసెను :" (పత్రసంఖ్య 17)

ఈ విస్తారమైన గోగణమును కాటమరాజు మొదట కడప మండలమునగల పాల కొండ ప్రాంతమునను, తరువాత కర్నూలు మండలములోని నల్లమల ప్రాంత మునను మేపి, ఆ పిమ్మట కనిగిరి మీదుగా నెల్లూరిసీమ కేగెను. అందువలననే కాటోలు ఈ కథలకు ప్రచారముకూడ కడప, కర్నూలు, నెల్లూరు మండలము లలో హెచ్చుగా నున్నది. ఈ మండలములలో కాటమరాజును గూర్చిన అనేక విషయములు జనశ్రుతిలో నున్నవి. రాయలసీమ నుడికారమును పుణికి పుచ్చుకొనిన నా ప్రియమిత్రులు దుంపా శ్రీరాములురెడ్డిగారు (కడపజిల్లా, పులివెందుల తాలూకా, బొజ్జాయిపల్లె గ్రామము) కాటమరాజు గోగణమును గూర్చి కడప మండలమున ప్రసిద్ధికెక్కిన ఒక సామెతను దాని వ్యుత్పత్తిని ఈ క్రిందివిధముగా జెప్పిరి ;

"మల్లేల కొండ గడ్డితిని మద్దులపాయ నీళ్ళుతాగితే, చిట్టెలుక కూడా చిట్టెడు పాలిస్తుంది''-అను సామెత నేడు రాయలసీమలో వ్యవహరింపబడుచున్నది. ఈ మాటలను కాటమరాజు స్వయముగా అన్నాడని ప్రజలు చెప్పుదురు. కాటమ రాజుయొక్క ఆలమంద మిక్కిలి పెద్దది. అది యెంత పెద్దది అనగా ఆ మహా గోగణము కదలుచుండగా ముందర నడచు ఆవులు గడ్డిని మేయుచు పోవుచుండ వాని వెనుకవచ్చెడి ఆవులు గడ్డిమోళ్ళను కొరుకుచు పోయెడివట; ఇంకను వెనుక వచ్చెడి ఆవులు గడ్డివేళ్లను పెరికి మేయుచు పోయెడివట; ఇక నా యాలమందలో చిట్టచివర వచ్చెడి ఆవులకు కసవువేళ్లు సహితము లభింపక, తమముందు పోయెడి ఆవులు వేసిన పేడను తినుచుండెడివట. ఇంత విస్తారమైన గోగణమును మేపు

టను బొమ్మునవ ప్రాంతమును కాటమరాజునకు అనుకూలింపలేదు. అతడు ఈ [illegible] దేశమున్నియు పరిభ్రమించెను. [illegible] పుష్కలముగా పచ్చిక సమకూర్పగల [illegible] లేదు. అట్లు కాటమరాజు [illegible] పులికాపుల ప్రాంతమునకు వచ్చెను. [illegible] "[illegible]" లేక "బాణాసురుడు గట్టు" ([illegible] బాణాసురుడు [illegible]) మాత్రము కాటమరాజు [illegible] గలిగినదట! అప్పుడు కాటమరాజు 'మల్లెలకొండ గడ్డితిని [illegible] నీళ్ళు తాగితే చిట్టెలుక కూడా చిట్టెడు పాలిస్తుంది' అని [illegible] గ్రామ వృద్ధులు చెప్పుచుందురు ('[illegible]' [illegible] బాణాసురుని గట్టువద్ద ప్రవహించెడి ఒక సెలయేరు).

19. కాటమరాజు వివాహము :-

కాటమరాజు భార్య పేరు '[illegible]' లేదా '[illegible]' అనియు బిలుతురు. ఈమె ఆదిశక్తియగు గంగమ్మ అవతారము. కాటమరాజు కల్యాణ పట్టణమున ఏడు సంవత్సరముల బాలుడుగా నున్నప్పుడు అతని తండ్రి పెద్దిరాజు, వాలికేతువరాజుపై దండెత్తిపోయి, అర్లపెంట రణమున మరణించెను. అప్పుడు కాటమరాజు తన తండ్రి పగ తీర్చుటకై అర్లపెంట రణమునకేగి వాలికేతువరాజును చంపెను. ఆ రణభూమిలో ఆదిశక్తి గంగ అతనిని చూచి మోహించి, తన్ను పెండ్లియాడుమని కోరెను. కాటమరాజు అందుకంగీకరింపక, ఆ యాదిశక్తిని మర్లవారియింట పుత్రికగా పుట్టవలసినదనియు, తాను పశువులను తోలుకొని ఉత్తర భూములకేగి, తిరిగి దక్షిణ భూములకు మరలునప్పుడు తప్పక ఆమెను వివాహమాడ గలననియు చెప్పి ఒప్పించెను. కాటమరాజు దక్షిణ భూములకు మరలునప్పుడు పాలేటికడ ఆదిశక్తి గంగ అతనిని అడ్డగించెను. మొదట వ్యతిరేకించినను కడకు కాటమరాజు ఆమెకు చేయెత్తి మ్రొక్కెను. అప్పుడు మర్లవారు వచ్చి తమ బిడ్డను వివాహమాడవలసినదని కాటమరాజును ప్రార్థించిరి. కాటమరాజు కత్తికి పుస్తెకట్టి మర్లవారిందిపడుచును వివాహమాడెను. ఇతని తండ్రి పెద్దిరాజు మదనకుంభిసులపైకి యుద్ధమునకు

పోవుమ ఒక సన్యాసుం మఠమును ముట్టడించేను. అప్పుడా సన్యాసులు "మావ లెనే నీ బిడ్డలు కూడ సన్యాసులుగా బ్రతుకుదురు" అని శపించిరి. అందువలన కాటమరాజునకు సంతానము లేదు. కాటమరాజు మర్లవారి వీరగంగను వివాహమాడి నట్లున్నదికాని ఆమెతో కాపురము చేసినట్లుగా ఏ వీరగాథలోను లేదు. వీరగంగ ఎల్లప్పుడును దొనకొండ అంతఃపురములో నుండెను. కాటమరాజు ఆలమందలతో దేశాటనము చేయుచుండెను. పాపనూకకు అసలు వివాహమే జరుగలేదు. పెద్ది రాజునకు గల శాపముచే పాపనూకకువలెనే కాటమరాజునకు కూడ, అసలు వివాహమే జరుగలేదని కొందరు గాథాకారులు చెప్పుదురు. ఇది సరికాదు. 'కాటమ రాజుకు పట్నం కట్టినకథ'లో భక్తిరన్న కల్యాణ నగరమునకుపోయి, సువ్వి పాటలు పాడుచున్న పాపనూకను గుర్తించి, ఆమెను కాటమరాజును ఎలమంచికి తీసికొని వచ్చినప్పుడు, కాటమరాజునకు మర్లవారి వీరగంగనిచ్చి వివాహము చేసినట్లుగా స్పష్టముగా నున్నది. కాటమరాజు భార్యగా ఈ వీరగంగ ప్రసక్తి పాపనూక కథ' లోను, 'అగుమంచి కథ' లోను, 'భక్తిరన్న' కథలోను వచ్చును. కాబట్టి కాటమరాజునకు వివాహము జరిగినది, కాని ఆతడు భార్యతో కాపురము చేయలేదు

20. వల్లవులు – స్త్రిరమందులు :-

యాదవులలో 'వల్లవులవా'రనియు, 'స్త్రిరమందులవా' రనియు రెండు ప్రధాన శాఖలున్నవి. యయాతికి శుక్రాచార్యుని కూతురగు దేవయాని యను బ్రాహ్మణ కన్యవలన కలిగిన సంతానము స్త్రిరమందుల వారు. వీరు ఏడు వేల మంది కలరట. యయాతికి శర్మిష్ఠయను రాచకన్యవలన కలిగిన సంతానము వల్లవుల వారు. వీరు ఆరువేలమంది. ఈ వల్లవులవారు రాజ్యమును పాలించు రాజులు. స్త్రిర మందులవారు వీరికడ మంత్రులుగానుందురు. అందుచే వల్లవులను 'రాజులవారు' అనియు, స్త్రిరమందులను 'ప్రధానులవారు' అనియు పిలుచుట కలదు. ఈ వల్లవులవారును స్త్రిరమందులవారును వియ్యమందుచుందురు. ఆరు వేల మంది వల్లవులతో స్త్రిరమందులలోని ఆరు వేల మంది వియ్యమందవలసి నదనియు; ఇక స్త్రిరమందులలో అధికముగానున్న వేయిమందిలో ఐదు వందల మంది ఒక వైపునను, మిగిలిన ఐదు వందలమంది మఱియొక వైపునను వియ్య మందుడనియు పల్లికొండ చెప్పెనట.

కాటమరాజు వంశ వృక్షములో పలురాజు, సింహాద్రిరాజు, పెద్దిరాజు, కత్తియావులరాజు, కాటమరాజు మొదలగు పురుషసంతతివారందరును వల్లవులు. వీరి భార్యలందరును స్థిరమందులవారి ఆడుబిడ్డలు. అట్లే [illegible] వరుసకు – కొమరమ్మ, [illegible], [illegible] – స్థిరమందుల వారింటి కోడండ్రు. [illegible] పాపినాయుడు, వల్లకొండ, పుత్త[illegible]రాజు, కల్లందుల పోతన్నడు మొదలగు వారందరును స్థిరమందులవారు. వీరు వల్లవుల అల్లుండ్రు, మామలువరుస. పలురాజు కుమార్తెయగు కాటమ్మను స్థిరమందుల వంశమువాడైన [illegible] పాపినాయుడు వివాహమాడెను. సింహాద్రిరాజు కుమార్తెయగు చిట్టెమ్మను [illegible] కల్లందుల పోతన్నడు వివాహమాడెను. పెద్దిరాజు కుమార్తెయగు పాపనూకను [illegible] నాచకూళ్ల నాయనికిచ్చి పెండ్లిచేయ సంకల్పించిరి; కాని పాపనూక [illegible] వంశమున జన్మించుటచేతను, నాచకూళ్ల నాయుని ఇల్లరికముంచుటకు [illegible] కొమరమ్మ అంగీకరింపక పోవుటచేతను ఆ పెండ్లి నిలిచి పోయెను. వల్లవుల పోలురాజు పుత్రికయగు అగుమంచిని స్థిరమందుల పుత్త[illegible]రాజునకిచ్చి పెండ్లి చేసిరి. వల్లవుల [illegible]రాజు పుత్రికయగు సింగెమ్మను స్థిరమందుల పుత్త[illegible]రాజు పెంపుడు కొడుకగు పోతయ్యకిచ్చి వివాహము చేసిరి. ఇట్లు వల్లవులును స్థిరమందులును పరస్పరము వియ్యమందుచుండుట కాటమరాజు కథాచక్రమందంతటను కాననగును.

నేడు యాదవులలో గల వివిధశాఖలలో ఎఱ్ఱగొల్లలు వల్లవులనియు పూజగొల్లలు స్థిరమందులనియు చెప్పవచ్చును.

కొన్ని వీరగాథలలో 'తిరమందులవారు' అని కానవచ్చుటచే ఈ శబ్దము యొక్క రూపనిష్పత్తి 'స్థిరమంత్రులు > స్థిరమందులు > తిరమందులు'గా భావింపవచ్చును.

## 21. యాదవులు శైవులే :–

కాటమరాజును విష్ణుమూర్తి అవతారముగా భావించు యాదవులు శైవులగుట విచిత్రము. "విష్ణువే కృష్ణుడు, కృష్ణుడే కాటమరాజు" అని యాదవుల నమ్మకము. కాటమరాజేకాక బొల్లావుకూడ విష్ణుమూర్తి అవతారమని యాదవులు

వీక్షించుతురు. కాటమరాజు కథలతోపాటు 'విష్ణు భాగవతము' (లేక కంసుడు కథ)ను గూడ యాదవ గాథాకారులు పాడుచుందురు. కాని యాదవులు వైష్ణవ మతస్థులైనట్లుగా ఏ వీరగాథలోను కానరాదు. పైపెచ్చు, ఎక్కడ చూచినను శైవ మత ప్రసక్తియే కానవచ్చును. చల్లపిన్నమనేని మంత్రి బ్రహ్మరుద్రయ్య శివబ్రాహ్మణుడు. పెద్దమ్మ, అగుమంచి జంగమారాధన చేసిరి. పోలురాజు సాక్షాత్తు శివాంశతోనే పుట్టినాడని చెప్పబడినది. ఈ పోలురాజు కథలో 'చంద్రగుప్తుని చాటువ', 'మల్లికాదేవి చాటువ' అను శ్రీశైల క్షేత్ర మాహాత్మ్యమును గూర్చిన శైవ పురాణ గాథలు చెప్పబడినవి. ఈ పోలురాజుకథకు 'శివపురాణ' మను నామాంతరమున్నది. సాక్షాత్తు శివుడే భక్తిరన్నగా జన్మించెనని చెప్పబడినది. ఇట్లు కాటమరాజు కథావక్రమున శైవ మత ప్రసక్తియే అడుగడుగునను ప్రత్యక్షమగుచుండును. వైష్ణవమునకు సంబంధించి, సింహాద్రిరాజు శ్రీకూర్మమందలి శ్రీ వైష్ణవులకు అభయమిచ్చినట్లుగా ఒక్క సంఘటన మాత్రమున్నది. ఇది తప్ప మరి యెచ్చటను వైష్ణవ మత ప్రసక్తి కానరాదు. కావున యాదవ వీరులందరును శైవులే! పల్నాటి వీరకథలలో కూడ వైష్ణవ మత ప్రసక్తి కన్న శైవమత ప్రసక్తియే హెచ్చుగా నున్నది. తెలుగుదేశమున శైవమత వ్యాప్తియు, తెలుగు సాహిత్యమున వీరగాథల విజృంభణమును ఏక కాలమున జరిగినవని నా అభిప్రాయము.

22. శ్రీనాథుని కర్తృత్వము :-

'పలనాటి వీరభాగవతము' అను పేర ఆ కథా చక్రమంతటిని మంజరీ ద్విపదగా రచించిన కవిసార్వభౌముడగు శ్రీనాథుడే 'కాటమరాజు చరిత్ర'ను గూడ ద్విపదగా రచించెనని జన వ్యవహారము. దీనికొక చక్కని కథను చెప్పుదురు:-

శ్రీనాథుడు పలనాటి వీరభాగవతమును పాడుకొనుటకు అనువుగా రచించినాడని తెలిసి, కొందరు యాదవులు అతని కడకుపోయి, "స్వామీ! తమకు తూమెడు వరహాలనిత్తుము. మా కాటమరాజు చరిత్రను పాటగా వ్రాసిపెట్టుడు" అని కోరిరట. శ్రీనాథు డందుల కంగీకరించి, తూమెడు వరహాలు లభించునన్న ఆశతో, నడుములు విరుగునట్లు దీక్షతో కూర్చుండి, యాదవ భారతమంతటిని

ద్విపదగా రచించెను. కాని యాదవులు తూమెడు వరహాల నిచ్చుటకు లోభించిరి. గొడ్డలిలో ఇనుపభాగమునకు కట్టెను బిగించు రంధ్రమును కూడ "తూము" అనియే పిలుతురు. అందుచే యాదవులొక గొడ్డలిరంధ్రముతో కొలిచి వరహాలను కాసులు, రువ్వలుగా మార్చిపోసి, శ్రీనాథుని కిచ్చిరట! శ్రీనాథుడు కోపించి "ఇదేమిరా! తూమెడు వరహాల నిత్తుమంటిరి కదా!" అని ప్రశ్నించెను. "తూము అంటే ఇదే స్వామీ!" అని యాదవులు సమాధానమిచ్చిరి. శ్రీనాథుడు వారి మోసమును గ్రహించెను. హృదయము భగ్గున మండెను. అడిగిన ఫలము దక్కలేదన్న విరక్తితో తాను కష్టపడి వ్రాసిన కాటమరాజు చరిత్రనంతయు విసరి ఒక నదిలో పారవేసెను. ఆ యాకులు నదిలో తేలుచు కొట్టుకొని పోవు చుండెను. యాదవులలో కొందరు నదిలో దుమికి వెదకి దొరికిన ఆకులు వారు తీసికొనిరి. ఆ చరిత్రలో కొందరకు మధ్యభాగము, మరికొందరకు మొదటి భాగము, ఇంకను కొందరికి చివరి భాగము లభించెనట. కాని ఆ యాకులకు శ్రీనాథుడింకను సంఖ్యాక్రమమును గుర్తింపలేదట. రాగతాళములను సూచింప లేదట, అందుచే యాదవులు మరల శ్రీనాథుని వెదుక వచ్చిరి. అతడు యాదవులు చేసిన మోసమునకు క్రుద్ధుడై, వేగముగా నడచి పోవుచుండెను. యాదవులాతని వెనుకబడి పోవుచు ఆ పత్రములకు వరుస సంఖ్యలను గుర్తింపుడనియు, కనీసము రాగతాళములైనను తెల్పుడనియు శ్రీనాథుని ప్రాధేయపడుచుండిరి. కోపముతోనున్న శ్రీనాథుడు వారి ప్రార్థనలను గణింపక పోవుచుండెను. ముందు శ్రీనాథుడు వెనుక యాదవులు- ఇట్లు కొంతదూరము పోవునరికి ఒక ఎరుకల గూడెము వచ్చెను. అటనొక ఎరుకత అల్లరి చేయుచున్న తనబిడ్డను విసుగుతో వీపుపై చరచెను. ఆ బిడ్డ ఏడ్వదొడగెను. ఆ యేడ్పును విన్న శ్రీనాధుడు, తన్ను పీడించుచు వెనుక వచ్చుచున్న యాదవులతో నిట్లనెను : "ఓరీ! మీపాటకు ఆ యేడుపు రాగమును పెట్టుకొనుడు, పొండు" అని కసరికొట్టెను అమాయకు లగు యాదవులది నమ్మి తమ కథల కా యేడుపు రాగమునే పెట్టుకొనిరి.[48]

---

48. ఈ కథను నెల్లూరుజిల్లా, నెల్లూరుతాలూకా, నరసాపుర గ్రామములో నున్న సుబ్బయ్య అను కొమ్ములవాడు 25-7-1966 న నాకు చెప్పినాడు.

ఈ కథలోని సత్యాసత్యము లేట్లున్నను, నేడు కాటమరాజు చరిత్ర అంతయు ఏయొక్కరి దగ్గరను లభింపకుండుట. ఈ గాథాగానమంతయు ఎక్కువగా శోకభూయిష్ఠమై యుండుట మాత్రము సత్యములే !

శ్రీనాథుడు కాటమరాజు చరిత్రను రచించినాడనుటకు పైన తెల్పిన జన, శ్రుతియే కాక, యిరువురు కవులును సాక్ష్యమిచ్చుచున్నారు. ఈ కవులు కూడ ఏవియో కావ్యములను రచించిన కవులుకాక, కాటమరాజు కథలను రచించిన వారేయగుటచే వీరివాక్యములు మరింత విశ్వసనీయములగుచున్నవి. గుఱ్ఱముకొండ భక్తవత్సలకవి 'కఱియావుల కాటమరాజుచరిత్ర' అను పద్యకావ్యమును రచించెను. (ఇది కాటమరాజు చరిత్రను సంపూర్ణముగా వర్ణించు కావ్యము కాదు. ఇందు పెద్దిరాజుకథ, కాటమరాజు అర్లపెంటయుద్ధము మాత్రమే వర్ణింపబడినవి) దీని అవతారికలో కవి తనకు శ్రీనివాసుడు కలలో ప్రత్యక్షమై శ్రీనాథుడను కవిశ్రేష్ఠుండు కాటమరాజు చరిత్రను ద్విపదగా రచించెనని చెప్పినట్లు వ్రాసికొన్నాడు.

"... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
హరికథ విని యా రాత్రి నిద్రింప
శ్రీనివాసుండిట్లు చెప్పెఁగలను
శ్రీనాథుఁడను కవిశ్రేష్ఠుండు ద్విపదగా
రచియించెఁగాటమరాజు చరిత
మది నీవు నాపేర నంకితంబుగఁ బద్య
గద్యాత్మకంబుగా ఘనత నుడువు
మని చెప్పి తిరోహితుఁడయ్యె ......"49.

ఈ కాటమరాజు కథాచక్రమున నేడు లభ్యమగుచున్న కొన్ని వీరగాథలకు కర్త 'గంగుల పినయెల్లయ్య' అని తెలియుచున్నది. ఈ కవి తాను రచించిన 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' అనుకథలో (ఇదిమదరాసు ప్ర. ప్రా. లి. పు. భాం. న

---

49. కఱియావుల కాటమరాజు చరిత్రము, ఆంధ్రయాదవ సంఘ ప్రచురణ, 1926, పుట 3.

'కాటమరాజు చరిత్ర' అను పేరుతో నున్నది. వి. నె 1040. దీనిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరింపగా ఆంధ్రగ్రంథమాలయము వారు 'కాటమరాజుకథ' అను పేరుతో ప్రకటించిరి. దాని యందు నిజముగను 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' మాత్రమే)-అవతారికలో తాను వ్రాయుచున్న యదు శాస్త్ర చరిత మంతయు మున్ను శ్రీనాథుడు రచించెననియు, అదియే తనకు మార్గదర్శకమనియు స్పష్టముగా తెల్పియున్నాడు:

"హరిపాద సేవకుండవని భక్తి పరుండు
నుభయత్రైన కౌసుమాల గోత్రాబ్ధి చంద్రుం
డనయంబు గంగుల యెల్లయ్య పౌత్రు
తనయుడు సర్వన తగు సహోదరుడు
పినయెల్లయను వాడు ప్రియము దీపింప
వలనొప్ప శ్రీనాథు వచన పద్ధతిని
సలిపెను యదు శాస్త్ర చరిత మంతయును"[50].

ఇందలి 'శ్రీనాథు వచన పద్ధతిని' అనుమాట విమర్శకులకు పని కల్పించినది. 'పూర్వము శ్రీనాథుడు వచనముగా వ్రాసిన కాటమరాజు చరిత్రను బట్టి గంగుల పిన యెల్లయ్య మంజరిగా తిరిగి రచించెను' అనునట్లుగా వాక్యార్థమును బట్టి స్ఫురించును. కాని యిది సరికాదు. తెలుగు సాహిత్యమున పూర్వకవులు కొందరు తాము రచించిన పద్య ప్రబంధములను కూడ 'వచన కావ్యము' అని పేర్కొన్నారు. హరిభట్టు అనుకవి తన వరాహ పురాణమను ప్రబంధమును[51], లోకేరావు సోమన అనుకవి తన శివరాత్రి మాహాత్మ్యమును పద్య కావ్యమును వచన కావ్యములుగా పేర్కొనియున్నారు. కావున శ్రీనాథుడు కాటమరాజు చరిత్రను ద్విపదచ్ఛందముననే రచించియుండును కాని వచనమున వ్రాసియుండడు.

---

50. కాటమరాజు కథ, వేటూరి (పరిష్కృతము) పుట 1.

51. "శబ్దభావనవరసాలంకారాను బంధురంబుగా నొక్క ప్రబంధ బాంధ్ర భాషా భవ్యంబగు వచన రచనా కావ్యంబుగా రచియిపం బూనిన సమయంబున" -వరాహపురాణము, అవతారిక.

గుణ్ణముకొండ భక్త వత్సలకవి శ్రీ నాథుడు కాటమరాజు చరిత్రను ద్విపదగా రచించెనని స్పష్టముగా వ్రాసియున్నాడు.

ఇట 'శ్రీనాథుని వచన పద్ధతి' అనగా 'శ్రీనాథుడు చెప్పిన విధము ననుసరించి' అని ఆచార్య తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారు అర్థము చెప్పిరి[52]. మల్లంపల్లి సోమశేఖరశర్మగారును ఇట్లే యర్థము చెప్పిరి: "ఇక్కడ వచనమనగా ఉక్తి, చెప్పబడినది, వాక్రువ్వబడినది అను నర్థమున చెప్పకొనవల సినట్లున్నది. 'ఆంధ్రభాషా భవ్యంబగు వచనరచనా కావ్యంబుగా' అని హరిభట్టు చెప్పిన దానిలోని వచనమున్న దానికి శబ్దము, ఉక్తి, పలుకు, నుడికారమనియే యర్థము. అందువలన 'వచన పద్ధతి'యనఁగా 'చెప్పిన పద్ధతి'యని యర్థము చేసి కొనవచ్చును"[53].

ఆచార్య బి. రామరాజుగారు మాత్రము ఈ 'వచన పద్ధతి'కి మరియొక యర్థమును సూచించిరి. "వచన పద్ధతిని అన్నమాటలు చిత్రములు. శ్రీనాథుడు వచించిన పద్ధతి యని కొందరు సర్దుకొనినటుల కానవచ్చును. నాకు జూడగా వచన పద్ధతి యనగా పాడిన పద్ధతి యని తోచుచున్నది"[54]. అని చెప్పి, ఏగంటి వారి వచనములును, కృష్ణమాచార్యుల వారి సింహగిరి వచనములును పాడబడుట నుదాహరించిరి. తాళ్లపాక వారి వచనములు రాగయుక్తముగానున్నవి. ఇట్టి వచనములను పాడు పద్ధతిలోనే శ్రీనాథుని కాటమరాజు కథ కూడ పాడబడుచుండెడి దని రామరాజుగారూహించినారు. ఒక్క తీరుగా నడువని కాటమరాజు కథాచ్ఛం

---

52. "ఇచట 'శ్రీనాథుని వచన పద్ధతి' యనఁగా 'శ్రీనాథుఁడు చెప్పిన విధము ననుసరించి' యనియే యర్థము చేసికొనవలసియున్నది. అంతియేకాని దీనిఁ బట్టి శ్రీనాథుఁడు కాటమరాజు కథను వచనముగా వ్రాసి నాఁడనియు, దానిఁ బట్టి యాతఁడు ద్విపదగా దీని రచించెననియుఁ జెప్పఁ గుదురదు"—కాటమరాజు కథ వ్యాసము, ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక, పుట 35.

53. కాటమరాజు కథ, పీఠిక, పుట xxi

54. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 205

ద్రము కూడ దీనికి తార్కాణమనిరి. రామరాజుగారి యూహ సమంజసముగనే యున్నది. ఏలయన, దొనకొండలో నేటికిని భట్టురాయబారము కథ వచన పద్ధతినే పాడబడుచున్నవి. మిగిలిన కథలలో గూడ, శోకాలాపన కొంత యున్నను, వర్ణన తీవ్రముగానుండు యుద్ధ ఘట్టములందు మాత్రము వచన పద్ధతిని పాడబడుచుండుట నేను స్వయముగా వింటిని

పై చర్చను బట్టి 'వచన పద్ధతి'కి ఏ యర్థము చెప్పుకొన్నను, మొత్తము మీద శ్రీనాథుడు కాటమరాజు చరిత్రను ఛందోబద్ధముగనే రచించెను. కాని, వచనము (Prose)గా వ్రాయలేదనుట మాత్రము స్పష్టము.

కాని, శ్రీనాథుడు రచించిన కాటమరాజు కథలలో నొక్కటి కూడ నేడు లభించుట లేదు. అయినను కొన్ని కథలు రచనా విధానమును బట్టి శ్రీనాథ కృతములై యుండునని ఊహింపబడుచున్నవి. వీనియందు కవినామము చెప్పబడలేదు. (పల్నాటి కథలలో నిట్లుగాక, శ్రీనాథకృతములని స్పష్టముగా అవతారికలోగల వీరగాథలు లభ్యము లగుచున్నవి). అట్టి వానిలో ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట ఒకటి. వేటూరి పరిష్కృత కాటమరాజు కథలోనిది అనుబంధముగా నీయబడినది. (కాటమరాజు కథ అను పేరుతో ప్రధాన కథగా ముద్రింపబడినది గంగుల పిన యెల్లయ్య రచించిన ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట). దీనిని గురించి తిమ్మావజ్ఝలవారు ఇట్లు ఊహించినారు: "కవిత్వము రసవంతముగా నుండి రచన మేలయినదిగా నుండుటచే నిది శ్రీనాథ రచన మేమోయని కూడ ననుమానింపదగియున్నది. ఇందలి రచనము పలనాటి వీరచరిత్ర రచనము ననేక విధములఁ బోలియుండుటయే యీ యనుమానమునకుఁ గారణము."55 ఇట్లు ఊహించునట్టి కథలేకాని, పల్నాటి కథలలోవలె శ్రీనాథ కృతములని ప్రత్యక్షముగా కనబడునట్టివి కాటమరాజు కథలలో లభ్యమగుట లేదు.

## 23. వెలుగునకు వచ్చిన కొత్తకథలు.

కాటమరాజు కథాచక్రమున ముప్పదిరెండు వీరగాథలున్నవని నా పరిశోధన వలన తెలిసికొంటిని. ఇందు సాహిత్యలోకమునకు తెలిసినవి అయిదు

---

55. కాటమరాజుకథ, వ్యాసము, ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక, పుట 46.

కథలు మాత్రమే. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, భట్టురాయబారము, కోటపాటి తాటి వృక్షం తెచ్చేకథ, అగుమంచికథ, ఆద్యంతరహితమైన పోలురాజుకథ-ఈ అయిదును మదరాసు, తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములలో నున్నవి. ఇందు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'కు రెండు ప్రతులున్నవి. ఒక ప్రతి గంగుల పిన యెల్లయ రచనగా తెలియుచున్నది. (ఇదియే కాటమరాజు కథ అనుపేరుతో మదరాసు ప్ర.ప్రా.లి.పు భాం. వారిచే ప్రకటింపబడినది). రెండవది శ్రీనాథుని రచనగా నూహింపబడుచున్నది. తక్కిన కథల రచయితలు తెలియవచ్చుట లేదు.

కాటమరాజు కథాచక్రములోని ముప్పదిరెండు కథలలోను పై అయిదు కథలను మినహాయింపగా మిగిలినవి ఇరువదియేడు కథలు. ఈ యిరువదియేడు కథలలో నేను శ్రమపడి, ఆంధ్రదేశమున పర్యటించి, మరి పదునేడు కథలను సంపాదింప గలిగితిని. వీనిలో ఏడు కథలలో కవుల నామములున్నవి. మిగిలిన పది కథలలో లేవు. నాకు లభించిన యీ వీరగాథలనుబట్టి శ్రీనాథుడు, గంగుల పినయెల్లయలతోపాటు మరి యేడ్గురు క్రొత్తకవులు వెలుగులోనికి వచ్చిరి. వీరిని గూర్చి వివరింతును:

1. వడరుప మద్దులేటికవి :- ఈ కవి కాటమరాజు కథాచక్రమందలి ప్రథమ వీరగాథయగు 'ఆవుల వలురాజుకథ'ను ద్విపదగా రచించెను. ఇతని తాత (పితామహుడు) మూలయ్య; తండ్రి పెద్దనార్యుడు. ఇతని యింటిపేరు 'ఘనవర్తి'యో లేక 'వడరుప' యో కావలెను. లేదా "వడరుప" యనునది గోత్ర నామమైన కావలెను. ఆవుల వలురాజు కథాంతమున తన్నుగూర్చి యిట్లు చెప్పు కొనెను :

"అనుమతి వడరుపాన్వయుడైన
ఘనవర్తి మూలయ్య కలిత పౌత్రుండు
పెద్దనార్యుని కూర్మి ప్రియనందనుండు
మద్దులేటసు బుద్ధిమంతు డొలురాజు
చరితను పూర్ణంబు చేయంగ దలచి
యిరువంద రచియించె ఇవరమంతయును"

ఇందలి 'అన్వయ' శబ్దముచే మద్దులేటి కవి ఇంటిపేరు 'వడరుప' యేయనియు, "మనవర్తి" యనునది ఈతని పితామహుడైన మూలయ్యకు విశేషణమనియు నేను భావించుచున్నాను. ఈ తాళపత్ర గ్రంథము నాకు 1966లో పల్నాడులో లభించినది.

2. మల్లయ్య :-

ఇతడు "పంపాద్రికథ" ను ద్విపదగా రచించెను. ఇతని తండ్రి జంగమయ్య. "సలిపెను యమశాస్త్ర చరిత మంతయును" అని చెప్పుకొనిన గంగుల పినయెల్లయ వలెనే యీ మల్లయ్యకూడ యాదవ చరిత్ర మంతటిని వ్రాసి యుండునని అవతారికనుబట్టి తెలియుచున్నది. ఇతడును (గంగుల పిన) యెల్లయ్యయు నొక్కరు కాదనుటకు, "మల్లయ్య" యనుపేరు యతిస్థానమున ప్రయోగింపబడి యుండుట గొప్ప నిదర్శనము. ఇతడు తన అవతారికలో తెరచీర భక్తులను స్మరించినాడు. తెరచీర భక్తులనగా కాటమరాజు కథలను పాడు సుద్దుల గొల్లలు.

ఈ మల్లయ్య రచించిన పంపాద్రి కథయొక్క తాళపత్ర గ్రంథము నాకు నెల్లూరుజిల్లా (నేటి ప్రకాశంజిల్లా) దర్శితాలూకా గంగదొనకొండ గ్రామములో 1966 లో లభించినది. ఈ మల్లయ్యకవి యాదవ చరిత్రను వ్రాయుటయే కాక, పాడి, ప్రజలను మెప్పించి, గుఱ్ఱములు గొడుగులు అరిగెలు ధనధాన్య వస్తువులు బహుమానముగా బడసెనట: చూడుడు:

"రయమొప్ప యాదవ రాజుల చరిత
చెప్పెను వినరయ్య జనులార మీరు
వాకలిగి తన కీర్తి వహించి మించి
ప్రాకటముగ చెప్పి ప్రజల మెప్పించి
గుఱ్ఱములు గొడుగులు గురుతైన అరిగెలు
మెరుపణి త్యాగములు, మెండుగానంది
ధనధాన్య వస్తువులు తనర అమృతము
అనుదినము తన యింట అతి తుష్టిగాను
[illegible] కీర్తులు వెలసిన ఘనుడు

జంగమయ్య సుతుండు జనులు మెచ్చంగ
సంగతిగ కవిత్వ సారస్యమెరిగి
దిట్టముగ యాదవ ధీరుల చరిత
గట్టిగా జెప్పేను కణగి సభవారు
ఆటంకారముగ నవరస అలంకారమున గూర్చి
మాటలు రత్నాలుగాను మల్లయ్య యనువాడు
సొంపుతో వినరయ్య చోద్యవేద్యముగ
పంపాద్రికథ చెప్పేను ప్రఖ్యాతిగాను"

పల్నాటి వీరకథా చక్రమందలి 'కోడిపోరు'కథను రచించిన మల్లయ్యయు ఇతడును ఒక్కరో లేక భిన్నులో తెలియకున్నది కోడిపోరు రచించిన మల్లయ్య తన తండ్రిపేరు చెప్పుకొనలేదు. కృష్ణామండలమున నాకు వేరొక పంపాద్రి కథ లభించినది. కాని అందు కవిపేరు లేదు. అది మల్లయ్యరచనకంటె భిన్నమైనది.

3. కనకబండి ఘట్టయ్య (ఘంటయ్య) :

ఈ కవి రచించిన 'ఆవుల పోలరాజు కథ' తాళపత్ర గ్రంథము నాకు నెల్లూరు మండలము (నేటి ప్రకాశం మండలము)న దర్శితాలూకా గంగ దొన కొండ సమీపమున గల ఎర్రబాలెము గ్రామములో 17-9-1966 న లభించినది. ఈ కథావతారికయందు ఇష్టదేవతా ప్రార్థనము తరువాత కవి తన్ను గూర్చి చెప్పుకొన్నాడు. ఈ కవిపేరు ఘట్టయ్య (ఘంటయ్య) అనియు, ఇంటిపేరు 'కనకబండి వా'రనియు, స్వగ్రామము 'కొండపల్లె' యనియు, ఇతనిది "కన్నె సిరుల గోత్ర" మనియు, కథావతారికనుబట్టి స్పష్టమగుచున్నది :

"వింతగా చౌషష్టి విద్యలకు నెలవు
పంతమున ఆ కొండపల్లెలోపలను
కొనసాగు కన్నెశిర్లగోత్ర పావనుడు
గొనకొని కనకబండి కొండప్ప సుతుడు
నెటింప ఘట్టయ్య నేర్చిన కొలది
తేటతెల్లముగాను తెల్పి చెప్పెదను
... ... ... ... ...
ఆవుల పోలురాజుకథ ఆలించి వినుడ

ఈ కనకబండి పుట్టయ్య యనుకవి పోలురాజుకథనే కాక, 'కంసుడు కథ' లేక 'విష్ణు భాగవతము' అను కథను గూడ రచించెను. దీని తాళపత్ర గ్రంథము కూడ నాకు లభించినది. ఈ కంసుని కథావతారిక యందు పై వివరములే యున్నవి.

4. పినయెల్లన :

ఈ కవి రచించిన "కటియావులరాజు కథ" నాకు లభించినది. ఇతనిది కొమనాల గోత్రము, యాదవకులము తల్లి చెన్నమాంబ. ఇతడును మదరాసు ప్ర.ప్రా.లి.పు. భాం. వారు ప్రకటించిన వేటూరి పరిష్కృత 'కాటమరాజుకథ'ను రచించిన గంగుల పినయెల్లయయు నొక్కరే కావచ్చును. అతనిదికూడ కొమనాల గోత్రమే. కాని యీ కటియావుల రాజు కథలో పినయెల్లన యింటిపేరుకాని, తండ్రి పేరు కాని కానవచ్చుటలేదు, ఆ భాగము శిథిలమైనది. సోదరుని పేరు మాత్రము 'సరువ భీమణి' అనియున్నది. గంగుల పినయెల్లయ సోదరుడు'సర్వన' అని మన మెరుగుదుము.కాటమరాజు కథారచయిత తన తల్లి పేరు చెప్పుకొనలేదు. ఈ కటియావులరాజుకథా రచయిత తనతల్లి "చెన్నమాంబ" యని చెప్పుకొన్నాడు

నాకు లభించిన కటియావులరాజుకథ తాళపత్ర గ్రంథము. ఇది పల్నాడులో గామాలపాడు గ్రామమున 31-8-1966న లభించినది. ఈ గ్రంథమున అవతారికలో ఇష్టదేవతా ప్రార్థనము తరువాత కవిని గూర్చి యిట్లున్నది :-

"కొమనాల గోత్రుండు గుణవిశాలుండు
కొమరొప్ప యాదవ కులవంశ (ఘను)డు
అతని (కులసతియ)గు చెన్నమాంబ
అంగన చెన్నమాంబకు వరసుతుండైన
ధీరుడైన సరువభీమణి సౌమిత్ర
అరూఢి పినయెల్లన అతి (మోద) మునను
కరియావుల రాజును ఘనతతో తలచి
రంగుగ కరియావుల రాజు చరిత్ర
సంగతి చెప్పెను శ్రోతాజనానందము గాను" (వ్రాత సంఖ్య-1)

తండ్రి పేరు, ఇంటిపేరు లేకున్నను, కొమనాలగోత్రము, సోదరుతు సర్వన పేర్కొనబడుటచే నీతడు కాటమరాజుకథ (ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట)ను రచించిన గంగుల పిన యెల్లయ అనియే తలపవలసియున్నది. ఇతడు యాదవ కులమువాడనియు, ఇతనితల్లి చెన్నమ్మ అనియు నాకు లభించిన తాళపత్రప్రతిని బట్టి తెలియవచ్చు ఆధికాంశములు. ఈ గంగుల పిన యెల్లయ లేక పిన యెల్లన యదుశాస్త్ర చరిత్ర మంతటిని (కాటమరాజు కథా చక్రమంతయు) రచించెనని వేటూరి వారు పరిష్కరించిన కాటమరాజుకథలో నున్నది. నాకు లభించిన ఈ కటియావులరాజుకథ దీనికి బలమును చేకూర్చు చున్నది.

౫. కట్టెబోయిన మారయ్యకవి :-

ఇతడు యాదవ గాథా చక్రమున 'కాటమరాజుకు పట్నం కట్టిన కథ'ను రచించెను. దీనికి 'కాటమరాజు పట్టాభిషేకము' అను నామాంతరము గాథాకారు లలో వ్యవహారమున నున్నది, 'పట్టము' అనుశబ్దమును జానపదులు 'పట్నం'గా నుచ్చరించుచున్నారు. ఈ తాళ పత్ర గంథమును నేను 1964లో కృష్ణామండ లమున సంపాదించితిని. ఈ కథకు ముందు పెద్ద అవతారిక యున్నది. మొదటి మూడు పత్రములలోను కవియున్న పట్టణ వర్ణనము, కవివంశాదికము, కృతి పతి వంశాదికము వివరముగా నున్నది.కవి తన ఊరుపేరున చెప్పలేదు కాని, ప్రబంధధోరణిలో పురవర్ణన చేసినాడు. కృతిభర్త కవికి బావగారు. అతనిపేరు జంగమయ్య. ఇంటిపేరు గంగాళపువారు. ఇతడు కొమనాల గోత్రు డని చెప్పబడినది. ఇందు చేయబడిన కృతి భర్త-వంశక్రమ వర్ణన నిట్లు చూప వచ్చును:

గంగాళపు రామకృష్ణ (భార్య : పెద్దమ్మ)
|
రాఘవయ్య
|
(మొదటిభార్య 'అంత్రిమ్మ' యందు) — (రెండవభార్య 'ఎఱ్ఱమ్మ' యందు)

(మొదటిభార్య 'అంత్రిమ్మ' యందు):
- అయ్యన
- జంగయ్య (భార్య : గగమ్మ) (ఇతడే కృతిభర్త)

(రెండవభార్య 'ఎఱ్ఱమ్మ' యందు):
- గురవయ్య

కవియగు కట్టెబోయిన మారయ్య, కృతి భర్తయగు జంగమయ్య భార్య గంగమ్మకు సోదరుడు. అనగా ఈ కవి తన బావగారి పేర వీరగాథను అంకితము చేసెను :

"ఎసగ నా గంగ ప్రాణేశు పేర
వరుస గంగాళపు వంశజుని పేర
గురుతైన కొమునాల గోత్రుని పేర
పరనెంచ రామయ్య తనయుని పేర
ఛప్పన్నదేశాది జంగము పేర
చెప్పనిట్లు ఖలి ప్రసిద్ధంబుగాను
కాటమరాజుకు పట్నము గట్టిన కథయు" (ఆకు-3)

అవతారికను బట్టి యీ కవి యింటిపేరు కట్టెబోయిన వారనియు, ఇతడు సకల యాదవ కథలను చదివి చెప్పగలవాడనియు తెలియుచున్నది. కృతిభర్త యగు జంగమయ్య కవిని పిలిచి యిట్లు చెప్పినట్లుగా మారయ్య తన కథావతారికలో వ్రాసికొనినాడు :

"తన బావమరదిని మారయ్యను తప్పక చూచి
యెనయంగ కట్టుబోయిన్ వారింట
మతిగలవాడవు మరి చెప్ప చదువ
నతినేర్పులయందు నమర మారయ్యవు
సకల యాదవకథలు చదివి చెప్పితివి
వకటి నిన్నడిగేను వనర గావించు
ఆవులను కల్యాణమందుండి
ఏ విధంబున దెచ్చి రెవరింట పెండ్లి
ఏ విధంబున జేసి రెల్లయాదవులు
సుముఖుడై తొల్లి కృష్ణుడు దెచ్చినట్టి
తమక మెక్కించి రే తగవున నతని
మట్టసంబుగ ఆల మందలకెల్ల
పట్నంబు గట్టి రే పగిది చేపట్టి

ఆ కథ నాపేర నంకితముగాను
చేకొని చక్కంగ చెప్పంపు మనుచు" (ఆకు-౩)

'సకల యాదవకథలు' అను ప్రయోగముచే ఈ కవి కాలమునాటికే కాటమరాజునకు సంబధించిన అనేక వీరగాథలున్నవనియు, కాటమరాజుకథ అనునది ఒక్క వీరగాథ మాత్రమే కాదనియు, అదియొక సుదీర్ఘ కథాచక్రమనియు స్పష్టమగుచున్నది.

పంపాద్రి కథను రచించిన మల్లయ్య తాను జంగమయ్య పుత్రుడనని చెప్పికొన్నాడు. ఆ జంగమయ్యయు, కాటమరాజుకు పట్నం కట్టిన కథను అంకితము పొందిన ఈ జంగమయ్యయు నొక్కరేమో తెలియదు.

6. మంగళపురి వెంకటాద్రి (కదిరి మంగళము వెంకటాద్రి): —

ఈ కవి పాపనూకకథను రచించెను. ఈ వీరగాథకు సంబంధించిన మూడు తాళపత్ర గ్రంథములు నాకు లభించినవి. 1966లో చిత్తూరు జిల్లాలో లభించిన ప్రతిలో అవతారిక యిట్లున్నది :

"కదిరి మంగలము చిన బసవయ్య సుతుడు
శేష వాల్మీకుడు చెలువొప్ప వెంకటాద్రి చెప్పిన కథయు
ప్రజలకు ఇంపుగాను పాపనూక కథయు
చెప్పేను వినవయ్య చెవుల పండువగాను"

దీనిని బట్టి మూక పేరు 'వెంకటాద్రి' అనియు 'శేష వాల్మికుడు' అనునది యితని బిరుదమో లేక నామాంతరమో అనియు, తండ్రిపేరు 'చినబసవయ్య' అనియు, ఇంటి పేరు 'మంగళము' వారనియు, నివాసము 'కదిరి' అనియు గ్రహింప వచ్చును.

1964లో కృష్ణాజిల్లాలో లభించిన ప్రతిలో. అవతారిక యిట్లున్నది :

"భావింపంగ మంగళపురి చిన్ని
బస్వన్న పుత్రుండు ప్రఖ్యాతిగాను
శేషు వాల్మీకుండు చెలువొప్ప వెంకటి
ప్రజలకు ఇంపుగాను పాపనూక కథయు

రాజీతంబుగ ఈ కథ రయమున గూర్చి
గానకాని చెప్పెను కులము వినరయ్య"

ఇందు 'కదిరి' పేరులేదు. ఇంటిపేరు 'మంగళపురి' అని కలదు. తండ్రి పేరు చిత్తూరుజిల్లా ప్రతిలో 'చిన బసవయ్య' అనియుండగా, దీనిలో "చిన్న బస్వన్న' అనియున్నది. (రెండింటికిని పెద్ద భేదము లేదు). కవిపేరు "వెంకటి" అని యున్నది. 'శేషవాల్మీకుడు' అను బిరుదము చెప్పబడినది. కృష్ణాజిల్లాలోనే లభించిన వేరొక తాళపత్ర ప్రతిలో అక్షరము లన్నియు తప్పులుగానున్నవి. అందు "కదిరి" నామమున్నది. కవిపేరు "వెంకట" అనికలదు.

మొత్తముపై పైన తెల్పిన మూడుప్రతులకును రచయిత ఒక్కడే అనుట స్పష్టము. అతనిపేరు 'వెంకటాద్రి' లేక 'వెంకటి'. అతని తండ్రి 'చిన బసవయ్య' లేక 'చిన్ని బసవన్న'. ఇతని యింటిపేరు "మంగళపురి" కాని "మంగళము" కాని కావచ్చును. ఇతడు కదిరి గ్రామమునకు చెందినవాడని ఊహింపవచ్చును. లేదా మొత్తము "కదిరి మంగళము" అనునదియే యితని యింటి పేరును గ్రామము పేరును కావచ్చును.

7. జరుగుపల్లె చెన్నయ్య :-

ఇతడు "అగుమంచికథ"ను రచించిన జానపదకవి. తాను "అరుంధతి పుట్టింటి ఘనుడ"నని చెప్పుకున్నాడు. ఇతడు పూర్వకవిస్తుతిలో కాళిదాసుని పేర్కొనుటచే మంచి సంస్కారముగల కవియని చెప్పవచ్చును. ఈతని రసవంత మగు కవిత్వమును దీనికి పోషకముగానున్నది. ఈ చెన్నయ్యకవి కాళిదాసుని స్తుతించిన తరువాత బాబావీరుల ప్రజ్ఞను కొనియాడినాడు. ఇష్టదేవతా ప్రార్థన, పూర్వకవిస్తుతి తరువాత తన్నుగూర్చి యిట్లు వ్రాసికొన్నాడు :

"వాలాయముగ నందరిని వాక్కున దలచి
సంధిలక్షణమెరిగి చెప్పనేర్చిన యట్లు
ముందుగా సంభువులు ముద ... ... ...
... ... ... ... ... ... ఘనత విలసిల్లు
చెలగి జరుగున పల్యా చెన్నయ్యను వాడు
పుడమి అరుంధతికి పుట్టింట ఘనుడు
కడువేగ అగుమంచి కథ ... ... ... ..

శ్రీకరంబుగ చెప్పెద చెలగి యాదవుల కథ
ప్రాకటంబుగ వినుడా ప్రఖ్యాతిగాను"

ఈ అగుమంచికథ తాళపత్రగ్రంథము నాకు చిత్తూరుజిల్లా, చంద్రగిరి తాలూకా, పెడకంటిపల్లె గ్రామములో 1-3-1966న లభించినది. తోడేటి సుబ్రహ్మణ్యము అను భట్టువాడు (కొమ్మలవాడు) ఇచ్చినాడు. ఈ గ్రంథ లేఖకుడు తోడేటి పాపయ్య కుమారుడగు కోటయ్య అనియు, ఇతడీ వ్రాతను క్రీ.శ. 1891లో వ్రాసెననియు గ్రంథాంతమున నున్నది. ఈ లేఖకుడు, నాకీ గ్రంథము నిచ్చిన సుబ్రహ్మణ్యము వంశములోనివాడే యని ఆ గ్రామవృద్ధులు నాకుచెప్పిరి. ఈ లేఖకునికి ''పల్లె" అను శబ్దమును ''పల్యా" అని వ్రాయు నలవాటుకలదు. గ్రంథాంతమున 'పెడకంటిపల్లె గ్రామ'మని వ్రాయుటకు బదులు 'పెడకంట్టి పల్యా గ్రామం' అని వ్రాసినాడు. దీనినిబట్టి యితడు వ్రాసిన 'పల్యాచెన్నయ్య' అనునామము నిజమునకు 'పల్లె చెన్నయ్య' అని గ్రహింప వలసియున్నది.

'చెలగి జరుగున పల్యా చెన్నయ్యానువాడు' అను పాదములో 'జరుగున' అను శబ్దమునకు అర్థము కుదురుటలేదు. ఇది కూడా కవి యింటిపేరులోని భాగమేమో! అగుచో కవిపూర్తిపేరు 'జరుగు(న)పల్లె చెన్నయ్య' కావచ్చును. నెల్లూరుజిల్లా, గూడూరు తాలూకాలో 'జరుగుపల్లె' (జరుగుమిల్లి) గ్రామమున్నది. ఈ గ్రామ నామమును గృహనామముగా గలవారున్నారు.

డా. వేటూరి ఆనందమూర్తిగారు 'పరిశోధన' సంచికలలో ప్రకటించిన అగుమంచి కథయు, నాకు లభించిన తాళపత్ర గ్రంథమును ఒక్కటే. కాని ఆనందమూర్తిగారి గ్రంథమున మొదట అవతారికతోపాటు కథాభాగము కూడ చాల లోపించినది (చూ. పరిశోధన, 1956, సంచికలు 5,6,7). నా తాళపత్ర గ్రంథములో మొదటి ఏడు పత్రములలో నున్న కథాభాగము వారు ప్రకటించిన దానిలో లేదు. అనగా సుమారు 500 పాదములు ఆనందమూర్తిగారి గ్రంథములో లోపించినది. అందుచే వారు కవినామమును నిర్ణయింపలేక పోయిరి.

ఇట్లు నాకు లభించిన తాళపత్ర గ్రంథములనుబట్టి కాటమరాజు కథాచక్ర ములోని వివిధ వీరగాథలను రచించిన ఏడ్గురు నూతన జానపద కవిపుంగవులు తెలియవచ్చుచున్నారు. నేను చెప్పిన "పినయెల్లన''యు మదరాసు ప్ర.ప్రా.లి.పు.

ఖాం. వారు ప్రకటించిన కాటమరాజు కథనుబట్టి తెలియుచున్న 'గంగాపం పీన యెల్లయ'యు నొక్కరే యగుచో- ఆర్గురు నూతనకవులు నా పరిశోధనము వలన వెలుగునకు వచ్చిరని చెప్పవలెను. వదరుప ముద్దులేటికవి, మల్లయ్య, కనకబండి ఘట్టయ్య, కట్టెబోయిన మారయ్య, కంచిమంగళము (మంగళపురి) వెంకటాద్రి, జరుగుపల్లె చెన్నయ్య- ఈ యార్గురును ఆంధ్రసాహిత్యచరిత్రకు నూతనముగా చేర్చదగిన సహజ కవిశేఖరులు!

## 24. కాటమరాజు కథాచక్రము - వివిధ వీరగాథలు :-

### 1. ఆవుల వలిరాజుకథ :-

ఇది కాటమరాజు కథాచక్రమునందు మొట్టమొదటి వీరగాథ. ఆవులవలిరాజు కాటమరాజునకు పితామహుడు. ('వలరాజు' అనుపేరే జానపద వ్యవహారమున వల్లురాజు' అనియు, 'వలిరాజు' అనియు 'వొలిరాజు' అనియు మారినవి). దీని రచయిత వదరుప మూలయ్య పౌత్రుడును, పెద్దనార్యుని పుత్రుడును అగు మద్దులేటికవి అని గ్రంథాంతమున గలదు. ఇది ద్విపదచ్ఛందమున నున్నది. వల్లురాజు యుద్ధ మనియు,వలిరాజు చరిత్రమనియు దీనికి మరిరెండు నామములు న్నట్లు తెలియుచున్నది.

మదరాసు ప్ర.ప్రా.లి.పు భాం. న వల్లురాజు యుద్ధమను కాగితపు ప్రతి కలదు. (R.No. 642. ఇది ప్రస్తుతము తిరుపతి ప్రాచ్య పరిశోధనాలయము వారి లి.పు.భాం. నకు తరలింపబడినది). కాని యిది ఆద్యంత రహితమైన వలి రాజు కథయే కాని, వల్లురాజుకథమాత్రము కాదు. నాకు పల్నాడులో గామాల పాడు గ్రామమున నొక తాళపత్ర గ్రంథము లభించినది. కాని అది అసమగ్రముగా నున్నది చివర కొంతకథ లోపించినది.సంపూర్ణమైన కథను ఆంధ్ర యాదవసంఘ మాజీ ప్రధాన కార్యదర్శియగు ఆరాధ్యుల పిచ్చయ్యగారు (ఎడవూరు) 1967లో "వలిరాజు చరిత్ర" అను పేరుతో ప్రకటించిరి.

ఆవుల వలిరాజు ఎలమంచి (యలమంచి) పట్టణమేలు ప్రభువు. ఇతని తండ్రి కవులావుల గంగురాజు, తల్లి గంగమ్మ. ఈ దంపతులకు కలిగిన నలుగురు పుత్రులలో వలిరాజు పెద్దవాడు. హరిపాలుడు, నందగోపాలుడు' గోవర్ధనుడు ఇతని తమ్ములు. తిరుమందుల తరిముత్తరాజు ఇతనికి ప్రధానిగా నుండెను.

యలమంచిలికి ఉత్తరముగానున్న ఖండెమొండెముల కోటను కలభూత గంగురాజు పాలించుచుండెను. అతడు బాలుడుగా నున్నప్పుడు, ఆ రాజ్యమునకు ప్రధానులుగా నున్న అయ్యలరాజు, శివరామరాజు, భాస్కరరాజు, దత్తరాజు, కన్నమరాజు అను ఐదుగురు నియోగిబ్రాహ్మణులు సర్కారు పైకమును నాలుగు లక్షలు అపహరించిరి. కలభూత గంగురాజు పెద్దవాడైన తరువాత భీమరాజు అను మరియొకమంత్రి ఆ ప్రధానులు చేసిన దొంగతనమును బయటపెట్టెను. గంగురాజు కోపముతో వారిని శిక్షింపబోగా, ఆ ప్రధానులు ఆరునెలల గడువును కోరి, యలమంచి పట్టణమునకు పారివచ్చి, వలురాజు శరణు వేడిరి. వలురాజు వారికి అభయమిచ్చెను. అంత కలభూత గంగురాజునకును వలురాజునకును యుద్ధమయ్యెను. వలురాజు సోదరులు ముగ్గురును, సేనాధిపతులగు పులిమ(ము)ద్దుల రామన్నయు, భండారు మల్లడును యుద్ధమునకేగి, కలభూత గంగురాజు సోదరులగు రంగధామరాజు, రఘురామరాజు, చిన్నగంగురాజు అను వారితోడను, సేనానులగు రామలింగన్న, సర్దారు పాపన్నలతోను ఘోరయుద్ధము చేసి అందరును వీరస్వర్గమును చేరిరి.

పిమ్మట వలురాజే స్వయముగా యుద్ధమునకేగ నిశ్చయించెను. తన పుత్రులగు సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలు రాజులను, కూతురు కొమరక్కను మంత్రియగు పల్లికొండకు అప్పగించెను. సింహాద్రిరాజు పెద్దవాడైనను బ్రాహ్మణులు చెప్పిన జ్యోతిషమును బట్టి, రెండవ కుమారుడైన పెద్దిరాజునకు పట్టము గట్టెను. పుత్రులకు బుద్ధులు గరపి తాను యుద్ధమునకేగెను. కలభూత గంగురాజుతో వలురాజు ఘోరయుద్ధము చేసెను. కడకు గంగురాజును చంపి, అతని భార్య శరణు వేడుటచే గంగురాజు కుమారునకు పట్టము గట్టి, పూర్వపు ప్రధానులను తిరిగి తమ తమ ఉద్యోగ ములందు నిలిపి, యుద్ధమున తగిలిన గాయములతో వలురాజు వైకుంఠమున కేగెను. అతని భార్య వల్లమ్మ సహగమనము చేసెను.

ఈ వలురాజు కథాప్రసక్తి "వేడుక బొంగరాల కథ", అగుమంచి కథ, భక్తిరన్నకథ మున్నగు ఇతర వీరగాథలలో గూడ కానవచ్చుచున్నది. వేడుక బొంగరాల కథలో పోచయ్య తన మామయగు ముమ్మయ్యతో వలు రాజును గూర్చి యిట్లు చెప్పును.

"వాసిష్ఠగోత్రుం వలురాజు [illegible]
రావుల కరణాల వెనకవేసుకొని
పంచభూతల [illegible]
కదిసి యుద్ధముచేసి [illegible]
రాయలు [illegible]
వురుస్థలాలు మీ తాతలు గాయాలు [illegible]
పక్షముల పోట్లునాటి పొంగి పొరాడి"56

అనుమంచి కథలో కొమురెడ్డి [illegible] నట్లనును.

"మా అయ్య వలురాజు మందతశ్వరుడు
దయకలిగి కరణాల వెనకవేసుకొని
పరణాల కొరకు కన్నె మొగిలి పికపనుప
శ్రీవీరకల్లుగా చెల్లె మాతంత్రి
అనువై అందలాలు ఆప రత్తలాయ
తరమునాటి పెద్దలు మారంభమట్ట చెల్లిం
రాళ్ళబండి కనుమునావ రక్తము పేకులై పారెను"57

భక్తిరన్న కథలో కాశీయాత్రకు పోయిన భక్తిరన్న గయాక్షేత్రములో యాదవవీరులకు పిండప్రదానము చేయుచు తమతాతయగు వలురాజు నిట్లు కీర్తించును.

---

56. 1967 మే నెలలో తెనాలి తాలూకా ఎడవూరు గ్రామములో లభించిన కాగితపు ప్రతి, పుట 13. ఆరాధ్యుల పిచ్చయ్యగారు దానిని నాకొసంగిరి.

57. చిత్తూరుజిల్లా, చంద్రగిరి తాలూకా, పెదకంటిపల్లెలో 1-8-1966 న లభించిన తాళపత్ర గ్రంథము, పత్ర సంఖ్య 18.

"కరణాల కొరకునై కడిసీ దండెత్తి
ఖండెమొండెములు నేతేటి కలఘాత గంగురాజుమీద
ఆలంబుచేసి హతముగ చెల్లితిరి
మెండయిన సేనమీద మెరసి దండెత్తి
దండి సేనలమీద తగ పోరి పోరి
వొళ్ళెల్ల గాయాలు పుక్కుటలుగులు నాటి
వొలురాజ! వో తాత! వొసుధపై వొరిగితివి
అగ్నినోములు నోమితివి హర హరా యనుచు
బొగ్గుల పాలయిపోతివి పొలతి వల్లమ్మ"58

## 2. పంపాద్రి కథ

ఆవుల పలురాజు మరణించిన తరువాత సోదరుల సహాయముతో పెద్ది రాజు యలమంచి పట్టణమును పది సంవత్సరములు నిరాఘాటముగా పాలించెను. పిమ్మట తండ్రియు, పినతండ్రులును గతించిన ఆ యలమంచి పట్టణమున నుండుట కిష్టములేక, సింహాద్రి రాజాది సోదరు లేవురును, అల్లుడు పల్లికొండతో కలిసి పంపాద్రికి పయనమై వచ్చిరి. అక్కడ పెద్ద పట్టణమును నిర్మించుకొని సుఖముగా పాలించుచుండిరి. ఇట్లు పంపాద్రిలో ఏడేండ్లు గడపిరి.

సింహాద్రిరాజు పెద్దిరాజాదుల భార్య లేవురును సంతానమును పడయగోరి పంపాద్రి బసవన్నకు నోములు నోచిరి. అందరికిని సంతానము కలిగినది కాని, ఒక్క పెద్దిరాజు భార్యయగు పెద్దమ్మకు మాత్రము సంతానము కలుగలేదు. బసవన్న ఆమె నోమును తిరస్కరించెను. పెద్దమ్మ మిక్కిలి పరితపింపసాగెను. అంత నొకనాటి రాత్రి పెద్దమ్మకు స్వప్నమున కల్యాణ పట్టణమున వెలసియున్న సోమేశ్వరుడు సాక్షాత్కరించి, 'నేను నీకు సంతానమునిత్తును. నా కల్యాణ నగరమునకు రమ్మ' అని చెప్పెను, ఆమె మేల్కొని భర్తతో తన స్వప్న వృత్తాంతమును చెప్పెను. 'ఆ దేవుడు నాకును కనపడినప్పుడు వెళ్ళుదము' అని

---

58. ప్రకాశంజిల్లా, కనిగిరి తలూకా, పంచలింగాలకొండ ప్రక్కనున్న వెంగళాపురములో 1966 సెప్టెంబరు నెలలో లభించిన తాళపత్ర గ్రంథము, ఆకు 15.

మించి, కల్యాణ పట్టణము చేరెను. అప్పుడు కల్యాణము నేలుచున్న మారాసపు గంగురాజు పెద్దిరాజును మిక్కిలిగ నాదరించెను. పెద్దిరాజును పెద్దమ్మయు కాట కోటేశ్వరుని ప్రార్థించిరి. పెద్దిరాజునకు అరువదియవ యేట కాటమరాజు జన్మించెను. తరువాత ఏడేండ్లకు పెద్దమ్మ పాప సంహారి నోము నోచెను. అప్పుడు పాపనూక యను పుత్రిక జన్మించెను. ఆమె దుష్ట నక్షత్రమున పుట్టినది. చిత్రభాను సంవత్సరమున ఫాల్గుణ మాసమున బుధవారమునాడు మధ్యాహ్న వేళ, తల్లి గండమునను, తండ్రి గండమునను, ధనధాన్యముల గండమునను, ఆవుల గండమునను, పాపనూక జన్మించెను. ఈ పాపనూక పుట్టిన ఏడవనాడే పెద్దిరాజు మారాసపువారి పగ తీర్చుటకై వాలికేతువరాజుపై దండెత్తిపోయి, ఆర్లపెంట రణమున మరణించెను. అప్పటికి ఏడు సంవత్సరముల బాలుడైన కాటమరాజు తండ్రిపగ తీర్పనెంచి, వాలికేతువరాజుపై దండెత్తిపోయి, ఆతనిని సంహరించి, తండ్రి శవమును తీసికొని యింటికి వచ్చెను. తల్లి పెద్దమ్మ భర్త శరీరముతో సహగమనము చేసెను. పసివాండ్రగు కాటమరాజును పాపనూకయు మారాసపువారి యింట పెరుగుచుండిరి. (తరువాత కాశికి పోయెడి భక్తిరన్న వచ్చి, వారిని గుర్తించి, మారాసపువారికి ఆనవాళ్ళుచూపి, కాటమరాజును పాపనూకను యలమంచికి గొనిపోవును).

కాటమరాజు కథాచక్రమున ఎక్కువ ప్రచారముగల వీరగాథలలో నిది యొకటి. పెద్దిరాజుకథ, గంగతర్కము, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, భట్టు రాయబారము, భక్తిరన్నకథ, కఱియావులరాజుకథ—ఇవి తరచుగా పాడబడుచుండును. వేడుక బొంగరాల కథలోను, అగుమంచి కథలోను, భక్తిరన్న కథలోను ఈ పెద్దిరాజుకథా ప్రసక్తి వచ్చును.

నాకు పెద్దిరాజు కథకు సంబంధించిన మూడు తాళపత్ర గ్రంథములు లభించినవి. కాని దేనిలోను ఆద్యంతములు స్పష్టముగా తెలియుట లేదు. 'కాటమరాజు ఆర్లపెంట యుద్ధము' లేక 'కాటమరాజు యుద్ధము-ప్రథమ కాండము' అని పిలువబడుచున్న వేరొక వ్రాతప్రతి కృష్ణామండలమున లభించినది. అందు కాటమరాజు తనతండ్రి పెద్దిరాజు మరణవార్త విని, వాలికేతువరాజుపై దండెత్తిపోవుట, యుద్ధమున నాతనిం జంపుట, పెద్దమ్మ సహగమనము, కాటమరాజును ఆతని చెల్లెలు పాపనూకయు పెండోట ముద్దమ్మయను మారాసపు రాణిచే పోషింప

మించి, కల్యాణ పట్టణము చేరెను. అప్పుడు కల్యాణము నేలుచున్న మారాసపు గంగురాజు పెద్దిరాజును మిక్కిలిగ నాదరించెను. పెద్దిరాజును పెద్దమ్మయు కాట కోటేశ్వరుని ప్రార్థించిరి. పెద్దిరాజునకు అరువదియవ యేట కాటమరాజు జన్మించెను. తరువాత ఏడేండ్లకు పెద్దమ్మ పాప సంహారి నోము నోచెను. అప్పుడు పాపనూక యను పుత్రిక జన్మించెను. ఆమె దుష్ట నక్షత్రమున పుట్టినది. చిత్రభాను సంవత్సరమున ఫాల్గుణ మాసమున బుధవారమునాడు మధ్యాహ్న వేళ, తల్లి గండమునను, తండ్రి గండమునను, ధనధాన్యముల గండమునను, ఆవుల గండమునను, పాపనూక జన్మించెను. ఈ పాపనూక పుట్టిన ఏడవనాడే పెద్దిరాజు మారాసపు వారి పగ తీర్పుటకై వాలికేతువరాజుపై దండెత్తిపోయి, అర్లపెంట రణమున మరణించెను. అప్పటికి ఏడు సంవత్సరముల బాలుడైన కాటమరాజు తండ్రిపగ తీర్పనెంచి, వాలికేతువరాజుపై దండెత్తిపోయి, ఆతనిని సంహరించి, తండ్రి శవమును తీసికొని యింటికి వచ్చెను. తల్లి పెద్దమ్మ భర్త శరీరముతో సహగమనము చేసెను. పసివాండ్రగు కాటమరాజును పాపనూకయు మారాసపువారి యింట పెరుగుచుండిరి. (తరువాత కాశికి పోయెడి భక్తిరన్న వచ్చి, వారిని గుర్తించి, మారాసపువారికి ఆనవాళ్లుచూపి, కాటమరాజును పాపనూకను యలమంచికి గొనిపోవును).

కాటమరాజు కథాచక్రమున ఎక్కువ ప్రచారముగల వీరగాథలలో నిది యొకటి. పెద్దిరాజుకథ, గంగతర్కము, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, భట్టు రాయబారము, భక్తిరన్నకథ, కటియావులరాజుకథ—ఇవి తరచుగా పాడబడుచుండును. వేడుక బొంగరాల కథలోను, అగుమంచి కథలోను, భక్తిరన్న కథలోను ఈ పెద్దిరాజుకథా ప్రసక్తి వచ్చును.

నాకు పెద్దిరాజు కథకు సంబంధించిన మూడు తాళపత్ర గ్రంథములు లభించినవి. కాని దేనిలోను ఆద్యంతములు స్పష్టముగా తెలియుట లేదు. 'కాటమరాజు అర్లపెంట యుద్ధము' లేక 'కాటమరాజు యుద్ధము-ప్రథమ కాండము' అని పిలువబడుచున్న వేరొక వ్రాతప్రతి కృష్ణామండలమున లభించినది. అందు కాటమరాజు తనతండ్రి పెద్దిరాజు మరణవార్త విని, వాలికేతువరాజుపై దండెత్తిపోవుట, యుద్ధమున నాతనిం జంపుట, పెద్దమ్మ సహగమనము, కాటమరాజును అతని చెల్లెలు పాపనూకయు పెందోట ముద్దమ్మ యను మారాసపు రాణిచే పోషింప

బతుకుట వరకును కథగలదు దీనినిబట్టి పెద్దిరాజుకథ వేరనియు, కాటమరాజు ఆర్లపెంట యుద్ధము వేరనియు తోచుచున్నవి. అట్లే పంపాద్రికథను పెద్దిరాజు కథతో ముడిపెట్టరాదు. కాబట్టి వలురాజు మరణానంతరమునుండి, భక్తిరన్న కల్యాణమునుండి కాటమరాజును పాపనూకలను యెలమంచికి చెప్పువరకును గల కథాభాగములో మూడు ప్రధాన కథలున్నవని చెప్పవచ్చును:

(1) వలురాజు మరణించిన తరువాత, పెద్దిరాజు రాజుగా సింహాద్రిరాజాది సోదరులందరును పది సంవత్సరములు యెలమంచిలోనుండి, పిమ్మట వారందరును పంపాద్రికి తరలివచ్చి, పట్టణ నిర్మాణము గావించుకొని సుఖముగా నుండుట, వారి భార్యలందరును పంపాద్రి బసవని నోములు పట్టుట, ఒక్క పెద్దమ్మకు తప్ప తక్కిన వారందరికిని సంతానము గలుగుట పెద్దమ్మ చింతతో నుండుట, ఆమెకు స్వప్నమువచ్చుట, ఇట్లు పంపాద్రిలో ఏడు సంవత్సరములు గడచుట-ఇంతవరకును 'పంపాద్రికథ' లేక 'పంపాద్రి నోములు'.

(2) పెద్దిరాజు సోదరులతో భాగము తేర్పరచుకొని పంపాద్రినుండి కళ్యాణమునకు వచ్చుట, కాటమరాజు పాపనూకల జననము, వాలికేతువ రాజుతో యుద్ధముచేసి పెద్దిరాజు కూలుట, తన మరణవార్తను భట్టుచే కుమారునకును భార్యకును తెలియజేయుట—ఇంతవరకును 'పెద్దిరాజు కథ' కావలెను.

(3) ఏడేండ్ల బాలుడైన కాటమరాజు తండ్రిపగ దీర్ప వాలికేతువ రాజుపై దండెత్తిపోవుట, ఆతని యుద్ధపతనము, గంగతోటి సంవాదము, వాలికేతువరాజును చంపుట, తండ్రి శవమును కనుగొనుట, గంగ దానిని బ్రతికించగా తండ్రితోమాటాడుట, ఆ శవము నింటికి దెచ్చి తల్లికిచ్చుట, తల్లి సహగమనము చేయుట, మారాసపువారి యింటిలో కాటమరాజు పాపనూకలు పెరుగుచుండుట—ఇంతవరకును 'కాటమరాజు ఆర్లపెంట యుద్ధము' లేక 'కాటమరాజు యుద్ధము—ప్రథమకాండము' (కాటమరాజు ఎఱ్ఱగడ్డపాడుతో చేసిన యుద్ధము ద్వితీయకాండమగును).

కాని గోవుల నాగేశ్వర కవిగారు తమ 'పెద్దిరాజు నాటకము'లో పంపాద్రిలో పెద్దిరాజు అన్నదమ్ములతో భాగము తేర్పరచుకొనుటనుంచి, భక్తిరన్న

వచ్చి కాటమరాజును పాపనూకను తోడ్కొని పోవుట వరకును గల కథాభాగము ననుసరించినారు. ఏమైనను, దీనిని పైవిధముగా మూడు కథలుగా భావించుట ఉచితమని తోచుచున్నది.

## 4. సింహాద్రిరాజు కథ

కాటమరాజు కథాచక్రమున కొన్ని కథలకు విశేష ప్రచారమున్నది. మరి కొన్ని కథలకు అసలు ప్రచారమేలేదు. ఇట్లు ప్రచారశూన్యములైన కథలలో సింహాద్రిరాజుకథ, ఎఱనూకరాజుకథ, నలనూకరాజుకథ చేరును. అంత మాత్రమున ఈ కథల అస్తిత్వమును శంకించుటకు వీలులేదు. వీని ప్రసక్తి యితర వీరగాథలలో కూడ కానవచ్చుచున్నది. ప్రచారము తక్కువ యగుటచే వీనికి పుత్రిక లెక్కువగా పుట్టలేదు. దేశమున రెండు మూడు తావులందు ఈ కథలున్నవని తెలియుచున్నది. నాకు లభించిన వేడుక బొంగరాల కథలోను, అగుమంచి కథలోను, భక్తిరన్న కథలోను వీని ప్రసక్తి వచ్చినది. స్థానిక చరిత్రలయందును ఈ రాజుల వివరములున్నవి.

సింహాద్రిరాజు, అవుల వలురాజు పెద్ద కుమారుడు. యాదవ రాజ్య సింహాసనము నిజమున కితనికి రావలెను. కాని పండితులు జ్యోతిషశాస్త్రమును బరిశీలించి పెద్దిరాజే సింహాసనమునకు సమర్థుడని నిర్ణయించుటచే, పల్లికొండ సలహాతో తండ్రి యితనిని ఒప్పించి, చిన్నవాడైన పెద్దిరాజునకు పట్టము గట్టెను. ఈ విషయము వలురాజుకథలో నున్నది గాథాకారులును ఇట్లే చెప్పుదురు. ఇది సింహాద్రిరాజు యొక్క మంచితనమును, ఔదార్యమును, తండ్రియెడగల విధేయతను చాటుచున్నది. నాకు ప్రకాశం జిల్లా, దర్శి తాలూకా, గంగ దొనకొండ గ్రామములో 'పంపాద్రికథ' అను నొక తాళపత్ర గ్రంథము లభించినది. అందు వలురాజు తరువాత సింహాద్రిరాజే రాజైనట్లుగా నున్నది

పంపాద్రిలో పంపకము లయిన తరువాత పెద్దిరాజు కల్యాణ నగరమునకు పోయెను. సింహాద్రిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు పంపాద్రిలో నుండిపోయిరి. (ఈ నలుగురును నాలుగుదేశములకు పోయిరని కొన్ని ప్రతులలో నున్నది.) అప్పుడు శ్రీ కూర్మ పట్టణమున సింధుభల్లాని రాజు శ్రీవైష్ణవులపై దొంగతనమును మోపి, వారిని బాధింప జొచ్చెను, ఆ శ్రీ వైష్ణవులు పంపాద్రికి

వారువచ్చి, సింహాద్రిరాజును శరణువేడిరి. అందుచే నితడు శ్రీ కూర్మముపై దండెత్తి పోయి, ఘోరయుద్ధముచేసి, సింధుభల్లాని రాజును చంపి, ఆ యుద్ధ మున తగిలిన గాయములతో మరణించెను. అతని భార్య సింహాద్రి సీత సహ గమనము చేసెను. భూమాటి శంకరయ్య అనునతడు సింహాద్రిరాజునకు సేనాధి పతి. ఇతడును పై యుద్ధమున మరణించెను. ఇతని భార్య భూమాటి శంకరమ్మ గుండమున బడెను.

సింహాద్రిరాజునకు కటియాపుల రాజు అను కొడుకును, చిట్టినూక అను కుమార్తెయు గలరు. ఈ కటియాపుల రాజు మహాశూరుడు. ఏ యాదవవీరుడైనను ఇతని తరువాత చెప్పవలసినవాడే: చిట్టినూక కొడుకు పోచయ్య.

వేడుక బొంగరాల కథలో సింహాద్రిరాజు కథాప్రసక్తియున్నది. పోచయ్య తన మేనమామయగు ముమ్మయ్యతో నిట్లనును :

"శ్రీ కూర్మము మీద మీపెదతండ్రి సింహాద్రిరాజు
శ్రీ వైష్ణవుల కొరకు సింధు భల్లాని రాజుల మీద
విడిబడి యుద్ధము చేసి
గట్టిగ ఎదురొమ్ము గాయాలు నాటి
సింధుభల్లాని రాజుల శిరసులు నరికి
చంద్రాయుధములు నాటి చెల్లె మీ తండ్రి"[59].

అగు మంచి కథలో కొమరక్క తన కోడలు అగుమంచితో సింహాద్రి రాజు కథను చెప్పను. ఇట సింహాద్రిరాజు యుద్ధ వర్ణనము అత్యద్భుతముగా కొనసాగినది.

"శ్రీ కూర్మము బోయెను సింహాద్రిరాజు
శ్రీ వైష్ణవుల కొరకు సింధుభల్లాని రాజుల మీద
పోరి పోతి వైరుల పొట్టలు చీరి

---

59. యాదవపూర్వ కాళితపు ప్రతి, పుట 18.

వుక్కుటలుగులమీద రాజుల వుక్కణగించి
దండిగా పగతుల తల లుత్తరించి
వుక్కు జీరారాజుల వుక్కణగించి
గొడుగులు తప్పించి పడగల నరికిరి
పడగలు తప్పించి గొడుగుల నరికిరి
పడగల కింద రాజుల గొంతులు కోసిరి
చక్రాల కొందరిని శిరసులు ఖండించిరి
పగవారి ఆయుధములు భారంబులాయె
ఈటెల పోట్లకు ఈవలావల వెదలి
వాటముగ వచ్చిన ఆయుధములు పక్కలు నాటి
సింధుభళ్ళాని రాజుల శిరసులు ఖండించి
వరిగెను మాయన్న వల్లవుల రాజు"60.

భక్తిరన్న కథలో కాశీయాత్రకు పోయిన భక్తిరన్న గయ యొద్ద పితృదేవతలకు పిండప్రదానము చేయుచు సింహాద్రిరాజును గురించి యిట్లు ప్రశంసించును: (ఈ ప్రశంసలో రసవంతమగు కవిత్వమును ప్రత్యక్షమగును):

"శ్రీ కూర్మము మీదను చెలగి దండెత్తి
సింహాద్రి వో తండ్రి! చనుదెంచి పోతివి
మూకలయి వొక్కరొక్కరిని మొనకట్టి చంపితివి
చేకొని వారిని చెండాడి చంపితివి
బారులకు ఎదిరించి పగతురద్రుంచి
దురములో రిపులను త్రుళ్లణచి నీవు
సింధుభళ్ళాని రాజు శిరస్సు తెగ నరికి
చంద్రాయుధాలు తాకి చెల్లితివి నీవు
సింహాద్రి వో సీత! సిరిగల కాంత!
అయ్యగూడి ప్రాణంబు అప్పగించితివి

---

60. పెడకంటి పల్లె తాళపత్రప్రతి, ఆకు 18.

హంసపడె వో తల్లి! అగ్గిలో పడిస్తివి
నిమిషంబులోపల నీరము పోరివి
కాశిలో అన్నంబు గైకొందు మేము"61.

## 5. ఎఱనూకరాజు కథ

ఇతడు ఆవుల వలురాజు తృతీయ పుత్రుడు. వలురాజు అనంతరము పెద్దిరాజు సింహాసనము నధిష్ఠింపగా, ఈ యెఱనూకరాజు యువరాజపదవి చేపట్టెను. ఇతని భార్య పేరు ఎఱనూక సీత. కుమారుడు భట్టావురాజు. పులిమద్దుల రాఘవుడు ఇతని సేనాని.

ఎఱనూక రాజు ఒకప్పుడు ఏనుగనాథుని కొండకు పోగా, అక్కడ ఎరుకలకు సంబంధించిన ఒక బెబ్బులి వేటుపడి ఎఱనూకరాజు మరుగు జొచ్చెను. అతడు ఆ బెబ్బులికిని ఎరుకలకును అభయమిచ్చి, ఎల్లభూపతిరాజుతో యుద్ధము చేసి మరణించెను. ఎఱనూకసీత భర్తతో సాగుమానము చేసినది. ఎఱనూక రాజు సేనాని పులిమద్దుల రాఘవుడును ఈ రణమున మరణించెను. అతని భార్య యగు దేవమ్మ అగ్నిగుండమున బడెను. వేదుక పొంగలి కథలో ఈ యెఱనూకరాజు కథాప్రసక్తి యిట్లున్నది :

"ఎరుకల పగలకు ఎరనూకరాజు
ఏనుగనాథు కొండకు ఏతెంచి పోయి
ఎల్లభూపతితో ఎదిరించి పోరి
ఎదురొమ్ము గాయాలు ఏకముగ నాటి
ఏనుగకొండ తావాయెను ఎరనూక రాజుకు"62

అగుమంచి కథలో కొమరక్క తన అన్న ఎఱనూకరాజు నిట్లు ప్రశంసించును :

---

61 వెంగళాపురము తాళపత్ర గ్రంథము, ఆకు 16.

62. యడవూరు కాగితపు ప్రతి, పుట 14

"ఏనుగనాథు కొండకు బోయె ఎరనూక మాయన్న
ఎరుకల కొరకై ఏటుబడి బెబ్బులి
ఎరనూక మాయన్న మరుగు జొచ్చెను.
మరుగు జొచ్చిన బెబ్బులి కొరకై మాయన్న
నూటొక్కరాజుల నుగ్గుగా జంపి
వురపడిని బాణాలు వుక్కుటలుగులు నాటి
ఈటెల పోట్లును ఎదురొమ్ము తగిలి
బల్లాల పోట్లును భారంబులాయె
ఎఱ్ఱభూపతిరాజు ఏపణగించి
ఏనుగకొండను ఎరనూక వారిగె"[63].

## 6. నలనూకరాజు కథ

ఇతడు ఆవుల వలురాజునకు నాల్గవ కుమారుడు. ఇతని భార్య నలనూక సీత. పుత్రుడు పెయ్యల ఎఱ్ఱయ్య లేక పయ్యావుల ఎఱ్ఱయ్య. మంత్రి చట మారయ్య. ఒకప్పుడు నలనూకరాజు 'నున్న బెజవాడ' (ఇది నేటి బెజవాడ కాదట, వేరొక బెజవాడ యట) అనుపట్టణమునకేగెను. ఆ పట్టణము నేలు 'నున్న భూపతి' నలనూకరాజును సుంకము చెల్లింపుమని నిర్బంధించెను. (ఈ నున్న భూపతి స్త్రీల వక్షోజములకు కూడ పన్ను వసూలు చేసెడివాడని గాథాకారులు చెప్పుచుందురు). ఆ రాజు దౌష్ట్యమునంత మొందింప దలంచి, నలనూకరాజు అతనికి సుంకమును చెల్లింపక, నున్నభూపతియగు నంది కేశవరాజుతో యుద్ధము చేసి, 'దిగ్విదేవుని పెంట' దగ్గర కూలి పోయెను. నలనూకసీత సహగమనము చేసెను. నలనూకరాజు మంత్రియగు చటమారయ్య కూడ ఈ యుద్ధమున మరణింపగా ,అతని భార్య మారమ్మ గుండమున బడెను. నలనూకరాజు పుత్రుడగు పెయ్యల యెఱ్ఱయ్య నున్నభూపతిని చంపి 'బెజవాడ బెబ్బులి' అని పేరు మోసెను. వేడుక బొంగరాల కథలో ఈ నలనూకరాజు కథాప్రసక్తి యిట్లున్నది : పోచయ్య తన మేనమామయగు ముమ్మయ్యతో నిట్లనును :

---

63. పెడకంటి పల్లె తాళపత్రప్రతి, ఆకు 18.

"నువ్వు బెజవాడకు మీ తండ్రి నలనూకరాజు
కచ్చెకు కాలు దువ్వి కదిసి పోరాని
నందికేశవరాజు చేతి నడుములు తెగిలి
నడికల్లున చెల్లె మీ అయ్య నలనూకరాజు"[64].

అగుమంచి కథలో కొమరక్క తన అన్నయగు నలనూకరాజు నిట్లు తలపోయును :

"నున్న బెజవాడకు పోయిన నలనూకరాజు
కంచుకు పెంచుకు అక్కలం గాజుకు నులకమ్ము లేదని
నన్న భూపతి రాజుల నుగ్గుగా జంపెను
పుక్క జీరారాజుల పుక్కణగించి
దండిగా పగతుల తల లుత్తరించి
వొళ్లెల్ల గాయాలు పువ్వుటలుగులు గాజీ
నున్న భూపతి రాజు మీద వొరిగె మాయన్న!"[65].

సింహాద్రిరాజు కథ, ఎఱనూకరాజు కథ, నలనూకరాజు కథ—లను మూడు వీరగాథలును నాకు లభింపలేదు. ఆంధ్రదేశమున, ముఖ్యముగా కనిగిరి సీమలో పర్యటించి, వీనిని శోధించి సంపాదింప వలసియున్నది.

## 7. పోలురాజు కథ (ఆవుల పోలురాజు కథ) లేక 'శివ పురాణము'

కాటమరాజు కథా చక్రమున పోలురాజు కథకున్న ప్రశస్తి ప్రచారములు మరి యే యితర కథకును లేవు. దీనికి 'శివపురాణ' మను నామాంతరము కలదని నాకు లభించిన ఒక తాళపత్ర గ్రంథమును బట్టి తెలిసికొంటిని. పోలురాజు వలురాజునకు కనిష్ఠ పుత్రుడు. ఇతడు ఈశ్వరాంశతో పుట్టినవాడు; గొప్ప శివ భక్తుడు. ఇతని భార్య పేరు సిరిదేవి లేక నూకాంబ. ఇతనికి భక్తిరన్న, అయిత

64. యడవూరు కాగితపు ప్రతి, పుట 14
65. పెదకంటి పల్లె తాళపత్రప్రతి, ఆకులు 18,19.

మరాజు, ముమ్మయ్య అను ముగ్గురు పుత్రులును, అగుమంచియను పుత్రికయు గలరు. పెద్దిరాజు కల్యాణనగరమునకు పోవుచు పోలురాజుకు ఆవులపట్టము కట్టెను. అందుచే నితనిని 'ఆవుల పోలురాజు' అనియు పిలుతురు.

ఈ పోలురాజు చెరుకూరి దగ్గర ఆలమందతో నుండగా, శ్రీరంగ పట్టణ మేలు చోడానిరాజు పెట్టు బాధలు పడలేక చెరుకూరిలోని జంగములు పోలు రాజును శరణు వేడిరి. పోలురాజు వారికి అభయమిచ్చెను. కావేరీనదికి కట్టకట్టు టకై వెట్టి చేయవలసినదిగా జంగముల నాజ్ఞాపించుచు చోడానిరాజు పురహరుడను యోధుని పంపెను జంగములా పురహరుని ఒకరాత్రికి నిలిపిరి. ఈలోగా తాము పోలురాజు మరుగు జొచ్చిరి. కల్లందుల మారినీడు, మసిలి నాయడు మున్నగు వీరులను తోడిచ్చి, పోలురాజు ఆ జంగములను శ్రీశైలమునకు పంపివేసెను. పురహరుడు శ్రీరంగమునకుపోయి చోడానితో జరిగిన విషయము చెప్పెను. చోడాని మండిపడి, పోలురాజుపైకి 'ముక్కంటి' అను వీరుని పంపెను. పోలు రాజునకును ముక్కంటికిని చెరుకూరి దగ్గర చిలకలమట్టి ఠాణ్యమున గొప్ప యుద్ధము జరగెను. యాదవ వీరు లెందరో ఆ యుద్ధమున మరణించిరి. కడకు పోలురాజును ఒరగి పోయెను. పోలురాజు చనిపోవుచు తన పుత్రులను ఆలమంద లను మేనల్లుడగు పల్లికొండకు అప్పగించును. ఇది యీ వీరగాథలోని ప్రధాన కథ. వేడుక బొంగరాల కథ, ఆగుమంచి కథ, భక్తిరన్న కథ–అను మూడు ఇతర వీరగాథలలో కూడా ఈ పోలురాజు కథాప్రసక్తి వచ్చును.

పోలురాజు కథ మిక్కిలి ప్రచార మందున్న వీరగాథయేకాక, మిక్కిలి దీర్ఘమైన వీరగాథ కూడ. ఇందలి ప్రధాన కథలో మధ్య మధ్య కొన్ని ఉప కథలు వచ్చును. ఈ యుపకథలను జానపదులు 'చాటువలు' అందురు. అట్టి చాటువలు పోలురాజు కథలో ఆరున్నవి : (1) చంద్రగుప్తుని చాటువ (2) మల్లి కాదేవి చాటువ (3) ముక్కంటి చాటువ లేక బ్రాహ్మణ చాటువ (4) జంగాల చాటువ (5) కపోత చాటువ (6) గయుడు చాటువ. ఇందు మొదటి రెండు చాటువలును శ్రీశైలక్షేత్ర మాహాత్మ్యమునకు సంబంధించిన కథలు. ఇవి పోలు రాజు పూర్వజన్మమును గూర్చి వివరించును. చంద్రగుప్తుని చాటువలో వచ్చు గంగమైలావే పోలురాజుగా జన్మించెననియు, చంద్రగుప్తుని కుమార్తెయగు మల్లి కాదేవియే సిరిదేవిగా పుట్టి పోలురాజునకు భార్యయైనదనియు చెప్పబడినది. ఈ

దంపతులు శివపురమున శ్రీశైల మల్లికార్జునుడు భక్తురాలిగా పుట్టినట్లు. ముక్కంటి చాటువ లేక బ్రాహ్మణ చాటువు అనునది పోతాని పోలురాజుపైకి పంపిన ముక్కంటి అను బ్రాహ్మణుని జన్మవృత్తాంతమును తెలుపును: జంగాల చాటువలో చోడాసచే పీడింపబడిన జంగమయ్యలు పెద్ద పోలురాజును శరణువేడుట కలదు. కపోత చాటువ శిబి చక్రవర్తి కథను, గయుని చాటువ గయోపాఖ్యాన కథను తెల్పుచు పోలురాజు జంగాలను ఆదరించుటను సమర్థించును.

నాకు ఈ పోలురాజు కథకు సంబంధించి, మూడు తాళపత్ర గ్రంథములు లభించినవి. ప్రకాశం జిల్లా, పర్చూరు తాలూకా, ఎద్దుబాలెము గ్రామములో లభించిన ప్రతి సమగ్రప్రతి. కనిగిరి తాలూకా వెంకటాపురము గ్రామములో లభించిన ప్రతి సమగ్ర ప్రతి. కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, పెద్దపారుపూడి గ్రామములో లభించిన ప్రతి శిథిలమై అక్షరములు సరిగా తెలియుటలేదు. ఎద్దుబాలెము ప్రతిలో కవి పేరు కనకబండి ఘట్టయ్య అని కలదు. ఇది 'అవుల పోలు రాజుకథ' అనిపేరుతో నున్నది. కాబట్టి పోలురాజు ఇంటిపేరు అవుల వారనుట రూఢియగుచున్నది.

ఇంతవరకును చెప్పబడిన యాదవ వీరుల కథలలో ఒక గొప్పగుణము కొట్టవచ్చినట్లు కనబడును. అవుల వలురాజును, అతని పుత్రుడు పోలురాజును పరోపకారార్థమై తమ ప్రాణములను తృణప్రాయముగా నెంచి త్యజించిన మహానుభావులు. వలురాజు మొదలుకొని పోలురాజు వరకును వారు చేసిన యుద్ధములలో స్వార్థము లవలేశమైనను లేదు. అగ్రజన్ములగు బ్రాహ్మణుల యొక్కయు, వైష్ణవులు, జంగముల వంటి భక్తుల యొక్కయు, ఎరుకల వంటి నిమ్నకులముల యొక్కయు ఆపదలను కాపాడుటకై తమ ప్రాణములను బలిపెట్టిరి. ఈ వీరుల చరిత్రలను బట్టియే "పరకార్యం మీద పాడైపోయింది యాదవకులం" అను లోకోక్తి పుట్టినది. ఈ లోకోక్తిని సుద్దులవారు తరచుగ చెప్పుచుందురు. ఖడ్గ తిక్కన యుద్ధములో చల్లపిన్నమనీడు 'తమ తరమునాటి పెద్దల' గొప్ప తనము నిట్లు చాటును ;

"తరతరముల తాత తండ్రులు మేము
భట్టుల బ్రాహ్మల వైష్ణవోత్తముల

వెట్టీ చేరలీ మాన్పి వెనుక వేసికోని
ప్రాణాలొసగి కీర్తి ప్రబలియున్నాము"

ఇట్లు పరోపకారము చేసిన సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, పోలురాజు—ఈ యైదుగు రన్నదమ్ములును వివిధ రణరంగములలో ఏకకాలమున మరణించిరట. ఆర్లపెంట రణములో నొరగిపోయిన పెద్దిరాజునకు తన సోదరుల మరణవార్తలు తెలియును.

## 8. బల్లికురువ పోట్లాట

లేఖకుడు దీనిని 'బల్లికురువ యుద్ధము' అనినాడు. అవతారికలో కవి మాత్రము 'బల్లికురువ పోట్లాట' అనియే పేర్కొనెను. ('ఆ చంద్ర తారార్కమై వెలసినట్టి, బల్లికురువ పోట్లాట ప్రజలార వినుడి'). కవినామము తెలియ వచ్చుటలేదు. దీని తాళపత్రగ్రంథము నాకు ప్రకాశం జిల్లా,దర్శి తాలూకా, గంగ దొనకొండ గ్రామములో 1966 లో లభించినది.

చెరుకూరిలో చిలకలమఱ్ఱి తాణ్యమున ముక్కంటితో పోరి పోలురాజు మరణించగా, పల్లికొండ బాలరాజులను (భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య లను) తీసికొని, ఆలమందలను తోలుకొని అర్థవీడునకు వచ్చెను. (ఈ అర్థవీడు నేడు కర్నూలు జిల్లా తాలూకాలో గలదు). ఈ అర్థవీటిలో గల సిరిదేవి, కొమ రక్క మొదలగు అంతఃపురస్త్రీలకు పోలురాజు మరణవార్త చెప్పెను. వారు సహగమనమునకు సిద్ధము కాగా,పోలురాజు ఆజ్ఞగా పల్లికొండ వారిని వారించెను. ఆ స్త్రీలను బాలరాజులను, ఆలమందలను తోడ్కొని యలమంచికి ప్రయాణ మయ్యెను. దారిలో చీకటి పడగా బల్లికురువ అనుచోట విశ్రమించెను. చిలకల మఱ్ఱి దగ్గర పోలురాజును చంపిన ముక్కంటియొక్క మనుములు బాలరాజులను చంపుటకై బల్లికురువపైకి దండెత్తి వచ్చిరి. పల్లికొండ శ్రీహరిని ప్రార్థించెను. శ్రీహరి ఒంటికొమ్ము బొల్లావును పంపెను. శ్రీశైలమునకు పోయిన కల్లందుల మారినీడు, మసిలినీడు వచ్చిరి. బొల్లావు గొప్ప యుద్ధముచేసి శత్రువులను తరిమి వేసెను. ఈ యుద్ధమున కల్లందుల మారినీడు, మసిలినీడుమరణించిరి. వారిభార్యలు సహగమనము చేసిరి. మారినీని కుమారుడగు పోలినీని సిరెదేవియు, మసిలినీని కుమారుడగు బీరినీని కొమరక్కయు పెంచసాగిరి. మరునాడు పల్లికొండ బాల

రాజులను తీసికొని పంపాది మీదుగా యలమందికి వచ్చెను. అప్పుడు యలమంచిని కాటమరాజు పినతల్లిపుత్రులగు చల్లవారు పాలించుచుండిరి. పల్లికొండ ఈ చల్లవారిని మోసగించి, ఆ రాజ్యమును అపహరించి, పోలురాజు ద్వితీయ పుత్రుడైన అయితమరాజును సింహాసనమెక్కించెను. ఇంతటితో ఈ కథ ముగియును.

చల్లవారు ఏడుగురు అన్నదమ్ములు. వీరిలో చల్ల పిన్నమనేడు పెద్దవాడు ఈ అన్నదమ్ముల్ ఏడ్గురును మహావీరులు. పల్లికొండ బాలరాజులతో వచ్చుచున్నాడని తెలిసి చల్ల పిన్నమనేడు సింహాసనము దిగి ఎదురేగగా. పల్లికొండ అయితమరాజునకు కన్నుగీటెను. అయితమరాజు చిన్నగా పోయి పిన్నమనేని సింహాసనముపై కూర్చుండెను. పల్లికొండ వెంటనే అయితమరాజునకు చేతులెత్తి మ్రొక్కెను. అవతార పురుషుడగు పల్లికొండ నమస్కరించుటచే మిగిలిన సభవారందరికిని అయితమరాజునకు మ్రొక్కక తప్పలేదు. ఈ మోసముచే చల్ల వారికి రాజ్యము పోయెను. [చల్లవారు పల్లికొండ చేసిన ఈ మోసమును సహించియుండిరి. కాటమరాజుయుద్ధమున మాత్రము వీరు పల్లికొండతో "రాజ్యమును మోసముచేసి అయితమరాజున కిప్పించినను, మా శౌర్యమును మాత్రము మోసగింపలేవు. యుద్ధమున మొట్టమొదటి ఠాణా మాది" అనిరి. పల్లికొండ సమ్మతించి, వారికి మొదటి ఠాణా నిచ్చెను. చాగలకొండ దగ్గర చల్లవారిని చూచి నల్లసిద్ధి గడగడ వణకెను. మహావీరుడగు ఖడ్గతిక్కన నల్లసిద్ధి భయము ను బాపి, చల్లవారిపై బెబ్బులివలె దండెత్తి వచ్చెను].

## 9. కాటమరాజుకు పట్నం కట్టిన కథ

నాకు లభించిన తాళపత్ర గ్రంథమున ఈ వీరగాథా శీర్షిక యిట్లే యున్నది. 'పట్టము' అనుటకు జానపదులు 'పట్నం' అందురు. దీనిని 'పట్టణము' గా భ్రమింపరాదు. కాబట్టి యీ కథాశీర్షిక 'కాటమరాజునకు పట్టము కట్టిన కథ' అని యుండదగును. అందుచేతనే గాథాకారులు దీనిని 'కాటమరాజు పట్టాభిషేకము' అనియు పిలుచుచున్నారు. కావున ఈ శీర్షికలోని 'పట్నం' అను మాటకు "పట్టాభిషేకము' అని యర్థము.

వెట్టి చెరలో మాన్పి వెనుక వేసికోని
ప్రాణాలొసగి కీర్తి ప్రబలియున్నాము"

ఇట్లు పరోపకారము చేసిన సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, పోలురాజు—ఈ యైదుగు రన్నదమ్ములును వివిధ రణరంగములలో ఏకకాలమున మరణించిరట. ఆర్లపెంట రణములో నొరగిపోయిన పెద్దిరాజునకు తన సోదరుల మరణవార్తలు తెలియును.

## 8. బల్లికురువ పోట్లాట

లేఖకుడు దీనిని 'బల్లికురువ యుద్ధము' అనినాడు. అవతారికలో కవి మాత్రము 'బల్లికురువ పోట్లాట' అనియే పేర్కొనెను. ('ఆ చంద్ర తారార్కమై వెలసినట్టి, బల్లికురువ పోట్లాట ప్రజలార వినుడి'). కవినామము తెలియ వచ్చుటలేదు. దీని తాళపత్రగ్రంథము నాకు ప్రకాశం జిల్లా,దర్శి తాలూకా, గంగ దొనకొండ గ్రామములో 1966 లో లభించినది.

చెరుకూరిలో చిలకలమట్టి తాణ్యమున ముక్కంటితో పోరి పోలురాజు మరణించగా, పల్లికొండ బాలరాజులను (భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య లను) తీసికొని, ఆలమందలను తోలుకొని అర్థవీడునకు వచ్చెను. (ఈ అర్థవీడు నేడు కర్నూలు జిల్లా తాలూకాలో గలదు). ఈ అర్థవీటిలో గల సిరిదేవి, కొమ రక్క మొదలగు అంతఃపురస్త్రీలకు పోలురాజు మరణవార్త చెప్పెను. వారు సహగమనమునకు సిద్ధము కాగా,పోలురాజు ఆజ్ఞగా పల్లికొండ వారిని వారించెను. ఆ స్త్రీలను బాలరాజులను, ఆలమందలను తోడ్కొని యబమంచికి ప్రయాణ మయ్యెను. దారిలో చీకటి పడగా బల్లికురువ అనుచోట విశ్రమించెను. చిలకల మట్టి దగ్గర పోలురాజును చంపిన ముక్కంటియొక్క మనుములు బాలరాజులను చంపుటకై బల్లికురువపైకి దండెత్తి వచ్చిరి. పల్లికొండ శ్రీహరిని ప్రార్థించెను. శ్రీహరి ఒంటికొమ్ము బొల్లావును పంపెను. శ్రీశైలమునకు పోయిన కల్లందుల మారినీడు, మసిలినీడు వచ్చిరి. బొల్లావు గొప్ప యుద్ధముచేసి శత్రువులను తరిమి వేసెను. ఈ యుద్ధమున కల్లందుల మారినీడు, మసిలినీడుమరణించిరి. వారిభార్యలు సహగమనము చేసిరి. మారినీని కుమారుడగు పోలినీని సిరెదేవియు, మసిలినీని కుమారుడగు బీరినీని కొమరక్కయు పెంచసాగిరి. మరునాడు పల్లికొండ బాల

మహావీరుడు. ఇతని భార్యపేరు నాగాంబిక లేక కటియావుల నాగ. ఇతడు నల్లని అలమంద కధిపతియగుటచే ఇట్టి పేరు వచ్చినదేమో ! చిట్టినూర యితని తోబుట్టువు. పల్లికొండ తమ్ముడగు పుల్లావుల కేశవయ్య యితనికి మంత్రిగా వ్యవహరించుచుండును. కటియావులరాజు బల శౌర్యములను నిరూపించు కథయే యీ వీరగాథ.

పల్లికొండ అయితమరాజాదులలో యలమంచి[66] లో నుండగా ఓరుగల్లు పట్టణమునుండి 'బాచయ్య' అను బ్రాహ్మణుడు యలమంచికి వచ్చెను. ఆ సమయమున అయితమరాజు గంగ జాతరను మహా వైభవముగా జరపించుచుండెను. బాచయ్య ఆ తిరునాళ్లను, యాదవుల వైభవమును చూచి ఆశ్చర్యపడెను. కటియావులరాజు శౌర్యమును గూర్చి ఆతడు వినియున్నాడు. ఆతని నెట్లైనను ఓరుగంటికి తీసికొని పోయి, అచట నున్న బేతాళుని ఓడించి, వాని గర్వము నణచవలెనని బాచయ్య నిశ్చయించుకొనెను. (ఓరుగంటిలోనున్న బేతాళుడు ఒకప్పుడు బాచయ్యను అవమానించెను. ఆ పగ అతని మనస్సులో నున్నది). అందుచే బాచయ్య యాదవులను ఓరుగంటి శంభుని తిరునాళ్లకు రండని ఆహ్వానించి వెడలి పోయెను.

అయితమరాజు, పుత్తమరాజు, కటియావులరాజు, పుల్లావుల కేశవయ్య, పల్లికొండ మొదలగు యాదవ వీరులందరును, అంతఃపుర కాంతాది సమస్త బంధుజనములతో యలమంచినుండి బయలుదేరి, ఓరుగల్లు సమీపమునకువచ్చి, దేరాల నెత్తిరి. ఓరుగంటి ప్రతాపరుద్రుడు యాదవులు తనపై దండెత్తి వచ్చినారని తలంచి రాయబారులను పంపెను. యాదవులు తాము ఓరుగంటి శంభుని తిరునాళ్లను చూడవచ్చితిమని తెల్పిరి.

---

౬౬. ఆవుల వలురాజు, పెద్దిరాజు, చల్లపిన్నమనీడు పాలించిన యలమంచి వేరు, ఈ యలమంచి వేరు అని చెప్పుదురు. పిన్నమనీని నుండి స్వాధీనము చేసికొనిన యలమంచిని పల్లికొండ సింహాద్రిరాజు కుమారులకిచ్చి, అయితమరాజునకు ఓరుగంటి సమీపమున వేరొక యలమంచిని నిర్మించెనని చెప్పుదురు. ఆ రెండవ యలమంచి యిది.

ఏడు ఘడియలలో తిరిగి వత్తుమని చెప్పి, కఠియావుల రాజును డేరాల కడ కాపుంచి, అయితమరాజు, పుత్తమరాజు, పల్లికొండ—ముగ్గురును ఓరుగల్లు పట్టణములోని కేగిరి. ప్రతాపరుద్రుడు వారి నెట్లైనను చంపవలెనని తలంచి, అలుగుల సింహాసనము నేర్పరచి ఆహ్వానించెను. పల్లికొండ విష్ణుమూర్తిని, తరమునాటి పెద్దలను తలచుకొనెను. ముగ్గురును దానిపై కూర్చుండిరి. వారికేవిధ మగు ప్రమాదమును జరుగలేదు. కొండెగాండ్ర మాటలు విని ప్రతాపరుద్రుడు యాదవ వీరులకు విషాన్నమును పెట్టెను. పల్లికొండ హరిస్మరణము చేయగా విషము అమృతమాయెను. తరువాత ప్రతాపరుద్రుడు తన ఉక్కురెక్కల మొండి గుఱ్ఱమును స్వారి చేయుడని కోరెను. ఆ గుఱ్ఱమెట్లైనను యాదవులను తుద ముట్టించునని ఆతడు తలపోసెను. కాని పల్లికొండ మాహాత్మ్యముచే పుత్తమ రాజు ఆ గుఱ్ఱము నెక్కి నిర్భయముగా స్వారి చేసెను. అప్పుడు ప్రతాపరుద్రుడు యాదవవీరుల గొప్పతనమును గుర్తించి, వారిని సన్మానించి, పచ్చల పల్లకిని బహూకరించెను. శంభుని సేవించుటకై అనుమతి నిచ్చెను.

ఇంతలో పల్లికొండ చెప్పిన ఏడు ఘడియల కాలము గడచి పోయెను. ఊరిబయట గుడారుల కడనున్న కఠియావులరాజు ఆవేశమును ఉత్సాహమును పట్టలేక, గుఱ్ఱమునెక్కి ఓరుగంటి పట్టణమునకు బయలుదేరెను. మార్గమధ్యమున బేతాళుని పూ-తోటలోని పూలుకోసి తన గుఱ్ఱమున కలంకరించెను. ఆతని నెది రించిన బోడి లను చంపి పూలతోటను ధ్వంసము చేసెను. పిమ్మట ఓరుగంటి నగరమును ప్రవేశించెను. రాజవీథిలో బేతాళుడు వ్రేలాడగట్టిన బిరుదునుచూచెను. ఆ బిరుదుల క్రిందుగా దూరిపోవుట వీరుడైనవానికి అవమానము. అందుచే వానిని విప్పుమని బేతాళునకు కబురు పెట్టెను. అతడు వినలేదు. అందుచే కఠియావుల రాజు లంఘించి ఆ బిరుదులను తన కత్తితో తెగనరికెను. ఇది బేతాళునకు కోపకారణమయ్యెను. అతడు కఠియావుల రాజును ఏకాంగి జగడమునకు ఆహ్వా నించెను. మహా సంతోషముతో కఠియావులరాజు అంగీకరించెను. బేతాళుని తల్లి, భార్యయగు చిటిగోపు కఠియావుల రాజుతో పోరాడపలదని బేతాళుని వారించిరి. అతడు వినలేదు. ఇరువురకును జరిగిన ఘోరయుద్ధమున కఠియావులరాజు బేతాళుని సంహరించెను. బేతాళునిభార్య చిటిగోపు సాగుమానము చేసెను.

ప్రతాపరుద్రుడు, కటియాపుల రాజు చేసిన దుడుకుపనిని సూచించుటకై, అయితమరాజు కడకు బేతాళుని నెత్తురు కోకలు పెంపెను. అయితమరాజు కోపించి, కటియాపుల రాజును చంపుట కాజ్ఞాపించెను. పల్లికొండ కటియాపుల రాజును రహస్యస్థలమున నుంచెను. యాదవులు తిరిగి యలమంచికి పోవుచు గవిలికొండ దగ్గర మజిలీ చేసిరి. కటియాపుల రాజు లేడు కదాయని ప్రతాపరుద్రుడు యాదవసైన్యమును ఢీకొనెను. పల్లికొండ రహస్య స్థలమునుండి కటియాపులరాజును రప్పించెను: అతడు ప్రతాపుని సైన్యమును చీల్చి చెండాడెను. యాదవులు క్షేమముగా యలమంచి చేరిరి:

"ఆస్తులు, బాలలు, ఆడస్త్రీలతోను
పసిబిడ్డ బాలాది బంధువర్గములోను
అపగింజంత ముల్లు అరికాల నాట కుండాను
క్షేమాన యలమంచి చేరిరి వారు"67.

ఈ కథా ప్రసక్తి జన్నివాడ కథలో కూడ వచ్చును.

ఈ కటియాపులరాజు కథకు సంబంధించి 'ముగ్గురు మాష్టీలకథ' అనియు 'ఒంటి మాష్టీని కథ' అనియు రెండు విధములగు రచన లున్నవి. ఓరుగల్లుతో కటియాపుల రాజుతో పోరాడిన బేతాళుడు మాష్టీడు ఇతనికి 'కన్నమాధీరుడు' 'రంపాల కేశవుడు' అను మరి యిద్దరు తమ్ముళ్లు గలరు. వీరును వీరులే. కటియాపులరాజు ఏకాంగి జగడమున బేతాళుని చంపగా, బేతాళుని సోదరులును యుద్ధ సన్నద్ధులైరి. వీరిలో కన్నమధీరుని కూడ కటియాపులరాజు చంపెను. రంపాల కేశవుని భట్టాపుల పల్లిభన్న చంపెను. ఇట్లున్న కథను "ముగ్గురు మాష్టీలకథ" అందురు. ఒక్క బేతాళుని వృత్తాంతముతో ముగియు కథను 'ఒంటి మాష్టీని కథ' అందురు. ఈ రెండును భిన్నకవుల రచనలు. అనగా 'కటియాపుల రాజు–ఒంటిమాష్టీనికథ' ఒక కవి రచన; 'కటియాపులరాజు–ముగ్గురు మాష్టీలకథ' అనునది వేరొక కవిరచన. ఈ రెండింటికిని కథాకథనమున కొంత భేదమున్నది. ముగ్గురు మాష్టీలకథలో బాచయ్య యలమంచికివచ్చి యాదవుల నాహ్వానించుట, యాదవవీరులు ఓరుగంటికి వచ్చునప్పుడు శకునములగుట, పల్లికొండ ఆ శకున

---

67. పెదకంటి పల్లె తాళపత్ర ప్రతి, ఆకు 66.

ఫలితములను అయితమరాజునకు చెప్పుట, ప్రతాపరుద్రుని సమక్షముననే ద్వంద్వ యుద్ధము జరుగుట చెప్పబడినది. ఇందు ప్రతాపరుద్రుడు కుత్సితునిగా కాక, ధర్మపరుడగు చక్రవర్తిగా చిత్రింపబడెను. అతడు బేతాళుని కటియావుల రాజును తన కొలువునకు పిలిపించి, వారి పోరు మాన్ప ప్రయత్నించును. కాని ఎంతచెప్పినను బేతాళుడు వినడు. ముగ్గురు మాష్టీల మరణము, చిటిగోపు సాగుమానముతో ఈ కథ ముగియును. ఒంటి మాష్టీని కథలో మొదట కొన్ని ఆకులు నష్టమైనవి. అందుచేనిందు బాచయ్య యలమంచికి వచ్చుట, యాదవుల ఓరుగంటి ప్రయాణము లేవు. ఇందు ప్రతాపరుద్రుడు కుత్సితునిగా, కొండెములను విని నమ్మెడి మూర్ఖపు రాజుగా చిత్రింపబడెను. ఇతడు యాదవులను చంపుట కెన్నియో ప్రయత్నములు చేయును. బేతాళుని మరణము తర్వాత ఇతడు కటియావుల రాజును అయితమ రాజుచే చంపింప యత్నించును. కటియావుల రాజు లేడని తెలిసికొని, గవిలికొండ దగ్గరనున్న యాదవులపై దండెత్తును.

నాకు పై రెండు విధములగు రచనలును లభించినవి. ముగ్గురు మాష్టీల కటియావుల రాజు కథ పల్నాడులో గామాలపాడు గ్రామమునను, ఒంటి మాష్టీని కటియావుల రాజు కథ చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, పెదకంటి పల్లె గ్రామములోను సంపాదించితిని. ఇందు మొదటి కథను ప్రధానకథగాను, రెండవ దానిని అనుబంధముగాను చేర్చితిని. ప్రధాన కథా రచయిత కామనాల గోత్రుడును, యాదవకులుడును, చెన్నమాంబా పుత్రుడును అగు పినయెల్లన్న (కాటమరాజు కథను రచించిన గంగుల పినయెల్లయ యితడే కావచ్చును). ఇందలి ఛందస్సు అక్కడక్కడ ద్విపదవలె నున్నను మొత్తముపై మంజరియే. ఒంటి మాష్టీని కథా రచయిత తన నామ మెచ్చటను తెలుపుకొనలేదు. (అవతారికా భాగము నష్టమైనది). ఇది మంజరీ వికారమగు రచన. గణములు శిథిలమై, సాగిపోయి, లయాత్మక వచనము వలె నున్నది. ప్రొద్దుటూరులో నొక యాదవ గాథాకారుడు పాడిన కటియావుల రాజు కథ పై రెండింటి కన్నను భిన్నముగా నున్నది.

ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో ఈ కటియావుల రాజు ఎఱ్ఱసిద్ధి రాజుతో పోరి అతనిని చంపును,

## 11. పాపనూక కథ :-

పాపనూక కాటమరాజునకు చెల్లెలు. ఈమె దుష్టనక్షత్రమున జన్మించినది. ఈమె పుట్టిన యేడవనాటికే తండ్రి పెద్దిరాజు ఆర్లపెంటరణములో హతుడయ్యెను. తల్లి అగ్నిగుండమున బడెను. భక్తిరన్న ఈమెను కాటమరాజును కల్యాణము నుండి యలమంచికి దెచ్చెను, భక్తిరన్న పాపనూకను తన తల్లి సిరిదేవి కప్ప గించి, అగుమంచితో సమముగా పెంచి పోషింపుమని చెప్పి, తాను కాశీయాత్రకు పోయెను.

ధనముకొండలో పాపనూక యీడేరి యుంటనున్నది. పల్లికొండ యీమెకు వివాహము చేయ సంకల్పించెను. తన తమ్ముడు నాచకూళ్ళ నాయని కిచ్చి పెండ్లి చేయవలసినదని అయితమరాజును సిరిదేవిని కోరినాడు. అయితమ రాజాదులు పురోహితుని బిలిచి పాపనూక జాతకమును చూడుడనిరి. పురోహితులామె జాతక చక్రమును పరిశీలించి, పాపనూక ఫాల్గుణ మాసమున బహుళమందు నాలుగు ఘడియల జమిలి నక్షత్రమున బుధవారమునాడు పట్టపగటివేళ భూమిని తన్నుచు పుట్టినదనియు, ధనధాన్యముల గండమునను, తల్లి దండ్రుల గండము నను, గోత్ర గండమునను పాపనూక జన్మించెననియు, అందుచే ఆమెకు వివాహము చేసినచో —

"ఇచ్చిన వారిండ్లు ఇలమీద క్రుంగును
పుచ్చుకున్నవారిండ్లు భూమి మీద వెలుగును
ఎదురిండ్లు మనవయ్య ఏక పుణికెల పాపకు
విధి అమిశతో పుట్టెను వినవయ్య చెల్లెలు
మధ్యానాన బుట్టింది మగువ పాపన్న
వద్దయ్య నగరువెళ్ళ వణిత నియ్యరాదు
మంచిది గాదయ్య మనుము లిచ్చినయపుడె
కొంచపడక మీరు గోకులాధీశ
ఇంటనె వుంచరయ్య యిళ్లు వెళ్లకుండా

మాటవాసి దక్కదు మన్నర్కము లేదు
రాజలక్ష్మి తొలగును నగరు వెళ్ళినయపుడె
పూజలక్ష్మి తొలగును పుట్టింటనే వుంచుడా
ఇల్లటముగాను ఇంటనే పెండ్లి

చెల్లెలు పాపనూక పెండ్లి చేయుడా మీరు" —[68] అని అయితమ రాజుతో చెప్పిరి. యాదవులీవృత్తాంతమును విని భయపడిరి. పాపనూక పెండ్లి చేసి, నాచకూళ్ళనాయని ఇల్లరిక ముంచుకొనవలెనని అయితమ రాజును, సిరిదేవియు తలంచిరి. కాని కొమరక్క తన కుమారుని ఇల్లరికముంచుట కిష్ట పడలేదు. అందుచే పాపనూక వివాహమాగిపోయెను. అవివాహితగా పాపనూక యింటనుండుట దోషమనియు, అట్లున్నచో యాదవ వంశమంతయు నాశనమగు ననియు, ఆమెను ఒంటరిగా ఊరిబయట నొక మేడలో నుంచుడనియు పురోహితులు చెప్పిరి. అట్లు చేయుటకు సిరిదేవి మిక్కిలి తొందరపడెను. కాని ముందు వెనుకలాలోచించి, అయితమరాజు తన తల్లిని వారించి, పాపనూకను మేడలో పెట్టు విషయము మందలోనున్న కాటమరాజునకు కమ్మలు పంపి తెలి పెను. కాలారి తెచ్చిన కమ్మలు చదివి కాటమరాజు మిక్కిలి దుఃఖించెను. అతని చెలికాడు పద్మరాఘవుడు అనేక విషయములు చెప్పి కాటమరాజునోదార్చెను. అతడు తన యనుమతిని తిరుగు కమ్మలు పంపి తెలిపెను అప్పుడు సిరిదేవి కాపులను పిలిచి ఊరిబయట ఒంటి స్తంభపు మేడ నిర్మింపుడని అజ్ఞాపించెను. కాపులు బండ్లు కట్టుకొని, అడవులకుపోయి, కలప కొట్టుకొని వచ్చి సుందరముగా ఏడంతస్తుల మేడను నిర్మించిరి. ప్రతి అంతస్తునందును చక్కని అలంకరణము వేసి పూర్వ యాదవుల చిత్రపటము లుంచిరి. తనకు రాబోయెడి విపత్తును గ్రహింపక అమాయకముగా నిద్రించుచున్న పాపనూకను వీరగంగ మేల్కొల్పును. ఆమెకు తలంటు పోసి, చక్కగా అలంకరించును. అప్పుడు సిరిదేవి అసలు విషయము చెప్పును. పాపనూక మిక్కిలి దుఃఖించి, బంధువర్గమును శపించును. యాదవకాంతలందరును పాపనూకను ఊరిబయటి మేడలో ప్రవేశపెట్టి తిరిగి వత్తురు.

---

68. పాపనూక కథ, తాళ పత్ర గ్రంథము, కుచ్చికాయలపూడి ప్రతి, 1964, ఆకులు 10, 11

ఈ కథకు సంబంధించి నాకు మూడు తాళపత్ర గ్రంథములు లభిం చినవి. మూడును ఏకకవి కర్తృకములే. కవి పేరు కదిరిమంగళము (మంగళపురి) వెంకటాద్రి.దొనకొండలో పాపనూక నివసించిన మేడ శిథిలములు నేటికిని గలవు. అట అతి ప్రాచీనమైన పాపనూక విగ్రహము లభించినది. దానిని దొనకొండ గంగగుడిలో భద్రపరచినారు. యాదవ వీరులందరును ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో మరణించినప్పుడు ఈ పాపనూక కూడ అగుమంచితో కలసి చిచ్చురికినది.

## 12. కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు :

ఈ కథకు "ఆవులమేపు", "ఉత్తరాది ఆవులమేపు", 'ఆవుల మేపులు-ఉత్తర కాండము' -అను మూడు నామాంతరములున్నవి. ఈ కథా చక్రమున గల ముప్పదిరెండు వీరగాథలలోను కాటమరాజునకు పూర్తిగా సంబంధించిన కథ యిది యొక్కటియే. ('మేపు' శబ్దమిచ్చట జానపదులచే నామవాచకముగా ప్రయోగింపబడినది. 'మేపు' అనగా 'మేపుట' అని యర్థము).

కాటమరాజు తన విస్తారమైన గోగణమును శ్రీశైల ప్రాంతారణ్యములో పండ్రెండు సంవత్సరములు మేపెను. ఇతనితో కూడ పల్నాటి ప్రభువగు వెలమ పద్మరాఘవుడును, కాటమరాజు పినతండ్రి నలనూకరాజు పుత్రుడగు పెయ్యాల యెఱ్ఱయ్యయు నుందురు. కాటమరాజు శ్రీశైల ప్రాంతములందే యున్నచో దక్షిణ దేశమున పోలురాజు పగ నెరవేరుటకాని, తన్మూలమున యాదవ వినాశముగాని సంభవింపదు. అందుచే హరుడు బ్రహ్మనడిగి యాదవుల ఆయుః ప్రమాణమును తెలిసికొనగోరెను. "ఏటిమీద ఆరు నెలలకు ఎద్దులు యాదవులు, చిత్రభాను సంవత్సరాన చెల్లనున్నారు." అని బ్రహ్మ చెప్పగా,ఈశ్వరుడు కాటమరాజును దక్షిణ భూములకు పంపనెంచి, నల్లమల ప్రాంతమున పచ్చగడ్డి లేకుండ చేసెను. నీరును పూరియు లేక ఆలమందలు మలమల మాడిపోవుచుండెను. త్రిమూర్తులు బలిజ వేషములలో వచ్చి, కాటమరాజుతో దక్షిణాదిని నెల్లూరి సీమలో వలసినంత పచ్చికయు నీరును లభించుననియు, ఆలమందల నటకు మళ్ళించుకొని పొమ్మనియు దెల్పిరి. కాటమరాజు పద్మరాఘవునితో నాలోచించి, దక్షిణాది భూములకేగ నిశ్చయించుకొనెను. తరువాత నతడు ధనముకొండకేగి, పినతల్లి సిరిదేవితోను,

అయితమరాజాది సోదరులతోను, తన దక్షిణాదియాత్రను గురించి చెప్పెను. పోలురాజునాటి ప్రాత పగలు తిరుగదోడునేమోయని సిరిదేవి మిక్కిలి భయ పడి అతనిని వారింపజూచును. కాని కాటమరాజు వినడు. దక్షిణ భూములకేగి, ముక్కంటి వంశమువాడగు నల్లసిద్ధితో ప్రాత పగలు తీర్చుకొని వత్తునని ప్రతిజ్ఞపట్టి, తనమందను మరలించుకొని, పాలేటి యొడ్డునకు వచ్చిచేరెను.

ఈ కథకు సంబంధించి నాకు రెండు తాళపత్ర గ్రంథములు లభించినవి. రెండును ఏకకర్తృకములే కాని, కవి పేరు తెలియవచ్చుటలేదు.

## 13. 'పాలేటి కథ' లేక 'గంగతర్కము' లేక 'గంగ-కాటమరాజు తరకవాదము' :-

ఉత్తరాది నుండి కాటమరాజునకుగల 'కుదిరితే ఆరామడ-చెదిరితే పన్నెండామడ' విస్తరించియుండు మహా గోగణమంతయు వచ్చి, పాలేటి యొడ్డున విడిసెను. తాళ్లూరి మిట్టల దగ్గర కొన్ని మందలు, బొమ్మిరెడ్డిపల్లి మిట్టలదగ్గర మరికొన్ని మందలు, ఇంకను కొన్ని మందలు చాకిరేవు మిట్టలు, అలవలపాటి రేవు, ముద్దుపాటిరేవు, మంగోలుపాటిరేవు, కోటపాటిరేవు, లింగాలకొండ కెదురుగాను విడిసినవి. ఈ మందలన్నింటిని పాలేరు దాటించి, దక్షిణ భూములకేగ వలెనని కాటమరాజు తలంపు కాని యాదవుల కులదైవమగు గంగ, ఆ పాలేటి కడ ప్రత్యక్షమై "నేను నీ కులదేవతను. నన్ను పూజింపుము. నాకు చేయెత్తి నమస్కరింపుము." అని హెచ్చరించును. కాటమరాజు ఆమెను లక్ష్యపెట్టక "నీవు ఆడుదానవు, నీకు నేను చేయెత్తి నమస్కరింపను!" అని సమాధాన మిచ్చును. గంగయు కాటమరాజును ఇట్లు ఎంతయో సేపు వాదించుకొందురు. గంగ ఎంత భయపెట్టినను కాటమరాజు చలింపడు. అప్పుడామె పాలేటిని విప రీతముగా పొంగించి, ఆలమందలు నదిని దాటుటకు వీలులేకుండ చేయును. కాటమరాజునకు ప్రియమైన మట్టిపెయ్యను ఒక గుండురాతి క్రింద దాచి వేయును. అయినను కాటమరాజు గంగకు చేయెత్తి మ్రొక్కడు. అంత గంగా దేవి పాలేటిలో నొక్కచుక్క నీరు లేకుండ చేయును. త్రాగుటకు నీరు లేక పశువులు మూర్ఛపోవును. ఆ పశుఘోష వినలేక, కాటమరాజు గంగను పూజిం

చుడి కొప్పుకొనును. ఆమెకు ఏటేట జాతరలు చేయుటకును, కులదైవముగా పూజించుటకును అంగీకరించి, చేయెత్తి మ్రొక్కెను. అప్పుడు గంగమ్మ సంత సించి, మట్టిపెయ్యనిచ్చి, ఆలమందకు పుష్కలముగా నీటి నొసంగెను.

కాటమరాజు కథా చక్రమున మిక్కిలి ప్రచారమున నున్న వీరగాథలలో ఈ గంగతరపు మొకటి. గంగ జాతరలలో ఈ కథను తప్పక పాడుచుందురు. ఇద్దరు వ్యక్తులు గంగవేషము, కాటమరాజు వేషము ధరించి, చేతిలో కత్తులు పట్టుకొని సంవాద రూపమున దీనిని పాడునప్పుడు వినుట జీవితమున నొక అపూర్వానుభూతి: రాయలసీమలో, ముఖ్యముగా కడప కర్నూలు మండలములలో నిట్టి యనుభూతులు తరచు కలుగుచుండును.

ఈ పాలేటి కథకు నాకు మూడు తాళపత్ర గ్రంథములు లభించినవి. మూడును ఒకే అజ్ఞాత కవి కృతములు.

## 14. ఎఱ్ఱయ్య తరకవాదము :-

ఇది కృష్ణామండలమున లభించిన మరియొక నూతన వీరగాథ (తాళపత్ర గ్రంథము). ఇతివృత్తము పై రీతిగనే యుండునుగాని, అందలి కాటమరాజు స్థానమును దీనిలో పెద్దయ్యల యెఱ్ఱయ్య ఆక్రమించును. ఆలమందలో గంగ భయంకర వేషమున ప్రత్యక్షమై ఎఱ్ఱయ్యను భయపెట్ట జూచును. కాని ఎఱ్ఱయ్య ఆమెను లెక్కచేయడు. తన్ను గొల్వుమని చెప్పు గంగను ఎఱ్ఱయ్య ధిక్కరించి ప్రశ్నించును. గంగ యెన్నియో మాయలు చూపును. ఎఱ్ఱయ్య చలింపడు. అంత గంగ మహా కోపముతో—

"పోలురాజు పగలు పోకుండ నిలిపి
వారికి మీకును వైరంబు చేసి
సరి వీరకల్లుగా సంపింతు నేను
ఏనుగులు గుఱ్ఱాలు ఎద్దులావులను
శానాపశానలు సంపింతు నేను"[69]—అని ప్రతిజ్ఞ పట్టి అదృశ్యయగును.

---

69. కృష్ణాజిల్లా, కైకలూరు తాలూకా, పెదకగూడెంలో 1964 లో లభించిన తాళపత్ర ప్రతి, ఆకు 33.

ఒక విధముగా 'పాలేటి కథ' సుఖాంతమని చెప్పవచ్చును. అందు గంగ చివరకు శాంతించి మాయమగును. కాని యీ 'యెఱ్ఱయ్య తరకవాదము'లో మాత్రము గంగ యాదవులను శపించి మాయమగును. కావున దీనిని విషాదాంత మన వచ్చును.

## 15. కాటమరాజు దక్షిణాది ఆవులమేపు (పుల్లరి కథ)

'కాటమరాజు దక్షిణాది ఆవుల మేపు' అను కథకు మరి అయిదు పేళ్లున్నవి. "పుల్లరి కథ, జన్నివాడ కథ, చదరంగం కథ, దక్షిణాది ఆవులమేపు, ఆవుల మేపులు-దక్షిణ కాండము." వీనిలో 'జన్నివాడ కథ', 'పుల్లరి కథ' అను పేళ్లకు ప్రాచుర్యము హెచ్చు.

గంగకు పాలేటి కడ చేయెత్తి మ్రొక్కిన కాటమరాజు, తన ఆలమందలతో పాటు పాలేటిని దాటి, నెల్లూరిసీమ కేగినాడు. పోలురాజునాటి పగలు తీర్చవలెనని సోదరులతో చెప్పినాడు. నెల్లూరును పాలించు నల్లసిద్ధిరాజు కడకు తన కంపటీలను పంపి, "సీరున పుట్టిన పూరెల్లమాది, ఆవుకు పుట్టిన కోడెల్లమీది" అని రాగి శాసనములు వ్రాయించుకొని, పెన్న యొడ్డునగల రంగనాథస్వామి దేవాలయములోని దేవసాక్షులను బెట్టుకొని, నెల్లూరి పచ్చిక బీళ్లలో తన పశు గణమును మేపుకొను చుండెను. కాటమరాజు ఆలమందలు పచ్చిక బీళ్లనే కాక, నెల్లూరి సీమలోని వరిపొలములను గూడ మేసివైచెను. పొలములలోని కాపులు నెల్లూరునకు పోయి, నల్లసిద్ధి రెండవ భార్యయగు కుందమాదేవితో మొరపెట్టుకొనిరి. కుందమాదేవి కాటమరాజుపై కోపించి, అతని ఆలమందలను బోయలచే పొడిపింతుననెను. ఆమె అన్నగారు 'భావరాజు' అట్టి పని చేయవలదని చెల్లెలిని వారించెను. అందుచే నామె తన పెంపుడు చిలుకను ఆలమందలున్న తావునకు పంపెను. ఆ చిలుక పలు రకముల కూతలు కూయుచు, కాటమరాజు ఆవులను బెదరించెను. ఆ యావులు విపరీతముగా భయపడి లేగలమ త్రొక్కుకొనుచు పరుగిడసాగెను. పద్మరాఘవుడది చూచి ఆ చిలుకను తన బాణముతో నేసెను. ఆ చిలుక కుందమాదేవి కడకువచ్చి ప్రాణములు విడిచెను. కుందమాదేవి ఆగ్రహావేశముతో చుండు బోయలను పంపి కాటమరాజు మందను పొడిపించెను. అది చూచి కాటమరాజు క్రుద్ధుడై, ఆ బోయలను, చంపించి, గోసంగి వీరులను

ఉపాయములలో నెల్లూరి కోటపైకి పంపెత్తించెను. గోసంగి వీరులు నెల్లూరు పట్టణమంతటిని ధ్వంసముచేసిరి. తరువాత యాదవులందరును నల్లసిద్ధిరాజునకు పుల్లరి నెగవేసి, ఎఱ్ఱగడ్డపాటికి తరలి వచ్చిరి.

నాకు, ఈ కథాసంబంధమగు తాళపత్ర గ్రంథము కృష్ణామండలమున కైకలూరు తాలూకా పెరికగూడెము అను గ్రామములో గుజ్జర్లపూడి చింతాలు అను కొమ్ములవానికడ లభించినది (21-9-1964); కవి అజ్ఞాతుడు.

## 16. భట్టు రాయబారము లేక కల్లి రాయబారము

ఎక్కువగా పాడబడుచున్న కాటమరాజుకథలలో నిది యొకటి. దీనిని దొనకొండ గంగజాతరలోను, పాలేటి గంగజాతర (ఎఱ్ఱగడ్డపాడు దగ్గర) లోను ప్రతి సంవత్సరమును పాడుచున్నారు. దీనికి సంబంధించిన వ్రాతప్రతులు మదరాసు ప్ర. ప్రా. లి. పు. భాం. న మూడున్నవి (డి. నెం. 1041, 1042, 1043). ఈ ప్రతులలో 'భట్టురాయభారము' అనియున్నను, జానపదులలో ఈ కథకు 'కల్లి రాయబారము' అనియే ప్రసిద్ధి.

దీని కర్త యెవరో తెలియరాదు. బ్రౌను దొరగారు ఒక వ్రాతప్రతిలో దీని కర్త 'రాయశృంగావళి' అని వ్రాసినారు. ఇది తప్పు. రాయశృంగావళి అనువాడు నల్లసిద్ధిచే కాటమరాజు కడకు పంపబడిన భట్టు. దొరగారు పొరబడి యితడే దీని రచయిత యని భావించిరి.

తన భూములలో పశువులను మేపుకొని, పుల్లరి నీయకుండ ఎఱ్ఱగడ్డపాటికి వచ్చిన కాటమరాజుకడకు, నెల్లూరి నల్లసిద్ధిరాజు ఒక భట్టును రాయబారమంపెను. అతనిపేరు 'రాయ శృంగావళి'; బ్రాహ్మణుడు. అతడు కాటమరాజు సభకు వచ్చి పుల్లరి చెల్లింపుడని యాదవులను కోరును. అతనికి సమాధానము చెప్పుటకై కాటమరాజు తన పక్షమున 'కొమార బంగారము' అను మరియొక భట్టును సభకు రప్పించును. ఈ యిరువురు భట్లును తమతమ యేలికల పక్షమున కాటమరాజు కొలువులో భాషించుకొనుట యీ వీరగాథలో సంభాషణాత్మకముగ రచింపబడినది. ఒక భట్టు భాషించిన పిమ్మట మరియొక భట్టు భాషించుటగా ఈ కథా రచన సాగును. రాయ శృంగావళి భట్టు తన వాదమంతయును వినిపించి, కడ

పట—"బుద్ధిమాలియు వెఱ్ఱి బుద్ధులు పోక, పెద్దరికాల్ మాని పెట్టు పుల్లరిని" అనును. ఇతని వాదమునకు సమాధానము చెప్పి, కాటమరాజు పక్షము వాడగు కొమారబంగారము భట్టు—"వదరక పలుమారు పసుధేశునెదుట, కదిలి రమ్మనుమి మీ కలవారినెల్ల" అనును. ఇట్లు ఒక్కొక్కడును తన ఏలికను గూర్చి, తమ బలసంపదను గూర్చి వీరావేశముతో గొప్పలు చెప్పుకొనును. ఒకడు చెప్పుకొనిన గొప్ప మరొకనికి కోపకారణమగును. ఆ కోపముతో వారాడుకొనిన పలుకులయందెన్నియో సామెతలు, పలుకుబళ్లు, దేశీయోపమలు కొల్లలుగా దొరలును. కడకు రాయశృంగావళి కోపముతో కాటమరాజు నిట్లనును.

"దబ్బరకాదు మాధనమును నిపుడు
గొల్లవంకరబుద్ధి గొబ్బున మాని
చెల్లించుమీ రాజ! చెడిపోకమీరు"

ఈ మాటతో కాటమరాజు ఉగ్రుడై లేచి, మాటిమాటికి 'గొల్ల, గొల్ల' యనుచున్న భట్టును చంపబోవును. ఆ భట్టు భయపడి పద్మనాయని చాటునకు తప్పుకొనును. పద్మనాయడు కాటమరాజును శాంతచిత్తునిచేసి, భట్టునకు కట్నాలిప్పించి పంపెను. యాదవుల భట్టు తమ వీరులందరును యుద్ధమునకు సిద్ధముగానున్నారనియు, సిద్ధిరాజు నెత్తిరమ్మను మనియు రాయశృంగావళిని హెచ్చరించును. రాయబారము విఫలము కాగా, రాయ శృంగావళి నెల్లూరుకు వెడలిపోయెను.

కాటమరాజు కథాచక్రమున ఈ 'భట్టురాయబారము'ను ఒక ప్రత్యేక పద్ధతిలో పాడుదురు. దీనిని 'పాడుదు'రనుటకన్న 'చదువుదు'రనుట సమంజసము. ఇందు రాగ వైవిధ్యము లేక, భావ గర్భితముగా ఆయా భాగములకు యుక్తమైన ఊనిక (stress) తో వచన కవిత్వము వలె చదువుదురు. గాథాకారులు రెండు వర్గములుగా చీలిపోవుదురు. ఒక వర్గమువారు నల్లసిద్ధి పక్షము భట్టువలెను, రెండవ వర్గమువారు కాటమరాజు పక్షము భట్టువలెను నటింతురు. దొనకొండలో గంగగుడికి ముందు రెండు అరుగులున్నవి. ఈ అరుగులపై ఈ ఈ భట్లు ఒకరి కొకరెదురుగా నిలబడి రాయభారము కథను కొనసాగింతురు. ఒక పక్షమువాడు ఒక భాగమును చదువగా, రెండవపక్షమువాడు దానికి సమాధానముగా మరియొక భాగమును చదువును. పిమ్మట మొదటి పక్షములోని మరి

యొక ప్రశ్న పాట నడుపుకొనును. దానికి రెండవపక్షములోని వేరొకవ్యక్తి సమాధానము చెప్పును. ఇట్లు భట్టు రాయబార మంతయు పాడుచు కడు రమణీయ ముగా ప్రదర్శింపబడును. ఈ గాథాకారులు నిలబడి పాడెడి అరుగులను 'తల్లి అరుగులు' అని పిలుతురు. కల్లి రాయబార కథను పాడు అరుగులు కావున ఈ పేరు వచ్చినది. ఎర్రగడ్డ పాడు దగ్గర గంగగుడి వద్ద జరుగు జాతరలో కల్లి రాయబారకథను పాలేటి మధ్యగల నల్లని గుండురాళ్ళదగ్గర పాడుదురు. ఈ రాళ్ళను 'కల్లిగుండ్లు' అందురు.

## 17. కోటపాటి తాటివృక్షం తెచ్చేకథ

వేటూరి పరిష్కృతమగు కాటమరాజు కథలో నిది రెండవ యనుబంధ ముగా ముద్రింపబడినది. దీని వ్రాతప్రతులు మదరాసు ప్ర. ప్రా. లి. పు. భాం.న గలవు, కవి అజ్ఞాతుడు.

ఇది భట్టు రాయబారమునకు తరువాత జరగిన కథ. నెల్లూరి భట్టు రాయబారము విఫలమైనది. కాటమరాజు యుద్ధసన్నద్ధుడు కాసాగెను. నల్లసిద్ధితో తనకు రాబోవు యుద్ధములో సహాయపడవలసినదిగా ధనముకొండలోనున్న తన సోదరుడు అయితమరాజునకు కమ్మ వ్రాయుమని పద్మనాయనితో చెప్పను. కమ్మ వ్రాయుటకు వ్రాలాకులు లేవని పద్మనాయడు పలికెను. కాటమరాజు, పంచలింగాలకొండకు దగ్గరలోనున్న 'కోటపాడు [70] గ్రామములో నుంచి వ్రాలా కులున్నవని తెలిసికొని, చట్టువారి యెఱ్ఱయ్యను బిలిచి వానిని తెమ్మనెను. అతడు ఆ కోటపాటికి పోయి, తన్నడ్డగించిన అనేక వీరులను జయించి, వ్రాలాకుల మంచి చెడ్డలు తనకు తెలియకపోవుటచే ఆ తాటిచెట్టునే పెల్లగించి తెచ్చివేసెను. పద్మనాయడు కరణములచే కమ్మలు వ్రాయించి, కాలారి చేతికిచ్చి దొనకొండలో నున్న అయితమరాజు కడకు పంపెను.

అయితమరాజు తనకు వచ్చిన కమ్మయొక్క శుభాశుభము లెరుగగోరి ఫలములు నింపిన యొక పళ్ళెరమున ఆ కమ్మనుంచి, ఛప్పన్నభాషలు తెలిసిన ఫలములు సిరిదేవిముందు పెట్టెను. ఆమె మొదట కమ్మను తాకక ఫలములను

70. ఈ కోటపాడు గ్రామము నేటికిని పంచలింగాలకొండకు తూర్పుగా మూడు మైళ్ళదూరమున పాలేటి యొడ్డున నున్నది. నేను చూచితిని.

తాకినచో యాదవులకు శుభమనియు, అట్లుకాక కమ్మనే తాకినచో అశుభమనియు అతడు భావించెను. సిరిదేవి మొదట కమ్మనే ముట్టినది; కమ్మచదివి వినిపించి నది. కాటమరాజునకు సహాయము చేయుటకై ఎఱగడ్డపాటికి పోవలెనని ఎల్ల రును నిశ్చయించిరి. బాలరాజుల (ముమ్మయ్య - పోచయ్యల)ను మాత్రము ధనముకొండ రక్షణకై అచటనే నిలిపి, తక్కిన యాదవ వీరులందరును ఎఱ్ఱ గడ్డపాటికి తరలిపోయిరి.

కాటమరాజు తన కడకు వచ్చిన సోదరులను బంధువులను ఆహ్వానించి గౌరవించెను. కాశికి పోయిన భక్తిరన్న రాలేదని అందరును ఒక ప్రక్క విచారించుచు, వేరొక ప్రక్క నల్లసిద్ధితో యుద్ధము చేయుటకై ఉవ్విళ్ళూరుచు పగచాటి పంతములు పల్కుచుండిరి.

ఈ కథనుగూర్చి వ్రాయుచు తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారు, "ఇది యసంపూర్ణముగా మాత్రమే యుపలబ్ధమగుచున్నది. తక్కిన గ్రంథ భాగము దొరకునేమో పరిశోధింపవలసిన యవసరమున్నది" అనిరి. ఇది ప్రామా దికము, వేటూరి వారిచ్చిన అనుబంధములో ఈ కథ సంపూర్ణముగనే యున్నది.

## 18. వేడుక బొంగరాల కథ (అలుగుల పోలు) :-

దీనికి 'బొంగరాల కథ, ముమ్మయ్య—పోచయ్య బొంగరాలు, అలుగుల పోలు' అను నామాంతరములున్నవి. ఇది పల్నాటి వీరకథా చక్రములోని బాల చంద్రుని బొంగరాల కథనుబట్టి వ్రాసినట్లుగా నున్నది. ఈ రెండు ప్రసిద్ధ వీర గాథా చక్రములును ఒకే కవి సార్వభౌముని చేతినుండి వెలువడియుండుటచే నిట్టి కథాసామ్యము లున్నవని తలపవచ్చును.

పోలురాజు మూడవ కుమారుడు ముమ్మయ్య. చిట్టినూక కన్నకొడుకును, ఆగుమంచి పెంపుడుకొడుకును అగువాడు పోచయ్య. ఈ మేనమామ — మేనల్లుడు ఇరువురును కలసి ధనముకొండలో బొంగరము లాడుట యిందు వర్ణితము. ఈ కథయొక్క తాళపత్ర ప్రతి చిత్తూరుజిల్లా, చంద్రగిరి తాలూకా, పెడకంటి పల్లెలోను, కాగితపు ప్రతులు కడపజిల్లా ప్రొద్దుటూరులో నొకటి, గుంటూరు జిల్లా తెనాలి తాలూకా యడవూరులో మరియొకటి నాకు లభించినవి. కాని వీనిలో ఏదియును సమగ్రముగా లేకపోవుట దురదృష్టము.

అయితమరాజాదులు ఎఱ్ఱగడ్డపాడులో నల్లసిద్ధితో యుద్ధము చేయుచుండిరి. ధనముకొండలోనున్న ముమ్మయ్య పోచయ్యలకు ఈ విషయము తెలియదు. సిరిదేవి వారించినను వారు వినక, దేవతా బొంగరాలను తీసికొని, సంగడీలతో కలిసి, చాలురావులకడ బొంగరాల నాడసాగిరి. మామయు అల్లుడును పందెములొడ్డి పంతముతో నాడసాగిరి. ధనముకొండలోని స్త్రీలు ఆ బొంగరాలాటను చూడవచ్చిరి. బాలరాజులు విసిరిన బొంగరము ఒక వైశ్యకాంతను తగిలి ఆమె మూర్ఛపోయెను. మూర్ఛనుండి లేచి, ఆమె బాలరాజులను దూషించెను' ఆ దూషణనుబట్టి కాటమరాజాదులు ఎఱ్ఱగడ్డపాడులో యుద్ధము చేయుచుండిరని బాలరాజులు గ్రహించిరి. వెంటనే తల్లుల అనుమతిని గైకొని పాలేటికి పయనమైరి. వారికి కొన్ని దుశ్శకునములయ్యెను. ఆ శకునములను గూర్చి మామ ముమ్మయ్య అల్లుడగు పోచయ్యను ప్రశ్నించును. పోచయ్య ఆ శకున ఫలములను చెప్పును. (ఇంతటితో నాకు లభించిన ప్రతులలో కథ నిలిచి పోయినది).

ప్రొద్దుటూరులో శూలం రామగోవిందప్ప అను యాదవ గాథాకారుడు తరువాత కథ నిట్లు చెప్పినాడు: "బాలరాజులు పాలేటికి వచ్చునటికి యుద్ధము పరిపూర్తియైనది. కాటమరాజు పంచలింగాల కొండపైకి పోవుచుండెను. ఈ బాలరాజులను చూచి శత్రువులని భ్రమించి, తన చేతనున్న బల్లెము వారిపై విసరెను. దానిచే బాలరాజులు కూలిపోయిరి. పిమ్మట కాటమరాజు వారిని ముమ్మయ్య—పోచయ్యలుగా గుర్తించి, చేసిన పనికి విచారించి, తానును ఆత్మహత్య చేసికొనెను. బాలరాజులిట్లు అలుగులచే నొరిగిపోయిరి కావున దీనికి 'అలుగులపోలు' అని పేరు వచ్చినది."

కాని పై కథాపూరణము సత్యముగా దోపదు. ఏలయన, 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' అను తరువాత కథలో ముమ్మయ్య పోచయ్య యుద్ధము చేసినట్లు స్పష్టముగా వర్ణింపబడినది. 'బాలరాజుల యుద్ధము' అను పేరుతో వీరి యుద్ధమును ప్రత్యేకముగా వర్ణించు నొక కొండ యున్నది. కావున ధనముకొండ నుండి బయలుదేరిన బాలరాజులు ఎఱ్ఱగడ్డపాటికి వచ్చి, నల్లసిద్ధిరాజు సైన్యముతో యుద్ధముచేసి, వీరస్వర్గ మలంకరించిరనుటయే బొంగరాలకథకు సరియగు పూరణము. ముమ్మయ్య—ఉండవెల్లి విరిగోపు అను శత్రువీరునితోను, పోచయ్య—తిర్దమల తిప్పయ్య అను పగవానితోను యుద్ధము చేసిరని ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో

స్పష్టముగా నున్నది. ఈ బొంగరాల కథలో వలురాజునుండి పోలురాజు వరకును గల పూర్వ వీరుల కథలన్నియును ప్రసక్తములగును.

## 19. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట

ఈ వీరగాథకు సంబంధించిన వ్రాతప్రతులు మదరాసు ప్ర ప్రా.లి.పు. భాం. లో నాలుగున్నవి. (D. No. 1031, 1032, 1033, 1034). ఈ నాలుగును 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' అను పేరుతోనే యున్నవి. ఇదేకథ 'కాటమ రాజు చరిత్ర' అను పేరుతో గూడ రెండు ప్రతులలో నున్నది. (D.No. 1040, 1044). ఈ ప్రతులలో D.No. 1040 అను దానిని వేటూరి ప్రభాకరశాస్త్రి గారు పరిష్కరింపగా, ఆ గ్రంథాలయమువారు మల్లంపల్లి సోమశేఖర శర్మగారి పీఠికతో 1953 లో ప్రకటించియున్నారు. (ఈ ప్రతులలోని నామమును చూచియే కాబోలును దీనికి 'కాటమరాజుకథ' అని పేరు పెట్టినారు. ఇది సరికాదు. దీనిని ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట అనుటయే సమంజసము. ఈ కథాచక్రమున ఏయొక్క వీరగాథకును 'కాటమరాజుకథ' అను పేరులేదు). దీని రచయిత గంగుల పినయెల్లయ.

ఈ యెఱ్ఱగడ్డపాటి పోట్లాటనంతటిని ఒకే వీరగాథగా భ్రమింపరాదు. ఇది యేడు కథల గుత్తి. ఈ యేడింటిని 'కాండలు' అందురు. ఈ కాండల వరుస క్రమమిట్లుండును: 1. చల్లవారి జగడము 2. బొల్లావు జగడము 3. బీర్నీడు యుద్ధము 4. బాలరాజుల యుద్ధము 5. అవుల యెద్దుల జగడము 6. ఎఱ్ఱయ్యల యుద్ధము 7. కాటమరాజు యుద్ధము. ('కటికియావుల రాజు యుద్ధ' మను కాండ కూడ కలదని కొన్ని ప్రసక్తుల వలన తెలియుచున్నది). గాథాకారులు ఈ యేడు కథలను వేరువేరుగనే పాడుచున్నారు. (వేటూరివారు అన్నింటిని కలిపి 'కాటమరాజు కథ' అని ప్రకటించిరి). ఈ యేడు కథలలోను మొదటి రెండు కథలకును నాకు తాళపత్ర గ్రంథములు లభించినవి. ఈ మొదటి రెండు కథలకే విశేష వ్యాప్తి యున్నది.

(i) చల్లవారి జగడము (ఖడ్గ తిక్కన కథ) :-

ఈ చిత్రభాను సంవత్సరము మాఘ బహుళ అమావాస్య మంగళవారము నుండి ఫాల్గుణ బహుళ దశమి గురువారము వరకును జరిగినది. దీనికి 'తిక్క-నామాత్యుని కథ', 'ఈర్లమాని కథ' (=వీరుల మాను కథ) అను రెండు నామాంతరములున్నవి. కాటమరాజు పినతల్లి కుమారు లేడ్గురు కలరు. చల్ల పిన్నయ్య, చల్ల గోవిందు, చల్ల అనంతుడు, కోనేరు, అచ్యుతుడు, పుణ్యుడు, వెంకటాద్రి. వీరింటి పేరు చల్లవారు. చలమించి రథపతులైన వీరేడ్గురును మహావీరులు. వీరు యుద్ధములో మొట్టమొదటి ఠాణాను ఆక్రమించిరి. 'చాగల కొండ చల్లగెరిగల' యొద్ద వీరి ఠాణా. చాగలకొండ పంచలింగాల కొండకు దక్షిణముగా ఇరువదినాల్గు మైళ్లదూరమున గలదు. నల్లసిద్ధి ఈ ఠాణాను జయించికాని, కాటమరాజున్న ఎఱ్ఱగడ్డపాటికి పోలేడు. ఈ చల్లవారు తిక్కన తోను, నల్లసిద్ధితోను గావించిన యుద్ధమును వర్ణించుకథ యగుటచే దీనిని 'చల్ల వారి జగడము అందురు. ఇది ఖడ్గ తిక్కన చూపిన మహాశౌర్యమును ప్రసర్శించు కథయగుటచే దీనిని 'తిక్కనామాత్యుని కథ' అనియు పిలుతురు. చల్లవారి పక్షమున ఖడ్గతిక్కనతో పోరి మరణించిన 'బ్రహ్మ రుద్రయ్య' అను శివ బ్రాహ్మణుని గౌరవార్థము యాదవులు జమ్మిచెట్టు క్రింద యజ్ఞముచేసి, అతనికి 'వీరజోనము' నర్పించి, బ్రహ్మహత్యా దోషమును బాపుకొనిరి. జమ్మిచెట్టునకు 'వీరవృక్ష' మని పేరు; అనగా 'వీరుల మ్రాను'. పదాది 'వ' కారము లోపించుట జానపదుల భాషలో గానవచ్చునొక ముఖ్య లక్షణము. 'వీ' లోని వకారము 'మ్రా' లోని రకారము లోపించి 'ఈరుల మాను' గా మారి, 'రు' లోని అచ్చు లోపించి తరువాతి ల కారముతో సంశ్లేషము నొంది 'ఈర్లమాను' అయినది. యాదవులు జమ్మిచెట్టు క్రింద బ్రహ్మ రుద్రయ్యను గూర్చి యజ్ఞముచేసిన కథా వస్తువు వున్నది కావున దీనికి 'ఈర్లమాని కథ' అని కూడ పేరు వచ్చినది.

కాటమరాజు కథాచక్రములో ఖడ్గతిక్కన కథకున్న లోకవ్యాప్తి మరియే కథకును లేదు. ఇతడు పుట్టుకచే బ్రాహ్మణుడైనను, గొప్ప క్షాత్రమును పద ర్శించుటచే ఇతనికింత పేరు వచ్చినది. చల్లవారిని చూచి భయపడుచున్న నల్ల సిద్ధిని, తన్ను యుద్ధమునకు పంపుమని రణ తిక్కన కోరుట, తిక్కన్న చాగల కొండదగ్గరనున్న చల్లవారి ఠాణాకు వచ్చుట, అతడు చల్లవారితో పోరి సైన్యము నష్టముకాగా తిరిగి నెల్లూరు చేరుట, తల్లిదండ్రులును భార్యయు అతనిని హేళనచేయుట, ఖడ్గతిక్కన రెండవమారు యుద్ధమునకు వచ్చుట,

చల్లవారు బ్రహ్మహత్యాదోషమంటు నని భయపడుట, చల్లవారి మంత్రి బ్రహ్మ రుద్రయ్య యను శివబ్రాహ్మణుడు ఖడ్గతిక్కనతో పోరుట, వారిరువురును మరణించుట—తిక్కనామాత్యుని కథలోని ప్రధానాంశములు. ఖడ్గతిక్కన్న-బ్రహ్మ రుద్రయ్య యిరువురును మాఘమాసమున అమావాస్యతిథిని మంగళవారము మధ్యాహ్న వేళ మడిసిరని కథలోనున్నది. వీరిరువురి యుద్ధము లోకోత్తరముగా వర్ణింపబడినది: తెలుగు సాహిత్యముక వ్రేళ్ళపై లెక్కింపదగిన యుద్ధవర్ణనలలో నిదియొకటి :

"అప్పుడు తిక్కన్న యగ్ని చందమునఁ
గదిసెను గోపాగ్ని కన్నుల నురల
నదలించి రుద్రుని నడ్డానవైచె
పడిరుద్రుఁడంత నావాటు దప్పుకొనెఁ
గరవాలు గైకొని కదిసె రుద్రుండు
విడిబడి రిద్దఱు వీరయుద్ధమున
ధరణిపై నొండొరుం దప్పించుకొనుచు
లంఘించి వెనుకకు రాగడిల్లుచును
బ్రాకుచు దూఁకుచుఁబైకి రేఁగుచును
దాటించి నఱుకుచుఁ దాఁకి పొడ్చుచును
నుఱివడితో వచ్చి పరువడి సేసి
కటపెట ఖంఖంగు ఘల్లుఘల్లనుచు
మెఱపులవలె మీఱి మెఱయుచుఁ బిడుగు
చఱపులవలె గొవ్వసడిని వ్రేయుచును
నిర్వురు పోరిరి దుర్వారులగుచుఁ
దిక్కఁడుద్రిక్తుఁడై తెగవ్రేయ రుద్రుఁ
డక్కడఁ జెక్కలై యవనిపైఁ బడియెఁ
-బడుచునే రుద్రుఁడాపక ఖడ్గ ధారఁ

పిసుముక యాముం బ్రీతం ద్రుంచివైచె"71.

ఇట్లు సజీవుడైన ఖడ్గతిక్కనయే కాదు, విగత జీవుడైన ఖడ్గతిక్కన కూడ మహా శౌర్యమును ప్రదర్శించెను. ఖడ్గతిక్కన తండ్రియగు సిద్ధనామాత్యుడు కుమారుని మరణమును విని, యుద్ధభూమికి వచ్చి, ఆతని కళేబరమును తనుగొనజాలక వెదకుకొనుచుండెను. అప్పుడు తెగిపడిన తిక్కన్న కండలు ఎగిసెగిసి పడుచుండెనట. శరీరమంతయు చూపం ముక్కలు ముక్కలగు వరకును పోరిన మహావీరుడు ఖడ్గతిక్కన. సిద్ధన ఆ కండలనే మూట కట్టుకొని నెల్లూరికేగినాడు:

"జలనిధిలో మీనముల్ చలియించునట్లు
నెత్తుటి యేఱులోఁ దుత్తునియలుగఁ
దిక్కన్న కండలు తేలాడుచుండె
నెగిసెగిసి పడుచుండె నివలావలకుఁ
గనుగొని యవి చూచి కన్నీరుగార్చి
కాపి భూపతిని నా కండలు పొదివి
యాతఁడు నెల్లూరి కప్పుడేతేరఁ"72

ఇటనొక ముఖ్యవిషయము గమనింపవలసి యున్నది. యాదవ జానపద కవులు యాదవుల ప్రత్యర్థియైన ఖడ్గతిక్కన శౌర్యమునుగూడ ఇంత ప్రశస్తముగా వర్ణించిరి. ఇది వీరగాథల చరిత్రలో అపూర్వ విషయము. సాహిత్యమున, ముఖ్యముగా వీరగాథలలో ఇట్టి నిష్పక్షపాత వైఖరి మరి యెచ్చటను కానరాదు. ఇది యాదవుల హృదయ నైర్మల్యమునకు మచ్చుతునుక!

ఇట్లు ఖడ్గతిక్కన—బ్రహ్మరుద్రయలు పరస్పరము ఖండించుకొని మరణించిన తరువాత, నల్లసిద్ధియే స్వయముగా చల్లవారిపై దండెత్తి వచ్చును. చల్లవారు గొప్పయుద్ధము చేసి, నల్లసిద్ధి సోదరుడగు కొమారసిద్ధి రాజును కూల్తురు. అంత కస్తూరి సిద్ధిరాజు విజృంభించును. చల్లవారేడ్గురును ఆతనితో

---

71. కాటమరాజుకథ, వేటూరి పరిష్కృతము, పుటలు 26,27.
72. Ibid, పుట 29.

కొంత తడవు పోరి మరణింతురు. ఇక్కడతో చల్లవారి జగడము పూర్తియగును. దశమి గురువారమునాడు చల్లవారు చనిపోయిరట. ఈదశమినుండి మరల వరుసగా అమావాస్యవరకును యుద్ధములు చెప్పబడినవి. కాటమరాజు యుద్ధము అమావాస్యనాడు జరగినదట. అనగా ఖడ్గతిక్కన యుద్ధమునకును కాటమరాజు యుద్ధమునకును సరిగా నొక నెల దినముల వ్యవధానమున్నది. ఖడ్గతిక్కన యుద్ధము మాఘమాసమున అమావాస్య మంగళవారమునాడు కాగా, కాటమరాజు యుద్ధము ఫాల్గుణ మాసమున అమావాస్య మంగళవారమునాడు జరగియుండునని ఊహింపవచ్చును. కాబట్టి చల్లవారి జగడము దశమి గురువారమునాడని వీరగాథలో నున్న దానినిబట్టి అది ఫాల్గుణ బహుళ దశమియని ఊహించుట సమంజసము. వీరగాథలనుబట్టి యీ సంవత్సరము పేరు 'చిత్రభాను'

ఖడ్గతిక్కన మరణమునకును చల్లవారి మరణమునకును చాల వ్యవధానమున్నది. దాదాపు 25 రోజుల యెడమున్నది. ఈ వ్యవధానములో నల్లసిద్ధి వివిధ రాజన్యులనుండి సైన్యములను సమకూర్చుకొని యుండును. మాఘ బహుళ అమావాస్య మంగళవారము ఖడ్గతిక్కన-బ్రహ్మరుద్రయ్యలు మరణించినరోజు. అనగా తిక్కన మొదటి దండయాత్ర యీ అమావాస్యకు పూర్వమే జరగినది. బహుళ చతుర్దశినాడు జరగియుండును. వీరగాథనుబట్టి రెండు దండయాత్రలకును ఒక్క రోజుకన్న ఎక్కువ వ్యవధానములేదు.

ఈ వీరగాథలో ఖడ్గతిక్కన చాగలకొండ దగ్గర చల్ల పిన్నమనేని మంత్రియగు బ్రహ్మరుద్రయ్యతో పోరి మరణించినట్లున్నది. కాని పట్టపురావి కైఫీయతులో ఈ ఖడ్గతిక్కనవృత్తాంతము భిన్నముగా నున్నది. తిక్కన మొదటి యుద్ధము పట్టపురావి గ్రామమునకు ఈశాన్యముగా పరుగుదూరమున పెన్నా నదికి ఉత్తర భాగమందు గల సోమశిలపట్టణము దగ్గర జరగినట్లున్నది. ఈ మొదటి యుద్ధమున నితడు చల్లవారితో పోరినట్లు లేదు. కాటమరాజుతోను, కరియావుల రాజుతోను, పోరినట్లున్నది. ఖడ్గతిక్కన అపజయమునొంది, నెల్లూరునకు పోయి తిరిగి సైన్యముతో వచ్చినప్పుడు చేసిన రెండవ యుద్ధము కూడ సోమశిలపట్టణము నొద్ద పెన్నానదీ తీరముననే జరగినట్లున్నది. ఈ రెండవ యుద్ధమున ఖడ్గ

తిక్కన కాటమరాజును, కటియావులవారిని, వారికి సహాయముగా వచ్చిన చల్లవారిని విరుగబొడిచి, పట్టపురావి గ్రామమున నుత్తరమున గల పెన్నానదీ తీరము వరకును వారిని తరిమి కొట్టినట్లుగా గలదు. అక్కడ దైవబలము చాలక తిక్కన మరణించినట్లుగా చెప్పబడినది. ఖడ్గతిక్కన మరణించిన ఆ ప్రదేశమును 'తిక్కనపాడు' అని నేటికిని పిలుచుచున్నారు. అక్కడ గుట్టముపై సధిరోహించిన ఖడ్గతిక్కన వీరగల్లు కూడ కలదు. వీరగాథలో చెప్పబడిన చాగలకొండ ప్రదేశముకాని, బ్రహ్మరుద్రయ్య పేరుకాని యీ పట్టపురావి కైఫీయతులో లేవు. తిక్కన మొదటిసారి చేసిన యుద్ధము చల్లవారితో చేసినట్టుగా లేదు.

(ii) బొల్లావు జగడము :—

మాఘమాసమున అమావాస్య మంగళవారమునాడు ఖడ్గతిక్కన-బ్రహ్మరుద్రయ్యల యుద్ధము జరగినట్లును, దశమి గురువారమునాడు చల్లవారు రణమున గూలినట్లును వెనుకటి వీరగాథలోనున్నది. అనగా, చల్లవారు ఫాల్గుణ బహుళ దశమి గురువారమునాడు చనిపోయిరని తలంపవచ్చును. ఈ బొల్లావు జగడము ఏకాదశినాడు జరిగినట్లుగా నున్నది. అనగా ఫాల్గుణ బహుళ ఏకాదశి శుక్రవారమని యూహింపవచ్చును.

చాగలకొండ ఠాణాలో చల్లవారు మడియగా, నల్లసిద్ధిరాజు తన సైన్యముతో మరికొంత ముందునకు నడచి 'అడ్డావుకట్ట' కడ నిలిచెను. అతని అపార సేనావాహిని "దిరిసెల, కటియెద్దుకురువ, ఆదూరు, పెంద్రేల, అన్నెబోయిన పల్లె, ఈదల భీమవరము, చీమపెంట, చిటిమడుగుపాడు, ఆరుమూడు గుళ్లు, మారినీనిపల్లె, మంగల్లిపాడు, దామిసెట్టి చెరువు, కంపమడుగుపాడు, గుజ్జర్ల వాగు, వెలుగొడు" మొదలగు ప్రదేశములలో విడిసినది. ఆ నల్లసిద్ధి సైన్యములో కొన్ని అపశకునములైనవి. యుద్ధమున తమ సైన్యములన్నియు మడియగలవని సంధ్యగోపాలుడు ఆ శకున ఫలితములను వివరించెను. కాని వీరనాయకులతని మాటలను లెక్కింపలేదు.

ఆ నాడు ఏకాదశి. పల్లికొండ నాటి యుద్ధము బొల్లావువంతని గ్రహించెను. యాదవులు బొల్లావు నలంకరించి. యుద్ధము చేయవలసినదిగా ప్రార్థించిరి. అవతారమూర్తియగు ఆ బొల్లావు వారి ప్రార్థన నంగీకరించి, నల్లసిద్ధిసేనపై పడదుమికి, వేలకొలది భటులను పరిమార్చి, వీరులను నేలగూల్చెను. ఇట బొల్లావు చేసిన ఘోర యుద్ధము అత్యద్భుతముగా వర్ణింపబడినది:-

"ఘనరౌద్ర కోపమున ఘంట మువ్వలును
జలరేగి మ్రోగంగఁ జౌకళింపుచును
ఘల్లునఁ బై దూకె ఘనులఁ బడఁ దాకె
లేవకుండగఁ ద్రొక్కి రేచి కోపాన
నాదుటందెలు మ్రోగ నాల్గు పాదములఁ
ఖాదాలు తాటించెఁ బగతుర పైనఁ
దన్నె సమ్మెట వ్రేట్లు తాకినయట్లు
పఱియలై పుఱ్ఱెలు వడఁగ నాడాడ
బ్రద్దలై గుండెలు వఱగంగ దళము
వొడమాపి పగతుర బొల్లియావపుడు
సుడిసితన్నఁగఁ బ్రేవు చుట్టుకొనివచ్చెఁ
గొందఱు విల్మూక గుంపులై యున్నఁ
గొమ్ము చక్కఁగ వంచి కుదురుగాఁ బొడిచె
పెడ మొగంబుగ వెఁటఁ బ్రేగులు వెళ్ల
వాలము మెడఁ జుట్టి వడినేలఁ గొట్టి
పాలేట గంగ భూపాలునిఁ జంపె
నంపకనుమ నాగరాజు నడికలనఁ జచ్చెఁ
గొందఱు మన్నీలు గుట్టలై పడిరి
యెడలేక చంపెను వెస నాదిమూర్తి" [73].

73. Ibid, పుట 53.

ఈ విధముగా యుద్ధము చేయుచున్న బొల్లావును చూచి నల్లసిద్ధి సైన్యములు పరుగు పెట్టినవి. బెదరి పారినసేన తమ యేలికయగు సిద్ధిరాజుతో మొర పెట్టుకొనెను. బొల్లావుయొక్క బొద్దుగంట మహాత్మ్యమును సంధ్యగోపాలుడు నల్లసిద్ధికెరింగించెను. కాని నల్లసిద్ధి దానిని లెక్కసేయక, గొప్ప వీరులను కొందరినేరి, ఆ బొల్లావుపైకి పంపెను, మహోపాయమున ఆ యావు వీరులను జంపినది. పారివచ్చిన కొందరు వీరులు బొల్లావు గొప్పతనమును నల్లసిద్ధిరాజు వారి ప్రశంసను విని మండిపడి బొల్లావుపైకి బోయవీరులను పంపెను. ఆ బోయలు బొల్లావుతో ఒక రేయి పగలు యుద్ధముచేసి, బల్లెములతో దానికి బల మైన గాయములు చేసిరి. అప్పుడు బొల్లావుశౌర్యము అభిమన్యుని శౌర్యమువలె అతిలోక సుందరముగా వర్ణింపబడినది.

"పెక్కు ముంగిసలతో పెద్ద శేషుండు
సాహసంబునఁ బోరు చందాన నావు
కొమ్ములఁ జిమ్ముచు గొరసెల మట్టి
యాకొని బొల్లావు అలుగులఁ దినుచు
దాహంబు గొని రక్తధారఁ ద్రావుచును
ధీరులౌ బోయల దిండ్లు ద్రిప్పుచును
వింతగాఁ బున్నమ వెన్నెల గాయ
నంతంత బిల్ల దీపులాడినయట్లు" 74.

యుద్ధము చేయుచుండెను. బొల్లావు జగడమునకు అమరులు మెచ్చి కనక రథమును బంపిరి. ఏకాదశి రోజున ఇరువది యేడు ఘడియలకు "కరివరదు డంపిన కనకరథమెక్కి, యరిగెను బొల్లావు నా విష్ణుపదము." కొమ్ములవారు చాల తరచుగా పాడెడి వీరగాథలలో ఈ బొల్లావు జగడ మొకటి. తానకముల రోజున దీనిని తప్పక పాడుదురు.

(iii) బీరినీడు యుద్ధము :–

ఫాల్గుణ బహుళ ఏకాదశినాడు బొల్లావు వైకుంఠ మేగగా, ద్వాదశినాడు బీరినీడు యుద్ధముచేసెను. ఆ రోజు శనివారము కావలెను. ఇతడు 'మంగల్లి

74. Ibid, పుట 75.

పాడు' ఠాణ్యమున వేచియున్న గోసంగి వీరుడు. ఆరువేల గోసంగి దళమునకు నాయకుడు; కొంగవాలుకత్తి గోసంగి వీరుల ఆయుధము. ఇతని తండ్రి మసిలి సీడు బల్లికురువ యుద్ధమున మరణించెను. తల్లి మారెమ్మ సహగమునము చేసినది.

బీరిసీని పుట్టుకను గూర్చి కొమ్ములవారొక వింత కథను చెప్పుచుందురు. పార్వతీదేవి బీరతీగలలో తన మైలబట్టను పడవేయగా బీరిసీడు పుట్టినాడట. ఆ బీరతీగలలోని బాలుని సిరిదేవి పెంచినది. బీర తీగలలో పుట్టుటచే 'బీరిసీడు' అని పేరిడిరి. ఇతడు యాదవుల ఆలమందలతోనుండు మాతంగి వీరుడు (మాదిగ). ఇతనికన్న ముందు 'ఉలవన్న' అను మాలవీరుడు యాదవుల ఆలమందకడ నుండెడివాడు. తరువాత అతడేకారణముననో యాదవులకు దూరమైనాడు. ఆ ఉలవన్నను కూడ పోలురాజు భార్యయగు సిరిదేవియే పెంచినది. ఆమె తన కుడి చంటి పాలతో బీరిసీని, ఎడమ చంటిపాలతో ఉలవన్నను పెంచినదట. కుడి చంటి పాలు త్రాగుటచే బీరిసీడు యాదవులతో కూడియున్నాడనియు, ఎడమ చంటి పాలు త్రాగుటచే ఉలవన్న ఎడముగా పోయినాడనియు గాథాకారులు చెప్పుచుందురు.

బీరిసీనితో పాటు 'చిన్నయ' అను మరియొక గోసంగి వీరుడు కలడు. వీరిరువురకును ఇద్దరిద్దరు తమ్ములు గూడగలరు. "చినగబ్బి పెదగబ్బి చిన్నయ్య తమ్ములు, పిన రంతు పెదరంతు బీరన్న తమ్ములు." అని గాథాకారులు పాడు చుందురు.

'అడ్డావుకట్ట' దగ్గర బొల్లావు మరణింపగా, నల్లసిద్ధి సైన్యములు ఆ ఠాణాను గడచి, మరికొంత ముందునకు నడచి, మంగల్లిపాటికి వచ్చి నిలిచెను. సిద్ధిరాజు రాకను జూచి బీరిసీడు తన గోసంగి వీరులను బిలిచెను. నాలుగువేల గోసంగులు వచ్చి బీరన్నను కీర్తించిరి. బీరన్న ఆ గోసంగి వీరులతో గలసి, అయితమరాజు కడ కేగి యుద్ధమున కనుజ్ఞ వేడెను. తరువాత వీరభద్రుని ప్రార్థించి, ఆతని విశ్వరూపమును పొంది, తనకత్తి పదును చూచుటకై ఒక మద్దిమానును నరకి నాడు. (గంగ జాతరలలో నేటికిని మద్దిమాను నరకుట ఒక ముఖ్యభాగము. బీరిసీడు వేషము వేసిన వ్యక్తి కత్తిని చేతబట్టి, ఊరిబయటకు పోయి, అట భూమిలో పాతబడియున్న అరటి బోదెను నరకును). తరువాత తన గోసంగు లతో గలసి నల్లసిద్ధి సైన్యముపై బడెను :

"బారులై యుండెడు బలములఁ జూచి
యుగ్రుఁడై బీరన్న యుఱిమి తాఁజూచి
చేతి పట్టకత్తి చెలఁగి జళిపించె
తళుకు తళుక్కున మెఱసెఁ దందర కుడువ
బాతుపై నెగసేటి భైరవువలెను
గొదకొని బీరన్న గోసంగులంత
మదగజంబుల మీద మఱి వేగఁగదిసి
కదిసిన యా భద్ర గజముల నెదిరి
మసిలమ్మ పుత్రుఁడు మార్కొని నిలిచి
యదలించి మెరవడి నంజె తాటించి
దట్టించి యందెలు ధళధళయనఁగ
నేటికి మత్స్యంబు లెమరెక్కి నట్టు
కొండలై వచ్చేటి ఘోర గజములను
దొండముల్ తెగనఱుకఁ దునియలై రాలి
మొండెము లెగురు నని మొఱ వెట్టుచుండు"[75]

ఇట్లు ఘోరరణము చేయుచున్న గోసంగి వీరులను జూచి, నల్లసిద్ధిరాజు కలవర మంది. తన సరదారుల పరాకును బాపెను. వారును ఉత్సాహపూరితులై గోసంగులపై విజృంభించిరి. గోసంగులును బీరినీడును గొంత తడవు యుద్ధము చేసి—

"కుడి యెడను నొఱగిరి గోసంగులంత
జాగిలాల్ బీరన్న సరసను దొఱగె
దండి గోసంగులు ద్వాదశినాడు
వైకుంఠమునకై వఱగి రావేళ
బీరన్న చెల్లెను బృథ్వి కంపింప"[76].

---

75. Ibid, పుటలు 89,90

76, Ibid, పుట 94.

బీరిఏడును గోసంగులును మరణించుసరికి ప్రొద్దు క్రుంకెను. నల్లసిద్ధి, అట దగ్గరలోనున్న 'కొప్పుకొండ'లో గుహ లెక్కువగా కలవని విని, అట విశ్రమింపదలంచి, తన సైన్యముతో నాకొండకడ కేగెను. ఆ కొండదగ్గర కాచియున్న 'కొమ్ము కసినేడు', తలికొండపాడులో నున్న 'దార సంబినేడు' అను వీరు లిర్వురును నల్లసిద్ధి నెదిరించిరి. వీరును కాటమరాజు పక్షమునకు చెందిన గోసంగి వీరులే. వీరితో పోరు సరికి తెల్లవారెను.

(iv) బాలరాజుల యుద్ధము:

బీరినీడు యుద్ధము తరువాత, మరునాడు బాలరాజుల యుద్ధము జరిగినది. కావున దీనిని ఫాల్గుణ బహుళ త్రయోదశి ఆదివారముగా నూహించుట యుక్తము.

నల్లసిద్ధిరాజు సైన్యము చాగలకొండ, అడ్డావుకట్ట, మంగలిపాడు, ఠాణాలను జయించి వచ్చుచున్నదని తెలిసి, ఎఱ్ఱగడ్డపాడులోని యాదవులు యుద్ధసన్నద్ధులైరి. అయితమరాజు తక్కిన సోదరులతోగలసి కాటమరాజు కడకు వచ్చెను. తామందరును యుద్ధమున మరణించినచో తమ యాదవ వంశము నాశనము కాకుండా, అయితమరాజు పుత్రుడగు అల్లుదాడెన్నకు ఆలమందనిచ్చి, గోపాలకులతో సహా కటకమునకు పంపివేసిరి. యుద్ధము చేయవలసిన వీరులు మాత్రము ఎఱ్ఱగడ్డపాడులో నిలిచిరి. మంత్రి పల్లికొండ యాదవ వీరులకు ఈ క్రింది విధముగా పగల నేర్పాటు చేసెను. ఏ వీరుడు ఏ వీరునితో పోరాడవలెనో నిర్ణయించుటయే 'పగల యేర్పాటు'. (నేడు ఆటల పోటీలలో చేయు ఏర్పాటు వంటిదే యీ పగల యేర్పాటు)

| | | |
|---|---|---|
| కఱియావుల రాజు | × | ఎఱ్ఱసిద్ధిరాజు |
| భట్టావుల వల్లభన్న | × | పాపసిద్ధిరాజు |
| అయితమరాజు | × | గండగోపాలరాజు మరియు కస్తూరిరాజు |
| ముమ్మయ్య | × | ఉండవెల్లి విరిగోపు |
| నేతివారి ముద్దయ్య | × | పెదవేగి భావరాజు, పెద వరుడరాజు |

నాచకూళ్ల నాయడు × గుత్తి భీముడు
పోచయ్య × తిర్ణమల తిప్పయ్య
కొండువారి కొండయ్య } × నల్లసిద్ధి సైన్యము
గోవుల గంగయ్య

ఇట్లు అయితమరాజు తమ్ములతోను పరదులతోను యుద్ధసన్నద్ధుడై 'అపర సరస్వతి' యను భట్టును సిద్ధిరాజు కడకుపంపి యుద్ధమున కాహ్వానించెను. నల్లసిద్ధిరాజుసైన్యములును అయితమరాజుసైన్యములును రణరంగమున డీకొన్నవి. ఆ సమయమున కాటమరాజును పద్మరాఘువుడును కనకలమకసుపై కూర్చుండి, పగడసాల నాడు చుందురు. ఈ యాటను వారు యాదవుల యుద్ధముతో పోల్చి ఆడుదురు.

ఆ భీకర యుద్ధమున బాలరాజులకు ముమ్మయ్య పోచయ్యలు విజృంభించి శత్రు సైన్యములను నుగ్గు నుగ్గు చేయుచుండిరి. పోచయ్య కన్నెకొమారకము నేలు కనకపు గంగురాజుతోను, చెన్నపట్టణమేలు చంద్రశేఖరునితోను, తిర్ణమల తిప్పయ్యతోను ఘోర యుద్ధముచేసి, ఆ ముగ్గురి తలలు ఖండించి, ఆ తరిగిన శిరస్సులను తన చేతబట్టి నలనన్న కడకు వచ్చి, పగతుర తలలతో నతనికి 'పాదకానుక' పెట్టెను. ఒకప్పుడు ఆరవెల్లి దగ్గర పోచయ్య పశువులను పిలువగా నవి రాలేదు. అదిచూచి కాటమరాజు సోదరపక్ష పాతముతో ముమ్మయ్యను పొగడి పోచయ్యను పరిహసించెనట. ఆ పరిహాసమును బాపుకొని, తాను వీరుడననియు, ముమ్మయ్య కంటె గొప్పవాడననియు చాటుకొనుటకై పోచయ్య యిట్టి కానుకను కాటమరాజున కొసంగెను. అయినను మొదట కాటమరాజు ఆ శిరస్సులు పోచయ్య నరికినవని నమ్మలేదు. అప్పుడు పోచయ్య శ్రీహరిని ప్రార్థించి, ఆ శిరస్సులను పలికించెనట. అప్పుడు కాటమరాజు నమ్మి, అతని శౌర్యమును ప్రశంసించెను. వీడెమునిచ్చి మరల పోచయ్యను యుద్ధమునకు పంపెను.

పోచయ్య నలనన్నకడనుండి తిరిగి యుద్ధభూమికి వచ్చుసరికి ముమ్మయ్య మరణించెను. పోచయ్య తన మామకై మిక్కిలి దుఃఖించి, రెట్టించిన కోపముతో విజృంభించెను.

"ఆగ్రగుడై పోచయ్య యశ్వంబునెక్కి
కాలు తాటించి కరాళించి దూకెఁ
జేరి విమతుల తోడఁ జేసెయుద్ధంబు
పోచయ్య యొక్కడే పొసఁగబదివేల
నప్పుడే వెన్నంటి హతము సేయంగఁ
కాల్బలంబుల నటికి కల్లుగాఁ జంపి
యామీఁద బగతుర నాముకొని కదిసి
జళిపించి బల్లాల సంధించగాను
చాచి బల్లాలపైఁ జౌకళించియును
దడయని కోపాగ్నిఁ దలలు ఖండించి
యాముకొని పోచయ్య హతముసేయంగ
ఘోరు ఘోరనియెడి గోపాలురెల్ల
వేడుక మీఱుచు వెలయ నుఱుమాడి
యేన్గుల నశ్వాల నెన్నంగ బలము
విరివిగా రణమందు వఱగిన విధము
ఘోరాజిఁబీనుగుల్ గుట్టలై యుండె
దురములో శిరసులు దొంతులభంగి
గుట్టలై యుండెను కొదవ లేకుండ."[77]

యాదవ వీరులందరును తమ తమ కేర్పాటుచేసిన పగలను సాధించి, తమ యశ్వములు రణములో కూలగా, ఎదురొమ్ము గాయాలు తగిలి, పూచిన తంగేడు చెట్లవలె నలనన్న కడకు వచ్చిరి. నలనన్న వారినందరిని ఓదార్చెను.

---

77, Ibid, పుటలు 116, 117.

ఈ బాలరాజుల యుద్ధము పల్నాటి వీర చరిత్రలోని బాలచంద్రుని యుద్ధమువలె నున్నది. శత్రువుల తలలు నరికి, పంతమీదేర్చుకొనిన పోచయ్య అచ్చముగా బాలచంద్రునివలెనే కన్పట్టును. బ్రహ్మనాయునివలెనే కాటమరాజు కూడ మొదట పోచయ్యను పరిహసించును. ఇట్టి సన్నివేశ సామ్యములు పల్నాటి వీర భాగవతమును రచించిన శ్రీనాథకవి సార్వభౌముడే యాదవ భారతమును గూడ రచించెననుటకు ప్రబలమగు తార్కాణములు.

(v) ఆవుల యెద్దుల జగడము :

త్రయోదశి ఆదివారమునాడు బాలరాజుల యుద్ధము జరుగగా, చతుర్దశి నాడు ఆవుల యెద్దుల సహాయముతో ఎఱ్ఱయ్యా లిరువురును యుద్ధము చేసిరి. ఒకే రోజున రెండు తిథులుండవచ్చును. కాని వీరగాథలలో చెప్పిన దానినిబట్టి చూడగా ఉదయమునుండి సాయంకాలము వరకును ఒక యుద్ధము జరిగినట్లుగా నున్నది. కావున ఇందలి ఒక తిథి ఒక రోజును సూచించును. కాబట్టి త్రయోదశి ఆదివారమునాడు బాలరాజుల యుద్ధము కాగా. చతుర్దశి సోమవారమునాడు ఆవుల యెద్దుల జగడము-ఎఱ్ఱయ్యల యుద్ధము జరిగినదని చెప్పవలెను.

యుద్ధమునందలసిపోయిన యాదవులను నలనన్న ఓదార్చినాడు. మరు నాడు మంత్రి పల్లికొండ చట్టువారి యెఱ్ఱయ్యకును, సలుగుటెద్దులకును. పుల్లెద్దు బసవన్నకును పంతముకలదని చెప్పెను. పాపసిద్ధి రాజు తన దండుతో పయన మైవచ్చినాడు. సంధ్యగోపాలుడు ఆవుల గొప్పతనమును గూర్చి చెప్పగా వీరులు తిరస్కరించిరి. యాదవులు తమ సఱ్ఱావులను అశ్వములపైకిని, సలుగుటెద్లను మదగజములపైకిని ఉరికించిరి. పాపసిద్ధి సైన్యము ఆలమందపై గుబగుబయని ధర గుబ్బటిల్లునట్లుగా తుపాకులు కాల్చిరి. అయినను ఆవులు లేగలు బెదరలేదు. శత్రువులపై విజృంభించి మహాయుద్ధమును చేసినవి.

"మేదినిపైఁజూచి మెండైన దళముఁ
దాటించి తన్నినఁ దలలాడిపడెను
గాలు దాటింపుచు గడు వేగనెగసి

లేళ్ళపై సింహముల్ లేచినయట్టు
లెడపక పగతుర యెదములు పగుల
దన్నుచుఁ ద్రొక్కుచు దళములఁ గూల్చి
నాలుకల్ చాచియు నతికోపమునకు
బగవారు శత్రువులు పట్టవచ్చినను
నుఱికి తలపునుకలు నూడిపడఁదన్ను"[78]

(vi) ఎఱ్ఱయ్యల యుద్ధము :—

ఇట్లు యుద్ధము చేయుచున్న యాదవుల లేగల ధాటి కాగలేక పాపసిద్ధి సైన్యము పారిపోసాగెను. అంతలో కాటమరాజు పల్లికొండతో నాలోచించి, చట్టు వారి యెఱ్ఱయ్యకును పెయ్యేల యెఱ్ఱయ్యకును పగల నేర్పరచి పంపెను. వారిరు వురును రణరంగమునకు వచ్చి, ఎద్దులను ఆవులను పేరు పేరున నాహ్వానించి, శత్రు సైన్యముపై పురికొల్పిరి. ఎద్దులు చెలరేగి ఏనుగులను చంపెను. నఱ్ఱావులు చెలరేగి గుఱ్ఱములను చంపెను.

"ఎద్దులు చెలరేఁగె నేన్గులమీద
దంతి ఘటములతోఁ దగిలి పోరాడి
కొమ్మునఁ జిమ్మినఁ గుంభముల్ పగిలి
యేనుగులన్నియు నిలఁ గూలిపోయె
ముమ్మరముగ నెద్దులు మొత్తముగ గూడి
చిమ్మయేన్గులఁ గూల్చి చీదర రేఁగి
యెర్రయ్య చూడంగ నెగసి మావటులఁ
దలలూడఁ దన్నుచుఁదగఁ బొడ్చి చంపు
గుర్రాల మీదను గొదకొని కదిసి
నర్రావులన్నియు నతి కోపమునను

78. Ibid, పుట 129

బావముల్ తాటించి వాలంబులెత్తి
చెలఁగి రోషంబునఁ జెవులు రిక్కించి
తురగంబులను బొడిచెఁ దుది పదముగాను
వెనువెంటఁ నెర్రయ్య వెసకొల్పుచున్న
చెంగలింపుచు నెగసి శంకయేలేక
అశ్వాల రౌతుల నటుతన్నగాను
తన్నుకఁ దలలన్ని తల్లడిల్లుచును
నఱుచుచు ధరణిపై నన్నియు వ్రాలి
అగబాట్లు పడుచుండె నా తలలన్ని
బావమఱఁది చూచి పకపక నగుచు
నడచె శిరసులపైని నర్రావులెల్ల
నశ్వాల కెదురెక్కి హతము సేయంగ
సలుగుబెద్దులు నేను సాహసంబునను
జెక్కిళ్ళఁ బొడిచినఁ జెవులకుదూరు
పక్కలఁ బొడిచిన బరులకు వెడలుఁ
గుతికెలఁ బొడిచిన గొంతులు చినుగు
వెన్నున గొమ్ములు వెళ్ళగుమ్ముచును
బకాళించితన్నఁ గుంభములు పగిలి
మెదడు కుప్పలు గాఁగ మేదినిమీద
నెరనన్న యెర్రయ్య వేడుకపడుచుఁ
గరుల నఱుమాడుచుఁ గలని లోపలను
గౌలావు లెద్దులఁ గలను సేయంగ
నెరనన్న యెర్రయ్య వెల కొల్పఁగాను"[79]

79. Ibid, 134, 135.

ఇట్లు యుద్ధము చేయుచున్న ఎద్దులను ఆవులను చూచి పాపసిద్ధిరాజు చోద్యపడెను. వాని పోరునకు దేవతలు హర్షించిరి. కొంత తడవు పోరాడి, ఎద్దులును ఆవులును అవనిలో నొరగినవి. అప్పుడు చట్టువారి యెజ్జియ్య, పెయ్యల యెజ్జియ్య ఈ యిరువురును శ్రీకంఠ రాజుపై కురికి అతనిని చంపిరి. తరునాత పాపసిద్ధిరాజుతో పోరి అతని తలనరికిరి. భానుడు గ్రుంకగా వారిరువురును నలనన్నకడకు వచ్చిరి.

ఎజ్జియ్యల యుద్ధము ఆవుల యెద్దుల జగడములోని భాగమా ?

ఇతివృత్తమును బట్టి చూడ ఆవుల యెద్దుల జగడమును, ఎజ్జియ్యల యుద్ధమును ఒకే కాండగా భావింపవచ్చును. మొదట ఆవులు లేగలు యుద్ధము చేసినవి. పాపిసిద్ధి సైన్యము పారిపోయెను. అప్పుడు ఎజ్జియ్య లిరువురును యుద్ధమునకు వచ్చిరి. ఎద్దులను ఆవులను పురికొల్పిరి. పిమ్మట వారే యుద్ధము చేసిరి. ఈ యుద్ధమంతయు నొకే రోజున జరగినట్లున్నది. కావున పై రెండు కాండలను ఒకే కాండగా భావించుట యుక్తము. అప్పుడు మొత్తము కాండలు ఆరు మాత్రమే యగును ఇది సంప్రదాయ సిద్ధముగా వచ్చుచున్న 'ఎజ్జిగడ్డపాటి పోట్లాట ఏడు కాండలు' అను దానికి విరుద్ధము కదా ! కాని ఈ దోషమును పరిహరింపవచ్చును. నాకు ఈ కాండలను గూర్చి చెప్పిన దొనకొండలోని పూజారి బోదయ్య అను గాథాకారుడు, ఎజ్జిగడ్డపాటి పోట్లాట ఏడుకాండలని చెప్పియు, ఉదాహరణముల నిచ్చుటలో ఎనిమిది పేర్కొన్నాడు. అతడు చెప్పిన కాండలు : 'చల్లవారి జగడము, బొల్లావు జగడము, బీరసీడు యుద్ధము, బాల రాజుల యుద్ధము, ఆవుల యెద్దుల జగడము, ఎజ్జియ్యల యుద్ధము, కటియావుల రాజు యుద్ధము, కాటమరాజు యుద్ధము ? "కాండలు ఎనిమిదియా ?" అని ప్రశ్నించినచో ఆ గాథాకారుడు ఒప్పుకొనలేదు. కాండలు మాత్రము ఏడే అను చున్నాడు. ఉదాహరణముల నెనిమిదింటి నిచ్చినాడు. దీనిని బట్టి చూచినను 'ఆవుల యెద్దుల జగడము—ఎజ్జియ్యల యుద్ధము' అనునవి ఒకే కాండయని స్పష్టమగును. అప్పుడు మొత్తము కాండల సంఖ్యయు మారదు. కావున 'కటియావుల రాజు యుద్ధము' అను కాండ యొకటి ప్రత్యేకముగా నున్నదని తెలియుచున్నది. అది నాకు లభింపలేదు.

కరియావుల రాజు యుద్ధము' అను ప్రత్యేకకాండ కలదా ?

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన 'కాటమరాజు కథ'లో కరియావులరాజు యుద్ధము, తక్కిన యుద్ధములవలె ప్రత్యేకముగా వర్ణింపబడలేదు. అట్లని పూర్తిగా వర్ణింపబడలేదని చెప్పలేము. పల్లిగొండ వద్ద నేర్పాటు చేయుచు మొట్టమొదట కరియావుల రాజు పేరును పేర్కొనుచు అతనిని ఎఱ్ఱసిద్ధి రాజుతో పోరాడవలసినదిగా ఆజ్ఞాపించును. ("కరియావులన్న నీవు కదిసి బలంబు, నెఱసిద్ధిరాజుతో నెదిరించి నిలుము"—పు. 104). అనగా కరియావుల రాజు ఎఱ్ఱసిద్ధి రాజుతో యుద్ధము చేసెనని తెలియుచున్నది. కాని వీరిరువురి యుద్ధ వర్ణనము మాత్రము ఎచ్చటను కానరాదు అయినను, దీనికిని యుద్ధము తరువాత కరియావులరాజు యుద్ధమునకు సమాయత్తమగుట వర్ణింపబడినది. అయితమరాజు, కరియావులరాజు యుద్ధసన్నద్ధులై నలవన్నకడకు వచ్చినట్లుగా చెప్పబడినది: అందు కరియావులరాజు యుద్ధాలంకరణ మిట్లున్నది:

"కరియావులన్నయుఁ గడు సాహసమున
ధీరుడై నెలవంక తిరుమణి దిద్ది
యురమున గందంబు నొప్పుగాఁ బూసి
కరములఁ జేమపూ కడియముల్ పెట్టి
మేలైన రత్నాల మెడనూలు వేసి
డాకాలి పెండెంబు ధరియించెనంత
బిరుదులు ధరియించి పరువడి వచ్చి
నలభై మూళ్లదట్టి నడుమునఁ గట్టి
యేకాంగి భీముని యినుప రాగోల
వంకిణిఁ జేపట్టి యోపినయట్లు
వనరైన చెంగావి వలిపంబు గట్టి
కరియావులన్నయు గజముపై నెక్క"[80].

80. Ibid, పుటలు 99, 100

ఇట్టి వర్ణనలనుబట్టి కటియావులరాజు యుద్ధమును వర్ణించు ప్రత్యేక కాండ యొకటి కలదని నిశ్చయముగా జెప్పవచ్చును. ఆవుల యెద్దుల జగడము, ఎల్లయ్యల యుద్ధము—రెండును ఒకే కాండ యగుటను గూడ నిది సమర్థించు చున్నది. ఈ కటియావులరాజు యుద్ధము వరుస క్రమమున బీరసీని యుద్ధము తరువాత నుండును.

మరునాడు అమావాస్యయని చెప్పబడినది. కావున ఎల్లయ్యల యుద్ధము చతుర్దశినాడు జరగినదని తలంపవచ్చును. ఆవుల యెద్దుల జగడము పల్నాటి వీర భాగవతములోని 'గుఱ్ఱాల సవరణ' యను కథను పోలియున్నది.

(vii) కాటమరాజు యుద్ధము ;-

యుద్ధములో గాయపడిన యాదవ వీరులందరును చతుర్దశి నాటి రాత్రి శివ పురాణమును వినిరి. మరునాడు అమావాస్య చతుర్దశి సోమవారము కావున ఈ అమావాస్య మంగళవార మగును. నల్లసిద్ధిరాజు దండుతో నేతెంచెను. అప్పుడు నలనన్న, పద్మరాఘవుడు-ఇరువురును యుద్ధమున కాయత్తపడిరి:

"కట్టిరి హనుమంత కాశలు వేగ
హనుమంత కాశపై రేమంత ముండ్లు
చేమంతి బంతులు చెలంగుచు వేసి
కనక వడ్డాణంబు కట్టిరి మీఁద
మేలు తుమ్మెద రెక్క మీఱిన వన్నె
సంపెంగ నూనెచే వంపించి కురులు
వీరజడలల్లిరి వేడుక పడుచు
ముడిచిరి గేదగుల్ ముంచుకొనియుండ
ఫాలమున కస్తూరి బాగుగా దిద్ది
పచ్చల పులిగోరు పతకముల్ దాల్చి

సన్నపు రుద్రాక్ష సరులు ధరియించి
పన్నుగా విభూతులు పరుస ధరియించి"[81].

ఈ విధముగా యుద్ధ సన్నద్ధులై పిమ్మట, కాటమరాజు కాశినుండి భక్తి రన్న రాలేదని విచారించెను. కాశిలో నున్న భక్తిరన్నకు ఈ యుద్ధము సంగతి తెలియదనియు, తెలిసిన వెంటనే కనకరథముపై ధనము కొండకు రాగలడనియు, పల్లికొండ చెప్పెను. అప్పుడు కాటమరాజు పల్లికొండ దగ్గర సెలవు తీసికొని "ముమ్మూర్తు లిచ్చిన ముక్కొమ్మికుంతంబు, దాచేతఁగోర్కెతో దాయంగ బట్టి", (సరిగా పల్నాటి యుద్ధములో బ్రహ్మనాయని మంత్రమును ఇట్టిదిగనె చెప్పబడినది). చెలికాడు పద్మనాయునితో గూడి, నల్లసిద్ధిపైకి వెడలెను. కాటమరాజుతో కటార్లుపట్టిన లక్షగోపకులు నడచిరి దేవతలు దివినుండి చూచుచుండిరి. బాజా భజంత్రీలతో, పంచ వాద్యములతో, త్రిజగంబులును దిగులు పొందునట్లుగా, నవపింజ గొడుగుల క్రింద నలవన్న కదిలెను.

ఇట్లు తనపై నెత్తివచ్చిన నలవన్న విగ్రహమును జూచి నల్లసిద్ధిరాజు ఆశ్చర్యపడెను. ఇరు సైన్యములును ఢీకొని ఘోర యుద్ధము చేయసాగెను. కొంతవడికి నల్లసిద్ధియు కాటమరాజును తలపడిరి. వీరి యుద్ధము వీర రసస్ఫూర్తితో వర్ణింపబడినది.

"దక్షుండు శంభుండు తారసిలినట్లు
ధరణి గహ్వర మెగయఁ దగను బోరాడి
కడు రామ రావణుల్ కదిసినయట్లు
పృథివి ఘూర్ణిల్లగా బోరి రిద్దఱును
మత్స్యంబు మత్స్యంబు మల్లాడినట్లు
వారిధి వారిధి వడిఁ గలిసినట్లు
వడికొని పోరిరి వసుధపై నంత

---

81. Ibid, పుట 140.

మేరువు మేరువు తారసిలినట్లు
సాహసంబునఁ బోర సాహసాత్మకులు
ధరణి ధూమము నెగసె తందరనొంది
సురలు మూసిరి కండ్లు చోద్యంబునంది
సూర్యునికిఁ గావురు చుట్టినట్లాయెఁ
గడువేగ చంద్రునిఁ గప్పినట్లాయె."82.

ఇట్లు యుద్ధము చేయుచుండగా, కాటమరాజు కాలాంతకునివలె లంఘించి, తన కుంతముతో సిద్ధిరాజు ఎదురొమ్మున పొడిచెను. గుండెలుపగిలి నలసిద్ధి రణములో కూలుచు నలనన్న యురమున పొడిచెను. కాటమరాజునకు గాయములాయెను.

సిద్ధిరాజు చనిపోగా, అతని ప్రధాని చింకర్ల భీమన, కాటమరాజు సంగడికాడగు పద్మ రామవునితో కదిసెను ఇరువురును కొంత తడవు పోరాడగా భీమినేడు నేలగూలెను. పద్మరాఘవునకు బాణములు నాటెను. తరువాత యుద్ధభూమి వర్ణింపబడినది. ఈ రణభూమి వర్ణన నన్నెచోడ తిక్కనల రణభూమి వర్ణనలతో నే మాత్రమును తీసిపోవునది కాదు :

"చినిగిన డొక్కలు చిదికిన తలలు
పాఱేటి రక్తానఁ బడిన మొండాలు
వక్కలు ముక్కలై పరఁగె రణమందు
బెదువులు దంతముల్ పెనగొనియుండెఁ
జెక్కిళ్లఁ జెవులును జేతులు మఱియు
మోకాటి చిప్పలు ముంజేతివ్రేళ్ళు
కనుగ్రుడ్లు నాడాడ కండలు నుఁడుఁ
బుఱ్ఱెలుఁ బునుకులు ప్రోగులై యుండెఁ

82. Ibid పుట 148.

బంగ్ల నందును గజిబి పట్టి నాయకులు
తుంబుగా రణమునఁ దలలు పడియుండె
బాకులు చేపట్టి పరుఁగ విడువకను
నటు ఒక్క ప్రాణాన నల్లాడు నరులు
మొనవెగిన హ స్తముల్ మోపులై యుండెఁ
గుమ్మరి చేసిన కుండల కుమరు
గూర్చినట్లు తలలు గుట్టలై యుండె
గజములు నశ్వాలు కాలుబలములును
రణమందు నరలేక రాసులై యుండె.[83]

ఇట్లు మొత్తముపై ఎల్టిగడ్డపాటి పోట్లాటలో ఏడు కాండలున్నవని చెప్ప వచ్చును: (1) చల్లవారి జగడము, (2) బొల్లావు జగడము, (3) బీర్నీడు యుద్ధము, (4) కటియావులరాజు యుద్ధము, (5) బాలరాజుల యుద్ధము, (6) అవుల యెద్దుల జగడము-ఎల్టియ్యలయుద్ధము, (7)కాటమరాజు యుద్ధము. ఇందు కటియావులరాజు యుద్ధకాండమును సంపాదింపవలసి యున్నది. అది యే తిథిని జరగినదో యీ కథలో లేదు. తక్కిన యుద్ధములు ఈ క్రింది తిథులలో జరగినవని వీరగాథలను బట్టి తెలియుచున్నది:

ఎల్టిగడ్డపాటి పోట్లాట.........చిత్రభాను సంవత్సరమున జరగినది.

1. చల్లవారి జగడము :-

(i) ఖడ్గతిక్కన × చల్లవారు......మాఘ బహుళ చతుర్దశి, సోమ వారము

(ii) ఖడ్గతిక్కన × బ్రహ్మరుద్రయ్య ...... మాఘ బహుళ అమావాస్య, మంగళవారము, మధ్యాహ్నవేళ.

(iii) చల్లవారు × కొమరసిద్ధి, కస్తూరిసిద్ధి ...... ఫాల్గుణ బహుళ దశమి, గురువారము.

---

83. Ibid పుటలు 151, 152.

2. బోల్లావు జగడము......ఫాల్గుణ బహుళ ఏకాదశి, శుక్రవారము.

3. బీర్నీడు యుద్ధము......''  '' ద్వాదశి, శనివారము.

4. కళియావుల రాజు యుద్ధము...... ?

5. ముమ్మయ్య—పోచయ్యల యుద్ధము (బాలరాజుల యుద్ధము) } ఫాల్గుణ బహుళ త్రయోదశి, ఆదివారము.

6. ఆవుల యెద్దుల జగడము—ఎజ్జయ్యల యుద్ధము...ఫాల్గుణ బహుళ చతుర్దశి, సోమవారము.

7. కాటమరాజు × నల్లసిద్ధి యుద్ధము
పద్మ రాఘవుడు × చింకర్ల భీమన్న యుద్ధము } ...ఫాల్గుణ బహుళ అమావాస్య, మంగళవారము.

ఈ విధముగా మొత్తము ఈ యెజ్జగడ్డపాటి పోట్లాట అంతయును చిత్రభాను సంవత్సరమున మాఘబహుళ చతుర్దశి సోమవారమునాడు ప్రారంభమై, ఫాల్గుణ బహుళ అమావాస్య మంగళవారమునాడు అంతమైనదని చెప్పవచ్చును. అనగా ఈ యుద్ధము సుమారు ఒక మాసము జరగినదని చెప్పవలెను. కాని యిందులో యథార్థముగా యుద్ధము జరిగినది ఎనిమిది దినములు మాత్రమే. ఖడ్గతిక్కన బ్రహ్మరుద్రయ్యల యుద్ధమునకును—చల్లవారు కొమరసిద్ధి కస్తూరి సిద్ధులతో పోరుటకును మధ్య సుమారు ఇరువదియైదు దినముల వ్యవధానమున్నది. ఈ వ్యవధానమున నల్లసిద్ధిరాజు బహుళః సైన్యములను సమీకరించుకొని యుండును.

ఎజ్జగడ్డపాటి పోట్లాటలో యాదవులు గెలిచిరి. వారి గెలుపునకు హరిహరులు మెచ్చి పుష్ప వర్షము కురిపించిరి. మంతి పల్లికొండ, ముమ్మయ్య పోచయ్యలను బిలచి, రణవార్త నెరింగింప వలసినదిగా కాశిలోనున్న భక్తిరన్న కడకు పంపెను. కాటమరాజు పగ మిగులకుండ పగ తీర్చుకొనెను. ఇట యాదవులు చేసిన యుద్ధమంతయు సమీక్షింపబడినది. (చూ. కాటమరాజుకథ, పుటలు 152,153). కాటమరాజు పాలేటి గంగకు పగవాని శిరసు 'పాదకానుక' పెట్టి, కాశినుండి భక్తిరన్న వచ్చువఱకును రణభూమిని కాపాడుమని కోరెను. గంగ, తన తమ్ముడగు పోతురాజుతో గలసి, రణభూమిలోని శవములు క్రుళ్ళిపోకుండ,

వాకల గడ్డల పాలుగాకుంత వాపోవుచుండెను. ఇంతటితో "పల్లిగడ్డపాటి పోట్లాట'' అను సుదీర్ఘ వీరగాథ సమాప్తమగును. దీని తరువాత, దొనకొండలో నుండి అన్నలకై ఆందోళనము చెందు 'అగుమంచి కథ', బాలరాజులవలన సోదరుల మరణవార్తను విని, కాశినుండి తిరిగి వచ్చిన 'భక్తిరన్న కథ' వచ్చును.

## 20. అగుమంచి కథ

అగుమంచి పోలురాజు కూతురు. అయితమరాజునకు చెల్లెలు. కొమరమ్మ పుత్రుడగు పుత్తమరాజు భార్య. కాటమరాజు, కరియావులరాజు భట్టావులరాజు, ఎల్లయ్య, భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య మున్నగు అన్న లందరును ఈమెను మిక్కిలి గారాబముతో చూచుచుందురు. కథా ప్రారంభమున కవి యీమెను గూర్చి యిట్లు చెప్పను :

''భక్తుని చెల్లెలు భామలలోను
పుత్తమురాలు అగుమంచి పుత్తడిబొమ్మ
కాటమరాజుకు ఘనమైన చెల్లెలు
మేటి గుణములతోను మెలగు అగుమంచి
అయితన్న చెల్లెలు ఆణిముత్యపు బొమ్మ
భట్టావులరాజుకు బాగైన చెల్లెలు
చుట్టాల సురభియా సుందరి అగుమంచి
కరియావుల రాజుకు గాంభీర్యపు చెల్లెలు
మరియాద గలిగిన మగువ అగుమంచి
ఎరనన్న చెల్లెలు హేమంపుబొమ్మ
ముమ్మన్న చెల్లెలు ముద్దు రాచిలుక
కొమ్మలలో కెల్ల పూగొమ్మ అగుమంచి
బీరన్న చెల్లెలు పృథివిలోపలను
పొందుగా నిల్లాలు పుత్తమ రాజుకు
కుందనపు బొమ్మ కులసతి అగుమంచి''[84]

---

84. పెతకంటిపల్లె తాళపత్ర గ్రంథము, ఆకు 2.

యాదవ కాంతలందరిలోను అగుమంచి గొప్ప సౌందర్యవతి. ఆడువారిలోకెల్ల అగుమంచితీరు, మొగవారిలోకెల్ల ముమ్మయ్యతీరు" అని వాడుక. సింహాద్రి రాజు కూతురు చిట్టినూక సహగామనము చేయగా ఆమె పుత్రుడగు పోచయ్యను ఆమె పెంచి పెద్ద చేసినది. అగుమంచికే 'అక్కన్న' అను నామాంతర మున్నది

అగుమంచి అన్నలందరును ఎఱ్ఱగడ్డపాటి యుద్ధమునకే పోయిరి. ఆమె ధనముకొండలో నున్నది. పావురములచే వార్తల నంపెదమన్న అన్నల నుండి ఏమియు వార్తలు రాలేదు అగుమంచి దిగులు చెందినది. శివరాత్రి వచ్చినది. ఆనాడు అగుమంచి ఉపవాసముండి జంగమార్చన చేయనెంచెను. అత్తయగు కొమరక్క "శివరాత్రి మనకు పనికిరాదు. నేను ఇదివరలో శివరాత్రి చేయుటచే నా అన్నలందరును రణములో నొరగి పోయినారు" అని హెచ్చరించినది. ఈ సందర్భమున కొమరక్క తన తండ్రి వలురాజు కథను, అన్నలగు సింహాద్రి రాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజుల కథలను అగు. మంచికి చెప్పినది అయినను అగుమంచి తన నిశ్చయమును విడనాడలేదు. శివ రాత్రి చేసి జంగమార్చన చేసినది. మరునాడు అగుమంచి తలంటుకొన దలచెను. తల్లి సిరిదేవి తన కోడండ్ర నొక్కక్కరినే పిలిచి, తనకూతురు అగుమంచికి తలంటు పోయుడని కోరును. భక్తిరన్న భార్యయగు నల్లమేడను మొదట కోరును. ఆమె "రాజుల చెల్లెలు రమణి అగుమంచికి, తేజముతో సిరసంట తీరుగా దమ్మ" అనును. అంత సిరిదేవి కాటమరాజు భార్యయగు వీరగంగను కోరును. ఆమె 'అతివ సిరసంట అత్తనే వెరతు' అనెను. ఇట్లే అయితమరాజు భార్య నేతివారి పోతు, భట్టావులరాజు భార్య సూరమ్మ, కటియావులరాజు భార్య నాగమాంబిక, ఎఱ్ఱయ్య భార్య భయ్యమాంబిక, ముమ్మయ్య భార్య చినమల్లు-వీరందరును అగు మంచికి తలంటి పోయుటకు భయపడుదురు.అప్పుడు పోచయ్యభార్య సిరిగిరమ్మను పిలుతురు ఆమె అంగీకరించి, బంగారు గిన్నెతో తలచమురు తెచ్చుచుండగా ద్వారబంధము తగిలి నూనె ఒలుకును. దానిని అశుభముగా దలంతురు. యాదవ కాంతలందరును మరునాడు సాగుమానము చేయవలసియున్నదనియు, ధనము కొండ కాలిపోవునని యు అగుమంచి శకునము చెప్పును. అగుమంచి స్నానమాడిన నీరు పెసలకు నిమ్మలకు పారును. కొమరక్క మొదలగు స్త్రీలు అది చూచి దుశ్శకునముగా దలంతురు. కొమరక్క, తన కాలమున గూడ నిట్లే జరగెన నియు, అప్పుడు తన అన్నలేవురును మరణించిరనియు. చెప్పును.

తలంటు పోసి కొనిన అగుమంచి తన అన్నలిచ్చిన ఆభరణములను చీర లను ధరించి అద్దములో జూచుకొనును. ఏ యన్న యిచ్చిన వస్తువులు ధరించినను అవి వెలవెల పోయినట్లు కనబడును. అప్పుడామె తన అన్నలకు ఆపద వచ్చెనని తలంచును. తమ కులదైవమగు గంగగుడికి పోయి, బోనములు వేటలు చెల్లించి, తన అన్నల కుశలవార్తలడుగును. గంగ విగ్రహము వెల వెల పోవును. అగుమంచి కోపించి, గంగను దూషించి, యింటికివచ్చి, ఆ రాత్రి నిద్రించును. ఆమె కలలో గంగ కనిపించి, ఆమె అన్నలు పాలేటి యొద్దున ఎఱ్ఱగడ్డపాడులో కూలిరని తెల్పుటకు కొన్ని సంకేతములు చెప్పును. అగుమంచి ఉలికి పడి మేల్కాంచి, ఆ రాత్రికి రాత్రే తన అత్తింటి నుండి పుట్టింటికేగి, తల్లితోను వదినెలతోను తన స్వప్న వృత్తాంతమును చెప్పును. కాటమరాజు భార్యయగు వీరగంగ, అగుమంచి స్వప్నమున కర్థము చెప్పును. అగుమంచి తన కలను చెప్పుచుండగా, వీరగంగ ఆ కలను విప్పుచుండెను. ఇట్లు అగుమంచి స్వప్న వృత్తాంతమంతయు వ్యాఖ్యా నింప బడుసరికి తెల్లవారెను.

ఇంతటితో నాకు లభించిన కథ పూర్తియైనది. ఇట్లున్న యీ కథను వేటూరి ఆనందమూర్తిగారు అసంపూర్ణమని భావించిరి. (వారు 'పరిశోధన' లో ప్రకటించిన అగుమంచి కథకూడ ఈ ఘట్టముతోనే ముగియు చున్నది). కాని యిది సరికాదు. అగుమంచికథ యింతటితో సంపూర్ణమే. నాకు లభించిన తాళ పత్ర గ్రంథమున ఈ కథా భాగము తరువాత "అగుమంచి కథ సంపూర్ణము" అని కలదు. తరువాత పాలేటి నుండి బసవదేవుడు వార్తలు తెచ్చుట, ఆగుమంచి, పాపనూక ఇత్యాది యాదవకాంతలు అగ్నిలో పడుట-కథాంశములు దీని తరువాత వచ్చు 'భక్తిరన్న కథ'లో నుండును.

నేను పైన వివరించిన 'అగుమంచికథ' చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, పెదకంటిపల్లెలో నొక భట్టువాని కడ లభించిన తాళపత్ర గ్రంథములోనిది. ఈ అగుమంచికథకు మదరాసు ప్ర. ప్రా. లి. పు. భాం. న ఒక తాళపత్ర ప్రతియు, (R.No. 664); తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా లయ లిఖిత పుస్తక భాండాగారమున నొక కాగితపు ప్రతియు (No. 1599) గలవు. మదరాసు ప్రతికి తిరుపతి ప్రతి పుత్రికయే. ఈ మదరాసు ప్రతి నాధా

రముగా జేసికొని వేటూరి ఆనందమూర్తిగారు 1955 లో 'పరిశోధన' 6, 7, 8 సంచికలలో అగుమంచి కథను పరిష్కరించి ప్రకటించిరి. దీనిలో ప్రారంభమున నున్న కాటమరాజు ప్రశస్తి యీ కథకు సంబంధించినది కాదు. ఇందు కథా భాగములో మొదట 350 పాదములు (నాకు లభించిన తాళపత్ర గ్రంథమున ఏడు తాళపత్రములలోని విషయము) లోపించినవి. ఈ లుప్త భాగములో అవతారిక, అగుమంచి సౌందర్య వర్ణన, ఆమె శివరాత్రి నవలంబించుటకు తలపోయుట-అను అంశములున్నవి. (నాకు లభించిన తాళపత్ర గ్రంథమున నివియన్నియు గలవు). నా ప్రతిలోని అవతారికననుబట్టి దీని రచయిత 'జరుగుపల్లె చెన్నయ్య' అని తెలియుచున్నది. ఇందలి కవిత్వము చాల ప్రశస్తమైనది. అగుమంచి సౌందర్య వర్ణన ప్రబంధ కవిత్వమును మించియున్నది :

"........................

నల్లతుమ్మెద బోలు నాతి తన కురులు
అలర చంద్రుని బోలు అతివ నీ ముఖము
మెరుగు టద్దము బోలు మెలత చెక్కిళ్లు
(కాముని చెరకు) విండ్ల గతి నుండు బొమలు
చెలువంపు బేడిసకు సరివచ్చు కనులు
నిండు సంపగి మొగ్గ నెలత నాసికయు
కనకకాంతిని బోలు కాంతదేహంబు
దానిమ్మ విత్తుల తనరు పల్వరుస
తామరతూడులు తరుణి హస్తములు
కనక కలశంబులు కాంతకుచములును
కొదమ సింహము బోలు కోమలి నడుము
నీళ్ల సుడిని బోలు నెరవైన నాభి
అరటిస్తంభము బోలు అతివ పెనుదొడలు
పొట కర్రలనవచ్చు బిగువారు పిక్కలు
చిగురుటాకుల బోలు చెలియ పాదములు

పగడపు మొగ్గలు పాదముల వ్రేళ్లు
నక్షత్రముల బోలు నఖముల తీరు
కామధేనువు బోలు కమలాక్షి మోము
భూదేవి సాక్షిగా పొగడంగ తగును
తరుణి కీర్తి గంధంబు తగు చంద్రబింబ."85.

## 21. భక్తిరన్న కథ :

ఇది కాటమరాజు కథాచక్రమున చిట్టచివరి కథగా తోచుచున్నది. భక్తిరన్న పోలురాజునకు పెద్ద కొడుకు. ఈశ్వరాంశతో పుట్టిన శివభక్తుడు. ఎఱ్ఱగడ్డపాడులో యుద్ధము జరగునప్పుడితడు కాశిలో నున్నాడు. ఈ యుద్ధమునకు చాలకాలము ముందుగనే భక్తిరన్న శ్రీశైల పర్వతములో తన తపస్సు చాలించి ధనముకొండకు వచ్చును. పాపనూక యన్నచో నితనికి మిక్కిలి యభిమానము. తల్లి దండ్రులు లేని ఆ పాపనూక నితడు కంటికి రెప్పవలె జూచుకొనువాడు. ఆమెను అగుమంచితో సమముగా జూచుకొనుమని తనతల్లి సిరిదేవితో చెప్పి, యితడు తరమునాటిపెద్దలకు పిండప్రదానము చేయు నుద్దేశముతో కాశికి పోవును. గయలో వలురాజు, సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు మున్నగు వల్లవులకును, వారివారి ప్రధానులగు తిరుమందులకును భక్తిరన్న పేరుపేరున పిండములు వదలుచుండును. అంతలో నాశ్చర్యముగ బాలరాజులు పిండములకై చేతులు చాచుదురు. భక్తిరన్న నిశ్చేష్టుడై "ఇదియేమి?" అని అడుగగా, తాము ఎఱ్ఱగడ్డపాటి రణములో మరణించిన విషయమును ఆ ముమ్మయ్య - పోచయ్యలు ఎరిగింతురు. అంత భక్తిరన్న అచటి మునులను ప్రార్థించి, మేఘ రథమును పొంది, దానిపై ధనముకొండకు వేంచేయును.

పాపనూకను తనతల్లి సిరిదేవి మేతపెట్టినదని తెలిసి భక్తిరన్న మిక్కిలి దుఃఖించును. పాపనూక మేడకు కాశితీర్థమును ప్రసాదమును పంపించును. తల్లి సిరిదేవి అతనికి భిక్షపెట్టగా దానిని తాను భుజింపక, ఎఱ్ఱగడ్డపాడులో కూలిన తన సోదరులకు పిండప్రదానము చేయుటకై కొనిపోవును. పాలేటి నుండి బసవ

---

85. పెదకంటిపల్లె తాళపత్ర గ్రంథము, ఆకు 2.

దేవుడు వార్తలు తెచ్చుననియు, అప్పుడు అంతఃపురస్త్రీలందరును అగ్నిప్రవేశము చేయవలసినదనియు ఆజ్ఞాపించి, భక్తిరన్న పాలేటికి పయనమగును. మార్గమధ్యమున మూసినది కడ బసవదేవుడు, రణమున నాటిన గాయములతో భక్తిరన్నకెదురగును. భక్తిరన్న ఎఱ్ఱగడ్డపాటికిపోయి, యుద్ధమున మరణించిన తన సోదరులను చూచి దుఃఖించి, వారికి 'కైలాస బండ' కడ పిండ ప్రదానము చేయును. మంగలిపాడు ఠాణాకు పోయి, అచట పడియున్న బీరినీని, చెన్నప్పను చూచి, యాదవ వీరులతోపాటు ఆ గోసంగి వీరులకు గూడ 'వీరకత్తులు' చేయించి, జాతరలలో కొల్పులు చేయించెదనని వారితో చెప్పును. ఆ వీరులు తృప్తిగా కన్నులు మూసి కైలాసమేగిరి. తాను కాశినుండి వచ్చువరకును పీనుగులు చెడిపోకుండ రణభూమిని కాచియున్న గంగకు, బలులు బోనములతో నేటేట జాతరలు చేయింతునని ప్రకటించెను.

దొనకొండలో బసవదేవుడు తెచ్చిన వార్తలువిని యాదవ కాంతలందరును కడు దుఃఖించి, చిచ్చురికి, కనకరథములపై కైలాసమేగిరి. ధనముకొండతోని లక్కసిరి మేడలన్నియు కాలి భస్మమైనవి. (ఈ కాలిపోయిన కోటశిథిలములను నేటికిని గంగ దొనకొండలో చూడవచ్చును. యాదవులు నివసించిన పెయ్యాల తిప్ప, పాపనూక మేడ యుండిన స్థలము, గంగ గుడి నేటికిని అచట ప్రత్యక్షమగును).

నాకు ఈ భక్తిరన్న కథకు సంబంధించి రెండు తాళపత్ర ప్రతులు, ఒక కాగితపు ప్రతి లభించినవి. కృష్ణా జిల్లా గుడివాడ తాలూకా కుచ్చికాయలపూడి గ్రామములో నొక తాళపత్ర గ్రంథము. ప్రకాశం జిల్లా, కనిగిరి తాలూకా, వెంగళాపురము[86]లో మరియొక తాళపత్ర గ్రంథము, గుంటూరు జిల్లా తెనాలి తాలూకా యడపూరు గ్రామములో నొక కాగితపు ప్రతి దొరకినవి. ఈ మూడింటను కథ అసమగ్రముగనే యున్నది. తాళపత్ర ప్రతులు రెండింటను, భక్తిరన్న కాశినుండి వచ్చి పాపనూక మేడకు కాశీ తీర్థమును పంపుటతో కథ ఆగిపోయినది. కుచ్చికాయలపూడి ప్రతిలో లేఖకుడు తాను భక్తిరన్న కథ సంపూర్ణముగా వ్రాసినానని చెప్పుకొన్నాడు. ఇదియే సత్యమైనచో నీ భక్తిరన్న కథ తరువాత ఒకటి

---

86. ఈ వేంగళాపురము పంచలింగాల కొండకు దగ్గరలో నున్నది.

రెండు కథలుండి యుండవలెను. 'పాపనూక వలపోత', 'అగుమంచి వలపోత' అను కథలున్నవని కొందరు గాథాకారులు చెప్పుచున్నారు. ఈ రెండు కథలును దీని తరువాతవి కానోపును.

కాని, నేటి గంగ దొసకొండ సమీపమునగల ఎఱవాలెము గ్రామములో నొక యాదవగాథాకారుని యింటిలో నేనొక తాళపత్ర గ్రంథమును చూచితిని (17-9-1966న) అది భక్తిరన్న కథ. దాని అంత్యమున అగుమంచి మున్నగు యాదవ కాంతలందరును అగ్నిలో పడి మరణించినట్లున్నది. కాపుర ప్రైపతులు మూడును అసమగ్రములనియే తలపవలసియున్నది. లేఖకుడు పొరపాటున సంపూర్ణమని వ్రాసియుండును. అయినను 'పాపనూక వలపోత' 'అగుమంచి వలపోత' అను కథలు లభించువరకును ఏ విషయమును చెప్పలేము. ఎఱవాలెములో నేను చూచిన భక్తిరన్నకథలో అంత్యమిట్లున్నది: (ఇదియే కాటమరాజు కథా చక్రమునకు భరత వాక్యము కానోపును).

"మంటలు మండెను మింటిపొడవునకు
పంతమున వచ్చేసు బాలరాజుల చెల్లెలు
వచ్చి చంపుడు కట్ట వరుసతో నెక్కెను
హస్తములు మొగిచి అగ్నిదేవునికి
ప్రస్తుతింప దొడగె పాలేటి వీరుల
గగనంబు భూదేవి వలరాజు దలచి
వప్పుగా వరములు వనరంగనిచ్చె
హస్తములు ముకుళించె సభవారి కపుడు
గుప్పున అగుమంచి గుండాన దుమికె
చమురు కుండలు వేసి సఖియలు అడిలిరి
పొగులుచు వెలవెల పోయిరందరును
బంగారు కంబాన వరగిన బసవన్న యపుడు
ముగురు మూర్తుల దలచి ముక్కన్ను దెరిచె
భాషింప ధనకొండ భస్మమై పోయె

లక్కసిరి కూటాలు రాచలోగిండ్లు
చిచ్చులు తగిలి కాలె సిరిదేవి కూటాలు
కౌమరగిరి కూటాలు కొలిమి మంటలై మండె
అగుమంచి కూటాలు అగ్గి తగులబడెను
కాటమన్ననలగంగ కూటాలు కనుకులై మండె
బత్తుని నల్లమేడ భద్రాక్ష కూటాలు
భద్రాక్ష కూటాలు కాలి భస్మంబు లాయె
చిత్రర్వ కూటాలు చిచ్చులు తగిలె
కొల్లారు కూటాలు కొలిమి మంటలై మండె
కైలాసగిరికి కాంతలు పయనమైరి
కనకరథము లెక్కిరి-గోప-కాంతలందరుచు
పాపనూక మేడమీదికి పరమేశ్వరుండు
చిత్రబాణములు శివుడు శీఘ్రమే పంపె
పాపనూక మేడ భగ్గున మండె
పాపనూక అగుమంచి పక్షిణి రథమెక్కిరి
యెరణప్ప, తల్లప్ప, యేణాక్షి అక్కప్ప,
సిరిదేవి, కౌమరక్క, సీతలందరూను
మరివేగ అగ్నిచే పుడిసి రందరును
బత్తుని నల్లమేడ పణతి వీరగంగ
కరియావుల నాగ కాంతలందరును
కనక రథములు ఎక్కి కైలాస మేగిరి
కాంతలు రాగాను కరకంతకుండు
బత్తినన్న కైలాస బండ కడచుండి
పాలేటి వీరులు ప్రఖ్యాతిగాను
బసువన్నకు దండ ప్రణామము చేసిరి
కరుణతో యాదవులు కైలాస మేగిరి"[87].

---

87. ఎల్లబాలెము తాళపత్ర ప్రతి, ఆకులు 43, 44.

దీని చివర "శ్రీముఖ నామసంవత్సరము మోడి కొండప్ప కుమారుడు ముసలయ్య వ్రాసిన భక్తుని కథ" అని యున్నది.

ఈ భక్తిరన్న కథలో 'గౌతమ చాటువ' అనునొక ఉపకథ వచ్చును. ఇది పరశురాముని కథా చక్రములోని 'మట్టిచెట్ల కథ' కానోపును.

యాదవ గాథాకారులు చెప్పుదానిని బట్టియు, ఇతర వీరగాథలలోని ప్రసక్తులను బట్టియు, జనశ్రుతిని బట్టియు ఈ కాటమరాజు కథా చక్రమున ఇంకను ఈ క్రింది వీరగాథలున్నవని ఊహించుటకు వీలు కలుగుచున్నది :-

## 22. పాపనూక వలపోత :-

దుష్ట నక్షత్రమున పుట్టినదను భయముచే సిరిదేవియు, అయితమరాజును కాటమరాజు చెల్లెలగు పాపనూకను ధనముకొండ బయట ఏడంతస్తుల మేడకట్టి అందుంచిరి. కాశికి పోయిన భక్తిరన్నకు ఈ విషయము తెలియదు: అతడు కాశి నుండి రాగనే పాపనూకను గురించి తల్లిని ప్రశ్నించును. ఆమెను ఊరిబయట మేడలో నుంచినారని తెలిసికొని మిక్కిలి దుఃఖించును. ఆమెను తోడ్కొని రండని దాదులను పంపును. (ఇంతవరకును తెలిసిన కథయే). ఆ తరువాత పాపనూక వచ్చి, తన్నభిమానించెడి భక్తిరన్నతో యాదవులు చేసిన అపకారమును చెప్పుకొని బిట్టు దుఃఖించియుండును- అదియే 'పాపనూక వలపోత' కావలెను. లేదా, బసవదేవుడు పాలేటి వార్తలు తెచ్చినప్పుడు ఈమె తన అన్నలకై దుఃఖించి యుండును. ఈ రెండవ యూహ కన్న మొదటి యూహయే సమంజసము. ఏలన, ఈమె యాదవులు యుద్ధమున మరణింతురని శపించినది కదా! తానిచ్చిన శాపము ననుసరించి వారు మరణించిరి. అట్టివారికై యీమె వలపోసి యుండునా యని అనుమానము. ఏమైనను ఈ కథను శోధింపవలసియున్నది.

## 23. అగుమంచి వలపోత :-

బసవదేవుడు పాలేటి వార్తలు తేగా, ఈమె తన అన్నల మరణమును విని వారికై మిక్కిలిగా వలపోసియుండును. అన్నలందరును ఈమెను మిక్కిలి అభిమానముతో జూచియుండుటచే, వారికై యీమె కడుంగడు పరితపించి యుండు నని సులభముగా నూహింపవచ్చును.

## 24. పల్లికొండ పుట్టుక : -

అవుల వలురాజును, అతని మంత్రి తరిముత్తరాజును వేటకు పోయి, దప్పిక కాగా ఒక సరస్సులో నీరు త్రాగ బోయిరి. ఆ సరస్సులో నొక కమలము గిర గిర తిరుగుచుండుటను జూచిరి. పరిశీలింపగా ఆ కమలమున నొక చక్కని బాలుడుండెనట. రాజు, మంత్రి-యిరువురును ఆ బాలుని కొరకై చేతులు చాపిరి. రాజు చేతులలోనికి ఆ బాలుడు వచ్చినచో అతడు రాజగుననియు, మంత్రి చేతులలోనికి వచ్చినచో మంత్రి యగుననియు వారు తీర్మానించుకొనిరి. ఆ బాలుడు మంత్రి చేతులలోనికి వచ్చెను. అందుచే నతడు మంత్రియగునని నిశ్చయించిరి.

వలురాజు ఆ బాలుని తీసికొని పోయి తనకూతురు కొమరక్కకిచ్చి, పెంచుమని చెప్పెను. ఆ బాలుడు పెద్దవాడు కాగా, అతని తెలివి తేటలను జూచి వలురాజు ఆతనిని మంత్రిగా జేసెను. అతడే పల్లికొండ. ఈ పల్లికొండ రఘుపతి విష్ణుమూర్తి అవతారమని యాదవుల నమ్మకము. ఇతడు త్రికాలజ్ఞుడు. యాదవులలో మూడు తరముల వరకును ఇతడే మంత్రి. వలురాజు, పోలురాజు, అయితమ రాజు-ఈ మూడు తరములలోను పల్లికొండయే మంత్రి. ఇతడు కొమరక్క పెంపుడు కొడుకగుటచే వలురాజు ఇతనిని మనుమనిగాను, పోలురాజాముల అల్లునిగాను, కాటమరాజాదులు బావగాను సంబోధింతురు. ఇతని పుట్టుకను దెల్పు పైకథను సేకరింప వలసియున్నది.

## 25. గంగపుట్టుక : -

ఇది కంసుని కథలో కొంత సూచింపబడును. దీనిని గూర్చిన ప్రత్యేక కథ కలదని తెలియుచున్నది. కంసుడు దేవకీ వాసుదేవులను చెరలో నుంచును. దేవకి అష్టమ గర్భమున కృష్ణుడు జన్మింపగా, వసుదేవుడతనిని రేపల్లెకు గొని పోయి, నందునికిచ్చి, కృష్ణమాయవలన ఆ నందునకు పుట్టిన బాలికను దెచ్చి దేవకి ప్రక్కలోనుంచును. కంసుడు వచ్చి దేవకికి అష్టమగర్భమున జన్మించినది. ఆ శిశువని భ్రమించి, ఆమెను నరకుటకై ఆకాశమున కెగుర వేయును. ఆమె పైకె

గిరిపోయి, కంసునితో 'నిన్ను చంపువాడు రేపల్లెలో పుట్టి పెరుగుచున్నాడులే!' అని చెప్పి మాయమగును. అట్లు మాయమైన కృష్ణమాయయే భూలోకమున గంగ నవతరించినది. కృష్ణుడే కాటమరాజుగా నవతరించినాడు. ఈ విధముగానుండు 'గంగపుట్టుక (గంగపుటక)' అను వీరగాథను సహితము సంపాదింపవలసి యున్నది.

## 26. భైరవకురువ యుద్ధము

వేడుక బొంగరాల కథలోను, భక్తిరన్న కథలోను వచ్చిన ప్రసక్తులను బట్టి కాటమరాజు కథాచక్రమున 'భైరవ యుద్ధము' అను వీరగాథ యొకటి ఉండి తీరవలెనని నేనూహించుచున్నాను కటియాపులరాజు బావయు, చిట్టినూక భర్తయునగు కల్లందుల పోలినీడు దీని నాయకుడు. ఈ తిరుమందుల వీరుడు భైరవుని కురువలో జలోధీరుడను వానితో యుద్ధముచేసి మరణించినట్లును, అతని భార్య చిట్టినూక సహగమనము చేసినట్లును, ఈ దంపతులకు పుట్టిన పోచయ్య అను పసికూనను అగుమంచి పెంచసాగెననియు, పై రెండు కథల లోను ప్రసక్తమైనది. వేడుక బొంగరాలకథలో పోచయ్య, మామయగు ముమ్మయ్యతో తన తల్లి దండ్రులను గూర్చి యిట్లు చెప్పును :

''కల్లందుల పోలినేడు రాళ్ళదిడ్డి భైరవుని కురువ దగ్గర
జలోధీరుని జంపి సేనల నరికి
గట్టిగా ఎదురొమ్ముకన గాయాలు నాటి
చిత్తు చిత్తుగా నరుకులు తగిలిననాడు
అప్పుడు మాతల్లి చిటినూక గుండానికి
సాగుమానము కావలెనని సయ్యన లేచి
పయనమై అప్పుడు పరుగున రాగ
ఏడు నెలల బాలుడయి వుంటిని నేను
వల్లవుల కాంతలు తిరుమందుల కాంతలు శీఘ్రముగ వచ్చిరి
చిటినూక కొల్లు సిరిధామర కొల్లు

పోచయ్యను పెంచుకునేము అని వచ్చిరీ
అప్పుడు అగుమంచి అతి త్వరగ వచ్చె
వచ్చిన అగుమంచి చేతికి వయ్యన చిటినూక
అందముగ నిమ్మపండు అగ్నిదేవుని కిచ్చిన చందాన
ఇచ్చెను అగుమంచి చేతికి వయ్యన చిటినూక
మండలాపతితోడ మడిసె గుండమున''[88].

భక్తిరన్న కథలో భక్తిరన్న కాశియాత్రకు పోయి, అట గయలో పితృదేవతలకు పిండప్రదానము చేయుచు, వలురాజు, సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు, బల్లికురువ వీరులు-వీరందరను వారి వారి భార్యలతో, మంత్రులతో, మంత్రుల భార్యలతోసహా తలచి, వారి పేర పిండములు వేయును. చిట్టచివరన, భైరవరాజు కురువ దగ్గర మరణించిన కల్లందుల పోలి నేనిని చిటినూకను దలచి, పిండప్రదానము చేయుచు నాతని కథ నిట్లు చెప్పును:

"రాళ్ళదిడ్డి భయిరవరాజు కురువవద్ద
జలోధీరుని చంపి సేనల నరికి
పోట్లు నాటి కల్లందుల పోలినేడ! చెల్లితివి
నిప్పులలోపల నిలిచి కాలితివి
అప్పా! చిటినూక! నీ అబ్బరపు కొడుకును
చెల్లెండ్లకు వొప్పగించి చిచ్చులో పడితివి
కలకంఠి చిటినూక కాంతరో నీవు
కాశిలో అన్నము గయికొండు మీరు!"[89]

ఇందలి 'రాళ్ళదిడ్డి' అనునది భైరవరాజు కురువ దగ్గర నున్న ఊరు పేరు కావచ్చును. ఈ కథయున్నదనుటకు వేడుకబొంగరాల కథయు, భక్తి రన్న కథయు గొప్ప సాక్ష్యమిచ్చుచున్నవి. కావున ఈ 'భైరవకురువ యుద్ధ ము'ను గూడ సంపాదింపవలసియున్నది.

---

88. యడవూరు కాగితపు ప్రతి, పుట 16.

89. వెంగళాపురము తాళపత్ర ప్రతి, ఆకు 19.

'బల్లికురువ యుద్ధము', ఈ 'భైరవకురువ యుద్ధము' నొక్కటే యనీ భ్రమింపరాదు. ఏలయన, భక్తిరన్న కథలో బల్లికురువ వీరులను స్మరించిన తరువాతనే, యీ భైరవకురువ వీరుడగు కల్లందుల పోలినేడు ప్రత్యేకముగా చెప్పబడినాడు. కావున రెండును వేరువేరు కథలు. బల్లికురువ పోట్లాట నాకు లభించినది. దాని యితివృత్తమునకును ఈ భైరవకురువ ఇతివృత్తమునకును సంబంధములేదు. బల్లికురువ పోట్లాటలో మరణించిన వారు కల్లందుల పోలినేని తండ్రియగు కల్లందుల మారినేడు (అతని భార్య మారెమ్మ), గోసంగి వీరుడగు మసిలినేడు (అతని భార్య పేరు కూడ మారెమ్మయే - ఈ మసిలినేని కుమారుడే బీరినీడు). ఈ యిరువురు వీరులును ముక్కంటి మనుమలతో పోరాడిరి. భైరవ రాజు కనుమలో మరణించినది ఒక్క కల్లందుల పోలినేడు మాత్రమే. ఇతడు కల్లందుల మారినేని కుమారుడు, సింహాద్రిరాజున కల్లుడు, చిట్టినూక భర్త. ఇతని ప్రత్యర్థి జలోధీరుడు. కాబట్టి బల్లికురువ యుద్ధమునకు భైరవ కురువ యుద్ధమునకును సంబంధము లేదనుట స్పష్టము. రెంటింటికిని మధ్య పెక్కు ఏండ్ల అంతరమున్నది.

## 27. కంసుడు కథ లేక విష్ణుభాగవతము :-

దీనిని గూడ యాదవ గాథాకారులు తరచుగా పాడు చుందురు. కాటమ రాజు విష్ణు స్వరూపుడుగా భావింప బడుటచేతను, కంసుని కథలోని 'కృష్ణ మాయ'యే గంగగా నవతరించెనని చెప్పబడుట చేతను, ఈ కథ కూడా కాటమ రాజు కథా చక్రమునకు సంబంధించినదిగా భావింపవచ్చును.

ఈ కథకు నాకు మూడు తాళపత్ర ప్రతులు లభించినవి. చిత్తూరు మండలమున లభించిన రెండు ప్రతులు అసమగ్రములుగా నున్నవి. ప్రకాశము మండలమున దొనకొండ ప్రాంతమున లభించిన ప్రతి సమగ్రముగానున్నది. పోలురాజు కథను రచించిన 'కనకబండి ఘట్టయ్య' అను కవియే యీ విష్ణు భాగవతమును గూడ రచించెను. ఇతడు కొండయ్య కుమారుడనియు, కన్నెసిరుల గోత్రమువాడనియు అవతారికను బట్టి తెలియుచున్నది.

ఈ వీరగాథ ద్విపదచ్ఛందమున నున్నది. కంసునిపుట్టుక, ఆతని దౌష్ట్యములు, కృష్ణుని జననము, బలరామ కృష్ణులు కంసుని చంపి, తలిదండ్రుల చెరలు బాపి, ప్రజలను కాపాడుట - ఇందు వర్ణింపబడినవి.

ఇట్లు మొత్తముపై కాటమరాజు కథా చక్రమున జ్ఞాతాజ్ఞాతములైన కథలు సుమారు ముప్పదిరెండు కలవని నిస్సంశయముగా జెప్పవచ్చును. ఈ గాథాగానము, ఈ సంప్రదాయములు నశించి పోవక మునుపే, వీనిని సంపాదించి ముద్రించి, తరువాతి తరముల వారికి అందించవలసిన బాధ్యత ప్రతి ఆంధ్రుని పైనను గలదు !

## 25. కాటమరాజు కథలు - వారానువర్తనములు

వీరగాథలకు సాధారణములైన 'వారానువర్తనములు' (Common places) 'కథనఘటకములు' (motifs) మాత్రమేకాక, కాటమరాజు కథలకు ప్రత్యేకమైన కొన్ని వారానువర్తనములు కథనఘటకములు కలవు. ఈ కథల ప్రార్థనలలో సాధారణముగా "శ్రీ జాహ్నవీగంగఁ జిత్తమునఁదలఁచి" అను వాక్యము వచ్చుచుండును. ఆవులను పేరు పేరున పిలుచుట పెక్కు కథలలో గలదు. (పాపనూకకథ, ఆవులమేపు, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, కంసుడు కథ). పాలు పితుకునప్పుడు 'తొలిచుక్క పొడవంగ దోరావుల బితికి, మలిచుక్క పొడవంగ మైలావుల బితికి' అని వర్ణింపబడుచుండును. సందర్భము వచ్చినప్పుడెల్ల కాటమరాజు వంశవర్ణన చేయబడును. విష్ణువునుండి కాటమరాజు వరకును గల తరములు చెప్పబడును. కాటమరాజు యొక్క ఆలమంద విస్తారమైనదని చెప్పుటకు పదేపదే "కుదురు ఆరామడ, కదులు పన్నెండామడ" అనియు "కుదిరితే ఆరామడ, చెదిరితే పన్నెండామడ" అనియు చెప్పబడుచుండును.

విశేషణ విశేష్యములను పరస్పరము మార్చి, త్రిప్పిచెప్పుట కాటమ రాజు కథలలో ఎక్కువగా కానగును.

"ఎద్దుల జ్ఞానమ్ము ఎఱ్ఱయ్యకు దెల్సు
ఎఱ్ఱయ్యజ్ఞానమ్ము ఎద్దులకు దెల్సు" (ఉత్తరాది ఆవులమేపు)
"చుక్కపెయ్య లరువంగ చూడియావుల వేసిరి

చూడియావు లరువంగ చుక్కపెయ్యల వేసిరి
పాడియావు లరువంగ పక్కలేగల వేసిరి
పక్కలేగ లరువంగ పాడియావుల వేసిరి"

( - దక్షిణాది ఆవులమేపు)

"గొడుగుల దప్పించి పడగల నరికిరి
పడగల దప్పించి గొడుగుల నరికిరి"

( - అగుమంచి కథ)

పల్నాటి వీరకథలలో గానవచ్చు వారానువర్తనములు కొన్ని కాటమ రాజు కథలలోను గన్పట్టుచున్నవి. పురనిర్మాణ వర్ణన, పల్నాటి వీరకథలలోవలెనే యున్నది. వలురాజు పుత్రులు పంపాద్రి పురమును గట్టించుట, బ్రహ్మనాయడు మాచెర్ల పట్టణమును వీరమేడపిని నిర్మించుటతో పోల్చవచ్చును. దిండ్లు తివాశీలు, జముఖాణములు పరపించి రాజసభ సమావేశమగుట; 'కాశమీదను కాశ హను మంతకాశ, హనుమంత కాశపై రేమంతముళ్లు' అనువర్ణనము; 'బ్రాహ్మణులు దీవింప భట్లు పొగడంగ' అనునది పల్నాటి కథలలోని వారానువర్తనముల వంటివే.

గంగవర్ణన కాటమరాజు కథలన్నింటను ఒకే విధముగా నున్నది. పంద్రెండు చేతుల భాగీరథి గంగ, పంద్రెండు భద్రాయుధములతో భయంకర ముగా వర్ణింపబడును.

"పంన్నెండు చేతుల భద్రాయుధములు
పగరాజు మర్దించు పముజు వకచేత
అసురుల మర్దించు అంబు వకచేత
దుష్టుల మర్దించు దుడ్డు వకచేత
శూలము వకచేత సింగి జొకచేత
కరవాల మొకచేత కత్తి వకచేత
శంఖము వకచేత చక్రమొకచేత
విల్లంబు లొకచేత పీటె వకచేత

పరశువు శూలధారిణి హరినీలవేణి
విరివిగ జడలన్ని విరబోసికొనియు"

యుద్ధములో యాదవ వీరులు మరణించినప్పుడు ఈ గంగ యాదవ కాంతలకు కలలో ప్రత్యక్షమై కీడును తెలియజేయును. పెద్దిరాజుకథలోను, అగు మంచి కథలోను ఇట్లు జరిగినది.

కరణములచే కమ్మలు వ్రాయించుట, కాలారిచే ఆ కమ్మలు పంపించుట కాటమరాజు కథలలో తరచుగా వచ్చును. ఏ కథలోనైనను కాటమరాజు పద్మ రాఘవునితో పగడ సాలాడుచున్నట్లుగనే వర్ణింపబడుచుండును. ఇది శ్రోతలకు విసుగు కలుగునన్నిసారులు చెప్పబడును.

వీరగాథా కవిత్వములో నొక విచిత్రమగు వారానువర్తనమున్నది. ఒక పని నొక వ్యక్తికి చెప్పగా, అతడా పనిని వెంటనే చేసినట్లుగా వీరగాథలలో నుండదు. ఎందరినో యడుగగా, వారందరును తిరస్కరించినట్లును, కడకొక ప్రత్యేక వ్యక్తినడిగినట్లును, అతడాపనిని చేసినట్లును చెప్పబడును. అగుమంచి కథలో ఆమెకు తలంటు పోయవలసివచ్చెను. ఆమె తల్లియగు సిరిదేవి తన కోడండ్ర నందరను వరుసగా నొక్కొక్కరినే పిలిచి, అగుమంచికి తలంటవలసి నదిగా కోరును. వారెవ్వరును సమ్మతింపరు. కడకు పోచయ్య భార్యయగు సిరిగిరమ్మ ఆమెకు తలంటుటకు అంగీకరించును. సిరిదేవి పెద్దకోడలిని పిలిచె ననియు, ఆమె అంగీకరింపలేదనియు, రెండవకోడలిని పిలిచెననియు, ఆమెయు నంగీకరింపలేదనియు, ఇట్లే తక్కిన కోడండ్రనైదుగురిని కోరెననియు, వారెవ్వ రును అంగీకరింపకపోగా కడకు సిరిగిరమ్మను కోరెననియు మనము తేల్చివేయు దుము. వీరగాథాకవి అట్లు వదలడు. సిరిదేవి ఒక్కొక్కరినే పిలుచుట, వారు సమ్మతింపకుండుట మెల్లగా వర్ణించును. సిరిదేవి కోరుమాటలు, కోడండ్రు తిరస్కరించుమాటలు ఒకే మూసలో పోసినట్లుండును. సిరిదేవి, సిరిగిరమ్మతో కలిపి మొత్తము ఎనమండుగురను ప్రశ్నించినది. ఈ యెనిమిది ప్రశ్నలు ఒకే విధముగానుండును; మొదటి ఏడ్గురు కోడండ్ర జవాబులును ఒకే రీతిగా నుండును. అయినను వీరగాథా కవి పునరుక్తి దోషమునకు వెరవక ఈ సంభాషణలన్నిటిని విపులముగా వర్ణించును. ఇదియొక వారానువర్తనము. ఇట్లే పాపనూక కథలో నిద్రబోవుచున్నపాపనూకను లేపి తలంటు పోయవలసివచ్చును.అప్పుడు సిరిదేవి

తన కోడండ్ర నందరిని వరుసగా కోరును. అందరును ఒకే రీతిగా తిరస్కరింతురు. కడకు కాటమరాజుభార్య వీరగంగ ఆ పనికి ఒప్పుకొనును. పల్నాటి వీరకథలలో బాలచంద్రుడు గూడ ఇట్టి పనినే చేయును. సంగడీలతో యుద్ధమునకు బోవుచు అనపోతును వెనుకకు పంపు నెపముతో, మాంచాల మేడలో తాను మరచిన ముద్దుటుంగరమును తీసికొని రమ్మని వెంటనే అనపోతును కోరడు. మొదట ఒక సంగడీనిని కోరును. అతడంగీకరింపక పోగా మరియొకనిని కోరును. ఇట్లు ఆరుగురు సంగడీలను కోరి, కడకు అనపోతును కోరును. కట్టపదములవంటి లఘువీరగాథలలో గూడ నిట్టి వారానువర్తనము కాననగును.

కాటమరాజు కథలలో చాల తరచుగా వచ్చు మరికొన్ని వారానువర్తనములు :-

(1) 'తరమునాటి పెద్దలు'

(2) 'శ్రీ వీరకల్లుగా చెల్లు'

(3) 'గట్టిగా ఎదురొమ్ముగాయాలునాటి'

(4) 'యదు బలంబులకు ఏట్లు పోట్లాయె'

(5) "ఎదురొమ్ము గాయాలు ఏట్లు పోట్లుబడి,
పగవారి ఆయుధములు భారంబులాయె"

(6) 'అంతట గాయాలు అతిభారమాయె'

(7) 'ఎత్తివచ్చిన బాణాలు ఎదురొమ్ము నాటినాయి
జారివచ్చిన బాణాలు జబ్బలు నాటినాయి'

(8) 'వుక్కుటలుగులమీద వోరిగిరి రాజులు'

(9) 'అన్నలకు తమ్ముడు ఆ పోలురాజు'

(10) 'వలపట పార్శ్వాన వంకిళ్ళు నాటి
దాపట పార్శ్వాన తగిలె నరుకులును'

పైడమ్మ చింత, పంపాద్రి బసవన్న, కల్యాణ కాంతసోమప్ప, కాటమరాజు కుచ్చులడేగ, బాగీరథి గంగ, ఒంటికొమ్ము బొల్లావు, మంద బసవన్న, జంగమాలు, సాగుమానము, బ్రాహ్మణుల జోస్యము, అలుగుల సిహాసనము, విషభోజనము, తుమ్మెరెక్కల గుజ్జము, బేతాళుని పువ్వులతోట, బేతాళుని బిరుదులు, స్వప్న [illegible]క్షేతములు, నెత్తురుకోకలు, శకునములు, ఆలమంద, పుల్లరి, పెంపుడు

చిలుక, వ్రాలాకులు, బ్రాహ్మణవీరుడు, బొంగరాలాట, పిండప్రదానము,—మొద లగువవి ఈ కాటమరాజు కథాచక్రములో కొన్ని ప్రధానములగు కథనఘటకములు (Motifs).

## 26. కాటమరాజు కథలు - కొన్ని భాషావిశేషములు :-

1. ఉపమాలంకారములు :-

నెల్లూరి సీమలో మేయుచున్న కాటమరాజు ఆలమందను బోయలు బాణములతో గొట్టిరి. ఆ బాణముల వేట్లతో ఎఱ్ఱగ రక్తము కారుచున్న ఆ తెల్లని ఆవులు ఎట్టి అద్భుతోపమలతో వర్ణింపబడెనో చూడుడు.

''మోదుగలు పూసి బూరుగల మీద వ్రాలినట్లుండెను
బూరుగలు పూసి మోదుగుల మీద వ్రాలినట్లుండెను
నెత్తురు మడుగులు నేల పగిలిన రీతి
కోసారక వేట్లు పడెను గోవులిచ్చట''

( - దక్షిణాది ఆవుల మేపు)

కాటమరాజు కథలలోని మరికొన్ని ఉపమలు :-

''అందంబుగా వెదురాకు చందమున
తిరుమణి తిరుచూర్ణము దిద్దిరి తోడ''
"కందుకంబును బోలె కాంతితో నెగసి.''
"పెక్కు ముంగిసలతో పెద్ద శేషుండు
సాహసంబున పోరు చందాన నావు''
"బాతుపై నెగసేటి భైరవు వలెను."
"ఏటికి మత్స్యంబు లెదురెక్కినట్టు"
"ప్రత్తి గింజలవలె పండ్లు దెరచెదవు
నూతిలో గప్పవలె గాతరించేవు"
"ఆకులన్నియుఁబండి యామఱ్ఱి మీద
వడిజేసి సుడిగాలి సుడిసినయపుడు

కారాకు డుల్లిన కై వడితోను"
"కాకరకాయలు కడు పెద్దకాగ
చేదెక్కువవునట్లు చెలగె నీగుణము"
"అందెలబండివలె ఆరడికి సైచి"
"మొట్టె గోడిగవలె మిట్టిపడియేవు"

3. దృష్టాంతము :

"కదనంబు కేగిన కాటి గుఱ్ఱాలు
చెదరక జగడంబు సేయంగగలవె"
"నక్కావుల కడుపు నాణ్యంబెయైన
గుఱ్ఱంపు పౌజుతో గూడంగ గలవె"
"బూరుగు తానెంత పొడుగు బెరిగినను
చందనంబుతో నది సరితూగ గలదె"
"ఎలమి జీలుగు చెట్టదెంతలావైన
నలమేడ కంబాల నాచంగ గలదె"
"పాములు బారలు పదినూరులైన
విష్ణు వాహనముతో వివదింప గలవె"
"ఎలమి దూదికొండ లెంత ఘనమైన
అనలంబు నొకయింత అణపంగగలవె"
"మదియించి యున్నట్టి మత్తేభములును
పొదిలి సింహము గూడి పోరంగ గలవె"
"ఉప్పెన కదులునే ఉడుత చప్పుడుకు"
"యతిప్రాసలుండని యాకైత లేల ?
సుతి గూడి నడువని సొగసుపద మేల ?
పతి సూచి మెచ్చని బంటుతనమేల ?
ఇతరులు మెచ్చని యీాటెసాధన మేల ? "

3. అప్రస్తుత ప్రశంస :

పిరికివాని బింకమును గూర్చి చెప్పుచు, "ఏకులతో బాకులెంత లేసినను, నాట నోపున అవి నలియును గాక" అని అప్రస్తుత ప్రశంస చేయబడినది.

ఇట్లే రూపకములు, స్వభావోక్తులు, శబ్దాలంకారములు, ఉక్తివైచిత్రులు పెక్కు గలవు.

4. సామెతలు లేక లోకోక్తులు (Proverbs) :-

'పురజింప గవివాత పులియున్నయట్టు'
'ఏట్ నిండి పారగా నెంపలిచెట్టు
పారకుండగ నాచి పట్టంగ గలదె'
'పులి కడుపున గొఱ్ఱె పుట్టు చందమున'
'గొల్లమీద పుల్లరి గోగుమీద బచ్చలి'
'ఉలవ లెత్తామంటె ఊళ్లనడిగెదవు'
'ఎద్దు రూపము దప్పి ఏదు రూపమాయె'
'తెడ్డడిగినప్పుడే కొయ్యడిగినట్టు'
'పేదవాని కోపము పెదవుల తీట'
'పేరేమొ తొటపెటల్ పెదవులు మృదువు'
'రక్షించు వారిని రమ్మని పిలిచి
భక్షింప జూచిన పని యింత లేదు'
'బూరె గంపలకాడ పొర్లుదండాలు'
'శారికకు దెలుపను శాస్త్రమున్నాదె,
'దూరాన బెట్టిన తురాయులదండు
అల కోలపెట్లకు నాగదన్నట్లు'

5. జాతీయములు (Idioms) :-

1. చెప్పని ఒక్కపొద్దు = అనాహూతుడై వచ్చుట, గౌరవము లెని పనిచెయుట
'ఊరకే చెప్పని ఒక్కపొద్దనగ'

2. ఉప్పుగల్లుగా చిదుము = చిత్తుగా నోడించు

'కసిమసంగుచు నుప్పుగల్లుగా జదిమె'

3. కవిలె కట్టుము = నోరుమూసికొనుము, మాటాడవలదు

'కట్టుమా నీకవిలె కట్టుమా చాలు'

4. వానలేని పిడుగు=హఠాత్తుగా సంభవించినట్టిది

'వానలేని పిడుగువలె మీదబడెను'

5. అశ్మిశకాంత్రరంబు=హస్తిమశకాంతరము = మిక్కిలి భేదమగు, అతుకని, పరస్పర భిన్నమగు

'అశ్మిశకాంత్రంబు ఆడితిమాట'

6. ఒడికట్లు పడు=మెలిదిరుగు (?)

'ఒకరిపై బడి యొకరు ఒడికట్లుబడిరి ?

7. గమిడి తీసినట్లు=బాహాటమగు, సులభముగా లభించు, ఆటంకము తొలగిపోవు

'వారి మందకు గమిడి వడిదీసినట్లు'

8. 'ఈగవ్రాలక యుండ, నీలె యిడకుండ' = చెడిపోకుండ, క్రుళ్లిపోకుండ

9. నక్కలే దిక్కగు = చనిపోవు, యుద్ధమున కూలు

'నక్కలే దిక్కాయె నట్టడివిగాదె'

10. ఆయువు నూరేడులగు=చనిపోవు

'ఆయువు నూరేడు లాయెనటంచు'

11. గోరుచుట్టుపై నీలె గ్రుచ్చినట్లు=కష్టము మీద ఇంకను కష్టము వచ్చు.

'గోరుచుట్టుపై నీలె గ్రుచ్చి నట్లాయె'

12. 'పెట్టిన తిరుమణి పేడెత్తకుండ | పూసిన గంధంబు పురి చిట్లకుండ' = ఏ మాత్రమును అలయకుండ, మిక్కిలి సునాయాసముగా

13. బద్దిగొర్ల జేయు=బలి యిచ్చు

'బద్దిగొర్ల జేతుము భాగీరథికిని'

14. వసపోసినట్లు వదరు = ఎక్కువగా మాటాడు, అతి వాగుడు

'వసపోసినట్టుల వదరేవుగాక'

15. కుడుముల వేట=భోజనము చేయుట

'పోట్లాట కుడుముల వేట్లాట కాదు'

16. కాకి నెపముల నెన్ను=కుంటి సాకులు చెప్పు
'కరువు బడి వచ్చిన కాలమైతేను
కాకి నెపముల నెన్నగా దగు మీకు'

17. 'ఎడమచే కుడిచేయి ఎరుగనివాడు' = ఏమియు తెలియనివాడు, యుక్తా యుక్త విచక్షణ లేనివాడు

18. టముకుచేయు = అందరకును దెలియ జెప్పు
'డాకతో మారాజు టముకు సేయంగ'

19. కాకి పారగు=నాశనమగు (?)
'కాకినాడంతయు కాకి పారాయె'

20. 'అదిగోను పులియంటె, అదిగోనుతోక'=గోరంతలు కొండంతలుగా జేయు, భయపడు వారిని మరింత భయపెట్టు

21. చెఱఁగునఁబైడి=ముంగొంగు పసిడి = మన స్వాధీనములో సిద్ధముగా నున్నది.
'చెలికాండ్ల చిత్తము చెఱఁగునఁబైడి'

22. చాటున కెక్కు = ప్రసిద్ధికెక్కు
'సాటున కెక్కిన సభవారి నంపి'

23. కంస బాధలు పెట్టు=విపరీతమగు బాధలు పెట్టు

ఇట్టి జాతీయములెన్నియో కలవు. మచ్చునకు కొన్ని మాత్రము చూపితిని

6. పలుకుబడులు, నుడికారములు, నానుడులు (usages) :-

నాకు లభించిన తాళపత్ర గ్రంథములనుండి కొన్ని మాత్రము చూపు చున్నాను:

1. 'ముత్తాత పగవాణ్ణి మొత్తివేసితిని
పెద్దిరాజు పగవాణ్ణి పెరికి వేసితిని'

2. 'తొలిచుక్క పొడవంగ దోరావుల పితికి
మలిచుక్క పొడవంగ మైలావుల పితికి'

3. 'తరమునాటి పెద్దలు'

4. అక్షున నవ్వు, గక్షున నవ్వు, చెక్కిట బాగాలు చెదరంగ నవ్వు,

5. కండ్లజూచు
6. 'అప్పుడు (అయితన్న) ఆడెనొక మాట'
7. 'వలవల కన్నీరు వలవొయ్యసాగె
ముత్యపు కన్నీరు ముక్కంట రాల్చె
పగడపు కన్నీరు పలువరుస జారె
నడుము నక్కన విరిగి నేలకు వరిగె'
8. 'ఎండలకు ఎత్తించె రాజు ఎండిపట్టు గుడార్లు
నీడలకు ఎత్తించె రాజు నీలిపట్టు గుడార్లు
మంచులకు ఎత్తించె రాజు మైనపుజిడ్డి గుడార్లు'
9. 'ఎత్తి వచ్చిన బాణాలు ఎదు రొమ్మునాటినాయి
జారివచ్చిన బాణాలు జబ్బలు నాటినాయి'
10. 'పగవారి ఆయుధములు భారంబులాయె'
11. 'శ్రీవీరకల్లుగా జెల్లె మా తండ్రి'
12. 'పసిబిడ్డ బాలాది'
13. 'గట్టిగా ఎదు రొమ్ము గాయాలు నాటి'
14. 'ఆ గొఱ్ఱు గేయని ఆవులు అరచెను'
15. 'సిరులు మించిన పసిడి పుట్టము గట్టి
చిలుకల రవికె తొడిగి'
16. 'కుదురు ఆరామడ చెదురు పన్నెండా మడ
కదలిన వోయి కామధేనువులు'
17. "చాల బొల్లావులు సంగటావులును
నేల యీనిన రీతి నెల్లారి యిరుమేల
తెల్ల బొల్లావులు ఒక్క దేముడెరుగు"
18. 'కట్టని చీరెలు గావు ఓయమ్మ
కన్నకిడు పేమియు గాదమ్మ సిది'

19. 'జళిపించి కటార్లు సాహసంబునను
సూర్య సోమ వీథుల జొచ్చి నరుకంగ'

20. "పెదరేమిడి గడ్డి పెద్దావుల పొడుగు
గుఱుగు చెంగలగడ్డి కుర్రలేగల పొడుగు
మళ్ల వక్కిన గడ్డి మనుజుల పొడుగు
చేదుబోదగడ్డి చెట్ల పొడుగు గలదు
గోగడనెడి గడ్డి గొడ్డుటావుల పొడుగు
చిలకవాలు తెగడు చెలికలలో మేపులు
చెలికలలో ఆవులు చెదరి మేయగాను"

## 7. పదజాలము :-

వీర గాథలలో దేశ్యపదములు, వృత్తి పదములు ఎన్నియో కలవు. వీనిలో చాల భాగము నిఘంటువులలోని కెక్కలేదు. కొన్ని శబ్దములను జానపదులు మనముపయోగించెడి అర్థములోగాక వేరగు నర్థముతో నుపయోగించుచున్నారు. కొన్నింటికి అర్థము తెలియుటలేదు. అట్టి పదములు కాటమరాజు కథలనుండి కొన్ని ఈ దిగువ నిచ్చుచున్నాను.

(i) అపూర్వ పదములు :

కాలారి = కాలరి (దూత)
కాటార్లు = కటార్లు
శాన = చాల (శానాపశానలు = మిక్కిలి ఎక్కువ)
ఆగ్రుడై = ఆగ్రహియై
హాగ్రులై = ఆగ్రహులై
ఏక పొగడుచు = నిరంతరము పొగడుచు
గండపెండెములు = గండపెండేరములు
వలపక్షము = పక్షపాతము
అచ్చాళి మూక = జంజాటము లేని సైన్యము

గమీడి—ద్వారము

ఆఖవరికట్ట=వప్రము

పలపోత = దుఃఖము

చంపుడుకట్ట=సహగమనము చేయునప్పుడు గుండములో దుము
కుటకు వీలగు ఎత్తయిన దిబ్బ

సాగుమానము=సహగమనము

అడియారాలు=అడియాలములు=గురుతులు, చిహ్నములు

పషిణి=పసిడి

బాగాలు=వక్కలు

రాగిడిలు, గణిడీలు, చిల్సిపెలు, మెండ్యెంబు (మేద్యంబు), తరిమళ్ళబడి, తండారి, సారసత్తు, సిరికళలు, కంపటీలు (కంపటులు), పసినంబు, తుదిపదము, గూబ జంకులు, వడసార, తలపొలము, కైరగాండ్లు, కూతుపంతాలు, కమికెము, కరపట్నాలు, అవుగుళాలు, గముకులు, పందుపలు, పయితల్లి, కోరుదల, సోకెత్తు యంబెట్టవు, దామెన, ఆరాళ్ళములు, కలనావి, కోరితమ, అల్లటి - ఇత్యాది శబ్ద ములకు అర్థములను కనుగొనవలెను.

(ii) వైరి సమాసములు :

పాదకానుక, కనకపొడి, ఘనగుంపు, పీరజడ, రత్నకడియాలు, ఘనవాల కనకపువ్వులదట్టి - మొదలగునవి

(iii) వ్యావహారికపదములు—వ్యాకరణాంశములు :

వీరగాథలలో జానపదుల ఉచ్చారణను బట్టియే సంధికార్యములు జరగు చుండును. పదాది వకారములోని హల్లునుచ్చరింపకుండుట (ఆడు, ఈడు, ఇను, ఏడి, ఈర్లు); వకారములేనిచోట వకారమునుచ్చరించుట(వెండ, వితడు, వొరిగి); 'వచ్చు'ను 'ఒచ్చు'గా పల్కుట; క్త్వార్థంబైన యిత్తునకు సంధిచేయుట (మెరసి + అడు=మెరసాడు, దాగి + ఉండు=దాగుండు మొ॥); కర్మధారయంబులందు తు నకచ్చుపరంబగునపుడు టుగాగమము రాకపోవుట; 'నుండి' అనుటకు 'నుంచి' అనుట; 'అవతారము'ను 'అవుతార'మనుట; 'స్త్రీలు' అనుటకు 'శ్రీలం' అనుట;

'సృష్టి'ని 'శ్రిష్టి' అనుట షష్టీ కు వర్ణమునకు ముందు నగాగమము రాకుండుట; (కాటమరాజుకు గాయాలునాలె); 'మగడు' శబ్దమును 'మొగుడు'గా నుచ్చరించుట—; 'మూస్తు, పోయిస్తే, చేస్తిమంత్రి,' మొదలగు వ్యావహారిక రూపములు హెచ్చుగా వాడుట; 'వస్తువులు' అను పదములో ప్రథమావిభక్తి ప్రత్యయమును వ్యాకరణ విరుద్ధముగా లోపింపజేయుట (వస్తులు), 'ఎదలు' అను శబ్దములో లేని ప్రథమా విభక్తి ప్రవేశపెట్టుట (ఎడపక పగతుర ఎదములు పగుల) మొదలగు విశేషములనేకములు కాటమరాజు కథల భాషలో కాననగును.

(iv) అన్యదేశ్యములు :

చీట్లు (చిఠ్ఠీ), వజ్రీలు (వజీర్), ముస్తీదు (ముస్తఈద్), సరదార్లు (సర్దార్), పారాలు, జముఖానంబు, నాడాలు,అవుదాలు (హౌదా), పౌజులు (ఫౌజ్), తాకీదు, కవులు, బాకీ, దిలాస, ఆర్కాతు, జవాబు, తురాయి, తురుపు, హేజీబు, బందె, పల్లటి (పల్టీ), మొదమాదు (మోతెమద్), జండ (ఝండా) — ఇత్యాది అన్య దేశ్యపదములు కూడకొన్ని కనబడుచున్నవి.[90] కాని పల్నాటి వీరగాథలు, కాటమరాజు కథలు ప్రాచీనములగు వీరగాథలగుటచే మొత్తముపై వీనిలో అన్య దేశ్యములు తక్కువయనియే చెప్పవలెను.

27. కాటమరాజు కథలు – ఛందస్సు :—

పల్నాటి వీరకథలలో ఎక్కువభాగము మంజరీ ద్విపదలో నుండగా, కాటమరాజుకథలలో ఎక్కువ భాగము ద్విపదలో నున్నవి. ఈ వీరగాథలలోని ద్విపద పాల్కురికి సోమనాథాదుల ద్విపదకంటె భిన్నమైనదని పూర్వము నిరూపించితిని (చూ. పీఠిక—1). ఇందు గణములలోని మాత్రలు ౕ5 + 5 + 5 + 3

---

90. కాటమరాజు కథలలో "ఘనముగా జలటైను గడు చంద్రికలను" అను వాక్యములోని 'జలటైను' శబ్దమును 'Gelatine' అను ఆంగ్ల శబ్దభవముగా డా॥ బి. రామరాజుగారు అనుమానించుచున్నారు. (చూ. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 666).

గానుండును. 'భ', 'నల' అను ఇంద్రగణములకు కూడ ఒక లఘువును చేర్చి అయిదు మాత్రల గణములుగా మార్చివేయుదురు. (దీనిని 'వీరగాథా ద్విపద' అనవచ్చును).

(భల)
"పరగంగ తెరచీర భక్తులకు మ్రొక్కి
(భల) (నలల)
సరవితో వ్రాయగల చదువగల యట్టి" (పంపాద్రి కథ)

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన కాటమరాజు కథలో ప్రధాన భాగము మంజరిలోనున్నది. అనుబంధములు ద్విపదలో నున్నవి. మంజరిలో నున్న కథలలో గూడ ప్రారంభమున అవతారికాభాగమును ద్విపదలో రచించుట పరిపాటి. ఈ ప్రారంభమును జూచి దానిని ద్విపదగా భ్రమింపరాదు. గంగుల పినయెల్లయ్య కూడ తన కథావతరణిక ద్విపదలోనే అందుకొనినాడు:

"శ్రీ జాహ్నవీ గంగఁ జిత్తమునఁ దలచి
రాజితంబుగ విఘ్నరాజుకు మ్రొక్కి
కమలేశుఁ గీర్తించి కమలాప్తుఁదలఁచి
కరి చర్మధరుడైన ఘనునిఁ బ్రార్థించి
చవుషష్టి విద్యా విశారదుల నెంచి
కవివర్యులకు నమస్కారంబు సేసి"

ఇందలి రెండవ ద్విపదలోనే ప్రాసభంగమైనది. ఈ యవతరణికను విడచి, కథ లోనికి రాగా, మంజరియే సర్వత్ర గోచరించును:

"ఎలమి వైరంబున్న యెఱ్ఱగడ్డపాట
బల్లవరాజుతోఁ బగవచ్చె ననుచు
వీరగంగమ ముందు వీరులై మేము
పగఱతోఁ బోరాడి పగదీర్తుమనుచు
శ్రీకరంబైనట్టి సృష్టిలోపలను
కాటమరాజను వాడు ఘనపుణ్యపరుఁడు"

ఈ గ్రంథమున అనుబంధములుగా సీయబడిన భట్టురాయబారము, కోట పాటి తాటివృక్షం తెచ్చేకథ, ఎఱ్ఱిగడ్డపాటి పోట్లాట-అను మూడు కథలును ద్విపదలోనే కలవు. ఆరాధ్యుల పిచ్చయ్య గారు ప్రకటించిన 'వలురాజు చరిత్రము, పోలురాజు చరిత్ర, బల్లికురువ యుద్ధము'- అను కథలు కూడ ద్విపదలోనేకలవు

నాకు లభించిన తాళపత్రగ్రంథములలో ద్విపదలోనున్నకాటమరాజుకథలు: 'ఆవుల వలురాజు కథ, పంపాద్రికథ (దొనకొండప్రతి), పోలురాజు కథ (ఎఱ్ఱి బాలెం ప్రతి), బల్లికురువ పోట్లాట, కాటమరాజుకు పట్నం కట్టిన కథ, పాపనూక కథ (కుచ్చికాయలపూడి ప్రతి), ఉత్తరాది ఆవుల మేపు (దొనకొండప్రతి), పాలేటికథ, ఎఱ్ఱయ్య తరకవాదము, వేడుక బొంగరాల కథ, అగుమంచికథ భక్తిరన్న కథ', ఇక మంజరీ ద్విపదలోనున్న కాటమరాజు కథలు: 'పంపాద్రి కథ (కుచ్చికాయలపూడి ప్రతి), పెద్దిరాజు కథ, కాటమరాజు యుద్ధము- ప్రథమ కాండము లేక కాటమరాజు ఆర్లపెంట యుద్ధము, పోలురాజు కథ (కంకణంపాడు ప్రతి), కటియావుల రాజు కథ, పాపనూక కథ (పెదకంటిపల్లె ప్రతి), ఉత్త రాది ఆవులమేపు (ఎడవూరు ప్రతి), గంగ-కాటమరాజు తరకవాదము, దక్షిణాది ఆవులమేపు, చల్లవారి జగడము, బొల్లావు జగడము'.

కాటమరాజు కథలలో బహుళముగా కానవగు ద్విపదలకు ఉదాహరణములు :

(i) "వల్లురాజు మొదలైన వరుస పెద్దలును
చెల్లిరి యలమంచి స్థిరముగా వారు
వారు చెల్లిన వెనుక వారి కుమాళ్లు
చేరి విచారము చేసిరందరును
పెద్దలు ఇచ్చోట పేరున చెల్ల
వద్దిక తా యలమంచి వమ్మదు తమకు
ఏటికి యలమంచి ఏమి నిత్యంబు
వాటముగ పంపాద్రి వచ్చిరి వారు"

—పంపాద్రికథ (దొనకొండప్రతి)

(ii) "ధనకొండలోపల తగవేడ్క_తోను
పనివడి కంఠసరి బాలలిద్దరును
బొంగరాలాడిన పూనిక వినుడి
సంగతి చెప్పెదను శ్రవణానందముగ''
—వేడుక బొంగరాల కథ

(iii) ''శ్రీకంఠు మదిలోన చెలగి నుతియించి
చేకొని శ్రీహరిని చిత్తాన దలచి
పంకజగర్భునకు ప్రణమిల్లి మ్రొక్కి
పొంకముగ శారదను బుద్ధిలో దలచి"
—భక్తిరన్న కథ

కాటమరాజు కథలలో సకృత్తుగా కానవగు మంజరీ ద్విపదలకు ఉదాహరణములు:—

(i) అల్లుడ పల్లికొండః అన్న సింహాద్రి
వన్నెగల తమ్ములార వసుధేశులార
ఎన్నడు నామాట కెదురాడలేదు
సోమప్ప కల్యాణము చూడరమ్మనెను
వచ్చిన సంతాన మిత్తునని పలికె''
—పెద్దిరాజు కథ (కుచ్చికాయలపూడి ప్రతి)

(ii) "భోరున ఆ చల్ల భూనాథసుతులు
తమవంతు పగవార్ని ధాత్రిపైగూల్చి
అంచితముగ వారేగు దన్నదమ్ములును
పల్లవరాజుల బలములు ద్రుంచి"
—చల్లవారి జగడము

(iii) "[illegible] బీరన్న యుతిమి తాఁ జూచి
చేతి పట్టకత్తి చెలఁగి జళిపించె

తళుక్కు తళుక్కున మెఱసెం దందర కుడువ
బొత్తుపై నెగసేటి భైరవు వలెను"
—బొబ్బిలి యుద్ధము

తరతరములనుండి పాడుటవలన కాబోలు ఈ కాటమరాజు కథలలో కొన్ని ద్విపదపాదములు మంజరీద్విపదపాదములు శైథిల్యమునొంది ఖండగతిగా (5 + 5 + 5 + 5) గా మారిపోయినవి. కఱియావులరాజు కథ, పాపనూక కథ, గంగతరక్కము, దక్షిణాది ఆవులమేపు (ఇన్నివాడ కథ), బొల్లావు జగడము- అను వీరగాథలలో నిట్టి ఖండగతి కాననగును :

5 5 5 5

"రంగుగా, కరియావు, లారాజు, చరిత్రను,
సంగతిగ, చెప్పేను, శ్రవణానందముగను,
కలియుగభేతాళుడు, కన్నమా, ధీరుండు,
రంపాల, కేశవుడు, రణశూరు, లు ముగ్గురు"

ఇందు క్రీగీతలున్న భాగములలో పదిమాత్రలును ఒకే ఆవృత్తముగా నున్నవి. 5 + 5 గా విడుటలేదు అయినను పాదమున మొత్తము మాత్రలసంఖ్య (20) చెడదు. పాపనూక కథలో ఖండగతి యింతకన్న స్పష్టముగా నున్నది :

ఇచ్చినా, వారిండ్లు, ఇలమీద, క్రుంగునూ,
పుచ్చుకున్న, వారిండ్లు, భూమిమీ, దవెలుసును,
ఎదురిండ్లు, మనవయ్య, ఏకపుణి, కెలపాపకు,
విధి ఆమిశ, తో పుట్టె, వినవయ్య, చెల్లెలూ.

ఇందు 'పుచ్చుకున్న' 'కెలపాపకు' అను ఆవృత్తములలో ఆరేసి మాత్రలున్నను, ఇవి పాడుటలో అయిదు మాత్రలుగనే ఉచ్చరింపబడును.

కొన్ని కథలలో ఈ శైథిల్యము మరింత ముదిరిపోయి, లయాత్మక వచనములా యనునంతగా రూపరియున్నవి. చిత్తూరు మండలమున చంద్రగిరి తాలూకా

పెడకంటి పల్లెలో నాకు లభించిన కటియావులరాజుకథ తాళపత్ర గ్రంథములో నిట్టి లయాత్మక వచనములు కాననగును. కటియావులరాజునకును పల్లికొండ కును జరిగిన సంభాషణము :

"ఎన్ని దినములు చూతు బావ? ఎన్ని గడియలు చూతు!
మూడు దినములు చూడు మరిది! మూడు గడియలు చూడు!
అయిదు దినములు చూడు మరిది! అయిదు గడియలు చూడు
మూడు దినములు చూడనె బావ! మూడు గడియలు చూతుగాని
అయిదు దినములు చూడనె బావ! అయిదు గడియులు చూతుగాని"

దక్షిణాది ఆవులమేపు (జన్నివాడ కథ)లోని శైథిల్యము చూడుడు :

"భూమిలో రాజులంతా పుల్లరికిత్తురుగాని
నీరున బుట్టిన పూరెల్ల ఇవ్వ నీతమా తమకు
ఆ ఖర్మమిచ్చిన నా కవుళ్ల కాలవేసి భూమిని
పాడుచేసి పోదామనిరి పాకనాటి ప్రజలు"

గంగతర్కమము (గంగ-కాటమరాజు తరకవాదము) కథలో గూడ నిట్టి శైథిల్యము కాననగును :

"శ్రీరాజాధిరాజు రాజు కాటమరాజు
దక్షిణాదికి ఆవుల తోలించుకోని
బలుమైన సంపదలు వచ్చి పాలేట నిలచి
ఆరునూరు గుత్తి కవ్వములు యాదవులు కొందరు
తరమునాటి గోకులము వచ్చి తాళ్లూరి మిట్టల దిగెను"

పైన తెల్పిన యుదాహరణములలో ఖండగతిలోని పంచమాత్రాకములగు ఆవృత్తముల నడక లేదు. కొన్ని పాదములలో నించుమించుగ ఇరువది మాత్రలు కిట్టుచున్నవి. మరికొన్ని యింకను దీర్ఘముగా సాగియున్నవి.

ఇట్లు మంజరీ ద్విపదపాదములు, ద్విపదపాదములు, ఖండగతిగా మారుట లో మరియొక వింత ఛందస్సు బయటపడుచున్నది. ద్విపద కథలలో అన్ని

పాదములును ఖండగతిగా మారినచో చిక్కులేదు. కాని యిందు కొన్ని మాత్రమే మారి, తక్కినవి మంజరిగానో లేక ద్విపదగానో ఉండిపోవును. అందుచే కథలో కొన్ని తావులందు ఒక ఖండగతి పాదము, ఒక మంజరీ పాదము నుండుట తటస్థించును. అప్పుడది హరిహరీపదముల వరుసగా కన్పట్టును. ఇట్టి విచిత్ర పరిస్థితి పల్నాడులో నాకు లభించిన కటియావులరాజు కథలో నున్నది. (ఈ కథలో ప్రధానఛందస్సు మంజరి. మధ్యమధ్య ఖండగతి యున్నది):

వేదాద్రి, నరసింహు, వేడుకతో, సేవించి, (ఖండగతి)
మరలి వో, రుగంటికి, మరిసాగి, పోత, (మంజరి)
తటాకము, లునుమంచి, తరుగు మే, డలుచూచి, (ఖం)
గోపురము, లును ఆట, కూటములు, చూచి, (ఖం)

..............................

కొల్లారు, మిద్దెలును, కొలువుకూ, టము చూచి, (ఖం)
చల్లనీ, చిత్తరువు, చవికెలను, చూచి, (మం)

..........................

బహుబంతి, కూటములు, భద్రశా, లలుచూచి, (ఖం)
సొంపైన, సూర్యసోమ, వీథులు, చూచి (మం)

ఇట్లు ఖండగతి పాదము మంజరీ ద్విపదపాదము కలసిన ఛందస్సును 'జంపె వరుస' యందురు. (హరిహరీ పదములన్నియును ఈ జంపెవరుసలోనే యున్నవి). ఈ జంపెవరుసలో మాత్రాగణము లిట్లుండును : 5 + 5 + 5 + 5, 5 + 5 + 5 + 3. కొందరు విమర్శకులు దీనినంతయు నొకే పాదముగా భావింతురు. మరికొందరు దీని నొకే పాదములో రెండు భిన్న దళములుగా నూహింతురు. తరువోజలోవలె ఈ పాదమునకంతకును ఒకే యతి పాటింప బడదు. మొదటి దళములో 1-3 గణాద్యక్షరముల కున్న యతికిని, రెండవ దళములో 1-3 గణాద్యక్షరములకున్న యతికిని సంబంధము లేదు. అందుచే నిది యంతయు నొకే పాదముగా భావించుటకన్న, రెండు దళముల కూడికచే

నేర్పడిన పాదముగా దలంచుట యుక్తము. జంపెవరుస యనగా నొక ఖండగతి పాదము, ఒక మంజరీద్విపద పాదము కలియగా నేర్పడినదనుట సమంజసము.

కాటమరాజు కథలలో నిట్లు ఖండగతి, మంజరీద్విపద పాదములు దగ్గరగా నుండి జంపెవరుసలవలె కాన్పించు కథలేకాక, ఈ రెంటు పాదములకును ఏక యతిని పాటించిన విచిత్రకథ కూడ నాకు లభించినది. (మొదటి దళమున ఖండ గతి యుండుటచే దీనిని తరువోజ యనుటకు వీలులేదు. రెండును మంజరీ ద్విపద పాదములుగనే యుండి, ఏకయతిని పాటించినచో నప్పుడు 'తరువోజ' యగును). నేను చిత్తూరు మండలమున 'గంగతర్కము' (పాలేటికథ)ను సంపాదించితిని. అందు ప్రారంభమున కొన్ని పంక్తులు లయాత్మక వచనమువలె సాగియున్నను మొత్తముపై ఖండగతియే హెచ్చుగ దోచుచున్నది. కొన్ని పాదములలో మంజరీ ద్విపదయు గోచరించుచున్నది. దగ్గరగానున్న రెండు పాదములకు భిన్నయతిని గాక, ఏకయతిని పాటించుట యిందలి విచిత్రము :

"బొల్లావులు ఎద్దులు — భోగవతి నర్రావులు వొచ్చి
బొమ్మిరెడ్డి పల్లెమిట్టల వారి — బోడావులు దిగెను.
జలతారు గుడార్లు — జగజంపు గొడుగులు
చల్లవారు ఏగురు — సాహసఘనులు
సకలాంబరభూషిత — సంపన్నులై వొచ్చి
సాకిరేవు మిట్టలవారి — సలుగుటావులు దిగెను.
కొమరొప్ప రెణభేరి — గోకులము వొచ్చి
కోపులేటిరేవున బసువన్న — గొబ్బున నిలచెను.
ఆరువేల గోపాల్కులు — అందెలు ఎద్దులు
అలవలపాటి రేవున వారి — అంధలావులు దిగెను.
మూడువేల పాడావులు — ముద్దుమోము లేగలు
ముస్తీదులై వొచ్చి — ముద్దుపాటి రేవున వారి—
ముచ్చటావులు దిగెను''.

పై పంక్తులలో కొన్ని జంపెపరుసల వలె నున్నవి. మరికొన్ని శిథిలత్వము హెచ్చిన ఖండగతికి చిహ్నములుగా నున్నవి. ప్రతి పాదద్వయమునకును ఏక యతి విధిగా నున్నది. పూర్వమిద్ది తరువోజ రూపమునన్నుండి, కాలక్రమమున నిట్లు శిథిలమైనదాయను అనుమానము కూడ వచ్చుచున్నది.

మొత్తముపై కాటమరాజు కథల ఛందస్సులో ద్విపద, మంజరీద్విపద, ఖండగతి పరస్పరము మిశితములగుట కానవచ్చుచున్నది. ద్విపదకన్న మంజరీ ద్విపదయే ఎక్కువగా ఖండగతికి ప్రోవతీసినది.

యతిప్రాసలు :—

వీరగాథలలో యతిప్రాసలు ఐచ్ఛికములే కాని నియతములు కావని చెప్ప వచ్చును. అట్లని యివి పూర్తిగ వర్జింపబడినవని భావింపరాదు, పల్నాటి వీర కథలలోను, కాటమరాజు కథలలోను, హరిహరీ పదములలోను, జంగం కథల లోను యతి సర్వత్ర పాటింపబడినది. శిథిలములైన ద్విపద, మంజరీ ద్విపదలలో గూడ గణములు శిథిలములైనవి కాని, యతిభంగము కాలేదు. ఉదాహరణమునకు పెద్దిరాజు కథలోని ఈ క్రింది పాదములు చూడుడు :

"తూర్పున ఆ రాజుకు — తుమ్మవృక్షంబు వీడ
పడమట ఆ రాజుకు —పాలబ్రహ్మవృక్షంబు నీడ
వుత్తరమున ఆ రాజుకు — వుసిరి వృక్షంబు నీడ
దక్షిణమున ఆ రాజుకు — దానిమ్మ వృక్షంబు నీడ
పాలకాడ ఆ రాజుకు — పషిణి తంగేడు"

ద్విపదలో సాగిన ఆవుల వలురాజు కథలో యతియేకాక ప్రాసకూడ ఎచ్చటను భంగము కాలేదు. పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను యతిభంగమును వారించుటకై జానపదకవులు అర్థరహితములగు పదములను వ్యవహారిక పదములను వేసి యతిని కిట్టించిన సన్నివేశములును పెక్కుగలవు.

"మాణిక్యముల గద్దెపై – మతడు గూర్చుండె"      (అతడు)
''నా తండ్రి నాయుడా ! – నతి వేగమునను''      (అతి)
''రావించి యిట్లనె — రప్పుడా బ్రహ్మ''      (అప్పుడా)

కాటమరాజు కథలు :

"మనిచెప్పె కలభూత మండలాధిపుడు"      (అని)
'వలలన్ని చాలుగా-వడ్డుడీ చక్క'      (ఒడ్డుడీ)
'చలరేగి మ్రోగంగ–చౌకళింపుచును'      (చెలరేగి)
'వైకుంఠమున కయి-వరగి రావేళ'      (ఒరగి)
'వళ్లెల్ల నేజాలు వడివడి నాటె'      (ఒళ్లెల్ల)
'వక ఘటంబేనుగులు వడిమావటీలు'      (ఒక)
''నిరతంబు సేవించి నిటుమీద జెపుదు''      (ఇట)

అఖండయతియు పలుతావులందు ప్రయోగింపబడినది :

1. ''... ... ... ... కలభూత గంగురాజేంద్రు
డెలమితో ఖండెమొండెమ్ముల కోట'' —(ఆవుల వలురాజు కథ)
2. ''నీ విటు నిలువ నిన్నేలినవాడు" — ( ,, )
3. ''అడవికాలయ విట్టయలు వున్నచోట
నా డుండ మఱునాడు నడువలేదాయె"      (పోలురాజు కథ)

4. ''బెబ్బులివలె పెడబొబ్బలిడుకొనుచు
నేతేరగని మసిలి నేయు డిట్లనియె"      (బల్లికురువ పోట్లాట)

ఈ వీరగాథలలో కొన్నిచోట్ల యతిభంగమైనట్లు శిష్టులకు గోచరించినను, జానపద పరిభాషలో, వారి యుచ్చారణలో ఆ పదమును పరిశీలించినచో యతి భంగము కాదు. ఉదాహరణమునకు ఈ క్రింది పాదములను చూడుడు :

"ఇలకీ రి చెన్నొందు వీర శౌర్యంబు''      (ఆవుల వలురాజు కథ)

పల్నాటి వీరకథలు :

"ఏవేళ జూచిన వీర ఘోషములు" (ఆవుల వలురాజు కథ)
"విప్ర మాన్యంబులు ఇచ్చు కట్నములు" ( ,, )
"ఇమ్ముగ రాజును వియ్యాలవారు" (పోలురాజు కథ)
"ఎన్నగల కంపటము వెంట బెట్టుకొని" ( ,, )
"ఎక్కువ కావేరి వెట్టి సేయించె" ( ,, )

పై పాదములలో యతిభంగమైనట్లు కన్పట్టుచున్నది. ఇది సరికాదు. పెద్ద అక్షరములున్న పదములను జానపదులావిధముగానుచ్చరింపరు.'వీర'ను'ఈర' అనియు, 'విప్ర'ను'యిప్ర' అనియు 'వియ్యాలవారు'-'ఇయ్యాలవారు', 'వెంట'-'ఎంట', 'వెట్టి'-'ఎట్టి' అనియు పల్కుదురు. అప్పుడు యతిభంగ మెట్లగును ? కావున వీరగాథలలోని యతులు జానపదుల యుచ్చారణానుసారముగ ప్రయోగింపబడుచుండునని చెప్పవలెను. వారి యుచ్చారణదృష్టితోనే వానిని మనము పరిశీలింపవలసియున్నది.

ప్రాస విషయమున గూడ వీరగాథలు లాక్షణిక మర్యాదలను పాటింపవు. ప్రాసపూర్వాక్షర మొక పాదములో దీర్ఘముగా నున్నచో, రెండవ పాదములోను దీర్ఘముగానే యుండవలెనుగాని హ్రస్వముగా నుండరాదు. కాని వీరగాథలలో నొక పాదమున ప్రాసపూర్వాక్షరము దీర్ఘముగాను, రెండవ పాదమున హ్రస్వముగాను నుండుట గలదు. ఆవుల వలురాజు కథలోని ఈ క్రింది యుదాహరణములను చూడుడు:

(i) "నియమంబుతో మ్రొక్కి నిలచి తరువాత
కాయజు శత్రునకు గలిగినయట్టి"

(ii) "దీవెన లిప్పించి తిరుమండ్లుతోను
భవగుణ సంపన్ను బాహు విక్రముడు"

పెక్కుచోట్ల 'ద' కార '' ద కారములకు ప్రాస పాటింపబడినది. (జానపదులు మహాప్రాణము నుచ్చరింపరు కదా !)

"హృదయ పద్మమునందు నుంచి సేవించి
బుధులను గొనియాడి పూర్వ సత్కవుల"

ఆవుల వలురాజు కథలో కొన్ని తావులందు లాక్షణికులు చెప్పిన ద్విప్రాస, త్రిప్రాస పాటింపబడినవి. ఈ ప్రాసలు రెండు పాదములకే పరిమితము కాక నాలుగైదు పాదముల వరకును కొనసాగింపబడి చక్కని రసావిష్కరణము నకు తోడ్పడినవి.

ద్వి పాస : (i) "చేసిరి యాదవ శౌర్య విక్రములు
నేసిరి యాదవు లనేక పీనుగుల
కోసిరి చేతులు గొంతులు కాళ్లు
తోసిరి కలభూత దొరబంధు జనల"

(ii) "మెట్టిరి క్షత్రియుల మెదడు వెళ్లరక
తట్టిరి చౌడోలి దంతాల పైన
పట్టిరి కడదొలగు పారుబంటులను
పెట్టిరి సరుదార్ల పేర్లు పదినూర్లు"

త్రిపాస : (i) "పరిపిరి పగవారిపైన బాణాలు
నెరిపిరి యాదవులు నేకటంబుగను"

..........................

(ii) "నిలిపిరి ప్రఖ్యాతి నెలయ లోకముల
కలిపిరి చెయ్యి చెయ్యి కయ్యంబులంది
పులిపిరి శిరములు పుచ్చకాయలుగ
మలిపిరి పేర్వేర మన్నె నాయకుల"

ఇట్లు వీరగాథలలో పల్నాటి వీర కథలలోను, కాటమరాజు కథలలోను యతిప్రాసలు బింకముగ పాటింపబడినవని చెప్పవచ్చును. ఒక్క బొబ్బిలి వరుస కథలలో మాత్రము యతిప్రాసలు ఐచ్ఛికములుగా నున్నవని చెప్పకతప్పదు. పదములు జంగం కథలు కూడ యతిప్రాసల విషయమున శ్రద్ధ జూపిన ప్రక్రియలే.

## 28. కాటమరాజు కథలు - గాథాకారులు :

కాటమరాజు కథల నెక్కువగా కొమ్ములవారు పాడుచుందురు. వీరు మాదిగలలో నొక తెగ. కథాస్థానమైన కనిగిరి సీమలో కొమ్ములవారే గాక, గొల్లలలో పూజగొల్లలు కూడ ఈ కథలను పాడుచున్నారు. కందుకూరు తాలూకాలో 'పికిలి వారు' పాడుచున్నారు. వీరును గొల్లలే. విశాఖ పట్టణ మండలమున 'పొడపోతుల వారు' కాటమరాజు కథలను గానము చేయుదురు. వీరి కులము తెలియుట లేదు. రాయలసీమలో భట్టువాళ్లు (మాదిగలు), ఎఱ్ఱ గొల్లలు; తెలంగాణమున ఎఱ్ఱ గొల్లలు, మందుచ్చవారు, బీరన్నల వారు యాదవ కథలను పాడు గాథాకారులు. కనిగిరి సీమలో కాటమరాజు కథలను పాడు పూజగొల్లలను 'యాచకులు' అని పిలుతురు. తెలంగాణమున వీరికి 'తెరచీర భక్తులు' అని పేరు. రాయలసీమలో, ముఖ్యముగా కర్నూలు మండలమున వీరిని 'సుద్దులన్నలు' అందురు. పంపాద్రి కథను రచించిన మల్లయ్యకవి కృత్యవతరణికలో 'తెరచీర భక్తు'లను స్మరించినాడు.

(i) కొమ్ములవారు :-

కొమ్ములవారు గంగదర్శనమునకు చెందిన మాదిగలు. వీరు తాము జాంబవంతుని వంశపువారమని చెప్పుకొందురు. ఈ కొమ్ములవారినే చిత్తూరు మండలమున 'భట్టువారు' అనియు పిలుచుచున్నారు.

కొమ్ములవారు యాదవులను యాచింతురు. వారి గోత్రములను చెప్పుదురు. కాటమరాజు కథలను, విష్ణుభాగవతమను నామాంతరముగల 'కంసుడు కథ' ను వీరు పాడుచుందురు. ఈ కథలను పాడుటలో వీరణములు, తిత్తి, తాళములు, కొమ్ములు నుపయోగింతురు. తమ వీరగాథా సంపదను కాపాడుచుండిన వారగుటచే యాదవులు వీరిని మిక్కిలిగ అభిమానింతురు. కాటమరాజు కథలన్నియు వీరికడ తాళపత్ర గ్రంథ రూపముననను, ముఖస్థముగను నున్నవి.

గంగ జాతరలలో ఈ కొమ్ములవారు పాల్గొని, గావు పట్టుట, కొమ్ముల నూదుట, తానకములు పాడుట, కాటమరాజు కథలు చెప్పుట చేయుదురు 'కాటమ

రాజు సైన్యమున ప్రత్యేకముగా గోసంగి దళమున్నట్లు వీరగాథలలో చెప్ప బడినది. దాని నాయకుడు బీరినీడు. ఇతడు మాతంగ వీరుడు. ఈతని సంతతి వారే నాటినుండి నేటివరకును ఈ కథలను గానము చేయుచున్నారని నాయూహ. వీరే నేడు 'కొమ్ములవారు' అని పిలువబడుచున్నారు.

పల్నాటి వీరకథలను పాడెడి హక్కు కన్నమదాసు సంతతివారుగా నూహింపబడుచున్న వీరవిద్యావంతుల కున్నట్లే, కాటమరాజు కథలను పాడెడి హక్కు బీరినీని సంతతివారగు కొమ్ములవారికి మాత్రమే కలదు. నిజమునకు గొల్లలు వీనిని పాడరాదు. పల్నాటి వీరకథలను తెలగలు, కంసాలులు, పిచ్చుకుంట్లు మున్నగువారు పాడుచున్నట్లే, కాటమరాజు కథలను వివిధ శాఖలకు చెందిన యాదవులు పాడుచుండుట జరగుచున్నది. (కొమ్ములవారికి వాక్శుద్ధి తక్కువయను తలంపుతో తాము ఈ గాథాగానమున కుపక్రమించితిమని కొందరు యాదవ గాథాకారులు నాతో చెప్పియున్నారు.)

ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట తరువాత భక్తిరన్న బీరినీని సంతతి వారగు మాదిగలను బిలిచి, యాదవకథలను లోకమున వ్యాప్తిచేయుటకై అనుమతి నిచ్చెనని చెప్పుదురు. భక్తిరన్న కాశినుండి తనతోపాటు పంద్రెండు మంది శిష్యులను దెచ్చెను. వారందరును యాదవ కథలను వ్యాప్తిచేయుటకే నియోగింప బడిరి. తన శిష్యులతోపాటు కొమ్ములవారును పదపూడవ భాగమునకు అర్హులని భక్తిరన్న నిశ్చయించెనట. కాటమరాజు కథలను చెప్పుచు యాదవుల నాశ్రయించి జీవించవలసినదని భక్తిరన్న కొమ్ములవారితో జెప్పెనట.

ఈ కొమ్ములవారు ఏ యాదవుని యింటిముందు కథ చెప్పినను అతడు వీరిని సన్మానించి తీరవలెను. అట్లు చేయనిచో ఈకొమ్ముల వారు అతని యింటిముందు గుడారు నెత్తుదురు. (ఇదికూడ భక్తిరన్న శాసనమేయట), ఇట్లు గుడారు నెత్తి నప్పటికిని ఆ యింటివారు ఈ కొమ్ములవారిని గౌరవింపనిచో, ఆ గుడారును కూల్చ రండని భక్తిరన్న చెప్పెనట. ఇట్లు ఇంటిముందు గుడారును కూల్చినచో ఆ ఇంటిలోని యాదవులందరును నశించిపోవుదురని భక్తిరన్న శాపమట: కావున కొమ్ములవారిని యాదవులు అత్యంత భక్తి శ్రద్ధలతో నాదరింతురు. ఈ

భక్తి రన్న శాపము మాట యేట్లున్నను, తమ పూర్వుల కథలను కాపాడిన వారగుటచే ఈ కొమ్ములవారిపై యాదవుల కభిమానముండుట సహజముగదా!

కాటమరాజుకథలు పాడు గాథాకారులు బడుగుల అచారమునకు చెందినవారు. ఈ బడుగుల ఆచారమునకు ఆరు ముఖ్యమైన వస్తువులుండవలెను. అవి; 'గుడారు, కొమ్ము, వీరణము. బొల్లావు, వీరభద్రుడు, బసవదేవుడు.' వీనిని కొంచెము వివరించెదను.

గుడారు :—

కథను చెప్పెడి ప్రదేశములో గుడ్డలతో పెద్ద గుడారమును వేయుదురు. ఆ గుడారములోపల గోడలకు యాదవుల కులదైవమగు గంగయు, కాటమరాజు కథలలోని ప్రధాన ఘట్టములును రంగులలో చిత్రింపబడిన పెద్ద పెద్ద గుడ్డల నతికింతురు. ఈ గుడ్డలకు 'తెరచీర' అనిపేరు. ఈ తెరచీరలను బట్టియే యీ గాథాకారులకు 'తెరచీర భక్తు' లని పేరు వచ్చినది. తెలంగాణమున పాండవుల వారను గాథాకారులును ఇట్లే కథలలోని ప్రధాన ఘట్టములను చిత్రరూపమున ప్రదర్శించి భారతకథలను పాడుచుందురు. ఇంగ్లండు వంటి విదేశములలో గూడ వీరగాథా గానమున ఈ చిత్రరూప ప్రదర్శనమున్నదని తెలియుచున్నది.

కొమ్ము ;—

ఇత్తడితో చేయబడి వంకరగా పొడవుగానుండు గొట్టమునకు కొమ్ము అనిపేరు. కథాగానమును ప్రారంభించుటకు ముందును, యాదవుల గోత్రములను చెప్పునప్పుడును, తానకములను పాడు సమయమందును కొమ్ముల నూదుదురు. ఈ కొమ్ములధ్వని శంఖారావమువలె భయమును గొల్పును.

వీరణములు :—

అంకమ్మ కథలలోను, పల్నాటి వీర కథలలోను ఉపయోగించెడి పంబజోడు వంటివే యీ వీరణములు కూడ. కాని పంబజోడుకును వీనికిని కొంచెము భేదమున్నది. పంబజోడు పెద్దది; శబ్దము చాల యెక్కువ. దానికైగంటలుండును. పల్నాటి కథలలో నుపయోగించు పంబజోడును "పిరజోడు"

అందురు. ఈ కాటమరాజుకథలలో నుపయోగించెడి వీరణములు వీరజోడు కన్న చిన్నవి. శబ్దమును తక్కువయే. పంబజోడువలెనే వీరణములును రెండుండును. ఒకటి వాద్యకారుని తొడలపై అనుకొని యుండును. దీనిపై నాను కొని రెండవది యుండును. మొదటిది శ్రుతి తక్కువ, రెండవని శ్రుతి యెక్కువ. మొదటి వీరణము వేప లేక రేల చెక్కతో చేయబడి యుండును. రెండవది ఇత్తడితో చేయబడును. (పల్నాటి వీరకథలలో నుపయోగించెడి వీరజోడులో రెండును ఇత్తడితో చేయబడినట్టివే). ఈ వీరణములు మానికంత లావున, రెండు జేనల పొడవుండును. పల్నాటి వీరజోడులో మొదటిది యించుమించు వీరణ మంతే యుండును గాని, రెండవది మాత్రము దీనికి రెట్టింపు ప్రమాణమున నుండును. ఈ వీరణములకు మేక లేక జింక చర్మములను ఉపయోగింతురు.

బొల్లావు:—

ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో పాల్గొన్న ఒంటి కొమ్ము బొల్లావు యొక్క బొమ్మ యిది. దీనిని చెక్కతోగాని, ఇత్తడితో గాని చేయుదురు. తానకములు పాడునప్పుడు, తానకముల వారు దీనిని నెత్తిపై బెట్టుకొని, శివమెత్తి గంతులు వేయుదురు.

వీరద్రాడు :-

పల్నాటి యుద్ధమున బ్రహ్మనాయడు జరపిన శివనందులకోట యుద్ధములో యాదవులతనికి తోడ్పడిరట. అందుచే నతడు యాదవులకు శివనందులకోట దోపులో లభించిన గుడారు, వీరద్రాళ్లు, గంగ-పోతురాజుల విగ్రహములు బహూ కరించెనట. తానకములు పాడునపుడు శివమెత్తి గంతులు వేయువారిని వీర ద్రాళ్ళతో కాళ్ళమీదను చేతులమీదను కొట్టుదురు. ఈ వీరద్రాళ్ల మూడు ముళ్ళతో నుండు బారెడేసి పగ్గములు.

బసవదేవుడు :—

ఎఱ్ఱగడ్డపాటులో యాదవులొరగిరను వార్తను దొనకొండకు తెచ్చినవాడు బసవదేవుడు. ఈ బసవదేవుని విగ్రహము కూడ గాథాకారుల కడమండును. దీనిని వారు పూజింతురు.

గాథాకారులు ఈ కాటమరాజు కథలను పాడునప్పుడు వీరణములనేకాక, శ్రుతిని నిలువుకొనుటకు తిత్తి, లయకు తాళములను గూడ నుపయోగింతురు. ఇందు ప్రధాన కథకునకు పల్నాటి వీరకథకునకున్నంత వేషముండదు కాని, నిలువుటంగీ, పంద్రెండు మూరల పాగా, కాళ్ళకు గజ్జెలు, నడికట్టు, చేతిలో పిడిగుడ్డ మాత్రముండును. గంగతర్కము కథను పాడునప్పుడు ఒకరు గంగ వేషమును, మరియొకరు కాటమరాజు వేషమును వేసికొని, ఎదురెదురుగా నిలుచుండి, చేతిలో కత్తిపట్టుకొని, ఆ కత్తి చివర నొక నిమ్మపండును గ్రుచ్చి కాళ్ళకు గజ్జెలు కట్టుకొని, గంతులువేయుచు, కత్తిని త్రిప్పుచు, గంగ-కాటమరాజు పరస్పరము వాదించుకొన్నట్లుగా నటింతురు. కడప, కర్నూలు, మండలములలో గంగ తిరునాళ్ళ సమయమున ఈ గంగతర్కము కథను తరచుగా పాడుచుందురు.

ప్రధాన కథకునకు వంతలు ముగ్గురుందురు. వీరిలో నొకడు తిత్తిని పట్టును. రెండవవాడు వీరణములు వాయించును. మూడవవాడు తాళము వేయును. ఈ ముగ్గురిలోను ఇద్దరు కథకుడు చెప్పుదానికి 'ఆ' కొట్టుదురు.

(ii) గొల్లసుద్దుల వారు :—

'గొల్లసూక్తులు' అను శబ్దమునుండి 'గొల్లసుద్దులు' అను శబ్దమేర్పడి, కాలక్రమమున నిది కాటమరాజు కథలను పాడెడి ఒక వర్గమునకు పేరుగా మారినది. ఈ గొల్లసుద్దులవారు బడుగుల ఆచారమునకు చెందిన గొల్లలలో ఒక శాఖ. వీరు యాదవులను యాచింతురు. సుద్దులను పాడు గొల్లలగుటచే వీరికి 'సుద్దుల గొల్లలు' అనియు నామాంతరము. రాయలసీమలో వీరిని 'సుద్దులన్నలు' అందురు. నెల్లూరు, ప్రకాశము మండలములలో వీరిని 'యాచకులు' అనియు "తెరచీర భక్తులు" అనియు పిలుతురు. వీరు పూజగొల్లలు. తెలంగాణములో 'ఎఱ్ఱ గొల్లలు' ఈ వృత్తిలో నున్నారు. ఈ సుద్దులవారు మేకలను పెంచెదరు.

కాటమరాజు పినతండ్రికుమారుడైన భక్తిరన్న కాశినుండి తనతో పంద్రెండు మంది శిష్యులను తీసికొని వచ్చెననియు, వారిని కాటమరాజు కథ

అను గానము చేయుచు యాదవులను యాచించి బ్రతుకుడని చెప్పెననియు, ఆ శిష్యుల సంతానమే నేటి గొల్లసుద్దుల వారనియు నొక ప్రతీతి. నిజమునకు కాటమరాజు కథలను పాడెడి అధికారము కొమ్ములవారిది. ఈ గొల్లసుద్దులవారు లేదా సుద్దులగొల్లలు కొమ్ములవారి తరువాత ఎన్నదగినవారు మాత్రమే,

కొమ్ములవారివలెనే ఈ గొల్లసుద్దుల వారుకూడ పెద్ద గుడారమును వేసి, అందులో కాటమరాజు కథావృత్తాంతములు బొమ్మల రూపములో చిత్రింపబడిన తెరచీరను కట్టి, పీరణములు, కొమ్ములు, తాళములు, తిత్తి మున్నగు వాద్యములతో ఆ గుడారములో కాటమరాజు కథలు పాడుగురు.

అయ్యలరాజు నారాయణామాత్యుడు (క్రీ. శ. 1750) తన 'హంస వింశతి' కావ్యములో సుద్దుల గొల్లలను విపులముగా వర్ణించినాడు (ద్వితీయా శ్వాసములో 87వ పద్యమునుండి 91వ పద్యము వరకును) :

''కొమ్ములు పీరణాలు జిగి గుల్కెడు వ్రాతల కృష్ణ లీలలం
గ్రమ్ము గుడార్లు వీరుడగు కాటమరాజు కథానులాపముల్
బమ్మిన పుస్తకాలు ముఖపట్టిడి కట్టురుమాలలున్నెఱా
సొమ్ములు నామముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చిరెంతయున్
(87వ పద్యము)

(iii) పొడపోతుల వారు :-

విశాఖపట్టణ మండలమున యాదవుల గురువులుగా చెప్పబడెడి ఒక ప్రత్యేకమైన తెగయున్నది. వీరిని 'పొడపోతుల వారు' అని పిలుతురు. వీరు కొమ్ములవారి వంటి వారేమో తెలియదు. యాదవకులమునకు చెందినవారు మాత్రము కారు. వీరు యాచకులును, గురువులును. వీరిని యాదవులు మిక్కిలి గౌరవింతురు.

విశాఖపట్టణ మండలములోనున్న ఈ పొడపోతుల వారు యాదవులకు గోత్రములు చెప్పి, కాటమరాజు కథలను పాడుదురు. వీరికి వాద్యము లేవియు

నుండవు. కాటమరాజు కథలను 'ఆక పదములు'గా పాడుదురు. (వంతలు తి కొట్టుచుండగా కథకుడు పాడును.) వీరు యాదవుల ఇండ్లదగ్గర నెలల తరబడి యుండి కాటమరాజు కథలు పాడుదురు.

ఈ పొడపోతుల వారు తూర్పు గోదావరీ మండలములో కూడ నున్నారు.

## 29. గాథాకారుల ప్రార్థనలు :-

కాటమరాజు కథలను పాడు గాథాకారులు మొదట గణనాయకుని ప్రార్థింతురు. పిమ్మట గంగను ప్రార్థింతురు. తరువాత కొన్ని చిల్లర పాటలు పాడుదురు. (ఈ చిల్లర పాటలను వంతలు కూడ పాడుచుందురు). ఇందు సాధారణముగా బొల్లావుపాట, ఏరువగంగ పాట, పాపనూక సువ్విపాట ఉండును. తరువాత ప్రారంభము జరుగును.

మొట్టమొదట చేయు గణపతి ప్రార్థన యీ క్రింది విధముగానుండును:-

గణనాయకా శివ గణనాయకా – గరళాకంధరుడవు గణనాయకా ః
హరహరా మహదేవ ,, హరుని కొమారుడవు ,,
శివశివా మహాదేవ ,, శివుని కొమారుడవు ,,
బ్రాహ్మణులే నిను గొల్వ గణనాయకా – బ్రహ్మదేముడందురయ్య గణనాయకా
రాజులే నిను గొల్వ ,,, రాయబా రమందురయ్య ,,
కోమట్లే నిను గొల్వ ,, కోటి లాభ మందురయ్య ,,
వెలమలే నిను గొల్వ ,, వేణునాద మందురయ్య ,,
ఎరుకలే నిను గొల్వ ,, కొల్లాపురి యందురయ్య ,, 91

తరువాత "తొండము నేకదంతమును......" అను పద్యమును, 'తల్లి నిన్ను దలంచి..."అను పద్యమును పాడుదురు. పిమ్మట గంగప్రార్థన :

వాలు జడలశూలము భాగీరథి గంగా ః వై భోగరాణివో భాగీరథిగంగా ః
పల్లాజడల శూలము ,, ,, పరమకల్యాణివో ,, ,,
ఎద్దులావులు ఏరుదాటంగ ,, ,, మొద్దులెక్కి మర్లు పిల్చేవు ,, ,,
మర్లవారి మట్టు పెయ్యాను ,, ,, మాటినావు గుంటి మరుగునా ,, ,,

ఇసుక నిప్పులు చేసేవు ,, ,, నీరు మంటలు పెట్టేవు ,, ,, 92

గంగ దొనకొండలో పూజగొల్లలు చేయు గంగప్రార్థన దీనికన్న భిన్నముగా దీర్ఘముగా రసబంధురముగా నున్నది :-

'శ్రీమహాదేవుని శృంగార రాణి
కామితార్థము లిచ్చు కంజాతపాణి
మౌనుల పాలిటి మంచారవల్లి
దీనుల పాలిటి దివ్య గీర్వాణి
కొల్హాపురంబున గొలు విచ్చుదేవి
చల్లంగ రక్షించు చంద్రికాదేవి
కనకము గురియించు కనకదుర్గాంబ
శ్రీధనుముకొండలో స్థిరముగానున్న
నీకు మ్రొక్కెదమమ్మ నీరజవేణి :
బ్రహ్మ గవేంద్రుని పాశెంబుతల్లి
సీత నీపుట్టినిల్లు శ్రీ పర్వతములు
మగువ నీ పుట్టినిల్లు మాల్యవంతములు
తుంగభద్ర వార్ణాసి దోర్దండ నిధులు
గంగాజలనిధులు కలుగని నాళ్ళు
ఎవని మీదుంటివే ఎవని తల మీద
ఉత్తరాదిని పుట్టి ఉంటి మేల్గిరుల
దక్షిణాదిని వెలసి ధనుముకొండను నిలచి
పాలేట పూజగొను పరమ కల్యాణి
కొమ్మ : లేవమ్మ: ఓ కొమ్మగంగమ్మ:
కొమ్మ: ముగ్గురిగన్న కోమలీ లేవె :

---

91, 92. కృష్ణాజిల్లా, కైకలూరుతాలూకా, పెరిక గూడెములో గుజ్జర్లపూడి మస్తాను అను కొమ్ములవాడు పాడిన ప్రార్థనలు. సేకరణ 21-9-1964

కామధేనువు అరచె గంగమేల్కొ-వె
మేలుకో శాంభవీ ? మేలియవమ్మ !
వాక్కివ్వవే మాకు ఓ శారదాంబ !
నీసేవ నే జేతు నీతి మార్గమున
పరసేవ నేనెరుగ పరమ కల్యాణి
నిండు చేతులను పన్నెండాయుధముల
పట్టిన గంగమ్మ పరమకల్యాణి
నీ కథల్ చెప్పంగ నిశ్చయించితిని
వినరయ్య జనులార ! విశదంబుగాను' 93

ఈ గంగప్రార్థన తరువాత కథ ప్రారంభమగును.

కొందరు గణేశ్వర ప్రార్థనకును గంగ ప్రార్థనకును మధ్య కొన్ని చిల్లర పాటలు పాడుదురు. ఈ పాటలు ముఖ్యముగా గంగదొనకొండ ప్రాంతమందలి గాథాకారుల దగ్గర వినబడుచున్నవి. ఈ క్రిందిది దొనకొండ గంగను గూర్చిన ప్రార్థన :

'నీలిపూవుల చీర నీరేజగంధి
పన్నెండు ఆయుధాల ప్రబలినావమ్మ
వన్నెరో తలకురులు ముడిచినావమ్మ
కన్నెరో ధనకొండ గంగ లేవమ్మ
పుడితివి కనకాద్రి భూముల్లలోను
వస్తివి ఓ గంగ వలగొన్న వమ్మ
వలగొన్న వలగొన్న వలగొన్న వమ్మ
వలగోని పూజలూ వలచినావమ్మ

---

93. ప్రకాశంజిల్లా, దర్శితాలూకా, గంగదొనకొండ గ్రామములో పూజారి బోదయ్య అను పూజగొల్ల పాడిన ప్రార్థన. సేకరణ 12-9-1967.

ఎలయంగ గంగుల ఎల్లయ్యానగరు
ఎలమిసంపదలిచ్చు ఎలమంచి గంగ
రంగుగా దొనకొండ రాయి మల్పించి
కట్టిరి దొనకొండ గంగమ్మ నగరు
చుట్టూరు కొండల్లొ నడుమ దొనకొండ
దొనకొండ వెలసినా దుర్గమ్మయమ్మ
చుట్టూరు ఏరుల్లొ నడుమ పాలేరు
పాలేట వెలసినా పరమ కల్యాణి !''[94]

పైపాటలో గంగుల యెల్లయ్య ప్రసక్తికలదు. కావున ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట రచించిన గంగుల పినయెల్లయ తండ్రి యెల్లయ్యాయే పైపాటను రచించెనేమో.

ఏరువగంగపాట (పాలేటి గంగపాట):

''గంగను కొలిచేరూ-ఏరువ
గంగను కొలిచేరూ
ఆకసాన సుళ్ళాడుతురాగా
గంగను కొలిచేరూ-పాలేటి
గంగను కొలిచేరూ
మేఘములోపల మెరుపులు మెరిసిన
గంగను కొలిచేరు-పాలేటి
గంగను కొలిచేరు''[95]

బొల్లావుపాట :

'కనకరాళ్ళ బోటిమీద
కనక వరుషమూ-ఆవుకు
కనక వరుషమూ

ఉద్దాగీరి ముద్దాపసుపు
ఆవుకొొచ్చెనూ-బొ
ల్లావు కొొచ్చెనూ!'96

పాపనూక సువ్విపాట :

'సువ్వి సువ్వనలార! సువ్వన్నలార !
సువ్వన్ని పాపమ్మ వేయన్నపాడు
మచ్చావతారుడే మాయావులన్న
హెచ్చుగా దక్షిణాది ఆవులమేపు
పచ్చొడ్లు నే దంచి పాలెసరుపెట్టి
పాయకా నే జూతు పాలేటిత్రోవ
కట్టమీదంగళ్ళు గంగరేగుల్లు
ఘనమైన గుడిపాడు గంగ పుట్టిల్లు
మొగలి పూతీరమ్మ మొగసాలతీరు
మొగవారిలోకెల్ల ముమ్మయ్య తీరు
ఆవంపు తీరమ్మ అద్దములొ తీరు
ఆడవారిలోకెల్ల అగుమంచి తీరు
చేరెడూ చేరెడూ చెవుల పోగుల్లు
చెలువుడు కాటమరాజు చెల్లెల్ని నేను
కాశీకి బొయ్యేటి వో యన్నలార
కాశీకి పడమటా గంట్ర మోగింది
పాటిమీది పుచ్చల్లే పైన దోసల్లే
పెద్దమ్మ పెట్టింది వెలలేనిసొమ్ము
కాకరా పూసింది వెలలేనిపూత
పెద్దమ్మ పెట్టింది వెలలేని సొమ్ము"97

---

94, 95, 96, 97. ఈ నాలుగు పాటలను గంగదొనకొండకు చెందిన మోడి గంగులు అను పూజగొల్ల పాడి వినిపించెను. 17-9-1966.

## 30. గంగజాతర లేక గంగ తిరునాళ్ళు :-

యాదవుల కులదైవము గంగ. ఈమె శక్తిస్వరూపిణి. ప్రధాన గ్రామ దేవతలలో నీ గంగ యొకతె.ఆంధ్ర దేశమున అనేక గ్రామములలో ఈ గంగకు దేవాలయములున్నవి. నెల్లూరు, ప్రకాశం, కర్నూలు, కడప మండలములలో ఈ గంగగుడులు హెచ్చు. ఈ గంగకు ప్రతిసంవత్సరమును గొప్ప యుత్సవ ములు చేయుదురు. యుత్సవములను 'గంగ జాతరలు' లేక గంగతి రునాళ్ళు' అందురు. ఈ జాతరలలో కాటమరాజు కథలు పాడింతురు; పశువులను పూజిం తురు; తానకములు పాడుదురు. రాయలసీమలో ఈ జాతరను 'ఆవుల పబ్బం' అనికూడ పిలుతురు. కర్నూలు మండలమున కోవెలకుంట్ల తాలూకా పెదయమ్మ నూరు గ్రామములో కుందునది యొడ్డున ప్రతిసంవత్సరము చైత్రమాసమున గొప్ప గంగజాతర జరుగును. (1966 ఏప్రిల్ 12వ తేదిని ఈ గంగజాతరను నేను చూచి ఆనందించితిని).

(i) దొనకొండ గంగ తిరునాళ్ళు :

ప్రకాశము మండలమున కథాస్థలములైన ధనముకొండ (నేటి గంగ దొనకొండ), పంచలింగాల కొండల యొద్ద గంగదేవళము లున్నవి. ఇవి అతి ప్రాచీనములైనవి. నాటి యాదవులు పూజించిన విగ్రహములివియే. దొన కొండలో చైత్రశుద్ధ దశమి మొదలు తొమ్మిదిరోజులు గంగకు తిరునాళ్ళు జరుపు దురు. ఏడుదినములు గంగకు ఊరేగింపు చేయుదురు. ఎనిమిదవ దినమున సుడులు, బోనములు జరపుదురు. తొమ్మిదవనాటి రాత్రి 'భట్టు రాయబారము కథ'ను పాడింతురు. దొనకొండలో గంగగుడిముందు రెండు అరుగులున్నవి. ఈ యరుగులపై సుద్దులవారు రెండు వర్గములుగా చీలి నిలబడుదురు. ఒక వర్గమువారు కాటమరాజు భట్టులవలెను, రెండవ వర్గమువారు నల్లసిద్ధిరాజు భట్టుల వలెను వ్యవహరించి, పరస్పర నిందలతో రాయబారపు కథ నంతటిని పాడుదురు. ఈ అరుగులను 'రాయబారపు అరుగులు' లేక 'కల్లి అరుగులు' అందురు.

గంగదేవళము ముందు పెద్ద గుడారమును వేయుదురు. దీనిపేరు 'నందుల గుడారు'. ఈ గుడారులో పగటిపూట కాటమరాజు కథలు పాడు చుందురు. ఈ యుత్సవములలో కడపటిదినమున బొల్లావు ప్రతిమను అగుమంచి

బావికడకు తీసికొనివెళ్ళి, అక్కడ ముగ్గువేసి, బొల్లావు నెత్తుకొని, ఆవేశముతో పరుగుపెట్టుచు, తల్లి అరుగుల కడకు వచ్చి, అక్కడ మరల ముగ్గువేసి, షడ్దర్శనములవారిని సెలవడిగి, భట్టు రాయభారము కథను ప్రారంభింతురు.

ఈ దొనకొండ ప్రాంతమున పల్లెలలో నొకవింత సామెతయున్నది. 'దొనకొండ పోయి గంగను కొని తెచ్చుకున్నావు' అనునది. కష్టములనే వ్యక్తియైనను తనంతతానుగా తెచ్చుకొన్నప్పుడు దీని నుపయోగింతురు. దీని వ్యుత్పత్తి తెలియవచ్చుటలేదు.

(ii) పాలేటి గంగతిరునాళ్ళు :-

కనిగిరి సీమలో పెద అలవలపాడు గ్రామసమీపమున గల ఎఱ్ఱగడ్డపాడు, పంచలింగాలకొండ ప్రాంతమున పాలేటి గంగగుడి కలదు. ఇక్కడ వైశాఖ మాసమున బహుళ పాడ్యమి మొదలు పంచమి వరకును గంగ తిరునాళ్లు జరుగును. ఈ జాతరకు ఆ చుట్టుప్రక్కల ప్రజలందరును కుంకుమ బళ్లతో ప్రభలు కట్టుకొనివచ్చి, యొడ్డున గంగమ్మకును, కాటమరాజువారికిని పశుక్షేమమును గోరి పొంగళ్లు పెట్టుదురు. కొమ్ములవారు పాలేటి యిసుకతిప్పలపై రాత్రివేళ కాటమరాజు కథలు పాడుదురు.

కాటమరాజు ఉత్తరాదినుండి దక్షిణాదికి పోవునప్పుడు అతని పశువుల మందను గంగ అడ్డగించిన ప్రదేశము ఇక్కడనే కలదు. ఇక్కడ పాలేటిమధ్య గల యొక పెద్ద గుండురాతిపై గంగ విగ్రహము చెక్కబడియున్నది. దీనిని 'గుంటి గంగమ్మ' అందురు.[98] కాటమరాజు నడ్డగించిన గంగ యీమెయే. ఈ

98. దరిసి తాలూకాలోని 'తూర్పు గంగవరము' గ్రామములో వేరొక 'గుంటి గంగ' కలదనియు, అట తిరునాళ్లు విశేషముగా జరుపబడుననియు, వానికి 'గుంటిగంగ తిరునాళ్లు' అని పేరనియు మిత్రులు శ్రీమాన్ కె రామానుజాచార్యులవారు తెలియజేయుచున్నారు.

గుండుదగ్గరనే భక్తిరన్న యుద్ధానంతరము కాశినుండి వచ్చి యాదవ వీరులకు పిండప్రదానముచేసెను. ఇక్కడనుండియే యాదవులు కైలాసమునకేగుటచే దీనిని 'కైలాసబండ' అని పిలుతురు. దీనిప్రక్కనే గోసంగివీరుడగు బీరిసీని విగ్రహము చెక్కిన రాయి మరియొకటి కలదు. ఈ ప్రాంతమున ఏటిలోనొక రావిచెట్టున్నది. యాదవవీరులు యుద్ధానంతరము తమ కత్తులను పాలేటిలో కడిగి యీ చెటుదగ్గర పాతిరని ప్రతీతి. ఈ రావిచెట్టుదగ్గరనే 'భట్టు రాయబారము' 'భక్తిరన్నకథ' మున్నగునవి పాడుదురు.

పాలేటిగంగ తిరునాళ్ళ గూర్చి వెంగళాపురమునకు చెందిన బొడ్డెబోయిన అయ్యన్న కుమారుడు గంగయ్య అను యాదవ గాథాకారుడు ఈ క్రింది వివరముల నిచ్చినాడు :—

పాడ్యమినాటిరాత్రి పెద అలవలపాడు దగ్గర పాలేటిలోనున్న 'కోసలేటి గంగ' కడకు ప్రజలు తమతమ బొల్లావులను మేళతాళములతో తీసికొనిపోయి, పొంగళ్లు పొంగించి, నివేదనలిచ్చి, వేటలు వేయుదురు. ఆ రాత్రి అక్కడనే గడపెదరు.

విడియనాటి ఉదయమునకు ఎఱ్ఱగడ్డపాడు దగ్గర పాలేటిలోనున్న గుంటి గంగమ్మ కడకు వత్తురు. ఇక్కడ యాదవవీరులకు పిండప్రదానము చేయుదురు. 'బద్దె గొఱ్ఱె'ను నరికి, దాని గుండెకాయనుతీసి, ముక్కలు ముక్కలుగా కోసి, ఒక్కొక్క పిండపు ముద్దలో నొక్కొక్క ముక్క పెట్టుదురు. వచ్చిన ప్రజలకు మాంసము కలిపిన అన్నమును పంచిపెట్టుదురు. తరువాత గుంటిగంగ నుండి పాత గంగగుడి దగ్గరకు వచ్చి (ఇదియును పాలేటిలోనే కలదు) అమ్మవారిని పూజించి, అటనుండి ప్రస్తుతమున్న గంగగుడి[99] కడకు వచ్చి అచ్చట అఖండ

---

99. ప్రస్తుతమున్న గుడి అర్వాచీనమైనది. ప్రాచీనమైన గుడి దీని కుత్తరముగా నొక ఫర్లాంగు దూరములో పాలేటికిని "రకత కాల్వ" కును మధ్య నుండెడిది. పాలేరు పొంగి అది నాశనమైనదట.

మును వెలిగింతురు. విదియనాటి రాత్రి పాలేటి యిసుకతిన్నెలపై 'గంగతర్కము' కథ పాడబడును.

తదియనాడు పగలు గంగగుడిదగ్గర సుడిమాను నెత్తుదురు. రాత్రి అమ్మవారి ఉత్సవ విగ్రహము నూరేగింతురు. ఆ రాత్రియంతయు నూరేగింపు జరుగుచనే యుండును. తెల్లవారుసరికి తిరిగి గుడికి వత్తురు.

చవితినాడు 'గావు' చేయుదురు. గావు చేయుట యనగా బలిపశువును నోటితో కొరికిచంపుట. ఇట్లు చంపిన బలిని (మేకపోతును) కొమ్ములవారికిత్తురు. బండ్లు, ప్రభలు మున్నగు నుత్సవమంతయు నీ చవితి రోజుననే జరగును

పంచమినాటి రాత్రి, పాలేటి యిసుకతిన్నెలలోగల గుండురాళ్ళ దగ్గర 'కల్లి రాయబారము' లేక 'భట్టు రాయబారము' కథ పాడుదురు ఈ గుండురాళ్లను "కల్లిగుండ్లు" అందురు. దొనకొండలో అరుగుల నుపయోగించినట్లుగా నిట రాతి గుండ్ల నుపయోగింతురు. అనగా భట్టురాయబారములోని యిరుపక్షములును రెండు రాతిగుండ్లపై నెక్కి వాదించుకొందురు. ఈ కల్లిగుండ్లు గుంటిగంగకు తూర్పుగా నున్నవి.

షష్ఠినాడు వసంతము చల్లుకొనుచు అమ్మవారిని పాలేటిగుడినుండి వెంగళాపురము గ్రామములోనికి తీసికొనిపోవుదురు.

ఈ తిరునాళ్ల సమయమున ప్రాతవడిపోయిన పీరద్రాళ్లు, శిథిలమైపోయిన తాళపత్ర గ్రంథములు పాలేటిగంగలో పడవేయుట ఆచారము.

చిత్తూరుమండలమున తిరుపతిలో గూడ గంగజాతర మహా వైభవముగా జరుపబడును. కాని యిక్కడ కాటమరాజుకథలు పాడబడకపోవుట విచారకరము.

## 31. ఆవుల పరుష - తానకములు :

రాయలసీమలో గంగతిరునాళ్ళ సమయమున ఆవులకు పొంగళ్లు పెట్టుట, అలంకరించుట, ఎద్దులతో బరువులులాగు పందెములు వేయుట, మొదలగు వేడు

కలు జరగుచుండును. అందువలననే యీ గంగజాతరకు "ఆవుల పబ్బ" మని పేరు వచ్చినది. కాని ఆవుల పబ్బము వేరు, గంగజాతర వేరు అని రాయలసీమ లోని పెద్దలు కొందరు చెప్పుచున్నారు. ఆవులపబ్బము యాదవులు మాత్రమే చేయు వేడుక యనియు, గంగజాతరను ఏ కులమువారైనను చేయవచ్చుననియు వీరి అభిప్రాయము.

నేడు రాయలసీమలో ఆవులపబ్బ మను పేర పిలువబడునదే పూర్వకాల మున ''ఆవుల పరుపు" గా వ్యవహరింపబడుచున్నదని తెలియుచున్నది. కడప జిల్లా సిద్ధవటము కైఫీయతులో (క్రీ. శ. 1800 ప్రాంతము) ఈ ఆవులపరుపును గూర్చి సమగ్రముగా నున్నది.[100] కాటమరాజు నల్లసిద్ధితో చేసిన యుద్ధమున మరణించిన ఆవుల యాకృతులను శిలలపై జెక్కించి, ఒకప్రదేశమున నుంతురు. ఈ ప్రదేశమునకు 'ఆవుల మాలె" అనిపేరు. నిజముగా ఆనాడు మరణించిన ఆవుల పుఱ్ఱెలను శృంగ సహితముగా కాపాడుకొనుచు వచ్చిన కుటుంబములుకూడ కొన్ని కలవట. వీనిని "దేవరావులు" అందురు. ఈ పండుగనాడు ఆ పుఱ్ఱెలను కూడ దెచ్చి, కొమ్ములకు పసుపుఁాసి పూజింతురు. ఈ సంబరమును జరపు యాదవులలో 'కాటమరాజు పాంగెస్తులు" అనువారు కలరు. వీరికి 'తానకములు' అనునవి కలవి. వెల్లెద్దు తానకము, బొల్లెద్దు తానకము, బోడెద్దు తానకము, కఱ్ఱెద్దు తానకము, పైయెద్దు తానకము- మొదలగు రీతిని, పెక్కుతానకములు గలవు. వీరణములు వాయించుచు నొక్కొక్క తానకమును పాడునప్పుడు, ఆ తానకమునకు సంబంధించిన పాంగెస్తులకు శివమెత్తును. తానకమనగా పరాక్రమ వర్ణన. వెల్లెద్దు తానకమనగా వెల్లెద్దు పరాక్రమమును దలచి, అది మేయుట, నీరు త్రాగుట, గంతులు వేయుట, యుద్ధమున అదిచూపిన పరాక్రమము మొదలగు నవి వర్ణించుచు పాడగా, ఆ తానకము నాశ్రయించి యుండు పాంగెస్తులకు పూనకము వచ్చును.

ఈ తానకములు ఆవులకు ఎద్దులకు మాత్రమే కాక, యాదవ వీరులకును గలవు. అట్టివి నాలుగు తానకములున్నవి. (i) కాటమరాజు తానకము, (ii) భక్తిరన్న తానకము, (iii) బాలరాజుల తానకము, (iv) పల్లికొండ

100. చూ. కాటమరాజు కథ, మల్లంపల్లివారి పీఠిక, పుట xxxiv

తానకము. వీనిలో ఆయా వీరుల పరాక్రమము, వారు యుద్ధమున నోరగిన తీరు వర్ణింపబడును. ఆయా వీరగాథలలోని పంక్తులే తానకములుగా నుపయోగింప బడుచుండును. ఉదాహరణమునకు బాలరాజుల తానక మిట్లుండును:

"ఎత్తివచ్చిన బాణాలు బాలరాజులకు ఎదమందు నాటినాయి
జారివచ్చిన బాణాలు బాలరాజులకు జబ్బలను నాటినాయి
తుపాకి వేట్లకు తునక తునక లాయె"

ఈ నాలుగు తానకములును రెండు ప్రధాన భాగముల క్రిందికి వచ్చును. కాటమరాజు తానకము, భక్తిరన్న తానకము—ఈ రెండును 'వల్లవుల తానకములు' లేక 'రాజుల తానకములు'. బాలరాజుల తానకము, పల్లికొండ తానకము-ఈ రెండును 'స్తిరమందుల తానకములు' లేక 'ప్రధానుల తానకములు'. వీరణములు వాయించుచు రాజుల తానకములు పాడునప్పుడు రాజులకును (వల్లవులకును), ప్రధానుల తానకములు పాడునపుడు ప్రధానులకును (స్తిరమందులకును) శివమెత్తును. వారు పూనకముతో నూగుచు గంతులు వేయుదురు. ఇట్లు శివమెత్తిన వారి చెవికడ కొమ్ములు హోరున ఊదబడుచుండును. వీరణములు ఫెళ ఫెళ వాయింపబడును. ఈ భయంకర శబ్దముల నడుమ పొంగెస్తుడు శివమెత్తి నృత్యము చేయుచుండును. వీరద్రాళ్ళతో నాతని కాలుసేతులపై కొట్టు చుందురు. దానిచే పూనకము మరింత హెచ్చును, ఈ పూనకము నాపుటకు యాదవుల హరిగురువైన పల్లికొండమీద, శివగురువైన భక్తిరన్న మీద, విష్ణుస్వరూపిణియగు బొల్లావు మీద ఆనలు పెట్టుదురు.

"హరిగురువు పల్లికొండ పాదమాన
శివగురువు భక్తిరన్న పాదమాన
బొల్లావు పాదమాన! చిరంజీవి! చిరంజీవి!" అందురు.

అప్పుడు ఆ తానక మెక్కినవానికి పూనకము తగ్గును. తాండవ మాగిపోవును. ఈ తానకములు గంగ దొనకొండలో నేటికిని పాడబడుచున్నవి.

రాయలసీమలో కర్నూలు మండలమున కోవెలకుంట్ల తాలూకా పెదయమ్మనూరు గ్రామమున జరగు గంగ తిరునాళ్ళలో గూడ తానకములు పాడబడును.

కానీ యిక్కడి తానకములలో నొక వింత పద్ధతి యున్నది. గంగతిరునాళ్ళ రాత్రి "గంగ-కాటమరాజు తరకవాదము" కథను పాడింతురు. ఆ కథలో గంగ వేషము వేయువాడు ముందుగా వేషముతో నూరంతయు దిరుగును. తానకము లున్న ఆయా గోత్రముల గొల్లలు గోవులవలె చేతులతోను కాళ్ళతోను నేలపై ప్రాకుచు గంగవేషమున కడ్డుగా వత్తురు. ఈ వింత గోవున కొక చెవిలో కొమ్ము నూదుచు, మరియొక చెవిలో గోత్రమును దెప్పుదురు. అప్పుడా'యావు'నకు పూనకము వచ్చును. గోత్రము సరిగా జెప్పినచో నా'యావు' గంగవేషము వెను కనే పోవును. తప్పు చెప్పినచో దూరముగా పారిపోవును. ఈరకపుటావులకు ముందు ఎవ్వరును కాలిజోడు తొడగరాదు, అట్లు తొడిగినవారిని ఈ 'వింత గోవులు' క్రుమ్మివేయును. ఈ విధమగు తానకములు రాయలసీమలో మాత్రమే కలవని భావించుచున్నాను.

'ఆవుల పరుపు' శబ్దమునకు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'ఆవులకు సంబంధించిన వేడుకలు జరుగు ప్రదేశము' అనియర్థము చెప్పిరి. "పరుపు" శబ్దము తప్పనియు. అది "పరపు"గా నుండవలెననియు, అప్పుడు "పరపు" నకు "ప్రదేశము" అనునర్థము వచ్చుననియు వీరు తలంచిరి

"ఆవుల పరుపు" అను పేరుతో నొక ప్రత్యేక వీరగాథ కలదని తెలియ వచ్చుచున్నది. దీనిని డా॥ బి. రామరాజుగారు, డా॥ నాయని కృష్ణకుమారిగారు సంపాదకత్వము వహించిన 'జానపదగేయాలు-సాంఘిక జీవనము' అను గ్రంథ మున చూడవచ్చును.

## 32. వీరబోనము :—

ఇది గంగతిరునాళ్ళలో జరగు మరియొక ఆచారము. కాటమరాజువారివృక్ష మున ఖడ్గతిక్కనతో పోరి మరణించిన "తంబళ్ళ బ్రహ్మరుద్రయ్య" అను శివ బ్రాహ్మణునకు యాదవులు చేయు గౌరవమే వీరబోనము. 'ఈర్ల మాను' (వీరుల మాను = జమ్మిచెట్టు) క్రింద బ్రహ్మరుద్రయ్య పేర యజ్ఞము చేసి, జంధ్యములు వేసికొని, వేటలుకోసి, ముద్దలెగురవేయుదురు. సోలెడుగిద్దెడు బియ్యము, దక్షిణ, తాంబూలము, కొబ్బరిగిన్నె, వేటలు కొమ్ములవాని కిత్తురు.

## 33. వీరులు-వీర భూములు :-

వీరగాథలలో ఎక్కువభాగము యథార్థసంఘటనలు కాబట్టి యీ చారిత్రక సంఘటనా సంబంధములగు అవశేషములు దేశమున అచ్చటచ్చట కానవచ్చు చున్నవి. ముఖ్యముగా పల్నాటి వీరకథలకును, కాటమరాజు కథలకును సంబంధించిన వీరుల విగ్రహములు, గుడులు, రణభూములు నేటికిని స్థలజ్ఞులు వర్ణించి చెప్పుచునే యున్నారు. వీనిలో కొన్ని గ్రామీణుల అభూత కల్పనగా భావించినను, వీరుల విగ్రహములు, గుడులు వంటి చారిత్రకావశేషములను సత్యములుగా నమ్మక తప్పదు. ఆయా వీరుల యొక్కయు, వీరభూముల యొక్కయు, వీరగాథలలో వచ్చు శక్తులయొక్కయు అవశేషములను నేను దర్శించి, వాని ఛాయా చిత్రములను దీసి భద్రపరచితిని. అందు కాటమరాజు కథలకు సంబంధించిన వీరులను, వీరభూములను కొంత పరిచయము చేయుదును.

(i) గంగ దొనకొండ ;

అయితమరాజాదులు పాలించిన దొనకొండ నేడు ప్రకాశంజిల్లా. దర్శి తాలూగాలో 'గంగ దొనకొండ' అను పేరుతో నున్నది. (రైల్వే స్టేషనున్న దొన కొండకు "రైల్వే దొనకొండ" అని పేరు. ఇది ఆధునికమైనది). గంగదొన కొండ పొట్లపాడు రైల్వేస్టేషనుకు ఆగ్నేయదిశగా మైలుదూరములో నున్నది. ఇట యాదవులు పూజించిన గంగగుడి. అందు పెద్ద విగ్రహము, పాపనూక ఒంటి స్తంభపు మేడ, అగుమంచిబావి, యాదవరాజుల శిలా విగ్రహములు, అయితమరాజు కోట శిథిలములు మున్నగు చారిత్రక స్థలములు గలవు. గంగ గుడిలో యాదవరాజుల శిలాశాసనములు గలవు.

గంగదొనకొండ గ్రామము నేడు "ప్రాత దొనకొండ", "క్రొత్త దొన కొండ' అని రెండు భాగములుగా నున్నది. గంగగుడి ప్రాత దొనకొండకు దక్షిణముగా రెండు ఫర్లాంగులలో, క్రొత్త దొనకొండకు పడమరగా నున్నది. ఈ గంగగుడికి దక్షిణముగా ఆరు ఫర్లాంగుల దూరములో పాపనూక మేడ శిథిలములున్నవి. ఈ శిథిలములలో సుందరమైన పాపనూక విగ్రహమొకటి లభించినది. దీనిని గంగగుడిలో భద్రపరిచినారు.

పాపనూక మేడకు పశ్చిమముగా రెండువందల గజముల దూరములో నొక చిన్న కొండ యున్నది. దీనికి 'పెయ్యల తిప్ప' అనియు 'ధనముకొండ' అనియు పేళ్లు. ఈ పర్వతమునకు తూర్పు భాగమున అయితమరాజు పాలించిన దొనకొండ పట్టణము వ్యాపించి యుండెడిది. ఆ పట్టణ శిథిలములు నేటికిని గాన వచ్చుచున్నది.

పాపనూక మేడకును పెయ్యల తిప్పకును మధ్యలో యాదవరాజుల కూటము లున్నవి. అయితమరాజు కూటము, పుత్తమరాజు కూటము, పోచయ్య కూటము, ఎఱ్ఱయ్యకూటము, కటియావుల రాజు కూటము, పోలినీడు కూటము— వరుసగా నున్నవి. ఈ కూటములన్నియు కాలిపోయి చిట్టెముకట్టిన రాళ్లగుట్టలుగా నేడు ప్రత్యక్షమగుచున్నవి.

పాపనూక మేడకు దక్షిణముగా నొక ఫర్లాంగు దూరములో నొక చిన్న కుంట యున్నది. దీనికి 'పాలకుంట' యని పేరు. యాదవుల లేగ దూడలు పాలు త్రాగుచుండగా కారిన నురుగు ఇట్లు కుంటగా పరిణమించెనని చెప్పుదురు.

ధనముకొండకు 'పెయ్యల తిప్ప" అని పేరు వచ్చుటకు కారణమున్నది. ఈ కొండకు ఆవలవైపున ఆలమంద యుండెనట. లేగలన్నియు ఈవలి వైపున పాలకుంటదగ్గర నున్నవి. ఈ లేగలు అరువగా ఆలమందయంతయు ధనుముకొండ పర్వతము మీదికి దాటివచ్చి, లేగలకు పాలిచ్చినవట. వాని నడకతో ఆ పర్వతముమీద నొక "కురువ' (త్రోవ) యేర్పడినది. దానిని 'ఆవుల కురువ' యని నేటికిని పిలుతురు. ఆవుపెయ్యలు దాటిన కొండ కావున దీనికి "పెయ్యల తిప్ప" యని పేరు వచ్చినది.

ఈ పెయ్యల తిప్పలో నొక గుహ యున్నది. దీనిగుండా భక్తిరన్న కాశికి బోయెనని చెప్పుదురు. ఈ గుహకు "బత్తిరన్న గవి" అని పేరు.

ఈ పెయ్యల తిప్పపై దక్షిణమువైపున ఒక చిన్న గుట్టపై నొక నల్లని నున్నని రాయి కలదు. ఇది మూడు గజముల వెడల్పున గుండ్రముగా నున్నది. పంచలింగాలకొండ యుద్ధములో యాదవులు మరణించుటను ఇచ్చటనుండి గమ

నించిన గంగమ్మ దుఃఖించినదట. ఆమె కన్నీరు ఈ బండపై పడినదట. అందుచే ఈ బండకు "కన్నీరు బండ'' యని పేరు వచ్చినది. ఈ బండ నేటికిని నిగనిగ మెరయుచు ఈగ వ్రాలినచో జారిపోవునటులున్నది.

గంగగుడిలో యాదవరాజుల విగ్రహములు, శక్తుల విగ్రహములు గలవు. ఈ గుడికి పశ్చిమముగా నొక బొడ్డన బావియున్నది. దీనికి ''అగుమంచి బావి" యనిపేరు. దీనిని అగుమంచి త్రవ్వించెనట. దీనియొడ్డున నొక పాలరాతి శివలింగ మున్నది. ఇది అగుమంచి పూజించిన శివలింగము.

ఈ అగుమంచి బావికి వాయవ్యముగా 'నందుల చెరువు' గలదు. భక్తి రన్న కాశినుండి మేఘరథముమీద వచ్చి, యీ నందుల చెరువు గట్టున దిగి శంఖము పూరించినాడని చెప్పుదురు.

గంగగుడికి దక్షిణముగా రెండు ఫర్లాంగుల దూరములో నొక శివాలయము గలదు. దీనికి 'ఓరుగంటి శంభుడు' అనిపేరు. పల్లికొండ, అయితమ రాజు, కటియావులరాజు మువ్వురువారు బేతాళుని జయించి ఓరుగల్లునుండి తిరిగి వచ్చుచుండగా ఈ శివలింగము వారి పల్లకీల వెంట దొరలుచు వచ్చెనట. ఇది తెల్లని పాలరాతి లింగముగా గన్పట్టుచున్నది.

గంగగుడిలో బేతాళుని విగ్రహము కూడ కలదు. యలమంచినుండి యీ గంగను దెచ్చి యాదవులిచ్చట ప్రతిష్ఠించిరని చెప్పుదురు. యాదవకాంతలు సహగమనము చేసిన అగ్నికుండము ఈ గుడిలో నున్నది. దాని సమీపమున చంపుడు కట్టపై అగుమంచి పాద చిహ్నములున్నవి.

2. పంచలింగాల కొండ – ఎఱ్ఱగడ్డపాడు :-

కనిగిరి నుండి కందుకూరు పోవు మార్గములో పెద అలవల పాడు గ్రామము దాటిన తరువాత పంచలింగాల కొండ, ఎఱ్ఱగడ్డపాడు, పాలేరు వచ్చును. పంచలింగాల కొండకు తూర్పు భాగమునను, ఉత్తర భాగమునను

కాటమరాజు కోట వ్యాపించియున్నది. పశ్చిమ భాగమున నేరెళ్ళవాగు ఉత్తర ముఖముగా ప్రవహించుచు పాలేటిలో కలియుచున్నది. పంచంగాల కొండపై శివాలయమున్నది. కొండ చరియలో పోలురాజు విగ్రహమున్నది. కొండ దిగువను కోటలో కాటమరాజు సింహాసనమున్న 'తమకము చింత', అతడు గుడారము వేసికొనిన 'గుడారు గుట్ట' కలవు.

పంచలింగాల కొండకు ఉత్తరముగా రెండు ఫర్లాంగుల దూరములో పశ్చిమము నుండి తూర్పు దిశగా పాలేరు ప్రవహించుచున్నది. ఈ పాలేటి దక్షిణ తీరమంతయు ఎఱ్ఱగడ్డపాడు. కాటమరాజు గంగతో తర్కవాదము చేసిన ప్రదేశ మిచ్చటనే కలదు. ఈ పాలేటి మధ్యనగల పెద్ద పెద్ద గుండు రాళ్ళపై గంగ విగ్రహము, బీరినీని విగ్రహము చెక్కబడియున్నవి. గుండుపై చెక్కబడిన గంగకావున ఈమెను 'గుంటి గంగ' యందురు. ఈ పాలేటి మధ్యలో రెండు చిన్న గుండు రాళ్ళున్నవి. వీనిని 'కల్లిగుండ్లు' అందురు. ఇచ్చట గంగతిరునాళ్ళలో 'భట్టు రాయబారము' కథను పాడుదురు.

ఈ పాలేటి యొడ్డున గంగగుడి కలదు. ఇది అర్వాచీనమైనది. ప్రాచీనమైన గుడి దీనికి ఉత్తరముగా నొక ఫర్లాంగు దూరములో నుండెడిదట. పాలేరు పొంగి అదినాశనమైనదట. ఈ క్రొత్తగుడికిని ప్రాతగుడికిని మధ్య ఒక పాలేటి పాయవచ్చి నేరెళ్ళ వాగుతో కలియుచున్నది. ఈ పాయ, యుద్ధమునమరణించిన యాదవుల రక్తముతో నేర్పడినదని చెప్పుదురు. అందుచే దీనిని 'రకత కాలవ' అని పిలుతురు.

'ఎఱ్ఱగడ్డపాడు' అనునది ఊరుపేరు కాదు. ఇక్కడ ఏపల్లెయు నేడు కానరాదు. పూర్వముండెడిదేమో తెలియదు. ఇది యాదవులు యుద్ధము చేసిన ప్రదేశము. 'యాదవులు చెల్లింది ఎఱ్ఱగడ్డపాడు' అనువాడుక కలదు. ఈ యెఱ్ఱగడ్డపాడు నేటి ప్రకాశం జిల్లా కనిగిరి తాలూకాలో పెద అలవల పాడు గ్రామమునకు తూర్పుగా రెండుమైళ్ళదూరమున పాలేటియొడ్డున గలదు. దీనికి ఉత్తరమున పాలేరు, దక్షిణమున నేరెళ్ళవాగు - పంచలింగాలకొండ, తూర్పున కాటమరాజు కోట బురుజు, పడమర నేటి గంగగుడి - రకత కాలవ సరిహద్దులని చెప్పవచ్చును. ఈ స్థలమంతయు సుమారొక చదరపుమైలు వైశాల్యమున నుండును.

"యాదవులు చేల్లింది యెఱగడ్డ పాడు" అనియు, ''అల్లివాగు, నేల్లివాగు, నెరా నేరెళ్ళవాగు'ల మధ్యప్రదేశము ఎఱ్ఱగడ్డ పాడనియు యాదవగాథాకారులు చెప్పుచుందురు: ఇచట మట్టి యెఱ్ఱగా నుండుటచే ఈ పేరు వచ్చినదేమో. ఈ యెఱ్ఱగడ్డ పాడునకు దక్షిణముగా అరమైలు దూరమున 'వెంగళాపుర' మను గ్రామము కలదు. పశ్చిమముగా రెండుమైళ్ళ దూరమున 'పెద అలవలపాడు' గ్రామమున్నది.

3. కాటమరాజు విగ్రహములు :-

గంగగుడి యున్నచోట్ల సాధారణముగా కాటమరాజు విగ్రహము కూడ కనబడుచుండును. ఎఱగడ్డపాడులోగల పాలేటి గంగగుడిలో కాటమరాజు, ముమ్మయ్య, పోచయ్య, భక్తిరన్న విగ్రములున్నవి. కనిగిరి సీమలో కాటమ రాజునకు ప్రత్యేకముగా గుళ్లు లేచినవి కూడ. అట మారెళ్ళ ప్రాంతమునందు కాటమరాజు శిలా విగ్రహమున్నదని తెలియుచున్నది.

4. ఏనూతల కాటమరాజు :-

కర్నూలు జిల్లా, కంభంతాలూకాలో రాజమలారణ్యమున కాటమరాజు దేవాలయమొకటి కలదు. ఇందు కాటమరాజు విగ్రహమును గంగవిగ్రహమును గలవు. ఈ రెండు విగ్రహములకు మధ్య ఒకరి ముఖమొకరికి కనబడకుండ ఒక మ్రానుకలదు. ఈ మ్రాకును 'ఒకగోగు మాను' అందురు. ఇక్కడి కాటమ రాజును 'ఏనూతల కాటమరాజు' అందురు. ఈ నిర్జనారణ్యమున గల కాటమ రాజు గుడిదగ్గర ప్రతి సంవత్సరమును ఉగాదికి గొప్పతిరునాళ్లు జరగును.

5. గూబగుండం బావి :-

పై ఏనూతల కాటమరాజు గుడి సమీపమున ఒక బావి కలదు. దీనిని 'గూబగుండం బావి' అందురు. ఇది ఈశ్వరుడు తన గజాశూలమును భూమిలో దించి, గడ్డ పెల్లగించి త్రవ్విన బావి యని జన శ్రుతి. ఈ ప్రాంతమందు కాటమ రాజు తన ఆలమందను మేపుచుండగా, నొకప్పుడు ఆవులు నీళ్లులేక అల్లాడిన వట. ఆయావుల బాధచూడలేక కాటమరాజు తన గజాశూలమును ఆకాశమునకు

వీసరి ఎదురొమ్ము నొడ్డినాడట. అప్పుడు ఈశ్వరుడు ప్రత్యక్షమై ఆకాశము నుండి పడుచున్న గజాశూలమును బట్టుకొని ఆపి, బావిని త్రవ్వినాడట. ఆ బావి కడ కాటమరాజు ఆలమంద తృప్తిగా నీళ్లు త్రాగి సుఖించినదట.

6. కాటమరాజు సమాధి :-

కనిగిరి సీమలోని పాలేటి తీరములో గొల్లపల్లెకడ కాటమరాజు సమాధి కలదు. అట ప్రతి సంవత్సరమును ఉగాది పండుగ వెడలిన మూడవనాడు 'కాటమరాజు తిరునాళ్లు' విశేషముగా జరగును.

7. జన్నివాడ చదరంగము గుండు :—

నెల్లూరునకు పశ్చిమముగా పెన్న యొడ్డున ఏడుమైళ్ల దూరమున నొక పెద్ద గుండున్నది. దీనికి 'చదరంగము గుండు' అని పేరు. ఆలమందను మేపుచు కాటమరాజు - పద్మరాఘవుడు నిచట చదరంగ మాడిరట. ఇది నేటి జొన్న వాడ గ్రామములోనున్నది. హనుమంతుడు 'వారధి' నిర్మాణమునకై పర్వతము లను దెచ్చుచుండగా నొక పర్వతము జారి క్రింద పడినదట. అదియే యీ గుండని చెప్పుదురు,

8. సర్వేపల్లి మిట్టలు :-

నెల్లూరునకు దక్షిణముగా 'సర్వేపల్లి' యను గ్రామమున్నది. ఇచట సిద్ధి రాజునకు సహాయముగా వచ్చిన సైన్యము నిలిచిన విశాల ప్రదేశము కలదు. దీనిని 'సర్వేపల్లి మిట్టలు' అందురు.

నెల్లూరు మండలమున చాగలకొండ, సోమేశ్వరుని గుడి, తిక్కనపాడు మున్నగునవి ఖడ్గతిక్కనకు సంబంధించిన వీరభూములు.

## 34. 'గొల్ల' - 'యాదవ' శబ్దములు ;

'గొల్ల' శబ్దము వృత్తి వాచకమనియు, 'యాదవ' శబ్దము కుల వాచక మనియు రాజవంశ ప్రదీపికలో నిరూపింపబడినది. యాదవులు చంద్రవంశ క్షత్రియులనుటలో సందేహము లేదు. కాని వీరికి 'గొల్లవారు' అను పేరుకూడ

చాల కాలము నుండి వ్యాప్తియందున్నది గొల్ల శబ్దము సచ్ఛూద్రకుల సూచకము. క్షత్రియునకు కాపు స్త్రీయందు జనించినవాడు గొల్లయని పరాశరస్మృతిలో గలదు. కాబట్టి గొల్లశబ్దమును యాదవ పరముగా వాడరాదని నేడాకులమువారు అభ్యంతరము చెప్పుచున్నారు.

గోవులను పాలించువారు 'గోపాలురు'. ఈ 'గోపాల' శబ్దమే 'గొల్లగా' మారియుండును: గోపాల > గో ఆల > గోల > గొల్ల. లేదా వీరికి గొఱ్ఱెలున్న గుఱంతువులుండుటచే 'గొఱ్ఱెలవారు' అని పిలువబడి, అదే కాలక్రమమున గొర్లవారు > గొల్లవారుగా మారియుండును. గోపాల శబ్దమునుండి పుట్టినదనుటయే ఎక్కువ సమంజసము. ఏలన తెలుగు భారత భాగవత కాలములనుండియు ఈ గొల్ల శబ్దము కనబడుచున్నది. యాదవులకు పూర్వకాలమున గోగణమే ప్రధానముగా నుండెడిది. ఆధునిక కాలమున వీరికి గోగణము లేదు. గొఱ్ఱెలు మేకలు నున్నవి. ఏది వ్యుత్పత్తిక్రమమైనను, యాదవులకు గొల్లశబ్దము వృత్తి వాచకమనుటలో సందేహము లేదు.

కాని నేడు యాదవులేకాక కొందరు నిమ్న కులములవారును గొల్ల శబ్దముచే పిలువబడుచున్నారు. వీరికి గొల్ల శబ్దము కులవాచకమనియే చెప్పవలసి యున్నది. నేడు పండ్రెండు రకముల గొల్లలున్నారని జానపద వ్యవహారమును బట్టి తెలియుచున్నది: 'పూజగొల్ల, ఎఱ్ఱగొల్ల, పూనాటిగొల్ల, గుజరాజుగొల్ల, వెయ్యగొల్ల, పెయ్యగొల్ల, కురపగొల్ల, ముష్టిగొల్ల, సజ్జనపుగొల్ల, పెద్దిటిగొల్ల, కర్ణగొల్ల, రాచగొల్ల,' రాజవంశ ప్రదీపికలో ఎనిమిది రకముల గొల్లలు మాత్రమే పేర్కొనబడినారు (పూరిగొల్ల, పూజగొల్ల, ఎఱ్ఱగొల్ల, పూనాటిగొల్ల, వృష్టిగొల్ల, కర్ణగొల్ల, మందగొల్ల, కురుపగొల్ల). ఈ వివిధ శాఖలలో ఎఱ్ఱగొల్లలందరి కన్నను గొప్పవారని చెప్పబడుదురు. (కాటమరాజు కథలలో వచ్చు వల్లవులును యదువంశక్షత్రియులును వీరే కావచ్చును. తక్కిన వారిలో చాలమంది నిమ్న కులముల వారుగనే కన్పట్టుదురు. ఉదాహరణమునకు పెద్దిటి గొల్లలు పాములను పట్టుకొని జీవింతురు)

'గొల్ల' శబ్దము అచ్చమైన తెలుగు శబ్దమనియు, 'యాదవ' శబ్దము దానికి సంస్కృతీకరణమనియు నాయభిప్రాయము. వర్తమాన కాలమున మా ॥

మాదిగల వంటి వెనుకబడిన కులములవారి వలెనే యాదవులందును, ఆత్మన్యూనతా భావము (Inferiority complex) ప్రబలినది. అందుచే 'గొల్ల' శబ్దమును తెలుగుభాష నుండి బహిష్కరింపవలెనని యత్నించుచున్నారు. ఇది విచారింపదగ్గ విషయము; ఒక విధముగా భాషకు అపచారము. శబ్ద ప్రయోగము జాతికి జన్మ హక్కు. 'బాపడు, రాచవాడు, కోమటి, గొల్ల, కంసాలి, ఈడిగ, చాకలి, మంగలి, మాల, మాదిగ'–మొదలగు శబ్దములు సిసలైన తెలుగు శబ్దములు. "వీనిని ప్రయోగింపరాదు, వీనికి బదులు మేము కృత్రిమముగా సృజించిన "బ్రాహ్మణ, క్షత్రియ, ఆర్యవైశ్య, యాదవ, విశ్వబ్రహ్మణ, సెట్టిబలిజ, రజక, నాయీ బ్రాహ్మణ, హరిజన, ఆదియాంధ్ర' ఇత్యాది సంస్కృత శబ్దములనే ప్రయోగింపవలెను" అని శాసించుట ఏసంఘమునకును సమంజసము కాదు. పైన తెల్పిన అచ్చ తెలుగు శబ్ద ప్రయోగముతో ఆయా కులముల వారిని కించపరచి నప్పుడే తప్పగునుకాని, అసలా శబ్ద ప్రయోగమునే చేయరాదనుట తెలుగు నుడికారమునకు అపకారము చేయుట తప్ప వేరుకాదు.

వెనుకబడిన యాదవులను సంఘటితముచేసి వారి అభ్యుదయమునకు తోడ్పడుచున్న ఆంధ్రప్రదేశ్ యాదవ సంఘము వారి కృషి (శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య, శ్రీ జంగిట బాలయ్య యాదవ మున్నగువారి కృషి) మాత్రము ప్రశంసింపదగినది.

## 35. నాకు లభించిన తాళపత్ర గ్రంథముల వివరములు:-

1. ఆవుల వలురాజు కథ :

గుంటూరు జిల్లా, పల్నాడు తాలూకా, గామాలపాడు గ్రామములో 1966 ఆగష్టు 31వ తేదిని లభించిన తాళపత్ర గ్రంథము. మిత్రులు శ్రీచిటి ప్రోలు కృష్ణమూర్తిగారి సహా యముతో దమ్మాలపాటి లింగప్ప అను యాదవుని దగ్గర తీసికొంటిని. ఇందు శైథిల్యము కలదు. వ్రాత తప్పులు హెచ్చు. ఆకు పొడవు 15 అంగుళములు, వెడల్పు 1.6". మొత్తము 45 ఆకులున్నవి. ఒక్కొక్క పుటలో 6 పంక్తులున్నవి. ద్విపదచ్ఛందము, సమగ్రము.

2. వేంపాద్రి కథ :

(a) కుచ్చికాయల పూడి ప్రతి :

కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, కుచ్చికాయల పూడిలో 5-9-1964 న, కొడాలి సీతారామాంజనేయులు అను కొమ్మలవానికడ లభించిన తాళపత్ర గ్రంథము. ఇందు శైథిల్య గ్రంథ పాతములు లేవు. ఒక్కొక్క పత్రము పొడవు—14.2", వెడల్పు—1.2". మొత్తము 89 పత్రములున్నవి. ఒక్కొక్క పుటలో 6 పంక్తులున్నవి. సమగ్రము. కాని కవిపేరు లేదు. అందు 1 నుండి 31 వరకును గల ఆకులలో పంపాద్రికథయు, 32 నుండి 89 వరకును గల ఆకులలో పెద్దిరాజు కథయు వర్ణింపబడినవి.

(b) దొనకొండ ప్రతి :

ప్రకాశం జిల్లా, దర్శితాలూకా, గంగ దొనకొండ గ్రామమున 1966 సెప్టెంబరు 12వ తేదిని పూజారి సుబ్బయ్య (70 సం.లు) అను వృద్ధ యాదవ గాథాకారుని యొద్ద లభించిన తాళపత్ర గ్రంథము. శైథిల్యము లేదు. వ్రాత స్పష్టముగా నున్నది. కుచ్చికాయలపూడి ప్రతికంటె రచన భిన్నమైనది, అసమగ్రము. అయినను అవతారికలో కవిపేరు 'మల్లయ్య' అని స్పష్టముగా నున్నది. మొత్తము పత్రములు-48. కొలతలు=14.8" × 1.4" ఒక్కొక్క పుటలో ఆరు పంక్తులున్నవి.

3. పోలురాజు కథ :

ప్రకాశంజిల్లా, దర్శితాలూకా 'ఎట్టబాలెము' గ్రామములో 17-9-1966న మోడి మునలయ్య అను పూజగొల్లని కడ లభించిన తాళపత్ర గ్రంథము. సమగ్రము. శైథిల్య గ్రంథ పాతములులేవు ఆకు పొడవు—12.3" వెడల్పు—1.1" మొత్తము ఆకులు 69. ఒక్కొక్క పుటలో 6,7 పంక్తులున్నవి. అవతారికలో కవిపేరు కనకబండి ఘట్టయ్య అని కలదు.

ఈ పోలురాజు కథకు మరి రెండు తాళపత్ర గ్రంథములు కూడ లభించినవి. ఒకటి కనిగిరి తాలూకాలోని కంకణంపాడులో తాళ్లూరి కోటయ్య అను కొమ్ములవాడు ఇచ్చిన ప్రతి (16-9-1966.) కొలతలు—13.6" × 1.5" పత్రములు—63. పుటలో పంక్తులు—7. ఇందు ఆద్యంతములు సరిగా లేవు.

అవతారిక లేదు. వ్రాత నిండుగా తప్పులున్నవి. చివరలో ఒకటి రెండు పాదములు లోపించినట్లున్నది,సర్వసమగ్రము కాకపోయినను సమగ్రమే. పైన తెల్పిన ఎల్లబాలెముకన్నను భిన్నమైనదిగా కన్పట్టుచున్నది. ఇది వేరొక కవి రచన కావచ్చును. కాని దురదృష్టవశమున ఆకవి పేరు కానవచ్చుటలేదు. ఇది నాలుగు కాండలు (చాటువలు)గా నున్న పెద్దకథ.

పోలురాజు కథకు సంబంధించిన మరియొక తాళపత్ర గ్రంథము కృష్ణా జిల్లా, గుడివాడ తాలూకా. కుచ్చికాయలపూడి గ్రామములో 5-9-1964న కొడాలి సీతారామాంజనేయులు అను కొమ్ములవానికడ లభించినది. ఇది బహుదుష్టముగా, దురవగాహముగా నున్నది. పత్ర సంఖ్య గుర్తింపబడలేదు. ఆద్యంతములులేవు.

## (4) కటియావుల రాజు కథ :

గుంటూరు జిల్లా, పల్నాడు తాలూకా, గామాలపాడు గ్రామములో దమ్మాలపాటి వెంకన్న కుమారుడు లింగప్ప అను యాదవుని కడ 31-8-66న లభించిన తాళపత్ర గ్రంథము. శైథిల్యము కలదు. అయినను సమగ్రము. ఆకు కొలతలు—12.6" × 1.2". మొత్తము ఆకులు—34. పుటలో పంక్తులు 6. ఛందస్సు మంజరీ ద్విపద. అయినను అచ్చటచ్చటశిథిలమైఖండగతితోచుచున్నది. అందుచే మధ్య మధ్య హరి హరీ పదముల జంపె వరుసయాయను అనుమానము వచ్చుచున్నది. ఇందలి వృత్తము ప్రత్యేకమైనది. దీనిని "ముగ్గురు మాష్టీల కథ" యందురు. దీని కవి పినయెల్లన.

చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, పెదకంటి పల్లెలో కటియావులరాజు కథకు సంబంధించిన వేరొక తాళపత్ర గ్రంథము లభించినది. తోడేటి సుబ్రహ్మణ్యమను కొమ్ములవాడు 1-3-1966న నాకిచ్చినాడు. ఇది పై కథకంటె కొంచెము భిన్నమైనది. దీనిని "ఒంటి మాష్టిని కథ' అందురు. ఇందలి ఛందస్సు ఖండగతిలో నున్నది. ఆ ఖండగతి కూడ బింకముగాలేదు, ఇందు అవతారికా భాగమును, కథాప్రారంభమున కొంత భాగమును లేవు. తక్కినదంతయును సమగ్రముగనే యున్నది. అందుచే దీని కవి యెవరో తెలియవచ్చుటలేదు.

(5) కాటమరాజుకు పట్నం కట్టిన కథ :

5-9-64న కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, కుచ్చికాయలపూడి గ్రామములో కొడాలి సీతారామాంజనేయులు అను కొమ్ములవాని కడ లభించిన తాళపత్ర గ్రంథము శైథిల్య గ్రంథపాతములు లేని చక్కని ప్రతి. కవి కట్టెబోయిన మారయ్య. 75 పత్రములు కలవు. పుటకు 6 పంక్తులు. ఆకు కొలతలు 13.7" × 1.1". సమగ్రము. వ్రాతలో తప్పులు హెచ్చుగానున్నవి. ఈ కథ జుజ్జవరపు రామయ్య కుమారుడు చింతయ్యచే — శోభకృతునామ సంవత్సరము ఫాల్గుణ బహుళ షష్ఠి సోమవారము వరకు వ్రాయబడినది.

(6) పాపనూక కథ :

(ఎ) పెదకంటిపల్లె ప్రతి :

చిత్తూరుజిల్లా, చంద్రగిరి తాలూకా, పెదకంటిపల్లె 1966 జూలై 19వ తేదిని తోడేటి సుబ్రహ్మణ్యము అను కొమ్ములవానికడ లభించిన తాళ పత్ర గ్రంథము. పుటకు అయిదారు పంక్తుల చొప్పున 80 పత్రములున్నవి. ఆకు కొలత — 15" × 1.3", కథ సమగ్రముగా కలదు. వ్రాత దుష్టము. అయినను స్పష్టము. ప్రారంభమున కొంత ప్రాసనియతి కలదు. తరువాతలేదు. కొన్ని తావుల మంజరి శిథిలమై ఖండగతిగా మారినది.

(బి) కుచ్చికాయలపూడి ప్రతులు :

కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, కుచ్చికాయలపూడిలో 5-9-1964న కొడాలి సోమయ్య యను కొమ్ములవానికడ లభించిన తాళపత్ర గ్రంథము. ఒక్కొక్క పుటలో అయిదారు పంక్తుల చొప్పున 62 పత్రములున్నవి ఆకు కొలతలు — 13.8" × 1.2". కథ సమగ్రముగానున్నది. వ్రాత మాత్రము దుష్టముగనున్నది. పైన తెల్పిన పెదకంటిపల్లె ప్రతికిని దీనికిని ఏమియును భేదములేదు.

ఇదే గ్రామమున వేరొక ప్రతికూడ లభించినది. అందు పుటలో అయిదు పంక్తుల చొప్పున 54 ఆకులున్నవి. ఆకు కొలతలు — 15.8" × 1.4". ఇందలి

రచన పైరెండింటిని పోలినదేకాని భిన్నమైనదికాదు. వ్రాత మిక్కిలి దుష్టమును అస్పష్టమును.

**(7) అగుమంచికథ :**

చిత్తూరుజిల్లా, చంద్రగిరి తాలూకా. పెదకంటిపల్లెలో తోడేటి సుబ్రహ్మణ్యము అను కొమ్ముల వానికడ 1-3-1966న లభించిన తాళపత్ర గ్రంథము. ఒక్కొక్క పుటలో 7 పంక్తుల చొప్పున 63 ఆకులున్నవి. కొలతలు 13" × 1.4". ఇందు మొదటి 42 అకులలో అగుమంచికథ సంపూర్ణముగను, తరువాత 21 అకులలో 'బొల్లావు యుద్ధము' అసంపూర్ణముగను, దాని తరువాత 6 చిన్న ఆకులలో 'బొంగరాలకథ' అసంపూర్ణముగను నున్నవి. ఈ తాళపత్ర గ్రంథ లేఖకుడు తోడేటి పాపయ్య కుమారుడు కోటయ్యయని తెలియుచున్నది. ఇతడీ గ్రంథమును 1891వ సంవత్సరము — నందననామ సంవత్సరము, అవణి నెల 5వ తేదిన వ్రాసినాడట. కాబట్టి ఈతాళపత్ర గ్రంథము 84 సంవత్సరముల క్రిందట వ్రాయబడినదని నిస్సంశయముగా చెప్పవచ్చును.

నేను ఆంధ్రదేశమందలి వివిధ మండలములలో పర్యటించి కాటమరాజు కథలకు సంబంధించిన మొత్తము 36 లిఖిత ప్రతులను సంపాదించితిని. అందు 30 తాళపత్ర గ్రంథములు మిగిలిన ఆరును కాగితపు ప్రతులు. నా సేకరణ వివరములను తరువాతి అయిదు పుటలలో పట్టికారూపమున నిచ్చితిని పరిశీలింపుడు :

# నాకు లభించిన కాటమరాజు కథల తాళపత్ర గ్రంథములు

| నెం. | వీరగాథ పేరు | జిల్లా | తాలూక | గ్రామము | లభించిన తేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 1. | కంసుడు కథ, లేక విష్ణు భాగవతము | చిత్తూరు | చంద్రగిరి | పెడకంటిపల్లె | 1-3-1966 | శ్రీతోడేటి సుబ్రహ్మణ్యము | శ్రీ M. ధర్మయ్య<br>శ్రీ D. శ్రీరాములురెడ్డి |
| 2. | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 3. | ,, | ప్రకాశం | దర్శి | ఎఱ్ఱబాలెము | 17-9-1966 | శ్రీ మోడి ముసలయ్య | శ్రీ దొనకొండలక్ష్మీకాంత దాసు<br>శ్రీ ఎ. బాల కోటయ్య |
| 4. | ఆవుల వలురాజుకథ | గుంటూరు | పల్నాడు | గామాలపాడు | 31-8-1966 | శ్రీ దమ్మాలపాటి లింగప్ప | శ్రీ చిటిప్రోలుకృష్ణమూర్తి |
| 5. | పంపాద్రికథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 5-9-1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీటి.వి.కె.సోమయాజులు<br>శ్రీ బి. విశ్వేశ్వరరావు |
| 6. | పంపాద్రికథ | ప్రకాశం | దర్శి | గంగదొనకొండ | 12-9-1966 | శ్రీ పూజారి సుబ్బయ్య | శ్రీ దొనకొండ లక్ష్మీకాంత దాసు<br>శ్రీ ఎ. బాలకోటయ్య |

| నెం. | వీరగాథపేరు | జిల్లా | తాలూకా | గ్రామము | లభించిన తేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 7. | పెద్దిరాజు కథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 5-9-1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ టి.వి.కె.సోమయాజులు<br>శ్రీ విశ్వేశ్వరరావు |
| 8. | పెద్దిరాజు కథ | ప్రకాశం | కనిగిరి | కంకణంపాడు | 16-9-1966 | శ్రీ తాళ్ళూరు కోటయ్య | శ్రీ జోసెఫ్<br>శ్రీ యస్. వెంకటశివయ్య |
| 9. | పెద్దిరాజుకథ (కాగితపు ప్రతి) | గుంటూరు | తెనాలి | ఎడవూరు | 25-2-1967 | | శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య |
| 10. | కాటమరాజు ఆర్లపెంట యుద్ధము(కాగితపు ప్రతి) | కృష్ణా | కైకలూరు | పెరికగూడెము | 9-9-1964 | శ్రీ గుజ్జర్లపూడి మస్తాన్ | శ్రీ టి.వి.కె సోమయాజులు<br>శ్రీ బి. విశ్వేశ్వరరావు |
| 11. | పోలురాజుకథ | ప్రకాశం | దర్శి | ఎణ్జబాలెము | 17-9-1966 | శ్రీ మోడి ముసలయ్య | శ్రీ ఎ. బాలకోటయ్య |
| 12. | పోలురాజుకథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 5-9-1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ బి విశ్వేశ్వరరావు |
| 13. | పోలురాజుకథ | ప్రకాశం | కనిగిరి | కంకణంపాడు | 16-9-1966 | శ్రీ తాళ్ళూరు కోటయ్య | శ్రీ రాయల మాలకొండయ్య |
| 14. | బల్లికురువ పోట్లాట | ,, | దర్శి | గంగదొనకొండ | 12-9-1966 | శ్రీ పూజారి సుబ్బయ్య | శ్రీ దొనకొండ లక్ష్మీకాంతదాసు |

| నెం. | వీరగాథపేరు | జిల్లా | తాలూకా | గ్రామము | లభించినతేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 15. | కాటమరాజుకుపట్నంకట్టిన కథ | కృష్ణా గుంటూరు | గుడివాడ | కుచ్చికాయలపూడి | 5-9-1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ బి. విశ్వేశ్వరరావు |
| 16. | కటియావులరాజుకథ | | పల్నాడు | గామాలపాడు | 31-8-1966 | శ్రీదమ్మాలపాటిలింగప్ప | శ్రీచిటిప్రోలుకృష్ణమూర్తి |
| 17. | కటియావులరాజు-కథ | చిత్తూరు | చంద్రగిరి | పెదకంటిపల్లె | 1-8-1966 | శ్రీతోడేటిసుబ్రహ్మణ్యము | శ్రీ యం. ధర్మయ్య |
| 18. | పాపనూక కథ | ,, | ,, | ,, | 19-7-1966 | ,, | శ్రీ డి. శ్రీరాములురెడ్డి |
| 19. | పాపనూక కథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 5-9-1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ బి. విశ్వేశ్వరరావు |
| 20. | పాపనూక కథ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 21. | ఆవులమేపు (కాగితపు ప్రతి) | గుంటూరు | తెనాలి | ఎడవూరు | 16-3-1966 | — | శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య |
| 22. | ఆవులమేపు | ప్రకాశం | దర్శి | గంగదొనకొండ | 12-9-1966 | శ్రీ పూజారి సుబ్బయ్య | శ్రీదొనకొండలక్ష్మికాంతదాసు |
| 23. | గంగతర్కము | కృష్ణా | కైకలూరు | పెరికగూడెము | 9-9-1964 | శ్రీ గుజ్జర్లపూడి చింతాలు | శ్రీటి.వి.కె.సోమయాజులు |

| నెం. | వీరగాథ పేరు | జిల్లా | తాలూకా | గ్రామము | లభించినతేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 24. | గంగతర్కము | చిత్తూరు | చంద్రగిరి | పెడకంటిపల్లె | 1-3-1966 | శ్రీతోదేటిసుబ్రహ్మణ్యము | శ్రీ యం. ధర్మయ్య |
| 25. | గంగతర్కము | ప్రకాశం | దర్శి | గంగదొనకొండ | 12-9-1966 | శ్రీ పూజారి సుబ్బయ్య | శ్రీ ఎ. బాల కోటయ్య |
| 26. | పాలేటికథ | గుంటూరు | పల్నాడు | గామాలపాడు | 31-8-1966 | శ్రీ దమ్మాలపాటి లింగప్ప | శ్రీచిటిప్రోలుకృష్ణమూర్తి |
| 27. | ఎఱ్ఱయ్య తర్కవాదము | కృష్ణా | కైకలూరు | పెరికగూడెము | 9-9-1964 | శ్రీ గుజ్జర్లపూడి చింతాలు | శ్రీటి.వి.కె.సోమయాజులు. |
| 28. | జన్నివాడ కథ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 29. | వేడుక బొంగరాల కథ (కాగితపు ప్రతి) | గుంటూరు | తెనాలి | ఎడవూరు | 16-3-1966 | — | శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య |
| 30. | ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట | చిత్తూరు | చంద్రగిరి | పెడకంటిపల్లె | 19-7-1966 | శ్రీతోడేటి సుబ్రహ్మణ్యము | శ్రీ డి. శ్రీరాములురెడ్డి |
| 31. | అగుమంచికథ | ,, | ,, | ,, | 1-3-1966 | ,, | శ్రీ యం. ధర్మయ్య |
| 32. | ముమ్మయ్య పోచయ్య బొంగరాలు | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 33. | అలుగులపోలు (కాగితపు ప్రతి) | కడప | ప్రొద్దుటూరు | ప్రొద్దుటూరు | 30-4-1966 | శ్రీ శూలం నారాయణ | శ్రీ గంగయ్య |

| నెం. | వీరగాథ పేరు | జిల్లా | తాలూకా | గ్రామము | లభించినతేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 34. | భక్తిరన్న కథ | ప్రకాశం | కనిగిరి | వెంగళాపురము | 15-9-1966 | శ్రీ బొడ్డెబోయిన గంగయ్య | శ్రీ యం.వి. కృష్ణమూర్తి |
| 35. | భక్తిరయ్య కథ (కాగితపు ప్రతి) | గుంటూరు | తెనాలి | ఎడవూరు | 16-3-1966 | — | శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య |
| 36. | భక్తిరన్నకథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 5-9-1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ బి. విశ్వేశ్వరరావు |

## 36. నేను పరిశీలించిన ఇతర అముద్రిత వీరగాథలు :-

(i) శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనా సంస్థవారి లిఖితపుస్తక భాండాగారము, తిరుపతి :

1. వల్లురాజు యుద్ధము—కాగితపుప్రతి — R. No. 642
2. కఱియావుల కాటమరాజు చరిత్రము—కాగితపుప్రతి — No. 6702
3. కాటమరాజు చరిత్ర (భట్టురాయబారము) — కాగితపుప్రతి — D. No. 1041
4. అగుమంచికథ — తాళపత్రప్రతి — R. No. 664
5. అగుమంచి చరిత్ర—కాగితపుప్రతి — No. 1599

(ii) మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము, మదరాసు :

1. కాటమరాజుచరిత్ర ౨ కాగితపుప్రతి — D. No. 1042
2. కాటమరాజు చరిత్ర — తాళపత్రప్రతి — D. No. 1044
3. కాటమరాజుచరిత్ర (భట్టురాయబారము) — కాగితపుప్రతి — D. No. 1043
4. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట — ,, — D. No. 1031
5. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట — ,, — D. No. 1032
6. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట — ,, — D. No. 1033
7. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట — ,, — D. No. 1034

## 37. నేను పరిశీలించిన ముద్రిత వీరగాథలు :-

1. కఱియావుల కాటమరాజు చరిత్రము (పద్యకావ్యము), గుఱ్ఱంకొండ భక్తవత్సలకవి, యాదవ సంఘము, తెనాలి, 1926.
2. కాటమరాజుకథ, (సం.) వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, మదరాసు ప్ర.ప్రా.లి.పు.భాం., 1953

| నెం. | వీరగాథ పేరు | జిల్లా | తాలూకా | గ్రామము | లభించినతేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 34. | భక్తిరన్న కథ | ప్రకాశం | కనిగిరి | వెంగళాపురము | 15-9-1966 | శ్రీ బొడ్డెబోయినగంగయ్య | శ్రీ యం.వి. కృష్ణమూర్తి |
| 35. | భక్తిరయ్య కథ (కాగితపు ప్రతి) | గుంటూరు | తెనాలి | ఎడవూరు | 16-3-1966 | — | శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య |
| 36. | భక్తిరన్నకథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 5-9-1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ బి. విశ్వేశ్వరరావు |

లక్ష్మీకాంతంగారు (1963-65), ఆచార్య జి.యన్. రెడ్డిగారు (1965-68)—

మూడేండ్లపాటు (1964-67) నా వీరగాథల పరిశోధనకు ఆర్థిక సహాయము చేసిన ఉదారులు యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ వారు—

నా పరిశోధనాంశములను తమ "భారతి" లో ప్రకటించి, నన్ను పండిత లోకమునకు పరిచయము చేసిన పూజ్యులు కీ.శే. శివలెంక శంభుప్రసాద్‌గారు—

వీరగాథలను గూర్చి నేను చేసిన కృషిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి దృష్టికి తీసికొనివచ్చిన మాన్యులు శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు-

ఈ కాటమరాజు కథల సంపాదకత్వ బాధ్యతను నా కప్పగించిన దయామయులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు—

సంపాదకత్వమున నాకు చేదోడు వాదోడుగానున్నవారు ప్రియమిత్రులు డా. చన్నాప్రగడ తిరుపతిరావుగారు—

అన్నిటికన్న మిన్నగా, నాకు మిక్కిలి ఓర్పుతో ఈ కాటమరాజు కథా విశేషములను వినిపించి, తమ అమూల్య సంపదయైన తాళపత్ర గ్రంథములను భక్తి విశ్వాసములతో నా కొసంగిన నిర్మల హృదయులు ఆంధ్రప్రదేశములోని వివిధ యాదవ గాథాకారులు—

ఈ కథలను సంతరించుటలో సహకరించి, ఆ మారుమూల పల్లెలలో నాకు అన్నపానాదులు సమకూర్చినవారు అనేక అమృత హృదయులు—

అందరికిని నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతములు.........

తెనుగుగడ్డ వీరగాథల పురిటిగడ్డ!

తెలుగుజాతి వీరరసప్రలుబ్ధ!

ఇక ఈ కాటమరాజు కథలు

నా జాతికి ఆమెతలగు ననుటలో సందియమేమున్నది!

"జ్ఞాన భారతి"
బెంగుళూరు 560056
రాక్షస, భాద్రపద శుద్ధచవితి
-9-1975.

ఇట్లు,
సుధీజన విధేయుడు,
తంగిరాల వెంకటసుబ్బారావు



గంగమ్మ [తిరుపతి]



గంగజాతర చివరిరోజు
బంకమట్టితో
జేయఁబడు
పెద్ద గంగమ్మ
[తిరుపతి]



గంగజాతర [తిరుపతి]



యాదవరాజులు
పూజించిన
దొనకొండ
గంగగుడి
[గంగ దొనకొండ-
ప్రకాశం జిల్లా]



దొనకొండ గంగ గుడిలో నున్న శక్తులు,
యాదవ వీరులు

యాదవ వీరుఁడు
[గంగ దొనకొండ]





యాదవ వీరులు (గంగ దొనకొండ)



పంచలింగాల కొండపై భైరవుని రూపమున వెలసిన
పోలురాజు



ఓరుగంటి భేతాళుడు
[గంగ దొనకొండ]



'పెయ్యలతిప్ప' లేక 'ధనముకొండ' [గంగ దొనకొండ]



'తమకము చింత' – పంచలింగాలకొండ దిగువ
[కాటమరాజు సింహాసన ముండిన ప్రదేశము]



'గుడారు గుట్ట' - తమకము చింత ప్రక్కన
[కాటమరాజు గుడారము వేసికొనిన ప్రదేశము]



గంగతర్కము జరిగిన పాలేటి ఒడ్డు [ఎఱ్ఱగడ్డపాడు]



పాలేటి మధ్య నున్న గుంటి గంగ [ఎఱ్ఱగడ్డ పాడు]



పంచలింగాల కొండ [కనిగిరి సీమ]



కాటమరాజు కోట
[పంచలింగాల కొండపై నుండి దృశ్యము]



పాపనూక ఒంటిస్తంభం మేడ శిథిలములు
[గంగ దొనకొండ]



పాపనూక విగ్రహం
[గంగ దొనకొండ]



దొనకొండ గంగగుడి ఎదురుగా నున్న
'కల్లి అరుగులు' లేక 'రాయబారపు అరుగులు



పాలేటి మధ్య నున్న
వీరనీడు విగ్రహము
చేతిలో-కొంగవాలుకత్తి
(ఎఱ్ఱగడ్డపాడు)



దొనకొండ
గంగగుడిలోని
బొల్లావు
(కంచుతోఁ జేసినది)



దొనకొండ
గంగగుడిలోని
బొల్లావు
(కొయ్యతోఁ జేసినది)



'అగుమంచిబావి'
(గంగ దొనకొండ)



'అగుమంచి బావి'
[గంగ దొనకొండ]



అగుమంచిబావి యొడ్డునఁగల 'అగుమంచిబొడ్డు'
(ఆగుమంచి పూజించిన శివలింగము?)



పెయ్యల తిప్పలోనున్న 'ఖత్తిరన్నగవి'



చంపుడుకట్టపై నున్న అగుమంచిపాదాలు
(దొనకొండ గంగగుడి)



అగుమంచి
సాగుమానముచేసిన
గుంతము
[దొనకొండ గంగగుడి]



కొమ్ములవారు [ప్రకాశం జిల్లా]



సుద్దుల గొల్లలు [ప్రకాశం జిల్లా-గంగదొనకొండ]



సుద్దులవారు ప్రదర్శించెడి తెరచీర [గంగ దొనకొండ]



సుద్దులవారు ప్రదర్శించెడి తెరచీర
[పంచలింగాలకొండ-వెంగళపురము]

# విషయ సూచిక

విషయము | పుట

## 1. ఆవుల వలురాజు కథ

## 2. పంపాద్రి కథ

## 3. పెద్దిరాజు కథ

## 4. పోలురాజు కథ

## 5. బల్లికురవ పోట్లాట

## 6. కాటమరాజుకు పట్నం కట్టిన కథ

## 7. కరియావులరాజు కథ

## 8. పాపనూక కథ

# అనుబంధము

## కరియావులరాజు కథ - ప్రత్యంతరము

# ఆవుల వలురాజు కథ

## కృత్యాది :—

శ్రీ రమాధీశు స్వాశ్రిత పారిజాతు
పారిజాతోల్లాసు భక్త జన పోషు
రవికోటి సంకాశు రాధావిలాసు
భవరోగ సంహారు పన్నగ శయను
పదిలముగ మదినుంచి పశుపతినెంచి
మదన సంహారుని మగువ పార్వతిని
కొనియాడి వెన్నుని కొడుకు పరమేష్ఠి
ఘనభక్తి సేవించి కాంతభారతిని
నియమంబుతో మదినిలిపి తరువాత
విద్యలకు మొదలైన విఘ్నేశ్వరునకు
ప్రొద్దుప్రొద్దున భక్తి పూజించి వెనుక
ఇలవేల్పు యదువుల కిష్టదైవంబు
కలకంఠి ధనకొండ గంగభవగంగ
మంజుల మృదుపాణి మగువ పూబోణి

కంజాక్షి యలివేణి గంగాభవాని
విష్ణుపాదములందు విమల జన్మించి
కృష్ణునకు సాయమై కొమరప్పమింట
మామతో నెదిరించి మాటలాలించి
దీమసంబుడిగించి దీనుని జేసి
తద్దయుకోపించి తన్ను నూహించి
పద్దు చెల్లించిన భాగీరథి గంగ
హృదయ పద్మమునందు నునిచి సేవించి
బుధులను కొనియాడి పూర్వీక కవుల
నిరతంబు సేవించి యిటమీద జెపుదు
వరుసతో ఆవుల వలురాజు చరిత
ఘనశౌర్య ధనుని ఆ కార్య లక్షణము
వినరయ్య జనులార విన్నవించెదను.

## -: వలురాజు వంశ వర్ణన :-

ఘనుడు కవులావుల గంగురాజునకు
వనజాక్షి నిజరాణి వనిత గంగమ్మ
పుత్ర సంతానంబు పొందంగ దలచి
చిత్తమున భక్తితో శివుని పూజించి

వనములు బ్రాహ్మణ వడుగు పెండిండ్లు
అనువంద కోనేర్లు నల తటాకములు
ఫలములు కొనితెచ్చి పంచిపెట్టించి
వనరొప్ప కరుళ్లున్న వారుపళ్లున్న

గోవులు భూములు గొడుగులు కన్నె,
లాదిగాగల దానధర్మంబు, సేయగాను
పురహరు దయచేత పుట్టిరి సుతులు,
పర జ్యేష్ఠపుత్రుండు వలురాజు వకడు,
అందమైన సుతుండు హరిపాలు
డొకడు,
నంపగోపాలుండు నరనాథు డొకడు,
వీరు ముప్పురుగాక వీరశౌర్యుండు,
కోటిమన్మథు దీటు గోవర్ధనుండు
నలుగురు కొమరుల నందచందంబు,
వలరాజు దీటు మన వలరాజు చూడ
మరి పెక్కు విధముల మమతలతోడ,
పరిపరి గతులను బాలలందరిని
పెంచి యీడేరిచి పెండ్లిండ్లు జేసి,
మంచి ముహూర్తాన మండలేశ్వరుడు
పన్నెకెక్కిన తండ్రి వసుధేశు లెదుట,
పన్నుగ యలమంచి పాలింపు మనుచు
దీవన లిప్పించి స్థిర మందులందు,
భవ్య గుణసంపన్ను బాహు విక్రముని
తరిమురిత్త భోజుండు తగునీకు మంత్రి,
అరలేక యుండు మంచతని నొప్పించి
తక్కిన ముప్పురు తనయుల బిలచి,
పెక్కు మార్గంబుల ప్రేమలు దెలిపి
"అన్నవాక్యము మీరు అది యెంత
యనక,
పన్నుగ యలమంచి పాలించుడోయి"
అనుచు బుద్ధులు దెల్పి ఆలించి వినిన,

దినమున సిద్ధిబొందె శ్రీహరి కృపను
తరువాత వలురాజు తండ్రిమార్గముల,
పరగంగ తమ్ములు బంధువర్గంబు
హితులు మంత్రులు పురోహితులు
సహచరులు,
మతి మంతులును పెక్కు మన్నె
నాయకులు
సరదార్లు గురికాండ్లు సన్నిధి కొలువ,
పరగంగ యలమంచి పాలింపుచుండె
ఇంతలో వలురాజు కీశ్వరు కృపను,
సంతాన మేవురు సాహసోత్తములు
సింహాద్రి, పెద్దన్న, చిన్నియరనూక,
తమ్ముడు నలనూక, ధన్యుండుగాక
పరగుణ సంపన్న వంశవర్ధనుడు,
శరధి గంభీరుడు శత్రుసంహారుడు
రాజధరుకృప వలురాజు కులసతికి
భోజుడు జన్మించె పోలు రాజేంద్రు
దేవురు తనయుల వెనుక కుమార్తె
బాగొప్ప కొమరమ్మ బాల జన్మించె
మనుజాధిపతి యలమంచి పురినుండె,
వలురాజు దేవేంద్ర వైభవంబునను
యలమంచితోనున్న యంతలోపలను,
ఆ పురికుత్తర మందున నొక్క
భూపాల గుణమణి పుణ్యశీలుండు,
చలముకు వెరువని సాహసోత్తముడు
ఇలకీర్తి చెన్నొందు వీరశౌర్యంబు,
కలవాడు కలభూత గంగు రాజేం..

డెలమితో ఖండెమొండెము కోట యనెడు దిట్టముగ నాకోట తీరుదెల్పెదను.
పట్టణం బేలు భూపాల శేఖరుడు

## ఖండెమొండెముల కోట వర్ణన

కోటలు నాలుగు కొత్తళంబులును
వాటమౌ నెనిమిది వాకిండ్లు దిడ్డు
వడిగల శత్రుల వశము కానట్టి
పుడమిలోనెంచగల పొడవైనకోట
యోజనంబు వెడల్పు నేపుదీపింప
తేజంబు గలయట్టి తెలివైనకోట
మోజైన వజ్రాల మొగసాల గలుగు
రాజుల కలవి గారాని యా కోట
చీకాకు పరపించు సేనాధిపతుల
భీకరంబైనట్టి బిరుదైనకోట
వంకవాడలు మంచి వడి సోర్నగండ్లు
ఫొంకంబుగలయట్టి పొందైన కోట
కక్కసపు రాజులకు కంటిలో నలుసు
వెక్కసముగ రక్ష మెరుపైన కోట
తట్టు తట్టామడ దరిదాపు లేదు
కట్టించినట్టి శృంగారంపుకోట
మేరువ సరియగు మెరుపుగలయట్టి
ధారుణిలో మెచ్చదగినట్టి కోట
దినకర సంకాశ దీప్తిగలయట్టి
కనకపు జలపోత గలిగిన కోట

యేవేళ జూచిన వేదఘోషములు
భావింపదగు విప్ర బాజారు లుండు
మదగజంబుల బట్టి మట్టి మల్లాడు
పదిలమౌ క్షత్రియ బాజారు లుండు
అల కుబేరునినైన ఔను కాదనెడి
బలవంతులౌ వైశ్య బాజారు లుండు
కలుములు బలములు గలిగి మదించు
ఫలములచే శూద్ర బాజారు లుండు
వనములు చెరువులు వరుసకోటలును
ఘనమైన నూతులు గలిగి యుండుండు
కదళికా ఖర్జూర ఘనచూత వకుళ
బదరికా గోరంట పనస పలాశ
శారద భల్లాత చంపకా నింబ
పారిజాతస్వేత ఫలదంత తాల
పాటాల హింతాల పాటీర వకుళ
మాటమై వనము శృంగారమై యుండు
ఆ రీతి గల యట్టి యా పట్టణంబు
గౌరవ కలభూత గంగు రాజేలు
అనువంద నొకనాడు అవనీశ్వరుండు
ఘన పరివారము కదసి గొలువంగ

జితిని పఠాణి వజీరులు గొలువ
అతులితముగ మంత్రులచ్చట గొలువ
నాయకులు మొనపతుల్ నరనాథు
పట్టి

పాయక యేవేళ బలసి కొలుపంగ
పిన్నలు పెద్దలు ప్రియబంధు జనులు
వన్నెగా కూర్చొండె వకనాటి పూట
పరగ మంత్రుల వంక పాలించి చూచి

## కలభూతగంగురాజు కరణములను నిర్బంధించుట

ధరణీశుడిట్లనె : "తగు మంత్రులార !
చెలగుచు నొక మాట చెప్పెద వినుడి
వలనొప్ప ఈ భూమి వంచన లేక
పాలింపుడనుచు ఈ పరగణా యంత
ధారబోసితి మీకు తమరె దొరలైరి
తమ తండ్రి చెల్లిన తర్వాత నుండి
భ్రమ గప్పె రాజ్యంబు పాడు జేసితిరి
మా తండ్రి యీ భూమి మన్నించువాడు
తాతముత్తాతల దైవమాన్యములు
విప్రమాన్యంబులు ఇచ్చుకట్నములు
సుప్రతంబుగ నుంచి సుఖముచే నుంచి
లక్షణంబుగ నాల్గు లక్ష సిబ్బంది
కక్షయంబుగ గడచి అటుమీద మూడు
ఏడూ లక్షలపైది వెళ్లుచునుండు
కీడు సేయక షేము కీర్తి రాదలచి
మా తండ్రికై వడి మాట మీ కొసగి
ఆ తీరుగా మిమ్ము నఖిల భూములకు
పెద్దలగ దలచి మీ పేర దొరతనము

ఖుద్దు యిచ్చిన భూమి గోదు కొలిపితిరి
దేవమాన్యంబులు తెరువు గలిపితిరి
పావనంబౌ గుళ్ళు పాడు జేసితిరి
దాన ధర్మంబులు దహన జేసితిరి
సూన పాన్పులమీద సొక్కి సోలితిరి
భోగము భామల పొందు జేసితిరి
యోగతత్వంబులు హెచ్చి పోయితిరి
కుల కరణాలని కూర్మి తోడుతను
పలు తెరంగుల మిమ్ము పాలించినాడ
కాని మంచిది లెండు కవిలలు తెండు
మానంబుచెడి వెనుక మంచిదా బ్రతుకు
కలభూత గంగు భూకాంతుని పలుకు
పలుకు పలుకుకు గుండె భగ్గు భగ్గనుచు
కూర్చున్న మంత్రులార్గురు భీతిచేత
మూర్ఛలు బొంది గ్రమ్మన కళ్లుదిరిగి
అంతలో పల్ల దెలిసి అయ్యలరాజు
చింతచే నిల్చుండె శివరామరాజు

భయముచే నటునిల్చె భాస్కరరాజు
దయతప్పె యిట్లనె దత్తమరాజు
యిక బ్రతుకు లేదనె వీరమ రాజు
కకబికలై బలికె కన్నమ రాజు
ప్రభువు కెదురుగ నెంచి బ్రాహ్మణోత్తములు :
"విభవ దేవేంద్ర ! మా విన్నపం బొకటి
విను రాజశేఖర వీరప్రతాప
కనలి కోపించిన కార్యంబు గాదు
యింపనుక మా మీద ఈరసం బేల
మందిమేళము జేసి మరియు గొబ్బునను
తెమ్మని మమ్ము లెక్క దేవర వారు
సమ్మతింపగ వలయు స్వామి మా మనవి
యేమి బోయెను మిగుల నెంత లాభంబో
స్వామి మీకే తెలుసు చెప్ప నేమిటికి
ధరణీశ తమ సొమ్ము తమ రాక మించ
అరుగునా మీ సొమ్ము అవతల ఎవరు
తెలిసిన వార్నిందు తెప్పించమనుడు
కలసి మాట్లాడించు కాదనిపించు
తగును తగదనిపించు తరుణుల మమ్ము
తెగటార్చు పనిజేయు దేవర వారు"
అని పల్కగా విని యవనీశ్వరుండు
పరిచారకుల బిలిచి పలికె నాక్షణము
"పరువడి భీమన్న పంతులను వార్ని
సొరిది కవిలె తీసుకుర"మ్మటంచు
సెలవిచ్చినంతనె చయ్యన నేగి
తొలగక పొడగాంచి త్వరితంబుగాను
"రాజు రమ్మనెను తీవ్రమ్ముగా మిమ్ము
రాజిత లెక్క కారణము జూచుటకు
లెక్కకవిలెలు గొంచు లేచి ర"మ్మనెను
"అక్కర యేమొ మా కది యేమి యెఱుక"
"మంచిది" యని లేచి మంత్రిశేఖరుడు
కొంచక రాజున్న కొలువు కేతెంచి
కరములు ముకుళించి కడను గూర్చున్న
హరుషంబుతో బిలచి యవనిపాలకుడు
పలికెను భీమన్నపంతులు తోడ
"కులకరణాల్ మీరు కూడి గుణించి
మన భూమి పరగణ మంది దావలయు
పరగంగ తమరు ఏల్బడి దేశమెల్ల
చక్కగ పదిరెండు సంవత్సరములు
లెక్క సమ్మతి జెప్ప లేచిరమ్మ"నిన
"మంచి"దని గంగ భూమండలేంద్రునకు
అంచితంబుగలేచి యంజలి చేసి
పేడు వారలు లెక్క విడిచి శోధించ
సీరు మట్టుగ జాడ నెమకి భీమన్న

ప్రతి యేట నొకలక్ష పైకంబు బాకీ
నతి వేగమున దీసి యంతయు గూడి
"పం|డెండులక్షలపైకంబు పసిడి
నిండి అర్గురి క్రింద నిలచిన"దనెను
పలికిన భీమన్న పంతులు మాట
కలభూత గంగు భూకాంతుడు దెలిసి
భగ్గు భగ్గున మండి ప్రభువు కోపించి
బిగ్గున కనుబొమల్ బిగియ ముడిబెట్టి
పరిచారకుల జూచి బ్రాహ్మణోత్తముల
వెనుక రెట్టలు బట్టి వ్రేలాడ గట్టి
సురుకు సబుకుల చేత సొరగ కొట్టించి
ధర దంపిపై దీసి తాసీలు జేసి
పండు మిరియపు రసము పైకి బట్టించి
ఎండను కూర్చుండ వేగ నియమించి
అడిగించె సభ నున్న ఆర్యుల తోటి
అడిగిన వారితో అయ్యలరాజు
శివరామరాజును చిన్నవీరన్న
జవరాజసుతుడు భాస్కరుడు దత్తన్న
కన్నమరాజును గడగడ వణకి
తిన్నగా బలికిరి దీనత్వమునను :
"హర హర మహదేవ! అన్నయ్య
లార!
తిరుగించి మా చేతికట్లు విడుపించు
తరువాత నడుగు డుత్తరము జెప్పె
దము
విరిచి కట్టిన మాట యవ్వలేమయ్య"

అనియిట్లు భూసురుల్ అడలుచుండగను
మనుజేశు సెలవొంది మన్నె సరదార్లు
కట్లు విడిపించి చక్కగను దెప్పించి
మాట్లాడు మనిరి యా మాన
వాధిపుతొ
"ఏమందు మయ్య మాకెవ్వరు దిక్కు
నీమంబు చెడకుండ విడుపించు మమ్మ
ఆడువారల పిన్నలర్భకులనెల్ల
యీడ పురినుంచి మా కిప్పించు
సెలవు
యేడాది గడువు మాకేర్పాటు జేయు
మీడేర్తు మయ్య మీ కిచ్చు వరహాలు
కాకున్న మము బట్టి ఖండించరయ్య
మీకు చిత్తము జెప్ప మా చేతగాదు"
అడలుచు నిటువలె నయ్యలందరును
గుడి విరిగి తమ మీద కూలిన రీతి
నెలుగెత్తి కరణాలు నేడ్వగజూచి
బలవంతులగు మేటి పరివార హితులు
తమ్ములు నాయకుల్ దండి సరదార్లు
క్రమ్మర నేతెంచి గంగు భూపతికి
రాజిత తేజులై రాజు కిట్లనిరి :
"రాజ శేఖర ! విను రాచకరణాల
ఆపదబెట్టుట యది నీతిగాదు
కోప మెచ్చిన వెళ్లకొట్టించు పురమ
సమ్మతింపగ వలె స్వామి మామనవి
బ్రహ్మత్య మనకేల పట్టభద్రుండ

నిజము యేడాదికి నీ లెక్కముట్టి
రుజువు జేయంగలరు రూఢి కరణాలు
కొట్టించి తిట్టించి కొదువ జేసినను
పట్టభద్రుండ ! మీ పాదంబు లాన
కాదు మీరింతకర్కశము బూనినను
బీద బాపల మీద భీకరంబేల ?
పరగ పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమేల ?
అరుదైన మా మనవి ఆలించు వినుడు
మదగజంబును కేల మశకంబుతోడ
కదసి కోపించుట కదనవిక్రముడ !"
అని యిట్లు తన వార లాడిన వినియు
మనుజాధిపతి పల్కె "మా యన్న లార !
తగున మీ కిట్టి యధర్మ లాభంబు
మిగుల కోపించిన మెచ్చరు మీరు
కరణాలు అని వీర్ని కరుణించి నేను
పురహరుమారుగా పూజింపు చుంటి
బాంధవుల్ మిత్రులు పరగ తమ్ములును
అందరు మాకు వీరనుకొని యుంటి
కవిలెలు దెమ్మన్న కదలరు వీరు
భువిలోన జొచ్చిన పోనివ్వ వీర్ని
కళ్ళు చీలిచి క్రొవ్వు కండలు తీసి
నలి నులిగా గొట్టి నరములు విడల
తెగగోసి వుప్పున తినిపించి మీద
నెగవేసి దిగనడ్చి విదళించి తుదను
కావుపాతర నూడ్చి కడజేతుగాని
పావనంబుగ వీర్ని ప్రాణాన విడువ"
ననియిట్లు ధరణీశు డాడిన మాట
వినిన బంధులు రాజు కిల సా మ్రొక్కి
"కొదువ లెంచకు రాజ ! కోపించవద్దు
తుద మొదలెంచకు దూషించ వద్దు
మించిన పైకంబు మ్రింగుట నిజము
దంచిన రోకళ్ళ ద్రవ్యంబు రాదు
వారి తరుణుల పిన్నవాండ్ల నిందుంచి
ఆర్గురి కిప్పించు మతివేగ సెలవు
కష్టమో భిక్షమో కన్నమో లేక
శిష్టలో కాయలో చిగురులో కట్టు
మోపులో గోపులో దోపులో ద్రోసి
తోపుతో మ్మవస్త్రాఘ్ము, యెన్నటికైన
సిద్ధము తేగలరు సెలవిమ్ము దేవ
వద్దు మీ శ్రీరామవాక్య మిప్పించు"
అని పల్కవిని "మంచి దట్లనే కాని
మనమున భయముంచి మా పైకమెల్ల
దినము కష్టము నొంది తీసుకురండు"
అని చెప్పెకలభూత మండలాధిపుడు
వెలవెలబోవుచు వెఱచి పల్కుచును
నులుకుచు నేతెంచి నిలయంబు జేరి
శయ్యపై గూర్చుండి సర్వేశు దలచి
నెయ్యంబుతో మ్రొక్కి నీలవర్ణునకు
కోరి ముప్పదిమూడు కోట్ల దేవతల
నారాయణ స్మరణామృతంబు గ్రోలి

ఆర్గురు మంత్రులు నర్ఘ్యాదిపూజ
భార్గవిపతి కిచ్చి బ్రహ్మకు మ్రొక్కి
చీకాకుపడి తడి చీరల తోడ
ఆకాశవాణికి హస్తంబు లెత్తి
"కడతేర్చుమమ్మ నాకాశవాణమ్మ
తడవేల మా కొక్క దరి జూపవమ్మ
నిన్ను నమ్మితి మమ్మ నీవారమమ్మ
కన్నడ జేయ కాకాశవాణమ్మ
పుట్టితిమి తల్లికడుపున నార్గురమును
పుట్టినప్పటినుండి పృథివి నేలితిమి
యేబది యరువది యేండ్లు బ్రదికితిమి
కాబట్టి యెన్నడే కష్టపడలేదు
కట్టి కొట్టించె భూకాంతు డీవరకు
ఎట్టు బ్రదుకుదుము ఇకను మాతల్లి
కడతేర్చు"మ్మని కరములు యెత్తి
వడి రెప్పవేయక పర విప్రవరులు
దలపోయుచున్నంత దక్షిణదిశను
పలయుచు చిలుకలమ్రిపై నుండి
కలియ పల్కెను పైడికంటులు రెండు
వెలసి రొప్పెను పక్షు లేకరంతులుగ
కొలది మీరగ పండుకొమ్మపై నుండి
అలుక పడ్డని పల్కి అటు వూరకుండె

## కరణములు వలురాజు సెలవు జొచ్చుట

వారిని గన్నట్టి వారిజనేత్రి
తరుణీలలామ చింతా నాగులమ్మ
వయ్యాన పక్షుల వచనలక్షణము
చయ్యాన నాలించి శకునంబు వినెను
విని పక్షిలక్షణము వీనులయందు తన
కుమారుల బిలచి తాల్మితో బల్కె :
"చెల్లంబో సుతులార ! చెప్పెద వినుడి
తల్లడపడి చాల తలపోయ నేల
అనుమాన పడక మీరన్నదమ్ములును
పనితుల జాలులెంబడి తీవరముగ
కోటకొమ్మల ప్రాప్య గొబ్బునగట్టి
దాటుడి అందరు తరుణులు సుతులు
గ్రామంబు వెడలి యిక్కడికి దక్షిణము
క్షేమము యలమంచి చేరితిరైన
వనధి గంభీరుండు వంశవర్ధనుడు
ఘనశత్రు సంహారు కాయజుమారు
యదుకుల విస్తారు ఏకాంగివీరు
మదగజ సంహారు మన్నెమధీరు
నలకూబరుని వంటి నరుడు వలురాజు
యలమంచి పట్టణం బేలుచున్నాడు

అతని జేరిన మిమ్ము నాదరించు"నని
వెతకి చెప్పెను పత్ను లేకరంతులుగ
పోరయ్య మీ వెర్రి బుద్ధులు మాని
ధారుణిలో విప్రదయ గలవాడు
రక్షింప గలవాడు రాజు వలురాజు
ఈ క్షణమున లేచి వెళ్ళు"డటనిన
తల్లిని అట జూచి తనయు లార్గురును:
"చెల్లంబో యీ పక్షిశకునముల్ నమ్మి
మందగొల్లని కడకు మమ్ము బొమ్మనుట
యిందుముఖి నీనోటి వింటిమిగాక
జతనము కలభూత జనపాలవరుని
కతడెంత వాడమ్మ యడ్డమై నిలువ
నలవిగాదమ్మ యీ యవనీశు కెదురు
నిలువగల రాజు ఈ నిఖిల లోకముల
తగ దోచదమ్మ చింతా నాగులమ్మ
మిగుల దోచిన బుద్ధి మీ మనసు కొద్ది"
అనుచు ముందెనుక తోచని విప్రవరులు
మనమున జింతించు మార్గంబు దెలసి
"మంతుకెక్కిన బుద్ధిమంత సుతు లార:
యెంత లేదనకుపే యాదవరాజు
పంతంబుగల సింహ బల పరాక్రముడు
అంత పుణ్యాత్ముండు అవనిలో గలడ
గొల్లడన బెల్లచు గోవర్ధనుండు
తల్లిదండ్రుల కన్న దయగలవాడు

సేనాధిపతులతో చలపీకరించు
ప్రాణంబులిచ్చు నా బడుగుల రాజు
మాటాడవలదు ముమ్మారును లేచి
బాట సాగించుడి పణతు లర్భకులు"
మాతవాక్యము విని మంత్రు లార్గురను
భీతిచే తరుణుల బిడ్డలు లేపి
సరి ప్రొద్దు రాతిరి చక్కట పడుచు
తరి తీపు కోట కొత్తళములు దాటి
మళ్ళి చూచుచు గస్తి మందిని దాటి
మెల్లన దగ్గుతుమ్ములు నావలింత
లన్నియు బిగబట్టి యుసురుసురనుచు
పన్నుగ వెడలిరి బహు కుటుంబములు
పలపల తెలవార బ్రాహ్మణోత్తములు
యలమంచి పట్టణం బేతెంచి రంత
నా వేళ వలురాజు నన్నదమ్ములును
భావించి యలమంచి పట్టణంబునను
బంధువుల్ మొనపతుల్ పరగ నల్లుండ్రు
పందుముల రఘుపతి పల్లెకొండయ్య
తగు మంత్రిశేఖరుడు తరిముత్తరాజు
చంగట మరి తరిశంకరుడు మంత్రి
మరి అచ్యుతుండను నాతడొక మంత్రి
వెరవొప్ప దామసాని వెంగళ మంత్రి
దండెబోయిన వారు తగు నొక వంక
బండెబోయిన వారి బల మొకవంక
గుండెబోయిన వారు, గుమ్మడి వారు,

చండ ప్రతాపులౌ శంకరివారు,
బలములు మరుదులు బావ నల్లుంద్రు
వలురాజు ఇరువంక వన్నెగా గొలువ
భూమాడి శంకరుడు భూరి విక్రముడు
దీమసంబున గొల్వ దిట్ట లేనూరు
పులుమద్దు చన్నయ పుణ్యచరిత్రు
కలసి తొమ్మిదినూర్లుకాల్బలము గొలువ
కార్యము హనుమంతు కదన విక్ర
ముడు
ఆర్వేల మూకతో నచ్చటి గొలువ
చల్ల భూపతి నేడు సమర ప్రతాపు
కొల్లలుగ నాల్గువేల్ కొలచి యుండంగ
పట్టభద్రుడు ముద్దు భండారు మల్లు
దిట్టమౌ నన్నూరు తిమురుచు గొలువ
కల్లందులయ్యన్న గంగుల రాజు
చల్లగ వలురాజు సరసన గొలువ
సగము దండుకు కర్త సరదారు దండి
భగులున గూర్చుండె ప్రభువుని గొలచి
పుల్ల మన్నను వాడు పురుమని పిడుగు
కొలువున కెదురుగా గూర్చుండి కొలువ
మాతంగకుల బంటు మదగజవైరి
భీతి గుండె నదురు పేగులు లేని
అశని పాకను పేర నమరిన ఘనుడు
పసి బాల గోసంగి బలములతోను
కొలువంగ వలురాజు కొలువున నుండె.
వంది మాగధు లిరువంక నిలుచుండి
రందెకై వారంబు లార్భాటముగను
వేదోక్తముగ విప్రవర్యు లక్షతలు
మీద జల్లుచు శుభము మిగుల గోరుచును
పాత్ర కన్యలు నాట పాట పాడుచును
గాత్రము గాన శృంగార మింపార
తాళ మృదంగాది ధ్వనులు విలసిల్ల
తాళ మానంబులు తరుణులు బాడ
సాలువల్ భైరవుల్ సరసదేగలును
జిలుకలు కంజులు జననాథుముందు
కారు కోళ్ళకు కత్తి కాలిగోళ్ళకును
పోరు గావింపంగ భూనాయకుండు
ఏగురు తనయులు ఎదురుగా నుండ
బాగొప్పగా నాడి పాడి రమ్మనుచు
వారితో నటుమళ్లి వచనమాడుచును
వీరితో నుత్తరం బిచ్చి నవ్వుచును
యలమంచి మొగసాల యచుకుం
పరుడు
వలురాజు కొలువున్న వరుస నంతటను
ఆపదచే గాసి నయ్యలందరును
బాపనయ్యలు నాదభామ లర్భకులు
వలురాజు కొలువుకువచ్చి యార్చుచును
పొల పొల దుఃఖించి పొలతుల దాము
"రాజాధిరాజ! యదురాజ! వలురాజ!
భోజ వంశాంబుధి పూర్ణ చంద్రుండ!
చండ మార్తాండ! ప్రచండ రణవీర!
దండి రాహుత్తుల మిండ మగండ!

మండనోద్దండః మద భృంగః శుభాంగః
గండముల్ గడపు ప్రఖ్యాతిగల రాజః
అపరాధులము బ్రోవుమయ్యః మామీద
కృప జూపు యదుకుల గుణమణి దీప
ఆపద నొందిన అతివలు మేము
దాపు జేరితి మింక దరి జేర్చుమయ్య
ఖండె మొండెము కోట కాణాచి మాది
గండీడు కలభూత గంగ భూధవుడు
భూపాలవరుడు మా పోషణకర్త
తాత ముత్తాత మా తండ్రి మా నాడు
చక్కగా రాజ్యంబు సాధించుకొనుచు
లెక్కలొప్పించి యా లోని లాభంబు
భోంచేసి సుఖముల పొలతులు మేము
లాంఛనంబుగ బ్రదికి లాభంబు లేక
అధికము కాసులపై నాశ లేక
బ్రదుకుచు నుంటిమి, పట్టభద్రుండు
ఒకనాడు మముబిల్చి వడ్డి మొదలాడి
నికరంబు దెమ్మనుచు నిల్పించి మమ్ము
లెక్క జూచియు కద్దు లేదనిపించు
ప్రక్కన భీమన్న పంతులను వాని
తెప్పించి లెక్కంత తేట పర్చించి
తప్పులు వొప్పించి దండన జేసి
కట్టించి కొట్టించి గంగ భూధవుడు
నెట్టన బంధించి నేలలో మాయ
చెరసాల వేయించి చర్మముల్ వొలువ
ధరదీరి కొలువున్న దండి సర్దార్లు
గురి చేసి యొక్కరీతి గొనమాడి
దొరతో
లావున పన్నెండు లక్షల పైడి
భూ వల్లభుని తోడ పూర్వపు మనసు
చెరబట్టి పణతుల చిన్ని బాలలను
కరుణించి యాడాది గడువు పైకముకు
వశకట్టు చేయించె వనితల మమ్ము
అసహాయ శూరులు నడ్డమై నిలువ
బాకి తీర్చుట మహాభారం బటంచు
చీకాకు బడుచుండ శ్రీ హరి కృపను
ధరణీశః వినవయ్య దక్షిణంబునను
కరుణించి వర పైడికంటులు రెండు
శకునంబు మీదరి జేరు మని పలికె
కకబిక కోటలగడ్తలు దాటి
అచ్చటి బాలలు అతివలు మేము
వచ్చినారము భోజ వలురాజః మమ్ము
కరుణించి రక్షించు కడతేర్చు మిగుల
పరిణామ మొనరించు బాలలందరిని
మున్ను శ్రీరాములు మొన కెదురువచ్చు
పన్నగ రావణ బ్రహ్మనుజునకు
నభయ మిప్పించి లంకారాజ్య మొసగి
విభవ మెసగగ సేతు వెసకట్టి దాటి
అతికాయు మహకాయు నా యింద్రజిత్తు
నని గూల్చి కుంభకర్ణాదుల దునిమి
పంక్తికంధరు గూల్చి పణతిని గూడి
శాంతియై ప్రతి విభీషణునికి లంక

పట్టంబు గట్టి యింపార భువికీర్తి
ఘట్టిగా నుంచిన కథ వినలేదె ?
ద్వాపర యుగమందు దేవకిసుతుడు
కాపాడి పాండవుల కౌరవులతోడ
కస్తిగా పోరించి, కౌరవుల ద్రుంచి
హస్తినాపురమిచ్చి, యల ధర్మజునకు
పట్ట మేర్పడ గట్టె పాలింపుమనుచు
గట్టిగా భారత కథ వినలేద ?
కృతయుగంబునను వైకుంఠంబునందు
ప్రతినతో ప్రహ్లాదు భక్తికి మెచ్చి
ఉక్కు గంబమునందు నుద్భవం బయ్యె
నక్కజంబుగ హిరణ్యకశిపు ద్రుంచి
ప్రహ్లాదు గాచుట భాగవతమున
మహిలోన జెప్పంగ మాట వినలేద ?
వలురాజ ! కృష్ణుని వంశంబు మీది
కలహంబులన కుడికాలు దువ్వుదురు
కరుణించి ద్రౌపది గాచిన యట్టి
హరిసంతతివి నీవు యాదవరాజ !"
అని యిట్లు దుఃఖించి అడలుచునుండ
విని విప్రవరులను వివరించి చూచి
తమ్ములు వలురాజు దండమని లేచి
నెమ్మది కూర్పించి నిలయంబు తోడ
"మీకేమి భయము మము మీరిన పనులు
చేకొని నడిచివచ్చిన చూడవలయు
తలలోన లేదు మీకైన భయంబు
తలపోసి చూడంగ తథ్య మీ మాట
రారాదు అయ్యలరాజు యీ పనులు
కారాదు మీకిపుడు కవులిచ్చినాడ
వలురాజు కొలువుకు వచ్చిన వార్త
బలవంతుడెవ్వడు పట్టుక పోను
చూతాము కలభూత శూరునితో నాజి
చేతము, అని వారి సేనల మీద
వస్తాదుతో వాడు వచ్చి నట్లైతె
చేస్తాము కలభూత శేఖరునితో నాజి
మీకు భయ మేటికి మీ పాదమాన
మాకు సంతసము ముమ్మాటికి మిమ్ము
చేకొని రక్షింప చెల్లును మాకు
ఆకొని మీరు మమ్మ భయము నడుగ ?"
ఈ తీరుగా పల్కవిని పల్లెకొండ
తాత వలురాజుతో తగనిట్టులనియె :
"తాతయ్య! వలురాజ! తగదు మీ మాట
నీతిగాదిప్పుడు నీవన్న ప్రతిన
అతి పరాక్రమశాలి యా గంగురాజు
మతిమంతు డతనికి మహిలోన నెదురె ?
పట్ట భద్రునితోడ పగ యేల మనకు
రట్టు చేయగనేల రాజ ! యీ పనికి
నయగణ సంపన్ను నల గంగురాజు
దయ గల్గియున్నాడు తమమీద నిపుడు
అటువంటి వానిపై నలుక మీకేల ?
కటకటా యతనితో కలహంబు ఏల ?
వగనొంది కరణాలు వచ్చిరటంగ

పగయేల వారితో బడుగుల రాజ ?
భూమి తెగదిను వారు భూసురుల్గారె ?
ఆ మీద కట్టుబడ నయ్యలుగారె ?
భక్షించుటకు వారె, భధకు వారె,
నిక్షేపముల నాడె నిజ మజుని వ్రాత
పోరేల కరణాల పొమ్మనవయ్య !
మారాడ వద్దు భూమండలాధీశ !
కరణాలపై నింత కరుణ కల్గినను
హరణ మౌట నిజము హరివంశ మెల్ల
మరణాలు నిజము సుమ్మా వలురాజ !
నీవు నీ తమ్ములు నీ వంశ మెల్ల
భావమున హతముగా ప్రతి దప్పరాదు
కుటిల వాక్యముగాదు కులభూష
ఖండ !
అటు వెన్క నీవు మమ్మనజెల్లదయ్య"
అని యిట్లు పల్లెకొండాడిన మాట
విని వేగ వలురాజు వికవిక నవ్వి
కొద్ది వాక్యము పల్లెకొండ కిట్లనియె

## శ్రీరాముని చాటువ - శిబిచక్రవర్తి చాటువ

"వద్దికతో నీవు వల్లవులకెల్ల
బుద్ధి జెప్పితివిగ భువిలోన కీర్తి
నిలువగల ఫలము నీవానతిమ్మ
మొలవ వలసిన మొక్క మోపున్న
నిలదు
భావంబుతో విను పల్లెకొండయ్య !
రావణానుజుడొచ్చి రఘురాముకడకు
అన్నకొల్వున నుండి అభయమని వచ్చి
పన్నుగ శ్రీరామభద్రునితోడ
విన్నవింపుచునుండ విని భానుసుతుడు
పన్ని ఉపాయముల్ పడకుండజేయ
రఘురాము డిట్లనె రవిసూనునకును :
'తెగువ తోడుత విను తొల్లికాలమున
ఎరుక డొక్కడు నడవి వేటలునాడి
కదిసి చిద్దునటొంచి కనికరమేది
కానకుండ శరము ఘల్లున దొడిగి
పూనివేసిన దప్పిపోయెను బెదిరి
కత్తికోతకు రెక్కకత్తిరించుకొని
యెత్తిపోవద శరము ఎరుక తాజారి
తప్పిపోయెను ఏటు తగలకపోయె
చెప్పనేటికి పక్షి చేసిన పూజ
పోనిత్తునా దీన్ని పుట మార్తుననుచు
దాని వెంబడి దగిలి తావులు లేపి
కకపికల్ చేయంగ ఘనకపోతంబు
ఒక వేటుబడి పక్షి వోర్వగలేక
అడవు లెల్లను ద్రిప్పె నతని చేబడక
బడిబడి నేతెంచె బ్రహ్మ కొల్వునకు
'కమలాసనుడ ! యెరుక గర్వించి నన్ను

అమర నేసెగదయ్య అంత బోనివక
వెనుతగిలిటువచ్చె నిక నెవరు దిక్కు
వనజసంభవ ! నాదు వలపోత మాన్పి
ప్రాణంబు రక్షించు బ్రహ్మదేవుండ !"
అని యిట్లు మొరపెట్టు ఆ పక్షి జూచి
వనజాసనుడు పల్కె 'నో కపోతంబ!
విను విను మా చేత నీ పనుల్ గావు
మనుజాధముడు ఎరుకు మా మాట వినడు
వినవలె మా మాట వీర ధర్మంబు
వినకున్న మాచేత వీరసంబేల
వేవేగ వైకుంఠ మేగి మొరపెట్టు
భావజజనకుని ప్రార్థింపు'మనుచు
లేచి పొమ్మని నంత లేచి యా పక్షి
తోచక వైకుంఠ త్రోవ ధాబట్టి
వెనువెంట నంటి యా యెరుక చండాలు
గనివేగ యా పక్షి కమలాక్షునకును
కరములు ముకుళించి కటకట యడలి
'తరలక నను గావు దాసుండ నీకు
మురహర! నగధర! ముచికుందవరద
కరిరాజ రక్ష ! మకరిప్రాణశిక్ష !
బృందావన విహార! భుజగేంద్రశయన!
నంద నందన ! వందనంబు గోవింద !
యెరుకచే భయమంది వేటుబడి చిక్కి
ధర నిల్వలేక నీదరి జేరవస్తి

విల్లునెక్కిడి యతడు వెంటనే తగిలి
అల్లడ్గొ వాడొచ్చె నసురారి కావు
కాచితే నీవు నిక్కము కావవలెను
చేసితే నను శిక్ష చేయుము నీవు'
అని యిట్లు చింతించు నా పక్షి జూచి
విని లక్ష్మిపతియైన విష్ణు విట్లనియె :
'ఎరుకును పొమ్మని యే నిన్ను గావ,
కరకు మానవుడెక్కు, కరుణించు మనుచు
బుద్ధి చెప్పిన వినడు, బుద్ధిహీనుండు
ఎద్దు మొద్దువాడు ఎరుగడు ముందు
వివర మెరుగనివాడు విధి చేతగాదు
ఈ వేళ కైలాస మేగుము వేగ
పురహరుడే బుద్ధి పూని తెల్పెడిని
పరతెంచు వేగంబె పనిగాదు ఇందు'
అన విని యా పక్షి అదలుచు లేచి
చనియె కైలాసంబు, చేరి యా పక్షి
పరిమేశ్వరున కిలబడి సాగిమ్రొక్కి
కరములు ముకుళించి 'కరకంఠ ! యీశ !
తారకాసుర హర ! దారవిభూష !
నారాయణస్తుత్య ! అఖిల లోకేశ !
అలనాడు పార్వతి కర్ధదేహంబు
వల నొప్ప నొనగిన వామదేవుండ !
పార్వతీశ్వర ! యెర్కు పాపాత్ము డొకడు

ఓర్వలేకిటు వైచె నురగభూషణుడ!
పావన మూర్తిరో పరతెంచె నెరుకు
నీ పైన దరిజేర్పు నీలకంఠేశ!'
అని పక్షి దుఃఖింప హరుడిట్టులనియె
విను పక్షి! నామాట విశదంబుగాను
ఎరుకాధముడు నిన్ను వేసె భక్షింప
తరువాత నిన్ను మాదరి జేర్పరాదు
వారి మనసే మనసు వాదు మాకేల?
కారణమేది నిను కావలేదనుచు
మీనిమిత్తము యెక్కుమీద కోపించి
కాని పోనిది వట్టి కారాడవలెను
వేంచేయు మిందు నిన్నెవరు గాచెదరు
మంచి పుణ్యాత్ముండు మానవాధిపుడు
ఎందు వుండునో పొమ్మి వేడుకోసుమ్మి
ఇందుండ జెల్లదు ఇపుడు వేంచేయు'
మన విని యాపక్షి మనము బెగ్గిల్లి
మనుజేంద్రుడగు శిబిమండలాధీశు
కొలువుకు నేతెంచి గోడుగోడనుచు
వల వల దుఃఖించు పక్షిని జూచి
'దుఃఖించనేటికీ? దుఃఖమేమిటికి?
తక్కక నిన్నెవరు దండించువారు
మృగములో నడవిలో మునివరులో లేక
తగవు తప్పక పల్కు తస్కరుల బాధొ
అది యేమి నీభయ మడిగితి తెలుపు
ఎదురెవరు నీవు నాయెదుటఁ జొచ్చినను
పట్టవచ్చిన వాని ప్రజ్ఞవిడిపింతు

కొట్ట వచ్చినవాని క్రొవ్వు గరిగింతు
మంచి మాటల వచ్చి మాటలాడినను
అంచితంబుగ నిన్ను హర్షమాడింతు
ఇన్నిమాటలు ఏల? ఇస్తి నభయంబు?
చెన్నొందు ఏవార్త చెప్పు' మంచనిన
అని యిట్లు శిబిరాజు ఆడిన పలుకు
విని కపోతము పక్షి యిల సాగి మొక్కి
'ఓ రాజ దేవేంద్ర! ఓ శిబిరాజ!
ఘోరాటవులయందు కోమలి నేను
పండ్లు కాయలు గడ్డిపంట ధాన్యములు
నిండు వేడుక మేయ నెఱుకవాడొకడు
కానకుండగ వచ్చి ఖడ్గంబు పేర్చ
మానిని దిగనాడి మలలన్ని దిరిగి
అతడు వెంబడి రాగ నజుని కొల్వునకు
గతియని వచ్చిన కావలే ననెను
తరువాత వైకుంఠు దరి జేరవస్తి
హరి నన్ను కావలేనన నందు తరలి
కైలాస మరిగితి కరకంఠు కొల్వు
తలపోయు నను జూచి తరలి పొమ్మ నెను
ముందెనుక దోచక ముగురి మాటలకు
ఇందు నేతెంచితి నింక నేలాగు'
అని యడలుచు పక్షి యాడినందులకు
ఘనుడు రాజేంద్రుండు కలకల నవ్వి
'ఓ పక్షి నీకింత తలపోత యేల?
యీపట్ల నిన్నివ్వ నెరుకవానికిని

రమ్మి ర'మ్మని శిబిరాజు చేపట్టి
నమ్మమని సింహాసనము పైననుంచె
నంతలోపల ఎరుకు నరనాథు చేరి
పంతంబులాడి నాపక్షి నిమ్మనెను
శిబి యెఱుకు పలుకులకు చిరునవ్వు నవ్వి
విభవమున లాలించి యిట్లని పల్కె :
'గర్వమో శౌర్యమో క్రౌర్యమో లేక
ధర్మమో మమునడుగ ? ధారుణీ విభుడను
బలవంతమున పక్షి పట్టిగొంపోవ
గలవా నీయందున్న క్రమము విన్పించు'
అని పల్క ఎరుకు భూనాథుకిట్లనియె:
'వినవయ్య శిబిరాజ! విన్నవించెదను
నిరతంబు మేమిట్లు నీయటవులను
తిరిగి వేటలనాడి దినభోజనముకు
పక్షులో మృగములో పట్టుకపోయి
భక్షింతు మయ్య మీ పాదంబులాన!
పరమాత్మ దయతప్పె పాపవుదినము
కరువాయె జీవముల్ కండ్లబడవాయె
ఈ ప్రొద్దుటికి శివుడీ కపోతమును
చూపెనో యని విల్లు సూటిగా దొడగి
వేసిన కనుచెదరి వెనుకగా దగిలి
తీసి పోయెను భూమి ద్రిప్పెనీ పక్షి
కడతేరె పక్షి నాగతియెట్లు ముందు
తడవేల నొక బుద్ధి దయచేయు' మనిన
శిబి యెరుకపలుకులకు చిరునవ్వు నవ్వి
'అభయ మిచ్చితి పక్షి నాదరించితిని
కర్మమో నీనోట కడి తియ్య మాకు
ధర్మమా ఖగమెత్తు తన కండ కోసి
యిచ్చెద'ననె, నంత విని ఎరుకువాడు
అచ్చుగా సంతోషమంద, శిబిరాజు
ఆచార వృత్తిచే నచట గూర్చుండి
త్రాసు తెప్పించి యా ధారుణీశ్వరుడు
సాహస విక్రమ సరస పుంగవుడు
దేహమంతయు కండ దెగపార గోసి
కండలు నొకయెత్తు ఖగ మొకయెత్తు
దండెన బట్టించి త్రాసున దూయ
హరి హరాదుల మాయ నతని పైకండ
వెరవొప్పు నాపక్షి యెత్తు లేదాయె
చర్మమంతయు వలచి శకలములతోడ
ధర్మంబు పోకుండ త్రాసుపైనుంచె
కలతూగె రెండు దిక్కుల త్రాసుసరిగ
ఇలమీద వ్రాలె భూవిభుడు దిగ్గునను
వడి విష్ణు బ్రహ్మాది వామదేవతలు
తడయక నేతెంచి ధర్మంబుజూచి
'సత్యవ్రతుండ! ఓ శిబి చక్రవర్తి!
అత్యంత గుణశాలి! అతిబలశాలి!
కష్టముకోర్చి మైకండలు కోసి
యిష్టము ఎరుకున కిచ్చితివి మేలు
మేలు నీ సత్యంబు మెచ్చితిమి మేము

కోలాహలముగ నడుగు కోరినవరము
ఇచ్చెద'మనినంత విని శిబిరాజు
అచ్చుగ సంతోషమ్మొంది యిట్లనియె :
'ఆదినారాయణ ! అజుడ భూతేశ !
బోధింప ఎరుకకు కపోతముకు తనకు
ఇప్పించు వైకుంఠ మిమ్ము శివపురము
వొప్పిత్రిమూర్తులు వారిని తోడుక
పోవ సాయుజ్యంబు బొందిరి తొల్లి
యీ విభీషణుని ఇనతనయ నేను
ఇంపార రక్షించి యిటుమీద లంక
సొంపుతో నేలింతు సుగ్రీవ నిజను'
అని యిట్లు శ్రీ రాములానతి యిచ్చె
కనికరంబున నేను కరణాల విడువ
ఎంత కష్టమొ లేక యెంత భయంబొ
కాంతలు బాలులు కాపురంబులతొ
వచ్చి కావుమటన్న వో పల్లెకొండ !
ముచ్చిలి దాగిన మొగతన మౌనె,
యాదవరాజుల కెచ్చు తగ్గులును
ఆదికాలము నుండి అన విన లేద
కరణాలకొరకు నా కవిలాల మంద
హరణమైనను గాక అయితే పరాక
చూతును గాక రణశూరుల మూక
చేతునుగాక నా సింహంబు దాక
తీతును గాక రిపు తిత్తులదాక
కోతునుగాక అహితు గొంతులదాక
వ్రేతునుగాక సరి వ్రేలాడుదాక
దోతునుగాక తన దేశంబుదాక
పాతునుగాక రిపు పట్టణముదాక
కాతునుగాక నను కొలన్నదాక"
అనుచు రోషావేశుడై వలురాజు
అనుజుల మరుదుల నల్లుండ్ర బిలచి :
"వినరయ్య నా మనవి విక్రములార !
ఘనమైన కలభూత గంగు రాజునతొ
కలహంబు కావలసె కరణాల గాచి
యిల కీర్తి రాషలసి యిటు మిమ్ము బిల్చి
మనవి చేసితి నాదు మనవి గైకొనుడి"
అని పల్క విని లేచి అల్లుళ్ల సుతులు
ముగ్గురు తమ్ములు మూల బలంబు
దిగ్గున లేచి వందన మాచరించి
అన్న కెదురగ నిలిచి హస్తముల్ మొగిచి :
"పిన్నవారలటంచు భీతిల్ల వద్దు
ఎన్నటు జగడంబు ఎరుగనివారు
పగ కెదురింతురొ పారిపోవుదురొ
దిగవిడ్చి పోదురొ తిన్నగా బిలిచి
అడిగితివిగాక మాయన్న వలురాజ !
కడ నిలచి ముందు మాకార్యంబు జూడు
తలపడగంగు భూధవుని తమ్ములతొ
కలహంబు రెట్టించి కన్నుల జూడు
ఇంతవారమటంచు ఇప్పుడు మీతొ

పంతంబు హెచ్చుగా బలుకనేమిటికి
రక్షించు కరణాల రాజ దేవేంద్ర !
కక్షశాయక బొదలు కదలించు నటుల
సడుతుము పొదుతుము అతని నెదిరించి
విడుచుము పృథివిలో నెంతకార్యంబు
చేతపంగపలయు మా చేతుల కొలది
మాయన్న యుద్ధమెన్నడు చేతుమింక"
యిటువలె పలుకగా వీర వాక్యములు
తటకున విని రాజు తలయూచి విప్ర
పద్మల బిలపించి వరభూషణములు
ఆర్వురకిప్పించె నన్నవస్త్రములు
సప్ప బియ్యముతోటి సర్వ వస్తువులు
అన్నికల పెరుగు ఆవుల నెయ్యి
వొప్పైన విడియముల్ వన్నెచీరెలును
ఇప్పించి వారికి విడుదు లేర్పరచి
సంతోషములనున్న సమయంబు నందు
కాంతుడు కలభూత గంగురాజునకు
కరణాలు యలమంచి కడ జేరిరనుచు
ధరణీశునకు దెల్ప తల యూచి లేచి
"నరదారులార ! వో సాహసులార !
కరణముల్ బోయినక్రమము వినరన్న
మా మనస్సున వారి మగుపల్లర్భకుల
నామంబు లేకుండ నణతు ననియుంటి
అడకున గలిగి మీరందరు వార్ని
విడిపించితిరి వారు ఇందుండరైరి
వలురాజు పేరైన వాడు మహారాజు
బలవంతు చెంత మన బ్రాహ్మణోత్త
ములు
కన్నెలు బాలలు కడతేర్చు మనుచు
ఉన్నారు ముంగల వుపమేది యింక?
అని విచారము జేసి ఆగ్రుడై లేచి

## కలభూత గంగురాజు కరణములకొరకు గుఱ్ఱపు దళము నిచ్చి నరహరి అను వీరుని యలమంచికి పంపుట.

కనుగ్రుడ్లు నెరజేసి కడుపండ్లు ంంత
నరహరి యను వాని నందు వీక్షించి :
"పరుషడి యెలమంచి పట్టణము నీవు
వేంచేయు అచ్చాళి వేయు గుర్రములతొ
కొంచించ కెదురాజు కొలువున నిలచి
యించు మాటల నడుగమన విప్రవరుల
వంచన చేయక వలురాజు ఘనుడు
రాజితో ఇచ్చిన రహితుల దెమ్మ"
నరనాథు సెలవొంది నరహరి లేచి
కర్థు లశ్వములను శృంగారంబు జేసి

వేయి గుఱ్ఱంబులు వెనువెంట గొల్వ
పాయక యలమంచి పట్టణంజేరి
కోపమున వలురాజు కొలువులో నిలచి
రౌతు అశ్వమ్ముల రవళింగ పట్టె
హయముల పైనుండి అల్లున నవ్వి :
"దయదప్పె పలురాజ ! దైవంబు మీకు
కరణాలపై నింత కరుణేల గల్గె
నిరుమూలమైతిరి ఇకమీద మీరు
కలభూత నృపతితో కరణాలు అలగి
మలయుచు వచ్చి నీ మరుగున జొచ్చి
చొప్పణచి యున్నారు చోరులు వీరు
తెప్పించు వొప్పించు దైవభూసురుల
రాపేల వొప్పించు రాజ ! వలురాజ !
విహితంబు గాదు మా విప్రులందరిని
పొమ్మని సెలవిమ్ము పోయెద నేను
బ్రాహ్మణుల కొరకు ఈపగయేల మనకు
కాలిముల్లు న నెంత గడ్డపారెంత
పాలించు నామనవి పట్టభద్రుండ!
ఇచ్చిన గొనిపోదు ఇవ్వక యున్న
పచ్చబద్దలపాల పడగొట్టుకొనుచు
కొనిపోదు చూడు నీకొలువులో నేడు"
అని యిట్లు నరహరి ఆడుచునుండ
కోపించి వలరాజు గుడ్లెర్ర జేసి
దాపున గూర్చున్న తరి ముత్తవరుని

కనలుచు వీక్షించి కనుసైగ జేయ
కినుకతో తరిముత్త కీర్తిప్రధాని
అటుయిటు చూడక నరహరి జూచి
హటముతో నటు బలికె నందరు వినగ :
"నరహరి ! వినవన్న నా మాన నన్న
కరణాల నిమ్మన కారణం బేమి ?
శరణు జొచ్చిన వార్ని శౌర్య మెందైన
కరుణించుదురుగాని కడకు దోచుదురె
ఇది మీకు సహజంబె ? వీర ధర్మంబె ?
అది మాకు మంచిదని అందరు జనులు
నేరడు మీ రాజు నేర్పరి గాడు
బారు తప్పుట తమకు భావ్యంబు గాదు
వస్తిరి గాక నీవారును నీవు
బస్తితో గొంపోవగను కర్తవయ్య
నరహరి నీమాట న్యాయంబుగాదు
పరతెంచు వేవేగ పట్టణంబునకు"
అని యిట్లు పలికిన అతిరోషమునను
అట్టహాసము జేసి ఆగ్రుడై పలికె
"నేరడు మా రాజు నేర్తురా మీరు
కారుమాటలు వద్దు కరణాల విడువు
వట్టి కలహము ఏల వోర్వనీ నింక
కట్టింతు నెట్టింతు కరణమయ్యలను
అటుమీద నీవు నన్నరికట్టలేవు
హటవాది నాపేరు అంతపని యేల
నిను జూడు కరణాల నిల్వగా నీయ
నను జూడు చట్రాతి నారదీసెదను
హయములనెక్కి కట్టాయత్తమాగను

దయగల్గి వ స్తిమి తరిముత్తరాజ!
మొర్రు మొర్రని వారు మొత్తుకొనుచున్న
ధర్మబడ నీడ్పింతు తప్పక జూడు
యెలమంచి పురిబైట వేయి గుర్రములు
కలహ మొందుచు బోదు కరణాల విడువ
అయ్యల విడచి నేనటు ఎందుబోదు
కర్యము నొనరించి ఖండ్రించి పోదు
మచ్చరంబునను బ్రాహ్మల నివ్వకున్న
చెచ్చెర నొచ్చెదరు చంపుదుము మిమ్ము
అచ్చాశి నామంది హయములు నేను
మెచ్చమయ్యును గాక వైరువనుగాక
వేయించుదును చూడు యలమంచి గములు
కోయించుదును ధాయి గొర్లవలె మిమ్ము
ఆడింతు జగడము నార్భాటముగను
నోడించుదును మిమ్ము నొక్క నిమిషమున
మూడింతు నాచేతి చబుకుచే నిపుడు
కేడింతు నీగద్ది కేల మిమ్మిడువ"
అని యిట్లు నరహరి యనువాడు బలుక
విని తరిముత్త రాజు వీరుడై కదసి
"నరహరి! యిటువినర! న్యాయమే వటుర!
[illegible] వదర

భూపతి కెదురుగా పూని వాదించి
యీపట్ల పల్కెద విందుమంత తగదు.
నిన్ను నీబలముల విరిచి కట్టించి
పన్నుగ నశ్వాల పారగొట్టింతు
అధికారమెంతరా అశ్వముల మీద
కుదురుగ గూర్చుండి కుట్రలుజేసి
కోతిగా నారాజు కొలువులో నిలచి
కూత రానీసారి గ్రుడ్లు దీయింతు
పొర్లు నీపురి దారిపోగుతో సాగి
తర్లు మాతోటి నుత్తరమివ్వ తగవు
కొరగావు మారాజు కొలువులో నిలువ
సరిగావు మాతోడ సాహసావడికి
నీవిటు నిలువ నిన్నేనిన వాడు
పావనంబైన భూపాలుండుగాడు
వుల్లమన్నను వాడు వొచ్చిన యిందు
పల్లడవైచు నీబలములు నిన్ను
అతిశౌర్య సంపన్ను డశనిపాకన్న
మతిమంతుడున్నాడు మాతంగి బంటు
ఇతరు లేటికి నీకు ఇంతమాత్రముకు
అతనికి చాలవు అధికారమేల
తరుచుగా నేటికి తర్లు నీపురికి."
నరహరికి శూలాలు నాటిన విధము
గ్రక్కున బాకులు పరువు ఛందమున
నిక్కించి కనుబొమల్ నిప్పులురాల్ప
దాటించి అశ్వాల తరిమి హయాల
ఘోటకంబుల రాజుకొలువు కెక్కించి

పనుపడ వేగుద్ది పట్టు సంధించి
అసువంద పూర్వొడచి అమిత కోపించి
"గొల్లడ నీకింత కొక్కెరంబైతె
చెల్లదు తనది బహు చెడ్డకోపంబు
వెనుకటికి ఏలూరు వేణుగోపాలు
డనుపంద మందెమేలము లాడె నాతొ
నతని పాతాళము నంట్రదొక్కిస్తి
ఈతీరుగనెపల్కె వినుకొండనృపతి
మదమడచి నీళ్లన్న మట్టుకంపిస్తి
వుదయగిరి భీమరాజు వుదరించె వచ్చె
ఈపట్టతో గొట్టి యీడ్చి పారేస్తి
దావుపాలించు భద్రాచలరాజు
ఇటువలె మాతోడ ఈరసమాడె
పుట మణగించితి భూపాలు దయను
ఇలలోన భూపతుల్ యీడెవరు మాకు
వలురాజ: నాతోడ వాదు నీకేల
మంకు మాటలు వద్దు మా రహతుల నిమ్ము
శంకలేకున్నావు శౌర్యంబు మాను
కొక్కరము లాడిన కొరగావు నాకు
త్రొక్కింతు నీచదురు దొరవని చూడ
రంకు సేయగనేల రాజ వలురాజ:
ఒక రాజు ఒక మంత్రి ఒక నాయకుండు
ఒక బంటు సరదారు ఒక మానవుండు
ఒక రౌతు మొనవాడు ఒక బల్ సిపాయి

అడ్డ మెవ్వరు కరణ మయ్యలకు మీరు
పొద్దు బట్టెద రిందు హరులెవరెవరొ
కులము గోత్రముగాని గుణహీన మొకటి
బలవంతుడవుగావు బడుగులరాజ
నా రాజు మహరాజు అతి బలాఢ్యుండు
వీరాధివీరుండు విక్రమార్కుండు
ఘటము మత్తేభముల్ గలిగిన వాడు
అటువంటి శూరుండు అవనిలో గలడ
కలభూతగంగు భూకాంతుడు రాజు
వలు రాజ కరణాల వొప్పించు మాకు
ఎక్కువల్ నాతోడ వేసాలు వేసి
పెక్కులు నిక్కులు ప్రేల వచ్చెదవు
పిచ్చి కోపము నాది పీల్తు రక్తంబు
కచ్చి వచ్చినచోట గర్వమణగింతు
మంచి మాటలకు నే మంచి మానవుని
మించితే పగతుల త్రుంచు మానవుని
నా పదును నా బలిమి నా రాజు కెరుక
బాపనయ్యల కొరకు బడుగుల రాజ:
యీప్రొద్దు నా బలిమి ఇంక నీ కెరుక
దాపులో నున్న మీదళముల కెరుక"
అనుచు కోపము జేసి అయ్యలంచరిని
కనలుచు మెడబట్టి కదలుడి యనుచు
అవనీశునైన జూడక గర్వమునను
భువిమీద బడనీడ్చె భూసురోత్తముల
వెరచి గడ గడ వణకి విప్రులందరును

ధరణీశువధనంబు తప్పకజూచి మమ్ము బాధలుబెట్ట మర్యాదలెల్ల
"వలులాజ! మిము నమ్మి వనితలు సమ్మతమె వలురాజ! సహజమే నీకు"
మేము అని యిట్లు దుఃఖించు నగ్రవంశజుల
తలపులో భయమేమి తలచకుండితిమి

## వలురాజు నరహరిని పరాభవించి తరుముట

కనుగొని వలురాజు ఘనుడు కోపించి
మనుజేశు బండారు మల్లుని బిలిచి
కనలుచు బలికెను గాఢ వాక్యములు
"వీనిమంత్రిని వీని విరిచి కట్టించి
వీని ప్రల్లదములు అరుగ గొట్టించి
వార లెక్కినయట్టి వాహనంబులను
బారుగా నశ్వాల పారగొట్టించి
వెళ్ళగొట్టుడి కాల్బు వెళ్ళునందాక
నల్లకుడి తాళీలు సాహసులార"
అని రాజు సెలవిచ్చి సంతసోపంనె
మనుజేశు బండారుమల్లు తాలేచి
నరహరి మొదలైన [illegible]లాఢ్యులను
పరగ నశ్వంబుల పైనుంచి యీడ్చి
ఆయుధంబుల వారి యశ్వములనెల్ల
ఆయనకడ నుంచి యందరి బట్టి
కట్టించి కొట్టించి ఘన రాజు కొలువు
నెట్టన వెళ్ళించి నిమిష మాత్రమున
కరవాలు విడిపించ ఘనుడెవడనుచు
నరహరిని శోధించె నటుకొలువు వెళ్ల
కోపించి నరహరి కొదువలాడుచును
"బాపురే వలురాజ భళిర మెచ్చితిని
ఇంతపని జేసితివి యిక జూడు ముందు
చింతింప నీపని సిద్ధమయ్యేడిని
నీ పట్టణంబెల్ల నిర్మూల పరచి
నీ పటాటోపంబు నిలమీద గూల్తు"
అనుచు చై చాపుచు నాగ్రుడై తర్లి
ఘన వేగమున జేరె ఖండెమొండెముకు
తేజముల్ హీనమై దెసపడుకొనుచు
రాజు కెదురుగ నిలిచి రయమున
నపుడు
"కరుణించు కలభూత గంగురాజేంద్ర!
అరుదైన బలవంతు డా వలురాజు
అతడె భీకరశాలి యతడె సాహసుడు
అతనికే భూపాలుడను పేరుగాక
యితర భూపతి తనకెవరు సరిరారు
క్షితిలోన భూపతుల జెప్పగా విందు
ఇంత విక్రమశాలి నెందు బొడగాన
గొంతులు మన్నించు గోకులాధిపుడు

కడమలో తక్కువ కష్టపాటెల్ల
పడితిమి రాజ సిపాదంబులాన
కతిసపు చిత్తంబుగం మానవులను
అటుపంటి పసులకు నంపుదుర మమ్ము
మీ సంతు నెరసమ్మి మిక్కిలిపోరి
చూచితి వక చెయ్యి చొరుపలు గాను
కరణాలు మీకు ఎక్కడికి పొమ్మనుదు
దరబారు చొరకుండ దండించెనయ్యా
అదళించి నను మీరి అశ్వములు నేను
సదురు పై నెక్కించి సబుకులంటిస్తి
అటు మీద కోపించి ఆ వలురాజు
ఇటువలె కొట్టించి విరిచి కోపించె
బహుచేయ నతనితో ప్రజ్ఞలాడితిని
మహరాజ నా పంత మంత యీడేర్చు

యదురాజుపై దండు వెడలితివైన
అది నీకు శౌర్యంబు అది బంటు
తనము
రాజు విను ఎన్నాళ్లు రామ రాజ్యముగ
ఈ జగం బేలుచు నిందుండగలము
తన మీద క్రౌర్యంబు తలచిన వాని
పసరంగ నొప్పించ వలెనంద్రు
బుధులు
లేకున్న నిన్నేరు లెఖ్ఖ బెట్టుదురు
శ్రీకరంబుగ పద్దుచెల్లించు'' మనుచు
చెరగొట్టి నరహర చెప్పినందులకు
దురుసువాక్యము విని దొరగంగురాజు
కోపించి దంష్ట్రిముల్ కొరికి తలయూచి

## గంగురాజు తన తమ్ములగు రంగధామరాజు, రఘురామ రాజు, చిన గంగురాజులను యుద్ధమునకు బంపుట

"బాపనయ్య కొరకు బడుగుల రాజు
నన్నైన చూడక నరనాథవరుడు
వీని కొట్టించెనా విరిచి కట్టించి
నేరడుగా నన్ను నెరయోధవరుల
ధారుణి మూగిన తను నిల్వగలడ

ఎలమంచి కోటపై నెక్కింతు లగ్గ
చలపట్టి యాదవుల చంపింతు మొగ్గ
బండారు మల్లును పట్టి చండాడి
ఖండింతు వలురాజు కంఠము వెనుక''
అని గంగు రాజేంద్రు డనుజుల బిలచి

"ఘనులార వినుడు చక్కగ
పిన్నమనవి
యలమంచిలో నున్న యాదవరాజు
బలవంత మెంత మన బ్రాహ్మ
ణో త్తముల
మరుగు జేర్చుక మగువలర్భకుల
నరహరిని గోపించి అశ్వముల నెల్ల
చెరబట్టి నతడెంత శౌర్య సంపన్ను
డైనను మంచిది అతని దేశంబు
డాయంగ చెరబట్టి అతులితంబుగను
కరణ మయ్యలకు దీయకై వాఠ బట్టి
సరగున చెరగొంచు చయ్యన రమ్మి
యదురాజునకు, కబురు ఎరుక
లేకుండ
పదిలముగ చెరగొంచు పట్టుకరమ్మి
వలురాజు తమ్ములు వార్తమన్నీలు
సొలయక రణవీర శూరులున్నారు
గోవర్ధనుడు నందగోపాలరాజు
పావనమూర్తి హరిపాలు డనువాడు
చెప్ప చూపగరాని శౌర్యులటంచు
వొప్పగా విన్నార వో తమ్ములార !
ఒక వేళ మీ కబురు వారు వినిరైన
ప్రాకటముగ మిమ్ము ప్రజ లణచెదరు
ముందు విచారించి మొగ్గుట తగ్గు
అందముగ దండు పొ"మ్మని
పంపెరాజు

# గంగురాజు తమ్ములు యలమంచిపై దండెత్తి వచ్చుట

అన్న వాక్యము ముువ్వురన్న దమ్ము
లును
మన్నించి దళము రమ్మని కూచి దార
వాయించి భేరీ హవ్వాయిగా ముందు
చేయించి కబురు పరిచారులకెల్ల
తలకూడె జగడంబు తడవుండ వలదు
బలము నంతయు సౌక పైనముల్జేసి
వారిధి మేర తెగి వచ్చెనో యనగ
బారులు గరలె నార్భాటంబు మిగుల
మంచి అశ్వంబులు మన్నెనాయకులు

ఎంచిచూడగరాని యేకాంగ వరులు
రాజాధిరాజులు రాజ మన్నీలు
రా జిత తేజులై రణరంగమునకు
నేల యీనిన రీతి నెర యోధవరులు
మూల బలంబు లిమ్ముగ నేగిరంత
పద్దు ద్రిమ్మంచు నృపుల్ పౌజులేర్పరచి
ప్రొద్దు గ్రుంగుట ఝామ పోయిన వెనుక
దండి పౌజులు, రాజు తమ్ములు మురువు
ఖండె మొండెము కోట కదలిన క్రమము
రంగధామ రాజు, రఘురామరాజు

శృంగారవర్ణుడౌ చిన గంగు రాజు
అన్నతో సెలవంది అశ్వాల నెక్కి
సన్నాహ మేర్పరచి, చనుదెంచి వేగ
యలమంచి పరగణ యంతయు చుట్టి
కొలది చెప్పగ రాని కొల్ల బట్టించి
పశువుల రైతుల పసి బిడ్డ లాది
వసుధ నంతయు చుట్టి వకరేయి పూట
ఖండెమొండెమునకు కదలవలె”
నను చు
చండ మార్తాండులై చలమార బట్టి
సాగి నడిపించెడి, సమయంబు నందు
వేగరుల్ ఏతెంచి యెల మంచిపురము

## గంగురాజు తమ్ముల నెదుర్కొనుటకై వలురాజు తన తమ్ములగు హరిపాలుడు, నందపాలుడు, గోవర్ధనుడు అను వారిని పంపుట

వలురాజు కొలువుకు వచ్చి యీ వార్త
తెలియచెప్పిన నంత దిగ్గునలేచి
మనుజేశు తమ్ముల మంత్రుల బిలచి
ఘన రోషమున ఘనుడు వలురాజు బల్కె ;

“గోకులాధీశ్వర గోవర్ధనుండ !
ప్రాకటముగ హరిపాల రాజేంద్ర !
నందగోపాలక ! నాతమ్ములార !
మందితో కలభూత మండలాధిపువి
తమ్ములు ముప్వురు దళములతోడ

క్రమ్మించి మనభూమి ఘటఘటలెల్ల
ఎక్కించు లగ్గకు పేరాళముగను.
పెక్కుండ్రు మొనగాండ్ల పేరులేకుండ
హతముగావించి సాహసము చేయించి
సతుల బాలల పతుల సంపదలతోడ
కలహంబు కావలసి కరణాలకొరకు
బలవంతమున భూమిపై చెరబట్టి
పంతంబు తగ బలికె భటుల నదలించి
యింతపని చేసిరట యీ రాత్రిపూట
మాయన్నలార! తృటిమాత్రమున వారు
పోయిన తరువాత పోరెట్ల గలుగు ?
ఎదిరించి వారితో యుద్ధంబు చేసి
చెదరక భారులుచెంది సర్దార్లు
కోటలు వెడలి గోవు విడిపించి
బాటకడ్డము నడచి పారిపోకుండ
పశువుల బాలల పణతుల నెల్ల
కుశలముగ విడిపించుకొని తరువాత
వారు మీరు గలసి వైరంబు గెలిచి
పోరాట మొనరించి పోవలె వేగ
లెమ్మలె"మ్మ నినంత లేచి యదు
రాజు
తమ్ములు మువ్వురు దండమర్పించి
"పగగల్గె ఇన్నాళ్ళు బ్రతికినందులకు
జగడంబు గలుగుట సహజములౌట
ఓ పరాక్రమభోజ! వో వలరాజ!
యీ ప్రొద్దుచూడు మా యుద్ధరంగంబు
మూకలపై దుమికి మొన రాజవరుల
భీకరాకృతి జంపి బిరుదు విడిపించి
హయముల గజముల ననిలోన ద్రుంచి
రయమున మన్నీల రణమందు దునిమి
పశువుల రైతుల పణతు లిడిపించి
కసిదీర మాచేత కయ్యంబు చేసి
కండెమొండెము దునుక గడిమి శత్రువుల
ఖండించి కలభూత ఘనుని తమ్ములను
అంతపనిచేయుదు మన్నయ్య మమ్ము
సంతసమున వేగ సాగి పోనిమ్ము"
అని పల్కి అన్నకు అడుగులకొరగి
అనికి కట్టాయుత్తమైరి వేగంబె

## వలురాజు తమ్ములు శత్రుసైన్యములను ఎదుర్కొనుట

బంధువుల మిత్రులు బలసి కొలువంగ
నందగోపాలుండు అమితవిక్రముడు
పంచకల్యాణి పై పరగంగ నెక్కి
అంచితంబుగ నడిచె నతిబలాఢ్యుండు

హరిపాలు డనునట్టి అమిత సాహసుడు
తురగంబుపైనెక్కి దుమికించు కొనుచు
చనువరల్ యిరుమేర సరగ కొల్వంగ
అనికి కేరుచు నడిచె నంతతోపలను
గోవర్ధనుడు మంచి ఘోటకంబెక్కి
బావలు మరుదులు బలసి కొల్వంగ
శృంగరమైనట్టి శూరులు గొల్వ
రంగమధ్యము సేయ రాజు తానడిచె
తిరుమందు లార్వేలు దివ్య వైఖరులు
గరిమతో నేగిరి కయ్యంబు చేయ
వల్లవు వార్వేలు వలురాజు సెలవు
కొల్ల విడ్పింతుమని గొబ్బున నడువ
ఆ సమయంబున నార్వేల తోడ
గోసంగి సేన ధీకొని నడిచె నంత
మువ్వురు తమ్ములు మూలబలంబు
నవ్వుచు కేరుచు నాజి కేతేర
నౌబోతు భేరీలు నాదు నగార
దివి భువి అదురంగ దిక్కు లాలింప
కనక తప్పెటలును కంచు కొమ్ములును
ధణ ధణ యని భువి ధ్వనులు విలసిల్ల
చెరుకు టొంకుల మెట్ట చేరువ నిలచి
పరదళముల వంక పారంగ జూచి
వలురాజు తమ్ములు వాహనమ్ములను
ఎలమి ధుమికించి హొయ్యాళిగా ద్రిప్పి
అరుణోదయంబున అవని పాలకులు
మెరుగు కత్తులు తీగ మెరపుల బోల

అనికి పైనము గ్గాగ నావలి మూక
ఘన శౌర్యవంతుల కన్నుల జూచి
వలురాజు అని చేయ వచ్చెనటంచు
కలవర పడువారు కడలెదువారు
యదుబలము మొనకు రా వెరచెడివారు
పద పదండని త్రోఇ బట్టెడు వారు
వలయక పొదరిండ్లు మాటున దూరి
తలగెడు వారు తత్తర పడువారు
తెల్లవారెను మూక దిశలెల్ల గప్పె
"కొల్ల బోనివ్వరు గొల్లరాజులును
కొల్లయేలను మన కొనప్రాణములతో
మళ్ళిపోయిన చాలు మన పురంబునకు
ఆ కొల్లపై ఇంత అగ్ని బడెగాక
చీకాకుపడి దండు చెల్లి రయ్యయ్యొ
ఎంత సాహసఘనుడు యాదవరాజు
పంతంబు చెల్లించె బాపనయ్యలకు
ఎందుజూచిన పద్దు యాదవులెగాక
కొందరికి చెల్లునా ఘోరయుద్ధంబు
తెల్లవారకమున్నె తెరువు కడ్డముగ
అల్లున తిరిగి కట్టినది బంటుతనము
ఐదారులక్షలు ఔను మన బలము
మైదానమున నిల్వ మర్యాదకాదు"
అని యిట్లు పలికి శ్రీహరి హరియించు
మనమున తల్లడ మల్లడ గొనగ
రఘురామ రాజేంద్రుడు రంగధామన్న
సుగుణుడు చినగంగు శూరు లెదిరించి

ఆవుల వలురాజు అనుజులతోడ
భావజ్ఞులేమని పలికి రంతటను
''గోవర్ధనుడ ! నంద గోపాలరాజ !
రావయ్య హరిపాల ! రమ్యగుణశీల !
వినరయ్య తెల్పెద విక్రములార !
వినరంగ ఈ పట్టి వైరంబులేల ?
పశువులు రైతులు పసిబిడ్డలాది
వసుధ గోవులు సొమ్ము వకరాశి వినుడి
మా విప్రులార్గురు మగువ లర్భకులు
యావత్తువారెల్ల వేరొక రాశి
విడిపించు కారణాల నిరిగొ మీ కొల్ల
విడువలే మంటిరా యిపుడె కార్యంబు
మా యన్న మీ యన్న మతి తెలియ వద్దు
బాయ రంగము వద్దు బవరంబు వలదు
మనలోనె మనము ఈ మాట పల్కాడి
ఘనమయి పోవుట కడు మంచిమాట''
అని రంగధామన్న అన్న దమ్ములును
వినసి పలుకగ విని యదుకులోత్తములు
''విను రంగధామన్న! వీరసంపన్న!
అని సేయ ఉంపె మా యన్న వలు రాజు
సంధి మాటలు అడి జరిగి రమ్మనుచు
అందనక సెలవు మాకన్నివ్వలేదు
మీరు సమర్థులు మీరు ధీరులును
వీరులు అన్నకు వెరువని వాగ
కాగనే అన్న యెరుకయులేని మాట
వేగ పల్కితిరి మాకేల యీమాట
కరణాల నివ్వను కర్తలము గాము
తిరుగ అన్నకు దెల్ప ధీరులము గాము
మా అన్న తెల్పిన మాట యింకొకటి
న్యాయంబు దప్పితి నేరమి యనుచు
రహితుల వొప్పించి రాజ్యంబు విడచి
మహిలోన మాతప్పు మన్నింపుమనుచు
పట్టిన కొల్ల మా పాలను విడచి
ఘట్టిగా మాతప్పు కావు మటంచు
కలభూత గంగు భూకాంతుడు వచ్చి
వలులాజు కొలువులో వందన మొనర్చి
రక్షించు మన వలురాజు మెచ్చెడిని
వీక్షింపగా నొకటి వినుడు ఈ మాట
దంతులు తురగముల్ దళములు మీరు
రంతు చెసుకవచ్చి రాజిమా వేల
గడిచేసుకొనిరాగ కవులు పనిలేదు
మదియ మాటలను ము మ్మాటికి విడువు
మాటలేటికి మీకు మాకు కార్యంబు
తేట పడలెమ్ము కొంతేమి లాభంబు''
అనుచు దృఢస్థుడై హరిపాలకుండు
గొనకొని కార్యమని గోవర్ధనుండు
నాదించమని భేరి నందగోపాలుడు
క్రోధించి రాజులు ఘోటకంబులను
వాగెలు సడలించి వైతట్టు డనుచు
గోత్రపావనులు హం గోవిందయనుచు

ధాత్రీశ్వరుల రిపుల తలగు మనిరంత
సెలవంది తమ భటుల్ చెలగు భేరీలు
కలయ నాదించిరి కంచు నగార్లు
ఘోరు కొల్పిరి నవబోతు ఢిమిళ్ళు
బారు దీరిరి పెద్దబాక పట్టించి
కైతప్పెనని చిన గంగురాజేంద్రు
వైతట్టు కంభాణవంబున నిలచి
రంగధామరాజు రఘురామరాజు
భంగమాయె నటంచు బలములు తాను.
పట్టిన రహితుల పశువుల విడచి
తొట్రుబడి సరదార్లు దొరలు నాయకులు
కడనిల్చి భేరీలు కంచు నగార్లు
తొడబడ నాదించి దోపుగా నంత
మొనచేసిపోయి గోములవారి నెల్ల
వెనువెంట నిలిపి ఏతెంచెరాజు

## వలురాజు తమ్ములు శత్రుసైన్యములను చీల్చి చెండాడుట

అంతట వలురాజు అనుజులు లేచి
పంత మేర్పడ బల్కి పగకు నెదిరించి
ఘోటకంబుల నెక్కి గోవిందు బలికి
పోటు మళ్ళించి రిపుల పొట్టలు చించి
పట్టి చే సంధించి పగతుల ద్రుంచి
పొట్టు పొట్టొనరించి భూపతుల ద్రుంచి
నామధేయము నిల్పె నందగోపాలుడు
సామజంబుల బట్టి చట్టలు చీల్చి
హరిపాలుడు నా పేరు అని తగ బలికె
కరితుండములు త్రిప్పి కంఠముల్ త్రుంచి
నాపేరు గోవర్ధ నని పేరు వాడి
భూపాలకుల నణచి పుట మొనరించి
కోపాగ్నులై ధుమికి గోపాల విభులు
రూపంబు లడఁచిరి ఘోషమేతమున
శ్రీరామ యని తలచి చివ్వున లేచి
బారు బారులు భువి పడ గూల్చిరంత
కేరుచు మీరుచు కేక లేయుచును
పేరెము ల్వారుచు పెనగి కయ్యమున
ఒక్కొక్క మెట్టున వరసి తరుగుచును
పక్క చాపలు రెండు పరపిన రీతి
చెక్కిరి యాదవసేన వైరులను
పొక్కిలి తేజీలు పడ గెడమియును
డొక్కలు చించి కందొనలు గాలించి
మంచి సిపాయిల మన్నె నాయకుల
కొంచ కర్పించిరి గోపకుమాళ్ళు
గున్న ఏనుగు వైరు గుంపుల మీద
కన్నె సింహముపిల్ల గమకించునటుల
దాటించె అశ్వాల తరిమి హయాల
నాదించి రని ఘోటక నారసంఘములను

పోటు ధారలు పొట్ట పగుల గొట్టించి
నూటికి నొక్కొక్కరు నొక్కించి పొడిచి
ముందు ముందు రక్షమూకల గూల్చి
వంది మాగధులచే వార్త చదివించి
శ్రీరామ ముప్పిళ్ళ చిన్నజముదాళ్ళ
అరూఢి నైజాల అంప వర్షంబు
చేసిరి యాదవ సింహవిక్రముల
ఏసిరి యాదవు లనేక యేనుగుల
కోస్సిరి చేతులు గొంతులు కాళ్ళు
త్రోసిరి కలభూత దొర బంధుజనుల
తరిగిరి కలభూత ధరణీశు బంట్ల
పరిగిరి వెన్నము పై విధము రిపుల
పరిపిరి పగవారిపై బాణములను
నెరపిరి యాదవు లనేకంబులాను
పలికిరి యాదవుల్ పంతంబు చాల
నిలిపిరి ప్రఖ్యాతి నిఖిల లోకముల
కలిపిరి చెయ్యిచెయ్యి కయ్యంబు లందె
పొలిపిరి శిరములు పుచ్చకాయలుగ
తలిపిరి పలురాజు తమ్ముల మనుచు
నలిపిరి శత్రుల నందరి బట్టి
పులపుల చేసిరి భూతలాధిపులు
కళిపెళ నాదించి కంచు కొమ్ములును
కొలిపిరి అనినేయ గోసంగి వరులు
కొట్టిరి మదగజ కుంభ స్థలాలు
మెట్టిరి శత్రుల మెదడు వెళ్లురుక
తట్టిరి చేదంతి దంతులపైన
పట్టిరి కడతొలుగు పొరుబంటులను
పెట్టిరి సరదార్ల పేర్లు పదినూర్లు
కుట్టిరి శూలాలు గుండెలు నాట
పుట్టిరో అద్భుతం భూమిలోపలను
అటువలె నేతెంచి అణచిరి మూక

## పలురాజు మంత్రి పులిముద్దు రామన్న రంగధామరాజు మంత్రియగు రామలింగన్నతోపోరి రణమున కూలుట

సమర ధోర్భలు ధామసాని వెంగన్న
రమణుడు పులిముద్దు రాము గుణధాము
ధీరులు సింగముల్ దీటు మానవులు
పోరు ఘోరము చేయ పొంగుచు లేచి
హరిపోలుతో సెలవు నంది నవ్యమను
అరుదేరగా చూచి అటు రంగధాము
రాజు ధర్మని మంత్రి రామలింగన్న
తేజ మార్తాండు డేతెంచె సెలవొంది
పైనూరు గుర్రముల్ పట్టపేనుగులు
మదగజంబులు నూరు మన్నె సరదార్లు
ఐదు నొక్కటి వేయి అశ్వమూకలతో
బయ లార్భటింపుచు పగకు నెదిరింప
రాగానె పులిముద్దు రాము గుణధాము
సాగి వేగమె ధామసాని వెంగన్న

హయములు పది నూర్లు అణచి పడ
ద్రోచి
ద్వయము మ త్తేభముల్ దురములో
గూల్చి
అయిదు వొక్కటి వేయు అర్వ మూక
లను
బయలుచేసిన చేను పడగోసినటుల
మన్నీల సరదార్ల మదమణచి రంత
రంగధాముని మంత్రి రామలింగన్న
ముంగల పొడగాంచి ముంచె శరవృష్టి
నించిన యంతనె నిలిచి యాదవులు
పేర్చిరి శరములు పెనువాన రీతి
అంచితంబుగ తన్ను అందరు జూడ
రామలింగేశ్వరుడు రణము చాలించి
సీమంబుతో బల్కె నిలచి అల్లంత
"రావన్న పులిముద్దు రామన్న నాతో
కోవన్న యుద్ధము కొదువ లేకుండ
వకరికి ఇద్దరు వైరంబు జగతి
తగదు నీకును నాకు తగును యుద్ధంబు
చాలించు మను దామసాని వెంగనను
ఆలించు నొకగడియ అటు నిల్వరమ్మ"
అనిన పులిముద్దు రామన్న తా లేచి
నెరచి రమ్మనె తనతో నిలిచి పోరు
టకును
ఘన దామసాని వెంగన నిలుచుండె
అనుపమంబుగా నిర్వురాజి వీక్షింప

మతి మంతులని చాల మరి బుజ్జగించి
అతని గూర్చించి తా నతనితో పోరె
పలురాజు తమ్ములు వంశపావనులు
నిలచి చూచిరి వారు నిళచి పోరగన్ను
రంగధామరాజు రఘురామరాజు
చెంగట ఇరువురి శౌర్యంబు జూడ
పోరిరి యిద్దరు భూమి గంపింప
మీరిరి శౌర్యంబు మించి కోపించి
విడబడి పెనగిరి యిద్ద రొక విడుత
అడుగునబడి మీదు నై రొక విడుత
తకచక చెణుకులు చేసి రొక విడుత
వకరి గొంతులు వక రొడిసి రొక విడుత
చేతప్పు లేకుండ చెంది రొక విడుత
ఘాత చేసిరి దొడ్డగా నొక విడుత
రామలింగేశు నురంబు పులిముద్దు
రామన్న నరికె తా నసిధార మునుగ
నరికిన మూర్చిల్లి అంతలో దెలిసి
కెరలి గోర్చెను కలని కెదురు రోషించి
ఖురుగడ భూపతు లెంచుచుండంగ
పరవళ్ళు చేయుచు పట్టిస కొంచు
ఆలమున చెడుగుడు లాడిన వగిది
పులిముద్దు రామన్న నద్భుతముగా నరికె
బవరమున నిద్దరికి ఖారమై పోట్లు
తిపిరి యుద్ధము చేయ ధీరులై లేచి
పెనిగిరి యిద్దరు పిడిగుద్దులాట
తవిపి తీరగ పోట్లు దాకి ఘూర్ఛ దలచ్చి

కత్తుల పొన్నుల కలవర మొంద
మత్తేభములరీతి మడిసిరిద్దరును
సత్తుగల మొనభటుల్ సాహసపరులు.

## వలురాజు మంత్రి దామసాని వెంగన్న, రంగధామరాజు బావయగు రాజగోపాలుని చంపి వీరస్వర్గము చేరుట

ఇత్తరి వారిద్దరిల గూలుటెరిగి
సాహసాంగుడు దామసాని వెంగన్న
బాహు బలంబు చూపదలంచి చేసి
ఖండించెవైరుల గజ తురంగముల
తుండించె నొక్కొక్క దుర్గాధిపతుల
దండించె మేలు సర్దార్ల వజీర్ల
పండించె ధరను భూపాల శేఖరుల
తప్పించె శిరములు దండి నాయకుల
నొప్పించె కళభూత నృపుచను వర్ణ
కుప్పించె పాతెల గుంపులమీద
కప్పించె పెంధూళి కానరాకుండ
ఇటువలె యుద్ధంబు విపరీతము గను
కట పెట్టి సేయ నాక్రమ మెల్లజూచి
రంగధాముని బావ రాజగోపాలు
సంగర స్థలి విల్చి సైంధవమెక్కి
"యెవ్వరు దామసాన్వెంగళ టంచు
క్రొవ్వి నాపాని వెరగుకొనగ నేవింటి
చెప్పంగ బాల నీశౌర్య ధైర్యంబు
ఇప్పుడు చూతు నీ విక్రమంచేది ?"
అని రాజగోపాలు డాడిన దామ
సాని వెంగళు రణస్థలి నిట్టులనియె
"విను రాజగోపాల విక్రమశీల :
అని సేయ నెరయోధు వౌదువు నీవు
నారాజు హరిపాలు నందగోపాలు
కోరి నాయుద్ధము కొనియాడ వలయు
రఘురామ రాజు మీ రంగధామన్న
తగు వారి యుద్ధమని తలచ
వలెనయ్య"
అని యార్చి పేర్చి కరాళంబు పూని
మును రాజగోపాలు ముఖమున వైచె
వైచుకరాళము వైపు దప్పించి
సాచియు వెంగళ సాహసోత్తముని
గడిమి రొప్పుచు పేర్చి కడు కరాళించి
పొడిచెరొమ్మున యదుపుంగవోత్తముని
ఝుడియక అల దామసాని వెంగన్న
ఖారమై రాజగోపాలుని జూచి
నోరుడిగి యదు బలోన్నతుతు రోషించి
సుకృక యిరుమేర చారషలు చేసి

చక్కగ సతనెడమ చనుమొన బొడిచె
అమరక ఆ పోటు ఆయంబు దగిలి
భ్రమదట్టి కన్నుల పరమాత్మదలచి
రాజగోపాలుండు రాజులు జూడ
ఆజిలోపల గూలె హరహర యనుచు

వీరుడు దామసాని వెంగళుడపుడు
ధర నిల్వలేకను తలచె శ్రీహరిని
గరి దూరి బాణాలు గాయములచేత
వొరిగె మత్తేభమువలె భూమిపైన

## ఎలురాజు మంత్రి బండారుమల్లు దంగురాజు చెలికాడగు సరదారు పాపన్నతో పోరాడి కూలుట

అతడు గూలుటెరింగి హరిపాలుడపుడు
మతిమంతు బండారు మల్లుని జూచె
చూచినంతనె రణశూరుడై లేచి
త్రాచుదు నని యిక తగు హయంబెక్కి
ఏతెంచె వైరిసేనల మీద నంత
ఘాతచే పగవారి కంఠముల్ దునిమె
పాటింప ఏనుగులపై వార్ని ద్రుంచె
ఘోటకంబులు చెండి గుట్టలు వైచె
పృథివిపై మత్తేభ పుట మణగించి
అతిశౌర్యవంతుల హతము గావించి
అటు మీద దాటించి హయము
హొయ్యాలి

ఔటువలె నేతెంచు వీరుని జూచి
కలభూపతికి చెలికాడు గుడికాడు
బలుకారు సరుదారు పాపన్న పేరు
రంగధాముసకు కరిమ్మలు మొగిచి
పొంగుచు భట్లచే పొగడించు కొనుచు

బండారు మల్లన్న పైదాకె నపుడు
నిండారు కన్నుల నిలచి ద్రిష్టించి
బండారు మల్లన్న పక పకనవ్వి
చంద్రప్రతాప రణశౌర్యుడై పలికె;
"ఘనుడవు పాపన్న కయ్యము చేయు
వనరంగ బహుశౌర్య వంతుడటంచు
బహు మన్నె సరదార్లు పలుకగా వింటి
వహికెక్కు బహు బుద్ధి మంతుడవు
వేగ
రమ్మ తడవేటికి రంగంబు సేయ
లె"మ్మని నంత తాలేచి పాపన్న
జముదాళి నేజాల జడి వానలీల
నిముసు కత్తులతోటి నిలువెల్లపోట్లు
బండారు మల్లుకు పైభారమాయె
కండ కండకు పోట్లు కత్తి నరుకులు
తగిలి కోపించె నుద్ధతి కఠారమున
తగిలించె ఎదురొమ్ము దాటి పరుజాన

అదిగాడి పాపన్న కతి భారమయ్యె
మదినుంచి పరమేశ మహిమీద వ్రాతె
మరి వెనుక బండారు మల్లు గాయములు

హరిపాలుజూచి శ్రీహరిని ప్రార్థించె
మేలు మేలని సురల్ మెచ్చు చుండంగ
నాలమున గూలె బండారు మల్లన్న

## హరిపాలుడు రంగధామరాజుతో యుద్ధముచేయుట

హరిపాలుడు పంచ కల్యాణిపై నెక్కి
మురియుచు రంగధాముని దాకి బల్కె
"కంభూత మీయన్న గంగ భూపాలు
వలురాజు మాయన్న వరగుణసాంద్రు
డెలమంచి కండెమొండెముల పట్నముల
నెరకొని మిము మమ్ము నెరయోధు
కోరి పంపిరి పేరు కొనియాడి మనల
ఇద్దరికి జోడవును యుద్ధంబు వార్త
పెద్ద అన్నల వరకు పేరు గావలయు
రంగాదాముడ యుద్ధరంగ మీ వేళ
శృంగార వర్ణమై చూడవలె జనులు"
అనుచు ఘోషించి కరాళించి మించి
ధనువు ఎక్కిడి రంగధాముని మీద
పంచ శరంబు లింపార మైనిండ
నించెను హరిపాల నృపతీశ్వరుండు
రంగధామునకు శరంబులు నాటి
రంగైన దీప్త శరంబులు దీసి
కర్ణముష్టి పటుతర కర్ణాంతముగను
హరిపాలకుని నుదురంటగ వైచె,

షకో పక్క నవ్వి హరిపాల భూవిభుడు
వక దివ్య శరము పావకుడను పేరు
తగుల నేసెను రంగధాముని యురము
తగిలిన దేహంబు తహతహ పడును
పరిపరి విధాల బాణఘట్టాల
హరిపాలకుని తేజి నవనిపై గూల్చె
అనుచు హయము కూలుట తెలిసి హరిపాల
కుండు
నయగుణ ధ్వని చేసి నారసంబులను
ధరగూల్చె నటు రంగధాముని హయము
ఇరువురు విరథులై విడిబడి ఘోర
శర పరంపరల విచ్చలవిడి చేసి
వరబాహు శక్తిచే వక్క బాణమున
రంగధాముని శిరము రంపమున దరుగు
భంగి భువిగూల్చె హరిపాల శేఖరుడు
పొంగి యాదవసేన పొగడె హరి
పాలుని
రంగధాముని గూల్చి రాజు హరి
పాలుడు
అంగాగములు కండలలుగులు నాట్టి

త్రిపురసంహారుని దీన రక్షకుని
ఫాలాక్షు పార్వతి పతియైన వాని
నీలకంఠేశుని నిల్పి హృదయమున
విపరీతముగ వరమిచ్చెడివాని
హరి పాలకుండొరిగె నమరులు మెచ్చ

## నందగోపాలుడు రఘురామరాజుతో పోరాడుట

హరిపాలకుం డొరుగు టదియెల్ల దెలిసి
నంద గోపాలుండు అమిత విక్రముడు
అందె సింహతలాట మమరిన హయము
క్రమమొప్ప నవరత్న కలికి తురాయి
కొమరొప్ప ముత్యాల గొడుగుల నీడ
రంజిల్లు రఘురామరాజు రవితేజు
పంజుపై నందగోపాలు డేతెంచె
రఘురామ రాజేంద్రు రథముపై డిగ్గి
తగు ఘోటకంబెక్కి ధాటిగా నిలచె
నిలచిన కనుగొని నందగోపాలుడు
పలికెను అతనితో ప్రౌఢవాక్యములు :
"వినవయ్య రఘురామ : విమలగుణ ధామ :
ఘనుడవు నీవు భీకర శాలి వనుచు
భువిలోన సకల నేర్పరి వనుచు నిన్ను
అవనిలో నందరు ఆడుకొన విందు
అక్కడక్కడ యుద్ధమవని లోపలను
చెక్కి చెండాడిన శౌర్యుండవనుచు
బలు మన్నెసరదార్లు పల్కగా వింటి
సులభ మెన్నగలాదు శూర్తుండవన్నిరి
అవనీశ : మాచేత నందు కార్యంబు
ఆవల తొలగు నీపని చేయకుంటె"
రోషించి హయమును రూఢి నురికించి
భాషించి రఘురాముపైకి లంఘించి
మేరు సమానులు మెరుపులో యనగ
వారిధి తొనుకులో వడియు సింగములొ
భల్లూకములునొ సొంపైన వ్యాఘ్రములొ
విల్లునంబుల నేజ ఈటె ముప్పిళ్ళ
బాకుల సొంగుల పట్టె చెణుకులను
ఏకాంగి వీరులై యెదురించి నిలచి
నందగోపాలుండు ఆర్చి కుప్పించి
అంది రఘురాముని ఆయంబు దగుల
జముజాలమున గ్రుమ్మె సాహసోత్తముడు
అమరనాటిన నొప్పినట్టి రఘురాముడు
నందగోపాలుని నరికె ఖడ్గమున
ఇందందు ఘోషించె ఇటునటు మెలగి
అది నందగోపాలుని కాయంబు తగిలి
పదును జముదాళ్ళను వరు జానపొడిచె
కోపించి రఘురాముడు కోరి ఖడ్గమున
చేపిడి యాదవసింహు త్రుటు వైచె

పక పక నవ్వి యా పార్థివోత్తముడు నిగమాంతవేద్యుని నిల్పి హృద
ప్రకటించి నందగోపాలు రోషించి యమున
రఘురాము శిర మిల ధర్మ్రాల తెగ నందగోపాలుండు అపని పై నొరిగె
టార్చి

## గోవర్ధనుండు-చిన గంగురాజుతో యుద్ధము చేయుట

అన్న లిద్దరు గూలు టదియెల్ల దెలిసి
వన్నె హయమును గోవర్ధనుండెక్కి
వైరుల నురుమాడి వాజుల గూల్చి
ధైర్య ప్రతాపు డుద్దండ కోపమున
స్యందన వారణ శస్త్ర సంఘముల
ముందుగా సరికట్టి మూకసర్దార్ల
పదింమా మేటి భూపాల శేఖరుల
పడిమించె నపుడు గోవర్ధనోత్తముడు
అతని ప్రతాపంబు సంతయు చూచి
మతిమంతు చినగంగు మండలాధిపుడు
తక్కిన బలములు తగిన భూవరులు
మక్కుచ ఇరుమేర మరి చేరి కొలువ
గోవర్ధనుని దాకి కోయని యార్చి
భావింప గంగభూపాలు డిట్లనియె
"వద్దు యుద్ధంబు గోవర్ధన నాతో
పెద్దు శౌర్యము లేల బల్కుచున్నావు
బుద్ధిశాలివి ఇట్టి బుద్ధులు మావి
తద్దయు వేడ్కతో తర్లిపోవన్న
కద్దు యుద్ధంబు ఎక్కడనైన భువిని
ఇద్దరు మీయన్న లిడిబడి చచ్చిరి
కుద్దు మా యన్నలు కులగిరుల పోలి
హద్దుగా పోరాడి హతమైరి చాల
అన్నలిద్దర గొంచు నరుగు మెలమంచి
వన్నెగా మాయన్నలను గొంచు నేను
ఖండెమొండెమునకు కదలి పొయ్యె
దను"
అని యాడు మాటకు అల్లన నవ్వి
అదలించి చినగంగు అసహాయ వరుని
వదనంబు చూచి గోవర్ధనుండనియె:
"ఓ వీరశేఖర ! ఓ గంగురాజ !
ఈవార్త వీనుల వినరాదు నిలువు
మా యన్నలిద్దరు మడిసిరటంచు
ఆ యన్న కడకు నేనరుగ ధర్మంబె
వినరాని మాటలు ఈలాగు మాతా
అనరాదు రాజుల కపకీర్తి కలుగు
మాయన్న విన్న యేమను నను జూచి
న్యాయంబు గాదు అన్యాయంబు ఇదియు
పల్కులేటికి నాతో జవరంబు చేయ
నులికితే తొలగుము నృపతున్నకడకు"
గోవర్ధనుండిట్లు ఘోరాజ్ఞి లోన్న

తీవరంబుగ పలికి ధీరుడై కదసె
కదసిన యపుడె చినగంగు రాజేంద్రు
పడలుడై ఆజి కేర్పడ నిల్చెనంత
బాలరాజులు విల్లు బాణముల్ తొడగి
పూలయడులవలె భూపాలమణులు
కాండంబు లైదు చినగంగు భోజుండు
చెండెను యదుకుల శేఖరు మీద
అంత గోవర్ధనుం డాగ్రుడై నిలచి
మంత్రించి యొకబాణ మతనిపై వైచె
వైచిన గంగభూవరు నుదరంబె
సైచక నిరువది సాయకంబులను
వరశక్తి నేసె గోవర్ధను దగుల
ధర నిల్చి కాండములు దాకిన నతడు
అదలించి గోవర్ధ నవనిపాలకుడు
గదియించి తురంగంబు గంగేశుపైన
గొడుగు పడిగెలు గూల్చె గోవర్ధనుండు
యాదవుతేజీని అవనిపై గడపె
ఇరువురు ధరణిపై విడిబడిరంత
పరువిడి చేసి నేర్పరి వివిధగతుల
తీవరంబున పట్ట తీసిపోవైచె
గోవర్ధనుండతని గొంతు తెగవైచె
కరణాల కొరకుగా కలహంబు చేసి
వరిగె చిన గంగుభూవరుడు ధరమీద
అంత గోవర్ధనుం డమితవిక్రముడు
కొంత యుద్ధము కరి ఘోటకావళుల
క్షితిలోన కీర్తి సుస్థిరముగా నిలువ
పృథివీతలేంద్రు లద్భుతముగా జంపి
రాజుల సరదార్ల రంగమధ్యమున
రోజు పరిపించి విరోధుల గూల్చి
తేజీల రాహుతుల తెరవు లొటిపిటల
ఆజిలో పుట మణచి అవనిపై వరిగె
ఆ సమయంబున నా రణంబునకు
రాసాగె పులులు హెరాళంబుగాను
నక్కలు గుంపులై నడికల్లు జొచ్చి
డొక్కలుచించి మొండెము లొండుచేసె
ప్రేవులు దొబ్బలు పెరికి భక్షించి
గావులు బట్టి చక్కని రక్తమెల్ల
పీల్చి సంతోషించి పేరెముల్ బారు
ఆర్చుచు భూతములాడు బాములును
దొబ్బలు గుండెలు దొరకొని మెసగి
బెబ్బులుల్ కడుపుపై పెళపెళ నార్చు
ఘాత చేయుచు కళ్లి కాపాడు కొనుచు
భేతాళు దేతెంచె పెడబొబ్బ లిడుచు
మరి యిట్లు విపరీత మార్గమై రణము
పరగంగ ఆజిలోపల నుండె నంత

## యుద్ధమున మరణించిన వలురాజు తమ్ములను మంత్రులు యలమంచికి తీసికొని వచ్చుట

ఖవరము నందగోపాలు హరిపాలు
నవతేజ గోవర్ధనమిత విక్రముడు
అని చేసి పగతుల అవనిపై గూల్చి
ఘనమైన బాణముల్ గాడి మైనింద

అలుగుల పొన్నపై హరహరయనుచు
ఇల గూలుటయు చూచి యెలమి యాద
వులు
తిరుమందు లచ్చన్న, తిరుగొండి రాము
పురుదారు మాతన్న, వోచ రామన్న,
వలురాజుతమ్ములు వరుగుట చూచి
కలయ నేతెంచి అక్కడికిని వారు
భోజుల వీక్షించి మొక్కి తలయూచి
"రాజధరు దయదప్పె వ్రాసె నా
బ్రహ్మ
కాలము కూడెను ఘనవంతులార
చాం మీపై నింద శరములు గాడి
యీలాగు రణరంగ వీథు లేర్పరచి
సోలితిరె యదువీర శూరులై యిందు
ఆలములకెదురులేరని పించి మాతో
వాలలాడితిరె కేవలముగ రిపుల
వలురాజు మీ యన్న వంశవిస్తారు
వలనొప్ప ఈ చెడ్డవార్త దావింటె
ఎంత చింతించునో యదుకులోత్తముడు
కంతు సమాన భూకాంత సుతులార!"
అనుచు దుఃఖించి పాలకి లోననుంచి
ఘనచిత్ర వస్త్రముల్ గప్పి మైనిండ
బంధువుల్ గుమిగూడి పల్లకిలెత్తి
వంది మాగధులచే వార్త చదివించి
కల బంధువర్గంబు గడియ లోపలనె
ఎలమంచిపురి చేర నేతెంచి రంత
వలురాజు కొలువు చావడియున్నకడకు
కల కలార్భాటముల ఘాతచే వారి
బిరుదులు పద్యముల్ భీకరాకృతిగ
వరుసతో చదివిరి వందిమాగధులు
రంతులు విని వలురాజు భూవిభుడు
ఎంతయు భీతిల్లి యదురాజ బిరుదు
వినబడి తా లేచి వెతబడి నిలచి
తనలోన తాను తన తమ్ముల తలపు
తలచుచున్నంతనే దగ్గరచేరి
పలికిరి యదురాజ పదపద్మ సరళి
నిలిచి రణస్థలి నిలువెల్ల దెలుప
"వలురాజ గోకుల వంశవిస్తార!
నవమన్మధాకార! నయగుణాచార!
ధవళయశోపార! ధర్మశరీర!
నీ చిన్నితమ్ములు నీతిపావనులు
రాచకుమారుల రణమందు గూల్చి
దేశాధిపతుల దుర్దశలు పరిపించి
భాసిల్లు యదుకుల పంత మేర్పరచి
మొనకొని వైరిసమూహము నెల్ల
వెనుదగిలి శిరములు వెదకి ఖండించి
గంగురాజాధీశు ఘనుని తమ్ములను
పొంగి తలలు ద్రుంచి పోగిడించి బిరుదు
హతమైరి తమ్ములు అవనీశతిలక!
మృతి చెందిరయ్య నీ ముద్దుల చిన్ని
భోజులు రొమ్మున పోట్లను నాటి"

## వలురాజు తన తమ్ములకై దుఃఖించుట

రాజు లిటువలె చెల్లిరని వినినంత
పరికించి పలురాజు పడి మూర్ఛనొంది
ధరణీశ్వరుడు లేచి తమ్ముల జూచి
తానంత భువిమీద తడబడ లేచి
"వో నందగోపాల ! వో హరిపాల!
గోవర్ధనుండ ! నా గోముల ముద్దు
కోవయ్య నేను మీ గోము చూచెదను
మిముచూచి మది చాల మురియుచు నుంటి
మము విడిపోతిరి మా యన్నలార
నాణ్యము లైనట్టి నా తమ్ములార
బాణాల పాలుగా పంపితి మిమ్ము
ఎన్నడు యుద్ధంబు ఎరుగని వార్ని
కన్నెకుమారుల కలని కంపితిని
పంపినందుకు యదుపంత మీదేర్చి
సొంపుతో రణముకు సౌరవులు చేసి
యిలలోన మీకీర్తి వెలసి నటింప
వలురాజు తమ్ములను వార్తకెక్కితిరి
నందగోపాలక ! అవనీశతిలక !
అందమెన్నడు జూతు నరుదెంచి రాగ
హరిపాలు ! చదరంగ మాడుచుండగ
ఇరవుగా కన్నార ఎన్నడు చూతు?
గోవర్ధనుడ ! నీవు ఘోటకం బెక్కి
భావింప నాదృష్టి బారు దెన్నటికి ?
ఇటువంటి తమ్ముల వీరుల చేసి
దిటము చేసుక యుంట దేహమదేల?
అనుజుల తరుణుల నగ్నికడ నిల్పి
ననబోణితో గూడి నాభోగమేల ?
నందగోపాల ! నిన్ననిలోన జంపి
యిందు నా ప్రాణంబు లిల బొంద గలదె ?
హరిపాల ! నీవంటి యనుజుని విడచి
పరగ నా బొందిలో ప్రాణ ముండెడిన ?
గోవర్ధనుడ ! నిను ఘోరాజి గూల్చి
భావము శయ్యపై పండి యుండెడిన ?
యలమంచి నాకేల? వెలదియు నేల?
కుల బంధువులు ఏల? గురువులు ఏల?
పరగ పుత్రులు ఏల? భాగ్యంబు లేల?
సరగ బ్రతుకులు ఏల? సంపద యేల ?
కొడుకులు శివులు ఘోడు ఘోష నుచు
అడలు చున్నారు అది ఏమి అనరు
ప్రేమతో సింహాద్రి పెద్ది రాజేంద్రు
సామజ భుజశాలి సరసు చెరనూక
పొలు పొందు నలనూక పోలురాజేంద్రు
కలకంఠి కొమరమ్మ కన్న కుమారై
దుఃఖవారాశిలో దుముకుచున్నారు
అక్కరతో లేచి అది యేమి అనరు
చింతచే మీ చదిన చీకాకు పడగ

అంతరంగమున మీ అలివేణులెల్ల
వార్త వినినంతనె వలపోతమాని
కీర్తిరాజవలెను మిక్కిలి సాగుమాన
మరుదెంతుమని లేచి ఆయత్తపడుచు
వణుగుచు న్నున్నారు ఓ తమ్ములార !
వగపెట్లు నిలుపుదు వో పల్లికొండ :
యిల నెట్లు తాళుదు వీరుల జూచి
వీరి పోట్లాటనే వింటిని కాని
శూరత్వ మాపట్ల చూడలేనైతి
ఏకగర్భమునందు వెడలిసందులకు
శ్రీకాంతు డిటుపలె చేసి యెడబాపె.
పృథివిలో తమ్ములు పుట్టెదరు చాల
మతిమంతు లిటువంటి మానవాధిపులు
ప్రతిమాట అన్నతో బలుకని వారు
సతత మాచారంబు సలిపెడి వారు
విసయంబు ఘనయందు విహిత
మార్గంబు
వినలేదు కనలేదు విను పల్లికొండ !
హరిమారు నీవు మా కానతి యేమి ?
దరిచూపి రక్షించు దరియించలేను
తమ్ములు నేను ఏదారి నడచినను
క్రుమ్మింతు శత్రుల కుదులు
త్రొక్కింతు
తమ్ము లెన్నడు జూతు దాపట రాగ
నిమ్మళించదు మనసు నిలిపెదననిన"
అని రాజు దుఃఖము ననుజులవంక
కనుగొని బొగులుచు కడుశోకమొంది
వలురాజు దుఃఖించి వొరుగుట జూచి
యెలమంచి సభ యంత యేకరంతులుగ
కొలుకుల కన్నీరు గోళ్ళ జిమ్ముచును
తొలకరి వానలు దుమికినయట్లు
కులకోటి బాంధవులు కులము చుట్టాలు
వలపోయ సాగిరి పంకలు చేరి

## మంత్రి పల్లికొండ వలురాజును ఓదార్చుట

కోదండధర పల్లికొండ యిట్లనియె
యాదవభోజుని ఎత్తి లాలించి
"తాతయ్య వలురాజ ! తగదు చింతింప
ఖ్యాతి తెచ్చిన వారికేల యీ వగవు
వనజాసనుని వ్రాత వడుపు దప్పింప
మన మెంతవారము మానవాధీశ !
చిన్నిరాజులు అని చెల్లిరన నేల ?
వున్నవారము రేపు వుర్వీతలేంద్ర !
వారు చెల్లిన వెనుక వసుధపై నాశ
కోరు వారెవ్వరు గోపాలవంశ !

చాలు నీ తమ్ములు, సమరప్రతాప ! అని పల్లికొండ యిట్లాడగా వినియు
మేలు మేలనిరి భూమేలు భూపతులు ఘనుడు దిగ్గునలేచి ఘడియలోపలనె
వలురాజ ! నీ యంత వార్త పుణ్యునకు త్రవ్వించె గుండముల్ తరుణులకు
వలపోత చెల్లదు వగపు చాలించు సెలవు
రాజువు దుఃఖించరాదు తమ్ములకు అవ్వెనుక సాగుమానములు గావించి
కాజేయు మీ పని కదలించు దండు తరువాత బంధువుల్ తాను తమ్ములకు
సభవారి దుఃఖము సఖుల దుఃఖంబు వరుస క్రతువులు చేసి వసుధలో
రభసంబు ఏటికి రాజ ! చాలించు గలుగు
పురిలోన కాలంబు పుణ్యంబు ఏమి పండిగ షోడశ దానములు చేసి
ధరణీశులకు చావు ధర్మమే యిటుల మండలాధీశు తిరుమందులు తాము
సంగద మరదండ్ల సాగుమానంబు సాపంక్తి గూర్చుండి షడ్రసాన్నములు
రంగుగా సెలవిమ్మ రాజిటు లెమ్మ" ఔపాసనములంది అలచు జయించి

## వలురాజు కలఘూత గంగురాజుతో యుద్ధముచేయ సమకట్టుట

## పల్లికొండ వారించుట - వలురాజు నిశ్చయము మారకుండుట

ఒకనాడు కొలువుండి వలురాజ విభుడు "వినవయ్య పందుముల విమల రవి
సకల మంత్రులు హితుల్ సన్నిధి తేజ !
గొలువ అవనిలో అనుజులు హతమైన వెనుక
ఎల్లవారును విన నెదుట గూర్చున్న ఎలమంచి పట్టణ మేలను మనకు ?
పల్లెకొండను చూచి పలికె యదురాజు కలఘాత నృపతితో కలహంబు మనము
చేయగపలె మన సేనలకెల్ల

నీయుడి సెలవును ఇప్పుడే తీర"
అని పల్కగా విని హరి పల్లెకొండ
"మనుజేశ ! వలురాజ ! మనవి ఆలించు
అనుజులు చెల్లిరని అధిక రోషమ్ము
ఘనుడ నీకేటికి కడు వెర్రిబుద్ధి
ధరణీశ ! సారెకు తమ్ముల వార్త
నెరసు జారిన రీతి నేల బల్కెదవు
వీరు వారును మహా వీరసము చేసి
జారు దీరిరి ఘోర బవరంబునందు
పోరాడి యిరువురు బొలిసిరిగాక
వారిచే వీరును వొరుగుట లేదు
అల గంగురాజేంద్రు ననుజుల జంపి
వలురాజ ! నీతమ్ము లొరిగిరి గాక
మిగుల పోవుటలేదు మిక్కిలి వారు
తెగువతో వెనుకను చెల్లిరి భువిని
వారిపై కయ్యంబు వలదు సారెకును
వారు ముగ్గురు రాజ వరులును చెల్లె
వీరు ముగ్గురు చెల్లె విను వలురాజ !
బలము సమానంబు ప్రభువులు సమము
కలహంబు చాలించు కడ ముట్టబోదు
రాబోరు తమ్ములు రాజ వలురాజ !
ఆభాస గాగలదొ అది తెలియబోదు
ఆజిలో పోరాట మందుముమ్మాడిక
నే చెప్పినది నమ్ము నెగులు బోనిమ్ము
కలభూపతికి నీకు కలహంబు వద్దు
తిలకింప నా దృష్టి తిరుగనంటి
చాలు యుద్ధము నీకు చారుల కొరకు
యేలయ్య యుద్ధము యదుకుల
చంద్ర ?"
అని పల్లెకొండ ఇట్లాడగా చాల
విని వలురాజేంద్రు డిట్లని పలికె :
"పందుముల గుణశాలి ! భాగ్యవం
తుండ !
సుందరాంగుడ ! నీదు సుద్దిపోదాయె
మంత్రి శిఖామణి ! మౌక్తికాభరణ !
తండ్రులపరాధుల దైవము లాది
సుజన పాలనమూర్తి ! సురుచిరకీర్తి !
విజయ బలోద్దండ ! విను పల్లెకొండ !
బహు దినంబులు మని పట్టణం బేలి
మహికెక్కి యెన్నాళ్ళు మరియుండ
గలము
అగ్గలముగ ఎల్లి ఆ రాజు కోట
లగ్గ కెక్కింతు కోలాహలము రిపుల
కొట్టింతు నామది కోరిక దీర
నెట్టింతు కోటలో నేడు సర్దార్ల
త్రొక్కింతు తురుముగ తురగ సంఘ
ముల
చెక్కింతు ముక్కలు చెలగి శూలాల
మగ్గింతు గిరులగు మదగజంబులను
బ్రుంగింతు రక్తాన ముంతు రక్తమున"
అని యిట్లు వలురాజు ఆడినందులకు
విని పల్లెకొండ తానిట్లని పలికె :

"యదుకుల రాజేంద్ర ! అమిత గుణ
సాంద్ర ! కదన విక్రమమూర్తి ! కలదు నీ
కీర్తి ! ఎన్న శక్యంబె నీ నెర మొగతనము
చిన్నవారము మేము చెప్పగా వినవు
కలభూతరాజుతో కలహంబు వలదు
వలురాజ ! పైబడి వచ్చు కార్యంబు
ధీరుడ నా దివ్యదృష్టి చూచినను
పొరదు హెచ్చుగా పౌరుషంబైతె
సరసుడ ! యిరువురు సరిబడగలరు
సౌరిది విప్రులు ఏల చొచ్చిరి మరుగు ?
కరుణించుమని వేడుకొననేల మిమ్ము ?
ధరణీశ ! నీ కింత దయ యేల గల్గె ?
కలిగినందుకు బుద్ధి గల్గు తమ్ములను
కలనికి పంపించి కయ్యమిటు కొల్పి
తతికాల మరుదెంచి దైవాజ్ఞనుంచి
మితి మీరి పోయిన మీదట నీవు
కలభూతరాజుతో కాలు దువ్వుచును
కలహ మేమిటికి లేని కార్యమేమిటికి
నా బుద్ధి విను తాత ! నయగుణాతీత!
నీబుద్ధి గోకులము నిర్మూల మౌను"
అన విని వలురాజు అల్లున నవ్వి
వినయమార్గంబున ఇట్లని పలికె :
"శ్రీరామ! గోవింద! శౌరి! ముకుంద!
నారాయణవతార! నవనీతచోర!
నందకుమార! సుజనాపనశూర!
పందుముల ఉద్దండ పల్లెకొండయ్య!
బ్రతుకుటపై ఆశ ప్రాణిపై ఆశ
సతులపై ఆశ సంసారంబు ఆశ
వప్పదు మానసం బో పల్లెకొండ
కుప్పింతు నొప్పింతు కుంభీనీపతుల
తప్పింతు శిరములు దండి రాసులుగ
కప్పింతు పెంధూళి కానరాకుండ
ఇప్పించు సెలవు యదువీరవర్గమునకు"

## పల్లికొండ సైన్యములను ఆయత్త పరుచుట

అను పల్కు విని లేచి హరి పల్లెకొండ
వేసర తిరుమందుల వల్లపులకెల్ల
కొలువు లోపల నున్న గోపవీరులకు
సెలవిచ్చె పైనము ల్సేనలకెల్ల
పలుకుచు పేర్వారి పల్లెకొండయ్య
కులబంధువుల నెల్ల గురువు తా బిలచె:
"జెట్టి బోయినవార! జడదారివార!
ఘట్టిగా కోటలగ్గకు మీకు సెలవు!

పల్లెబోయినవార! బండారువార!
పెల్లుగా లగ్గకు పైనముల్ గండి!
కొండెబోయినవార! కొమనాలవార!
ఖండితముకోట లగ్గకు మీకు సెలవు
ఆవపువ్వువార! అచ్యుతువార!
వేవేగ లగ్గకు వేగ పదరయ్య.
గుండె బోయినవార! గుమ్మడివార!
దండి లగ్గకు సెలవు తర్లుడీవేళ
శంఖుదారవార! జడదేవివార!
శంకేల లగ్గకు సెలవు పదరయ్య
కనక నందులవార! గంగావువార!
పనిబూని లగ్గకు పదరయ్య సెలవు!
మద్దిరావులవార! మాధవువార!
సద్విజోత్తములార! చాలపై లగ్గ
గుమ్మడి వార! ఓ గోవిందువార!
సమ్మతి పదరయ్య సర్వలగ్గలకు
చామవువ్వువార! చింతమవార!
సంతోషలగ్గలకు సాగి పదరయ్య!
చెన్నుబోయినవార! చెంగల్వవార!
పన్నుగ లగ్గలకు పదరయ్య మీరు!
బృందావనమువార! పుల్లెద్దువార!
కందువ కోటలగ్గకు నేగరయ్య!
చామటావులవార! జడదేవివార!
క్షామరక కోటపై వెళ్ళుడి లగ్గ!
చల్లవార! దామసానియువార!
మొల్లముగ కోటపై ముట్టడి లగ్గ!
రచ్చరావులవార! రాయంచవార!
అచ్చాళి కోటపై కరుదెంచరయ్య!
బోరున కామనబోయినవార!
రారయ్య కోట పేరైన లగ్గకుకు
మట్టెద్దువార! వో మానమువార!
పట్టి వత్తమురండి ప్రాకారలగ్గ
పాలబిందెలవార! పద్మాక్షువార!
వాలాయముగ లెండు వరుసైన లగ్గ!
పోరు కెరువని దండెబోయెనవార!
ఆరూఢిగా కోట కరుదెంచరయ్య!"
పైనముల్ గమ్మని పల్లెకొండయ్య
వైనాన కులబంధు వర్గము బిలచి
దేశాధి పతులకు దిక్కు దిక్కులకు
వ్రాసి పంపించె హావ్వాయిగా లేఖ
కమ్మలు చూచుక ఘడి ఘడికెల్ల
సమ్మతించుక నడిచె సర్వదళాలు
ఎలమంచి పురి బైట ఎత్తె దేరాలు
ఎలమి భూపతులెల్ల వెలపట నిలచి
వలురాజునకు కబురు వచ్చినా మనుచు
మలయుచు తగు రాజమంత్రు లేర్పరచి
పంపిరి దేశాధిపతులు వేవేగ

## వలురాజు తనకుమారుడగు పెద్దిరాజుకు పట్టముగట్టుట

పంపిన యదుకుల పట్టభద్రుండు
పరికింప సంతోష భరితుడై రాజు
మరి మరి నుప్పొంగి మంత్రుల బిలచి
పల్లెకొండను బిలచి పలికె వలురాజు:
"చల్లని మాపాలి స్వామి! నామనవి
విన్నవించెద నీవు విని గారవించు
చెన్నొందు భూపతు ల్సేనాధిపతులు
వచ్చియు నెలమంచి వూరిబయళ్ళ
నిశ్చయముగ డేరాలు నిలిచె అల్లవిగొ
వహి కెక్కు మన బంధు వర్గము మనము
సహజంబుతో దండు సాగించవలెను
ఇదిగాక నొకమాట విను పల్లెకొండ!
కదనము కేర్పడి కదులు చున్నాము
ఇక జయాపజయంబు లెవ్వరి కొక్కొ
నికరంబు యెవ్వరొ నిల్వని దెవరొ
అది తెలియరాదయ్య హరిహరుల మాయ
కొదువ విచారంబు కొనసాగవలయు
నా ముద్దుపుత్రులు నధిక విక్రములు
కాముని మారుగా ఘనులు ఉన్నారు
బాల లేవ్వరిలోన బలవంతు లెవరొ
వాలాయముగ దెల్పు ఓ పల్లెకొండ!
ఘతిమంతు డెవ్వరొ మనకీర్తి నిలుప?
ఘనునికి ఘనలమంచి అధికార మిచ్చి

భూపతి లక్షణంబులు దెల్పి చాల
ఏపుతో మనదండు వెడలించు" మనుచు
అని యిట్లు వలురాజు ఆడినందులకు
గొనకొని పందుముల గోవిందు బలికె:
"తాత! నీ సుతులు ఇంతటి వారలనుచు
నాతరమె వర్ణింప అవనిపాలకుల
వారలు నీకన్న వార్త కెక్కుదురు
ధారుణిలో కీర్తి తరుచు తేగలరు
వరుస నావులవారి వంశంబు నిలువ
నిరత మాచారంబు నిలుప గలవారు
తిరమంద కులపగల్ తీర్ప గలవారు
అరుదైన మిక్కిలి అసహాయ నరులు
ఏగురు పుత్రులు ఏకాంగివరులు
బాగైన శివభక్తి పరులగు వారు
నిత్యాన్నదానులు నీతికోవిదులు
అత్యంత గుణవంతులగుదురు వారు
వలురాజ! నీ సుతుల్ వంశపావనులు
అలఘు బలోద్దండు లందరికంటె
ఘనుడు విక్రమ గజకంఠీరవుండు
మనుజేశ! యదువీర మండలాధిపుడు
పావనతను భవు పరిపాటివాడు
రవితేజుడౌ పెద్దిరాజు భోజుండు
ధరణి పాలన చేసి ధర్మవర్తనను
అరలేక నడిపించు నని తోచుచుండె
క్షితినాథ! మీ అగ్రసుతుడు సింహాద్రి

మతిమంతు డన్నిటికి మంచి సజ్జనుడె
భువి నెన్నగలవాడె భూరి విక్రముడె
అవుగాక యలమంచి అతనిచే గాదు
బుద్ధిమంతుడు రాజపోషణకర్త
పెద్దిరాజేశుని పేరనున్నాది
రమణతో ఎరనూక రాజశేఖరుడు
విమల చారిత్రు భూవిభుడు నలనూక
రాజు ఆవులుపోలురాజు నల్వురికి
రాజాంశలేదు వలురాజ శేఖరుడ!
తగిన పట్టపురాజు తను మెచ్చువాడు
మగటిమి గలవాడు మర్యాదకాదు
భట్టు నేలెడివాడు బలదృష్టివాడు
నిటలాక్షు మది నెపుడు నిలిపినవాడు
ప్రతి దానకర్ణుండు పరమ పావనుడు
నుతికెక్కు మీనందనుడు పెద్దిరాజు
కులమంచి పాలించి యేలుదుననుచు
ఎలపావనుం డతడు కోరి యున్నాడు
ఇది మంచి దినవార మిది శుభనక్షత్ర
మిది మంచి ముహూర్త మిది మంచివేళ
కావించి పట్టణకర్తవని యతని
భావించు రాజని భక్తితో సుతుని"
పందుముల దిగ్గజము పలికినందులకు
బృందారకులు మెచ్చి పొగడిరి దివిని
ఎలమంచి పురజనుల్ యెలమి బాంధ
వులు
పలికిరి పెద్దిభూపతి రాజు అనుచు
పఖిరాజు భూసురవర్గము బిలచి
నలువంద సింహాసనము శుద్ధిచేసి
పిలిపించె యలమంచి పిన్న పెద్దలను
కులగుర్వు పందుముల గోవిందు తాను
రావించి సింహాద్రిరాజు కిట్లనిరి:
"నా వార్త వినవన్న నా ముద్దులన్న
యీ పట్ల నామాట ఎంతలేదనక
కాబట్టి నా మాట కాదనవద్దు
బలువైన సేనలు బంధువుల్ నేను
కలభూత నృపతిపై కదలుచున్నాము
వేడ్కతో యలమంచి నేలుమని నిన్ను
తోడ్తోన నీకు నేదొరతన మిచ్చి
పోవలెనని మది పొంగుచునుంటి
భావజజనకుండు పల్లికొండయ్య
తిలకించి తన దివ్యదృష్టి నీపేర
వలదు వలదనియు పల్కె మువ్మారు
రాజ్య భారము పెద్దిరాజు కిప్పించి
రాజ్యంబు నడుపుమనె సకలవిభవముల
దొరతనము కొరకు నను దూరెద
వనుచు
వరుసతో నిను బిలిచి ఆడితి ముందు
ఇట నొక్క బుద్ధియు మాట శుద్ధియును
తటుకున వివరించు దారినడిపించి"
లాలించి జనకు డిట్లాడినందులకు
చాల సంతోష విశ్రాంతుడై నవ్వి
పందుముల బలభద్రు బంధువులు తండ్రి
అందరు వినగ సింహాద్రి యిట్లనియె:
"నాయన్న యెందుకు నన్నడుగ మీరు?

న్యాయంబె, అతడెవ్వ రే నేవ్వరయ్య?
పట్టణంబతడేలి పట్టెతన్నంబు
పెట్టడా చాల సంప్రీతి, కొదువేమి?
తమ్ములుగా కపతల నెవరైన
మమ్ము కడత్రోచి యలమంచి వేలంగ
కలహంబు లేర్పరిచి కద్దు లేదనుచు
బలు నుపాయంబున ప్రజ్ఞలాడుదురు
నా చిన్నితమ్ములు నలుగురిలోన
యోచనవంతులై ఒకరైన భువిని
వంతు కెక్కిన చాలు వలదు తొర
తనము
అంత మీదట ముప్వురనుజుల మాట
ఎరనూక నలనూక ఎలమి పోత్రాజు
కరుణాసముద్రులుగాని నామీద
దయగల తమ్ములు ధర్మపుంగవులు
నయగుణవంతుల నడుగ బనిలేదు
రమణ తోడుత పెద్దిరాజ శేఖరుని
కొమరొందు నవరత్న కొలువు కూట
ముకు
తెప్పించు మార్యులు దీవన లొసగ
నర్పించు యలమంచి అతని పేరిటను"
అనిన సంతోషించి యా వలురాజు
పనిబూని విప్రులు బంధు చనువర్గ
అనువేగ పిలపించి యవనివల్లభుల
అనువొంద బిలిపించె నార్యుల నెల్ల-
ఉద్యాపనము చేసి ఉల్లసిల్లుచును
పెద్దిరాజుకు సకలాప్తప్రియ వాక్యములతో

ఖుద్దు వుంగర మిచ్చి కులబాంధవులతో
ముద్దుల సుతునకు ప్రమొక్కవేయించ
కొదమ పరివారంబు కొల్వు సరదార్లు
మునుమున కరములు మొగిచి రవ్వేళ
తరువాత వలురాజు తనయులందరికి
మర్యాదతో వారి మలినముల్ బాప
పుత్రుల నందర్ని పొత్తున నేక
పాత్రంబులోపల పాలు అన్నంబు
భోజనము గావించి బుక్కాయి అగరు
రాజితంబుగ నేవురన్నదమ్ములును
అలదుక దమ తండ్రి అనుమతిచేత
ఎలమంచి పురమందు వెలయుచునుండ
వలురాజు పుత్రుల వైభవంబెల్ల
తొలగక వీక్షించి తొడలపై నుంచి
విడియముల్ వేర్వేర నిప్పించి సెలవు
అడిగె యుద్ధముచేయ నరిగెద ననుచు
అడిగిన వారేవు రన్నదమ్ములును
తడయ కెదురుగ నిల్చి దండమర్పించి
"కదిలి సేనలు నీవు కలభూతరాజు
పదునైన కోటపై పగలులగ్గలకు
పురికొల్పబోవుచు పురిలోన మమ్ము
విరివి చేసుట కొరకు విడిచిపొయ్యెదవు
అసహాయ శూరులు అయిన నీ సుతులు
పసి బాలకులమైన పారిపొయ్యెదమ
మా బంటుతనమును మా ప్రతాపంబు
నీ బంధువులు నీవు నిలచి వీక్షించు"
అని పెకుక్క భంగుల నడిగెడి సుతుల

నెనరున వీక్షించి నెయ్యము బలికి
"ఐవరము మీకేల పసిబాలకులకు
వివరించి నా వార్త వినుడి సుతులార!
కకపికల్ కావించి ఖండెమొండెముల
నకనకల్ గావించి అరఘడియలోన
ఖండనంబున వైరు బలములు గూల్తు
ఖండింతు కలభూత గంగేశు శిరము
తెప్పింతు శిరమును ద్వేషిది మీకు
వప్పించు నామాట వప్పు'' మటంచు
సారెసారెకు చెయ్యి సాటి పుత్రులకు
ధారుణీశ్వరు దెల్పి తర్లించె దండు

## వలురాజు ఖండెమొండెముల కోటపై దండెత్తుట

రాజులు మంత్రులు రౌతులు భటులు
ఆజికి నేగ కట్టాయత్తపడిరి
కుల బంధువులు యదు గోప శేఖరులు
కలభూత నృపతిపై కదలి రవ్వేళ
అంతట భూపాలు డంతఃపురమున
కంతుని సతి గౌరు కాంతను చేరి
అని కేగు వృత్తాంత మంతయు తెలిపి
మనుజేశ్వరుడు స్నానమాడి నామములు
గావించి పరిమళ గంధ కస్తూరి
తీవరంబుగ నలది దేహమంతయును
పచ్చి కస్తూరి నింపారగా దిద్ది
అచ్చమౌ దివ్యాంబరములు ధరియించి
ముత్యాల పోగులు ముంగ మురుగులును
రత్నాల మకుటంబు రంగు దళుకొత్త
మడనూలు కంఠసరి మేలుంగరములు
సొంతమైన హారముల్ ప్రోదిగా దాల్చి
కైసేసి తనమేని కనకాంబరమున
కాశ బిగించి డాకాల పెండెంబు
ధరియించియు ప్రయాణ తాత్పర్య బుద్ధి
తలిరాకుబోణిని తగ నూరడించి
విలసిత కర్పూర విడియంబు లంది
కూర్మిపుత్రకుల బుజ్జగించె యందునిచె
ధార్మికుం డటు లేచి తలశాల దాటి
సరగున నిజ కొల్వుచావిట నిలచి
నరనాథు పందుముల నందనందనుని
పిలిపించి రాజు సంప్రీతి మార్గమున
తిలకించి రవికోటి దివ్యమౌ కనక
పద్మ రేఖలు మించు పాలకినెక్కి
పద్మారివదనుడై పరతెంచె రాజు
అంతట పందముల హరి పల్లెకొండ
చెంత నేతెంచెను సైంధవం బెక్కి
తడయక బగులు నత్తరి ముత్తరాజు
నడిచె హయ్యంబెక్కి నాయకంబుగను

సాహసాంకుని ముందు సర్దారుదండి
వాహనంబెక్కి హవ్వాయిగా నడిచె
వర బలాఢ్యుడు చల్లవారి భూపతియు
చల్ల భూపతి నేడు సమర ప్రతాపు
కరకు మించిన ఘోటకంబుపై నెక్కి
కదన సన్నద్ధుడై ఘనరాజు ముందు
కదలెను వంది మాగధులు నుతింప
దనరుచు మేలు సైంధవముపై నెక్కి
అనువంద కార్యము హనుమంతు గదిలె
దండనతేజి నుద్దండ దుమికించి
బండారుమల్లు భూపతి చెంత నడిచె
యెక్కి తురగము కరియావుల చన్న
మక్కువతో నడిచె మహరాజు ముందు
కంకాణవంబుపై గంగుల పోలు
పొంకముగ నడిచె యదుభోజు వలపటను
తగు నాజిపైనెక్కి తరి శంకరుండు
సొగసున నేతెంచె శూరుని ముందు
అటువలె బంధువులు అల్లుళ్లు శూర్లు
తటకున నేగిరి తక్కిన బలము
వుల్లమన్నను వాడు ఉర్వీశు ముందు
రొల్లు చేయుచు అధిక రోషుడై నడిచె
అవనిపాలు నెదుట అశనిపాకన్న
రవళి తోడుత నడచె రాజు దాపటను
కంఠీర్వ టెక్కముల్ ఘనరాజు ముందు
వెంటనె హనుమంత వృషభ టెక్కెములు
ఎల్లెడ సేనలు యదురాజు ముందు
పల్లకి ముందర పట్టి నడిపించ
పెట పెట తప్పెటుల్ పెద్ద బాకలును
కట పెట నాదు శృంగార మింపార
గిడిబడి నౌబోతు కెరలి ఘీంకార
బడి బడి నాదించ పంచ వాద్యములు
తండోపతండమై దళముల తోడ
ఖండెమొండెము కోట గట్టున నిలచె
ఆ రేయి దళములు అష్టదిక్కులను
బారు బారులు దీర్చి బంధించి కోట

## వలురాజు కలభూత గంగురాజును యుద్ధమున కాహ్వానించుట

మరునాడు వలురాజు మంత్రుల బిలచి
హరుషంబుతో చాల నతిగారవించి
గ్రక్కున కలభూత గంగు రాజేంద్రు
చక్రవర్తికి కమ్మ చెప్పి వ్రాయించి
కోట లోపల కంపె గొబ్బున కబురు
బాటగా యదురాజ భటులు నేతెంచి

దరవాజకడ నిల్చి ధారుణిపతికి
నెరి విన్నవించిన వెంటనే వార్ని
రిప్పించి కమ్మను రాజకరణముకు
నిప్పించి చదివించె నిలకడగాను
ఏమని చదివిరి యదురాజు కమ్మ
"శ్రీయుత కలభూత! సింధు గంభీర!
పావన గుణశీల! భాగ్యసుశీల!
భావజురేఖ! శుభాకర! భీక
రాకారునకు యదురాజు వలురాజు
లేఖపంపిన చూచి లేచి మామీద
ప్రాకారమటు వెళ్ళి బలములు నీవు
సాకరముగ మాతో సమరంబు జేయు
మటు గాదటన్న మీ యాత్మలో దలపు
చిటుముటుల్ బడవలదు సేనల్లు మేము
మొనగల మీ ఖండెమొండెము కోట
చనరుచు బలసమేతము తోప మేము
ఎక్కింతు లగ్గకు హేరాళవముగ
నుక్కణగింతు నా వుద్దండ శక్తి"
చదివె ఇటువలె మంత్రి సభలోన వినగ
చదువగ విని రాజు సాహసోత్తముడు
కమ్మలోపల రాచకార్యంబు దెలిసి
ముమ్మరంబుగ కోరమీసంబు దీటి
"విను బుధ జనులార! విద్వాంసులార!
ఘనులార! యదురాజు గర్వించి యిటుల
మొన చేసుకొని కోట ముట్టడి సేసి
అనికి రమ్మని లేఖ లంపించినాడు
అంపిన మేలాయె నైన కొదువేమి?
సొంపైన యదువీర శూరుని మీద
కార్యమందుదు గాని కడకేల బోదు
సర్వకాలము బ్రతుకు చాలును గాక
వ్రాయుడి కమ్మను వైనముగ నిపుడు
ఆయత్తముగ వ్రాసి అంపు" మటనిన
నృపతి వాక్యములకు నుపముగా కమ్మ
నపరిమితంబుగా నంతయు వ్రాసి
యింపుతో వలురాజు విభుని సన్నిధికి
పంపించె గంగ భూపాలుడు త్వరను
వలురాజు కొలువుకు వచ్చి యా భటులు
కలభూత రాజేంద్రు కమ్మలందివ్వ
ముదమున కమ్మలో ముచ్చటంతయును
చదివిరి వలురాజు సభయంత వినగ:
"శ్రీయుత యదుకుల సింధు గంభీరు
నీమము గల ధర్మ నీతి కోవిదుడు
కదన విక్రముడు భీకర బాహుబలుడు
కుమరైన సౌందర్య కోటిమన్మథుడు
మతిమంతు దరిక్షుల మర్మ భేదితుడు
క్షితిపాలుడెనట్టి సోమవంశజుడు
రాజ మహారాజు రాజ రవితేజు!
భూజన స్తుతిపాత్రు, పుణ్యచరిత్రు
రాజకంఠీరవు వలురాజు భోజున్నకు
సకల గుణ సంపన్ను సరి గంగురాజు
లిఖియించి నటువంటి లేఖలు వినుడి

మమ్ము యుద్ధమునకు రమ్మని వ్రాసి పంపించితిరి చాలు భళిభళి మేలు
కమ్మలంపించిన క్రమ మెల్ల దెలిసె తెంపుతో మీరు మా తెలివైనకోట
రమ్మన లేదు మీరై వచ్చి మాతో పగలు లగ్గలు కెక్కి పంతంబు చాలు
బొమ్మ ముట్టడి కోట దొరకొని వేచి మగతనంబులు పలికి మత్తులై మీరు
అనికి రమ్మని లేఖ లంపితి రిటుల పగలు చాటుచు నిల్వ భావ్యంబు గాదు
వెనుకతీయుట మాకు యోగ్యము కాదు తగవైన బలములు ధారుణీశ్వరులు
యుద్ధము గావలసె యుద్దండముగను కడమాట కోటపై కదలిర"మ్మనుచు
పద్ధతో నిటువంటి పత్రికలు వ్రాసి పదిలేఖ పలురాజు వరమంత్రి చదివె

## యాదవబలములు యుద్ధమునకు సిద్ధమగుట

కమ్మలు విని రాజు కలకల నవ్వి బాలచంద్రునివార ! బడుగులవార !
బ్రహ్మాండముగ యదుబలముల బిలచి పాలబిందెలవార ! పదరయ్య లగ్గ !
"కొమనాలవార ! హరిగోవిందువార! పచ్చకస్తురివార ! పద్మాక్షువార !
క్రమముతో కోటలగ్గల కేగరయ్య ! మచ్చరింబున లగ్గ మార్కొనరయ్య !
అమరేంద్రువార ! శ్రీహరిదాసు వార! పెరుమాళ్ళవార ! వో పెయ్యలవార !
ప్రమదముగ కోటకు పదరయ్యసెలవు: యిరువంద లగ్గకు విడిబడరయ్య !
ఓరుగంటివార ! ఓ చల్లవార ! లంకేశువార ! కల్లందులవార !
పేరాళముగ లగ్గకేతెంచరయ్య ! పంకజాక్షునివార ! పదరయ్య లగ్గ
చెన్నుబోయినవార ! చేమటివార ! పోరుకెరువని జెట్టిబోయినవార !
పన్నీరువార ! మరి పందుమువార ! కొరుమేఘమువార ! కదలుడి లగ్గ !
రాచయావులవార ! రాచూటివార ! కమలబాంధవువార ! గజపతివార !
లేచి రారయ్య పాతేటియువార ! ఉమామహేశ్వరువార ! వురుదారువార!
కలుహరేకులవార ! కవిలావువార ! సాకేతుపురివార ! సంపతివార !
కళ కల లగ్గకు కదలి పదరయ్య భీకరాకృతి కోట బిరుదైన లగ్గ

మధురాపురమువార ! మహిపతివార !
నిధి మీద రఘురాము నిశ్చయము లగ్గ!
తారకావళివార ! తగు చట్టవార!
కేరుచు కోట మార్కొనరయ్య లగ్గ!
ద్వారకాపురివార ! దొరమన్నెవార !
మేరుశైలమువార ! మేలైన లగ్గ !
పరమేశ్వరునివార ! బండారువార !
అరుదెంచరయ్య బ్రహ్మాండమౌ లగ్గ!
శంభునివార ! హరిశంకరువార !
జృంభణంబుగ రండు సురతానిలగ్గ!"
అని ఇట్లు వలురాజు అల్లుడు కుమాళ్ళ
గొనకొని పిలిపించి కోటపై లగ్గ
బసిబడి వాయించి పగలు లగ్గలకు
విడిపించె కర్పూర విడియంబు లిచ్చి
కొలది పెన్నిధి గంటు గోసంగి బంటు
కలనైన మరువజాలని సాహసాంకు
పగలు లగ్గల కళని పాకన్న బిలిచి
తగువైన చేలముల్ తాంబూల మొసగి
"తన కీర్తి నిలుపు నాతమ్ముడ" వనుచు
వెనువెంట వీడ్కొల్పె యదుకులాధీశు
డతనికి సరిసాటి యనదగు మేటి
అతి భీకరాకారుడగు పుల్లమన్న
నరపతితో పిలిచి నృపతి వలురాజు
కరుణించి మైపూత గంధంబు లిచ్చి
కరమర్థితో హస్తకంకణాలొసగి
తలుపు సెలవిచ్చి ధరధీశుడంపె

పదునైన బలములు పరగ వలురాజు
కదలిరి కోటపై కడులగ్గకనుచు
సెలవంది గోసంగి సేన లార్వేలు
నలిగి మించిన కోట నాజికేర్పడియె
మొనలైదు ఎక్కటి మూక లార్వేలు
మనవి గైకొని పుల్లమన్న తా గదిలె
సరదారుదండును సన్నిధి బిలచి
ధరణీశు డంపించె తగు బహుమాన
మమితముగ పదివేలమంది తోడుతను
గమకించు మని పంపె ఘనుడు వలు
రాజు
తరువాత వలురాజు స్నానంబు చేసి
బిరుదైన లాగు సంప్రీతితో తొడగి
చొక్కమౌ ముత్యాల చౌకట్లు చెవుల
మక్కువతో దాల్చి మరి భూషణములు
కుందన బంగారుగొలుసు మెడనూలు
పొందైన పుత్తడి పొదిగుండ్ల పేర్లు
గమకము తుళకించు కంఠసరాలు
అమరిన మెడనూలు అపరంజిశాలు
జవరైన పెదుత్ర జంధ్యాల జోళ్ళు
రవళు చెక్కిన కంజరబాకు మొలను
కళలొప్ప హనుమంతుకాసెయు వేసి
తళతళ మెరిసేటి ధాటి వలెవాటు
వలయమౌ గొలుసులు వుంగరంబులును
మలయుచు రత్నాల మణిహారములును
కలిత ధరించి శ్రీగంధ కస్తూరి

పొలుపొందమృగనాభి బుక్కాయి అగరు
సలదిమై, షడ్రసాన్నములు భుజించి
పెలయంగ కర్పూర విడియంబు వేసి
పంచకల్యాణిపై బాలచంద్రుండు
అంచున వింజామరములు వేయంగ
నవపంజు గొడుగులు నమర బట్టించి
చవుకళింపుచు హయము సరసు డౌలు

రాజు
ఆయత్తపడుచున్న అట్టి సమయమున
రాయమన్నీలు వలురాజు ఇరుమేర
తరిముత్తరాజు, పందుముల కులగురువు
సరస హయములనెక్కి సన్నిధి పడువ
చల్ల భూపతిరాజు సమరప్రతాపు
వెల్ల బిరుదుల తేజి నెక్కి తానడిచె
పగటున బిరుదుల పట్టించి వెంట
పగమీర నడిచె గాలము హనుమంతు
పరురాజు ముందట వొడి తోపుఖాన
విలుమూక చెంగట ఈటెలమూక
ప్రభుపు సరసమొంది బల్లెములమూక
వుభయ పార్శ్వముల రాజోత్తము మూక
ఇటువలె మొన నిలిచి విడిచె లగ్గలకు

## ఖండెమొండెముల కోట యుద్ధము

అటు ముందు నేతెంచి రమిత బంధువులు
రక్తధారపు కోట రాయుడి కోట
శక్తులు ఉండేటి శవముల కోట
పగవారిపై గుండ్లు బరిపెడి కోట
తగు హజీరుల గుండెతల్లడము కోట
వేల్పుమంటల కోట వెరపించుకోట
కాల్పుమంటల కోట కార్యంపుకోట
అటువంటి కోటపై నంటి యదుబలము
చిట చిట కోటపై చిచ్చులు బుట్టి
మిట మిట మంటలు మిన్నంట మండె
పట పట ఘని యదు బలముల మీద
పొట ఘొటా యనుచు నిప్పుల వృష్టి
కట పెటి యాదవుల్ కాలి

దేహముల
విరిగిరి వొరిగిరి విజ్ఞోడు గాను
సొరిగిరి యదువీర శూరు లావేళ
కొందరు యాదవుల్ కోటపై కెక్కి
కందకంబులు దాటి కడు లగ్గ కెక్కి
వచ్చి నంతట శక్తి వక్త్రింబు తెరచి
యిచ్చగా యదుశూర వీరుల మ్రింగె
మరి మీరి వచ్చిన మన్నెనాయకుల
నురిపిరి కలభూతనృపతి మొనవరులు
చక్కని రాజుల సాహసోత్తముల
గుర్తిసె కుక్కిణంచిరి గంగనృపతి చనువరులు

లగ్గ దింపులు మించి రాళ్ళచే ముంచి
వుగ్రంబు గల యాదవుల బరిమార్చి
కోటపై కలభూతగంగు రాజేంద్రు
మేటి మేటుల నొక మాటున ద్రుంచి
చక్ర బారు తుపాకి జబురు జంగులును
మొర్రో మొర్రో ఫిరంగి మొన సమూ
హంబు
ప్రాకార మంతట పరిపించె వైరు
మూకపై నడిపించె మొన జారకుండ
కోటపై శక్తులు కోవరంబులును
ధాటుగా పెడబొబ్బ దారలు చేసి
అహితు లందరి బట్టి అవనిపై గొట్టి
తహ తహ చేసి యాదవుల పుట మణచి
అంతట వల్లవుల్ అమర తిరమందు
లంతయు రోషించి ఆక్రోశించకను
చుక్కపొడుగగు మంచి సురతాణి లగ్గ
కెక్కించి పెళ్లుగా కేకలువేసి
శక్తిపై ధుమికి భుజశక్తులతోడ
యుక్తితో సరిపడ యుద్ధంబు చేసి
సాంగుల శూలాల సరికటారులను
సింగిణి అమ్ముల చిప్పకత్తులను
అనిచేసి శక్తితో అటు పోరలేక
వెనుకముందై బలము వెతపడి విరిగి
ములబడి కొంత తానీగె నొక కొంత
కలవరబడ జూచి ఘను డొలురాజు
ధంధణ యని భేరిధ్వనులు చేయించి

వంది మాగధులచే వార్త చదివించి
భీకరాకారుడై పెకళించె దృష్టి
మూకగా ఘోటకముల పంజుముందు
గణనకు మిక్కిలి కాల్బలంబులతో
రణము కెదిరించె పలురాజ శేఖరుడు
కోటపై దుమికించి ఘోటకంబులను
నాటించె శక్తిపై నారసంబులను
వాడి శూలంబులు పలురాజుమీద
రూఢిగా బరపె కరాళించి శక్తి
వచ్చు శూలంబుల పలురాజ విభుడు
పచ్చళ్ళుగా తరిగె పట్టితోడుతను
తరిగి యంతట భోజధారుణీశ్వరుడు
తరువడి శక్తి పెడతలు రక్తమొరుగ
విడిచె కటారి భూవిభుడు పలురాజు
విడిచినంతట బోక వీర రణశక్తి
కరవాలమున రొమ్ము ఘల్లుమనంగ
కరవాలు పలురాజు కనిపైచి తట్టి
అమరంగ శక్తి నొసలటుగ బొడిచె
అమర నాటిన శక్తి యటు నిల్వలేక
యదురాజు సమదృష్టి యెదుట నిల్వ
కను
తదనంతరమున అదృశ్యమై చనియె
అవనిపాలుడు శక్తి యరుగుట చూచి
నవ మన్మథాకారు డనిమొన నిలచి
పరువడి పందుముల పల్లెకొండయ్య
తరి ముత్తమంత్రి నంతట చేరబిలిచి

"ఉత్తర భాగంబు ఇరువుర మీకు
సొత్తు, మందితొ కోట సురతానిలగ్గ
అంబుధు లేకమై అడ్డగించినను
శుంభుస్మహారౌద్ర శూరుండ్రనను
ఘన పరాక్రమము మించి కదలక నిల్చి
వెనుదీయక లగ్గ కెక్కు"డని బల్కె
మాతంగులుకు మేటియైన సరదారు
ఖ్యాతితో అశన పాకన్నను బిలచి
మరి వేగమున పుల్లమన్నను బిలచి
ధరణీశ్వరుడు పల్కె "దక్షిణదిక్కు
బలములు మీరలు పగలు లగ్గలకు
తొలగక కోటకొత్తళముపై దుమికి
సేనలపై కెరళి చెండి చెండాడి
ప్రాణాలు త్రుంచు"మని బవరమున
కనిపె
బండారుమల్లను పరగ సరదారు
దండిని రప్పించి "తరి తీపరముగ
పటుతరంబుగ కోట పశ్చిమభాగ
మటు యిటు కదలక అనిచేసి లగ్గ
పైనెక్కి యెదిరించు పగతుల ద్రుంచి
త్వాకికముగ కీర్తులందు నిల్వండి"
యిరువొంద సెలవీయ విడిబడి రంత
నరయంగ చల్లభూపతి నరవరుని
రమ్మనె తనవెంట రాజు వలురాజు
క్రమ్మించె తూర్పుదిక్కున కోటలగ్గ
కోట నల్దిక్కుల కూతలు చేసి
వాటమౌ ప్రాకారంబుపై లగ్గ
కెక్కించి రిపులను గణికెలు చేసి
త్రుక్కించి అహితుల సురతానిలగ్గ
పట్టించె యదుకులపట్టభద్రుండు
నెట్టించె కలభూతనృపు సైన్యములను
ధీరులై లగ్గల దీపు తొప్పించ
బారులన్నియు పటాపంచ గావించి
తీరుతీరుగ సుందురిత్తు లంటించి
మేరుధీరుల మీద మెదపి రిరుగడల
హేరాళవంబుగ యాదవులమీద
వీరాధివీరులు విడిబడి రంత
వడిరాళ్ళ దెబ్బలు వడిశాల వాట్లు
తొడిబడక మోదిరి తొట్రుపడంగ
కోట కొమ్మలపైన గుండుపెకలించి
మేటి యాదవులపై మెలిపిరిరుగడల
విడిబడి శక్తి ఎప్పటివలె కదసి
కుడియెడ మంతయు గూల్చె యాదవుల
అల తుపాకీలు ఫిరంగీల మ్రోత
కలయమ్రోగిన చాపకట్టులై కొంత
పరగిరి యాదవుల్ వసుధపై చాల
ధర మేరలేకన్న దండి సరదార్లు
మడిసిరి కోటపై మాటమాత్రమున
చెంగట పోరి గోసంగులు కొంత
రంగమధ్యమున శ్రీరామ రామనుచు
సుడిబడి కోటపై శూరుల మీద
మడిసిరి అని పుల్లమన్న బలంబు

శక్తి నాహుతి చేత శస్త్రుల చేత
రక్త వర్షముచేత రాయుడి చేత
చిట పట మను అగ్ని శిఖల చేత
పట పట మనెడు తుపాకుల చేత
పరిఘ గద ప్రాస పట్టిసల్ చేత
నెరిచెడి యాదవుల్ ఇలమీద కొంత
వరుగుట గతిచూచి వలురాజ విభుడు
పరమాత్మ మదినెంచి పగతు నెదిరించి
సరదార్లు బంధువుల్ సన్నిధి రాగ
మరుదులు బావలు మామ లల్లుండ్రు
వాజీల కొంత వాహ్యాళిగా ద్రిప్పి
రాజవీథులు జొచ్చి యార్భాటముగను
గురికాండ్ల సరదార్ల గుట్టలుగవైచి
తరిమి రాజులను ప్రధానుల గూల్చి
గజముల తేజీల గలసి బరిమార్చి
నిజ కాల్బలంబుల నిలకడగ నిల్పి
దంతపు మొగసాల దనుక గదిమించి
చెంతను ఉండెడి సేనాధిపతుల
కలవర పరచి డొక్కలు చించివైచి
అలుగులు నాటించి లావులు వంచి
కలసిన గోరింద గచ్చగడి దాటి
పలు దెరంగుల నందు ప్రభువుల జంపి
మొగి వాడి యెలుగుల మొగసాల దనుక
రంగముగా యదురాజు పొడిపించి

రణమున కెదురించు రక్షకుహాళ్ళ
గణన చేయక ద్రుంచె ఘనుడు వలు
రాజు
భద్రమౌ కంచుగుబ్బల మొగసాల
రౌద్రుడై కదిసె వలురాజు కోపించి
కదిసిన కలభూత గంగ భూపాలు
పదునైన సరదార్లు బంధువర్గంబు
మేలిమౌ భూపతులు మెచ్చ మన్నీలు
మూలబలంబు లిమ్మగ గొల్చిరాగ
అష్టమంగళ మను అశ్వంబు నెక్కి
శిష్టపాలుడు రాజు సింధుగంభీరు
మహిపాలు కలభూత మండలాధీశు
డహితుల కనుగొని ఆగ్రహుడై కెరలి
మొన కంచుగుబ్బల మొగసాల ఘడిన
నని కేర్పడగ నిల్చె నరనాథవరుడు

## వలురాజు, కలభూత గంగురాజుతో ద్వంద్వయుద్ధము చేసి ఆతనిని వధించుట

మనుజేశు కలభూత మండలాధిపుని
[illegible] వలురాజు కంఠీరవుండు
తన ప్రతాప ప్రౌఢి తగనిట్టులనియె
"విను గంగ భూపాల! విక్రమశీల!
మతిమంత! గుణవంత! మరి శాంతవంత!
క్షితి సాటిలేని సుస్థిర కీర్తివంత!

కలరు భూపతులు లోకములోన చాల
ఇలలోన నీసాటి వీరుని గాన
తరచుగా కోటలు ధరణిలో గలవు
ఇరువంద ఫౌడగాన నటువంటి కోట
సకల దేశంబుల సరదార్లు గలరు
ప్రకటముౌ ఇటువంటి బంటుల గాన
వీరుడ వీవు ప్రవీణుడ వీవు
రాజవు నీవు నిరాశ్రయం నీవు
భోజుడ వీవు, అంభోనిధి వీవు
గణనతో నెదిరించి గంగభూపాల
రణకేళి చేయు ధరాస్థలి నీవు
అదిగాక బలవంతుడనుచు భూపతులు
పదివేల విధముల ప్రణుతి చేయగను
విని చాల నా మది వేడ్కరంజిల్లి
పనిబూని నీమొన ప్రౌఢి నే జూడ
వలసి ఇందనుక నే వచ్చితి మేలు
భళి భళి నాతోడ బవరంబుచేయు"
మన విని కలభూత మండలాధిపుడు
ఘనవేగ యదురాజ ఘనున కిట్లనియె
"హరివంశతిలక !సాహస విక్రమార్క!
ధర ఖండనోద్దండ ! దాన కర్ణుండ !
సమద సద్గుణమూర్తి !చారు సత్కీర్తి !
విమల మన్మథరేఖ ! విను విను పరాక
రాజ వలురాజ ! యదురాజ! మహరాజ!
రాజపూజిత ! వినుతరాజ ! రవితేజ !
కదనంబునందు చక్కగా నిలచి నాతో
యెదురించి పోరాడ యెంతవాడనక
తగు మనకు పోరాడ తగు ఈడుజోడు
తగు సాహసము కులము తగు మనః
శుద్ధి
ధరణీశ ! నీ బంటుతనము వేరొక్క
టరుదాయె నా నోట నవవీల పరచి
పగలు లగ్గల కెక్కి భటుల మర్దించి
తగ నగడ్తలు దాటి దైతలోడించి
చిచ్చు మంటలు గెల్చి చీకాకుపరచు
గచ్చగోరిందల గడితాటి శక్తి
నురికించి కోటలు నూరు వాకిళ్ళు
తెరిపించి యందున్న దేశాధిపతుల
నరకించి పేరైన నాయకుల ద్రుంచి
సరదార్ల గురికాండ్ల చక్కబరిపించి
నొంచి రణరంగంబు నోలలాడించి
కంచుగుబ్బల మేలుకట్ల మొగసాల
కడనిల్చి, నాతోడ కయ్యంబు జేయు
కడసితి వొలురాజ ! ఘనుడని జనులు
నూర్వురు భూపతుల్ నుడివిన జాలు
ఓ రాజ రాజేంద్ర ! వలురాజ చంద్ర !
తగుపేరు కీర్తి యాదవ చక్రవర్తి
తగు నీవు పంతంబు తలచిన యంత
తడబడ కింతటి ధైర్యంబు చేసి
నడిపించుకొంటివి నను గెల్చిపొమ్ము"
వలురాజు గంగభూవరుని వాక్యములు
పలుకగ విని మెచ్చి భట్టు రావించి

భేరీ నగారీలు భోరు కొల్పించి
కరమొప్ప వందిమాగధులచే బిరుదు
పద పద్యములు రాజు పట్టిచదివించి
ఉదయాద్రిపై చంద్రు డుద్భవంబైన
తెరగున వలురాజు తేజిపై నెక్కి
మెరుగుచాయలు మించు మేల్ పటా
బూని
సుగుణుడు యదువంశ శూరవిక్రముడు
ఉగ్రుడై లేచి ఆయత్తమై నిలచె
తరువాత కలధూత ధరణిపాలకుడు
దురుసుగా భేరీలు తుడుము నగార్లు
నాదించి పంచెవన్నెల రూపములను
ఆదరముగ నుత్తమాశ్వంబునెక్కి
ప్రతిలేని చాయల పట్ట చేబూని
జతనము భట్లతో చదివించి బిరుదు
మిక్కిలి రణశూరు మేరుసమాను
చక్కగా వలురాజు సమదృష్టి నిలిచి
వలురాజు కలధూత వరగంగురాజు
తలపడి పోరిరి తగమహోన్నతులు
బాల సింగంబులో భద్ర గజములో
విలయగ్రహంబులో పిడుగులో సురలో
కులగిరులో రెండు కుల సముద్రములో
ఇలనాథు లిటువలె యుద్ధంబు చేయ
వలురాజు రోషించి వడువు నశ్వంబు
కలధూత నృపతిపై కదియ దోలించి
తీగమెరుపుగ పటాతీసి శేకొద్ది
వాగెసడలించి తీవ్రంబుగా నరికె
నరికిన వక్షంబు నజ్జునజ్జులుగ
గరిబారి గాయంబు గంగభూపాలు,
భళిభళి నీ చెయ్యి పారలేదనుచు
కలవరబడి తురగంబును దోలి
వలురాజుపై ధుమికి వాజిని గెడపి
తలగక సాహసోత్తముడు సైరించి
కదన భీకరశక్తి గంగభూపాలు
"దెదురాజ ! చూడు"మనియెదురొమ్ము
నరికె
నరికిన పక పక నవ్వి వలురాజు
పరదళంబుల చూడ పట్ట వడిత్రిప్పి
కుప్పించి కలధూత కుంభినీధవుని
నొప్పించి యశ్వంబు నుర్విపై గూల్చి
తన సాహస ప్రతి తరుచు చదివించి
ఘనరోషచిత్తు యదుకంఠీరవుండు
అట్టహాసముచేసి యటునిటు మెలగి
పట్టతో నొగి తట్టి బాకుచే గుద్దె
బాకుపోటుకు గంగ బాలచంద్రుండు
భీకరాకారుడై పేర్చి పెల్లార్చి
కన్నుల మిణుగురుల్ క్రమ్మ కోపించి
"అన్న ! నీ చెయ్యి నా కంటలే"దనుచు
బిరుదు స్వరంబవు పిడిబాకు బూని
కరిపైని లంఘించు కంఠీర్వమనగ
చెలగుచు తా పేరు చెప్పి కుప్పించి
"వలురాజ ! చూడు"మని వక్షంబు
బొడిచె

నాటిన పోటుకు నవ్వి వలురాజు
సూటి జముదాళియన్ సురియ ఝళి
పించి
ధాటిగా నతడు నుద్ధతి తలమీద
వాటముగ నడచె భూవరుని వీక్షించి
కనురెప్ప వేయక కడు చోద్యముగను
మనమున పురిగొని మరియు నిట్లనియె:
''కడు బలశాలివి గంగభూవిభుడ !
తొడలి శాత్రవులను ద్రుంచినవాడ
కనగి కయ్యము చేయగలవాడ వీవు
వినుతింప యదుబలశాలిని నాతో
క్రమ్మర నాతోటి కయ్యంబు చేయ
బొమ్మ రాజేంద్ర ! నీ పురి చేర వేగ''
అన విని రోషించి యా గంగవిభుడు
కనలుచు బలికె నుత్కంటము దీపింప
''కదనంబు చేయ చక్కగ నిల్చె నీతొ
పదిలుడై యున్నాడ బడుగుల రాజ!
ఘన బాహుశక్తిచే కదలక నీవు
అనువంద నాతోను నని మొన జూపు''
మన విని వలురాజు మనము రంజిల్ల
కనలుచు జముదాళి కరము చేబట్టి
భద్ర గజంబుల పగిది పోరాడి
రౌద్రుడై గంగశౌర్యుని రొమ్ము బొడిచె
పోటువెంటనె జొత్తు బొళబొళయనుచు
నోట గ్రక్కుచు విలువ నోపంగలేక
బిరుసు గాయముచేత బిమ్మర గొనుచు
తిరుగుచు సొరుగుచు తెరగున గంగ
ధరణీశు డాత్మలో దలచి పురహరుని
వలురాజుపై కెగసి వక్షంబుబొడిచి
యిల వ్రాలె గంగభూవిభుడు రణమందు
గంగురాజాధీశు కల్లిలోపలను
క్రుంగుట గని యదుకుల భూషణుండు
పటురౌద్రగతి తా పట్ట చేబూని
నిటలాక్షు మదిలోన నిల్పి కుప్పించి
ఖండెమొండెము కోట కలయ శోధించి
భండనంబునను భూపతుల నిర్జించి
మేటి మేటీలను మెడలు ఖండించి
కోటపైగల మంచి గురికాండ్ల చంపి
పాశేల వారిని బడవేసి కలను
ధూళిగా నని చేసి తృణమాత్రముననను
దేశాధిపతుల నెందెందు పోనీక
రాశిగుట్టలు చేసె రణవీథి యందు
చక్కని సరదార్ల సామజంబులను
చెక్క ముక్కలు చేసె సమర మధ్యమున
సంతన లొటిపిటల్ స్వారిగుఱ్ఱములు
ఇంతలింతలు చేసి విజయు డొలిరాజు
ఆ వేళ బంధువు లమిత విక్రములు
భూవరు నెడబాసి భూరియుద్ధంబు
చాలు చాలున చేసి సరిగడల్లు నాటి
కోలాహలంబుగా గొరకలు నాటి
పగలు లగ్గలకెక్కి బలుల మర్దించి

తెగి దేహమంతయు దేలి రక్తాన
కోట నల్దిశలందు గోవింద యనుచు
పోటు రంకెలు వేసి పొదిలించి ఘించి
కోటలో గురికాండ్ల గొంతులు నరికి
ఘోటకంబులనెల్ల కుంభిని గూల్చి
పల్లికొండయ్యయు, భండారుమల్లు,
చల్ల భూపతిరాజు, సరదారు దండి,
తరిశంకరుడు మంత్రి, తరిముత్త ఘనుడు,
వరబలాఢ్యుండు గార్యము హనుమన్న
అమితవిక్రమశాలి అశని పాకన్న
సమ ముల్లమన్న విస్తార బలాఢ్యు
వర తిరమందులు వల్లవులెల్ల
మునుకొని వలురాజు ముందర నిల్వ
బల్లెముల్ వాటి ఈటెలు బాణముల్ దగిలి
చిల్లరంబులు నాటి శ్రీహరి యనుచు
పందుముల రఘుమూర్తి పల్లికొండయ్య
వందనంబనె తాత వలురాజునకును
తక్కిన బంధువుల్ ధరణీశ్వరునకు
మ్రొక్కిరి కరములు మొగిచి గోపకులు
రాజులందరు గూడి రాజమార్గమున
బాజా బజంత్రీల పట్టించుకొనియు
వాయించి భేరీలు వలురాజుముందు
గాయకుల్ వంది మాగధులు కై వార
ఘోషముల్ చదువగా గోకులాధీశు
భాషింపు కొనుచు తా పల్లికొండయ్య
గాయముల్ భారమై కార్యంబు తెలిసి
ఆయాసపడక దేహము సొమ్మసిలక
శృంగారమగు కోట చొచ్చిరి చూడ
బంగారు గోడలు పదును గరిడీలు
మేడలు వాడలు మేలిమి గుండ్లు
చూడ చక్కని మంచి తోరణగండ్లు
తేరులు గోపురాల్ తెరమిద్దెటిండ్లు
కోరిన వస్తువుల్ కొల్వుచావళ్ళు
కన్నుల పండువుగాను వీక్షించి
అల గంగరాజు సింహాసనముమీద
వలురాజు బంధువుల్ వరుస గూర్చుంచె.

## వలురాజు, గంగురాజు కొడుకునకు పట్టము కట్టుట

అన్న యంతట గంగయుర్వితలేంద్రు
మన్నన పట్టంపు మగువలందరును
చనివేగ నడ్డతెర చాటున నిలచి
ఘన శోకభార్తచే కాంత లిట్లనిరి:
" అన్న వొలురాజ! నీ యాడుబిడ్డలము
కన్నతండ్రివి మాకు కావలె నీవు
మా పాలిపురుషుని మండలాధిపుని
మాపాల రణమందు పోరి గెల్చితివి

పగదీరె మీకు మాపతి కూలిపోయె
మగువలము విధవలమైతిమి యింక
గంగురాజుకు కూర్మిగల కుమారుండు
ఇంగితం బెరుగడు విను కన్నతండ్రి
దయయుంచి రక్షించు ధర్మగుణశీల
దయలేదనంటివా తరుగు ఖడ్గమున"
అనుచు పుత్రునిదెచ్చి యతివలందరును
పనిబడి వలురాజు పాదములమీద
కనికరంబున వేయ ఘనరాజు జూచి
నెనరు బాలుని నెత్తి లాలించి
"బాలుడ! నీరాజ్య పదవి నీవింక
యేలు ముమ్మాటికి నేల యీ చింత
పగదీరె మీతండ్రి ప్రాణంబు విడిచె
తగవులన్నియు తీరె ధరపతివి గమ్ము
దాలపాపడ నీవు భామలు వారు
ఏలాగు పట్టణ మేలు చుండెదరు?
అధికారములనిచ్చి అయ్యలరాజు
పాదుకొని యీభూమి పాలించినాడు
వారికి మునుపటి వలెనె రాజ్యంబు
పారుపత్యము నొసగి పట్టణంబేలు
మునుపటి బాకీ నిమ్మల నడగవద్దు
ఘనులతోపల భేదమంత్రము మాని
మీతండ్రివలె వారిమీద క్రోధంబు
ఘాతచేయక చాల కనికరముంచి
ఉపముగా వారిపై నుంచి మీప్రేమ
కృపచూపి రక్షించు గుణశీలముగ"
అనుచు విప్రులదెచ్చి అధికారమిచ్చి
అనుమతుల్ బడ చెప్పి అయ్యె
తోప్పించి
బాలున కా రాజ్యభార మర్పించి
నీలకంధరు సాక్షి నేలు మటంచు
బంగారు కడియముల్ పట్టు వస్త్రములు
ముంగార మురుగులు ముందు టుంగ్రగ
ములు
బాలున కిచ్చి భూపతివి గ"మ్మనుచు
మేలిమి బంధువుల్ మిత్రులు తాను
గమనించె యదుకుల కంఠీరవుండు
విమలమౌ రవి సోమ వీథులు గడచి
ఒకటి రెండగు పూరి వాకిళ్ళు గడచి
ప్రకటముగ కోట వెలుపటికి నేకెంచి
చంద్రకావి గుడారు చేరువ నిలచి
అందరు గుమికూడి అచటి గూర్చుండి
మరుదులు బావలు మామ లల్లుండ్రు
దొరకుమారులు వారితో సంగశీలు
పందుములవారు, బండారువారు,
బృందావనమువారు, బోయినవారు
తిపిరి దండెలవారు, దినకరువారు,
అపరూపములవారు, నచ్యుతువారు,
మట్టి యావులవారు, మానమువారు,
జెట్టిబోయినవారు, శాంభవివారు,
పుల్లావులవారు, పురుబారువారు,
కొల్లెబోయినవారు, కోడుముట్లవారు,

రామదాసునివారు, రంగేశువారు,
దామసానివారు, దంభోళివారు,
జడదేవివారు, శ్రీజానకివారు,
పడిగెకొండవారు. పద్మాక్షువారు,
చామటావులవారు, చెంగల్వవారు,
సోమకులమువారు, శోభనవారు,
చెన్నుబోయినవారు, జడదారువారు,
పొన్నపువ్వులవారు, బోడావులవారు,
తగుదల్లవారు! చింతామణివారు,
భాగవతులవారు, బడుగులవారు,
సరదారువారు, హరిసంతతివారు,
పరమేశ్వరునివారు, భాస్కరువారు,
దేవగణమువారు, దేశాంత్రివారు,
కావటివారు, నలకావురమువారు.
చింతామణివారు, చింతమువారు,
పచ్చపువ్వులవారు, బంగారువారు,
ముచ్చుపెయ్యలవారు, మునిమందవారు,
కస్తూరివారు, శ్రీగంధమువారు,
శిస్తువన్నెలవారు, సెలగోలవారు,
తిరుచూర్ణమువారు, తిలకమువారు,
గురునాథువారు, దుణగోష్యమువారు,
వకుళభరణమువారు, వైకుంఠువారు,
మకరకేతునివారు, మాధవువారు,
మాఘమువారుము, మంచికలవారు,
కులసముద్రమువారు, కుంతమువారు
తలకధారిమువారు, ధర్మజువారు

ఆల్లుళ్ళుకుమాళ్ళు నాయముల్ దగిరి
చల్లని వలురాజు సరసగూర్చుండి
ధరణీశ్వరుని వంక తప్పకచూచి
మురియుచు కరములు మొగిచి యిట్లని
రి
"దేహంబు నిల్వదు దేవరవారు
దాహంబులిప్పించు కాము తడవుండ
గాయముల్ యెదురొమ్ముగాడి
యున్నావి
సాయమైయున్నాడు సర్వేశ్వరుండు
ఇందనుక పెంచితి విందరి మమ్ము
సుందరాకార! మా శూరత్వమొకటి
చుక్క పొడుపుకోట సురతానిలగ్గ
ఎక్కితిమి, మాతోడ నెదురు శత్రువుల
కొట్టితిమి, శత్రుల కోలాహలముగ
అట్టి మీపగ దీర్చి అడ్గితిమి సెలవు
ఇప్పించు యదురాజ! వీరరణశూర!
తెప్పించు శ్రీతులసి తీర్థంబు మాకు"
అనుచు బంధువులెల్ల నడుగగ నంత
కనుగొని వలురాజు కలకల నవ్వి
అమిత బలశాలి తా నప్పు డిట్లనియె:
"కమనీయతనులార! గాంభీర్యులార!
ప్రతిలేని సాహసప్రతిభ గలవార
మతిమంతులార! నామనవి వినరయ్య!
కాదని మమ్ముల కార్యంబు మీరు
లేదు పోట్లాడుట లేశమింతైన

అందర మేకమై పనిచేసినాము
పొందుగా భారంపు పోట్లు బడినాము
మము విడచి చన మీకు మర్యాదయౌనె
తమమీద నేరంబు తప్పులులేవు
తన దేహమున పోట్లు దరిదావు లేదు
చెనుకులు గాయముల్ శంకము ల్గలవు
శ్రీహరిచెంతన-చేరుద నసుచు
ఊహ నామదియందు నున్నది చాల
నాపాల దయగల్గి నన్ను రక్షించు
దాపు ప్రాపున నీతి దయగల మంత్రి
పావనాచారుండు పందుముల ఘనుడు
గోవిందుడగు పల్లికొండ యున్నాడు
హరుడన్న కైలాస మంపిన నతడె
యిరువంద వైకుంఠ మిచ్చిన నతడె
కరణాలు నా పరుగు కరుణించు
మనుచు
తరితీపు నెగు నీతని మాయగాదె
కలభూతరాజుతో కయ్యంబు చేయ
తలపెట్టుకొనుట నీతని మాయగాదె
శత్రుల నోడించి చెలగు యదువంశ
గోత్ర పావనమూర్తి గోవిందుగాడె
అన్ని మాయల బన్ని ఆవులవారి
చిన్న ప్రధానియై చిక్కి యున్నాడు"
మనుజాధిపతి చాల మరియాదతోడ
కొనియాడ విని పల్లికొండ ఇట్లనియె

## పల్లికొండ పూర్వ వృత్తాంతము

"జనపాల గోపాల! చక్రభూపాల!
గుణజాల! యదుబాల! కోమలలీల!
రాజ! మహరాజ! రవికళతేజ!
భోజ! నా విన్నపం బొకటి వినవయ్య!
నేనెంతవాడ నన్నేటికి ఇంత
లేని పెద్దరికంబు లేల తాతయ్య
అవనీశతిలక! మీయనుమతి చేత
కవగూడి కోటలగ్గలకు నెక్కితిమి
కొలదీర నహితుల కొట్టి చెచ్చితిమి
నిలువెల్ల గాయముల్ నిండి వచ్చితిమి
మాయందు ఏమైన మహిమలు ఉన్న
గాయముల్ మైనిండ గలుగునా దేవ!
నా పూర్వజన్మంబు నా పూర్వఫలము
భూపాల! వినుపింతు వొసగి యాలించు
శ్రీవిష్ణు వైకుంఠ సింహాసనమున
సేవ్యుడై యున్నట్టి సమయంబునందు
చెప్ప చూపగరాని సేవకులు కలిగి
శ్రియఃపతి నిత్యంబు నమితు సద్భక్తి
బృందారకవరదు పూజ లొనర్చి
అందరిలో భక్తి అధికమై యుంటి

శ్రీహరి ధ్యానంబు చిత్తంబునందు
సోహంబుగా నాత్మ సౌఖ్యాచునుంటి
హరి సన్నిధానము నన్ని వస్తువులు
పరిపరి విధముల భ్రమయింపుచుండి
యీ సమయంబున హరిపాదపూజ
చేసితి నాకోర్కె చెలగి సిద్ధించ
సకల జీవుల రక్ష సద్భక్తి మోక్ష
నొకనాడు ననుబిల్చి ఒకవార్త తెలిపె:
'విను ముఖ్యుడగు శిష్య! వినుము నా యాజ్ఞ
అనఘ వర్తనులు సదాచారపరులు
ఇలయందు యాదవ వీరపుంగవులు
ఎలమంచి పంపాద్రి నేలుచున్నారు
వారిని తోడుక వైకుంఠమునకు
చేర వేగమె రమ్మి సెలవు పో శామ్మి
అలనాడు మేము మధురా పురమునను
నలర జన్మించియు నందుని ఇంట
పెరిగి వెన్నలు పాలు పెరుగులు మ్రింగి
అరయ పట్టపు దైత్యులందరి గూల్చి
మామ కంసునిజంపి మరి పగను దీర్చి
గోవులు జూపించి గొల్లవాడలను
నామంబు దెల్పించి నందుండు తండ్రి
మామలు బావలు మనతట్టు వారు
తమ్ములు తనయులు దాయాది వరుస
ముఖ్య పెనగుడు కడసారి వరకు

కద్దు లే దనటంత కయ్యమనిపించి
తద్దయు వైకుంఠ దరిచేర్చు నటుల
ధైర్యముగ నామారు తర్లి యాదవుల
కార్యముల్గలిగించి కలుపుక రమ్మి
సజ్జనుల్ యాదవుల్ సాహసోత్తములు
ముజ్జగంబుల యందు ముఖ్యమగువారు
వారికి మంత్రివై వారితోపాటు
దారి మోసిన వేళ తలుగక నాజి
ఎదురించి పోరాడి యేక చూపట్టి
మదినుంచి వారింటి మగువ పెండ్లాడి
తగిలి వెంబడి మూడు తరములనుండి
తగ తోడితెమ్ము సత్వరగ మాచెంత
వారివెంబడి మంత్రివైయుండి నీవు
కోరి మందకు నీడగొడుగు చందమున
కాపాడి మందలో కవులావులీల
ఏపుతో జన్మింతు నిది నిక్కువంబు
కమలాసనుని రూపుగాను పుల్లెద్దు
ప్రమథాధిపుని తురగ బసవదేవుండు
పశుపతి రూపంబు భక్తుడను పేరు
కుశలముగ దిక్పాలకులు గోపవరులు
వేదముల్ మందలో వృషభములుగను
ఆదిలో పుట్టుటకై వెడలె నిజము
సాగరంబుగ పెద్ద చల్ల గల్పించె
ఆ గురుడిటువంటి అవతారములను
కాగ భువి గావింప కట్టదున్నాది
లోకపావని గంగ లోలాయతాక్షి

శ్రీకరంబుగ వారి స్థిర యిలవేల్పు
కలుగ చేయుదు క్షీర కడలిలో నీవు
నళినీ దళంబులో నటు నుద్భవించి
తరువాత నేను అంతట చేరవచ్చి
దరిచేర్తు'నని పలికె తర్లి వచ్చితిని
కమలాక్షుడొక మాయ కల్పించి నన్ను
కమలమున బుట్టించె కలశాబ్ధియందు
అందు వెయ్యేండ్లు శ్రీహరి పాదపూజ
సందులోకుండ హరి స్మరణచేసితిని
సలిల మెల్లాడి సప్త సాగరంబులును
వలయ ప్రదక్షిణ వరుస ముమ్మారు
తిరిగితి నే సప్త ద్వీపాంతరములు
ఛాయగా నొకనాడు శౌరినిగంటి
పాయక తక్కిన బహు ఋషివరుల
నెడనెంచి నను జూచి యిట్లనిపలికె :
"పదినూరు యేండ్లు ఈ పద్మంబు సందు
పదలక నను మది వాంఛనుంచితివి
పొలుపొందు వైకుంఠ పురముకు నీకు
తలచినప్పుడె కోర్కె దయచేయగలను
అందుకు నొక కొంత అనుమానమెద్దు
ముందు నీతోతెల్పు ముచ్చట లెల్ల
మనసున ఉన్నవా? మరచి ఉన్నావా?''
వనితనివాసుని వాక్యమాలించి
దండ ప్రమాణంబు తగ సమర్పించి
ఖండింతంబుగ మంచి కవులు అడిగితిని

"వైకుంఠ మెడబాసి వచ్చిననుంచి
మైకాంతి మిముగాన మాధవ యింక
పరమాత్మ ! యింక మావని ఏమి"టన్న
మురహరి నాపల్కు ముచ్చటాలించి
ముదమున ననుచూచి మురహరుడు బల్కె
"యాదవుల్ జననముల్ ఎత్తి ఉన్నారు
అవతారములు ఇట్లయని యంటి మొదలు
అవి యెల్ల జన్మించె నా మందలోను
బొల్లావు మారూపు బోలి జన్మింతు
అల్లగ పుల్లెద్దు అజుని రూపాయె
శంకరు వాహనం సెలవందివచ్చి
పంకజోద్భవ మంద జనవన్నపుట్టు
సర్వేశు డెదుకుల సాధ్వి గర్భమున
మర్యాద జనియించు మరి యుగంబులను
కాని నీ వరుదెంచు క్రమము దెల్పెదను
భువిలోన యదురాజు పుణ్యాత్ముడొకడు
ధవళ కీర్తి గలట్టి ధన్యు డొలురాజు
ఎలపుంచి పంపాద్రి యేలుచున్నాడు
బలులైన కులకోటి బంధులున్నారు
ఆవులమందలు నధికంబు గలవు
చాల సంపదల విస్తారు డనదగును
వేటలాడుచు నిందు వేంచేయగలడు
పాటించి నిన్ను ఏర్పడ చూడగలడు
నీ వెవరుండని నెలవడుగ గలడు
నీ విధమంతయు నెఱిగింప గలవు
తుద మొదలు వినగ సంతోషింప గలడు

కదలి రమ్మని నిన్ను గణుతింపగలడు
పనజాత మిడనాడి వలురాజువెంట
పనివడి యలమంచి పంపాద్రిచేర
పోవయ్య నిన్నుంచి పోషింపగలడు
పావనంబగు పేరు పల్లి కొండయ్య
పందుము గోవిందు పణతియు దాను
అందుక వలురాజు అనుమతిచేత
పుత్రులు లేకను పుత్రసంతాన
దత్తంబు చేసుక తగపెంచగలడు
పందుము గోవిందు పణతి నాగమ్మ
కందువతో వలురాజు కన్న కుమార్తె
మారుగావలె అతని మనుమడ వీవు
ఆరాజు సుతునకు ఆడ శిశుబాల
అంగన గాగలదు అజుని నిజవ్రాత
కొంగుముడి యీ మాట గోకులాధిపుల
కాపాడి కొన్నాళ్ళు కార్యమూలమున
మాపాల బడవేయు'మని హరి బలికి
పోయెను వలురాజు ! భూపాలతిలక !
ఆ యెడ సాగరమందు నేనున్న
ననుగాంచి తెచ్చితి నాటనుండయును
నిసుబాయకను గొల్చి నీ మంత్రినైతి
మరువక భోజన మజ్జనంబులకు
తిరమంద పోషించితివి భేదపడక
పోషించినందుకు పొరలక మనసు
వేసుక యుద్ధంబు ఏడ్చి చేసితిని
పురుషోత్తముని మాయ భువిలోన
మమ్ము
పరమున పుట్టించె పకరాశి గూర్చి
మాయచే హరి మీకు మంత్రిగానున్న
'పాయకుండు' మటంచు పలికె
నొకమాట
'యేపనికి ముందర యోచన మనసు
లోపలి మర్మంబులో దివ్యదృష్టి
గత ఏష్య లబ్ధముల్ కనుపడ గలవు'
అని లక్షణము తెల్పి హరి పురికేగె
తవిలి గాదీమాట తథ్యంబు తాత!
వివరించితిని నాదు వృత్తాంతమెల్ల
అందరికి పై బారమైనదిగాక
పంద మానవుల నేర్పడ జూపు మింక
పరగ శ్రీహరివేడి పసిడి వ్రతములను
త్వరితముగ రప్పింతు తొడరి మనమంత
పరగ వైకుంఠము పట్టణము చేర
తరలి పోదము లెమ్మి తాత
వలురాజ"!

## వలురాజు వైకుంఠమున కేగుట

వలురాజు హరి గురువు వచన
మాలించి
చెలువుడై కలకల చిరునవ్వు నవ్వి
"విను పందుములవాస! విఘ్ననిదాస!
మనసిజ గురుని సమానమౌ నీవు
కృపజూచి రక్షించు కుల ముద్ధరించి

ఉపకారివై కీర్తి ఉర్విపై నిలుపు
మమ్ము కదిలించు హరిమందిరంబునకు
నెమ్మది యలమంచి నీవు చేరబొమ్ము
ఇందు చెల్లినవారి ఇంతులందరిని
అందు వైశ్వానరు కాహుతి చేయు
కడపట మీ మామగారి ఏవురుని
నడిపింప భారమున్నాది నీ వలన
పెద్ది రాజును బిలచి ప్రియమును దెలిపి
ముద్దు టుంగర మిమ్ము మురహర నీవు
పెద్ద వాడున్నాడు బేరజముకాడు
బుద్ధి విస్తారు డద్భుత భయంకరుడు
అతనిపై దయ యుంచుమని పెద్దిరాజు
క్షితితలాధిపునితో చేయు విన్నపము
ఎరనూక నలనూక యెలమి పోల్రాజు
పర భయంకర శక్తి ప్రబలిన ఘనులు
వార్త కెక్కిన రాజు పరశిఖామణులు
మూర్తి మంతులు వారు మువ్వురు హితులు
పదివేల పదిలక్ష పశువు లున్నావి
కొదువలేని పదార్థ గోప్య మున్నాది
పంపుగల వీరకోటి బంధులున్నారు
రాజులకు మంత్రులకు రాకులమునకు
పూజితంబుగ మంత్రిపుంగవ నీవు
యేరీతి మామల నెత్తి పెంచెదవు
ఆ రీతి కడతేర్తునని పల్కునాతో
తెప్పించు రథములు, దేహముల్ తోడ
నిప్పించు వైమంత నిలయమందరికి"
అనుచు దగ్గర నిల్చి హస్తముల్ బట్టి
"మనవిని విను ప్రతిమాట లాడవలదు
గత భవిషదర్థముల్ గని పల్లికొండ!"
పృథివీశ్వరుని మనవి పొసగ నాలించి
"తాతయ్య! వింటి నీదగు విన్నపంబు
సీతామనోహరు సెలవద్ది మీకు
అతి శీఘ్రముగ విమానములు తెప్పించి
చేతోపరాధముల్ చెల్లింతు" ననుచు
కరము చలింపక కరములు మొగిచి
తిరుచూర్ణధరుని ప్రార్థింప దొడగె:
"భోగీశ వరద! అంభోనిధిశయన!
నాగారి వాహన! నగధరోద్ధార!
భువన వందిత! భక్తపుణ్యసంచార!
భవజనమందార! పద్మదళాక్ష!
ఇందిరా హృదయార విందమిళింద!
మందిరోన్నత! కూర్మ మత్స్యావతార!
పీతాంబరధర! దైత్య సంహార!
పూతన భంజన! భువనైక వీర!
వర శకటా తృణావర్త సంహార!
గోప భామల నేలు కూర్మి విటకాడ!
లోపల పదునాల్గు లోకముల్ నోరు
తెరచి తల్లికి చూపి తరువాత రోట
విరచిన కట్టను మద్దు లీడ్చిన దేవ!
నగుచు మణిగ్రీవ నలకూబరులకు
పగటున శాపంబు బాపిన తండ్రి
పరగ వత్సాసుర బకుని సర్పకుని

ధర గడపి గార్దభ దానవుల గూల్చి
కమలగర్భుని గని కాళింగు నొంచి
విమలమౌ కార్చిచ్చు వెరువక మ్రింగి
కన్నెల వలువలు కనకుండ తెచ్చి
పొన్నమానెక్కి భోగశరీర!
ఆవుల రక్షించ అద్రి పైకెత్తి
దేవేంద్రు నోడించు దేవకితనయ!
రోషించి వృషభాసురుని సంహరించి
కేశి యను దైత్యుని కెరలి చెండాడె
వ్యోమకాసురు బట్టి వడి నేల గొట్టి
ఆ మీద కృపయుంచి అక్రూరునకును
విశ్వరూపము జూపి వీక్షించి నట్టి
విశ్వంభరుడ! నీకు నిదిగె వందనము!
మధురాపురము చేరి
మడియాలు దునిమి
అధమురాలగు కుబ్జ కతిరూప మొసగె
స్పష్టముగ ధనువు చెయిసంధించి
విరచి
అష్టమదములు దిగిన హస్తిని గూల్చి
మల్లరంగము గాంచి మడియ చాణూర
మల్లజెట్టిని ధరణి మడియ బరిమార్చి
గండరగండని కంస భూవరుని
చెండి కైవల్యంబు చేర్చు శ్రీకృష్ణ!
గోవింద! గోవింద! కోదండరామ!
నీవాడ నను గావు నీలవర్ణుండ!
మొగురొమ్ము పోట్లతో యదురాజ
వరులు
మదగజంబులవలె మ్రగ్గి యున్నారు
రక్షించు యదువీర రాజ కుమాళ్ళ
వక్షమై వైకుంఠ పట్టణం బిమ్ము
మరుజనక ; దివ్యవిమానము లిటకు
కరుణించి రక్షించు కరిరాజవరద !"
అని విన్నవించిన నబ్జలోచనుడు
ఘన విమానము లంపె కదలి
రమ్మనుచు
అక్రూరవరదుడు అంపిన హేమ
చక్రరథములు వేంచేయగ చూచి
పంచముల కులగుర్వు
పల్లికొండనియె :
"వందన మావుల వలురాజ చంద్ర !
తడవేల నిక రథమ్ము లల్లవిగె
బడిబడి కులకోటి బంధువుల్ నీవు
గమనించి రథములు కడుమోదమలర
విమలమౌ వైకుంఠ విడిదికి జనుడు
భూవర ! మీరథము పోనిమ్ము వేగ
పోవలె యలమంచి పురము నేచేర"
పల్లికొండనుమతి పైనమై లేచి
వల్లపు లార్వేలు వరుస తిరుమందు
లెల్లరు నేడ్వేలు ఆరథము లెక్కి
రాలాగు బంధువు, లా వలురాజు
పల్లికొండను చూచి పలికె నవ్వేళ :
"చల్లని పందుముల సరస చారిత్ర !
నామారుగా జూడు నా ముద్దుసుతుల
పియము భాళించు నాబిడ్డ లంచరిని

అదిగాక మీ యప్ప సగ్నిప్రవేశ
మొదలుగ కావించు పురహరు సేవ !
కొమరకన్నె ! నాచిన్నకూతురున్నాది
తమకక అన్నల దయవుంచుమనుమి
అటుమీద మీదయ సంపదమీద
పటుతరంబుగ నిల్పు బాలలందరికి
కుదురు చక్కని పెండ్లిపూతుళ్ళ
తెచ్చి
అదునుగా పెండ్లిండ్లు ననుకూల పరచు
ఇన్ని చెప్పగనేల విను పల్లికొండ !
చెన్నుండ ! నా కొక్క సెల
విమ్ము దేవ!"
సెలవు మున్మాటి కిచ్చెను పల్లికొండ
వలురాజు వీక్షించి వర విష్ణుభటులు
పన్నుగ గనియు ఆపన్నులై లేచి
'అన్నయ్య ! వేంచేయు హరికొల్వు
నకును'
ఆటపాటలు మంచి హరికీర్తనములు
గాటమౌ గంధర్వ గాన గీతములు
భోగరాగంబులు బోనకావళ్ళు
సాగి నడువగ రాజు సరసుని ముందు
యేలాగు యలమంచి వేట సన్నాహ
మాలాగు వైకుంఠ మరిగె వలురాజు
వరుస రాజుల నెల్ల వైకుంఠ మనిచి
పరమాత్మ పందుము పల్లికొండయ్య
విరివి గాయములతో వీరపుంగవుడు
తన చుట్టు మన్నీలు ధైర్యమానసులు

భేరీలు తుడుములు పెద్దన్నగార్లు
తీరైన సౌబోతు తంత్రి నాదములు
పచ్చపు బిరుదులు చిలుకపట్టు గుదార్లు
యెదురాజు బిరుదులు ఎందు
బోకుంత
పుర్వ్వ హయములపైన వృషభముల
పైన
పరిపరి విధముల పట్టి నడిపించె
అంచు బంగారు పూత ఆణి
ముత్యములు
మంచినీలంబులు మణికాంతి ప్రభలు
పల్లకి తగనెక్కి పల్లికొండయ్య
చిల్లర బలములు చేరి వెనువెంట
కలయ నాదుచు భేరికాహళ ధ్వనులు
ఎలమి తోడుత వినుచు ఎలమంచి చేరె
వలురాజు పుత్రులు వలురాజువిధము
గలవారు సౌందర్య ఘనులు
నైదుగురు
సాదన గరిడిలో సాము చేయుచును
పాదముల నెగజిమ్మి పందుము రాళ్ళ
గోనె లద్భుతముగ గూర్చి తమ్ములును
పూని పెనగుచు వచ్చి పుటముగా
నెగయు
తండోప తండముగ దండేలు దీసి
గుండ్లు లోడీలు వేగిరపాటు ద్రిప్పి
పిల్ల పేరెంబు లొర్పిళ్ళు చేయుచును
ఉల్లాసమున రాజులున్న సమయమున

పందుము కులగురువు పల్లికొండయ్య
దంఢణ భేరులు తముకు చేయించి
పంది మాగధులచే వలురాజు బిరుదు
పొందైన యలమంచి పురవీథులందు
బిరుదు నొందిన వీర భీకరాకృతుల
సరసలక్షణములు చదివించుకొనుచు
ప్రఖ్యాతి దెల్పుచు పాలకి ముందు
విఖ్యాతిగా రాజవీథిని రాగ
ఆలించి తమ్ములు నన్నలు సాము
చాలించి గరిడి ముఖసాలయు దాటి
చనువరుల తోడ భాషణము
లాడుచును
పనిబడి శౌర్య ప్రతాపు లేగురును
అల్లంత రాజూచి అవనీశ్వరులను
పల్లికొండయ్య తా పల్లకి డిగ్గి
వందనముచేసె పేర్వాడి రాజులకు
ముందుగా కరములు మొగిచి
యిట్లనియె :
"విను పెద్దిరాజు! నా విన్నపంబొకటి
మనుజేశ! వలురాజు మా తాతగారు
మగటి మిగల ఖండెమొండెముకోట
పగలు లగ్గలుకెక్కి పగతుల ద్రుంచి
కలభూత గంగ భూకాంతుని దునిమి
గెలిచి తన పంతంబు గెడపి శత్రువుల
మాధవు సెలవు విమానములెక్కి
మోదమున వైకుంఠమునకు వేంచేసె
కనుగొను మీతండ్రి ఘనభూషణ
ములు"
అనవిని పెద్దిరా జన్నదమ్ములును
విని చాల సంతోష విశ్రాంతులగుచు
మొనబాకు సవియాలయులు కేలబూని
సవ్వేచు నేగురు అన్నదమ్ములును
చివ్వన నొకరొకరు శిరములు వంచి
చక్షుల సలిపి నిక్షేపంబు కరణి
లక్షణంబుగ మంగళ ప్రదంబులతో
పల్లకీ సొమ్ములు బాకు పుంగ్రములు
పల్లికొండను వెంటపట్టుక తర్లి
వల్లమ్మ కొల్వు నివాసంబునకును
అల్లన నేతెంచి అమ్మకు మ్రొక్కి
సింహాద్రి పెద్దన్న చెలువు దెరనూక
తమ్ముడు నలనూక తగ పోలురాజు
వందనం బొనరించి వరకుమారకులు
తండ్రి సొమ్ములు బాకు తగుటుంగ
రములు
అండజయానకు నందించి సుతులు
వల్లమ్మ వినగ భూవరులు ఇట్లనిరి :
"తల్లివి నీవు, మా తండ్రి వలురాజు
మొనగలదిల ఖండెమొండెము కోట
ఘనత లగ్గలకెక్కి ఘనుల మర్దించి
గణుతించి కలభూత గంగ భూవరుని
రణమందు పడగూల్చి రభసంబు
మెరసి
బారులన్నియు పటాపంచగావించి
హేరాళముగ తన హితులు పదమూడు
వేలతో వైకుంఠ మేగె నటమ్మ
ఆలంబుచేసి మా అల్లుడు యిటకు

పచ్చి గాయంబులతో భారంబులనక
వచ్చెను పదివేలు వోపికతోడ"
అనవిని వల్లమ్మ అపసంబునొంది
ఘనుడు పందెముల దిగ్గజము నీక్షించి
కొమరుల నిరువైపు గూర్చుండనించి

## వల్లమ్మ సాగుమానసము

కమలాక్షి తన విభుని కార్యలక్షణము
అతిగౌరవముతోడ నడుగంగ తొడిగె:
"గత రహస్య మెరుంగు ఘనపల్లి
కొండ !
బవరమున మీ తాత బంటుతనమ్ము
వివరించు నెటువలె యుద్ధముచేసె
కులకోటి బంధువుల్ గుమిగూడి వెంట
కానికి నడచిరో కైదప్పి పోయిరో ?
కోటపై లగ్గలు కొల్పించినపుడు
మాట దక్కించిరో మన వంశమునకు
ఘాటమౌ కలభూత గంగ భూపాలు
కోట బయలాయెనే కోర్కెలు మీర ?
తగ గంగరాజు మీ తాతయ్యగారు
తెగబడి పోరుటందముగ చూచితివె ?
వలురాజు ముందర వారిగెనా ? గంగ
యిలనాథు డొరిగెనా ? యిధి
నిక్కువంబు
తెలుపు ?" మని పలికె, నంతట
పల్లికొండ
నిలచియు పందుములనిలయు డావేళ
కనకాంగి యడగిన కార్యలాభంబు
విని యక్షయంబుగ నింతి కిట్లనియె :
"రమణి ! నీ విభుని పరాక్రమము
తమకక అనిచేసె సాహసోత్తముడు
మొనగల గోపకుమారు లందరును
అనికి పైనముచేసి అంపించె ముందు
సెలవొంది కోటపై చెలరేగి లగ్గ
మట్టలన్నియును తా మట్టి గావించి
జంటైన శత్రుల చదిమి పోదరిమి
ఎన్నగల భూపతుల వెంపరలాడి
కేరుచు నగరి వాకిళ్ళను దాటి
రారాజుసరి గంగురాజును గూల్చి
అతని సుతునికి పట్న మధికార మిచ్చి
వీరులతో తమరున్న విడిది కేతెంచి
సెలవొంది నాతోడ శ్రీహరి దలచి
మలినములేని విమానము లెక్కి
బలములు గొలువంగ పదమూడు వేలు
వలురాజు చనినమ్మ వైకుంఠమునకు"
విభుని పరాక్రమం విని వల్లమాంబ
హృదయ సమ్మతమొంది ఒగి
నిట్టులనియె
"ఎంటిని నావిభు వీరశౌర్యంబు

వెంటనే నాకొక్క వేడి గుండంబు
కావించు పందుముల ఘనపల్లికొండ!"
ఆవుల వల్లాంబ యనుమతిచేత
భావించి విని లేచి ఖళిఖళి యనుచు
ఏవురు మామల నెలమి వీక్షించి
తావిన్నవించె వృత్తాంతము నొకటి:
"వినరయ్య! మీతల్లి వీరధర్మంబు!
వనజాక్షి యనుమతి వలదన రాదు
పురుషులపై మర్లు పొర్లిన స్త్రీల
ధర నిల్వుమన మనకు ధర్మంబుగాదు
గ్రామంబు పూర్వదిగ్భాగంబునందు
భామకు గుండ మేర్పరచ నెయ్యముగ
మరి తడయగ రాదు"అని వేగ తర్లి
కోరి రాజులు పల్లికొండ యొకరావు
పిన్నలు పెద్దలు ప్రియ బంధు జనులు
పన్ని ఫాల్గుణ శుద్ధ పక్ష ద్వాదశిని
బలువైన వడ్డె వుప్పర్ల బిలిపించి
సులువుగా నల్దిశల సూత్ర మేర్పరచి
అండజయానకు ఐక్యముగాను
గుండ మేర్పరచి యేగురు
ముద్దుసుతులు
వొట్టివేళ్ళ తడిక లొరుస పందిళ్ళు
పెట్టుగా సంపంగి బిందె లేర్పరచి
సకలమైన వన్ని సఖియ గుండమున
కొకటి కొదువలేక వనగూర్చి
సుతులు
తల్లి సన్నిధికేగి దండంబు బెట్టి!
వల్లమ్మ! మీకోర్కె వనగూడె లెమ్మి

పంచకల్యాణిపై పట్నముకేగి
యెంచంగ సురలు దివి కేగుదువు
లెమ్మి!
కొమరుల యెడబాసి కొమరమ్మ
విడచి
అమరలోకము బోయెదమ్మ లేవమ్మ!
గ్రక్కున బంధువర్గము విడనాడి
పుష్పకతేరుపై నెక్కి యరుగుదువు
లెమ్మి"
అని యిట్లు పెద్దన్న, అన్నసింహాద్రి
వనజాక్షికిని దెల్ప వల్లమ్మ లేచి
ఘనవేగ యాదవాంగనల బిలిపించి:
"వినరమ్మ! ఒకవార్త విన్నవించెదను
దయ్యన శిరసంటి జలకములార్చి
వయ్యన గావించి వరభూషణములు
శృంగారమున పసుపు చీరగట్టించి
ముంగరములు కాళ్ళ మువ్వలందెలును
సొంపుగా ధరియించి సొరిదిగుండముకు
పంపరో యమ్మ! నను పైనమ్ము
చేసి"
మగువ లందరు వల్లమాంబ మాటలకు
నొగి వేగ సంపంగి నూనెలు దెచ్చి
తరుణి శిరస్సంటి తగు జలక మార్చి
అరయ మిక్కిలి తల యార్చి,
తిలకంబు
దిద్ది, నేత్రంబులు తెలియ కాటుకయు
ముద్దియ నొనరించి ముదిత లందరును
పేరైన సొమ్ములు ప్రియముతోడుతను

హారముల్ మెయినిండ నాలంకరించి
పల్లవపాణికి పసుపు చేలంబు
మొల్లముగ ధరియించి మోదమునరంగ
లేమ తగు పంచకల్యాణి నెక్కించి
భామలందరు రాగ పట్నమూరేగి
యింటింట వల్లప్పవిందు భుజించి
వెంటనే గుండము కేతెంచె నప్పుడు
చేటల నోములు స్థిరముగ నోమి
నీటుగ మగువ పుణ్యంపు నీరాడి
కొమ్మ కుంకమ పసుపు కొల్ల
లామించి
సొమ్ములన్నియు విప్రసుదతుల కొసగి
దాన భూదాన గోదాన విధాన
పూని తానిప్పించె భూసురులకెల్ల
అటుమీద సింహాసనమున
గూర్చుండి
నిటలాక్షు పూజించి నెలత
తన సుతుల
రమ్మని చిన్ని కొమరమ్మను పిలచి
నెమ్మది సింహాసనము పైన నుంచి
పల్లికొండను బిలచి పణతి పల్లాంబ
పల్లవాధరి విన్నపము చేయదొడగె:
"ఆదినారాయణ! అవుతారమూర్తి!
రాధావిలాస! శ్రీరామ చంద్రేశ!
వలురాజునకు మేటి పై కుంత మిచ్చి
యిల కీర్తి చెందితి విందుకులేశ!
పురుణింప విభునితో పొసగ వె కుంతి
మరుగ నానతి యిమ్ము మదినుంచి
కరుణ
పరమాత్మ! గుంపముకు పైన మైనాను
ధర కీర్తి నిలుపు నా తనయు లున్నారు
వారిపై మీదయ వదల కేపొద్దు
పరామరిక వుంచు పల్లికొండయ్య!
మామీద దయవుంచి మమ్ము
మన్నించు!
పాదుక మమంచి పట్ట మేలించు
రాజుంపు చెల్లెలు రమణి పూబోడి
రాజీవనేత్రి కొమరమ్మ వున్నాది,
బాలుర నొక కంట భామ నొకకంట
చాలగ వీక్షించు సాక్షాత్తు గరువ!
ఆలమందలు ధనము అరమర లేక
ఫాలాక్షు మాయచే పంపులవువేళ
తనయులతో టట్టు తరుణిభాగమును
వనగూర్చు పనిచేయు వో పల్లికొండ!
తనయులు నా చిన్నతనయ మీదటను
నెనరుంచి వెనుదగిలి ఎడబాయకుండ
యలమంచి పంపాద్రి యెల్లదేశములు
నెలకొని పెద్దన్న నృపతి నేలించు"
మని పల్లికొండకు మనవి వినచెప్పి
ఘన నీలవేణి దిగ్గనలేచి నిలచి
భ్రమలుడిగి తనయులపై నాశవిడిచి
కొమరులందర పల్లికొండ కాప్పించి
వెలది చంపుడుకట్ట ఎక్కి నవ్వుచును
నలిశల్ వీక్షించి నలినాయతాక్షి

తలవంచి సభకెల్ల దండమర్పించి
పలురాజు కులసతి వనిత వల్లమ్మ
గురువుతో సెలవంది, కులము
సెలవంది,
ఆరలేని సెలవంది, అరవిందనయన
తప్పు ఒప్పులకెల్ల దండమర్పించి
గుప్పున పడదుమికె గుండంబులోన
గుండము దరిన ఏగురు సుతులు
సుతయు
పెల్లుగ వల్లమ్మను పేర్కొని యడల
ఇమ్మారు ముమ్మారు ఇందీవరాక్షి
సమ్మతి యని పల్కె సభ యెల్ల వినగ
చమురు బిందెలు దుంప సమిధ
దూలములు
నిబిడీకృతముగ నించి రా వేళ
నెలత గుండము నగ్ని నెగడు
మంటలును
కలగాలి అగ్గిలో కరిగె వల్లమ్మ

## కొమరమ్మ వలపోత

అలివేణి కొమరమ్మ అన్నలేవురును,
ఎలుగెత్తి హో యని యిందరు జూడ
తల్లి వల్లమ్మను తలచుక సుతులు
పల్లికొండను చూచి పలికి రావేళ :
''అల్లుడా ! పరమపద మరిగె మాతల్లి,
వల్లమ్మ వలురాజు వకరాశియైరి
సతిపతు లేకమై స్వర్గస్థులైరి
గతి మిమ్ము మాకు దిక్కని జూపి చనిరి
సిరిబాల కొమరమ్మ చింత యే ప్రొద్దు
మరి మరి వలపోత మాన్పగాలేము
మా తండ్రి మీతో యేమని చెప్పినాడు?
ఏ తీరుగా మమ్ము ఎత్తి పెంచెదవు ?
నీవే మా తలిదండ్రి! నీవె దైవంబు !
నీవె మా భ్రాతవు ! నీవె మా
గురువు !''
కొమరమ్మ పందుముల గోవిందు చూచి
అమితమౌ దుఃఖమున నవనిపై
నొరిగి
''అన్న ! పందుముల శ్రీహరి !
పల్లికొండ !
కన్నీరు వుడుగదు, కాంత వల్లాంబ
గుండంబు చూచిన గుండె తల్లడము
చండ ప్రతాపమై చెదురుచున్నాది
అన్న ! నాపై ప్రేమ నాల వల్లమ్మ
చిన్న ప్రాయంబున శివుడెడవ్రాసె
మాకు భాగ్యంబు నౌమమ్మ మాయమ్మ
కాక యే భాగ్యంబు గలదు గోవిందు ?
గండు తేటుల కాంతి కలుగు నీకురులు
మండి యగ్నిలోబడి మాయమయె తల్లి!
నెలవంక యనవచ్చు నెలత నీనొసలు

కలగాలి మంటలో కరిగె మాతల్లి!
పశుపతిసూడిల్లు పణతి కనుబొమలు
మసియయి పోయెను మగువ వల్లమ్మ
కలువరేకుల మించు కన్నులు రెండు
చిలువసామికి సాటి చెలి శిఖ జడయు
మాడి నిప్పుల కుమిలె మాట
మాత్రమున
గుండములో ధుమికితే కువలాయ
తాక్షి!
అమరంగ నీమోవి అమృతపుధార
కురియుచు నుండును కుమిలెనా
చిచ్చు!
పలువరస మొల్లల పంక్తి నోడించు
నిల గాలిపోతివి నిముషమాత్రమున!
అద్దంపు బిళ్లలౌ యమ్మ చెక్కిళ్ళు
దగ్ధమై పోయెను తల్లి వల్లమ్మ
వడి మీద సుడి సరివచ్చు నీగళము
చెడగాలి చిచ్చులో చెదరె నాతల్లి!
మమ్ముల నీడేర్చు మధుర పాలిండ్లు
కుమ్మరాముల రీతి కుమిలె నాతల్లి!
వనజతూండ్లకు సరివచ్చు
హస్తములు
ఘనమైన గుండములో కాలె నా తల్లి!
చివురుటాకుల బోలు చెలియ
పాదములు
ధగధగ యని మండి దాపకుండితివి!
కమనీయ నక్షత్ర కాంతినీగోళ్ళు
అమర గాలి భస్మ మాయె నాతల్లి!
కొదమసింహము బోలు కొమ్మ
మధ్యంబు
కదియ గాలి పరమ్మ కంటివటమ్మ!
యింతి నీ పిరుదులు యిసుకదిబ్బలుసు
పంత మాడగనవి పడివేలు తరుగు,
కాంత నీతొడలును కదళికంబములు
సొంతముగ గుండమున సమిసె
నాతల్లి!
పిక్కలా వరిపొట్ట బిగువుల గేరు
చెక్కలలో కాలి చేరితివె హరుని!
కమఠంబు పైచిప్ప కాంత మీగాళ్ళు
తమకక తెగ కాలె తల్లి వల్లమ్మ!
తరణికిరణంబులు తరుణి నీగోళ్లు
విరియ కాలె నటమ్మ వెలది వల్లమ్మ!
స్ఫటికంబులను బోలు పణతి నీ వ్రేళ్లు
చిట పెట మాడె నీ చిచ్చులో తల్లి!"
అని అమ్మ వర్ణించి అవనిపై పొర్లి
వనిత కొమరమ్మ తా వలపోయ జూచి,
పందుముల రఘుమూర్తి
పల్లికొండయ్య
కందు బాలల చూచి కన్నీరు నించి
యేవుచు మామల అక్కున చేర్చి
ఆ వెనుక కొమరమ్మ నమిత లాలించి
చనిన క్రిందటి పూర్వ సామ్యముల్
దెలిపి
మన మెంతవార మని మరి దుఃఖ
మార్చి
నది చేరనేగి స్నానములు చేయించి

పిదప సూతన వస్త్ర క్రియము
లిప్పించి
మందిరము చేరి బ్రాహ్మణుల రప్పించి
అందు సమారాధనంబు లేర్పరచి
తరువాత గోవుల దానము లొసగి
ధరగల షోడశ దానము లిచ్చి
పణతి గుండంబులో వద్దు వీక్షించి
కను కార్పిపై మన్ను కప్పించి సుతులు
దిన దినము క్రతువులు తీర్చి
విభవముల
అల్లుడు పల్లికొండయ్య కృపచేత
వల్లవుల పెద్ద భూవల్లభు డంత
సొంపుగా సింహాద్రి సోదరి
తమ్ములతో

పంపాద్రి యెలమంచి పాలింపుచుండె
అని మాధవుని పేర, నహితల్పు పేర
మునివిధేయుని పేర, సురవైరిపేర,
భక్తవత్సలు పేర. పరమాత్ము పేర,
కరిరక్షకుని పేర, కమలాక్షు పేర
వర మద్దులేటి నివాసుని పేర
అనుమతి వడ రుపాన్వయుడైన యట్టి
ఘనకీర్తిమూలయ్య కలిత పౌత్రుండు
పెద్దనాచ్యని కూర్మి
ప్రియనందనుండు
మద్దులేటను బుద్ధిమంతు డొలురాజు
చరితను పూర్ణంబు చేయంగ దలచి
యిరువొంద రచియించె వివర
మంతయును.

# పంపాద్రి కథ

### -: ఇష్ట దేవతా ప్రార్థన :-

శ్రీ నీలకంఠుని చిత్తాన దలచి
గీనమందారుని-విష్ణు-దేవునకు
మ్రొక్కి
వారిజగర్భునకు వందనముచేసి
శారదను కొనియాడి శివుని ప్రార్థించి
కూర్మితో పార్వతి-పెద్ద-కుమారుడైన
చేరి విఘ్నేశునకు సంతసమొనర్చి
ఎలమితో తన ఇలవేలుపు అయిన
కలకంఠి తంగిరాల గంగను వేడి
కాళిదాసు మొదలైన కవివరులకెల్ల
తాలిమి సాష్టాంగ దండంబుల నిడి
అఖిల దేవతలకు ఆదికవులకు
మ్రొక్కి ప్రార్థన చేసి ముందుగాదలచి
దీపింప యాదవాధిపతుల చరిత
పరగంగ తెరచీర భక్తులకు మ్రొక్కి
సరవితో వ్రాయ చెప్ప చదువగలయట్టి
అయ్యల కొనియాడి అతిభక్తితోను
రయమొప్ప యాదవ రాజుల చరిత
చెప్పేను వినరయ్య జనులార మీరు

## కవి వంశాదికము

వా కలిగి తనకీర్తి వహించి మించి
ప్రాకటముగ జెప్పి ప్రజల మెప్పించి
గుఱ్ఱము గొడుగులు గురుతైన
అరిగెలు
మెరువడి త్యాగములు మెండుగా నంది
ధనధాన్య వస్తువులు తనర
అమృతము
అనుదినము తన యింట అతి
తుష్టిగాను
వేమారు కీర్తుల వెలసిన ఘనుడు
జంగమయ్య సుతుండు జనులు
మెచ్చంగ
సంగతిగ కవిత్వ స్వారస్యమెరిగి
దిట్టముగ యాదవ ధీరుల చరిత

ఘట్టిగా జెప్పేను కణగి సభవార !
ఆటంకారముగ నవరసాలంకారమున గూర్చి
మాటలు రత్నాలుగాను మల్లయ్యయను వాడు
సొంపుతో వినరయ్య చోద్యంబుగాను
పంపాద్రికథ జెప్పె ప్రఖ్యాతిగాను.
రాణింప ఈ కథ లక్షణమెల్ల
పోణిమిగ చెప్పెను పొందుగా వినుడి

## ఆవుల వలురాజు పుత్రులు సింహాద్రిరాజు, పెద్దిరాజు, యరనూకరాజు, నలనూకరాజు, పోలురాజులు యలమంచి విడిచి పంపాద్రికి వచ్చుట

వలురాజు మొదలైన వరుస పెద్దలును
చెల్లిరి యలమంచిన స్థిరముగా వారు
వారు చెల్లిన వెనుక వారి కుమాళ్ళు
చేరి విచారము చేసి రందరును
"పెద్దలు ఇచ్చోట పేరు పేరుల చెల్లిరి
వద్దికతా యలమంచి వమ్మది తమకు
ఏటికి యలమంచి ? ఏమి నిత్య" మని
వాటముగ పంప్రాదికి వచ్చిరి వారు
తడబడు సంపదలు తామరతంపరై
పడమటి ఝామున పంపాద్రికి వచ్చిరి
పొందుగా సంపదలు పుడమి కంపింప
అందలాలు దిగెను అచ్చోటవేగ
ధన ధాన్య వస్తువులు మించిన ఘటుల్లు
శూలాలతోబండ్లు చాలుగా దిగెను
కందువతా యాదవ కంపటము మొదలు
నందుల గుడార్లు అందముగదిగెను
వాటంపుటరిగెలు నీటుకేకములు
యాటలు పైడమ్మ–చింత–ముురుమేల దిగెను
జల్లుబల్లేలు సాధన శెవిరీలు
గుడార్లు చందువ గోనెలు దిగెను
మొల్లముగ సందలు ముడుపుతోవచ్చి
పల్లకీలు పంపాద్రి పడమట దిగెను.
పోకల కంట్లాలు బుక్కాయి పెట్టెలు
ఆకులు మావటీ అతి వేగ కదిలె
కెంపులు పచ్చలు గరిమ రత్నాలు
కొంశక నీలాలు గోమేధికమ్ములు

రవి మించు వైడూర్య పుష్యరాగములు
సరవితో ముత్యాల చౌకట్లు మొదలు
కుంకుమ కురువేరు గోవజవ్వాజి
తీరు కలిగిన మంచి దివ్య భూషణాలు
కోరికతో కదిలెను కోకలపెట్టెలు
పల్లెబోయినవారు పందుములవారు
చల్లని నేరేళ్ల సరసను దిగిరి
దండెబోయినవారు దామసానివారు
పండిన మామిళ్ళ బయటను దిగిరి
కొల్లారు బండ్లును కొలువు గుడార్లు
వల్లవుల సరసన వైళంబ దిగిరి
ఆవపువ్వులవారు అచ్యుతునివారు
వేవేగ దిగిరి ఎల్లావులవారు
శంఖుదారవారు సరగమర్లవారు
పొంకముగా దిగిరి భూపతివారు
జెట్టిబోయినవారు జడదారవారు
పట్టుగల సంపదలు పంపాద్రినిలిచి
కనకనందులవారు గంగావులవారు
గొనకొని జగజంపు గుడార్లు దిగెను
కల్లందులవారు కవ్వమువారు
చెలువైన సంపదలు చెలువార దిగెను
మగుటకోటవారు మరినేతివారు
దిగిరి సంపదలు తేరళ్ల బయట
సింహపరాక్రమున చెలగి నుతికెక్క
గహ్వరమున సింహాద్రి ఘనుడు
తా కదిలె
ధామసానివారు తగు వేడ్క కదిలిరి
అమరంగ పెద్దిరాజు అటు వెనుక కదిలె
మరి వేగ ఆవపువుల మరుదులు
కొలిచి రాంగ
ఎరనూకరాజు తా నెలమితో కదిలె
వలనొప్ప జడదారువారు కొలిచి రాంగ
నలనూకరాజు తా నలివేడ్క కదిలె
తిరుమందులవారు ధీరత కొలిచి రాంగ
ఆరూఢి పోలురాజు అటువెనుక కదిలె
వల్లవుల రాజులు వరుసతో వెనుక
పల్లికొండ రఘుపతి బాగొప్ప కదిలె
బ్రాహ్మలు దీవించి భట్లు పొగడంగ
బ్రహ్మాండముగ రాజులు పంపాద్రికి
వచ్చిరి
పడమటిజామున పంపాద్రికి వచ్చిరి
పడిగెలు గొడుగులు పంపాద్రిన నిలిచె
ఘనముతో వల్లవులు కరుణతోడుతను
వీరణంబులు డోళ్ళు ఎలమి
సవ్వాయులు
ధారలు భేరీలు తమ్మట ధ్వనులు
బోరుకొనగ ఇంద్రభోగములు
మెరయ
ధీరత వచ్చిరి దినకరతేజులై
గరిమతో పట్టుజముకాళముల మీద
కొలువుదీర్చి యుండిరి కోరికతోను
ఆలోన సూర్యుడు అస్తాద్రి కరిగె
దినకరుడు గ్రుంకెను చీకట్లుగ్రమ్మె
వినయమున రాజులు వేడ్కతోదిగిరి

## పైడమ్మ చింతపై గల పక్షులు ఏష్యము పలుకుట

ఇరువులు చేసుక-పద్దెనిమిది-
యుగములనుండి
కూర్మితో పొందువ గూళ్లలోనుండు
గూళ్లలో పక్షులు గుబగుబ నెగసె
గూళ్లు చుట్టుకవచ్చి గుబురు గలిగినట్టి
పైడమ్మ చింతనున్న పక్షులు ఎగసె
వైనాన కొమ్మల వాలె నాడాడ
ఎలమితో ఆ మాను ఎటు జూచినాను
చెలువైన కచ్చలిచేను ఎలుపున వుండు
బలువైన యా మాను పాదు జూచినను
అలర జలరాశి అంటి తా వుండు
పొలుపొంద ఆ మాను పొడువు
చూచినను
అలర కైలాసము అంట పెరిగుండు
పాటించి చూచితే పదివేలు లెఖ్ఖ
కోట్ల పర్యంతము కొమ్మల చింత
తీరైన ఆమాను తెలివి చూచినను
పరుషమునకు సాటి ప్రతి వచ్చునంత
కాయలు చూచితే గముకమై లెన్స
భైరవశక్తికి ప్రతి వచ్చునంత
మెండైన ఆ మాను పండిన పండ్లు
కండచక్కెర తేనె కలిపిన మధుర
జుంటి తేనెకు సాటి చేయంగవచ్చు
అటువంటి ఆ మాను ఆదికాలమునుండి
గాటముగ ఆశక్తి కావలై యుండు
త్రైలోక్య సుందరి దానవశక్తి
పైడమ్మ యను పేర ప్రబలిన శక్తి
ఈ రీతి యా శక్తి ఇరవు చేసికొని
వుండంగ
చిరకాలము పైడమ్మ చింతయన తగును
ఆ చింత పక్షులు అనేక విధముల
ముచ్చట లాడెను మూకలు గూడి
"కృతయుగము నాడు
హరిశ్చంద్రుండు
సత్యముతొ రాజ్యంబు సరగున నేల
చేకొని విఘాతమని చెప్పితిమి నాడు
త్రేతాయుగము నాడు రామభద్రుండు
అధిక సంపదతోను అయోధ్య నేల
చేకొని విఘాతము చెప్పితిమి నాడు
హరిశ్చంద్రుండు సత్యంబు తప్పకను
కూర్మితో తన సతిని కుదువ బెట్టుకొనె
ఆతడు కులము చెడి అంత్యజు గొలిచె
రతిరాజు తండ్రి శ్రీ రామచంద్రుండు
అయోధ్య విడిచి ఆ అన్నదమ్ములును
వయ్యన చేరిరి వనప్రయాసములు
ఆ రూఢి వారికి అట్లు చెప్పితిమి
చేరి పాండవులు కురుక్షేత్ర మేలగను
ద్వాపరయుగమందు దుర్యోధన
పాండవులు
ఏపున రాజ్యంబు ఏలుచుండగను
తప్పక వారికి తార్కాణగాను
ఎక్కువగ చెప్పితిమి ఏర్పాటుగాను
దిక్కులేక పాండవులు దుర్యోధనులు
మిక్కువతొ పోయిరి మాయమె వారు

కలియుగ ప్రాంత్యాన ఘనుడు
వొలురాజు
ఎలమంచి పట్నము ఏలుచుండగను
విరివిగా చెప్పితిమి విఖ్యాతిగాను
చెప్పిన పలుకులకు చెలగి వలురాజు
కుప్పలుగ చెల్లిరి గోపాలవరులు
అక్కడ వారంత హతమైన వెనుక
ఇక్కడ పంపాద్రి ఏలెదమనుచు
వేగంబె వచ్చిరి ఇచ్చోట దిగిరి
తెగువతో ముందరి యోగక్షేమంబు
దీకొని వారికి తెలిపెద" మనుచు
చేకొని పక్షులు చెప్పంగ సాగె
రెక్కలు వేయుచు రెపరెపలాడుచు
కకపికలుగా బలికి కంఠములెత్తి
గుజగుజలాడుచు గూళ్ళ లోపలను
విజయులై యాదవ వీరసామంతులు
గూడారు లోపల కొలువు దీర్చుండి
ఆడనుండి పక్షులు ఆడు మాటల నెల్ల
విని పల్లికొండను వేగంబె అడిగిరి
"ఘనుడ పల్లికొండ ! గతకాల
మేష్యము
ఎరుగుదువు ముందరి యోగక్షేమంబు
పరిపరి విధముల పక్షులు పలికె
ఏమనెను పక్షులు ఎలమితో రఘుపతి
ఆ వార్త మాతోను ఆనతి"మ్మనిరి.
మామల మాటలకు మదనవల్లభుడు
"రామకుల గోత్రము రయమున
మామలార !
ఈవేళ పక్షుల నేమి యనరాదు
జీవుల పోషించుక చేరేటి వేళ
ఇనుడు గూకే వేళ ఎక్కడెక్కడ
నుండి
వనములకు పక్షులు వచ్చేటి వేళ
కేరుచు నేడేడ గీములలోను
చేరేటి వేళను చెప్పంగ రాదు
దోషము ఈవేళ దేవతపక్షి
భాష పట్టగరాదు పాపంబు వినుడి
ఏమియు ననరాదు ఇషువంటి వేళ
మా మనవి వినరయ్య మా మామలార
తెల్లవారితె మీకు తెలియ జెప్పెదను
కల్లలాడించకుడి ఘనులార నన్ను"
అల్లుడు పల్లికొండ ఆడు మాటలువిని
వల్లవుల రాజులు వైళంబె లేచిరి
పల్లికొండను పిలిచి పంపె నా రాజు
వల్లవుల తిరుమందుల వరుసతో నంపె
పరివారము బంధువులు పరగ సెలవు
పుచ్చుకోని
వారి వారి జాగాలకు వరుసతో వచ్చిరి
తమ్ముల బిలిచెను తాను సింహాద్రి
సమ్మతితో వారి జాగాల కంపె
అప్పుడు పల్లికొండ అంపించుకోని
ఒప్పుగ గుడార్లలో ఒయ్యన నిలిచి

# పల్లికొండ రాత్రివేళ పశులకు ఆన పెట్టుట

తన మనసులో నిట్లు తలచె నతండు
''వినయముతొ మామలకు విన్నపము
గాను
పంతమాడియు సాక్షి పెట్టేను నేను
మేతలాడి ప్రొద్దున మేసి ఆడాడ
పొయ్యేని పశులు పోకుండ మరియు
చేకొని తన మనవి కల్లచేయకు
మనియు
పక్క ప్రొద్దులు చెప్పి వచ్చెద''
ననుచు
గ్రక్కున పశుల కడకు నేతెంచి
యెదగలుగ నిలుచుండి యాదవుల
గురువు
ఘడియలో పక్క ప్రొద్దు ఖగములకు
చెప్పె
''అస్తమానమువేళ అనుమానముగను
ముస్తీదు తోడుగను ముచ్చటాడితిరి
నదినీళ్ల త్రాగి నానాజీవులాను
మీరు పల్కిన పలుకు మేదిని జనులు
తార్కాణగ్గా జేసి తలపోసి కొందురు
అటువెనుక మిమ్ములను అడుగ
వచ్చితిని
ఎటు బోకుడని వేగ చెప్పుచున్నాను
ప్రొద్దున మేతలకు పొయ్యేరు గనుక

సుద్దులాడగ వలెను చోద్య-వేద్యముగ
పోతిరైన మీకు భూకాంతయాన
ఘాతగా మీగురువు గరుత్మంతుడాన
సీతపతియాన పోతిరైన మీరు
మీతల్లిదండ్రులాన పోతిరైన మీరు''
ఆనబెట్టి పల్లికొండ అతివేగ మగిడె
జననాథుడు తానున్న జాగాకువచ్చె.
దినకరుడు నిద్రించె దిక్కులు సద్దణగె
మనుజేశు లంతంత మజ్జనమాడి
అన్నము భోంచేసిరి యాదవప్రజలు
పన్నుగా నిద్రలు పవళించి రంత
రాజులు ఐదుగురు రమణ నిద్రించిరి
భోజులు నిద్రలు పోయి రందరును
బ్రహ్మాండముగ పైడికుండ
గుడారులోను
సింహాద్రిరాజు తా చెలువుగ నిద్రించె
సిద్ధముగ పైడికుండ చిత్తరువు బాడు
దిద్దినారు మంచి దివ్యభూషణాలు
పేరుగల గుడారులో పెద్దిరాజు
నిద్రించె.
కోరికతో మంచి గోడ సరాదు
ఎర్రపట్టు గుడారులో ఎరనూకరాజు
నిద్రించె
జతగూర్చిన మంచి జరధారు బాడు

నల్లపట్టు గుడారులో నలనూకరాజు
తెల్లముగ నిద్రించె దేవేంద్ర భోగమున
సందుసందుల మంచి నందులు వ్రాసిన
కుందనము చెక్కిన పైడికుండ
యామీద
పొగడపువ్వు గుడారులో పోలురాజు
నిద్రించె.
పొంకముగ నిద్రలు పోయి రందరును
సద్దణగి సభవారు తమరు ఆడాడ
నిద్రించసాగిరి నిశిరేత్రి యాయె
కలువరా జుదయించె కైలాసవీధి
నలువపు ప్రొద్దులు నడిపించ సాగిరి

నాలుగో ఝుమూయె నట చుక్క పొడిచె
తెలతెల్లవారెను ధేనువుల కదుపులు
క్రేపుల కరిచెను, కెందరువు పువ్వు
ఏపున వికసించె ఎనసి కలువలు
ముకుళించె నలినములు మొనకప్పి
వెరచి
కొక్కొరొకో యని కోళ్ల ఎలుగెత్తె
గోపాంగనాశ్రీలు గొబ్బున లేచి
నీపింప జానలు తెలివితో పెరుగు
తరిచేరు కవ్వాల తాల్మితో నంత
అరుదెంచెను ఇనుడు అంబుధినుండి
రథమెక్కి చనుదెంచె రవితేజఘనుడు

## మరునాటి ఉదయము పల్లికొండ
## పైడమ్మ చింతను ప్రార్థించుట

రతిరాజు గురుడైన రఘుపతి లేచి
స్నానంబు చేసెను జగదేకమౌళి
ఎనయంగ నీరుకావి వలువలు కట్టి
జారీచెంబుతో జలకంబు తెచ్చి
కురిజీపీటమీద కూర్చుండి వేగ
కృష్ణాజినము పొదిగి కెంపులు దాపి
విష్ణు కర్పితమైన ఎనయ మేదొక్కట
తిరుమణి పెట్టెయు తెప్పించె వేగ
నీరజనాభుండు నిలువుపద్దంబు

చూచెను వేమారు సొంపుతోడుతను
కేశవనామంబు కిణకతో దిద్ది
శ్రీచూర్ణ మామీద దృఢముగా దిద్ది
కలుగంటి సిగవేసి గేదంగులు ముడిచి
వలనొప్ప రామతులసి వనమాలపేర్లు
మేలొప్ప ధరియించె మెడనిండ వేగ
నీలవర్ణుని మదిలో నిష్ఠతో నుంచి
శకునానికి ముస్తీదు చేసె నంతయును
అలరంగ శ్రీగంధ అక్షింతలు ధూపము

బంగారు బిందెతో పట్టె ఉదకంబు
సంగీతలోలుండు శకున ముస్తీదు
ధగధగ బంగారు జలపోత దండె
వగమీర భుజమున వన్నెగా నిడెను
వైనాన వస్తువులు వేశంబె కొంచు
టాంబూళము గొంచు తా కదిలె
పల్లికొండ
శక్తిచింతను జేరి చేతులు మొగిడ్చి
ముక్తార్థప్రార్థనము ముద మొప్పచేసె
త్రైలోక్యసుందరి దనుజసంహారి
పైడమ్మయను పేరు ప్రబలిన తల్లి
మేటి వేలుపులెల్ల వేటల గోర
గోటముగ మెప్రెల కోరినావమ్మ
సాటి వేల్పులలోను చక్కని వేల్ప
నేటితో నీమూర్తి నే జూడవలెమ
చింతను నీకీర్తి చేకొని యుండ
ఏంతగా పక్షులు విపరీతముగను
పరిపరి విధముల పలికెను నిన్న
సరవి నీసత్యము శకున పంతంబు
ముందు వచ్చే మేలు ముదమొప్ప కీడు
అందముగ పక్షులను అడుగ వచ్చితిని
చేకొన్ని పక్షులు చెప్పవలె నాకు
వాక్కియవమ్మ వో వనజాక్షి నీవు"
బలభద్రసేనుండు పైడమ్మను వేడె
చెలువైన పైడమ్మచింతను ప్రార్థించె
"ఓ కల్పతరువ ఓ మహామేరువ
నీ వయసు వేయేండ్లు నేరమితోను
ఈయెడ నాలుగు యుగములనుండి
కైలాసవీథిని కద్దు వక చింత
ఆ చింతకును సాటి అనవచ్చు నిన్ను
వాసించు పారిజాతవాసన నీవు
వంతుకెక్కిన సాటి వ్రూకులలోను
భూదేవి తెలిపెను పొంగి లెస్సగను
పాదుకొనియుండి పంపాద్రిలో పుట్టి
మహిమీద పుట్టిన వ్రూకులలోను
వహి కీర్తి కెక్కితివి వాహినిగ నీవు
తక్కిన వృక్షములు ధరమీద నుండ
చక్కని పక్షుల తావు చేసికొని
నీ నీడలో నుండి నిష్ఠలు గలిగి
పనిబూని నిన్నొక ప్రార్థన జేతు
మాకు శకునము పక్షులు మరి
చెప్పవలెను
వాకీయవమ్మ ఓ వనదేవత నీవు"

## పల్లికొండ శకునపంతము చెప్పుడని పక్షులను వేడుకొనుట

అమరంగ పల్లికొండ అంటట నిలిచి
వేమారు పక్షులను వేడంగ సాగె
"అనంత యుగమునాటి అబ్బురపు
పక్షులార
పనిబూని మిమ్ము నే భాష కోరితిని
అర్బుద యుగమునాటి అఖిలేశు
పక్షులార:
నిబద్ధిగా జెప్పరే నే నడిగినట్లు
తామంత యుగమునాటి తావు
పక్షులార :
అమరంగ చెప్పరే అడిగెద మిమ్ము
తారయుగమునాటి ధర్మపక్షులార :
సరిపోను చెప్పరే శకునపంతంబు
భిన్నయుగమునాటి పేరుగల పక్షులార
నిన్న పలికిన యట్లు నిజముగా
పలుకుడీ
అండజ యుగమునాటి అరుదైన
పక్షులార :
ఖండితముగ చెప్పరే గ్రక్కున తనకు
ఇత్యా యుగమునాటి పెంసిన
పక్షులార:
సత్యముగ చెప్పరే శకునపంతంబు
ఆదిత్య యుగమునాటి అష్టభోగులార :
వివరముగ చెప్పరే వేడుకున్నాను

అనియుగమునాటి అందమైన
పక్షులార :
మునుపు చెప్పితిరి నిన్న మాపటివేళ
అంత కృతయుగమునాటి అమిత
పక్షులార :
పలుకరే సత్యంబు పక్షులార మీరు
విశ్వ యుగమునాటి విపరమంతులార :
ఈ శకునము పలుకుడీ ఎటువలె
నున్నది
పరశ్రీ యుగమునాటి పక్షులార మీరు
ఉన్నట్లు చెప్పరే ఓ పక్షులార :
సకల శ్రీయుగమునాటి స్వాములార
మీరు
వాసన నున్నట్లు పరాకు సేయకుడి
ధర్మ శ్రీయుగమునాటి తల్లులార
మీరు
మర్మాల బొంకక మాతోను చెప్పరే
కృత యుగమునాటి గీము పక్షులార :
నాతోను చెప్పుడి నమ్మికగాను
త్రేతా యుగమునాటి వెలివైన
పక్షులార
భూతలమున నాతో బొంకక చెప్పుడి
దా పర యుగమునాటి దేవతా
పక్షులార :

చేపట్టి మాకును చెప్పరే మీరు
కలియుగమునాటి కబోది పక్షులార !
పలికి బొంకక నాతో పలుకరే మీరు
ఆడి పలుకకుంటె అధిక పాపంబు
పాడి దప్పితిరైన పాపము దగులు
ఎవరైన శకునము ఎరుగని వారికి
చిత్తజగురుడాన చెప్పకుంటేను
మావంటి వారికి మరుగు బెట్టితిరైన
గోవును జంపిన పాపము కొలచుట్టు
కొనును
వారణాసిలో బ్రాహ్మణ్ణి వధియించు
పాపము
తార్కాణగా మీకు తగులును
పక్షులార !
ముదముతో నే నడిగిన ముచ్చట
జెప్పరే!
కదలక యున్నారు ఓ ఖగములార !
బేజ్జపుతనమున బెదరితిరో లేక
నిర్జరులై యున్నారు నేడు బొంకకుడి
ముందరి మేలు కీడు మొనకట్టినట్లు
సంగతిగ చెప్పుడి శకునపంతంబు
నిన్న పలికినయట్లు నిర్ణయించి నేను
పన్నుగా మిమ్ముల భాష గోరితిని
భాషకు తప్పి మీరు పలుకకుంటిరైన
కసిబోని పలుకులు కాబోలునందు
చేపట్టి రెవరు మీ శకునపంతంబు
ఈపట్ల మామీద ఎరిక వుంచి మీరు
పరాకు చేయకుడి పక్షులార మీరు
బొంకితిరైన మీకు భూకాంత యాన
పంకజహితు డాన పణిరాజు ఆన
గరుత్మంతు డాన గగనంబు ఆన
ఊరికే ఉన్నారు ఓ పక్షులార !
పలుకకుంటిరైన పక్షులార వినుడి
చిల్లనమ్ముల కొలది చెండింతు మిమ్ము
అగణితమ్ముగ మీరు ఆడి తప్పితిరైన
జిగురు గండెలను బంధింతు మిమ్ము
నోరెత్తి పలుకక వూరకున్నారు
ఉరుగోలల బంధింతు ఓ పక్షులార !
కాళ్ళను రెక్కలు కదలకున్నారు
రాళ్ళను రువ్వింతు బొంకితిరైన
ఈరీతి మిమ్ముల అడిగితి ననుచు
కోరిక నామీద కోపము చేయక
మేలును కీడును మీ రెరిగినట్లు
వాలాయముగ చెప్పరే ఓ పక్షులార!''
అని యిట్లు పల్లికొండ ఆడు మాటలు
వినియు

## పక్షులు శకునపంతము తెలుపుట

పొన్నుమీదనుండి పక్షులు పలికె
కిలకిలమని నవ్వి కెరలి యా పక్షులు
కలకలలుగా నవ్వి కంఠంబు లెత్తి
ఏడేండ్లు పంపాద్రి ఏల చెప్పుటకు

నడుమను వక పక్షిని అటు వుంచి
వేగ
చేరి పరివారము కొలుపు చేసినయట్లు
ఉర్వీశ చూడంగ ఉండె నా పక్షులు
ఏడు కోలలు విరిచి వెంటనే రాప్పె
ఏడేండ్లు పంపాద్రి ఎచ్చరికతోను
ఏలేటి బలమును ఎరుగంగ జెప్పె
బలువైన సంపదలు పాడిపంటలు
గలిగి
ఉన్నతముగ వర్ధిల్ల వార్తలు చెప్పె
వన్నెగా బంతుల అన్నము వడ్డించినట్లు
కొన్ని పక్షులు తమలో గూళ్ళనున్న
పిల్లలకు మేతలు పెట్టంగ సాగె
పల్లికొండ చూడంగ పక్షులన్నియును
ఏడేండ్ల చేరువను ఐదుగురు తోడి
కోడండ్లు
పంపాద్రి బసవనకు వ్రతములు బట్టి
సొంపుతో నోమేటి సూక్ష్మము చెప్పె
ఇంపుతో పక్షులు ఎడబాసి కడకు
వచ్చి యా పక్షులు వైశంబె మంచి
పూచిన కొమ్మను పొలుపార జూచి
కొమ్మరెక్కల దుసిచి గొబ్బున పూలు
సమ్మతిగ పల్లికొండకు సరిపోవునట్లు
కుమ్మరామము మిణుగుర్లు గొబ్బున
ఎగసినట్లు
వాలాయముగ పువ్వులు రాలి ధరమీద
భావితముగ పుష్పలు రాలంగ జూచి
బసువన్న తననోము వొప్పకపోతె
ఉసురుమని పెద్దమ్మ వలపోసినట్లు
పల్లికొండకు తెలియ పలికెను పక్షులు
పుల్లసిలి యా పక్షి పోలేక ఎగసె
వాడి దప్పిపచ్చి వొంటికొమ్మన వ్రాలె
పొడవుగా మెడ యెత్తి పోటుకూతలు
గాను
కటకట దుఃఖించి కన్నుల వెంట
పొటపొట నీళ్లదెచ్చి పొగిలి యా పక్షి
ఆ పక్షి అదలంగ ఆ గొబ్బుగాను
ఒప్పుదప్పి పక్షులు వలపొయ్య సాగె
వక వక శకునంబు వైశంబె అడిగె
మక్కువతో పల్లికొండ మరివక
శకునంబు
అర్పించి వారేగు రన్నదమ్ములును
ఉచితముగ హర్షాల నుండేటి విధము
మొక్కి తా నడిగెను ముంగలి బుద్ధి
గక్కున పల్లికొండకు కనిపించునట్లు
తెగువ చేసుక పక్షులు దేశాలు విడిచి
ఎగసి పోసాగెను ఎక్కడెక్కడికో
నగుబ ఎగసెను గూళ్లు విడదన్ని
బొబ్బరింతలు వేసి పోటుకూకలు
కూసి
చెదరి యా షైడమ్మ చింతను విడిచి
పతి సతులు ఎడబాసి పాయతెరువులయి

చేకొని రెండు పక్షులు సతియు
పురుషుండు
శ్రీకూర్మము చాయ శీఘ్రంబె నడిచె
చేకొని రెండు పక్షులు సతియు
పురుషుండు
దుఃఖాన కల్యాణపు దూరదేశము
నడిచె
పూనికతో రెండు పోతు పెంటియును
ఏనుగఘాఘకొండ చాయ ఎడబాసి
పోయె
నిజముగా పోతు పెంటి రెండు
ఎడబాసి
బెజవాడ చాయకు పెంపుతో నడిచె
పతి సతి గూడుక పక్షులు రెండు
సత్యాన ఒక బిడ్డను చంక బెట్టుకొని
దక్షిణ శ్రీరంగము చాయ తర్లెను
పక్షులు
పంచ ఖండాలకు అన్నలు బడిబాసి
పోగ
మందనడుమ కొమరక్క మల్లడించ
చెప్పె
పొంటుగా పోతు పెంటి పొడవుగా
ఎగసి
గూటి లోపల ప్రాలి గోడుగోడున
అడిచె
తోటి వారైదుగురు దొనయెత్తి
పోయిరి

అని చెప్పి అడలంగ అటు పోతుపక్షి
ఆ పక్షిని కలువుక దక్షిణ శ్రీరంగము
పొయ్యేటి
పక్షుల వెంటనే పాయక ఎగిసె
మచ్చికతో వల్లవులు మన్నె
తిరుమందులు
ఎడబాసి ఎవరెవరి వెంట బోదురో
చెప్పె
కడమ పక్షులన్ని కకపిక లాయె
అయిదు నూర్లేర్పడి ఆ గొబ్బుగాను
పయనమై వాటెంట బోరుసాగి నడిచె
అన్నదమ్ములు వారు అయిదు
ఖండాలకు
వన్నెగా పక్షులు వయిలు బడ జెప్పె.
కంచి వంటి పంపాద్రి కాశి పారదజేసి
పంచపాండవుల వంటి బంధువుల
విడిచి
వల్లవుల రాజులు వయిలు బడజెప్పె:
ద్వారావతి కాపురాలు తర్లించు కోని
విరివిగా పంపాద్రి విడిచిపో జెప్పె
ఎలమంచి కాపురాలు ఎడబాపుకోని
పాలవెల్లి గోత్రము బడిబాయ జెప్పె
అల్లుదామర వంటి బలగము అండ
బావుకొని
వలురాజు కొమాక్షు వయిలుబడ జెప్పె
వియ్యాలు బంధువులు విఘాతము
చేసికొని

వహిలుబడి పోవుచు వలపొయ్య జెప్పె
సోనవాన కురిసినట్లు చోద్యంబుగాను
ఘనమైన పక్షులు కన్నీరు బెట్టె
వృక్షము విడిచి పక్షులు విఘాతము
చేసికొని
పక్షులు పోతేను-వృక్షము-
పాడుబడసాగె.
చింతకింద పల్లికొండకు వెయ్యి
చింతలై తోచె
వంతుకెక్కిన గర్భశ్రీమంతు లందరికి
అయ్యయ్యో అందరికి ఆపదలు చేసె
పాయక దోషకారి పక్షులు నేడు
ఏమి చేయుదు పక్షు లిటువలె చెప్పె
రామకులగోత్రము రఘువంశమంత
చీమలపుట్టకు చిచ్చు పెట్టినయట్లు
పాలవెల్లి గోత్రంబు ప్రలాపించ
కుండేర
వల్లవులు తిరుమందులు వలపొయ్య
కుండేర
మరుగు బెట్టితినైన మందలించేరు
శకునము మరుగుబెట్టి చెప్ప పాపంబు
పోకుమని చెప్పితే తనబుద్ధి వినరు

విధి కారణము వీరి కిటువలె నుండ
కాదని శకునంబు గర్వించరాదు
కీడైన మేలైన కించిత్తు జనులకు
ఆడుకొనగ బోదు అనుభవించకను
తలపోసి పల్లికొండ ధైర్యంబుచేత
నెలకొని శకునంబు నిర్ణయించుకొని
ఆనబెట్టిన చెట్టు ఆన తావిడిచి
మానవేశ్వరుండు మరి వేగ నపుడు
పైడిపోగు వెండిపోగు పరగ వర్షించె
వైరాలు వర్జించి ఉదకంబు చల్లె
చిటితాళము దండె తీసి పుస్తకము
పటవస్త్ర శయనుండు వచ్చెను మగిడి
గూడారులోనికి గొబ్బున వచ్చి
కడు వగ శకునముకాళ తా విడిచి
మదనవల్లభుండు మజ్జనమాడి
దిద్దెను నుదుటను తిరుమణి వేగ
పేరుగల చౌకట్లు పెట్టెను వేగ
తరుచైన బంగారుతగుటు తల జుట్టె
పరగ వెన్నముద్ద పచ్చడము గప్పె
బంగారు బొగడల పావాలు దొడిగె
రంగు మీరగ వచ్చె రఘుపతి వేగ

## పల్లికొండ సింహాద్రిరాజాదులతో వారి భవిష్యత్తు చెప్పుట

మామల సముఖానకు మరి వేగ వచ్చి
రమణతో పల్లికొండ రఘుపతి రాంగ

గుల్లున లేచిరి సభవారు అంత
అల్లుడు వచ్చెనని అతివేడ్కతోను

కూర్చుండమని జాగ గొబ్బున నిచ్చిరి
కూర్చుండె పల్లికొండ కొలువులోపలను
తబుకుతో కర్పూర తాంబూల
పీడ్యము
గొబ్బున నిచ్చిరి పల్లికొండకు నపుడు
అడిగిరి శకునంబు అల్లుని బిలిచి
"ఆడిదప్పని యట్టి హరిగురుప వినుము
పాళిలో రెండాడని బలభద్రళయన
శంఖచక్రావతార సర్వజ్ఞనిధివి :
పంకజనాభుండ పల్లికొండ రఘుపతి
నీకు సాటెవ్వరు నిఖిలంబులోను
మాకన్న ఘనుడవు మహనీయమూర్తి!
శకునపంతము మాతో చెప్పవయ్య
రఘుపతి?"
భూకాంత ఆకాశ పురహరుల మీద
ఆనబెట్టి అడిగిరి అల్లుని బిలిచి
మానవేశ్వరుడైన మదనగోపాలు
"అదేమి మామలార ఆనబెట్టేరు
భూదేవిపైనుండి బొంక నేలయ్య
మాకేల బొంకను మామలార వినుడు
శకునము వున్నట్టు చెప్పగలవారము
దేవతపక్షులకు తెలిసినట్టు గాక
ఆవుపాళి మాటలు ఆడ తమ కేమిటికి
వున్నట్టు చెప్పేము వో మామలార
కన్నడ చేయక ఘనులార వినుడు
చెప్పేద మీకును శకునపంతంబు
వొప్పుగ వినరయ్య వో మామలార !
మదనుండ సింహాద్రి మామరో వినుమ!
కదనసంహరుండ ఘనుడ పెద్దన్న-
మతిశాలి యరనూక మామరో వినుమ !
సత్య గలయట్టి జననాథ వినుమ !
మరి వేగ నలనూక మామరో వినుమ !
మారట శంభుడ మామ పోలురాజ !
అందరు శకునంబు ఆలించి వినుడి
ముందు వచ్చేమేలు ముదమొప్ప కీడు
అడిగితిని పక్షులను అర్చించి నేను
నుడి యడిగి మ్రొక్కితి నుత్తమపక్షు
లిట్లట్లు తర్లక ఏర్పాటుగాను
పట్టుగల పంపాద్రి ప్రజలును మీరు
ఏల చెప్పెనయ్య ఏడేండ్ల దనుక
పాలించి ఏలేరు ప్రజ్ఞాఫణముగాను
ధన ధాన్య వస్తువులు తగు
వేడ్కతోను
కనకమేడలు చాల కట్టించుకోని
ఆచంద్ర తారార్కము—అయిదుగురు-
అన్నదమ్ములును
హెచ్చుగా ఏడేండ్లు ఏల జెప్పినవి
ఏలేటి యా బలము ఎవరి పేర నంటె
పలికెను సింహాద్రి పట్టభద్రుని పేర
ఆరేండ్లు వెళ్ళి ఏడేండ్లు చేరువను
వారైదుగురు జనప ప్రవతములు పట్టి
ఆప్పలు చెల్లేండ్లు అతి నిష్ఠతోను

చెప్పెను పంపాద్రి శకునంబు చాల
ఉత్తమస్త్రీలు నోమ చెప్పెను వినుడ
భక్తితో నలుగురికి ఫలమియ్య జెప్పె
మోక్షము ఆమె నోము వొల్లని
యందుకు
వచ్చి కూటాలలో వలపొయ్య జెప్పె
ఆమెనోముకు మీరు అన్నదమ్ములును
సీమభూములు విడిచి చెదిరిపో జెప్పె
మీరు పోగ తిరుమందులు మేటి
వల్లవులు
వరుసతో మీవెంట వైలుబడ జెప్పె
అందరునూ బోంగ ఆడబిడ్డ వచ్చి
మందనడుమ కొమరక్క మందలించ
జెప్పె
తావు దప్పించి దేవస్థళానకు బోయేటి
దవ్వుదేశాలు మీకు తావుగా జెప్పెను
శ్రీకూర్మానకు సింహాద్రిమామ
ధర్మపక్షులు తాము తావుగా జెప్పె
ఏనుగనాథు కొండకు ఎరనూకమామ
పూనికతో పక్షులు పోజెప్పె మిమ్ము
నున్న బెజవాడకు నలనూకమామ
నిన్ను పోజెప్పెను నిఖిలంబు లెరుగ
పెద్దురాజ వో మామ పేరుగల పక్షులు
సిద్ధముగ కళ్యాణము చేరబో జెప్పె
పోలురాజ వో మామ భూములుగాని
భూములు
వాలాయముగ శ్రీరంగము పోజెప్పె
వినుమ
పంచఖండాలకు మీరు పరిబేన బోయి
అంచితముగ వుందురో అని అడిగితేను
అడిగిన యందుకు అనుమానముగను
తడబడి పలుకుచు ధరమీద నపుడు
క్రక్కెను నెత్తురు ఘనులార వినుడి
ఎక్కువ పక్షులు ఈలాగు జెప్పె
ఇక బొంకులేదయ్య ఈశ్వరుని ఆన !
కందర్పగురుడాన ! కల్ల కాదయ్య !"

## శకునపంతము విని సింహాద్రిరాజు చిన్నబోవుట

శకునము పల్లికొండ చెప్పినందులకు
మక్కువతొ సింహాద్రి మరి చిన్న
బోయె
"పల్లికొండ రఘుపతి ! బలభద్ర
శయన !
చెల్లంబొ యెటువలె చెప్పితివి నీవు
మేలనుభవించియు కీడు ముందరికి
అలరంగ దూరాన అరికట్టి చేస్తివి
దనుజసంహార మునుపు తార్కాణ
గాను

వెనకటికి చెప్పితివి ఎలమంచిలోను
తమ తండ్రి వోలురాజు తామరతం
పరై
క్షేమాన వుండంగ చెప్పితివి నీవు
చెప్పిన శకునంబు శివునిశూలమై తాకె
వుపకారార్థము తమ అయ్య వోలు
రాజు
కరణాలకుగాను గంగురాజులతో
పోరి తన ప్రాణములు వొప్పగించి
నాడు
కన్నెమొగిలి వీరబయట గాజుకొండకు
తూర్పున
మిన్నువిరిగిన బయట రాయి విరిగిన
కనుమపద్ద
వొప్పుగా బాహువులు వురపడె నాటి
దొప్పదోగి రక్తాన సోమవంశ మంత
చెల్లికి నీవు చెప్పిన శకునపంతాన ;
తమ తల్లి అగ్గిలో తాపమై పోయె
అయ్య చెల్లిన కాణాచి వూరుతము లేదని
వయ్యన పంపాద్రికి వస్తిమి మేము
వచ్చి యిక్కడ మేము వహిలుబడి పోగ
వుచితముగా బ్రహ్మ వ్రాసె కాబోలు
నిలక డిక్కడ లేక నెలవులు విడువ
ఈలాగు నుండెగా నీశ్వరు మహిమ ;

## పెద్దిరాజు అన్నకు ధైర్యము చెప్పుట

అని యిట్లు సింహాద్రిఅన్న తలపోయ
మన్నీడు పెద్దన్న మరి యిట్టు లనియె
అలనాటి మాటలకు అవనివల్లభుడు
పిన్నపెద్దల పేరుపేరున బిలిచి
"తిరుమందుల మల్లుని, దినకరుని
కదిరి,
తరికోటి ధర్మన, దామసాని పోతన,
పులిమద్దుల రాఘవు, భూమాడి శంకరు
కలిగిన పెద్దలార ఘనశూరులార ;
పందుముల పాపన; పల్లెబోయిన తాతన;
పొందుగా వినరోయి పుల్లావుల
భూపతి ;
అన్నసింహాద్రి తానన్ని బుద్ధులు ఎరిగి
చిన్నమాటలు మాతో చెప్పెను వింటిర
పక్షులు పలికినట్లు పల్లికొండ రఘుపతి
నిశ్చయముగ వున్నట్లు చెప్పగలవాడు
వొచ్చేటి మేలును వొనరంగ కీడు
ఇచ్చట అనుకోంగ వచ్చునే యికను
అర్జును చక్రవర్తులు వసహార్జును
రాజులు

ఏరి భూమిలోన ? ఉన్నార చావక ?
వాలాయముగ బ్రహ్మ వ్రాసె కాబోలు
తెలివితో అనుభవించక తీర దెవ్వరికి
ఈ వార్త మీతోను ఎంచ పనిలేదు
చావుకు పగచేది సాహసము గాదు
ఏడేండ్లు పంపాద్రి ఏలితే చాలు
ఏడు తరాలుగా ఏలిన ఫలము
మరి వేగ పెద్దన్న మాటలు మనసున వుంచు
గరిమతో రఘుపతి కట్టించు పట్నము."

## యాదవులు పంపాద్రి పట్నమును నిర్మించుకొనుట

పెద్దరాజుమాట విని పల్లికొండ రఘుపతి
బుధులను పిలిపించి పేరుబల మడిగె
ఎలమంచి పురోహితులు అయిదుగురు వచ్చి
బలువైన మూర్తమున పట్నంబు గట్ట
వేగంబె చెప్పిరి విప్రవరు లంత
రవితేజ ఘనులార! రాజ శేఖరులార!
సామ్రాజ్య పదవితో సంపూర్ణముగను
స్తంభ ప్రతిష్ఠ చేయ ఘనులార నేడు
మూడో ఝామునుండి మూర్తము మంచిది
దండిగా పంపాద్రి తగు వేడ్కతోను
ఏలేటి బలము మీ ఏగురిలోను
బలువుగ సింహాద్రిపేర బలము వున్నాది
విప్రుని మాటలు విని వేగంబె రాజులు
కాశీల వడ్రంగుల ఘనత వుప్పర్ల
వేర్వేర అందరిని పిలిపించి రంత
ద్వారకాసూత్రము ధర జనులెల్ల
గౌరోజు కాళప్ప, కాళింగ శంభు,
దేవపూజ మల్లోజి, జున్నోజి శ్రీగిరి,
చివ్వోజ శరభయ్యను శీఘ్రంబె పిలిచి
ధట్టిక భాయిలు తసిరీబు లిచ్చి
పరబ్రహ్మమైన పరగంగ లోకాలు
నిర్మించ కర్తలు నేడు పంపాద్రి
పాలించి కట్టరయ్య పంచాణమువార!
తాల్మితో శేఖరుల డాయంగ బిలిచి
బొమ్మిసెట్టి రాఘవు, పోలిసెట్టి యెల్లు,
తమ్మిసెట్టి మండలి, తగు పెద్దలార!
గౌలిసెట్టి రాచయ్య, కంచిసెట్టి పోలు
వుప్పర్ల బిలిచెను వొప్పుగా సింహాద్రి
కప్పెను తసిరీబులు కనకాంబరములు
కడు వేడ్క నిచ్చెను గరిమ తోడు తను
మెండైన శేఖరులు మేటి బ్రాహ్మలును
అంపించుకొని వారు అతివేగ వచ్చి
రాజులు తామును రమణ భోంచేసి

భోజులు ఎప్పుడు బుధులు మూర్త
మున
సామ్రాజ్య పదవితో సకల భోగంబు
స్తంభ ప్రతిష్ఠ చేసిరి కడు ముహూర్త
మున
కాశీలు వద్రంగులు ఘనత వుప్పర్లు
వాసిగా సూర్య సోమ వాడ లేర్పరచి
బలు సుముహూర్తమున పరగ చేపట్టి
వైనాన మేడలు వాడ లేర్పరచి
దీటుగా ద్వారకకు తీరు అనవచ్చు
వాటముగ గోపురాలు వన్నెగా వీథులు
పంపాద్రి కట్టేరు ప్రఖ్యాతిగాను
రంజిల్లు వజ్రాల రత్న కూటములు
వరుసతో గట్టేరు పల్లవుల యిండ్లు
తరుచైన మేడలు దంతనపు తలు
పులు
తీరుగా కట్టేరు తిరుమందుల వాడలు
కేళీ గృహంబులు తీరైన మిద్దెలు
పాలించి కట్టేరు పందుముల వాడ
ఉప్పరిగె మేడలు ఉరువని పందిళ్ళు
ఒప్పుగా చల్లవారి వాడ కట్టేరు
చెలువు మీరగ మంచి చిత్తరువు
మేడలు
కల్లందులవారి వాడ కడు వేగ గట్టేరు

చుట్టు కొల్లాలును చోద్య వేద్యముగ
మట్టుగ గట్టేరు మర్లవారి వాడలు
గోపురముల మీద పైడికుండ లెత్తించి
దాపున గట్టేరు దామసానివారి వాడలు
జెట్టిబోయినవారు, జడదారవారు
వోడు బిళ్ళల తలసాల వొప్పైన
మేడలు
అంతరువు అంతరువు దంతనపు
మేడలు
వంతుకెక్కిన కొమనాలవారికి గట్టేరు
మంచి శిలలును మేలి మ్రాకులు దెచ్చి
నాచకూళ్లవారికి నతివేగ గట్టేరు
భవంజి కూటాలు పంచలు విడిచి
ఆవపువ్వులవారికి అతివేగ గట్టిరి
కసకనందులవారు గంగావులవారు
కనకపు జలపోత కంబాల మేడలు
పులిమద్దులవారు భూమాడివారు
చెలువైన లక్కసిరి శృంగార మేడలు
ఎడలేక కట్టేరు ఏర్పాటుగాను
మేడలు వాడలు మేలి చావళ్ళు
శస్త్రశాలలు మంచి సాధనగరుళ్లు
చిత్తరువు చవికెలు శీఘ్ర వేగమున
ఆరువేల తిరుమందుల అంతఃపురాలు
వల్లవులవారికి వాడ లేర్పరచి

# పంపాద్రి నగర వర్ణన

మేలైన వాడలు ఏర్పరచి రంత.
అష్టాదశ పర్ణాలవారు ఆ పట్నమందు
అష్టభోగములతో అలరుచు నుండిరి
భావింప శివభక్తిపరులు వుండంగ
శివలోకమై యుండె చెలగి పంపాద్రి
ఆ తీరు చేతను అధిక సంపదలు
విరివిగా పంపాద్రి విష్ణుపుర మనవచ్చు
గహ్వర వేద శాస్త్రఘనులు వుండంగ
బ్రహ్మపురి యన వచ్చు పంపాద్రి
మిగుల
పద్దెనిమిది ఫణాలవారు పట్నాన
మెరసి
నిదానముగ వుండిరి నిండు పంపాద్రిని
వర్ణాశ్రమ ధర్మాల వాడ లేర్పరచి
పేరుపేరుల గట్టిరి పెక్కు విధములను
సరగ రేపల్లెకు సాటి యనవచ్చు
పరగంగ పంపాద్రి పట్నము మిగుల
వయ్యన పంపాద్రి వాడలు జూడ
అయోధ్యకు సాటి అనవచ్చు మిగుల
గొనకొని పంపాద్రి గోపురాలు జూడ
తిరుమల పర్వతాలకు దీటొచ్చు
మిగుల
వజ్రపు తలుపులు వాకిళ్లు దాటి
సజ్జనపు మేడలు సరభిత్తోడుతను

హరినిర్మితమైన ఆరూఢి మేడలు
ఇమ్ముగా గట్టేరు ఎంతయు వేడ్క
బోనేశ్వరంబులు భోరు తలుపులును
సేనలుగ గట్టిరి చెలరి పంపాద్రి
ప్రజలును వర్తకులు బలుపు సంపదలు
నిజవాడ లేర్పరచి వసుధలోపలను
మేడలు గోపురాలు మేలుగ గట్టిరి
దివాణాలలోను దిష్టికుంభాలు
భావింవగా బోసి ప్రతిష్ఠ జేసిరి
తిరుమందులు వల్లవులు తేజంబు
మెరసి
నిండైన పట్నాన నిధానముగను
దండిగా పాలించిరి ధర్మపాళిగను
ఏలిరి పంపాద్రి హెచ్చుగా నంత
నెలకు మూడు వర్షాలు నేర్మితో కురిసె
పన్నెండు ధాన్యాలు బలువైన పంటలు
పాడిపంటలచేత ప్రబలి రంతంత
అన్నము అమృతము అనుదినము
గలిగి
వన్నెగా పంపాద్రి ప్రజలు వర్ధిల్లి
రంత.
బావులు చెరువులు బలువైన వనములు
దేవళంబులు దొడ్డ తేరులు గలిగి
వుండెను పట్నంబు వుర్వి కంపింప

పండు ఫలములతోడ పరగతోటలును
నిండు కోనేరులు నెరువైన పేటలు
సకల సౌఖ్యము గలిగి సామ్రాజ్య
పదవి
ప్రాకటముగ సింహాద్రి పట్టభద్రుండు
హెచ్చుగా ఏలెను ఏడు ఏండ్లూను

## యాదవకాంతలు సంతానమును గోరి పంపాద్రి బసవన్నకు నోములు నోయ సమకట్టుట

ఏడేండ్ల చేరువను ఏగురు తోడికోడండ్లు
పట్టిరి వ్రతములు బసువదేవునికి
నోము ఫలములు బట్టి నోముదా
మనుచు
కామినీమణు లెల్ల కడు వేడ్కతోను
తమలో విచారములు తలపోసి రపుడు
అలనాడు పక్షులు ఆడిన వాక్యములు
పల్లికొండ చెప్పిన ప్రకారముగాను
తప్పక శకునపంతము తార్కాణమాయె
అప్పలు చెల్లెండ్రు అందరు వారు
పంపాద్రి బసువన్నవ్రతములు బట్ట
సొంపుతో వచ్చిరి శుభ ముహూర్తమున
రమణతో సింహాద్రిరాజు కులసతియు
శ్రీమహాలక్ష్మి బోలు సీతాంబ యనగ
అరుంధతికి సాటి అనవచ్చు మిగుల
సాధుగుణముల మంచి సత్యవతి యనగ
నలనూక రాజుకు ననుచు నిజరాణి
వలనుగా సీతాంబ వారిజనేత్రి
పార్వతికిని సాటి ప్రతి యనవచ్చు
తీరు గలిగిన మంచి దివ్య గోపికయు
నుతికెక్కు పోలురాజు నూకాంబ
యనగ
భక్తితో పంపాద్రి బసువదేవునికి
నోముఫలములు బట్టి నోముదా
మనుచు
అమరంగ తలపోసి అప్పు డిట్లనిరి
"ఆవుల వల్లమ్మ అరుధాంగలక్ష్మి
భావింప పంపాద్రి బసువనకు చాల
ఎక్కువైన నోములు ఎన్నికగ నోచి
అత్త నోచింది తొల్లి అని యేక
విధముల
అత్త బట్టిన వ్రతము అరుషంబు గాను
అక్కజముగ కొమరక్క నడుగవలె"
ననుచు.
అమరంగ తలపోసి అప్పచెల్లెండ్లు
కొమరగిరి నగరికి గొబ్బున వచ్చిరి
ఆవేళ కొమరక్క అతి వేడ్కతోడ
గోవింద మండపాన కొలువుతీరివుండె

వల్లవుల కాంతలు వచ్చిరని పోయి
వై శమే దాదులు విన్నపము చేసిరి
వదినలు వచ్చిరని వార్తవిని కొమరక్క
ఎదురుగా వారికి వెళ్లి తా వచ్చెను
అందరు కొమరక్కకు హస్తమెత్తి
మ్రొక్కిరి
చందనగంధులు సంతోషమునను
కొమరక్క వున్న కొలువుకూటము
చొచ్చి
జమకాళము పరిపించ సఖియ
కొమరక్క
అతి వేగ కూర్చుండ మని ఆనతిచ్చె
వుత్తమా పతివ్రతలు కొలువై
కూర్చుండిరి
పచ్చనీ బాగాలు పండు తెల్లనాకులు
ఇచ్చెను కొమరక్క ఏర్పాటుగాను
"వచ్చిన పనియేమి వో వదినలార!
దాచక నాతోను తలపొయ్యరమ్మ"!
వంచనార్థి గలిగిన వదినె లందరును
ఎంచగల కీర్తులు ఎంచిరి వేగ
"రమణి పుత్తడి బొమ్మ!
రాచిలుకోవమ్మ!
హంసనడకల వంటి అలినీలవేణి
అలరంగ వల్లమ్మ అతిముద్దుపట్టి!
కొమరగిరి వో యక్క! గొబ్బున
వినుమ
భామరో మేము వక ప్రయోజనము
గలిగి
ఈ వార్త మీతోను విన్నవించితిమి
చెప్పిన వార్తలు మీ చిత్తాన వుంచి
తప్పులెంచక మామీద దయవుంచి నీవు
కాదన అవునన కర్తవు గనుక
విధమెల్ల చెప్పేము వినవమ్మ నీవు
మా అత్త వల్లమ్మ మగువశిరోమణి!
పాయక అనియేక పట్టిన వ్రతము
నోముగల నోములు నోచిన వార్తలు
కామినీమణి నీకు కనవచ్చు గనుక
అడుగ వచ్చినాము అక్క కొమరక్క
కడు వేగ జెప్పుమా కాంతరో నీవు!"
వల్లవ వదినెల వార్త విని యంత
నలినాక్షి కొమరక్క నవ్వి యిట్లనియె

## కొమరక్క తనతల్లి వల్లమ్మ నోచిన నోములను వదినలకు వివరించుట

పేరుపేర వదినెల పిలిచె నావేళ
"అరుంధతీలక్ష్మి! ఆణిముత్యపుబొమ్మ!
గహ్వరమైనట్టి కాంతా శిరోమణి!
సింహాద్రిసీత! విరిగల కాంత

బుద్ధి కలిగిన మంచి పుణ్యాత్మురాలు!
నిద్దంపు చెక్కిళ్ల పెద్దమ్మ వినుము!
మరువంపు మొలకల మాటలదిట్ట
సిరికాంత ఎరనూక సీతరో వినుము!
తళుకు చెక్కుల మంచి తరుణి
యనగాను
నలనూక సీతరో నా మేనవదినె!
సర్వజ్ఞురాలవు సజ్జన గుణముల
నగ్రావుల సిరిదేవి! నా మేనవదినె.
నాడులార! వినరమ్మ నన్నడిగినందుకు
మా తల్లి వల్లమ్మ మహానిష్ఠతోను
పట్టరాని వ్రతములు పట్టింది తల్లి
పుట్టుతా తమతల్లి భూమినోము నోమె
ఎడదీరు ప్రాయమ్మున పద్దులనోము
నోమె
కలిమి సంపదలతో కల్యాణము గలుగ
బాల ప్రాయంబున బ్రహ్మముళ్ల నోమె
శ్రీకూర్మము నోము నోమె చెలగి
మాతల్లి
ప్రాకటముగ సింహాద్రి పట్టభద్రుని
కనెను
అమరావతినోము నోమె ఆవుల
వల్లమ్మ
భీమబలాఢ్యుని పెద్దన్నను గనియె,
దేవగిరినోము నోచె తెలివితో వల్లమ్మ
రవితేజు యరనూక రాజును గనెను

భక్తితో నోమెను ఘనతి వల్లమ్మ!
నిష్ఠతో నోచెను నీలకంఠుని చాల
వలురాజుకు సమాన ధీరుడై నట్టి
నలనూకరాజును నాతల్లి గనెను
నందులనోము నోమె నాతి వల్లమ్మ
పొందుగా మాయన్న పోలురాజును గనెను
కోటినోములు నోమి కొమరక్క యను
పేర
కొమరక్క యను పేరు కూతురిని
గనియె
ధన ధాన్య వస్తువులు తనయులు గలుగ
అనంత నోములునోచి అతి నిష్ఠ తోను
పున్నమ చంద్రుల వంటి పుత్రుల
గనియె
పన్నీరు దొంతులు బాగొప్ప నోమి
వనరంగ నోమెను వరలక్ష్మినోము
ధనలక్ష్మి గలుగంగ తరుణి వల్లమ్మ
ఎనయంగ కేదార ఈశ్వర నోము
సంపద లక్ష్మిగలుగ తరుణి వల్లమ్మ
కంపింప భూములు కలుగను నోమె
ఉభయలక్ష్మి గలుగ వల్లమ్మ వినుత
నిబ్బరంబుగ నోమె సిరాళ్లనోము
రాజ్యలక్ష్మి గలుగ రమణి వల్లమ్మ
పూజించె అనియేక భూమిదేవరల
పూజ్య లక్ష్మి గలుగ పుణ్యంబు గలుగ
ప్రజలకు సాటిగా పగంతాలు నోమె

నామగిరి గూడార్లు నందిబెక్కేలు
సామంత రాగోల జమిలందలాలు
హనుమంత పడిగెలు ఆల వట్టములు
ఏనుగమీద బెక్కేలు ఏకశంఖులును
పంచమ వాయిద్యములు బసువ
శంకరబిరుదు
అంచితముగ తమకు అష్టభోగము
గలుగ
సకల సౌభాగ్యము సామ్రాజ్యపదవి
దక్కవలె ననుచును తరుణి వల్లమ్మ
వకరి శక్యముగాని వ్రతములు పట్టి
అక్కజముగా నోమె ఆవుల వల్లమ్మ
నన్నడిగి సందుకు నాతులార మీకు
నోమ గలిగితిరైన నోమరమ్మ
మీరు!
ఆ మాటకు వారేగురు అప్పచెల్లెండ్లు
"కొామరక్క వో యక్క కోపము
చేయకు
మా మనవి వినవమ్మ మగువరో నీవు
మా యత్త వల్లమ్మ మారుగా నీవు
వో యక్క నిన్నడుగ వొస్తిమి
మేము
వొచ్చిన యందుకు వుచితముగాను
దాచక చెప్పితివి తోచినయట్లు
పంపాద్రి బసువన్న వ్రతములు బట్టి
ధూప దీప నైవేద్యము సూక్ష్మ
మంత్రంబు
అత్త బట్టిన వ్రతములో అర్ధభాగమైన
ధన ధాన్య వస్తువులు తనయులు
గలుగ
అక్కరో నోమేము అంపించు మమ్ము
అత్తమారుగ నీవు ఆడబిడ్డవు గాన
గ్రక్కున నడిపించు కరకంతుకు
తమరు
దండి వక్కపొద్దులు తమరుండ
వలెను
నేడు మొదలుగాగ నిష్ఠలు బట్టి
వక్కపొద్దు లుండవలె వో యక్క
నేడు
అత్తపాల గలిగిన అన్ని దైవాలు
తమపాల లేకపొయ్యెనె ధన
ఋణాలకును
మేము కర్తలముగాని మరి వకరము
గాము
నిమిషమాత్రంబున నిలిచి
చూతురుగాని
రారమ్మ తిరుమందుల రమణులార
మీరు"
అని చెప్పి కొామరక్కచేత
అంపించుకోని
శివలింగ మండపానికి శీఘ్రంబె వచ్చి
వేవేగ తమలోన విచారము చేసి
పల్లకాండను పల్వుమని పనివారి నంప,
సలలితముగ బలభద్రు సముఖానకొచ్చి

"ఆది విష్ణుమూర్తి ; అవతార ఘనుడః దాచక చెప్పుడీ దాడులార మీరు"
వుత్తమా పతివ్రతలు వనరంగ మిమ్ము
అత్తుకొని పిలిచిరి అవతార ఘనుడ :"
పల్లికొండ వచ్చెనుపనివారి వెంట
కొలది మీరినయట్టి గోవిందమూర్తి
రాచనగరు చొచ్చె రఘుపతి వేగ
వచ్చిన వార్తలు వనితలు వినిరి
బంగారు తబుకుతో బాగాలు వీడ్యము
అంగనా మణులంత అంపిరి వేగ
వీడ్యమందుక పల్లికొండ వివర మంతయును
కడు వేగ తమకును కలిగిన ముచ్చట
దాడులతో చెప్పె తగ పల్లికొండ
''మదిరాతు లేమైన మాట లుంటేను
వంచన గలయట్టి వల్లవుల కాంతలు
అడ్డతెరల చాటున అప్పు డిట్లనిరి
''దొడ్డవారు మీరు దూరపు బుద్ధి
తెలిసిన ఘనుడవు దేవతామూర్తి
పలికితివి పశుల పంతంబు నీవు
నీవు చెప్పిన శకునము నిష్ఠతో మేము
భావించ వ్రతములు పట్టితిమి మేము
సెలవు తమ కిచ్చియు శీఘ్రంబె నీవు
పాలవెల్లి పందిళ్లు బసువన్నముందు
ముస్తీదు చేయించు ముఖమండపాన
వస్తువులు తెప్పించు వనర పాలవెల్లికి
ఆదివారము చెప్పిరి అతివ లందరును

## పంపాద్రి బసవన్న నోములకు పల్లికొండ ఏర్పాట్లు కావించుట

ఆవేళ పల్లికొండ అతివేగ వచ్చి
పంపాద్రి కాపులను పరగ పిలిపించె
కాపులందరు వచ్చి కరమెత్తి మ్రొక్కిరి
వేర్వేర కాపుల పిలిచె పల్లికొండ
''మీరు త్రొక్కిన భూమి షేరలేనట్టి
పంటలు పండును ప్రజలార వినుడ
ఇంటింట వక బండి ఏర్పాటుగాను
మరి వేగ బోయి మీరు మ్రాకులు దెండి"
బాడిశలు గొడ్డండ్లు బండ్లవెంట కదిలె
దొడ్డగా ఆ బండ్లు తురుతుగా బోయి
నిలువురాతి బయట నిలిచెను బండ్లు
చలపట్టి మ్రాకులు సాధించి నరికిరి
టేకులు పాలలు శలుసు వృక్షములు
జోకతో మ్రాకులు జతచేసి రంత

చిందుగలు వందుగలు చిల్ల మ్రాకులున
చందసపు మ్రాకులు సామగ్రిగాను
పూనించిరి బండ్లనిండ పోదాము
అనుచు
కొంచక వెదురు గుమ్ములు చొచ్చి
పండువెదుళ్లు సరికి బండ్ల బూనించి
దండిగ బండ్లను తర్లించి రపుడు
పడమటి ఝామున బండ్లను వేగ
కూడుక ముందర గొబ్బున వచ్చి
బసువన్నగుడి వెనుక బండ్లు దిరచేరు
ఎసగంగ మ్రాకులు విస్తారముగను
ఎటు చూచినా చాలు ఏర్పరచి రంత
పట్టుగల కంబాలు పట్టించి రంత
పరిచేరు తెచ్చిన పండు వెదు రంత
విరివిగా యామీద వెదురు చాపలను
ముదముతో పరిపించి ము స్తీదు చేసి
మదిరాత్ములకు చాల మరుగులు కట్టిరి
పందిళ్లు ముస్తీదు ప్రజలు చేయించి
అందరు వచ్చిరి హరిగురువు కొలువుకు
ప్రజల సమ్మతించి పంపె పల్లికొండ
తేజముతో వల్లవ దివ్యగోపికలు
పాలవెల్లి గట్టను పందిళ్లు ఆయెనని
యలమితో చెప్పించె యాదవ స్త్రీలకు
బ్రాహ్మల బిలిపించి పరగ ముహూర్త
మడిగె
"బ్రహ్మాండముగ మీరు బసువన్నను
వేడ
నేడుగురు వారమునుండి నిష్ఠతో మీరు
శివునిమీద ధ్యానాన సోమవారమునాడు
వసరంగ భోగాల వేడబోండి మీరు"
అని చెప్పి బ్రాహ్మలు అరిగి రందరును.

## వల్లవ కాంతలు బసవన్న వ్రతమునకు సిద్ధమగుట

ఘనమైన వల్లవుల కాంత లందరును
ఏనాళ్ళు వకప్రొద్దులు ఎలనాగ లుండిరి
చతుర్దశి నాడు శంభుని వేడ
అతివలు జలకంబు లాడి రంతంత
మగువలు తమతమంత మజ్జన మాడి
వగమీరిన శుద్ధ వస్త్రాలు గట్టిరి
చిలుకవన్నె చీరె నిండు చిత్తరువు
నలువొప్ప సింహాద్రినాతి దా గట్టె
మన్నిని దేవులు మగువ పె[illegible]
కరకంచు పట్టుచీరె కడు [illegible]
ఎరనూకసీతాంబ ఎలమితో [illegible]
వహిణి పట్టుచీరె బంగారు జ[illegible]ద

వాసిగల నలనూకవనిత దా గట్టె
నందుల వన్నెచీరె నాతి దా గట్టె
కందువతో నూకాంబ కడు వేడ్క
తోను
భవిరెలు కుంటెడ్లు పముజుల కమ్మలు
సరవితో. ముత్యాల సరులు ధరియించి
బిళ్ళతీగెలు మంచి బిన్న సరులూను
కొల్లగా. బంగారు గుండ్ల పేర్లూను
ముత్యాల కుచ్చులు ముఖమున నందరు
భక్తితో దిద్దిరి భస్మాంగములను
వారిజాక్షు లంతంత వైనవైనాన
పేరుపేరు వరుసల బసువన్న కపుడు
చక్కెరపానకం శనగల పందేరము
గక్కున బంగారు కలశాల వుదకము
జగజ్యోతి వత్తులు సిద్దెల చమురు
గుగ్గిలం పుష్పాలు కోరతో పాలు
బంగారు పువ్వులు పాదకానుకలు
రంగుగా ముడుపులు రమణులు గట్టిరి
పాలబెల్లి వస్తువులు పట్టుచీరె దిండ్లు
నలినాక్షు లందరు నడిపించ సాగిరి
కస్తూరి గంధము గాజుగిన్నెలతో
వస్తువలు బట్టిరి వైనవైనాన
పంచవాద్యములు మించి మ్రోవంగ
మంచి ముహూర్తమున మగువలు
కదిలిరి
వల్లవులు తిరుమందుల వనిత అంద

చల్లని పడమటి ఝాము ప్రొద్దునను
పరగ నా వస్తువులు పట్టించుకోని
తేరు కదలినయట్లు దివ్య గోపికలు
బసువన్నను వేడ పయనమై వచ్చిరి
వసుధ కంపింప వైభవములాను
గోపకాంతలు బసువన్న గుడివద్ద
నిలిచిరి
శాపసమర్థులు జంగాలు వచ్చిరి
బ్రాహ్మలును భట్లు పదివేలు గూడిరి
గహ్వరమైనట్టి గానవిద్యల వారు
చుట్టుపట్టులవారు చూడవచ్చేరు
నట్టువభోగాల నాతు లాడేరు
గోపకాంతల నోము గొబ్బున జూత
మనుచ
సోపతులు గట్టుక చూడ వచ్చేరు
గరిమతో ఇరుగడల గ్రామాలవారు
తిరుమల పర్వతాలు పోదీర దనుచు
పర్వతాల మారని ప్రజలు వచ్చేరు
అంతట వల్లవుల అతివ లేవురును
సంతోషమున పాలవెల్లి చందువలు
కట్టిరి
గాంభీర్యమైనట్టి కామినీ మణులు
వరుసతో పాలవెల్లి వాడ లేర్పరచి
చెరుకులు చక్కెరాలు చెలగి గంగ
నురుగురులు
తరచుగా గట్టిరి తగ పనసపండ్లు
నిమ్మపండ్లును మంచి నిండు కుతివేరు.

ఎమ్మోగా గట్టేరు ఏర్పాటుగాను
కస్తూరిపీటెళ్ళు గంగవాడ జల్లులు
పస్తుపలు గట్టిరి వాడ లేర్పడగ
గేదంగి పువ్వులు గన్నేరు బంతులు
హాదుకొని గట్టేరు పాలవెల్లి కంత
సంపెంగలును మంచి జాజి పూవులును
ఇంపైన మల్లెలు ఎలమి తామరలు
బొండుమల్లెలు మంచి పొగడపువ్వు
లును
దండలుగ గట్టిరి దట్టముగ
నంత
వాలాయముగ దెచ్చిన వస్తువలెల్ల
పాలవెల్లి కట్టిరి పట్టుకుచ్చులును
ముత్యాలు రత్నాలు ముదముతో
కెంపులు
హత్తుకొని పగడాలు అమరిన నీలాలు
గోమేధికంబులు గురుతైన పచ్చలు
రమణతో వైడూర్య పుష్యరాగాలు
మొగలు
ఎలమితో పాలవెల్లి నిండాను గట్టిరి
తెలివైన వస్తువలు దివ్యాంబరములు
అంత పాలవెల్లి ఆయత్తపరచి
వంతు కెక్కినపట్టి వల్లమ్మ
కోడండ్లు
నిష్ఠతో పాలవెల్లికి నెరి పట్టుబిరెలు
దిష్టి దీయించిరి దివ్యసిరితోను

తెగువతో దోసిరి తెలివితో జగజ్యోతి
మగువలు జ్యోతియు మక్కువతోను
వైళంబె ముట్టించి వసజాతుబంత
వేయిన్నూరు దివిటీలు వెలుగుచుండ
గను
నాగభూషణునకు నాల్గు దిక్కులను
మగ్గిలపు కణుకులు గొబ్బున వేసిరి
రాజింప వైరాలు రంపిల్లగాను
మతపతులు జంగాలు మరి దొడ్డ
యోగులు
కోటాన కోట్లుగా కూడి రచ్చటను
బ్రాహ్మలు భట్లును పదివేలు గూడి
గహ్వర విజయుండు కమలజహితుడు
గురిమీర జలరాశి గ్రుంకె నచ్చటను
హేరాళముగ దివిటీలు ఎక్కడెక్క
డను
పట్టపగలు పలెనె పట్టి రచ్చటను
నట్టువభోగాల నాతు లాడేరు
అప్పుడు బాణవిద్యలా గుబ్బుగాను
వొప్పుగా జేసిరి పుర్వి కంపింప
జబురు జంగులు మంచి
చంద్రజ్యోతులును
గుభగుభ తుపాకి గుండ్రకోపులును
పెట్లు గోపులు మంచి పెద్దబాణాలు
అటు వేగ మ్రోవంగ యాధసత్రీలు
ఆకాశబాణాలు అవని గంపింప

టీకతంబుగ చంద్రశేఖరు వద్ద
వింత వైభోగముల హెచ్చుగా నపుడు
వంతుగా పిన్న పెద్దలు వరుసతో నంత
పూజింప సాగిరి భూతేశు నపుడు

## సింహాద్రి సీత బసవన్నను పూజించుట

మదిరాక్షి సింహాద్రి మగువ సీతాంబ'
బసువన్న దగ్గరకు భక్తితో వచ్చి
పూజింపసాగెను భూతేశు నపుడు
బసువన్నపైనున్న పాతపూజంత
కుసుమగంధి యపుడు గొబ్బున దుడిచి
సంపంగినూనెతో సరగ బట్టించి
పంపాద్రి బసువన్న పై నిండ నలది
పొందుగా పట్టుచీరె పొలతియు వేగ
నందిపై తుడిచెను నాతి తానపుడు
కుంకుమగంధము గోవజవ్వాజి
పొంకముగ బూసెను భూతేశు కపుడు
అందముగా దెచ్చి అతినిష్ఠతోను
కదనాన మెత్తిరి కస్తూరి దండిగా
గొప్పుగా బసువన్నకు వొనరంగనుదుట
పుప్పొడిబొట్టును పొందుగా దిద్ది
కనకపు కుప్పెలు కాలకంధరునికి
గొనకొని కొమ్ముల గొబ్బున దొడిగి
బంగారు పక్కెర బసువదేవునికి
పూనికతో దెచ్చి పుష్పాలపూజ
దానవవైరికి తగ భక్తి చేసె
ఆరగింపు నందికి అతి తుష్టిగాను
పేరుపేర వస్తువులు పెట్టెను వేగ
వారుబోసి సాంబ్రాణి వామాక్షి యిచ్చె
తరళాక్షి సాష్టాంగ దండంబు బెట్టె
బంగారుపళ్లెములో పంచవన్నెల ముగ్గు
రంగుగా తగ నిడి హస్తముల బూని
అయిదు పళ్లెములలో హారతులు బట్టి
వైనాన నివ్వాళి వరుసతో బట్టెను

### మంగళహారతి

భక్త మందారునకు భావజువైరికిని
భుక్తి మానసము దిన్న భూతేశునకును
వ్యక్తితో నివ్వాళి ఇంతు లిచ్చేరు
చాల
భక్తితో పంపాద్రి బసువన్నకూ
జయమంగళం నిత్య శుభమంగళం ॥
మంగళం త్రిపురారి మహనీయ
మూర్తికిని

మంగళం ఖండేందుమౌళికిని
మంగళం కైలాస మహనీయమూర్తికిని
మంగళం పర్వతాల మల్లప్పకూ
జయమంగళ॥
గజచర్మధారునికి కాలకంధరునకు
సిరికీర్తివంతునకు శ్రీహరునకూ
సరవితో నివ్వాళి సఖియ లిత్తురు గూడి
పరిపూర్తి పంపాద్రి బసువన్నకూ॥
జయమంగళం॥
దేవాదిదేవునికి దీనమందారునికి
శివలోకపతియైన శంకరునకూ॥
వేవేగనివ్వాళి వెలదులిత్తురుగూడి
భావింప పంపాద్రి బసువన్నకూ
జయమంగళం॥
కైలాస వాసునకు—ఖండేందుమౌళికిని
మహిలోన వీరమాహేశునకును॥
వైనాననివ్వాళి వామాక్షులిచ్చేరు
బహుమేటి పంపాద్రి బసువన్నకూ
జయమంగళం॥
అనియిట్లు సింహాద్రి అరుధాంగలక్ష్మి
గొనకొని నివ్వాళి గొబ్బున నిచ్చె
పాలునెయ్యి పంచదార పానకం గరిపి
తాల్మితో బసువన్నకు తగనిష్ఠ బట్టెను.
అరూఢి తననోము అర్పణము చేసెను.

## యరనూక సీత బసవన్నను పూజించుట

పేరుపేర చెల్లెండ్ల పిలిచి సెలవిచ్చె.
మరివేగ యరనూక మగువ తా నపుడు
చేరి బసువన్న పూజ చేయంగసాగె
తాదెచ్చిన వస్తువులు తగనిష్ఠతోను
ఆ దేవదేవునికి అర్పణము జేసి
బంగారు పువ్వులు పదివేల మాడలు
పొంగుచు పాదార్చన పట్టించి వేగ
నెలకొని వారు బోసి నివ్వాళియిచ్చె
బలువైన రత్నాలు పల్యాణ బోసి
పాలించి మంగళార్తులు పాడుచు వేగ

మంగళహారతి

"గిరిభేది జనకునకు గిరిశృంగ
నిలయునకు
గిరిధరా పరమాత్మ ఖేచరునకు॥
అరయంగ నివ్వాళి ఆయిదువలు
పాడెదరు
పరగంగ పంపాద్రి బసువన్నకు॥
జయమంగళం నిత్యశుభ మంగళం

కుటిలసంహారునకు గోరాజమౌళిని
మటుమాయ మైనట్టి మల్లప్పకూ॥
అటు వేగ నివ్వాళి అయిదువలు బట్టేరు
పటుతరం బైనట్టి బసువన్నకూ
॥జయమంగళం॥
త్రిపురసంహారునకు దీనమందారునికి
జపతప యోగైన శంకరునకూ॥
కృపతోను నివ్వాళి కొమ్మలిత్తురు చాల
పాపసంహారునకు బసువన్నకూ
॥జయమంగళం॥

సంగరాధారునకు సకలలోకేశునకు
ఉరగభూషణునకును ఉర్వీశుకూ॥
మెరువడి నివ్వాళి మీనాక్షు లిచ్చేరు
పరమాత్ముడైనట్టి బసువన్నకూ
॥జయమంగళం॥
అని ఇట్టు యరనూక హారతులు బట్టి
తననోము అర్పితము తగ నిష్ఠతోను
పాలు నెయ్యి బసువన్నకు పట్టి తా వేగ
తాల్మితో సాష్టాంగ దండంబుల నిడి
కడువేగ వరిశించె కాంత యరనూక

## నలనూక సీత బసవన్నను పూజించుట

అటువెనుక నలనూక అతివేడ్కతోను
పటుతరముగ వచ్చె బసువనను వేడ
నీలకంఠుని పూజ నిష్ఠతో జేసి
వాలాయముగ దేవునికి వస్తువల నెల్ల
ఆరూఢి బసువనకు అర్పితము చేసి
పరగంగ కెంపులు పల్యాణ్యాలు బోసి
అవనిపైనను నిలచి హారతులు పాడె
నివ్వాళి ఇచ్చెను నిలచి నలనూక

మంగళహారతి

"నీరజబాహునకు నిగమగోచరునకు
మారట శంభునకు మల్లప్పకూ।
తిరముగా నివ్వాళి తెలివితో బట్టేరు
పరమాత్ముడైనట్టి బసువన్నకూ
।జయమంగళం।।
కలకంఠి చంటిలో గక్కున బలికిన
పులిశాలు గప్పిన భూతేశుకూ॥
నెలకొని నివ్వాళి నేర్పుతో బట్టేరు
ఫాలలోచనుడైన బసువన్నకూ,
॥జయమంగళం॥

పుక్కిటి నీళ్లను పూజలు వడసిన
ముక్కంటి త్రిశూల షూత్రికిని
ముక్కవతా నివ్వాళి మదిరాక్షు లిచ్చేరు
పక్కెరా తేజైన బసువన్నకూ॥
జయమంగళం॥"

నలనూక ఈ విధమున నందికి వేగ
అలరంగ తన నోము అర్పితము చేసి

దండంబు తగబెట్టి తన నోము అర్పించె
వ్రతము చెల్లించెను వామాక్షి వేగ
నిండు వేడుకలతో నిలచె యిరుగడల.

## పెద్దమ్మ వరుస క్రమమున బసవన్నను పూజించుటకు నిరాకరించుట

అప్పుడు సింహాద్రి అతివ సీతమ్మ
ఒప్పుగా పెద్దమ్మను ఒనరంగ పిలిచి
"గాంభీర్యము గలిగిన కాంతాశిరోమణి
శంభుని నోము" మని చెప్పినంతటను
అప్పతో బలికెను అరుధాంగ లక్ష్మి
"ఓయక్క వినవమ్మ! ఒక విన్నపంబు
పాయక నను బిలిచి బసవనను వేడుమని
ఇయ్యెడ ఆనతి ఇస్తివి నీవు
పోణిమిగ నీవు చెప్పిన బుద్ధిప్రకారము
ఆలాగె వేడేము అక్కరో వినుమ!
పోలురాజు నూకాంబ పొందుగా నిపుడు
బసువన్నను వేడ పరగ ఆనతిమ్ము
అసువసంహారుని అడుగవలె మనము
ఈశ్వరుడు చెల్లెంప్లకు ఇచ్చిన వరము
వాసిగా జూడవలె ఓ యక్క వినుమ!
పెద్దమ్మ మాటలకు ప్రియముతో నపుడు
మదిరాక్షి పోలురాజుమగువ సిరిదేవికి
చెలగి బసువనను వేడ సెలవిచ్చె నంత

నేర్మితో నూకాంబ నిలచి యిటనియె
"అక్కరో వో యక్క అప్ప పెద్దమ్మ
ఇప్పుడు నను బిలిచి యిస్తివి సెలవు
వన్నెగా పిన్నపెద్ద వరుస ఎరుగకుంటె
విన్నవారేమందురు వెర్రిబుద్ధిగాక
ఏదొక్క ప్రయోజనం ఎరుగకుండినను
కాదని బుద్ధిచెప్ప కర్తలు మీరు
మీరు నోమి చాలించిన మీదట నేను
ఆరూఢి నోమేను ఆనతీయవమ్మ!"
అనుచు పోలురాజుదేవి ఆడు మాటలకు
వనజాక్షి పెద్దమ్మ వరుసతో బలికె
"చెల్లెల వినవమ్మ! చెప్పెద నీకు
ఎలమి సంతానము ఎవ్వరెవ్వరికి
ఇచ్చినాడు సంతానము ఈశ్వరుడు మీకు
నిశ్చలంబుగ నేడు నీలకంఠునికి
అడుగవలెను వరము ఆలస్యమైన
కడువేగ నీనోము గ్రక్కున వొప్పించి
కడకు పక్షిశింపవే కాంతరో నీవు"

## పోలురాజు సిరిదేవి బసవన్నను పూజించుట

అలరంగ పెద్దమ్మ ఆడు మాటలకు
పోలురాజునూకాంబ పొలతి నిజరాణి
అతివేగ పాదార్చన చేసి
భక్తితో పూజించె ప్రమదాఢ్యురాలు
పేరుపేర వస్తువులు ప్రియము తోడుతను
సరగ బసువన్నకు సమర్పణము చేసి
వారుబోసి సాంబ్రాణి వామాక్షి యిచ్చె
మురియుచు పల్యాణ ముత్యాలు బోసి
ఇద్దరిద్దరు జోకతో ఎలమి నూకాంబ
పాడుచు నివ్వాళి బసువన్న కపుడు
ఆ మహేశ్వరునకు అటు మంగళార్తులు
బహువిధముల బాడె భామ నూకాంబ

### మంగళహారతి

"శంకరుడు ఎక్కోటి చెలగి నిత్యంబుగా
రంకెవేసెడి బసవ రాయునికిని ।
పొంకముగ నివ్వాళి భూతేశు కిచ్చేరు
పంకజాముఖు లెల్ల బసువన్నకూ
॥ జయమంగళం ॥
మేక పెంటికలోను మెచ్చి తన రూపమును
చేకొని వెలసిన శంభునకును ।
జోకతో నివ్వాళి సొంపుతో బట్టేరు
ప్రాకటం బైనట్టి బసువన్నకూ
॥ జయ మంగళం ॥
మెచ్చి ప్రమథులకును మేలుగా వరములు
ఇచ్చి రక్షించిన ఈశ్వరునకూ ।
హెచ్చుగా నివాళి ఎలనాగ లిచేరు
పక్షిగాచినయట్టి బసువన్నకూ ..
॥ జయమంగళం ॥
అసురసంహారునకు అంగజవైరునకు
ఎనయంగ మాపాలి ఈశ్వరునకు
పొసగంగ నివ్వాళి పూబోణు లిచ్చేరు
పశువులకు రాజైన బసువన్నకూ
॥ జయమంగళం ॥

పోలురాజునిజరాణి పొలతి నూకాంబ
ఈలాగు నోమెను ఇంత వేడుకతో
చాలించి తన వ్రతము సమర్పణము చేసి
నిలిచె వావారిలో నెలతలు తాము
అప్పలా చెల్లెండ్లు అలరంగ నలుగురు
ఒప్పించి వ్రతములు ఒనర చెల్లించి
నిండు వేడుకతోను నిలిచె నిరుగడల.

## చివరకు పెద్దమ్మ బసవన్నను పూజించుట

చండతేజుని వేడ చెలగి పెద్దమ్మ
అటు వేగ వచ్చెను అష్టభోగముల
నిటలాక్షుని పూజ నేర్మితో జేసె
జగదేక మౌళికిని జలకంబు చేసి
శ్రీగంధ జవ్వాజి చెలగి కస్తూరి
నాగధరునికి పూజ నాతి పెద్దమ్మ
కుందన తొడుపులు గుజ్జారి గంటలు
నందికి ధరియించె నాతి పెద్దమ్మ
నవరత్న భూషణాలు నందిదేవునికి
సవరించె పెద్దమ్మ సామాగ్రిగాను
జాజులు మల్లెలు సంపెంగ కలువలు
పూజ తా చేసెను పొలతి పెద్దమ్మ
బంగారు పువ్వులు పాదాల మీద
రంగుగా మాడలు రాశిగా పోసి
తెచ్చిన వస్తువలు తేనరిటిపండ్లు
పుచ్చుకొని వడ్డించె సంపూర్తిగాను
హస్తాలు మొగిడ్చి అతిభక్తి నిలిచి
ప్రస్తుతి చేసెను బసువన్న నపుడు
"శివ భక్తమందార ! శ్రీశైలవాస !
గవిరీ మనోహర ! గాంభీర్య ధీర !
కనక కుండలాభరణ ! కాలప్రమాణ !
ఫణిరాజధర వర్ణ ! బహురూపకర్ణ !
కమ్మవిల్తుని సంహారి! గజ చర్మ
ధరుడ!
నిమ్మపువ్వుల మెచ్చితిని నీటు ప్రతాప!
గణనాథుని తండ్రి ! గంగప్రాణేశ !
పుణుక చేతను బూని బొజ్జ పరమేశ!
ప్రమథుల బ్రోచితివి పరగ కైలాస!
కుముదమిత్ర ధర! గుణప్రకాశ !
కొండ విల్లుగ బట్టి కోటి రాక్షసుల
చెండివైచిన యట్టి చంద్రశేఖరుడ!
పురహరుడా!నిన్ను పొందుగా నిత్యంబు
పరగంగ పంపాద్రి బసువన్న యనుచు
కలియుగము వారెల్ల కరకంతకుండ !
పొలుపొంద వెయినోళ్ళ పొగిడేరు
నిన్ను
తిలకుండ ! మాపాలి దేవదేవుండ!
కలిమి సంపదలును గజతురంగములు
అలరంగ నిమ్ము నిన్నడిగిన వరము
గొడ్రాళ్ళు నీనోము కొంచక నోచితే
బిడ్డల నిత్తువని పేరు వడసితివి
పెద్దలు నీనోము పేర్కొని నోచితే
పొదుకొని ధనధాన్య భాగ్యంబు లిత్తువు
ఆటుగమక నీనోము అభ్యాసపడి నేను
పట్టితి నీవ్రతము బసువన్న వినుము !
పరమాత్మ ! మామీద భక్తి వుంచు
నీవు"
అరయంగ తన నోము అర్పించెను
ఈలాగు పెద్దమ్మ ఎంతయు నేర్పు
కాలరుద్రుని వేడె కలుముల బంగారు

పళ్లెంబులోపల పగడాలు బోసి
ఎలయంగ బసువన్న ఎదట నిలుచుండి
మదనసంహారునికి మంగళార్తులును
బహువిధముల బాడిరి భామలందరును

## మంగళహారతి

"సిరితొండభక్తునికి చెలగి
వరమిచ్చియు
గరిమతో మెచ్చిన కరకంఠుకూ
ఇరువంద నివ్వాళి ఎలమితో బట్టేరు
ప్రజలెల్ల మెచ్చంగ బసువన్నకూ
॥జయమంగళం॥॥
మెచ్చి ప్రమథులకును మేలుగా
వరములు
ఇచ్చి బ్రోచిన యట్టి ఈశ్వరునకూ
రక్షించు మనుచును రమణులు పాడేరు
పక్షములుగల యట్టి బసువన్నకూ
॥జయమంగళం॥
మెచ్చితివి రాళ్లను మేరగా నిత్యంబు
మెచ్చితివి స్త్రీల్లను మెప్పుగానూ
నోచిన నోములకు ఉత్తమాశ్రీలను
కాచి రక్షించవే కరకంఠుడా
॥జయమంగళం॥
వింట పురములు ద్రుంచి
విఖ్యాతికెక్కిన
కంటి పూజలు గొన్న కరకంఠుకూ
వంటెరిగి నివ్వాళి వామాక్షు లిచ్చేరు
పటుతరంబైనట్టి బసువన్నకూ ॥
జయమంగళం ॥
అరుదైన ముగ్గురు అఖిల ప్రమథాదులు
ఇరువుగా నీయందు ఇముడుకొనిరి
తగమీర మామీద దయగలిగి
రక్షించు
పరాకు సేయక బసువదేవా
॥జయమంగళం॥

## బసవన్న పెదమ్మ పూజను తిరస్కరించుట

ద...త ...ఘయిును
ప్రయిముతోడుతను
...బసువనకు హారతులు పాడి
నెగడి హోసంబుల నివ్వాళి పట్టంగ
పగవానివలెను పరముఖ మాయె
కువ్వారము చేసెను కూర్మితో స్వామి
వేవేగ బసువనకు వెలది పెద్దమ్మ
ధూప నైవేద్యములు తురుతుగా
బట్టంగ

పాపసంహారుండు పరముఖమాయె
పాళ్లు నెయ్యి పెరుగు బసువన్నకు
పట్టగ
కాలకంధరుండు కన్నుల్లు మూసె ;
బసువన్న పలపక్షము పణతి పెద్దమ్మ

ఎసగంగ ఈరీతి అతివేగ చేయ
అవి చూచి పెద్దమ్మ అటు చిన్నబోయె
వేవేగ మనసులో విచారముచేత
వెరవక దేవుడవి వెనకముందు చూడక
దూరసాగెను తనకు తోచినరీతి

## పెద్దమ్మ బసవన్నను దూషుట.

"అయ్యయ్యో బసువన్న ; ఆత్మందు
నిన్ను
శాయరాని భక్తి చేస్తిని నీకు
వయ్యాన నావల్ల వోక్షమేమి వుండె ?
దయవుంచక నా వ్రతము తప్పు
పట్టితివి
వలపక్షము చేస్తివి వయ్యాన నీవు
చలముకొని బసువన్న చెల్లంభొ
వినుమ
నమ్మితి బసువన్న నమ్మితి నిన్ను
నమ్మి నందులకు శివుడ నట్టేట పుట్టి
ముంచివట్లాయెగదె మొక్కిన ఫలము
పంచాక్షరి నేను నీపాదములు నమ్మి
వోక్షపట్టి తన నోము వల్లనందుకును
రచ్చదొక్కి రెండాడి రాగాను వింటివే
బతితిలో చలపక్షము పంచిపెట్టగను
కంతుసంహారుడ కనివుంటె చెప్పవే ;
ఏం నామీదను పరపక్షరకరము చేస్తివి
పాళిల్లో పక్షము పలికితివె బసువన్న

ఇంతైన దయలేదు ఈశ మందార ;
కొంతైన దయలేదు ఘోర రుద్రేశ
భావింప తన నోముఫలము
మెచ్చవైతివి
ఆవుపాళి మాటలు ఆడంగ వింటివో
కూడేటి పెండ్లిండ్లు కూడకుండ చేస్తినో
తోడికోడండ్ల బిడ్డల దొరియ జూచితినో
పరగ తా జేసిన పాప మేముండెను
ఏరాలి బిడ్డల ఎడ్డముగా జూచితినో
పరగ తా జేసిన పాప మేముండెను
చేర బిలిచి బాలల చెక్కిళ్లు గొట్టితినో
వూరికే తనవల్ల వోక్షమేమి వుండె
ఆడేటి బాలల అదళించితినట్లైన
తోడబుట్టుకమీది ఆన తోస్తినటె
బసువన్న
ఏమి పాపము జేస్తి ఇందు శంకరుడ
నోరెరుగని బాలలు నూతికొట్టి నుండి
పరగ తా తియ్యని పాపాన పోతినే
సంధెభిక్షము గడిపితినో సంపదలచేత

ఇంధువరుస ఎరుగని పాపాత్మురాలనో
వృషధ్వజ నావల్ల వ్రత మేమితప్పె
పశుపతివాహన! పార్వతిప్రియుడ!
గోనెల వి తనాలు కూటికొలుచుకు దెచ్చి
అన్ని అంగట బెట్టి అమ్మంగ వింటివే?
బసువన్న నీకు మేము పగవారమటవే?
ఎసగంగ తననోము ఏల వప్పవైతివి?
వరమడుగ వస్తిని పలపక్షము చేస్తివి
గురువు దైవంబును గురుతెరుగనైతినే?
నీకేమి తప్పుచేస్తి నీలకంఠుడ వినుమ
ప్రాకటంబుగ వినుమ ఫాలలోచనుడ!
బసువన్న నామీద భక్తి వుంచవైతివి
పశువులలో బాలల పలుకరించనైతినే?
ఆడి రెండాడను ఆచారము తప్పము
తొడిబడ నావల్ల దోషమేమి చెప్పుమ?
ఎవ్వరైనాగాని ఎండనుండిన వారిని
నీడకు బిలిచేది నీవెరుగవా బసువన్న?
తనవల్ల వ్రతము ఏ తావున దప్పె
గొనకొని బసువన్న గొబ్బున జెపుమ?
కర్మములు ఇంతైన కలియకుండాను
దానములుచేస్తి సంతానంబుకొరకు
చీమలకు చిమ్మిలి శిప్పిలో బెట్టితి
పాములకును పాలు పవగ బోయిస్తి
నందికి నానుబాలు నయమొప్ప బెట్టితి
పొందుగా నిట్టికి పుల్లఖండములు
బెట్టితి

ఎన్నియో దానాలు ఈశ్వరా చేస్తిని
నన్ను దయజూడవు నాపాలి తండ్రి?
బాలల కొరకును పంపాద్రిదేవ
పాలపండ్ల గంపలు పరగ
చూరవిడిచితిని
చాల దానములు సంతానము కొరకు
కలుగనాడిన ఘనులకై చూరవిడిచితి
సమ్మతిగాను సంతానముకొరకు
కుమ్మరావంబులు కొని చూరవిడిస్తి
ఆమట ఆమటకు అన్నసత్రాలు
వేమారు బెట్టిస్తి ఈవరదనుక
పాలసత్రాలను బాలలకు బెట్టిస్తి
యనయంగ బెట్టిస్తి అన్నసత్రాలు
మిట్టను గుళ్లు కట్టిస్తి మేలొప్ప
చెరువులు
ఘట్టిగా త్రవ్విస్తి పల్లాలతాను
పెంటిరావుల పోతురావుల పెండ్లిండ్లు
చేస్తిని
కంటకపు దేవుడా కరుణ వుంచవైతివి
పెండ్లిండ్లు చేస్తిని పేదబ్రాహ్మలకు
వన్నెగా చేయిస్తి వడుగు లనేకము
సన్నుతిగా మరియు సర్వేశ్వరునకు
పుత్రులకొరకు నేను భూదానము చేస్తి
వస్త్రదానము చేస్తి వరుస తోడుతను
గోవుల దానము చేస్తి కొదువ లేకుండ
ధన కనక వస్తువులు దానము అనేక

వనములు వేయిస్తి వాడికె భావులు
ఘట్టిగా కట్టిస్తి కాలకంధర నీకు
పాటించి నామీద భక్తి లేదాయె
సరవితో చేయిస్తి సంతానముకు గాను
పరోపకారమును పరగ చేయిస్తిని
నోములన్ని నోమితి ఈశ్వరుడ నీకు
చెన్నుమీరగ దయ శివుడ లేదాయ
నోములు నోముతా ఉత్తమాగుణముల
వేములు వేస్తినటె వినవె బసువన్న!
నోమిన నోములు వేముల పాలాయె
వేముల ఫలమంది విరిగెను నేడు
ఫలములేని నోము పట్ట నేమిటి కని
నీలకంఠుడ! నేను నీనోము నోమితే
వొక దయ చూడవైతివి వో బసువన్న
ప్రకట మందారుడవు బసువన్న నీవు!
అందరి దయచూడు అయ్య బసువన్న!
చయ్యన బసువన్న చెలగియు నీవు
వయ్యన బసువన్న వలపక్షము చేస్తివి
కపటముంచితివి గారవించవైతివి
సొంపుతో అందర్ని చూస్తనే వుంటివి
ఇప్పుడు నామీద ఎరపరికము చేస్తివి
చెప్పవే ఏమైన చేసుంటినైన
ఉప్పిడి ఉపవాసము ఉంటిగదె
బసువన్న
తనగుడువ పిన్నలు తనగుడువ
పెద్దలు

వనర వారు చేసిన వ్రతము మెచ్చితివి
నీకునేజేసిన నేరమేమి చెపుమ
చేకొని దుఃఖంబు చేస్తివి తనకు
తెగువతో ముక్కంటిదేవుడని చూడక
దీకొని పెద్దమ్మ తిట్టంగసాగె
కోపముచేతను గొబ్బున పెద్దమ్మ
దీవించి బసువన్నను తిట్టంగసాగె
గురిమీరగ జగతి గురువని నిన్ను
వరమడుగ వస్తిగదె వో బసవన్న
చూపులో రెండుచూపులు చూస్తివి నీవు
పాపాత్ముడవుగదే బసువన్న నీవు!
నా సాటివారెల్ల నిన్ను పూజించ
యాసాల బొర్లక వినవె బసువన్న
పోషించి నీకు నేను పూజసేయగను
రోషము వచ్చెనటే రుద్రుడా నీకు
బసువన్న నీకు చేసిన ప్రార్థన యిట్లు
దేశములో జగడపు తిట్లాయె నటవె
ఎంతచేసిన నీకు వినవె బసువన్న!
పంతమా నామీద భక్తి లేదాయె!
నీళ్ళజేసిన పూజ నీలకంఠుండ!
నిప్పుల పూజాయె నీకు బసువన్న
సమ్మతి జేసిన జుంకంబు నీకు
అమ్ములై తాకెనే అన్యంపు దైవము!
సత్తుగా పూసిన శ్రీగంధము జవాజి
జొత్తులై తోచెనే దోషపు దేవుడ!
తాల్మితో నీకు నే ధరియించిన సొమ్ములు

పాటించి పెంజరపాము లాయెనటవె ;
అతిరసాలు నీకు ఆరగింపు పెట్టితేను
మతిదప్పిపొట్టలోన మంటలాయె
నటవె;
నిలచి నీకు నేను నివ్వాళు లీయ
మళ్ళితివి కంటికి మంటాయె నటవె ;
తరచుగా ఇచ్చిన దూపదీపంబు లన్ని
పొరయంగ దుమ్ముల పొగలాయె
నటవె;
బసువన్న పాలు నెయ్యి పట్టితే నేను
పసనాభి నూనెగా పల్లక పోతివి ;
నీవు పండ్లు వల్లనందుకు నేను
బసువన్న
అరయంగ జైనరాయి అగుపెరుగనైతి
నీవు నిలిచినతావు నిధియని వుంటి
ఆవులు చేరనిదొడ్డి అవుత నేనెరుగ
నీ పాదాలు నాలుగు వేదాలని వుంటి
ముదముతో అరిటిమొద్దుల చందమగు
పెరుగ
దేవుడవయితేను తిరిగి బసువన్న
వేవేగ నాసేవ వేగ గైకొందువు
బసువన్నవు గావు పరగ ఎద్దువుగాని
వొడలెల్ల లింగాలు వో బసువన్న
గడుసైన రాళ్ళవుట కానలేనయితి
త్రిశూలము కన్నుగల దేవుడని వుంటి
పాషాణమేకాక బసువన్న వినవె
దవ్వులవారెల్ల ధాతవని నిన్ను
ఎవ్వరైన వచ్చినవారు వెర్రులుగాక
కువ్వారపు దేవుడై కొలువ పాపంబు
సర్వేశ్వర;నీకు ఎక్కడి సత్యంబువున్న
పుర్వీశ;నానోము వొప్పకపోతివి
కసువు దింటివి గాంగ కరుణించ
వైతివి
బసువన్న నీవు నాపాల లేవైతివి
వద్దికతో నిన్ను నే వరమడుగ వస్తి
ఎద్దురూపము గాంగ ఎరుగలేనైతి
ఆముకొని పూజకు హరుడవు గావు
దిమ్మరి పశువువై తిరుగనేగాని
కొందరిని ఒకచూపు కొందరి
నొకచూపు
ఎందుకు చూస్తివి ఏమందు నిన్ను
ముదముతో నీకు నేను మ్రొక్కిన
మ్రొక్కులు
కొదువ చేస్తివిగదె కుచ్చితపు దేవుడ ;
నీకు నే నోమిన నోము లెల్లాను
కాకులకుగాని నెమ్మల కథలాయె
నటవె
పొసగంగ నేను చేసిన పూజెల్ల నేడు
బసువన్న బూరుగ ఫలమౌట ఎరుగ
సాటివారి లోపల సంతానముకొరకు
మాటికి దుఃఖాన మందలించ చేస్తివి
ఘట్టిగా నాసాటి కని ఫెంచే వారిలో

కట్టడిదై వమా ఖర్మము గట్టుకొంటివి
ఎత్తిపెంచే వారిలో యాకార జేస్తివి
గుత్తకొని నానోము కొదువచేస్తివి
నీవు
వాలాయముగ కాశియాత్ర పోయేది
లెస్స
బాలింతల జూచి భ్రాంతిపడ చేస్తివి
వన్నెగా నాసాటి వారి లోపలను
చిన్నబోతే నీకు సంతోష మటవె
ఎవ్వరెవ్వరికి తొల్లి ఇయ్యావా వరము
గువ్వను రక్షించిన గుణ మింతెగాక
చిన్నవాని సాగ సిరియాళుని మెచ్చవ;
కన్నప్పను మెచ్చవా రాళ్ళరువ్వినవాని;
పిడికెడు వంటకానకు పృధివెల్ల ఎరుగ
అడిగిన వరమియ్యవా అలనాడు
పొదిలెలో
చేకొని ఏపాటి చేస్తే మేలిస్తివి
రోకట గొట్టంగ రోషము లేదాయె
ఎక్కుపగ దోషము ఏల లేదాయె
పుక్కిట నీళ్ళు నీకు పూజసేయగను;
జాగుసేయక అన్నము సరగ భోం
చెయ్యగాను
జాగిలాన్ని గొట్టి సమయింతు ననగ
ఇందుకని వస్తివి యిస్తివి వరము
కందువతొ ఇటువంటి కానిమాటలు
నన్ను

అయ్యయ్యో బసవన్న ఆడంగ వింటివె
వయ్యన నానోము వల్లనందుకును
దుఃఖాన అనియేక దూరితినిగాక
ఇక్కడ నీవు వరము ఇయ్యకపోతేను
దిక్కు ఎక్కడ వక దేవుడైనాను
లేకపోవునుగాన లెస్సాయె గనుక;"
ఈలాగు పెద్దమ్మ అనియేక దూరి
చాలించి అనియేక సంతోషము దప్పి
దూరెను బసువన్నను దివ్వెలు
మలిపించి
వరుసతో తలుపులు వడి ముద్దరించి
అతివేగ పెద్దమ్మ అప్పుడు తల్లె
తప్పక శివుని దూరి తరుణి పెద్దమ్మ
అందరు చూడంగ అతినిష్ఠతోను
కొందరు చూడంగ గొబ్బున నపుడు
గుడివెళ్ళి వచ్చెను కోపంబుతోను
బెడిదంపు మాటలు పెద్దమ్మ అపుడు
చిన్నబోయి తనలోను చింతించుకొనుచు
"నాతులార చూస్తిరటే నా
నోముఫలము
ఎంతలేదిటువంటి దేవుండ్లు వరమిస్తె
పొలుపడి తిరుమల పర్వతాలెల్ల
భూలోకమువారెల్ల పోనేమి వుండె"
అనుచును పెద్దమ్మ అందరిగూడి
తన మనసులో యాకళం
తలపోసుకొనుచు

వచ్చి దివాణమువాకిట నిలిచి
మచ్చికతో వదినమరదండ్లు పిలిచి
ఇరువంశముల వారి యిండ్లకు బంపె
ఆరూఢిగా వారు అప్పచెల్లెండ్లు
మరి వేగ శివలింగ మండపాన నిలిచి
వల్లవుల కాంతలు వరుసతో నంత
చెలువొప్ప కదిలిరి సఖియలు వేగ
హంసనడుపుల సతులు అందరు
నపుడు
క్రమమొప్పనిలిచిరి కాంతలు వేగ
సేవలు చాలించిరి సతులు తమరూను
ఈశమందారుని అప్పుడు కొలిచి
మలయజగంధులు మరి వేగ నంత
పొలతులు దండి వక్కప్రొద్దులు
తమరు
విడువవలె ననుచును వెలది పెద్దమ్మ
అడిగిన వారైదుగు రప్పచెల్లెండ్లు
అడిగిన వారితో నపుడు పెద్దమ్మ
ఆడెను వకమాట అందరినిగూడి
"వినరమ్మ చెప్పేను వివరంబుగాను
అనువుగా మీనోము శివునికి
అర్పితమాయె
ఒప్పుగా మీనోములు శివుడు ఒప్పినాడు
ఒప్పినందుకు మీరు ఒక్కప్రొద్దులు
చేయుడీ
సంతోషము చేసినాడు సర్వేశ్వరుండు
ఇంతులార మీరు ఇందరిలోను
పాపపు దేవుడు విచారము పాలుజేసి
ఈపట్ల చేసినాడు ఈశ్వరుడు తనకు
అటుగనక మీతోను ఆనతిచ్చెదను
నెట్టణముగా నేనున్న వక్కప్రొద్దు
వూరికే చేయరాదు వో యప్పలార
సరవితో జంగాల చాల పిలిపించి
చేయవలసి యున్నది చెలులార మీరు
చేయరమ్మ వక్కప్రొద్దులు నే
చెప్పినట్లు"
మదిరాక్షి పెద్దమ్మ మాటలువిని యంత
వదలక శివునికున్న వక్కప్రొద్దులు
విడిచిరి

## పెద్దమ్మ జంగములను సంతర్పణకు పిలిపించుట

ఎలనాగ పెద్దమ్మ ఏర్పాటుగాను
పిలిపించె దాదుల ప్రియముతో నంత
కలకంఠి పిలిపించె గ్రక్కున వారి
"అంగనామణులార అతివేగ బోయి
జంగాల్ల తోడుకొని చయ్యన రారె"
దాదులుఅంతట తగు వేడ్కబోయి

ప్రమథుల బిలిచిరి భక్తితోడుతను
అటువేగ పెద్దమ్మ ఆనతిని బోయి
మఠపతుల బిలుచుకొని మరి
వేగవచ్చిరి
పంకజాక్షుం బిలిచి పయనమై వచ్చిరి
శంఖులు పూరించుచు జంగాలు
వచ్చిరి
శంకరుని దలచుచు జంగాలు వచ్చిరి
ఓంకారనాదముల వడియలు వచ్చిరి
కరస్థలాన లింగాలు కాయమందు
రుద్రాక్షలు
పరమాత్ములైనట్టి భక్తులువచ్చేరు
జడజడన పదివేలు చంద్రకాంతి
లింగాలు
వడియలు వచ్చేరు వప్పు మీరగను
వురువున బంగారు వురుసజ్జ
లింగాలవారు
కరుణతో నందుల ఘంటలవారు
గరిమతో లాథాపు కన్ను భూతాలవారు
ఘోరణ్యములవారు కూడి రనియేక
నీటుతో తమతమ నిష్ఠలతోను

పాటించి వచ్చిరి ప్రమథ గణములును
ఎండ నీడ కన్ను ఎరుగని భోగులు
కుండలాల జంగాలు కూడి రనియేక
జంగాలు గూడిరి సరగున నంత
యోగితమైనట్టి అనియేక జంగాలు
శివునికి గలిగిన శివభక్తిపరులు
గరిమతో పులిశాలు కప్పినవారు
మఠపతులు జంగాలు మరి
దొడ్డయోగులు
కోటానుకోటులు కూడి రనియేక
బహువిధములవారు పదివేలు గూడి
రహిమించు వల్లవుల రాచలోగిళ్లు
చొచ్చిరి
నలినాక్షి పెద్దమ్మనగరికి వచ్చిరి.
పలికిబొంకని యట్టి పరమాత్ములాను
తిలకించి పెద్దమ్మ తెగువతోడుతను
చెలియ తా వారుబోసి శివభక్తిపరులను
పదిలమైన పెండ్లిచవిక బయటను
నిలిపి
దాదులు పెద్దమ్మకు తగ విన్నవించిరి.

## పెద్దమ్మ జంగములను భక్తితో పూజించుట

ఆవేళ పెద్దమ్మ అతిభక్తితోను
శివలింగమండపానకు తాను సెలవిచ్చె
శాపానసమర్థులు జంగాలు వచ్చిరి

కృపతోను లక్కసిరి కూటాలనడుమ
భూరించిరి శంఖులు భూతేశు దలచి
ఆరూఢి పెద్దమ్మ అడ్డతెరమరుగున

వారుబోసి సాంబ్రాణి వరుస దా బట్టె
మగువ పెద్దమ్మ తన మందిరములోను
తెగువతో అందరు దేవండ్ల మారని
సాష్టాంగ దండంబు సరగ దా బెట్టె
నిష్ఠతో శివునికి నిజభక్తురాలు
శుభమున దీవించిరి సొంపు తోడుతను
విభూతిపండ్లు రెండు వెలది పెద్దమ్మకు
అడ్డతెర మరుగుకే అంపి రందరును
అడ్డతెర మరుగునుండి అందుకొనె
సపుడు
తానున్న కూటములోకి తా కొంచువచ్చి
పన్నుగా జంగాల భక్తితో నపుడు
వన్నెగా జంగాల పంచనార్థితోను
కూర్చుండమనె జంగాల కూటాల
నడుమ
కూర్చుండమనెను గురువులనపుడు
ఎంతయు భక్తితో అతివేగ పెద్దమ్మ
సంతత పుణ్యులు జంగాల కెల్ల
బంతిగా కూర్చున్న ప్రమథులకెల్ల
సంతోషమున ఇచ్చె జడమాడలూను
పొంగుచు పెద్దమ్మ భూమిసంచారులకు
లింగవస్త్రము లిచ్చె లీలతోడుతను
భావింప శివునికి ప్రమదాదురాలు
శివార్పనము లిచ్చె చెలగి దానములు

ఈరీతి దానములు ఎన్నియో చేసె
నారీమణి అరిటాకు నైతెలు తెప్పించి
అయ్యగారి ముందర అరిటాకు లిడియు
పయ్యన అన్నము పడ్డించ సాగిరి
అతిరసావడలు ఆనపాల పాయసాలు
సుష్టుగా అన్నము పడ్డించి రపుడు
పప్పును నెయ్యియు పరిపుశించు
కూరలు
వప్పుగా అయ్యగారికి వడ్డించి రపుడు
బంతిగా కూర్చున్న ప్రమథులకు నెల్ల
సత్తుగా వారుబోసి సాంబ్రాణి యిచ్చి
నిష్ఠతో శివునికి నిజభక్తురాలు
సాష్టాంగదండంబు సమర్పితము చేసి
శివునికి మ్రొక్కెను చెలగి పెద్దమ్మ
వేవేగ మనసులో వేడుక పడియు
జంగాల ఎదుటను సఖియ తానిలిచె:
"సంగతిగా వినుడ స్వాములార మీరు
నేర్మితోడుత మీ లింగాల కెల్ల
సమ్మతిగ లింగాలకు సమర్పణము చేసి
వినరయ్య తనకు విభూతి ధరించి
చనువుతో మంత్రము సమర్పణము
చేసి
భోంచేయరయ్య వో భూతేశులార!"

## జంగములు పంక్తి భోజనమునకై పెద్దమ్మ కుమారుని కూర్చుండ బెట్టుమనుట

నిజముగా పెద్దమ్మ నిలిచి ఆడినందుకు
ప్రమథు లందరును పలికి రిట్లనుచు:
"రమణిరో పెద్దమ్మ! రాచకొమారైవు
గరిమతో వినవమ్మ కమలజనేత్రి!
అరయ బంగరుబొమ్మ! అతివ పెద్దమ్మ
విన్నపము జేసేము వినవమ్మ నీవు!
అన్నము శివునికి అర్పణముగాను
వొప్పుగా బెట్టితివి వో భక్తురాల!
తప్పక నీవు మహోదయ భక్తితోను
ఎపుడు వరచిత్తము వింతయులేక
ఇపుడు ఈశ్వరునకు ఇంత వేడుకతో
పొలుపార అన్నము భోంచేయుమని నీవు
ఎలనాగరో నీవు ఎంతయు వేడ్క
అన్నము బెట్టితి వొక్క ఆలోచన వినుము
ఉత్తమముగా నీవు కన్నకొమారుని
కొమ్మరో సవుబంతిన కూర్చుండబెట్టు
ఎమ్మెగా నీ వుద్యోగము ఈడేరు నమ్మ!
స్థిరకాలము వర్ధిల్లుదువు మా దీవెనల చేత!
పరగంగ బాలల మా బంతిన బెట్టుకొని
భోంచెయ్య వలెనమ్మ పొలతి పెద్దమ్మ!
కుసుమగంధిరో నీదు కొడుకును దెమ్మ!"
అని యేక బలికిన ఆపుడు జంగాలు
కనుగొని పెద్దమ్మ కరుణ రంజిల్ల
ఆ మాటకు పెద్దమ్మ అయగారితోను
భామినీమణి తాను పరగ నిట్లనియె!
"మహేశ్వరు లార! ఓ మతపతులార!
మహిలోన తన మనవి మహాత్ము లార!
కొమారుని దెచ్చి కూర్చుండ బెట్టుమని
ప్రమథులార! ఇపుడు పలికితిరి మీరు
వెన్న డిప్పుడు పాలు వెన్న లార గించి
పన్నుగ భోంచెయ్య నేరడు బాలుడు అతడు"
పణతి పెద్దమ్మ మాటలకు ప్రమథు లిట్లనిరి!
పలికి రేర్పాటుగా ప్రమథు లందరును
చెలువైన జంగాలు సఖియ కిట్లనిరి
పలికిరి జంగాలు భయభీతి లేక
"కలకంఠి పెద్దమ్మ! కరుణ రంజిల్ల
వినుతింప బాలుని వేగ పెద్దమ్మ!
ముందర అడ్డంబు ముదమొప్ప బెట్టుక
అంగనరో నీవు అడ్డతెర మరుగున
అన్నము భోంచేయు మమ్మ పెద్దమ్మ!"

## పెద్దమ్మ తనకు బిడ్డలు లేరని చెప్పుట

వన్నెగా జంగాల వార్తలు వినియు
ఘనమైన కోపాన కణగి యిట్లనియె :
"మనవిగా చెప్పితే మహాత్ములార !
వినరు
పనిబడి అనియేక భక్తితో మీకు
వసరంగ అన్నము వడ్డించగాను
వినరయ్య చెప్పేను విశ్వమందున్న
ఘనమైన గజచర్మధరులార ! మీరు
బాలుని తెమ్మని పలికితిరి మీరు
బాలుడు తనకు లేడు భక్తులార వినుడి
బాలలు గలిగితే ప్రమథాదులార !
పెంపున మీకింత ప్రియము చెప్ప
కుందున
సత్తుగా మీరంత సర్వేశ్వరుని మారని
భక్తులార ! తనకు బాలలు లేకుండ
భక్తులార తనసు బాలలు గలుగ
దీవించి మీ కషపాల తీర్థాలు నాకు
కాపలసి మీకు నే ఘనులార చెప్పితిని
ఎందాక చెప్పేను యతీశ్వరులార !
నా పంచనము మెచ్చరయ్యా నా
అయ్యలార !
ఎందుకు ఆలసించ ? ఏల మీకింత ?
పొందుగా అన్నము భోంచేయరయ్యా !
చయ్యన శివునికి సావాద్యభక్తులు
అయ్యలార! మీకు వే ఆనతిచ్చెదను"
ఈలాగు పెద్దమ్మ ఎంత చెప్పినను
విలసితముగ జంగాలు వినక యిట్లనిరి

## జంగములు సంతులేని పెద్దమ్మ ఆతిథ్యమును నిరాకరించుట

"హరహరా! యని పలికి అయ్య
లిట్లనిరి :
"నారీమణి పెద్దమ్మ! నా తల్లి వినవె
నీతోను జెప్పేము నేడు వినవమ్మ!
లోకమువారెల్ల బూటకముగాను
వొక వార్త చెప్పేము వో యమ్మ
వినవె!
సంతానము లేనింట జపయోగులు వచ్చి
బంతులు భోంచెయ్య పాప మందురమ్మ
బాలలు లేనింట ప్రమథాదు లొచ్చి
వాలాయముగ భోంచేయ వద్దందు
రమ్మ!
పుత్రులు లేనింట భూమిసంచార్లు వచ్చి
వస్త్రదానము పట్ట వద్దందు రమ్మ!

సరవితో వినవమ్మ సంతులేని యిల్లు
గురుతైన శిలలేని గుడి అందురమ్మ!
పొంకముగ బాలలు పుట్టని యిల్లు
చీకటిక్కోన యని చెప్పంగ వినవ?
వనితరో! సంతులేని వారి యిండ్లూను
ప్రణుతింప వాడని బావి అందురమ్మ!
పుడమిలో బాలలు పుట్టని యిల్లు
అడివిలో బూరుగ అనుకుందు రమ్మ!
పరగంగ వినవమ్మ! బాలలు లేని
యిల్లు
దొరకొని నడువని దోపంచు రమ్మ!
చిట్టడుగు లేనిల్లు సృష్టిలోపలను
చెట్టుగొట్టిన మోడు చందమగు నమ్మ!"
ఈ రీతి జంగాలు ఎంతయు వప్పక
నేరము లెంచుచు లేవంగ సాగిరి.
"సంతు లేనింట అన్నము సర్వే
శ్వరునికి
సంతోషము కాదమ్మ సఖియ
పెద్దమ్మ !
నీ వెంత చెప్పినా నేడు పెద్దమ్మ !
అనేకుల మటపమ్మ అమ్మ పెద్దమ్మ !
సమ్మతము కా"దని జంగాలు లేచిరి.
గ్రక్కున లేచిరి కరుణయు లేక
మక్కువతొ పోగాను మరియు పెద్దమ్మ
కమ్మక తమతమ కట్టుపర్గాలు
పుచ్చుకొని పోగాను భూతేశు లెల్ల
వచ్చేటి యప్పుడు వనిత పెద్దమ్మ
వారితో వకమాట వయ్యన బలికె:
గర్వమున పెద్దమ్మ కాంత తానపుడు
దొరకొని జంగాలతో తోయజముఖి
యిట్లనియె !
"రారయ్య స్వాములార ! నా అయ్య
లార !
అప్పుడే అన్నము హరుషము కావని
చెప్పరై తిరి ఎగ్గు చేస్తిరి మీరు
పెంపుతో పెద్దమ్మ పెట్టిన అన్నము
పంపాద్రిలో వల్లరని ప్రజ్ఞ నిలుపు
కుంటిరి
శాపాన సమర్థులని మీ సేవ చేస్తిని
అపకీర్తి నిలిపితిరి అయ్యలార మీరు!
అయ్యలార!నాయింటి అన్నము శిముడు
ఇయ్యడు గాబోలు ఎంతలేదు పోండి
భిక్షకులుగా తన ప్రియ మెరుగరై తిరి
వచ్చెనే మీనుండి ఏమి వరమైన ?"
ఆ మాటకు జంగాలు అంగీకరించక
"ఏమైన అనుకొమ్మ ! ఎంత
లే"దనుచు
కూటాలు వెలువడి గొబ్బున తమరు
మతములకు బోయిరి మహాత్ము లపుడు

## పెద్దమ్మ విచారము

పణతితో జంగాలు పట్టని అన్నము
కచుజాన పెట్టించి కాపు దపించె
ఆమీద రుద్రజడ అరుగు వేయించె
వామాక్షి పెద్దమ్మ వచ్చి కూటాలతో
చిన్నబోయి పెద్దమ్మ చిలుకల గద్దెమీద
పన్నీరు చెంబుల పట్టిరి దాదులు
'అక్కరో కొ'మ్మని అందించి రపుడు
పుక్కిలించి అటు వుమిసె పొలతి
పెద్దమ్మ
వూరికే వుండను వుచితము గాదని
సిరిమించు బంగారు చిటిగిన్నెలోను
పాలు నెయ్యి పంచదార పానకము
గలిపి
అలరంగ పెద్దమ్మకు ఆరగించ
నిచ్చిరి
నెలత తా పాలు వెన్న నెయ్యారగించి
పులకడిగి వుదకంబు పుక్కిలించి
వుమిసె
అప్పుడు పెద్దమ్మకు అంగనామణులు
కర్పూర వీడ్యములు గ్రక్కున నిచ్చిరి
కూర్మితో ఎవరెవరి కూటాలలోను
పన్నుగా పల్లవుల పణతు లందరును
రాజులు అయిదుగురు రమణ
భుజియించి
భోజులు నిద్రలు పోయి రందరును
అలసి పెద్దమ్మయు ఆత్మదుఃఖాన
మలయుచు దోమతెర మంచము మీది
"అయ్యయో సర్వేశ అలసట చేస్తివి
దయలేక తనమీద సదాశివమూర్తి!"
తెలివి దప్పి పెద్దమ్మ దేహంబు మరచి
బలువైన చింతతో పవళించి యుండె

## కల్యాణ సోమేశ్వరుడు పెద్దమ్మ కలలో సాక్షాత్కరించుట

పంపాద్రిలోపల పట్టపురాజు దేవులు
సొంపుదప్పి ఆ రేయి శోకింపగాను
చోద్యాన కల్యాణపు సోమప్ప వినెను
అర్ధమరాత్రి పెద్దమ్మకు ఆత్మకల
చెప్పెద ననుచు
గాటముగ నందిని కాంతసోముండు

కట్టాయితపడెను ఖండేందుమౌళి
గజచర్మము బిగువార కాశగా గట్టె
భుజమున శూలంబు భూతి పైనిండ
ఘనమైన ఫణిరాజు కంకణములు పెట్టి
పూనిన రుద్రాక్షపూసల పేర్లు
పరగంగ నాగుబాము పాగ తలచుట్టి
గిరణములు గరళములు గిరివిల్లు బూని
నుదుటన పుండ్రంబు నొకచంక భార్య
పదిలముగ నడుముకు పామునడికట్టు
గండర పెండెరంబు కక్షపాలయును
తలపేర్లు గలయట్టి తపయోగి యపుడు
చెలువైన పులిచర్మ శాలు పైగప్పె
అటుకడ నిశారాత్రి అటు మధ్యవేళ
అటు వేగ నందిని రవాలు ద్రొక్కుచు
కదిలి వచ్చె శివుడు గజచర్మధరుడు
మదన సంహరుండు మరి వేగనపుడు
కల్యాణానునుంచి కాంతసోమలింగము
పైళమే పంపాద్రికి ఏతెంచె వేగ
హజారము బయట అశ్వాన్ని దిగెను
తేజముతో పెద్దమ్మ దివాణము
చొచ్చెను
తెరగొప్ప ఎవరెవరి దివాణము లుండ
గురుతెరిగి పెద్దమ్మ దివాణము
గొబ్బున జొచ్చె
గొలుసుల దివ్వెలు గొదకొని వెలుగ
మెలుకువ చూచుచు-కూటాలకు-
మెల్లనే వచ్చెను
సదాశివుడు చెలువొప్ప బూసిన
వీభూతి వాసనకు వేగ దివ్వెలును
దివ్వెలు మలిగితేను నగురు చీకటి గ్రమ్మె
దేవదేవుండు ధీరత నిలిచె
అంత వేడుకతోను అ దేవదేవుడు
పంతంబుతో నిలిచె పార్వతీవిభుడు
పెద్దమ్మ స్వప్నమందు పెంపుతో
లెస్సగను
నిద్దరిసెనముగ చెప్పంగ సాగెను
నీలకంఠుండు

## కల్యాణమునకు వచ్చినచో సంతానమిత్తునని సోమేశ్వరుడు పెద్దమ్మకు చెప్పుట

'నారీమణి పెద్దమ్మ ! నాతిరో వినవే ! సంధ్యవేళ దూరితివి సరిప్రొద్దు
ఘోరనేల దూరితివి వేదనేల వేడితివి వేళకు

కందువతో వినుమ నీ గర్భము పండే
న్రిద మేలుకొనవె నే నెవ్వరంటేను
సువతిరో కల్యాణపు సోషప్పప బాసు
వచ్చినాను సంతానము ఇచ్చేటి కొరకు
విచారము పడ్డు లేవె ఇస్తి సంతానము
కల్యాణము వస్తేను కలిగేరు బాలలు
కల్లకాదు నా మాట కాంతరో వినుమ!
నా భూమికి వస్తేను నమ్మవే నీకు
భూమెల్ల శాయను పుత్రు నిచ్చేను!
నాలుగు మూడు తరాల పగలెల్ల
పాలించగలిగిన బాలు నిచ్చేను!
కులవైన మెరిగి గోత్రాలు పాడ
కులము ఎంచగల కూతురు నిచ్చేను!
ఇద్దరికన్న సంతానము ఇక నీకు లేదు
సిద్ధము తన వరము చెప్పేద వినుమ!
ఇంతిరో ఈ భూమిన ఎన్నాళ్ళు
వుండినా
సంతానము నీకు లేదు సఖియరో
వినుమ!"
అని యట్లు కల్యాణపు దేవుండు
ఆత్మలో చెప్పంగ
తన మనసు లోపల తరుణి యిట్లనియె
"దేవదేవ శివుడ! దీనమందార!
వేవేగ నా మనవి నీ వపుధరించు
సదాశివమూర్తి! సాలగ్రామలింగ.
చతుర్భుజము కన్ను త్రిశూలము
వినుమ
పార్వతిసమేత! పరమేశ! ఈశ
సర్వదేవేంద్ర? సభనాయకుండ
నరలోకమందార! నాపాలి స్వామి!
కరకంఠ? సర్వేశ! గవిరీసమేత!
దయ గలిగి నామీద దూరితే వస్తిరో.
కాయజసంహార! కరుణ వుంచితివైన
ఆలాగె వచ్చేను అరమర లేక
అటుమీదట కీర్తి అపకీర్తి రాకుండ
నిటలాక్షుడ వచ్చేను నీ పాదము
నమ్మి!
వెనక ముందు చూడక నీవెంట వచ్చేను
నన్ను రక్షించు నిన్ను నమ్మినందులకు!
కల్యాణపుదేవు డింత కల్లలాడె ననుచు
కల్ల గాకుండను గాజూడు స్వామి!
ఇల్లాలి నడిగి వరము ఇచ్చితివి తొల్లి
కల్ల ఈవరదనుక కలిగింది లేదు
వాసుదేవుండ! వో స్వామినాథ!
నామీద దయ వుంచి నన్ను రక్షించు!
స్వామి నీ పాదములు చాల నమ్మితిని
సోమేశ వచ్చేను!" అని సొప్నమందు
అత్మలో పెద్దమ్మ అడిగినంతలోను
మహాత్ముడు సోమప్ప మరియు
నిట్లనియె:
"ఎంత మాటడిగితివి ఇంతిరో నీవు!
పంతము పౌరుషము ప్రజ్ఞావిశేషము
సత్యము శౌర్యము పరసతివిముఖుని
సత్యసంధుడైన తనయుంత వాని

ఇచ్చేను నమ్మవే: ఈఘడియ రావె:
వచ్చి దూరుచున్నగాని వనిత పెద్దమ్మ:
ఇలపరున కులపరున ఎరిగి గోత్రాలు
లింలు పొడేటి నెలత నిచ్చేను
నమ్మవే ఈమాట: నా లింగమాన:"
నిమ్మపండ్లు తాగుకి ఇచ్చేను వేగ
అక్షయ స్తే మని గురుతు ఆనవాలిచ్చె
విభూతి పండ్లు రెండు వెలది
పెద్దమ్మకు
నమ్మించి శివుడు నందివాహన మెక్కి
సమ్మతి కదిలెను సర్వేశ్వరుండు.
పెద్దమ్మకు చెప్పెను ప్రియముతో
శంభుడు
ఆ ప్రమథగణాదులు హరుడు
తానపుడు
గొబ్బున తా వున్న గృహముకు
వచ్చెను.
విబ్బరపు కలగని నెలత పెద్దమ్మ

కలగని పెద్దమ్మ గ్రక్కున మేలుకొని
పిలచెను దాదులను పేరుపేరునను
"కన్నవారిచ్చిన కంఠసర దాదులార:
వన్నెగా రాగదరే ఏక వార్త చెప్పేను
సంతానము తనకు సర్వేశ్వరుండు
కాంతసోమయంతు కలుగ జెప్పె వేరె
తెలివితో కల్యాణపు దేవుండు తానట
కలలోన వచ్చి తనకు తార్కాణగా
జెప్పె
నా భూమికి వస్తేను-పుత్రుని-
నయముగానిచ్చేను
నమ్మించెను శివుడు నాతులార వినుడి:
ఇప్పుడే ఈ వార్త రాజుకు వినిపించ
వలెను
వప్పుగా దివ్యలు వనర ముట్టించుడి:"
మచ్చికతో పెద్దమ్మ మాట విని
దాదులు
ఆ క్షణములోపల అందరు మేలుకొని
దిగ్గదిగ్గన లేచి దివ్వెలు ముట్టించిరి.

## పెద్దమ్మ తన కలను భర్తకు చెప్పుట

మగువ పెద్దమ్మ తన మందిరము
వెడలి
స్థిరమింపు ఫాధాల చీరె మెలగగను

అరయంగ సొమ్ములు ఆరుత
మెరయగను
జాజిపువ్వుల బంతి సఖియ పెద్దమ్మ:

భోజుని సభియ తా భోరున కదిలె
నీటుతో పెద్దరాజు నిజరాణి పెద్దమ్మ
వాటముగ ఛిలకల వలనొప్ప చెక్కిన
బంగారు ముక్కాలి పీట తెప్పించుకొని
రంగుగ కై దండ రమణు లియ్యగను
పతి వున్న సముఖానకు పరువున వచ్చె
మతిమంతు డై నట్టి మన్నెదేవేంద్రుడు
వచనశుద్ధి గలిగిన వల్లవులరాజు
భోజుడు నిద్ర తాను భోగింపుచుండ
పట్టుచీరెతో తన విభుని పాదాలు వత్తె
పట్టెను హస్తాల పాదాలు బిసికె
నెలతయు తన విభుని నిద్రమేల్కొలిపె
మేలుకొనె నంతట మేదినీశ్వరుడు
మన్నీడు పెద్దరాజు మరి నిద్ర తెలిసి
పన్నుగా సతివంక పారంగ జూచె
మదిరాక్షి పెద్దమ్మ మరియు నిట్లనియె!
"రాజాధిరాజ ! ఓ రాజశేఖరుడ !
భోజుండ ! వినవయ్య ! భుజబలభీమ !
వర్ణనతో వల్లవుల వజ్రసింహాసన !
వల్లవగోత్రుండ ! వనధిగంభీర !
వలురాజుసుతుడ ! నా ప్రాణవల్లభుడ !
జననాధ ! వక మాట
చక్కగా వినుమ !
మనుజేశ ! వినవయ్య మా
విన్నపంబు !
సంతోషము వార్తలు స్వామిరో విను ! ము

పుడమిలో తాను చేసిన
పుణ్యము కాబోలు
పంపాద్రిదేవుడు ఫలము మెచ్చడాయె
ఇంపుగా తనచేతి అన్నము ఇంపు
కాదనిరి
వోక్షపట్టి జంగాలు అన్నము వొల్లక
పోయిరి
నిక్షేపము చేస్తిని నీ పాదమాన
వచ్చి కూటములోను వలపొయ్యగాను
పక్షము గలిగిన కల్యాణపు బసువ
దేవుండు
ఇచ్చెను సంతానము ఇప్పుడే తనకు
రక్షకుడు ఈ భూమి రాజ్యంబు విడిచి
కల్యాణము వస్తేను కలిగేను సంతు
కల్లకాదు వీభూతిపండ్లు కాసుకగ
ఇచ్చె !
వచ్చినపుడె సంతానము ఇచ్చెద ననుచు
కక్షపాల వీభూతి కల్యాణపు దేవుండు
అక్షయముగ బ్రతుకుమని అభయ స్త
మిచ్చె !
కులముద్ధరించగా కొమారుడు గలుగు
కులస్తాన మెరిగి గోత్రాలు పాడ
అడపడుచు కలిగేని అనెను నాతోను
కాణయాచులు విడువు మనెను
కల్యాణపుదేవుడు
బాలల ఇచ్చేనని ప్రజ్ఞ బలికినాడు

వాలాయము రమ్మని వరుసతో చెప్పె
అని యిట్లు శంభుడు ఆత్మలో చెప్పె
తనవెంట రమ్మని తాను నమ్మించె
ఇందుకు ఏమి ఆసతి స్త్రీవో రాజు?
పొందుగా పోదాము భూపాలకుండ ;
కందుపతో నామీద కరుణ వుంచ
వయ్యా ;
అందున్న స్వామిని అక్కడ మనము
సత్తుగా దేవుని సత్యము చూచి
వత్తాము పదవయ్య వో ప్రాణనాథ ;"

## పెద్దిరాజు కల్యాణమునకు పోవుటకు నిరాకరించుట

కులసతిమాటలకు గొబ్బున రాజు
కలకల నవ్వుచు ఘనుడు ఇట్లనియె
"పలికి బొంకనియట్టి భామరో వినవె ;
కలగంటి నని వొచ్చి క్రమమున
చెప్పితివి
కలగన్న తావుకు గంపఎత్తుకొని
కలరటే పోయినవారు కలియుగమందు?
బిడ్డల కొరకుగాను పెద్దరాజు అందరిని
ఎడబాసి పోయెనని ఎన్నచే స్త్రీవి గాక,
బాలలకొరకు బంధువుల ఎడబాసి
సలువొప్ప పోయెనని నవ్వచే స్త్రీవి
గాక,
పుత్రులకొరకునై భూములు విడిచేది
శాస్త్రాలు గాదుగదె జనులు నవ్వేరు ;
నీ వాడిన మాటలకు నెలతరో వినవె
మావంటి వారు మనసివ్వరాదు.
మగువల మాటలకు మావంటి వారు
విఘాతమ్ము చేస్నేది ఏ మాటలోది ;
తన అన్నదమ్ముల విడిచి తాను
పొయ్యేది
వన్నెయు గాదు గదె వనితరో
వినుమ ;
కాదని పోతేను కమలదళనేత్రి ;
గొదకొని బంధులలో కొదువ
గాదటవె ;
ఎలనాగ యిప్పుడిగో యెంతమాత్రంబు
కలియుగమున అన్నదమ్ములు
కాంతరో వినుమి ;
కారణముండె కాబోలు కారణార్థంబు
మరియును వకమాట మగువరో
వినుమ ;
ఇన్నాళ్ళ దనుకను ఎడబాయ లేదు
చెన్నుమీరగ తాను చెలియరో వినుమ ;
నారీమణి నీమాట న్యాయంబు కాదు
పరగ అన్నదమ్ముల ఎడబాసి
భామరో వినుమా ;

మనవంటి వారు ఈ మండలంబునను
శానగా వున్నారు సంతతి లేక
వారికంటె హెచ్చైన వారమటె
తమరు ?
మరువవే యిటువంటి మాటలునీవు"

## పెద్దమ్మ సంతానములేని సంపదలు వ్యర్థమని చెప్పుట

ఆవేళ పెద్దురా జాడు మాటలకు
మదిరాక్షి పెద్దమ్మ మరియు
నిట్లనియె :
"బుద్ధి చాలని యట్టి భూపాలవరుడ !
నే నాడినమాటలు నీతి గాదంటివి
జననాథ ! వినవయ్య ! సకలదేశముల
సంతానములు లేని జన్మ మేమిటికి ?
పంతమున తన మాట పరాకుశాయకు
కొమాళ్ళు లేనివారిని కొలువ పాపంబు
గుమానపు మాటలు గొబ్బున మాని
పోదాము పదవయ్య పుడమీశ నీవు !
ముదమొప్పగా నీవు ముందరిబుద్ధి
తెలియక వున్నావు దీనమందార !
కలిమి సంపద లెన్ని కలుగంగ నేమి
ధనబుజాలకు కర్త తనయుడు లేక
గడియించిన వస్తువులు గాథా నగలును
కూడిన ధనమెల్ల కొమాళ్ళు లేకుంటె
భూమిపాలై పోవు భూపాలకుండ !
భూమికి తగినట్టి పుత్రులు లేకుంటె
జగమందు నెగడదని జను లను
కొందరు
భాగవతోతము నీవు తెలియకున్నావ !
కాన్పులు గల యిల్లు కందవిత్తు
లందురు !
కాన్పులు లేనిల్లు కలియుగమందు
కరి మ్రింగిన వెలగపండు క్రమము
సుమి బ్రతుకు !
సిరి గలిగిన వేళ చిట్టడుగు లేకుంటె
సొంపు దప్పిన తాటాకు సొద సుమి
బ్రతుకు !
సంపదకు తగినట్టి సంతు లేకుంటె
సిరిదప్పిన కుమ్మరావము చిచ్చు సుమి
బ్రతుకు !
పరుల బిడ్డల జూచితే భ్రతత
అవుచున్నది
రాజ్యము లేలేటి రాజుల కెల్ల
పూజకు తగినట్టి పుత్రులు లేకుంటె
ఇలలోన దివ్వెలేని ఇల్లు సుమి
బ్రతుకు !
కోటికి పడగెత్తి కొమాళ్ళు లేకుంటె
ఏటికి ఆ బ్రతుకు ? ఎరగవు రాజ !
దయగల శివుడు వచ్చి తనయు
నిచ్చేనంటె

దాయాదుల ఎడబాయ నంటివి
ధర్మమా నీకు ?
ఇంటికి వచ్చి వర మిచ్చేననంగ
వెంటనే పోకుంటె వెఱ్ఱి అవునయ్య !
దాయాదులు నీకేల ? ధనము నీకేల ?
ఇంటికి దిక్కులేని రాజ్యంబు ఏల ?
శిశువులు లేని యిల్లు శ్రిష్టిలోపలను
పసువులలొ బసువన్న లేని పాప
మందురయ్య !
ఏమో అని చూడక ఎంత లేదనక
నా మనవి వినవయ్య నా ప్రాణనాథ !
మరి వక విన్నపము మన్నీద
వినవయ్య!
తిరుమల పర్వతాలు తీర్థాలు నిధులు
వరుసతో పొయ్యేటి వారిని చూడవా ?
వారికన్న హెచ్చైన వారమా మనము ?
పోదురు వత్తురు భూమివారెల్ల
కాదనక వినవయ్య ! కాక విజోడు
కాయకు !
పోదాము పదవయ్య భూమీశ నీవు !"

## అన్నదమ్ముల బిడ్డలే తన బిడ్డలని పెద్దిరాజు పలుకుట

ముదమొప్ప పెద్దమ్మ ముచ్చట వినెను
మదసుందు పెద్దన్న మరియు
నిట్లనియె!
"ఆడవా రిటువంటి మాట
ఆడవచ్చునని
ఆడుచున్నావటే అతివరో నీవు?
నా యన్నదమ్ములకు నాతిరో వినుము!
పాయక్క సంతానప్రాప్తి గలిగితేను
వారే తన కొమాళ్లు వారే తనకు దిక్కు
చిన్నయ్య పెద్దయ్యయని పిలిచేటి
యెడను
అన్నదమ్ములవారిని అందరిని కాదని
పొయ్యేది యిటువంటి బుద్ధి కాదు
వినవే!
వియ్యాల బంధువుల విఘాతము చేసుక
విడిచి పొయ్యేది ఏ వివేకములోది?
నుడుగవచ్చునటవె నోటివాక్యమున?
కులసతిమాటలకు కులకోటి బంధువుల
ఫలములు చేసెనని ప్రజలు నవ్వుదురు.
మగుపల మాటలకు మరియు
ఎడబాసిపోను
తగున అన్నాయని నా తమ్ము లాడేరు!
మొగవారి మనసు వెడచేసుక
తగున పోనని నన్ను దాయాదు లాడేరు!
నీ అప్పచెల్లెండ్లు నిన్నాడగాను
న్యాయము గా దిటువంటి నవ్వుమాట
లాడేరు!
నాసాటి వారెల్ల నన్నాడగాను

నీసాటి వారెల్ల నిన్నాడగాను
ఎనయంగ ఎడబాయ ఏటికి వినవె?
మనవంటి వారు భూమండలములోన
శానగా వున్నారు సంతానము లేక
ఇంతిరో! ఇటువంటి మాటలు విచారము
నీకేల?
మరువవె యిటువంటి మాటలు నీవు!
వావారికి బోవె వాసూక్షి నీవు!''
ఆవేళ పెద్దరాజు ఆడిన మాటలకు
వామాక్షి పెద్దమ్మ వరుస నిట్లనియె!
''మావంటివారి మాటలు మనసున
వుంచి
భావింప వింటేను మహాపాపంబు వచ్చు
(నీకు) బుద్ధి గలిగిన నాటికి
పోదాముగాని''
(అని) గద్దెపై లేచెను కాంత పెద్దమ్మ.
కోపాన లేవంగ కులసతిని జూచి
''ఏపాటి మాటగాగ ఇంతి కోపంబు
నీపాలగల దేవుడు నాపాల వస్తేను
ఆలాగె పోదాము అతివరో పోవె!''
వనిత పెద్దమ్మ తన వావారికి వచ్చె.
తెరగొప్పగా తూర్పు తెలవారె నంత
నెరెయ భానుడు పొడిచె లేచిరి రాజులు
ముఖమార్జనము చేసి ముదముతో నంత
సకల వైభోగముల చదురుపై
కూర్చుండె
అన్నలు తమ్ములు అందరు వుండగ
మన్నలును దొరలు మరి వేగనుండగ
అవనీశు మాటలకు అమ్మ పెద్దమ్మ

## అన్నదమ్ముల బిడ్డలు తమ అక్కరకు రారని పెద్దమ్మ పలుకుట

రావయ్య వో రాజ! నాప్రాణనాథ!
తమ్ములకు అన్నలకు తనయులు
గలిగితేను
వక్రమాని చెక్కదీసి వక్రమాన
పెట్టితేను
చక్కనై వుండునా జగతి లోపలను?
కుందనం వెలిగారం కూడితే లెస్స
బంధన బెట్టితేను పైడి అతికేన?
కంచుకు కంచుకు కలిగితే అతుకును
కంచుకు పెంచుకు కరుగునా లోన?
వక యింటివారము వైరము లేచంటివి
ఘక ఘంట్ల గుర్తిసిన ఘనర్థ అమ్మతమ్ము

పాలబుట్టిన నెయ్యి ఎరపరిక మైతోచు
పాలు తూమెడై న పందుము నీళ్లైన
ఎరపరికము పుట్టదు ఎరుగవా రాజా?
అన్నలు దమ్ములు హరుషమై వుంటే
వారు వీరును వకరు మేలు దప్పితేను
వారివారి బిడ్డలు వారివెంట బోదురు.
తముగన్న బిడ్డలై తే తమదగ్గర
వుందురు
లోగుదురు వెరతురు ధనబుణాల
కవుదురు
తోడికోడండ్లు గనక దొడ్డ హరుషమై
వుంటేను
బిడ్డల ఇత్తురు పెంచుకొమ్మందురు
పొల్లచిల్ల మాటలు పుట్టిన యపుడు
చెయి బట్టుకొందురు చేరంగనియరు
నేరుపుమాటలు నీకేవి రాజా?
మారు మాటాడక నామనవి
వినవయ్యా!"

## పెద్దిరాజు సభచేసి బసవ పురాణమును వినగోరుట

ధొరలు మరుదులు వల్లవులు
తిరుమందులు
పరుసతో నందరు పై నవై నాన
పల్లికొంచ పెరుపూళ్ల పరగి కొలువుండి
వుండిరి ఆవేళ వొసరంగ రాజులు
పాండవ దుర్యోధన ప్రౌఢిని మీరి
ఆవేళ పెద్దిరాజు అతిసంభ్రమునను
భావింప పిలిపించె బ్రాహ్మణోత్తముల
"విప్రపుంగవులార! వినరయ్య మీరు!
సంప్రీయముతోడుత చదువుడి
వేదశాస్త్రములు"
హరిచంద్ర కుశలవ యను రామకథలు
వరుసతో చదివించ వల్లవుల రాజులు
విని సంతసించిరి వేడ్కను పొంగి.
జననాథు పెద్దిరాజు చెలగి యిట్లనియె:
"రసికులార వినరయ్యా! రామాయ
ణము వింటిమి.
కుశలవకథ వింటిమి, గురుతైన
హరిచంద్రు
సత్యంబు వింటిమి సంతోషమునను,
పృథివిలో బసువపురాణము వింటెను
పాపపరిహార మని ప్రజలు ఎంచుదురు
ఈప్రొద్దు ఈకథ వినవలె తాను
చదువుడా ఈకథ సభవారు వినగ"
యాదవకులజుండు అడిగి నంతటనె
వేదమూర్తు లందరు ఇట్లని పలికిరి!

## సంతానహీనులు బసవ పురాణమును వినరాదని బ్రాహ్మణులు పెద్దిరాజునకు చెప్పుట

"పెద్దురాజ! వినవయ్య భీమబలశాలి!
నిద్దంపు కీర్తుల నెగడిన ఘనుడ!
సాహసవిక్రమ! చెలగి వినవయ్య
అసహాయశూరుడ! యాదవఘనుడ!
బసువశంకర బిరుదు పొలగల రాజ!
వృషభశాస్త్రంబులు విన్న వారలకు
విరహతాపంబు విరక్తి పుట్టును
తిరుగ మూలికెమాట తెలిపేము వినుమి
శిశువులు లేనివారు శివలింగవాక్యము
దోషము వినరాదు తొల్లి అనుకుందురు
సంతులేనివారు సామిత వింటేను
ఎంతో పాపమని ఎంచిరి తొల్లి
బాలలు లేనివారు ప్రబంధ మింటేను
పాలలో విషము గలిపిన పాపమందు
రయ్యా!
(మీ) చిత్త మెట్లుండునో కాని
చెప్పరాదయ్యా!
పక్షిజంపిన యంత బ్రాహ్మణ లందురు
ఇంత వివరము మీకు విన్నవించితిమి
ఎంతయు వింటిమి యదువంశతిలక!
వినరాదు ఈవార్త వినవయ్య రాజ."
మానవేశ్వరుండు మాటలు వినెను.
సరిపోయె తనకు సతి ఆడిన మాటలు
నరనాథు డప్పుడు నతిఖిన్ను డాయె.
చదురుపై లేచి సభనారి నంపె.
వేదము విన్ననుండి విచారముచేతను
కొలువు చాలించి కూటాలకు వచ్చిరి:
జలజమిత్రుడు గ్రుంకె ఆర్క-సమానులు
జుంకంబు లాడి సరగున భోంచేసి
పాలుపొంద నిద్రలు పోయి రంతంత

## కల్యాణ కాంతసోమప్ప కామధేనువును పెద్దిరాజుకడకు పంపుట

పతిసతి యిద్దరు పట్టాడిన మాటలు
అతివేగ కల్యాణపు అఖు
కాంతసోముండు
తెరగొప్ప మహాత్మునికి తెలిసి
అన్నియును
ధరణీశు భ్రాంకించి తా దెతు ననుచు

సారెకు తాటోయె చౌకయ్యె ననుచు
కరుణతో తసపద్ది కామధేసువను
"పిలిచి నీవు పంపాద్రికి సిరువేగ
పోయి
భావింప వారికి భ్రమలు పుట్టించి
ఇక్కడికి రావలెను ఈ క్షణము
రోసు"
ముక్కంటదేవుడు మూర్తి పంతమిచ్చె
గ్రక్కున పంపెను (మాయ)
కామధేనువను
కామధేనువ వచ్చి కరుణ రంజిల్ల
ఆముకొని ధేనువ అటు శీఘ్రగతిని
శిరసులు రెండు చెవులును నాలుగు
సొరది నాలుగు కొమ్ములు చూచేటి
కన్నులు నాల్గు
ఎనిమిది పాదాలు ఏనుగపొడువు
వాలములు రెండు వదనములు రెండు
ఎనిమిది కుచములు ఈశ్వరు కృపచు
కానగ లింగాలు శరీర మంత
పడు యంత నలుపు పక్కలు ఎరుపు
అయిదు వన్నెల రూపు ఆశ్చర్యముగను
ముఖమెల్ల తెలుపు మూపురాన జడలు
పిక్కలు పొడవన్నె పిరుదులు గలిగి
ఎక్కువైన ధేనువ వింతరూపముతో
చక్కదనముతోను సరగ ఆ మొదవు
మానవుల రూపున మరి వేగ నపుడు
కైలాసవాసుని కరుణ పంపునను
మంత్రించి వీభూతి మరి వేగవైచ
మంత్ర వీభూతి చేత మరి గర్భిణాయె
మంత్రములచేతను మాయ కామధేనువ
అంత్రవేగమున వచ్చె అర్ధరాత్రివేళ.

## కామధేనువు పెద్దిరాజు పంచలో దూడను పెట్టుట

రవితేజమానుండు రాజు పెద్దిరాజు
త్రివాచి పరిచిన తిరుగుడు పంచాది
చవికెలోపల నిద్రబోవుచుండంగ
నిర్వేగరాజు నిద్రమేలుకువ ఎరిగి
పన్నుండి చూచుచు పశువుచందమున
అరఘడియలోపల అబ్బురపు క్షేపును
మాటమాత్రమున ఈనె
మాయకామధేనువ
"బోటుమాట కాకుండ పురహరుని
పంపు
మాటలాడించవలె అతని మనసు
పండవలె ననుచు

## దూరదేశమున నున్న దేవుడు సంతానమిచ్చునని పెద్దలు పెద్దిరాజుతో చెప్పుట

"విధమెల్ల చెప్పేము వినవయ్య రాజ!
సర్వేశ్వరుని మహిమె స్వామిరో
వినుము :
పర్వతాల మల్లప్ప ఫలమియ్య జెప్పె
ఈశ్వరుని మహిమ యిది వినవయ్య
రాజ !
శాశ్వతముగాను సర్వేశ వినుమ !
కామధేనువ ఈనింది కలిగేరు బాలలు :
ధీమంతుడ వినవయ్య దేవతాసురభులు
వాటికి తెలుసు గనుక మోక్షపట్టెనయ్య!
నేటికి సంతానము లేదు గనక నీకు
అటుగనుక మోక్షపట్టి అక్షేపు నవ్వె :
నవ్వితే నవ్వేగాని నరనాథ వినుమ!
దవ్వుగా దూరపు దేశాన నుండి
పరభూమిదేవర ఫలమియ్య జెప్పెను.
పూరపశువుల గొల్వ పుదాసీన మాయె
సర్వేశ్వరుని మహిమ సత్య మీమాట
పుర్వీశ : మనసులో వుంచుకో రాజ"
పెద్దలాడిన మాటలు పెద్దన్న వినెను
పద్దుపద్దు లన్ని ప్రతివచ్చె ననుచు
పరివారము ధొరల బాంధవుల ప్రజల
పేరుపేరున బిలిచి పంపె నందరిని.
రఘుపతి పల్లికొండతో
రాస్యమాడసాగె :
దిగ్గుదిగ్గున లేచి దివాణము చొచ్చెను
అంతఃకరణ వార్త లల్లునితోను
అంతయు చెప్పెను ఆత్మలో బుద్ధి :

## కల్యాణమున కేగుటకు పెద్దిరాజు పల్లికొండ అనుమతిని కోరుట

"పిన్నపెద్దల పెంచి ఈడేర్చినావు
విన్నపము జేసేను వినవయ్య నీవు
కాదన అవునన కర్తవు నీవు
సాధించిన పనులెల్ల వద్దంటే నేను
వేదశాస్త్రిలు చాల విన పాపమనిరి
బుద్ధియెరుగని దేవుడు పూజ
వొల్లడాయె
భిక్షకులు చాలగను మోక్ష పట్టి పోయిరి
పక్షులు చాలగను పలికెనని చెప్పితివి
క్షేపాడిన మాటలు కల్లకాదు వింటివి

శ్రీపతి వినయ్య ః మీచిత్త మేలాగొ
దవ్వుల దేశాసగాని సంతానము లేదసిరి
నవ్వుమాటలుగాని సమ్మికెలు గాని
అనతీయవయ్య హరిగురువ నీవు ః
ఎనయంగ తన బ్రతుకు ఎన్నికలాయె
నిత్యములు గావు శరీరాలు అనిత్యాలుగాని
పుత్రసంతానాసకు తాను కల్యాణ మిపుడు
పోయిపచ్చేసు బుద్ధి అనతి ఇమ్ము
మహిలోన ఆ దేవుని మాటలు నిబద్ధి
కని మగిడి వచ్చేను ఘనుడ పల్లికొండ ః
జననాథ ః నీవును సెలవు దయచేయు ః
నాకు తోచినయట్లు నరనాథ వినుమ ః
తమ్మని పోలురాజును తమతండ్రి వున్ననాడె
నిమ్మళముగ పట్నము నీవు గట్టవైతివి ః
తమ్మని పట్నము గట్టక తనకు పోరాటు
సమ్మతించి అందరు సర్వసమ్మతిగాను
అందరితో చెప్పి అంపవే మమ్ము ః"
కందువ పెద్దన్న కనకలిగిన బుద్ధులెల్ల
వేవేగ పల్లికొండ విని అప్పుడనియె ః

## పల్లికొండ పెద్దిరాజును వారించుట

"జననాథ ః నీకెవరు చెప్పి రీబుద్ధి ?
కొంచగాడవు గావు కుటిలబుద్ధులు మాను ః
మంచి గుణాఢ్యుడవు ఈమాట నీవు
ఆడుకో చెల్లదు అవనీశ వినుమ ః
తా చెప్పిన మాటలు తొలుకక జనులు
లోకప్రకారులు లోకు లాడేరు
వాకున మనసున వుంతురా రాజ ః
పురాణాలు సామెతలు పుట్టినవిగాక
నేరములున్నవారు లేరటవయ్య
ఆర్గురు చక్రవర్తులు పదహార్గురు రాజులు
నేరము లున్నవారె నీ వెరుగవా రాజ ?
చెప్పబోతే అన్ని సామెతలు గాని
ఆడవారి మాట వినకు, చేపట్ట రెవ్వరు ః
రహస్యము చెప్పుదును నామాట వినుము ః
వసుధేశ ఈ బుద్ధి వద్దయ్య నీకు ః"
అల్లుడు పల్లికొండ ఆడు మాటలకు
వలురాజుసుతుడు తా పరుస నిట్టనియె ః

## పెద్దిరాజు తన నిశ్చయమును విడనాడకుండుట

"ఇన్నాళ్లదనుక నీ వేమిచెప్పినను
నీమాట మేము అతిక్రమించినాము?
అప్పకొటుకుపుగాంగ అంతరంగముతో
చెప్పదగిన మాటలు చెప్పితివిగాక
హరిహరుల మారు (నీవు) అడ్డగింపు
మాటలు
అరికట్టు గట్టకు! అధికఫలము లేదు!
నీవు ఆడిన మాటలు వేదవాక్యములు
అటుమీదట ఏమి ఆనతిచ్చినను
దుడుకుగా పోరాదు దుర్బుద్ధిచేత!
చిత్తానకు వస్తేను సెలవిత్తువుగాని
నీతికాదంటేను మేమెంతవారము?
రాజ్యము చాలించు రాజ పల్లికొండ!"
అసమానఘనుడైన ఆ పెద్దురాజు
పల్లికొండను గూడి బ్రాహ్మల పిలిచె:
"పల్లవ పోలురాజుకు వర్ధిల్ల
ముహూర్తము
పట్నము గట్టను బలమైన మూర్తము
ఘట్టిగా చూడు" మనెను ఘనుడు
పెద్దురాజు.
"పట్నాన ఫలమౌనో? పసులలో
ఫలమౌ?
విష్ణుబలము గలవాడో? ఈశ్వరబలము
గలవాడో?
రెంపు ముహూర్తములు చెప్పుడా
రేపటి మూర్తమున?"
దండిగా బ్రాహ్మలు తగ చూచిరంత
"రేపు త్రయోదశి గురువారము
సకలపనులా లెస్స
చేపట్టిన పనులెల్ల సమకూడు మీకు
పుట్టకను పోలురాజు పురహరుని మారు
చంద్రకళలు గలవాడు సూర్యకళలు
గలవాడు
ఇంద్రభోగము గలిగి ఈశ్వరద్రిష్టి
గలవాడు
దివ్యజ్ఞానము గలవాడు ధేన్వాల
కచ్చివచ్చు
శవ్యవ్రతము గలవాడు శౌర్యము
గలవాడు
హరిహరు లిద్దరు అరమర లేక
సిరులు మించిన పూజ చేయగలవాడు
(మీ) నలుగురికి సమస్తము
నడుపగలవాడు
పోలురాజు అనగాను పూజగలవాడు
నగరపట్నము గట్టి రాజ్యము ఏలి
సంతోషమున ప్రతిజనుల కెల్లాను
ధేన్వాల పట్నము దేవేంద్ర పదవితో
ఆనంద భరితుడై అవనిలోపలను

విభీషణపట్నమై విలసిల్ల గలదు
ప్రబలి ఆచంద్ర తారార్కమై ప్రౌఢిని మీరి
ఆవులలో పట్నము హరువుల మున్నాది.
దివాణములో పద్ద''ని చెప్పిర్బ్రాహ్మలు.

## పెద్దిరాజు పోలురాజునకు ఆవుల పట్నము కట్టుట

మంచిదని పెద్దన్న ఆ మరునాడు
పంచ మహావాద్యములు బలువడి మ్రోగ
అన్నలు దమ్ములు ఆత్మవర్గంబు
పిన్నలు పెద్దలు పేరుకల వర్తకులు
ఎలమితో అందరు ఏకమై కూడి
పనిబడి ప్రజలు భక్తితో నంత
భట్లు బ్రాహ్మలు పరివారము ప్రజలు
జెట్లు భోగశ్రీలు చెలువంబుగాను
బాణవిద్యలు చాల బారు చేయించి
మూడోఝాము కద్దనగ ముహూర్తము పెట్టుకొని
ముస్తీదు చేయుమని ముందర పంపిరి
పరువడి రాజులు పరగంగ నపుడు
కరుణతో వచ్చిరి ఘను లందరూను
విస్తీర్ణమైనట్టి ఎర్రపట్టుగుడారు
కొలువుగూడార్ల వెంట కొంచక నపుడు
నలువొప్ప పాలవెల్లికి నవరత్న భూషణాలు
కోకల పెట్టెలు కురిజి పీటలును
పోకలాకులు చాల భూతి కస్తూరి
ముందర యివి యన్ని ముదముతో పంపిరి
ఆవపువ్వు అచ్యుతుని ఆవులకు నంపిరి
ఆవుల మందలోకి అతివేగ పోయి
ఎలుగులు ఎడలు వేయించి రంత
కంపటానకు పెద్ద కవులావు లయ్యన
సంపతి వోబయ్య, జన్నావుల ఎర్వ,
గాలము కోనేరు, గంగావుల బచ్చన
పాలవెల్లి గోవిందు, పడ్డలావుల కదిరి
ప్రొద్దుఝాము కద్దనగ పొలము మళ్లించుక
ఎద్దుల నావులను ఇక మీరుపోయి
పొర్లదోలుక రమ్మన్న పొమ్మన్న కంపటీలు
తర్లిపోయి కంపటీలు తలమళ్లించిరి ధేన్వాల
మందలో ముస్తీదు మరి చేసిరంత
కందువతో పన్నెండు స్తంభాల గుడారు
ఎర్రపట్టుగుడారు ఎత్తించె వేగ
జరుదారుచీరెలు చందువలు కట్టిరి
స్తంభాలు ఎత్తించి చాలేరుపరచి

కంబాల గట్టిరి కావి గవిసెనలు
అప్పుడు గుడారములోను అరుగు
వేయించి
కర్పూరసమాను గ్రాసము చేసిరి
ముత్యాలు కెంపులు ముగ్గులు పెట్టిరి
ఉత్తర దక్షిణ తూరుపు పడమట
నాలుగు మూలల అరిటి స్తంభాలు
నిలిపి
యాదవు లందరు ఏకముగ గూడి
ముదముతో కంపటీలు మురియుచు
వచ్చి
సాహసవిక్రమములు సరగున అపుడు
రహిమించు రాజులు రమణతో
మరియు
పరువడి రాజులకు బాగు మీరగను
అంతయు ముస్తీదు ఆయెనని వేగ
ఆవపువ్వు అచ్యుతు అతివేగ వచ్చి
అక్కడ ముస్తీదు ఆయెనని చెప్పె
గ్రక్కున ముహూర్తము కదలుమని
నంత
అంగరంగ వైభోగము లందరు
కదలిరి.
బంగారుపల్లకీలు పడివాగె తేజీలు
అరిగెలు గొడుగులు అందలంబులును
సొరిటీలు పట్టంగ సొంపుతో కదిలెను
గురువారమునాడు గోకులములోకి
తిరుమందులు వల్లవులు తేజీల నెక్కి
అందలా లెక్కిరి అన్నదమ్ములును
పంతముల రఘుపతి పల్లకి ఎక్కెను
వచ్చిరి అందరు వైభోగములను
ప్రజలూను వచ్చేరు బ్రామితపడుచు
అసహాయ శూరులు యాదవవరులు
చూడవచ్చిరి చాల చోద్యపడుకొనుచు
పుడమిలో యాదవ పుణ్యులు చూడ
మచ్చికతో గోకులము ముందుకు మళ్లె
ఎద్దులు ఆవులు ఎక్కడెక్కడను
దొడ్లలోపల చాల తుల్లమై యుండె
దొడ్డివాకిళ్ళు గమ్మి దూడలపొది
దోలిరి
అడ్డగల కంపటము ఆ లక్ష
యాదవులు
గుడారు వద్దికి గొల్లలు కంపటీలు
కూడిరి రేపల్లె గోపాంగనశ్రీలు
ముహూర్తము వచ్చెనని ముదముతో
రాజును
వార్తకెక్కిన యట్టి వలురాజుసుతుని
మెరుపైన జమిలి మెడనూళ్ళు వేసిరి
వుంగరంబులు బెట్టిరి వుర్వి గంపింప
రంగుగ పోలురాజు రమణతో మరియు
తమతండ్రి వాలురాజు ధరియించినట్టి
చేమపువ్వుకడియాలు చిలుకలతాళి
అందమైన ముత్యాల పెద్ద చవుకట్లు

పదివేలు దీరింది పడిదెల గట్టిరి
సొమ్ములు శృంగారించి సురిటీలు
విసిరిరి
కమ్మక సేసలు కస్తూరి చల్లిరి
బ్రాహ్మలు దీవించ భట్లు పొగడంగ
సింహాసనస్థుని ద్రిష్టి తీయించి
ప్రధానిపట్నము పరగ ఏర్పరచి
మతిమంతుడు కల్లందుల మారినేని
బిలిచి
సరసన గూర్చుండ సెలవిచ్చి రపుడు.
అన్నదమ్ములు అప్పు డందరు గూడి
వింతగ రాజులు వేడుక మీరి
పేరుగల సొమ్ములు పెట్టిరి అతనికి
నాల్సనగలు కోకలు ఇచ్చె రాజు
పెద్దరాజు
కల్లందుల మారినేని ఘనత ప్రధాని
తీర్పరిని చేసిరి తిరుమందుల మల్లును
గారవించి అతనికి కనకాంబరములు
ఇచ్చిరి తసిరీబులు హెచ్చుగా నపుడు
లక్షణవంతుడు రాజు పెద్దన్న
అన్నలు తమ్ములు హస్తమెత్తి
మ్రొక్కిరి
చనువరులు దొరలు చాల ముఖళించిరి!
తమ్ముని సముఖాన సమద్రిష్టి నిలచి
తమ్ముని కిట్లని తగ బుద్ధి చెప్పె :

## పెద్దిరాజు పోలురాజునకు బుద్ధులు చెప్పుట

"తమ్ముడా! పోలురాజ ! తన మనవి
వినుమ
వినవోయి తమ్ముడా ! వివరమున నీవు
పనివడి చెప్పేను ప్రఖ్యాతిగాను
నలుగురికి తమతల్లి నాతి వల్లమ్మ
పాలు నెయ్యి వుగ్గు పరగ బోసింది
పరిపరి విధముల పణతి వల్లమ్మ
బుద్ధులు నీకు వుగ్గు బోసింది తమ్ముడా
అన్నసింహాద్రి తా అతిభోగి .యనుచు.
పన్నుగ యరనూకరాజు ప్రజాఘణం
గలవాడు
సచివుడు నలనూకరాజు సాకలేడు
ధేనువుల
పశువులకు నీపేర బలము చెప్పినారు
మహదొడ్డ వాడవని మన్నీలు
కొనియాడ
సాహసఘనుడ వని చెప్పిరి బ్రాహ్మలు
నీ యంతటి వాడు నిఖిలమున గలడె
చయ్యన యాదవులు సరగ కొలువంగ
అటుగనుక నిన్ను ఆవులమంద
పట్నము గట్టినాను బాగొప్ప నిన్ను
ధర్మరాజుకు తమ్ముడు తగ అర్జునుండు

ధర్మజ్ఞుడవు అతనికి సాటైన
తమ్ముడవు
రామభద్రునకు తమ్ముడు
లక్ష్మణుండనగ
తనకు అతనివంటి సాటైన తమ్ముడవు
బలభద్రునకు తమ్ముగు పరగ
కృష్ణుండు
తనకు అతనివంటి సాటైన తమ్ముడవు
సత్యంబు ధర్మంబు సకలజనులందు
ఉత్తమగుణములు ఉంచుమా
తమ్ముడ!
ఎవ్వరెవ్వరి పట్ల ఎరిగి నడుచుకొమ్మ
బావలు మరుదులు బంధువుల పట్ల
దయగలిగి నడుచుకో తమ్ముడ నీవు!
ఆవుల ఎద్దుల యాదవుల ప్రజల
నవపముజు గొడుగులు నందిజెక్కెలు
సామంత రాఘోల జమిలందలాలు
నాఘగిరి గుడార్లు నవపంజు గొడుగులు
పడివాగె తేజీలు పట్టు పతావళ్ళు
కడలేని వస్తువులు కనకాంబరములు
వల్లవులు తిరుమందులు వారు వీరనక
గొల్లలు కంపటీలు గోసంగులు మసిలి
నేడు
తలగోం వురుదాళ్ల బసువశంకర
బిరుదు
మారుగుత్తి కప్పము ఆత్మబాంధవులు
అర్థాం పెద్దలు ఆవుల మందల్లు

కర్తవై అన్నింటి కాపాడుకొమ్మ?
ఎండనున్న వారిని ఎవరైన గాని
నీడకు రమ్మని నిలుపు సత్యంబు!
గోకుల మంతయు గోపకుమాళ్లు
యాకకంపటము అందరిని నీవు
చేకొని యాదవుల శ్రీకరంబుగను
ఎక్కువై యాదవుల అందరిని నీవు
వుపకారార్థము వుంచుమా తమ్ముడ!
ఏపట్ల కోపము ఎంతైన లేక
పరోపకారము పాటించు తమ్ముడ!
దూరమెరిగి నడుచుకో దొడ్డబుద్ధి
వుంచుకో
అల్లుడు పల్లికొండ హరిగురువు మారు
తల్లిదండ్రుల మారు తా ఎరిగి
నడుచుకో!
మేనల్లుడని మందమేళము చేయకు!
వనజనాభుండైన వాసుదేవుమారు!
అన్నదమ్ము లందరిని ఆదరించవోయి!
నిన్ను నమ్మినవార్ని
నిర్వహించవోయి!
ఇక నొక విన్నపము వినవోయి
తమ్ముడ!
(మీకు) ఎవరెవరికి సంతాన
మిచ్చినాడు శివుడు
అంతే చాలునని అబ్బురపడి వుంటి"
అని యిట్లు సమ్మతించి ఆతిగారవించె
వినయము తోడుత ...

కనకాంబరంబులు కట్నాలు ఇచ్చెను
పంచనవరత్నాలు మణిభూషణములు
సంతోషమున వారు సేసలు చల్లి
శుభమని దీవించి సొంపుతో బ్రాహ్మలు
విభీషణపట్నమై ఇంద్రభోగము గలిగి
వర్ధిల్లుమని దీవించిరి వారిజగర్భులంత
ఎనయంగ మరియును ఎంతవేడుకతో
ఆలపట్నములు విసుర ఆవుల
పోలురాజుకు
శలవిచ్చి అందరు శాయగల వందనము
చేసిరి
వల్లవులు తిరుమందులు వందనార్థి
చేసిరి
పల్లికొండ ఆజ్ఞనియేక భయభక్తితోను
ఆలింగనము చేసి అమిత
విక్రమశాలులు
తాల్మితో ప్రజలకు తశిరీలు లిచ్చిరి
పేరుగల వర్తకులకు పెంపుతో నిచ్చిరి
భూదానములు చాల భూసురుల కిచ్చిరి
భట్లకు జెట్లకు పరగ తశిరీలులు
ఆటపాటలవారికి అర్థములు పంచిపెట్టిరి
బాణవిద్యలు చాల బహుమేళములను
పోటిమిగ గప్పిరి పులివర్తిశాలువలు
వేయున్నేనూరు దివిటీలు వీణెభోగాలు
కైవారము చుట్టు గానపాటలవారు
గిడిగిళ్ల భేరీలు పెద్ద ఢమామీలు
ఆరూఢి మ్రోవంగ అష్టభోగముల
తిరుమందులు వల్లవులు తేజీల నెక్కిరి
బరాబరులు చేయుచు బారులముందర
క్షేమాన పంపాద్రి చేరిరి వారు.

—:o:—

# పెద్దిరాజు కథ

శ్రీగిరి నాథునకు చెయ్యెత్తి మ్రొక్కి   వినిపింతు యాదవ వృత్తాంత మెల్ల
సొంపుతో కల్యాణ సోమప్పను దలచి   పెద్దభూపతి కథయు పెంపొంద వినుడి

## కథా ప్రారంభము

పంపాద్రి నేలుచు పరగ పెద్దన్న
సంతుకొరకును తాను సతియు
పెద్దమ్మ
కల్యాణ సోమప్పను సేవింప కడు
నిశ్చయించి
అన్నల తమ్ముల అందరిని బిలిచి
కులకోటి బాంధవుల గొబ్బున పిలిచి
ఆవేళ పెద్దిరాజు అతి వేడ్కతోను
కొలువున కూర్చుండి పల్లికొండను
చూచి
"పందుముల రఘుపతి ! పల్లికొండ !
వినుమ
యలమంచిలో తమ తండ్రి తనకు
పట్నము గట్టి
యెన్ని యేళ్ళు అయెనో యెరిగించు"
మనిన

అ మాటకు పల్లికొండ అపుడిట్లగనియె
"మామరో! వో మామ! మా పెద్దిరాజ!
పరగంగ యలమంచిలో నిన్ను
పట్నము కట్టిన వెనుక
పరిణాన పదకొండు ఏండ్లు ఏలితివి
అంతట వొకనాడు అవల వొలురాజు
కరణాల కొరకునై కాపు కండెలలోను
పోరాడి చెరలు పోకుండ విడిపించె
సారికల్లుగ వలురాజు చెల్లిన వెనుక
పదిఏండ్లు వెనుకను పంపాద్రికి
వొస్తిమి
ఏడేండ్లు పంపాద్రి ఏలితిరి మీరు"
ఆవేళ పెద్దిరాజు అతి వేడ్కతోను
అందరను కనుగొని అపుడిట్లగనియె !

## సంతానము కొరకై పెద్దిరాజు కల్యాణమునకేగ గోరుట

"అల్లుడ పల్లికొండ ! అన్న
సింహాద్రి !
వన్నెగల తమ్ములార ! వసుధేశులార !
ఎన్నడు నామాట కెదురాడలేదు మీరు
సోమప్ప కళ్యాణము చూడ రమ్మనెను
వచ్చిన సంతాన మిత్తునని పలికె
పన్నుగా పశువుల పాళ్లను పంచి
అన్నలార ! కల్యాణము
అంపరే నన్ను !"
తమ్ములు, సింహాద్రిరాజు
తలలొంచుకొనిరి
కన్నుల కన్నీరు కాల్వలై పారె
అన్నలు దమ్ములు ఆత్మవర్గంబు
చిన్నబోయి తమలోన చింతింపసాగిరి
తగనొప్ప సింహాద్రి తమ్ముని బిలచి,
"తగని మాటాడితివి తమ్ముడా ! నీవు
అలనాడు మనతండ్రి అపల వలరాజు
కాపుల కరణాల వెనుకవేసుకొని
కనకము గంగురాజు మీదికి కదలి
పోవగను
కనకసింహాసనానికి కర్తను జేసి
అన్నదమ్ములలో నిన్ను అధిపతిని జేసి
కంపజీలు మొదలు గలిగిన బలముకు
ధనముకు ధాన్యముకు దండనజేసి
సరస సంపద ఆవులు సర్వంబు నీకు
అందరిని మమ్ముల అన్నదమ్ములను
ఇల యెల్ల యెరుగంగ ఇల్లడజేసి
ఆలంబు చేయంగ అరుదెంచినాడు
చలమున బ్రాహ్మణ చెరలు విడిపించి
పశువుల దోపు పట్టిన కొల్ల
సాహసమున బోరి అంత విడిపించె
కొసరక మన్నీల కుమ్మి పడద్రోసి
వలరాజు కలుబోడి గంగరాజును జంపె
జలపడ బోడిశివసదపై గూల్చి
అరులను నురుమాడి ఆ కల్లిలోను
తలి ముత్యనాయుడు మనతండ్రి
వలరాజు
వలరాజు ఎదురొమ్మున వజ్రాయుధంబు
నాటి
కల్లిలో వొరిగెను కాంత చిచ్చురికె
అల్లంతట కొందరు చెల్లిరి
ఆలంబులోను
నాడు దుఃఖము లేదు తమ్ముడా నాకు
అయ్యా చనిపోయిన అందిరిని విడిచి
పొయ్యేది నీతియటోయి తమ్ముడా
నీకు"
అన్న సింహాద్రిరాజు ఆందోళపడగ
ఎన్నరాని దుఃఖమున ఎరనూకరాజు
అన్నముఖము చూచి హరహరా
యనుచు

అన్నమాటకు తాను విన్నతిగ్గ బలికె
"మన్నించి మామాట మనవి చేకొనుమి
కారణ మేమి మావల్ల కల్లతన మేమి
నేరమేమి చేస్తిమి అన్నరో మేము
అనుమానము పాపక అన్న పెద్దన్న
మనసులో కోపము మరి వుండపలదు
చేకొని నీచేతి చంద్రాయుధాన
చక్కచక్కగ తలలు తరుగవో
యన్న
ఆడవారి మాటలు విని అన్న పెద్దన్న
ఎడబాసి కల్యాణము ఏల బోయెదవు"
ఎరనూకరాజంత ఎలుగెత్తి ఏడ్చె
దరిలేని దుఃఖాన ధరమీద వొరిగె
అతని దయ తమ్ముడు అతి
బాలచంద్రుడు
దినకర చారిత్ర దివ్య సుమిత్ర
కొలుకుల కన్నీరు గోళ్ల జిమ్ముచును
నలనూకరాజు నప్పు డేతెంచె
"అలరంగ ఏడేండ్లు అన్నదమ్ములము
ఎలమితో పంపాద్రి ఏలుచుంటిమి
అయ్య చనిపోయిన అది తెలియకుండ
అయ్యమారు అని నిన్ను ఆశించి
వుంటిమి
సదాశివు డీరీతి సమకట్టె నేమొ
ఏది తెరువో మాకు ఎరిగింపు మన్న
బుద్ధిమాటలు మాకు నేర్పుగా చెప్పుడు
పెద్దన్న మామీద నీ ప్రేమెందు బోయె
ఇందర మమ్ముల వెతలను గూర్చి
అందముగ కల్యాణ మరుగవో
యన్న"
అలమట పడుచును అవనిపై వొరిగె
నలనూకరాజు నటు మూర్ఛపోయె
వొద్దికతో పోలురాజు పెద్దన్నను జూచి
"కద్దుటే యిటువంటి కపట మార్గంబు
పాదాలు పట్టుచూ పలవరించుచును
గొడ్డుతన మీలాగు కలదటే అన్న
వాసి మీరగ మము పోషింపగాను
ఆశించి వుంటిమి అన్న పెద్దన్న
ఇప్పుడు కడచేసి యిందరి మమ్మ
ఏకచిత్తంబున ఏల బోయెదవు
అక్కడున్న సోమప్ప అంతట గలడు
కల్యాణ సోమప్పకు కడువేగ మనము
గుళ్లు శిఖరంబులు గోపురంబులును
వేగమె కట్టించి వేడ్కతో మనము
వనములు కోనేర్లు వనరగా దీర్చి
తేరులు రథములు తేజంబుగాను
ఇక్కడ కొలిచెదము ఇందరము గూడి
అక్కడున్న సోమప్ప అంతట గలడు
ఇక్కడే సంతాన మియ్యంగ గలడు
పొందుగా కల్యాణము పోవద్దు అన్న
(అని) పోలురాజు ధరణిపై
పొర్లాడుచును

నీ త్రోవను అన్న నీవు పోగానె
తల వొక త్రోవను తాము
పోయెదము''
(అని) పెద్దన్నను కౌగిలించి పైకొని
అడిలె
అన్నదమ్ము లీరీతి అడలంగ జూచి
బావమరుదులూను బంధు వర్గంబు
తామర కొల్లు వంటి బలగము
తల్లడిల్లగను
నిండు వాలుగన్నులకు-పెద్దన్నకు-
నీళ్లు రావాయె
అన్నలు తమ్ములు అడలంగ జూచి
బావలు మరుదులు ప్రలాపింపగాను
చెల్లెలు కొమరక్క చేరి ఏతెంచె
అన్న మొకము చూచి ఆపుర్న అడిలె
గోడుగోడున అడులుచు కొమరగిరి
అక్క
అన్నమీదను బడి అలమరుగుచూను
"అలసట పెట్టి మము అన్నదమ్ములను
కల్యాణము పోగానె కలిగేర సుతులు
తమ్ములందరు నీకు తగ సుతుల మారు
అయ్యమారు సింహాద్రి అన్న వున్నాడు
భూమిఎల్లను విడిచి పుత్రుల కొరకు
తమ్ముల విడిచిపోను ధర్మంబు గాదు
తామరకొల్లు వంటి బంధువుల బాసి
భామమాటలు విని పోను బాగటే అన్న

కూడిన కాపురాలు కూడకుండాను
ఎడబాసి కల్యాణము ఏల పోయెదవు
కట్టిన యిళ్లను కడచేసి నీవు
పట్టపగలో యన్న పారబుచ్చి పోయేవ
వృక్షము మారని వుంటి మిన్నాళ్ళు
పక్షులకు ఏదారి వృక్షంబు లేక
పాలునీళ్ళ వంటి బాంధవుల బాసి
బలిమి విడనాడిపోను బాగటె
వో యన్నా
కాకులు కల్యాణము కదలి పోయినాను
కాకులు మళ్లవు కానాతులాకు
అని యిట్లు పురజనులు అనుకొనంగాను
వినకుంటివో యన్న వివరంబుగాను
చెప్పిన మాటలను చెవినుంచు అన్న"
అప్పుడు కొమరక్క అతిశోక మంది
ఇందుముఖి మూర్ఛిల్లి యిలమీద
వొరిగె
ఆ పణతి మూర్ఛిల్ల అందరు జూచి
కుమ్మరాము చిచ్చువలె కుమారిల
సాగిరి
యరవలు దగిలి మంట వెలిగిన రీతి
గుళ్లలో పై డికంబె గుబగుబ
లాడినట్లు
ఆరీతి అడిలిరి అంగనామణులు
మగువలు శోకాన మల్లడించగను
కంటి తడి లేదాయె ఘనుడు పెద్దన్నకు

అందరును అప్పుడు అన్నదమ్ములును
బంధు సహోదరులు బావమరుదులును
బలభద్ర చెన్నుండు పల్లికొండ పలికె
"కరవాలుతో మమ్ము ఖండించి నీవు
కదలుమా కల్యాణము కటకట మామ !
బంధుల నందరిని పారిగొర్ల చేసి
ఎడబాసి కల్యాణము ఏగెదవ మామ !
తీర్థయాత్ర బోయి మీరు
తిరుగొచ్చుదాక
దిక్కు మాకెవ్వరు ఎట్లు ధరియింతుము
పీకతో మాకింత విషమైన బెట్టి
చనుదెంచుట మంచిది-మీకు-సహజమై
యుండు
నీతియటే మామ నీతమ్ముల ఎడబాసి
పోను
తనయులు నీకు నీతమ్ములు గార
పుట్టబోయేర యిక పెరగబోయేర
వట్టి భ్రమత నీకు వచ్చింది మామ
ఏమి నిమిత్యముకు ఎట్లు వున్నాదొ
కాదనక పోయినా కానవచ్చునె మామ"
అల్లునివంక చూచి ఆ రాజశేఖరుడు
పల్లికొండ ఈరీతి పట్టిచెప్పంగ
"మనసొచ్చిన దేవుని మరి వేగమునను
కలవొచ్చిన శంభుని కనులార
సేవింతు
కాదన్నా కల్యాణము గ్రక్కున బోదు
వద్దన్నా కల్యాణము వైశమె పోదు
ఇంత విచారంబు ఏమిటికి మీకు
వుండ''మని అందరిని పురలించి చెప్పె
గౌరవించి అందరిని కౌగిటచేర్చి

## పెద్దిరాజు ఆవులమందను సోదరులతో పంచుకొనుట

మారాడ పద్దని మానములు చెప్పె
పంచిపెట్ట మనెను పశువుల నెల్ల
మామ మాటలకును మరి పల్లికొండ
"ఏమని నీతోను వివరింతు మామ
ఏడు తరాలనుండి ఎడబాయ లేదు
తాడు కోల ఎరుగని ధర్మసురభులును
తుండకోల ఎరుగని కుచ్చితపు
సత్రావులు
పొద్దువంక చూడని భోగసిరి తమ్మిలు
ఆంబోతు మొకము చూడని అన్యకారి
సురభులు
మందముచ్చులును మాచకమ్మలును
సన్నాసి ఆవులు సలుగుటెద్దులును
ఈనని కట్టని ఇనప సంగలును
చూడ చక్కని మంచి సురదేవతలును
అందమై వుండును ఆ మంద ధేనువులు
దేవతలు ఆ మంద దృష్టింప రాదు
శివుడు ఆ మందను భూశనే రాదు

విష్ణు ఆ మందను వివరించ తేడు
బ్రహ్మ ఆ మందను భావించ లేడు
పంచకోట్లు బా మందలో పొదించి వుందురు
నను చెప్ప వపట బంచ న్యాయంబు లేదు''
కూటాల లోనికి కూర్మి ఎత్తించి
సీకాయను స్నానమాచి శుద్ధి పయిపలు గట్టి
తెరగొప్ప భూషణాలు తేజముగ దీర్చి
మెచ్చుగా గంధము మేనున నలది
వచ్చి యామందకు వాంపూరి దిరిగిరి
వేడ్కతో నిలిచిరి ఏగు రన్నదమ్ములు
అలరంగ గంధంబు అక్షింతలూను
సాంబ్రాణి వేయించి సాష్టాంగ మెరగి
సౌరిది దేవతలార! శూర దేవతలార?
కరుణతో మాపాల గలిగితిరైన
పరగంగ పాళ్లకు పంపులు గాండి

అని యేగు రన్నదమ్ములు అర్పించి మొక్కిరి
వినిన ఆ రాత్రి సమయంబు నందు
ఆవులు లేగలు అలమరుగుచూను
ఆవేళ అరెబో యని అరవంగ సాగె
తల్లులు బిడ్డలు తల్లడించుచును
పెద్దరికి ఆవులు పేరెము వారుచు
ఆవులుమీదను ఆర్లు వేసుకొని
వక కొన్ని కన్నీరు కంఠములు దడియ
వక్కటొక్కటి కూడి వర్లంగ సాగె
కూరిమితో మనము కూడి పెరిగితిమి
కారణ జాతకము ఇటు వుండె నేడు
చేటుదోచి ఆవులు చెవులు వెలవేసె
బొటబొట కన్నీరు భువిమీద వ్రాల
చుట్టు మెట్టాడుచు సురభు లన్నియును
కొట్టు మిట్టాడుచు గుంపులు గూడి
తమతమ క్రేపుల దరియంగ బిలుచుచు
భ్రమవిడిచి ఆవులు పంపు లేర్పడెను.

## పెద్దిరాజు సోదరులు దిక్కున కొకరగుట

పంచపన్నె కామధేనువులు పరభూము లాయెను
పంచఖండంబులకు పయనంబు లాయెను
సిరిగల ధేనువులు సింహాద్రిరాజువెంట
శ్రీకూర్మ మేలేటి సింధుభల్లాణి రాజు

సింధుభల్లాణిరాజుమీదికి శీఘ్రమే కదిలెను
పేరుగల ధేనువులు పెద్దిరాజుపాలు
వాలి కేతువరాజు మీదికి వైబాడి కదిలె
ఎన్నగల ధేనువులు ఎరనూకరాజుపాలు

ఏనుగనాథు దుర్గానికి ఎరుపాడె నంత
ఎర్రభూపతిరాజు మీదికి వేగంబె కదిలె
నయముగల ధేనువులు నలనూకరాజు
పాలు
బెజవాడ నున్న భూపతిరాజు మీది
అతివేగంగ కదిలె ఆ రాజు వెంట
పోటిమిగల ధేనువులు పోలురాజు పాలు
శ్రీరంగపట్నము చూడ శీఘ్రమే కదిలె
కలియుగ చోడాని మీదికి కదిలె
వేగముగ
ఏడుపోతు లెడ్లు ఏనూరావులు
నడిమందలో ధేనువులు నట
వుండజూచి
ఆసహాయశూరులు అప్పుడు వచ్చి
"అల్లుడా పల్లికొండ హరిగురువ
వినుమ
ఈ ధేనువు లెవరివి ఎరిగింపు మనిస"
అనిన నా పల్లికొండ అపు డిట్లగనియె:
"వల్లవుల మామః వంశాబ్ధిచంద్ర:
ఈ ధేనువులు మీ చెల్లెలు కొమరక్క
పాలు"
"తమకు తెలియకుండ తరుణి
కొమరక్కకు
ఎవ్వరిచ్చినారు ఎరిగింపు మాకు:"
ఆ మాటకు పల్లికొండ హర్షంబు నొంది
ఓ మనవి వినవె హో సహసందుల
మామ:

అలనాడు మీతండ్రి అవల వలరాజు
ఆవుల అరణ మిచ్చెను
అతివేడ్కతోను
కలుబోతు గంగరాజు మీదికి కదలి
పోవుచును
చేతిలో చెయివేసి చెప్పి వప్పగించె
అరణ మిచ్చిన ధేనువులు దొడ్డిని
అతివేగ నిలిచె"
అనిన నా పెద్దిరాజు అతి సంతోష
మందె
అంతటతెల్లవారె అర్కు డుదయించె
అర్కు డుదయించెను అమృత సిద్ధ
యోగమందు
ముదమొప్ప పెద్దిరాజు ముస్తీదు
లాయె
కల్లిలో గోపాలకుల గ్రక్కున బిలిచె:
"సాటిలేని యట్టి సంగ్రామ శూరులు
పెయ్యావుల పాపన్న పద్మాలకొండు
కుంకుమ నారాయణ, గుమ్మ
గోయిందు
పంకజనాభుండు పద్మవుకసాన
చెవుల గోపాలుడు, కండె శత్రుఘ్నుడు
శీలం గోపాలక శ్రీవల్లభుండు
తల్లిం గోపాలుడు, పద్మనాభుండు
అరంత కేశవుడు, ఆది కూర్మండు
వినయము గలవాడు విశ్వేశ్వరుండు
సంద గోపాలకుడు నారాయణుండు

ముందర విడియ, మురహర తిమ్మ
తరికోట వెంకటి, దాసం శంకరుడు
పర్మము గలయట్టి మంత్రి కొండయ్య
ఆ మాటి మాధవు, ఆంబోతుల బొమ్మన
మకరం గంగన్న, నేతివారి వీరన్న
వేల్పుల పాపన్న, వేడు గోసరుడు
కవులావుల గంగన్న, కార్జుడు మొదలు
విజయ నామధేయుండు విశ్వాలోరయ్య
వీరకేతుండు విమలనాభుండు
రాయకేతుండు రాత్మగల గంగన్న
కనకం కేతాకుడు కదిరి గాసిన
ఘనుడు
దేవుని ఆవుల గాచేటి కరేటి కదిరి
పేరుగల కంపవీడు జెట్టిబోయిన ఎల్లు
బుద్ధావుల భీమన్న పుల్లావుల
పుట్టన్న
ఎల్లావుల గంగన్న, ఎల్లమందన్న
తెల్ల గోవిందుడు, దినమరంతకుడు
జక్కము చింతన్న జన్నావుల కేశవు
వేదము నారాయుడు, వెన్నుడు
మొదలు,
గోవుల కొండయ్య, గొడ్డటి చెన్ను
శంఖుధార లక్ష్మయ్య, జావాది చెన్ను
చెక్కము రామయ్య, తెల్లావుల
రాఘవు
కాకర్ల పాపన్న, కల్లందుల బాలలు

పాలిగిరి వేమన్న, బనపోటులు
అంబరి అచ్యుతు మొదలు ఆనవాలు
ఎల్లు
అర్ధవీటి మదన వాలము చెన్ను
నిత్య సత్యవ్రతుండు నీలము కొండు
కవులావుల గంగన్న, గాలము సింతు
ద్వారావలి పాపన్న, దాసరి తల్లయ్య,
బీరావతి సుబ్బన్న, అప్పుతపు
తల్లయ్య
అష్టాక్షర మనియేటి అంగిరేకుల
తెలగన్న
అచ్యుత గోత్రుండు హరిబృందకుండు
పాలసముద్ర గోత్రుండు
భక్తవత్సలుడు
సర్వ రణములలోను సాదర్ల బిలచి
ఎన్నగల కంపటమును వేగముగ
బిలచి
రమణకుళ్ళ గోత్రుండు చెన్నబోయిన
ఎం.కు
లక్కబోయిన పాపన్న రాజుంపుల
మందడి
కవులావుల పద్మయ్య, కనకము సింగ
విత్తము గోవిందు, విస్వరాము దేశు
నేతికొప్పు రాగన, నెమ్మలి ముసలి
పాలము ఈశ్వరుడు, నారెబోయిన
పాపన్న

సారంగు రామయ్య, సమిడిబోయిన
బాలు
బలిజెల పాపన్న, పట్టర్ల పిన్నయ్య
కల్యాణానకు పయనము గ్రక్కున
గమ్మనెను
మనుజేశుడు పెద్దిరాజు మగువ
పెద్దమ్మ
మనసు వక్కటిగాక మరి వేగమునను
అనువేగము పల్లకీలు ఆయత్త
పరుచమనిరి
తోయజనేత్రుల తోడికోడండ్లు
దయవచ్చి అప్పకు దండంబు బెట్టిరి
ఎరనూక సీతమ్మ నలనూక సీత
పోలురాజునూక భక్తి రన్నను దెచ్చి
వసుధేశు చేతి కిచ్చిరి వనిత లందరును
ఇచ్చిన అందుకొని ఇలనాధు డనియె
"అన్నదమ్ములార! అతివేగ వినుడ!
అల్లుడ పల్లికొండ! అన్న సింహాద్రి!
పిన్న పెద్దలార ప్రియముతో వినుడ
మనసు వచ్చిన వేళ పెద్దయ్య
అందురు
మనసు రానివేళ మహా[illegible]
[illegible] అయిన బలుతురు
వకరి కుమాళ్లు మాకు వద్దుపొమ్మనెను"

అప్పుడు సింహాద్రిసీత అతివేగమునను
భక్తుని ఎత్తుక భామ తావచ్చె
"వినవమ్మ చెల్లెలా! నా మనవి
వివరంబుగాను
పరభూములకు పోవద్దు భక్తుని
పెంచుకో
వెగురము కూడి వుండుము ఇంపు
సొంపుగను
రాజులు అయిదుగురు రాజ్య మేలంగ
ఎదటివారు చూచిన ఎక్కువ బలము
కదా
వెన్ను బలిమి తప్పించి ఏల
బోయెదవు?"
అనుచు భక్తుని తెచ్చి అతివపై నుంచె
ఆవుర్న ఆ బాల అడలంగ సాగె
"పోరమ్మ మీకేల ప్రొద్దేల పోదు
కన్నది కడుపు కట్టింది చీరె
పెట్టింది సొమ్ము పెంపుమీరంగ"
గొడ్డుమాట లాడె కోమలి యపుడు
"కననివి కడుపులు కావు కట్టనివి
చీరెలు కావు
పెట్టనివి సొమ్ములు కావు పెద్దప్ప
వినుమ!
ఒడ్డవారి బిడ్డలు వద్దు పోవమ్మ"

## కొమరక్క పెద్దమ్మను దూరుట

ఆడబిడ్డ కొమరక్క ఆమాట వినెను
''కాపరాలు చెరిచితివి గొర గలిపితివి
దాపురమైతివి మాయింటి దయ్యమై
నీవు
భూమీశు నెడబాపితివి భూతమై నీవు
యమురాలవై పెద్దన్నను ఎడబాపినావు
దయ్యపు పుట్టుక తరుణిరో నీది
రేయును పగలును రేపిళ్ల పెట్టి
పాయదెరువులు చేసి పోవుచున్నావు
కంటికి నిద్రలేక కాంతరో నీవు
వేగమె రాజును వెళ్లదీసితివి
కాపురాలు చెరిచేది కానలేమైతిమి
రాగతనమున నీవు రాజు నెడబాపితివి
ఆడగూతురువు గావు అసురవు గాని
కాపురాలను నేల కలిపితివి వదినె
అగ్గి కరిగించుకొని అతివ నీ విభుని
పరభూములు చూపితివి భామరో నీవు
అన్నదమ్ముల ఎడబాపితివి అతివరో
నీవు
తల్లుల బిడ్డల ఎడబాపి తల్లి పొమ్మేప
కుడిచి కూర్చుంటివను కాదు
కాలదన్నుక
పాడు బుద్ధులు బోను బాగటే నీకు
చెవిబెట్టి నేనెంత చెప్పినా వినవు
పోయిన తావున నీకు పొందు
దుఃఖంబు
వలదనంగను పోవ వద్దు వో సఖియ
తలపోత లాయెను తరుణిరో నీకు
చూడవు తలయెత్తి సుదతి నాపంక
తోడికోడండ్లు చేసిన దోషంబు లేమి
చలపట్టి చెప్పిన చెముడ నీకేమి
పొలతిరో ఇందుకు పోలర వీరు
పాపపు దైవము చలపట్టె నేమొ''
రోషమున తొలిగెను కొమరగిరి అక్క
పెద్దప్పచెల్లెండ్లు పెద్ద పెట్టుగని
ఎలుగెత్తి డీ యని ఏడ్వంగ సాగిరి
వదనములు వంచుకొని కలవరపడుచు
తగదని కన్నీరు తుడిచె తరుణి
పెద్దమ్మ -
పొగులుచు నుండిరి పొలతు
లందరును
రాజశేఖరుండు రాజు పెద్దన్న
తేజముతో అన్నదమ్ముల తెరగొప్ప
పిలచి
''అన్నలార ! రొక్కము తార్పుతెచ్చి
సొమ్ములు ధనము పంపు చేయరే
యనుచు'' అనిన సింహాద్రిరాజు
అనుమానపడుచు
శివుడు ఈరీతిగా చేసెనో యనుచు
కానిమ్ము లెమ్మని కలిగిన సొమ్ములు
ధనము పెట్టెలు దెచ్చి దాయ
నిలుచున్న

సమముగా పెట్టెలు సోల్పుగా నిల్పిరి
కొమరక్క నా వేళ గొబ్బున పిలచి
పేర్చిన పెట్టెలు ఎత్తుకొమ్మనిరి
ఇచ్చవచ్చిన సొమ్ము లెత్తుకొమ్మనిరి
కావలసిన చీరలు కట్టుకొమ్మనిరి
అన్నల మాటలు ఆలించి అనియె
ఎన్నంగ పెట్టెలు ఎత్తెత్తి చూచి
పెట్టె లెత్తిన గొప్ప పెద్దదైన పెట్టె
అయిదు పెట్టెల తరువాత ఆరో పెట్టె
అయిదు పెట్టెల బరువు అణగి
వున్నాది
అది ఎత్తి కొమరగిరి ఆశపాశమున
మదిరాక్షి ఎత్తుక మగిడె కూటాలకు
కూటాల నడుముకు ఉరికెను చవికె
నాటకశాలలో నప్పుడు దించి
పెట్టె మూకుడు బీగములు దీసి
అష్టమూర్తిని చూచి ఆశ్చర్యపడెను
అక్కపాలను వచ్చిన ఆదిమా శక్తి
అన్నలపాలు ధనము పెట్టెలు వచ్చెను
అష్టకంకణాల దుర్గను అప్పుడు చూచి
అతివేగ కొమరక్క అన్నల
సముఖానకు వచ్చెను
''అన్నలార! నాపాలు ఆదిమాశక్తి
వచ్చెను''
అన్నలు అయిదుగురు అఘ్మన
నవ్వెచును
చెల్లెలి మాటలు విని చేకొని పెద్దన్న
''అలివేణి! నీపాలు ఆదిశక్తి వచ్చెను
వచ్చినందులకు వణితరో వినుమ
పూజించ కర్తలు పొందుగా మీరు
చెయ రాజ్యకర్తలము చెల్లెల మేము''
అయిదు పెట్టెల ధనము అప్పుడు తీసి
ఆరోపెట్టె నిండా అమరకముచేసి
ఆరో పెట్టె చెల్లెలికి అందించినారు

## పెద్దిరాజు కల్యాణ నగరమునకు బయలుదేరుట

పంపులు ఎరుపాడి పెద్దన్న కదిలె
సకల బలగము కదిలె చయ్యన నపుడు
దళములు కదిలెను ధరణీశు వెంట
నెట్టుకొని కదిలెను నేర్పున వలస
తార్పులు సొమ్ములు ధనముపెట్టెలును
నేర్పుగా బండ్లపై నిలిపి రావేళ
కోకలు బొక్కాలు గొడుగులు
తర్లెను
బియ్యపు పెరికెలు పెద్ద తేజీలు
చయ్యన పంపాద్రి సాగె నా వేళ
గొడుగులు అరిగెలు గొప్ప
టెక్కెములు
పడిగెలు చతురంగ బలములు కదిలె
పల్లకీలు కదిలె పంపాద్రి విడిచి
కొల్లారు బండ్లను కూడ నేతెంచెను
సుందర కదిలెను మూక లన్నియును

మూకలవెంట పడిగలు సోల్పుగా
నడిచె
శిస్తుగా నెత్తిరి సింహ తలాటకములు
గగనంబు ముట్టుకొని కన్నులు చెదర
వీర హనుమంతుని విఖ్యాతి మించి
పవగంగ హనుమంతుని పడగలు
గదిలెను
నందిటెక్కెములు నరపముజు
గొడుగులు
చందుపలును గోడ స్వారములు
కదిలెను
అప్పుడు పెద్దిరాజు పెద్దమాదేవులు
నిండు వేడుకతోను ప్రజలు చూడంగ
అన్నదమ్ములు అలర బంధుజనులూను
వరుసగా వచ్చిన వారి కిట్లనియె
"పట్నంబు వున్నది బంధువులార
బాహుబలంబున భద్రముగ నుండుడు
కల్యాణముకు మేము కదలి పోతేను"
నెగడి డెబ్బదిరెండు నియోగములును
అగణితంబుగ కిదిలె అరాజుగ సుందు
అన్నదమ్ములు చుట్టు కొని అతివేగ
రాంగ
పెద్దిరాజు కదిలెను భేరి వేయించి
సంపదలు తనువెంట సాగి రాంగాను
పంపాద్రి వెడలెను పశుపతిరాజు
భేరీలు ధమామీలు పెద్ద బూరలును

దారలు సన్నాయిలు తమ్మటంబులును
మేలైన నాగస్వరములు మించి
మ్రోవంగ
రుంజలు కేరళ్లు గూటికొమ్ములును
ఝూంఝుణి ఝూంఝుణి యని
మ్రోవ ధర క్రక్కటిల్ల
వీరణంబులు కంచు వీరమద్దెళ్లు
గొడుగుచింతల బయట గొబ్బున
నిలచె
జడియకుడని తమ్ముల స్థిరముగా
నంపె
మల్లెపువ్వువాగున పరగంగ నిలిచె
పల్లవాది రాజుల బంధువుల నంపె
వీరగొట్టంబున వెలయగ నిలిచె
అచ్చట మునుల గాంచి అతివేగముననను
సంతోషమున గాంచి సన్యాసుల
నపుడు
చేకొని పెద్దన్న ఏకచిత్తమున
రేపల్లెలో నిలచె రేమంతు డెలమి
గాసి వావిరుల జూచి కదిలెను రాజు
భద్రాచలంబున పరగంగ నిలిచె
అంత రఘురాముని అలర సేవించె
ధర్మపురమున నిలిచె తగ పెద్దిరాజు
నరసింహా నతిభక్తి నర్చన చేసె
నిర్మల మతితోడ కొలచె పెద్దిరాజు
మేలుగా దుప్పలగుంట మెరయంగనిలిచె

కోటిలింగాలను కోర్కె సేవించె
నిమ్మనాథుని గొలిచె నప్పుడు తాను
ప్రజ్వరి పట్నాన పెద్ద భూపతి నిలిచె
ప్రజ్వరిల్లుచు నుండె పరగ విష్ణుండు
తన్మయభక్తిని పరగ సేవించె

మాహేశ్వరము చేరె మానవేశ్వరుడు
రహిమించు కొల్లాపురమ్మను గొలిచె
హాటగుళ్లవాడ కరుణతో నిలిచె
గుడార్లు ఎత్తించె గొబ్బున రాజు
వొచ్చియు పలసలు వుండి రచ్చటను

## పెద్దిరాజు కాటకోటేశ్వరుని పూజించుట

కామధేనువుల మేపేటి కడు
చిన్నపాపలు
కాటకోటేశునకు కనక పొంగళ్లు
చెలగి బాలలందరును చెల్లించగాను
కనుగొని పెద్దిరాజు గర్వంబునాను
ఆ చిన్నవాళ్లను అటకు బిలిపించె
మంచి కొబ్బరి బెల్లము మామిడిపండ్లు
పప్పు చక్కెర ఖర్జూరపండ్లు తెప్పించి
ఆ చిన్నవాండ్లకు అప్పు డిప్పించె
అప్పుడు పెద్దిరాజు అతివేడ్కతోను
చిన్నవాళ్లను దగ్గర చేరంగ పిలిచి
"ఇది యేమి దేముడో ఓ పాపలార!
ఈలాగున మీరు ఏలాగు వచ్చెదరు"
అని యిట్లు అడిగెను ఆ బాలల నెల్ల
కలకల నవ్వుచు కడు వేడ్కతోను
"వినవయ్య వో రాజ విన్నవించెదము
తాము మేపేటి కామధేనువులు
పలమంతవలెనని పరగ సంచరము
పరమేశ్వరుని కొలుతుము
పట్టభద్రుండ"

"ఈ దేముని పేరేమి ఎరిగింపు డో
బాలలార!"
అడిగిన బాలలు ఆనతిచ్చినారు
"కొందరు జనులు కాటకోటేశ్వరు
డందురు
గోవుల కాచేటి గోపాలవరులు
కాట్రాయు డందురు ఘనుడ
పెద్దయ్య!"
అనిన పెద్దిరాజు అతివేడ్కతోను
"ఈ కాట్రాయుని మేము పూజిస్తె
సంతాన మిచ్చునా సర్వేశ్వరుండు"
అనిన నా బాలలు అందరు నవ్విరి
చక్కగా వినవయ్య చెప్పేము మేము
"కాటకోటేశ్వరుని కని పూజ
చేయుడా
కొడుకును ఇచ్చేను కోర్కెతో మీకు"
అమృత వాక్యంబులు ఆ బాలలు పలికిరి
అనిన నా పెద్దురాజు అతిసంభ్రమునను
ఆడబోయిన తీర్థ మెదురుగా వచ్చెను

అరవయ్యారు మూళ్ల పట్టుచీర
అతివకు తెప్పించె
సతిపతి యిద్దరు పక్కచీరకట్టుకొని
పాతాళ జలనిధిని స్నానంబు చేసిరి
పరము భక్తితోను పరమేశు దలచి
ప్రాణాచారము పడి ప్రార్థన చేసిరి
ఓ కాట్రాయుడా కాటకోటేశ్వరా!
కాంతిసోమప్ప! తమ గర్భంబునందు
పరగంగ బాలలు జన్మించితేను
నీపేరు పెట్టుదుము నిఖిలంబు ఎరుగ
(అని) భక్తితో ప్రాణాచారము పడి
యుండగాను
కాటకోటేశ్వరుడు అపుడు తా మెచ్చి
కాయను పండును దోసిట రాల్చెను
కాయ పండేమి యని కలలోన అడిగితే
కాయే కాటమరాజు పండే పాపనూక
అని
కలవిచ్చెనప్పుడు శంకరుడు దయతో
ఇచ్చితినని వరము ఇచ్చె శంకరుడు
అచ్చుగా వరములు ఆ రాజు గాంచి
గుడార్ల కేతెంచె కులదీపకుండు
జంగమార్చన చేసె సద్భక్తితోను
జంగాల కన్నంబు లింగాలకు వస్త్రంబు
గోవుదానము లిచ్చె కొదువ లేకుండ
తాను శివపూజ చేసి భూపతి మ్రొక్కె
దేవపూజ చేసి దేమునికి మ్రొక్కె

## కాటమరాజు జననము

ఆరగించి సౌభక్తిని అయ్యగారు తాను
పరుపైన మల్లెలా పాన్పుమీదాను
కేళీగృహములోను కదిసి రిద్దరును
మరియును సంసార మార్గంబులోను
కాంతకు తొలిచూలు గర్భంబు నిలిచె
తొమ్మిది గడియలకు తొల్చూరు చూలు
నెమ్మది గర్భంబు నెలసె నటుపలెను
వళ్లు పలుచనాయె వాకర్లు తరచు
తెల్లనాయెను మొకను
దేహంబు చిక్కె
వదనంబు వాడెను వాచవులు కోరె
చేదె చిక్కనమొదలు నీటిపుమ్మలు
తరుచు
కోరె వేడుక పులుసు కోనెను రుచులు
చద్దికూడడుగుచు సఖియ కొల్పుచును
మందమాయెను కడుపు మన్నురుచి
కోరె
పాన్పురుపై పట్టుపెట నిల్వనందున
పైచెమటలు పుట్టె ప్రబలె గర్భంబు
రొమ్ము సరుదాయెను రొమ్ము అధికంబు

సఖియ కుచములు పొదిలె
చనుమొనలు నలుపు
ఇంతిగర్భము పెరిగె వికసించె నాభి
కాళ్లు విలవిలదీసె కాంత నడిచినను
నీరజాక్షికి మత్తునిద్ర తరుచాయె
కదిలించ లేకుండ కాళ్లు వుర్లుజూపె
కోమలికుక్షిలో కొడుకు మెదిలాడె
వెడదయైన కడుపు వింతయై తోచె
నెలకొని తొమ్మిది నెలలు వెళ్లినను
కాంతకు కాటమరాజు గ్రక్కున
జన్మించె
జాతకము వ్రాసిరి జనులెల్ల వినగ
"కోటానుకోటుల కూల్చ నున్నాడు
తాతతండ్రులనాటి తరమైన పగలు
భూతలంబున నితడు
పొరిమార్చగలడు"
అప్పుడు పెద్దిరాజు అధిక
సంతోషమున
పాపలకు చక్కెర పంచిపెట్టించె
పురటింప పదినాళ్లు పోయిన వెనుక
పురుడు పుణ్యము తీర్చి పొందుగ
నపుడు
కాటమరాజని కాంతలు పిలువ
అంతట ఏడేండ్లు అచ్చటుండగను

## పెద్దమ్మ పాపసంహారి నోమునోచి పాపనూకను కనుట

(అంతట) కల్యాణపు సోమప్ప
కలలోన వచ్చి
పాపసంహారి వ్రతము పరగ
చేయుమనెను
పెద్దమాదేవులు
పాపసంహారి దేవళానికి పరువున వచ్చి
జలనిధిలో జొచ్చి స్నానంబు చేసి
తడివస్త్రాలు విడిచి పొడివస్త్రాలు కట్టి
కుడిచెయిలోనుగా వలయంబు దిరిగి
ఆదేవి సన్నిధిని అతిభక్తితోను
ప్రార్థన జేసిరి భక్తితో నిద్దరు
"ఈశ్వరి ! పరమేశ్వరి !
అన్నపూర్ణేశ్వరి !
ఓ యమ్మ ! ఓ తల్లి : పాపసంహారి
పాపసంహారి ! ఓ పరమేశ్వరి ! నీవు
తన గర్భమందున తనయవై పుట్టు"
(అనిన) పాపసంహారి అపుడు
పక్కుననవ్వి
"నీ గర్భమందున నేను జన్మిస్తే
నీ వంశము పెద్దిరాజు నిర్మూలమగును

''అయితే మేలయెగాని ఆడబిడుచు
పుడితే చాలు''
ఇచ్చెదనని వరము ఇచ్చె అమ్మవారు
కాంతకు రెండవ గర్భంబు నిలిచె
కాంతకు పాపనూక గ్రక్కున జన్మించె
కల్యాణ పురోహితుడు గాంగువర్ణునుడు
జాతకంబు వ్రాసెను జనులెల్ల నెరుగ

## కల్యాణ సోమేశ్వరుడు పెద్దిరాజును జన్మభూమికి తిరిగి పొమ్మనుట

(అంతట) కల్యాణ మందున్న కాంతసోమప్ప
పెద్దమ్మకలలోను ప్రేమతో చెప్పెను
''అమ్మరో పెద్దమ్మ అతివరో వినవె
నేర్పుగా కలజెప్పి ఈ నెలవకు దెస్తిని
సంతానముకొరకు జన్మభూములు బాస్తిరి
పుత్రులకొరకు భూము లెడబాస్తిరి
సంతానము గలిగెను మళ్ళి పోరమ్మ
పుత్రులు గలిగిరి భూములకు మళ్ళిపోరమ్మ''
కలగని పెద్దమ్మ తన ఘనునితో చెప్పెను :
"సంతాన మిచ్చిన దేముడు సరివార్ని కలియ బొమ్మనెను
కలజెప్పి దేముడు కదలి పొమ్మనెను"
అనిన నా పెద్దిరాజు అధిక సంతోషమున
కల్యాణము చూడవలెనని గ్రక్కున రాజు
పడగీసి గుడార్లు బరకాల పూరించి
వెల్లవేముల బయట వేగంబె నిలిచె
వెల్లవేముల బయట ఎత్తించె గుడార్లు
కావి గుడార్లు చంద్రకావి గుడార్లు
భూచక్రముగ సూర్యపుటము గుడార్లు
పచ్చపట్టు గుడార్లు వెన్నముద్దపట్టు తెల్లగుడార్లు
పొద్దులకు ఎత్తించె పొగడపట్టు గుడార్లు
నీడలకు ఎత్తించె నీలిపట్టు గుడార్లు
హేమాద్రిగా ఎత్తించె ఎర్రపట్టు గుడార్లు
మహిమీద ఎత్తించె మైనపుబిడ్డు గుడార్లు
దామసానివారు ఎత్తించిరి తడిపట్టు గుడార్లు
కొమణాలవారు ఎత్తించిరి కొల్వుగుడార్లు
నందుల గుడార్లు నవనందుల గుడార్లు
నంధుల గుడార్లకింద ముత్యాల పందిరి

ముత్యాల పందిరికింద దేవేంద్రఅరుగు
దేవేంద్రఅరుగుక్రింద దివ్యరత్నాల
తముకము
దివ్యరత్నాల తముకమీద కొలువాయె
నారాజఘనుడు
పరమేశ్వరునికి పట్టేటి పంచవన్నెల
బిరుదులు
పంచవన్నెల బిరుదులు పాటించినాడు

కృష్ణమ్మకు పట్టేటి డెబ్భయేడు
బిరుదులు పట్టించినాడు
దాపట తిరుమందులు వలవట వల్లవులు
భట్లు పొగడంగ బ్రాహ్మలు దీవింప
ఝొట్టీలు తమలోను సాములు
సేయంగ
రంభయు నాట్యంబు లాడుచుండగను
అంకెపదేవారి ఆటలు చూచుచు
మారాచ గంగురాజు మరివేగ వచ్చెను

## కల్యాణము గంగురాజు పెద్దిరాజును చూడవచ్చుట

వాడుగో గంగురాజు వచ్చెనంటేను
ఎదురుగా పెద్దురాజు వేంచేసినాడు
చెట్టపట్టాల్ పట్టుక చేరి యిద్దరును
కొలువుగుడారులోను కొలువు దీర్చినారు
ముచ్చటలు హాత్రలు ముదమొప్ప
నాడిరి
అప్పుడు మారాచ గంగన్న మరి వేగ
పలికె
మాధవుడు పెద్దురాజుతో మరియు
నిట్లనియె:
"వల్లవులరాజ! మీరు వచ్చిన నాటనుండి
కల్యాణం దేవగిరిపట్నం ఆద్యంతాన
జనులు
కన్నులార నిద్రబోయిరి ఘనుడ
పెద్దరాజు"

ఆమాటకు పెద్దురాజు ఆశ్చర్యమంది
"ఎటువలె నిద్రబోయిరి ఎరిగింపుమన్న
మారాచ గంగన్న మరి వేగ పలికె:
"గండభేరుండాలు సారాభిసార
సారాభిసారాలు శార్దూలపక్షులు
మాయరాత్రుళ్లలో మరి కేసరులు వచ్చి
కల్యాణం దేవగిరి పట్నాల యందున్న
ఏనుగుల మాష్టిల ఎత్తుకుపోవు
పిల్లమేతల కెత్తుక పోవుచు నుండె
మీరు వచ్చిన నాటి నుండియు పక్షులు
పట్నానికి రాలేదు పట్టభద్రుండ"
అనుచు భాషించెను ఆ గంగురాజు
కదలి పెద్దిరాజు కల్యాణము వచ్చెను
అంతట గండభేరుండ శార్దూల పక్షులు
ఆకాశవీథిని అవి నిలిచి [illegible]

పెద్దురాజు కట్టిన బిరుదులు చూచి
వీరెవ్వరో ఇపుడు ఎరుగవలె నను
వారి కులగోత్రము వారి నామావళి
తెలియవలెనని వేగ దిగి వచ్చెనపుడు
అంబోధి పెంబోధి అనియేటి పక్షులు
పెద్దురాజు పెంచిన పెంపుడు చిలుకలు
గోముగా పెంచిన గోరువంకలును
పావురాళ్లతో పక్షులు భాషింపదొడగె:
"మీ రాజుల గోత్రావళి మీ రాజుల
వంశావళి
మీ రాజుల నామావళి మిగులంగ
మాతో
చెప్పు"మని పక్షులు చెంగి అడుగంగ
ఆ మాటలను విని అప్పుడు చిలుకలు
గోరువంకలు పావురాలు గొబ్బున
పలికె:

"హరినారాయణ వంశము
ఆదినారాయణ బిరుదులు
పాలవెల్లి గోత్రము బసువశంకర
బిరుదు
శరణంటె కాచును శరణార్థులాను
ఎదురుతిరిగిన వారి వెనుదగిలి
నరుకును
శరణాగత బిరుదు మారాజు
చెల్లించుచున్నాడు"
ఆ మాటలు విని అబ్బురపడుచు
గండభేరుండాల: గ్రక్కున పలికె
"(మీ రాజు) శరణాగత బిరుదెప్పుడు
చెల్లించుకొనెను
ఏ విధముగ గలిగెనో ఎరిగించు"మనిన
అనిన రామచిలుకలు అతివేగ పలికె:

## గోవర్ధనగిరి చాటువ

"ద్వాపరమున కృష్ణునితల్లి యశోద
వేగమే దేవేంద్రునికి యజ్ఞము గావించె
దేవేంద్రునికి పాలవెల్లి కట్టించినాది
నారదబ్రహ్మ వచ్చి సయముగా
నపుడు
కూరిమి తోడుత కృష్ణతో పలికె

మీ తల్లి ఇంద్రునకు మేలిమిగాను
ప్రీతితో పాలవెల్లి పెంపుగా కట్టించె
ఓ స్వామి లోకాలకు కర్తవు నీవనిన
ఆ మాట విని కృష్ణుడు
అమ్మసముఖానకు
వేవేగముగ వచ్చి ఇట్లని పలికె

ఏమి విచిత్రము గావించితివి నీవు
పశువులను ఇంద్రుడు పాలించి
దయతో
కోడెలను పెయ్యలను కూర్మి కాపాడునని
పాలవెల్లి గట్టిస్తి పరమాత్మ యనిన
ఇలవేల్పునై నేను ఇంట వుండగను
తక్కిన వేల్పుల గొలువ ధర్మమటె
తల్లి
పాలవెల్లిని గోప బాలకులచేత
కొల్లలాడించెను కృష్ణమ్మ తాను
నారదబ్రహ్మ యిది నాణెముగ జూచి
దేవేంద్రునితో నపుడు తెలియ
నిట్లనియె
నీపేరు జెప్పియు నిఖిలంబులోను
యశోద ఒక పాలవెల్లి గావించె
కొల్లలాడించెను కృష్ణుడు కినిసి
అని నారదుడు చెప్ప అలిగి
ఇంద్రుండు
ఆ వేళ కురిపించె ఆవులమీద
రాగిడించి ఘోరముగ రాళ్ళసిడుగుల
వాన
ఆ వానకు ఓర్వలేక అఖిల జనులంత
పరమాత్ముని మరుగుకు పరగ
పోదామనుచు

ఎనభై నాలుగు లక్షల జీవరాసులు
వేగంబె వచ్చి
కావవే గరుడవాహన ! కావవే
గజేంద్రవరద
కావవే వైకుంఠవాస ! కపటనాటక
సూత్రధారి !
కావవే కౌసల్యాగర్భ రత్నాంకుర !
కావవే దేవకీనందన ! కావవే
పద్మనాభ !
కావవే వటపత్రశయన ! కావవే
క్షీరాబ్ధిశయన !
శరణు శరణు వో స్వామి ! మీ
శరణు జొచ్చితిమి
శరణంటె కాచేవు శ్రీకృష్ణస్వామి !
కినుకతో తన వేళ్ళ పెళ్ళగించెను
కొండ
గోవర్ధనగిరి కొండ గొడుగుగా పట్టెను
ఎనభై నాలుగు లక్షల జీవరాసులును
ఆ కొండక్రింద దాగె ఓ పక్షులార !
పరమేశ్వరునికి చెల్లేటి పంచవన్నెల
బిరుదులు
ద్వాపరయుగమున మా రాజు
చెల్లించుకున్నాడు
ఓ గండభేరుండ పక్షులార !''

## పెద్దిరాజు గండభేరుండములను అదుపులో పెట్టుట

ఆ వార్తలకు పక్షు లిట్లని పలికె :
"వినరె రామచిలుకలార వివరంబు
గాను
(మేము) ఒక్కొక్క ఈకెకు
కుప్పెడు రక్తము ఇస్తాము
అలరంగ మీరాజును గండభేరుండాల
యోగశాల
గాజుకంబాలు వేసి కట్టించు మనుడి
గండభేరుండాల యోగశాలలోను
కొలువు దీర్చి మీరాజును
కూర్చుండమనుడి
ఎన్నాళ్ళు మీ రాజు ఈభూమి నున్న
అన్నాళ్ళు మేమిందు చరించేది లేదు"
అని చెప్పి శరభ శార్దూల పక్షులు
అంబర వీథులకు అవి ఎగసిపోయె
రామచిలుక లా వార్తలు రాజుకు
చెప్పెను
కలకల నవ్వుచు ఘనుడు పెద్దిరాజు
గాజుకంబాలు తెప్పించి గండభేరుండ
యోగశాల సపుడు కట్టించినాడు
కృష్ణసంతతి రాజు తెల్లవారంగ
ప్రొద్దుగూకగ మమ్ము తలుస్తున్నాడు
అంబరవీథుల పక్షులు అధిక
సంతోషమున
పాలసముద్రమున కొచ్చె పక్షు
లప్పుడును
అప్పుడు పెద్దరాజు అతి వేడ్కతోను
గండభేరుండాల యోగశాలలోను
చక్కగ నేలను చదురు చేయుమనెను
రాజులు మంత్రులు రమణ తోడుతను
నడివీథి నిలిచిరి నాయకులు భటులు
ఘనుడు పెద్దరాజు గాంభీర్యమునను
కొమరవాగంబుతో కొలువు కూర్చుండె
మారాచవారి పరిచారకు లంత
పెద్దరాజు కొలువుకు ఏతెంచి చూచిరి
గంగురాజు కొలువుకు పోయి గ్రక్కున
విన్నవించిరి :
"రాజాధిరాజ ! ఓ రాజదేవేంద్ర !
రాజ పరమేశ్వర ! రాజశేఖరుడ !
రాజ కంఠీరవ ! రాజ మార్తాండ
రాజ తేజోనిధి ! రాజాధిరాజ !
మారాచ గంగురాజ ! మా మనవి
వినుమ
వంరాజుసుతుడు వంశవర్ధనుడు
పెద్దరాజు అను పేరి భీమబలుండు
నిత్యసత్యకీర్తి నిలిచియున్నాడు"
అని విన్నవించిన మారాచ గంగన్న
ఏరువ రాజును చూడ ఏతెంచె నపుడు

ఆతని బంధువులును ఆత్మవర్గముతో
చతురంగ బలములు చేరి కొలవంగ
హెచ్చుగా పరాకులు హెచ్చరిక సేయ
పచ్చబద్దలవారు బరాబరులు సేయ
భేరీమృదంగములు బిరుదు

వాయిద్యములు

ఆరూఢిగా మ్రోప అవని కంపింప
భూరివిక్రమశాలి భుజబల భీము
పొగడగా పట్నము భోరున వెడలె
పెద్దభూపతి కొలువుకు పెంపుగా వచ్చె
ఆలింగనము చేసి అంత కొలువాయె
కనకవస్త్రాలును కట్నాలు ఇచ్చె
గంధము కస్తూరి కలిపి గిన్నెలను
పెద్దన్న పురమున పెంపుగా నపుడు
అగరు శ్రీగంధము అలదిరి పైని
తబుకులు తాంబూలములు తశిరీబు

లిచ్చి

"విను పెద్దరాజ! ఓ విభవదేవేంద్ర!
మా మనవి వినవయ్య మండలాధీశ!
నేనేలు రాజ్యము నీ వేలుమనెను
అన్నదమ్ములము మన మలర

ఇద్దరము

భ్రమతగా ఇద్దరము కూర్మి నుందాము
దెస బల్మిగా చాల తేజరిల్లెదము
అన్నదమ్ముల మారుగా

అనుభవింతాము

ఫలమేమి గలిగిన పంచుక భోంచేసి
పగవారిని సాధించి పట్నమేలుదాము
కల్యాణపురము నీది కవులావులు నావి
కోటలున్నవి ఏలు గొబ్బున నీవు
గొబ్బున కల్యాణముకు

కదలిరమ్మ"నెను

## పెద్దిరాజు కల్యాణ నగరమున నిలచి పోవుట

వెడ్కతో కల్యాణముకు వేంచేసినారు
వకవాడ జనులను వరుస రప్పించి
కవిజనుల పురోహితుల కాపుకరణాల
పేదబీదల ఇండ్లు వెళ్ళిపొమ్మనెను
అప్పుడు మొరలిడిరి అందరు జనులు

వొచ్చిరందరు ఓం లింగ నమశ్శివాయ

యనుచు

తాతతండ్రుల తరము తర్లక వుంటిమి
భూతలమున తమ తరము పొలుపుగా

వచె

కట్టిన గ్రామములు కాంతసోమప్ప
విడువ లేమని ప్రజలు విలపింప
సాగిరి
అంపరు జనులును అలమట పడగ
ప్రజలను జూచెను పశుపతిరాజు
"ఇది ఏమి చోద్యము ఏమి గంగన్న!
మాకు గృహములు కావలెనని మరి
వేగమునను
వీరిని పొమ్మంటివి పసుధేశ్వరుండ!
తీర్థయాత్ర వచ్చినవారికి స్థిరమైన
గృహములు వలదు
వారి యిండ్లకు వారిని వెళ్ళనంపించు."
గంగన్న పెద్దురాజు కదలి నగరునకు
మాధవుడు పెద్దురాజు మారాచవారి
నగర
పాలును నేతులు పరగ పణ్ణములు
మేలైన పెరుగును మీగడలు జున్ను
చారు బచ్చలికూర గోవుల చల్ల
ప్రియమైన పేరుగల పిండివంటలును
నయముతో మంచి రాజనాల
అన్నములు
పచ్చళ్ళు పప్పును పానకంబులును
అచ్చాపుల వెన్న కజ్జములు మొదలు
మారాచ పుద్దమ్మ మరియు వడ్డించె
పరమాన్న మెలమితో బంతి భోంచేసి
కల్యాణము తర్లి గుడార్లకు వచ్చె
గరుడ టెక్కెములు గండభేరుండ
బిరుదులు
పరుసగా బట్టిరి వన్నె టెక్కెములు
హనుమంతు బిరుదులు
జగజంపు ఝల్లు టెక్కెములు
గంగన్న ఇరుగడల గ్రక్కున పట్టించె
ఈ విధమున పెద్దన్న వేంచేసి రాగ
మంగళం బలికె శుభమంగళం బనుచు
అంగనలు ముత్యాల హారతులు ఇవ్వ
గండభేరుండ యోగశాలకు గ్రక్కున
వచ్చి
కొలువు గూర్చుండిరి గొబ్బున నంత
అప్పుడు పెద్దురాజు అతివేడ్కతోను
మారాచ గంగురాజుతో మరియు
నిట్లనియె:

## పెద్దిరాజు కనకరేపల్లె కట్టించుట

"మించిన ఎలమంచి మిగుల దక్షిణాన
అంచితముగ ఏలినారు
అమరావతిపట్నము
పెద్దలు ఏలినారు పెద్దగవిశి పట్నము
పిన్నలు ఏలినారు పినగవిశి పట్నము
తాతలు ఏలినారు ద్వారకాపురి పట్నము.

మతి మంతు లెంచంగ మంచి సజ్జనులు
దిక్కుల తన కీర్తి జనులు ఎంచంగ
కల్యాణానకు తూర్పున కనక రేపల్లె
దినకరుని పేరిట దివ్యరేపల్లె
కట్టించు''మని పెద్దిరాజు ఘనుడు తా
బలికె
కట్టించె గంగన్న ఘనత మీరంగ
తూర్పున వక మేడ సూర్యుని కెదురు
పడమట వక మేడ బాలచంద్రుని
కెదురు
దక్షిణాన వక మేడ ధనకోట కెదురు
ఉత్తరాన వక మేడ కాశివిశ్వానాథున
కెదురు
నాలుగు మేడల నడుమ నందుల
దివాణము
మరవని పందిళ్లు మరి గజ్జమేడలు
వంటింటి కూటాలు వరస మిద్దెటిండ్లు
వంటించి కట్టినారు మద్దికాయల చవికె
మద్దికాయల చవికెలో మన్నీడు
కొలువాయె
కల్యాణ పురిలోను ఆ గరిడిలోను
మన్నీల గెలిచిన మహా బిరుదురాజు
పందాన గుండెత్తి పల్లదామడేడి
జగత్ప్రతాపుని బట్టి జయభేరి
మ్రోయించి
వీరకేతుని బట్టి వీపు రాలించి
మేటైన బిరుదులు చెల్లించుకొన్నాడు

గరిడీ సాధనబంటు గంగు రాఘవన్న
గంగు రాఘవునితోడి సంగడీడు
ముద్దమ్మ రాఘవుడు
ముద్దమ్మ రాఘవునితో సంగడీడు !
కల్యాణ యోగధీరుడు కాటమరాజు
శంభుని వరమున పుట్టిన చెన్న
సోమలింగము
వినుతి కెక్కిన కాటమ విక్రమశీలి
గరిడి సాధన చేయుచు ఘనుడు
తావుండె
కల్యాణపు గంగన్న ఘనుగు
పెద్దురాజు
మందన కుంభిళ్ళకు దండు మరి వేగ
తరలె
గంగరావుల బయట గంగన్న
అందలము దిగెను
''ద్వారావతీపుర దక్షిణ కేశిరాయ !
జంగభూపతివైరి ! సంగ్రామలింగమా !
గండభేరుండాల గజ వేటగాడ !
మన్నెసింహాల వైరి ! మన్నీడ
పెద్దురాజ !
సంతానముకొరకు సరివారి నెడబాసి
వస్తివి
సంతానము కలిగెను సరివారి
గలియబోవన్న
బాలల కొరకునై బంధువుల నెడబాసి
వొస్తివి

బాలలు గలిగిరి బంధువుల కలియ
పోవన్న
పుత్రుల కొరకునై భూము లెడబాసి
వాస్తివి

పుత్రులు గలిగిరి భూములకు
మళ్ళిపోవన్న'
ఆమాటలకు పెద్దరాజు అక్కున సవ్వి

## పెద్దిరాజు గంగురాజువెంట విజయ యాత్రలకు వెడలుట

''వినవోయి గంగన్న ! విశదంబుగాను
సరియైన రాజుతో జగడంబు గలుగ
కదలి పోకుండగ ఘనుడైన రాజు
పట్నాన వుండేది పంతంబు గాదు
నీ కార్యఖడ్గము నే చూడవలెను
నీ వడిగలతనము నీ పరాక్రమము
నే చూడవలె గాన నేను నీవెంట
మదనకుంభిళ్ళకు కదలి వచ్చేను''
ఆ మాటకు గంగురాజు అపు
డిట్లగనియె :
కల్యాణ పురమున గట్టించినారు
కట్టించినారు శంఖుచక్రాల గరిడి
ముగ్గురు (మతిదేవిరాజులు)
కట్టించినారు ముత్యాల గరిడి
ఘనుడు కాటమరాజు గరిడిలో
సాధనము చేయుచున్నాడు
ఏనూరు కటారి కోలలు ఏనూరు
మున్నూరు కటారికోలలు మున్నూరు
కోరణ్ణ

కోరణ్ణ ధట్టిరాజు కటారి
బలియిస్తున్నాడు
కటార్న ధట్టిరాజు కోరుడుకు
బలియిస్తున్నాడు
పురువడి వచ్చి వుక్కు స్తంభం
అక్కున గుద్దుచున్నాడు
పురువడి వచ్చి రాజు బంగారు స్తంభం
నలియ బెనుగుచున్నాడు
రాగి స్తంభాన రాజు రాగడిల్లుచున్నాడు
వినప స్తంభాన పెనిగి రాజు వెనకకు
లఘువు వేయుచు
వుక్కు స్తంభాన రాజు వురవడి
పెనుగు
ఏదుము రాళ్ళ గోతము ఎత్తి
యాడుచును
ముత్తూము రాళ్ళ గోత్రము ముంచేత
జిమ్ము
పందూము రాళ్ళ గోతము పట్టి
యాడుచును

పన్నిద్దరు రాజుల గూడి భారతము
చదువును
పన్నిద్దరు జెట్టీల గూడి పడితాళం
జట్టు
వీరులు శూరులు విరాటపట్నం రాజులు
కనుము గంగురాజు కల భీమరాజు
కోటి గోపాలకులు కూర్మి పట్నాం
రాజులు
గురువుపట్నాల రాజులు లింగపట్నాల
రాజులు
చోడపట్నాల రాజులు వీర
గంగన్న శూరులు
మొదలైన రాజులు ముదము
తోడుతను
గంగువారి గరిడిలో ఘనుడు
కాటమరాజు
సంగ్రామ విజయుండు సాము
చేయుచునుండె
(అపుడు) పెద్దరాజు కొమారుణ్ణి
పేర్కొని పిలిచె
గంగువారి గరిడిలోని కాటమరాజు
తండ్రికొలువుకు వచ్చి దండంబు
పెట్టెను
ఎదురువచ్చి కొమారుణ్ణి ఎత్తుకొని
దించెను
చెక్కిలి ముద్దాడి చేరి చల్లాడి
తొడలపై కొమారుణ్ణి కూర్చుండ
నుంచుక

"వినవోయి కొమారా!
విన్నవించెదను
కల్యాణపు గంగురాజు
కదలిపోతున్నాడు
మదనకుంభిళ్ళమీదికి
కదలిపోతున్నాడు
నేను గంగన్నకూడి దండు
పోతున్నాను
మదనకుంభిళ్ళ మీదికి దండు
పోతున్నాను
మదనకుంభిళ్ళ మీద యుద్ధము చేసి
చెలువుగా యుద్ధము చేసి చెల్లితినైన
రేయెల్ల కొమార పగులు గావలెను
పగులెల్ల కొమార రెయ్య గావలెను
పట్టపగులె కొమార నక్షత్ర మండలము
కానరావలెను
నెలతప్పి పొడవ వలెను నేలతిమురు
పుట్టవలెను
కాంతిగల చంద్రుండు కళలు
తప్పవలెను
నీ నగుర్వున వుండేది వుత్తర
జంఝుము
పెనుబాముల వలె నీ అత్తరను
పెనుగాడవలెను
నీచేత నుండేటి
పిల్లల కొరుడు కటారికోల
ముదమొప్ప మూడు చేతులు దరి
తప్పవలెను

గంగువారి గరిడి ఎఱ్ఱ కాపురు చెల్లెననుకో
కప్పపవెను చక్కని కొమక ! కోటిసంపద
నీవు పూజ చేసేటి గరిడి బేతాళునికి గోకులము వుప్పది
ఒక కంట పుదకంబు ఒక కంట బాలబుద్ధుల మాని బంధువుల పోషించు
రక్తము కారపవెను మరి వేగ పంపాద్రి మళ్ళిపో
నీకు చేయించిన కొరకట్లు చేదై కొమార !''
వుండెనా అని చెప్పి గరిడికి వెళ్ళ సంపించినాడు
మదనకుంభిళ్ళమీద మా అయ్య

## కనకదుందుముల కోట గెలుపు

గంగన్న పెద్దురాజు కదలిరి వేగ
మదనకుంభిళ్ళ మీదికి మరి వేగ
తర్లిరి
కనకదుందుముల కోటకు కదలి
వచ్చినారు
మూడు నెలలు పదిహేను దినములు
ముట్టడి వేసినారు
అంతట ఆ కోట కోల్పోక వుండెను
రక్కసులు దానవులు ఆ కోటకు
కావిలి
కొమ్మ కొమ్మ కొత్తళాన కోటివేల
దానవులు కావిలి
ఎందునా ఆ కోట స్వాధీనము
కాకుండాను
యాదవులు కొలిచేటి అష్టమా దుర్గ
తిరుమందులు కొలిచేటి తిన్నెవేల్పు
గంగ
ఆవుల వల్లమ్మ కొలిచిన ఆదిమాశక్తి
ఆరాత్రి పెద్దురాజు కలయందు వచ్చి
"ద్వారావతి సింహరాయ !
దక్షకేశిరాయ !
జంబూపతుల వైరి ! సంగ్రామ
లింగమా !
గండభేరుండాల గబవేటగాడ !
ఇట్ల నీకీకోట సాధ్యంబు కాదు
కోట చుట్టూవున్న కొరివి దయ్యాలు
మంకు భూతాలు గర్భరాక్షసులు
దుష్టభుతాలు కొరివిదయ్యాలు
ఈ కోటకు కావిలి వల్లవులరాజ
భూతాలతో కోట భూతళించున్నది
గచ్చ కోరిందలు కలబెరిగి యున్నవి
ఇందుకు వుపాయము యాదవరాజ !
కుంభాలు పోయించు కులదీపఘనుడ
వాలారుగోళ్ల కిన్నెర వాయించి నేను

దానవుల కుంభాలకు దెత్తు
ధనుము కొండ రాజ !
కుంభాలు ఆరగించి దానవులు కూడి
సొమ్మ బట్టును
మత్తులై దానవులు మరచి నిద్రపోగ
బంటుకు వకజంఝము పరగ
కాల్చుకొని
దానవు లన్నింటిని పుడియ
కాల్పించు"
కలజెప్పి ఆ గంగ కడకు పైదొలిగె
కలగని పెద్దరాజు గ్రక్కున లెగచె
పనులవారిని బిలిచి పంపె నా రాజు
"ఓ పనులవార ! వేగమే మీరు
వరికూటి కుంభాలు వాముల పొడుగున
కొర్రకూటి కుంభాలు కొండం
పొడుగున
జొన్నకూటి కుంభాలు చొప్పవాముల
పొడుగు
నంజుడు వండించి నడిరాసులమీద
పెయ్యండి"
కుంభాలు వండించె కులదీపఘనుడు
పదహారు మెట్ల కిన్నెర వాయించె గంగ
కలకల నవ్వుచు కిలకిల వచ్చెను
దానవుల కుంభాంతు దెచ్చె దైత్య
సంహారి
ఆరగించి దానవులు కూటిసొక్కు బట్టి
మత్తుచేత దానవులు మరచి నిద్రపోగ

బంటుకు వక జంఝము పెట్టించె
రాజు
దానవుల నన్నిటిని పంపి కాల్చు
మనెను
దక్షిణ కొత్తళాన దామసాని వారెక్కిరి
పడమటి కొత్తళాన మారాచగంగన్న
ఎక్కెను
తూరుపు కొత్తళాన కోటి గోపాలకు
లెక్కిరి
వుత్తరా కొత్తళాన వుర్వీశుడు పెద్ద
రాజు ఎక్కెను
కొరివి పొట్టిభూతాలు కొండలు పట్టెను
దివిటీలు కాల్చిన దిక్కులు తెలియక
అరుచుచు భూతాలు అడవులు పట్టెను
కోట లగ్గలకెక్కి కొల్లబుచ్చినారు
కోటలో రాజుల గొంతుకలు కోసిరి
చితచితగా శిరస్సులు నరికిరి
ముక్కులు చెక్కులుగాను ముఖాల
కోసిరి
బారిగొర్ల రీతిని బలముల నరికిరి
కనకదుందుముల కోట కాలి ధూళి
బుచ్చినారు
గొడుగులకింది రాజుల గొంతుకలు
కోసిరి
చలపట్టి రాజుల తలలు ఖండించిరి
ఎదరించిన రాజుల ఇలమీద కూల్చిరి
పోరాడిన రాజుల పొట్టలు చించిరి

రాయగుడార్లు చొచ్చి రాజుల
తెగటార్చిరి
మన్నెగుదార్లు చొచ్చి మన్నీల నరికిరి
గుర్రాల నరికిరి గుట్టలుగాను
ఏనుగల నరికిరి యుద్ధరంగమున
తనంతేసి రాజుల శిరస్సులు ఖండించి
మారాచగంగన్న గొడుగుకొమ్ముల
కట్టించినాడు
తనంతేసి రాజుల శిరస్సులు ఖండించి
వల్లవుల పెద్దన్న గుర్రపు అంకెల
కట్టించినాడు
కలుభూత గంగురాజును బట్టి కల్లు
గానుగ లాడించినారు
కనకదుందుముల కోటలో కాలభైరవుని
కావలి వుంచినాడు
కల్యాణము దేవగిరి రాజులు
కదలివచ్చినారు
కల్యాణపు రాకొమార్తెలు కడు
వేడ్కతోను
ఉప్పులిగె మేడలెక్కి రాజులు పచ్చే
ఉన్నతములు చూస్తూ వున్నారు
పగరాజుల శిరస్సులు మీదుగా వచ్చెను
మారాచ గంగన్న కిందుగా వచ్చెను
పగరాజుల శిరస్సులు కిందుగా వచ్చెను
వల్లవుల పెద్దురాజు మీదుగా వచ్చెను
కల్యాణాన వున్న గంధర్వస్త్రీలు
తెచ్చిరి నివాళి తేజముగ రాజులకు

పట్టవచ్చి నివ్వాళి భామలు చూచిరి
గొడుగుకొమ్మల శిరస్సులు గురుతులు
చూచి
గుర్రపు అంకెల శిరస్సులు కొమ్మ
లందరు చూచి
తలలు పంచుకొనిరి తరుణ లందరును
కీర్తి అపకీర్తి ఎరుగని రాజుకు
ఏలపట్టవలెను ?
అరపయ్యారు పళ్ళాల నివ్వాళి
పెద్దన్నకు తెచ్చిరి
అప్పుడు పెద్దురాజు అందరిని చూచి
"మాకన్న పెద్దవాడు మారాచ
గంగన్న
అక్కడ పట్టుడీ అందరు పోయి"
పట్టుమన్న మాటలకు భామలు నవ్విరి
"మాకు సంతానము లిచ్చినాడు
కాంతసోమప్ప
సోమప్పకు నివ్వాళి సొంపుతోపట్టు"
మనెను
మారాచ గంగురాజు ఆ మాటలు వినెను
చిన్నబోయెను రాజు చిత్తంబులోను
మాట్లాడక గంగురాజు తన మందిరము
కరిగె
వల్లవుల పెద్దురాజు వడి నవ్వి పలికె
వేగితెల్లవార తెలియ గుడారు
లెత్తించినాడు
ఢమఢమా రణభేరి తముకు చాటించె

కంచు రణభేరి వేయించి కదిలె
పెద్దరాజు
పుష్కలముగా కదిలె పృథ్వీశ్వరుండు
పన్నె లక్షగుర్రాలు పరుస
అందలాలవారు
దాపట కొలిచేటి దండనాయకులు
పలపల గొలిచేటి వాలు మన్నీలు
సామంతవర్గము రాజును చేరి
కొలుపంగ

అందరు రాజులు అశ్వాల నెక్కిరి
కొందరు రాజులు గోడిగల నెక్కిరి
పల్లకీ లెక్కిరి బలువు మన్నీలు
తురగాల నెక్కిరి దుష్ట గోపకులు
మేలిమి ప్రజాలు కెళ్లించినట్లు
కులముపగ కాదు గోత్రముపగ కాదు
దాయాదిపగ కాదు తనపగ కాదు
మూరాచ పగలకు మరి దండు కదిలె

## ఏడు కుంభిణుల గెలుపు

వీరకుంభిణికి దండు ఎత్తించె నపుడు
వీరకుంభిణి మీద యుద్ధంబు చేసె
వీరకుంభిణి ఏలేటి కృతాంగవీరుని
బట్టి
వీపుచర్మము వొలిపించె రాజు
వీరతమ్మటములు మ్రోయించినారు
గోపకుమాళ్ళచేత ఆ కోట
కొల్లబెట్టించినాడు
వీరమహాంకాళి అనే దేవతను కావిలి
వుంచినాడు
వీరకుంభిణినుంచి రాజు విజయకుంభిణి
వచ్చినాడు
వీరతమటము తమకు వేయించినాడు
విజయకుంభిణి పొడిపించి వీథు
లేర్పరచె

విజయకుంభిణి ఏలేటి వీరకేతువుని
వీపుచర్మము వొలిపించినాడు
కంచుభేరి మ్రోయించినాడు ఘనుడు
పెద్దరాజు
కనివేన రణభేరి తమకు వేయించి
కంచుకుంభిణికి రాజు గ్రక్కున
వచ్చెను
కంచుకుంభిణి పొడిపించి గోరలాడించె
కంచుకుంభిణి ఏలేటి కాలకేతుపరాజును
బట్టి
కదలకుండ కత్తుల బోనులో
వేయించినాడు
కనకము గోపకుమాళ్లచేత
కొల్లబెట్టించినాడు
కనకదుర్గ నక్కడ కావిలి వుంచినాడు

కంచుకుంభిణి రాజు గజకుంభిణికి వచ్చె
గజకుంభిణి ఏలేటి గాయ గోపాలరాజును బట్టి
కదలకుండ కావుపాతళ్ల వేయించినాడు
గజదేవతను అచ్చట కావలి వుంచినాడు
గజకుంభిణి రాజు రాయకుంభిణికి వచ్చె
రాయకుంభిణి ఏలేటి రాజశేఖరుని బట్టి
రవ్వగాలల వేయించె రాజు పెద్దన్న
రాయకుంభిణివాడు రత్నకుంభిణికి వచ్చె
రత్నకుంభిణి ఏలేటి ఏగురు రాజుల బట్టి
విసురుగాలాల వేయించె వుగ్రకోపమున
రత్నములు కొల్లబెట్టించినాడు రాజు పెద్దన్న
కొల్లాపురిదేవతను కావిలి వుంచినాడు
రత్నకుంభిణివాడు కుంతలం వచ్చెను
కుంతలం బొడిచి సామంతుల మేల్కొల్పినాడు
సామంతలం పొడిచి వేయించినాడు
కొర్లమీద పీనుగుల దించుక పోకుండ ఎగసి పోకుండ
కొర్లపెంట అనే దేవతను కావలి వుంచినాడు
సామంతలమువాడు వేగ దాంతవాళి ధిగు దాంతవాళి
ఏడు త్రిపురపురములు ఏడు శివ నాటకములు
ఏడు వల్లకాపురములు ఏడు గుజ్జునాటకములు
జంగప్రతాపుని కోట లింగప్రతాపుని కోట
నారధుళి బిరాధుళి బెండు బెండపురిపట్నము
కోడికుక్కురాజ్యము కకభూర్లక
మత్స్యలోక సర్పలోక సప్త ఏడు
కాండాలమీదను మన్నీడు పెద్దరాజు
సూర్య సోమ వీథులు ఏర్పరచినాడు
వీర శూరులతోడ వాదించినాడు
కల్లుభోతు గంగురాజుమీద కదిసి యుద్ధము చేసెను
కలుబోధి గంగురాజు కల్లుగానుగ లాడించినాడు
కోటలు గోపకుమాళ్ళచేత కొల్లలాడించినాడు

## పెద్దిరాజు సన్న్యాసుల కోటను ధ్వంసము చేయుట

చెలగి సన్నాసులకోటకు చయ్యన
కదిలెను
చతురంగ బలములు సేనల జూసి
కోటలు విడిచి గోడు గుడుచుచును
పట్నము విడిచి పారిపోయిరి
ప్రాణాలకొరకు
కారుణ్యమున పెద్దన్న కాల్చె బాణాలు
కాల్చిన బాణాలు కారణార్థమున
సన్నాసుల మఠములో చయ్యన బడెను
కార్చిచ్చు అనే బాణము గ్రక్కునవచ్చి
మఠములోపల బడి మండెను మంట
శిశువులు బాలలు శ్రీకాంత లంత
కటకటా సన్నాసులు కాలుచు బలికిరి

## సన్న్యాసులు పెద్దిరాజును శపించుట

''హరహరా ! పెద్దన్న !
హత్యకట్టుకొంటివి
(నీకు) సరియైన రాజుతో జగడము
చేయవలెను
ఈడైన రాజుతో యుద్ధము
చేయవలెను
(నీకు) జోడైన రాజుతో
జుమజుమాకవలెను
దిసదినము తిరుగుదుము దిగంచలము
మేము
ఊరూరి భిక్షము గుళ్లోది నిద్ర
యోగులము భోగులము
యతీశ్వరులము మేము
మఠము సొదబెట్టితివి మన్నీడ నీవు
మఠము సొదబెట్టిన మాత్మ్క లెవరోయి
మఠము సొదబెట్టిన మన్నీడు గర్భాన
అబ్బరపు కొడుకైన ఆడబడుచైన
(మాకుమల్లె) సన్నాసు
లవుదు''రని శపియించినారు
ఆ శాపమే పెద్దన్నకు అంటులై
తాకెను.
అప్పుడు పురజనులు అందరువచ్చి
సన్నాసుల మఠమని చెప్పిరి రాజుకు
అది విని పెద్దరాజు ఆ తావు తర్లెను
భదిరి విదర్భరాజు మీదికి
దండెత్తినాడు
విదర్భరాజుమీద విద్ధము
చేస్తూవున్నాడు

కుంభిణి రాజులను కూలంగ నరికి
కోటలో రాజుల గొంతులు కోసి
కరివేము నరికించి స్తంభ మెత్తించి
స్తంభాన మీసరగండమే తూము
తవ్వించి
తూమున తూమెడు జంఝూలు తూల
పోట్లాడెను
తూమున జంఝూలు కొలబట్టించినాడు
భట్టు జంఝము కాకుండ బ్రాహ్మని
జంఝము కాకుండ
తాను తెచ్చిన రాజుల జంఝూలు
కొలబట్టించినాడు
కోటి యని జంఝూల కొలవంగ
బోతే
కోటికి వక జంఝము కొదువై
యుండెను
జంఝము కొదువై నప్పుడే
స్వర్గలోకము కొదువన్నాడు
స్వర్గలోకము కొదువై నప్పుడే
పౌరుషమందు కొదువన్నాడు

స్తంభాన నిలిచిన గోపకుమాళ్ళ
కదలి పొమ్మనెను
"గోవుల కొండయ్య, గోవుదార మల్లు
బత్తుల వీరన్న, భగీరథుని వెంగళు
పెయ్యావుల రామన్న, భాండారు
రాగన్న
జన్నావుల మాధవుడు,జంప లక్ష్మన్న
భట్టులు బ్రాహ్మలు పయనమై
పొమ్మ"నెను
స్తంభాన గోపికొమాళ్ళు కదలి
వచ్చినారు
ధూపదీప నైవేద్యములు తుష్టిగా
బెట్టి
అర్చించి స్తంభమును అవనిపై నిలిపి
పూజించిరి స్తంభమును పురోహితు
లంత
కుడిచెయ్యి లోనుగా వలయంబు తిరిగి
దారబోసి అందరూ వందనం చేయగా
భళభళ వురిమి దక్షిణ కాంబోధి
దక్షిణ కాంబోధి ధరణిమీద వారిగె

## వాలి కేతువరాజు వంశచరిత్ర

దక్షిణకాంబోధి ఏలినవాడు వాలి
వాలికొమారుడు అంగదుడు
అంగదుని కొమారుడు నిశ్శంకరుడు
నిశ్శంకరుని కొమారుడు
ఉమామహేశుడు

ఉమామహేశుని కొమారుడు
సహస్రపతిరాజు
ఆరు శిరస్సులు పన్నెండు హస్తాలు
గలవాడు

హస్తపతిరాజు కొమారుడు
బాలి కేతుపరాజు
మూడు శిరసులు ఆరు హస్తములు
గలవాడు వాలి కేతువరాజు
వాలి కేతుపరాజు జంఝుము కోసము
వారుగా వున్నది
కాలయముని వలె జంఝుము కట్టడై
యున్నది
శనేశ్వరుడనే జంఝుము చాలక
యున్నది
ఆ వార్తలు పెద్దలు అందరు చెప్పగా
అళ్లున నవ్వేను ఆప్పు డిట్లనియె
తన రెండు భుజములు తలమించి
పెరిగె

కుడిమీసం ఎగవేసి గుడ్లెర్రజేసి
"పిన్నలార ! పెద్దలార !
పురోహితులార :
నాకన్న పెద్దలార ! నా యన్నలార!
నాకన్న పిన్నలార ! నా తమ్ములార !
వకరి పోటు వకరు మెచ్చనివారు
సూ మన్నీలు
అన్నపోటు తమ్ములు మెచ్చని
మహనీయ సురలార !
తమ్మునిపోటు అన్నలు మెచ్చని
దండి నాయకులార !
నా ప్రతిజ్ఞ చూడుడు
బావమరుదులార !
దిగ్గధీరుల వంటి తిరుమందులార !"

## వాలి కేతువరాజు జంఝుము కాటమరాజు పేరున వచ్చుట

అని పేరుపేరున అందరిని పిలిచి
"ఈ జంఝుము ఎవరిపాల వచ్చెనో
వివరించు మనెను
ఏ అన్నపాల వచ్చెనో ఏ
తమ్మునిపాల వచ్చెనో
ఏ బావపాల వచ్చెనో ఏ మరిదిపాల
వచ్చెనో
ఏ బాలునిపాల వచ్చెనో ఏ బంటుపాల
వచ్చెనో

గంగన్నపాల వచ్చెనో ఘనుడు
పెద్దురాజు పాల వచ్చెనో
ఎవరిపాల వచ్చెనో ఎరిగింపు"మనెను
అనిన ఆ పెద్దలు అష్టదిక్కులను
అర్చించి
ప్రస్తిలు చూచి పరగ నిట్లనిరి :
"ద్వారాపతి సింహాసూ ! దక్షిణ
కేశిరాయ !

కుంభిణి మానపర్దః ! కులదీప
ఘనుడ !
గండభేరుండాం గజవేటకాడ !
వార్తగల మన్నీడ ! వల్లమ్మసుతుడ !
ఏ అన్నపాల రాలేదు ఏ తమ్మునిపాల
రాలేదు
ఏ బావపాల రాలేదు ఏ బంధునిపాల
రాలేదు
ఏ పాళెగానిపాం రాలేదు ఏ బంటుపాల
రాలేదు
గంగన్నపాల రాలేదు ఘనుడ
నీపాల రాలేదు
ఈ జంఝుమువార్త ఇల ఎల్ల
ఎరుగంగ
ఎంచంగ పెంచంగ ఏడేళ్ళ రాజు
కాటమరాజు పాలపచ్చె ఘనుడ
పెద్దురాజ !"
ఆ వార్త విని రాజు అళ్లున నవ్వె
"పిన్నలార ! పెద్దలార !
పురోహితులార !
నాకన్న ఘనులార ! నా అన్నలార !
ఎన్నంగ నా కొమారుడు ఏడేండ్ల
రాజు
నొసలు మీటితే వస గారును
చెక్కిలి మీటితే పాలు గారెను
కాటమారాజు పాల వచ్చెనని
ఘనులార పల్కితిరి

ఏడేండ్ల రాజును జగడాన కంపి
ఎల దూడిపాన్పున ఎటువలె పవళింతు
మల్లెల పాన్పున మనసెట్లు పొందు
ఏడేండ్ల కొమారుని జగడాన కంపి
ధరమీద బాంధవులార వీలాగున
ధరించి వుందు
ఏడేండ్ల కొమారుని పాల రః
జంఝుము ఎటువలె వచ్చెనుః"
కుడిమీసము దిద్ది గుడ్లెర్ర జేసి
"ఎట్టైనా లెస్స యుద్ధానకు కదులు"
మనెను
అని యిట్లు పెద్దురాజు ఆడుమాటలకు
విని చెవులవారు జెట్టిబోయినవారు
పెయ్యావులవారు పశుపతివారు
దండిబోయినవారు దామసానివారు
పుల్లావులవారు భూమడివారు
ఇంద్రునివారు కుభేంద్రునివారు
లక్షకంపటము వచ్చి రాజుకు
మ్రొక్కిరి
"మా మనవి వినవయ్య మండలాధీశ !
ఎవరి పాల వచ్చిన జంఝుము
వారిపాలనే కాని
మరి వకరికి సాధ్యముకాదు మా
మనవి వినుమ
మనము కనకరేపల్లెకు పోయి
ధావన పూదోటకాడ దాడి
గుడార్లెత్తించి

రక్షకుండు కాటమారాజు నంపుదాము
నీ కొమారుని అండలం
వెనుకపట్టించుకోని
మేము ముందర యుద్ధానకు కదలి
పొయ్యేము
నీ కొమారునిది గెల్పు మాది వోడు
అనిపింతుము
గట్టిగా కనకరేపల్లెకు కదలి
పోద"మనిరి
అ వార్తలకు పెద్దురాజు అప్లున
నవ్వెను
బావమరుదుల చూచి పల్కెను రాజు
"ఏరోయి చెపుల గోపాలుడా !
జెట్టిబోయిన పెరుమాళ్ళు :
దాబి రాఘవుడా ! రంతు గంగన్న"
అని యిట్లు పేరుపేరున అందరిని
పిలిచి
ధనముమీది "కాంక్ష ధాన్యంమీది కాంక్ష
చట్టాలమీగి కాంక్ష సుతులమీది
కాంక్ష
సతులమీద కాంక్ష గలవారు
ప్రాణాన కనకరేపల్లెకు పారి
పొమ్మ"నెను

"చావంటె సంతోష మనియేటి వారు
పోటంటె కోటిలాభ మనియేటి వారు
తనవెంట యుద్ధానికి తరలి
రమ్మ"నెను
చిటిచాపలు పరిపించి శిఖాముద్ర
మాడలు పోయించి
గ్రాసాలు తీర్పించి ఘనుడు పెద్దురాజు
"కట్టరోయి అన్నలార !
శిఖాముద్రమాడలు
బంటును పొడిచినా బంటు
బ్రతుకవలెను
పెట్టరోయి బావలార ! కేశవ
తిరుమణి
పుయ్యరోయి తమ్ములార !
గంధకస్తురి పరిమళాలు
అల్లరోయి తమ్ము లార ! ఘన
వీరజడలు
పెట్టరోయి అన్నలార ! నవరత్న
భూషణములు
పూసిన గంధంబు పురి చింట్లకుడ
అల్లిన వీరజడముడి విచ్చకుండ
పెట్టిన తిరుమణి పేటె త్తకుండ"
అన్నదమ్ములకు ఆనతిచ్చె నపుడు

## పెద్దిరాజు తనవారికి యుద్ధధర్మము లుపదేశించుట

"హత్యలు నాలుగు ధర్మాలు ఎనిమిది
హత్యలు నాలుగు ఏమిటని అడిగితేను
బ్రాహ్మణ్ణి చంపితే బ్రహ్మహత్య కలదు
గోవును చంపితే గోహత్య కలదు
శిశువు చంపితే శిశుహత్య కలదు
స్త్రీలను చంపితే స్త్రీహత్య గలదు
ధర్మాలు ఎనిమిది ఏమని అడిగితే
రెణాన చెట్టులెక్కిన వాని పొడువంగ రాదు
రెణాన పుట్టలెక్కిన వాని పొడువంగరాదు
రెణాన పూరిగొరికిన వాని పొడువంగ రాదు
రెణాన ముటవేసినవాని పొడువంగ రాదు
రెణాన చేతులెత్తిన వాని పొడువంగ రాదు
రెణాన జలధిజొచ్చిన వాని పొడువంగ రాదు
రెణాన పారిపొయ్యేవాని పొడువంగ రాదు
రెణాన చచ్చినవానికింద చొచ్చినవాని పొడువంగ రాదు
ఇటువంటి వారిమీద యుద్ధము చేసి
ఇటువంటి వారిని చంపిన వారికి
ఇలలోను వారికి స్వర్గంబు లేదు
చక్కని తమ్ములార ! సరగున వినుండ
వైకుంఠపదవి వారికి లేదు వో యన్నలార !
ఇటువంటి ధర్మాలు మన్నిస్తిరైన
వైకుంఠ నిధులలో వోలలాడుదురు
మీతోడ ఎదిరించి రాకుపోకు మని
పరిగడ వేసినవానిని పట్టి విడువకను
చంపుడు త్రుంపుడ సమరంబులోను
పొడవుడ గెలువుడ పోనీక యితని"
అని తమ్ములకు మరుదులకు అందరికి చెప్పెను
రతిరాజు గూడుక రంభతోడుతను
సరిమించు బంగారు ప్రతిమల వలెను
పల్లకీ లెక్కిరి బలువు మన్నీలు
తురగాల నెక్కిరి ధృష్ట గోపాల్కులు
జగడానకు పెద్దరాజు సంతోష మంది
అగళముగ వాయిద్యాలు వాయించు మనెను

# ఆర్లపెంట యుద్ధము

వెక్కసమైన బిరుదులు ఎత్తించినారు
టెక్కాలు పడిగెలు దేవేంద్ర
బిరుదులు
అరవయ్యారు భూచక్ర గొడుగులు
అందలాలమీద
మీసరగండ బిరుదులు మీను
టెక్కెములు
నందుల టెక్కెములు నవపముజు
గొడుగులు
కైలాసనాథు డిచ్చిన కనక కుండలాలు
హనుమంతు పడిగెలు ఆలవట్టములు
శార్దూల గండభేరుండాల సింహ
టెక్కెములు
మకర టెక్కెములును మన్నీలవెంట
బొమ్మిడి గొడుగులు దొరయ
శంఖులును
పట్టుగొడుగులమీద బసువశంకర
బిరుదులు
గండరగండర కత్తుల చోను
వీరసంపత్తి గొడుగులు
వింజామరములు
తమ్మటంబులు రుంజలు
దారశంఖులును
బూరలు కొమ్ములు కంచువీరణాలు
నఫిరీలు వాయించి నాగస్వరములును
రుంజలు వాయించి గరుడ
వాయిద్యములు
ఢమ ఢమామీలును తమటములు
మరియు
మద్దెళ్ళు వీరణాలు మంచి సన్నాయిలు
ఝుంఝుణ ఝూంఝుణి యని
మ్రోయ జగతి కంపింప
తుడుములు నఫిరీలు తూది
పాదముగాను
ధిమిడి ధిమిడని ధరణి
దిగులుకొనంగను
అరువయ్యారు తమ్మటంబులు
అగూచ్చలాయెను
మృపై ఘమూడు కంచుభేరీలు ముందర
మ్రోవంగ
రెణము రెణము అని రెణభేరి
వేయించె
జయము జయము అని జయభేరి
వేయించె
తమతండ్రి ఆవుల వంరాజునాటి
రెణభేరి అగాధు చేయించె
శివపూజ గుడారు శిముడు పెద్దరాజు
శివపూజలు చేసి శివునికి మ్రొక్కెను
భూతిపుండ్రన పూసి
ధరియించుకొనెను

చేతిలో లింగాన్ని సజ్జలో నిడెను
ప్రాణలింగాన్ని పెద్దరాజు
పూజించినాడు
కట్టాయితపడెను కడు వేడ్కతోను
లగవుగా చర్మపల్లవను చెఱిపొప్పు
తొడిగె
దిండుమీదను దిండు దిద్దిన పూసెందు
కాశిమీదను కాశి అనుమందు కాశి
హనుమంతుని కాశిమీద రేమంతుముక్క
రేమంతుముక్కమీద పింజముల
దండ
పింజముల దండమీద పించుతురుపేక్క
దాపట పై దిక్కుప్పె జమదాళికట్టి
వెలపట కట్టెను వెండిపిడి బాకు
ముత్యాల చౌకట్లు మువ్వల వడ్డాణము
గట్టెను
గంటపెండెము పెట్టి గంటల
వడ్డాణము కట్టెను
చాయగల బంగారు చవుకట్టు పోగులు
వరసిన నీలాలవంటి వంటిముత్యాల
జోడు
రాజు వ్రాళ్లన దొడిగె వజ్రాంగి జోడు
శిరసున ధరియించె ముత్యాల
కిరీటము
చేత కటారు చేరి తా నందె
ఒగడానకు పెద్దరాజు సంతోష
మంది

పుత్తమ గుణములు గల సత్యమైన
తేజి
సత్యమైన తేజి తెప్పించు మనెను
సూచనా కర్ణము సురువాగెలాడు
అరటాకు పర్ణము అనువాగె తాడు
భావింప అశ్వానికి పిల్లిద బిగెవాళ్ళ
ముత్యాల చయికను ముమ్మరముగా
బట్టె
ఉల్లాల తరకాసులు చాల
శృంగారించిరి
శిరసున అశ్వానికి పలుకు చిలకలు
అశ్వానికి ధరించిరి అతివేగ తెచ్చి
అశ్వాన్ని చూచి రాజు అధికసంతోష
మందె
రాజువంత అశ్వము తప్పక చూచి
మరణకాలము జక్కిదేవత మరి వేగ
తలచె
కొలకుల కన్నీరు గొబ్బున జారె
ముత్యంపు కన్నీరు ముఖమున వ్రాల
అశ్వాన్ని చూచి రాజు అప్పు
డిట్లనియె
"అదియేమి జక్కిదేవతా అడల
నీకేల ?
మరణకాలము వచ్చేది మంచిది కాద?
ఎన్నాళ్ళు బ్రతికినను రెండే కాదా ?
అలుగుల మరణము అయితేను
ఇప్పుడు

సాయుజ్య పదవియు స్వర్గంబు కలదు
వైకుంఠ వీథుల వాల లాడుదుము''
అని కు స్తరించెను అశ్వాన్ని రాజు
కావిచంద్ర రుమాల కన్నీరు తుడిచె
అంకెములో పాదము వేసి అశ్వం
మీద నిలచి
తేజిని ఎక్కెను తేజంబుగాను
భూచక్ర గొడుగులు పువ్వులు
తూలాడ
గహ్వరమైనట్టి గరుడ పడిగెలును
జగజంపు గొడుగుల నీడను చయ్యన
కదిలె
వెనక వింజామరములు పేటు
రుమాళ్లు వెయ్యగా
ఆవేళ బ్రాహ్మలు ఆశీర్వదింప
ఆ రాజుభట్టు అపురూప సరస్వతి
చెంగి కైవారము చేయుచు రాగా
బిరుదులు చదువుచు పెట్లు పుట్టించిరి
అరవయ్యారు తమటములు ఆగుబ్బు
లాయె
కంచుభేరి వేయించి కదిలెను దండు
వున్నతమైనట్టి వీర రవుతులును
పన్నె లక్షగుర్రాలవారు తా గదిలిరి
దాపట గొలిచేటి దండనాయకులు
వలపట గొలిచేటి వాలుమన్నీలు
సామంత వర్గము చేరి కొలువంగ
అందరు రాజులు అశ్వాల నెక్కిరి
కొందరు రాజులు గోడిగల నెక్కిరి
తురగముల నెక్కిరి ధృష్ట
గోపాలుర్కలు
మేలిమి వజ్రాలు కేళించి నట్లు
జగడానకు పెద్దరాజు చనుదెంచె
నపుడు
"వినరోయి అన్నలార! వీర
ధర్మంబు
పరదళము హెచ్చు మన దళము
కొంచమని చూడక మీరు
కొంచించక శత్రుల ఘోరకంపు
లాడుడి
వెనక అడుగు ముందర బెట్టి
పోట్లాడితిరైన
సాయుజ్య పదవికి దోవలు గలుగు
ముందర అడుగు తమ్ములార!
వెనకబెట్టి పోట్లాడితిరైన
వెనకటివారికి మోక్షపదవులు లేవు
వెన్నుపోటు పిక్కపోటు దారిన బిరుదు
చాలిబంటు
చదిరీక ఎదురొమ్మున నాటిన గాని
చెదరక జగడంబు చేయుడీ మీరు"
అని తమ్ములకు మరుదులకు
ఆనతిచ్చె నపుడు
పచ్చల కిరీటాలు పషిణి వుంగరాలు
వీర పరివారముకు ఇచ్చి సెలవాయె
కంచుభేరి వేయించి కదిసెను మూకలు

ఇరుబలములు యుద్ధము చేయగను
మునుపటి జగడముకన్న
ఘుమ్మరమ్ముగను
ఘనమైన బాణాలు కాల్చిరి వక విడత
కాలరి సేనలు కదలిరి వేగ
ముందుగా ఎలగోల మూకలు నడిచె
తరుదైన బాణాలు ధరమీద నెక్కించి
బాణాల కెదురెక్కి బవరంబులోను
చెండాడి పగతుల చాలగా నరికిరి
ఎరుజాలు పరుగున ఎదురెక్కి
మన్నెమూకలు
దండి బారులు గదిసె ధరణి
గ్రక్కటిల్ల
పృథివిపై బెబ్బులులు పోరాడినట్లు
ఆజిలో తేజీల అటు వేగ తోలి
బాహుపుటములు ఉరికించి చక్కగా
నరికిరి
నగళించి పెగళించి నంతయు జొచ్చి
జబురు జంగులు ఫిరంగులు తరుచు
బాణాలు
జడిగొని గాల్చిరి పాలించి భూమి
వడగండ్లు తొలకరివాన గురిసిన
యట్లు
పెటపెట తుపాకులు పేలె నొక
జాము
ఉరికెను మూకలు విరిగినయట్లు
తరుచైన తుపాకిగుండ్లు తాకెను
రిపులకు
దండిగా కూలిరి ధరణిపై నంత
అట్టహాసము చేసి ఆలమున పోరి
దట్టపుటలుగులు తరుచుగా పట్టి
ఆయుధములు పోరిరి పురుపడి
పగతులు
పడుసుకత్తుల పొడిచి పగవార్ని
నరికిరి
వీరులు కూలిరి ఇలమీద నంత
వానకాలంబున వరుషించి నట్లు
చెలరేగి వేట్లాడి చెల్లి రాకకొంత
గ్రమ్మిన మేఘమున కడువేగ
మెరపులు
మత్తుకొని మెరసినట్లు అయుధాలు
పెరికి
ఝుళిపించి రవుతుల తలలు ఖండించి
తళుకులు మెరుపులు తగ
గుణధ్వనులు
దొరకొని రక్తాన పొర్లాడువారు
ఈటెలతో కదిసి యుద్ధరంగమున
వాలాయముగ రణమున వరిగేటివారు
పొన్నపూ ఈటెల పొడిచినగాని
అల్లన బాయక అటు నవ్వువారు
పారి గడలవార్ని పడబొడుచువారు
కొమ్ము టేనుగులతో గోపాల్కులు
గదిసి
కుంభస్థలములు కూలగా ద్రోసిరి
గిపెట్టి ఏనుగులు కూలె రణమందు
భద్రగజముల ద్రుంచి బారులు నరికి

ముప్పిడిగా గోపాల్కులు ముందర నడిచిరి
గుర్రపు రవుతుల కూలంగ నరికిరి
చందగిరి బల్లాలు శిరసున నాటి
చేతి ఆయుధములు విడిచి చెల్లేటివారు
మోకాళ్ల కీళ్ళను మొత్తముగ నరికిన
మొండెముల భూమిపై మూర్ఛిల్లువారు
బాకులతో పొడిచి పడద్రోసినపుడె
పయ్యన భూమిపై పరిగేటివారు
చెలరేగి పొడిచిరి చలగొని యాదవులు
గద్దరి శత్రులను కలబడి నరికిన
కంఠలు తెగిపడి కల్లిలో పరిగిన
చదరక నటబూని శస్త్రాల వేసిన
తలతెగి రవుతులు ధర గూలువారు
సానకత్తుల బూని సవకళించి నరికిన
సేనలు మడిసెను చెలగి రణమందు
ఆజిలో వురికించి అశ్వాల నరికిన
కుప్పలై తేజీలు కూలె రణమందు
గండ్రగొడ్డళ్ల బూని గజముల నరికిరి
మందలై ఏనుగులు మడిసె రణమందు
పేరాలు బారుచు తల తెగనరికిన
పెదిమలు కొరుకుచు పడివుండు తలలు
కుమ్మరగుంటికి కుండలు చేర్చినట్లు
కుంభిణిపై శిరసులు నరికి కుప్పలు పెట్టిరి

## పెద్దిరాజు శత్రుసైన్యమును నురుమాడుట

చిప్పకత్తులతో శిరసులు నరికిన
గిటగిటమని పండ్లు గిలేటి తలలు
వసుధపై చెరుకులు నరికి వోదెలు పెట్టినయట్లు
ఖండించి వేసిన కాళ్ల చేతులును
మోపు గట్టినట్లుండె మొనసి రణమందు
కటార్ల పొడిచిన కంపప్పి కొందరు
పొదల లోపల దూరి పొర్లాడువారు
శిరసున పోట్లు నాటి జీవులు స్రుక్కి
సొరిదిగా చెట్లలో సొరిగేటివారు
పరువులు బారుచు ధాళ్ల పడరువ్వువారు
రాతిపెట్లు దాకి నజ్జునజ్జులై కొంత
వూపిరి వెళ్ళగా వొరిగేటి వారు
వరిమడికి కాలువవాగు దిద్దినయట్లు
రక్తము కాల్వలై రాసాగె నపుడు
దొబ్బలు కండలు దొరసి రక్తాన
దుమికి పారసాగె దొడ్డ రణములోన

కాళ్లను వేళ్ళను కరములు శిరములు
కొట్టితే పడియుండు కొవ్వుదొబ్బలును
నరికితే పడియుండు నల్లని శిరసులు
ఆడాడ పడియుండు అల ఆయుధాలు
క్రిక్కిరిసి పడియుండు
సొక్కశివగెడాలు
పరుగులై పడియుండు బొందిడీల
జోళ్ళు
కకవికలై యుండు కత్తులు గెడలు
ఈటెలు నేజాలు ఇనుప శూలాలు
అరిగెలు ఝల్లులు ఆ కల్లిలోను
మెండుగా పడియుండు మేదినిమీద
పండిన జొన్నచేను పడగోసినట్లు
నేరనివాడు చొప్పవామి నెరిపినయట్లు
అవిసెలు నరికి అడ్డాలు వేసినట్లు
ఈరీతి అతిఘోర యుద్ధంబు చేయ
పడమట మునుముపెట్టి తూర్పుకు
బాట లేర్పరచిరి
ఉత్తరాన మునుముపెట్టి దక్షిణానకు
బాట లేర్పరచిరి
తూర్పు పడమర ఉత్తరా దక్షిణం
నడిచి పొడిపించె పెద్దరాజు
రాచమొనల మీద
వాలికేతువ రాజు గూడారుదాక
పైబడి యుద్ధంబు పరగంగ జేసె
వాలికేతువరాజు వసర కొలువున్న
గూడారు త్రాళ్ళను కోయించినాడు
దక్షిణమొఖముగా గుడారు ధరమీద
పరిగెను
అంతట వాలికేతువరాజు ఆగ్రుడై
లెగిచెను
మచ్చల పులివలె మసులుకుంటాను
పొద దుప్పిపిల్లవలె భూపెట్టుకుంటా
గాండీవము దీసికొని గ్రక్కున లెగచె

## పెద్దిరాజు వాలికేతువరాజుల ద్వంద్వ యుద్ధము

వాలికేతువరాజు వచ్చె పందెత్తి
పురుషది పరువాడి పుగ్రకోపమున
నిలిచె
వారి యుద్ధము చూడ దేవతలు
చక్రి నక్క నెక్కెను శనేశ్వరుండు
మహిషము నెక్కెను యమధర్మరాజు
కుబేరుడు ఎక్కెను గుర్రము నపుడు
దేవేంద్రుడు వెల్లయేనుగు నెక్కెను
విష్ణుండు గరుడవాహన మెక్కెను
వేగమే వచ్చెను ఈశ్వరుండు తాను

కాళ్లను వేళ్ళను కరములు శిరములు
కొట్టితే పడియుండు కొవ్వుదొబ్బలును
నరికితే పడియుండు నల్లని శిరసులు
ఆడాడ పడియుండు అల ఆయుధాలు
క్రిక్కిరిసి పడియుండు
సొక్కశివగెడాలు
పరుగులై పడియుండు బొందిడీల
జోళ్ళు
కకవికలై యుండు కత్తులు గెడలు
ఈటెలు నేజాలు ఇనుప శూలాలు
అరిగెలు ఝల్లులు ఆ కల్లిలోను
మెండుగా పడియుండు మేదినిమీద
పండిన జొన్నచేను పడగోసినట్లు
నేరనివాడు చొప్పవామి నెరిపినయట్లు
అవిసెలు నరికి అడ్డాలు వేసినట్లు
ఈరీతి అతిఘోర యుద్ధంబు చేయ
పడమట మునుముపెట్టి తూర్పుకు
బాట లేర్పరచిరి
ఉత్తరాన మునుముపెట్టి దక్షిణానకు
బాట లేర్పరచిరి
తూర్పు పడమర ఉత్తరా దక్షిణం
నడిచి పౌడిపించె పెద్దరాజు
రాచమొనల మీద
వాలికేతువ రాజు గూడారుదాక
పైబడి యుద్ధంబు పరగంగ జేసె
వాలికేతువరాజు వసర కొలువున్న
గూడారు త్రాళ్ళను కోయించినాడు
దక్షిణమొఖముగా గుడారు ధరమీద
పరిగెను
అంతట వాలికేతువరాజు ఆగ్రుడై
లెగిచెను
మచ్చల పులివలె మసులుకుంటాను
పౌడ దుప్పిపిల్లవలె భూపెట్టుకుంటా
గాండీవము దీసికొని గ్రక్కున లెగచె

## పెద్దిరాజు వాలికేతువరాజుల ద్వంద్వ యుద్ధము

వాలికేతువరాజు వచ్చె పందెత్తి
పురుషది పరువాడి వ్యగ్రకోపమున
నిలిచె
వారి యుద్ధము చూడ దేవతలు
చక్కి నక్క నెక్కెను శనేశ్వరుండు
మహిషము నెక్కెను యమధర్మరాజు
కుబేరుడు ఎక్కెను గుర్రము నపుడు
దేవేంద్రుడు వెల్లయేనుగు నెక్కెను
విష్ణుండు గరుడవాహన మెక్కెను
వేగమే వచ్చెను ఈశ్వరుండు తాను

నందివాహన మెక్కి నాగభూషణుడు
పార్వతితో గూడ పరగ నేతెంచె
అంతలోనే బ్రహ్మ హంసవాహన
మెక్కి
తేజమున వచ్చెను దివినుండి అపుడు
కౌమారస్వామి వచ్చె కోరి
నవిలునెక్కి
విరూపాక్షయోగి వచ్చె ఇర్రివాహన
మెక్కి
తేలునెక్కి వచ్చెను జటాంగియోగి
మంద్రగబ్బ నెక్కి వచ్చెను
మచ్ఛీంద్రయోగి
దేవేంద్ర దేవతలు దివిజ పాలకులు
వ్రతులు మునులు సన్యాసులు
ఏకాంగు లంత
అంతరమధ్యాన రథాలు వేసుక
అతివేగ నిలిచిరి
వల్లవుల పెద్దరాజు వాలి కేతువ
రాజు
యుద్ధము చూస్తూను వున్నారు
దేవతలు
ఏకాంగి వీరులై యాదవులు కదిసిరి
విమల సంగర వీథిని విరసంబుతోను
సమరంబు చేసేటి చందంబు వినుడ
చటులాగ్ర భీకర చటుల ఖడ్గముల
ఘాతాలు భీతిల్ల పృథివి కంపింప

దానవులు వెరగంద ధరణి
గ్రక్కటిల్ల
సేనాధిపతు లెల్ల చెర్లాడుకొనుచు
తామసమున పోరిరి సమరంబులోను
నక్షత్రములు రాలె నంతరిక్షమున
జగన్నాథుడు కదలంగ త్రిజగములు
వొణుక
కులగిరులు కదలంగ కుంభిణి అదర
ఎడలేని రథములు ఇనుప శూలాలు
పిడుగులను పోలేటి ఫిరంగిగుండ్లు
వెక్కసపు బాణాలు వెలబిరుసులూను
చుక్కల పొడుగున చక్రబాణాలు
అమిధ పొగబాణాలు ఆకాశం
పొడుగున
గుబగుబ మనియేటి గుంటిగ్రోవులును
చిరంమర మనియేటి చక్రబాణాలు
సకిలించి గుర్రాలు సమరంబులోను
గీపెట్టి ఏనుగులు క్రిక్కిరిసి నడువ
ముఖమున కోపంబు ముసిని
బడుచునపుడు
మాయసరదార్లను వురికించి పొడువ
గయ్యాళి రిపులతో కయ్యంబు సేయ
ఏనుగుల మీదినుండి ఈటెలతో
పొడువ
గడలతో ఎదనెంచి గమకించి పొడువ
అదిరిపడి బాబోయని అటు దుముకువారు

డాబాకత్తుల తతిగొని నరికినను
మొద్దులవలె పీనుగలు మడిసి
రాకల్లిలోను
నేల పరువడిగాను నిలిచి పొడిచినను
మేలు భళాయని మెచ్చేటివారు
అడ్డకత్తుల బూని అట నరికినాను
చయ్యన రణమున చచ్చేటివారు
పరివిడి ఎదిరించి పటాలని నరికినను
కోపాన పెదములు కొరికేటివారు
శూలాల నెదిరించి సూటిగా పొడిచిన
ఓం లింగః నమశ్శివాయః అని
వొరిగేటివారు
చదరక నట పూని చక్రాల వేసిన
పూని చక్రాల వేసి పడి మర్చువారు
ఆయుధాలు దాకి అయ్యోః సుభ్రానే
అనుచు
ఇంద్రపురము గలిగె ఇదిగో అనువారు
శిరమున శరములు నాటి
జజ్జితముగాను

పరవాదము గలిగెను భళిరే యను
వారు
వారి చావులు చూచి వణికేటివారు
కోపించి బల్లేల కూల బొడిచినను
ఏలాగు ననుచును ఎలుగెత్తువారు
చుట్టాల బంధువుల సుతుల నెడబాసి
గట్టిగా అడవుల కలిస్తి మనువారు
తల్లిదండ్రుల బాసి తనవార్ని బాసి
బల్లేల నేజాల పాలైతి మనుచు
అన్నదమ్ముల విడిచి అటవస్తి
మనువారు
వొక్కొక్క దిక్కు వొరిగేటివారు
ఆలిబిడ్డల విడిచి అట వస్తి మనుచు
పొదల లోపల దూరి పొంచున్నవారు
తొక్కుకనని చాయ తొలగి పోలేక
రొమ్ముస రక్తము చిమ్మించి పార
గాయాల చూచుక కల్వరించువారు

## యాదవ సైన్యము హతమగుట

అడ్డగల కంపపలు ఆ ంక్ష
యాదవులు
కోప గోపాళ్ళులు కొర వీరవర్గము
అలముస పోట్లాడి అటు వొరిగినారు

(యాదవ దళములు) ఆర్లపెంట
రణములో హతముగా చెల్లిరి
బావమరుదులు తాను పట్టభద్రుండు
యుద్ధరంగము చేయ విడబడిరంత

బాణాలు నలిచేసి బవరంబులోను
మదపుటేనుగులను మట్టుమలాడి
ధరమీద దండెటోయిన మాధవుడు
వొరిగె
భూమిపై బాణాలు బోరున రాంగ
బాణాల కెదురెక్కి బవరంబులోను
ఇచ్చగా గుర్రాం విడబడి నరికి
వాడి సూర్యబాణాలు కటార్లు నాటి
చాయసాని పోతన్న ధరమీద వరిగెను
హెచ్చుగా బలములు ఏతెంచి రాగ
వచ్చిన బలముల ఇచ్చగా నరికి
జముదాళి పోట్లు ఎదురొమ్మున పెడలి
మహిమీద జెట్టిటోయిన మాధవుడు
వరిగె
ఆలమున తేజీలు అధిగొని రాగ
తేజీల రవుతులను కుమ్మి తెగటార్చె
బహుపరాక్రమశీలి బండారు రాగన్న
ఆలమున చెల్లెను అవనీశుపద్ద
సమరమున విమతుల సమయించి
మించి
సందులేక గాయాలు సొసకత్తులు
నాటి
సంగమేశుని మల్లయ్య సమిసె నా
కల్లని
బావమరుదులు బంధు సహోదరులు
ఆలమున పోట్లుబడి అటు వరిగినారు
పల్లవుల పెద్దరాజు పక్కడే నిలిచె

గొడుగుల బట్టించుక రాజులు గొబ్బున
రాగ
గొడుగులమీదికి అశ్వాన్ని గొబ్బున
దుమికించినాడు
గొడుగులు పడిగెలు కూలంగ నరికెను
గొడుగులకింద వచ్చేటి రాజుల
రాజుల శిరస్సులు ఖండించివైచె
ఏనుగ హవుదాల ఏతెంచిరాగ
హవుదాల మీదికి అశ్వాన్ని దుమికించె
కుంభస్థలములు నరికి కూల్చె
హవుదాలు
తొండాలు చాచుక ఏనుగలు తురతురగా
రాగ
తొండాలు రెండేసి తునియలుగ
నరికె
గుర్రాలు రవుతులు గోడించి రాగ
గుర్రాల రవుతుల కూలంగ నరికె
మత్తగజముల నరికి మట్టుమల్లాడి
త్రొక్కి నూర్పిడిచేసి తొలగక
ఆజిలో
ఎత్తివచ్చిన బాణాలు-జక్కిదేవతకు-
ఎదయందు నాటెను
నాటిన వెరవక నరపతుల ద్రుంచె
జలధీరుల నరికి సేనల ద్రుంచె
గుమ్మడిగింజ బాణాలు అశ్వానికి
గుండెల నాటె

గన్నేరాకుల అలుగుల అశ్వానికి
గాయాలునాటె
చిప్పకత్తుల నరుకులు శిరసున
తాకెను
మప్పిళ్ళపోట్లు ముమ్మరముగా
నాటెను

## పెద్దిరాజు గుఱ్ఱము కూలుట

పోట్లునాటి జక్కిడేవత పోలేక
వుడిగెను
పాదుకాళ్ళతో అశ్వము పాలించి
నించె
కొలుకల కన్నీరు గొబ్బున దెచ్చెను
అశ్వాన్ని జూచి రాజు హరహరా
యనుచు
''అదియేమి జక్కిడేవరా ! ఆడోళన
పడియేవు !
నీవు పోయిన ఏడుఘడియలకు నీతో
కలియవొస్తున్నాను
నీకూ నాకు ఆనవాలు కైలాసబండ
కైలాసబండ కాడికి కలియ
వస్తున్నాను''
మొకం మీద చెయ్యివేసి
ముద్దుపెట్టుకొనెను
కరాళించి అశ్వము కైలాస మేగెను
వాలికేతువరాజు వచ్చె దండెత్తి
వాలికేతువరాజుమీదికి పెద్దరాజు
పైబడి కదిసెను
ఊరు లిద్దరు కదిసి విద్ధరంగమున
కొండలు కొండలు తారసిలినట్లు
మత్తేభము వారధి మడిచినయట్లు
ఏనుగ ఏనుగ ఎదిరించినట్లు
సింహము సింహము చెల్లించినట్లు
అనుమంతు లఘువున అట్టటు జుణిగి
కేడించి వానిచెయ్యి కెడమున
చప్పున
కదిసి వాలికేతువుని శిరస్సులు
గరిగరిల్లున నరికెను
ఎగసి వాని శిరస్సులు యోజనము
పొడువు
కిలకిలార్చి ఆ శిరస్సులు కిలకిలా
నవ్వుచును
మళ్ళి వచ్చి వాని శిరస్సులు బొందిని
వ్రాలెను
కుడిభుజమున వానికి కుమ్మరివాడు
ఎడమ భుజమున వానికి కమ్మరివాడు
కుమ్మరివాడు అతుకను కమ్మరివాడు
శీలభిగించను

ఎప్పటివలె వాలికేతువు ఏతెంచి రాగ
ఈసారి తనచెయ్యి దరితప్పె ననుచు
వల్లవుల పెద్దరాజు వుగ్రకోపమున
సారథిని నరికెను సమరంబులోన
రథముల గుర్రాల రెణమలో నరికె
(కొండవలె) వాలికేతువురాజు రథము వరిగె ధరమీద
అవనిపై వాలికేతువురాజు అప్పుడు నిలిచె
వాలికేతువురాజు వుగ్రకోపమున కదిసి
కరితురంగములు రెండు కదిసిన యట్లు
అనుమంతు లఘుపున ఆ రాజు కదిసి
ఈసారి వక్కసారి విశంగి చుట్టి
గాండీవమున వాని శిరసులు ఘరిల్లున నరికెను
ఎగిసి వాని శిరస్సులు రెండు యోజనాల పొడవు
కిలార్చుచు వానిశిరస్సులు కిలకిల నవ్వుచును
మళ్ళివచ్చి వాలికేతువురాజు బొందిని వ్రాలెను
కుమ్మరివాడు అతుకను కమ్మరివాడు శిలబిగించను
ఎప్పటివలె వాలికేతువురాజు ఏతెంచి రాగ

ఈసారి తనచేయి దరితప్పెనేమొ
అప్పుడ నవ్వి పెద్దరాజు ఆగ్రహించెను
అల్లడి చేసి పల్లడి దుమికెను
హనుమంతు లఘువున ఆ రాజు లెగిచెను
గాండీవమున వాని శిరస్సులు ఘరిల్లున నరికెను
ఎగసి వానిశిరస్సులు మూడు యోజనాల పొడువున
కిలార్చుచు వాని శిరస్సులు కిలకిల నవ్వుచును
మళ్ళి వచ్చి వాలికేతువు బొందిని వ్రాలెను
వాలంగా జూచి పల్లవుల రాజు
అప్పుడు పెద్దరాజు ఏమని పల్కెను ?
"తాను సత్యముగల సాహసుడై తేను
శిరసులు మొండెమున మొలచి రావలెను
ఎంగిలి ప్రాణానికి ఆశించితివి వాలికేతువురాజ !
ఈడైన రాజువని యుద్ధాని కొస్తిని
సరియైన రాజువని జగడాన కొస్తిని
ఎన్నాళ్ళు బ్రతికినను రెండే కద
అంతకన్నా కలద ఆ బ్రహ్మవ్రాలు"
అని యిట్లు పెద్దరాజు ఎగ్గు లెన్నగను
వాలికేతువురాజు కడ నున్నవారు

వీరులు శూరులు విక్రమార్కులును
వాడీలు తోరణాలు రాజుమీద వంచిరి బాణాలు
సూరీడు అనేబాణం పెద్దన్నను చుట్టుకొని మండెను
యముడు అనే బాణం పెద్దన్న ఎదయందు నాటె
శనేశ్వరుడనే బాణం పెద్దన్నకు సరికట్టి వెడలెను
తూమంటి బొందికి తూరె బాణాలు
కంచువంటి బొందికి కదిసె బాణాలు
ఏనుగతొండాల వంటి ఎగుభుజంబులను
ఎగుభుజంబులను ఏట్లు పోట్లాయెను
అరటి స్తంభాలవంటి పెద్దన్న తొడలను అలుగులు నాటెను
రాజు శిరసున ధయించిన ముత్యాల కిరీటము
తుపాకీవేట్లకు తునియలై పోయెను
రాజు రొమ్మున తొడిగిన వజ్రాంగి జోడు
బాణాల వేట్లకు భగ్గున మండెను
చంద్రమండలం గట్టె రాలె నక్షత్రాలు
సూర్యమంతలం గట్టె చుక్కలు రాలెను
కాలము చేరువాయె గంగ వైదొలిగె
పల్లవుల గోపికొమాళ్ళకు వజ్రాయుధాలు నాటె
దండిగా రాజుల తలలు ఖండించి
అల్లరి మూకల హతముగా నరికి
పుల్లావుల వెంగళుడు భూమిపై వరిగెను
టోవనాధులు చేసి దొరల ఖండించి
మాహకొని జెట్టిబోయిన మాధవుడు వరిగెను
వలపట వల్లవులు దాపట తిరుమందులు
విరసముగా పోట్లాడి రాజు ఇరుగడల వరిగిరి

## పెద్దిరాజు యుద్ధరంగమున వరుగుట

వలరాజు పుత్రుండు పోట్లబడి వరిగె ధరమీద
వరుగుచు పెద్దురాజు భట్లను బిలిచి
చిన్ని వేలివుంగరము ఛిలుకల ఛాళి
పనివేళ్ళ వుండేటి పక్షిణి వుంగరాలు
దక్షిణాది రాజుల గెలిచి తెచ్చిన చాయల జముదాళి

కాకిత రాజుల గెలిచి తెచ్చిన కంచు
రెణభేరి
తమ్ములగూడి పంచుకొన్న తరమునాటి
పతకము
వంకిణి మొలత్రాడు వాలారిగోరు
కోదండ పోగులు గొడుగు పావాలు
యాపకాయంతేసి ఏడు సన్నలింగాలు
వరసిన నీలాలవంటి ముత్యాల జోడు
అతి వేగమున తన కులాంగికి
అడియారములు పంపె
తూర్పున ఆ రాజుకు తుమ్మవృక్షము
నీడ
ఉత్తరమున ఆ రాజుకు ఊడిగవృక్షము
నీడ

దక్షిణాన ఆ రాజుకు దానిమ్మ
వృక్షము నీడ
పాదాలకాడను పక్షిణి తంగేడు
సరులకు సమ్మతిగా దాదిరి వృక్షము
తులసి బృందావనము తోలగక చేర్చి
మఠము సన్నాసుల మొగమండపమున
తలకింద డాచెయ్యి తగ వొప్పనుంచి
వలచెయ్యి రాజు తన వొళ్ళుమీద
చేర్చుకొని
నిద్రబోయిన చందాన రాజు వుర్విపై
వరిగెను
చావునిద్ర బోయె సంతోషపరుడు
మరచి నిద్రబోయె మహాఘనుండు

## గంగ పోతురాజును రణరంగమునకు కావలి యుండుట

ఆ రణము కాచేటి ఆదిమాశక్తి
పట్టుపుట్టము గట్టి పడతి తురగము
నెక్కి
తన తమ్ముడు పోతురాజును డాయంగ
బిలిచి
"కనక రేపల్లెకు కదిలి నే బోయి
ఆవుల పెద్దమ్మకు అనివార్త జెప్పి
సుదతి పెదమ్మకు శుభవార్త జెప్పి

కలజెప్పి వచ్చేదాక కల్లి కాయవోయి"
అని యిట్లు ఆ గంగ ఆడు మాటలకు
"అక్కరో వో యక్క ఆదిమాశక్తి
ఏ పల్లె పట్నాలు కాస్తేను తనకు
పూజలు పుష్పాలు భుక్తిముక్తి కలదు
ఈ పాడు బొందులు కాచిన ఫలమేమి
కలుగును"
అని యిట్లు పోతురాజు ఆమె మ్రాటలకు

"వినవోయి తమ్ముడా ! వివరంబుగాను
యాదవ కులములో ఎన్నికగాను
ఉప్పు నీరు పారుచు ఉన్నంతలోను
గావులకు కొలుపులకు కనకజాతర్లకు
తాడంత పోతు మేటంత ముద్ద
ఇలలోన తమ్ముడా ఇల్లడజేతును"
అని యిట్లు పోతురాజుకు కట్టడిజేసి
ఆ రాజులమీద లక్షణాలు వుంచెను వేగ
ప్రధానులమీద ముద్దర్లు వుంచెను వేగ
సిరిగల వీరగంధము చిట్లిపోకుండ
పెట్టిన తిరుమణి పేడెత్తకుండ
అల్లిన వీరజడ ముడి విచ్చుకుండ
కారిన రక్తము కరుడు కట్టకుండ
కసువుస నక్కలు కారాడకుండ
పల్లాన రక్తము పారాడకుండ
గండుచీమలు బొందులు కరచి పెరగకుండ
కసువెయ్యకుండ దేహము గాజుపారకుండ
మూకలై భూతాలు ముసురారకుండ
ఆకాశమున కాకులు అర్రు వంచకుండ
మేదినిపై మృగములు మెడ వాల్చకుండ
ఈగ వాలకుండ లీపట్టకుండ
వుట్టలోని చీమలు పట్టి కరవకుండ
ధరణిపై బొందులు తరిపట్టకుండ
భూమిపై బొందులు బూరటిలకుండ
కల్లి గాయవోయి ఘనుడ పోతన్న
అని యిట్లు పోతురాజుకు కల్లి వప్పగించి
పదిలమని చెప్పి గంగ పయనంబులాయె
సేసగిన్నె వక చేత శేషు డొక చేత
ధూర్తుల మర్దించ దుడ్డు వక చేత
హంసల మర్దించ అంబు వక చేత
డక్కి వక చేతను డమరుకము వక చేత
త్రిశూలము వక చేత సింగిణి వక చేత
పరువైన దానిమ్మ పండు వక చేత
శూలము వక చేత సురటి వక చేత
బద్ది వక చేత పట్టుకొని పయనంబులాయె
పన్నెండు చేతులా పట్టి ఆయుధాలు
రట్టడి ఖాగాన మెట్లు తా నెక్కెను
ఏడుకట్ల చేపి గంగ ఎలమి రాబట్టెను
పొలో యని పెద్దయ్య రణముకు పోతుకాలు చుట్టెను
కదిలెను రణముకుండి గంగాభవాని

పెద్దన్న పగలు తీర్చగ పెసుమెట్టలు
పట్టెను
పెద్దన వీరబయళ్ళు చిన్నబోయి వుండ
చింతించె గంగ
గుభగుభ యని గంగ గుబ్బటిల్లంగ
ఆరుదార్ల గంగ ఆదుకొని వచ్చెను
కనకరేపల్లెకు కదలి తా వచ్చెను
గండభేరుండాల మొగసాలకాడ
గంగాభవాని నిలిచెను
గంధపట్టెల బోరుతలుపు కదిలించి
చూచెను
కదిపిన కదులవు కంచు బిగువులును
ఊపిన ఊగవు ఉక్కు బిగువులును
సొంపైన తన చేతి శూలంబుచేత
గంధపట్టెల బోరుతలుపు గ్రమ్మున
పొడిచెను
తలుపుతాళములు వూడి కడకు
వైదొలగె
దూలాల కట్టిన దుప్పి కొదమలును
కంబాలకు కట్టిన కణుజు
కొదమలును
కస్తూరిపిల్లులు ఘన మృగములును

విడుపులకు కట్టిన ఇర్రి కొదమలును
శాంభవిని కనుగొని ఝుళ్ళున బెదిరె
"త్రుళ్లకుడి త్రుళ్లకుడి
దుప్పికొదమలార
పెంపుచేసి మిమ్ము పెంచిన తండ్రి
ఆర్లపెంట రెణములో అలిసి
వరిగినాడు
అతివేగ రేపల్లెకు ఆపద వచ్చెను"
శార్దూలమండపము దాటి గంగ
తానపుడు
సజ్జనాల మేడకు చయ్యన వచ్చె
ఉక్కుటలుగు మేడమీద వనిత
పెద్దమ్మ
పగడంపు తరికోళ్ళ పట్టెమంచము
మీద
హంసతూలిక పాన్పు నామీద పరిచి
పరువైన మల్లెలు పాన్పున బోసి
మల్లెల పాన్పుపై మదిరాక్షి తాను
ఏనాళ్ల పాపను ఎదను తా జేర్చి
నీరజాక్షి పెద్దమ్మ నిదురింపగాను
గొలుసుల దివ్వెలు గొదకొని వెలుగ
గోడకు శూలంబు గొబ్బున జేర్చి

## పెద్దమ్మకు గంగ కల చెప్పుట

తలగడ దిక్కున నిలిచి
దైత్యసంహారి
పచ్చని వీరసేస పైబార చల్లెను

దానిమ్మపండు పెద్దమ్మ తలగడచేర్చెను
భుజము చరిచి మేల్కొల్పె భూలోకశక్తి
తోయజాక్షి పెద్దమ్మతోడ మాట్లాడెను

"ఆవులవారి కోడలా అర్ధాంగలక్ష్మి !
పంతము గలవారి కోడలా ! పణతి
పెద్దమ్మ !
చక్కని దివ్యగోపికా ! సఖియ
పెద్దమ్మ !
ఏమినిద్ర బోయేవు ఎలమంచి
పెద్దమ్మ !
నీరుమొగ్గల వంటి కన్నులకు నిద్ర
ఎట్లు వచ్చెను
వాలారి కన్నులకు వచ్చెనా నిద్ర
నీ చామంచి కన్నులకు చేటునిద్ర
వచ్చెనా
కాలయముడు నిద్ర కప్పెనా నీకు
సంతోషపు నిద్రచే చక్కని తల్లి
పరిణపు నిద్రచే పణతి పెద్దమ్మ
నీ విభవంబు తప్పెను నీ విభుడు
కోల్పోయె
పూచిన బూరుగ భూమికి వరిగెను
కాయలతో గజనిమ్మ కల్లిలో వరిగెను
నట్టింట వుక్కు స్తంభం నడిమికి
విరిగెను
విత్తులగాది చెదరి ఇల్లెల్ల నిండెను
గానకొని వెలిగేటి గొలుసుల దివ్వెలు
మలిగి చీకట్లు గమ్మె మగువరో లేవె
సోమప్ప కెత్తిన సొంపైన దివ్వెలు
భగ్గుభగ్గున మండినట్లాయె భామరో
లేవె
కొమ్మరో నీవున్న కొలువు కూటములు
సిరిగల స్తంభములు చిట్లి పై వరిగెను
కంచు స్తంభంబులు క్రేవాలి వరిగెను
వీరకుప్పిపి స్తంభము విరిగె
లేవమ్మ
నవరత్నాల మకుటము నడికల్లిలో
పరిగె
అమ్మరో ! నీవు కట్టిన అంచు
పలిపెంబు
పొగచూరి మంటలో పొర్లె లేవమ్మ
కాంతరో నీ చెవుల కాంతిగల
సొమ్ములు
అగ్నిదేవునకు ప్రియమాయె లేవమ్మ
మగువరో ! నీమెడ నున్న
మంగళసూత్రంబు
నిప్పురోపల మండి నీరాయె లేవమ్మ
సఖియరో ! నీచేతి సన్న నీలాలు
పెటపెట మంటలో పేలె లేవమ్మ
ఇందుముఖి ! నీకు ఇన్నాళ్ళదనుక
కంటికి నిద్ర కానకున్నావు
తరుణిరో : నీవిభుడు దండు
బోతేను
నెరయగ కనులకు నిద్రెట్లు వచ్చె
మత్తేభము విడబడి మడిసె
పెద్దమ్మ !
కొమ్ముటేనుగ ధరమీద కూలె
లేవమ్మ !

లేగంబె కరిరాజు శివపురి కేగెను
రాజు కొల్చువీర్చిన రత్నాల తమకము
వనరంగ ధరమీద వరిగె పెద్దమ్మ !
రాజు పోట్లుబడి రణవీధి లోను
కైవాలి వరిగెను కాంత పెద్దమ్మ !
నీ పురుషునకు బట్టేటి భూచక్ర
గొడుగులు
భూమిపై వరిగెను పణతి పెద్దమ్మ !
రాజు పెట్టుకొనేటి రత్న
భూషణములు
రక్తాన తడిసెను రాజీవనేత్రి !
కూర్చిన ముత్యాలు గుట్ట నేవళాలు
కుంభిని మీద పెద్దమ్మ ! కుప్పలు
పడెను
చేరు తెగి ముత్యాలు చెదరె లేవమ్మ!
గుడి విరిగి పెద్దమ్మ ! కూలె ధరమీద
గుడిమీద పసిడికుండలు గుభాలున
పగిలెను
సంతానముకొరకు రాజుని తమ్ముల
వెడబాపితివి
సంతానము కలగంగానే తమ్ముల
మరచితివి
పుత్రులకొరకు రాజుని భూము
లెడబాపితివి
పుత్రులు గలుగగానె భూములకు
తిరగరె తిరి

కాన్పులకొరకు కానాక్షులు ఎడబాపి
వస్తివి
కాన్పులు గలిగిననాడె కన్నవారిలో
కలపవే వైతివి
సంతానము గలిగె నీకు చావు
నిత్యమయ్యె
పండెను గర్భము పాడాయె బొంది
ఇట్టి ఫలములు గలిగె విరిగె వృక్షంబు
పండుఫలములు గలిగె పాడాయె
వృక్షము
పంపాద్రి వీరబయట పంచఖండాలకు
వెబడి కళ్యాణము వచ్చేటి నాడు
అడబిడ్డ కొమరమ్మ అడిన మాటలు
తారాక్షణ మాయెను తరుణిరో ! నీకు
కొమరగిరి ఆడిన మాటలు
కొంగుముళ్ళాయె
కల్యాణ మేనాడు కాన్పులేనాడు
కల్యాణము పోయిన కాకులు
మళ్ళవన్నారు
అయివచ్చినవారికి కల్యాణము
అయివొచ్చే ననిరి
అయిరానివారికి పైవచ్చే ననిరి
వద్దన్న కల్యాణము వలదని వస్తివి
సంతానము గలిగితే చాలునంటివి
నీవు

చావు ఏమి లక్షణ మంటివి సఖియ
పెద్దమ్మ :
ఎలనాగ : ఈనిద్ర ఏమి లేవమ్మ
సుఖమైన నిద్రలే సఖియరో : నీను
పణతిరో : నీ నగరున వున్న
పన్నీరుదొంతులు
దొరకొని కూటాలలో దొర్లె లేవమ్మ
రమణిరో నీ నగరున వున్న
రాచకామాత్రెలకు
ముత్యాల పాపటల మురువైన చేర్లు
తెగి
జలజల ముత్యాలు జారె లేవమ్మ
మానవతి : నీదగ్గర వున్న మగువల
కెల్ల
చెంపల తూలాడు చెంగల్వ కొప్పులు
కొప్పులూడి గొజ్జంగులు కుప్పలు
పడెను
తమ్ములగూడి పంచుకున్న తరుచైన
పతకము
చీల వూడి రణమందు చిందె లేవమ్మ
ఎర్రంగ సూర్యుడు ఏతెంచు వేళకు
రాజుచేత నున్నది రత్నాలు
చెక్కినది
నందుల ముప్పిడి నాగపతికంకణము
జననాథు ముడిచిన జాజుల సరము
వసుధేశు చిన్నిబ్రేలి వాలారెగోరు

రాజు గట్టిన ధట్టి రక్తాన తడిసెను
దిట్టముగ నీ నగరుకు తెత్తురు
అడియారములు
అతివేగ తెత్తురు అమ్మరో లేవె
కొంచక రోకళ్ళ కొట్టిన పసుపు
కుంపసు నీ మీద గుప్పేరు లేవె
అలసించకలేవె అమ్మ పెద్దమ్మ
మారాచ రుద్రభూమి మనకైన వద్దు
పూబోణి : నీకేల పుణ్యభూములును
నాగప్ప గట్టించిన నందులచెరువు
వెనుక
కోటి అర్థముపెట్టి కొనవమ్మ భూమి
నాగలోకాలు గుణ్ణాలు నదు లేరుపరచి
శోభనాల గుణ్ణాలు సొదు లేరుపరచి
ముదముతో గండభేరుండాల
మొగసాల విప్పించు
జారువట్టెలన్ని పగల గొట్టించు
పొంకముగ గుణ్ణాన పొదిగించవమ్మ
గుగ్గిలపు మ్రాకులు కురుచందనాలు
కుదురుగా గుణ్ణాన గుప్పించ వమ్మ
మంచి గంధపుచెక్కల మ్రాకుల
నడుమ
మన్నీడు నీ విభుని మన్నించవమ్మ
సుదతిరో గుణ్ణాన సొంపు మీరగను
నాలుగు మూలల నందుల నిల్పరే
అయిదుపలు నీవును ఆయత్తపడుడి

అడవిని ఇల్లుగట్టి ఆలసించవద్దు
మల్లెల మహాదేవి మామిడివనములో
శృంగారతోటలో చిగురుమామిళ్ళ
క్రింద
శ్రీమహాలక్ష్మి అనే తమకంబు
పన్నించవమ్మ
కాంతరో ఆ తమకముమీద గ్రక్కున
ఎక్కవె
రత్నాలు ముత్యాలు రాసులు పోసి
బ్రాహ్మణశ్రీలకు పంచిపెట్టవమ్మ
అంగరంగ వైభోగముతో ఆటలు
పాటలు
ఆ తమకము మీద నుండి
ఆడించవమ్మ
చెంగి పుణ్యపు నీరాడి చేడెరో నీవు
వనజాక్షి ! కుంకము పంచిపెట్టవమ్మ
పూచిన బూరుగుక్రింద పొందుగా
నిలిచి
పొంకము నీ వంటి పోలెషులు తీసి
పరగంగ అందరకు పంచిపెట్టవమ్మ
చంపుడు కట్టనెక్కి సఖియరో నీవు
పరగంగ నీచేతి పసిడి నిమ్మపండ్లు
మూరాచ అప్పల చేతికి
అందియ్యవమ్మ"
కలచెప్పి గంగ తా కడపు పై దొలగె
పక్కనున్న పాపను పారంగ జూచి

కంకణాల చేత గారవించి దువ్వె
అదిరిపడి ఆ పాప ఆపుర్న అడిలె
అడలకు అడలకు అబ్బరపు పట్టి
అజుడు నీకు పాపన్న అడల
వ్రాసినాడు
తల్లిదండ్రుల కరువు చేసె తాకట్ల
బ్రహ్మ
అని పాప నూరడించె భాగీరథి గంగ
గొలుసుల దివ్వెలు గొబ్బున మలిపె
కంబాల దివ్వెలు గ్రక్కున మలిపె
కూటాలు మళ్ళిపోత (గంగ) కూతలు
వేసె
అంత్రపురము మళ్ళిపోత (గంగ)
ఆర్భాటము చేసె
ఆర్ల పెంట రణమునకు అరుదెంచె
గంగ
కలగని పెద్దమ్మ గ్రక్కున లేచె
పక్కనున్న పాప పామై పొర్లెను
తలగడ దిండ్లన్ని త్రాచులై తోచెను
కొప్పులో గొజ్జంగులు కుటిలకుంతలకు
పక్కనున్న మల్లెలు పాములై
పొర్లెను
నడుము నక్కన విరిగె
నలినాయతాక్షికి
ఎడమనున్న నల్లగుండె ఏడు
వప్పులాయె

వాళ్ళు చాలు పుట్టె వాణిత
కప్పదుసు
మేనెల్ల పులకించి మెంతలసు లేపెసు
"అమ్మలార లేరమ్మ ఆంచెం
దాదులార !
కాని కల గంటిని కాంతలార
లేరమ్మ
చిన్నబోయి వున్నది సిరిగల
దివాణము
సిద్ధముగా కలగంటి శివుడు
దయతప్పె నేమొ
చేటుకూటాలు తెలియదప్పెను
చూడరమ్మ
చేరదు నా మనసు వో యక్కలార !
చెదరిపోయె తనువు
గడగడ వణకి తల్లడించెను గుండె
బాలలు గలిగిరి బ్రతికే మనుకొంటిని
వోర్వలేక దైవము వై దొలిగె నేమొ
కొండెవారి కొండు, గోవుల గంగు
ఎండెండి దాదులార ! ఓ వెలదులార !
ఒప్పని గల గంటిని ఓ వెలదులార !
కాని కల గంటిని ఓ కాంతలార !''
అలివేణి మాటలకు అదిరిపడి లేచిరి
ఏమి కల గంటివి ఎలమంచి పెద్దమ్మ
''వల్లవులు కొలిచేటి వజ్రమాణిక్యాల
గంగ

ఏరుమందులు కొలిచేటి లేనెవేల్పు
గంగ
అమ్మనుచె వచ్చి నా అర్రంచు నిలిచి
చేరి నాకు చేటువార్త చెప్పెను వినుడి
నిలుప సాధించదు నెంతులార ! నాకు
కన్నతల్లి వలె వచ్చి నాకు కానికల
చెప్పెను
వొప్పని కల గంటి వొళ్ళు చాలు
పుట్టె వో యమ్మలార !
నెంతులార ! నా గుండె నేడు
తల్లడిల్లె
కన్నట్టి కల జెప్పెద కాంతలార
నాకు
విన్నట్టె నాకు విప్పన్నము చాయరె"
పణతి గోవుల గంగు పద్మాక్షి
పలికెను :
"అమ్మరో నే జెల్ల అతివ పెదమ్మ
ఏమి కల గంటివో ఎలనాగ నీవు
పంపాద్రిలో నీవు కన్న కలలు మాకు
ప్రథమాన వుండును
ఎలమంచిలో నీవు కన్నకలలు మా
ఎదయందు వుండును
కల్యాణములో నీవు కానికల గంటివి
కల్యాణము కలలు కనిపించవమ్మ
రమణిరో కల్యాణపు రాచ
కొమార్తెలు

కలలు విప్పర్థము చేయకలరమ్మ
వారు"
ఆమాటకు పెద్దమ్మ అతి శీఘ్రమునను
పన్నిద్దరు దాదుల పయనంబు చేసె
పదమెత్తి పరుగున మగువలార
వేగ
కల్యాణముకు కదలిపొండి మీరు
కల్యాణపు తలారి మారెన్నకు తగ
నొప్పజెప్పిరి
గంట పెరాదిరుగు వీరగంట
సాముసకు వినబడ జెప్పిరి
మగువ పెందోట ముద్దమ్మ నగరు
వేగమే జొచ్చిరి వెలదు లావేళ
పెందోట ముద్దమ్మను పేర్కొని
పిలచి
"పంకజ నేత్రి ! పెద్ద గంధాపతి !
పుష్ప గంధాపతి ! భూలోక చిందు !
అలుగుల సురదేవి ! అక్క
మాదేవులు !
వనజాక్షి చెంచుల వల్లాంబిరాలు !
పిచ్చుకుళ్ల మాదేవి ! పికుళ
లక్షువమ్మ !
తూర్మి లక్షువమ్మ ! కొమ్మలార
వినుడి
రేపల్లెలోపల నెలతి పెద్దమ్మ
కానికల కని నేడు కడు వేగమూన
చేరి కల చెప్పను చెల్లెండ్లు లేరు
దాసి కల చెప్పను దాదులు లేరు
పరభూములకు పస్తిమి బంధువులు
లేరు
వెరగుబడి మాయమ్మ వేగంబె మిమ్ము
రమ్మని పంపెను రారమ్మ మీరు"
ఆ మాటకు కల్యాణపు అప్ప
లేమనెరి
"రాజులు పట్నాన లేని వేళలను
నారీమణులార నగరువెళ్ళ న్యాయంబు
కాదు
ఏమి పని కలిగెను ఎలమంచి
పెద్దమ్మకు
పదరమ్మ పోదాము పద్మాక్షులార !"
పట్టు పటావళ్ళు గట్టి పయనంబు
లైరి
ఉడుతవన్నె పట్టు ఉదయ రాగములు
పులిపట్టు వలిపట్టు పసి నిమ్మపట్టు
కరకంచు మట్టెలు కాల పిల్లేళ్ళు
పీర బొబ్బిలికాయలు వ్రేలి
వుంగరములు
వేగంబె ధరియించిరి వెలదు లందరును
వన్నెగల వస్త్రాలు వలనొప్ప గట్టిరి
అప్పలు చెల్లెండ్లు అతి వేగమూన
తొడవులు పెనుగాడ తోడి కోడండ్లు
కస్తూరి బొట్టులు కాంత లందరును

చెంగల్వ ముడిచిరి చేడె లందరును
కట్టిరి చల్వాయి కాళ్ళ పెనుగాద
వేగమే పయనమైరి వెలదు లందరును
ఆడబెత్తలు పల్లకీలు అడ్డుపట్టించి
పల్లకీ లెక్కిరి పడతు లందరును
పదిలమని తలవర్ల పట్నాన వుంచి
కనకరేపల్లెకు కదిలి రందరును
బంగారు స్తంభాల మద్దికాయల
చవికెలో
పట్టుతివాచీలు పరపించె పణతి
పెద్దమ్మ
అప్పలు చెల్లెండ్లు అతి గారవమున
కు స్తరించి అప్పలను కూర్చుండ
బెట్టె
జాలవల్లికలోన జననాథు దేవి
గంధము కస్తూరి కలువగిన్నెలును
మంచిగంధము పరిమళాదులు మన్నీని
దేవులు
ఉప్పొంగి అప్పలకు ఉరువున పూసి
శంభుని మదిరాక్షి చెల్లెండ్ల కెల్ల
కనుగొని గంధము కంఠముల పూసి
వప్పుగా అప్పలకు పయన వయనాన
కర్పూర బాగాలు కాంతలకు ఇచ్చి
బంగారు గద్దెమీద భామ కూర్చుండె
ముచ్చట వార్తలు ముదమొప్ప నాడి
అప్పుడు కల్యాణపు అప్ప లేమనిరి ?

"రమణిరో ! పెద్దమ్మ మమ్ము
రమ్మనుట ఏమి ?
అప్పరో చెప్పవే అలినీలవేణి
చెప్పు"మని అడిగిన చెల్లెండ్ల తోను
కడువేగ పెద్దమ్మ కల చెప్పసాగె
"వినరమ్మ అప్పలార నా
విన్నపంబు
ఏడుతరముల కాణాచి ఎలమంచి
తుమ్మపూడి
పదితరముల కాణాచి పంపాద్రి
పట్నం
ఎలమంచి పట్నము ఎడమాయె
మాకు
పంపాద్రిపట్నము పాడు చేసితిని
కలిగిన కన్నవారు కడు దూరమైరి
జన్మభూములు విడిస్తిమి
సంతానము కొరకు
చలము చేసి నా విభుని సరివారిని
బాపితిని
కంటసమున విభుని కన్నవారిని
బాపితిని
మనసు చెదరనాడి మగువ ముద్దప్ప
సంతానములేని యిండ్లు చావిడికొట్లు
మద్దెటిళ్ళు
తనయులు లేని యిల్లు తూములేని
చెరువు

చిట్టడుగు లేని యిండ్లు క్షితిమీద
గుళ్ల
శిలలేని గుడి చీకటి కొట్న మంటిని
సుతులు లేని యిల్లు చూడ దోష
మంటిని
బాలలు లేని యిండ్లు బసవన్న
ఆరగించడు
కొడుకులు లేని యింట కుడవరు
జంగా లంటిని
ధనమెంత యున్నను దాయాదుల
పాలంటిని
సంతానము లేని సంపదలు ఏలంటిని
పుత్రులు లేనిచో భూములేల తనకు
తనయులు లేనిచో తనువులు
ఏలంటిని

రట్టుకు లోనైన రాజును ఎడబాపితిని
కల్యాణపు భూమి కాణాచి అయె
తనకు
ఆత్మబంధువులైనా మీరే అప్పలైనా
మీరే
నా తోడబుట్టిన నా యక్కలార!
కన్నకల చెప్పేను కాంతలార
వినరమ్మ"
ఆ వార్తకు కల్యాణపు అప్ప లేమనిరి
"ఇంత చింతపడేవు ఎలమంచి
పెద్దమ్మ
నారీమణి నీవు కన్నకల నాతో
చెప్పవమ్మ"
అని కల్యాణపు అప్ప లడిగినను

## కల్యాణపు రాజకుమార్తెలు పెద్దమ్మకు కల విప్పిచెప్పుట

"కన్నకల చెప్పేను కాంతలార
వినరమ్మ
పూచిన బూరుగ భూమిపై వరగ
కలగంటిని
ఈ కల ఎవరికి పడునో మీరు
వివరించరమ్మ"
"పూచిన బూరుగైతే పెద్దమ్మ నీ
భూపతికే పడును"

"మరియొక కలగంటి మగువలార
తాను"
"ఏమి కలగంటివే ఎలమంచి
పెద్దమ్మ"
"కాయలతో గజనిమ్మ కల్లిలో వరగ
కలగంటి"
"కాయలతో గజనిమ్మ అయితేను
ఘనుడు పెద్దిరాజు కల్లిలో వరిగెనమ్మ"

''ఇక నొక కల గంటిని ఇంతులార
తాను
విత్తులగాది నడుమ విరుగ కలగంటిని
ఈ కల ఎవరికి బడునో
ఎరిగించరమ్మ''
"విత్తులగాదె అయితేను నీ విభుడు
ఏగ కల గంటివి''
''మరియొక కల గంటిని మగువ
ముద్దమ్మ :
శివునకు బట్టేటి శ్రీతాళ దిబ్బెము
చింద కల గంటిని ఓ చేడెలార
ఈ కన్నకల ఎవరికి పడునో
ఇవరించరమ్మ''
''శ్రీతాళ దిబ్బెమయితే నీయింట
శ్రీలక్ష్మి వై దొలిగెను''
"ఇక నొక కల గంటిని ఇంతులాత
తాను
మదపు టేనుగ మడియ కలగంటిని''
"ఏనుగయితే నీ విభుడు ఏగ
కలగంటివి''
''ఇక నొక కలగంటిని ఇంతులార
తాను
పాతాళదిబ్బెము పగల కలగంటిని''
''పాతాళదిబ్బెము పగిలినందులకు
భామరో నీయింటి భాగ్యలక్ష్మి
వై దొలిగెను"

"ఇక నొక కల గంటిని ఇంతులార
తాను
కాంతసోమప్పకు ఎత్తిన కంబాల
దివ్వెలు
మలిగి చీకట్లు గ్రమ్మ కలగంటి
మగువ ముద్దమ్మ
ఈ కన్నకల ఎవరికి పడునో
వివరించరమ్మ"
''కంబాల దివ్వెలు మలిగి నందులకు
మగువ పెద్దమ్మ
భామరో నీ యింటి భాగ్యలక్ష్మి
తొలగెను
''ఇక నొక కల గంటి ఇంతి
ముద్దమ్మ
విడబడి కొమ్ము టేనుగ ఏగ
కలగంటి"
''కొమ్ము టేను గయితేను కోమలి
వినుమ
ఎదిరించిన రవుతులను అందరను
గూల్చి
మదన కుంభిళ్ళమీద నీవిభుగు
చెల్లెను''
''ఇక నొక కలగంటిని ఇంతులార
తాను
తలదాటి దూలాలు ధరమీద వరిగెను

ఈ కల ఎవరికి పడునో ఇంతులార
చెప్పుడి''
''తలదాకి దూలాలు ధరమీద
విరిగినందులకు
దామసాని పోతన్న దళము నెదిరించి
గద్దరి శత్రువుల కలబడి నరికి
దొరకొని ఏనుగుల తొండాలు నరికి
శరీరమున ఈటెలు జర్జితముగ నాటి
మహిమీద మీ అన్న మడిసె
పెద్దమ్మ :''
''ఇక నొక కలగంటి ఇంతులార
వినుడి
నట్టింట పుక్కి స్తంభము నడిమికి
విరగ కలగంటి''
''స్తంభము విరిగినందులకు కాంత
పెద్దమ్మ
కొమ్మరో నీ విభుడు కూల కల
గంటివి''
ఆ కల విని పెద్దమ్మ హాళ్లన నవ్వేను
''ఇక నొక కలగంటిని ఇంతులార
వినరమ్మ
రత్నాల తమకము రణములో విరగ
కల గంటిని''
''రత్నాల తమకమయితే రాజు
పెద్దరాజుకు పడునమ్మ''
''మరి యొక కలగంటి మగువలార
తాను
పణతులార గుడి విరిగి పడను కల
గంటిని''
''గుడి అయితే పెద్దమ్మ నీవు గుణ్ణాన
బడుదువు''
''మరియొక కలగంటి మగువ
ముద్దమ్మ :
పక్షిణి కుండలు భూమిమీద పడను
కలగంటి''
''నారీమణి ఈ కల నాతికి పడును
ఆ కల విని పెద్దమ్మ హాళ్లన నవ్వేను
పకపక నవ్వుచు పణతి పెద్దమ్మ
''ఇక నొక కలగంటి ఇంతులార
వినరమ్మ
పన్నీరు దొంతులు పగల కల గంటి
దొంతుల కడవలు దొర్ల కల గంటి
ఈ కల ఎవరికి పడునో వెలదులార
చెప్పరే''
''పన్నీరు దొంతులై తేను నీ దగ్గర
పణతులకు పడును
దొంతుల కడవలు దొర్లినందులకు
రాజుకన్న ఘనులు రాజులు
ముందరను
మేనున బల్లేలు నాటి మేదినిపై
విరిగితేను
చిత్తరువు ప్రతిమల వంటి సిరిగలశ్రీలు
ఆరూఢిగ గుండమున అందరు
పడుదురు''

ఆ కల విని పెద్దమ్మ అసుమానపడెను
"ఇక నొక కల గంటిని ఇంతి
ముద్దప్ప ! పద్మాక్షి ! నా దగ్గరనున్న పణతుల
కెల్ల
ముత్యాల చేర్లు తెగె ముదితరో వినవె
రంగైన ముత్యాలు రాల కల గంటిని
చేరు తెగి ముత్యాలు చెదర కల
గంటిని
ఈ కన్నకల ఎవరికి పడునో వివరించ
రమ్మ"
"పణతిరో నీవు గుణ్ణానకు పయనమై
పోగ
అక్కరో నీ దగ్గరనున్న అతివలకు
నెల్ల
ముత్యపు కన్నీరు ముఖమెంట జారు
చేరు తెగి ముత్యాలు చెదరి నందులకు
అక్కరో నీవు గుణ్ణానకు అదుకొని
పోగ
చుట్టుమళ్ళవారు చూడవచ్చేరు నిన్ను
కొలుకుల కన్నీరు గోళ్ళ జిమ్మేరు
మగువలు శోకాన మల్లడించేరు
జలజల కన్నీరు జారునో యమ్మ"
ఆ కల విని పెద్దమ్మ హరహర
యనుచు
"ఇక నొక కల గంటిని ఇంతి
ముద్దమ్మ

కమ్ముకొని నామీద కొమ్మ లందరు
రాగ
కొప్పులాడి గొజ్జంగులు కుప్పలు
బడెను
ఈ కల ఎవరికి పడునో
వివరించరమ్మ"
"అమ్మరో నీవు గుణ్ణానకు అదుకొని
పోగ
పరువులు బెట్టేటి పణతులకునెల్ల
కొప్పులాడి గొజ్జంగులు కుప్పలు
పడును"
"పక్షిణిగుండ్ల పేరు బన్న సరములును
కణుగులోపల బడ కలగంటినమ్మ
కాలంగ జూచి కాంత లందరును
కస్తిబడి ఏడ్వగ కలగంటి నమ్మ
ఈ కల ఎవరికి బడునో ఇవరించ
రమ్మ"
"పద్మాక్షి నీవు గుణ్ణానకు పయనమై
పోగ
చుట్టుమళ్ళవారు చూడవచ్చి నిన్ను
హరహరా అనుచు అడల కల
గంటివి"
"ఇక నొక కల గంటిని ఇంతి
ముద్దమ్మ
చేరు తెగి ముత్యాలు చెదర కలగంటి"
"వినవమ్మ ఈ కల వెలది పెద్దమ్మ
ధండు భోయిన పరివారము ధరణీశుచుట్టు

చెదరి చీకాకుపడ కల గంటివమ్మ''
"మరియొక కలగంటి మగువలార
తాను
కూర్చిన మువ్వాలు గుండ్లు నేవళాలు
కుంభిణి మీద ముద్దకుప్పలు బడెను
వినవమ్మ ఈకల వివరంబుగాను''
"పేరుగల దొరలు పెద్దగు తేజీలు
గద్దరి తేజీలు కలబడి నరికి
ఖర సూర్యబాణాలు కంఠములు నాటి
శరీరమున ఈటెలు జర్జితముగ నాటి
వలపట వల్లవులు దాపట
తిరుమందులు
కల్లిలో పోట్లుబడి కైవాలి
వరిగిరమ్మ''
ఆ కల విని పెద్దమ్మ హరహరా
యనుచు
కల్లిలో యాదవులు కై వాలి
వరిగినందులకు
అమ్మలార తన విభునకు అతిభార
మాయెనేమొ
"మరియొక కలగంటి మగువ
ముద్దప్ప
నాగప్ప కట్టించిన నవనందుల చెరువు
వెనుక
తరుణిరో గుణ్ణము త్రవ్వించ కలగంటి
పేరుగల ధూలాలు గుణ్ణమున పేర్చ
కలగంటి

పరగంగ మ్రాకులమీద నా విభుని
పన్నించ కలగంటి
పట్టుచీర విడిచి పసుపుచీర కట్టి
పుణ్యంపు నీరాడ కలగంటి పొన్నల
నీడను
ఇసుకను ఇల్లు కట్టి పసుపున గౌరిని
నిలిపి
పట్టి చేటలనోము పదిలముగ నోమి
పొందుగా నావంటి పోలెములు తీసి
పరగంగ బ్రాహ్మణస్త్రీలకు పంచిబెట్ట
కలగంటి
పషిణియూ పసినిమ్మపండ్లు అప్పలార
మీ చేతికి అందింప కలగంటి
ఈకల ఎవరికి పడునో
వివరించరమ్మ"
"ఏడేండ్ల బాలరాజును ఏన్నాళ్ళ
పాపను
అలరంగ మా చేతికి అందించ కల
గంటివి''
"చేకొంది కుంకుమ చేటలతోను
కుంకుమ వసంతము నామీద గుప్ప
కలగంటి
పసుపు చేటలతోను పదిలముగాను
ఆకులు పోకలు అందరు చెలరేగి
చెలరేగి నామీద చల్ల కలగంటి ఓ
చేడెలార!

అరుణోదయ వేళకు అప్పలార
తనకు
నెత్తురు అడియారాలు రక్తాన తడిసి
రక్తాన తడిసి రాను కలగంటి
కడపుండి కడదాక కాని కలలాయె
పాపపు సోమప్ప నాపాల లేడాయె
విషము కుతికను వుంచి నా విభుని
ఎడబాపె
కడలేని భక్తిని ఘనుని పూజిస్తిని
తప్పేది చేస్తిని దైవమా నీకు
తప్పు నావల్ల తా వోర్వవలదె
మాకు కుదురు లేను మాపాల స్వామి
అజుడు మా కిట్లనీ అడల వ్రాసినాడు
దామసాని పోతన్న తమ తోడబుట్టి
వల్లవుల మహరాజు వరచెట్టబట్టి
వగవ పాలై తినే వణిత ముద్దప్ప"
అప్పుడు కల్యాణపు అవ్వ లేమనిరి

"శీతాకాలము పండుబోయిన రాజులు
చిత్తమున వత్తురు
శీతాకాలము కలపు నీ చిత్తాన
వుంచకమ్మ
మొగిలుకాలమున రాజులు
మదియందు వత్తురు
మొగిలుకాలపు కలలు నీ మదియందు
వుంచకమ్మ"
"మొగిలుకాలపు కలలు కావు ముద్దప్ప
మన్నీడు కలవచ్చినాడు మరి
పొల్లుకాదు
శీతాకాలపు కలలు కావు ముద్దప్ప నా
శివుడు కలవచ్చినాడు
ఏగితె చిచ్చున బడ కలగంటి నేను
కలగంటి నేను ఓ వెలదులార !"
కలజెప్ప కలవిప్ప కడు తెల్లవారె
ఎఱ్ఱడాలు కప్పిన సూర్యుడు ఏతెంచె
నపుడు

## పెద్దిరాజు అడియారములు పెద్దమ్మకు చేరుట

ఆర్లపెంట రణమునుండి అడియారాలు
తెచ్చిరి
అంచలంచెల దాదులు అమ్మ సముఖ
మెరి

"శీతాకాలము కలలంటివి ముద్దప్ప
అతివలారా ! నా శివుని అడియారాలు
వచ్చెను

ఇక ఆలస్యము చేయరా''దని అతివలు రఘువీర తమకము పన్నించినాది
తాను రఘువీర తమకముమీద దేవేంద్రుని
అరవయ్యారు అపరంజి పళ్లేల నివాళి అరుగు
చేయించెను దేవేంద్రుని అరుగుమీద తివాసి
సొంపుతో బ్రాహ్మణకన్యలు శోభనం పరిపించెను
పాడ అడియారాలు వైనవైనాన వుంచెను
బంగారు చెంబుల తీర్థంబు గొంచుక పెద్దమ్మ
సాంబ్రాణి ధూపాలు సౌభక్తి గొంచుక రాజుకట్టిన ధట్టి రక్తమున తడిసె
ఏనుగ పొడవున అడ్డతెర పట్టించె దిట్టముగ వుండెను తెచ్చిన
దాదులమీద కైదండ లుంచుకొని అడియారాలు
ఏకాంతపు మిద్దె దాటి ఏనుగ జల్లులు తరకాసులు దానిమ్మపండ్లు
మొగసాల కాడికి నడిమిబ్రవేలి వుంగరము నాగపతి
ఏనుగ మొగసాలకాడికి ఎదురుగా కంకణము
వచ్చెను నాగపతికంకణము నందుల
పట్టుచీరెలు చించి ప్రాణేశు సురటియు
అడియారాలకు బంగారు కిరీటము-పషిణి జంఝుంబు
ప్రాణేశు అడియారాలకు పైద్రిష్టి రుద్రాక్ష తావళము భద్రాక్షసరులు
తీసెను ఏపకాయలంతేసి ఏడు సన్నలింగాలు
ఏదుము సాంబ్రాణి వేగముగ వలపట చెక్కిన వెండి తిరువంకిణి
వేయించెను దాపట కట్టిన పైడికుప్పె జముదాళి
వారబోసి పెద్దమ్మ వాలి మ్రొక్కెను కోదండ పోగులు గొడుగు పావాలు
అడియారాలు పైనవైనాన అందుకొనె మోహనమాల ముద్దుటుంగరాలు
తల్లి అడియారాలు పైనవైనాన వుంచె
కన్నులకు నద్దుకొనె కాంత తానపుడు పెద్దమ్మ
రాజు కట్టించిన వుక్కుటరుగు కుడిచెయ్యి లోగాను వలమురి తిరిగి
మేడలోపలను సాంబ్రాణి వెలిగించె సౌభక్తితోను
మద్దికాయ చవికెలో మరి వేగమున గొబ్బున రాజును కొనియాడ సాగెను

హ స్తములు ముకుళించి
అపుడిట్లగనియె :
''నా తియ్యమామిడిపండు : గొజ్జంగి
తరువ :
నా పున్నపు వెన్నెల : నా పూర్వ
బలమ :
నా మోక్షముగల రాజ : నా
జోడుకాడ :
అన్నదమ్ముల విడచి అందరను బాసి
పద్దన్న కల్యాణము పలదని వస్తిని
కాచన్న కల్యాణము కర్దని వస్తిని
కల్యాణము వచ్చినందుకు కలిగెను
సంతు
సంతు కలిగిననాడె జన్మభూములకు
మళ్ళిపోద మంటిని నామాట వినవైతివి
నామాట వినవైతివి నా ప్రాణనాథ
సంతు కలిగితే చాలు స్వామిలోకాలకు
త్రోవలు గలిగేనంటివి
పుత్రులు గలిగితే చాలు పుణ్యలోకాలకు
త్రోవలు గలిగేనంటివి
నీవు చెప్పిన మాట మనకు నిజమాయె
విభుడ
ఆర్లపెంటరణము నీకు అస్తమాన
మాయెను
నెత్తురడియారాలు నేర్పుగా బంపితివి
నీ బాలల నెవ్వరికి అప్పగించవైతివి

ఇటువలె సందునా ఈశ్వర మహిమ''
అడియారాలు తెచ్చినవార్ని అందరిని
పిలిచి
''అంగిరేకుల మారన్న అడప ఎల్లారి
కత్తి బట్టినవాడు కాలారి మారు
గొడుగు బట్టిన వాడు గొడుగు పోలన్న
సురిటి వేసినవాడు కుంచె గోవిందు
భట్టుదేవ రాజులార : బ్రాహ్మణోత్తము
లార :
ఆత్మ బంధులార : అశోధ గాంది''
బంటుకు చేతివేసి చిలకముద్ర మాదలు
చిలకముద్ర మాడలు ఈనాము
లిప్పించె
తాళి చపుకట్లు ఇప్పించి సంతోషపరచె
అంగిరేకుల మారన్నను అమ్మ
తా పిలిచి
''మా రాజు పరాక్రమము మాతోను
చెప్పుమ
ఎన్ని కుంభిళ్ళ సాధించె ఎందరు
పగరాజుల గెలిచె
ఎచ్చోట వరిగెనో యదుకుల దీపకుడు
రాజుకన్నా ఘనులు రాజువెంబడి
వచ్చిరి
దాసిన వియ్యము దామసానివారు
భట్లు ఏమైరో బ్రాహ్మణులు ఏమైరో
మా రాజువద్దను ఏ రాజు వరిగెను ?''

ఆ వార్తకు అంగిరేకుల మారన్న
హస్తములు మొగిచి
"అమ్మరో పెద్దమ్మ! అతివేగ వినుమ
రాజు చేసిన యుద్ధము ఘోర
యుద్ధమమ్మ
ఏడేడు కుంభిళ్ళు ఏర్పరచినాడు
కుంభిళ్ళ రాజుల కూలంగ నరికి
కడ కుంభిణిమీద గరుడ స్తంభ
మెత్తించి
స్తంభాన వీసరిగండ మనే తాము
మెలిపించి
తూమున తూమెడు జంఝాలు కొల
బట్టించినాడు
తూముకు పక జంఝము కొదవయ్యె
నమ్మ
జంఝము, కొదవయినపుడే తన
సాహసము తక్కువన్నాడు
వాలికేతువురాజు మీదికి పైబడి నడిచెను
పక జంఝమునకు పైబడి పోరి
లక్ష వెయ్యి జంఝాల రాజుల
కూల్చెను
వాలికేతువునిమీద పైబడి పోరాడి
ఆరు శిరస్సులు పండ్రెండు హస్తాలు
గల

అస్తపతి రాజుకొమారుడు వాలికేతువు
రాజు
రావణ బ్రహ్మంత రాజటి వాడు
ఎంగిలి ప్రాణాలకు ఆశించినాడు
కుడి భుజమున వానికి కుమ్మరివాడు
ఎడమ భుజమున వానికి కమ్మరివాడు
శిరస్సులు నరికినా మళ్ళీ
అతికిస్తున్నారు
వాలికేతువు రాజు మీద వైరంబు
పూని
ఉదయాస్తమంబుల వొక్కటై వడి
పోరి
వాలికేతువురాజు బాణము వక్షస్థలమున
నాటి
అలసి పరగినాడు అమ్మ పెద్దమ్మ
బంగారు రేకుల పరగంగ చదివె
ఆత్మబంధువులార నా అన్నలార
ఎంచగా నా కొడుకు ఏడేండ్లవాడు
కాంత సోమలింగము కాటమరాజు
గంగువారు కట్టించిన పోతుగరిడి
లోపలను
పన్నిద్దరు రాజులతో పట్టి తాళము
పట్టుచున్నాడు
ఈ వార్త తన సుతునకు విన్నవించు
మనెను"

## గరిడిలోనున్న కాటమరాజు తండ్రి మరణవార్త వినుట

అమ్మ చేత శలవంది ఆ భట్టురాజులు
కాటమరాజు సముఖానికి ప్రయత్నైన
కదిలిరి
అయ్యవసరాన కాటమరాజుకు
కైవారము చేసిరి
"కల్యాణ మహీపతే! కాట భూపాలా!
శంభుడా! యాదవాళి చిన్న
సోమలింగమా!
వినుతి కెక్కిన కాటమ!
విక్రమశాలి!"
అని భట్టురాజులు ఆర్భటించి చదువ
గంగవారి పోతుగరిడి లోపలను
సంతతి శుభకరుడు! సాము
చేయుచును
మహిమంత పన్నిద్దరు మాష్టీలతోను
పట్టి తాళము పట్టి పల్లడి వేయుచు
చుట్టు పేరంటారు బెట్టుగా రాజు
ధాత్రి సంతోషమున దండెములు
దీయు
పందుమురాళ్ళ గోతము రాజు పట్టి
యాడుచును
ఏడుమురాళ్ళ గోతము ఎత్తి
యాడుచును
ముత్తూము రాళ్ళ గోతము మునుగాళ్ళ
జిమ్మెను

పంచిన గుండెత్తి పల్లటి వేయుచు
కొండదాన వెసగుచు కొమరు దీపింప
రాగి స్తంభము పట్టి రాగిల్లి పెనగు
వెండి స్తంభము పట్టి వెనుకడుగువేయు
ఉక్కు స్తంభముపట్టి ఉరవడి పెనగు
పలుపలి విధముల పటుగతి పెనగ
గరిడిని సాము చేయు ఘనుడు
కాటమరాజు
అర్ధపెంట రణమునుండి అడియారాలు
వచ్చెను
అంగిరేకుల మారన్న ఆదప యల్లారి
చెంచుల వీరమల్ల కుంచె గోవిందు
రణభూపతి యని భట్టురాజుల
పొగడ
పొసగంగ బిరుదులు చదివెను రాజు
పోతురాజు
"ఎనిమిది గొడుగులు దొరయ
శంఖులును
వీరణములమీద వీరనాదాలు
కంచుకొమ్ముల రణభేరి కలిగిన
రాజా!
శరణన్న గాతువు కరుణా విధేయ!
గండ భేరుండాలకు గురువు పెద్దయ్య
నందిబెత్తములును నరపముజు
గొడుగులు

గంట గాలములును గజలంక బిరుదులు
జల్లిమీద నిలిపిన జగజంపు గొడుగులు
కనకంపు రణభేరి కలిగిన రాజ !
పలరాజుపుత్రుండు వంశవర్ధనుడు
అరులను నురుమాడి ఆ కల్లిలో చెల్లె"
అని ఆర్భాటము చేసి ఆదిగొని చదువ
కాటమరాజు విని కడు వేడ్కతోను
వల్లవుల మా అయ్య దండుబోయి వచ్చెనేమొ యనుచు
సోరిగళ్ళ గుండా చూసెను భట్లవంక
చిన్నబోయి రాగాను చేరవచ్చి చూచెను
దుర్గ దయ తప్పెనేమొ మా తండ్రి రాడాయె
సంగడీలతో రాజు చయ్య నేతెంచె
కొమరైన ముఖశాల కూటమున నిలిచె
అప్పుడు భట్టులు ఆ రాజును గాంచి
పసి పట్టుభద్రుని ప్రస్తుతి చేసిరి
"సకల సౌభాగ్య చతుర పుణ్యాత్ముడ !
నిజలోక పుణ్యాత్మ సీలవర్ణుండ !
యదుకుల నందన ! యశోద తనయ !
కాంతిగల చంద్రుడా ! కాటమేశ్వరుడ !
కాటు భూపాలక ! ఘనుడు మీ అయ్య
పనుపడి రణమున పగతుల ద్రుంచి
కుంభిళ్ళ రాజుల కూలంగ నరికి
ఆర్లపెంట రణమున హతమాయె నయ్య
అడియారములు చెప్తిమి మీ అయ్యవద్ద నుండి"
ఆ వార్త విని రాజు ఆళ్ళున నవ్వెను
చెక్కిట బాగాలు చెదరంగ నవ్వెను
పుక్కిట తాంబూలము భూమిపై వుమిసె
రాచకుమాళ్ళు చూచి రాజుతో ననిరి
"వల్లవుల వో రాజ : వంశాబ్ధిచంద్ర !
మీ ఆయ్య కూర్చుండే ధర్మ సింహాసనము
నాకు దక్కేనని నవ్వితివా నా యన్న నీవు !
మీ అయ్యకు బట్టేటి భూచక్రాల గొడుగు
నాకు బట్టేరని నవ్వితివా నరనాథ చంద్ర !
మీ అయ్యను కొలిచేటి ఆరువేల వల్లవులు
ఏడు వేల మన్నె తిరుమందులు
నన్ను గొలిచేరని నవ్వితివా వల్లవుల రాజ !
తండ్రి చెల్లినాడంటే ధైర్యంబుతోడ

నవ్వేది విహితమా నలనన్న నీవు?''
ఆ మాట కిట్లనెను ఆ రాజఘనుడు
''ఆర్లపెంట రణమున మా అయ్య
చెల్లితేను
సూర్యుని తేజస్సు వేరయి వుండు
నెల తప్పి పొడవవలెను నేలతిమురు
పుట్టవలెను
పగలు నక్షత్రమండలాలు
కానరావలెను
గంగువారి పోతుగరిడి ఎర్రడాలు
కప్పవలెను
నా చేతి కొరుడు కటారి కోల
వక చెయ్యి రెండు చేతులు ధర
తప్పవలెను
నా మెడనున్న వెండి పుత్తడి జందెము
పెనుబాములై మెడను పెనగొన వలెను
మద్దులు మారేళ్ళు మరి సాక్షి పలుక
వలెను
కట్టమీద వున్న రాతిబసవన్న
కాలుదువ్వి ఖణేలు మని రంకె
వెయ్యవలెను
కాకులు మూకలై కలవర పడితే
అప్పుడు మా తండ్రికే హతమౌట
నిజము
సాక్షులు పలకలేదు మా అయ్య
చెల్లలేదు''

పట్టుమని పడు తాళములు పట్టేప
రాజు
సూర్యుని తేజస్సు వేరయి తోచె
నెల తప్పి పొడిచెను నేలతిమురు
పుట్టెను
పగలు నక్షత్రమండలాలు కానంగ
వచ్చెను
గంగువారి పోతుగరిడి ఎర్రడాలు
కప్పెను
చెయితప్పి గజ్జెల కటారి కోల
ధరమీద వ్రాలెను
రాజుమెడ నున్న వెండి పుత్తడి
జందెము
పెనుబాములై మెడను పెనగొన సాగె
మద్దులు మారేళ్ళు మరి సాక్షిపలికె
కట్టమీదనున్న రాతిబసవన్న
కాలుదువ్వి ఖణేలుమని రంకె వేసెను
కాకులు మూకలై కలవరపడెను
సాక్షులు పలికెను చక్కని
బాలరాజుకు
అప్పుడు చిన్నబోయెను ఆ
రాజఘనుడు
చంద్రకాంతి దప్పెను చక్కని
రాజుకు
''సంగడి బాలలార ! నా యన్నలార !

ఆర్ల పెంట రణమున మా
అయ్యచెల్లితేను
కంట నీరుపెట్టి కడు దుఃఖపడిన
వగచిన మా తండ్రి వచ్చునా యిటకు
వీర శూరులార ! విను డొకమాట
పోట్లాట అంటేను కోటిలాభ మందురు
కల్లి అంటేను కాల యముడందురు
చావు అంటేను పెండ్లియని
సంతోషపడుదురు
చావని వారెవరు జగతిలోపలను
పుట్టినప్పుడె బ్రహ్మ గిట్ట వ్రాసినాడు
ఎంత నీట్టరికైన బ్రహ్మదేవునికైన
ఆయువు క్రుంగితే హరుడికైన
వశమ ?
ఎంతవారికైనను నూరేండ్లు కాద ?
అంతకన్న కలద ఆ బ్రహ్మవ్రాలు
దుఃఖపడితే వత్తురా ధీరాత్ములార !''
అని సమ్మతించెను ఆ రాజఘనుడు
గంగురాజు కొమారుడు, తమ్ముడు
రాఘవన్నను పిలిచి
వురువార ఎత్తుకొని ధరణిపై దించెను
ముద్దుపేరున పిలువంగ ముద్దు
రాఘవన్నను
''శీఘ్రాన సెలవిచ్చి పంపుమా
తమ్ముడా !
అయ్య చెల్లిన పంభిళ్ళకు కదలి నే
పోయి

అయ్యను సంహరించిన పగరాజును
హతమార్చి
వాని శిరస్సులు తెచ్చి వైనవైనాన
అయ్యపాదాలకాడ కానుక బెట్టి
స్వామిలోకాల నున్న చక్కని మా
అయ్యను
తెచ్చేను నన్నంపు తమ్ముడా
రాఘవన్న !''
ఆ మాట విని రాఘవుడు అన్నన
నవ్వేను
''యదువంశపు రాజ ! నీ వెంట నే
వత్తును
ఈడైన రాజు యుద్ధమునకు
పోంగాను
జోడైన రాజు పట్నాన వుండేది
చులకనౌనన్న
రణమునకు నీవెంట నేను అరుగుట
లెన్న
ఎంతైన నేను నీకు అనుబలిమి కాద''
ఆ మాట విని రాజు అపు
డిట్లనియె :
''ఇద్దరము కదిలితేను ఏలాగు
తమ్ముడా
మొలతాడు గట్టిన మొగవాడు పట్నాన
లింగమందాయెను
విషమెయ్యి జంఝాలు మారాచ
రాజులు

లక్షవెయ్యి జంఝాలు యాదవ
రాచకొమాళ్లు
కుంభిళ్ళమీదను కూలిరి తమ్ముడా
ఇందరు మరణముకు విదివడి పోతేను
కల్యాణ దేవగిరిపట్నము కనకరేపల్లె
పాడవును తమ్ముడా పట్న
మంతయును
నీవు రణమునకు పోతేను
నే నుండవలెను
నేను రణమునకు పోతేను నీవుండ
వలెను
ఇద్దరము రణమునకు వేంచెయ్యరాదు"
అని యిట్లు తమ్ముని పట్నాన వుంచి
ఘనమైన చక్రాల గరిడిలోపలను
సాధన కొరుల్ల రాజు చక్కన
చేర్చెను
ధరణి సాగి భేతాళునకు దండము
పెట్టెను
"ఏమని దూరుదు భేతాళ ఏమందు
నిన్ను
కాపాడి వకసారి గడప లేవైతివి
వలపక్షపు దైవమా! మా తండ్రిని
వప్పగించి వస్తివి
ధైర్యంబు చాలక పముజుబంటువై
పారిపోయి వస్తివి"
దూషించి భేతాళని దూరెను మిగుల

మట్టిదట్టీలతోను మరి వేగ రాగ
వుక్కుటిరుగుల మేడమీదనుండి
పంచెత పెద్దమ్మ
తనయుని రాకడ తల్లి తా జూచెను
చందనగంధుల చయ్యన బిలిచి
"నలినాక్షులార చూడరే నా తనయుని
రాకడ
ఇన్నాళ్ల నా సుతుడు ఏతెంచిరాగ
పల్లకీ లందలాలు పడువారి తేజీలు
గొడుగులు పడిగెలు ఘోషించు భేరీలు
ముందర అలికీలు ముస్తీదు రాగ
వెనుక వింజామరలు వేటు రుమాళ్ల
వేయి విధంబుల వేగంబె వచ్చును
ఇప్పుడు వచ్చేరాకడ ఇంతులార
చూడరే
సేనలు వెంట రాలేదు తేజీలు
ఎక్కలేదు
వంటరిగా నా సుతుడు వక్కడే
వస్తున్నాడు
తండ్రిగల రాజుకు తగును
గారాబములు
మురిపెముతో తండ్రిముందర ముద్దు
చూపుదురు
మురహరుడు దయ తప్పె కొడుకు
మురిపెంబు దప్పెను"

తరుణి పెద్దమ్మ యిట్లు తలపోత
పోయగా
తల్లిదివాణముకు తనయుడు వచ్చెను
అరవయ్యార్రుగురు దాదులు అతివేగ
నంత
ఏనుగు మొగసాలకాడికి ఎదురుగా
వచ్చిరి
పదార్థన చేసిరి బాలరాజు కపుడు
పట్టువస్త్రము దెచ్చి పైదిష్టి తీసిరి
తల్లిదివాణముకు వచ్చెను తనయుడు
నలనన్న
తల్లికి సాష్టాంగ దండంబు పెట్టెను
పుక్కుటరుగుల మేడమీదనుండి తల్లి
కుమారుని చూడగానే గుప్పున
దుమికెను
ఏడేండ్ల బాలరాజును ఎత్తుకొనె తల్లి
పురువార ఎత్తుకొని ధరణిపై దించెను
చెక్కిలి ముద్దాడి చక్కని తండ్రిని
"మొక్కకు మొక్కకు కొమార
మొగధీర ఘనుడవు నీవు
నీయంత రాజులు నీకు మొక్కగను
వసుధేశపుత్ర నాకు వాలి మొక్కితివి
నీవు నిలచి మొక్కిన నిమ్మళము
తనకు
ధరణి సాగిలి మొక్క ధర్మంబు
గాదు

దుర్గాల మన్నెవారు విన్న దూతేరు
నిన్ను
పట్నాల రాజులు పలచంగ చూతురు
చావిళ్ల మన్నెవారు చౌకదనము చేతురు
ఆడవారికి మొక్కితే అపకీర్తి కొడుక
హస్తము లెత్తి మొక్కితే మీ
ఆచార్యులకు మొక్కవలెను
ఆర్లపెంటనున్న మీ అయ్యకు
మొక్కవలెను
నాకేల మొక్కితివి ననుగన్న తండ్రి"
ఆ మాటలకు రాజు అప్పున నవ్వెను
"ఎంత మాటాడితివి ఎర్రి నా తల్లి
నీకన్న గురువెవరు తనకు ఓ ఎర్రితల్లి
తల్లికి మొక్కని స్తనయుండు ఏల
తల్లిదండ్రుల బోలిన గురువు
దైవంబు లేదు
పెల్లునంబును బోలిన ఆయుధము
విలలోన లేదు
జటాంగును బోలిన తపస్సు లేదు
ఈ లోకంబు బోలినది ఏ లోకంబు
లేదు"
అ మాటకు తల్లి హాశ్చర్యపడెను
"పుట్టవు పెరగవు భూమిమీద లేవు
ఎంచంగ పెంచంగ ఏడేండ్ల రాజువు
ఎవరు చెప్పిరి కొడుక ఇంతలేసి
బుద్ధులు

రాజశేఖరః మ్రొక్కితే రాజులకు
మ్రొక్కు
పడిసాగిల మ్రొక్కెను పట్నపురాజు
వన్న!
రావోయి కొమార! రాజ నలనన్న!
మీతండ్రి ప్రాలు వచ్చేను కొడుక
వుండరాదు ఇచ్చట, స్వామి
లోకాననుండి చక్కని మీ తండ్రి
నెత్తురడియారాలు నేర్పుగా పంపెను
పోరాడి రాజును తెచ్చినందులకు
నా పుణ్యవశమున నే గోరినట్లు
నా గర్భమున నీయంత కొడుకు
కలిగిన ఫలము
శీఘ్రాన సెలవిచ్చి పంపుమా కొడుక
మూణ్ణాళ్లు వెళ్లితేను ముండకూడదందురు
వుండరాదు భూమిమీద వుచితంబు
గాదు
ఏనాళ్లు వెళ్లితే ఎదవకూడదందురు
అన్నమారగించితే అమరులు మెచ్చరు
దాహ మారగించరాదు తాంబూళం
చేయరాదు
ఏగి లెగచి చూడరాదు ఎవరి ముఖము
కొడుక!"

## తండ్రిపగ తీర్చుటకై కాటమరాజు తల్లి అనుమతి కోరుట

ఆ మాట విని రాజు అక్లననవ్వెను
"ఎంత మాటాడితివి ఎర్రి నా తల్లి
అర్లపెంట రణమున మా అయ్య
చెల్లితేను
వంటకట్టెలకు ప్రాణ మిచ్చేవటే నా
కన్నతల్లి!
వూరక ప్రాణ మియ్య వుచితము కాదు
పూబోణి వినుము నీ పురుషునికొరకు
ప్రాణము నెడబాయ భావ్యంబు కాదు
నావంటి సూనుడు నీకును గలిగి
నిప్పులలో ద్రోయ హితమటే తల్లి
క్షితిని లోకము లెల్ల సిరిచాపగను చుట్టి
చతురమధ్యములు శాణభూములు వెదకి
దేవేంద్ర లోకము తెగువతో పోయి
ధీరత నీపాలి దేవాధిదేవుని
కామినీ నీవున్న కనకరేపల్లెకు
తెచ్చెద నేనిపుడు తల్లి పెద్దమ్మ!
అమ్మరో సెలవిచ్చి అంపవే నన్ను
నాతండ్రి చెల్లిన కుంభిళ్లకు కదలి నే
పోయి
మా అయ్యను సంహరించిన
పగరాజును హతమార్చి
వాని శిరస్సులు దెచ్చి మా
తండ్రిపాదముల కాడ
పెదకానుక పెట్టేను ఓ కన్నతల్లి!

ధీరాత్మ నీపాలి దేవాధిదేవుని
తెచ్చేను నన్నంపు తల్లి పెద్దమ్మ
దీవించి భూతిని ధరింయిచవమ్మ"

## పెద్దమ్మ బాలుని యుద్ధమున కంపుటకు భయపడుట

ఆ మాటకు తల్లి విలవిలబోయె
నాగుబాముపంటి నడుము నక్కన విరిగెను
ఎడమన వున్న నల్లగుండె ఏడు వప్పులాయె
నడవ కాళ్లాడక నాతి యిట్లనియె
కరకంఠుని దలిచెను కలికి పెద్దమ్మ
గంగను దూరెను కాంత పెద్దమ్మ
"పాపపు సోమప్ప ఫలము చెరచితివి
ఏమి జేతును ఈశ్వరా! ఏమందు విధిని!"
హా పుత్రా! యని రాజును అక్కున జేర్చె
కొమారుని జూచి కోమలి యిట్లనియె:
'ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక
నిన్నంప ధైర్యంబు నిలుపదు తండ్రీ!
రాజ తేజోనిధీ! రత్నాల కుప్పా!
డువ కాళ్లు లేవు నా ముద్దుచిలుక!
నొసలు మీటితేను కొమార వస గారేను
నచెక్కిళ్లు మీటితే కొమార పాలు గారేను

మిక్కిలి నెత్తురుముద్దవు నేకన్న కొమార!
బాలరాజు లేనాడు? పగరాజు లేనాడు?
మీ తండ్రి చేసిన యుద్ధము చెప్పేటప్పటికి
ఎడమనున్న నల్లగుండె ఏడు వప్పులాయెను
కదన రంగము రీతి తుదముట్ట వినుము
పోడు నరికివైచిన పోలిక నుండు
ఏనుగలు పీనుగలు ఏకమై రణమున
ఏర్పడి వున్నాయి కొడుక ఎట్లు పంపుదును
అటువంటిరణమున అఖిల భూతములు
కోటానుకోటులు కొరివి భూతములు
బహుభూత గణములు బ్రహ్మ రాక్షసులు
ప్రేత పిశాచములు రణములో గల వు
మరివిను మృగములు మందలై యుండు
తోడేళ్ళు కణుజులు దొడ్డ మృగములును

మారేడు కణుతులు మందలై యుండు
చూడ శక్యము కాదు చొచ్చి యా
రణము
కల్లి చూచి నీవు కలవరపడేవు
ఏనుగుల చూచి కొడుకా ఏడ్వబోయేవు
పీనుగుల చూచి కొడుకా పిరికిబారేవు
గుఱ్ఱాల చూచి కొడుకా గుండెలగిలేవు
భూతముల చూచి కొడుకా భీతిరిల్లేవు
నక్కలు తోడేళ్ళు నరమాంసము
మెసవి
వూళలు పెట్టుచు వుకో వుకోయనుచు
కొల్లగా భూతాలు గుంపులై యుండును
కండ లారగించి భూతాలు కావరించి
వున్నాయి
మాంస మారగించి భూతాలు మత్తులై
వున్నాయి
తన్ను తా నెరుగక దండి భూతాలు
కొవ్వు లారగించి భూతాలు కుట్టుబడి
యుండు
కాళ్ళ ఎముకలు పిల్లనగ్రోవుల జేసుక
వేణునాదములు నాదించు
వెఱ్ఱిభూతాలు
పొక్కలు చంకలకు తగిలించుకొని
జమిలికలు వాయించు జంటుభూతములు
తలకాయ పుఱ్ఱెలు హస్తాల బుచ్చుకొని
అయ్యగారి శివశక్తులమని ఆడును
భూతాలు
చాలినన్ని పీనుగుల చంక
నిముడ్చుకొని
తిరుగాడుచుండెను తిఱ్ఱిభూతాలు
ఏనుగుల పీనుగుల రాసుల జేసుక
చాలదని వెళ్లేటి జంకుభూతాలు
అటువంటి కల్లికి అయ్యా! నిన్నంపి
నిమ్మళించి నా బొంది నివిచేన కొడుక
పగవాని రణముకు బాలరాజ నిన్నంపి
మల్లెల పాన్పుమీద మనసెట్లు పొందును
చేకొంది నీచేతి చంద్రాయుధాన
ఏటూరు తునియలుగ ఏసిపో కొడుక":

## బాలరాజు ధైర్యోక్తులు

ఆ మాటకు రాజు అప్పుడ నవ్వె
"ఆర్లపెంట రణమున మా అయ్య
వుండగాను
శంకభయములు నాకు చెప్పకే తల్లి
రాక్షసిభూతాలు నాకు ఎదురటే తల్లి
బాలుడనని నీవు భ్రమత పడియేవు
బాలుడు గాదా తొల్లి దాంత్రిష్ణమ్మ ?
పూతన చనుద్రావి పొలియించలేద

మూడవ నెలలోనె ముద్దుకృష్ణుండు
బండి విరగదన్నె బాలుడుగాడ ?
ఏడాది బాలుడై ఎగసి తృణావర్తుని
మెడపట్టి కూల్చెను మేదినరుదంద
చిన్నిబాలుడు గాడె సిరియాళుడు తొల్లి
కంచి వాడలు ఏడు కదలించె
ఎరుగవా ?
పణతి నీ నోముఫలమును గూర్చ
కొమరుడ నైతిని కువలయతాక్షి !
ఎదురెవరె నా కత్తికి మదిరాక్షి తల్లి
కన్న మోహమున నీవు కానకున్నావు
తొల్లి లంకాపురి పట్నములోను
రాక్షసుల సంహారించిన రాజును నేను
రామలక్ష్మణ కుమారులు బాలలు గారా?
రావణసేన లెల్ల మూర్ఛపో జేసిరి
చిన్నది కాదటే తల్లి సింహపు కొదమ
భద్ర గజముల మీద పడదుముకుట
ఎరుగవా ?
చిన్నది కాదటే సాలవపక్షి, ఎరుగవా
తల్లి,
స్వాతికొంగల మీద సాల్పుగా నడిచేది?
చిన్నవాడన్నమాట నీ చిత్తమున
వుంచకు
దేవేంద్ర లోకమున తెగువతో వెదకి

ధీరాత్మ నీపాలి దేవాధిదేవుని
తెచ్చెను సన్నంపు తల్లి పెద్దమ్మ
పరుసూట లాడక మంచి వాక్యమున
అమ్మరో దీవించి అంపవే నన్ను !
ఏనాళ్ల దాకను ఎదురు చూడవమ్మ
ఆనలు బెట్టేను అమ్మరో నీకు
తముకము దిగితివైన త్రయిమూర్తు
లాన
అమ్మరో దీవించి అంపకుంటివైన
మీ మామ వలరాజు పాదంబు లాన
మీ అత్త వల్లాంబ పాదంబు లాన
మా అయ్య వెల్లిన కుంభిళ్లకు
అంపకుంటివైన
మా పెదితండ్రి సింహాద్రిరాజు
పాదంబు లాన
ఆర్లపెంట రణములో చెల్లిన మా తండ్రి
పాదంబు లాన
మా పినతండ్రులు యరనూకరాజు
నలనూకరాజు పాదంబు లాన
ఆవుల పోలురాజు పాదంబు ఆన
జంగమాన లింగమాన సదాశివుని ఆన
నీలకంఠుని ఆన నీ పాదంబు లాన
పణతిరో నీపట్టి పాపన్న యాన
ననుగన్న తల్లిరో నామీద ఆన

## పెద్దమ్మ కాటమరాజును దీవించుట

అమ్మరో దీవించి అంపవే నన్ను"
అమ్మకు దీవించ ఆడదాయె నోరు
"ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక
ఆకాశవాణి భూకాంతను బోలి
హరివంశపు రాజు మీ తండ్రిని
గలుసుక
తలపువ్వు వాడక తలికే మీ తల్లిని
కలియ రావన్న!"
"ఆకాశవాణి భూకాంత దొడ్డవారే కాని
వారికి వోక్షమున్నది వో కన్నతల్లి"
"వారికేమి వోక్షమున్నది వో
కన్నకొడుక?"
"అన్న తమ్ము డొక చేను పాళ్ళు
పంచుకొని
దున్ని పైరులు పెట్టుదు రమ్మ
అన్నచేను వెండును తమ్ముని చేను
పండును
భూదేవి వలపక్షము కాదటే వో
కన్నతల్లి?
ఆకాశవాణి అనగ వినవే వో కన్నతల్లి
వక భూమిని వర్షములు కురియును
వకభూమిని శాంబరము దొర్లును
ఆకాశవాణిది వలపక్షము కాదటే వో
కన్నతల్లి?
వోక్షము లేని రాజు కొమారుడను
తాను
వోక్షములేని దీవెన దీవించవమ్మ"
"ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక
సత్యమునకు దొడ్డవాడు ధర్మరాజును
బోలి
హరివంశపు రాజు మీ అయ్యను
కలుసుక
తలపువ్వు వాడక తలకే మీ తల్లిని
కలియ రావన్న!"
"వాని దీవెన నేను వల్లనే వో కన్నతల్లి
ధర్మరాజనగా దొడ్డవాడే కాని
గురువును జంపిన కులద్రోహి వాడు"
"ఇక ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక
సత్యానికి దొడ్డవాడు హరిశ్చంద్రుని
బోలి
హరివంశపు రాజు మీ అయ్యను
గలుసుక
తలపువ్వు వాడక తలికే మీ తల్లిని
కలియ రావన్న!"
"హరిశ్చంద్ర మహారాజు దొడ్డవాడే
కాని
అలిబిడ్డల ఇల్లడచేసి అన్యాయము
చేసినాడమ్మ.
కులహీనుని గొలిచి తాను
కులభ్రష్టుడాయె నమ్మ.
మాలవాని ఇంటికి మధుమాంసంబుల
కావిడి బెట్టుక గ్రక్కున మోసెను

వాని దీవెన నేను వొల్లనే వో
కన్నతల్లి!''
''ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక?
సత్యమునకు దొడ్డవాడు బలిచక్రవర్తి
బోలి
హరివంశపు రాజు మీ అయ్యను గొంచుక
తలపువ్వు వాడక తలికే మీతల్లిని
కలియ రావన్న!''
''అమ్మా! బలిచక్రవర్తి దొడ్డవాడే కాని
వానికి మోక్షమున్నది వో కన్నతల్లి!
హరి మూడు అడుగులు అడిగె దానంబు
ఇస్తునని దానంబు ఇస్తు నన్నాడు
ఆకాశమును వక అడుగుగా జేసెను
ధరణిని రెండవ అడుగుగా జేసెను
మూడవ అడుగున చక్రవర్తిని
క్రుంగ ద్రొక్కినాడు
వానికి మోక్షము కాదా వో కన్నతల్లి?''
''ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక
పరాక్రమమునకు దొడ్డవాడు
కార్తవీర్యుండు
ఆ చక్రవర్తిని బోలి నాయన్న
హరివంశపు రాజు మీ అయ్యను
గొంచుక
తలపువ్వు వాడక తలికే మీతల్లిని
కలియ రావన్న!''
''వాని దీవెన నేను వొల్లనే వో కన్న
తల్లి
గోవుని బ్రాహ్మణుని చెనికిన వాడు''
''ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక?
శౌర్యంబు గలవాడు జమదగ్నిరాముడు
ఆతనిని బోలి నాయన్న
హరివంశపు రాజు మీ అయ్యను
గొంచుక
తలపువ్వు వాడక తలికే మీ తల్లిని
కలియ రావన్న! ''
అది విని కాటమరాజు అప్పుడు నవ్వెను
''అమ్మరో ఈ దీవెన హరుషంబు
గాదు
పరశురాము డయితె పరాక్రమశాలియే
కాని
ఆతనికి మోక్షమున్నదే వో కన్నతల్లి
అది యెట్టిదని నీవు అడిగితి వైన
తన తండ్రి జమదగ్నికి సమ్మతిగాను
తల్లి రేణుకను తెగటార్చి నట్టి
ఆత్మద్రోహమును అణంచంగలేక
హస్తములు ఖండించుకొన్నాడు
అమ్మరో నాడు
అటువంటి దీవెన అమ్మరో వొల్లను.''
''ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక?
రామ లక్ష్మణుల బోల్తు రాజకుమార?''
''రామలక్ష్మణులును రమణి పెద్దమ్మ
సీతను గోల్పోయిరి క్షితియెల్ల ఎరుగ
వారిబోలు దీవెనలు వల్లను తల్లి''

"హనుమంతు బోల్తునా అయ్యా
సుపుత్ర ?"
"హనుమంతుడు వినుమ ఆ లంకలోన
కంనిలో ఇంద్రజిత్తుకు కట్టుబడినాడు
వానిబోలు దీవెన వల్లను తల్లి"
రాజుమాటలు విని రమణి యిట్లనియె :
"ఆ దీవెన వద్దంటివి బాల నాతండ్రి
పొందుగా కుశలవుల పోలి నాయన్న
హరివంశపు రాజు మీ అయ్యను
గొంచుక
తలపువ్వు వాడక తలికే మీతల్లిని
కలియ రావన్న !"
తల్లి దీవించిన తనయు డిట్లనియె:
'అమ్మరో నీ మాటకు అన వెరతుగాని
ఏల పోలి స్తివే ఎలనాగ నన్ను ?
రాముని సుతులైతే నాకన్న ఘను
లౌదురమ్మ
అలనాడు ఎరుగక ఆ రామబలములతో
తెగువతో పోరిరి సామంతమునను
వారి తండ్రిని కానగాలేక వసుధేశు
రాము
తండ్రిని ఎదిరించిన తనయులట వారు
తగదు ఈ దీవెన ధర్మంబు తప్పకు"
"ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక ?
కృష్ణుని పోల్తునా కులపావనుండ?"

అన విని తనయుండు అమ్మ కిట్లనియె
"ద్రేపల్లె లోపల రేయిపగలనక
స్త్రీలలో క్రీడించి చెలగుచు నుండు
రోటను గట్టెను తాను యశోద
అంతమున ఎరుకచే వేటుపడ్డాడు
వానిబోలు దీవెన వల్లను తల్లి"
"పాండవుల బోల్తునా పరగ
నా కొడుక?"
"కౌరవులకు పాండవులకు కలహంబు
పుట్టె
జూదమాడి పాండవులు వోడిరి భూమి
ద్రుపదపుత్రిని తమ వెంటబెట్టుకొని
వనవాస మేగిరి పణతి పెద్దమ్మ
వారిని బోలు దీవెన వల్లను తల్లి."
"ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక?
సత్యమునకు దొడ్డవాడు గురుభక్తుని
బోలి నాయన్న నీవు
హరివంశపు రాజు మీ అయ్యను
గొంచుక
తలపువ్వు వాడక తలికే మీతల్లిని
కలియ రావన్న!"
"వానికి వోషము వున్నదే వో
కన్నతల్లి"
"వానికేమి వోషము వో కన్నకొడుక"

## గురుభక్తుని చాటువ

"అమ్మా గురుభక్తుడు దొడ్డవాడేకాని
వాని తలిదండ్రులు వుభయ
మానవతమ్మ ధరణికేతపురాజు
సంతానము లేక చాల కొన్నాళ్లు
పట్టరాని వ్రతములు పట్టిరి వారు
నోమరాని నోములు నోచిరి వారు
ఆకుగాని ఆకెల్ల పత్రిగా నోమిరి
రాయిగాని రాయెల్ల శిలగాను నోమిరి
పన్నెండు ఏండ్లకు పరమేశ్వరుండు
మెచ్చి సంతానము ఇచ్చెను శివుడు
నెమ్మదిగా గర్భంబు నిలచి ఇటువలెను
మల్లికార్జును గుడికి మళ్లి రాగాను
గండభేరుండ పక్షులు పిల్లలు జేసుక
పిల్లమేతలకు పక్షులు పోయె దూరంబు
ధరణికేతువ రాజుతో
వుభయమానవతమ్మ
ఆ పక్షుల జూచి అధిక సంతోషమయ్యే
ముద్దాడవలెను నా మోహంబు దీర
ధరణికేతవురాజు వృక్షంబు నెక్కి
పక్షులను దెచ్చి పణతికందించెను
పక్షులను ముద్దాడి పణతియు తాను
ఎప్పటివలె వృక్షముమీద వుంచి
పోయినారు
సప్త సముద్రముల యందు పక్షులు
వేటలాడి
ఏనుగులను తన్నుక వేగంబె వచ్చెను
అంటు దగిలి పిల్లలు అటు
పూరకుండెను
గూళ్లలో పిల్లలు గుభగుభలాడెను
ఏమి కారణంబో ఇన్నాళ్లు ఎదురుగా
వచ్చెను
నరుని యంటు దగిలి నలిగి వున్నాయి
వృక్షముమీద పక్షులు వెతపడ సాగెను
పిల్లలు మేతలంటక పికపిక లాయె
మ్రానుమీద పక్షులు మల్లడించ సాగెను
చేపట్టి మమ్మంటి చెరచిన వారు
కళ్లు కాళ్ళు లేని కబోదులై పోదురు
అని శాపంబు పెట్టెను పక్షులు నాడు
మల్లికార్జునుగుడికి చేరి చేరక ముందె
కన్నుకాళ్ళు లేని కబోదులై పోయిరి
తొమ్మిదినెలలు వెళ్ళె
వుభయమానవతమ్మకు
కొమ్మకు దొడ్డవాడు కొడుకు జన్మించె
మల్లికార్జునుని పూజకు తంబళ్ళ
బ్రహ్మయ్య వచ్చెను
మల్లికార్జునునకు నైవేద్యము మరి వేగ
పెట్టెను
ధరణికేతవురాజు వుభయమానవతమ్మ
తంబళ్ళతో నపుడు తగ విన్నవించిరి

చాలినంత ధనము ఇచ్చేము గాని
ఈ బాలుని రక్షించుకొమ్మని పలికి
బిడ్డను
అనిన నా బ్రహ్మయ్య అధిక సంతోష
మందె
ఈదేర్చి పెంచుదు ఇమ్మని పలికె
పట్టుమని పొత్తుల వాని నందించినారు
ఎత్తుకొని వచ్చి బ్రహ్మయ్య తన
ఇంతి చేతి కిచ్చెను
పాలను వక పూట పప్పుగా పెంచిరి
వుగ్గుపాలు నేతులతో వొప్పుగా
పెంచిరి
చదువు శాస్త్రములు సమముగా నేర్పిరి
పన్నెండేండ్లకు బాలకుని దేవళము
ఇల్లడి జేసిరి
శంభుని దేవళముకు నీవు శీఘ్రానపోయి
శంభునికి పులికాపు చేసి వేగంబె
నైవేద్యం పెట్టుము నాయన్న నీవు
ఆక్కడ కన్నుకాళ్ళులేని కబోదు
లున్నారు
వారికి అన్నపానాదులు నవరించి
రావోయి
నేను శృంగారపు తోటలోనికి శీఘ్రాన
పోయి
పారిజాతంబులు కోసుక వచ్చేను
గాని

అని చెప్పి బ్రహ్మయ్య ఆ వనమునకు
వచ్చెను
బ్రొద్దున్నే దేవాలయమునకు పోయె
గురుభక్తుడు
దేవాలయములో కబోదులు చందాలము
చేసి యుండగాను
కన్నుల రోషాగ్ని కడిది కురియంగ
ముసలివాండ్లను జూచి మురియు
కోపాన
కాలదన్నెను వేగ కడు కోపమునను
శంభునకు ఆరగింపు పెట్టెను తాను
తన మేరకు వచ్చెను వేగ
గురుభక్తుడు
పారిజాతంబులు గోసుక బ్రహ్మయ్య
వచ్చెను
తనయుడు గురుభక్తుని దగ్గరకు
పిలిచి
అన్నా : దేవళములో కబోదు
లున్నారు
అన్నము వుదకాలు పెట్టి వచ్చినావా ?
లేదా ?
నీవు ఇన్నాళ్లూ ఎట్లు పెట్టివచ్చినావో
ఎరుగను నేను
కాళ్ళచేత నేను పెట్టివచ్చినాను
శివా శివా యని బ్రహ్మయ చెవులు
మూసుకొనెను

అన్నా ! మీ తలిదండ్రాజులు వారు
అని చెప్పి బ్రహ్మయ్య అందోళ పడగాను
కుమ్మరాము చిచ్చువలె కుమారిలగాను
వేద బ్రాహ్మణుల పిలిచి వేగంబె పలికెను
తల్లిదండ్రుల కాళ్లచేతుల తన్నిన పాపము
ఎటువలె పరిహారమవునో ఎరిగించుమనెను
వేదశాస్త్రంబులు వెదకి శోధించిరి
అయ్యలు గురుభక్తునకు అతివేగ జెప్పిరి
కాశీనుంచి రామేశ్వరానికి
రామేశ్వరంనుండి కాశీకి
కావిడిబెట్టి మోసిన కద్దు స్వర్గంబు
అని యిట్లు బ్రాహ్మణులు అటు చెప్పగాను
గంపల కావిడి కావించుకొనెను
కాశీయాత్ర దర్లెను ఘనుడు గురుభక్తుడు
కాశీశ్వనాథుని కానుక సేవించి
గయలోన స్నానంబు గ్రక్కున జేసెను
రామేశ్వరానికి తల్లి రాగాను
జనకుని వనమును చేరంగ వచ్చె
జనకుని వనమున చెంగల్వ కొలను
ఆ కొలనుకు కుంభిటేనుగ నీళ్ళకు వస్తూ
నీళ్ళు కలకలు చేసి పోతూ వుండగాను
దశరథరాజు ధనస్సు వెక్కి పెట్టెను
ధనుర్బాణము తొడగి తాను వుండగాను
వనముకు గురుభక్తుడు వచ్చె నంతలోను
ద్రాహంబు లడిగిరి తల్లిదండ్రులును
భుజమున నున్న కావిడి మ్రానుకొమ్మకు చేర్చి
కమండలము అంది గ్రక్కున నపుడు
వాలుమండేసుక వైశంబె కొలనుకు వచ్చి
కొలనులో కమండలము గ్రక్కున ముంచె
బుడబుడా కమండలము బుడగొట్ట సాగె
ఏనుగ వచ్చెనని వేసె బాణంబు
వేసిన బాణము ఎదయందు నాటె
శివశివా యని గురుభక్తుడు తలిదండ్రుల దలుచుక
క్షితిమీద వరగి చింతింప సాగెను
మనిషి అలికిడి విని దశరథుం డపుడు

ధనుర్బాణములు [illegible]
వినిచెను.
ఏమి పాపము చేస్తిని ఈశ్వరా
యనుచు
గురుభక్తుని కడకు గొబ్బున వచ్చెను
అప్పుడు గురుభక్తుడు ఆ రాజును
చూచి
ముదుసళ్ళ పుత్రశోకం ముందు
బుచ్చుకొంటివి
కన్నుకాళ్లు లేని కబోదు లున్నారు
అన్నరో ! నీవు హత్య గట్టుకొంటివి
విని దశరథరాజు విలవిల బోయెను
ప్రాణంబు ఇచ్చెను భక్తుడా నీకు
ఎంగిలి ప్రాణంబు ఏలయ్య తనకు
వినవయ్య దశరథా ! వివరంబుగాను
కమండలము నీళ్లు గ్రక్కున దీసుక
వాలుమండ వెంబడే వైశంబ పోయి
కమండలము అందించు గ్రక్కున నీవు
దాహము ఈయవయ్య దశరథరాజ !
బాణంబు తియ్యవయ్య ప్రాణంబు
నిలువదు
బాణంబు తియ్యగావె పరలోక మేగెను
కమండలము దీసుక దశరథుడు
గ్రక్కున వచ్చెను
సైగను కమండలము గ్రక్కున
ఇచ్చెను

[illegible] వృద్ధులు
[illegible]
గురుభక్తుడా ! యని వారు
పిలువగాను
పల్కక దశరథుడు పలవరించగాను
తీర్థము తెచ్చిన [illegible] ఏమాయె ?
నా కొమారుడు వచ్చె అతడేడి
ఇపుడు
అను మాటలను లేదు అతిభయము
నుండి
నీ సుతుడు కొలనిలో నీళ్ళు ముంచగను
బుడబుడమను ధ్వని బుద్ధి నూహించి
కడువేగ ఏస్తిని కరియని నేను
పట్టరా నరుడా ! శాపంబు
[illegible] పట్టుమనగాను
పుత్రశోకము నీకు పుట్టు వేగంబె
పుత్రశోకముచేత పోవు ప్రాణంబు
అని ప్రలాపించి వృద్ధులు ప్రాణాలు
విడిచిరి
ఆ శాపంబు దశరథునకు అంబులై
తాకెను
వనముకు దర్లెను వైశంబె. రాముడు
పుత్రశోకముచేత పోయె దశరథుడు
అమ్మా ! గురుభక్తుడు అటువంటి
వాడు

అన్నా ! మీ తలిదండ్రాజులు వారు
అని చెప్పి బ్రహ్మయ్య అందోళ
పడగాను
కుమ్మరాము చిచ్చువలె కుమారిలగాను
వేద బ్రాహ్మణుల పిలిచి వేగంబె
పలికెను
తల్లిదండ్రుల కాళ్లచేతుల తన్నిన
పాపము
ఎటువలె పరిహారమవునో ఎరిగించు
మనెను
వేదశాస్త్రంబులు వెదకి శోధించిరి
అయ్యలు గురుభక్తునకు అతివేగ
జెప్పిరి
కాశీనుంచి రామేశ్వరానికి
రామేశ్వరంనుండి కాశికి
కావిడిబెట్టి మోసిన కర్మ స్వర్గంబు
అని యిట్లు బ్రాహ్మణులు అటు
చెప్పగాను
గంపల కావిడి కావించుకొనెను
కాశీయాత్ర దర్లెను ఘనుడు
గురుభక్తుడు
కాశీశ్వనాథుని కానుక సేవించి
గయలోన స్నానంబు గ్రక్కున
జేసెను
రామేశ్వరానికి తల్లి రాగాను
జనకుని వనమును చేరంగ వచ్చె

జనకుని వనమున చెంగల్వ కొలను
ఆ కొలనుకు కుంభిపేనుగ నీళ్ళకు
వస్తూ
నీళ్ళు కలకలు చేసి పోతూ
వుండగాను
దశరథరాజు ధనస్సు వెక్కిపెట్టెను
ధనుర్బాణము తొడగి తాను
వుండగాను
వనముకు గురుభక్తుడు వచ్చె
నంతలోను
ద్రాహంబు లడిగిరి తల్లిదండ్రులును
భుజమున నున్న కావిడి
మ్రానుకొమ్మకు చేర్చి
కమండలము అంది గ్రక్కున నపుడు
వాలుమందేసుక వైళంబె కొలనుకు
వచ్చి
కొలనులో కమండలము గ్రక్కున
ముంచె
బుడబుడా కమండలము బుడగొట్ట
సాగె
ఏనుగ వచ్చెనని వేసె బాణంబు
వేసిన బాణము ఎదయందు నాటె
శివశివా యని గురుభక్తుడు
తలిదండ్రుల దలుచుక
క్షితిమీద వరగి చింతింప సాగెను
మనిషి అలికిడి విని దశరథుం డపుడు

ధనుర్బాణము లప్పుడు ధరణిపై
విడిచెను.
ఏమి పాపము చేస్తిని ఈశ్వరా
యనుచు
గురుభక్తుని కడకు గొబ్బున వచ్చెను
అప్పుడు గురుభక్తుడు ఆ రాజును
చూచి
ముదుసళ్ళ వూతకోల ముందు
బుచ్చుకొంటివి
కన్నుకాళ్లు లేని కబోదు లున్నారు
అన్నరో ! నీవు హత్య గట్టుకొంటివి
విని దశరథరాజు విలవిల బోయెను
ప్రాణంబు ఇచ్చేను భక్తుడా నీకు
ఎంగిలి ప్రాణంబు ఏలయ్య తనకు
వినవయ్య దశరథా ! వివరంబుగాను
కమండలము నీళ్లు గ్రక్కున దీసుక
వాలుమండ వెంబడే వైశంబ పోయి
కమండలము అందించు గ్రక్కున నీవు
దాహము ఈయవయ్య దశరథరాజా !
బాణంబు తియ్యవయ్య ప్రాణంబు
నిలువదు
బాణంబు తియ్యగానె పరలోకమ్మేగెను
కమండలము దీసుక దశరథుడు
గ్రక్కున వచ్చెను
సైగను కమండలము గ్రక్కున
ఇచ్చెను

కమండలాలు వృద్ధులు
కాసు వెయ్యగాను
గురుభక్తుడా ! యని వారు
పిలువగాను
పల్కక దశరథుడు పలవరించగాను
తీర్థము తెచ్చిన వీరుడు ఏడను ?
నా కొమారుడు వచ్చె అతడేడి
యిపుడు
అను మాటలను రేడు అలిభయ
మంది
నీ సుతుడు కొలనిలో నీళ్ళు ముంచగను
బుడబుడమను ధ్వని బుద్ధి నూహించి
కడువేగ ఏస్తిని కరియని నేను
పట్టరా నరుడా ! శాపంబు
[illegible] పట్టుమనగాను
పుత్రశోకము నీకు పుట్టు వేగంబె
పుత్రశోకముచేత పోవు ప్రాణంబు
అని ప్రలాపించి వృద్ధులు ప్రాణాలు
విడిచిరి
ఆ శాపంబు దశరథునకు శూలంబులై
తాకెను
వనమునకు దర్లెను వైశంబె రాముడు
పుత్రశోకముచేత పోయె దశరథుడు
అమ్మా ! గురుభక్తుడు అటువంటి
వాడు

సంతానమ్ము ఇచ్చెనంటివి
జన్మభూములు విడిచి వస్తేను
పుత్రుల నిచ్చే నంటివి పుణ్యభూములు
విడిచి వస్తేను
సంతానము ఇచ్చినపుడే
జన్మభూములకు మమ్మంపవైతివి
పుత్రుల ఇచ్చిననాడే భూములకు
మరియు పంపవైతివి
మాకు సంతానము గల్గిన సావు
నిత్యమాయెను
ఆర్లపెంట రణము అ స్మమాన
మాయెను
స్వామి నీ వరపుత్రుడు కాటమరాజు
వక్కడే కుంభిళ్ళకు పైనమైనాడు
తాను కల్యాణము వచ్చిందేకల్ల
నీవు సంతానము ఇచ్చిందే కల్ల
నమ్మితి సోమేశ్వర ! నమ్మితిని నిన్ను
నమ్మినందులకు నీవు నట్టేట పుట్టి
ముంచితివి''

## కల్యాణ సోమేశ్వరుడు కాటమరాజుకు అండగా నిలబడుట

అనగానే సోమేశ్వరుడు అమ్మకు
ప్రత్యక్షమాయె
వెన్నుజరచి తల్లిని వెరువకు మనెను
పెద్దమ్మతో పలికె సోమేశ్వరుండు
''తాను కాటంరాజువెంట వదలి
పొయ్యేను
శంక భయము ఏమి చెప్పకు తల్లి
ఏనాళ్లకు నీకుమారుని నీవు
అప్పగించేను''
''నమ్మదున శంకరా ? నమ్మదునా
లోకనాయక ?
నమ్ముదున గంగాధర ? నమ్ముదున
త్రిపురాంతక ?
గౌరీమనోహర నమ్ముదున నిన్ను ?''
అనుచు ప్రార్థించిన ఆ సాంబమూర్తి
"నమ్మవే పెద్దమ్మ నమ్మవే తల్లి"
నమ్మించె పెద్దమ్మను నందివాహనుడు
సంతోష మాయెను సఖియ పెద్దమ్మకు
సోమప్ప సెలవంది శూరుండు కదిలె
రణవిజయ తేజీని రాజు తా ఎక్కె
రాజుకు కుడిబుజమున పరమేశ్వరుండు
రాజుముందర కదిలె రమణ తోడుతను
తమతండ్రి వేయించిన దవనంపుతోట
కడనుంచి తల్లిని పట్నానకు పంపెను
కాటమరాజు తమ తండ్రి చెల్లిన
కుంభిళ్ళకు కదిలె

కాంతి గలిగిన గంగరావులు దాటి
దేవుని గుళ్ళను తెట్టిరావులుదాటి
గంగరావులు దాటి కదిలెను రాజు
అదిగని రాగన్న సాహస ఘనుడు
సంగడీలతో ఎదురాయె తమ్ముడు
రాఘుపన్న
అల్లంతట నిలచి అంజలి చేసి
పురుపున ఎత్తుకొని పుర్విపై దించె
"అన్నరో నీవు వక్కడివె కల్లికి
ఆరుగుట లెస్సయా ?"
ఆమాటకు రాజు అపుడిట్లగనియె
"అది యేమి తమ్ముడా అంటివీమాట
శంక భయములు నాకు చెప్పకు
తమ్ముడా
చావంటె తమ్ముడా సంతోషపడుదు
రణమంటె తమ్ముడా కల్యాణమందు
సప్త సముద్రములు నాకు
మోకాటిబంటి
పరమేశ్వరు డిచ్చినాడు పంచవన్నెల
దేగ
సోమప్ప ఇచ్చినాడు సొంపైన దేగ
కైలాసపతి ఇచ్చినాడు కనకపుప్వుల
దేగ
ఈశ్వరు డిచ్చినాడు ఇంపైన దేగ
దేవతలు పొగడగా నా దేగకు తెల్లని
వన్నె
నాగపతులు పొగడగా నా దేగకు
నల్లనివన్నె
ఇంద్రుడు ఇచ్చినాడు నా దేగకు ఎర్రని
వన్నె
రెక్కలు గంధర్వులు నాలుక
నక్షత్రాలు
కన్నులు సూర్యచంద్రాదులు కోపము
అగ్నిదేవుడు
వూపిరి నా దేగకు వాయుదేవు
డందురు
గుప్పున నా దేగ గుభాలున లెగిస్తే
జడిసి లోకము లన్ని జలనిధులు
ఇంకును
గుప్పున నా దేగ కుంభిణి లెగచిన
పక్షిజాతు లన్ని భస్మమై పోవును
కరుచును పొడుచును కన్నెసిరి దేగ
పిలుపుకు వచ్చును భీకరంబునను
రాజుల జంపు రక్త మారగించును
కోటి రాజుల జంపి కొవ్వారగించు
నేటి రాజుల జంపి మెదడారగించు
నెల్లి రాముడు పట్టింది యిది రణగబ్బి
దేగ
పరశురాముడు పట్టింది రణగబ్బి దేగ
కాటమరాజు చేతను కనకపువ్వులదేగ
ఎడమచేతను రాజుకు చంపుడు కోల
కుడిచేతను రాజుకు కుప్పుల దేగ

కాటమరాజు రణముకు కదిలి పోగాను
వచ్చేను తన వెంట సోమేశ్వరుండు
రాజశేఖర : తమ్ముడ రాఘవన్న
వినుమ
కల్యాణ పట్టణము కళదప్పి వున్నది
ఆమూకలై వున్నది అన్నరో వినుమ
మూకచింతమీద మునుకొని కాకులు
పేరేల బారుచు పట్నంబుమీద
ప్రేలుచు నున్నవి భీకరంబుగను
మొగపురుషుడు పట్నాన
లింగమందయ్యో
నేను రణముకు పోతేను నీవుండ
వలెను
నీవు రణముకు పోతేను నేనుండ
వలెను
మారు మాటాడకు మంచి వాక్యమున
భయభీతులు నాకు పుట్టవు తమ్ముడ'

పడిగలు గొడుగులు పట్టుమని యిచ్చె
ధీరుండు పట్నానకు తిరుగ నంపించె
వీరశూరుడు కదిలె విజయ కుంభిణికి
విడబడ్డ ఏనుగవలె వక్క విధమున
కదిలె
తియ్యమామిడి తోపు తిప్పలు గడిచి
అవనీశుడు వింధ్యాద్రి అడవులు దాటి
ఘనపర్వత మనియేటి గట్టు తా
నెక్కె
ఏడేడు కుంభిళ్లు ఏర్పాటుగా చూచి
శిలలేని దేవళమువలె చిన్నబోయి
వున్న
కుంభిళ్ళ దాపున పన్నెగుడార్లు
కంఠీరవము కై వడి కాటమరాజు
పర్వతము దిగ వురికె ప్రళయ
రుద్రుని బోలి
నీలకంధరుడు కదిలె పుర్వి మిన్నంది

## కాటమరాజు తన తండ్రి కళేబరమునకై రణరంగములలో వెదకుట

వీర కుంభిణి రణము విధమెల్ల జూచి
చెప్ప ఘోరమైన శల్యముల వెంట
ధరణికి వొరిగెను తలల పుర్రెలును
మేరమీరి మిగుల మెరయు
ఆయుధములు
[illegible] నలినలి జేసి

పోడు నరికేసిన పోలిక నుండె
ఆ రణము చూచి రాజు
ఆశ్చర్యపడెను
మరియొక రణముకు మరియు నేతెంచె
విజయ కుంభిణి చూచి వెదకెను రాజు
వసుధేశు డా రణము వర్ణింపసాగె

కూలిన భద్రగజములు గుర్రపు తలలు
దిట్టమై మూకలు ధర గప్పి వుండె
భగ్నమై పడియున్న బహు రథంబులును
వేగమే ఆ రణము విధమెల్ల జూచి
తన మనసందున తలచె ఈశ్వరుని
కంచు కుంభిణికి కదిలె కాటమరాజు
చొరబడి ఆ రణము చూచెను రాజు
నజ్జునజ్జులై యున్నవి నల్లని శిరసులు
చెండిన కండలు శిరసుపు రెలును
చీకాకుగ పడియున్న శిరసులు సరములు
తొలగ సందు లేదు డొక్కలవెంట
రాజశేఖరుడు వెడకె రణరంగ మంత
ఆ రణము వెడలి తా గజకుంభిణీ కేతెంచె
గజకుంభిణీ కేతెంచె ఘనుడు సంపన్న
మడిసిన గజములు మంచి తేజీలు
భూమిపై పడియుండె బోరుకొండల రీతి
మానవేశ్వరుడు జూచె మడిసిన వారిని
ఆ కల్లి అంతయు అతివేగ జూచె
రాజు తా గదిలెను రాయకుంభిణికి
వసుధపై ఆ రణము వర్ణింపరాదు

దూరమున పడియున్న తలలు మొండెములు
పుడమి మొండెము లన్ని పోగులై యున్న
అటువంటి ఆ కల్లి అంతయు జూచి
కదిలె కాటమరాజు కుంతలం
సామంతలం కోటకు
అచ్చోట రణములు అటు వెదక కదిలె
జననాథుడు జజ్జువుకుల కోట కేతెంచె
కోటపట్టము జూచి కోయిలను జూచి
పీనుగులు కోట పొడుగున పడియుండ గాను
అదె జూచి కాటమరాజు అళ్ళున నవ్వెను
కనకదుందుభుల కోటకు కదిలెను
రాజు
వినుతుడై ఆ కల్లి విధమెల్ల జూచి
కదిలె సాహస ఘనుడు కనకదుర్గ కోటకు
ఆ కోట పైనంబు అంతయు జూచి
పేరుగల రాజు డొక్కలపెంట కేతెంచె
చూచెను ఆ రాజు చోద్యంబుగాను

## రణభూమి వర్ణన

మురిగిన మాంసంబు మెదడు రక్తంబు
అఘోర ఘోరంబుగా ఆ కల్లి
వుండెను
కవుసుకు బొబ్బరీతి కదుపులు గూడి
తొక్కులాడుచున్న డొక్కల పెంటను
నక్కలు తోడేళ్ళు నరమాంసము
మెసవి
వూళలు పెట్టుచు వుక్కో వుక్కో
యనుచు
హేరాళ మైనటి ఎలుగులు పులుగులు
చరియించుచుండెను సమరంబులోను
కారిన రక్తంబు కడుపార ద్రాగి
గద్దలు గూబలు కాకిబలగంబు
మాంసంబులు తినుచు బుస
పెట్టుచూను
నంజుళ్ళారగించి నడుములు బిగించి
సుఖమున దిరుగుచు సొక్కు
భూతములు
ఆ కల్లిని జూచి రాజు హళ్ళున నవ్వె
భోరున గదిలెను భూనాయకుండు
ఆ రాజు కార్లపెంట కోట కేతెంచె
ఆవేళ సూర్యుడు అస్త్రాద్రి కరిగె
ప్రళయ రుద్రుని బోలె పట్టభద్రుండు
కన్నుల పండువుగ ఆ కల్లి జూచె
పచ్చి నంజుళ్ళు తిని బారులు దీర్చి
భారతము చదివేటి బ్రహ్మరాక్షసులు
కండలు మాంసము కడుపార దినియు
ప్రేలుచు భూతాలు పెనుగాడుచుండు
మూలుగులు చీకుచును మురియుచు
రణమున
హాంకరింపుచు నుండు కొన్ని
భూతములు
కడుపార దిని మెదడు
క్రొవ్వారగించి
కుట్టుబట్టి రణమున గుసుసు భూతాలు
రక్తమారగించి రణము లోపలను
గుంపులు గూడుచు గంతు లేయుచును
మోకాలి ఎముకలు మెచ్చు తమకనుచు
శాకినీ భూతములు చరియించుచుండు
ప్రేగులు దొబ్బలు ప్రియ మారగించి
విర్రవీగుచుండె వెర్రి భూతాలు
ఈ రీతి దయ్యాలు ఎన్నైన గలవు
తన్ను తా నెరుగక తడబాటు పడుచు
చాలినంత మాంసము చంక
నిముడ్చుకొని
శక్తులు పొరాడి చెలగు నా కల్లిని
మదముతో పీనుగల మోపుల గట్టుక
తిరిపెమున తిరుగాడు త్రిరి భూతాలు
పొట్ట బట్టినంత పొంకముగ దినియు
గాలి పిశాచులు గద్దరింపుచుండును

పెంపుడు దయ్యాలు పీడ పిశాచులు
మేలిమిగ దయ్యాలు వేదములు
చదువుచు
బవరంబులో నుండు బిర్ర
బిగియుచును
దాసీభూతాలు తట్టలు బట్టుక
కావరించి తిరుగు కల్లిమధ్యమున
భేతాళపతు లెల్ల భారతము వినుచు
పాలించి ఏపొద్దు శివపురాణములు
వినుచు
విష్ణుకీర్తనలు చదువుచు
విభవంబుతోను
హూంకార శబ్దమై వుండె న వేళ
కామినీ భూతములు కనుగ్రుడ్లు
తినియు
పిటికాండ్ల పెదుపసు విశ్వంబులోను
వాటి పిన్నెలు చూచి పసుధేశ్వరుండు
కుంభిని అదరంగ గొబ్బున నార్చె
కాలాగ్నిరుద్రుడై కత్తి ఝళిపించె
కత్తిమెరుపులు చూచి కదిలె భూతాలు
ఇది యేమి ప్రళయమో
ఇంతకాలముకు
కారుచిచ్చువంటి కల్లి ఏతెంచె
ఏది ద్రోవ యనుచు వెతుకులాడ హాగె
చిల్లరి పిశాచులు చెట్లపాలాయె
ఘోషపెట్టెనె భేతాళ ముక్తినాయకుడు

పూని విచారంబు పొందుగా చేసి
"మనుజనాయకు డైతె మన భూమికి
రాడు
హరిహరుడైతే గాని ఈ కల్లికి రాడు
ఎవరైననూ గాని ఎదురు గావలెను"
తమలోన తమరిట్లు తలపోత చేసి
పరుగున నేతెంచి పడి సాగి మ్రొక్కిరి
కరములు మొగిచిరి కాటమరాజుకు
"నీలవర్ణుడ : మాకు నిను జూడగలిగె
జన్మ పావనమాయె జననాథ : మాకు
కాటమరాజ : మీ తండ్రి మా
కరువెల్ల తీర్చె
భుక్తిముక్తులు రెండు పుట్టెను మాకు
భక్తవత్సల : నీవు బవర మధ్యమున
నిలిచిన కారణార్థ మేమి నీలవర్ణుండ :
మీ అయ్య ఆర్లపెంట రణములో
చెండాడి పగతుల
భూపాల : మీతండ్రి మాకు భూతబలి
పెట్టెను
రణబలి పెట్టెను రణగంగలాకు
అలసి వరగినాడయ్య ఆర్లపెంటలోను
ఘోతుటీగ ఆ కల్లి వ్రాలంగ రాదు
విజయశేఖర : మేము నీ వెంట
వత్తుము"
"ఆ కల్లికి మిరెల : ఇచ్చుటే
పుండడే

భూతకోట్లను వుంచె
భుజగేంద్రసుతుడు
కొర్లపెంట రణమునకు వచ్చెను
కులదీప ఘనుడు
కొర్లపెంట రణములో తండ్రిని
వర్ణింప లేక
పట్టిపట్టి చూచెను పడిన పీనుగుల
పీనుగులు మొండెములు రణమున
పిక్కటిల్లగను
దాసి యాబొందుల దగ్గరకు వచ్చెను
వయ్యన తమ తండ్రిని
వర్ణించుచుండెను
ఈ రూపుగాదు తండ్రి ఇచ్చోట లేడు
ధరమీద వరగిన దళముల నెల్ల
విప్పి విప్పి తమ తండ్రిని వివరించి
చూచెను
చీకాకుగా పడియున్న పీనుగుల
చిక్కులు తీసి
వెరువక తమ తండ్రి పోలికలు
ఎత్తెత్తి చూచెను
సొరిది పీనుగుల జూచి చోద్యంబు
పడుచు
హళ్లున నవ్వె రాజు హరహరా
యనుచు
తామసంబున వెదకి తర్లె నంతంత
సొరిదిలో పడివున్న బొందులు తెచ్చి
పొర్లించి తమతండ్రి పోలికలు చూచె

పురువున కదిలెసు పుర్వీశ్వరుండు
పొర్లబడి వున్న పీనుగుల పొర్లించి
చూచి
ఈ రూపు అవునేమొ ఈ బొంది కాదు
అవనిపై బడివున్న బొందులు అన్నియు
చూచె
ఎర్రని శిరస్సులు ఏరి తా తెచ్చి
ఈ శిరస్సు అవునేమొ ఈ తేజంబు
గాదు
అమరించి మొండెములు అతికించి చూచె
చూరములో పడివున్న తునియలు తెచ్చి
కాంత దేహంబున కదించి పట్టి
అవునేమొ కాదేమొ మా తండ్రి
హరిహరు లెరుగుదురు
కమగొని పీనుగుల కదిలించి చూచె
ఖండించి నరికిన కాళ్ళు చేతులును
కీలుకీలు పొసగించి తమ తండ్రిని
పొసగంగ జూచె
తిరిగి తిరిగి తమతండ్రి తీరెల్ల జూచె
అక్కడక్కడ పడివున్న హస్తములు
తెచ్చి
అమరించి తమతండ్రి అందంబు చూచె
శిరసు పెంకులు తెచ్చి చేకూడ బెట్టి
తమతండ్రి తేజంబు తప్పక చూచె
తల్లడపడి రాజు తమతండ్రి నెతుకంగ
అర్ధరాత్రి ఆయెను అయ్య కనరాడు
విక్రమార్కుడు ఏరీతి విచారపడుచు

## కాటమరాజు తన తండ్రిని కనుగొనలేక విచారించుట

"తరళాక్షి మా తల్లిని తమకాన పెట్టి
ఎదురుచూడ మంటిని ఏనాళ్ళ దాక
ఎలనాగ మా తండ్రిని ఏనాళ్ళ నాటికి
పెద్దిరాజును దెస్తునని పనిబూని వస్తిని
ఏనాళ్ళు ప్రొద్దోయె ఏమి చేయుదును
తల్లిముఖము చూడ మా తండ్రిని
కానలేనైతి"
అల్ల నేరేడువృక్షము క్రింద అలసి
శోకాబ్ధిచేసెను సురల ప్రార్థించె
"అఖిల లోకేశ్వరా! ఆదిదేవుండ
కానరా మా తండ్రిని కల్లిలోపలను
హరిసతి వో తల్లి! ఆదిలక్షుమమ్మ!
మనుజేశు పెద్దిరాజు మడిసె
కుంభిళ్ళమీద
ఘనుడు మా తండ్రిని కానరా మీరు!
ఈశ్వరా పరమేశ! ఈ కల్లిలోను
పోరాడ మా తండ్రి పుడమిపై వరిగెను
నీవైన చూపయ్య ఈ కల్లిలోను
శివుని కులసతి ఓ పార్వతమ్మ!
మరణించిన మా తండ్రిని మరి
చూపవమ్మ
పర బ్రహ్మమైనట్టి బ్రహ్మ దేవుండ!
సులలార! మా తండ్రిని చూపరె
యనుచు
త్రైలోక్య సుందరీ! సరస్వతీ దేవి!

మన్నె విరోధుల మట్టు మల్లాడి
చెల్లిన మా తండ్రిని చూపవో యమ్మ!
సురలార! మునులార! సురకన్యలార!
తరతరము మా తండ్రిని మీరైన
చూపరే
మింటమీద చుక్కలార! గుంటిమీద
లింగమా!
చెలగుచు నున్నట్టి సంపెంగలార!
పగలేని పగ మా తండ్రి తనపాల
బెట్టుకొని
పరుల పగకై తాను వరిగె నాకల్లి
అలిసివున్న మా అయ్యను కానలేనైతి
చుక్కలార! మా తండ్రిని చూపరె మీరు
తరులార! గిరులార! దైవంబులార!
గరుడ కిన్నెర యక్ష గంధర్వులార!
వీడుగో యని మా తండ్రిని వేగమే
చూపరే
గండభేరుండ పక్షులార! ఘన
మృగములార!
ప్రేమతో దయ వుంచి మా తండ్రిని
చూపరే
పరిపరి విధముల ప్రళయ కాలుండు
కదిసి రాజుల చంపె కల్లి మదమునను
ఆర్లపెంటలోన హత మయ్యినాడు
కంటిరా మా తండ్రిని కన్నుల జూపరే

అని దేవతల నెల్ల దూషించి పలికె
పంతమా నాతోను పల్కరే మీరు
తాపులు పిడిచి మాతండ్రిని గలిస్తిరా మీరు
దేవకోటుల్లారా! వ్యర్థమై పోతిరా"
అంకరించి రాజు హరిహరుల దలపగా
అంతట దివినుండి అమరులు జూచిరి
అంతరిక్షమున నిలిచి ఆడి రొకమాట!
"దూషింప నీకేల ధీరుడ వన్న
ధీరుని కడుపున పుట్టిన రణశూరుడ వన్న
సురపతి ధీరుడా! సుజన మందార
సురలు దేవతలెల్ల చూడంగ నీవు
సోమప్ప పరమున సోమకులమున బుట్టి
మమ్ములను దూరెదవు మాధవ చంద్ర
మూడు జేనలుగల ముప్పిరి సురియ
వరదూసి యా కత్తి ధరపైన నిలుపు
వెరచి చీకట్లన్ని వీడి పగలగును"
అని యిట్లు దేవతలు ఆడంగ వినియు
సురలు దేవతలును స్తుతి చేయగాను
ఆ మాట విని రాజు అతి సంతసమున
పర్వతము దిగ పురికి ప్రళయ కాలుని బోలి
వారఫెరికి కటారి వురువడి జడిపించె
తళతళ మెరిసి కటారి తెలతెల్లనాయె
తెల్లవారిన తెరువున వుండె నంతటను
దురము జొచ్చి రాజు దొడి వెనుకంగ
రవుతుల పొర్లించి రాజుల జూచె
రాజుల పొర్లించి రవుతుల జూచె
ఎడమయందు చెయ్యివేసి ఎత్తి త్తి చూసె
తల్కింద చెయివేసి తలఎత్తి చూసె
పొర్లుచు అడలుచు పొగ్లె దుఃఖాన
తనయుడు వెదకుచు తండ్రిని రణములో
ఆర్లపెంటకు రాగ అస్తమాన మాయె
ఆర్లపెంట కాచింది అమ్మ భవాని
సోలియు సోలదు శోభనకారి
తమవారు కొల్చిన తరమునాటి వేల్పు
ఆవుల వల్లమ్మ కొలిచిన ఆది మాశక్తి
పెద్దిరాజు రణము కాచింది పేరుగల గంగ
పొట్టువన్నె చీర పొంకమైన రవిక
అంతులేని సొమ్ము లమరించి గంగ
జడలు తూలనాడంగ జనవీర గంగ
గగనము మాయచే గజము గావించి
కుదురుగా రణభూమి కుందెన జేసి
వినయంబుతో గంగ వేడుక మీర
దేవగాంధారివలె తేజంబు తోను
పగరాజు శిరస్సుల పాడుచు దంచె

ముందర రాజుల శిరస్సులు
ముక్కలుగ దంచె
కనకవీర సువ్వల్లో యని గంగ తా
బాడె
అమ్మవారి తమ్ముడు ఆ పోతురాజు
ముప్పైమూళ్ల ముద్రగడ మురమొప్ప
బట్టెను
పన్నెండుమెట్ల భైరవకిన్నెర వక
చేత బట్టె
ఏబండ్ల మీద కొంగవాలు కత్తి వక
చేత బట్టె
ఏడుకట్ల చేట వక చేత బట్టె
కోటి రాక్షసులను కోటి భూతములను
వెంట బెట్టుకొని
పారా దిరుగుచుండె పోతుల రాజు
ఆ రణము కాసేటి ఆదిమూళశక్తి
యాదవ చంద్రుడని ఆత్మలో దెలిసి
తమ్ముడు పోతన్నను దాయంగ బిలచి
"ఎనవయ్య సోదర విక్రమశాలి
ఎవ్వడో రణమును వెదుకుతున్నాడు
సొరిది పీనుంగుల సోపుడు పెట్టుక
వెరవక రణములో వెదుకుతున్నాడు
పురవడి నీ వేగి వ్యగ్రము చూపి
హరుడవో నరుడవో అది నాకు
చెపుము
అని పల్కి సంగతి కని
రమ్మ" టన్న
కలనికి పోతురాజు కదలె నా క్షణము

## పోతురాజు కాటమరాజుల వివాదము

చెలగి గణాదులు చేరి కొలువంగ
మూరలు పన్నెండు ముద్రగడ పట్టి
భూత చేయుచు వచ్చి గగ్గోలు పరచి
పోతురాజాతని పోలిక జూచి
ధీరుడో వీరుడో దినకరుడో లేక
హరియో ముక్కంటియో ఆ
కాలరుద్రుడో
పుణ్యసాహసు డెంత భుజబలుడో కాని
వర్ణింప లేడయ్య వల్లవుల రాజును
ఏదేండ్ల రాజుకు ఎదురుగా వచ్చి
గిబ్బరముతో పోతన నిలచి
యిట్లనియె :
"ఎవ్వడవురా నరుడ : ఈవేళ కాడ
ఈ రణముకు రాను ఏమి
కారణము ?"
అని పోతురాజు అంకారించి పలికె
హోంకారించి భూతాలు వొచ్చి
చుట్టుకొనెను

ఇమ్ములనుండిన పరమేశ్వరుడు
ఇట్లగని పలికె
వెన్ను చరిచిరాజును వెరపకు మనెను
"వాడే గంగలకు తమ్ముడు కల్లి
పోతురాజు
బెదరక చెదరక భీతిలేక నీవు
నేర్పుగా మాట్లాడు నే నెందు పోలేదు"
ఆ మాట విని రాజు ఆగ్రుడై కదిసె
"ఎవడను మాటకు ఏపణగింతు
ఎవడవుర నన్నడుగ ఎవడవురోరి?"
కాలాగ్ని రుద్రుడై కత్తి ఝుళిపించె
పోతురాజు శిరము తెగవెయ్య
బోయెను
బొబ్బలు పెట్టుచు పోతులరాజు
జడిసి భూతాలతో తబ్బిబ్బులాయె
కూతలు పెట్టుచు కొరివి దయ్యాలు
శంకిణీ భూతాలు చెట్ల పాలాయె
కామినీ భూతాలు కదిలె వేగంబె
అప్పకొలువుకు పోతురాజు ఆర్చుచూ
వచ్చె
ఎదురుగా బోయి గంగ ఎరవకు మనెను
ఎన్ను చరచి గంగ ఎరవకు మనెను
"భూతకోట్లకు నెల్ల పురుషుడవు నీవు
ఎవరోయి తమ్ముడా! నిన్ను
ఎదిరించిన వారు?"
ఆ మాటకు పోతురాజు అపుడిట్లగనియె
దిపడలు వణకుచు తబ్బిబ్బు పడుచు
"వోయక్క వినవమ్మ వొక విన్నపంబు
వాడు ఎవడో గాని విపరంబు ఎరుగ
మహామేరుపు వలె మండుచున్నాడు
ప్రాయంబు ఏడేండ్ల బాలుండు వాడు
కుడిచేత వానికి కుచ్చుల దేగ
ఎడమచేతను వుండె చంపుడు కోల
పొర్లాడు బొందులు పొర్లించి చూచి
ఎక్కడెక్కడి బొందు లెత్తెత్తి చూచి
చొచ్చి యా రణమును శోధింపగాను
ఎవ్వడ వని వాని హెచ్చరించితిని
ఎవడన్న మాటకు ఎదురుకొనె వాడు
పలవరించి గణాదులు పారిపోయిరక్క
దిక్కులేక పోయె దేవు డాతండు
నిలువలేక నేను నీచాటు కొస్తి
గ్రక్కున నిటు రాగ కంటిని నిన్ను
అక్కరో వో యక్క ఆది మాశక్తి"
నీతి విడి పోతన భీతితో పలికె
ఖ్యాతిగా పోతన గంగకు తెలిపె
ఆ మాట విని గంగ అట్టున నవ్వె
విని గంగ తమ్మునికి వివరించి పలికె
"భువిబల రణశూర భుజ విక్రముండ
భూరి రాక్షస కోటి పొరిగొను మేటి
భేతాళకుని బట్టి బెదిరించినావు
నీకు సాటెవ్వరు నిఖిలంబులోన"
వెరువకు మని తమ్ము ననఘాత్మ తెలిపె

"బెదిరించె నీదెంత దాపూ విక్రమశాలి
ఇంతగా శోధింప నీదెంత ఘనము"
వింతగా మరియొక్క విధము పుట్టించె
పట్టపగలు చీకట్లు బ్రహ్మాండమెల్ల
గిరికొని చీకట్లు క్రిక్కిరిసి యుండె
రాజవుట తెలిసెను రమణి గంగకును
మాయ గలిపించెను మాంకాళి శక్తి
గాంధారి మాంధారి గంగాధర రాత్రి
అమ్మవారు పెరిగెను ఆకాశము పొడవు
అమ్మవారి శిరస్సు కొర్లుగా దోచెను
కొత్తరికి పండ్రెండు ఏనుగులు వేసెను
ఏనుగుమీద పండ్రెండు పీనుగులు
వేసెను
పీనుగుకు పండ్రెండు జగజ్యోతులు
ముట్టించెను
పండ్రెండు చేతుల పట్టె ఆయుధాలు
సేసగిన్నె వకచేత శేషు డొకచేత
శంఖు వకచేతను చక్రంబు వకచేత
కరవాల మొకచేత ఖడ్గ మొకచేత
విల్లంబు లొకచేత వీటె వకచేత
సింగిణి వకచేత శ్రీబాణ మొకచేత
డమరుకము వకచేత డక్కి వకచేత
త్రిశూలము వకచేత దివ్యాస్త్రము
వకచేత
శూలంబు వకచేత సురటి వకచేత
అసురుల మర్దించు అంబు వకచేత
ధూర్తుల మర్దించు దుష్టు వకచేత
రాక్షసుల మర్దించు రాయి వకచేత
పగరాజుల మర్దించు పసుపు వకచేత
పండ్రెండు చేతుల బట్టె ఆయుధాలు
కుడిపాదమున కట్టింది పంపుస
సన్నగజ్జెలు
ఎడమపాదమున గట్టింది ఎలలేని
మువ్వాలు
కోరకోరకు కొరికె కోటి ఏనుగులు
నిప్పుల కుంపటి నెత్తిన బెట్టి
భూరి కిన్నెర వకటి భుజమున బెట్టి
మోజుసము పొడుగున మెరమెరిగింది
పండ్రెండు కుచ్చెళ్ళ నేల జారలు
చాపుకుంటూ
ఘల్లు ఘల్లున వచ్చెను గంగాభవాని
వురుములు పుట్టించి వురిమెను గంగ
మింట మంటలు పుట్టె మిణుగురులు
రాలె
అగ్నిరోషమున అసురుసురు మనుచు
భగ్గుభగ్గున మండి భాగీరథి అరిచె
గిటగిట మని కోరలు గీటుచు నంత
పెటపెట మని పండ్లు పెళ్లున కొరికె
రాల్చెను నిప్పులు రాజు చూడంగ
తాడివలె పెరిగి ధరణి మిన్నంటె
కదిలెను మిట్టిపడి గంగ తానంత

## గంగా కాటమరాజుల తరకవాదము

కదిసినంతలోన కాటమరాజు
హనుమంతు లఘువున అతివుగ్ర
గతిని
కత్తిని వరబెరికె కరమొప్ప రాజు
ఏడేండ్ల బాలరాజుతో కాంతసోమప్ప
ఏమనుచున్నాడు ?
"వెన్ను జల్లున చరచి వెరువకు రాజ
అదియే మీ యిలవెల్పు గంగాభవాని
అపరక బెపరక కనుచూపు చెదరక
తొలగక దానితో మాట్లాడు రాజ :"
ఆ మాట విని రాజు అతివుగ్రు
డగుచు
కాలాగ్నిరుద్రుడై కత్తి ఝళిపించి
"రాకు రాకు దైత్యా ! రాకువే దైత్యా :
ఏతును ఏటారు తునియలుగ నిన్ను"
పుక్కిళ్ళు వుబ్బించె పూబోణి తాను
రాల్చెను నిప్పులు రాజు చూడంగ
అట్టిట్టు సొక్కుచు ఆడుచు గంగ
కాటమరాజుతో గద్దించి పలికె:
"ఎవడవురా నరుడ ఈవేళ కాద
రణముకు రాను ఏమి కారణము ?"
ఆ పన్న మాటకు ఏమనుచున్నాడు ?
"ఎంతివే దైత్యా ! నాతో
ఎదిరించెదావు"
ఆగ్రుడై పలికెను ఆ రాజు ఘనుడు
"జడలు తిప్పకే శక్తి నీ మెడలు
నొచ్చేను
తలనిండ జడలు నీవు తాటక వలెను
ఎదిరించి పలికేవు మేదినిమీద
పాము లల్లాడంగ పరువులెత్తేవు
శక్తులనగా నెంత ! నీవనగ నెంత
తలపతి ఈ రణము తాము వెతకంగ
తలచూప వెరతురు దానవులెల్ల
బెడగోడవలె అడ్డము పెరిగి వున్నావు
ఎవతెవే నాతోను ఎదిరించినావు ?
చేష్ట చేయక చెప్పు నీ పేరు ?"
"ఎవడోయి నీవు ? ఏ
రాజుపుత్రుడవు ?
సురలైన ఈ రణము చొచ్చి రాలేరు
హరుడైన వెరచును నా ఆగ్నలేక
దేవాధి దేవతలు దేవేంద్రుడు మొదలు
ద్రిష్టించి చూడలేరు ధీరులీ రణము
నడురాత్రి కాడను ఈ రణములోను
వెరువక తిరిగేవు ఎవరు నీపేరు ?
కొసరక నాతోను గొబ్బున చెపుమ ?
తరిమి పురికింతును చలము సాధింతును
నాయాగ్న చేతను నరుడరో వినుమ
వేలుపులైనను వెరుతురు నాకు"

అని ఫెళఫెళ నార్చి పలికెను శక్తి
విని కాటమరాజు వీరశేఖరుడు
శక్తితో ఎదిరించి చేరి యిట్లనియె
"గంగవో గౌరివో గద్దరించి పలికేవు
శక్తినని చెప్పేవు చేరి వచ్చేవు
తరచుమాటలు చెప్పకు తర్లి పోవలెను
కుంభిళ్లపై ఎగసి గుడ్లెర్రజేసేవు
వెలది నీ బింకాలకు జంకేది లేదు
హరిహర బ్రహ్మరుద్రులు అవతార
మెత్తిరి
వారిని కొలిన వల్లవుల రాజును
సురలు యాదవులెల్ల సుంచరి పోవె
ప్రమథులు లింగము అపటకాగు శిరి
మందలో వున్నారు మాయలాడి ఓ వె
జడుపు వెరపు లేదు తర్లిపో నీవు
వంటరిగా ఈ రణము వక్కడనే
వెతుకంగ
తలచూప వెరవను దానవులైన
నీకు వెరతున నేను నిలచి వున్నావు
చేష్టలు చేయక చెప్పవే నీపేరు?"
"ఏమి నరుడ నన్ను ఎరగకున్నావ
నరనాథ నా పేరు నన్నడిగి సందుకు
నీపేరు చెప్పుమయ్య నీలవర్ణుండ?"
"చెప్పవే నీపేరు చిన్నెలు మాని"
"నాపేరు నరుడ చిక్కాల బీరకాయ
అందురు"

"ఏమేమి దైత్య! ఎరుగవా నన్ను?
చిక్కాల బీరకాయ తరిగే కక్కాల
కొడవలి నాపేరు"
"అది ఏమి నరుడ! అంటి వీమాట
కరుకు మేఘమున పుట్టిన మెరుపుతీగె
నాపేరు"
"అదియేమి దైత్య అంటి వీమాట
మెరుపుతీగన పుట్టిన పిల్ల పిడుగు
నాపేరు"
"అది ఏమి నరుడ అంటి వీమాట
కాలమునాటి కాలవిధి నాపేరు"
"అది యేమి దైత్య అంటి వీమాట
నీపేరు విధియైతే నాపేరు విధినాథు
డందురే"
"అది యేమి నరుడ అంటి వీమాట
ఈ రణముకు రణకొమార్తె అందురు
నాపేరు"
"అది యేమి దైత్య అంటి వీమాట
నీపేరు రణపెండ్లికొమార్తె అయితేను
నీ కాలుతొక్కి కంకణం కట్టే
రణపెండ్లికొమారుడు నాపేరు"
"అదియేమి నరుడ అంటి వీమాట
పార్వతి అందురు పట్టభద్రుడ నన్ను"
"అది యేమి దైత్య అంటి వీమాట
పార్వతి నీ పేరయితే పరమేశ్వరు
డందురు నన్ను

సరిచెప్పలేనని సారె సారెకును
ఇన్ని బొంకులు పలికి ఇట్టు లడిగేవు
చిన్నారి నీపేరు చెప్పవే దైత్య''
అన్నంతలో గంగ అప్పుడిట్లనియె
''మూడు కొండలు దెచ్చి
ముచ్చటాడెదను''
''మూతు కొండలు దెచ్చి
ముచ్చటాడినను
ఏడు కొండలు దెచ్చి
ఏకాంతమాడుదు''
''పేరు చెప్పుము రాజ ప్రగ్నలు
మాని''
''చేష్టలు మాని నీపేరు చెప్పవే
నెలత''
''అక్కజముగ నాపేరు అడిగి
నందులకు
చెన్నుమీరగ పేరు వినవయ్య రాజ
వల్లవులు గొలిచేటి వజ్రపు నిక్కను
తిరుమందులు గొలిచేటి తీనె
వేల్పురాలను
హరుని శిరసున వున్న ఆదిశక్తిని
నేను''
భాగీరథితో రాజు ప్రకటించి పలికె
''వినవమ్మ నాపేరు ఇలలోన చెపుదు
ఇందుసంతతియందు యదుకుల
ఇంద్ర సింహాసన మెక్కిన వాడ
లంకాపురీ పట్నమున
రాక్షసుల సంహరించిన రాజు
నాపేరు
వలరాజు మనమడను వంశవర్ధనుడ
సింహాద్రిరాజు రాజుకొమారుడను
సింహపు పిల్లను
పెద్దిరాజు కొమారుడను పేరుగల
రాజును
యరనూకరాజు కొమారుడను
యాదవ చంద్రుణ్ణి
నలనూకరాజు కొమారుడను
నలనన్న నాపేరు
పోలురాజు కొమారుడను భోగ
దేవేంద్రుడను
కాంతసోమలింగము కాటమరాజు
నాపేరు''
కాటమరాజు అనగానే అమ్మవారు
కలకల నవ్వె
ఆరూపు అపుడు మారె అలివేణి గంగ
పండ్రెండు ఏండ్ల బాలకొమార్తె
ఆయెను
''రావోయి కాటమా రాజశేఖరుడ!
ఇంతవాడ వవుట ఎదిరించి నాతో
అదరక మాటాడితివి అవనీశ నీవు

కాస్తి కాస్తి సరుడ కాస్తిని నేను
గోల కాస్తిప నీవు గోవుల కాస్తిప
కాస్తికాస్తి సరుడ కాస్తిని రణము
పొడిచిన బొందులు పులుసెయ్యకుండ
పూసిన పీభూది పొంక మెడలకుండ
కారిన రక్తము కరుడు గట్టకుండ
కట్టిన ధట్టీలు కడు మాయకుండ
మొల్లలు జాజులు ముడి విచ్చకుండ
శ్రీగంధ మెంతయు చిట్లి పోకుండ
భూమిపై బొందులు బుర్రటిల కుండ
ధరణిపై బొందులు తరసిల్లకుండ
కల్లిలో దేహము కసువేయకుండ
ఈగ వాలకుండ ఈపి పెట్టకుండ
రణముకు నక్కలు నటు చొచ్చకుండ
ఆకాశమున పక్షులు అర్రు వంచకుండ
మింటిమీది కాకి మెడ వాల్చకుండ
కమ్ముకొని భూతాలు కదిసి రాకుండ
పోతుటీగ రణము పొంచి చూడకుండ
రణము కాచితిని ఈ రణతలమెల్ల
కాటమరాజనంగానే కాస్తిని నిన్ను
హస్తములెత్తి మ్రొక్కవోయి
యాదవరాజ!

పల్లమ్మ కొలిచిన ప్రజమాణిక్యమును
కొమరమ్మ కొలిచిన
కొంగుబంగారమును
పెద్దమ్మ కొలిచిన పేరుగల గంగను
సిరిదేవి కొలిచిన చిత్రరుపు ప్రతిమను
ఎప్పటి మీ ఇలవేల్పును
యదుకులాధీశ"
ఆ మాటలు విని రాజు ఆగ్రుడై
మండెను
"హస్తములెత్తి మ్రొక్కమంటివి
అతివరో నన్ను
ఎంచంగ పెంచంగ ఏడేండ్ల రాజును
హస్తమెత్తి మ్రొక్కేది ఎరుగను
నేను"
ఆ మాట విని గంగ అళ్ళున నవ్వెను
తన రెండు హస్తములెత్తి తగ
నిట్టులనియె
"ఇటువలె మ్రొక్కు"మని ఆనవాలు
తెలిపె
అది చూచి ఆ రాజు అళ్ళున నవ్వె
"గంగమ్రొక్కు ముందాయె
నామ్రొక్కు వెనుకాయె"

## గంగ కాటమరాజును పెండ్లాడ గోరుట

ఆ మాట విని గంగ అవమానపడెను
"ఇంతవాడ వవుట నీవు ఎరుగవు
నేను
మనమిద్దరము కల్యాణము అందవలె
నిపుడు"
ఆ మాట విని రాజు ఆగ్రుడై మండెను
"మా అయ్య చెల్లిన రణములోపలను
ఆయ్య కనుపింపక నేను ఆందోళన
పడుచు
సొరిదిగా దుఃఖాన పొగులుచున్నాను
న్యాయమటే శక్తి నన్ను
పెండ్లాడమనుట"
ఆ మాటలకు గంగ అపు డిట్లగనియె
"రణము గాచితిని రణకుతల మెల్ల
రణభుక్తి ఏమిటి నాకు పెట్టెదవు ?"
"రణభుక్తి ఏమి కొదువ రమణిరో
నీకు
అడుగుమీ గంగ ఆహార మిపుడు"
పుడమీశు పుత్రుండు పూని పల్కగను
కడువేగ గంగ తా ఘనున కిట్లనియె :
"యుగములు జగములు
వున్నంతవరకు
సూర్యుడు చంద్రుడు చుక్క
లుండువరకు
తాటంత పోతును మేటంత ముద్ద
యుగయుగంబులు నాకు వుండులాగు
జేయుము"
పాటించి రాజునని పలికినందులకు
మేటి కాటమరాజు మెలత కిట్లనియె :

## కాటమరాజు గంగకు కొలువులు చేయింతుననుట

"మా తండ్రిని చూపించి
మాట్లాడిస్తినైన
మా అయ్యను సంహరించిన
పగరాజును సాధించి నేను
క్షేమాన మా తండ్రిని కనకరేపల్లెకు
చేరిస్తినైన
తరమునాటి పగలు దక్షిణదేశాన
తావుకొని వున్నవి
తరమునాటి పగలు నే సాధిస్తినైన
పాకనాటి రాజుల బారిగొర్ల జేతును
గొడ్డుగొర్లకు సరిగాను స్వరాల
పొడిపిస్తును

కొమ్ముతగళ్ళకు కొమ్ము చేసుగలు
కొమ్ముతగళ్లగా బలియిత్తు కోమలి
నీకు
నరబలి పెట్టుదు నరుల సురుమాడి
కండలు గుండెలు కానుక బెట్టింతు
కరికుట్లు చెల్లింతు కల్లిలో నీకు
రక్త మేరులు పారింతు రమణిరో నీకు
ఇటువలె సాయమై ఈరీతి నున్న
వుర్లుకొండ యలమంచిలో వుండారు
బాంధవులు
మర్లవారి యింట నీవు అవతారమెత్తి
మరివేగ జన్మము ఎత్తితివైన
అప్పుడు శ్రీకల్యాణము అందేసుగాని''
ఆ మాటలకు గంగ సంతోషమంది
''నమ్ముదునా రాజ నమ్ముమన నిన్ను''
నమ్ముమని గంగను నమ్మించె రాజు
బలబల తెల్లవారె భాను డుదయించె
చెటాపటీలు పట్టుకు చేరి రిద్దరును
ఆర్లపెంట రణముకు వచ్చిరి
అతివేగమునను
చూచె నారణమును చోద్యంబుగాను
ఆర్లపెంట రణము అపుడున్న
తీరు
పునుగున జవ్వాది భేదించినట్లు
మంచిగంధము వాసన మరివేగ వేయ
కుంకుమ కురువేళ్ల కోరు జవ్వాది
పైగోరు జవ్వాది పచ్చ కస్తూరి
మొగలి పూల వాసన మల్లెపువు తావి
బొడ్డుమల్లెలు విరజాజి చేమంతిపూలు
వాడిపువ్వులు రాసు వాసన వేసును
పరిపరి విధముల పరిమళింపగను
పుణుసుక గబ్బుసు కల్లిలో పుట్టంగ
రాసు
పూసిన గంధము పూరి మాయ లేప
కట్టిన దట్టీలు కడు మాయలేప
ప్రాణాలు విడువక పడిన ఏనుగులు
నిద్రపోయిన రీతి ఇలమీద వుండె
నరికిన శిరసులు నడి కల్లిలోను
కనిగుడ్లు వెలివెళ్ళి కరచె నాలుకలు
తప్పక చూచేటి తలకాయ పుర్రెలు
తెగిపడ్డ తలలును తేజంబు తప్పక
ఈరీతి వుండెను నడి కల్లిలోను
పరువుపడి నరికితే పడిన తలలన్ని
నోరు తెరుచుక నెరి రొప్పుచుండు
పెదవులు కరచుక పడివున్న తలలు
పొర్లాడు బొందులు బుసపెట్టు తలలు
చిరిగిన పొట్టలు జిర్ర పేగులును
ఈవిధమున బొందులు విశ్వంబులోను
ప్రాణములు విడువక పడివున్న
పీనుగులు
పండ్లు కొరుకుచు వుండు
సమరంబులోను

రా ప్పేటి బొందులు రోజు పీనుగలు
కొప్వును దొబ్బలు కుప్పలై వుండె
గుర్రాలు సర్దార్లు కూలె రణమందు
వసుధపై చెల్లిన వుత్తమాశ్వాలు
పోట్లబడి రణమందు బుసగొట్టుచుండు
బాణాలు తాకిన భద్రగజాలు
తొండాలు తెగిపడి దొర్లాడుచుండు
అరిగెలు గొడుగులు ఆ కల్లిలోను
పీటెలు నేజాలు విద్ధ రంగమున
అలుగులు విరిగిన ఆ కల్లిలోను
బల్లేలు ఈటెలు పందిగొరకలును
మెండుగా నుండెను మేదినిమీద
అటువంటి రణమున తమ అయ్యను
వెదకెను

సూర్య సోమ వీథులు చొచ్చి
శోధించెను
ఇందుశేఖరుండు ఈశ్వరుని బోలి
తనయుండు రణములో తమ తండ్రిని
పిలిచెను
కల్లిలో తమ తండ్రి కానరాడనుచు
వీడు రాజు వీడు బంటని
వివరించరాదు
పతకములు మెడనూళ్ళు పైబడి
సరిబొందులు
వజ్ర వైడూర్య పుష్యరాగాల హారాలు
మాణిక్యము గోమేధికము ధరించువాడు
వసుధేశుడు తమ తండ్రిని వర్ణింపలేక
విక్రమార్కుడు తాను విచారపడెను

## గంగ కాటమరాజుకు రణరంగమున హతులైన వీరులను చూపుట

విచారపడగానె గంగ తా నపుడు
చెట్టబట్టుకొని రాజును సరగున నపుడు
రణములో చెల్లిన రాజుల నెల్ల
కడు వేగమున చూపె కాటమరాజుకు
"మెండుగా రాజుల మేదిని గూల్చె
బాణాలు దేహమున పరిపూర్తి నాటి
ధండిబోయిన ధర్మరాజు ధాత్రిపై
వొరిగె"

దండిబోయిన ధర్మరాజును చూచి
రాజు తా కదిలె
"ఘోటకంబుల నెల్ల గొదకొని నరికె
ఖర సూర్య బాణాలు కంఠమున నాటె
జననాథుడు జగ్గన వరిగినాడు
చూడు"
వారివంక చూచి చాల వగచెను రాజు

''బ్రహ్మ్రవాలు చిరిగెనా బాలలార
మీకు''
మరి రెండు అడుగులు మగిడి తా
వచ్చెను
'కొమ్ము చేనుగుల నెల్ల కూలంగ
నరికి
కసిగండమున పోట్లు గాయాలు నాటి
రణవిజయు బోలేటి బండారు గోపన
వీడుగో రాజ వీక్షింపవయ్య''
''పగవారికి మా తండ్రి మిమ్ము
పరిగొన జేసిన
భూమిమీద వుండుదీ మళ్లి వత్తు
నేను''
''ఎదిరించిన మన్నీటి బంసుంతయు
గూల్చి
అచ్యుత తిరుమణి వీడుగో రాజ !''
అచ్యుత తిరుమణిని చూచి రాజు
ఆందోళనపడెను
అతుల ప్రతాపశాలి అచ్చోటు
తరలెను
''అసహాయ శూరుల హతముగా నరికి
గొరకలు అంబులు నాటి ఘోరాజిలోను
అసహాయ శూరుండు ఆవపువ్వుల
హనుమంతు
వీడుగో రాజ వీక్షింపవయ్య !

పరగిన చందంబు వో రాజ ! చూడు''
అతనివంక చూచి అధైర్యపడుచు
''ఎవరితో భాషింతు ఎవరితో
ఏకాంతమాడుదు
ఆవపువ్వుల హనుమంతూ అటువుండు
నీవు''
అచ్చోట తరలెను ఆ రాజమనుడు
''గుర్రాల నెల్లను గుంపుగా జేసి
చక్కగా నరికెను సంగరములోను
చెవుల కేశవన్న చెల్లినాడు చూడు''
చెవుల కేశవన్నను చూచి కెరలె
మనసాన
''వంటరివాడ నైతిని వో మామలార!''
అనుచు భాషింప రాజు,గంగ తా
నపుడు
''పల్లవుల పుంగవుడు భూమాడి
పోలు
చంపము సాధించి చంపె శత్రువుల
శరీరమున ఈటెలు జర్జితముగ నాటి
సాహస ఘనుడు పరిగిన చందంబు
చూడు''
వారిని జూచెను వల్లవుల రాజు
''వంటరి వాడ నైతిని వో
మామలార !''
అనుచు సమరానికి ఆ రాజు కదిలె

"ఎచ్చరించిన మూకల మచ్చరమున .గూల్చి
మట్టుగా ఈటెలు మగుటములు నాటి
మహిమీద చెల్లితిరి మామలార మీరు"
ఆలోసనే గంగ ఆ రాజును బిలిచెను
"సేనాప సేనల చెంరేగి చంపి
బాణాలు దేహమున బలుపడి నాటి
చండి భుజశాలి దామసాని పోతన్న
ధర్మమీద వరిగెను మీ మామను చూడు"
కటకట నడలుచు రాజు కడు చేరవచ్చె
"ధర్మవర్తనుండ దామసాని మామ
అందరు మీరును ఆర్లపెంటలోను
పాలిగాండ్లు మీరైతిరి పగవాడ నేనైతిని
కరాళించి మీరందరు కల్లిలో మాసిపోగా
ఎనక ముందు లేక నేను వక్కాడ నైతిని
ఎవ్వరూ పలుకరు ఏమనేవు మామః
దళములు గూర్చుక మీవెంట వుండు రానైతి
పలకరు కాబోలు పగ దలచి మీరు
శిరసున పోట్లు నాటి ధారంబు లాయెను
తప్పదు ఇది మనకు దామసాని మామ
మీతోను భాషించ నే నెంతవాడను
మా తల్లి పెద్దమ్మ మా అన్న ఏదని అడిగితేను
నీ పరిణము ఏమని చెప్పుదునె మామ ?
నేర్పు నేరములు నే నేమి చేసితిని ?
నీ తోడబుట్టిన మా యమ్మను చూడవే మామ !
చూడుము నావంక చుట్టమును నేను
పగవాడ గాను మామా ! నీ అల్లుడను నేను
పరిపరి విధమున పల్వరించుచును"

## గంగ కాటమరాజుకు పెద్దిరాజు శవమును చూపుట

అంతలోనే గంగ ఆ రాజును పిలిచె
"పీడుగో ! మీ తండ్రి పీడుగో రాజ
వేంచేయ" మన్న మాటలకు రాజు విషాదమంది
చయ్యన తమ తండ్రికడకు చేరంగవచ్చె
చటువ కెక్కిన యట్టి జాహ్నవిగంగ
రక్తాన దొగచి యుండగాను
పీడుగో మీ తండ్రి యితడని చూపె

## కాటమరాజు తండ్రిశవమును చూచి దుఃఖించుట

తొణికి తమ తండ్రిని తొడపైని
చేర్చుక
కలవర పడి తమ అయ్యను కన్నుల
జూచి
పచ్చ పగడమువంటి పలుపరుస
జూచి
బైరగడ్డము జూచి భావించె రాజు
చెరకు తుండెములవంటి చేతులుచూచి
ఏనుగు కుంభస్థలములవంటి ఎదభుజ
ములు జూచి
అరటి స్తంభములవంటి పెంగొడలు
జూచి
పట్టిపట్టి చూచి ప్రలాపించుచును
తళుక్కుటద్దములవంటి తండ్రి చెక్కిళ్ల
తడిమి తడిమి తండ్రిని పేర్కొని
పిలిచి
పట్టు ధట్టి కొంగు భస్మంబు తుడిచి
తమ తండ్రి రథధూళి తనయుండు
తుడిచి
తండ్రి చెక్కిళ్ల నొక్కి తల్లడమంది
ఉడుగని దుఃఖాన వలపొయ్యసాగె
తనమోము రాజు తండ్రిపై జేర్చుక
దండి ధాయాదులు లేరు వో తండ్రి
నాకు
పొగులుచు దుఃఖాన పలపొయ్యసాగె

''కట్టడి విధి ఇట్లు కల్లికి దెచ్చేను
నేర్పుగా విధిని నా నెలవకు దెచ్చి
కట్టుబడితిరి విధి కట్టడిచేత
ఏ భూమిని పుట్టి ఏ భూమిని పెరిగి
తివో
పరభూమిని చెల్ల ప్రాప్తంయి వుండెరా''
తొల్లి రావణాయుద్ధములోను లక్ష్మ
ణుడు వొరిగితేను
మూర్ఛగతుడైన తమ్ముని ముందుంచు
కొని
దుఃఖపడుచున్న శ్రీరాము చందమున
పరి దుఃఖాన తండ్రిపై బడెను
''దానము చేసేటి తండ్రీ! నీ హస్తములు
వున్నతముగా నేటితో వుడిగెనా తండ్రీ!
తుమ్మెద రెక్కలవంటి తూలాడు
కురులు
గపగంప తలనెరులు తండ్రి ! గాలికి
పొర్లేన
నిమ్మపండువంటి నీ చక్కని
దేహంబు
కత్తులు నాటెనా ఘనుడ వో తండ్రీ!
వస్త్రాదిః నీవు తొడిగి వజ్రాంగిజోడు
తుపాకి ఏట్లకు తుందునక లాయెనా!
పగవాడిని కాను నీ పట్టినే తండ్రి !
నాతోను పల్కవే తండ్రి పెద్దయ్య !

కపటంబు మాని తండ్రి కనులెత్తి
చూడవు
ఇన్నాళ్ల వో తండ్రి వేగమే నన్ను
బాలుడని ఎత్తుక పైచెమట తుడుతువు
నాటి దయ వో తండ్రి! నేడెందు
బోయె
నీ చిత్తంబు ఎటు బోయె చెప్పవే
తండ్రి!
ఎంత పల్కరించినా ఏమనవు నీవు
ఆరుంధతి మీ తల్లి ఆవుల పల్లమ్మ
నోమరాని నోములు నోచె మీ తల్లి
కత్తులపాలు జేసెనా వో కన్నతండ్రి!
ఆచరువు లివ్వరే అయ్యరో! తమకు
నట్టేట వృద్ధి ముంచినావా నా తండ్రి
ఎవరితో భాషింతు ఎట్లు బ్రతుకుదును
పాపపు దైవము పగవారికనే కూడె
ఏకాంగి నైతినే తండ్రి! ఎనక ఎవ్వరు
లేరు
పలుకు బంగార మాయెనటే వో
కన్నతండ్రి!
వింతవాడను కాను నీ సంతతి వాడను
పరోపకార్యమునకు ప్రాణముకు వుర్రు
పెట్టుకొంటివి
తండ్రులు కలవారు తనయులు పిలువ
ధైర్యంబు నిలువదు వో తండ్రి
తమకు
వొకసారి పల్కవే వో తండ్రి నీవు!
పుడితిమి నీ గర్భాన పుణ్య లిద్దరము
ఎనయంగ మా కింక వేడ్క లేదాయె
అయ్య నే వగవంగ వూరుకున్నావు!
ప్రియము చేకొనుము ప్రియము
నామీద
పాయక నామీద భక్తి నిలపవయ్య!
నాతండ్రి పల్కవె నాతోను నీవు
శివభక్తుల కొరకు సీమభూములు
విడిస్తివి
శివభక్తులు కలిగిరి స్రిష్టిపై వరిగితివి
అయ్యా! అని పిలుతును అర్లపెంట
లోను
పని గలిగి నాతోను భాషింపవయ్య!
ధీమంతుడా! నాకు దిక్కెవరు లేరు
కడలేని దుఃఖంబు కలిగి వున్నాది
కట్టడి నాతండ్రి కరుణించవయ్య!
అలిగి పల్కవా తండ్రి! అలసి
వున్నావా
పంతమా నాతోను పల్కవే తండ్రి
నీవున్న తేజంబు నాకేమి తెలుయదు
కాబోలు వూపిరి కమ్మి పారేను
తనువున ఏట్లు పోట్లు తాకెనటే తండ్రి
తరచు పోట్లు రక్తంబు చిమ్మించి
పారెనా
అంబులు నాటెనా అయ్య పెద్దన్న!

వురువున రక్తంబు వుబ్బి పారేనా!
వుక్కుటలుగులు నాటెనటే చక్కని
తండ్రి
నీమేను రక్తంబు మెరసి పారేనా!
పగవారు నీమీద బాణాలు వెయ్యంగ
అరిగెలు తుపాకులు కలవారు హతమైర
తండ్రి
తుపాకీల గుండ్లు నీమీద దూసి
పారేనా
శాయిగచ్చు టలుగుల మూక
కాపాడరైరి
విల్లునంబులు నీమీద విరిగి వున్నాయి
కాచేటి సూర్యుడు కాపాడడాయె
చొక్కు సింహగడలు చొచ్చి
పొడువగను
నీవు పట్టిన ఆయుధంబు పగవారికి
కూడెనా
హరుడు వ్రాసిన వ్రాలు అణగెనటే
తండ్రి
అయ్యా! నీవు చేసిన అన్యపున్యములు
తప్పక నేటితో తొలగెనటె తండ్రి
ఎక్కువ ధేనువులు గలిగె ఏల
భూములు కలిగె
ఈ రాళ్ళపై నుండ వేయుకటే తండ్రి
పట్టెమంచములు గద్దె పరుపులు గద్దె
పయునిరాళ్ళ దిబ్బ పాన్పు ఆయెను తండ్రి!

ఆగరు శ్రీగంధము అలిదేటి మేను
మెదడు రక్తపుపూత మేలాయెనటె
తండ్రి
వెలలేని భూషణాలు వెయివేలు గలిగి
గాయాలే భూషణాలు ఆయెనటె తండ్రి
హరుషంబు అయినట్టి అన్నదమ్ముల
బాసి
ఆరెమాను వీర బయప్పు అర్థమయనటే
తండ్రి
తమ్ములు నీకు గలిగె తనయుడను
గలిగితి
ధరణి పాలైతివి తండ్రి పెద్దయ్య
కోటి ధనములు గలిగి కొమాళ్ళు గలిగి
కుంభిణిపై కూలితివి వో కన్నతండ్రి!
బాంధవులు నీకు కలిగి బాలలు కలిగి
భద్రగజములపై చెల్ల బాగటే తండ్రి
నీవు నాతో పల్కవు నేర మేమయ్యా
నీవు దండు రమ్మంటేను దాగి
పోయితినా
నీవు రమ్మనలేదు నేను రాలేదు
వచ్చి నీవెంటను వయ్యాళి చేయక
వెన్నిచ్చి పోతినా వెనక ముందైతినా
పిరికినై పోతినా బిరుదు పోనాడి
ఖడ్గము పారవేసి కలవర పడితినో
పయ్యాళిలో బంటు వచ్చి వదిరించిన
ఇలుయుస వెంట నే పెగిపోయితినా

ప్రాణము దాచుకొని పార్థి పోయితినా
చేసిన నేరంబు చెప్పవే తండ్రి
తప్పేమి యున్నది తండ్రి నావల్ల
నిను జూచి ప్రాణంబు నిల్వంగ జేతు
ఆవులమంద పట్నముకు అర్హులు లేరు
మీ తండ్రి ఏడని మా తల్లి అడిగితే
క్షేమము ఏమని చెప్పుదును తండ్రి"
చేతులు పిసుకుచు దేహంబు మరచి
వో తండ్రి యని రాజు పుర్విపై
వొరిగె

## గంగ పెద్దిరాజును బ్రతికించుట

బాలరాజు ఈ రీతి ప్రలాపింపగాను
వినుతి కెక్కిన గంగ విశ్వనాథుండు
బ్రహ్మదేవుడు విష్ణు భాగీరథి గంగ
శంఖుచక్రంబులు శరముల తోడ
అష్టమాదుర్గతో అపు డిట్లనిరి:
"అసహాయ శూరుండు అడలుచున్నాడు
తమ తండ్రి పల్కడని అధైర్యపడుచు
నిద్ర లేపు రాజును నీరజనేత్రి
తండ్రిని కొడుకుతో తగ
మాట్లాడించు"
అని యిట్లు పలికిరి ఆకాశవీథిని
అష్టమాదుర్గ అపుడా మాట వినియు
తన తమ్ముడు పోతురాజును డాయంగ
బిలిచి
పోతురాజు ననియేక భూషించె గంగ
"గంగలకు-తమ్ముడా! కల్లిపోతన్న!
బాలాగ్నిరుద్రుడు కాటమరాజు
ఖ్యాతుడు మహానుభావుడు ఇందుశేఖరుడు
అధైర్యపడుచున్నాడు తండ్రి
పలుకడనుచు
ఘనుడ పోతురాజ! గాయాలు జొచ్చి
పోయిన ప్రాణంబు పొందుగా నిచ్చి
నిబ్బరముగా రాజును కూర్చుండబెట్టు
అబ్బరపు కొడుకుతో మాటలాడించు"
ఆ మాటకు పోతురాజు అడిగె
వివరంబు
"అక్కరో వో యక్క! అలివేణి
గంగ!
తాడంత పోతును మేటంత మద్ద
గావు దిబ్బాలును కట్నాలు తనకు
పోతురాజుకుంభ మని పోయించు తనకు
యాదవవంశమున ఇల్లడి చేయవమ్మ"
అనిన పోతురాజుతో అప్ప ఏమనెను
"నాతోడ ఇల్లడ గావింతు నీకు"
గంగచేత కట్టడి చేయించుకొని

రాజుగాయాల' గుండా గ్రక్కున జొచ్చెను
బొందిలోనికి చొచ్చి పొర్లించి లేపెను
కన్నులు నులుపుకొనుచు కన్నెత్తి చూచెను
నిద్రబోయిన చందాన నిలిచి కూర్చుండెను
తన కొడుకు ముఖమును తప్పక చూచె
హా పుత్రా! యని రాజు అక్కున జేర్చె
''పాపిష్టి మీ తల్లి పంపెనా కొడుక
భీకరేత రణముకు ఏల వస్తివి కొడుకా
భూతభేతాళాల కూతలు వినియు
శాకినీ ఢాకినీ పిశాచుల జూచి
కాకులు నక్కలు కడు చిమ్మిపారేను
నిండుగా మాంసము మెరయుచు నుండె
అది జూచి నీ గుండె అదిరెనా కొడుకా
పోటుల గాయాలు పొలయుచు నుండె
ఘటంపు ఏనుగులు గజములు జూచి
నీ వెంత జడిస్తివో నేడు ఓ కొడుకా
ఈవేళ ఇక్కడికి ఏమి వచ్చితివి?
బాల పాపడవు నీవు బాలరణ మెట్లు?
పెలుపొంద ఏడేండ్ల పుత్రుడవు నీవు
నెత్తురేరులు కొడుక ఓడి పారేను
భయపడక నిన్నెట్లు పంపె నా కొడుక
దయగలిగి నా యట్టి మీ తల్లి కాదో

కొడుకులు లేకను కొంతకాలంబు
కడు దుఃఖపడగాను కలిగితివి నీవు
కలిగిన యందుకు మీ తల్లి కరుణించదాయె
నా పూణ్యవశమున నీవంటి కొడుకు
ఈ పరభూమిలో ఎంచంగ లేరు
నీయంతటి వసుదేశుడు నీవంటి శూరుడు
ఎన్నంగ భూమిలో ఎవ్వరున్నారు?
ఇందుశేఖర నీవు ఈ కల్లికోసు
పొందుగా బొందులు పొర్లంగ జూచి
ఎన్నంగ నా కొడుక యాకపోయినావో
వర ఆయుధముల జూచి ఎంత జడిసినావో
శూయండ ఈ కల్లి చూడ నీకేల
ఇంతలేసి పనులు ఏమిటికి నీకు
కాంతిగల నాతండ్రి కలపర పడితివో
కొండల వలె నున్నవి కరియూధములును
గుండెలు జల్లుమని గుబులుకున్నావో
గొదకొని గుర్రాలు గూపెట్టగాను
దట్టించు రిపుల జూచి తల్లడిల్లేవో
ఇటువంటి కల్లికి ఏల వచ్చితివి''
తేజంబుగల సుతుని తొడలపై జేర్చుక
రాజితముగ జాటమరాజును జూచి

మరువంపు సిగముడి విప్పి దువ్వేను
తండ్రి
సరిచేసి ముత్యాల సరులుండ జూచి
బొజ్జమీద చెయ్యివేసి బుజ్జగించె రాజు
చెక్కిలి ముద్దులాడె చక్కని
కొడుకును
"ఎంచంగ పెంచంగ ఏడేండ్లరాజు
ఎవ్వరు చెప్పిరోయి కొడుకా ఇంతలేసి
బుద్ధులు"
ఆ మాట విని రాజు అప్పుడ సప్పేను
"ఆర్లపెంట రణమున అయ్య నీ
వుండగా
శంక భయములు నాకు చెప్పకే తండ్రి
బాలుడు గాడటే బాలక్రిష్ణమ్మ
దాసవిచ్చిన పాలు ద్రావి చంపుటఎరగవా
బాలలు కార తొల్లి పరగ కుశలవులు
రామసేనల నెదిరి ధర గూల్చలేద
నీకు బాలను గాక పగవారికి బాలనటే!
నీయంతో తండ్రికి నాయంత కుమారుడు
గలిగి
తండ్రిపగ తీర్చని తనయుండు ఏల
అయ్య నా పరాక్రమము అటు
చూడు" మనుచు
తమ తండ్రిపాదాలు కనులద్దుకొనెను
గంగను పోతురాజుని కల్యాణపు
శంభుని

సాయంబు గమ్మని శరణార్థి చేసెను
ఈశ్వరుండు రాజుకు ఈబూది ఇచ్చెను
గంగ నీవెంటనే కదలి వచ్చెదననెచు
పచ్చని పీరసేస రాజుపై చల్లెను
అపుడు కాటమరాజు గంగ కిట్లనెను
"కోటలు పదునాల్గు కొత్తళంబులును
మేటి గజములు వాని మించు
బలములును
కొట్టి విదళించెద ఘోరాజిలోను
వాలికేతుప రాజును పసుపపై గూల్చి
వాని తలలు నరికి వైసముగ దెచ్చి
కల్లిలో తండ్రికి కానుక వుంచి
పంతము నెరవేర్చి ప్రఖ్యాతిగాంచి
మా తండ్రి పగదీర్చి మరి పోదు పురికి
రమ్మను దండెత్తి రాజమార్గమున
ఇటు రాక పురివెడలి ఎందైన బోవ
బ్రహ్మలోకము జొచ్చిన పట్టి
చంపుదును
హరిహరుల జొచ్చిన అవలీల ద్రుంతు
ఇంద్రలోకము జొచ్చిన హింసింతు
వాని"
అని "వటవృక్ష క్రింద కూర్చుండుము
నీవు
వానిని దోడ్కొని వచ్చెద నేను"

## గంగ భట్టువేషమున వాలికేతువరాజు వద్దకేగి కాటమరాజు యుద్ధాహ్వానము నందించుట

అని రాజుతోజెప్పి ఆదిమాశక్తి
కామలక్ష్మియు వేగ కల్లని దాటి
భాగీరథి తానొక భట్టువేషమున
వాలికేతువు పురికి వొచ్చెను భట్టు
ఆరసి కోటలు అతి చోద్యమంది
అంతఃపురము జొచ్చి ఆయు రాజును
గాంచి
వెలయ కాటమరాజు విఖ్యాతి పొగడె
"వసుధ యాదవకుల వర్ధనీయుండు
పసి పట్టభద్రుండు పరగ విక్రముడు
బసవశంకర బిరుదు పట్టభద్రుండు
గద్దరి మన్నీల కాచినవాడు
పెద్దభూపతి సుతుడు పృథు
విచారుండు
కాంతిగల చంద్రుండు కాటమరాజు
వచ్చెను రణముకు వసుధ నిను గూల్ప
మచ్చరము నీమీద మసలుచున్నాది
కాలయముడు నీకు కాటమరాజు
ఫాలమున వ్రాసిన వ్రాలు చెడిరె నీకు
కోలాహలంబుగ కూల్చును నిన్ను
మూడు శిరసులు నరికి ముడి తొగర
దున్ను
ఆరు హస్తములును అవనిపై గూల్చు
నీవు దండెత్తుము నిరువేగ పొమ్ము

అని చెప్పి ఆ గంగ ఆయు
మాయమయ్యె
అన వాలికేతువు దార్భటము చేయుచు
"ఎనయంగ ఆ భట్టు ఏ వాటి
వచ్చెను"
అని విచారించెను వాలికేతువ రాజు
"కనుమాయగా వచ్చె కాన మెవ్వరిని
కాన" మని చెప్పిన రాజువారిని
కంసబాధలు పెట్టె కర్కోటకుండు
బలవంతులను వీరభటులను బిలిచి
వాలికేతువురాజు వారి కిట్లనియె:
"వీర శూరులార! విజయ వరులార!
హతము చేయుడి వాని నాలంబులోన
ఘాతలు చేయుడీ ఘనులార యిపుడు
దండు కదులు" డనుచు ధరణీశు డనియె
అనిన ఆ మంత్రులు అప్పు డిట్లనిరి:
"భుజబలవంతుడవు భువనంబులోను
చలమున నీతో నెవరు సరిపోల గలరు
కల్యాణపు గంగురాజు ఘనమన్నెవారు
వడివడి విరుగుదురు వార్త విన్నపుడె
ఇతరులవలె గాదు ఇత దీశ్వరుండు
భూతరాక్షసులను పొరిగొన్న శౌరి
హరియంశమున నిట్లు
అవతారపురుషుడు

త్వరపడి పోరంగ తగదయ్య నీకు"
అని మంత్రులాడిన ఆగ్రహుడయ్యె
మదాంధుడగు రాజు మంత్రుల కనియె:
"మంత్రి పుంగవులార! మానితులార!
పంతములు దిగనాడి పలికితిరి మీరు
భూతేశ హరి ఇంద్ర భుజశక్తి మెండని
మతి దప్పి ఆడిన మాటలు మానుడీ
హతము జేయుడు వాని నాలంబులోన
ఘాతలు చేయుచు దండు కదులు"
మని పలికె.

## వాలికేతువరాజు యుద్ధ సన్నాహములు

భేరీమృదంగాలు పెద్ద డమామీలు
ధారుణి మిన్నంటె తల్లడం బందె
భేరి వాయించిరి భీకర ధ్వనుల
బారులు ఏర్పడె ప్రబలె పంతములు
కరులును అశ్వములు కనక రథములును
పురవడి వాంచెలు వాంటి రాహుతులు
తులువల కోలుగల తురగ క్షత్రియులు
కల్లారి మూకలు కన్నోజు బలము
చిల్లరి మూకలు చివ్వల దొరలు
అరుదైన వజ్రీలు ఆరె రాహుతులు
దొరమన్నె నాయకులు దొడ్డ
రాహుతులు
గడెమన్నె నాయకులు గసగండ్లగాక
నడిమి కొల్లవాండ్లు నాల్గు లక్షలును
విరివైన సంద్రము వెల్లి విరిసిన యట్లు
హేరాళమై దళము ఏతెంచె నపుడు
వాలికేతువుండు వైబడి కదిలెను
బారులు భాగాను భాగీరథి చూచి
కాటమరాజున్న కడ కేగుదెంచి
వాలికేతుని దండు వచ్చెనో రాజ
అల్లవిగో ఏనుగులు అవిగో రథములును
చెలకొని పోడును చెండిన రీతి
బలముల పరిమార్చి భద్రగజముల కూల్చి
రథపతుల అశ్వాల రణమున గూల్చి
విడిబడి రాజుతో యుద్ధము చేసి
సమరము సల్పేటి సమయంబునందు
అలసినప్పుడు నన్ను ఆత్మలో తల
చుకో
గంగ చెప్పగ విని ఘనుడు సలనన్న
పరదళముల నంత పారంగ జూచి
కట్టాయితపడెను కాటమరాజు
కుడిచేత రాజుకు కుచ్చుల డేగ
ఎడమచేత రాజుకు చోపుడుగోల
ఏడు సానలు దీరిన చంద్రాయుధము
చేత బూనుకొని
వాలికేతువురాజు మీదికి వైబడి కదిలెను
పగరాజు కొమారుడు వచ్చె నంటేను
రథమెక్కి వచ్చెను వాలికేతువ రాజు

## కాటమరాజు శత్రుసైన్యమును హతము చేయుట

పగరాజు సేనలను బాలరాజు చూచెను
కుడిమీసము దువ్వి గుర్రెక్కజేసెను
సేనలపై వురికె రాజశేఖరుడు
రథముల నుగ్గాడె రాజుల తెగటార్చె
పగరాజులు వేసిన బాణంబు లన్నియు
బంగారు పువ్వుల బారులై వుండె
నరికె కాటమరాజు నరుల నుర్మాడె
నరికితే పడివుండు నల్లని శిరసులు
కొట్టితే పడివుండు కొవ్వు దొబ్బలును
కండలు గుండెలు తరిగిన రీతిని
పేగులు దొబ్బలు పెనగొని యుండును
కాలకంఠుని బోలె కాటమరాజు
ఎన్నంగ సూర్య సోమ వీథు లేర్పరచె
తన సేనలన్నియు ధర కూలి పోవ
రథముపై నున్నట్టి వాలికేతువరాజు
కుడిభుజమున వానికి కుమ్మరివాడు
ఎడమ భుజమున వానికి కమ్మరివాడు
శిరస్సులు నరికితే మళ్లీ శిరస్సులు
అతికిస్తూ వత్తురు
ఎంగిలి ప్రాణానికి ఆశించినాడు
ఆరు శిరస్సులు పన్నెండు హస్తములు
గలవాడు హస్తాపతిరాజు
హస్తాపతిరాజు కొమారుండు వాలికేతువు
రాజు
మూడు శిరస్సులు ఆరు హస్తములు
గలవాడు వాలికేతువరాజు
మింటికి యోజనము పొడవున వున్నాడు
వాలికేతువరాజు
కాలాగ్నిరుద్రుడై కత్తి ఝుళిపించె
పుడమెగసె నప్పుడు పెద్దభూపతి
సుతుడు
చంపట్టి కత్తిని ఝుళిపించె రాజు
ఘనతరముగ రాజు ఖడ్గమంకించి
సింహము గజముపై చెలగిన రీతి
కాలాగ్నిరుద్రుడై కదిసి నంతటనె
కదిసె బలములు రాజకంఠీరవుణ్ణి
మదపు టేనుగులను మట్టి మల్లాడి
అదలించి గజముల అవనిపై గూల్చె
తొండములు రెండేసి తునియలుగ నరికి
గుట్టలుగ నరికెను కుంజరంబులను
కండలు తెగనరికె కదన రంగమున
వంద తరిగిన రీతి వసుధపై గూల్చి
చెండేటి పగతుల క్షితిమీద గూల్చి
ఆరె రాహుతులను అవనిపై గూల్చి
మారుభాషల తురకల మడియంగ
బొడిచి
తులనరో రాహుతుల తుత్తుమురు జేసి
చెలగక పదివేల శిరసుల నరికె
మలయాళ రవుతుల మూర్కొని
ద్రుంచి
కరవాలు ఝుళిపించి కాటమరాజు
మేలైన రాజుల మేదిని గూల్చి

కోలాహలము జేసి ఘోరాజిలోను
వీరుల తెగటార్చి వీరత మెరసి
విఱ్రవీగుచు వచ్చె వీరుల ద్రుంచి
విరివిగ రణభూమి వెదజల్లినటుల
మర్రికి ఇరుగడల మడిసె నాబలము
సాహసఘను లంత సమసిరి కలన
రాహుతులు మన్నీలు రాజాధిరాజులు
దండి సంగరమున తత్తరపడిరి
వృత్తమాశ్వములను వురికించువారు
మత్తేభముల నరుక మన మెంత వార
మని
వెతకుడిచి పరువున వెళ్ళెడివారు
నెత్తురులను బడి నెరి గూలువారు
సమ్మతిగ రణములో సాగి పోలేక
మొత్తముగ బడి నేల మొరపెట్టువారు
చచ్చిన వార్కిఁకింప జొచ్చెడివారు
హెచ్చైన ద్రిమ్మకుల కెగబ్రాకువారు
మచ్చరములు మాని మరుగు
జొచ్చువారు
పచ్చికసవు గరచి పలవరించువారు
పుట్టలోపల జొచ్చి బుసపెట్టువారు
వట్టి ఏడ్పులు ఏడ్చి వాపోవువారు
నీళ్ళలోనే పోతూ నీళ్ళడుగువారు
గుట్ట లెక్కబోయి కూలేటివారు
చెట్లపాలుగ వురికి చెల్లేటివారు
ధారి ధారి పొదల దాగేటివారు
ఎలుగెత్తి భీతిచే ఏడ్చేటివారు
బలములు ఈ తీరు పారుట చూచి
వాలికేతువుండు బాపురే యనుచు
చలమున రణభేరి చెలగ వాయించి
బలవంతుడై వచ్చె బలములతోడ
అంగబలముతోను అగుబ్బుగాను
వుప్పొంగి సంద్రము వెల్లిబారినట్లు
నిప్పుల వర్షంబు నిమిష మాత్రముగ
గుప్పిరి బాణాలు కుంభవర్షముగ
శరవృష్టి కురియగా సేనల కురికి
అరమర సేయక ఆలంబు లోన
జననాథుపై వొచ్చె చిన్ని
సోమలింగము
కరి తురగ బలములు ఖండించి వైచి
తుదిపార బలముల తుత్తుమురు జేసె
ఇది యేమి చోద్యమని ఎదుట నిలువ
వెరచి
పొదల దూరువారు బొబ్బరించువారు
ఎదుటను రాహుతులు బెదరుట జూచి
పరువడి వాలికేతువుడు పంతంబు
మెరసి
రథమెక్కి రాగాను రాజు తా జూచి
కరిపైకి సింహము కదిసిన యట్లు
మెలగి లంఘించెను మేదినీశ్వరుడు
కదిసిన తానున్న గతి చూచి రాజును
పరిపరి విధముల పలికిరందరును:

"పరమేశ్వరుడో ఇతడు ప్రళయాంత
కుండో
వీరభద్రుడో గాని ఇతరుడు గాడు
పరుపడి వకసింత బలములు జంపను
నరుడై జన్మించి ఉపురెన పుడువా
తమ తండ్రి పగదీర్చ తా వచ్చినాడు
హయ గజముల నన్ని హతమార్చి
నాడు
పరుగున మనమింక ఎందుపోగలము
కారణము ఈ దినము కట్టడాయెను
గనుక''
దురముగ ఈ రణము దూల సాధించి
బిర బిర అంబులు పెంచి వేయగను
కదన విక్రమశాలి కాటమరాజు
చెదరక వెను వెంట సేనాధిపతుల
కదనమున మద మణచి గగ్గోలు
పరచి
చేరి వాలికేతువు శిరములు ద్రుంచి
కరములు ఖండించె ఘన బాహుశక్తి
ఎగసెను శిరసులు వినువీథి కపుడు
కేలార్చి శిరసులు కేక వేయుచును
మలయుచు వలలన్ని మాయవాదమున
శిరములు బొందిపై స్థిరముగా నిలిచె
వెరవక రణ వీరభద్రుడై రాజు
సరిమించు శిరసులు చక్కగా నరికె

పంచాప్ప రేసుడు పడిపడి నెగసె
అట్లన వచ్చి పడుపడి అరుకును తలలు
ధీరుడై వెలుగక ఘటముపై నిలిచి
పంతేసి రాజుతో పంతంబు మెరసి:
"బలవంతుడ! నాతో నెదిరించి నిలిచి
గెలువక పోరాదు, గెలువు నీ''వనుచు
వాలికేతుపరాజు పడి నుగ్రుడగుచు
సాయక బాణములు సంధించె నపుడు
విష్ణువ బాణాలు బోపుడు పెట్టుక
రాపుడవిసై కన్నుల రాజంగ అగ్ని
త్రిపురాలు సాధించిన
త్రిపురాంతకుండు
భూపతుల హతమార్చు భుజశక్తి
మెరసి
సురలాడి సుదుతెల్ల చూచి వెరగొంద
పరుస వాలికేతువు తలలు ఖండించ
మురియుచు తల లెగసి మూడు
యోజనములు
మళ్ళి వచ్చి శిరసులు మాటున గుదిరె
చెలరేగి యుద్ధము చేసి అనియేక
తలచెను గంగను తన మానసమున
"నమ్మితిని దైవమా : నమ్మితిని
నిన్ను
నమ్మితి''నన గంగ నెమ్మది పొంగి
ఇమ్ముల నుండియు ఇట్లని పలికె :

## వాలికేతువరాజు వధోపాయమును గంగ కాటమరాజుకు తెలుపుట

"రాజకులాబ్ధి చంద్ర ! రాజశేఖరుడ !
మరువు మోసము లేక మనసున
వుంచు
కుడిచంకలో నుండె కుమ్మరివాడు
ఎడమ చంకలో నుండె కమ్మరివాడు
ఎనక వైపున నుండె జంగమువాడు
కుమ్మరి కుదురుచెయ్యి కమ్మరి
కదకొట్ట
జంగము జాలిపొయ్య ఎప్పటివలె
రథమున అతడున్న
కమ్మరిని కుమ్మరిని జంగమును
కట్టుకోవయ్య
నరుకు మీదను నరుకు వనరంగ
నరుకు
ఎగసును శిరములు ఏడుయోజనముల
పొడవు
మగిడి శిరసులు బొందిని మాటు
సమయమున
చేత వుండే డేగను ఎగరెయ్యవయ్య
కొమరొప్ప మూడు జుట్లు కూర్చి
తాబట్టు
కూలును వాలికేతువుడు కుచ్చెల
చేని మేర
తొలగక జందెము తొక్కిపట్టి కోసి
వనరంగ తూములో వేయుము రాజ !
వారుగు దీరును తూము
వుర్వీశ్వరుండ"

## కాటమరాజు వాలికేంతువరాజును వధించుట

భ్రమరాంబ చెప్పిన పద్ధతి విని
రాజు
కరములు శిరములు ఖండించగానె
ఎగసెను శిరములు ఏడు
యోజనములు
ఎగసిన శిరసులు ఏర్పడ చూచి
ఎగవైచె తనచేతి డేగను చూపి
ధిగధిగ లఘువున ధీరత నెగసి
పగవాని తలలు తన్ని పట్టెను డేగ
వుదరము తెగ నరికి వుర్విపై నిలిచి
బొడ్డున వున్న అమృతకలశము
చెదిరి పోకుండ
సోమకుల ధీరుండు చొప్పించి నరికె
ధారుణి అదరంగ దానవులు మూర్ఛిల్ల

ఘోరున కొండవలె భూమిపై వొరిగె
జగములు పొగడంగ జననాథు డేగ
పగవాని తలలు రాజుపాదముల
బెట్టెను
అంతకుడై వేగ అమరంగ వ్రాలె
కాంతిగల చంద్రుండు కామరాజు
తమతండ్రి పగవాని తలలకై చూచి
కొమరప్ప జుట్టులు కోసి పట్టుకొని
తలలు జందెము గొంచు తా వేగ వచ్చె
చెలువుడు తండ్రి వున్న క్షితికి
వేవేగ
తూములో జందెము తొలగక వేయించి
కంబము వొరుగు దీర్చె ఘనుడు
నలనన్న
శృంగారపు కొలనుకు రాజు శీఘ్రాన
వచ్చెను
పండు తామరపువ్వులు రాజు తా దెచ్చె
తండ్రిపాదాల కాడను వుంచె వేగ
పగవాని శిరసులు దెచ్చి తండ్రిపాదాల
కాడను వుంచెను వేగ
కొడుకు నక్కున జేర్చుక పెద్దభూపతి
పలికెను :
"పోరాడ నా కొడుక నే
వచ్చినందులకు
నా పగ ఈడేర్చితివి నేగన్న కొడుక
నోమరాని నోములు నోస్తిమి మేము

పట్టరాని వ్రతములు పట్టె మీ తల్లి
చినగంగ వ్రతకాలు పెదగంగకు రా
నోమె
పెదగంగ వ్రతకాలు చినగంగకు రా
నోమె
ఏడేండ్ల సందియు ఎండిన గజనిమ్మ
వృక్షములు చిగురెట్ట నోచె మీ తల్లి
వృక్షములు పూచి ఫలింప నోచె నో
కొడుక !
మూడు పండ్లు పండె ముదమొప్ప
నందు
సతీ పురుషులము ఇద్దరము వుపవాస
ముండి
బంగారు చీరెలు పట్టె వస్త్రాలు గట్టి
పైడి పళ్లెములోను ఫలము
లుంచుకొని
కోటానుకోటులు బ్రాహ్మణోత్తములు
పంచమా వాయిద్యములు బలువడి
మ్రోయ
సకల సంతోషమున శంభుని
మందిరము
కుడిచెయ్యి లోనుగా వలమూరి
తిరిగితిమి
గర్భగృహమును జొచ్చి గ్రక్కున
భోగ

గంట గణగణ మ్రోగె
గర్భగృహమందు
పైడిపళ్లెము స్వామినగరున
వుంచితిమి
ఇద్దరము భక్తితో పట్టితిమి కొడుక
మూడు గజనిమ్మపండ్లు తమ
హస్తమున వ్రాలెను
కాటకోటేశ్వరుడు గ్రక్కున పలికెను :
శ్రీరాముని వంటి వాడు కాటమరాజు
అర్జునునివంటి వాడు ప్రధాని వెలమ
పద్మనాయుడు
వింటికి అర్జునుడు విప్పర్ల సింహము
ఇస్తిని పొమ్మనెను వస్తిమి మేము
నీవు గాంగ ఊపగ ఊడేర్చినావు
మన పెద్దలు ఏలింది పెదగవిలి
పట్నము
పిన్నలు ఏలింది పిసగవిలి పట్నము
తాతలు ఏలింది ద్వారకా పట్నము
ఏడు తరముల కాణాచి ఎలసుంచి
తుమ్మపూడి
పన్నెండు తరముల కాణాచి పంపాద్రి
పట్నము
మా అయ్యలు ఏలినారు అమరావతీ
పట్నము
దశానంద పురాలు ఏడు వల్లకాపురాలు
మా తండ్రి అవుల వలరాజు ఏలెను

వంశము సూర్యవంశము గోత్రము
అచ్చుతానంద గోత్రము
సూర్యుని కళలుగల యాదవ కులము
నామావళి చెప్పేను నేగన్న కొడుక
అవుల వలరాజు కొమాళ్లు ఏవు రన్న
దమ్ములు
సింహాద్రిరాజు, పెద్దిరాజు, యరనూక
రాజు
నలనూకరాజు, వల్లవుల పోలురాజు
వీరివంశము రక్షింప ఘనుడవు నీవు
కాంత సోమప్పః నీపేరు కాటమరాజు
నీనుండి నాకీర్తి ఇల వృద్ధి పొంద
వలెను
పశువుల నానాడు పంపు చేయలేదు
పశువుల నీనాడు పంపుచేసుకో కొడుక
సన్యాసి పట్నాలు సమకూడె నీకు
మగువల వర్జించి మందపట్నము
కట్టుకో కొడుకః
బసవన్న పాదముకు నీ శిరసుకు
ప్రతిలంకె కొడుకః
కుల ముద్ధరిచెడి కొడుకువు నీవు
బలమును చేకూడె పంతంబు చెల్లె
నాతోడి వంశము నశియించె ననుకొంటి
నీనుండి ఘనమాయె నేడు నాయయ్యః
దైన్యము పడనేల తనయుడ నీకు

ఎన్నంగ బంధువులు ఎలమంచి
నున్నారు
సంపూర్ణ చంద్రుని సంతతి నీకు
పంపాద్రి నున్నారు బలువైన బంధు
వులు
యాదవుల కెల్లను అధిపతివి నీవు
పదవిగా ఆవులపుండ పట్టణము నీది
లక్షవేయి జందెముల రాజు లెల్లరును
దక్షిణమున నీచేత హత మగుదురు
చాల
భక్తుడు మీయన్న పల్లెకొండ నీబావ
దివ్యమై యున్నారు నిజరూపు బర్వి
వందనపరుడవై వారి కందరికి
సింధు గంభీరుడా చెల్లించు కొనుము
బంధు సహోదరులు బావలు మరదులు
అందరు వోపికతో అరసి కొలిచేరు
నిండు వేవురు బాంధవులు నీకును
గలరు
అడల నీకేటికి అడలకు పుత్ర!
నీ కన్నతల్లిని నిముషంబు నిలుపక
సాగుమానము చేసి సాగ నంపించు''
అనిన కాటమరాజుకు అయ్యకు ననెను:
''చెలగి విరోధుల చంపితివె తండ్రి
కాలమో లేక అపుకాలమో నీవు
ఏమియో నాతోను ఎరిగింపు తండ్రి''
గత పేష్య మడిగిన ఘనుడు తా దెలిసి

మతిమంతునిరొ తండ్రి మగిడి
యిట్లనియె:
''కాలమయ్యెను పుత్ర ఆలస్యము
వలదు
ప్రమథ రక్షకుడు వర మిచ్చిన
ఫలమింతె
పర్వకాలమున శివుడు పుట్టించినాడు
దయనేర్పడ నేను తనయుడ నీకు
నిలువదు ప్రాణంబు నిలుపంగ రాదు
శంఖుతీర్థము పోసి స్వర్గమున కనుపు
హరివత్రి వేయించి హరిపులి కంపు''
అంతలోనే అన్నదమ్ముల వార్తలు
పెద్దనకు అప్పుడే వచ్చును
అందరికన్న పెద్దవాడు సింహాద్రిరాజు
సింధుబళ్లాని రాజుమీద శ్రీవైష్ణవుల
వెనక వేసుకొని
అన్న చెల్లినవార్త పెద్దన్నకు అప్పుడే
వచ్చెను
ఏసుగనాథుని దుర్గం ఏకవీర పెంటుకు
కనకనంది పెంటు కల్లి మధ్యమున
ఎర్రభూపతి రాజుమీద ఎరుకుల
ఏనాదుల వెనకవేసుకొని
యరనూకరాజు చెల్లిన వార్త పెద్దన్నకు
వచ్చెను
నున్న బెజవాడమీద నూటొక్క
రాచకొమాళ్లను వెనక వేసుకొని

కంచుకు పెంచుకు లక్కగాజులకు
సుంకము వేసిన
నున్న భూపతి రాజును నురుమాడి చంపి
నలనూకరాజు చెల్లిన వార్త పెద్దన్నకు
వచ్చెను.
అన్నలకు తమ్ముడు ఆ పోలురాజు
జంగాలకొరకు చోడాసిమీఁద యుద్ధము
చేసి
పోలురాజు చెల్లిన వార్త పెద్దన్నకు
వచ్చెను.
రివ్వు రివ్వున వచ్చి పావురాలు రివ్వున
వ్రాలెను.
పావురాలు రాంగానే పెద్దిరాజు
చూచెను
జాబులు తీసుక చదువంగ సాగెను
అన్నదమ్ముల తలుచుకొని ఆందోళన
పడెను
"వక్క ముహూర్తమున పెండ్లిండ్లు
అయెను మనకు
వక్క ముహూర్తమున సావు
వ్రాసెను బ్రహ్మ
కారణాలు వేరు కల్గి అంత వకటి
కాడాయె తమభూమి కాడాయె
తమకు
తమకు సెలవియ్యవే తను
కన్నకొడుక !
చిత్రభాను సంవత్సరం చేరువాయె
తమకు"
తండ్రిమాటలు విని ధరణీశ్వరుండు
దరిలేని దుఃఖాన దొనకొని అడిలె
పొంకముగా తులసిపత్రి తా దెచ్చి
పొగులుచు ప్రాణనీరు పోసె
కాటమరాజు
శివశివ యని పెద్దిరాజు శివుని
తలచుకొని
జీవచోరణ మాయె శివుని సన్నిధికి
తండ్రి జీవము విడువగా తనయుడు
దుఃఖించె
కరుణానిలయుండు కాటమరాజు
స్థిరముగా మళ్ళి శంఖుతీర్థము పోసె
జనపతి శివపురి కేగె చయ్యన
నపుడు
తనయుడు కాటమరాజు తండ్రిని
అపుడు
పసువడి బంగారు పల్లకీలోను
పొసగంగ తమతండ్రిని పొందుగా
వుంచె
ఇనుదంత గ్రుంకెను ఇర్లుకొనె మబ్బు

## కాటమరాజు తన తండ్రిని వైకుంఠమునకు పంపుట

ఆనందభరితుడై ఆదివిష్ణుండు
హరి కొలువై యున్న అట్టి
సమయమున
శ్రీహరిని ప్రార్థించె క్షితిపాలకుండు
"జయ లోకపాలక ! పుండరీకాక్ష !
కినిసి గోవర్ధనగిరి పెల్లగించి
పూని చిటికెనవ్రేలిని కొండ గొడుగుగ
ఎత్తి
గోవులను రక్షించిన వో కృష్ణరాయ !
జీవులను రక్షించిన చిన్ని కృష్ణమ్మ !
జనపాల ! శిఖిపింఛ శేఖర ! శౌరి !
ఓ పుండరీకాక్ష ! భువన రక్షకుడ !
కరుణించు నీ బంటును
గరుడవాహనుడ !"
స్తుతియించి విష్ణుని తలచెను రాజు
అని వేడిన అపుడు ఆదివిష్ణుండు
పక్షిణి వాహనమును బంపెను శ్రీహరి
తన మేనమామల తగిన బాంధవుల
వారిని వైకుంఠ వాసులను జేసె
వినుతింప నందరు ఏగిరి దివికి

## కాటమరాజు తన తండ్రి కళేబరముతో కనకరేపల్లెకు కదలుట

ఘనుడు కాటమరాజు గంగతో
ననియె :
"నాపాల గలిగిన నళినాయతాక్షి !
వినవె ఈ పల్లకీలు ఈ క్షణమందు
అంపవే పట్నానికి అమ్మ భవాని"
మనుజేశు మాటలకు మంచిదని గంగ
"కరకంతు నిలయమౌ కనకరేపల్లెకు
కరుణానిధీ ! నీవు కదలుము వేగ
తానంతట తానే పల్లకీ కదలి
వచ్చేను"
అపుడు కాటమరాజు ఆ రణము వెడలె
దైవసహాయమున తరలె పెద్దన్న
భూమినున్న పెద్దన్నపల్లకి పుడమిపై
నెగసె
త్వరపడి పెద్దన్న ముందర కదిలెను
ధరణి మిన్ను తిరిగె తన సుతుని
వెంట
తన మదిని సంతోషముగ తర్లి
రాగాను
అమరులు చూచిరి అటు చోద్యపడుచు

"ఏమని ఇతనిని ఎంచంగ వచ్చు
నరరూప మైనాడు నారాయణుండు
కరకంఠు డీతండు కాటభూపాలుడు''
వాహినిగ పువ్వుల వానలు కురిసె
దైవకోట్లును గొల్వ దానవులు
చెదరిరి
ధీమంతుడు కనకరేపల్లెకు వచ్చెను
కలపొన్న చింతలు గంగురావులు
తాను
అన్నరావులకాడ వారి అందలాలు
దిగెను
వున్నతముగా తండ్రిని వుర్విపైనుంచె
పగతుల చండాడి విక్రమార్కుండు
తేజముగ నిద్రబోయిన తెరువుగా
యుండె
రాజమన్మథ దేవి రమణి పెద్దమ్మ
తమకమున పెద్దమ్మ తా లేచి
యపుడు
రమ్మని పెద్దమ్మ రమణుల బిలిచె :
"మారాచ ముద్దమ్మ! కాంతలార
వినరమ్మ
పోకుమనగా సుతుడు పోయెనే అప్ప
ఏ వార్త తెలియదాయె ఏనాళ్ళు ఆయె
పొగలుచు నాసుతుడు పోయి
రాడాయె
పక్కనతే నాసుతుడు వంటరిగ బోయె
మక్కువతో రణము మరి చూసి
భ్రమసి
యాకపోవుచు నుండె ఏమి
చేయుదును
వేగమే-తన సుతుని వెంట బోనైతి
నమ్మించి తన సుతుడు పోయి
రాడాయె
కాంతలార తమ తండ్రిని
కానలేడాయె''
అని విచారపడుచు అపుడు పెద్దమ్మ
అప్పలు చెల్లెండ్లతో ఆందోళపడగ
తలపోయుచుండగా కాటమరాజు
వేగమే నగరుకు ఏతెంచెనపుడు
తల్లికి కాటమరాజు చెయ్యెత్తి
మొక్కె
పుడమి సాగిలిపడి మొక్కిన
పుత్రుని జూచి
తడబడి యా తల్లి తనయుని జూచి
గుప్పున తమకము దుమికె పెద్దమ్మ
ధరణి సాగిలి మొక్కిన తనయు
నెత్తుకొని
అయ్యా లెమ్మని తల్లి అక్కున
జేర్చె
చెక్కిలి ముద్దులాడి చిరునవ్వుతోను
ముఖము వాడిన సుతుని ముందర
యుంచుక

పైచెమట తుడిచెను పణతి పెద్దమ్మ
వొళ్లుదుమ్ము తుడిచి వణిత యిట్లనెను:
రణ ద్రిష్టి తీయించె రాజీవనేత్రి
''తరుణులార తన సుతుడు దాహము
గొన్నాడు
దాహంబు తేరమ్మ వో తరుణులార''
తేట పన్నీరును తెప్పించె తల్లి
తన కుమారునికి తల్లి ద్రాహంబు
తీర్చె
చిడిముడి పడుచును చిరునవ్వు నవ్వె
''వస్తివా వో కొడుక ! తెస్తివా
తండ్రిని
ఏడోయి నీతండ్రి ఏర్పడ జెపుమ''
అనిన కాటమరాజు అమ్మతో జెప్పె:
''వాడుగో మా తండ్రి
వయ్యాళిబయట
తెట్టెరావుల బయట దేవుని గుళ్ళవద్ద
విలసిల్లు తరువుల చల్లని నీడ
ఘనమైన పనసలు గంగరావులు తాను
సొంపైన తరువులు దానిమ్మ నీడను
భ్రమగల మామిళ్ళ పనసల నీడను
శుభమున మాతండ్రి సురరాజుబోలి
అతివేగ దండుబోయి అతివ
నీవిభుడు
పొలతిరో మాతండ్రి
న్నిదబోవుచున్నాడు''

తల్లి సంతోషపడె తనయుని
మాటలకు
''అవుదువు నాతండ్రి
అసహాయశూర !
నిబ్బరపు నాపుత్ర నీవె దేవుడవు
తప్పదు నీమాట తగునోయి
కొడుక''
అనుచును పెద్దమ్మ అతి సంతసమున
చూపవోయి మీ తండ్రిని సురలోక
ఘనుని
చనుదెంచె కూటాలకు సఖియలతోడ
శీఘ్రమున-జలక మార్చిరి సఖియ
లందరును
కనకవర్ణపు చీరెలు కాంతలు గట్టిరి
మగువలు తలార్చి మంచిమల్లెలు
ముడిచిరి
చెంపకీలు కొప్పులు చెలియలు తీర్చిరి
కాటుక దిద్దిరి గంధంబు నలదిరి
నవరత్న భూషణములు నడుమ
వడ్డాణములు
అధికముగ ధరించిరి అతివ
పెద్దమ్మకు
పైనమై నిలిచిరి భామల బిలిచిరి
బంగారు చెంబుల పన్నీరు దెచ్చి
తన దాదుల చేతికి చయ్యన నిచ్చె
''నేను నోచిన నోములు నేడు వనగూడె

కల్యాణము రాగానె కలిగిరి సుతులు
ధనధాన్యము లేల తనయులు లేక
తనయులు గలిగితె చాలు తనువులు
స్థిరమా
బాలలు గలిగితె చాలు భాగ్యంబు లేల
మాకు-బ్రహ్మ వ్రాసిన వ్రాలు ఫల
మిట్టులుండె"
కల్యాణపువారు గంగురాజు ముద్దమ్మ
కాటమరాజు సంగడీడు ఘనుడు
రాఘవన్న
వున్నతముగా కదలిరి వుర్వీశుకడకు
ఇందువదన కదిలె తన విభుని సన్నిధికి
అష్టాదశ వర్ణాల అతివలు గొలువ
కడు వేగమున గోపికాంతలు తాను
వేమారు పంచ మహా వాద్యములతోను
బూరలు కొమ్ములు బోరుకొల్వగను
వేడ్కతో పెండ్లికి ఏతెంచినట్లు
అవునని చూచి రాజుకు హస్తములు
మొగిచిరి

మురియుచు తన విభుని ముందర
నిలిచి
అరయంగ పెద్దమ్మ ఆత్మ సంత
సమున
వలమురి దిరిగియు వాలి తా మ్రొక్కె
అడ్డతెర పట్టించె అలివేణి యపుడు
రణ ద్రిష్టి తీయించె రాజీవగంధి
పట్టుచీరెలు దెచ్చి పైదిష్టి తీసె
తెరగొప్ప పచ్చడము తెరయెత్తి చూచె
వరదలై రక్తంబు వడియంగ చూచి
రమణి తన చెంగున రక్తంబు తుడిచి
భామ చెంబులతోడ పన్నీరు దెచ్చి
గాజుగోరులతోను గంధము కస్తూరి
రాజుమోమున నున్న రవధూళి తుడిచి
కసిగండమై యుండ గాయాలనిండ
తన విభుని గాయాలకు తగినట్లుగాను
పూసెను గంధంబు పూర్ణేందువదన
మనుజేశుతోడను మగువ ఇట్లనియె:
భామ ఆ వేళను భాషింప దొడగె:

## పెద్దమ్మ వలపోత

"ఏమయ్య నావిభుడ! ఏమయ్య రాజ!
ఏమి నా ప్రాణవిభుడ! ఇందుశేఖరుడ!
మనకు- బ్రహ్మ వ్రాసిన వ్రాలు ఫల
మిట్లు వుండె

ఎంతపని ఆయెనని ఏల చింతింప
వద్దన్న కల్యాణము వలదని వస్తిమి
కాదన్న కల్యాణము కద్దని వస్తిమి
బాలలు గలిగిరి భాగ్యంబు కలిగె

వొద్దనగ చింతిస్తివి వో ప్రాణనాథః
నా మనవి వినవయ్య నా ప్రాణనాథ:
నాపాలి దేవుడ వని నమ్మితిని నిన్ను
ఈవేళ నాతోను ఏమి పల్కవుగ
అల్లన ప్రొద్దోయె అలగ నీకేల ?
అలిగితే ఎవరైన ఏమందురయ్య
నవ్వుచు వుందువు నరనాథ నీవు
నీనవ్వు ఎందుబోయె నా ప్రాణనాథ
అలిగితివి నామీద నా ప్రాణవిభుడః
కులసతిని నేను నన్ను కోపంబు చేయకు
స్త్రీల నేరంబులు చిత్తాన వుంతురా ?
వలదయ్య పలుకక వాదు నీకేల ?
కష్టపడనేల నిక కడతేరిన పనికి
నిష్టూర మేలను నేటిపని యింతె
నీమాట నిజమాయె నేడు నావిభుడః
నామాట లాలించు మమ్మేలు రాజ
బంధువుల నెడబాపిన ఫలమేమి గలిగె
అన్నదమ్ముల ఎడ బాపిన హత్య నాకు దగిలె
నీ కన్నవారిని బాపితి కలిగె భాగ్యంబు
కల్యాణభూమి మనకు కాబాచి ఆయె
ఇది మనకు వేడ్కాయె నా ప్రాణనాథః
విధి కారణము చేత ఇట్లాయె మనకు
పంతపు కొడుకుతో పల్కవటె రాజః
నీ గర్భాన బుట్టిన కాటమరాజు

నిబ్బరముగా నీ యిరుపుపై వున్నాడు చూడు
ఎవరికి పప్పగింతు ఏమయ్య రాజ ?
అవనిలో నిను జూచి అడిలె పుత్రుండు
ఆ రూపము కొడుకును అది యేమి యనవు
ఏమయ్య పల్కవు ? వూరికే వున్నావు
బ్రతుకుతెరువు కనవు తన బాలల కిపుడు
కులదీపకారుడాః నీ కొడుకు నేమనవు
చెక్కిళ్లు తన రెండు చేతుల బట్టి
తొణికి రాజుశిరస్సు తొడలపై చేర్చుక
అడిలేను ఆ కొడుకు ఎరగవా రాజః
జడిసి వున్నాడు నీ కొడుకు ధైర్యంము దెల్పు
తన సుతునితో బల్కె దయతోను రాజః
అలిగి వున్నావని అఖిల దేవతలు
ఆరడి చేతురు అవనిలోపలను
కన్నతండ్రివి నీవు కోరి పల్కకున్నావు
విన్నవారేమందురు విశ్వంబులోను
తన రెండు హస్తముల తనయుని బట్టి
ఘనమైన మోహమున కౌగిట జేర్చి
పురుషరత్న మోహమున పొలపొల పొక్కుచు
మన్మథరూపుడు మడిసెగా నేడు

మచ్చరించె విధి మనువు లెడబాపె
గ్రుచ్చి కవుగిట జేర్చి కూర్చుండబెట్టి
శివశివ యని పెద్దమ్మ చిరునవ్వుతోడ
వాసిగల మొగధీర! వల్లాంబ సుతుడ!
తనయులు గలిగినపుడే మీతమ్ముల
గలియ బోమైతిమి
తనయులు గలిగిరి తమకేల చింత
యనుకొంటిమి
పుత్రులు కలిగిననాడే భూములకు
మళ్లి పోమైతిమి
పుత్రులు గల్గిరి మనకు భూము
లెడమాయె
ప్రేమతో నవనందుల పెద్దమా దేవులు.
భామకు తన విభుడు పల్కకుండగను.
పెదిమలు వడి వత్తి ప్రేమతో
వుప్పొంగె
మదిథాక్షి పెద్దమ్మ మరియు నిట్లనియె
నాతప్పు గాయవే నాప్రాణనాథ!
వార్త కెక్కిన యట్టి వలురాజుసుతుడ!
కంటిని పాపను తింటిని నిన్ను
దిట్టతనమున మనము దాయాదుల బాసి
కల్యాణ బయిళ్ల కప్పితి నిన్ను
అలిగి పలకవేమొ అవనీశ నీవు
అలుక దీరె పలుకు అయిన కొదవేమి!
కులకోటి బాంధవులు కూర్మి చుట్టాలు
కంచియంత బలగము మీ కన్నవారు

కలమెలిగి ఈవేళ కలిసి వుంటేను
నీ చెల్లెలు కొమరమ్మ చేరి కలియదాయె
కొల్లగా ఈ వేళ కొట్టించి పసువు
కుంకుమ వసంతము గుప్పు నామీద
సిరిగల మా యప్ప సింహాద్రిసీత
వుంటేను
చీరెలు నోమించి పయనంబు జేసును
ఈవేళ మా యప్ప ఏల రాదాయె
వాలాయముగ నా చెల్లెలు యరనూక
సీత
ఈ వేళ వుంటేను ఎంత వేడుక
వుండును!
ఇరవంద నా చెల్లెలు ఏల రాదాయె!
నారీమణి నా చెల్లెలు నలనూకసీత
వుంటేను
అందముగా సొమ్ములన్ని నాకు
అలంకరించేను
విందు భోంచేయ బెట్టి వేడుకతో నాకు
పయనంబు చేసి నా చెల్లెలు పంపించు
నన్ను
పొందుగా నాచెల్లెలు పోలురాజునూక
కడగొట్టు నా చెల్లెలు సిరిదేవి వుంటేను
సంతోషమున గుణ్ణానకు సాగ
నంపించును
కులకోటి బాంధవులు కూర్మి చుట్టాలు
కన్నవారు నాకు కడు దూరమెరి

అప్పలు చెల్లెండ్లు లేక నేను వక్క
దాసనై తిని
కల్యాణపు అప్పలార! కాంతామణు
లార
తలగూడి నాకల తార్కాణ మాయెను
పయనంబు చేసి అప్పలార! పంపరే
నన్ను
కోటి తేజంబుల కోటిలా మేటి
కాటమరాజ! వినవయ్య ఘనుడు
మీ తండ్రి
తోరంపు పెదిమలు తొగరురంగు
పోయి
కళదప్పి దగగొట్టి కంది యున్నాయి
దివ్యతేజంబైన నీ తండ్రి దివ్య
దేహంబు
రవిదప్పి వచ్చెను రాజ వినవయ్య!
చిన్నబోయి వున్నది సిరిగల
మొగము
వున్నతమైన దేహము వుడిగి యున్నాది
పసలేదు ఈ పొద్దు పయనంబు చేసి

వేగమే మీ తండ్రిగూడ అంపుమా
కొడుక!
పుణ్యభూములు వద్దు భూపాలకుండ
మానవేశ్వర వద్దు మాకు రుద్రభూమి
మారాచ రుద్రభూమి మనకైన వద్దు
నందుల చెరువు వెనుక నడిమధ్యమూన
ఇందుశేఖర! కొను ఇది నీకు లెస్స!
కొనుమన్న! భూమిని గోత్రచింతామణి!
కొనవయ్య భూమిని కోటి అర్థమిచ్చి"
గుణ్ణ మాయుతపరిచి గురుతులు చెప్పి
వినుతింప తన సుతుని వెంట బెట్టుకొని
గొనకొని యా భూమి కొని రంతటాను
పసిడి పల్లకిలో పెద్దభూపతిని
వుంచుకొనిరి
శృంగారంబుగాను సురటీలు విసర
గొడుగులు పడిగెలు ఆలవట్టములు
పల్లకీ చుట్టూను బాగుగా నపుడు
పరిపరి విధముల పటుగతితోను
భేరీ డమామీలు పెద్ద బూరలును
దారలు బూరలు తమ్మటంబులును
ఘోరున వాయించంగ భూమి వెరగందె

## పెద్దమ్మ సాగుమానమునకు సంసిద్ధమగుట

ఇంపార పెద్దమ్మ తన విభుడును
తాను

పదపడి తన విభుని పయనంబు
చేసె
సొంపుతో నందులచెరువు కేతెంచె

తెగువతోడుత భూమి తెరుగొప్ప
కొనెను
కనుగొని భూదేవికి కరమెత్తి
మ్రొక్కెను
భాషించె పెద్దమ్మ భూదేవి తల్లితో :
"శివశివ మహాదేవి చెలగి భూలక్ష్మి !
హరహర శరణార్థి ! అమ్మ
భూదేవి !
గిరులును తరులును సప్తసాగరములు
నిధులును నదులును గోగణంబులును
ఎనసి ఎనుబదినాల్గు లక్షల జీవులును
పొందుగా నీవిచ్చి పోషించినావు
ఆరీతి పోషించు అమ్మ భూదేవి
తల్లి నా గర్భంబు జగతి కర్పిస్తి"
ఆరూఢి భూదేవిని అమ్మ ప్రార్థించె
పొందుగా తాంబూళము భూమిపై
నుంచె

## గుండము నిర్మాణము

అటువెనుక వుప్పర్ల నందరి బిలిచి
మగువ తా వేంచేసె తన
మందిరముకు
బాగుమీరగ కాటభూపాల చంద్రుడు
నాగలోక గుణ్ణాలు నదులు
త్రవ్వించి
నందుల నిలిపెను నాల్గు మూలలను
శోభనాలు గుణ్ణాలు సొవ లేరుపరచి
గండభేరుండ మొగసాల గ్రక్కున
ఇప్పించె
ఘనమైన బారుపట్టెలు తెసిరి
ఖండెమ్మొండెములుగా ఖండించి రంత
పొందుగా గుణ్ణాన పరిపించె రాజు
గుగ్గిలపు తరువులు కురుచందనాలు
తగినట్టి గుణ్ణాన దాపించి రంత
సంపంగి నూనెల చమురు బిందెలును
చంపుడు కట్టమీద చాలగా దించిరి
వణిత గుణ్ణముతిరుగార వట్టివేళ్ళ
తడికెల
ఎన్నంగ పన్నించె యదువంశజుండు
ఎలమి బ్రాహ్మణులును ఎలమి
పురోహితులు
అగ్నిహోత్రము తెచ్చి అటు వుంచి
రంత
గుణ్ణాన పనులన్ని గొబ్బుగా
తీర్చిరి
శ్రీమంబె శృంగార్పతోట కేతెంచిరి

గోదానములు బ్రాహ్మలకు గొబ్బున యిచ్చిరి
కరుణతో తన విభుని మ్రాకుల నడుమను
పరగంగ వల్లవుల పెద్దభూపతిని
స్థిరముగా గుణ్ణాన సంధించి రావేళ
పేరుగల మ్రాకులు పేర్చి రామీద
నిజరూపమున నిల్చి నీలవర్ణుండు
దాహాగ్ని తగిలించె తంత్రి తలగడను
పెళపెళ గుణ్ణములో పేలె కనుగులును
తళతళ మంటలు ధరగప్పె నపుడు
కనుగులలో పెద్దన్న కలగాలి సమిసె
కనులు బాష్పంబులు కనుగొని వ్రాల
తనయుడు ఆవులన్న తల్లికడకు వచ్చెను
అతివశిరోమణి అతివ పెద్దమ్మ
అమ్మరో గుణ్ణమ్మ ఆయత్తపడెను
అంతట పెద్దమ్మ అరుషంబు నొంది
"సంతోష మాయెను చక్కని తనయ"
అనుచు దాదుల బిలిచి అతివ తా బలికె
పయనము చేసి అప్పలార పంపరే నన్ను.

నలినాక్షులు సంపంగినూనె తా దెచ్చిరి
కాంతకు శిరసంటి కడు జలక మార్చిరి
దేహంబు తడిపత్తి తిలకంబు తీర్చిరి
పసగల కస్తూరి పైనింత జల్లిరి
పొసగ జాజులదండ పొందుగా గట్టిరి
నిలువుటద్దము దెచ్చి నెలతకు పట్టిరి
సలలితంబైనట్టి రత్న హారములు
పేరుగల ముత్యాల పేరులు వేసిరి
నారీమణికి సొమ్ములు అలంకరించిరి
కాంతకు కన్నుల కాటుక దిద్దిరి
పట్టుచీరెలు కట్టి పయనమై వచ్చిరి
చుట్టాల సురభియై సుందరి వచ్చెను
శ్రీ మహాలక్ష్మి అనే తేజీని ఎక్కెను
పచ్చబద్దలవారు పరగ వెయ్యిన్నూరు
దొరలును మంత్రులు తొలుగు తొలుగు అనుచు
పంచమా వాయిద్యములు మించి మ్రోవంగ
కల్యాణము దేవగిరి కనకరేపల్లె
ముయ్యేడు వీథులు మెరవణి తిరిగి
కడువేగ వచ్చెను కాంత పెద్దమ్మ
పూచిన సంపెంగ వృక్షముల క్రింద
రఘువీర తమకము రమణి పనించె

ఆ వీర తమకమున అమ్మ కొలువాయె
తమకముపై ఎక్కెను తరుణి
పెద్దమ్మ
తన బంధువులచేత తరళాక్షి యపుడు
తరళాక్షి కుంకుమ తగ పంచిపెట్టె
కరుణతో వాయిద్యములవారిని పిలిచి
మేటి విద్యలవారు మెరువణితోను
కోటాను కోటులు కొలువు చేయంగ
వారడిగిన వస్తువులు వాహనము లిచ్చె
దివ్యరత్న తమకము దిగెను పెద్దమ్మ
పుణ్యపు నీరాడి పూచిన బూరుగక్రింద
ఇంపుగా పాపను ఎదయందు జేర్చి
వుదిరిపడీ పాపన్న వుగో యని ఏడ్చె
అదిరిపడి ఏడ్చేటి అబ్బరపు పట్టిని
వూపుచు పెద్దమ్మ వూరకుండు మనెను

## పెద్దమ్మ బిడ్డలను చూచుకొని దుఃఖించుట

"భూనాథు పుత్రికా! పాప నూకమ్మ!
కుచములు కావలెనా చక్కని తల్లి!"
చనుమొనలు కుడుపుచు "చక్కనితల్లి
పట్టి కుడువు పాలు పాపన్న నీవు
చయ్యన బుజ్జగించంగ కుచముల పాలు
ఆకలి కాదటే పాపన్న! అలసటచేత
చేదెరుగని కూతురా! చేదటే పాలు
పిరికి బారకే కూతురా! పిక్కటిల్లెను
పాలు
తనివిదీర కుడువు తల్లిరో నీవు
కన్నులు పొంగగా ఏడ్చేవు నీవు
కడసారి మాటే కూతురా! కన్నతల్లిని
నీకు
ఎడమాయెను కూతురా ఏల ఏడ్చెదవు
అలిగిత్తివటే కూతురా నామీద నీవు
నాతల్లి ఏడ్వకే నా ముద్దుపట్టి
పాపపు బ్రహ్మ వ్రాసె పల్వరించ
కమ్మ
పక్షిణి కంకణాలు నీకు బాలపాపన్న
ఏనాళ్ల పాపన్న ఏం పొగిలేవు
రవిరేక కురులు రమణిరో నీకు
సారెకు తలయంటి జలక మార్చగను
పోరాడి పోషింప ఏ పొలతులున్నారు?
అమ్మ నీ ఆకలి అది నీవు ఎరుగవు
రమ్మని చన్నియ్య ఏ రమణు
లున్నారు?
చక్కని నా తల్లి సఖియ పాపన్న
ఎర్రంగ కందేను నీ వళ్లు ఏడ్వకో
యమ్మ

కటకటా ఏడ్వంగ పూరడించ ఏ
కాంత లున్నారు?
తల్లిలేని బిడ్డవని కష్టపడకుండ
ఆదరించి ఎత్తుకొనే ఏ అతివ లున్నారు?
మారాముననోరుపెట్టి మల్లటించగను
మచ్చిక చేసి ఎత్తుకొనే ఏ మగువ
లున్నారు?
తండ్రిలేని బిడ్డవని దగ్గరకు తీసి
దయతోను పోషించ ఏ తరుణు
లున్నారు?
నీ చిన్నిముఖమును నా చిన్ని కూతురా
వాడకుండ పోషించ ఏ వనితలున్నారు?
ఎవ్వరకు వప్పగింతును? ఏమందు
విధిని?
ఎవరు నిన్ను చేరదీసి ఎవరు పెంచేరు?
తగనొప్పు నా గర్భాన పుట్టినందులకు
తల్లి కరువాయెనే చక్కని కూతురా!
మిక్కిలి భోగంబున పుట్టి మిగుల
తేజంబు గలిగి
తరుణి నీకింతలోనే తండ్రి కరువాయె!
తల్లిలేని బిడ్డలై దైవమా యనుచు
అలర ముత్యములవంటి అమ్మ నీ
కన్నులు
కన్ను లంటకుండ కాటుక మీకు
సన్నముగ దిద్దేటి సఖియ లున్నార?
శిశువింత చేసెను చింతింప వలదు
తలవాల్చి చన్నిచ్చితా గారవించె
కట్టడి దైవంబు మీ గారవము చెరచి
పుట్టిపుట్టక తల్లి మీకు కరువాయె"
భ్రమరవది కూతురుకు చన్నియగాను
ఏడేండ్ల బాలరాజు ఆలించి వినెను
కటకటా యని రాజు కన్నీరు బెట్టె
బ్రాచుపాము కూనవలె రాజు తల్లడ
పడెను
అడిలేటి సుతుని తన అక్కున జేర్చెను
ఏడ్చేటి సుతుని ఎత్తుకొనె తల్లి
చెక్కిలి ముద్దులాడె చక్కని తనయుని
తొడలపై నుంచుకొని సుదతి యిట్లని
నియె:
"వినవోయి కాటమరాజు! నలనన్న!
ఆడవారికి చెల్లు ఆందోళపడను
మొగరాజువు నీవు ముఖము వాడ్చనేల?
కంచంత బలగము కన్నవారుండగా
కొండంత బలగము అన్నదమ్ము
లుండగా
ఏల కోటలున్నవి ఎక్క అశ్వా
లున్నవి
ఏడేడు కోటలు ఏలి బ్రతికేవు
పట్నపురాజు కొమారుడవు భావ్యంబు
గాదు"
ఆ మాట విని రాజు ఆవుర్న అడిలెను
"అమ్మరో వినవమ్మ అతివ పెద్దమ్మ!

ఏనాళ్ళ పాపను వడి బాలగిన్నె
గాలించుకో వో వమ్మ కన్నతల్లి నీవు
ఏడేండ్ల బాలరాజును వెంటబెట్టు
కోవమ్మ
వర్షపు దేగవలె గుణ్ణాన వరగవే మా
కన్నతల్లి!
తల్లీ! మూడు ప్రాణాలు తగులబడి
కాలగా
కల్యాణము వారు కన్నుల చూడగా
గుప్పున గుణ్ణాన వేయవే తల్లీ!
అమ్మా నీగుణ్ణాన మేమడిగితే మంచిది
తండ్రి లేకుంటేను తల్లి వుండవలెను
తల్లి లేకుంటేను తండ్రి వుండవలెను
తల్లితండ్రులు లేని తనయు లిద్దరము
ఎట్లు బ్రతికేము మేము ఎవరు లేకుండ
ఏడేండ్ల బాలరాజును ఎట్లా గన్నా
బ్రతికేను గాని
ఏనాళ్ళ పాపను ఎవరు సాదేరు?
అర్ధరాత్రికాడ నా చెల్లెలు కోరి లేచి
అమ్మా యని పిలిచిన ఏమనిపల్కుదును?

నిద్రపోయి లేచి పాలు అడిగితేను
తరుణిరో ఏ యింటి దాదిని పిల్తును
ఎవరిని పిల్తునే ఓ మంచితల్లి?"
ఆ మాట విని తల్లి అప్పున నవ్వె
"రావోయి కొమార రాజ నలనన్న
ఆకొని చెల్లెలు అమ్మా యని పిలిచిన
అరమర లేక పలుకు అబ్బరపు
కొడుక
అయ్యా అని పిల్చినా పల్కు నా
తండ్రీ!
అమ్మా పాలు అని అడిగినగాని
చన్నియ్య మారాచ సఖియ లున్నారు
అమ్మవైనా నీవే అయ్యవైనా నీవే
అన్నవైనా నీవే అబ్బరపు కొడుక?
అబ్బరముగా పెంచు అబ్బరపు
చెల్లెలను"
తల్లి మాటలు విని తాను దుఃఖించె
ఉయ్యాల తొట్టెలో వుంచెను పాపను
మారాచ మగువల పిలిచె మస్నినిదేవి

## పెద్దమ్మ తన బిడ్డలను పెందోట ముద్దమ్మ కప్పగించుట

మారాచ అప్పలార! మా యమ్మలార!
పెందోట ముద్దమ్మ! పెద్ద గంధావతి!
చుక్కల సురదేవి! అక్క
వల్లభురాల!

పిచ్చుకుళ్ల మాదేవి! పిసికిళ్ళ
లక్షువమ్మ!
కూర్మి లక్షువమ్మ! కొమ్మలార
వినుడి!

నాసంపద లిచ్చెను ముద్దప్ప ! సకల
భాగ్యము లిచ్చెను
అర్ధప్రాణము ఇచ్చెను అందుకోరమ్మ!
పట్టుపోగులు ఇచ్చెను పుచ్చుకోరమ్మ !
పెట్టెలు బంగారు పట్టుచీరెలును
పట్నపురాజు కొడుకును ఇచ్చెను
పుచ్చుకోరమ్మ !
రాచబాలల నిచ్చెను రక్షించుకోర
కుల ముద్ధరించను కొడుకు నిచ్చెను
గోత్రాలు పాడను కొమార్తె నిచ్చెను
ఎవరులేని బాలలని ఎగ్గుసేయకుడీ
పోతపాలు పోస్తా పోరేరు మీరు
దూదిపాలు పోస్తా దూరేరు మీరు
ఈ బాలలు దొడ్డవారే వో పంతులార!
శుక్రాచార్యునికి మునిమనుములు వీరు
సూర్యవంశము గల యాదవ రాజులు
చుక్కబొట్టు పెట్టరు సూర్యునకు
మ్రొక్కరు
యయాతిసంతతి యాదవ రాజులు
వీరి అయ్యలు ఏలిందే అమరావతి
పట్నం
తాతలు ఏలిందే ద్వారావతి పట్నం
పెద్దలు ఏలిందే పెదగవిలి పట్నం
పిన్నలు ఏలిందే పినగవిలి పట్నం
ఏడు వల్లకాపురాలు మా మామ
నలరాజు ఏలెను

ఏడు తరముల కాపాడి ఎలమంచి
పట్నము
పన్నెండు తరముల కాపాడి
పంపాద్రి పట్నము
నలరాజు కొమారులు వారు
ఏగురన్నదమ్ములు
అందరికన్నా పెద్దవాడు మా బావ
సింహాద్రిరాజు
అతని దయతమ్ముడు నా
ప్రాణేశ్వరుడమ్మ
వారికన్నా చక్కనివారు
ముగ్గురూను
యరనూకరాజు నలనూకరాజు
బొద్దుల కదియాల పోలు
రాజేంద్రుడు
నా చిన్నమరుదులు వారన్నదమ్ములు
ఆయిదుగురు తోడబుట్టింది అక్క
కొమరక్క
కొమరక్క ఆడిన మాటలు మాకు
కొంగుముళ్ళాయె
తన చెల్లెలు సిరిదేవి యాడిన
మాటలు
మాకు తార్కాణ మాయెనే వో
తరుణులార !
అధిక దుఃఖాన మా బావ
సింహాద్రిరాజు

తమ్ముణ్ణి కౌగిలించి మహా
తల్లడించెను
నా చిన్న మరుదులు నవ
నీలవర్ణులు
అన్నపాదములు పట్టుక అలమరిగి
రమ్మ
తన తోడుకోడండ్లు మహా
తల్లడిల్లిరమ్మ
పంపాద్రి పట్నమంతా కాకిశోక
మాయె
సంతానముకొరకు జన్మభూములు
విడిచి
నేను ఎవరిమాట వినక వస్తినే
వో యప్పలార
కల్యాణము వచ్చినదాకా కూడ
బ్రతికితిమి
కంటిని పాపలను కడుపార నేను
పుట్టెను పాప, భూపతిని కోలుపోతిని
కొంచకోల్పోతి తన కొమ్ము
చేనుగను
అన్నదమ్ములు గల రాజును తెచ్చి
హత్య కట్టుకొంటిని
బావమరుదులు గల రాజును తెచ్చి
పాపము కట్టుకొంటిని
దామసాని వారింట దైత్యనై
పుట్టితిని
ఆవులవారి ఋంట యమురాల
నైతిని

దామసాని పోతన్న తన
తోడపుట్టినవాడు
దూరమాయె పంపాద్రి దుఃఖమాయె
కల్యాణము
ఎవరిని దూరుదును ఏమందు
విధిని
బాలల పెంచరే వో భామలార !''
ఎనభై వేలమంది యాదవ స్త్రీలు
తన ఇరుప్రక్కల తమకము లెక్కిరి
ముద్దు కాటమరాజును రెట్ట పట్టుకొని
దాదుల చేతి పాపను తా నెత్తుకొని
ఏనాళ్ళ పాపను ఎదమున జేర్చుక
'నారీమణి నిచ్చేను నలినాక్షులార
బాలకు కర్తలెవరు పాప నిచ్చేను
వల్లవుల కొడుకు వలరాజుమనమని
కాటమరాజు నిచ్చేను వో కాంతలార :
పాయక నే కన్నపాప నూకమ్మను
రాచబాల నిచ్చేను రక్షించుకోరె
పట్టభద్రుడి కొడుకు బాలరాజు
నిచ్చేను
పుట్టుభోగుల నిచ్చేను పుచ్చుకోరమ్మ
చందమామవంటి చక్కని కొడుకును
ఇందుముఖులార ! ఈడేర్చుకోరె !
కడముద్దు నాబాల కాటమరాజు
నడుపుకోరే తల్లి నామారుగాను
కాంతసోమేశ్వరుడు కాటమరాజు
వరపుత్రకుండు నా వల్లవులకొడుకు
సూర్యుని ఇచ్చేను ఓ సుదతులార !

కోటి అర్థము గోకులము ఇచ్చేను
పట్నపురాజు కొమారైను పాప
నిచ్చేదను
పెట్టెల బంగారు పట్టువస్త్రములు
అష్టైశ్వర్య సంపన్నుడైన బాలుని
కని పెంచరే రవితేజ రాజు నిచ్చేదను
భూతేశు నిచ్చేను పుచ్చుకోరమ్మ!
ధర్మ భూషణుడైన రాజేంద్ర
సుతుని
కొమ్మలార ఇచ్చేను కులదీప ఘనుని''
తమకముపైనుండి తల్లి యిట్లనగాను
అమరంగ వినిరి యాదవులంతా
వెన్నముద్దవారు వెన్నునివారు
పున్నపు వెన్నెలవారు పుల్లావులవారు
చెన్న కృష్ణునివారు చెన్నునివారు
పొన్న పువ్వులవారు బోయినవారు
జన్ని ఆవులవారు జగ్గమువారు
పన్నగేంద్రునివారు పయ్యావులవారు
పొన్న బోయినవారు పూజారివారు
కన్ని బోయినవారు కపిలావులవారు
దామసానివారు ఈశ్వరవారు
రామభద్రునివారు రాచావులవారు
గంగి ఆవులవారు గాలమువారు
కొమణాలవారును గోవిందుని వారు
సంగమేశ్వరునివారు సరభావులవారు
గోవిందునివారు గొడ్డటివారు

రవితేజునివారు రామబోయినవారు
దండిబోయినవారు గుండిబోయినవారు
గురుమూర్తివారు కొర్లెపాకవారు
మచ్చనావులవారు అచ్యుతునివారు
పంబయిండ్లవారు భాగీర్తివారు
ఇంద్రునివారు కుబేంద్రునివారు
పంచయిండ్లవారు పశుపతివారు
లక్ష కంపటము వచ్చి ఆ రమణికి
మ్రొక్కిరి
''ఎలమంచి పెద్దమ్మ ఏల ఆడితివి?
కులమువారము గలిగి గోత్రము గలిగి
చాలినంత అర్థము సంపదలు గలిగి
ఆదరించను నీకు అన్నలు గలిగి
దాదులు గలిగి దాయాదులు గలిగి
నీపాల వారు నిండేగురము గలిగి
ఆవుల మందలు గలిగి మేమంచరము
గలిగి
సీమ భూములు గలిగి సేనలు గలిగి
అమ్మ మారాచవారికి బాలల
పప్పగించేవ!
వకరాజు కుంభిళ్ళమీద వరిగితే నేమి
కాటమరాజు పాపమ్మ అధిపతులు
మాకు
రాజును పెంచేము రమణిరో మేము
భుజబలభీముని భూము లేలింతుము

తండ్రిబలగమున కలుపుదుము తరుణిరో మేము''
కొండంత బలగములో గోపాల్కు-లనిరి
అందరి మాటలను ఆలించి వినెను
నందుల పెద్దమ్మ నాతి యిట్లనియె :
''దేవగిరి కల్యాణము తెస్తి నందరిని
గాంభీర్యశాలి కల్లిలో వారిగెను
అందరిని కోరుబెట్టి అవనీశ్వరుండు
అమ్మలార ! బాలల ఎవ్వరు ఆదరించేరు ?
గొబ్బున అడిలిరి గోపకాంతలంత
బాలలు మీరు గోపాలకులార
కల్యాణపువారు గంగురాజు ముద్దమ్మ
అనువేగమున ఈడేర్చి పెంచేరు మిమ్ము
చేడెలార ! నామాట ఈ క్షణమున వినరె''
ఎంతలేదనక యాదవ స్త్రీలకు
సంతోషముగ తల్లి మనవిగా చెప్పెను
అంతట కల్యాణపువారు అధిగొని వచ్చిరి
తమకము తిరుగువారు తమరంత వచ్చిరి
పెందోట ముద్దమ్మ పేర్కొ-ని పిలిచెను
''ఎలమంచి పెద్దమ్మా ! బాలల ఆదరించేము
భూదేవి సాక్షిగా పుత్రులను పెంచేము
భక్తితో కాటమరాజుని ఎత్తుకొని యెదము
అమ్మా ! బాలల నిమ్మని హస్తాలు వొగ్గిలి
ఏమి అనుమానము ఎలమంచి పెద్దమ్మ !
నీ గర్భము వకటి కాదు మా గర్భము వకటి కాదు
ముద్దమ్మ కొమారుడు రాఘవన్న కల్ల
పెద్దమ్మా నా కొమారుడు కాటమరాజు నిజము
బాలపెంచి కల్ల పాపన్న నిజము
ఏకచక్రముగా భూమి ఏలింతుమమ్మ !''
ఆ మాట విని పెద్దమ్మ అపుడిట్ల గనెను

## బిడ్డలను భక్తిరన్న కప్పగించుమని పెద్దమ్మ చెప్పుట

''తండ్రివైపువారు జంగమై వత్తురు
తల్లివైపువారు దాసరై వత్తురు
తాను కల్యాణము కదలి వచ్చేటినాడు
తన మరిది కొమారుడు తగు భక్తి రన్న
చిన్నవాడై వుండెనే వో చేడెలార !

భూములు చెల్లించు పుణ్యమూర్తి
అతడు
రాజ్యము నేలించు దేవజంగ మతడు
తాను వచ్చి, వేడి, గుర్తెరిగి వకవేళ
కాడ
వచ్చి బాలల యిమ్మని పట్టి అడిగితేను
వారి బాలల వారికి యివ్వరే వో
యక్కలార:"
ఆ మాటకు ముద్దమ్మ ఆడె నొక
మాట
"ఏమి మాటాడితివి ఎలమంచి
పెద్దమ్మ!
ఈ కళ్యాణపు పట్టణము లింగపీడమ్మ
ఎఱ్రబొంత జంగాలు దెయ్యిలక్ష
వెయ్యివేలు
యోగులు భోగులు యతీశ్వరులును
మఠపు సన్యాసులు మహాత్మ
లున్నారు
అరికాళ్లకు నరాలు గల అయ్య
లున్నారు
అందులో వక జంగము మాయవేషము
దాల్చి
బాలల యిమ్మని పట్టి అడిగితేను
ఏలాగు యిత్తును ఎట్లు చెప్పితివి"
ఆ మాట వింటూనే పెద్దమాదేవులు
"అటువలె గాదమ్మ వో యప్పలార!
అతడు నా మరిదికొమారు డయితేను
భక్తు డయితేను పలికించును సాక్షులు
ఏమని సాక్షులు పలికించేను ఎలమంచి
పెద్దమ్మ
ఆరిపోయిన గుణ్ణము అగ్గి రవళుచు
మద్దులు మారేళ్ల మరి సాక్షులు
పలికించు
పొగలోను నిలిచి నేను పోలిక
చూపేను
కలుపొన్న పూసి కలుకోడి కూసేను
కలునంది డాకాలు దువ్వి ఖణేల్న
రంకె వేసేను
వారి బాలల వారికి యివ్వరే వో
యప్పలార!
అనుచు ముద్దమ్మకు చెప్పి వప్పగించె
తనచేతి బాలల, తమకంబు మీదను

## పెద్దమ్మ గుండమున దుముకుట

కుంకుమ వసంతము కొల్లలుగాను
కుడిచెయ్యిలోనుగా గుణ్ణమ్ము చుట్టు
వలంపూరి తిరిగి వచ్చెను వేగ
చంపుడు కట్టనెక్కి సభవార్ని చూచె
చేరి చూచి ప్రజలకు చెయ్యెత్తి మొక్కె
అందముగా నిమ్మపండ్లు అగ్నికర్పించె

గుప్పున గుణ్ణాన దుమికె పెద్దమ్మ
వర్ణపు దేగవలె వాలె గుణ్ణాన
కణ కణ మండేటి కనుగులలోను
నిగ నిగ పెద్దమ్మ నిలువంగ చూచి
కన్నీరు తెచ్చెను కాటమరాజు
అమ్మా! అమ్మా! అని అడలంగసాగె
వోయమ్మా! అని రాజువల పొంచ్యసాగె
పెద్దమ్మా! యని తల్లిని పేరుసపిలిచె
ముమ్మారు పలికెను ముద్దుల
కొడుకుతో
చమురు కుండలు వేయించె తల్లి
గుణ్ణాన
పడవేసినప్పుడే భగ్గున మండెను
తల్లి దండ్రులు చెల్లిరి తమదిక్కు
పోయె
కట కటా యని అడిలె కాటమరాజు
కుల కోటి బాంధవులు కూడిరి చుట్టాలు
తామరాకుల మీద నీళ్లవలె తల్ల
డించగను
కాటమరాజు అడలంగ గంగురాజు
చూచెను
వద్దు అని కాటమరాజును ఎత్తు
కొనెనపుడు
చెక్కిళ్లు నొక్కి చేరి ముద్దులాడెను
బుద్ధులు చెప్పి బుజ్జగించె రాజును
ముద్దమ్మ తా వచ్చి ముద్దాడె నపుడు

చక్కని కొడుకును చయ్యన ఎత్తు
కొనెను
మరి వేగ వచ్చెను మందిరమునకు
మరునాడు కాటభూమండలేశ్వరుడు
గంగమైలావుల పాలకడవలు తెప్పించె
తల్లిగుండముమీద పోయించి అగ్గి
చల్లార్చె
గుణ్ణములో వున్న గురుకోళ్లు చల్లార్చి
గోవులదానము భూసురాదుల కిచ్చెను
షోడశ దానములు సొరిది నిప్పించె
జంగానికి అన్నం లింగానికి వస్త్రం
యిప్పించె
కులకోటి బాంధవులు కూడి భోంచేసిరి
ప్రియముతో ముద్దమ్మను పెంచు
కొమ్మనుచు
అప్పుడు బాలలను అప్పగించిరి వారు
నాలుగువేల వల్లవులు ఏడువేల
తిరుమందులు
పన్నెండువేల మాథాన బాంధవు లెల్ల
వప్పగించిరి మాచావారి ముద్దమ్మకు
తమకముపైనుండి తరుణి తా లేచె
బంగారు జలపూత పల్లకీ ఎక్కె
పంచమా వాయిద్యములు బలువడి
మ్రోయంగ
నందుల చెరువుకు నాతియు కదిలె
పుణ్యపు నీరాడి పూబంతు లంది

పట్టుచీర విడిచి పసుపుచీర కట్టె
నాతికి సొంపైన నవరత్న
భూషణములు
పేరుగల ముత్యాల పేరులు వేసె
నవరత్న భూషణములు నడుమున
వడ్డాణము
అందముగా మేనున అలంకరించెను
కాంతకు కనులకు కాటుక తీర్చిరి
నిలువుటద్దము తెచ్చి నెలతకు పట్టిరి
నిలువుటద్దములోను
నెలతచక్కదనము
కరుకుమేఘమున పుట్టిన మెరుపువలె
నుండెను
ఆశ్చర్యపడి చూచె అద్దములో నపుడు
పసుపుచీరె గట్టి పయనమై వచ్చె
ఇసుకయిల్లు కట్టి పసుపుగౌరిని నిల్పి
చేటలు గౌరికి చెల్లుగా నోమెను
ఎఱ్ఱబద్ద చేటలు వెయ్యివేలు నోమెను
పచ్చబద్ద చేటలు పదివేలు నోమెను
నల్లబద్ద చేటలు నన్నూరు నోమెను
దామసాని పోతన్న యిచ్చిన
ఏడువాడల సొమ్ములు
బ్రాహ్మణస్త్రీలకు పంచిపెట్టె తల్లి
వరహాలు మాడలు వస్త్రాలు దెచ్చి
బ్రాహ్మణులకు భట్లకు పరగ
వైష్ణవులకు
భూదానములు ఇచ్చెను భూనాథు దేవి
పసుపు కుంకుములును పంచి
పెట్టించి
కుంకుమ వసంతము కొల్లలాడించె
వేగమే విడుదులకు వేంచేసి రపుడు
అతి గారవంబున అన్నచెల్లెండ్లు
పెందోటి ముద్దమ్మ నగరును
పెరుగుచునుండిరి,

## ఫలశ్రుతి

ఎలమితో ఈ కథ విన్నవారలకు
వ్రాసి చదివిన యట్టి వారలకెల్ల
భాగీరథి యిచ్చును భాగ్య భోగ్యములు
ఈశ్వరుడు ఇచ్చును ఇహపరములాను
కొడుకులు కోడండ్లు కొమరొప్ప గలిగి
ధనము ధాన్యములును తగనొప్పగలుగు
వొప్పులు తప్పులు వొనరంగ దిద్దరే
బుద్ధిమంతులైన వో పెద్దలార !

—:o:—

# పోలురాజు కథ

## ఇష్టదేవతా ప్రార్థన

శ్రీలంబ ఉదర శ్రీశితికంఠు తనయ
ఫాలంబు జేర్తు మీ పాదంబులాన
శ్రీ భవానీసుతు చిత్తాన తలచి
దేశాదినుతు మహాదేవ సుతుండు
నాగజందెమువాని నాగభూషణుని
నాగబంధము బొజ్జ నమరినవాని
శశిధరపుత్రుని శశివర్ణు దలచి
ప్రసన్నునికి మ్రొక్కి ప్రస్తుతి జేసి
వాసిగ మూషిక వాహను మదిని
జేసికన్నులవాని పెద్దసుతు దలచి,
మదన సంహారు సుతు మదగజవదను
మదిని నెమ్మది దలతు
మారుటమూర్తి
భక్తపయోనిధి భక్తి సేవింతు
వ్యక్తంబు యుక్తంబు అడిగెద వేడి
కర్ణామృతమైన కర్ణచామరున
నిర్ణయించియు వేడ నే నెంతవాడ
ఏకదంతుని మదిని వినయంగా వేడి
నాకు ఇమ్మయి వుండ నాకివ్వ వాక్కు

మూపు జంధ్యమువాని ప్రాపు దా
మనుచు
కాపాడు విద్యల గణపతి దలచి
చతురు వేదంబులు చతురుముఖముల
చతురత బలికిన చెలువుని సతివి
రమ్మ శారద ! వరమిమ్ము
మాకిపుడు !
బ్రహ్మపుక్కిట కొమ్మ ! పణతి
మాయమ్మ !
వినయమున శాంభవి ! విద్యావిశాంబ !
వౌనరంగ శశిబింబ ! వో శారదాంబ !
నాకు గలిగిన కృతి నరుద ఈ
స్తుతియు
సఖియరో ! యీ కీర్తి ! సమకూర్చు
ఖ్యాతి !
అసురుల నణచిన హరు జటలింగ
వెస పాప మణచంగ వేడితి గంగ
వేద విద్వాంసులు ఆదిమ కవులు
పాద పద్మములకు భక్తితో మ్రొక్కి

## కవి పేరు, నివాసము

వింతగా చౌషష్టి విద్యల నెలవు
పంతమౌ యా కాంతపల్లె లోపలను
కొనసాగు కన్యసిరుల గోత్ర
పావనుడు
గొనకొని కనకబండి కొండప్ప
సుతుడు
నెట్టింప ఘట్టయ్య నేర్చిన కొలది

తేటతెల్లముగను తెలిపి చెప్పెదను
పాలింప ధర్మజుడు భక్తి రాఘవుడు
కళలందు మన్మథుడు కలిమి
కుబేరుడు
గోపాల కృష్ణుండు గోగణంబులకు
ఆ పోలురాజు కథ ఆలించి వినుడ :

## పోలురాజు పంపాద్రినుండి శ్రీరంగమునకు బయలుదేరుట

ఎలమంచి పంపాద్రి ఏలిన ఘనుడు
వలురాజు వల్లమ్మ వరకుమారుండు
అగ్రజన్ములమీద అతిభక్తి కలిగి
ఉగ్రంబు రిపులపై నుంచిన రాజు
జడముడి గలిగిన జంగాలమీద
వొడియలపై దయ వుంచిన రాజు
క్షోటి కవిలావుల గూడిన రాజు
పాటించి శివపూజ పరుడగు రాజు
అత్తిలవలె నుండు అన్నల రాజు
మత్తేభముల వంటి మరుదుల రాజు
వహిమీర పాళ్లను వనర పంచుకొని
రహి పంచఖండముల్ రాజు లేర్పడిరి

దక్షిణ శ్రీరంగము తర్లె పో్రలాజు
అక్షీణ పశువులు యాదవ ఘనులు
కాపురా లర్థపీటి కడ గట్టు నిలిపి
అర్థ పీట దొనకొండ అందరి నుంచి
రాజవై అయితమరాజ నీ వేలు'
ప్రధానునిగా ధర్మపాలన గలుగ
వుత్తమరాజును పోలురాజుంచి
గోపకాంతల రాచకూతుళ్ళ నపుడు
అర్థపీట దొనకొండ నమరంగ నుంచి
ఆరువేల వల్లవులు యాదవ వరులు
ఆరువేల తిరుమందులు అసహాయశూరులు
ఎన్నగల కంపటము వెంట బెట్టుకొని

భూమి ప్రదక్షిణము పోలురాజపుడు
అనువంద పశువులు అతిశూరులు వేగ
పల్లికొండ శ్రీరంగపట్నాని కొచ్చి
సకల సంపదలును సన్నాహములతో
ఒక్కరొక్కరు దిగి రుభయ సార్మ్వ
ములు
దండైన గుడహార్లు తరచుగా నెత్తె
వల్లవుల గుడార్లు వాడ లేర్చరచి
సరివారి గుడహార్ల సరస నెత్తించె
కావి గుడా ర్లిందుకాంతి గుడార్లు
దేవత గుడహార్లు తిరుమందు లెత్తె
భూచక్ర గుడహార్లు పొలుపు మీరగను
రాచగురువు పల్లికొండ రఘుపతి కెత్తె
నెన్నముద్దల పట్టు వెల్ల గుడార్లు
మన్నీడు రుద్రాక్షమల్లు ఏత్తించె
గొడసరాదు గుడార్లు గోపుర గుడార్లు
వేడ్కతో భద్రాక్ష వెంగళ త్తించె
చిల్కా వన్నె గుడార్లు చిత్ర గుడార్లు
పొలుపొంద కల్లందుల పోల్నేడు ఎత్తె
భద్రాక్ష గుడహార్లు పట్టు గుడార్లు
ముందర ఇంద్రుని మూర్తి ఎత్తించె
నామగిరి గుడార్లు నందిగుడార్లు
కోమటి కొమనాల కోనేరు ఎత్తె
పగడపు ఛాయల పట్లు గుడార్లు
బాగుగా నెత్తె భూమాడి కోనేరు
రుద్రాక్ష గుడహార్లు రూఢి ఏర్పరచి
అందముగ ఆవుల అచ్యుతు డెత్తె
శివపూజ గుడహార్లు శంఖు గుడార్లు
రాజితముగ నెత్తె రాజ గుడార్లు
ఎడలేని గుడహార్లు యాదవు లెత్తె
అసురముఖ గుడార్లు అక్షయముగను
పొసగంగ జడధార భూపతెత్తించె
సురిదిగా ఈశ్వరు శూరులు గొలువ
స్థిరముగా ఎత్తిరి చేర్చి గుడార్లు
పస గల్గిన నీలిపట్టు గుడార్లు
మసిలిసిడెత్తించె మహి విలసిల్ల
పైడికుండ గుడారు బారు లేర్పరచి
వెండికుండ గుడారు వీథు లేర్పరచి
కులగిరులను బోలు గొనపు గుడార్లు
కళలు మించిన యట్టి కంచు గుడార్లు
సంగట నుండగ చంద్ర గుడార్లు
కంపటీ లెత్తిరి కావేటి సాటి
టెక్కెము గుడహార్లు తీవిగా వెలుగ
గరుడ పడిగెలును కనక పడిగెలును
మిన్నంటి తూలెడు మీను టెక్కెములు
కొలువు గుడారులు కొలువు పడెగెలును
శ్రీరంగనాథుని శిఖరాల బోలు
పర్వతగూళ్ళకు ప్రతి యెంచవచ్చు
రవి సమీపము కెదురు రాచగుడార్లు
గుడహార్లు ఎత్తించె గోపుదారమల్లు
పోలురాజు కొలువులో పొడగాంచి
నిలచి :

"రణవిజయ పోలరాజ ! రాజాధిరాజ !
గుణసముద్రుడ ! ...
పాదసేంద్ర !
నెలకొల్పిరి సదార్థ నియోజ్ఞ ఆన
పల్లిన తిరుమంగలము వైన వైనాన
గుడహోర్లు ఎత్తి స్తి కొమున లేసుండ"

... రాజు పుష్పాంగి పుష్యంబు లిచ్చి
కనకపు ముంఘాని కప్పంబు లిచ్చి
పడివార సప్తాహ బలముల గొలువ
కొలుప్పుంచె పొగడపుష్ప
... యుక్తిరేపు

## పోలురాజు రంగనాథుని దర్శనమునకు కానుకలు సమకూర్చుమనుట

అల్లుండు పల్లికొండ నతిభక్తి బిలచి
పల్లికొండను జూచి ప్రార్థింప దొడగె
"పందుముల రఘుపతి ! బంధు
సోదరుడ :
వందనములివె గోవింద వరమూర్తి !
రంగశాయిని జూడ రఘుపతి ఇపుడు
గంగమైలావుల కపిల యావులను
కానుక బట్టించు కడు వేడ్క తోను
దానములకు పదార్థముల లోనగూర్చు"
మని వేడి యడిగిన మామకు నపుడు
గొనకొని యా పల్లికొండ యిట్లనియె
"మామరో ! ఓ మామ ! మా
యమ్మయన్న !
భూమీశ వలురాజ పుత్రుండ వినుము
రాజువు తలిదండ్రి రక్షకుడ వీవు
తేజమౌ శ్రీరంగదేవుని జూడ
అడిగిన వేళఫల మానతిచ్చెదను

చెడుగు శుభము సమ్మత
సిద్ధయోగంబు
పరహాను గడియల పొరిక మీద
అటు బృహస్పతి అమరియున్నాడు
అంగుగా వైభవం యాచపుకే
మనము
రంగశాయిని జూడ రాజ లెస్సవును
స్వామిని వేడిన సంతసం బంది
స్వామి యిడు ఇహపర సౌఖ్యంబు
మనకు
ఇపుడు నీవడిగిన యిమ్ముహూర్తంబు
భూపతితో పోరు పుట్టనున్నదిగ
ఈ ప్రొద్దు రేపట ఎదిరెడి పోరు
శరీయున్న ధేనువుల చదను
నొంచెదిని
శుభము ధేనువులు రాజు చుట్టమౌ
తుదిని

చోడాని మనకు తా సూడి దలంపు
కడువేగ మనచేతి కట్నాలునందు
పక్షమునను ప్రాణ ప్రద మౌను
మనకు
ఇచ్చట లెస్సవును ఇటమీద మనకు
పరహిత జగడము పైవచ్చు పూని
కారణమున పోరు కలుగును మామ"
అల్లుడు పల్లికొండాడు మాటలకు
పల్లవ పోలరాజు వడి నవ్వి పలికె:
"అల్లుడ సంతోష మైతేను లెస్స
కయ్యము గల్గితే కల్యాణ మగును
తాతతండ్రులు తొల్లి ధర్మమార్గమున
ఖ్యాతిగ పోట్లాడి కీర్తి కెక్కిరిగ
ఉపకారమున పోరు వుద్ధరించిరిగ
జపతపంబుల ఫలము సమకూరు
మనకు
అందుకు సందేహ మనుమాన మేల ?
విందు భోంచేయుట కేగుదే !"
యనిన
రఘుపతి యా పోలురాజు మాటలకు
"తెగువతో పల్లవ దేవేంద్రభోగ !
అసహాయ శూరుండ ! అతిధర్మశాలి !
పొసగ దయామూర్తి !
పుణ్యావర్తనుడ
ఎసగ నీ కీర్తియు వినువీథి బొందు
పసగల దాయాది పగవెరవు లేని
రసికుండ ! చెల్లు నీకు రాజ ఓ మామ !
మరి తిరుమందుల మల్లును బిలచి

## దైవదర్శనమునకు పోలురాజు బయలుదేరుట

స్థిరముగ తమ్ముల చేరంగ బిలచి
రాజు ఆయత్తపడె రంగప్ప నేడ
'సజ్జ గోపాలరాజు సర్వ సేనలును
సకల ముస్తీదులై సర్వ సేనలతొ
చక్కనై రం'డని చాటించె రాము
చాటిన విని సేన సంతోషమంది
కోటాన కోటులు గొబ్బున లేచి
కట్టాయి తంబైరి కలిగిన బలము
పట్టభద్రుని వెంట బహాళమై కొల్వ
పున్నమచంద్రుని బోలిన ఘనుడు
కనకదండె పల్లకి గ్రక్కున నెక్కె
కుచ్చుల రత్నముల్ గూర్చిన యట్టి
పచ్చల పాలకి పల్లికొండెక్కె
కుందన బంగారు కొమరు దీపింప
అందలా లెక్కిరి తిరుమందు లెల్లరును
గోడిగ లెక్కిరి గోపాల [illegible]లు
కడలేని గుర్రాల కంపటి లెక్కె
రాజుకు ఇరుగడ రాగ సైన్యములు

ధాజాభజ [illegible] బిరుదు
ముందర [illegible] నడువ
పం[illegible] బలములు [illegible]
డెబ్బదేన్[illegible] దిశలు
[illegible]
వేటురుమా[illegible]ల చామరములు
పాటించి [illegible] పట్టు
గొడుగులును
శంఖపన్[illegible] గొడుగు చ[illegible]కాల గొడుగు
పంకజనా[illegible]నికి ప[illegible] గొడుగులును
జల్లుల గ[illegible]లును జ[illegible] తేజీలు
చెలువొ[illegible] యా[illegible] శే[illegible]డు కదిలె
తెప్ప దర్లినయట్టు [illegible]వుని జూడ
కంపింప భూమెల్ల గ్గమ్మిక నడువ
మేఘంబు రంజిల్లి మెరసిన రీతి
వేగంబె వారిధి వెల్లి విరిసినటు
వల్లవ చంద్రుండు వయ్యన వచ్చి
కనుచూపు మేరను కాల్నడ నడచి
కని రంగనాథుని కనకగోపురము
వలచెయ్యి లోగాను వలపల దిరిగి
మాలిక కంబాల మండపమునను
జముకాణమును బరిచి చదురు ఏర్పరచి
ఇమ్మగ [illegible]జును [illegible]య్యాల వారు
రాజు తిరుమందుల రఘుపతి దాను
భోజుడు కొలువుండె భోరు కల్లంగ
నంబుల ఓ[illegible]లిపించి నై వేద్యమునకు

[illegible] సామగ్రి సమకూర్చి రంత
[illegible] నేతుల గర్భగిఉ[illegible]
దీపము [illegible] లక్ష వెరగొప్ప వెలుగ
అ[illegible] జే[illegible]యించి యరి ప్రియ[illegible]
పీ[illegible] గట్టి ప్రి[illegible]తో నొసగి
ఘు[illegible] ఘుమ వాసించు శ్రీగంధ
మలది
రత్న హారంబులు రత్న భూషలును
రత్నా[illegible] కిరీటము రయమొప్ప నిడియు
పక్షివాహనునికి ఫలహార మొసగి
పుష్ప జాతులతోను పూజింప సాగె
గంగిమైలావుల కపిల యావులను
రంగేశు కర్పించి రాజు పోల్రాజు
"జయ జయ శ్రీరంగ! జయము
లుప్పొంగ
భయపాప మణచంగ పాదమున గంగ
పచ్చివెన్నలు మ్రింగ పణతి నోమంగ
పాంచాలికిని మానభంగము దొలుగ
ముంగల నిహపర ముక్తి కలుగంగ
కలికి చూపుల నంగ [illegible]వేటి రంగ
అలివేణి కొక చింత అతిప్రాఅనాథ
దాసులకు నీ సేవ దయ రంగశాయి
శరణు శరణు కావు శ్రీరంగశాయి
నీ[illegible]దముల కొలువ నేర్తునా దేవ!
పాపసంహార! నిన్ను బ్రహ్మ
ఎరుగడు"

అని కొనియాడిరి అల్లుడు మామ !
దినకరు మణి శంఖు తీర్థము లంది
శ్రీతులసి తీర్థము శిరమున నిమిడి
సద్భక్తి సాష్టాంగ దండంబు బెట్టి
వినయమున నంబులకు విడిమాడ లిచ్చి
దేవదేవున కారగింపులు చేసి
గోవుదానంబులు కోరినట్లుగను
బ్రాహ్మణులకును శ్రీవైష్ణవులకును
కామధేనువులను కట్నాలు ఇచ్చి
పల్లికొండయు రాజు పరగ
తిరుమందులు
కొలువుండిరి పొన్నపువు గుడహారుక్రింద
సకల వైభవముల సర్వేశు కృపను
సుకరము పోట్రాజు సురరాజు బోలి
హరిహర భక్తు డా యాదవ పతియు
యాదవుల్ కొలువంగ నచ్చట నుండ

## చోడాని కావేరి వెట్టిపని విషయమై తన మంత్రులను అడుగుట

అంత నా శ్రీరంగ మనుదినంబునను
ఎంతయు నొప్పుగా నేలెడి రాజు
మూడుకన్నులవాని మూర్తి గలట్టి
చోడాని రాజు తా శూరుడై జగతి
ఈడు ఎవ్వరు లేని ఈశ్వరనుతుడు
వేడుక కొలువుండి వెక్కసముగను
"మరి నీతిమంతుడ ! మంత్రి
సుమంత !
చేరి వినుము మాట చంద్రశేఖరుడ!
కావేరివెట్టికి కలిగినవారి
చేయించితిని మీరు చెప్పినయట్లు
తెరగొప్ప ఛప్పన్న దేశాలవారు
వెరచియు కావేరివెట్టి చేసిరిగ
అందరో రాపట్టయు శంకయు లేక
వీకతో సురలచే వెట్టి గైకొనిన
సొరిదిని ప్రజనెల్ల శోధించి తెచ్చి
శ్రీరంగమున వెట్టి చేయించినాను
ఎదురు మీరిన రాజు లెవ్వరు లేరు
చెదురు గెక్కడ నున్న చెప్పంగ
వలయు
మీకు కానగవచ్చు మిగుల కార్యములు
నాకు కన్పింపరు నాకన్య" లనుచు
చోడాని పల్కిన సూడు మాటలకు
వడి లేచియు ప్రధానివర్గ మిట్లనిరి :
"విను విను చోడాని ! విక్ర
మార్కుండ !
విను విభవదేవేంద్ర ! విన్నవించెదము
ఏ బదార్థేశాల ఏ రాజులైన

అభయార్థులై పెట్టి రరి అర్పణములు   ఏరీతి ఘనులు మీ యాజ్ఞకు లొంగి
చేరి వెట్టి యొనర్చి సేవకులైరి   గర్వము విడిచియు కడతేరినారు

## మంత్రులు పోలురాజును గురించి చెప్పుట

రాజ ! వినుము పోలురాజు తా వచ్చె   కలిమి బలిమి యెంత ! కంపట
తేజమెక్కడి వాని ధేనువు లెన్ని
మెంత !
సంపద యెంత ! తా సైన్యం   అలుగుల పాతరై అతడు వున్నాడు
బదెంత   అదురు బెదురు లేక యాదవరాజు
కంపింప గుడహోర్ల కడగుర్రు లేదు !   పదవితోడుత మన పట్నాని కొచ్చె"

## పోలురాజును పట్టుకొని రమ్మని చోడాని మంత్రులతో చెప్పుట

అన విని చోడాని ఆల్లున నవ్వి   చెడ బ్రతిమాలిన చెప్పిన వినక
జనపతి మంత్రులకు చెప్పంగ దొడగె   తోడుక రండిటకు దొర బంటు
"విను చంద్రశేఖర ! విను
అనక
సుమంతుండ !   విడువక కావేరివెట్టి చేయించ"
పోయి యాదవులను పోనీక పట్టి   సెలవు విడియమిచ్చి చంద్రశేఖరుని
నాయెదుటకు దెండు నాపేరు చెప్పి   వైశమ సుమంతుని వడి వేగ బంపె
ఎందరు ఉండిన ఎందు బోనీక   ఆ రాజు పంపిన ఆ సమయమునను
గొదకొని అందర కొనితెండు ఇటకు   తురంగముల నెక్కి త్రుళ్లుచు వారు
విడియము కాసించి విడువక మీరు   పోలురాజు కొలువు పొడగాంచి నిలచి

## మంత్రులు పోలురాజుతో చోడాని ఆజ్ఞ చెప్పుట

తేజీలపైనుండి దిగక యిట్లనిరి :
"రాజవు యాదవరాజ! ఇటు వినుము
పుడమిని చోడాని పుత్తెంచె మమ్ము
చోడానివారము సుమంతు నేను
జనపతిమంత్రి నే చంద్రశేఖరుడ
పనిబూని చోడాని పంపెను మమ్ము
అఖిల దేశాధీశు లందరిని దెచ్చి
ఎక్కువ కావేరివెట్టి సేయించె
భూపాలకుని యాజ్ఞ బూనియు నిపుడు
గోపాలకులు మీరు గొబ్బున లేచి
కత్తలమూ దలల గట్టిగా కట్టి
నెత్తికి చుట్టలు నేరతట్టలును
పక్షిణి వెండి చెలికపార గుద్దళ్ళు
పట్టుక వేగమె వెట్టికి రండి !"

## పోలురాజు కోపముతో తిరుమందుల మల్లుని జూచుట

అనగను పోలురా జాగ్రుడై మండి
తనమరిది తిరుమందు తప్పక చూచె
తిరుమందుల మల్లు ధీరుడై లేచి
పురువగ్నిని చమురు పోసిన యట్లు
ధృతి సుమంతుని జూచి తెగడుచు
బలికె :
"నీవెరుంగని మాట నీవు ఇచ్చుటను
అడిగితి, విపుడేమి అనవలె నిన్ను ?
చోడాని ఎవరు తా చూడకెట్లాడె
వెట్టి సేయుమని నీవెట్లు అడిగితివి
ఎట్టి గర్వము కలిగె వెట్టికి బిలువ
వెరువ కాడిన వారి నేమన వచ్చు
తర్లి పొండీ మీరు తప్పేమి లేదు"
మల్లభూపతి ఆడు మాటలు వినియు
చెల్లునా యని పల్కె చంద్రశేఖరుడు
"గుణ మెరుంగని వకార్క
గొల్లలుగాక
ఫణి నడుముకు చుట్టు పద్ధతివలెను
మీరియు వెట్టికి మీర రాకుంటె
సోదిరి భూమంతయు పోకు నీవార్త
చోడాని విను నెంతొ సూడును
గలుగు
ఓడక పిలిపించి యొత్తిడి బెట్టు
ఎరుగక మరి కొంత ఇట్లు ఆడితిరి
ఎరుగకాడిన వారి నేమన రాదు
ఓపిన మాత్రము నొక కొంతసేపు
మాపు రేపు కడతి మందిని జూపి
చేసిన మాత్రము చేసిన మేళ్ళు

వాసికి పోయిన వచ్చును బాధ
అపుడు దీర్చవచ్చెను అరులు
బాధించ
ఇపుడు పుట్టిన పోరు ఇందరు
నెరుగ
చల్లార్తుమా మేము సందు లేకుండ
కల్లగాదని నమ్మి కావేరి వెట్టి
ప్రొద్దునొచ్చేమనుడి పోపరె మేము
వొద్దు నాబుద్ధి విను వో పోలురాజ!
మందగొల్లలు అట మరి వెట్టిచేయ
కాదంటె కొట్టును గనుక రండటకు
వొరుసుక కొలువులో వుక్కుపొడి
రాలు"
మరి విని తిరుమందు మల్లు ఇట్లనియె:
"చెల్లంబో సుమంత!
చంద్రశేఖరుడ!
వల్ల ఎరుగని మాట వచ్చె నిచ్చోట
పట్టభద్రుని కొల్వు పల్కితిరి మీరు
ఇట్టి వెట్టికి బిల్వ నెట్లాయె నోరు
ప్రల్లదా లిచ్చట పలుమరు ఆడ
అట్లనె వారిని అనవలెగాక
వెట్టి చేసే వారు వేరె వున్నారు
వెట్టిచేసే వార్ని వెరపింతుగాక
మానక వెట్టికి మమ్ము రమ్మంచు
అనగను మిమ్ముల నే రాజు పంపె
నీకు వెట్టిని చేయ నేర్తుమా మేము
కాక యిట్లాడంగ గలిగితి రిటుల
మంత్రులుగను నీతిమార్గంబు లెన్న
సంతరింపక యెల్ల సర్వజ్ఞతనము
దూరము చూడక దూరు మీకేల
పోరుగా మాట్లాడ పోరు మీకేల
నెంపని అడిగితిరి నేరక మీరు
కుళ్ళుమాటలు బుద్ధి గూడని మాట
చోడాని రాజని సొంటివి నాడితిరి
కడమ వారెంతని కలిమి చూచుకొని
మనుజుడు పరబలిమి మదిని దలపడు
కర మెరింగిన దుష్టకర్మకు వెరచు
రమ్మని పిలువుము రణరంగమునకు
రమ్మనకు వెట్టికి రాము మీకేల?
నేను చెప్పితి బుద్ధి నేర్వరు మీరు
రాననిరని చెప్పు రాజుకు మీరు"
సుమంతుడా మాటకు సురసుర
మండి
"ఏమేమి యంటివి యాదవరాజ
నే వచ్చి చెప్పితే నేర్వరు బుద్ధి
త్రోవయాడితి రీరు త్రొక్కితావేది
కావేటి వెట్టికి కడతేరగలర
అవ్యక్త మాటలు ఆడితి రిపుడు
రాజుకు చనువరి రా జంతవాడ
రాజువెనుక ప్రధాన రాజును నేను
పనివడి మారాజు పగ మీకు ఏల:
విను సిబ్బందిని బంపు మిపుడు రాకుంటె

సాటి వారెవ్వరు సరగున రండి
నేటికి కొందరు రేపు కొందరును
చయ్యన సమకూర్చి సాగనంపండి
వెయ్యారు యాదవుల్ వెట్టి యొసర్ప
పంపక మాతోను పంత మాడినను
చంపును ఆవల సరసము చెడును
గంతులు వేసి మీకన్నను ఘనులు
వంతుకు మన్నును వరుస మోసిరిగ
పంతంబు లెంత మీ ప్రజ్ఞలు ఎంత?
సుంతైన కడముట్ట వింతయు నిజము
తీర్థవాసులరై తిరిగి పోవుటకు
సాదృశ్య మెంతయు సరసులు
అగుట
వచ్చేము మాకేమి యిచ్చేరు అనరు
నొచ్చేరు యిచ్చుట పొచ్చెము లేదు
ఎంతని చూతుము యాదవరాజ
బంతిని కట్టని మేషము రీతి
ఇందున దిక్కు మీ కెవ్వరున్నారు
మందెమేళము మాని మనుజుల నిమ్ము
ఇచ్చేవా? ఇవ్వవా? ఇవి రెండు
జెప్పు
వచ్చేము జాగేల వక మాట జెప్పు
కలియుగ చోదాని ఘనుడని యెంచ
పోలురాజనుచు పొగిడేవు సారె
పంచ రత్నములను ఎంచిన చోట
పచ్చని గాజుపూస హెచ్చు చెప్పేవు
పండు ధాన్యము ఎంచబడునట్టి
చోట
ఎండిన తాలుకంకు నెంచబొయ్యేవు
చోడాని ఠాకన్న సొంది లోకమున
గాడపు రాజులకు కంటిలో నెరసు
అని జెప్పుకొందురు అవని దేశాల
మనుజులు తిరుమందు మల్లిటు
వినుము
గుట్టు చెరుచుకోక వెట్టికి రండి
ఎట్టులు సాగిపోనియ్యను మిమ్ము
కన దిక్కును మీకు కలగదు
ఇచట
గొనకొని మీరెల్ల గొబ్బున లెండి
పాలు దాగిన వెండి పనివేళ రండి
పోలరాజ చదురు దిగి పోవలె నిపుడు
గబ్బితనము మాని గొబ్బున లేచి
దబ్బర లాడక తర్లిగదు డంత''
సురసుర ఆ మాట శూలమై తాక
మరి తిరుమందుల మల్లు ఇట్లనియె
"ఓరి సుమంత! నీ నోరు పదిలమున
పారుపట్టెరుగవు పారెయకు నోరు
పంతంబు లాడేవు రంతు చేసేవు
రంతు పంతులకు పాలవు నిక
వినుము
భక్తి గల్గిన రాజు పంతంబు ఏల?
పత్తు బట్టిన మాట మాను సుమంత

దూరము చూడవు దొరకు వెరువవు
పారుగ మాటలు పల్కితి విపుడు
లక్ష కంపటమును లక్ష యాదవులు
లక్ష్యపెట్టరు విను రారు వెట్టికిని
సంద్రము జొచ్చిన సలుగుబెద్దులును
మందిని ద్రొక్కను మరలొక దిక్కు
అశ్వాలు అన యెంత ఐశ్వర్య మెంత
ఈశ్వరు సాక్షిగ వెట్టికి రారు
గోపాలకులు వింటె కొట్టేరు మిమ్ము
చెప్పము ఈ మాట చంద్రశేఖరుడ
అవులు పొడుచును అవనీశు నెదుట
కావరంబున కన్ను కానకున్నారు
గుబ్బాల దిగకను గుండె బిగువున
వెర్రి మాటలు ఇట్టు లేల ఆడితిరి
వచ్చి చెప్పితిరి మే మొచ్చేది లేదు
వచ్చిన త్రోవను వడిగ వెళ్ళండి
బొమ్మిక సిగ్గును పోగొట్టుకొనక
నెమ్మది తోచినట్లెల్ల ఆడితిరి''
ఆ మాట తిరుమందు లాడంగ
వినియు
సూమంతు డశ్వాన్ని చురుకుముట్టేసి
చదురు దగ్గర తోలె చంద్రశేఖరుడు
వుదిరుదిరి పడుచును చదురు
దిగ్గనుచు
"చదరంగ మాడకు చరగున లేచి
మందిని తోడ్కొని మావెంట రండి
వెడగు మాటాడుచు ఏమి ఉన్నావు
చోడాని మారు నే సూమంతు'' డనుచు
"మెడబలిమిని జూప మెదల నిచ్చేమ
తొడబలి మెరుగవ దుండగాల్ మాను
అరుపు తెరుపు లెరుగ రడ్డమాటాడ
మరి లేచి నిలువుదు మనుజు లెల్లరును
వింజామరల్ వేయకు విడియ
మందియకు
బంజింతు గొడుగులు పట్టించుకోకు
అడుగు దాటగనివ్వ నవనీశ్వరుండ
వెడగువు నా రాజు నెరుగవు ఎంత
చెల్లంబు నా మాట చెవిటి కుయ్యాయె
అల్లన నెరుగక అవనీశ్వరుండ
పరుగున రండిపుడు పనికిరా వీడ
కొరివి తోడుత తల గోకినయట్లు
ఎన్నని చెపుదు వివేకము లేదు
నిన్ను గడియసేపు నిలువంగనీయ
చోడాణి అన్నను సౌరిది ఎక్కడను
గడి మన్నెరాజుల గర్వాలు కదులు
నా రాజు కెదురాడ నవనిలో లేరు
పారెడు పాములు పడగెత్త వెరచు
వెరచియు సూర్యుడు ఎండలు విడుచు
తరచు విసిరే గాలి తమకించ వెరచు
జపములయం దుగ్రతపముల యందు
శాపములందు ఉచ్చాటనయందు
ప్రళయకాలుని బోలు పగ నీకు ఏల ?

చల ముడిగి వెట్టికి సాగి రాకున్న
నీ ప్రజ్ఞ సడలించి ఈ ప్రొద్దు మిమ్ము
రప్పించి వెట్టికి రాత్రి పగలనక
మందిచే చేయింతు మన్ను మోయింతు
కొందరిచే కత్తవరాలు దీపింతు
చద్ది కుడువనివ్వ సంబార మివ్వ
రద్దిచేయగ నీక రాళ్ల మోయింతు
వడ్డె గుద్దండ్లిచ్చి వడ్డారమునను
గడ్డిమోపులు గట్టి కడక మోయింతు
గచ్చుకు సున్నపు కావళ్ల ఇచ్చి
హెచ్చుగా గోపుల విడక మోయింతు
గుట్లరాయియు ఇసుక కుంద లెత్తించి
అట్లు ఏమరకను అగ్గి జేసెదను
లెమ్మన్న లేవరు లేచి నిలబడరు
దుర్మాన ముడుగరు దురుసు జూపెదరు
నిలువుడు లేచియు నిలమీద నిపుడు
కలహము కావలెను కదలి వచ్చెదరు
కొని గుంపు సేయింతు గురితించి చూడు''
అన విని పోలురా జాగ్రుడై మండి
పందుముల రఘుపతిని పరగంగ బిలచి

## మంత్రులు బ్రాహ్మణులు గనుక అవమానపరచక కొలువు వెళ్లగొట్టించుమని పోలురాజు పల్లికొండతో చెప్పుట

అందరు వినగను ఆ రాజు పలికె:
"పంపిన తేజీలపై నెక్కి వచ్చి
చెప్పిరి తమ రాజు చెప్పినయట్లు
రారని వారేగి రాజుకు జెపుడు
పోరాడ నీ రేతి ప్రొద్దు పోదేమొ
ప్రజ్ఞ చూపగరాదు బ్రాహ్మలమీద
బ్రాహ్మలకై తండ్రి భక్తియు గలిగి
వెలయ వారల చెర విడిపించినాడు
కలభూత గంగుతో కలహంబు చేసి
పలురాజు బ్రాహ్మల వసుధపై నిలిపె
ఇల భట్టుబ్రాహ్మల కిడవలె అభయము
అటుగాన వారిమీద అలుకేల మనకు ?
తటుకున సభనుండి తర్లించు వీరి
చోడాని భంభమంత చూతము మనము

తొడబడ వెనుకకు తోయుడు వీరి"
రఘుపతి పలికొంత రాజన వినియు
దిగుమని అశ్వాల దిగవిడిచి వారి
'రాజుకు చెప్పు'దని రచ్చ వెడలించె
తేజుడిగి సుమంతు తిరిగి చూచుచును
భగ్గుభగ్గున మాట బడప
జూచుచును
ఎగ్గులు పల్కి "నీకింత కావరమ :
పోనిత్తునా నిన్ను పోలురా''యనుచు
"కాని ముందెరుగవు కండ్ల కావరము
ఎంతకు వస్తివి యాదవ రాజ !''
పంతంబు లాడుచు ప్రజ్ఞ బల్కుచును
కోకలు చించుక కోపగించుకొని
కాకతో చోడాని కని, మ్రొక్కి,నిలచి
'పోలురాజును జూచి
భూమండలమును
పాలించు చోడాని మంత్రుల మనియు
కావేరివెట్టికి కలవారు ఎల్ల

పోవలె లెండని పూని పల్కగను
చోడాని రాజని చూస్తిమిగాని
ఏడ రాజులు ఇటు లాడుట గలద ?
ఎప్పుడ వీవు నను వెట్టికి బిలువ
ఎవ్వరు చోడాని ? ఎదురెరుంగకనె
నిస్సారముగ జూచె నీళ్ళకు వలెను
లెస్సగ గర్వించి లేచి రాడాయె
పోతిమి వస్తిమి పులినాకి విడిచె
రాతిని చెదలంటిన రాననె నతడు
మమ్మేమురాచెను మిమ్మేమి జూచు ?
అమ్మమ్మ ! పోలురా జాడిన మాట
అనరాదు ఇచ్చట అనలేము గాని
ప్రాణాన వస్తిమి బ్రతికి చుల్కనగ
భయ మయ్యెనుగ మా కభయ
మియవయ్య
కయ్యా మియ్యక కాని కదలిరా
మనిరి"
చెప్పిన చోడాని చంద్రశేఖరుని

## పోలురాజు విభవశౌర్యాదులను గురించి చోడాని మంత్రుల నడుగుట

తప్పక వీక్షించి తహతహ పడుచు
కడలేని మిణుగురులు కన్నుల
గురియ
చోడాని బలికెను సుమంతు జూచి :

"రారనిరా వెట్టి రాజనవాడ ?
మరి మరి ఏమనె మందిని విడువ ?''
అనుచు రోషావేశుడై యిటు బలికె :
''తనవారిచే వెట్టి తగిలి చేయింతు

వాసికి బోయిన వారలచేత
కూసి గుంపులుచేతు గురుతు
నామాట !
ఇంత ప్రతాపంబు ఇంత బలిమియు
ఇంత కలిమి వాని కే దేవు డిచ్చె ?
అ ధేనువులు ఎన్ని ? ఆ సైన్య
మెంత ?
ఏ దేవు పూజించు ? నెవ్వరి గొలుచు ?
ఇతని పూర్వకథయు నితని
జన్మంబు
ఇతనికి గలిగిన విభవ మేలాగు ?

అనతి' మ్మని రాజు అడిగిన నపుడె
భూనాథుని ప్రధాని బుద్ధిమంతుండు
''శరణార్థి'' యనుచును చేతులు
ముడిచి
"వెరచి చెప్పుదున ? నే వెరవక
చెపన ?''
అనిన చోడాని తా నప్పు డిట్లనియె :
''వినుము సుమంత ! నీ వెరిగిన
యంత
వెరపేల చెప్పుము వివర
మంతయును''

## చంద్రగుప్తుని చాటువ
## (పోలురాజు పుట్టుకను మంత్రులు చోడానితో చెప్పుట)

"పరతలంపును లేక పరగంగ
వినుము
పూర్వము పోల్రాజు పుటుక
జెప్పెదను
పర్వతాని కుదీచ భాగంబునందు
ప్రథ చంద్రగిరియను పట్టణంబుండు
అ దుర్గ మేలెడి ఆవనీశ్వరుండు
చంద్రగుప్తుండను శౌర్యధనుండు
చంద్రగుప్తున కశ్వసతియందు గలిగె
మల్లికాదేవి యను మగువలలామ

కొల్లగా అవులు గుంపులు గలవు
మండలి బోయుండు, మల్లికార్జునుడు
గుండెబోయుండును గోముఖార్జునుడు
తరిమి త్తబోయుండు ధర్మ పెద్దలుగ
గిరిగహ్వనాలలో క్రేపుల మేపు
బడిగాపు బోయలు పరగ ఏనూరు
అడవుల వెంటను ఆవుల మేప
అతని శివపూజ కమృతము పితుకు
మత మెరింగిన గంగిమైలావు లైదు
నాలుగావుల పాలు నగరికి నడచు

పాలివ్వ దొరక యావు పరతత్వ మెరిగి
లేగకై అరువదు లేశమాత్రమును
లేగ అరువదు తల్లిరాక నాశించి
నురుగు గుడిచినట్లు నున్ననై పెరుగు
మరి చేరదు లేగ తల్లి మరిచి యావేగ
తల్లికి బిడ్డకు తాలూకు లేదు
తల్లి పాలివ్వదు తా కుడువదుగ
ప్రొద్దు గ్రుంకెడు దనుక పొదుగు
పాలుండు
ప్రొద్దు పొడవ పాలు పొదుగును బట్టి
మందలి బోయుండు పిండి బోయినను
కుండ తడినిగాక గుండెబోయుండ !
ఈ ధేనువది యేమి ఇవ్వదు పాలు ?
ఇది యేమియో కాని ఎరుగ
మెన్నడును
బాధ వచ్చు ననుచు పరుగున వచ్చి

## చంద్రగుప్తునితో గోపాలకులు కవిలావు పాలియ్యని విషయమును చెప్పుట

చంద్రగుప్తునితోడ జెప్పెను ఇటుల
"అయ్య ! నీ దేవపూజ అల
గాచుదును
అయిదావులలో నొక్క యావు
అదేమొ
పాలు కురియుచుండు పగటింత
దనుక
తెల్లధారుండదు తెల్లవారగను
చెప్పితి సుమి మీకు చంద్రగుప్తేంద్ర !
తప్పు ఎరుగ"మని దండంబు బెట్టె
చంద్రగుప్తుడు విని "చెల్లంబో !
వోయి
చిందాయె శివపూజ చెప్ప రెన్నడును
పాలు ద్రాగెడువాని బట్టి తేకుంటె
పాలించ మిమ్ముల పట్టి కొట్టింతు
తావు జేరు" మటంచు తాంబూల
మిచ్చి
పోవుమనగ వారు పోయి మందలకు
మాపు ఆవులదొడ్డి మందలు చేర
కాపుగా పొడజాల కంపను నరికి
పొందుగా నడిదొడ్డి పొది యేర్పరంచి
అందులో దేవపూజ ఆవుల తోలి
సందు కంపను బరచి చా
సందె చీకటి గాక సరె
ఆ యావు దొడ్డిని అటె [illegible] కదుమెత్తి
చాయగా చప్పుడు ఝుక్క [illegible] ద్ర

అప్పటప్పటి చప్పు డాలకింపుచును
చప్పున అడుగడుగు చాచి వేయుచును
ముల్లుముడకనక ముచ్చుమబ్బునను
అల్లన నది ఈది అరిగె నా సురభి
ఆవుల గాచేటి అ భోజులెల్ల
ఆవును గనిపెట్టు కంత టంతటను
తెరువును జూచుచు తెప్పలు ఎక్కి
చేరిరి ఆ వెంట చేరిక గాను
గురుతెరింగిన అయిదు కోనల పుట్ట
పరగ పుట్టదిరిగి భళ్లున అరిచె
గురుగురనుచు పుట్టకోనలో నుండి
కర మరుదుగ వచ్చె ఘనదివ్యమూర్తి
పంచజడలవాడు పసిడి కప్పెరతొ
పొంచి పొంచా యావుపొదుగు కై పట్టె
పంచటిల్లియు గోవు పరమేశునాకె
కొంచక పితుకంగ కురిసెను పాలు
మూడుగిన్నెలు త్రాగి మురిసి
పాడుచును
ఆడుచు పుట్టపై హరుడుండ జూచి
కట్టపొదల చాటు కాచిన వారు
పుట్టపైనున్న ఆ భూతేశు జూచి
వెరవక దొంగని వేగంచె వచ్చి
ఎరుగకుండను చేరి ఒదిగిలి చొచ్చి
నక్కినక్కియు వచ్చి స్వరావుచాటు
పోకు పోకనుచును పొద బయలెల్లి
'దొంగ దొరికె నిదె దొరికె' నటంచు
పొంగి గొడ్డట వేసి భూతేశు దగుల
మనిషి అలికిడికి మారుటమూర్తి
చనె పుట్టలోనికి చయ్యన దూరి
పంచజడలలోని పరుసము సోకి
పచ్చని కుందనం బంగారమాయె
గంధగొడ్డలి పైడి కర్రెల్ల వెండి
అరిది బడియు బుచ్చు కావును
దొడుక
అ మల్లికార్జుని నట కాపలుంచి
గోముఖార్జును డాది గొబ్బున వచ్చి
రాజును గనుగొని రాత్రిటి వార్త
భోజులు చెప్పంగ జూపి రిటువలెను:
"నీవు చెప్పినయట్లు నిద్రగాచియును
గోవును కనిపెట్టుకొని యుంచగాను
ఆవులు దొడ్డిలో నన్నియుండగను
ఏవిధి చప్పుడు వినరాక సురభి
కంప వురికి యావు కడు నది దాటి
తెంపుతో కొండలు దిగియు ఆ నడుమ
పుట్టకోల దిరిగి బొల్లున అరిచె
అట్టె పుట్టలో నుండి ఆ దొంగ వచ్చి
కప్పెరతో పాలు గమకించి పిండి
తప్పక పాలును త్రాగేటి దొంగ
పొంచియు గొడ్డట వేస్తిని నేను
మించుబంగార మయ్యె నిది యేమొ
కాని"
చంద్రగుప్తుడు విని సంతోషమంది

''అందరు జూస్తిరా ఆ దొంగవాని ?''
''చూస్తి మయ్యా ! చేత శూల
మున్నాది !
చూస్తిమి నుదుటను నేత్ర మున్నాది''
''తాలర, ఎరుగవు ! తా జూచినాను
మాలజడల చందమామ యున్నాది''
''ఇతనేమి ఎరుగును నే జూచినాను
కుతిక నలుపుగుండె గురుతు నా
మాట''
''తలగర ! ఎరుగవు ! నా జూచినాను
తలలోను తరుణియు డాగి
యున్నాది''
''అన్నిమాటలు కల్ల ! అయ్య ! నే
జూస్తి !
చిన్నది వక లేడి చెంగటున్నాది !''
''ఇందర మాట కాదే జూచినాను
ముందర వక చిన్న నంది
యున్నాది!''
''వాడేమి ఎరుగును ? వాలుగ జూస్తి !
పొడుగాటి పాములు పొర్లాడుచుండె !''
''వాలాయముగ జూస్తి ! వాని
మాటేల !
పులితోలు కాశగా పూని యున్నాడు!''
''నిలిచి ఎంతో సేపు నే జూచినాను
తలను పేర్లెన్నియో ధరియించి
యుండె,
పడలెల్ల విభూతి యోగవాగాలు
పల్లజడల పిస్న బాలుడై యుండె''
''మగవాని రూపంబు మగువరూపంబు
తగవొప్ప తనయందు తగిలి
యున్నాది''
''చేతులు నాలుగు చెప్ప మరచితిని
చేత మనిషిపుర్రె చెప్పవరోరి !''
గుమిగూడి యాదవులు గురుతులు
సెప్ప
స్వామి యౌటను దెలిసి
చంద్రగుప్తుండు
గోపాలులకు మ్రొక్కి
కొనియాడసాగె :
''వేపల్లె కృష్ణుని వంశంబుమీది
ఆదిని యాదవు లమరులుగాన
ఎదుటను శివుడు తానటు గానవచ్చె
కన్నులు చెలగ ముక్కంటిని మీరు
కన్నుల జూస్తిరి ఘనపుణ్యమతులు''
అందర కొనియాడి అంజలి జేసి
యాదవు లంపలాల్ ఎక్కించు
కొనియు
ముందర నడిపించె
ముహూర్తమునను
చంద్రగుప్తుడు మంత్రి చనువరుల్
గూడి

వసముకు పంచ మా
వాయిద్యములతో
చని పర్వతము ప్రక్క చాలుగ
నడిచె

పురహరు డున్నట్టి పుట్ట జూపినను
పరదక్షిణము తిరిగి పడి
సాగిమ్రొక్కె :

## చంద్రగుప్తుడు అడవిలో పుట్టను త్రవ్వించుట - అతడు సైన్యసమేతముగా మూర్ఛిల్లుట

''పాలించు ఇపుడు నా
పాలిదైవంట !''
కాలాంతకుని నీలకంఠుని జూచ
తగ ధూప నైవేద్య తాంబూల
మిడయు
సగరులకు సెలవిచ్చె
చంద్రగుప్తుండు
నలుబది గజములు నలుచదురైన
చలపట్టి త్రవ్విరి సాధించి పుట్ట
జలము లుబ్బకయుండె జాడెరుకు
లేదు
నిలువులు ఏడును నెమకి త్రవ్వినను
పొడగాన లేరైరి పోకంత శిలను
కడు డస్సి సగరులు కళవళ
మంద
చంద్రగుప్తుడు దూరె
చంద్రశేఖరుని

''నందివాహన ! పిన్ననాటి
నుండియును
క్రన్నన నతిభక్తి గలిగియు మదిని
అన్యదైవ మెరుంగ నిన్నె పూజిస్తి
నను కృపజూడుము నాపాలి
స్వామి !''
అని పలురీతుల హరుని నిష్ఠురత,
దూరగ, శివుడును దూరము పోక
చేరువ పొడగట్టు చందంబు
వినుడు :
బలువైన వక చట్టుబండ గన్పట్టె
అలసి వుప్పర్లు మాకలవి గాదనిన
''ఈ బండ క్రిందుండె నాపాలి
శివుడు
ఈ బండ ఖండించు డిందరు మీరు !''
కాశీలు ఆ బండ గఃశికలుగు సరికి
తీసి ప్రోగులు వేసె తిరుగార నపుడు

పొరలు నూరును పలుగు లేనూరు
పరగ తొమ్మన్నూరు పద్దెగుద్దండ్లు
ఇనుము బంగారమాయె నిది యది
యనక
కని భ్రమసియు వారు కలవర
పడియు
కార్చిచ్చువలె మండు కనకము జూచి
మూర్ఛగనైరి మొగి జనులంత

## మల్లికాదేవి చాటువ-మల్లికాదేవి శివుని ప్రార్థించుట

గొల్లలు మల్లికా కొలువు కేతెంచి
"తల్లి ! చంద్రగుప్తుడు ప్రవిశించె
పుట్ట
దొంగ దొరకడేమి దోషంబొ కాని
బంగార మాయెను పార గుద్దండ్లు
చంద్రగుప్తుడు, మంత్రి
సర్వసేనలును
అందరు మూర్ఛిల్లి యచట నున్నారు
కదలరు మెదలరు కన్నులు
దెఱచి
చదలువట్టును బొండ్లు శీఘ్రమె రమ్మ"
ఆ వార్త విని సుత హరహర
యనుచు
శివశివ యని లేచి శీఘ్రంబుగాను
పణతులు మోసెడి పల్లకి యెక్కి
పుణుక పేరులవాని పుట్ట కేతెంచి
దవ్వుల బొడగని దండంబు పెట్టి
శివుని సన్నిధినిల్చి శివదేవి పలికె
"పర్వతాధీశ్వర ! పార్వతినాథ !
సర్వలోకేశ్వర ! శంభు మహేశ !
గిరిజా మనోహర ! గీర్వాణ వంద్య !
హరహర ! ఫాలేశ ! ఆనందభరిత !
త్రిపుర సంహారనాథ ! దిక్కు
దేవేశ !
త్రిపురాంతక ! దేవ ! దినకర తేజ !
నాగభూషణధర ! నారీశ ఈశ !
వేగ బ్రోవుము ఈశ ! వేదాంత
వేద్య !
కాలకూటాకంఠ ! గంగా ధరుండ !
భస్మాంగరాగ ! త్రిశూల ధరుండ !
కన్నులు మూడున్న కైలాసవాస !
పన్నగ పులితోలు పలెవాటుశాలి !
మూడు వేలేండులు మూకాసురుండు
కూడి పూజించిన కృపజూపి తీవు
శరణంచొచ్చినవారి చేపట్టినావు
మరి దయ మామీద మరచితి స్వామి
కాళహస్తిలో బోయ కన్నప్ప
యొకడు

నీలకంఠా మదినిల్పి నిను జూడ
గంధ్రక తెర పై చి కడు ఉగ్రతపము
మెండుగ జేయగ మెచ్చియు వాని
ప్రజ్ఞ గెల్పించిన భక్తెందు బోయె
వన్నె కోమటి కంచివాని బ్రోచితివి
గజవదనుని గన్న గజచర్మధరుడ !
గజాసురుని బట్టి గర్వము అణచి
సిరియాలు చంపంగ శిరితొండ
మెచ్చ
కరుణెందు బోయెను కైలాసవాస
భల్లాణరాజును భార్యను అడిగి
కైలాస మిచ్చియు కరుణించినావు
పదవిడితి కిన్నెర బ్రహ్మయను
మెచ్చి
వదలితివా దయ వో స్వామినాథ
నిమ్మవ్వ పొదలోన నిన్ను పూజింప
సన్మతి నొసగితి సద్గతి నీవు

భక్తితో దూడల మల్లప్ప బ్రోచి
ముక్తి యొసగితివి ముదమున జేర్చి
ప్రమథు లెందరొ నీకు భక్తులు
ఎవరొ
అమితము నే నెఱుగ హర నీవె కాని
పుట్టవు పెరుగవు పుట్టలోపలను
కట్టింతు దేవళము కనపడు స్వామి
మితిమీర యేర్పరుతు మిమ్ము
పూజింతు
సతతము భోగము సాగింతు మీకు"
మల్లికాదేవి మాటలు మెచ్చి
మల్లిఖార్జునస్వామి మహిమీద కెగిసె
పుట్టలో గుగ్గిలము పొగ యెగిచినట్లు
చెట్లు మల్లెలు పారుజాతముల్
కురిసె
మల్లికాంబికవద్ద మగువ లందరును
మల్లికార్జున మహిమ మత్తును గొనిరి

## మల్లికాదేవికి శివుడు ప్రత్యక్షమై వరము లొసంగుట

వేపకాయంత శిలగెగసి మల్లప్ప
ప్రాపుగ ప్రత్యక్ష మాయె నీశ్వరుడు
మల్లిఖార్జుని శిరము మరి కౌగలించి
అలుముక మల్లిక యంజలి జేయ
విసమనేత్రుడు మనుజు
డాడినయటుల
కుసుమ కోమలి అడుగు కోరిన
వరము

తల్లి నీవేమడుగ దయసేతు న"నిన
మల్లికదేవియు మరి యడిగె నిటుల :
"పశువులవల్లను పశుపతి మూర్తి !
ప్రసన్నమైతివి ప్రజ యాదవులకు
వాని వరములివ్వ వసుధలోపలను
అని యావు జన్మము
హర వినుపింపు"
మల్లికాదేవికి మారుటమూ రి

పలికె “ఆవై నాకు పాలొసంగుటను
కడసారి జన్మమె కలుగ జోదికను
పుడమిని రాజయి పుట్టును ఆవు”
అన మల్లికాదేవి అప్పు దిట్లనియె
“విను ధేనువై పూజ వెస
యొనర్చుటను
ఆవుల రాజాను అది పుట్టవలెను
ఆవుల రాజుకు నతివగా జేయు
భూతేశ నీవు పుత్రుడై పుట్టి
ఖ్యాతిగల్గగ మాకు ప్రీతి వరమిమ్ము
తల్లిని నీ సను తనయుడ వీవు
మల్లప్ప భక్తుడ మాటిమ్ము నాకు
ముందర నీ నందిమూర్తి మాయింద
అందమౌ బసవన్నయై పుట్టవలెను
మాయింట ఈశ్వరుడు మందబసవన్న
సాయమై యుండును స్వామి
యెప్పుడును
అల్ల చతుర్ముఖుడవని జనించి
వల్లని పుత్రైష్టుగ సమకూర్చు దేవ
అవిష్ణుపు మంద నావయి పుట్టి
మహానుపుంపు గగ్గ అర్థము ఇయము
ఇష్టనిత్యాంకుల్ యాదవులుగను
ఇష్టత నాకిచ్చు విశ్వనాథుండ !
అసంఖ్య భక్తుల అంర వృషభములు
విసుకక నాకిచ్చు వేదవేద్యుండ !”
వనిత మల్లికదేవి వరముల నడుగ
విని పర్వతము మల్లిఖార్జుండు నవ్వి
మన్నించి పర్వతమల్లప్ప మెచ్చి
“... పూజిస్తివి కరుణిస్తి నిను”
“తండ్రి మూర్ఛదెలుపు తండ్రివి
నివు”
దండంబు బెట్టిన దయతోడ జూచి
పొర్లిపొర్లి నిదురపోయిన రీతి
మెల్లన నిద్రలు మేలుకొనంగ
చంద్రగుప్తుడు సర్వసైన్యము లేచి
చంద్రశేఖరునకు సాగిలి మ్రొక్కి

## మూర్ఛదెలిసిన చంద్రగుప్తుడు శ్రీశైల మల్లిఖార్జునునకు దేవాలయాదులు గట్టించుట

వినుతించి పటురీతి విశ్వేశునకును
ఘనభక్తి గట్టించె మనమున దలచి
గుళ్ల గోపురములు కోనేర్లు నడలు
అల్లన గట్టించి అన్నిదిక్కులను
కనక కుంభములను కంభాల కెత్తి
ఘనముగా పాతాళ గంగను గూర్చి
కాశికేశ్వర ఘట్టకల మహిమొనర్చి
కలియుగ కైలాస కరకంతు నెలవు

పిడిఘంట నాదులు భేరి శంఖులును
పడిగెలు గొడుగులు పైడి నందులును
దవనపు మరువపు దంతి తోటలును
శివపురి తీరుగా జేసె పర్వతము
దేవళమున దేవదేవుని నిలిపి
సేవలు జేసెను చంద్రగుప్తుండు
కుందేలు తా వచ్చి గురుని పూజించి
కుందేలు కుమ్మరగుండయ్య అయ్యె
కరియయి పూజించి కరకంఠు
దయను
కరియె చోడాణివై గలిగితి పీవు
ఆవయి పూజించి అరువదియేండ్లు
ఆపుల పోలురాజై పుట్టె నతడు
ఆ మల్లికాదేవి అతివగ నయ్యె
అమరులు యాదవులై పుట్టినారు
గోపాలకుల జన్మ కొంచెము గాదు
భూపాల చోడాణి పూనియు వినుము
దేవ సీవత డొక్కదేవు పూజించి
భూవిభు లైనారు పురహరు దయను
అతడు నీసాటి అధికుడే గాని
క్షితినెన్న కొంచెపు జనుడు గాడతడు
పోలురాజుకు నీకు పోరు లేదయ్య
పోల్రాజు జననము పూర్వ మీలాగు"
మంత్రి చెప్పిన విని మండె చోడాణి
ఎంతయు కోపించి యేమని పలికె :
"వాని పూజలు ఎంత ? వాడన నెంత ?
కోనగోవుల నేలి క్రొవ్వినా డతడు
గోవుల నేలపై గూల్తును నేను
కావర ముడిగింతు ఘడియలోపలను
జపతపమునను, ఉచ్చాటనమునను
శపియించు టెరుగవ
శివపూజమహిమ !"

## చోడాణి పోలురాజుపశువుల మందను గోపాలకులను శపించుట

అని లేచి స్నానము నాడి చోడాణి
తను ధ్యానమగ్నుడై తడివస్త్రములతో
అర్ఘ్యార్చనాదుల హరుని పూజించి
ఉగ్రసూక్తములతో హోమ మొనర్చి
తర్పణాదికము సమర్పణ చేసి
అప్పుడు పోలురాజావుల వ్రాసె
పసిలేగలను వ్రాసి పాడియాల్ వ్రాసి
[illegible] వ్రాసి
పశుపతి దలచుచు పట్టి ఉదకమును
విశదముగా జల్లె యెద్దులాల్ మీద
చోడాణి శపియించ సొరిది నా మంద
వేడుక చెడి కీడు వెసవచ్చె [illegible]
శాపంబు తగిలెను శలపె[illegible]ల్య కును
పాపంబు చుట్టెను పాడి యా[illegible]లకు
మంద మురిజిద్దాయె మం[illegible]
క్రందుక చూడల కడుపుబ్బి[illegible]యె

పొదులలో దూడలు పొర్లాడసాగె
మెదలక కౌలాలు మేతలు ఉడిగె
నిట్టు ఉపసించె నీరుపూరికిని
తుట్టునొప్పులతోను గునిశాడసాగె
అంభో యటంచు అరచె యూబోతు
లెల్ల
శంభుని మందకు చేటు పుట్టె నిటు
సలుగుటెద్దులు తమ సమరము మాని
తూలి నడువలేక తొదకాళ్ల బడియు
భల్లుభల్లున నర్చి బసవ ముద్దెడ్లు
నేలను గఱుచుక నిలువక పడెను
యెదతర్చి దూడలు యెగిరిపడి పొర్లె
మెడలు క్రిందుగ వైచె మెండాయె
వ్యాధి
పలపల గెట్టెలు పగిలె వై శంబె
పోల్రాజు మందంత పుడమి పాలాయె
ముంచుక యీగెలు ముసిరె
ఝుమ్మనుచు
కాంచగ పసిగణం కన్నీరుపెట్టె
తిరుమందులవారి దేనువు లెల్ల
వురుకతో కౌలాల వుండెలు తొలిగె
అడుగు కుంటులచేత అడుగెత్తలేక
బడలిక రక్తము పారంగసాగె
బొడ్డూడని లేగలు పొర్లాడసాగె
దొడ్డికి ఇరుగడ దోరావు లొరిగె
పుల్లెద్దు బసవన్న బొల్లావు తప్ప

గొల్లరాజుల మంద కుంభినీ వరిగె
ప్రేరిమి మంత్రాలు ప్రేటువై రాకె
విలవిల దన్నుక యెద్దులు పడెను
మంపరువు తరువులు మతిచెడి కూలె
నియమకాలాన పశువులు నేలను వరిగె
గోవులు తడలేరి కొట్టుకాడగను
గోవుల గాచేటి గోపాలవరులు
మందలు ఓగనాడి మందలింపుమను
అందరు తమలోన ఆందోళపడుచు
కోలలు, సెలగోళ్ల గొప్పున అంది
పోల్రాజు కొల్వుకు పొగలుచు వచ్చి,
బలువిడి దండముల్ ప్రభువుకు బెట్టి
నిలబడి తెలిపిరి ఎల్లరు వినగ
"మనవులు వినరయ్య మందలో
స్థితులు
ధేనువుల్ ఛప్పన్నదేశాలు మేసి
కోయభూముల మేపి ఘోరడ్వీ మేపి
మాయల మలకట్లు మంత్రభూములను
యంత్రభూముల నెల్ల ఎద్దుల మేపి
ఇంత భూమిని తిరిగి యీడ కొచ్చి
తిమి
పశువుల కెడలేని ప్రాణాని కొచ్చె
శిశులేగ లాదిగ శివమంద బడెను
ఎందు తెలియని వ్యాధి ఎరుగంగరాదు
మందలు నేటితో మడిసెను రాజ
చోద్యమై యున్నది సాధ్యంబు గాదు

శోధించు'' మని చెప్పె శోకిస్తు వారు
విపరీతమౌ వార్త విని విని పోలురాజు
అప్పుడు పలికొండ నడిగె నిట్టులను :
"అల్లుడా పల్లికొండావు లన్నిటికి
మూల మెరుగని వ్యాధి
ముంచెనంటిపుడు
ఇది యేమి చోద్యము ఎరిగించు"

వ.

మదిని విచారించి మామతో ననియె :
"ప్రోల్రాజ ఓ! మామ!
ప్రొద్దుటవేళ
కలియుగ చోడాణి కావరంబునను
రమ్మన్న వెట్టికి రాము పొమ్మనగ
దీమసమున మన ధేనువుల వ్రాసి
ఉపవాసమును ఉగ్రజపము నొనర్చి
శపియించి నీరు జల్లె పాపంబు
అనక"

## పోలురాజు చోడాని సైన్యమును రౌతులను శపించుట

రఘుపతి జెప్పిన రాజు తా లేచి
పగలు స్నానము చేసి పగ
దీర్చుకొఱకు
నీరాకావి ధోవతి నీరు కారగను
పోరుకు ముక్కంటిని పూజింపనాగె
ఎర్రని గంధము, ఎర్రని పువులు
ఎర్ర నక్షింతలు ఎర్రని నీళ్ల
కపట ఉచ్చాటనకై సమకూర్చి
జప మొనరించియు శంభునిగూర్చి
వారి యేనుగులను వ్రాసెను నేల
వారి అశ్వములను వారి రౌతులను
కుటిలంబుతో వారు కుంభిణి వరుగ
పటు కమండల జలం పైన ప్రోక్షించె
కబంధములు వగుల గజముల
కడుపు
ఉబికియు గజములు ఉర్విని వ్రాలె
వరిగెను అశ్వాలు వరిగె లొటిపిటలు
భేరీలవలె కడుపు బెరిగె రౌతులకు
కరి గజ శాలలు కార్చిచ్చు పడిన
వెరపున స్తంభాలు విరిగె ఫెళ్లునను
ఉయ్యాలశాలలు ఊరికె విరిగె
మాయచే రాజుండు మండపం కూలె
ఆట్లుపోట్లుతో వరిగి రద్భుతంబుగను
కోటలో సేనలు గుములుగ గూడి
తత్తరింపుచు ప్రజ తలుపులు వేసి
మంత్రి అంచరు మరచిరి పనులు
అన్నోదకము లేక అయె ముద్దిడ్డు
కన్నతల్లులు శిశులు గానక యుండె
దగ్గులు పడిశాలు తలకొని మిగుల
ఉగ్గుపాలొల్లక వుండె బాలకులు

చోడాణియును మంత్రి సుమంతు
గొంతు
వాడు చందరశేఖర వరమంత్రి
పక్క
కడమువారికి శిరోకంపంబు బుట్టె
ఆ పట్న కొత్వాలు అందెం
మార్కేడు
అనను దిరిగెడి కోనమునీడు
పొరిగంట పర్వతు పరగ నేతెంచి
కలియుగ చోడాని కని
మ్రొక్కిరంత
'పట్టభద్రుద మన పట్న
మంతయును
పటు బుట్టెను మీకు చెపుదు మిపుడు
పట్టేనుగులును పరగ నశ్వములు
లొట్టిపిట్టలు పడి రోజాడసాగె''
చెప్పిన చోడాని చంద్రశేఖరుని
అప్పుడు బుద్ధిమంతు నడిగె చోడాని
బుద్ధిమంతుడు రాజు బొడగని పల్కె
''యాదవు డెట్టికి ఎదురాడగాను
క్రోధమునను వారి గోవు లన్నిటిని
వాదించి శపియించ వారి మందకును
ఆపద వచ్చిన ఆ రాజు తెలిసి
శపియించ గజముల శాల లశ్వములు
అటని జపమంత్ర ములుగులై నాటి
వెతవచ్చి పట్నము వేసుచున్నదిక
అతను ఏమంత వానొప నోవాకి
యూపవునికి మీద ఫేమను లేదు
వద్దని చెప్పిరిమి, వసుధేశ మంచు''
అన విని చోడాని ఆశ్చర్య మంది
మనమున మోదించి మంత్రుల
కనిరె :
''ఆవుం పోలురాజరడును మనుడు
ఆవుల బ్రతికింప నతని జేరాను
లన సురభులకయి రగ మహి
మిపుడు
మనమీద యతని సామర్థ్యము జూపె
వాని సురభులెల్ల వరుస రక్షింప
మున గజాశ్వములను మనజేయ గలడు
హరుషంబు గావలె యతనికి మనకు
పరమేశ్వరుని నిష్ఠపరులము మేము
కాలిముల్లనకుండ కౌలావు లెల్ల
చల్లంగ జేతునని జపమొప్పబూని
గోవు లెల్లను వ్రాసి గొనకొన్న కరుణ
దివ్య మంత్రజలంబు దీవించి జల్లె
మునుపటికన్న అధిక మూర్తులు
కలిగి
కనక చాయల మెరిసె కౌలాల మంద
గోవులు లెస్సయిన గోపాలవరులు
అవులలో పబ్బ మమరగ జేసి
జయమని పోత్రాజుతో జెప్పిరి వారు
రయమున పోత్రాజు రఘుపతి తాను

చేతిలో చేయి వైచి చెప్పక నవ్వి
''అతని భద్రకరు లతని గుఱ్ఱముల
బ్రతికింతు" నని వేగ పెట్టెను తపము
అతని గజము తేజు లతని రాహుతుల
ప్రత్యేకముగ వ్రాసి పరమేశు దలచి
సత్యవ్రతుం డపుడు జలమును బూని
మంచి పువ్వులు గంధం మారేడు పత్రి
అంచితముగ జల్లి అక్షయ మనెను
తుద నేనుగులకును తొండాలు నతికె
కదిలెను గజములు కాళ్లను దట్టె
కరాళించశ్వముల్ గ్రక్కున లేచె
అరఘడియ లోపల అనంద మాయె
వేసడంబులు బ్రదికె వెతలెల్ల బాసె
పసబిడ్డ తల్లుల భ్రమ లెక్కువాయె
నీలకంతున కంపె నివ్వాళు లెల్ల
కోలహముగ పూజగూర్చె చోడాణి
మతివచ్చి పట్టము మబ్బులు విడిచె
క్షితి చోద్యమందెను చెలగి చోడాణి
"అతడు యాదవుడని యాతని బలము
ఎంత లక్ష్యముపెట్ట కింత చేసితిని
మంత్రి చెప్పినమాట మనసుకు దట్టె
మంత్రజపముకు సమర్థుం డతండు
దేవపూజ ఘనుండు దేవు భక్తుండు
ఆవుల పోలరాజు అతడు నా సముడు
పోలురాజు స్నేహ బుద్ధెటులగును
పోలరాజు చుట్టమౌ పూన్కి యె"
ట్లనుచు
నీతిమంతు నడుగ నిలచియు మంత్రి :
"నీతితో చోడాణి నిజము చెప్పెదను

## చోడాని పోలురాజుతో స్నేహము చేయగోరి దేవాలయపు గచ్చునకు పోలురాజును పాలడుగ మంత్రులను పంపుట

శ్రీరంగపతి గుడి శిఖరములకును
వారిని పాలడుగ వలెను చోడాణి
పాల్గన్నము కని పనివడి మన
పోలురాజు నడుగ పుత్తెంచ వలెను
అందుకు పోలురాజమృతము బంపు
అందు కుపాయము అయ్య దెల్పెదను
గుడి కీర్తి పుణ్యము గొల్లరాజులది
గుడి మాది పుణ్యపు గురుతు మీదనుచు
పనివడి మనదిగా పంపుము కమ్మ"
అన విని చోడాణి హర్షుడై తాను
మంత్రులు చెప్పిన మాటలు రాజు
సంతసమ్మున కమ్మ చయ్యన వ్రాసి
తన వ్రాలు జేసియు తగువారి బిలచి
అనుపమ సుమన్తున కాకు లిప్పించి

పేరెన్నికైనట్టి పెద్దలగు వార్ని
వారికి తోడిచ్చి వడిగా తా బంపె
పంపిన నుప్పొంగి బలియులై వచ్చి
ఆ పోలురాజుసభన అశ్వాలు దిగిరపు
చిరునవ్వుతో సుమంతు చేతులు మోగిచి
శరణార్థి యని మ్రొక్కె చంద్ర
శేఖరులో
లక్కముద్రల కమ్మ రాజు యంపినది
గ్రక్కున పోల్రాజు కానుక బెట్టె
పోల్రాజు కమ్మలు పుచ్చుక వేగ
బాలసరస్వతి ప్రధాని కిచ్చె
రాజు పంపిన కమ్మ రద్దూడదీసి
రాజు వినగ చదివె రాచకరణము
"రాజాధిరాజు మార్తాండ తేజుండు
భుజబల భీముండు పోలురాజుకును
పన్నుగా చోడాని పంపిన (లేఖ)
మనవి
మన్నించు వందనము మహనీయ
మూర్తి
తమరు నే నొక్కటి దైవము ఒకటి
తమ భక్తి మెచ్చితి తమ్ముడ వీవు
శ్రీరంగమే మీది శివమంద నాది
అరమర లేకను అంపితి లేఖ
గుళ్ళ శిఖరములు గోపురంబులును
పాలసున్నము జేసి పంపితి లేఖ
దవ్వున గనవచ్చు ధర్మము మీది
దేవళం పుణ్యము తెరగొప్ప మాది
కనవచ్చు పుణ్యము కడముట్ట మీది
కనరాని పుణ్యము కడమెల్ల మాది
అపునని గోరితి ఆలస్య మనక
అపుల పాలంపు అరమర లేక''
ఆ మాటలు విని రాజు అల్లన నవ్వి
కామజనకు పంక కన్నెత్తి జూచి
''విను తిరుమందులు వీరి నేర్పులును
విను చంద్రశేఖరుడీ సుమంతుండు
ఈ ప్రొద్దు మనలను వెట్టికి బిలచి
ఈ ప్రొద్దు పాలడుగ నిటు వచ్చినారు
చంక దుడ్డును బెట్టి శరణార్థి యనుచు
జంకు లేక దిగెడి చంద మీమాట
బెదరించి పాలడుగ పెట్టంపె రాజు
ఇది యెక్కడి మాట యివ్వను
పాలు"
అటులన రఘుపతియౌ పల్లెకొండ
తటకున రాజుతో తా జెప్పబూనె
"దేవేంద్ర పై భోగ ! ధీరుడ వీవె
భావించు నామాట బంధుపోషకుడ !
కోటి అర్థము బెట్టి గుళ్లు కట్టించి
పాటింప పుణ్యము పంచిపెట్టుదురు
చేయని పుణ్యము సిద్ధించు మనకు
చేయగవలె పొందు జనపతి మనము
కనరాని పుణ్యము కలుగును మనకు
ఎన్ని గావలసిన ఇవ్వుము పాలు

పాలకై పుణ్యము పంచిపెట్టుదురు
ఎలాగు అనకిప్పు డివ్వుము పాలు''
పల్లెకొండిటు జెప్ప బాగుబాగనుచు
అల్లునితో రాజు అప్పుడిట్లనియె
"హరిసర్వ మీమాట అతిమీరగలన?
హర్షమునొ మీరు ఆడిన మాట
పాలడిగి వెట్టికి పట్టుదు రేమొ
కుండల ఇచ్చిన కూడును వెట్టి
మండలాధిపతుల మాట లీలాగు
కావళ్ల పాలంపు కాపులము గాము
కావేటి కడనుండి కాల్వలు దిద్ద
వ్రాసి పంపుడ యిప్పుడు రఘుపతి
మనము
ఖాసిగా చోడాని వారలచేత

## పశువులమంద వద్దనుంచి దేవాలయమువరకు కాలువ తీసి గచ్చు చేయించినచో ఆ కాలువ వెంట పాలు పంపుదుమని పోలురాజు చెప్పుట

తగువేక్క కాల్వలు త్రవ్విన వెనుక
వగలేక పాలవేర్పంపుదా'' మనిరి
''ఓ రాజ లెస్స''ని వొప్పె సుమంతు
చంద్రశేఖర రాజు చెప్పినట్లొప్పె
కడియముల్ దట్టీలు కనకాంబరములు
ఇడె చంద్రశేఖరునికి సుమంతునికి
కలియుగ చోడాణిక్కి కమ్మ
వ్రాయించి
పల్లెకొండయు రాజు పంపెను వార్ని
మారుజాబులు నంది మగిడిరి వారు
శ్రీరంగపట్టము చేరిరి దాము
మాపటి కొల్వున మండలేశ్వరుని
భూపాలు చోడాణి బొడగని మ్రొక్కి
''పార్థివేశ్వర మీరు బంపిన బోయి
అర్థించి పోల్రాజు నట పొడగాంచ
పోల్రాజు పలికొండ భూషించె మమ్ము
పాలు పంపెదమని పంపిరి లేఖ''
అవనీశ్వరుని యాజ్ఞ నా మంత్రి
చదివె
భువనాధిపతి సర్వభూపతుల్ వినగ:
''శ్రీమతు రాజ్యశిరోమణి యైన
భూమేంద్రు దరిరాజ పూజితుడైన
మహాదేవ భక్తుండు మండలేశ్వరుడు
మహనీయమూర్తి సన్మాన
భూసురుడు
శ్రీరంగపట్టము స్థిరమైన రాజు
శరణార్థి రక్షకుడు శరభవ మూర్తి
పోల్రాజు మీకిపుడు పుత్తెంచు లెఖ
పాలంపుమని మీరు పంపిన లేఖ
చదివించుకొంటిమి సంతోషమాయె

ముదముతో దెలుపు మా
ముచ్చటేమనగ
కాలువల్ తీయించు కావేటి వెంట
ఆలమందలవర కాయ త్తపరచు
అ కాలువలు గచ్చు ననువుపఱచినాం
ఆ కాలువల పాలు అంపుదు మేము"
కలియుగ చోడాణి కమ్మను వినియు
పోలురాజును మెచ్చి పొగడియు వేగ
తన మంత్రులను బిల్చి తాంబూల
మిచ్చి
"ఘనమగు కాల్వలు గచ్చుచేయుటకు
అయత్త పఱచు"మనె అపుడు చోడాణి
ఆ యుత్తరువు నంది అపుడు
మంత్రులును
కాశీల వుప్పర్ల గడిలోన బిలచి
''వాసిగా కావేటి వద్దనుండియును
కౌలావుల దనుక కాల్వలు దీసి
కాల్వలతో నవుత్కానలు చేసి
ఆలస్యమును లేక అవి గచ్చుచేసి
తెలుపు" డంచును నాజ్ఞ తీవ్రత నివ్వ
వేవేగ త్రవ్వియు వెలిగచ్చు చేసి
''నీవు చెప్పినయట్లు ఇప్పుడు మేము
ఆయత్త పఱచితి''మనిరి మంత్రులకో
చేయెత్తియు నమస్కృతు లొనరించి
చోడాని కెరిగింప చోద్యము నంది
వీడ్యంబు కాశీల కిడి వెనువెంట
''అయ్య : నీకోరినట్లన్ని జేసితిని"
చయ్యన పోల్రాజుకు జాబుల పంపె
పంపిన చదివించి పరగ పోల్రాజు
కంపడిల్ పెద్దగు ఘనుమల్లు బిలచి
"సోమవారము రేపు సొరిది
మండంలో
ఆమని లేగం నటు మాపువేళ
దండిమలుపు లమర్చి దామెన గట్టి
యుండగవలె" నంచు నుర్వీప నాజ్ఞ
వేగ చాటింపగ వేగంబె పోయి
వేగుల చాటించె వేగవేగంబె
అపుడు జలకమాడి అనుష్ఠానమైన
కృప భూసురార్చన కోరికల్ దీర్చి
పైడి గుడారులో పరమేశు దలచి
పైడి భూషణములు పట్టు తివాచి
పరిపించి చిత్తము పరమేశు చేర్చి
సొరిది తివాచిపై సొంపుగా గూర్చి
భద్రాక్షలును యేడు బంతు లమర్చి
రుద్రాక్ష లామీద రూఢిగా నిల్పి
పొన్నకాయ శిరసు పోల్రాజు మోపి
వెన్నున పులితోలు పీడక జుట్టి
పాదాలు మీదుగా పట్టెను తపము
హృదయమందున నీశు బదిల మొనర్చి
పరమేశు నుతియించ పలువిధంబులను
కోర్కెతో నీరాళ్ళ గొందులు మెరసె
మార్కాని పడమర మరి వాస బట్టె

ఉరిమి మబ్బులు గ్రమ్మె
ఉత్తరదిక్కు
పడమర మెరసెను పలుమబ్బు
గ్రమ్మె
విడివిడి జలధార విడలక గురిసె
ఘుంచి కురువసాగె మొరబెట్టి వాన
మించియు గర్జిల్లె మేరుపు గదల
ఉఱుములు మెరుపులు ఉరవడి సాగె
పరికించి చోడాణి ప్రధానిని జూచి
"వాగులు వంకలు వడి పొర్లసాగె
తగ భయదమౌ వృష్టి ధరణి గంపించె"

సన సుమంత్రుడను నధిపుని జూచి
"వినుము మాధవవర్మ బెజవాడలోను
వావిరి కుందనవాన గురిపించె
ఆవులమందలో నా పోలురాజు
వాసి కెక్కగ పాలవాన గురిపించె
చేసిన పుణ్యంబు జెడదు యేనాడు"
పట్టు పురుదాఱను పరగంగ బూని
గెట్టల సెలకోల నెత్తి యాదవులు
తమకించి క్షేపుల తగవేగ విడచి
క్రమమొప్ప పేరుల కౌలాల బిలిచె

## గచ్చుకాలువ వెంట పోలురాజు చోడానికి పాలు పంపుట

'సురభిదేవత రమ్మ! సుర
ధేన్వ రమ్మ!
గరుడుని తల్లి రా! గంగ రావమ్మ!
పాలవెల్లీ రమ్మ! పాంచాలి రమ్మ!
చాలకొడుకుల తల్లి సాధువ రమ్మ!
శ్రీలక్ష్మి రమ్మిపుడు సిరిముద్దుబాల!
అల సరస్వతి రమ్మ! ఆవుల రాణి!
శృంగార మల్లెరా చిత్తర్వుప్రతిమ!
గంగా భవాని రా కావేరి రావె!
సురరాణి రావిటు సొగసుల తల్లి!
మారాడ కిటురావె మదనుని తల్లి!
పార్వతీదేవి రా! భద్రకాళి రావె!
కోరిన్న క్కోర్కిడు గోపి రావమ్మ!

కలికిచిలుక రావె కామేశ్వరమ్మ?
తొలకరిమెఱుపు రా! దురితసంహారి!
రాచవీటి ఆవు రా! రాహంస రమ్మ
పెయ్యలతల్లి రా! పెనుమాఞ్చు రమ్మ!
అమరావతీ రావె! అంజనీదేవి!
రాముదేవి రమ్మ! రత్నమాణిక్య!
ఆణిముత్యము రమ్మ! అమరుల తల్లి!
పంచరత్నము రావె! పరవుపకారి!
కంచి కామాక్షమ్మ! గౌరి దేవమ్మ!
కల్పతరువు రావె! కళ్యాణి రమ్మ!
శ్రీరంగకన్య రా! చిట్టిముత్యంబ.
చిలుకలకొలికి రా! చిగురబోడి రావె!
యలమంచిగంగ రా! యశోద రమ్మ!

పాలబిందెల తల్లి! భాగీరథీ రా!
ఇంద్రునితల్లి రా! యెరుకుసాసమ్మ!
గజవరధుని తల్లి? కౌసల్య రావె!
సౌనవాన రావె! ఓ శోభన రావె!
బొందుమల్లె రావె! పుష్పము రావె!"
హస్తమెత్తి మ్రొక్కి ఆవుల బిలచి
ఇచ్ఛగా లేగల విడిచి పితుకగా
దూడలు ఒకచన్ను తొణికి కుదు
వగను
కడమ చన్నుల పాలు కాల్వలై పార
పితికి పోసిన పాలు పెద్ద యేరుగను
ఉపకముతో కలిసి ఉబ్బి పారగను
కాలువలో పాలు గంగతో కలిసి
వాగు వంకలు నిండి వచ్చె పాలేరు
పాలతెప్ప నురుగు పచ్చివెన్నలును
కావేటి కెగదట్టె కరకంఠు దయను
సరగ ధ్యానంబును చాలించి రాజు
మరి వేగ తిరుమందు మరుదుల బిలచి
"బంధువులును మీరు పాలేరువెంట
మందితో తిరుమందు మల్లును బోయి

## తిరుమందుల మల్లుని పోయి కాలువ వెంట పాలు పంపితిమని చోడానికి చెప్పుమనుట

చోడాణి పొడగని సుద్దులాడియును
అడిగిన అమృతము అంపితి మనుచు
ఒప్పించి రావోయి ఓ మరిది"యనెను
పంపిన తిరుమంద్లు పల్లకీలెక్కి
మూడువేల గోవులు ముందు నడువగ
వేడుక పాలేరు వెంటను కదిలె
మ్రోతలు వినుచును కూతలాడుచును
ఖాతిగా పాలేరు పరుగులు జూచి
పొడుగుచెట్లెక్కియు బొబ్బరింపుచును
వడివడి పాలేరు వచ్చె ననువారు
పాలసంద్రంబని పల్కను ప్రజలు
పాల్యేరు కన్నులపండుగ జూస్తిమి
అంతట పనులవా రతివేగ వచ్చి
రంతు చేయుచు వచ్చి రాజుకు చెప్ప
పట్టపేనుగ నెక్కి పరగ చోడాణి
అట్టె పాలేరు జూచి ఆశ్చర్యపడెను
బ్రాహ్మలు వరుసగా ప్రజల కా
వెనుక
అమృతము సెలవిచ్చె అనువేగ త్రాగ
పాలు గలిగెనిక బ్రతికితి మనుచు
పాలను జూచియు వాలువాలనుచు
స్నానము చేయుచు దండమనువారు
పానము జేసియు పలికెడివారు
యాదవుల పుణ్యాన నయెననువారు
బ్రతికితిమి పోలురాజుభాగ్య మనువారు
వారిగోవుల పుణ్యము వారిపుణ్యమును

వారి సంపద చాల వర్ధిల్లు ననుచు
చేయెత్తి మొక్కుచు శరణనువారు
వెయ్యి నోళ్ళను నాడ వినియె చోడాణి
తిరుమందులు పల్లకీల్ దిగిరి వేవేగ
కరినుండి దిగియెను ఘనుడు చోడాణి
ఆవేళ తిరుమందు లపుడు చోడాణి
వేవేగ అంజలి వెస జేసికొనియు
కౌగలించుక యేటి కట్టపై కెక్కి
పొంగి పాలును కట్ట పొర్లగ జూచి
పొర్లిపోయెడి పాలు పోకుండ నపుడు
కలియుగ చోడాణి కట్టె ఇసుకతో
కరముల చోడాణి కట్టుట జూచి
తిరుమందుల మల్లు తెరగొప్ప ననియె :
"ఈవు మమ్ముల ముందు వెట్టికి బిలిచి
మీ వెట్టి ముందాయె మేము చూడంగ"
అన విని చోడాణి అల్లున నవ్వి
చనువున చెయిపట్టి సరసంబు లాడి
"తమ్ముడు పోల్రాజు తనయంతవాడు
అమ్మహీపతి మర్ది వనవచ్చు నీవు"
సల్లాపములతోడ సభ కరుదెంచి
ఉల్లాస మొప్పంగ ఉర్వీశు డపుడు
పట్టపుటేన్గులు రెండు పల్లకీల్ కొన్ని
పట్టు పడావళ్ళు పసిడి పల్లాలు
[illegible] తేజు వేను పందిళ్ల
చొక్కింపు వస్తువుల్ సూడిదె విడియు
చోడకాసుల ముద్ర చెల్లింపు డనుచు
విడియంబు లిప్పించి వెడలంపె రాజు
పదినూరు గుర్రాల పట్టెమ మురహరు
పదిలము చోడాణి పంపె వెంబడిని
చోడాని పంపిన సూడదెలన్ని
కడువేగ పోల్రాజు గైకొని తాను
పల్లకీలను నవపంజు గొడుగులును
జల్లులు యిన్నూరు జమిలి టెక్కెములు
ఏనూరు ఆవులు ఏనుపోతెడ్లు
సొనటిరిన మణుల్ సల్లుటెద్దులును
బంగారు తబుకుతో పట్టువస్త్రములు
రంగుగా నందికాసులు రత్నభూషలును
ఆకులు పోకలు అగరు పన్నీరు
ప్రాకటముగ నిడి పట్టెమ మురహరుని
పట్నాన కంపెను పరగ పోల్రాజు
పట్టెం మురహరు ప్రభున కొసంగ
నవ్వుచు చోడాణి నరనాథు డంది
నివ్వెర నందికాసు లెల్లెడ చెల్ల
చోడాణి చాటించె సొరిది పట్నమున
చోడాణి కాసులు చోడముల గలును

మరుక్షణములో చెల్లి మంచలో వాలె
మరిదైన తిరుమంచు మల్లును విడచి
ఈ పేర పొలేరు విడిపట్టు విడె
గోపుర చెరుకూరు కావు చేరగను

## శ్రీరంగమునుండి ఆలమంద సమేతముగా వెడలి చెరుకూరువద్ద విడుదు లేర్పాటు చేయమని పోలురాజు తిరుమందుల మల్లుతో చెప్పుట

తర్లించ పోల్రాజు తన కాజ్ఞ యిడగ
తర్లగ వేలాలు తన మంద లెల్ల
నడి తముకు చేయించె నపిరీలు బట్టి
పడదీసి గుడహార్లు బరుకాన పూని
మక్కెన యెద్దుల మన్నె సంపదలు
క్రిక్కిరిసి గదిలెను బుక్కాయిపెట్టె
జవ్వాజి పిల్లులు జాలె దేగలును
అవ్వారిగా పోక లాకుమోదలును
బియ్యపు గోనెలు పెద్దకావళ్ళు
వయ్యాన గుడహార్లు వరుసన గదిలె
అందలాల్ పల్లకీ లందముగాను
పొందుగా కదిలెను పోల్రాజుమంద
పందుముల రఘుపతి బలములు గదిలె
సందు లేకుండను సన్నాహములతో
చెరుకూరి పడమర చిలకలమర్రి
మర్రికి పడమట మందలు దిగెను
చిలకల మర్రిక్రింద శివుమంద నిలిచె
కొలది చెప్పగరాని గుడహార్లు ఎత్తె
“చెరుకూరు ఇది పుణ్యక్షేత్రము
మనకు
చెరుకూరు ఇది మన జన్మపావనము
చెప్ప చూపగవచ్చు చెరుకూరు
మనకు”
అప్పుడు సంతోషమంది పందెమును
అల్లుడు పల్లికొండ యాదవపరులు
పల్లవ పోల్రాజు వసుధ కొల్వుండె
పాలించి శ్రీరంగపట్న మేతేవో
కలియుగ చోడాణి గంభీరముగను
మంత్రుల జూచియు మరియు
నిట్లనియె
“మంత్రులాలా వినుడు మరియొక
మాట
వైళమ పోల్రాజును వరశి జూచితిమి
పోల్రాజుకు మనకు పొందౌనగూడె
పరగంగ మన వెట్టిపనికి రాకెవరు
ఏరెట నుండిరో యెరిగింపు డిపుడు
ఎవ్వరు ఎదిరించి యెచట నుండినను
దవ్వుల నుండిన దాచకు” డనుచు
అడుగ సుమంతుడు హస్తముల్
మొగిచి

"తడవేల చెప్పెద ధరణీశ వినుము
మూడు లోకాలకు మూర్తుల రీతి
మూడు పట్టణములు మొదల
సెప్పుడును
వొరగల్లొక్కటి నొరసి చూచినను
పేరుక గల్గిన కంచి పెద్దపట్ణంబు
వాటికి యెక్కువ వరిముల్టుయంత
పాటించ నెల్లూరు పట్ణమనంగ
మూడు పట్ణములును మొదటినుండియును
తోడగ పట్ణాలు దొర లేలుచుండ్రు
కచ్చ కెర్వొండు ముక్కంటి కాలుండు
హెచ్చుగా నెల్లూరు నేలుచున్నాడు
వచ్చునో రాదేమొ వాడు ముక్కంటి
నిశ్చయం చోడాని నిజము నామాట"
చెప్పిన చోడాన సెలవిప్పి పలికె
"ఇప్పుడే తెప్పించి వెట్టి చేయింతు"

## నెల్లూరుప్రభువగు ముక్కంటిని కావేరివెట్టికి తీసికొని రమ్మని చోడాణి పట్టెము మురహరుని పంపుట

పదినూరు గుర్రాల పట్టెము మురహరు
చదురుకు పిలిపించి చనువిచ్చి పలికె
"నెల్లూరికిని బోయి నే చెప్పినట్లు
కాలుడు ముక్కంటి కాలుని బట్టి
తలమీద బంగారు తట్ట లెత్తించి
చలికెపార భుజాన చేత గుద్దలిని
తన్ను గొల్చెడువారు తానును మరియు
మన్ను మోయంగను మానక బట్టి
తెర్లనీయక వారిని తీసుక రమ్మ
తర్లుండు లె"మ్మని తాంబూల మిచ్చి
మురహరు బంపిన మొనయయి కదిలె
పరుగున గుర్రాల పల్లముల్ కట్టి
పరువడి నెల్లూరుపట్ణము కొచ్చె
సొరిదిగా ముక్కంటి శూరులు గొలువ
కైలాసపతి రీతి కాలకంఠుండు
బలములు ఇరుగడ బలసి కొల్వంగ
ఛప్పన్నదేశాల చనువరుల్ దొరలు
అప్పుడు కొల్వగ అమరేశుసుతుని
కాలకంధరు బోల్లి కాలకంఠుండు
నెల్లూర కొలువుండె నేర్పుతో నపుడు
పండ్లు గీటుచు వచ్చి పట్టెమురహరుడు
నిండిన కొల్వులో నిలచి యిట్లనియె :
"మురహరుడు నా పేరు ముక్కంటి
వినుము
శ్రీరంగమును రాజసింహుండు ఏలు
కలియంగ చోడాణి కత్తుల బోను
శూలాన పాతర శూరు డతండు
చోడాణి పంపె నిచ్చోటికి నన్ను

కడలేని వెట్టగు కావేరివెట్టి
ముక్కంటి నీమీద మొక్కణ ముంచి
కక్కసు మాని నీ కలవారు నీవు
వెట్టికి వే రండు తట్టలు బట్టి
పట్టు చుట్ట లివిగో పారలు ఇవిగో
కొట్టను తిట్టను కొల్వు వెల్వడుదు
ఇట్టనట్టును చూడ నిక నేమి కద్దు
తొలగిపో లేరెక దొరికితిరీరు
బలములు నీవును పదుడు వెట్టికిని
అన్నము కుడుప నివ్వాలశ్యమగును
నిన్ను తెమ్మన్నాడు నివ్వనే పెఱతు
పదుడోయి ఆపద పడనేల మీకు
పదపద గొల్చున పనికందవలెను''
ముక్కంటు డప్పుడు ముక్కో-
పమునను
"ఎక్కడి మాటలు ఎరుగ కాడితివి
దిక్కు మీకెవ్వరు దిగుమంటి చదురు
మ్రొక్కిరాజులు గొల్చె ముక్కంటి నేను
చోడాణి యెవడురా! చూడ
మెన్నడును
ఏడవాడవు నీవు ఎఱుగ కాడితివి
వెట్టి యనగ నేమి? యెక్కడి వాడ?
ఎట్టు వస్తివి నీవు? ఎట్లంపె తాను
ఎక్కడి కావేరి ఎవరు చోడాని?
ముక్కంటి నెఱుగడా మూర్ఖుడు తాను
దొడ్డ కొంచె మెఱుగ తోడుగాడతడు

గడ్డు మించపపడు గౌరవమునను
గురుతెఱుంగడు తన గురువును నేను
ఔరా నిబద్ధిగా అంపెనా నిన్ను
ఇతడు మా తండ్రియౌ యీశ్వరు
గొలిచె
ఇతనికి వరములు వచ్చె మాతండ్రి
కంటిరా! మీరు పెంక్కంటుడ నేను
వింటిరా చోడుని కెంత గర్వంబు
మా తండ్రి విష్ణుంపు మాకు విష్ణుండు
మా తండ్రి భక్తుండు మాకు భక్తుండు
మూడుకన్నులవాని ముద్దుపుత్రుండ
మూడుకన్నులు గల మూర్తిని నేను
తనకన్న ఇనుబడి ధరణియు గలిగి
తనయంత దారలు దాసి కొల్వంగ
ఏనుగుల్ గుర్రాలు హెచ్చైన
కలిమి
గానక చోడాని కావరంబునను
కన్నులు మూడును గలిగినవాడ
కన్నులు రెండును గలవాడు సాటి
దళముల సరిరాడు తక్కువ తనకు
పాలింప యెందును ప్రాప్తుడు గాడు
ఇందుశేఖరు వర మిది యొకటిగాని
ఎందుకు సరిరాడు ఏడి చోడాణి
వెఱచి వానికి మేము వెట్టి చేసెదమ?
మురహరుడ మీరాజును మురియకు
మనుము

తిరిగి పో చెప్పుము దిక్కు నీకెవరో
మరియు పంపిన వారికి మాట లింకేల
దూతతనము బూని దుర్భాష లేల
కోతి గద్దింపులు కొరగావు పొమ్మ
సొరిది నీరాడిల్లు సొచ్చిన రీతి
ఎఱుగడు చోడాని యెరుగడేపట్ల
గుడ్డెద్దు జొన్నాట గుర్తెరుగ నటుల
చోడాని మేలును చూచితి పొమ్మ
కొలు వెళ్ళిపొ"మ్మని కోపంబు చేసె
చలమున మురహరుడు చదురెక్కి వచ్చి
"ముక్కంటి విను విను ముందెఱుగ లేవు
నక్కటక్కులు మాను నారాజు నెదుట
బలసి ముక్కంటి యెద్దు బసవన్నమీద
కలసి అంకెలు వేసి కాలు ద్రువ్వినట్లు
పొట్టక్రొవ్వున రాజు పోనాడితీవు
పట్టభద్రుండును పరువు లేకుండ
నీళ్ళకు చుక్కన నీవెంతనాక
కలియుగ చోడాని ఘనుడు మారాజు
శివుని పుత్రుడనని చిన్నెలు బోకు
అవు తెఱంగెరుగవు ఆమికతోను
బలము లేదని వేడబము బూనబోకు
వైళంబె వెట్టికి వేంచేయు మటకు
మూడు కన్నులు కల్గి మురియు చున్నావు
కడలిలో చేపలకు కనులెన్ని గలవు
కలియుగ చోడాని ఘనునికి ఈడ
మరియొక రైతేను మన పెట్టగలర ?"
పయినున్న రుద్రాక్ష పట్టు పచ్చడము
భయభీతి లేకను పట్టె మురహరుఁడు

## ముక్కంటి పట్టైమ మురహరుని శపించుట

కాలాంతకుండు ముక్కంటి కాలుండు
కాలకూట విషంబు కదలంగ బలికె :
"నీవన నేమిరా నీచుడా వోరి !
శివుని పుత్రుడ నేను చెంగు బట్టితివి
పట్టిన నీమేను పగల శపింతు
మిట్టిపడ్డుంటివి మిక్కిలి చెడుగ :
ఖర్మ మూడెను మేను కాల్తుర వోరి,
అమరేశు పుత్రుడ నైతిన యేను
తన తల్లి పతివ్రతధర్మ యైతేని
వీని అశ్వబలంబు వీని మేన్వీఱుతు"
కొణిదెడు తీర్థము గోరెడు విభూతి
అగ్నిసూక్తము చదువు చతనిపై చల్లె
పుట్టుపాప లగుచు పోదు రటంచు

పట్టెమ మురహరుపై బారజల్ల
వేడి మంగలముతో వేచిన రీతి
పడిరి భయంబున బలుమూర్ఛ తోడ
తొల్లిటి రూపముల్ తొలగె వారికిని
తెల్లని మేనితో తెప్పరిలి రంత
ఆడకాడకు రూప మాగోచరముగ
చూడ ఘోరంబైన చురుకులు బుట్టె
కనుబొమ్మ వెంట్రుకలు
కన్నురెప్పలును
తనువెల్ల తెల్లనై తల్లడింపుచును
వెలవెల బోవుచు వేడి మంటలతొ
పిల్లికన్నులచేత బెగడి వారంత
అతడు తెల్పు అతని అశ్వాలు
తెలుపు
ఆతని గొల్చినవార లందరు తెలుపు
తెలుపు మాపులతోడ చెరలి
పచ్చియును
కరికాల చోడాని కడకు నేతెంచె
ఒకపాటి యెండల కోర్వగ లేక
మ్రొక్కి చోడానికి మొర
పెట్టిరపుడు
చోడాని గని వార్ని చోద్య మందుచును
"ఏడవ్వారలు మీరు ఏ దేశమయ్య
తెల్లని మనుజు లే దేశాన గలరు
తలిదండ్రు లీలాగ తరుణు లీలాగ
మీరాజు ఈలాగ మీది యే భూమి ?
మీరు మ్రొక్కగనేల మొరపెట్టనేల ?"

## ముక్కంటి శపించినాడని పట్టెమ మురహరుడు చోడానితో చెప్పుట

చోడాని యడిగిన శోకాన వారు
"ఏడవారము గాము ఇదియె
మాభూమి
నిన్ను గొల్చినవాడ నీబంట నేను
నిను నమ్మి తరతరాల్ నిల్చినవాడ
పట్టెమ మురహరుడ బంటును నేను
నెట్టన బలముతో నెల్లూరి కరిగి
కక్కసి ముక్కంటి కాలుని బట్టి
ఇక్కడికిని వాని నీడ్చి తెమ్మంటి
అయ్యా నీ సెలవిచ్చి నానతి బోయి
గయ్యాళి ముక్కంటి కాలుని జూచి
పాలించి శ్రీరంగపట్న మేలేటి
చెలుపుడు చోడాని సేవకుడంటి
పట్టెమ మురహరుడ పనిపడి తాను

వెట్టికి రమ్మని పెట్టంపెనంటి
అన్నపుడు ముక్కంట
హంకారమునను
తన్ను తా పొగుడుచు తమను
పోనాడె
అడ్డ మాజ్ఞయు లేక అతడు
గర్వమున
మూడుకన్నులవాడ ముక్కంటి నేను
కలియుగ చోడుని కన్నులు రెండు
వెఱుపక నన్నిట్లు వెట్టికి బిలిచె
అయ్య యీ దుర్భాష లాడిన కినిసి
పయినున్న చెఱగును పట్టి దిగనీడ్చి
నయమున బోధింప నాటదు నంత
పయిన ఫస్మోదకం పారంగ జల్లి
పుట్టుపాపలు నయి పొమ్మను
చతడు
కట్టడి యిటువంటి కార్యము జేసె
నీయంత వాన్గొల్చి నిజరూపు బోయి
అయ్యయో పుట్టుపాపల మైతి మేము''
చెప్పిన చోడాని చెవుల లోపలను
కుప్పెకోలలు నాటి కుమ్మినట్లయ్యె
వెల్లని కన్నులకు హెచ్చె కోపంబు
కల్లరి ముక్కంటి కాలు డిట్లనియె :
''వినుము సుమంతుండ వీడెవ్వడనుచు
మనమున నూహించి మనము బిల్వంగ
నంపిన మనుషుల నత డిటువలెను
శపియించి యిట్టుల చేయంగవలెన ?
ఎంత గుండగు ? వీని కెవ్వాని బలిమి ?
దాత యెవ్వడు వీని దైవంబు
యెవరు ?
కోపంబు హెచ్చును గొబ్బున నాకు
ఇప్పుడె వాని వా ర్తెఱిగింపు'' మనిన

## ముక్కంటి చాటువ లేక బ్రాహ్మణ చాటువ (ముక్కంటి జననమును గురించి మంత్రులు చోడానితో చెప్పుట)

ప్రధానులు లేచి ప్రస్తుతి జేసి
చేతులు మొగిడిచి చెప్పుచున్నారు :
''అడిగెతి విపుడు నన్నతని జన్మంబు
తడవేల జెప్పెదంతయును నిపుడు
వినుము
పేద బ్రాహ్మణుడైన విరూపాక్షభొట్లు
తా దేశకఱువయి తావును దర్శి
నలుగురు బిడ్డలు నాతియు తాను
వలపోయు చాకట వలసలు పోయి
కొండొక రామాన్జకూటము చేరి

తిండికి యాచించి లెపవు గగ్గొనికి
యింతె బిడ్డలు తానువి స్తరాకులును
యెంతయు సమకూర్చు విధమున
దాము
అయ్య రేపును మాపు నాయ త్తపఱచి
వేయు వి స్తరులును తీయు వి స్తరులు
ఆ విధి గుడుచుచు నాలు బిడ్డలును
అవధి లేకను మఠ మందున గడుప

ఆతని బిడ్డలు ముద్దు రతని
భార్యయును
హతమందె పోయిరి అంత్యముగూడ
పుత్రికల శోకాన పొలతి శోకాన
వెతపడి బ్రాహ్మడు వేగంగలేక
పాటుబడి తిన్నాళ్లు పదతిబిడ్డలకు
కష్టపడు పెన్నారి కడుపుల కనుచు

## విరూపాక్షభొట్లు భార్య అస్థికలను కాశిలో కలుప బయలుదేరుట

సంసారము ఇకను చాలని యతడు
అస్థుల ఇఱ్ఱిచర్మమందున పొదివి
ఉత్తర కాశిలో నుంచెద ననుచు
పుత్రిక దీసుక భూసురుడు కదిలె
దినముల వెంబడి దేశాలు గడిచి
వనములలో నడిచి వారు రాగాను
బ్రాహ్మణు కూతురు పార్వతికన్య
తమ తండ్రి నడవిలో దాహంబు
నడిగె
"ఆడవిలో దాహము అమ్మెటదెత్తు"
పొదువు చెట్టెక్కె తా పొడగని
దిగియె
"ముందు ఊరో పల్లె ముందరున్నాది
ప్రొద్దుపొడ్పున దొడ్డ పొగ గంటి తల్లి

మనుజులు వుందురు మా యమ్మ
పదవె"
కానలో పలు బడి కడుత్రోవ గనక
అడ్డము ద్రొక్కక అయ్యబిడ్డయును
దొడ్డ యెండిన వరుగు త్రొక్కుచు
రాగ
మన్నెశంకరు పుత్రు లన్నదమ్ములును
కానలో విట్టయ్య, కాలయ్య తాము
బలియులై వేటాడ పరిపరి గతుల
పెళపెళ త్రొక్కుచు బ్రాహ్మడు
రాగ
వీక విండ్లెక్కిడి వేయుదా మనుచు
మాకు లండగ నుండ మరి చేరవచ్చె

# అడవిలో విరూపాక్షభొట్లు ప్రొద్దుగ్రుంకి బోయలవద్ద కేగుట

పొంచి చూడగ నపుడు పొదగట్టె
విప్రుడు
పంచిన విండ్లను వారటువైచి
పాపము వచ్చేని పాదాల కెరగి
చంపిన కటకటా సాగిలి మ్రొక్కె
ఆశీర్వదించుచు నా బ్రాహ్మణుండు
"కాశికి బోవుచు కంటిమి మిమ్ము
పోలేము బాలతో ప్రొద్దు గ్రుంకినది
కలకాలమును కీర్తి గలుగును మీకు
ధర్మ మీ ప్రొద్దున దాచి మమ్ములను
నిర్మలమతులార నెనరుంచి మీరు
తెల్లవాఱిన వెనక తెరువు జూపియును
వెళ్ళనంపితె మీకు నభివృద్ధి
యగును"
కానియ్యి మంచిది కాలవిట్టయలు
వానిని దోడుక వచ్చి రింటికిని
నట్టడవిలోపల నట్టువమీద
అట్టుకపై వారి కర యేరుపఱచి
బియ్యము పప్పును పిండితేనెలును
నెయ్యము మీరంగ నిడె చాల పండ్లు
చమురుకల్పులు మంచి షడ్రుచు లెల్ల
బ్రాహ్మణు కిడె స్వయంపాకము
జేయ
అట్టుమీద సంధ్యనుష్ఠానముల్ దీర్చి
తటుకున కూతుతో తా వంటజేసి
భుజియించి నిదురించె భూసురు డటక
విజనాటవిని భీతి యెంతయు లేక
భళ్లున తెలవార బ్రాహ్మణుడు లేచి
తర్లిపోదామని తనయను లేపె
భీతి కడుపు జొచ్చె బిడ్డేడ్వసాగె
"ఓ తండ్రి నడువంగ నోపగ లేను
కాళ్ళు బొబ్బలు వోయె కదలంగ లేను
బిళ్లలు గట్టెను బిరుసుగజ్జలలో
మీగాళ్ళు వాచియు మిసమిస మెరిసె
వంగవు నాకాళ్ళు వాచియుండుటను
సలపరించెను మేను సన్నపు వెచ్చ
అలసితి లేవలే నయ్యేమి సేతు
ముగ్గురు అప్పలు ముదమొప్ప తల్లి
అగ్గిపాలయి బోయి రచ్చట వారు
చావు లేదాయెను చంపు వో తండ్రి
తావు తర్లగ లేను తండ్రి యిచ్చోట"
"పాపపు మాటనకు పాపరో నీవు
ఓపినంత నడువు మొక కొంతసేపు
ఎత్తుక పోయెద విను" మట ననిన
చిత్తము ఝల్లన చింతతో బలికె :
"దిగవిడ్చి పో తండ్రి దెస వచ్చె
నాకు
పగవాడి వైతి వీ పట్లను నీవు

తగదనకు' మని పల్కి తండ్రి
కోపించి
వగపుతో కూతురు వదన
మీక్షించి
"కులము గోత్రముగాదు కూతురా
వీరు
చెల్లంబో శూద్రులు చేరి వుండుటకు
మన్నెవారలు మధుమాంసము
గుడుతురు
ఎన్న బ్రాహ్మణకుల మెక్కువ
మనది
పాప ముందటి మన బ్రాహ్మణ
యింద్ల
లోపెట్టి పోయెద నొక కొంత
నడుపు
ఇచ్చట ఉంచుట విహితము గాదు
అచ్చట వుంచెద అమ్మ పదమ్మ"
బ్రాహ్మణుతో బిడ్డ ప్రతిమాటలాడె
"బ్రాహ్మణ యింద్లను పరగ
తానుంటె
కట్టెలు తెప్పించి గడ్డి మోయించి
వెట్టిచాకిరి చేయ వెలపించి కొట్టి

తిట్టి పనులపేర తీయించురయ్యా
గొట్టి మిట్టావిన కోపింతురయ్యా
తోడివారై రేను దొడ్డ చూడరుగ
దొడ్డవారలు చెడి తుడివాండ్ల జేర
ఉంచేరు గౌరవ మొప్పగించిచట
ఉంచక ఉంటేను ఉరిబెట్టి చంపు
తప్పదు నామాట తప్పంగ లేదు
అప్పగిం"చనుమాట కా విప్రు దగలి
"ఏలాగు వుంచిపోదీ యడవిలోను
కలకాలమును మోసి కనియెను తల్లి
కడుపెట్టు భరియింతు కాళ్ళు ఎట్లాడు
పడుచు బుద్ధులు మాను పదవె
పోదాము"
అప్పుడీ మాటలు ఆడగ తండ్రె
నొప్పితో నెలుగెత్తి నొగులుచు
జూచి
"బలిమి చేసితివైన ప్రాణాని కెలువ
నాలికె పెరుక్కొందు నాన నీతోడు"
బిడ్డాడు మాటకు బెగడి బ్రాహ్మణుడు
"ఈడ యెవ్వరు లేరు ఇక నేమి
సేతు."

# విరూపాక్షభొట్లు తన కుమార్తె పార్వతిని అడవిలో కాలయ్యవిట్టయ్యల తల్లి దండ్రులకు అప్పగించి వెళ్లుట

కాలుని తలిదండ్రి కాలవిట్టయను
నలువురి నటు బిలచి నాతిని జూపి
"నలిబడి యీ బాల నడుపంగ
లేదు
చెల్లంబో నడుమను చెల్లి పొయ్యేను
గోల సుమీ మీరు కృప వుంచు"
మనెను
"తల్లిదండ్రులు మీరె తన బిడ్డగాదు
కడుపున గనినావు కాలవిట్టయల
పుడమి గన్నులు గన్న పుత్రిక
మీకు
కన్నది మీ తల్లి కాలవిట్టుండ
చిన్న బాలను మీకు చెల్లనుకొనుడు
ఆడతోడగు మీకు ఉరమర లేక
చేడె మీ చెల్లె"ని చెప్పి వప్పించ
కాలుని తలిదండ్రి కానని వృద్ధు
కాలుడు విట్టుడు గజగజ వణకి
ధరణి సాగిలబడి తల్లిదండ్రులును
పరదేశ విప్రుని పదముల కెఱగి
"పాప మొడిగట్టకు బ్రాహ్మణుల్
మీరు
ఈ పసిపాపను ఎటుల బెంచెదము
అంటగూడదు మిమ్ము అగ్రజు
లగుట
వంబక మేలాగు వండి కుడ్చెడిని
కండ్లు కానని యట్టి కపోతులము
మేము
కుండలు కడవలు గురుతెఱుగ లేము
ఒకనాటి పనిగాగ వుంతుమా మేము
అకట నా తనయులు అడవి
మృగాల
వారు వేటాడుచు వత్తురో రారొ
అరణ్యముల నుందు రన్నదమ్ములును
మాకులం వారైతె మణగి
యుండెదరు
ఈ కన్య బ్రోచుట నేరము గాన
అయ్య నీబిడ్డకు ఆలసట దీర
పొయ్యేరు గా నుండు
భూసురోత్తముడ"
కాలుని బ్రాహ్మడు కని వేగ పలికె
"తల్లిదండ్రులు మీరు తమ్ముడ
నేను
పేరు కీర్తులు మీవె
పెంచుకొ"మ్మనెను
వేరు చేయకు మని అనియేక చెప్పె
ఆశించి ముదుసళ్లు ఆడబిడ్డనుచు
దోసి లొగ్గియు విప్రుతో నమ్మబలికె
కాలయ్య విట్టయ్య గ్రక్కున లేచి

చెల్లెని బ్రాహ్మణచరణముల్ ముట్టె
ఘడి యెడబాయక గౌరవంబునను
పలుమారు బ్రాహ్మణు పాదాలు ముట్టి
ముద్దు చెల్లెలనుచు మోహంబుతోను
తలమీద చెయిబట్టి తల్లిగొడుక్కలును
ఇద్దఱు చెల్లని యూడేర్చి పెంచె
కడ స్వయంపాకము ఘనముగా నిచ్చి
కన్న పురులుకన్న కనని పుర్లెచ్చు
అడివెళ్ళ నంపిరి యన్నదమ్ములును
అన్నట్లు బెంచిరి అందఱు నపుడు
తమ బిడ్డయే యని తల్లిదండ్రులును
ఏకాంగియై విప్రు దేగుచెడనెడను
ప్రేమమీరగ బెంచె పెంపు తోడుతను
పీకతోడుత కృష్ణవేణిని జేరి
ఆడతోడు గలిగె నన్నదమ్ములును
కోరి యా ధరణాలకోట రేవునను

## విరూపాక్షభొట్లు అమరావతివద్ద కృష్ణానదిలో స్నానము చేయబోవుట

ఆరూఢిగా స్నానమాడ దలంచి
అమరావతి వెలసిన అమరేశ్వరుండు
తనతోటి విప్రులు స్నాన మాడగను
బ్రాహ్మణు కనుగాని ఫకఫక నవ్వె
తనకేమి గతిలేదు ధర్మంబు చేయ
అతివృద్ధ విప్రుడై యమరేశ్వరుండు
వారిలో గలియక వంపుకు నరిగి
జతపట్టి పంచాంగ జపమాలపేరు
మరిచాటు నుండిన మడుగులోపలను
శిరమున లింగము చేత విభూతి
తాను దొంగిలి కృష్ణస్నానము జేయు
హరహర యని గంధ మక్షత లంది
మునిజన హృదయుండు ముక్కంటి హరుడు
దేవాలయమునుండి దేవదేవుండు

## అమరలింగేశ్వరుడు విరూపాక్షభొట్లును దానమడుగుట

తా వచ్చి బ్రాహ్మణు దరికి దీవించి
తా బెట్టి గంధము దగిన యక్షతలు
విభూతిని యొసంగి విశ్వనాథుండు
సంకల్పమును జెప్పి సంతోషపఱచి

కొంకక దానము గోరె బ్రాహ్మణుడు
"దొంగచాటుగ నున్న దొడ్డ
మడుగునను
వంగి సాన్నంబాడ వచ్చెను వీరు
గతియు మోక్షము లేదు కడు పేద నేను
ఇతనికి దానమే మిచ్చెద ననుచు
ఇయ్యక పుచ్చుట విహితము గాదు
అయ్య నాకునుగల ఆస్తి జెప్పెదను
బ్రహ్మకమ్మివి రెండు పాతధోవతులు
ఇమ్మంటె యొక్కటి యిచ్చెద మీకు
నీకు నాకొక్కటే నిజము నా మాట
ఒక రూక యియ్యలే నో యయ్య
నేను"
అప్పుడు ధరణి కోటమరేశ్వరుండు :
"వప్పజాలను పాతవల్లె నో యయ్య
దొడ్డవాడను నేను తోలెపు ఈవి
గుడ్డపాతను వల్ల గురుతెరుగ లేవు
కొంగులు మాసిన కునికుట్లబొంత
జంగమునకు వలె సమర్పించెదవ
సాటి గృహస్థును చప్పచేసెదవ
మేటి దానంబిడి మెలగుము కీర్తి
కన్నెదానం బివ్వ కల్గి యుండినను
నన్నుజూచి లేదనకు నమ్మి వచ్చితిని
కద్దు లేదనకుము గ్రక్కున నాకు
ప్రొద్దెక్కె గుడిజేర పోవలె నేను
ఆలస్యమౌ యీవి కూలితో సాటి
గలిగిన లేదంటె గలద పుణ్యంబు"
అడిగిన బ్రాహ్మణు డయ్యను జూచి
"కడు పేదవాడను గతిలేదు నాకు
అయ్య కన్నియదాన మడిగితి విపుడు
యియ్యవలెను గాని యిటు వినవయ్య
వనితలు బిడ్డలు ఒక నెలక్రింద
చనిపోయె మీ పాదసాక్షిగా నపుడు
కడగొట్టు బిడ్డతో కాశికి వెడల
నడవలేకను చిక్కె నట్టడవిలోను
అల్ల కాలయవిట్టయల కొప్పగించి
చెల్లెని వొప్పించి చేరితి నిటకు
బతికెనో హతమయనొ బ్రాహ్మణు
సాక్షి
ఇంతెగాకిక నాకు ఎవ్వరు లేరు"
ఆమాట కమరేశు డతిముద ముంది

## అడవిలో విడచివచ్చిన తన కుమార్తె పార్వతిని విరూపాక్షభొట్లు అమరలింగేశ్వరునకు దానమిచ్చుట

"ఇమ్ము కన్నెను దాన మిహపరం
గలుగును
ఏమని ఇచ్చెదను ఇచ్చితి ననుచు
తామసించక కన్నెధార బోయు"మనె
అమరేశు చేయి క్రిందు అయ్యచేయి
మీదు

క్రమముతో ధార్వోసె కన్నెదానముగ
''అతివె నిచ్చితి'' నని అమరేశ్వరునికి
అతని చేయుంగరం మానవాలిచ్చె
ఈ మహి గలవఱకి కీర్తి నిలుప
అమితము దీవించి అమరేశు డరిగె
నీళ్ళ ధార విడచి నిటలాక్షునకును
అల్లన కాశికి నరిగె విప్రుండు
కాలవిట్టయ ఇంట గడపెడు విప్ర
బాలకు యౌవ్వన ప్రాయంబు వచ్చె
కుచములు క్రిక్కిరిసె కురులు గూడుచును
విచికిలరదనకు విరపండె పిరుదు
రూపురేఖ విలాస రూపంబు జూడ
పాపకు యౌవన ప్రాయంబు నిండె
ఆవేళ ధరణికోటమరేశ్వరుండు

## పార్వతికి యౌవనము ప్రవేశింపగా అమరలింగేశ్వరుడు అర్ధరాత్రివేళ వచ్చి ఆమెను కౌగిలించుకొనుట

ఈవిధం బెఱిగియు నిశివేళ వెడలి
బ్రాహ్మణుసుత తల్లిప్రక్క లోపలను
నిమ్మళంబుగ బాల నిద్ర బోవగను
ఆకాశమునుండి యమరేశ్వరుండు
ఏకాంతమున జేరి యట్టడ్వి దిగెను
కాంతకుచములపై గంధం బలంది
అంతమరేశ్వరు డదృశ్య మాయె
తల్లిప్రక్కలో బిడ్డ త్రుళ్ళిపడెగెసి
కలికి గంధర్వేళ కలవర పడెను
దయ్యమో భూతమో దానవ మహిమొ
అయ్యయ్యో యిదియేమి యపకీర్తి యనుచు
కట్టిన చీర్విడ్చి గంధంబు దుడిచి
అట్టడ్విలోపల నేమనకుండె
ఇమ్మారు ముమ్మారు ఈశ్వరు డొచ్చి
ఆమె కౌగిలిగొనె నమరేశ్వరుండు
చంద్రపూవును గల చంద్రశేఖరుడు
నందెపల్లన గట్టి నాతి చేబట్ట
వనితకు తగు పిన్నవయసు రూపము
కన్నెను మోహించి కదలి తా వచ్చి
అట్టడవిని దిగి ఏకాంతమునను
పుట్టుభోగిని బొంది భూతేశు డరిగె
అమ్మదవతికిని నటు చూబు నిలిచె
నెమ్మది గర్భము నిలచె నెట్లనిన
ఒడలు పలుచబారె వళులు విప్పారె
తెల్లనాయె ముఖము దేహంబు చిక్కె
వడలు పీడగ సాగె వాంఛలు మీరె
చేడె చిక్కినదాది చిరుతిండి గోరె
కోరి వేడుక పులుసు కోరును తఱుచు
కారము తిననోడు కాంత ప్రొద్దుటిని

చద్దిని కుడువదు సఖియ వాకొల్పు చేదె నడ్చిన కాళు చేతులు తీపు
మందమాయెను నడమన్ను రుచాయె అడకాడకు నిదుర అగ్గలం బాయె
నెలతకు పైకొంగు నిలవక జారు వడవడలై కాళ్లు వదలించు చుండె
పలు చమటలు బుట్టె ప్రబలె గర్భంబు పిడచకట్టె నడుము పిండంబు మెదిలె
రొమ్మునందు గలిసి రోజెక్కువాయె సుకుమారి బిడ్డిట్లు స్రుక్కంగ జూచి
ఇమ్మయి కడుపును వికసించె నాభి

## గర్భవతియైన పార్వతిని తల్లి గర్భ మెటులయ్యెనని ప్రశ్నించుట

ఒకనాడు తల్లి తా వయ్యన బలికె దగ్గుత్తికను బొంది తలవంచి పాప
"నమ్మితి కూతురా! నాకు దాచకుమి మారుమాటాడక మరిమరి యేడ్చి
అమ్మరమరలేని ఆడబిడ్డనుచు పార్వతేమనకను పాప వూరుకొనె
దాచక చెప్పుము తల్లి యీ గుట్టు అడలుచు నోరెత్తి ఆబిడ్డ జూచి
దాచితివై నను తప్పు చేసితివి ఆడిక లని తల్లి అనుమానపడియు
నలుసముద్రము చట్టు నాసుతుల్ వార్త "పసిబిడ్డ వనుకొంటి బ్రాహ్మణపిల్ల
కాలయముడు వెఱ్ఱు కాలవిట్టులకు" ఒసుకంత సందివ్వ విక నేమి సేతు
పోతురాజాదిగ భూతసంఘములు తెలిపి జెప్పుమనిన తెరువందదాయె
పోతుటీగై నను పొలయంగ వెఱచు కాలయ విట్టయ ఖర్మలా జెపుము"
తల్లి నీమేలుకు దాచకు మనుచు వనములకును బోయి వచ్చిన దనుక
కాలవిట్టులు వింటె కాయరు నిన్ను" వనిత తెరువును జూచి వలపోయసాగె
తల్లి యడుగ బిడ్డ తల వొంచుకొనియు అంతట వేటాడి యన్నదమ్ములును
జలజల కన్నులజారగ నీళ్లు పంతముల్ పల్కుచు వచ్చియు వారు
సిగ్గున భయమున జిన్నబోవుచును తల్లికి కొడుకులు దండంబు పెట్టి

## అడవిలో వేటాడి వచ్చి నమస్కరించిన కొడుకులగు కాలయ్య విట్టయ్యలను తల్లి దీవించకుండుట

తల్లి దీవించక దరికొని మండె
"తల్లినటర నేను తనయులా మీరు?
కూళకర్మలు మీరు కొడుకులా
నాకు?
తగ పాపకర్మలు తల్లిదండ్రులున
తగవు దప్పినవారికి ధర్మ మెక్కడిది
చూచితి మీ గుణము చూడజాలనుర
చూచిన పాపము చుట్టును మెడను"
కన్నతల్లి పలుక కాలవిట్టయలు
మిన్ను విఱిగి వచ్చి మీదబడ్డట్టు
"కటకట నీవు మా కన్నతల్లివిగ
ఇటువంటి మాటలు ఎట్లాడితీవు
ఏమి పాపము జేసి తేమి తప్పిదము
సామిద్రోహుల మని సారెకాడెదవు
అనుమాన మేమి? మా అవగుణ
మేమి?
అనుమాన మాటలు ఆడకు చెపుమ"
తల్లి కుమాళ్ళతో దరికొని బలికె:

## పార్వతికి గర్భ మెటులయ్యెనని తల్లి కుమారుల నడుగుట

"కాలవిట్టయ పాపకాలముగాక
బాల నొప్పించుచు బ్రాహ్మ డేమనెను?
చెల్లెలటంచును చెప్పడా మీకు
కల్లలాడియు మీరు చెల్లెలన్నారు
అన్నలు యెవ్వరు ఆడబిడ్డెవరు
కానలో మనుజుల కానమెన్నడును
ఈ గర్భము నిలిచె నింతికి నెటుల
తా గన్నచెల్లె గాదని తలంచితిరొ?
కనకము జూచిన కన్నెను జూడ
మనసు నిల్పగరాదు మాట
లేమిటికి?
నీ తమ్ముడో గాక నీవు గావలెను
ఘాతకు నుదుటకన్నుగలవాడు రాడు"
తనతల్లి ఆడెడి తగని మాటలకు
గొనకొని నిప్పుల గుండమై మండె
"చెల్లెలు మాకగు చెడ్డమాటనకు
కల్లలే నీకల్ల కట్టకు తల్లి
ఆ కాంతకును నేను అన్నను అపుట

ఆకాశవాణి ఎరుగు అన్నెపుణ్యములు
ఇది నమ్మకుంటేను వినమమ్మ తల్లి
సౌదబెట్టి అగ్గిలో చొరమన్న జొత్తు
మది కల్లలేదని మంట బట్టేను
ఏది ప్రమాణంబైన ఇచ్చేము తల్లి
అమ్మరో మామాట కనుమానపడకు
తమ్ముడు విట్టయ ధర్మాత్ము డౌను
ఈ కర్మ మతనిదో యేనెఱుగ తల్లి
కాకెట్లు పాపము గలిగెనో యేమొ
అనుమాన మొల"దని ఆయుధము
ముట్టె
తనయుడు ఇట్లన తల్లి విట్టయను
"బుద్ధి చాలని కొడుక పుట్టె నీవలన
పెద్దవాడిట్టు ప్రమాణము జేసె
వీడు దప్పెవ్వడు వింధ్యాద్రిలోను
గూడును బాలను ? గుణహీను
డితడు"
ఆమాట విట్టయ్య కలుగులై తాకె
కుమ్మరావమువలె కుములుచు పలికె
"నాతోడు ఆ బాల నీతోడు తల్లి
నీతి యెరుగని మాట నీవాడెదేల ?
నాతల్లి నీమారు నమ్ము నామాట
కాలుని వల్లను కలిగెనో యెఱుగ
చెల్లె"ని ప్రమాణము చేసె విట్టయ్య
తమ్ముని మాటకు తలవంచుకొనెను
క్రమ్మ కన్నుల నీళ్లు కటకటా
యనుచు
"తమ్ముడా వుండరా ధర్ముడ వీవు
నమ్మవు నన్ను నే నమ్మను నిన్ను
యీటె వింట్లు కటార్లు వెడలంగ
దూసి
వాడైన మనచేతి వజ్రాయుధాలు
వీపు ఆయుధాలు వెళ్ళినగాని
పాపంబు బాయదు పాపడా మనకు"
అవును పోట్లాడుదా మనుచు
వారలును

## కాలయ్య విట్టయ్యలు యుద్ధ సన్నద్ధులగుట

ఆవేళ వీరజడ లల్లించుకొనిరి
అన్నదమ్ములు పొత్తునన్నము గుడిచి
అన్నకు విట్టయ్య అలిదె గంధంబు
తమ్మునికి కాలయ్య తగ గంధమలదె
తమ్ముడు విట్టయ్య తానిచ్చె విడెము
విట్టయ్యకన్న దా వీడియ మొసగి
చెట్టపట్టక వారు చేరగ జనియు
యుద్ధరంగంబున నిద్దరు నిలచి
పెద్దకటార్లతో పేరెము జాచి
"అన్న పొడవర నా ఆయంబు జూచి"

"చిన్నపు పొదవర చేరి సన్నిపుడు"
వారి పోట్లాటకు వారల తల్లి
"ఎరుగకాడితి మాట యెరుగక చేటు
ఎఱుగకనిన మాట యెగ్గటర కొడుక
వృద్ధుల మమ్ముల విడువగ నేల,
ముదుసళ్ళ చంపుడు ముందుగా మీరు
మమ్ము పోషించను మరియెవరుండె?
బ్రాహ్మణు డెటనుండి బాలసు దెచ్చె?
పల్లెపట్నము గాదు బ్రాహ్మడు రాను
వల్లగాదన నిట వడి దించి పోయె"
కొడుకుల పరిణాము గొబ్బున జూచి
"పడుదుము అగ్నిలో ప్రాణాలు
విడువ
వసితెను ఇచటకు వత్తుక వచ్చి
ప్రాణాలు గుత్తగ బ్రాహ్మడు
గొనియె
ఆడపడుచు దెచ్చి హతము చేయించె
ఊడె ఊతగు కొల ఓ కొడుకులార"
ముసలిది మొగునితో
మొర్రొమొర్రనుచు
దెసవచ్చె మనకిక దిక్కెవ్వరనుచు
వాపోవ ముసలాడు వడివడి లేచి
ముప్పిరి కోపాన ముప్పిడి తూసి
"వలదు ముసలిదాన వలదన వినవు,
పులిపిరివలె బలిసి పుణ్యమటంచు
నాపుత్రి నా బిడ్డ నాతల్లి యనుచు
నీ పలుకెటులయ్యె?" నెత్తిన గొట్ట

## అన్నలిద్దఱు యుద్ధసన్నద్ధులు కాగా పార్వతి యేడ్చుచు దొంగను పట్టియిత్తుననుట

బ్రాహ్మణసుత వారి పలుకులు జూచి
అమ్మమ్మ వద్దను అన్నల విపుడు
గడ్డము బట్టుక కన్నీళ్ళు దుడిచి
గడగడ వణకుచు గారాబుబిడ్డ
"వద్దను అన్నల వచ్చేటివాని
ప్రొద్దున బట్టిత్తు పోట్లాట యేల
కాయుడు దొంగను కనుగల్గి మీరు
పాయక యుండుడు పట్టిత్తు"ననెను
పోరు వద్దని వారికి పూనిక జెప్పె
వారు మంచిదనుచు వీరస ముడిగి
పఱల కత్తుల పైచి వారి ఖడ్గముల
తరువుల జేర్చియు తాముండి రంత

విండ్లు ఎక్కిౘడియును, ఏపెలు ఎక్కి
కండ్ల నిద్దురలేక, కాకి గుర్రన్న
విండ్ల నేతామని పీరస ముండె
అర్ధరాతిరి వేళ నమరేశ్వరుండు
నందిపల్లన గట్టి నాతిని గూడ
విట్టయ కాలయ వింధ్యాద్రి కొచ్చి
నట్టడివిపై దిగె నట లింగమూర్తి
పరమేశ్వరుండును బ్రాహ్మణకన్నె
విరుల పానుపుమీద ఇద్దరు వుండి
మూడు ఝాములదాక ముచ్చటలాడి
ఆడ తరలిపోవ అమరేశు జూచి
విభుని కొంగును చేత విడువక బట్టి

## పార్వతి అమరలింగేశ్వరుని చెరగును బట్టుకొని నీవెవరవని అడుగుట

ఆ బాల ఆడలుచు అమరేశు కనియె
"నీకెట్లు గర్భము నిల్చెనటంచు
నాకొరకు తెగటార నాయన్నలుండె
యిక్కడికిని స్వామి వేంచేయగాను
వుక్కుటల్లుల మీద వారుగనున్నారు
కొడుకులు పోట్లాడి కూలిన వెనుక
విడుతురు ప్రాణాలు వృద్ధులు వారు
అన్నలు ముదుసళ్ళు హతమైన వెనుక
తన ప్రాణము నీకు ధారబోసెదను
ఇందర్ని చంపగ హింస మీకేల ?
ఎందుండి వచ్చితి వేల స్త్రీహత్య
నీపేరు ఏమిటి ? నీకులం బేమి ?
చెప్పక దాచిన చెల్లుదు నేను'
అతివమాటలకును అమరేశ్వరుండు
కాంత కౌగిట జేర్చి కలకల నవ్వి
కొమ్మరో ధరణాలకోట లోపలను
నెమ్మది నెలకొన్న నీలకంఠుండ
నెలతరో నీకును నింద బాపుదును
వినుము మీ తండ్రియౌ
విరూపాక్షభొట్లు
ధరణాలకోట కృష్ణ స్నానమాడ
దేవ బ్రాహ్మణుడనై దేవళం వెడలి
దీవించితిని వాని దీర్ఘాయు వనుచు
సంకల్పమును జెప్పి సంతోషపడచి
సంకట పడక చేచాపి యర్థించి
ధర్మమెఱిగి కన్నెదాన మడిగితిని
అమ్మయు నల్గురు ఆడబిడ్డలతొ
పాటుకై రామాంజ కూటము నుండ
పెద్దామెతో గూడ బిడ్డలు మువురు
విధికాల మటు మూడి వే చనిపోగ
కడసారి బిడ్డతో కదలి దేశాలు
అడవి కాలయవిట్టయలు వున్నచోట

# పార్వతి అన్నలతో అమరలింగేశ్వరుడు చెప్పిన మాటలు చెప్పుట

"అన్నలారా మీరలుగక వినుడు
ఎన్న ధరణికోట వెలసిన హరుడు
అమరేశ్వరుండు మా అయ్యట
తనకు
ధర్మాత్ముడై కన్నెదాన మిచ్చెనట
నాతండ్రి చేతిది నందులుంగరము
ఆతని గుఱుతు చెప్పి ఆనవాలిచ్చె
ఉడుగక తెల్లార మూడు ఘడియలకు
కడు చక్కనౌ మూడు కన్నుల
కొడుకు
పుడమి నేలంగను పుట్టనని చెప్పె
వెడవెడ జెప్పెను ఇక మీకు గుఱుతు
అన్నలారా మన ఆడకూనకును
కనునట పోతులేకను ఏడుకూన్ల
అని చెప్పి తనపేరు అమరేశు డనెను
చనె తన గృహముకు
సర్వేశ్వరుండు"
విట్టయ్య కాలయ్య వికవిక నవ్వి
కట్టా యికను మూడు ఘడియలు ఎంత
తటపటలై యుండి తరుణి మాటలకు
అటు మాటలు రెండు ఇట గుర్తుకానా
అనుకొన తూర్పున అటు తెల్లవాటె
మొనసి సూర్యుడు బొడ్చె మూడు
ఘడియలకు
నొగులుచు యాకాంత నొప్పులు
బడెను
దగకుట్టు బొరసియు తరుణి వీళ్ళాడె
కన్నులు మూడును కంఠంబు నలుపు
కన్నెకు ముక్కంటి కాలుండు పుట్టె
అనుమానము లేక ఆడకూసకును
గునగున నడచెడి కూనలు బుట్టె
ఆశ్చర్యమందిరి అన్నదమ్ములును
భూషించి చెల్లెల్ని పొగడంగసాగె
పురుడు పుణ్యముదీర్చి పొలతి
వేడుకను
తరుణి తల్లిదండ్రులకు దండంబు
బెట్టె
కరము లెత్తియు మ్రొక్కె
కాలవిట్టులకు
అరుదుగా సోదరి నాశీర్వదించె
"అన్నలారా పెంచి నా రుణము
బాయ
పిన్నబాలుని పేరు పెట్టుడు మీది"
"హరుని కుమారుడు అవుగద యితడు

పెంచుము మా పేరు పెట్టుమ'' మనిరి
''హరుని పేరును ముందు ఆపల మీద
ఇఱువొంద బెట్టెద వినుమన్నలార''
ముక్కంటి కాల్వెట్టు ముగ్గురి పేరు
మక్కువ బెట్టియు మరి పిల్చె తల్లి
అంత కాలయ విట్టయలా సంతసించి
అతిగారాబమున నల్లుని పెంచి
అరచేతి పువ్వువలె అమరేశ సుతుని
మరి తొమ్మిదేడులు మామలు పెంచి
పోతురేకను పుట్టు పులి వాల్ల కూస్లు
ఘాతలించి పెంచగి పులులతో పోరు

## బాలుడగు ముక్కంటి తన మేనమామలతో వేటకు పోవుట

కడు మంచిమూర్తాన కాలవిట్టయలు
అడవి వేటలు నాడ ఆయత్తపడిరి
మామల కనుగొని మరియు
ముక్కంటి
''ఓ మామ మీ వెంట వచ్చెద నేను''
వచ్చెద నల్లుని వద్దు వద్దనిరి
''పచ్చి తేనెలు మంచి పండ్లు
ఫలములు
తెచ్చేము మా తండ్రి దేవుడ నీవు
మచ్చిక జేసిన మనవి వినకున్న
అక్కడ కొండగుట్టలు యెక్కలేవు
ఉండుడు'' మన నుండకుటికె
ముక్కంటి
గండుకూనలు వెంట కదిసి రాగాను
అటువెన్క మామలు అల్లుడు ముందు
పుటమెగసి ముక్కంటి పులులను
బాయుచు
మెకముల మసుబోతుల మేదిని
గూల్చు
కకవికలై పొదల గల జంతువులను
జాగిలంబులచేత చాల పట్టించు
మృగముల జంపగ ముచ్చట జూచి
ఘనమైన యడవిని కానలలోన
మునుకొని వేటాడ ముందఱ బోవ
నవుచు భళాయని నా తండ్రి
యనుచు
సవరైన నెల్లివృక్షము కడ కేగ
శిల పానువట్టము శివుడు తా వెలసి
కల మృగములు పక్షిగణము
శంకరుని
ఇచ్చగా పూజించు నిది యది
యనక
అచ్చట మాచన్న యనెడి కుందేలు
పూజింపుచుండెను పూర్వమునుండి

రా జంగము పావము తడుపుక
వచ్చి
గడ్డిపోచలు పచ్చి గరిక
కొరుకుకొని
కూడ దెచ్చుచు వచ్చి కుందేలు
ఎపుడు
దడయక పూజించి దండంబు పెట్టు
పడి సాగి మ్రొక్కియు ప్రార్థన
జేయు
"నమ్మినాను శివుడ నందివాహనుడ
నమ్మ్రితి కృప వుంచు నామీద"
ననుచు
కుందేలు అటుపోవ కొంత సేపటికి
మదగజం బొక్కటి
మసిలాడుకొనుచు
తొండాన నీళ్ళతో తూలాడుకొనుచు
కొండనుండియు వచ్చు కోరి పూజించ
పత్రిపుష్పములను పదిలాన గొంచు
మత్తేభ మొచ్చెను మరి శివుకడకు
కుడిచెయ్యి లోగాను గొబ్బున దిరిగి
పొడగనె కుందేలు పూజలు తాను
ఎడమకాలను దుడ్చి యేనుగు
అపుడు
తొండముదకము
కుంభద్రోణముగాను
శంభునిపై చల్లి జలకంబు జేసి
పంచిన భక్తిని మారేడుపత్రి

కరివైచి మ్రొక్కియు దపలె
వనముకు
కరి యిటు పూజించ గని
యీసడించి
తటుకున కుందేలు తా వచ్చి
మ్రొక్కి
కటాకటా శంభుడ కటకట యీశ !
కటకట శంకర ! కానక నిన్ను
ఇటుల పూజించితి నెఱుగక నిన్ను
గంగాధరా నిన్ను కని పూజ సేయ
ఎంగిలి గాకుండ యెద జేర్చి గరిక
పూజించితిని నిన్ను పూనిన భక్తి
కుంజరంబది నేను కుందేలు గనుక
గజము నాపూజను కాలను దన్ని
యెంగిలి నీళ్ళది యెగ్గొనరించె
తగ్గుజీవము నని తా దలచిటుల
నిస్సార మైతిని నిన్ను పూజించి
యుస్సిరో" యని దూర విని హరుడు
నవ్వి
నందివాహనుడనె నా చాటునుండి .
"ఇందొచ్చు గజమును వెఱువక
నీవు
తోడనే కరువుము తొండంబు బట్టి
వీడక 'యా స్వామి వెనుకను నుండి
వేమరి కరి రాగ వెరక కుందేలు
సొమజతొండము చయ్యన గఱిచె
పెడి పెనుకను నేగి వేయుచు ఫీక

పరుగిడె నేనుగు పిఱికి పాఱుచును
కోపాన కుందేలు కూడ వెళ్ళియును
ఏపున గజమును వెనుకని కరువ
బెగ్గిలి యేనుగు బెదరి పాఱగను
తగ్గక యేనుగును తఱిమె కుందేలు
చెవులపోతుకు వెఱచి చెడి పాఱిపోవ
కవకవ ముక్కంటికాలుడు నవ్వి
కాలయ్య విట్టయ్య కంటిరా మామ
అల్ల కుందేలెంత ఆ గజం బెంత
తగవేది దీనిని తరుముచు నుండె
జాగిలాల్ విడిచియు చంపింతు"
అనుచు
వేగంబె గొలుసులు విడిపించ నపుడు
వేగ కుక్కలు గవిసి వెనుకొని
తఱుమ
కుక్కల కికురపఱిచి కుందేలు వచ్చి
అక్కడ నపుడేరి పడపడుచును
పురహరు నిన్ను పూజిస్తి నమ్మి
వెఱుగక ప్రాణికి వెనతిరుగొంటి
తానెటు బో "వని తల్లడపడగ
పూనియు నపుడు రా పుట్ట కల్పించి
పుట్టలో చొరుమని భూతేశ్వరుండు
పుట్టలో చొచ్చియు పోయె కుందేలు
వెనుతగిలి ముక్కంటి వెంటనే వచ్చి
పోనిత్తునా చెవులపోరు నిన్ననుచు
తవ్వియు నెల్లి నడికె దవ్వనము దీసి
సిద్ధము పాస్పటము శిలకడ బెట్టి
పుట్టతవ్వ నేకపోయె కుందేలు
గొట్టు తవ్వగ యేడు కొప్పెర్ల
ధనము
వింతగా కన్పించి వెలుగు రేగుచును
అంతట చాలించి అతివేగమునను

## ముక్కంటి, దేవాలయమును నెల్లూరు పట్టణమును గట్టించుట

మక్కువ ధనమును మామలు దీయ
మ్రొక్కియు శిలకును ముక్కంటి
యపుడు
శిల పానవట్టము చేతుల బట్టి
మూలధన స్థానమున దేవుని నిలిపె
కడువేగ ముక్కంటి కట్టించి గుడిని
ఏడు శివస్థలా లేర్పాటు జేసి
కోటలు పేటలు కొమరొప్ప గట్టి
వాటమౌ వాకిళ్ళు పంకదారులును
సత్రమ్ము శాలలు చాల గట్టించి

కొత్తళంబులు కొల్వుకూటముల్
మరియు
ఎన్నిక చెఱువులు వెలయ బావులును
క్రొన్నన చెంగల్వకొలనులు మరియు
సంపెంగ వనములు సరస కోనేర్లు
సొంపు మీరిన సూర్యసోమ
వీథులను
నెల్లివృక్షము పేర నెల్లూర గట్టి
పాలించు ముక్కంటి పరులు
బెగ్గిల్ల
సురరాజు బోలిన శూరులు గలరు
కరిఘటంబులు అశ్వ కాల్బలముండె
లంకకు యీడైన లాగు నెల్లూరు
శంక గొల్పెడి యబ్ధి సాటగు పెన్న
అందున్న వస్తువు లవలేట లేవు
ఇందుశేఖరు పూజ లెల్లపుడు జరుగు
ముక్కంటికాలుండు మునుముందు
నుండి
యిక్కరణి నెల్లూరు నేలుచు నుండు
అతని జనన మిది యమరేశుసుతుడు
నీతికి ముక్కంటి నీయంతవాడు
అవు''నన చోడాణి యనెను నవ్వుచును
"భువనంబులో దొడ్డపుట్టుక తనది
అమరేశుసుతుడు తానైతె నౌగాక
దోమ మాత్రము వాడు దొడ్డట నాకు
వెర్రి సుమంతుడ వెఱపు జెప్పితివి
జెట్టికి త్రాచుకు జన్మించినాడు
ముక్కంటి అననెంత ముచ్చటదెంత
త్రొక్కెద కన్నులు తొాబకలుగాను

## చోడాని ముక్కంటిని మూడవకన్ను పోవునటుల త్రొక్కుట

భగ్గు భగ్గున మండి దిగ్గున లేచి
అగ్గనాల్ భావి నీరాడి స్నానంబు
భద్రాక్ష రుద్రాక్ష భస్మాంగ మలది
రుద్రుని పూజించె రుద్రుని బోలి
కావేటి కట్టపై కన్నులు వ్రాసి
అవియన్ని ద్రొక్కితే అంధుడౌ
నను చు
వాని నుదుటికన్ను వ్రక్కలు గాను
పూని బొటనవ్రేల వురువడి ద్రొక్కె
ఇక్కడ ద్రొక్కిన ఈశ్వరు మహిమ
ఫక్కున గుడ్డూడిపడెను ముక్కంటికి
కన్నుబో ముక్కంటి కాలుండు దడిసి
తనమీద చోడాని దయగలవాడు
ఎంత పుణ్యాత్ముండు ఎంతవాడతడు

ఇంత దయగలవాడు ఇలలోన లేడు
పోరుచే నొకకన్ను పోద్రొక్కె గాని
కారుడ్డమున మూడు కన్నులు ద్రొక్కె
దిక్కెది ఇత డాదిదేవుడు గాక
చక్కగ నే బోయి శరణు వేడెదను
గుడ్డు బడినచోట గుట్లూరు గట్టి
గందము గతిపెడు కరకంప దనుచు

## ముక్కంటి భయపడి సైన్యసమేతముగా చోడానిని శరణు వేడుట-చోడాని ముక్కంటికి సర్వాధిపత్య మొసంగుట

కొలుచువారును తాను కోటానకోట్లు
కలియుగ చోడాని కడకు నేతెంచె
అల్లుడుగా ముక్కంటి యన్నపుడు
లేచి
వెళ్ళెను చోడాణి యెదురు వానికిని
కౌగలించుక కొన్ని కట్నాలు యిచ్చి
తగురీతి మన్ననల్ దశుపుచు
ననియె
,‘వచ్చె ముక్కంటను వాసియె చాలు
ఇచ్చట దొడ్డగ ఈశ్వరతనయ
పట్టణమునకు పారుపత్యము నీకు
గట్టితిచ్చట వెట్టి కడసాగ జూడు
అవునన కాదన అడ్డము లేక
సర్వాధిపత్యము స్వామి సాక్షిగను
తన శిఖావుంగరం తాళబీగాలు
నేనె నీ” వని తాను నేర్పులు బలికె
కలియుగ చోళుడు ముక్కంటి
కాలుండు
చెలిమినుండియు వెట్టి చేయించుకొనుచు
ఒకనాడు చోడాని ఒనర కొల్వుండి
ముక్కంటి సుతుతోను ముచ్చటలాడ
“రావోయి ముక్కంటిరాజువు నీవు
కావేరు కట్టడ కడముట్టదాయె
కావేరు కట్టడ కడముట్టెనంటె
అవని ధన్యాత్ముడ” ననెను చోడాని
“వెలిచి పక్షులు పశ్వు వెట్టిజేసె మును
వెఱువ కెవ్వడు నీదు
హృదయమునున్న
త్వరగ చెప్పుము దాని దాచగ నాకు
మరుగుబెట్టక చెప్పు”మని మరి
యడిగె

## జంగాల చాటువ

అడిగిన ముక్కంటి అయ్య
లెస్సనుచు
"చోడాని వారున్న చోటు చెప్పెదను
శివలింగయోగికి శీలాంబికకును
భువి నైదుగురు పుట్టె పుత్రులుగాను
గౌరిమనోహరుడు గంగాధరుండు
విరుపాక్ష శంకర విశ్వనాథుండు
చెరుకూరు యేలుచు క్షేమాన నుండె
మరువక శివపూజమంతులు వారు
యేగురు కొమారులు
వినియమార్చనులు
భోగనందులు వారు పుడమి లోపలను
'ఏనూరు కుటుంబాలు వెలయు
జంగములు
ఏను శీలామంతు లిచటికి వచ్చి
తట్టల చుట్టల్గు తమ జడల్ చుట్టి
గట్టిగా లింగాలు కదులాడ గాను
మొయ్యజాలక మన్ను మోయ
జంగాలు
అయ్య శీలామంతుల ఆపదచూచి
ఘడియలో కావేరి కట్టుపడేను"
చోడాని ముక్కంటి జూచి యిట్లనియె
పంపు శీలామంతుల పట్టి తెమ్మంచు
పంపుమటంచును పల్కె చోడాని

## కావేరిపెట్టికి చెరుకువాడ జంగాలను పట్టుకురమ్మని ముక్కంటి పట్టెమ మురహరునికి సెలవిచ్చుట

ముక్కంటి పట్టెమ మురహరు బిలచి
"చక్కంగ చెరుకూరు సక్రిపొద్దు
పోయి
ఏనూరు కుటుంబాలు వెలయు
జంగాలు
ఏను శీలామంతు లెవ్వని విడక
పెట్టికి రమ్మని వేగంబె జీరి
పట్టుక రాబోయి పారిపోకుండ"
చూపులవారి నంపె జునిగి పోకుండ
మాపున మురహరుడు మందితో
వచ్చి
మఠముల వారిని మందిరము వార్ని
పట్టుగ బట్టుక బాధలు పెట్టి
కొంగులు ముడివేసి కొట్టి తిట్టుచును

మూగజంగాల్ జడల్ ముళ్ళు
వేయించి
శివశివ యనగాను చేతులు గట్టి
తీవ్రమె పదుదన తెప్పరిరి వారు
జడలు వీడక యటు జరిగేటివారు
సడి చప్పుడు గాకుండ సర్దుకొన్నారు
దేవపూజ విడచి దెసపడువారు
కావిబొంతలు విడిచి కంతలు దూటి
అడలుచు శంఖులు నటునిటు వైచి
పిడిగంట లటువైచి బిమ్మరవోయి
వర సందుగొందులు వదిగేటివారు
వీరసంబడి లింగముల జారవైచి
కప్పెర లటువైచి కల్వరపడుచు
చప్పుడు గాకుండ చనెడి వారలును
పసిడికాలు మువ్వలు పారంగ వైచి
ముసిగొను దుఃఖమున మునిగెడివారు
రతనంపు కోలలు రజిత పొన్నులవి
వంతల చెంతల వదలెడివారు
చంద్రవంక పరశుచక్రాలు విడిచి
నందివాహను దలచి యదలేటివారు
పావుకోళ్లు విడిచి పారిపోలేక
శివు దలిచి మొరపెట్టి చింతిల్లు వారు
గొరిజెత్రాలును గజహాలములోప
అరల లోపలంజెట్టి అదరేటివారు
కషపాలలు విడిచి కంపరపడుచు
అచట పుట్టుభోగు లరహర యనుచు
తావకా అటువైచి తల్లడ పడుచు
త్రోపలు గానక దొంటికి రందలను
ఒకరిని పోనివ్వక ఉరిపట్టుకొని
అక్కడ నొక దొడ్డి నందలు నుంచి
అందు శీలామంతు లైదుగు రచట
ముందట నుంచియు హరహరు దనియె
"అయ్యలారా ! మీర లాలశ్యమేల
ఇయ్యెడ వెట్టికి వేంచేయు"దనెను
''దెసవచ్చి చోడాని తెమ్మన్న
యపుడు
ఇసుమంత సేపును యుండుండ నివ్వ"
పట్టెము మురహారుడు పదుదన్న
యపుడు
అట్టి శీలామంతు లతనితోననిరి :
"అయ్య మా మనవిని ఆలకించియును
దయయుంచి యీ దేర్పు తగదనకంటె

## శీలామంతులు పట్టెము మురహారునితో 'ఈరాత్రి భోజనము చేసి పరుండుడు. ఉదయము వెళ్లుద'మని చెప్పుట

రాజు రమ్మన్నపుడు రాకపోరాదు
భోజనం భోంచేసి పోదాముగాని
విను" మని చెప్పియు విడుదు లేర్ప
ఱచి

అన్నపు: అమృతము అమితము జేసి
లక్షణ భోజన లంచంబు బెట్ట
అక్కడ భోంచేసి హరుషము నొంది
అలసి నిద్రలుబోవ అయ్య లందఱును
తల్లి శీలాంబకు దండంబు బెట్టి
"నీ కడుపున బుట్టి నేటి వరకును
ఈ కరణి యాపద నెఱుగము తల్లి
ఎండకన్నులు జూచి యెఱుగని మేము
చోడాణి బాధలు చొఱలేము తల్లి
ఏగురం చెరుకూరు ఏలితి మిటను
భోగులం వెట్టికి పోలేము తల్లి
అరకాల వెంద్రుక లమరెను చూడ
ఎఱువు తట్టలు మోయ నెఱుగము తల్లి
చిగురు టాకుల వంటి చేతులు గలిగి
తగ గడ్డపాఱల త్రవ్వంగలేము
ఓ యమ్మ యీ ప్రాణమొల్లము ఇపుడు
పోయు విషము త్రాగి పొలయుద మమ్మ
చక్రాల కొంచెఱ శిరసులు దునిమి
వుక్కు శూలములతో నుక్కణగించి
గండ్రగొడ్డట శిరసు ఖండించు
కొందుము
గుండెలు దీసియు గురువు పూజింతుము
కొందఱము నీళ్లలో కూలియు మేము
అందఱము లింగము లౌదుము తల్లి"
తలపోసి యడలగ తల్లి కొడుకులును
వలనొప్పగా చెరుకువాడ లోపలను
కలకలధ్వని పైడికంటులు రెండు
పలికి పరిణామము పక్షులూరుకొనె.
ఆ పక్షిపలుకు శీలాంబిక వినియు
ఆపదపడి సుతుల్ అడలినఁదులకు
"వలురాజు పుత్రుండు వర
గుణాఢ్యుండు
పోత్రాజు శివదేవు పూజాపరుండు
ఎంత ఆపదనైన వెనుక వేసుకొని
పంతంబుచే బ్రోచు భక్తిగల రాజు
భక్తుల వడియల భక్తిని బ్రోచు
ముక్తి నర్థించి తా ముక్కంటి
గొలుచు
మఱుగు జూచ్చిన వారిని మళ్లి బట్టిడు
శరణాగత త్రాణ సామర్థ్య డతడు
శీలము చెడకుండ చెలగి రక్షించు
ఆలస్య మేటికి అయ్యలార పదుడి

## పోలురాజును శరణు వేడుడని శీలాంబ తన కొడుకులకు చెప్పుట

నిండిన కాపురాల్ నిధనముల్ విడిచి
పండిన చేల్పాడి పశువుల వీడి
ధనధాన్యముల్ విడిచి తావులు విడిచి
పిన్నలు పెద్దలు బిడ్డ తల్లులును

దోవిడి చేతులు దోవలు పట్టి
శివునికి మొరచెప్పి చెడి విరిగిపోయింది
ఏనూరు కుటుంబాలు వెలయు
జంగములు
ఏను శీలామంతు లెలమి భార్యలతో
కనరాని చీకటి కానలు బట్టి
చన బసవన్న రంకె చయ్యన వైచె
బసవన్న రంకెకు భక్తు లందఱును
వెస చెరుకూరుకు నేగె తెల్లార
చెరుకూరు పడమట చిలకలమ్రి
పత్రి క్రింప గుడార్లు మరి యుండు
పెరిగి
పంచనందుల దేర పట్టిభద్రుండు
నెంచంగ పోత్రాజు నిదురింపగాను
గుడహోర్గ యిరుమేర
కూడిరయ్యలును
ఒటి పూదె శంఖులు వురిమిన యట్లు

## జంగాలు పోలురాజుమరుగు జేర వెళ్లుట

పిడిగంటనాదులు పిడుగులు బోలు
ఎడలేని నాదులకు యాదవుల్ లేచె
రంతులు విని పోలురాజు తా లేచి
'అల్లుడా! పల్లెకొండా? గత
మెఱుగు
కైలాసమున నుండి కరకంతు
డిపుడు
పర్వతాల మల్లప్ప పనిబడి చూడ
సర్వత్ర వచ్చెనో శంఖు మ్రోతేమి?
అల్లుడ శ్రీహరి వైపు ట్టినపుడు
పల్లెకొండా! మంద పర్వతం బాయె
ఉల్లమున సంతోష ముబ్బుచు నుండె
చల్లనయ్యల నిట సభకు దెండ''న్న
మందలింపుకు తిరుమందులు లేచి
అందఱు అయగాండ్ల ఆపద జూచి
జడలు తూలాడంగ జంగాల దెచ్చి
పొడగాంచ దీవించె పోత్రాజు నపుడు
పోలురాజును జూచి పొగడి
యందఱును
శీలమంతు లడలి చెప్పుచున్నారు
''శివభక్త ! పోత్రాజ ! శరణు
జొచ్చితిమి
అవిధిపడి వస్తిమి యాదవరాజ
పాపపు చోడాని పట్టె వెట్టికిని
ఆపద బాపయ్య ఆదరించియును
మా మొర ఆలించు మమ్ము
మన్నించు
భూమి చెప్పంగల పుణ్యంబు నిలుపు
శీలమంతులు ముందు స్త్రీలు తెరచాటు
బాలలందఱు నడ్డపట్టు పట్టుకొని

పల్లవ పోల్రాజ వాహిని నిలుపు
తల్లుల బిడ్డల తమను ఈడేర్చు
గండము గడుపుము కడు మేలు రాజ
మండలపతి మీదు మఱుగు
జొచ్చితిమి"
శిశువులు బాలలు శీలమంతులును
పసిబిడ్డతల్లులు ప్రలపింపగాను
అయగాండ్లు ఇటువలె ఆపదపడగ
భయపడి చోడాణి బాధలు చెప్ప
బాలల ఆపద పణతు లాపదలు
శీలమంతుల బాధ చిత్తాన దెలిసి

## పోలురాజు జంగాలకు అభయ మిచ్చుట

"వెఱవకు డయ్యలార వెఱపుమీకేల
స్థిరబుద్ధి నమ్ముడు చింతిల్ల వలదు
భారంబు లేదేమి బాధలు లేవు
శరణన్న గాచితి చేపట్టినాను"
తలమీద చెయిబెట్టి తలకకు డనుచు
పలుపలు రీతుల బాధలు మఱువ
జంగము నాపాలి సర్వేశ్వరుండు
జంగము నాపాలి సత్యంబటంచు
వడియలు నాపాలి పటువలింగములు
వడియలు వెఱవంగ వలపదటంచు
శంకరు నానను శంకేమి లేదు
బొంకను నమ్ముడు పురహరునాన
అలసి వచ్చినయట్టి అయ్య లందరికి
వెలయ గుడార్లలో విడుదు లేర్పఱచి
బాలలకును వుగ్గుపాలు నేతులును
చాలగ తెప్పించి సమకూర్చి వారికి
రాజనపు బియ్యము రాగి చెర్వలును
భోజనపాత్రలు పొసగ నన్నియును
పప్పు కూరలు నెయ్యి పాలకాగులుమ
ఒప్పుగా రసవస్తువులు చాల యిచ్చి
గంధము కస్తూరి గాజుగిన్నెలతో
అందఱి కిప్పించె నమితముగాను
వారలు శివపూజ వనరుగ జేసి
ఆరగించియు గంధ మలదిరి మేన
మరుగు జొచ్చిన వారు మఱచి
బాధలును
పరిణాన వుండిరి పణతులు దాము
బలబల తెలవార పట్టెమ
మురహరుడు
శీలమంతులు బోవ చేతులు బిసుకక
కలియుగ చోడాని ఖండించు మమ్ము
కాలిజాడలు బట్టి కంటిరా యనుచు
శీలమంతుల కొరకు చేరె నాజ్ఞాద
ఆలోన దెలుసుక నతివేగమునను

మాపటి మురహరుడు మంచిలో వచ్చి
చూపులవారి నుంచె చుట్టుక మంద
మురహరుడు పోల్రాజు ముందఱ నిలిచి
శరణార్థి చేసియు చేయెత్తి మ్రొక్కి
"పలువురు జంగాల పట్టి తెమ్మంచు
సెలవిడె చోడాని శీలమంతులతో
పసిబిడ్డ పణతుల పట్టుకొనంగ
మసబెట్టి వారు నీమరుగున కొచ్చె
నీవె చోడానివి నీవె మాప్రభువు
నీవీడ జంగాల నిలువగ నియకు
పోలురాజా! మేము పోవలె వేగ
శీలమంతులవారిని చేతికి నిమ్ము
వెట్టిచేయగ నిమ్ము ఏలినవాడ
పట్టిచ్చి జంగాల పెట్టంపు మిపుడు
మీదరి కయగాండ్లు మీరి వచ్చిరిక
కైదు చేసియు వీరినిక ట్టంపు నాకు"
ఆమాట విని రాజు అల్లున నవ్వి
"ఈమాట నీకేల యివ్వ జంగాల
నమ్మి వచ్చియు వారు నా మఱుగు జొచ్చి
నెమ్మది నున్నారు నేనేం ఇత్తు
ఆపదచేత వారాసించి వచ్చె
పాపము చుట్టుకు పట్టిచ్చినపుడు
వాడు బంధువుగాని పగవాడుగాని
చోడానిగానివ్వ నుద్దులు ఏం
మఱుగు జొచ్చిన వారిని మరియేల ఇత్తు
శరణంటె కాచియు చేపట్టినాను
వీరిని నమ్మించి విడువ సత్యంబు
మురహర పట్టివ్వ ముమ్మాటికి నిజము"
"ఇటులన పోల్రాజ! ఇష్టతి చెడుకు
మేటియా పోల్రాజ మేలు చేసితివి
పోరేల చోడాని పొందు చేసితివి
తిరెపెపు జంగాల తీసుకపోడు
కలియుగ చోడానికి కావలె చెలిమి
పులిచాటు మ్రొచ్చుల పొందేం నీకు
పలుగూటి జంగాలు పథ్యమా నీకు
అలుగవలదు నిన్ను అడిగితి నయ్య
పడియల కడ్డము వుండకుడయ్య
మాట దక్కించుము మంచితనాన"

## మురహరుడు జంగాల కొంగులు బట్టి యీడ్చి 'పదు' డని యదలించుట

సుదతుల జంగాల చుట్టుగా జుట్టి
పదుడని ముందర పలుక మురహరుడు
కుయ్యో మొఱ్ఱో యంచు కూడి అయ్యలును

అయ్య నమ్మితిమంచు నడలి రందఱును
జంగాల పోల్రాజు సాదృష్టినుంచి
కొంగులు పట్టీడ్వ కోపంబు హెచ్చి
మల్లభూపతి బిల్చి మండి పోల్రాజు
"చెల్లంబొ నను నమ్మి చేరి రయ్యలును
వచ్చె వీరిని బట్టి వోర్తునా నేను
ఇచ్చట అయ్యల యీడ్వంగ దగున

## మురహరుడు మొదలగువారిని కొలువు వెళ్లగొట్టుమని పోలురాజు ఆజ్ఞాపించుట

మురహరువారల మూకలనెల్ల
వెలువక బట్టీడ్చి వెళ్లదోలు మిక"
అన కోటమల్లు తా నాగ్రుడై వచ్చి
అనె మురహరునితో నదలించి పలికి
"వడియల విడిపించు ఒకరి పోనివ్వ"
విడిపించె కొలువులో వెలవకు డనుచు
పట్టెమ మురహరు బలముల జెఱచి
అట్టె తోలెను సభ నటు వెళ్లనపుడు
పన్నగ వారి నంప పగ చేరువాయె
మిన్ను ధరణి యదరె మిణుగుర్లు రాలె
పిల్లలపక్షులు పికపిక లేచె
తూలాడె పక్షులు దురితంబుగాను
ఎఱ్ఱని కన్నీరు వేష్యంబు గురిసె
తురుతుగ నెత్తురు తుంపురువాన
అదిరిపాటుగ గురిసె నా మందమీద
అది జూచి పల్లెకొండ హరహర యనుచు

## జంగాల నీయకున్నచో కీడు మూడునని పల్లికొండ పోలురాజుతో చెప్పుట

"రాజ ! వో మా మామ ! రక్షక ! వినుమ
రాజమండలమీద రక్తపు వాన
కా స్తిమి జంగాల కడముట్ట లేము
చూస్తుము హతముగా సురభులతోడ
మడియంగ జూతువో మామరో మామ!

వడియలకై మంద వరగనున్న దిట
మనకు చోడానికి మంచితనంబు
వెనుక పగగొనుట వెర్రితనంబు
పొందుచేసిన తావు పోరేల మామ
విందుచేసిన చోట వెకిలితనంబ
శీలమంతులు వారి సీమవారె గద
ఏలయ్య జంగాలు ఏల యీ పోరు
వారికిగాసు ఈ వాదేల మనకు
వారినుండి మనకు వచ్చేది లేదు
వడియలు మనకేల వరుగంగ నేల
పుడమివారిది వారి పోరేల మనకు
పరజగడం బేల పగ గొనుటేల
వరుగుట నిజమౌను ఓ మామ వినుము
కలియుగ చోళునితో కలహంబు ఏల
పోల్రాజ ! వో మామ ! పోరేల మనకు
తరువు నరుకొ్కన తనమీద బడును
ఎరిగి తీసికొనుట యేలయ్య మామ
పట్టెమురహరు పట్టి తెప్పించి
ఇట్టిప్డు జంగాల పెట్టంపవలెను''
మామకు పల్లికొండ మనవిగా జెప్పె
ఇనయముతో రాజు యిట్లని పలికె :
"విను పల్లెకొండ నా విజ్ఞాపనంబు
వినియును దెలుపుము వివర
మంతయసు
కాదన అవునన కర్తవు నీవు
కాదనక జెప్పెద కథ వినవయ్య

## కపోత చాటువ (ఎఱుకలవానిని పక్షిరక్షించిన కథను పోల్రాజు చెప్పుట)

ఎన్నెన్నో విద్యలు ఎఱుకల పెద్ద
అన్ని నేర్చియు వేటలాడంగ బూని
ఉచ్చుగుదులు చంక ఉరిగోల చేత
చిచ్చురులు మొలను జిగురు
కొమ్ములును
వలలు గుమిడికలు వద్ద సంధించి
పొలము వేటాడంగ బోయె దూరంబు
పొదకట్టు శోధించి పొదలను వెదకి
మదగజంబువు లుండు మలలు
శోధించి
పుట్టలు పాలించి చెట్లెక్కి వెదకి
గుట్టలు పాలించి గుబురులు వెదకి
చెట్టు చెట్టు తిరిగి చెడి వేటలాడ
వేటేమి సాగక వెతపడుకొనుచు
పట్టపగటి దనుక పనిబడి తిరిగి
మిట్టమధ్యాహ్నము మీర బొగులుచును

మల్లటింపుచు నొక్క మఱ్ఱిక్రింద జేరె
''చెల్లంబొ యిక నేమి చేయుదు ననుచు
పిట్టబొట్టె దొరుక దెబ్బెబొట్టెలకు
ఎట్టిల్లు చేరుదు యింతిచే బాధ
కలుగ కాళ్ల బిసుకు గయ్యాళిదుంచి
కలుగకుంటే గొంతు గట్టిగా నొక్కు''
చింతించు యెరుకు తా చెట్టుపై
జూస్తు
అంతట కలయ జూడం దొకచోట
తరువుమీద కపోతి తావు జేసుకొని
తరుణి గ్రుడ్లను పెట్టి తా పొదగంగ
ఎఱుకువాడును జూచి యెక్కె
వృక్షంబు
ఉరులు బారుగ దిద్ది వొదిగొకచోట
ఉరులలో బడగను నూపె యా కొమ్మ
ఉరులు తగులుకొని వొరిగి కపోతి
రెక్కలు తగులక రెపరెప గొట్ట
ప్రక్కకు గూడొరిగె పక్షి చిక్కుకొనె
గ్రుడ్లు నేలను బడె గూడెల్ల చెదరె
గ్రుడ్లను కన్నీరు గ్రుక్క వ్రేలాడ
ఉరికి యా కొమ్మకు ఉరులు దప్పించి
పెరికి లగువు దీసి పెద్దదని పొంగి
చిక్కెగదా! యని చిక్కెములో వేసి
మిక్కిలి కుతుకమున మేదినికి దిగె
పక్షి చిక్కినపుడు బ్రహ్మాండ మెల్ల
గచ్చుపొద్ద వలెను కదలెను మిన్ను
గిరులును తరువులు గిరగిర తిరిగె
వారధి మొరపెట్టి వచ్చినట్లాయె
జీవజంతువు లడలె చీకట్లు క్రమ్మె
వావిరి మబ్బులు వరలెను మింట
కావిరిగొనె భూమి కనపడదాయె
ఉఱుములు మెఱుపులు నొక తెంపులేక
కాఱువానలు కుంభధారగా గురియ
పలిబట్టి యా యెఱుకు వానచే జిక్కె
చలిగొట్టి వానికి చావు ఘటించె
విలవిల దన్నుకొని యిలమీద బడియు
స్రుక్కి కొంగపడె చేతులు కాళ్ల
నక్కళ్ల కదపడి నట్టడవి చిక్కె
కట్టువస్త్రము లేక గజగజ వణికె
గుట్టగ మొద్దునా కూలె నా యెఱుకు
మానురోలన వరిగె మఱ్ఱిక్రిందటను
కాన వర్షము చిక్కి కదలాడకుండె
వర్షముచే తడిసి వడి పోతుపక్షి
తరువుపై నిలుచుండి తరుణి లేదనుచు
రాలిన యీకెలు రాసులు జూచి
కూలిన గూడును కొమ్మలు చూచి
గ్రుడ్ల నీరును గ్రమ్మ గొనకొని జూచి
దొడ్డుగా చింతించి దొరకొని అడలె
''పరమ పతివ్రత ప్రాణేశ్వరీవు
తరుణెందు బోతివి తను విడనాడి
పతిలేని సతికేల ప్రాణములనుచు
నాతి దంచేగితే నను విడనాడి

ఓ భామ!ఓ సతి!ఓ ప్రాణపదమ!
ఓ భాసురాంగి నా కోరులు చేరెవరు
ఎన్ని బాధలు పడి యేడ వేగిరివో
అన్నులమిన్న నీవని'' పోతు అనల
చిక్కి రెక్కలు విరిగి చిక్కిన పక్షి
అక్కడ విభు జూచి ఆ పక్షి బలికె:
''ఓ ప్రాణనాథ! ఈ పంపోత యేం
నీ పాదములు నమ్మి నే నీడనున్న
నిను నెడబాయంగ నేర్తునా నేను
తాను చిక్కములోన తగులుబడున్న
నియమ పతివ్రత నేనైతినేని
పాయను నను నమ్ము ప్రాణేశ!
వినుము
ఇది 'విను' ప్రాణేశ!విన్నపం
బొకటి
సదయుడ అతివను సంతోషపెట్టు
కపోతరాజవు కారుణ్యవార్ధి
భూపదమున జెడని పుణ్యంబు
నిలుపు
మన నిమిత్తము ఎఱుక మలలకు
వచ్చె
చనిపోవ జూచిన సత్య మెక్కడిది
సర్వధా ఎఱుకు తా చనిపోవుచుండె
నిర్వహించుము స్వామి నీకీర్తి
వెలయ
ఎగ్గుబట్టక నీవు ఎక్కడనైన
అగ్గిని గొనిత్తెచ్చి యతని
బ్రతికింతు''
అని పల్కి పతి విని అతివ
కిట్లనియె:
''వినవె ముద్దుగుమ్మ ఈతడు
కావ
నీకు శత్రువుగద నీవడు దెఱుకు
నాకెంత చుట్టము నమ్మినవాడు
పడతి నిన్నుబట్టిన పగవాడు వీని
నేడు గాచున నేను ఇంత చుట్టమును
పాపమున్నని గాచు పనిలేదు
మనకు''
ఈపగిదిని పల్కి నింతి ఇట్లనియె:
పర ఉపకారముకు పట్టి పక్షించు
''పర ఉపకారముకు పశువు కష్టించు
పర ఉపకారముకు పండు
ధాన్యములు
పర ఉపకారముకు పండు
వృక్షములు
పర ఉపకారముకు పగవారినైన
దరిచేర్చి కీర్తిని దగిలిరి విభులు
అట్టి శత్రువు వీని కావద యేల?
పట్టి రక్షించిన ప్రఖ్యాతి కలుగు
స్థిర'' మన నలిపల్కి చిత్తాన దంచి
మరి మంచిపని యోగమునుంచలం
వెగసె

23)

అగ్నిదేవుడు వున్న అంబర్షకొండ
అగ్ని రాజగ జూచి అటు బోయి
పక్షి
కాలిన పుల్లను కఱచి పట్టుకొని
వలిబట్టిన యెలుకువాని కడుంచి
తనగూడు బడదన్ని దరికొల్పె
నగ్ని
తన రెండురెక్కల దరికొని విసిరి
గూడు తగులుకొని గుభగుభ మండె
వేడిమంటను కాగె ఎలుకు ఆవేళ
చప్పగ చలివిడిచి క్షణములో బ్రదికి
ఈ పక్షి కడుపున నేను పుట్టితిని
ఆరుమంటవలన నాకట నొచ్చి
నోరు కడుపు జూపి నొచ్చెను
ఎలుకు
వినెను కపోతము వృక్షమునుండి
"అన్న మమృత మిడ నర్హులము
గాము
విను వింధ్యభూముల వెస గడ్డిగింజ
తిని బ్రతుకుద మిక తెలుపుదు
వినుము
నిను తృప్తిచేయగా నేరను వేర
తను నారగించ''ని దబ్బున పడెను
రెపరెప కొట్టుక రెక్కలు కమిలె
నిప్పులలో కాలు నెలత తా జూచి
చిక్కి రెక్కలు విఱిగి చిక్కములో
పక్షి

అక్కడ దుఃఖించె నా యాడ పక్షి
''అన్న నా విభునితో నగ్ని చొర
వలెను
గ్రన్నన విడిపించు కడు పుణ్య
మగును
తానును విభుడైన తమ కొరత దీరు
వదిలించు చిక్కము" వామాక్షి
బలికె
వెతవెత పడియును ఎలుక
ఏమనెను
"ఏను జంపిన పక్షులు ఎన్నియో
గలవు
తనవంటి పక్షుల తల్లి యే నెరుగ
విడిచి పెట్టెద బోయి వింధ్యాద్రి
బ్రతుకు"
"ఏటి మాటాడేవు ఎలుకల అన్న
పతి బాసి యుండెడి బ్రతుకు నాకేల
పతితోడ చెల్లిన పరలోక మబ్బు''
నిశ్చయ మెడలక నెలత తా బలుక
'అచ్చట చెల్లుదు' ననెను ఆ పక్షి
'అమ్మ చెల్లో'ద్దని ఆ పక్షి దిగిచి
'హా'మ్మని విడిచిన హోక యా పక్షి
పుణ్య కపోతి తా బురుషుని జూచి
కణకణ నిప్పులకడ వచ్చి నిలచి
"దేవకన్యకలారః దేవతలారాః
నీవును, భూదేవిః నిజమాడరమ్మః
పతిపట్ల మారాడి పలికెన బోము

ఇతరుల చెడనాడ ఇష్టతి గాదు
బ్రతుకు నాకేటికి ప్రాణంబు
ఒకటి"
అతివేగ విభుపైకి ఆ పక్షి వ్రాలె
విభుని రెక్కలంపి రా విలవిల బొర్లె
విభునితో హతమాయె విహగి
యప్పుడును
ఎఱుకవాడది చూచి విజ్ఞానబుద్ధి
ఎఱుగక మునుమున్న నెన్నిటినో
నేను
ఈ పక్షులను జంపి తెన్నాళ్ళు మనుదు
ఈ ప్రాణమేలని యాశ్వ రుడలచి
వడి వచ్చి మంటలో వాడును బడెను
జడివానగా పారుజాతము గురిసె
మూకలై వచ్చిరి ముువ్వురు మూర్తులును
ఖగవాహనుకి మ్రొక్కి గత
ప్రాణుడయ్యె
పక్షుల నెఱుకును పశిని రథాల
మెచ్చి కొంపోయిరి మేలు మేలనుచు
పరమ పతివ్రత పక్షి పాపాత్మ
డెఱుకని యరికట్టె యమునివారంత
పక్షుల్ దేవతల్ పాదాల కెఱగి
ఈ క్షణ మివ్వుడు ఎఱుకకు పరము

మంచి నెనుక తమకు మనవుల చెప్ప
విష్ణుదూతలు వచ్చి యమువార్ని ద్రోలి
విష్ణుపురము చేర్చె విను పల్లికొండ:
మునుమాని గొక పక్షి మహి నిట్లు
బ్రోచె
మనము గావే దెంతమాత్రము వీర్ని
పల్లికొండదిక నొక్క పలుకును వినుము
చెలగి శ్రీరాముండు శ్రీవిష్ణుమూర్తి
అవింత్మ్రయె సీత అమ్మవారి నటు
క్రోధించి రావణుడు కొంపోయె వెఱువ
జగతి ద్రోహిని వాని చంపెద ననుచు
తగ నగచరులచేతను వార్ధి కట్టి
శ్రీరామచంద్రుండు సేనల గూర్చి
గురిచేసి బాణాలు గుప్పిన నాడు
వీరరాఘవు మరుగు విభీషణుండు
వెఱచి శరణటంచు వేడ తా కాచె
పగవాని తమ్ముని భక్తు చేబట్టి
రఘుపతి మది మెచ్చిలంక యిత్తుననె
సాధించి రావణు చంపి యా లంక
పాదుగ విభీషణునకు పట్టంబు గట్టె
వెనుక శ్రీరాములు నేలె రాజ్యంబు
మనము గాచే దెంతమాత్రము వీరిని

## గయుని చాటువ

అల్లుడ యిక నొక యానతి వినుము
జలధర దేహుండు జపము చేయంగ
గగనభాగమునుండి గయుడు
పోవుచును
తెగి తమ్మలంచొంగ తెప్పగా వచ్చి
భగవాను దోసిట పడ్డపుడె విడచి
పగదల్చి "వానిని పట్టి సాధింతు
తగ వసుదేవుడ తనయుడ నైతె"
విష్ణుతో పగదెలిసి వెఱచి ఆ గయుడు
అష్టదిక్కుల కేగి యందఱి వేడ
వెనుక వేసుకొన వెఱచి రందనుసు
వెనుక నారదు ప్రేరణను బొగులిచేగి
మనమున చింతించి మానవు డనక
మరి వచ్చి యర్జును మరుగు
జొచ్చియును
శరణని వేడగా చెంతకు జేర్చి
నమ్మించెను కిరీటి నాడు ఆ గయుని
ఇమ్మన్న కృష్ణున కివ్వకపోయె
బావ దేవుడు ప్రాణబంధువు గురుడు
భావింప పాండవ పక్షపాతిగద
అంతవారితో ఇవ్వనని పల్కె తాను
పార్థుడు గయుని తా పట్టివ్వడాయె
అర్థించె పల్లికొండ అయగాండ్లు నన్ను
వాదుకు వెఱచియు వారి బట్టివ్వ

ఇయ్యను జంగాల యిత్తు ప్రాణాలు
అయ్యగాండ్లకుగాను అర్థము బోసి
భక్తుల కొఱకుగా బలమెల్ల బోయిన
కత్తుల నామేను గాడిన లెస్స
ఆ లక్ష యాదవుల్ హతమైన మేలు
శీలమంతులకుగా శిర సప్పగింతు
ఆరువేలు వల్లవులు హతమైన మేలె
వీరుల మొదుము ఇవ్వ జంగాల
ఏడువేల్ తిరుమంద లెదురొమ్ము
గాడనీ
ఒడియల నియ్యను ఒరుగుదుముగాని
శివలింగవీడుగా చెల్లుదు మిచట
ఇవ్వను జంగాల వెఱువ బలిమికి
బల్లేల పోట్లకు భక్తుల నియ్య
ఈటె పోటులకును ఇవ్వ జంగాల
ఈ శీలమంతుల నిచ్చితినైన
వాసియొ వలురాజు వరసుతుడు
గాను"
ఆవుల పోల్రాజు అల్లునితోడ
ఈ విధిని ప్రతిజ్ఞ నెలమిని బలుక
మామమాటలు విని మరి పల్లికొండ
"మామరో ! ఓ మామ మనవి జేసెదను

## శీలామంతులను జంగాల సహితముగా శ్రీశైలము పంపుమని పల్లికొండ పోలురాజుతో జెప్పుట

పొసగంగ యెల్లుండి
ప్రొద్దుపొడుపునకు
వెదగండు చోడాణి వెదలిటువచ్చు
శీలమంతుల గాచు సెలవేమి మామ
ఆలములో చెల్ల హత్యా చుట్టెడిని
వడియలు మందలో వొరిగినయెడల
కడసారి స్వర్గము కలుగదు మామ
శీలమంతుల నెత్తురు చిందిన యిచట
కలియుగమున మన ఘనత
నిల్వదుగ
వడియలు మనతోడ వొరిగినయెడల
పుడమిని గాచిన పుణ్యంబు లేదు
జంగాలు వొఱిగితే లింగహత్యగును
అంగన లయగాండ్ల కరుసము లేదు
కూడేటి దండులు కూడక మునుపె
తోడిచ్చి అయగాండ్ల దొడ్డెళ్ళనంపు
శరణు జొచ్చినవారు చెదరి పోకుండ
పరువడి భక్తుల పర్వత మంపు"
ఆ వార్త పల్లికొండానతిచ్చినను
అవునని పోత్రాజు అల్లుని మెచ్చి
"ఎవ్వరి నంపవలె నెవరు పొయ్యేదరు
ఎవ్వరు అయగాండ్ల నీడేర్చగలరు
క్షేమాన అయగాండ్ల చేర్చ పర్వతము
సామర్థ్యలను దెల్పు సరగున" ననిన
'తిరుమందు వల్లవుల దిక్కు బొల్లావు
గరుడబొల్లావు తా కదలవలయు
అయగాండ్ల నిప్పుడు ఆదివిష్ణుండు
భయమెంత లేకుండ పర్వతం జేర్చు
త్రిపురముల్ గెల్చిన
త్రిపురాంతకుండు
అపర పరమశివుండను యెద్దునంపు
దక్షుని యాగాన తల ద్రుంచినట్టి
హెచ్చగు వీరభద్రెద్దును బంపు
లంక సాధించిన రఘుపతి పేరి
జంకెరుగని యెర్రచామ పెద్దంపు
కేసరిపుత్రుడన్ కీర్తిగలట్టి
అసురుల పై రెద్దు హనుమంతు నంపు
భీతి యెరుగని లావు భీముడనెద్దు
భక్తుల తోడచ్చి పంపుము మామ
అర్జును పేరిటి అచ్చకత్తెర్రెద్దు
బొజ్జగణేశుడన్ పోతుబెద్దంపు
వల్లవ తిరుమందుల వాసిగలట్టి
కల్లండ్లు పోల్నేడు ఘనుడు మళిలన్న
సరిబలం గాగను జంగాల వెంట
పర్వతానకు తోడు పంపుము మామ!
అల్లు డిట్లాడగ నా పోలురాజు

కొలువు దిగ్గున లేచి గుడహారు వెడలి
వల్లవుల్ తిరుమందులు వైనవైనాన
అల్లుడు పోత్రరాజు బొల్లావుకడకు
పంచవాద్యములతో పట్టభద్రుండు
కొంచక సురముఖ గుడహారు చొచ్చి
పలికొండ పోత్రరాజు ప్రదక్షిణముగ
వలగొని పన్నీట పాదముల్ గడిగి
మామయు నల్లుడు మహి సాక్షిబట్టి
ప్రేమతో గంధము మెత్తించి రాజు
నాల్గు పాదాలను నాదుటందెలును
గళపేరును బొడ్డుగంట గొలుసులును
రత్నాలపేరులు రావిరేఖలును
సత్యమౌ సురభికి జల్లులమర్చి
అటువెనక బెట్టించె అందెపెండెంబు
చిటిమోత లీనుచు చెవి కింపౌనర్ప
పశిడిజోడు తొడిగి పట్టి నివాళి
ఆసచే వేడిరి అల్లుడు మామ :
"పంతము ఈడేర్చు పంతాల సురభి
భక్తు లాపద నీదు పాల బెట్టితిని
వెట్టి చేయగలేక వెఱచి అయ్యలును
ఇట్టు మరుగు జొచ్చి రిందు నిల్పితివి
వేడి రయ్యలు నన్ను వేడితి నిన్ను
పీడ భయము పీర్చి వెస గిరి జేర్చు
నమ్మినా రయ్యలు నమ్మితి నిన్ను
సమ్మద మొనగూర్చు" సాగిలి మ్రొక్కె
పల్లికొండయు మ్రొక్కె "ఫాలము ముట్ట
కల్లందుల మార్నేని కౌగిట జేర్చి
కలిపిన గంధము కస్తూరి బూసి
"కల్లందుల సింహమ! కరకంఠ భక్తి
చిత్తాన దయవుంచి శీలమంతులను
ఇత్తఱి కుటుంబాలు ఎడము గాకుండ
కంటిని రెప్ప తా కాపాడినట్లు
వెంటాడి పర్వతం వేగంబె జేర్చు
పోవలె" నని చెప్పి భూషించి రాజు
వావిరి నందఱ వార్నొప్పగించి
తమ్ముడు మశిలన్న దగ్గఱ కేగి
కమ్మని కస్తూరి గంధంబు ఇచ్చి
పండుటాకులు మంచి బాగాలు ఇచ్చి
"నిండుమనసు గల నీవు నాతోడు
ఆ వనజాసను అవుతార ఘనుడ
నీవును కీర్తి ని నిలుపగ వలయు
మా యన్నదమ్ముల మరి యేడొ యెఱుగ
పాయక కుడిభుజం పగిదిని నాకు
కుడుచుట ముడుచుట కూడనె జరుగు
ఎడపకగ నెప్పుడు వేఱు గాకుండ
తోడుగ అయ్యల కు తోడయి నీవు
ఈడేర్చి ర"మ్మని వీడుకొల్పినను
అన్నకు మశిలినే దళి వేగ మ్రొక్కె

జననాథ తెస్నాయె శరణార్థి ననెను
ఎడ్ల శృంగారించి మోహరించగ
మ్రొక్కె
పుడమి గ్రక్కదరగ పోల్రాజునాజ్ఞ
అటుదెంచె పల్లవుల్ ఏనూరు మంది
తీరైన యేనూరు విరుసులు దెచ్చె
అయిదునూర్ గోసంగు లంపబు రాగ
అయ్యల వెంటను అండబు పొండు

## సైన్యమును తోడిచ్చి పోలురాజు జంగాలను శ్రీశైలమునకు పంపుట

ఏనూరు కుటుంబాలు వెలయు జంగాలు
ఏను శీలామంతుల కెసగిన భక్తి
తాను పల్లికొండ దండంబు బెట్టి
"విను డయ్యలార మీరేగుడు గిరికి"
పూనిక స్త్రీలకు భూషణాంబరముల్
పచ్చడాల్ ధోవతుల్ పట్టువస్త్రములు
ఇచ్చగ అయ్యల కిచ్చి పోల్రాజు
సాగిలి మ్రొక్కియు చరణముల్ ముట్టి
వేగమె పర్వతము వేంచేయు డనెను
పోలురాజును జూచి పోక అయ్యలును
శీలమంతు లడలి శివశివ యనుచు
"మా యాపదలు దెచ్చి
మీయందు బెట్టి
మీ యాదవులు నెల్ల మీరును గూల
సత్యముగల సురభిచయములు గూల
భక్తుడా యెన్నాళ్ల బ్రతికేము మేము
గంగిమైలావులు లింగముద్రెడ్లు
సంగరమున జావ చసలేము మేము
హనుమంతు మోరెడ్లు ఆవులేగలును
ఇన్నియు జచ్చిన హింస మాకేల ?
బసవముద్రెద్దుల ప్రాణాలు బోవ
పశుహత్య యెన్నటికి పాపుకోగలము ?
పోయి చోడాణిని పొడగని మేము
చేయుమనిన వెట్టి చేతుముగాని
కాకుంటె మిముగూడి కయ్యముజేసి
వీక గండ్రగొడ్డ వేటులాడేము
చక్రాల కొండల శిరసులు తరిగి
ఉక్కుశూలాలతో నుక్కణగించి
భద్రేశ ఆయుధాల్ భక్తులందఱము
చిత్తవత్తుగ పోరు చేతుముగాని
దక్షుడు చోడాని తాము శరభులము
ఇచ్చట వీరంగమేతుము గాని
చంపుటో చచ్చుటో సర్వథా మేము
ఒప్పగించియు పోము ఓ పోలురాజ!
పోలేము రణములో పొలిసెద" మనుచు
శీలమంతులు పలుక చిరునవ్వు నవ్వి

"ఏలయ్య కోపంబు ఏము ఉండంగ
మీమూర్తి పంపున మీ దయచేత
స్వామి పోరుదు మేము శరణయ్య
మీకు
మీరు క్షేమమునున్న మేలు మా
ప్రతిన
శరణ"ని అయ్యలకు చేయెత్తి మ్రొక్కి
తర్లగ పోల్రాజు దండంబు బెట్టి
ఫాలము మోపియు భక్తులకు మ్రొక్కె
"ప్రత్యుత్తరం బిస్తె పరమేశునాన
సతినాధునా" నని చరణాల కొరిగె
"అవు పోలురాజ మమ్మడుగు
చున్నావు
ఎవ్వరిచే విందు మీవార్త మేము

## జంగాలు యుద్ధపరిణామము నెవ్వరిచే విందుమని అడుగగా పోల్మరాజు గుర్తులు చెప్పుట

మీ జయాపజయంబు మీ మేలుకీడు
మీ జయవార్త మేమెఱుగుటెట్లు"
"శరణు శరణు మీకు జెప్పెద
గుఱుతు
పరిణాన మీరంత పర్వతం చేరి
మీరు పూజలు సేయ మెలిగెడి వేళ
అరచేతి లింగము అవనిపై వరుగ
ఆవుల పోల్రాజు కపజయ మనుడు
కవుమండలము నీళ్ల కౌచువేసినను
గోవులు హతమని గుర్తెఱుగుడయ్య
గవురి బెత్తము విఱిగి కణిక లైతేను
పృథివిలో యాదవుల్ పొలిసిర
నెఱుగు
రుద్రాక్ష తావళాల్ రుత్త లైతేను
యాదవుల్ రక్తము ఏరులనెఱుగు
భద్రాక్ష దండలు పగిలినయెడల
సిద్ధము యాదవుల్ చెల్లిరనెఱుగు
పూసిన విభూతి వులుసు వేసినను
వెస పోలురాజు పడెనిల ననుకొనుడు
శివపూజ పుష్పాలు చిందుబిందైన
శివభక్త పోల్రాజు చెల్లె ననుకొనుడు
ముందు మీ పిడిగంట మ్రోగక
యుంటె
సందు లేకను పోట్లు జరిగె
పలికొండకు
వినుడు త్రిశూలముల్ విఱిగిన
గుఱుతు

అని యాదవులు మంద హత
మనుకొనుడు
స్వామి మీ శివపూజ
సంతోషమైన
క్షేమము మా''కని చెప్పి పోత్రాజు
''సెలవు వేంచేయుడ''ని చెప్పి
పోత్రాజు
కల్లండ్లు మార్నేని గరుడబొల్లావు
పసిలినేని దిలచి మందకు బలిమి
వెస యేడు యెడ్లలు ఎన్నగ బలము
పీని నందు బిలిచి వీడ్యాలు లిచ్చి
పనిషినుడని చెప్పి పర్వత మంపె
ఆపప బాయగ అయ్యలందరికి
ప్రాపుగ భక్తుల పర్వత మంపె
పట్టుగ కోపాన పట్టెమురహరుడు

## జంగాలను పట్టుకొని వచ్చుచుండ పోలురాజు అడ్డగించెనని పట్టెమ మురహరుడు చోడానితో చెప్పుట

పట్టి తెచ్చినవార్ని బలిమి విడిపించె
శీలమంతులు నాకు చిక్కినవార్ని
చలమున విడిపించె సైతునా
యనుచు
కోపాన చోడాణి కొలువున కేగి
మాపటి కొలువున మండి
ముర్హరుడు
"పాలించు చోడాని పట్టభద్రుండ !
పాలించు నేను నీ పాదసేవకుడ
వాలాయము చెరుకువాడ జంగాల
శీలమంతుల తేగ సెలవిచ్చినారు
స్వామి మీచెప్పిన సరి ప్రొద్దు
బోయి
ఏమారకను వారి వెలదుల సుతుల
పట్టుక రాగాను పశుపతిరాజు
అట్టె అడ్డమువచ్చి యాదవుల్
తాను
ఇమ్ముగ విడిపించి వెనుక వేసుకొని
పొమ్మని మముబట్టి పొడిచి నూకించె
వశుధీశ చోడాని వార మన్నాము
పశుపతిరాజు తా ఫక్కున నవ్వి
'చోడాని వారల చూడమా వోరి !
వాడైతె భయమురా వసుధ
మాకనుచు
వారికి వెఱచెడి వార లున్నార !
అరికట్టి మమ్ముల నాపదబెట్టె'
దెప్పిరి పస్తిమి దేవర" యనుచు
చెప్పిన చోడాని చెవిజేర్పడాయె

ఎవరు జెప్పిన విని యేమనకుండె
మరిమరి జెప్పిన మంత్రులతోను
విని విచారముజేసె వీరస ముడిగి
"మనము తా జేసిన మంచితనంబు
అన్నదమ్ముల మన్న హరుషంబు
వొకటి
పన్నుగ నందికాసు పట్టణము నందు
అందఱం చెల్లిస్తి మరమర లేక
పొందుగ మన కాసుముద్రను తాను
పోత్రరాజు చెల్లించె పొగడి యంతటను
శ్రీరంగ మతనిది శివమంద నాది
మేరలు బలికితి మేమును నతడు
చెలిమి చేసిన తావు చేటేల తలప
చలము బూనగరాదు చేవిడ రాదు
ఈశ్వరు భక్తుల మిరువుర మేము
పశుపతి సాక్షిగా ప్రతిన వినండి
అతడు శీలమతుల కడ్డమొచ్చినను
అతనిపై నలుగ"నని అల్లున నవ్వె
పగ యెంచకను రాజు పకపక నవ్వ
నగవు ముక్కంటికి నారసమాయె

## ఆగ్రహము చెందని చోడానితో ముక్కంటి పూర్వము సోదరులైనవారి విరోధములను గురించి చెప్పుట

ముక్కంటి చోడాని ముంచట
నిలచి
పుక్కిట విషముంచి పూని తా బలికె :
"కని కానవైతివి ఘనుడ చోడాని :
విని వినవైతివి వివరము లేదు
పగవాని పొందేల పైవచ్చినపుడు
తగ నీకు వాడును తమ్ముడా రాజ !
వారెవ్వరీ వెరుగవా రాజ వినుమ
వారన్న దమ్ములు వాలి సుగ్రీవులు
వాలాయముగ తాను వాల్ని జంపించ
చెలపట్టి రాఘవు చెంతను జేరి
వాల్ని జంపించిన వార్తలు వినవా
అల రావణు విభీష ణ న్నదమ్ములుగ
రాము దేవిని చెర రావణుడు దెచ్చి
క్షేమమా లంకకు చేటు దెచ్చి తన
సోదరు పలుకును సూడుగా దలచి
క్రోధించి తమ్ముని కొలువెళ్ళగొట్టె
మచ్చరంబున రాము మరుగు తా
జొచ్చి
అచ్చటి మర్మము లన్నియు దెలిపి
ఆ రావణుని జంప నా లంక యేలె
వారన్నదమ్ములె వసుధెల్ల యెరుగు
వినుమిక నొక కథ వివరంబుగాను
ఫణులకు పక్షులకు పగగద రాజ

అక్క చెల్లెలు కద్రువా వినత
సుతులై
గ్రక్కున నసురులు క్రతుభుక్కు
ల్లె
అన్నదమ్ములు కౌరవులును
పాండవులు
గ్రన్నన కురుక్షేత్ర కలహమున
గూలె
నేరుపుల్ నేర్చిన నీకు చెప్పంగ
నేరను ఓ రాజా! నేనెంతవాఁడ
గొల్లరాజులు ఎంత గోవులు ఎంత
శీలమంతు లెవరి సీమలవారు
ఈ భూమి యెవ్వరి దిది బూటకమేగ
ఓ భూవరా చూడు మూహించి మదిని
మందబోయుల కింత మత్సరమైతె
ఎందుకు కొఱగాము ఏలయ్యా మనము
పశుల బోజులు ఇంత పలుచగా జూడ
వసుమతి రాజులు వారెల్ల వినర
గొల్లరాజుకు వెఱచి గుట్టున వుంటె
మల్లబాటొదురు మన్నీలు దొరలు
పోర్చక పూరికై వుండిన యపుడె
లక్ష్య పెట్టరు నిప్పురాచకుమాళ్లు
వెట్టి చేసేవారు వెక్కిరించేరు
ఏపకి గుఱ్ఱాలు ఏల యీ కరులు
పీగని యీ దండు ఏలయ్యా మనము
నగరముల్ దోచంగ నాయుళ్లు పొంచు
రాజ ముఖముగద్ద రాని కోపంబు
భోజ పీపున గద్ద పొడమునా
వినుము"
ముక్కంటి యిట్లాడ ముసిముసి నవ్వి
అక్కడ చోడాని అప్పు డిట్లనియె:
"రాదు కోపము గొల్లరాజులమీద
వాదేల ధర్మము వదలను నేను
సమ్మించి చెఱుచుట న్యాయము గాదు
తమ్ముడు పోలురాజు దండెత్తనేను
ఆడితప్పిన లోక ఆరడి నాకు
కూడదు ఈమాట కూర్చుండు''
మనెను
కరుణించి చోడాని గట్టిగా బలుక
మరియు ముక్కంటికి మంటలై మండె

## ముక్కంటి వెట్టికి వచ్చినప్పుడు చోడాని తనకు వాగ్దానము జేసిన సర్వాధిపత్యమును గురించి హెచ్చరించుట

"తప్పవు బొంకవు తగవు తప్పవును
ఇప్పుడు దప్పకు ఈశ్వరునాన
నెల్లూరు నేలుచు నేనుండగాను
వెళ్లిరమ్మని నన్ను వెట్టికి బిలువ

పిలిచిన నే రాక బింకము పోగ
కలకన్ను బో ద్రొక్క కలవర
మొంది
సర్వసన్నాహముతొ స్వామి నే వస్తి
నిర్వహించితి నన్ను నీవె నేననుచూ
నీ శిఖాముద్రయు నీ రాజ్యమునకు
నా సమ్మతంబని నమ్మించినావు
పారుపత్యము గల పనులకు నన్ను
కరకంతునానని కవులిచ్చినావు
అమరేశపుత్రుడ నధికుడ నంచు
గురుకుమారుడనని కృపయుంచినావు
మాతండ్రి భక్తుడ మాట దప్పకుమి,
ప్రీతితో విను మాట పెడచెవి నిడక
అయ్య పారుపత్య మంతయు నాదె
అయ్య జంగాలకై నంపింది నేను
పోలురాజుకు నాకు పోరంతె కాని
నీలకంతుని యాన నీపని లేదు
అల్లట్లు నేనేగి ఆలము జేసి
గొల్లల పోల్రాజు గోకులమంత
పట్టించి దెత్తు నీపాదాల కడకు
ఇట్టిప్డు సెలవిమ్ము యీశ్వరునాన
పట్టి విడిచిన నీకు బహుగౌరవంబ
ఇట్టె సెలవి'' మ్మన్న నేమనలేక
సెలవిచ్చె చోడాని సేనల కెల్ల
కొలువులో చోడాని కోటానకోట్లు
కోరల కస్తూరి గోవ జవ్వాజి
కర్పూర విడియముల్ గ్రక్కున
నిచ్చి
కదలగ చాటించె కాలుని వెంట
పదిలమైన ముహూర్త బలమును బట్టి
పరగంగ శ్రీరంగపట్టణ మంతయును
సర్వసేనలు జన చాటింప బంచె
"వీర పరిజనులు వీరు వారనక
వీరతనము గల వీరులారిపుడు
సామంతులార యో సాహసులార
సామజ ఘట యుద్ధ శౌండులారిపుడు
రాజిత తేజీల రౌతు లెల్లరును
ఆజికి సన్నద్ధులై చనుడిపుడు
తూపాకి విలుమూక తులువ
లందఱును
ఈ ప్రొద్దు కలనికి నేగుడు మీరు
పోల్రాజుమందలు పోటని చెపుడు"
కాలుడు తనపేర కమ్మలు వ్రాసి
వేగులకు నొసంగి వెస రాత్రి బంపె
దుర్గాలవారికి తురుతుగ బంపె
అరవ రాజ్యపు దండుకాకులు
వ్రాసి
మొరస రాజ్యము దండు మొనల
రమ్మనుచు
తెంపు కార్యము జేసి దేశాల కంపె
అంపె లేఖలు వేగ నపుడె ముక్కంటి

కరపట్టణముల వారిని కదిలి
రమ్మనుచు
పేరైన మన్నీలుకు పెట్టంపె లేఖ
పట్టిన పశువుల పాలువ (భాగం)
ల్లనుచు
మాట దప్పక యిత్తుమని వ్రాసి
బంపె
పట్టినకొల్ల యా బంటుకె కాని
ముట్టిన యమరేశపుత్రుడ గాను
శ్రీరంగమున నుండి చీట్లు వ్రాయించి
పేరైన మన్నీలకు పెట్టంపె లేఖ
పరికించి లేఖలు పయనమైవారు
దూర దేశమువారు దుర్గాలవారు
వారు వీరు కదిలి వారధి వలెను
చేరిరి వారును శ్రీరంగమునకు
సేనలు నాయకుల్ చెలగుచు కదిలి
ఆనువుగ తమతమ అశ్వాల నెక్కి

బిరుదులు చదుపంగ బింకాలతోను
మొరసలు కరవాల మొత్తుదా మనుచు
పేరుగా కదిలిరి పృథివి గంపింప
బెరుకు అళుకు లేని బిరుదు
రాహుతులు
వెనుకొను కన్నోజి వీర రాహుతులు
మునుమును కదిలిరి మొనలతోడుతను
తక్కిన రాహుతుల్ తఱుచు గుఱ్ఱాలు
ఉక్కుపొడియు రాల ఉరవడి కదిలె
కాటార్లు తునియలుగా వేతు మనుచు
పఠానులును వీరభటులతో కదిలె
గడిమన్నె దండులు గమిగూడి గదిలె
కూడి కోయల దండు కోటానకోట్లు
గుఱ్ఱాలు యేనుగుల్ కుంభిణి యదుర
అగ్రెత్తి ఘీపెట్టుచిల యీనినట్లు
ధారుణి వణకంగ దండెత్తి వచ్చి
శ్రీరంగ పట్టణము చేరిరుగడల

## యుద్ధ సన్నద్ధులై వచ్చిన సామంత ప్రభువుల సైన్యములను చోడాని సత్కరించుట

పటు పటావళ్లను పట్టు ధట్టీలు
పట్టభద్రుడు ఇచ్చె పరిపూర్తిగాను
నవరత్న తాపృమౌ నవ్య భూషలును
ఇవ్వ రాజన బంటన వేరు గాకుండ

కనక సంతతులు ముక్కంటి
తా నిచ్చి
రణభేరి వేయించి రణముకు కదిలె
దారిద్ర్యహతముగా ధనములు గొన్న

వీరులు కలనికి వేగమ కదిలె
ఇది నేల యిది మిన్ను ఇదియ
ఈ దండు
ఇది యని కనుగొన పీలు లేకుండ

చెరుకూరు చుట్టును సేనలు దిగెను
డేరాలు గుడహార్లు దీపించుచుండ
మందకామడ రణమండప మెత్తి
మండపమున రాజు మరి కొల్వుదీరె

## ముక్కంటి పోలురాజువద్దకు భట్టును బంపుట

తగువేగ ముక్కంటి తన భట్టు బిలచి
"తగ చంద్రవంశజు దగ్గఱ కేగి
పొడగని నను జెప్పు పూనికతోడ
వడియ శీలామంతు లొకరి బోనివక
పట్టి యిమ్మను తన పంతము మాని
పట్టివ్వ మంచిది అట్టివ్వకుంటె
రమ్మను రాజును రణరంగమునకు
పొ"మ్మని భట్టును పోల్రాజు సభకు
అంపిన నా భట్టు అమిత వేగమునను
తెంపుతో కొల్వు కేతెంచెను అపుడు
కొదలేక శివనంద్లు గుడహారుక్రింద
చెదరక యాదవ సేనలతోను
పోల్రాజు కొలువున్న పొడగాంచి
భట్టు
ఆర్భాటమునుగాను హస్తము లెత్తి
"వినుత సాహసఘన వీర హంకార!
ఘనరిపు మార్తాండ గండబిరుదాంక
మార్కొన్న రిపులకు మానిసీవిటుడ
చక్కని మన్మథ సారగంభీర!

యాదవ రాజేంద్ర! యదుకుల
సాంద్ర!
అర్థిజనావన! అబ్ధి గంభీర
వసుధ వైరులక్షత్ర!
వలురాజుపుత్ర!
అసహాయ రణశూర! యాదవరాజ!
బ్రహ్మయువగు రాజ! భట్టును నేను
సింహపురంబు నా స్థిర నివాసంబు
ఇటు విను వో రాజ! యినసమతేజ!
కటకటా నా రాజు కావేరికట్ట
పట్టి తెచ్చినవార్ని బలిమి విడిపించి
పట్టెమ మురహరు (తొ) ప్రజ్ఞలు ఆడి
తిట్టి కొట్టియు వారిని తిరుగ దోలితివి
ఇట్టు చేయుట ధర్మమేనయ్య రాజ!
ఎదిరి బల్మిబల్మి నెఱుగ కాడితివి
కొదువ జేస్తివి మంద కొల్లబుచ్చితివి
ఎదురెవ్వరిప్పుడు యాదవరాజ
కదిలొచ్చె ముక్కంటి కాలుని దళము
తెమ్ము జంగాల చేతికి నిమ్ము ఇపుడు

నమ్ము భయములేదు నామాట మీద
జంగాల నిచ్చిన జరిగి పొయ్యెదము
జంగాల నివకున్న సమరంబు నిజము
వెనుక వేసుక మీరు ఇవకుంటిరైన
క్షణములో జగడంబు సలిపి మీమంద
పశువుల చెఱబట్టి పట్టభద్రుండు
పశువుల శ్రీరంగ పట్టణము దోలు"
ప్రల్లదములు బలుకు భట్టు మాటలకు
పల్లెకొండను జూచె పకపక నవ్వి
మరదైన తిరుమందు మల్లుని జూచి
"సరవిని వింటిరా చారువాక్యములు
పల్లెకొండింటివా భట్టు మాటలను
అల్ల వడియలకు సఖిల సేనలును
ముక్కంటి కాలుండు మూకలు గూర్చి
వెక్కసంబులు ఆడి వెఱపించుచుండె
భక్తుల నిమ్మని భట్టును బంపె
భక్తుల నివకున్న బవరంబు కోరె
చొచ్చి వచ్చిన తన సొంపెల్ల విడిచి
అచ్చట తా మేకలఱు పఱచెడిని
జంగాల నివ్వను సమరంబుగాక
భంగము జూడక వడియల నివ్వ
చోడాని నిట నేను చూడగవలెను
రాడాయె పట్టపురాజు చోడాని
అంపుడు చోడాని సతనికి ఇత్తు
రంపెలేటి కతని రమ్మను భట్ట
యాదవ సేనల కెదుఱు గమ్మనుము"
ఘూదైతు డిట్లాడి పూని భట్టుసకు
రాకట్టు పుంగ్రాలు రత్నహారములు
చేకట్ల కడియముల్ చిత్రభూషలును
మెడనూళ్లు తావళాల్ మేలురత్నములు
మాడలు తగనిచ్చి మళ్ళి బెట్టంపె

## పల్లికొండసలహాతో పోలురాజు యాదవసేనలకు ఆజ్ఞ నిచ్చుట

హరిగుర్వ పల్లికొండా సమయమున
వల్లవ పోల్రాజును వనర వీక్షించి
తిరుగువాట కొలువున్న తిరుమందుల జూచి
వీరశూరుల జూచి యిట్లని బలికె:
"భట్టు తిరిగిపోయె పగ నిజంబాయె
వొట్టిగ మన మూరకుండంగ రాదు
కొంచిన పరివార గోపాలకులకు
కలనికి సెలవును కైసేయు" మనిన
అల్లు డిట్లాడంగ ఆ పోలురాజు

వల్లవ వీరుల వరుసతో బిలచి
కొదువ తిరుమందుల గొబ్బున
బిలచి
పందుములు వారిని భక్తితో పిలచి
మర్లవారిని చాల మన్నించి బిలచి
సర్వసేనల కర్త జడదారివారి
ఆజానుబాహులౌ యాదవవరుల
తా జూచి సెలవిడె దళముతో వెడల
"నూటికి సెలగను నురుమగలార!
కోటాన కోటులౌ గోపకులారా!
వీరులౌ పంతపు విలుమూకలార!
దురముకు కదులుడు తుపాకిమూక
కాలారి నేజాల గడవతులార!
వీలతో కలనికి లెండు పేరిమిని
అండగ లౌ కంపటా లక్షగోవులు
లెండు కలనికిపుడు నిండు మనసుల
మలల సింహము వంటి మరిది
తిరుమందులు
శీలమంతులు మరుగు చేరిరి కాచి
వారిగిన మనకీర్తి పుర్విపై నిలుచు
పరవుపకారముకు ప్రాణ మిచ్చినను
సురలోక మబ్బును శూరు లందఱికి
జంగాల కొఱకునై సమిసితిమైన
లింగాల మౌదుము లిఖితము గలదు
చెరుకూరు ఇది పుణ్యక్షేత్రము
మనకు
ఛేరుకూరి వీరులై జగతిని బరగు
చిత్రభానాబ్దము చిత్రముగాను
చిత్తవత్తుగ మీరు చెలగి పోరుడిక
మారు ముఖము గాక మడిమ తిరుగక
పరులకు వెన్నీక పగ కెదిరించి
ఏపున పోటులు ఎదరున నాటి
వీపున వెళ్ళిన వెఱువక మనము
గడలను బొడిచిన గండ్లను తూరి
కడుపులో బాణాలు కళపెళ మనిన
తెగిన కండలు కడా తీసివేయుచును
పేగులు వెళ్ళిన పెరికి వేయుచును
ఆయువు నిజమని ఆత్మలో దలచి
చేయుడు యుద్ధము సెలవు మీ"
కనెను
మూడుకోట్ల ధనంబు ముంధర బోసి
ఎడపక దానము ఇచ్చె నా రాజు
గంధము కస్తూరి కలయ పూయించి
అందఱికి భూషలు నమితముగా నిచ్చె
వారపు సొమ్ములు వన్నెదట్టీలు
కోరిన కట్నాలు కొసరక ఇచ్చె
వివరింప కర్పూర విడియము లిచ్చి
కవుగిట జేర్చెను ఘనుడు తా నపుడు
మరి తిరుమందుల మఱుదు లెల్లరును
అరుదెంచి గూడుక ఆ సమయమున
ఉదయ స్నానముచేసి ఉగ్రు పూజించి
పదపడి మాందూళి పట్టు వస్త్రములు
శ్రీరామ మాడలు శివకొల్లగాను
బ్రాహ్మలు భట్లకు బలువుగ నిచ్చి

వాసించు పీతాంబరి పల్లవుల్ రాసి
ఈశ్వరు పూజించి వేసె రుద్రాక్ష
ధరియించి చందము తాపశాక్ వేసి
తిరుమణి తిరుచూర్ణం తిరుమండలు
దిద్ది
హరి శివ నారాయణయనుచు సంతసమున
పీరగంధము బూసి విరజాజి సరులు
ధరియించి యందఱు దట్టీలు గట్టి
అందలంబులు కొందఱు అశ్వాల నెక్కి
కొందఱు కాల్బలం కొలిచి రాగాను
పల్లవుల్ హోయని పల్లవాయుధాలు
పెళపెళ నార్చుచు పెటికిరి పరలు
హరి గోవిందని యార్భాటముగను
తిరుమందులు పరనుండి తీసె
కత్తులును
పోత్రాజు కొలువులో పుట మెగసినటు
వల్లవుల్ తిరుమందులు వచ్చినిల్చినను

పల్లవ పోత్రాజు వారల జూచి
పులకిత దేహుడై పూసి గంధమును
రత్న భూషణములు రాజు ధరించి
యత్నించిన తుపాకి వేయు చౌరకుండ
పల్లవ పోత్రాజు పుష్పమీర దావిగ
అల్లిక తపారము యిమ్మైన జుట్టి
పిల్ల పద్దానము ఒగించి పెట్టి
పలపు యహ రాజు పంకిణి దాల్చి
బాపట తా జముదాడి ధరించె
ప్రాపుగా నుతియను ప్రక్కను దాల్చి
ముజ్జగ మెరుగంగ ముఖ్యమైనట్టి
గట్టి కఠారి ఘనుడు తా నందె
పచ్చని పల్లకి పల్లికొండెక్కె
హెచ్చుబల్లెం వారిరుగడ గొలువ
ఆనవేల్ వల్లపు లార్చుచు రాగ
తిరుమందు లేడు వేల్ తిరుగువార్రాగ

## పోలురాజు యుద్ధమునకు వెడలుట

పల్లకి యెక్కెను పౌజులు గొలువ
వల్లవుల్ హరహర వరశంభో
యనుచు
మహాదేవ యని వీర మన్నీలు
నడిచె
సహాగూడి కదిలిరి సంగరమునకు

తప్పెట్లు తుడుములు ధర
మిన్నుమ్రోయ
గొప్పగు బూరలు ఘూర్ణిల్లుచుండ
గోసంగి బలములు గొలచకొనినడువ
వేసరక రణభేరి వే మొఱయుచుండ
బిరుదు భట్లు పొగడ పిదపను రీవి

పరగగ పంచమ వాయిద్యములతో
తుపాకుల ధ్వని తుదిమేర లేక
యేపుగా కాల్బలం హెచ్చరిక మ్రోయ
కంచు కొమ్మల ధ్వని గ్రక్కటిలంగ
మించి మహాఘోష మిన్ను ముట్టంగ
కలనికి పయనమై కాల్బల మెల్ల
మలకు చేర్చిన రీతి మందిరుమేర
అలుగుల బడబాగ్ని యాదవు మంద
శూరులై యుండగ చూపులవారు
చేరి ముక్కంటికి చెప్పిరా వేళ
బారులకు సెలవు పట్టించె ధార

## ముక్కంటి తన సేనలకు యుద్ధము చేయుటకు సెలవొసంగుట

కొదలేక బాములు కదులు మటంచు
గొపకొని సెలవిచ్చె గోవుల చంప
రణములోపల వీర రౌతుల కపుడు
పుణుతక మందను పొడువగ
సెలవు
వేల పర్యంతము వీర శూరులును
ఆలసింపక కొల్ల కూడుడు మంద
ముక్కంటి సెలవివ్వ ముంచెను
దండు
ఎక్కిడె విండ్లను ఎంచగ మూక
మంచుబట్టిన చాయ మందను జుట్టె
మించిన కైదువుల్ మెఱుపుల రీతి
ఏదు ఘడియల ప్రొద్దు ఎక్కెను
వెసుక
[illegible] గుళ్ళాలు దొడ్డిపై కొచ్చె
చతురంగ బలములు సేనలు గూడి
హతమార్చ దొరకొనె యాదవసేన
మావటీల్ ధీకొల్ప మదపు టేనుగులు
ఘీ పెట్టి యేనుగుల్ గిర్రున కదిసె
మోరెత్తి ఖరాలించి మొనసి తేజీలు
బారుగ 'బాహి' యస్బలముల మీద
దళముల కెదురెక్కి దండి
యాదవుల
పెళపెళ నార్చుచు పేరాలు బారి
పొగబాణములు వేయ
బొబ్బరింపుచును
పగలు చీకటి గ్రమ్మె బాణాల మబ్బు
మండెడి తుపాకి మందుగుండులును
పడగండ్లు తొలకరి వానలను బోలె

మబ్బు మెఱుపునపోలు మరి
యాయుధములు
ఉబ్బుగ రణభేరి ఉరుము బురుముంగ
వత్తుగ పోతురాజు వాహినంతటను
చిత్రవాసై కురిసె జోర్తు చినుకులను

మన్నీలు ఏయమందు మరుదులంపఱును
''జననాథ పోతురాజ! సెలవిమ్ము
మాకు
మత్రపరులంద మంచియుం మమ్ము
నిత్యము పోషిస్తి నేపినకతను

## చోడాని మేనల్లుడు పుంఢ్రవెల్లి వుద్దన్నతో పల్లికొంత సైన్యము తలపడుట

మదగజములమీద మాకు సెలవిమ్ము''
మేదిని చోడాని మేనల్లు డౌకడు
వుంఢ్రవెలి వుద్దన్న వుదయ
భూపతితో
పందుముల రఘుపతి బలములు
ఎదిరె
బలువైన ముక్కంటి బలములతోను
పోతురాజుసేనలు పోరాడ సాగె
రవుతులు గోపాలురు రాజుకు రాజు
సవతయి పోట్లాడె సమర రంగమున
కొలిచిన పనివార గోసంగి బలము
కలసి పోట్లాడిరి కత్తినరుకులతో
మదగజంబుల వెల్ల మన్నె తిరుమందు
తుది పదముగ నరికె తూరి తొండాలు
కుంభస్థలము బొడిచి కూలంగ ద్రోచి
కుంభిని మావటీల గూల్చిరి వారు
వైరుల నొక్కొక్క వాటున ద్రుంచి

గుట్టపు రౌతుల కూలంగ నరికె
బాహబాహీ వీర భటులను బొడిచి
దేహము గాడియు దెరలక నించి
పొంగుచు పగవారి పొట్టలు చించి
సింగిణి విండ్లను చేతికత్తులను
అరిగెల నేజాల అదళించి పొడిచి
తూరి యీవల వల తూపాకి గుండ్లు
కారేటి రక్తము కాల్వలై పార
వరుస తోటల నీళ్లు వడి పారినట్లు
ఆ లక్ష గోపాలుకు లంచిఱు నపుడు
కాలు ద్రువ్వుచు సూర్యకతార్ల బొడిచి
బాణకత్తులు నరుకు పదులు ఇర్వదులు
పోణిమి చెడి నేల పోర్లాడువారు
సురియలతో పొడిచి స్రుక్కుచువారు
కురుకురు యనుచును కూలెడి వారు
నజ్జుగ కత్తులు నరికిన యపుడె
బొజ్జ లీడ్చుచు నేల పొర్లేటివారు

జబ్బలు దెగపొడిచి జంఘలు నరికి
వుబ్బుచు నేలపై వొరిగెడివారు.
బాకులతో బొడువ భళిభళి యనుచు
వీక విండ్లమ్ముల కెదురెక్కువారు
గన్నెరా కలుగులు గర్రున నాటి
వెన్ను తూరిపార వెఱవక నిలచి
పొన్నపూ బల్లెలు పొడిచి వడద్రోచి
తన్నుదా నెరుగక ధర గూలువారు
గుమ్మడి గింజలుగ గుప్పిన యపుడె
వమ్ముగ ధరమీద వరిగేటివారు
తిరిగి చుట్టుగడం తిరిగి పొడిచినను
అరిచేత ప్రేగులు నదిమి పట్టుకొని
విల్లునంబుల పోట్ల కీచెపోట్లకును
అల్ల ధరణి బడి హతమగువారు
అరిగెలు తాటించి ఆయుధాల్ నరికి
హరహర యని భూమి నటు బడు
వారు
కొంకక అటు నరికి కొంగవాల్ కత్తి
జంకక భువిమీద సమసెడివారు
రౌతులు పల్లాలు రణము లోపలను
వేతునియలు గాగ వేయు గోసంగ్లు
సరవిని రౌతుల చాచి నరికినను
వరిగిరి గోసంగులు వరుస కలనిలో
బిరుసులు తగిలిన బెదరక నిలచి
మీరి భళాయని మెచ్చెడివారు
ధీమున్న రకం(బు ఓమిం)చి పార
దొమ్మి మూకల నెల్ల దొడి గూల్చు
వారు
జంతి కూడినవారి పంక్తులు నరికి
కుంతాల పడనెట్టి గోపకుమాళ్లు
సెలగోల లందుక చేకొని నరికి
కలనిలో శత్రుల గాసిల్లజేసి
వడిగల గోపాలుకు లొరిగి రక్కడను
పడెవాగె తేజీలు పడి రణమందు
వడి వుడిగి రణములో వాలెను చాల
విడిబడి రణములో విజ్ఞోడుగాను
గుడిచుట్టు గశ్వాలు కూలె నచ్చోట
రౌతుల బడబొడిచి రిభసంబుతోను
వై తప్పి రణములో వరిగిరు గడల
పొడిచి క్రొవ్వున నార్చి పొడ్డేలు
బారి
వడి యీట్ల పోట్లచే వరిగెడివారు
గాయాల రక్తము కాల్వలై పాఱ
బాయక కలనిలో బడి పొర్లువారు
చొక్కచివ్వలు నాటి చుర్రున స్రుక్కి
పక్కరొక్కరి దాపు వరిగెడివారు
చక్రాలు వేసిన చెదరక నిలచి
ఉక్కుటల్లులమీద వొరిగెడి వారు
దూరాన వేసిన తుపాకిగుండ్లు
వారి కడుపులో చిక్క వడచెడి వచ్చి
ఉండంగ ప్రాణాలు వుండుబోవుచును
ఉండి శూరుల పొడిచి ధర గూలువారు

తల్లి కడుపుతొ తిరిగి చాగేను
యనుచు
మల్లి తిరిగి శత్రు మసులుచు పొడుచు
కొలువు గడల వారి కొంకులు నరికి
శూలాల పోట్లకు చుర్రున గ్రుక్కి
ఆలుబిడ్డల యిండ్ల ఆస యేలసుచు
పల్లికీల్ రాజుల పడ పొడుచువారు
అందలంబుల వారి నందెల గడల
అందంది పొడిచెడి యపుడు
యాదవులు
చచ్చెడివారికి సంభ్రదము ఎంత
వచ్చు మోకాలి లోతాగి వడి తెలియ
అని పల్కి రణములో నశ్వాలువారి
గణికెలుగా నరికి గడలతో జిమ్మి
చెండు బెండాడిరి చక్రాలచేత
పడితెగి శిరసులు పర్రెలై పగిలి
యుద్ధరంగమునందు ఇరు బలములును
యుద్ధము చేయంగ నుర్విని బడిరి
తెగిబడ్డ జబ్బలు తేలు మొండెములు
తెగబడి పగిలి రణములో తేలాడసాగె
నొసలు పగిలి తలల్ నొగిలిన తలలు
మీసాల శిరసులు మీసులవలెను
పదటున లేచుచు పొరలెడి తలలు
మెడను వెళ్లిన తలల్ మెదిలెడి తలలు
పుర్రెలు పద్రుత్తై పోయెడి తలలు
కురులు వీడిన తలల్ గడ్డాడిన
తలలు
వీరజడలు వీడి వ్రేలాడు తలలు
కీళ్లు దప్పిన మెడల్ కిందుగా బడియు
కాళ్లను వ్రేళ్లను కరచరణములు
తొడలును కొంకులు దొబ్బగుండెలును
మడిమల్లు కూడిన మరి యెముకలును,
బొజ్జలు గజ్జలు భుజము సంధిళ్లు
అజ్జైన ప్రేగులు నలుగు పిక్కలును
నరములు ఉరములు నడుములు విరిగి
ఛిద్రుపలై కలను చెల్లిరివారు
గుర్రాలు లొటిపిటల్ కూలె నేనుగులు
అరిగెలు విఱిగిన ఆయుధంబులును
తునుకలై బల్లేలు తుమురు కావింద్లు
అని రక్తములో దేలి అటు రాగ
జూచి

## ముక్కంటి హతశేష సైన్యమును బురికొల్పుకొని యుద్ధమునకు వెడలుట

కాల విట్టుడు ప్రళయ కాలుడై మండి
కలియుగ చోడానికి కలిగినవారు
వెలుపు మఱుపు లేని వీరవిక్రములు
మఱచితిరో చేయ మన్నీలు మీరు
గొల్లరాజు వలన కోల్పోయె దండు
చల్లంబో నేనుండి చందంబు గాదు
యెల్ల సేనలు మీరు విడిబడి పొడు
వుడు,
ముక్కంటి కాలుండు మొన యయి
నిలచె
అక్కడ యాదవు లార్చుచు కదిసి
అల్లుడు పల్లికొండా పోలురాజు
వల్లవ తిరుమందులు మైన మైనాన
బల్లిదు చోడాణి బలముల నెదిరి
అల్లున కో యని యార్చి రందఱుమ
ఎదవిండ్లు నెక్కిడి యాదవులంత
కొదలేక అంపవాన కురియించసాగె
అంతట ముక్కంటి యా రాజు జూచి
అతిరత్న మనియెడి యశ్వంబు నెక్కి
కడు వేగ ముక్కంటి కాలుండు ఎదిరె

## ముక్కంటి పోలురాజుల ద్వంద్వ యుద్ధము

పిడుగుపేరనబడు బిరుసు గుఱమును
పోలురాజెక్కియు పోరుకు ఎదిరె
కలగి సింగిణి విండ్ల కదిలి రిద్దరును
బాణాలు వేయంగ భారంబు లాయె
బాణముల్ నాటియు పడులు
ఇర్వురులు
ఎదముల తేజీలు యెద్దురూపమున
కదలక నిలచెను గజగజ వణకి
ముక్కంటి యశ్వము మూర్చిల్లి
వొరిగె
అక్కడ పోలురాశ్వము మేను
నిప్పు మంటలుగులు నిలువెల్ల నాటి
గప్పున వొరిగెను కల్లిమధ్యమున
ఆవుల పోల్రాజు నపుడు ముక్కంటి
భువికి లంఘించియు పోరాడసాగె
వజ్రాయుధములతో వరుస పోట్లాడి

నేజాల బాకుల నేర్పున పోటి
ఆవుల పోల్రాజు ఆయుధంబునను
వేవిడి ముక్కంటి యెదురొమ్ము
పొడిచె
పోటు వెంటనే దూలి పొడిచె ముక్కంటి
పోటుగ పరుజుతో భారంబు గాగ
తర్లక ముక్కంటి తా నిల్చి వేగ
పోల్రాజు గానంట పొడిచె నేజాతో
ఆవుల పోల్రాజుకు అతిభార మాయె

## పోల్రాజు ముక్కంటిని నరుకగా అతడు నేలకూలుట

కాటని తెగసరికె కల్లిలో వొరుగ
చెరుకువాడేలేటి జంగాల వుసురు
చెరుకూర ముక్కంటికి శాపమట్లాయె
అయ్యగాండ్ల వుసురు అలుగులై నాటి
వయ్యన కల్లిలో వొరిగె ముక్కంటి.
ఎదురు రొమ్మున నాటె యెనిమిదిపోట్లు
మది శివు దలచుచు మరియు నేమరక
శిరసు పోటులచేత శివశివ యనుచు
పరిపరి అలుగులు పాన్పులు గాగ
గాయాలు ఇటు అటు కానరాగాను

## పోలురాజు నేలకు ఒరగుట

కయివాలె పోల్రాజు కరకంతు
దలచి
పోలురాజు నొసటి పోటు గాయాన
పొలపొల విభూతి పొరలంగ సాగె
బల్లేల పోటులు భారముగ నాటి
వల్లవులకు విభూతి వరషంబు కురిసె
పల్లెకొండకు నాటె బలువు గాయాలు
అలుగులు నాటియు ఆవల వెడలె
తిరుమండులకు నాటె తీవ్ర బాణాలు
వరి ముల్లెడములేక వరుసను నాటె
మరి తిరుమందుల మన్నెసింహముల
తెరలుచు గాయాల తిరుమణి గురిసె
గురువు పల్లికొండ గుప్పుగుప్పునను
అరుదైన గాయాల నతిభారములుగ
గోపి చందనమును గురిసె గాయాలు
ఏపుడిగి గోవులు అంతట పడగ
తల్లడించెను మందతల రాజు వరుగ
అలుగుల పాన్పున ఆ పోలురాజు

చెరుకూరి శివపూజ చెల్లె వేగంబె
సిరివీడి మందలు చెదిరటు ఇటుల
చెదిరెను గుడహార్లు చేరులు దెగియు
నందుల గుడహార్లు మందలో వారిగె
పోత్రాజు గుడహారు పొర్లె రక్తాన
వల్లవుల గుడార్లు పరదన గలిసె
కూలెను తిరుమందుల కొలువుగుడార్లు
తెల్లని గుడహార్లు తేలె రక్తమున
ఆవుల పోత్రాజు హస్తములోను

## పల్లికొండ మూర్ఛిల్లుట

కై వాలె తల మోపి ఘనుడు పలికొండ
అగులు భుగులు నాయె హరిగుర్వు వరుగ
పగలు చీకటి గ్రమ్మె పల్లికొండారుగ
నందుల పోత్రాజు నడుమ నుంచుకొని
బంధువర్గం.బంత బడె తిరుగువార
యదువులకు చిత్రభా నెదురొచ్చె ననగ
పందుముల రఘుపతి ప్రక్కన వారిగె
కాలుకాల్ పెనుసుక కల్లందులవారు
చల్లవాళొరిగిరి చాపకట్టుగను
మర్రిపొదుగునను మన్నీలు చెల్లె
మర్రిక్రిందను రక్తమడుగులు కట్టి
ప్రదక్షిణము తిరిగి పారంగ సాగె
మందలంభా యని మరి యడలసాగె
తెప్పరిలి పలికొండ తెలివి తప్పకను

## పల్లికొండ మూర్ఛ దెలిసి పోలురాజును చేతితో నిమురుచు దుఃఖించుట

అప్పుడు పోత్రాజును హస్తాన చమిరె
"మామరో ! పోత్రాజ ! మాట్లాడు నాతో
ఏమి ముచ్చట లాడవేమి జెప్పవుసు
అన్నల బాపితి నలిగితి వేము
నన్నును జూడవు నా మేనమామ ;

పైడమ్మ చింతను పక్షిశకునము
చెడుగని నీకు నే చెప్పితి మామ
పెద్దిరాజు సింహాద్రి ప్రియము
నీమీద
అది విడిచి పగవారి అలుగులకు
దెస్తి
పెంపొంద మీయన్న పెద్దభూపతికి
ఇంపు కూర్చెడి భక్తి యిటు చెల్లె
మామ
ఎలవోక మీయన్న యెలనూకరాజు
నలుగురికి తమ్ముడని నలనూకరాజు
దయయుంచ నీకు నే దాపయి మామ
మాయగ చిలకల మర్రి పాల్చేస్తి
ఎన్నగ కొమరమ్మ యన్న యేడంటె
నిన్నుగూర్చి తేను మేమని జెపుదు
చెల్లంబో వలురాజు చెల్లిన వెనుక
వల్లమ్మ గుణపతి వచ్చి నను బిలిచి

'తల్లిదండ్రులు లేని తనయులేగురికి
తల్లివండ్రివి నీవె పల్లికొండయ్య
కనగొట్టు పోత్రాజు గారాబు కొడుకు
ఒడుగక చూచుచు వుందుము అయ్య'
నమ్మిక పుచ్చుక నాకొప్పగించె
నమ్మించి మెచ్చియు నరబలి జేస్తి
హరిగురుడని నన్ను ఆడినందులకు
పరుల బల్లెంబుల పాలు చేసితిని
అల్లుడు మామను హరుసంబు నేడు
చెల్లెంబొ నేటితో సమిసెనో మామ
తనయులు మిన్నుదిగి తల్లడించేరు
విన జెప్పుదువు వారి కెటులైన ఓ
మామ"
ఆరీతి పల్లికొండదలుచు తాను
కారేటి రక్తాన కౌగిట జేర్చి
పల్లికొండిట్టుల పలవరింపగను

## పోలురాజు మూర్ఛదెలిసి పల్లికొండతో మాటలాడుట

తలయెత్తి అల్లుని తప్పక జూచె
"అల్లుడా పోట్లు నీకంతింత గాదు
తలకొన ఋనుబడి దండి గాయాలు
కడలేని రక్తము కారుచు నుండె
ఉడుగుము నీవు నాకు వగవ
న్యాయంబె

పర్వత మన్యాల పంపించినాము
చేరిరో మద్యాను చెడిపోయి రేమొ
వగవవలెను శీలవంతుల కొఱకు
తగ విను చెప్పెద తగు నొక మాట
శివునికి మ్రొక్కెడి శిరసు వేటుపడె
శివునికి మ్రొక్కని శిరసది యేల

భస్మము ధరియించ బహు విఘ్న
పాయె
భస్మము నలదక బ్రదుకుట యేల
బ్రహ్మరంధ్రము గాడిపడె భారమాయె
దేహం బదేలను దేవుబ్రొక్కకను
పంచలింగాల కొండ పానువట్టముగ
నుంచి నా బిడ్డల నీ వాదరించు
చల్లవారలు చేవస్థంబాల రీతి
పల్లికొండెలమంచి పట్టమేలుచును
ఉన్నారు వారి నే యుపమున నైన
గ్రన్నన తొలగించి కట్టు పట్టమును
ఊరు వుయ్యాల జేసి వడి గద్దెజేసి
పరగ నీప్రక్కను పానుపు జేసి
పాలు నెయ్యియు బెట్టి బాలల బెంచు
బాలల బెంచెడి భావము వుంచు
యెండ సీడను కన్ను లెఱుగకున్నారు
కండ్లను రెప్పలు కాపాడినట్లు
అయ్యన్న బలుకుము అమ్మన్న బలుకు
నెయ్యము బిడ్డల కీవె తలితండ్రి
ఈడేర్చు బాలల నింతలంతలుగ
పెండ్లిండ్లు చేయుము పెంచి బాలలను
మరుదుల నీడేర్చి మా యిండ్లు నిలుపు
గురి పంచలింగాల కొండ నుండెదను
నిరవుగా నెప్పుడు నిచ్చోట నేను
వల్లవుల దిక్కన్న వాహిని నిబుపు"
పల్లెకొండిట్లాడు పలుకులు వినియు
పల్లికొండకు గుండె భగ్గుమనపుడు
పల్లికొండాడెను పలుకు గద్గదిక:
"ఇప్పుడు యీ మాట లెట్లాడితీవు
నొప్పెరుగ వైతి వి నోరెట్లు ఆడె
భారపు గాయాల ప్రాణంబు నిలదు
తరముపెద్దను మీదు తండ్రి నాటివాడ
పాటిగ నెరిసెను పై వెంట్రుకలును
వాటిల్లె వార్థకము వాలె కనుబొమలు
మిగుల కానగ లేను ఈనాటి వాడనా
ఈ గోల బాలల నెటుల సాకుదును
తరతరమును మీదు తనయుల తరము
తరములు మూడు మీ తనయుల బెంచ
సొదకు వోర్వగ లేను సొద యేలనాకు
వృద్ధును బిడ్డల నెటు బెంచగలను
తల్లినై వుండాలి తల్లి గుండవలె
చెల్లంబొ నే బెంచ చేతనెట్లౌను
పండిన పండును బరువు నాకేల
నడుప పెంచగ జాల నా చేతగాదు
మామ నీతో చెల్ల మంచిది నాకు
నా మనవినుము ప్రాణము నిలున
బోదు"
పల్లికొండనగను పకపక నవ్వి
పోత్రాజు కౌగిట బూన్చిటు లనియె:
"అల్లుడ శతవృద్ధు వవుదువు నీవు
ఎల్ల పాపములను ఎడబాపు దీవు
అరువదేండ్లు వరకు ఆయుష వుండె

అరువదేండ్లకు గాని అంత్యము లేదు
కైలాసమున కేగ కారణం లేదు
ఇల వెలసియుందును ఇచ్చట నేను
ఇంచలింగాలొక్కొండ పానువట్టు మయి
అంచిత గంగరేగా తాపరముగ
చిత్రభానాబ్దము చెల్లితి నిపుడు
చిత్రభాను వఱకు శిశువుల బెంచు
అల్లుడ నీవొచ్చి అరువదేండ్లకును
పిలిచిన బలుకుదు ప్రియముతో నీతో
వడివు ఘో యనుచును వల్లపు శిలలు
కూడి తిరుమందులు గోవింద యనుచు
నిన్ను విడిచిపోను నిజము నామాట
విను బాలలును మీరు ఏను బంధువులు
శివపురి కేగుదము చిత్తాన నమ్ము
చెవికమ్మ గాజులు చెపఱక నిలుపు
అత్త నూకాంబిక కరువదేడులును
అర్తి నల్లలపూస అయిదపతనము
ఇద్దరు మీరుండి యీడేర్చు సుతుల
దద్దయు చెయిబట్టి తనయుల బెంచు
అల్లుడ నామాట అరిగదున వద్దు
అల్లుడ నమ్మించు"మని చేయిబట్టి
"అపద బంధువ పల్లుడ నీవు,
చేపట్టు బాలల చెప్పి నమ్మించు"
"చెప్పితి వొప్పితి చెయివిడువు మామ
ఎప్పుడు బాలల నే బెంతు నిజము
ఉడుగను నీమాట వొర్తు నీదేర్తు
పెండ్లిండ్లు చేయుదు పెంచి యీడేర్చి"
అనుచు నమ్మిక చేయగా సమయమున
చనిన శీలామంతులు శ్రీశైలము జేరి
మల్లిఖార్జున ముఖమంటపముందు
తా లింగపూజ లందఱు జేయుచుండ

## శ్రీశైలము చేరిన జంగాలు లింగపూజ చేయుచుండ పోలురాజు చెప్పిన గుర్తులు కన్పించుట

కమండలము నీళ్లు కడు రక్తమాయె
క్రమముడిగి దొబ్బలై కౌచువాసనగ
శిలలప్పు డొఱిగియు చిటచిట నవిసె
మేలిమి బెత్తాలు మెలికలై విఱిగె
పడి వొరిగె శూలాలు పగిలె భద్రాక్ష
పిడిగంట లప్పుడు బీటలు వాఱె
శంఖులు చెదిరెను చిట్లె విభూతి
శంకరపూజలు చిందు బిందాయె
శీలమంతు లడలె శివశివ యనుచు
ఇలబడి యెలుగెత్తి యేడ్చి రందఱును
గుఱుతులు దెలిసెను కూలె యాదవులు
చేరి పోలురాజుకు చేటు దెచ్చితిమి

మనము పోర్లాజును మడియ జేసితిమి
మనవల్ల రాజు తా మరణము నొందె
హింస గట్టుకొంటి మిపు డొడియబార
సమిసిన మేలు ఈ స్వామి
ముందఱను
మల్లప్ప ముందఱ మడియుద''
మనుచు
తల గండకత్తెరల్ తగిలించు
కొనియె
వుఘో వుఘో యని వుత్తరించుటకు
వుఘో యని యఱచె వడియ
లందఱును
గర్భగృహము తలుపు గడగడ
వణికె
గుభగుభ మల్లప్పగుడి తల్లడించె
పర్వతమల్లప్ప ప్రత్యక్ష మాయె
"వొరుగ మీకేటికి వుగ్రంబు యేల
శీలమంతులార చెల్ల మీకేం
ఏల మీ సాహసం బెందుకొఱిగెదరు
నడలింగమూర్తులు నామారు మీరు
వడియలు మీకేల వొరుగ నిచ్చటను
నేనె మీరై వున్న నేరంబు ఏమి
మారుట ఈశ్వర మహితు" లనంగ
శీలమంతులు మ్రొక్కి శిరసు వొంచి
ఫాలంబు చెయిజేర్చి పల్కి రిట్టులను:
''చెఘకువాడేలుచు క్షేమాన నున్న
శ్రీరంగమేలెడి క్షితినాయకుండు
కలియుగ చోడాని కావేరిపనికి
తలగక రమ్మని తరితీపు చేసె
పోలురాజను దేవపుణ్యచరితుడు
నెలవయి దాపున నిలిచె చెరుకూర
కాపురములతోడ కష్టముకు వెఱచి
మాపట పోర్లాజు మరుగు జొచ్చితిమి
చెదరక కాచెను చేపట్టి మమ్ము
ఏది భయము లేదని ఇటులంపె
నిటకు
మా నిమిత్తము రాజు మందతో
మడిసె
పూని జంగములను పూజించు వాడు
వీభూతి రుద్రాక్ష వీరుతైనారు
ఆ భూపతి యదువు లతని మందలును
పుడమిని చెల్లిరి పోర్లాజుమంద
బడుగులపతి రుణము బాపుకోలేము
హతమాయె మమ్ముండి ఆ పోలురాజు
అతనికిగా లింగ మౌదుము మేము
ఇందుశేఖర ! మేము ఇత్తు ప్రాణాలు''
అందరయ్యల మాట కానంద మొంది
కరుణతోడుత మల్లికార్జును డనియె
"పర ఉపకారులు భక్తులందరును
కలియుగమందును కలరు పుణ్యులును
ఆల శివభక్తుని హర్షించుదాము
పదరయ్య పోదాము భక్తులార"నుచు
మదనుసంహరమూర్తి మనుజరూపముతో

## శ్రీశైల మల్లికార్జునుడు జంగాలతో కలసి చెరుకూరుకు వచ్చి పోలురాజునకు మోక్ష మొసంగుట

మరి వేగమున శీలమంతుల గూడి
చెరుకూరి కేతెంచె చంద్రశేఖరుడు
అల శీలవంతుల నావల నుంచి
చిలకలమర్రికి శివుడు ఏతెంచె
పొరలుచు నటు జూచి పొలికలనందు
శరణని పోల్రాజు చేయెత్తి మ్రొక్కె
''ఎక్కడి శరణయ్య ! యాదవరాజ !
ఎక్కడెక్కడి పోట్లు ఎంత భారంబు
అమ్మమ్మొ నీకెంత ఆయుష వుండె
సొమ్మసిలక యేమి స్రుక్కకున్నావు
బాగుగా నుదుటను భారపు పోటు
వీగక ప్రాణము లెట్టు వుంటివొకొ
ప్రాణము బిగబట్టి పనము నొందకను
ప్రాణని కాశించి బ్రతుకనున్నాను
సతిసుతు లాశను సంసార మాశ
బ్రతుకు ఆశించి నీ ప్రాణము నిలుప
ధనధాన్య కాంక్షనా ధరమీది కాంక్ష
అన్నదమ్ముల మీద ఆవుల మీద
బాలల మీదాశ ప్రాణ ముంచితివి
ఆవులరాజ! నా కానతిమ్మిపుడు''
పలికిన శివునితో ప్రాణము నిలిపి
పోల్రాజు పలికెను పొలనవ్వుతోడ
''ఆలుబిడ్డల వొల్ల అర్థంబు వొల్ల
వొల్లను సంసార మొల్ల భాగ్యంబు
అన్నదమ్ముల వొల్ల ఆవుల నొల్ల
ఇన్నిటి మీదాశ యింతైన లేదు
యేనూరు కుటుంబాలా ఏపురుపతులు
విను చోకబాధల కిట జొచ్చె మరుగు
పర్వత మంపితి భక్తు లందఱిని
సర్వథా వారల సైన్యంబుతోడ
శ్రీశైల మయ్యలు చేరిరో లేదొ
పసిబిడ్డ బాంధవుల్ పరిణామములను
ఎవరిచే వినుటని యెదులు జూచెదను.
ఎవరెఱిగింతురొ యెటు తోచకుండె
భక్తులమీద నా భక్తి యున్నాది
భక్తులను వినక ప్రాణాలు విడువ
శీలమంతుల వార్త చేరెనదనుక
నిపితిపితి ప్రాణాలు నీ పాదమాన:''
మల్లప్పభక్తుల మరి చేర బిలిచె
అట్లంత మతపతు లాగొబ్బుగాను
చాటున వున్నట్టి జంగాలు వచ్చి
పట్టిరి శంఖులు బ్రహ్మాండ మదుర
శరణనె అయ్యలకు శంఖునాదులకు
కర్ణపూరిత మాయె ఘంటనాదులకు
ఘుంచను నిలిచెను నందివాహనుడు
పొందుగ దండము పోల్రాజు బెట్టె

"ఇయ్యేడు జగముల నీడేరె కీర్తి
అయ్యల క్షేమము హరమూర్తి గంటి''
పొర్లి దండము బెట్టె పోలురాజపుడు
మల్లప్ప రాజును మరిపురి మెచ్చి
"అంతటి భక్తి నీదయ్యలమీద
యెంత పుణ్యండవు యాదవరాజ
పరమోపకారముకు ప్రాణ మిచ్చితివి
పరమోపకారివి భళభళా'' యనుచు
మెచ్చియు పోల్రాజు మేన చేవైచి
హెచ్చుగ నిమిరియు నిటు బల్కె హరుడు ;

"కలియుగమున నీరు కలిగినన్నాళ్లు
ఇల యాదవకథలు వెలయుసుగాక."
అని భస్మమును బెట్టి హరుడు వేంచేసె
చనగ శిలామంతుడు చాల దీవించి
శంఖుతీర్థంబు ప్రసాద మివ్వగను
హెంకము నీరును బోసె పలికొండ
జీవ మెడలి రాజు శివుని కొల్వునకు
ప్రావేశ మాయెను పరగ పోల్రాజు
చన మందలను శేష జనము దోడుకొని
అనువేగ పలికొండ అర్థవీడేగ



# బల్లికురవ పోట్లాట

శ్రీకరంబైనట్టి శ్రీరాము దలచి
ప్రాకటముగ గంగ ప్రార్థన జేసి
గణనాథు నుతియించి గజచర్మధరుని
వనజనాభుని భక్తి వాంఛతో గొలచి
భాసిల్లు శారదాంబను మది నెంచి,
ఆచంద్రతారార్కమై విలసిల్ల
బల్లికుర్వ పోట్లాట ప్రజలార వినుడు

## పల్లికొండాదులు అర్థవీడుకు వచ్చి సిరిదేవితో పోలురాజు మరణవార్త తెలుపుట

పల్లవగోత్రంబు వసుధపై వెలసి
యుల్లంబులో కీర్తి యుంచుట కొఱకు
గొల్లలు కంపటీల్ గోసంగి బలము
మరియు పోత్రరాజు తిరుమందుల మల్లు
పరగ షుక్కంటితో బారులు దీర్చి
చెరుకూరు రణరంగ క్షేత్రమనిపించి
హరిహరాదులు పొగడ అమరులు మెచ్చ
అరుదైన బాణముల్ ఆయమున్ దగిలి
చెలుగుల పాన్పుపై ఆ పోలురాజు
ధరణాల అమరేశు తనయుని జంపి
చెలగుచు శ్రీశైల శివుని మెప్పించి
అల్లుడు మృతులకు హరిపురిప్పించ
పల్లికొండతో ఆత్మభావంబు దెలిపి
జంగము వెంటను సాహసోత్తముల
ముంగలంపించిన ముచ్చట దెలిసి
అర్థవీటికి బోయి అందర్ని దోడుక
పద్దుతో యబమంచి పట్ణము జేర
బొమ్మని సెలవిచ్చి పోయె శివపురికి
అమ్మనుజేశుని అనుమతిచేత
ఘనుడు అర్థవీటికడకు నేతెంచి
వనితలతో చేటువార్తలు దెలిపి
ఘనవేగ బంధువర్గముల నందఱిని
అనుపంద బిలుపించి అప్పుడిట్లనియె

"సంగడావుల చెన్ను! చట్టి మారయ్య!
అంగిరేకుల బాలు! అమృత ముసిలు!
కౌలావు లక్ష్మయ్య! గౌరి
హనుమంతు!
మైలావు రామన్న! మాధవు శింగన!
రామనవోయిన వేంకట! రంగు
మాదయ్య!
కాపుసబోయిన గోపన! కనకము
చెన్ను!
పద్మాల తిరుమల! బసుగుబ మల్లు!
భద్రాక్ష నరసింహ!బందారు పనము!
లక్కము ఓబయ్య!రాచూటి పాపన!
జక్కము పోలయ్య! సాక్షి సూరయ్య!
వేకర్ల ఓబన్న! వేల్పుల సాధు!
మాకము వేంకటాద్రి! మంద కోనేరు!
పెదపీర్ల పెమ్మయ!పేరము అబ్బు!
ఆదనూరి సుబ్బయ! అచ్యుత పరాశు!
సింగినాదము సిద్ధన! చింత వీరయ్య!
సంగనబోయిన రాఘవు!
సత్యమంతులార!"
అని యిట్లు పేర్వేర అందర్ని బిలచి
ఘన సుగంధము మేన కస్తూరి బూసి
"వినరయ్య చెరుకూరు వీరపోట్లాట
ఘన పరాక్రముల వుక్కణచి
మా మామ
రాజుల ఏనుగుల వసుధపై గూల్చి
రాజు ప్రధానుల రాయమన్నీల
కదసి యాదవులెల్ల కదనమున రిపుల
మదమణచి చిలుకలమర్రి యిరుగడల
తలిగిరి ముక్కంటి దళముల నెల్ల
వొరిగిరి కొండలపలెను యాదవులు
శ్రీరామ గోసంగిసేన యుద్ధంబు
ఘోరాసి వైరుల గుట్టలుగ వైచి
చైబాకు ముప్పిళ్ళ చెండు చెండాడి
పై భారమై మామ పాదాల ముందు
పరిగిరి గోసంగి వరసమూహంబు
అరిసైన్యము గూల్చి అసురులు మెచ్చ
చేసిరి యుద్ధంబు చెల్లిరిటువలెను
బాసిపోయిరి మసల బంధువర్గంబు
రాజు యుద్ధంబు శ్రీరాముల కెఱుక
రాజమార్తాండుల రణములో ద్రుంచి
హతమాయె మామయ్య హరుడు దయ
దప్పె
మతిమంతు తిరుమందు మల్లు
యుద్ధంబు
నాతరమె వర్ణింప నా యన్నలార!
ఖ్యాతి యుద్ధము జేసి కైవాలె భువిని
తమితోడ మీరినంతకును యుద్ధంబు
రమణతో జేసితి రాజు ముంగలను
భారంపు పోటు లుత్పాత మయ్యేడిని
ధారుణీశ్వరుతోడ తాళ లేనంటి
ఆయాసపడగ నా యాపద జూచి

గాయాల విభూతి గప్పె మామయ్య
తెలివొంది నానొప్పి తీరిన వెనుక
ఇల నొప్పుగా అర్ధపీటికి బోయి
యెలమంచి పట్నముకు వెలదుల
తోడుక
చెలగుచు వేంచేసి చల్లవారలను
పట్టణము వెళ్ళించి బాలరాజులకు
నెట్టన రాజ్యంబు నేకచక్రముగ
ఏలించుమని చెప్పి యేగె శివపురికి
బాలరాజుల గన్న భామినీమణుల
చిచ్చురక వంటని సిరిదేవితోడ
మచ్చికతో దెల్పి మన బంధువులను
వెనువెంట తోడ్కొని యెలమంచి చేరి
పనికొని అయితభూపాల భోజునకు
పట్టణము గట్టించి పాలింపు మనుచు
పుట్టిగ సిరిదేవి కాంత కొమరమ్మ
గోపవర్గము వార్త గొబ్బున వినియు
నీపట్ల సగ్గిలో నిడుకొందుమనుచు
పైనమై యున్నాము పణతు లందరును
వైనమున మనమేగి వనితంతోడ
మామ జెప్పిన యట్టి మనువు
లన్నియును
సామదండోపాయ సకల మర్మములు
తెలుపుదా" మనియు పందముల
దిగ్గజము
కులబంధు జనులను గురుపు
తోడ్కొనియు
సిరిదేవి కొలువుకు శీఘ్రవేగమున
పరువడి నేతెంచె పల్లికొండయ్య

## సిరిదేవి, కొమరక్క మొదలగు యాదవకాంతలు సొగుమానమునకు సిద్ధమగుట

ఆ సమయంబున అతివ సిరిదేవి
భాసిల్లి తనచుట్టు పణతులు గొలువ
సుజ్ఞాన ధర్మముల్ సుదతులు
వినుచు
అగ్నిగుండాలకు ఆయత్తపడుచు
ఈ విధంబుల నున్న యింతుల జూచి
భావించి యిట్లనె పల్లికొండయ్య
"చిచ్చు సమాధుల సెలవు మీకెవరు
ఇచ్చినారోయమ్మ యింతి సిరిదేవి ?
రక్షకుడు మా మామ రాజదేవేంద్రు
నిశ్చయంబుగ మిమ్ము నిలుపుమనె
నమ్మ !

పుత్రులకొలకు ఆ పుణ్యాత్మవరుడు
పత్ర మంపించ నింపార తనచేత
ఈడేర్చి పెండిండ్లు విరివిగా జేసి
తోడుగా యలమంచి దొరలనిపించి
కీర్తి నిల్పుమటంచు కేవలము నాతొ
పార్థివోత్తముడు సంప్రీతితో దెల్పె
మీకు సెలవియలేదు మీనాక్షులార
మాకు సెలవియవమ్మ మగువ
సిరిదేవి !"
బలభద్ర రఘుపతి పలికినందులకు
సలినాక్షు లంచరు నవ్వి యిట్లనిరి :
''అన్నలసు ! యీ పొట్టి ఆశలు
ఏల ?
పిన్నలున్నారని ప్రియము మాకేల ?
బ్రతుకుట యెన్నాళ్లు ? భాగ్య
మెన్నాళ్ళు ?
పతిలేక అరఘడియ బ్రతుకు మాకేల ?
కలువల దొర గలడు
కాంతి చంద్రుండు
అల చందురుడు బోతే ఆ కాంతి
యేది ?
వెలయ తామరలకు ఇనుడు పతి
యయ్యె
తకుకు గూకితె యేమి తామరల
కాంతి ?
తమ సతిపతి న్యాయ తగవు దప్పితే
గన
కొమరొప్ప పరమేశు కొలువు
దూరంబు
శృంగారపు వనమున చెడుచెట్టునట్టు
రంగు దప్పియు నుండు రాత్రిరి
బగలు
పతిలేని సుతులేల పల్లికొండయ్య ?
హితవు మాలిన మాట లిందు సరిరావు
వృక్షము గల్గితే వుర్విలోపలమ
పక్షులకు దిక్కు గద పల్లికొండయ్య
పరగంగ పతిని ఎడబాసిన సతికి
సరగ మోక్షము లేదు
సర్వసిద్ధముగ"
అనుచు దిగ్గున లేచి అతివ సిరిదేవి
కనలుచు వల్లవ కాంతలందరికి
సెలవు ముమ్మాటిచ్చె చిచ్చులకురుక
అలివేణి కొమరగిరి అంతలోపలనె
మంటలకు సెలవు తిరుమందు
లందరికి
జంటన సెలవియ్య చయ్యన వెడలి
తరుణులు నూనెల తలలంటుకొనిరి
అరయంగ సీకాయ అటకలి బెట్టి
తల గడగి స్త్రీలంత తగ నొక్కచోట
నెలకొని చేటల నోములు నోమి
పెట్టెల సొమ్ములు ప్రేమతో దాల్చి
పట్టుచీరెలు గట్టి పైనమై వచ్చి
సఖియలు గుండము చాలున నిలువ
సకల బాలలు ధుఃఖ సాగరముగాను

జాలిమాలిమిగ తల్లి చరణముం
కొరగి
బాలరాజులు దుఃఖపడిరి హా
యనుచు
పల్లికొండటు జూచి బాలలందరెని
చెల్లంబొ నేనేమి సేతునని పగచి
తలవంచి మామను తలచుక మదిని
పలవరింపగ సాగె బలభద్రమూర్తి
''బాలల బెంచుమని పంపితివి నన్ను
చాల దెల్పితి నేను సఖియ లందరికి
నలినాక్షు లిప్పుడు నా మాట వినక
యెలమితో గుండమున కేగుచున్నారు
తరుణుల దండించ తన చేతగాదు
మరుదుల దుఃఖంబు మాన్పంగ లేను''
అనుచు పూబోణుల కడ్డ మెదురేగి
కనుగవ న్నశ్రువుల్ గ్రమ్మ నిట్లనియె
''వినవమ్మ సిరిదేవి ! యింతి
కొమరక్క !
నను వెర్రిచేసిపో న్యాయమా మీకు ?
బత్తు దై తమరాజు పరగ నమ్మన్న
యెత్తుకొని మిగుల నేడ్చుచున్నారు
కొమనాల సింహము
కొమరమ్మసుతుడు
అమిత విక్రమశాలి అడలుచున్నాడు
పసిడి ముద్దుల బొమ్మ, పగడంపు
కొమ్మ
కసిగందు అనుమంచి కప్ప కొమారై
పడయ మరచున్నది వాపోవుకొనుచు
నడుమ తాలాచక అబల యున్నాది
పలడు చిచ్చురక ధావ్యంబు గావమ్మ!
యెలమించి నీ సుతుల నేలించవమ్మ''
అని పల్కగా విని అతిప సిరిదేవి
''విను పల్లికొండ! నా విన్నపం
బొకటి,
బాలల దుఃఖంబు పణతి దుఃఖంబు
ఏల గల్పించెదవు ఏమైన గాని
యీ వింత మాచెంత విన జెప్పరాదు
గోవింద!మా విభుని గూడి
పొయ్యేదము
తమరు చిచ్చురకను తలచిన పనికి
భ్రమలు గల్పించితే పల్లికొండయ్య!
నీ విచారము వొట్టి నేర్పు చాలించు
మా చిచారము యున్న మాట
సాగించు''
మని తెంపు వాక్యముల్ మగువ
సిరిదేవి
విన బలికి చిచ్చురక విడిబడచూడ
అటమీద కొమరగిరి అలివేణులంత
తటుకున గుండముల దరి జేరిరపుడు
బలుపు గుండము వొకటి బలభద్ర
మూర్తి
నెళపుగా త్రవ్వించె నిమిష మాత్రమున

పట్టుధట్టి బిగించి బత్తునెత్తుకొని
ఘట్టిగా బతభూకాంతు నొకభుజము
దరి లేని వుత్తమధన్యు ముమ్మయను
అరయంగ నొడిబెట్టి అగు మంచిరెట్ట
పట్టుక వేంచేసె పల్లికొండయ్య
చుట్టు స్త్రీలందరు చూడవలె ననుచు
వేగ చంపుడు కట్టయెక్కి కూర్చుండి
బాగుగా శ్రీహరిని ప్రార్థింపుచుండె
వల్లవుల సిరిదేవి వనిత కొమరమ్మ
పల్లికొండను జూచి పకపక నవ్వి
అలివేణి సిరిదేవి హరిగురువు కనియె :
"కొలది ముప్పదిమూడు గుండముల్ తమకు
అదిగాక అరువది ఆరుగుండములు
కదసి తిరుమండుల కాంతలకాయె
తళతళ మంట లుద్ధతి మింటి కెగడవు
బళువు గుండము ఎవరిపాల గలదయ్య?"
అన విని పల్లికొండాడె నొక మాట
"వినవమ్మ సిరిదేవి! వృత్తాంత మెల్ల,
బలువు గుండము తమకు బాలరాజులకు
నెలవు గల్పించితి నెలత సిరిదేవి
పోల్రాజు శివపురికి పొయ్యేటి యపుడు
చాలగ నాతో బాసలు జేసిపోయె
కుల ముద్ధరించ నా కొడుకుల బెంచి
యెలమంచి పట్టము ఏలించు మనెను
ఈ మాట నాతోను వివరించినేసుక
మామతో నే నొక మనవి జేసితిని
తల్లులు లేనట్టి తనయుల బెంచ
వల్లగాదని చాల వాపోతి నపుడె
"మీరు చెల్లితిరంటె మీనలోచనలు!
బారిగుండాల నొప్పార దుముకుదురు
తరువాత బాలుల దరి జెప్పు'మంటి
హరిహరాదులు వినగ అపు డిట్టులనియె
'చెప్పవలసిన రీతి చెప్పు పణతులకు
నొప్పక అగ్నిలో నిడుకొను వరకు
తన ప్రజ్ఞ చూడు' మని తర్లె శివపురికి
తన మీద నేరమింతయును లేకుండ
చాల దెల్పితి వినక సరిపోదు మీకు
బాలల అగ్నిలో పడవేతు ముందు
ముమ్మయను గుండమున మును కొని వేతు
సమ్మతిగ బతమ సాహసుని వేతు
బత్తినయ్యను అగ్గిపాలుగ జేతు
పుత్తన్న నగ్నికి పొసగ నర్పింతు
అందరు చూడంగ అగుమంచి బాల
నిండు చిచ్చులొ వేతు నిందుముఖులార!
తరువాత దుముకుదు తాను గుండమున
కరుణ యింతయు లేక కన్నసుతు విడిచి
మెచ్చక నా మాట మెలత లందరును
చిచ్చులోపల దుముక చెల్లునా మీకు?
బాల లందరిని నాపైన బడవేసి

తాలిమింతయు లేక తన మాట వినక
కొడి దెలియక మీరంత గుజగుజలాడి
బడిబడి చిచ్చురుక పైనమైనారు
కాని మము బంపించు కర్తయున్నాడు
మానిసి ముసుగాల! మాపాలి బ్రహ్మ
యెటు లిఖించున్నాడొ యెరుగముగాక
మటుమాయ జేసె మా మామ
నాతోడ."

## పోలురాజు మహిమచే అగ్నిగుండములు ఆరిపోవుట

అంతట పోల్రాజు హరుని సముఖాన
"పంతంబు దప్పెను పల్లికొండయకు
ఇచ్చిన వరముకు వినక స్త్రీలంత
చిచ్చుల కురుకగా చింతనున్నారు
నిర్దయ యుంచక నీవు మాపాల
అర్థవీటిలో చిచ్చులార్పి పణతులకు
ఆపద వారించు అల్లుని కుమార్ల
పాపల రక్షించి పల్లికొండయ్య
కోరిక చెల్లించు గోరాజగమన!"
హరుడు యాదవరాజు ఆనతి మెచ్చి
పురుహూతు బిలిపించి పురహరుడు
బలికె:
"ఇరవొంద మేఘముల్ విడుకొల్పి
వృష్టి
కురియించి నాతుల గుండముల్ ఆర్ప
నరుదెంచు" మనినంత నవమేఘ
ములకు
సెలవిచ్చి స్త్రీలకు చెరబాపు కొరకు
పలువిప్పి దేవేంద్రు పలికినంతటను
అంచు చుందనక మేఘంబు రంజిల్లి
పొందుగ వీభూతి పుష్పవర్షంబు
కొతకక గురియించె గుండముల్
నిండ
ఆతప లాపదబాపి అగ్నిచల్లార్చె
అతి వేడ్కతోడుత హరు మాయచేత
సుతులపై భ్రాంతులు సుదతులకు
గప్పె
కడతేరమని మామ కనికరముతోడ
బడబాగ్ని గుండముల్ పరగ చల్లార్చి
సఖియలు పలికొండ సన్నిధికేగి
ముకుళించి కరములు ముదిత లిట్లనిరి
"అన్నయ్య! కానలేమైతి మీ మహిమ
చెన్నలర నీ కోర్కె చెల్లె సిద్ధముగ
తరువాత దెల్పు ముందరి
కాలమహిమ
హరిగురువ! విధవలమై యుండలేము"
అనుచు సిరిదేవి కొమరమ్మ పల్కగను
విని పల్లికొండ తా వివరించి పలికె:

"సిరిదేవి! విను సర్వసిద్ధి నా మాట
చెరుకూర మా మామ చెప్పిన పలుకు
'తరుణుల ముత్తైదుతనము బోకుండ
వరుసతో నరువది వత్సరంబులును
బాలుల యలమంచి పట్నమేలించు
ఈలాగు వారికి (యుద్ధ)మేర్పరచి
క్రమమున పంచలింగాల దాపటను
సమరంగ వొప్పించు నా కుమారకుల'
అని చెప్పి కైలాస మత డేగుడెంచె
విని వచ్చి తెల్పగా వినక మీరంత
నామీద కోపించి అగ్ని చొరబోవ
మా మామ యిటు తన మహిమ
గన్పించె
మామ సత్యము నిజమాయె యిది
వరకు

గ్రామంబు జేరుడి కాంతలందరును"
హరిగురువు వాక్యముల కానంద మంది
తరుణు లందరు జనిరి తమ గృహంబు
లకు
అగ్ని కెదురుగ నడిచినట్టి పాపంబు
విఘ్నంబు జేతుమని యింతు
లందరును
తరుణులు షోడశ దానముల్ విప్ర
వరులకు నర్పించి వజ్ర వైడూర్య
గోమేధి పుష్యరాగములు ముత్యములు
నేమముల్ బోకుండ నిడిరి గోదాన
పప్పు బెల్లంబులు పంచదారయును
కొబ్బెర చెరుకులు ఖర్జూరపండ్లు
కొంచక భూసుర కోటుల కెల్ల
పంచిపెట్టించెను పల్లికొండయ్య

## పల్లికొండ బాలరాజులను యాదవకాంతలను సంపదలను తీసికొని యలమంచికి పయనమగుట

'మరునాటి తొలాన్నటి మంచి
ముహూర్తంబు
కరుణతో చేపట్టి కదలవలె'ననుచు
ప్రజలు సామంతులు బంధువర్గములు
నిజముగ తమనంటి నిండి రమ్మనెను
"(యిపు)మాకు తలితండ్రి నీవె బల
భద్ర!

యెవరు నీతో మాట కెదురాడబోరు
కవగూడి నీవెంట కదులుదు" మనిరి
వొప్పి తిరుమందుల వంశ విస్తారు
గప్పన సంపదులు కదలుమని పలికె
నిండిరి అర్థవీడు నేలతలు దాము
అండ బాసిరి మామ లల్లు కుమాళ్ళు
నలినాక్షు లందరు నరదంబు లెక్కి

యొలమితో కదలిరి యేకుజాముగను
వల్లవుల సిరిదేవి వనిత కొమరమ్మ
పల్లికొండసుమతి పైనమై వేగ
ముత్యాల పాలకుల్ ముందుగా నెక్కి
నిత్యాన్నదాన వినోదులై నడువ
అంతట పల్లికొండయితభూపాలు
పంతంబు గల యదు బాహు
విక్రమములు
ఘన పరాక్రమములు యదు కంఠీరవ
ములు
మునుకొని అశ్వసమూహ మెనువెంట
వల్లవు ఐత భూవర కులాధిపుడు
పల్లికొండతో గూడి భట సమేతముగ
సకల వైభవములు సకల విద్యలును
అకలంక చిత్తులై అయితన్నముందు
దంధణ యని భేరితముకు వేయించి
అందముగ నడిచిరి ఐతన్నముందు
బల్లెముల్ ఈటెలు బడితోపుఖాను
వల్లవు లయిత భూవరు ముందు నడువ
డాలు ధమామీలు దండి నాయకులు
మేలుగ అయితన్న మేరువ నడువ
భూచక్ర గొడుగు లద్భుతముగ బట్టి
రాచన్న ముందు హేరాళమై నడువ
హనుమ ధ్వజంబులు ఆలవట్టములు
ఘనమైన గరుడ పడిగెలు బట్టిరంత
నవపంజు గొడుగులు నందికోలలును

అపిరళంబుగ బట్టి రయితన్నముందు
అర్థముల పెట్టెలు ఆలమందలును
అర్థవీడు వెడలి అరిగెను ముందు
'ఇక్కడ నుండుట యిది నీతి గాదు
గ్రహప్రాస సంపదల్ కదలు'మని
చాటి
అర్లుకొట్టుచు మంద లావులు గదలె
తర్లెను సంపదల్ ధరణి గంపిల్ల
గ్రామముల్ వలసలు కదిలె ఘోరముగ
భూమినినట్లు అంభో యని కదలె
దండైన తుడిమిళ్ళదాపు గ్రామములు
మెండైన వలస క్రమమ్ముక సాగినడువ
కంభము కాకర్ల కలిగిన ప్రజలు
అంబరము పెంధూళి అందుకొని
నడువ
కలవొన్న కందుకూరు ఘన
బొల్లుపల్లె
నిలువక వలస నెరి మూక గదిలె
మోక్షగుండము చుట్టు మూక వెళ్ళిరిసి
ఆ క్షణంబున వెడలె అంతకు ముందె
ఎడ వెళ్ళి గుడిమిట్టి యిరుగడల వారు
కడవేగ సంపదల్ కదలిరి వేగ
తర్లుబాడు బొడ్డుచర్ల తడియ
కిడిబడియు
వుర్లుబడి నడిచెను వరుస మూకలును
గోపకుమారుల గుణబుద్ధిచేత

కాపురంబులు కదిలె కడగుర్తు లేక
కోకల పెట్టెలు కురుజు పెట్టెలును
రాకుమారుల వెంట రహుతు లేతేర
పోకల కంట్లాలు బుక్కాలు పెట్టెలు
ఆకులు గుజ్జళ్ళు హంస తూలికలు
బంగారు పట్టెల పట్టెమంచాలు
శృంగారముగ కదలె శూరుల వెంట
బండ్లును పైబడి బారులు సాగి
దండ్లరాయిడి తెరచి తర్లె వేవేగ
కురుచజాలె డేగలు గోరువంకలును
మురుపైన భైరపుల్ ముందుగా బట్టి
కస్తూరి పిల్లులు కన్నె చిలుకలును
దిస్తుగా బట్టిరి ధీరుని ముందు
కంచు వీరణ జోళ్ళు కాని కొమ్ములును
అంచితంబుగ రాజు అంచున గదలె
తమటముల్ గిడుగిళ్ళు దండె వీణెలును
క్రమముగా నడిచెను ఘనుని
ముందరను
తంబురపాట మృదంగ నాదములు
గంభీరముగ నాడు కదలె నారాజు
జమ్ఖాళ గడలు నెరి చిక్కు కటార్లు
గముకమౌ బాణాలు కంజుర బాకు
లరుదైన చేగుద్దుల సుర బాకులును
కరవాల సింగిణీల్ గదలు సాంగులును
పట్టలు డాలులు పట్టెకత్తులును
పట్టిరి ఐతభూపాలుని ముందు
మంత్రులు హితులు సామంతులు
దొరలు
ఘంతుకెక్కిన రాయమన్నె కుమాళ్ళు
వన్నెవన్నెలు గల్గు వాజీల నెక్కి
సన్నహంబుల తోడ సమకూర్చి నడువ
పంచవన్నెల తేజి పల్లన గట్టి
అంచితంబుగ గదిలె అయిత భూవరుడు
ముత్యముల పల్లన ముందుగా గట్టి
బత్తినయ్య గదిలె బారులలోను
చొక్కమౌ ముమ్మయ్య చిలుక
తురగమును
గ్రక్కున 'గమకించి' కదిలె నావేళ
అమరిన పంచకల్యాణి పైనెక్కి
కొమనాల పుత్తన్న గొబ్బున గదలె
ఎవరెవరి తేజీల నెక్కి వేడుకల
భువన రక్షకు చెంత భూరిగ నడువ

## బాలరాజులకు అపశకునము లగుట

పల్లకి నెక్కగా పల్లికొండయ్య
పిల్లులు రొదచేసె బెదరి పోసాగె
మహిపాలు అయిత భూమండలు
ముందు

గ్రహము మీద వనిత క్రక్కున
దుమ్మె
తటతట ఒక్కతె తల విరబోసి
మెటికలు విరుచుచు మిగుల కోపాన
ఇంతి యింగల పెంచు ఎదురేగి రాగ
అంతట కనుగొని అ పల్లికొండ
నీలకడవ నొక్క నెలతెదురేగి
పాలకి ముందర భగ్గున అవిశె
బడుగు బ్రాహ్మ డెదురుపడె నంతలోన
పడిగెత్తి ఒక పాము పడి నేలమొత్తె
వరుడు పెద్దపులుగు వసుధ గంపింప
మరువక రొదచేసె మరిమరి మీద
నల్ల పక్షులు వచ్చి నడి త్రోవలోను
పల్లకి ముందర పడి పొర్లె పొర్లె
పాలలు మిక్కిలి పరివారములుగ
వాలు దిర్గుచు రొప్ప వడి గూబ బెదిరె
పొళ్లకాయలు ద్రుంచి భువి నేసినట్లు
చాల పాములు వచ్చి సరితట్టె ముందు
వీచె పక్షులు నంత విపరీతముగను
చూచిరి పెద్దలు చోద్యంబుగాను
పక్షుల శకునంబు పల్లికొండ జూచి
"అచ్యుతు గోత్రులు యాదవులార!
పోనీయుడు చెరుకూరి పోరిదివరకు
కానిండు ముంగల కాగలవార్త
తురుచైన జగడము తూర్పున మనకు
అతికట్టగలరు మీ యాత్మ కెరుకైన
త్రోవలో పక్షులు దొర్లినందులకు
వుర్విలో మనవారు వొరుగగలరయ్య
దాట్లు దూపై పోరు ధారుణీశ్వరులు
పోట్లచే రణములో పొర్లాడగలరు
పాలలు మిక్కిలి పలికినందులకు
వాలాయముగ జొత్తు పరుదలై పాలు
పాములు అడ్డాలు పారినందులకు
శ్రీమించు పగతుల శిరములు తెగును
అని ముందర గూబ లరికట్టుటకును
ననువంద మూకల నరికట్టగలరు
పణతి యొక్కతి కడ్వ
పడవేసినందుక
మునుగుదురే జలములో ముదితలంద
రును
వరుడు బల్కిన వల్లవులు
తిరమందులు
వీరులై నాడాడ విరుగ నున్నారు
పిల్లులు రొదచేసి బెదరి నందులకు
కొల్లలుగ పగవారు కుమ్ములాడేరు
పక్షులు బడిబడి పలికినందులకు
చచ్చేరు మొనవరుల్ సత్య మీమాట"
అని విచారింపుచు నా పల్లికొండ
ఘనమైన చింతచే కదలె నర్థపీడు
కంభము కాకర్ల ఘనతగా నిలచి
కంభము నృసింహుని కని వినుతించె:
"హరి! శంఖచక్ర ధరావతారుండ

కరిరాజ వరదుండ! గాన లోలుండ!
కలచన్న ప్రహ్లాదు గాచి రక్షించి
మలయుచు వైకుంఠ మరిగిన దేవ!
వెలదుల తోడొక్కని యెలమంచి చేర
పొలుపొందగా సాగి పోవుచున్నాడ
మామీద కృపవుంచు మమ్ము నీదేర్చు
క్షేమాన నెలమంచి జేర్చు నృసింహ!"
కరములు ముకుళించి కదలె సంపదలు
తరితీపుతో నడ్చె తర్లుబాటికిని
కడచి మాపటివేళ కదిలె సంపదలు
బొడ్డుచర్ల నిలచె పొలుపు మీరగను
నాతులు పలికొండ నతిభక్తి తోడ
పోతురాజుకు వేటబోన మర్పించి
మేరగా సంపదల్ మీరి మర్నాడు
మారకపురి జేరె మందలావులతొ
నారాయణుని జూచి నాతులు దాను
చేరి దర్శించిరి చెన్నరాయులను
"పాలవారిధి మీద పవళించు దేవ!
బాల గోపాలక! పదివేలు శరణు!
పారిజాతము దెచ్చి భామకు నిచ్చి
పోరు గావించిన భూలోక తండ్రి!"
గోపాల కృష్ణుని కొనియాడి మిగుల
కాపురంబుల తోడ కదిలె మర్నాడు
చక్కగా బుక్కపురం జమ్మిగుంపు
లకు!
మక్కువతో వచ్చి మాపటి వేళ
దామెన వేటలు తగుపారి గొర్లు

భోరున సంపదల్ పొతకమూర్ జేరె
చారు సత్య వ్రతు చెన్నకేశవులు!
భాసురంబుగ వేడి భక్తితో మ్రొక్కి,
"కేశవ!మాధవ!గోపాల!శౌరి!
ఇక్ష్వాకు వంశ లక్ష్మీశ! బుధవంద్య!
పక్షివాహన!మమ్ము బాలరాజులను
దయవుంచి యెలమంచి దాపు జేరించు,
నయభక్తితో పూజ నాచేత గొనుట
తగును కేశవ!శౌరి! దండ"మని
మ్రొక్కి
రఘుపతి మరునాడు రమణులతోడ
పొల్వరమ్మటు దాటి పొలుపొంద సాగి
తాళ్ళూర నిలిచెను తగ పల్లికొండ
భీకర యాదవ భీమ బల శాలి
నూకలాంబికె జూచి నుతి జేసెనంత
"కృపజూడు మా తల్లి! కోకిలవాణి!
కపట రాక్షసకోటి గణముల నెల్ల
చండిన భూలోక శర్వాణి! మమ్ము
నిండు వేడుక కావు నీరజనేత్రి!
సోమరవి నేత్రి!పరంజ్యోతి!చాముండి!
మా మొర యాలించు! మమ్ము
రక్షించు!
అయ్యల వెనువెంట అరిగిన మూక
చయ్యన మము గలయ
చనుదెంచి రైన

నీమంబుతో మీకు నే సమర్పింతు''
అని మ్రొక్కి వేటబోనంబు గావించి
పనివడి ధర్మవర పట్టణము జేరె
ఫాలలోచను గని ప్రణమిల్లి మ్రొక్కి,
''నీలకంధర! యీశ! నిఖిల లోకేశ!
త్రిపురాసురాంతక! త్రిజగ మందార!
కృప వుంచి మనుచు''మని గురువు
అటు లేచి

## యాదవులు బల్లికురువను చేరుట

చల్లప్రొద్దున బండ్లు సాగ నడిపించి
బల్లికురువను నిలిచె పల్లికొండయ్య.
బల్లికురువకు పూర్వ భాగంబునందు
గొల్లలు నొక పెద్ద గుండు దాపునను
పల్లకీలు దిగిరి పణతు లందరును
పల్లవాధర లంత పరుపు గావించి
చదురుగా గూర్చుండి సఖియ
లందరును
ముదముతో గుమిగూడి ముచ్చటాడు
చును
నలువైన మొనభటుల నాయకుల నిల్పి
కలకంఠి సిరిదేవి కాంత కొమరమ్మ
పందుముల యరణప్ప పణతి తల్లప్ప
యిందుముఖి అగుమంచి యింతు
లందరును
బలవంతులైనట్టి బాలరాజులను
కొలువుగా ముందర కూర్చుండ నుంచి
తోయజాక్షులు చిన్నిదొరల యిరుమేర
పాయక కూర్చుండి పల్కులాడుచును
బితన్న ముందర ఆటపాటలును
చెయితప్పు లేనట్టి ఝుట్టీలు పెసగ
తగరుల ఢీకొల్పి తాకులాడించి
పిగిలికాండ్లతొ మంచి పీకులాడించి
కుక్కుటంబుల దెచ్చి గుద్దులాడించి
కక్కెర లిడుకొల్పి కయ్య మాడించి
సంతసంబుననున్న సమయంబునందు
పంతంబు గల యట్టి బాలరాజులకు
చాల యుద్ధము ముందు సరితట్టు
ననుచు
పాలలు పేరెలు పారంగసాగె
వరదక్షిణము దిక్కువన గాకి బలికె
పరమటి మూలల బల్లులు బలికె
వుత్తర మూలను వూరబిల్లులును
నెత్తురు గ్రక్కెను నేరులుగాను
అవి జూచి పోలరాజతివ సిరిదేవి
వివరించినటు బలికె వెలది నూకాంబ :
''వనజాక్షులార!యీ వార్త
జెప్పెదను
మనమార వినరమ్మ మగువ లందరును
బల్లులు పల్కిన పల్కు పంతాన

బల్లిదు లైనట్టి బంధువర్గంబు
సర్వేశ్వరుని కొల్చి జంగాల విడచి
పర్వతము దిగివచ్చు పంతమున్నాది
యిందుముఖి కొమరమ్మ! యీ శఖున
మునకు
కొందరు యాదవుల్ కూలేరు ఇందు
పక్షుల శఖునంబు పర్వతమునుంచి
వొచ్చి కలిసినవారు వొరిగెదరు ఇందు
గూబల శఖునాన గోపశేఖరులు
బీభత్సు గాగలరు పిన్న భూపతులు
హద్దుగా పాలలు అటు పారుటకును
ఇద్దర చిచ్చులో విడిబడగలరు
గద్దరివైరుల కణికెలు జేసి
యెద్దులు ఈగుంటి వెలయ నున్నావి
కద్దు లేదీమాట కల్ల గాదనకు
పద్దులు పన్ను నిబద్ధి కొమరమ్మ"
సిరిదేవి యిటువలె చెప్పగా వినియు
దరిలేక స్త్రీలంత తల్లడగొనుచు
అరటి ఫలముల వంటి అర్భకుల జూచి
పురపుర బొక్కుచు పూబోణు లంత
సిరిదేవి దుఃఖించ శిశువుల జూచి
అరుదైన కన్నీరు అణచుక మదిన
"అన్నబత్తుండ! వో యన్న ఇతన్న!
చిన్ని యుమ్మన్న! వో సిరిముద్దుబాల!
చెరుకూర మీతండ్రి చెల్లిన దినము
పరగ మాసము లేదు పక్షంబు లేదు
చిచ్చుల జడితె నా చింతలు మాను
వెచ్చంబుగాక యీ వెతజేసె శివుడు
పందుముల మీ బావ పల్లికొండయ్య
అందు మాయలు బన్ని అణచె
దుఃఖంబు."
దుఃఖించి దుఃఖించి ధూర్జటిని దూరి
అక్కడ నిద్రించి రారేయి స్త్రీలు
వెంబడి దగిలిన ఎలమి సంపదలు
అంబోయటంచును ఆలమందలును
దాపు జేసుక యూళ్ళు తమ నెడబాసి
పోపోను జాలక భూములు దిగియు
కాగల కార్యముల్ కనిపోద మనుచు
వాగొరుస మేరగ వలసలు దిగెను
ముందలి వలసలు మూకలై పోయి
నందెడ్ల యిరుమేర నపరితంబుగను
పదునుగా ఆడాడ ప్రజలు నిలిచియును
అదురు ఇంతయు లేక అటువలె నున్న
అంతెకాలమందు అరికట్టె గనుక
పంతమున పోరాడ పగ వెంటబడెను

## ఇమ్మడికుమ్మరాజు బాలరాజులను చంపుటకు ప్రయత్నించుట

సంతత శుభకరుడు సార్వభౌముండు
వంతుకెక్కిన యట్టి వంశపావనుడు
చౌలక్ష గుర్రాలు చాల గలవాడు
చోళభూపతి సుతుడు చోద్యంబుగాను
సమ్మతి శైవ ప్రసాద సేవకుడు
యిమ్మడికుమ్మరాజ వీరశౌర్యుండు
కమ్మక నరువది ఘటము నేనుగులు
ముమ్మరంబై నట్టి మూక యిరులక్ష
అశ్వముల్ లొటిపిటల్ అగు లెఖ్ఖలేక
విశ్వంబు యీనిన విధము రాహుతులు
ధారుణీశ్వరుడు తన దళములతోడ
శ్రీరంగ పట్నాన సేవ్యుడై యుండి
కొలువున గూర్చుండి కోరి
మంత్రులతో
తలపోయె సాగెను తగు చక్రవర్తి
మంత్రులు బుధజనమణు లొకవంక
వంతుకెక్కిన శౌర్యవంతు లొకవంక
రవితేజు లైనట్టి రాజు లొకవంక
కవి గాయకాచార ఘను లొకవంక
భారతాదుల జదువు వారు లొకవంక
పురజను లొకవంక పుణ్యు లొకవంక
సన్మంత్రు లొకవంక సభ్యు లొకవంక
మన్మథాకారులౌ మాండలికు లొకవంక
క్షత్రియు లొకవంక సరసు లొకవంక
మూర్తులౌ పురహరు ముఖ్యు లొకవంక
ఋుట్టీలు వకవంక సైన్య మొకవంక
భట్రాజు లొకవంక భటు లొకవంక
వేడుకతో గొలువ వినుతుడై యున్న
''కడువేగ యాదవుల్ కదలి
పొయ్యేదరు
ఎలనాగ లందర్ని వెంట బెట్టుకను
ఎలమంచి పట్నము కేగుచున్నారు
పల్లికొండనువాడు బాల లందరిని
వెళ్ళించుకొని ధాటి నేగుచున్నాడు
చలపట్టి ముక్కంటి చంపినవాని
కుల ముండనివరాదు గుణమణులార!
పోకుండ వారిని పోయి అరికట్టి
చీకాకు పరపించి శిశువుల జంపి
తృణమాత్రమున వార్ని దురములో
ద్రుంచి
పణతు లందరి చెర పట్టగావలెను
ఎలమంచి సీమకు ఎత్తిపోకుండ
బలములతో మీరు పైనముల్ గండి!
ధరణీశు లా కృష్ణ దాటి బోకుండ
పరివార మందరు పైనాలు గండి''

అనుచు ముందుకు మున్నె ఆ
రాజునకును
తనకు చనువరియైన ధారుణీశ్వరుడు
పుండ్రవెళ్ళియు నేలు వీరగోపాలు
మండలాధిపునకు మనవిగా వ్రాసి,
"సంపదల్ బాలలు సఖియలు ఆల
కంపటీల్ గోపకుల్ ఘన పల్లికొండ
యెలమంచి పంప్రాది కేగుదా మనుచు
బలము చేసుక సాగి బల్లికురువందు
ఈ రేయి నిలిచెను ఇది నిజవార్త
వారి నంతటినుంచి వదలి పోకుండ
తరితోపుతో మీరు దళములతొ వచ్చి
అరికట్టు "మని వ్రాసి అంపినందులకు
వ్రాలాకు చూచుక వడి రాజవిభుడు
కోలాహలము బలము కూర్చి యా రేయి
వన్నెగా దిక్కులకు వ్రాయించె కమ్మ,
మన్నెసరదార్ల ఒక్క మాటున గూర్చె,
వినుకొండ యేలేటి వీరభళ్లాణు
ఘనమైన గుర్రాలు ఘటము నేనుగులు
దండు బల్లికురువ దాపున నుండె,
అండజేసుక వుత్తమాశ్వ మార్వేలు
పఠాణివర్గ ముత్పాతంబుగాను
కుటిలంబుతో బల్లికురువ దాపైరి ;
చుట్టు పట్టుల మూక చురుకుగా వచ్చి
తట్టు నాల్దిక్కుల తట్టి దాపైరి,
చక్కగ చనువరుల్ సాహసోత్తములు
పక్కెరతేజీల పైనమై వచ్చె,
చింతలచెరువేలు శ్రీరామచంద్రుడు
పంతమున నేతెంచె బలములు గొలువ,
అయినవోల్ నూజర్ల అందున్నవారు
పైనమై ఆర్వేల బలములతో గదలె,
ఈదర భీమవర మిలనార్జునుండు
ఆదికొని కదలెను అశ్వములతోడ,
కుందురు ధర్మవర కులశేఖరుండు
ముందు తొమ్మిదివేల మూకతో గదలె,
కంచర్ల యేలేటి గజకంఠకుండు
అచ్చాళి మూకతో అతడేగుదెంచె
కొణిదెల వేలెడు గణపతిరాజు
కొణిదెల కొమరప్ప కోటి బెట్టించె,
క్రమ్ముక నేతెంచె గజము తేజీలు
యిమ్మడికక్కమరాజు విడిబడి క్షణము
కొలువు కేతెంచెను కోటి భూధవుడు
ఇల మిన్ను యీనిన విధమున గదిలె
హితవరుల్ దొరలును ఇష్టబాంధవులు
చతురుదిక్కులు బలసి సేనలు దిగెను
ఫిరంగులును జాణపెట్లు గ్రోవులును
గురుతైన తుపాకి గుంటి క్రోవులును
జిబురు జింగులు మంచి జిర్రబాణములు
నిబ్బరంబైనట్టి నేజాల గడెలు
విలుమూక యిలుమూక యీటెల
బారు
కోలాహలంబుగ కూడి రనియేక

పోణిమి యాదవ భూపతుల్ మీద
రాణించనట్టి యుద్ధరంగము జేయ
పట్టుపేనుగ నెక్కి బారులతోడ
ఘట్టిగా యిమ్మడక్కమ రాజు నిలచె.
కొండతో కొండ మార్కొన్న విధముననను
దండు చుట్టుక నిలచె ధరగ్గక్కటిల్ల
బల్లికుర్విరు మేర బలములు, వుంద్ర
వెళ్ళి గోపాల భూవిభు డార్భటించి
చుట్టుక యదువీర శూరుల ముందు
అట్టిట్టు బోకుండ అరికట్టి రంత.

## పల్లికొండ బాలరాజులను యుద్ధమునకు ప్రోత్సహించుట

ఆ రేయి బాలలు ఆ పల్లికొండ
నారీమణి సిరిదేవి నాతి కొమరమ్మ
శకునఫలము దలచి చాల చింతించి
అకడ నిద్రించి వారంత మేల్కొనిరి:
పందుముల సింహము పల్లికొండయ్య
సంధ్యవందన క్రియన్ చక్కగ దీర్చి.
చెలగుచు కూర్చున్న చారు లేతెంచి
బలభద్రునకు విన్నపము జేసిరంత
''పరదళమ లేతెంచి పల్లికొండయ్య
అరికట్టి యున్నవి అవని గంపింప
దరిలేక చిక్కితిమి తరుణులు మనము
పరమాత్మ డీవరకు పగబట్టె"ననిన
విని పలికొండ తా వికలంబు నొంది
కనుగొని దళముల కలవరం బంది
"నాతుల బాలల సజల సంపదల
ఏతీరు గడపుదు? ఏమౌను ముందు?''
అని మది దృఢమంది అవుతారమూర్తి
ఘన శౌర్య గుణ శాలి కలకల నవ్వి
తన మరదుల బిలచి తగ హెచ్చరించి,
"కనుగొంటిరే చిన్ని గాంభీర్యులార!
నన్ను మీరిన యట్టి నా తమ్ములార!
పిన్న మరుదులార!పిరికి పారకుడి!
ఎన్నడు యుద్ధము ఎరుగనివారు
చెన్నొంద మనపద్దు చెల్లించరయ్య!
ధారుణిలో కీర్తి తడవుండవలెను
కేరుచు వైరుల కెరలించరయ్య!
బలికురువను యుద్ధప్రాప్తులై మీరు
తల్లడమందిక దళముల జూచి
కాయంబు జల్లెడ గండ్లయిన గాని
సేయుడు యుద్ధము శరపరంపరల
మసిలన్న యుంటేను మన్నీల నెల్ల
కసిదీర నరికింతు కల్లిమధ్యమున

శ్రీహరి బొల్లావు చేకూడదాయె
మోహర మణగింతు మొన పీరవరుల
దయెదప్పె హరిమూర్తి దగ్గరలేక
పయనంబు తాబోయె పర్వతంబునకు
మత్స్య కూర్మావతారః మమ్ముల
గలయ
వచ్చి రక్షించుః నీవారము మేము,
అలనాడు ప్రహ్లాదు ఆపద గాచి,
అల హిరణ్యకశిపు హతము గావించి,
యిలలోన సత్కీర్తి యింపొందినావు
యిలువేల్పుః మమ్ముల నీడేర్చు మిందుః
చల్లని మాపాల చక్రధరులైతె
బొల్లావుః ఈ పగల్ భోరున ద్రుంచుః
సేనల్మ రక్షించి చిక్కు బాపించుః
దానవాంతకః శౌరిః దాపించు మమ్ముః''
అనుచు ప్రార్థన జేసి ఆ పల్లికొండ
''చనువరి బలు శౌర్య సాహసోత్త
ముడు
మా తండ్రి కల్లందుల మారినేయుండు
నీతిమంతుడు ఇందు నెలకొనడాయె
గుర్రము లొటిపిటల్ కుంజరంబులను
వొర్రెలుగ జేయింతు వొక్క
నిముసమున
వల్లవు ప్రోలాజు వంశవిస్తారు
చెల్లుచు నన్ను తన తన చెంతకు
బిలచి

'బాలలు వున్నారు పల్లికొండయ్య
చాల దయ వుంచు'మని చనె శివపురికి.
బాసలు చేసితి బాలలందరిని
కాచి రక్షింతునని కొలిచ్చి వస్తి
అంశ నిటువలె నాయె అన్నయ్యలారః
వంశంబు నేటితో వనకూడదాయెః
తతికాల మేతెంచె తన తండ్రులార
మితిగూడి వచ్చుట ముందెరుగనైతి
పోలురాజును గూడి పోయె వంశంబు
ఈలాగు జగములో విని వాడగలరు
వలసలు ఆసించి వచ్చె నెంబడిగ
కలవరపడి చెడి కానల గలసె
పరగ శ్రీరాము నా పాల లేడాయె
కరుణ యింతయు లేక
కపటంబు జేసె
పనివడి జేసిన పాప దోషంబు
జనులకు తప్పు నా చేసినంతయును
మతిమంతులారః యో
మామసుతులారః
చతురంగ బలముల సేనల మీద
బడిబడి పకమన్నె బారుల మీద
పిడుగులు మోదిన భీకరంబుగను
కాలము చేకూడ్ని ఖగముల మీద
సాళువ రౌద శేయు చాయగ మిగుల
ముంగల మదగజ మూకల మీద
సింగపు పిల్లల చందాన ధుమికి

మీ కీర్తి ధరణిలో మిక్కిలిగాను
నా కీర్తి నిలుపుడీ నా యన్నలార!
గోసంగి మూక ముంగోలుగా వస్తే
పీచంబుగల వైరిబిరుదు విడుపింతు
దైవంబు దయవుంటె తప్పు దుర్దశలు
దైవమా!మమ్మొక దరి జేర్పు"మనుచు
దివ్యదృష్టిని జూచి ధీరత్వమునను
నవ్వెను పందుముల నరసింహమూర్తి
ఇరువంశముల గురువు ఇటుల
బల్కగను
పరిపరి విధముల పలికినందులకు
తలయూచి ఐతన్న ధైర్యపుంగవుడు
కలకలమని నవ్వి కని రంకె వైచి
కనులందు రోషాగ్ని కణములు రాల
తన యీడు రాజులు తాను యిట్లనిరి :
"బావ మమ్ముల నెంత పలుచన
జూస్తిరి
యీ విచారము పల్కు- లేల నాడెదవు?
చిన్నవాండ్లని మమ్మ చులుకగ జూచి
తిన్నగ పల్కెదరు దేవరవారు
వారు లేరన నేమి?వలపోత లేమి?
హారులము మేముండి గ్రుక్కనీకేల?
సిరిదేవి కొమరప్ప చింతపడేట్లు
వెరపు వాక్యంబులు ఏల పల్కెదవు?
సిరిమించు నవరత్న సింహాసనము
మరివేగ కూర్చుండి మమ్ము పరికించి
చూడుము మా వీర హారత్వ మెల్ల,
పోడిమి నా మాట బుద్ధిలో వుంచు,
పులికి బుట్టిన పూన పూరేల మేయు
ఆలంబు సేయను అంపవే బావ!"
అనుచు కట్టాయత్త మైరి బాలలును
ఘనమైన నవరత్న ఘన
భూషణములు
తెల్లని వస్త్రముల్ తెరగొప్ప కట్టి
జల్లులు యిరుమేర సమకూర్చి రంత
వళ్ళను శ్రీగంధ మొప్పుగా బూసి
కల్లి కెదురు నడిచె గాంభీర్యవరులు
శ్రీరామ ముప్పిళ్ళ చేతికత్తులును
గారాబు జముదాళ్ళ గముక కటార్లు
కొమరప్ప రామమల గోత్రజుల్
గొల్వ
అమరంగ బాలలు ఆయత్త పడిరి.

# శ్రీశైలమునుండి బాలరాజుల సహాయమునకు కల్లందుల మారినేడు, గోసంగివీరుడు మసిలినీడు, బొల్లావు, ఏడుఎద్దులు బల్లికురువకు వచ్చుట

అంతట పర్వత మయ్య లందరును
చింతలెంతయు లేక శివుని కర్పించి
భోజనం భోంచేసి పోదాము అనుచు
వాజితో కూర్చున్న వారికి కబురు
"వల్లవు పో|లాజు వారిగిన వార్త
పల్లవాధరలును బాలరాజులును
సంపదల్ మందలు సర్వమంతయును
పంపాద్రి మార్గమై పల్లికొండయ్య
సాగి పోవగ వారి సకల సంపదలు
భోగేశు వరపుత్రు భూమీశ్వరుండు
శ్రీరంగ మేలేటి చోళభూసుతుడు
ధారుణిపతి యిమ్మడక్కమ రాజు
కూడి దళము బల్లికురువ ముట్టడిని
దాడి నిన్నటి దినము తగిలిరి చాల
రఘుపతి, చిన బాలరాజుల శిరము
తెగవైచి చెరబట్ట తెరవల దలచు
కున్నాడు ఇమ్మడక్కమ రాజవరుడు
పిన్నరాజులు తమ బిరుదు చదివించి
కయ్యాన కెమరించి కాలు ద్రువ్వుచును
వొయ్యారి తోలుచు వుత్తమాశ్వముల
తల్లుల కందరు ధైర్యముల్ దెలిపి
కల్లి చేసెటికొరకు కదసి యున్నారు"
అన విని బొల్లావు అతి మహారథులు
ఘనులు హుటాహుటుల్ ఘడియైన
రావు
విడిపించ వలెనని విక్రమోన్నతులు
వడి వేగమున నడిచి వక రెండు
ఝాములు
కేకలు వేయుచు ఖేచరంబులును
అకాశ పిడుగులై అది వస్తిమనుచు
కలయ నేతెంచిరి ఘన పరాక్రములు
బలవంతులకు ముందు వరగ బొల్లేవు
కనుచూపు నేల పొడకట్టె నం.రికి
వెనువెంటనే తగిలె ఏడు వృషభములు
పుల్లది మట్టేది పొడజాల నర్ర
అల్ల చామటి కోడె అంగ బట్టని
కోరతల కర్రిది గుజ్జరి బూద
ఏర్పరచి పంపిన యేడు ఎద్దులను
మరియు కల్లందుల మారినేయడు
నెరి బలాఢ్యుడు మసిలి నేయుడు
మొదలు
గోసంగు లేనూరు గోపాల మణులు

అసహాయ రేనూరు అమిత విక్రములు
వారి నందరి జూచి వనిత సిరిదేవి
కోరిక చెల్లెనని కొమరమ్మ చూచె
తమవారు వచ్చిరని తగ పల్లికొండ
విమల సంతోషులై వీక్షించి చూచి
బాలరాజులు తాను పరగ నెదురేగి
వేళను తో డ్తెచ్చి విడుదల నుంచి
నెమ్మదిగ గూర్చుండి నెంతలు దాము
తమ్ముల మరుదుల తగ జేర బిలచి
కమ్మని కస్తూరి గంధంబు లలది
సమ్మతిగ పందుముల సరసు
డిట్లనియె :
"విను సహోదరులార!
విను మరుదులార !
తనకు చేకూడెప తా గోరినట్లు
మనసులోపలి చింత మఱి కడకు
బోయె
మనసు చొక్కముపాడు
మారినేయుంపు
బలములతో గూడి పైనమై వచ్చె
చలమునకు వెరువము సాహసులార!
బొల్లేవు హెచ్చైప పొలుపు మీరంగ
కొల్లగా యుద్ధము కోరాడగలము
అదిగాక మసిలన్న అరుదెంచి వచ్చె
మదగజంబులకైన మనము వెరమింక
వచ్చిరి గోసంగి వర సమూహంబు
చొచ్చి పొడిపింతుము చొరవలుగాను."

## యాదవులు బొల్లావును ప్రార్థించి పూజించుట

అనుచు సంతోషమున ఆ పల్లికొండ
వినయమార్గంబున నిరువురు గూడి
బొల్లేవు కడకేగి పొర్లు దండములు
వల్లవుల్ తిరుమందు లొరుస నర్పించి
అంగన లందరు అతి వేడ్కతోను
బంగారు చెంబుల పన్నీరు దెచ్చి
మూర్తివంతము గల మురహరుని
కెదురు
ప్రార్థన చేసిరి పణతులు దాము,
"అక్షయ వలువలు అతివ కొసగితివి
పక్షీంద్ర వాహన! పరమ పుణ్యుండ !
అభిమానముగ రావణానుజు గాచి
కపిసేన పతి నేలి కాచిన దేవ!
మా మనవి గైకొని మమ్ము నీడేర్చి
యేమరక సంపదలు యెలమంచి
జేర్చు !

మిమ్ము నమ్మితి మయ్యామీ
పాదమాన
మమ్ము రక్షించుమి మా పాలి స్వామి!
కరుణించు మమ్ముల గరుడవాహనుడ !
దరిజేర్చు మిందు! యాదవుల
రక్షించు!"
అసురముఖము అందె హనుమంతు
బిరుదు
దశావతారునకు ధరియించి రంత
పుండరీకాక్షునకు పూని నవరత్న
పెండెంబు డాకాల పెట్టి రఘుపతియు
మూపున శంఖంబు ముద్రచక్రంబు
వీపుని పికిలికుంచ వింజామరములు
హరినాటి బిరుదులు ఆవుకు నొసగి
చెరగు పట్టుచీరె తెరగొప్ప దెచ్చి
పరుసతో సొమ్ములు వనర ధరియించి
కోరికల్ దీరగా గోపభామినులు
మలయుచు వైకుంఠ మందిరోన్నతుని
విలసితంబుగ గొలిచి వీర భామినులు
సిరిదేవి కొమరక్క శరణని వేడె
గరిమతో యాదవ కామనీమణులు
వున్నతంబుగ చెంబు లుదకముల్
తోడ
పన్నగ శయనునకు భక్తి తోడుతను
వారిడి ధూపంబు పరుసతో నొసగి
ఆరోధిగా మంగళారతులు బాడి

అలివేణు లందరు హారతుల్ బట్టి
తలమోపి సాష్టాంగ దండముల్ బెట్టి
దరిదాపు నీవని తరుణులు బల్క
సరగున నిల్చున్న స్వామి బొల్లేవు
కుడిపాద మభయ మని గురుతు
చూపెట్టె
మెడ యెత్తి ముందుగా మేల్కొనను
మనెను
అభయంబు లిచ్చెను అవుతారమూర్తి
విభవంబుతో స్త్రీలు విడిదికి జనిరి
రచ్చరావు చిలుక రఘుపతి నిలచి
హెచ్చరించెను మేటి యాదవోత్తముల
రమ్మని పేర్పేర రాజులందరిని
సమ్మతి బిలచెను సకల యాదవుల,
పరివారముల బిలచి బాంధవుల బిలచి,
సరస కొలువై యున్న సేనల బిలచి,
"వీర నాయకులార! విఁకరణు గార!
తీరైన మా యన్న తిరుమంద గార!
వల్లవ పరులార!వో మఁసదులార!
బల్లికురువందు మీ పద్దు చూచెదను
తొలుగక వాకరొకరు ఘోరమున వార్ని
కలనులో చంపుడి గగ్గోలుపర ).
మేలైన రాజుల మెడలు ఖండి వి
కాలుకాల్ వారుసుక కార్యము మండి
కట్టుడి రణముకు కంకణాల్ ఁబరు
పెట్టుడి మెడగుండ్ల పేర్లు సొమ్ములును

పట్టుడి హస్తముల పట్టి కత్తులును
కొట్టుడి శత్రుల కొంకులు తెగను,
ఎక్కుడి తేజీల వేగిరంబునను,
చెక్కుడి మొన వైరిశిరముల నెల్ల
కొరుకుడి పండ్లు బల్కోపంబుతోను,
పెరుకుడి శాత్రవుల ప్రేవులు నెల్ల,
పరుపుడి బాణముల్ పగవారి మీద
నెరపుడి బాణాలు నెత్తురు లొలక
పెరుకుడి మదగజ పిల్లల మీద
తరుగుడి గుండెలు దండిభూపతుల
పెరుగుడి ఝుల్లవలె పేరెముల్ బారి
తురుముడి వైరుల దురము లోపలను
పుట్టిన కొన్నాళ్ళు భూమిలోపలను
గిట్టుట నిజమిల కీర్తి నిలపలెను."

తాంబూల వస్తువుల్ తగ వేట్క నిచ్చి
గాంభీర్యవంతుల గౌరవము జేసి
కస్తూరి జవ్వాది కలపి గిన్నెలతో
కుస్తరించవి యేక గుణములు దెలిపి
వక్కటొక్కటి జోడు వస్త్రముల్ దెచ్చి
వొక్కరొక్కరి కిచ్చె వొప్పు దీపింప
మక్కువ వరహాలు మంచి తోతెలుగ
లెక్కకు మిక్కిలి లేహంబు జేసి
ముత్యముల్ సొమ్ములు ముద్దు టుంగ్రములు
పుత్తడి బంగారు భూషణంబులును
పచ్చల కడియాలు పతక మెడనూళ్ళు
హెచ్చైన బంధువుల కిచ్చె రఘుపతియు.

# పల్లికొండ కల్లందుల మారినీని, గోసంగి మసిలినీని యుద్ధమునకు పురికొల్పుట

మరియు కల్లందుల మార్నేని బిలచి
"పేరు కలవాడవు భీమ బలశాలి
శిశువుల స్త్రీల నా చేతి కొప్పించి
రసికుండు మా మామ రమణతో జనియె,
వొప్పించినందుకు వొచ్చి పగవారు
కప్పుక వచ్చిరి కార్యంబు జేయ,
బంధువు లుండగా పర్వతమునుంచి
అందు కలయగ వచ్చి ఆపదల్ బాపి

ముందు సాగించిరని మొనరాయవరులు
పొందుగ మీకీర్తి పొగడుకోవలయు
ఈ పగ నీది సుమి, యింతు లందరికి
ఆపద బాపుము మా అయ్య నీవు!"
మారినేనికి దెల్పి మసిలన్నతోడ,
"పేరు కల మాతంగ! బిరుదు సాహసుడ!
వరశౌర్య గుణధీర! వార్త మన్నీడ!
వరుస కెక్కిన బుద్ధివంతుడవు నీవు.

కాశిలో గంగ నిక్కముగ బల్కించు
వాళయిన యిరాబత్తు వంశంబు మీది
అటుగనుక మీకు మా కాదివిష్ణుండు
కట్టడి చేసిట్లు కావించినాడు
మాకు మీకును ఇట్లు మరియాద గలదు
ఈ కార్యములు నీతో నీడేరవలయు
సార్వభౌముడు మిమ్ము జంగాల వెంట
పర్వతానికి తోడు పంపేటి యపుడు
జయమంది యే వార్త చెప్పించనినాడె
దయచేసి యీపట్ల సాగించు ముందు
కార్యమొచ్చిన వేళ కని పిల్చి నిన్ను
శౌర్యవంతుం డనుచు చెప్పెను మామ
మంచిదని వొప్పితి మామతో మొదట
అంచితంబుగ నిపుడు అటువలె నొప్పు
బాలల పగ నీవు పాలించితైన
పాలింతు నేను నీ బాలలందరిని
యుగములు జగములు ఉన్న
యన్నాళ్ళు
తగ మీకు మాకును దాయాదులముగ
లక్షణంబుగ ఏమి లాభంబులైన
పక్షపాతము లేక పంపు గావింతు
బల్లికుచువ రణము నీపాల నున్నది
బల్లిదుడః గోసంగి బలములతోడ
అరుదెంచు మసిలన్న!''అన విని వొప్పి
పరగంగ రణము కేర్పాటుగా నడిచె.
బొల్లేవు మార్నేడు పొంగుచు లేచి
కల్లి కెదురుగను భీకరముగ నడువ
బత్తుడు అయితన్న పరగ ముమ్మన్న
పుత్తన్న నేతివారి ముద్దన్న ఘనుడు
కువలయాధిపు నాచకూళ్ళ నాయుండు
అవిరళంబుగ మంచి అశ్వాల నెక్కి
వరశేఖరులు మెచ్చ వయ్యాన నడిచి
సరగున నిలిచిరి సమరంబు చేయ.

## యుద్ధ ప్రారంభము - బాలరాజుల పరాక్రమము

ముమ్మరంబైనట్టి మూక నేర్పరచి
యిమ్మహక్కమ రాజు విడిసె
నాషణమె.
భేరీ మృదంగాలు భీకరంబుగను
హేరాళవంబుగ విడువక నాద
నభిరావముగ కంచునాదు నగార
నబరితంబుగ నవబోతు గిడుగిళ్ళు
తప్పెట్లు కొమ్ములు తగిన బూరాలు
ఏర్పాటుగా నాద బాకు నైజాలు
కేరుచు బిరుదు ప్రఖ్యాతి గలవార్ని
బారులుగా దీర్చి బలముల నెల్ల
తేజీల తేజీల తెచ్చి యెదురించి
రాజాధిరాజుల రణ మణచువారు
భద్రగజంబుల పాలనోన్నతుల
రౌద్రులై యదుబాల రాచకుమాళ్ళు
అపలీలగా ద్రుంచి అనిలోన నొంచి

భువన విక్రమములను పుటమణచి చొచ్చి
మట్టి మల్లాడిన మన్నెనాయకుల
పట్టి కంఠముల నప్పాటుగా తరిగి
పోటుధారలు బెట్టి భూమి గంపింప
గీటణంచిరి సూర్యకోటి సంకాశ
బాలరాజులు ఏక బలసమేతముగ
యాలలు బాడుచు ఆర్పుచు రిపుల
మానక త్రుంచుచు మన్నె నాయకుల
సేనలు గూల్చుచు చెలగి నవ్వుచును
ధుమికించి అశ్వముల దుర్గాధిపతుల
గమకించి రెండేసి ఖండములుల్ చేసి
చక్కని రాజుల సమరంబులోన
వుక్కణంచిరి రాచవర కుమారులు
ఐత భూపాలుండు అశ్వ మురికించి
భూతలాధీశ్వరుల పృధివిపై గూల్చి
ఆర్చుచు పేర్చుచు అధిక యుద్ధంబు
గోర్చుచు శ్రీరామ గోవింద యనుచు
మానవాధీశ్వరుల మార్కొని మేటి
భూనాయకుల పట్టి పొట్టలు చించి,
"చలముతో ముక్కంటిని చంపిన
యట్టి
వాలురాజు పుత్రుని వరకుమారుండ
ఐతన్న నా పేరు అన విన లేదః
ఖ్యాతి కెక్కిన యట్టి కీర్తిమణులారః
కదలక మీ బాణ కటార్ల చేత
ఎదురించి నాతోను యుద్ధ మండుండిః"
అని పేరు వాడుచు ఐతభూపాలుడు
ఘన రోష చిత్తుడై ఖండించె రిపుల
బత్తుడు ముమ్మన్న పటురౌద్ర గతిని
కత్తుల నేజాల కణగి సింగిణుల
విల్లునమ్ముల బేర్చి విమతులమీద
జల్లు గురియించిరి సమర రంగమున
రాజుల తేజీల రథ గజంబులను
పూజ్యంబు చేసె రిపు పుంగవోత్తముల
ఆ సమయమున కొమనాల పుత్తన్న
కేసరివలె ధుమికి కేకలు వేసి
విక్రమం బటు జూపి వీరపుంగవుల
చక్రముల శిరసులు చలమున ద్రుంచి
దంతులపై ధుమికి ధారుణీశ్వరుల
గొంతు మట్టుకు తరిగి కో యని యార్చె
వార్త కెక్కిన నేతివారి ముద్దయ్య
కీర్తివంతుడు నాచకూళ్ళ నాయుండు
రణవీధి కెదురించి రాజుల ద్రుంచి
కణికెలు జేయుచు కంభాణవముల
దుర్గాధిపతులపై ధుమికించి తేజి
స్వర్గాన కంపిరి సౌరిది భూపతుల
రంగమధ్యంబున రాజ పుంగవుల
భంగంబు జేసిరి బాల కుమారుల.

## మసిలినీడు కల్లందుల మారినీడుల విక్రమము

మసిలన్న, కల్లందుల మారినేయుండు
కసిబిసి జేయుచు కంఠముల్ ద్రుంచి
ధారుణి ఆ మిన్ను తారసిలినట్లు
కారు మేఘంబులు కప్పినట్లాయె
కులగిరు లటు విరిగి కూలినట్లాయె
ఫలవృక్షములు విరిగి పడినట్టులాయె
చిత్తవానగ జొత్తు చిమ్మినట్లాయె
చతురత యుద్ధంబు చేసి రిటువలెను
కణగి నెత్తులమీద కత్తిచే మొత్త
పుణకలు తెగి మెదడు భూమి
పడువారు
అత్తుకొని బాణాల అంపవర్షమున
తుత్తుమురులై కూలు ధారమన్నెవారు
చిల్లనమ్ముల కొద్ది చేరి వైచినను
వొళ్లెల్ల దుసిపారి వొరిగేటి వారు
కండలు తెగనరికి కల్లి కెదురించి
చెండి పగతుల పొట్ట చించిరావేళ;
చమటలు మై దిగజారగా గదిమి
తముకొని శత్రువుల తరిగి రిరుగడల,
పైనిండ రక్తంబు పారినగాని
నైనాల చూడక నవ్వేటివారు,
చంద్రగిరి బాణాల చెండినగాని
తందర నొందక ధరఁ గూల్చువారు,
వారి ఘాతలు విని వైరివర్గంబు
పారిరి కొండలపాలు శత్రువులు,
వడి బాణములు దగిలి వొట్టికాళ్ళిరిగి
పుడమిపై బడి చాల బొబ్బలిడువారు,
గుంటి క్రోవులు తగిలి గుండెలు బగిలి
పెంటలై పడి భువి బెగ్గడిలువారు,
జబురు జంగులు దాకి సడుగులు విరిగి
తబుకులై వడిచెడి ధర గూలువారు,
నేజాల బొడిచిన నవ్వి లేదనుచు
తేజీల వయ్యాళి తోలేటివారు,
అరికట్టి పోనీక ఆయుధము వైచి
విరుగక పోరేటి వీరశూరులును,
వెరచి నెత్తురు జూచి విపరీతముగను
పిరికి దాగిరి కొంత పీనుగుల క్రింద
జడియుచు కొందరు సాగిపోలేక
పడియుండి రొకకొంత పణుకుల క్రింద
పారేటి రక్తంబు పైనిండ చమిరి
శ్రీరామ చస్తిమని చింతించువారు,
ముచ్చిలి రక్తమున మునుగుచు కొంత
చచ్చినవారి క్రింద చొచ్చేటివారు,
కాళ్ళు ధర నిలుపక గడగడ వణకి
వ్రేళ్ళు కొంగర్లు బోయి వెతపడువారు,
గాయముల్ చూచుక కన్నీరు నించి
ఆయంబు దగిలెను హా యనువారు,
సేయుచు యుద్ధంబు చెదరి మానసము

ఆయుధమును విడచి అటు పడువారు,
వొదిగి మాట్లాడక వొకరితో వొకరు
కదలక మెదలక గాసిల్లువారు,
పోట్లబడి కొందరు పొట్టలు జినిగి
చాట్లోని తాలువలె చెరకొట్టువారు,
ప్రేగులు వెళ్ళిన పెడచేత బట్టి
యీగెలవలె కొంత యిల గూలువారు,
దాపు మోపటు లేక ధర నిల్వలేక
చాపకట్టుగ బడి సమిసేటివారు,
నడువబోయిన కాళ్ళ నరములు దెగియు
వడగండ్లు బడినట్లు వ్రాలి రక్కడను,
తల్లడపడి నెరుల్ తడిసి రక్తాన
అల్లకల్లోలమై అటు కూలువారు,
తడబడ గుండెలు తగిలి యిరువంక
చెడవిరిగి మన్నీలు చెల్లి రక్కడను,
వానచే నేతెంచు వరద కై వడిని
పీనుగుల్ తేలాడె పృథివి రక్తమున,
తెల్లని జల్లులు తెప్పవలె జొత్తు
బల్లికురువ బయళ్ళ పారంగ సాగె,
రాలి తేలిన యట్లు రాసు లేడేడ
తేలెను పీనుగుల్ తేజీలు కరులు.
పడిగెలు కత్తులు పాలకుల్ రథాలు
గొడుగులు చామరాల్ కూలె
రణమందు,
తెగి తటాకము వరుద తీసిన రీతి
పగవారి రక్తము పారంగ సాగె,
పరుపలై వాగులు పడి గోసినట్లు
నెరసుక రక్తంబు నిండియు పారె,
మెదడు రక్తంబుపై మెట్టుగా దేలి
కదలంగ సాగెను కాల్వలయందు,
పారె రక్తము కృష్ణ బారినయట్లు
ధారుణి మిన్నంటి తాఁగతి గానెను,
చుక్కలు ఝుల్లున సృష్టిపై గురిసె
గ్రక్కున రవిసోములు గనుపించరైరి,
వారి ఘోషములకు వారిధు లినికె,
సురలెల్ల చోద్యము చూచి వెరగంద
తల్లడంబును బొంది దళములు విరిగి
ఝల్లడసి చెల్లిరి సమర రంగమున,
నతులితముగ పోడు నరికిన రీతి
తతిదినము కారాకు ధర రాలినట్లు
కడువ గుమ్మడిపిందె కాయ పువ్వులును
తడయక వడగాలి తగిలి చెడినట్లు,
వడ్రంగి పనిజేయు వరుసనే ప్రొద్దు
పడ్డ చెక్కలు నేల పరచిన రీతి,
పండిన చేసులు పడగోసినట్లు,
కండలు రణముపై గముకమై యుండి,
వొరిగడ్డి వాములు వైచిన రీతి,
అరటి మ్రాకులు విరిగి అడ్డపడినట్లు,
పక్కలు పిక్కలు బాహువుల్ మెడలు
చెక్కులు డొక్కలు చరణ పద్మములు
గజ్జలు బొజ్జలు కండగుండెలును
నజ్జులై పడివుండు నందునిందనక,

కత్తులు నైజాలు గండ్రగొడ్డండ్లు
చెత్తరాలిన రీతి క్షితిమీద నుండు,
పుచ్చకాయల రీతి పుణుకలు తెగియు
అచ్చటపడియుండు అఖిలభూపతులు,
తిరమందులందరికి తీవ్రబాణాలు
ఇరవొంద మైనిండ ఈటెపోటులును
బల్లెముల పోటులు భారములయ్యె
కల్లిలో వారిగిరి కల్లందులవారు,
వల్లవులవారికి వజ్రములు నాటి
చెల్లిరి నొకవేయి శౌర్యసంపన్నులు,
కొవనాలవారికి గొరకలునాటి
గమికూడి చెల్లిరి కాలుకాలొరసి,
అబ్బురం బైనట్టి అలుగులు నాటి
గొబ్బున రక్తంబు గుబ్బటిల్లగను
ముప్పిళ్ళపోట్లకు మురహరుదలచి
తుప్పలై చెల్లిరి గుమ్మడివారు,
వుక్కటలుగులు బల్లె మురవులునాటి
చిక్కిరి కొందరు శిరములు గాడి,
గొరకవాటులు నాటి గోపకుమాళ్ళు
చురుకుపోటుల నాటి స్రుక్కిరొక
విడుత,
బాలల పోట్లాట పల్లికొండయ్య
మేలు మేలని పొగడి మెచ్చులు బలుక
ఆరీతి పగవారి నాజిలో చంపి
కేరుచు గుమిగూడి కేక లేయుచును
దట్టమౌ అశ్వముల తగ నెక్కి రాగ
పట్టభద్రులు చిన్ని బాలుకుమాళ్ల
కనుబొమల్ ముడిబడుచు గద్దింపు
కొనుచు
అనికి నెదురించుచు హరహరా యనుచు
"అన్న బత్తుండ! మా యన్న! యీసారి
చెన్నొంద లంఘించు సేనలమీద,
ముద్దుల తమ్ముడా! ముమ్మయ్య బాల!
పద్దు చూచెద ధుముకు బలముల మీద,
తమ బావమరిది పుత్తమ రాజవొరుడ!
నీ మహా పటుశౌర్య మిటు జూపు
తనకు,
ముద్దన్న నా మెచ్చు ముద్దుల మరిది
హద్దుగ నీ శౌర్య మటు జూపు తనకు.
బావ కల్లందుల పోలినేయుండ!
పావనమూర్తి! నీ పద్దు జూచెదను"
అని పేరు వాడుచు ఐతభూపాల
ఘనుడు ధుమికించె నుగ్రగత
తురంగమును
భూపతి ఐతమ పుంగవుని ముందు
కోపించి నడిచిరి ఘోరయుద్ధముకు,
మండలాధీశ్వరుల మన్నెనాయకుల
చెండిరి బేర్వేర చెల్లింపు కొనుచు,
హనుమంత లఘువులు అంతర్వు
మెరయ
గొనుచు పగతుల బట్టి గుట్టలు వైవ
బాలల కలుగులు పైనిండ నాటి

పాలధారల వలె పారె రక్తంబు,
పశువుల కాడాడ బాణాల వాట్లు
కసిబిసిగా తగిలె కల్లిలోపలను,
బహ్మాండ భాండ భూ భాగంబు లదర
యిమ్మఢక్కమ రాజవీరుండు గదిసె,

## కల్లందుల మారినేడు ఇమ్మఢక్కమరాజును సంహరించుట

మళ్ళి కల్లందుల మారినేయుండు
బల్లెంబు వడి ద్రిప్పి పటురౌద్ర గతిని
'రమ్మ నాతో యుద్ధరంగంబు' కనుచు
యిమ్మఢక్కమ రాజు యెదురొమ్ము నాటి
గదిమి బల్లెము రవి గానరా బొడిచె,
అది లెఖ్ఖ చేయక నా రాజవరుడు
పట్టతో ధట్టించి పరవళ్ళు జేసి
నెట్టన మార్నేని నెత్తిపై నరికె,
నరికిన పకపక నవ్వి మారన్న
కరి సమూహములపై కంఠీరవంబు
లంఘించు గతిని బల్లెంబు చేనూది
పొంగుచు భట్లును పొగడగ బిరుదు
పైవాడి బల్లెంబు పరుజాన గ్రుమ్మె,
కైవాలె ఇమ్మఢక్కమ రాజు ధరణి.
ఇమ్మఢక్కమరాజు ఇరుమేర నృపుల
గుమ్మిరి యీటెల గోపకుమాళ్ళు.
మరియు నెదురించిన మన్నెసరుదార్ల
నరికిరి యావుల నాగభీకరులు.
యిమ్మఢక్కమరాజు నిలమీద గూల్చి
అమ్ములు జర్జరితమ్ముగా గాడి
నిర్వహింపగ లేక నృపబలాఢ్యుండు
వుర్విపై హరిదలచి వొరిగె మారన్న.

## గోసంగి వీరుల యుద్ధము

గొబ్బున మసిలన్న గోసంగి వరులు
బెబ్బులు వలె పెద బొబ్బ లిడు కొనుచు
నేతేర గని మసిలినేయు డిట్లనియె :
"ఖ్యాతి నిల్పుడి అని గోసంగులార!
వారి పేర్వాడియు వైరముకు బంపె
వురుదాడి శేఖరు! వురుగల్లు నాగ!
గానుగపెంటి గంగ! గజ్జల రంగ!

హనుమంత లింగన! అలుగుల బసువ!
హొలపాకు సింగన! బొందడి సిద్ధు!
కాళింగ రుద్రప్ప! గడికోటి భద్ర!
ఇప్పపువుల తాటి! ఇసపాకు బొండు!
కుప్పెల కోనేరు! కొనికపాకు మర్రి!
తాబేటి దాదినేడ! తామెర మర్రయ!
ఆబోతు లక్కన! అరిగెల కనకన!
గుమ్మడి గోవిందు! కోవెలల చందు!
దొమ్మిమూకల వైరు! దుగ్గిపాకు పరశు!
వలపూస వన్నయ్య! వావిలి జంగయ!
చిలక ముక్కు శకము! చిప్పెపాకు అంకయ!
చేతుడుము సింగన! చేకత్తి మంగు!
పాతుర పాపయ్య! పాలకి తాతి!
చొరువకత్తి చాలయ! సొంపు బాలయ్య!
కురుచ ముప్పెటి జక్కన! కుందేటి దండి!
అరుపల్లి అచ్చన! అలుగు బాచన్న!
తరువడి ధర్మన్న! దళము కంబన్న!
బోడావు లన్నె పాకు! బూరుగల సాక్షి!
వాడిగల గోసంగు లొయినా రండి!"
అనికి ముస్తీదులై అల్లు కుమాళ్ళు
ననువంద మసిలినేయుని వెంట గదుల
నీరుకావి ధోవతుల్ నిలువు తిరుమణియు
దారుతరంబైన శాలువల్ మైని

చంద్ర కాపుర ధట్టి సింహ టెక్కెములు
చంద్రగిరి బల్లెముల్ చేకురుచ గడెలు
పరంగు కత్తు లొప్పయిన కటార్లు
చిరుతపులి బొందలాల్ చెలగు ఝల్లులును
పెద్దపులి బొందలాల్ పికిలిచండ్ల గడెలు
హద్దైన కచ్చుటరిగెలు నిశానలును
ఎలుగుతోల్ బొందలాల్ ఎర్ర నిశానలును
వలనొప్ప హనుమంత వన్నె టెక్కెములు
నపీరు కొమ్ములు నల్లరిగె మూక
తుపాకి బాణముల్ తుదిపదంబుగను
పిల్లగోవి తప్పెట్లు పికివి తాంబ్ర
నల్లపట్టు గొడుగులు నల్ల సురిటీలు
ఆయుధంబులు బట్టి అశ్వాలమీద
వాయించి తుడుము లిటువలె సొచ్చిరంత.
వొకచంప గంధాలు వొరుగు శిఖఫారు
రకముగా నిటువలె రణముకు నడువ,
అరిగె తాటించి వస్తాదుగా మించి
కరి ఘోటకములపై కదలిరా వేళ.

## మసిలినీడు పరాక్రమించి వీరభల్లాణుని కూల్చుట

"సరగ నేతెంచిన సాహసోత్తములార
విరుగక రణరంగ వీరులై పోర
పసిబిడ్డ బాలాది బంధువులార !
మిసిమైన రాహుతుల మీద నెదిరించి
కసిబిసి నాచేతి ఖడ్గ దీప్యంబు
మసిలన్న పోట్లాట మరి చూడరయ్య!"
అనుచు విక్రమశాలి అరులపై ధుమికి
ఘన రోషచిత్తుడై ఖండ్రించి రిపుల
మాట మాత్రంబున మస్నీల ధౌరల
నేటుగ గూల్చుచు నేతెంచె ముందు ;
చీకాకు పరపించి సేనల నెల్ల
ఏకాంగ వీరుడై యేనుగుల బొడిచె ;
ఫీపెట్టి మదగజ గున్నల బారు
చోపెట్టి తోలిన చొరవలై పోయె ;
భీకరాకారుడై పృథివి తేజీల
మూకల నెల్ల నిర్మూలంబు చేసి,
కత్తి ఝుళిపించుచు గద్దింపుకొనుచు,
కుత్తుకలు కోయుచు గుండె
తరుగుచును,
చెక్కులు పక్కలు చెక్కుచు చెలగుచు,
ముక్కులు గోయుచు ముంగల సాగె,
రథములపై ధుమికి రాజపుంగవుల
వాతికెల బడ బొడిచి వరశక్తి జూపి,
వాక్కరొక్కరి పొట్ట వ్రక్కలు చేసి,
వొక్కరొక్కరి పండ్లు వొయ్యన
బెరికి,
వొక్కరొక్కరి బట్టి వడి నేలగొట్టి,
వొక్కరొక్కరి చర్మ మొలచి
పోవైచి,
ఆకారవంతుడు అమిత విక్రముడు
చేకొద్ది వైచుచు చొకళింపుచును
అకాశ పుటములు ఆర్చుచు లెగసి!
చేకొని వైరుల చెండి మసిలన్న
ఎదురించి గోసంగు లేనూరు మూక
గొదకొని శత్రువుల గుదులుగా జేసి,
వైరివర్గంబుపై వొరుస గోసంగు
వీరులు భైరవ విదితంబుగాను
చిందర వందర చేసి యార్చుచును,
కొందరు పగతుల కొట్టి చెండాడి,
పక్కెర తేజీల పడగెడువారు,
డొక్కల వ్రయ్యలై దొర్లెడువారు,
తొండములు రెండేసి తునియలు జేసి
మొండైన యేనుగుల మెడవిరుచువారు,
పక్షులు ఆడాడ పచ్చిమాంసంబు
భక్షింప సాగెను బవరమధ్యమున!
గోసంగు లనియేక ఘోరయుద్ధంబు
చేసి, పేరులు జెప్పి, శలగగా నరికి,

అని కెదుర్పడి మసిలినాయుండు
రాగ,
వినుకొండ యేలేటి వీరభల్లాణి
వేయు తురంగముల్ వేదండములును
పాయక మసిలన్నపై నడిచి కదిశె;
పదినూరు గుర్రముల పట్టి చెండాడి
మదగజంబుల గొట్టి మసిలినాయుండు
వీరభల్లాణుపై విడిబడె నంత;
వీర విక్రమశాలి వీరభల్లాణు
కొసగక పట్టి చేకత్తి ఝుళిపించి
మసిలన్నపై పైచె మానవేశ్వరుడు;
ఆహా హా యని కటాహారి చేకొద్ది
మహిపతిపై విడిచె మలిసినాయుండు;
అది నాటి వీరభల్లాణు కోపించి
పదపడి యెదురొమ్ము పాటుగా
బొడిచె;
అత్తరి మసిలన్న అధిక రోషమున
కత్తి చెయి ఝుళిపించి కటహారి
బొడిచె;
అయంబు దగిలి భల్లాణు రోషించి,
కాయంబు చిల్లర గాయముల్ జేసి,
మసిలన్న యెదురొమ్ము మార్కొని
నరికె;
మలసిన్న రోషించి మానవేశ్వరుని
విశదము నట్టిటు విడిబడి పెనగి,
కసిదీర భల్లాణు కంఠంబు దునిమె;
వీరభల్లాణుని వెస శిరము ద్రుంచి,
భారమై పైనిండ పట్టవాటులకు
పురహరు మదినుంచి, పోత్రలాజుదలచి,
ధర గూలె మసిలన్న తరువాత
నచట.

# బోడావు లన్నెపాకు కంచర్ల గజకంఠకుని చంపుట

అతనికి ప్రధాని అతిమహారథుడు
అతిబలాఢ్యుడు బోడావులన్నెపాకు
కంచర్ల యేలేటి గజకంఠకునితో
అంచితంబుగ నెపెరి అచ్చోట నిలచె.
అత్తరి వేయు గుర్రంబుల బారు
మత్తకరి ఘటములతో మార్కొనె
నంత;
అరుదేర కనుగొని అన్నెపాకన్న
పరువడి హయముల బారుపై ధుమికి,
తన బాహుశక్తిచే తరిమి నుగ్గాడి,
ఘన భద్రగజముల కంఖాణపముల

అదలించి, భువి నణచె అన్నెపాకన్న;
గొదకొని గజకంఠకుండు నవ్వేళ
తురగంబు పైనెక్కి-
ధమికించుకొనుచు,
అరుదెంచి నై జచే అతనిపై వైచె;
అన్నెపాకంతలో ఆ చెయ్యి దప్పి
పన్నుగ హయమును పడగెడిపె
భువిని;
తద్దయు నన్నెపాకు తేజిని నరికి
యిద్దరు ధరణిపై విడిబడి పెనగ,
సింహపు కొదములు చెరకొట్టురీతి,
బ్రహ్మాండ మదర నిర్భయ శంకలేక
అంబుధుల్ రెండు పెనగాడు
చందమున
అంబరం బదర ధ్వనులంటి రొప్పుచును
చెయిబాకు ముప్పిళ్ళు చేతికత్తులును
కయిబ్రవాలిద్దరు. ఘడియ లోపలను;
పీచంబు లణపించి బిరుదు బొగిడించి
గోసంగు లచ్చోట గోర్చి అని జేసి
వెసగాడి ఆయముల్ వెడలిన యట్టి
మసిఎన్న యిరుమేర
మడసిరందరును.

## బొల్లావు జగడము

అంతట బొల్లేవు ఆదివిష్ణుండు
దంతి ఘటంబుల తరిమి నుగ్గాడి
నరసింహ కోపాన నని కెదురించి
అరులను వొలియింప అటు మ్రిదిచాచి
కాలు ధట్టింపుచు కని రంకె వైచె;
జోళ్ల గుర్రాల విజ్జోడుగా బొడిచె
మదము యేన్గుల బొడిచి మన్నీల
బొడిచె,
గొదకొని శత్రువుల కొమ్మున జివ్మె,
రాజుల రౌతుల రణమందు నణచె;
తేజంబు గల మొన దేశాధిపతుల
కత్తుల నీటెల ఘన బలాధిపుల
చిత్తవిత్తిగ బొడిచి చీరాకు పరచి,
ఎలమి రథంబులు ఎక్కిన నృపుల
చలవట్టి బొల్లేవు చంపంగ సాగె.
కళవలపడువారు కపిలావుచేత
అలుకుచు ఇట్లని ఆడి రొకకొంత,
"బోయకత్తుల రాజుబొల్లేవు వచ్చు
తోయిడి గుర్రమును దురము
వెళ్ళరుకు;
శూలము బసవయ్య:చూడక ముందు
కాలి యురువడిగను కదలు వేవేగ;
కోట భేతరాజు:గోవు వేంచేసె

దూటుగ నొక కొంత దూర
గదవయ్య;
గుజ్జుల మాదన్న! గుఱ్ఱముల్ విడచి
బొజ్జ పిసుకుకొనుచు పోవ గదవయ్య!
చయ్యన జముదాళి చముడ భూపాల!
వొయ్యన నొక దిక్కు వొదుగ
గదవయ్య!
తమ్మెట్ల రామన్న! తగ వచ్చె అపు
దొమ్మిమూకల క్రింద
దూరగదవయ్య!"
అవు బొడుచు నటంచు అందుండ
వెరచి
త్రోవలు దప్పించి తొలిగిరొక కొంత;
బాణముల మారన్న బలు మొనవారు;
జాణతనంబున జరిగెను పురికి;
చింతలపురి యేలు శ్రీరామచంద్రు
కొంత బలము తోలుకొని పోవుచుండె;
తెలిసి యా బొల్లేవు తెరువు కడ్డంబు
కలసి పోనియ్యక కల్లుబడ జంపె;
అయినవోల్ నూజర్ల అశ్వమురారి
వయితట్టుగా అవు వచ్చె నటంచు
తరితీపు తోడుత దారి బట్టించి
జరుగగా నది దెలిసి చంపె బొల్లేవు;
అటు చూచి కొందరు హాయనువారు,
దిటము చెడి కొందరు దిగులు
పడువారు,
సతుల సుతుల మనసందున దలచి
వెత కుడిచి ధరణిపై వేలబడువారు,
'వో తల్లి వో చెమ్మ వొడుపు దప్పిస్తె
జాతర సేతు'మని సక వెఱ్ఱవారు,
'ప్రాణముల్ కడతేరి బ్రతికితిమైన
బోనముల్ యేటలు పొలుపొంద మీకు
భావమౌ సొమ్ములు పట్టుచీరెలును
కావింతు' మనుచు చక్కగ
నురుకువారు,
'కత్తి నరుకులు బోయి గడచితిమైన
బత్తులకు బెడుదు'మని పడి మొక్కు
వారు'
ఇల్లు జేరితిమైన ఎప్పటివలెను
తల్లి యెల్లమ్మ నిన్ తప్పక కొల్తుము.
గురునాథ వో స్వామి! గురుతుగా నీకు
పేరులు చీరెలు పెంపుతో లెస్స
సమ్మతిగ పొంగలి సాగింతు మనుచు
ఎమ్మె లన్నియు మాని వెతకుడుచు
వారు,
బొల్లేవు దయచేసి పోనిచ్చెనైన
ఇల్లు తీర్థ మొచ్చెదము వేడుకతోను,
క్షేమాన పణతుల చేరితిమైన
తమటాల యెద్దులు దండెదాసర్లు
తిరుమలనాథ! యిలు తీర్థంబు మీకు
అరిగెద మనుచు మరియాదగా కొంత
ఆపద మ్రొక్కులు అట మ్రొక్కువారు,

ఈ పగిది బయ్కుచ విరిగెను మూక;
పగరాజు లందరిని భస్మంబు జేసి
తగవేడ్క బొల్లేవు చైత్యసంహారు
ఈ రీతి పగవారి నిలమీద గూల్చి
ధారుణీపతుల సుత్తమ తురంగముల
చలపడి అచ్చోట క్షయము గావించి
తలకక బొల్లేవు తరుణుల చెంత
నిలచి యుండగ జూచి నెలత సిరిదేవి
కలకంఠి కొమరమ్మ కరములు మొగిచె;
పందుముల రఘుపతి ప్రణమిల్లి మ్రొక్క
నందిపాటుగ ఆవు సమర శయనించె;
పర్వతము పోత్రాజు పంపించినట్టి
సర్వమైనదళము సమిసె నావేళ;
కల్లందుల మార్నేడు ఘనత యేడెడ్లు
గొల్లలు నాకకొంత గోసంగివరులు
బోడావు లన్ని హెకు పుడమిపై బండె;
మెడెం నాగెను మేటి పుంగవులు
వారి వారికి బ్రహ్మ వ్రాసిన రీతి
నారయణుతో వారు కైవ్రాలి రచట;
వారెల్ల బల్లికురువందు ఆడాడ
పేరులై వెలసిరి విక్రమోన్నతులు
ఆవేశ బాలలు అశ్వముల్ తాము
కాపె బూసిన రీతి గాయముల జొత్తు
వొళ్లెల్ల దుసిపారి ఒకరితో వొకరు
అల్లిబిల్లిగ మాట లాడుచు వైరు
లందరిన్నోస ద్రుంచి హతమైన వారి
ముందర గూర్చుండి ముచ్చటాడుచును

## యుద్ధమున మరణించిన వీరులకై అయితమరాజు విలపించుట

బావను పిలిపించి, పణతు లందరిని
రావించి, ఐతమ రాజపుంగవుడు
"వివరించి చూడుడి యీ రణము మహిమ
శివుడు సహాయమై శిలమంతులను
మాతండ్రి పోత్రాజు మరుగున వేసె;
ఖ్యాతి కెక్కిన యట్టి కీర్తిసాహసులు
సింహాల మునిమంచ చెంగి యాదవులు

దూటుగ నొక కొంత దూర
గదవయ్య;
గుజ్జుల మాదన్న!గుఱ్ఱముల్ విడచి
బొజ్జ పిసుకుకొనుచు పోవ గదవయ్య!
చయ్యన జముదాళి చముడ భూపాల!
వొయ్యన నొక దిక్కు వొదుగ
గదవయ్య!
తమ్మెట్ల రామన్న! తగ వచ్చె అపు
దొమ్మిమూకల క్రింద
దూరగదవయ్య!"
ఆవు బొడుచు నటంచు అందుండ
వెరచి
త్రోవలు దప్పించి తొలిగిరొక కొంత;
బాణముల మారన్న బలు మొనవారు;
జాణతనంబున జరిగెను పురికి;
చింతలపురి యేలు శ్రీరామచంద్రు
కొంత బలము తోలుకొని పోవుచుండె;
తెలిసి యా బొల్లేవు తెరువు కడ్డంబు
కలసి పోనియ్యక కల్లుబడ జంపె;
అయినవోల్ నూజర్ల అశ్వమురారి
వయితట్టుగా ఆవు వచ్చె నటంచు
తరితీపు తోడుత దారి బట్టించి
జరుగగా నది దెలిసి చంపె బొల్లేవు;
అటు చూచి కొందరు హాయనువారు,
దిటము చెడి కొందరు దిగులు
పడువారు,
సతుల సుతుల మనసందున దలచి
వెత కుడిచి ధరణిపై వేలబడువారు,
'వో తల్లి వో చెమ్మ వొడుపు దప్పిస్తె
జాతర సేతు'మని సక వెళ్ళువారు,
'ప్రాణముల్ కడతేరి బ్రతికితిమైన
బోనముల్ యేటలు పొలుపొంద మీకు
భావమౌ సొమ్ములు పట్టుచీరెలును
కావింతు' మనుచు చక్కగ
నురుకువారు,
'కత్తినరుకులు బోయి గడచితిమైన
బత్తులకు బెడుదు'మని పడి మొక్కు
వారు'
ఇల్లు జేరితిమైన ఎప్పటివలెను
తల్లి యెల్లమ్మ నిన్ తప్పక కొల్తుము,
గురునాథ వో స్వామి!గురుతుగా నీకు
పేరులు చీరెలు పెంపుతో లెస్స
సమ్మతిగ పొంగలి సాగింతు మనుచు
ఎమ్మె లన్నియు మాని వెతకుడుచు
వారు,
బొల్లేవు దయచేసి పోనిచ్చెనైన
ఇల్లు తీర్థ మొచ్చెదము వేడుకతోను,
క్షేమాన పణతుల చేరితిమైన
తమటాల యెద్దులు దండెదాసర్లు
తిరుమలనాథ! యిలు తీర్థంబు మీకు
అరిగెద మనుచు మరియాదగా కొంత
ఆపద మ్రొక్కులు అట మ్రొక్కువారు,

కీలు వదలిన బొమ్మ క్రియతోడ బాలు
పోల్నేడు తండ్రిపై పొరలంగ సాగె:
"సంపంగి నూనె శిరసంటి సీకాయ
ఇంపు జలకములాడు విభవ మెటు
బోయె?
శక్తి నేటికి తొలుగ శౌర్య సంపన్న
రక్తమున జలకంబు వ్రాసినా
బ్రహ్మ?
బంగారు దుప్పట్లు పైనిండ గప్పు
శృంగారమగు మేటి స్రుక్కితివె
తండ్రి?
వొప్పయిన బాణాలు వడి గాడి పారి
తప్పక బల్లికురువ తావాయె నీకు?
కురువేరు పువ్వులు కొమరప్ప మిగుల
పరిమళించెటి మొల్ల పరగ జాజులును
ముడిచెడి నీ శిరము మునిగె రక్తాన?
మెడనూలు కంఠసరి మేలైన మణులు
ధరియించు నీ రొమ్ము తాకెనా పోట్లు?
విరిగినా దేహంబు? వొరిగితివె తండ్రి?
పుత్తడి బంగారు బోలు నీ నొసలు
నెత్తురు చిందినది నేడు నా తండ్రి!
మొత్తము నీ చేతి మొనయ ఫిరంగి
కత్తి రెండు మూడు కణికలై యుండె.
పందుముల మా యన్న
పల్లికొండయకు
కందువతో నను వప్పగించె
మా తండ్రి.
కస్తూరి శ్రీచూర్ణ కర్పూర సాదు
హస్తాన గాయముల్ అమరెనా తండ్రి?
పుష్పముల చేరులు భూచక్ర గొడుగు
తెప్పలుగ రక్తాన తేలెనా తండ్రి?
ప్రమదము అపరంజి పల్లంపు తేజి
కొమరొప్ప నీ చెంత కూలెనా తండ్రి?
నను పూరడింతు విన్నావ్వు వో
తండ్రి!
కను యెత్తి చూడవు కనికరము లేద?
సవరించు నీ రొమ్ము జముదాళి పోట్లు,
నవుమొఖము యెటు బోయె నాతండ్రి
నీకు?
మానసము నామీది మరు లెందు
బోయె?
తానెంత వగచిన దయ లేదు నీకు?
వొరుసతో వూరకే వున్నావు తండ్రి!
పరివారమా యెంత భ్రమ లేదు
నీకు?
మంచి శరములు వేశి మామీది ప్రేమ
త్రుంచెనా విధి నిన్ను దురములో
తండ్రి?
చక్కని దేహంబు సరిదొలిగి నెరులు
చిక్కబడి యున్నవి శిరమున
తండ్రి!
పచ్చల కడియాలు పచ్చి రక్తమున
గ్రుచ్చి నట్లున్నవి గొరక వాటులకు;
మెత్తని పాన్పుపై మెలిగేటి మేను
కత్తులు పాన్పుగా కలిగెను తండ్రి!"
దొరకొని శోకించ దుఃఖంబుచేత
పరగంగ పోల్నేడు పడి మూర్చ
నొందె.

## పోల్నేని పల్లికొండ ఓదార్పుట

ఆక్కరతో పల్లికొండ అతని వీక్షించి
మక్కువతొ గూర్చించి మనసు జెడకుండ
తప్పించ నతనికి తండ్రిపై మరులు
చెప్పెను బహులోక చరిత లన్నియును:
"గాయముల్ యెదురొమ్ము గాడితే గాని
సాయుజ్య పదమౌట స్వర్గంబు గనుట
అది గాక రంభాది అనుభవం బగుచు'
ఇది పురాణములందు వినగ జెప్పుదురు;
ఎన్నాళ్ళు తల్లిదండ్రు లెవ్వరికైన
వున్నారు పోల్నేడ వుర్వి లోపలను?
గట్లును కులగిరుల్ కదలక యుండు
చెట్లును పక్షులు చెలగు మృగములును
పుట్టిన వస్తువుల్ భూమిలో నిలక
గిట్టుబో, మీ తండ్రి కీర్తి నిలిపించె;
జనులకు నూరేండ్లు జయ ప్రమాణంబు
అనుట శాస్త్రములందు అంటజెప్పుదురు,
అన్ని దినములు బ్రతుకుటా ఫలంబేమి?
కన్నతండ్రికి నీకు కారణము లేదు
చింతచే పడనేల? శివుని అననేల?
అంత దుఃఖము వద్దు అటు మానవన్న!
వినవోయి మీ తండ్రి యుద్ధంబు జూచ
ముని దేవతా యుద్ధమునకు దీటౌను,
వలనొప్ప భువిలోన వొక తెర బట్టి
నలరుచు బొమ్మల నాట్య మాడించి
అవి చోద్యపరుపించి అఖిల మనుపించి
జవదప్పి బొమ్మల సరగ కీళ్ళూడి
వొరిగిన బొమ్మలు వుర్విలో జనులు.
మారినేని సుపుత్ర! మహనీయ గాత్ర
చేకొను నా మాట శౌర్యప్రతాప!
ఏ కార్యమైన నీ వెరుగనివి లేవు,
మీకు తండ్రియు లేడు, మీ తల్లి లేదు,
శోకింప పనిలేదు, శోకంబు మాను."
చాల దుఃఖము లార్చి సనసు లందగును
పోలినేని కటుల బుద్ధి పోషించి
పల్లికొండ పెద్దలు బల్లికారువందు
కల్లంద్లు మార్నేని ఘనత తోడుతను
పల్లకిలో నుంచి పల్లికొండయ్య!
వల్లవుల సిగిదేవి వనిత కొమరమ్మ
మసిలినాయుని జూచి మగువ లందరును,
పసిబాలుడగు అన్నెపాకును జూచి
పల్లవులు తిరుమందు లొరుసతో జూచి
పల్లికొండ మాతంగ బలులను జూచి

"మీరు మన తోటట్టు యుద్ధంబు చేయ
కారణ ముండె నా కల్లిలో నెల్ల
వెరపరిక యుంచక యే వస్తువైన
అరలేక నడిపింతు అసురులు మెచ్చ
అన్నపానాదులు అనుభవించేరె
పన్నగ కులగోత్ర మేర్పడెగాక
ముందు మా తండ్రికి ముత్తాతలకును
పందుముల వారికి బావలు మీకు
మసిలినాయుడ మేనమామవు తనకు
వసియించు బోడావులవారు వివరింప
తమ రన్నదమ్ములము తాతముత్తరము
అసురులు మెచ్చగా అన్నపానము నా
తమ్ము
డనుచు భేదము లేక అనుకొందు
మెపుడు
ఘనులు మా పెద్దలు కార్యసంగడిన
సరసను పోట్లాడి సాహసము జూపి
పౌరుష దప్పక చెల్లి వార్త కెక్కితిరి"
అని పల్లికొండ యిట్లాందోళపడగ
మనుజేశ ఐతమ మండలేశ్వరుడు
మారన్న సరసన మాతంగ వీరులు
దారిగ నడిపించె తమ విడిదికడకు
బల్లికుర్వను జేరె బంధువుల్ దాము

## యుద్ధభూమి వర్ణన

కల్లికి మృగములు కలయ నేతెంచె
చేరెను చిరుతపులి చెలికె తోడేండ్లు
పారెను భేతాళ పతులు విస్తీర్ణ
వంతులు గ్రద్దలు బవర మధ్యమున
రంతులు జేసెను రణవీథియందు
కొల్లి గలిగెనంచు కొరివి భూతములు
త్రుళ్ళుచు నేతెంచె దురము లోపలికి
నక్కలు తోడేండ్లు నడికల్లు జొచ్చి
త్రొక్కుచు శవముల దొరకొని మెసగి
భూతముల్ చెలరేగి పుఱ్ఱెల మెదడు
మేతగా భక్షించి మీసముల్ దీటు
చిక్కని రక్తంబు చెదురు కండలును
ఎక్కడ జూచిన ఎనసి నట్లుండు
జర్జరితంబుగ శవముల శిరము
ఖర్జూర మధురమై కలసి భక్షించు
తావులు గైకొని తవిలి భూతములు
గావులు గాబట్టి కారాడసాగె
కొవ్వుదబ్బలు గుండె కొలదిగా మెసవి
నవ్వుచు భూతముల్ నాట్యంబులాడు
పరుపైన రక్తమున పడి యీదులాడె
కొరివి భూతములెల్ల కూత లిడుచుండె
కాకులు ఆడాడ కంఠస్వానంబు

మూకలై కల్లిలో మసిరి భక్షించె
మీరిన సంపదల్ మిగుల గోపకులు
చేరిరి బల్లికుర్వ క్షేత్రంబునందు.
రణమందు పోరి నిరయమైనవారి
పణతుల బిలుపించి పల్లికొండయ్య
సొగుమాన మటంచు సఖియ లందరికి
వేగంబె సెలవిచ్చె వేడ్కతో నపుడు
బాలల రప్పించి బలువు గాయాలు
మేలిమిగ భద్రించి మేరగా నుంచి

## మార్నేని మారమ్మ సొగుమానము

అంతట మార్నేని అతివ మారమ్మ
కాంత శిరోమణి కనకంపు ప్రతిమ
తరళాక్షి వేంచేసి తన విభుని జూచి
చరణములపై వ్రాలి చిరునవ్వు నవ్వి
పురుషునికి తా మ్రొక్కి భూమి గొను
కొనెను
ఇరుగడ బంధువుల్ యిష్టమై కొలువ
పుప్పర్ల బిలుపించి వొప్పుగానపుడు
కర్పూర వీడ్యముల్ కట్నాలు యిచ్చి
గుండంబు త్రవ్వించె గురువు
పలికొండ
అండన మాతంగ అతివ సమాధి
పరగ బోడాలన్నె పాకుల సతికి
సరగున త్రవ్విరి సరస గుండంబు
చందనపు తరువులు చాల వేయించి
పొందించి రప్పుడు పొసగ గుండముల
తెగువతో నేతెంచె తెరవ నవ్వుచును
అగ్నికి మారమ్మ ఆయత్తపడెను
కీలు కడియంబులు కీలు కంకణాలు
చాల చొక్కము బన్నసరములు మెడను
ముత్యముల కమ్మలు ముంగా
మురములు
హత్తుకొని రత్నాల హారములు నేసి
బవిరెలు రత్నాలు పజ్జుకమ్మలును
సవరించె సొమ్ములు సఖియ మారమ్మ
ముత్తైదులైనట్టి ముదితలు అపుడు
పుత్తమాంగనలైన వొనర బాంధవులు
అగరు కుంకుమ గంధ మైదువుల్
జల్ల
మగువలు వీడ్యముల్ మడిచి యందింవ
గుభగుభ వాద్యముల్ గుభులుగ
మ్రోయ
సొబగుగా పసుపుచేలము ధరియించి

గరిమ పుత్రను తురంగముపైన — తనయు డున్నాడని తన బంధువులకు
నెక్కి — గొనకొన పందుముల గురువుతో
తిరమందు లేంచేసి దీపనలంచి — దెల్పి
అందరి మందిర మన్నంబు గుడిచి — దండ మొప్పగ బెట్టి ధర్మసభ వెళ్లి
పందుముల రఘుపతి పదములకు — గుండంయిన ధుమికె గురువు సెలపంది
మ్రొక్కి — పకపక నవ్వుచు పలికె ముమ్మారు
తరువాత వేంచేసి తమకంబు యెక్కి — ప్రకటముగా విధుగూడి పరమపద
గరిమ వైభవంబు కన్నుల జూచి — మరిగె.
కవి గాయకుల కర్థిగణముల కెల్ల — దాయాది బలగము తమ యింటివారు
దివ్యాంబరంబులు తెరగొప్ప నిచ్చి — హాయని దుఃఖించి రాగుబ్బుగాను
చెలగి కాంతల గూడి చేటల నోమి — పొలపొల క్రొక్కుచు పొలతు లందరును
బలువైన సొమ్ములు బ్రాహ్మణుల కిచ్చి తలపట్లు బట్టుక ధైర్యపాటైరి
ఆభరణములు అన్నియు దీసి — పాలవారిధిభవు పల్లికొండయ్య
కాబట్టి ధర్మంబు కాంతల కిచ్చి — పోలినేయుని చెట్ట పొసగంగ బట్టి
పన్నగ శయనుని భక్తితో దలచి — కలబంధువులు తాను కన్నీరు దుడిచి
పుణ్యపు సీరాడి పొలతి మారమ్మ — జలధిలో స్నానంబు చేయించి తోటి
సొంపుతో సభ యెల్ల జూచుచుండగను మరియాదతో వచ్చె మగువలు దాను
చంపుడు కట్టెక్కి సఖియ తా నపుడు

## మసిలినీని మారమ్మ, బోడావుల అన్నమ్మ తమ పుత్రులను సిరిదేవి కొమరక్కలకు అప్పగించుట

కాంత ఓచ్చురికిన ఘడియ లోపలను
మాతంగ యింతులు మరి పైనమైరి
తమ పురుషులకు పొర్లు దండముల్ బెట్టి
అమరంగ ముస్తైదులైరి ఐదువులు
కడియముల్ ముంజేతి కంకణంబులును
నడుము వడ్డాణముల్ నడిగుండ్ల పేర్లు
బవిరెలు కమ్మలు బశువు పులిగోర్లు
నవరైన ముక్కరల్ నానుగ్రోవులును
పతకముల్ మెడనూళ్లు భటువుంగరములు
ముద్దుతో గజ్జెలు మువ్వలందెలును
పసుపుచీరెలు జాతిపట్టు రవికలును
మసిలి నాయుని తరుణి మారమ్మ జోడు
బోడావు లన్నమ్మ పొలతి పుణ్యాంగన
కొడుకుల చంక గైకొనియు నేతెంచి
కాటుక కన్నుల కలికి మారమ్మ
బోటి తిరుమణి పెట్టి పొలతి అన్నమ్మ
వంతు కెక్కినయట్టి వరసుతుల దెచ్చి
యింతు లిద్దరు వొచ్చి వినయంబు తోడ
కొమరొప్ప సిరిదేవి కులగురువున్న
తమకంబు చెంతను తనయుల నిల్పి
"యుద్ధరంగము చెల్లు ఇద్దరి కుమాళ్ళ
వొద్దిక నిచ్చెదము వొప్పకోరమ్మ
మసలినేని కుమారు మరి బీరినేని
శిశువు బెంచగదమ్మ సిరిదేవి నీవు
సంగట బోడావుల చెన్నమనేని
అంగన కొమరమ్మ అందుకోవమ్మ
శృంగారముగ మమ్ము చూచు యాదవులు

పొంగుచు బాలల పుచ్చుకోరమ్మ
స్తన్యపానము గల సఖియలు ఎవరొ
చిన్నబాలల అంది చేరదీయరమ్మ
సత్యవంతులు మీరు సఖియ సిరిదేవి
నిత్యము మా సుతు నీక్షించరమ్మ
మా యమ్మ సిరిదేవి మా
కుమారకుల
న్యాయంబుతో ఎవరంది పెంచెదరు"
అని యిట్లు మారమ్మ అన్నమ్మ
సుతుల
కనుగొని హా యని కన్నీరు నించి:
"కడతేర్చి మిమ్ముల ఘనులను జేసి
నడుపు వారెవ్వరో నా యన్నలార!
ఆవుల వల్లమ్మ అతి పుణ్యశాలి
కావలసి మీ తండ్రిగార్లను బెంచె
ఇందు మిమ్మెవ్వరు ఈడేర్చి పెంచి
అందముగ రమ్మ బొమ్మను వారు
యెవరు ?
తల్లిదండ్రు లుండవలె తనయుల
బెంచ
ఎలమితో మరియొకరు ఏల పెంచెదరు:
మమ్ముల గన్నట్టి మా తండ్రులారా!
బ్రహ్మ యిటువలె చిన్న ప్రాయమున
వ్రాసె
కొమరుల గంటిమి కోటికి పడగ
అమరంగ ఎత్తుదామని వుంటిమన్న
పతుల వెంబడి మేము పైనమై పోవ
మతి యుంచి యీ గతి మిము
సాకువెవరు ?
పిన్న ప్రాయంబున బీరన్న నిన్ను
కన్నుల జూడను కారణము లేదు
చెన్నయ్య మిము పెంచి చెలగి ముద్దాడ
పన్నుగ మాకేల ప్రాప్తి లేదాయె
వారివారల చిన్నవారి లోపలను
పేర్వేర మిమ్ముల పిలుచు వారెవరు ?
చెన్నయ్య బీరన్న చేపట్టి మిమ్ము
తిన్నగ చెయిబట్టి తీసువారెవరు ?
తండ్రులు లేకుండ దైవంబు మీకు
అండ దప్పించె శివు డన్నయ్యలార !
ఘనులార ! మీ తండ్రిగారి కైవడిని
ఎనయ లోకములందు విఖ్యాతి జెంది
ఈశ్వరు కృపచేత ఈడేరి పెరిగి
శాశ్వత కీర్తిచే చెలువగ మీరు
ప్రఖ్యాతి గలిపించి పగతుల ద్రుంచి
విఖ్యాతి జెందుడు విక్రములార !
వల్లవు వారింటి వాహిని నిల్పు
చల్లని హరుని ప్రసాద సేవితుడు
వర పెద్దిరాజేశు వనిత గర్భమున
ధర కీర్తివంతు డుద్భవమయి రిపుల
కల్లి నణచుట కొరకు ఘన
పరాక్రముడు
కల్యాణ పట్నమున గలిగి యున్నాడు

రక్షించు మిమ్ముల రాజతడుగాగ
దక్షతు లెవరు ఇందరిలోన లేరు
ఈరేడు జగముల యెన్నికగాను
బీరన్న మీ తండ్రిపేరు చెల్లించు
తోడుగా చెన్నయ్య ధొరల సన్నిధిని
బోడావుల వారిలు పోకుండ నిల్పు
ధరను మీ తండ్రులు దాటిపోవగను
ఉర్విలో తమరుండ నుచితంబు గాదు
పరమ పతివ్రత పద్మినులార?
బీరన్న చెన్నయను పెంచుకోరమ్మ!
పాలకాయ గోత్ర భామినులార!
బాలల బెంచి చేపట్టరో యమ్మ!
వరలేని సురియలు వాడని బంట్లు
విరుగు తలకుట లేని విక్రమోన్నతులు
వీరభద్రుం డితడు వేడ్క నా సుతుడు
బీరనాయుని మీరు పెంచరో యమ్మ
కంజముఖులార! విక్రముడు
చెన్నయ్య
అంజనీసుతు రూపు యని పెంచరమ్మ
గోపిక మణులార! కోమలులార!
ఆపద గడుపుడ అయిదువలార!
అతివ శిరోమణి అమ్మ సిరిదేవి!
మతిమంతురాల వో మగువ కొమరమ్మ
తనయుల బెంచుడి తమకు
సెలవియుడి''
అనగ సిరిదేవి కొమరమ్మ యిట్లనిరి:

"చక్కని మారమ్మ! సఖి శిరోమణివి
అక్కరో మా యమ్మ అన్నమ్మ!
వినుడ
మేలంద కైలాస మేగెడువారు
బాలురపై నింత భ్రాంతులు ఏల?
యాడవుల్ గోసంగు లే కాలమైన
పాదుగ దాయాగి బంధులైనారు
తరతరంబుల నుంచి తమ వంశమందు
ఇరవొంద మిము బెంచి యీడేర్చినారు
పెంచినందుకు తమకు పేరు దెప్పించి
వంచన లేకుండ వొరిగినారమ్మ
యీపట్ల మిమ్ముల విడనాడితేను
కాపట్టి మము హరుడు కడతేర్చగలడ?
కారమ్మ మీ సుతులు, కాంత మారమ్మ
నారిమణి మా సుతులు, సన్నింట
దాది,
మాటలు నేర్పుట మరి ఒక దాది,
పట్టెమంచము వంచి పరపులు బరచి
నెట్టిన సుఖియింప నెరి ఒక దాది,
పిన్నప్రాయము గడిపి పెద్దవారైతె
చెన్నొంద చదు వభ్యసించ సాధనలు
నేర్పించి తేజీల నెక్కి యాడింతు,
తీర్పరులను జేసి తివిరి పెండ్లిండ్లు
కావింతు నా సుతుల గారవంబులను,
పావనము జేయింతు పద్మాక్షులార!
సమ్మతి నా మాట చక్కగా మీరు

నమ్మి మారమ్మ! వో అన్నమ్మ
మమ్మి"
అనుచు సిరిదేవి బీరన్నను తనకు
వనిత తెమ్మని చాచె వసర
హస్తములు
నవ్వుచు మారమ్మ నాతి కందించి
అవ్వల నేతెంచె అగ్ని కెదురుగను;
నన్నమ్మ నట జూచి నాతి కొమరమ్మ
'చెన్నయ్య' నిమ్మి 'నా చేతికి' ననెను
కలకల నవ్వుచు కాంత అన్నమ్మ
కలకంఠి కొమరగిరి కందించె నపుడు

## మాతంగ కాంతల సాగుమానము

బాలల నందించి పణతు లిద్దరును
మేలిమి చేటల నోములు నోమి
పుణ్యపు సీరాడి పోలెముల్ దీసి
పుణ్యాంగనలైన భూసుర స్త్రీల
కిచ్చిరి దానముల్ యీవలావలను
సొచ్చెను మారమ్మ సొరిది సమాధి
పురుషుని తన కుడిభుజము సందిళ్ల
పరగంగ తానిల్పి పణతి మారమ్మ
తరుణి అందరి బిల్చి దండమర్పించి
సరగున చిచ్చురికె సఖియ మారమ్మ
మంచెపై నటు యెక్కి మగువ
అన్నమ్మ
అంచితంబుగ నిలచి అగ్నికి మ్రొక్కి
దండమని సభకు నంతటను
గుండంబు
నిండు వేడుక జొచ్చె నెలత
అన్నమ్మ
పూబోణు లిద్దరు పురుషుల గూడి
వైభవంబున చనిరి వైకుంఠమునకు
అనువంద యాదవ అంగన లెల్ల
చనిరి బాలల గొంచు సదనంబులకును
మరునాడు ఏతెంచి మరియాదలెల్ల
మరియు గుండంబు సమాధి శోధించి
అందు గల్గిన మేలు అనవాల్ జూచి
కందువ తోడ పైకప్పిరి మన్ను
సారమగు తమరున్న సదనంబు కరిగి
బీరన్న చెన్నయ్య పేరుబలంబు
అడిగిన విప్రు లిట్లని పల్కిరపుడు
"కడువేగ వినుడి భీకరశాలురీరు;
ఈ ధర యాదవుల యుద్ధరంగనులు
సాధించ గలిగిన సాహసులు వీరు;
శివరూపు బీరన్న, చెన్నయ్య విష్ణు,
నవనీతులై పుట్టినారు వీరిందు,
కారణము తల్లిదండ్రి కన్నట్టివారు

వీరి ముచ్చట చూడ విధవంబు లేదు.
తగ వీరికిని మీకు దైవంబు ఇటుల
తగవు దప్పక చేసె ధనరుణంబులకు
మీరు పెంచుడ వీర్ని మిగుల సంపదలు
పేరు బలంబుతో పెరుగుచున్నారు
పెంచుడీ బాలల పెంపుతో మీరు
మించును ప్రఖ్యాతి మీ వంశమందు”
పప్పిరి యా విప్రవరుల వాక్యములు
చొప్పున ఏనాళ్ల సూతకము దీర్చి
పంచభక్ష్యాజ్యముల్ బంధువర్గముకు
కొంచక నర్పించి కోలాహలముగ
భూసురార్పితముగ పుణ్యముల్ కలుగ
చేసిరి షోడశ చెలగు దానములు
ఘోరున కల్లందుల పోలినేయుండు
ధారుణిపై బొర్లి తల్లిని దలచి
కొలుకుల కన్నీళ్ళు గోళ్ళ జిమ్ముచును
పలవించి పలవించి బంధువుల జూచి
“నను బెంచి పుద్దాడి నయము గావించు
నెన రెటు బోయెను నెలత మారమ్మ?
చక్కని నీ మేను సమిసె నేడిందు
చెక్కుల పాలాయె చెల్లంబో తల్లి!
పగడంపు పలువరుస బాగైన మోవి,
నిగురు మంటలలోన నిమికెనా తల్లి?
తుమ్మెద రెక్కవలె తూలెడు కురులు
అమ్మయ్య మంటపాలాయెనా యిందు?
శిస్తయిన మెడగుండ్ల చేరులు దెగియు
హస్త కంకణములు అగ్నిపాలాయె!
తల్లిదండ్రులు తనకు దరిదాపులేక
బల్లికుర్వ పట్టణము పాలైతి రిచట
పొలుపొంద ఎలమంచి పోవుచున్నాము
తెలియజెప్పుడ బుద్ధి తెరవ మారమ్మ''
అని యిట్లు పోల్నేడు అడలుచుండంగ
అనుపంద సిరిదేవి అతివ కొమరమ్మ
దుఃఖించి మది కొంత దృఢముగా జేసి
అక్కన పోల్నేని అలమి లాలించి
తోడుకు నిరుమేర తోయజాక్షులును
వేడుక తామున్న విడిదికి జనిరి
కలబంధువులు తాము కల వంటకములు
నలరు పంక్తి భుజించి నంటు బాపించి

## యాదవులు తిరిగి యలమంచికి ప్రయాణము సాగించుట

అనువంద సంపదల్ అచ్చోటు తర్లి
ఎనుముల మందకు మగంబె జనిరి
అమితమౌ దాసళ్ళ కన్న మొడ్డించి
ప్రమదముతొ మసిలమ్మ పేరు
జెప్పించి
మార్నేనిపేర బ్రాహ్మలకు దానములు
పౌర్ణవమి దినమందు పదివేల కిచ్చి
వస్త్రదానంబులు వైష్ణవుల కిచ్చి
పశువుల దానముల్ పరగ నర్పించి
పాటలగంధులు బాలరాజులును
కోటిలింగముల గ్రక్కున జూచి
పొగడి
కువలయాక్షు లన్నమిడి కొల్పి
వడియలకు
శివరాత్రి జాగరము చేసి రారేయి
పదివేల దివ్యలు పరమేశ్వరునకు
కొదువ లేకుండ మక్కువ సమర్పించి
అందు పందుముల శ్రీహరి పల్లికొండ
నందివాహనుని ఆనందమున గొలిచి
భూసురుల కర్పించి భూరి దానము
దాసులకు వస్త్ర గోదానముల నొస
పిన్నరాజులు తాను ప్రియ
బంధువరు
ఎన్నగల కంపటీల్ వెలదు లందరును
సాపంక్తి సాగించి సకల వస్తువులు
వైపు అరువది పిండివంటలు మరియు
కూరగాయలు తమరు గోరినటువంటి
పేరిన నెయ్యి సొంపలరిన చారు
షడ్రసాన్నంబులు సాపంక్తిలోను
వడ్డింప తృప్తిగా వనర భుజించి
పెద్దుగ పోట్లాడి మొననిల్పినట్టి
ఎద్దులకు వైకుంఠ మేర్పాటుజేసి
మన్నీల మార్నేని మసిలినాయునికి
అన్నెపాకు గోసంగు లతిబలాఢ్యులకు
కోటిలింగములందు కోరి కైలాస
బాట సాగించెను పల్లికొండయ్య
తర్లించె నెలమంచిదారి సంపదలు
వుర్లించ మందలావుల కంపటంబు
ఆవేళ నాదెండ్ల యను పురము జేరి,
గోవర్ధనుని పల్లికొండ తా వేడి
"పక్షివాహనః రామః బలభద్ర రామః
మచ్ఛ కూర్మావతార మాపాలి స్వామి!
వ్రేల కొండెత్తిన వెన్నుడ వీవు
తాల్మితో బలిని భూదాన మడిగితివి
చక్రధర! మధురకు చెలగి అలనాడు
అక్రూరు వెంబడి అరిగి చాణూర

మల్ల ముష్టికులతో మహిమీద బోరి
పల్లడవైచు బలభద్రావతార!''
కానుక లర్పించి కదలి మరునాడు
ధేనువుల తర్లించి తెరవలు దాఘు
వాకు వాగెపురము వల్లూరు దాటి
కాకుమానూరు నిల్కడ జేసె గురువు.
ముంగల నడుపించ మొనసి సంపదలు
మంగళగిరికి జేరె మరునాడు వొచ్చి
నరసింహులను జూచి అతిభక్తితోడ
కరములు ముకుళించి ఘనతతో వేడె
"నారాయణ! మురాంతక!
నందకుమార!
శ్రీరామ! జలజాక్ష! శ్రీరమానాథ!
గజరాజ వరద సుకౌసల్య పుత్ర!
విజయంబుతో శరణు విలువిద్య రామ!
శుభమస్తు నీకు భాస్కర వంశతిలక
అభయ మియ్యవె నాకు అక్రూర
వరద!''
అనుచు ప్రార్థన జేసె ఆ పల్లికొండ
వనర భూపుత్రిని వనజ దళాక్షి
సీతాంబికను జూచి సిరిదేవి పొగడి
నాతులు కృష్ణస్నానము జేసి రచట
అంబను ప్రార్థించె నా పల్లికొండ!
''శాంభవి! పదివేల శరణమ్మ నీకు!
లంకలోపల బుట్టి లక్షణంబుగను
ఫ్రౌంకముగ దశముఖుని పోరి గెల్చితివి
శ్రీరమా శక్తివి సీత మా యమ్మ!
కోరి వేడెద తమకు కోర్కె లీడేర్చు
చేసెద నీసేవ జనకుని పుత్రి!
దాసుడ నేను నీ దయ వుంచవమ్మ!"
సీతాంబికను వేడి చెలగ మరునాడు
ఖ్యాతియౌ సంపదల్ కదిలె బెజవాడ
మల్లప్పకును ప్రణమిల్లి యాదవులు
పల్లికొండయు అతి భక్తితో వేడి
"భల్లాణ భూపతి పణతిని అడిగి
కొల్లగా కైలాస కొండ యిచ్చితివి,
శరణార్థి! శరణార్థి! శరణు మల్లేశ!
కరుణించి మమ్ముల కరకంఠ యీశ!"
అనుచు ప్రార్థనజేసి అచ్చోటు కదలి
ఘనమైన బాలల కన్న సిరిదేవి
బెజవాడయు తర్లె భేరి వేయించి
సుజనులందరు వినుచు శ్రీరాముకథలు
ఏలూరు నిలచిరి యదుకులోత్తములు
జాలానాథుని సేవించి పొగడి
తేజమౌ యేలూరు తర్లె మరునాడు
రాజమహేంద్రము రఘుపతి నిలచి
పణతులు యాదవుల్ పల్లికొండయ్య
పుణుకకంచమువాని పూజించి మ్రొక్కి
గౌతమీ స్నానంబు ఘనతతో జేసి
బహు దానములు జేసి బ్రాహ్మలందరికి
మార్కండ రాయుని మరి వేడిరంత

''మార్కండ యీశ్వర ! మరి
సోమశేఖర !
అష్టమూర్తివి నీవు! ఆది రుద్రుడవు!
దృష్టముగ ముక్కన్ను త్రిపుర
సంహారి !''
యంచు నంతట వేడి యెలమి
సంపదలు
అంచితంబుగ తర్లె ఆ మరునాడు
పాటలగంధులు పరమేశ మేగి
కోటి లింగాలను కొనియాడె గురువు
''కప్పిన పులితోలు గండపెండెంబు
అప్పు శిరమున నిల్పు అమరేశ
శరణు ; ''
రామలు తా ద్రాక్షారామము జేరి
భీమలింగము జూచి ప్రియముతో ? డి,
''కందర్ప సంహార! కామపాలుం ! !
నందివాహన! శరణు అఖిల లోకే !
బిరుదైన శూలంబు భీమలింగేశ !
నరమాంస మడిగిన నాగ లింగేశ!'
మట్టుతో పూజించి మదనారి గొలిచి
నట్టువ భోగాల నాతుల కెల్ల
పట్టు చేలంబులు బంగారుమాళ్ళు
దిట్టముగ యిప్పించి తివిరి మరునాడు
పిట్టపురంబున ప్రియముతో నిల్చి
అట్టహాసము సూకలాంబను వేడి
''భ్రమరాంబికవు ! లోక పావన
మూర్తి !
అమరుల గన్నట్టి అమిత గీర్వాణి !
అమ్మ నీ మేను సాహస మోహనంబు !
సొమ్ము గావించెను సోమరవినేత్రు''
సీతాంబికను వేడి చెలగి మరునాడు
జాతర చేయించి చయ్యన వెడలి
సింహాద్రి పోట్నూర చేరి రందరును
సింహాద్రి అప్పని చెలగి ప్రార్థించి
''పరమాత్మ! పాండవుల పక్ష మురారి!
ఉరమున శ్రీలక్ష్మి నుంచిన భోజ!
ఖగము నెక్కిన రౌత ! గజరాజవరద!
సకలవిద్య ప్రవీణ! సఖుల నెరజాణ!
కృష్ణమాచార్యులకు కీర్తి బుట్టించి
దృష్టముగ నీ రూపు తెలిపిన దేవ !
పటుతరంబుగ మమ్ము పాలింపు''
మనుచు
అటువేగమున తర్లె ఆ మరునాడు
శ్రీకాకుళము జేరె చెలగు సంపదలు
శ్రీకాకుళము నున్న శ్రీకాంతు వేడి
''మాధవ! గోవింద! మందరోద్ధార!
నాదవినోద! హరి! నారాయణుండ!
పతివ్రతలగు త్రిపుర భామల మనము
కౌతకక చెరిచిన కోదండరామ!
కరుణ దేవకిదేవి గర్భమున బుట్టి
తరుణి యశోదకు తనయుడైనావు!''
ఇంపుగా ప్రార్థించి యింతులు గదలి
పంపాద్రి చేరిరి పణతులు దాము

## - : పల్లికొండాదులు పంపాద్రిని చేరి యలమంచిలోని చల్లవారికడకు దూతను పంపుట : -

బసవదేవుని జూచి పల్లికొండయ్య
వెస నేరములు చాల నెంచె నావేళ
"నమ్మితి బసవన్న! నాడు నీపట్ల
మమ్మ కృపజూడకీ మరియాద జేసి
కాపాడవై తివి కడకంట జూచి
పాపకర్మండవో బసవన్న నీవు!
అన్ని నోములు వక్కటన లేక నీవు
పన్నుగ మమ్మ నెడబాపితి విందు
మొదట మిము నమ్మితిమి
మోసపోయితిమి
కదలి పోయితిమిడిచి కాణాచు లెల్ల
మామ లందరిని రణమందు పేరాచ్చె
మేము వేంచేసితిమి మీరున్నకడకు
తిలకించు మికనైన దేవతామూర్తి!
యెలమంచి పట్టణము కేగుచున్నాము
కృపయుంచు" మని మొక్కి కూర్మి
చుట్టాలు
నిపుణత్వమున గదలి నెలత
లందరును
మార్గస్థులై యొక్క మాటున నిలిచి
శీఘ్రమున రప్పించి చారులతోడ
పల్లికొండిటు బల్కె "పనిబడి మీరు
చల్లభూపతి సుతుల్ సాహసోత్తములు
ఎలమంచి పట్టణము ఏలుచున్నారు
నిలువక మీరేగి నృపవరులతోడ
అన్నలు తమ్ములు అందరునున్న
పిన్నయకు దెల్పుడి ప్రియవాక్య
మొకటి
ఆవుల పోలరాజు హతమైన వార్త
మా వంశ తిరుమందుల మల్లు చెల్లినది
చెరుకూరు యుద్ధమున చెల్లినందరిని
తరుచైన గాయముల్ తనకు నాటినది
అందరిని శివపురికి అంపించి నేను
పొందైన అర్ధవీడు పురము జేరినది
పణతుల బాలల బంధువర్గమును
క్షణమాత్రమున లేచి సాగించి బాట
పైనమై యెనిమిది పదియు గడిచినది
వైనమున బల్లికురువను జేరు వార్త
అచ్చట గలిగిన అనిమొన వార్త
యిచ్చట బాలలు విడిబడి ఘోర
బత్తుడు అయితన్న పరగ ముమ్మన్న
పుత్తున ముద్దన్న పోలినేయుండు
నాచకూళ్ళనాయుడు నర్భకులెల్ల
చేసిన అనిపేరు జెప్పి తమ బిరుదు

చదివించి భూపతుల జంపిన వార్త
కదన భీకరశక్తి కల్లందులవారు
మారెనేయుండును మడిసిన వార్త
పేరుగల పూతంగబిరుదు మసిలన్న
గతమైరె యిరువురి కాంతలు అందు
పతుల వెంబడి చిచ్చుబడిరని దెల్పు
బాలరాజుల కెల్ల పైసింది పోట్లు
ఈలాగు నడిచిన దిదిగాక ఒకటి
పందుముల మీబాప పణతి సిరిదేవి
యిందుముఖి కొమరమ్మ యింతు
లందరును
ఆర్థముతోడుక ఆలమందలతొ
గొబ్బున వచ్చి" రని లకోటలు వ్రాసి
యింపైన యెలమంచి నేలు
పిన్నయకు
పంపించ పందుముల పల్లికొండయ్య
వారిమణి సిరిదేవి "నా కుమారులకు
కోరి దీవించెనని కొడుకుల కనుమి,"
అలివేణి కొమరగిరి "అల్లురందరకు
వలనొప్ప దీవెనల్ వాడితి ననుమి"

చెలగుచు యీరీతి చెప్పివారంత
సెలవిచ్చినంతనే శీఘ్రమె వారు
చల్లభూపతి పుత్రు సరసు లేగురును
మొల్లముగ కొలువుండి
ముచ్చటాడుచును
ఉన్న సమయంబున ఈవలావలను
మన్నె నాయకవరుల్ మరి
కొలువగాను
ఝెట్టీలతో సాము సేయింపుకొనుచు
దిట్టముగ పొట్టేలి తాకులాటలను
వకచెంత తేజీం హొయ్యాళి త్రోల
నొకచెంత పక్షుల నోటికాట్లాట
ప్రకటితంబుగ విప్రబల సమూహంబు
సకల పురాణాది శాస్త్రముల్ నొడువ
కైవారమొంది మాగధులు చేయంగ
దైవాంశ పుత్రు లుద్ధతి నున్నవేళ
చారులు నరుదెంచి చల్లపిన్నయ్య
చేరువ నిలుచుండి శరణార్థులనిరి
పందుముల రఘుపతి పంపిన లకోట
అందివ్వ చదివెను అన్నపిన్నయ్య

## :- చల్ల పిన్నమనీడు పోలురాజాదుల మరణమునకు దుఃఖించుట :-

తలయూచి దుఃఖించి తమ్ములందరికి
కల బంధువులకు నక్కడనున్న
సభకు
వినిపింప నాశ్చర్య విస్మితులైరి
కనలికన్నుల నీళ్ళు కాల్వలైపార
చల్లపిన్నమ నేడు సభవంక జూచి
యెల్ల విధంబుల నెలుగెత్తి అడిలె
"విను సహోదరులార! విక్రములార!
మన మెలమంచి సెమ్మది నేలుచుండ
తండ్రి చెల్లెనటంచు తనయులేగురును
పుండక యెలమంచి వొదలి పోనేల?
ఇంపుగాదని మమ్ము విడనాడి పోయి
పంపాద్రి యేలక పాళ్ళు బోనేల?
పోయిన నేగురొక భూములకు బోక
పాయదెరుపుగ సీమపాలుగానేల?
అటుగాననైన తమ అతివల గూడి
నిటలాక్షుడు దయచేసి యిచ్చిన
సుతుల
అతిగారవంబుల అనుదినంబులను
హితవుగా బెంచి పోషించుట లేక
యెక్కడెక్కడ వార్ని వెనక వేసుకొని
అక్కడక్కడ చెల్ల అజు డేలబ్రావాసె?

అదిగాక తమపాల అని గలుగువేళ
కదనముకు మము బిల్వ కలదియ్యలేక
పిలచిన తలచిన పినతండ్రి వారల
కలసి తమ పాదముల కడ పేరువాడి
చేతుమో యుద్ధంబు చెల్లుదుమొ
యందు
ఖ్యాతిని పోలురాజు క్షేత్రపాలి వెనుక
బాలుడు ఐతన్న బల్లికురువందు
కోలాహలము రిపుల కొట్టి చెండాడె
ఎంత విక్రమశాలి యెన్నంగ రిపుల
పంతంబు గల్గు భూపతుల నిర్జించి
దాపున యుద్ధంబు తమరు జేయంగ
ఈ పట్లనైన మము విన బిల్వగాద?
ఇన్నిటికి మాభాగ్య మెంచుకోవలెన?
అన్నలు తమ్ములు అమ్మ సిరిదేవి
కొమరగిరి మాయత్త కొదువ
మరుదులును
రమణియ్య మాబావ రఘుపతి
మొదలు
వచ్చినది పదివేలు వారి భూములకు
మెచ్చు తమ భాగంబు మేలు కీకులను
పక్షపాతము లేక పంచి మాకి

అక్షయంబుగ నేలుమనుడి తమ పాలు
తమకు లేదనుమాట ధర్మమా తమకు
విమలముగ సరిబాలు నేలుమను
భూమి"
అనుచు లేఖలు వ్రాసి అంపె పిన్నయ్య
"పనిబడి మా బావ పల్లికొండయకు
జాగిలి పదివేలు చేసె ననరన్న!
శ్రీగిరి వరపుత్రి సిరిదేవి కిపుడు
తల్లికి పదివేల దండ మనరన్న!
చల్లని మాయత్త సఖియ కొమరమ్మకు
శరణార్థులని యేము శంక లేకుండ"
అరలేక పిన్నయ్య అంపె చారులను.
పంపగ నటువారు పైనమై వచ్చి
యింపలర రఘుపతికి నిచ్చి రా లేఖ.
వివరింపగను చూచి విని తలయూచి
కవగూడి సంపదలు కదలుమని పలికె

## పల్లికొండాదులు యలమంచిని సమీపించుట

సెలవిచ్చినంతనే సేన లన్నియును
యలమంచిపురి బయలు విడిదిగా నిల్వ
మరుదులందరి బిలిచి మర్మముల్
దెల్పి
సరగున బతమ సాహసోత్తముని
వప్పుగా శృంగారవంతుని జేసి
చెప్పవలసిన బుద్ధి చెవిలోన నొసగి
దళముల మన్నెసరుదారు లందరిని
వైళమె అయితన్న వెంట నడుమనెను
బావల మరుదుల పటుసహోదరుల
వేవేగ అయితన్న వెంట నడుమనెను
రాయమన్నీల హేరాళముగ బిలచి
ఆయడ నయితన్న నంటి నడుమనెను
అష్టమంగళి యనెడి అశ్వంబు దెచ్చి
స్పష్టముగ పల్లన సవరించి కలిత
మూహూర్త నక్షత్రమును విచారించి
విహితము నశ్వంబు వేడ్క నెక్కించి
తడయక సెలవిచ్చి దళముల తోడ
నడుపించ బత భూనాథ శేఖరుని
పరుస బంధువు లిరువంకలయందు
తురగము ల్లంఘించి ధుమికించు
కొనుచు
మల్లేశు వరపుత్రు మహిత చారిత్రు
అల్లన బత్తినన్న శ్వంబు నెక్కి
క్రమ్మక నడిపించె కంఖాణవంబు
ముమ్మన్న సిరిబాల మొగి
హయంబెక్కి

అన్న వెంబడి నడిచె అమిత
సాహసుడు
యన్నంగ మొనవీరు డమిత
విక్రముడు
తగు బావమరిది పుత్తమ రాజబలుడు
వాగి హయంబెక్కి కడు వొయ్యాళి
తోలి
కళ్లెంబు సళ్ళించి కమ్మి వుర్కించి
మళ్ళించి బావ సమానమున గదిలె
వాజిపై నెక్కి నేతివారి ముద్దన్న
రాజితంబుగ నడిచె రాజు దాపటను
పొంగి కల్లందుల పోలినేయుండు
ముంగల నడుపించె మొన ఘోటకంబు
తక్కిన బంధువుల్ తగిన తేజీల
ఎక్కి నడిచిరి రాజు ఇరుపార్శ్వ
ములను
కటపెట పెద్ద నగార మ్రోతలును
లొటిపిటలపై కల్లోలమైన నాద
పరపైన కొమ్ము తప్పెట్లు గిడుగిళ్ళు
పరగ ఢక్కలు పెద్ద బాకలు నాద
తంబూర తాళ మృదంగ నాదములు
రంభాంశ వరసతుల్ రాగముల్ బాడ
ఆటలు పాటలు అంగరంగముల
దాటుగ అయితమ ధరపాలు ముందు
క్రమముతో వంది మాగధులు
నుతియింప
రమణీయ్య వింజామరంబులు వైప
బ్రాహ్మ లాశీర్వాద పారాయణంబు
సౌమ్య శ్లోకార్థముల్ చదువుచు రాగ
ఆటమీద కులగురు వయితన్నతోడ
''ఇట చూడు అట వొద్దు ఈ
లక్షణములు'
తెల్పుచు దొరముందు తేటగా బయిలు
కొల్పుచు చిరుత కోల్కతార్లు బట్టి
పట్టుగ మరిదితో పల్కులాడుచును
చట్టముగ తను పాదచారియై నడువ
వెనువెంట సిరిదేవి వైభవంబలర
చనుదేర యలమంచి సామీప్యమందు
మనమార యున్న సమాధులు చూచి
మునుపు తమ తాతలు ముత్తాతవారి
స్థాపనము జేసిన స్థళము గోరీలు
గోప్యముగ చూపెను గోవిందమూర్తి
తిలకించి ఐతమ ధీరపుంగవుడు
వలనొప్ప అశ్వాన్ని వొయ్యన డిగ్గె
అందలాల్ వాహనము లందరు డిగ్గి
వందనము జేసిరి వైనవైనమున
వొలురాజు వేయించు వసంత
తటాకములు
బలభద్రు డయిత భూపాలునికి జూపె
వొలనొప్ప ఐతమ వసుధేశుడు జూచి:
''అలనాటివారు పుణ్యాత్ములు బావ!
తరి ముత్తరాజు మీ తాత గాకలెను

కరకంత దేవళము గట్టించినాడు
క్షితిలోన కీర్తి నిక్షేపముగల్గె
అతడు పుణ్యాత్ముండు అనదగు
బావ!''
అనిచూచి పొగడుచు అటు దాటిరాగ
''ఘనమైన యలమంచి కందకము
కోట
కోటపై కొమ్మలు కొత్తళంబులును
మేలైన భవనముల్ మేడవాడలును
కనుపించె కంటివే ఘనుడ
అయితన్న!''
''కనుపించె బావ నే కంటి
కన్నులతో''
అని రాగ, ''వల్లమ్మ అగ్ని
గుండంబు
అనువంద చూడు వో అయిత
భూపాల !''
చూచి హయము డిగ్గి సొరిది
బంధువులు
ఆచారవృత్తిచే అమ్మగుండముకు
ప్రదక్షిణము తిరిగె బల సమేతముగ

ముదమున జాగిలి మ్రొక్కి కడ
నిలచి
అలివేణి సిరిదేవి అత్తగుండంబు
తిలకించి''నీ సుతుడు తీరెనో యత్త!
నాగతి యిటులుండె నాపాలి బ్రహ్మ
యీగతి వ్రాసె''నని యిలమీద వరల,
కొమరగిరి తమతల్లి గుండంబు జూచి,
అమితమౌ దుఃఖమున "అమ్మమ్మ"
యనుచు,
''అన్నలు యేగురు హతమైరి తల్లి!
కన్న భూములు విడిచి కడభూము
లకును
అని చేసి అన్నలు హతమైరిగదవె
కనుగొనవమ్మ నను కాంత వల్లమ్మ!''
అని చాల చింతించి అచ్చోటు బాసి
ఘనవేణులును తాను కలసి యేతేర
ధన్యు డయితమరాజు తగు బంధు
వరులు
చెన్నొంద వచ్చిరని చల్ల పిన్నయకు
వినఃపింప సంతోష వివశాత్ములగుచు

# చల్ల పిన్నమనీడు తన తమ్ములతో గలసి అయితమ రాజాదులకు స్వాగత మిచ్చుట

అనుజులు తాను కట్టాయత్తపడుచు
మనవారు వచ్చిరని మాటిమాటికిని
మనమున సంతోషమంది పిన్నయ్య
భేరీలు కోటపై భోరు కల్పించ
బారు సేయించిరి బహుఫిరంగులును
చొక్కమౌ నగరంత శుద్ధిజేయించి
గ్రక్కున కుంకును కలియాపి జల్లి
వొలురాజు కొల్వు చావిడిని కస్తూరి
కలయ బూయించె నరఘడియ
లోపలను
ఎలమంచి పట్టము ఎల్ల వీథులును
నలరు పచ్చని తోరణములు గట్టించి
తమ్ములు మంత్రులు తాను
బంధువులు
సమ్మతి తనవెంట సాహసుల్ రాగ
పూలహారంబులు బుక్కాయి అగరు
పూల చేలంబులు పునుగు జవ్వాజి
దివ్యమౌ భూషణాల్ దివ్యవస్త్రములు
భవ్యమౌ భువిగల్గు ఫలము
వస్తువులు
పట్టించుకొని తాను పల్లకి నెక్కి
నెట్టన పిన్నమనేయుండు గదలె
పందుముల బావకు పల్లకి యొకటి
అందమౌ పల్లకి అయితన్న కొకటి
బత్తినయ్యకు వాజి పంచెవన్నెలది
ముత్యముల పల్లనిది మున్మన్న కొకటి
అమ్మకు అత్తకు అందలాల్ రెండు
ఇమ్మైన యెలమంచి వీథిన గదిలె
కంచు నగారలు కావికొమ్ములును
మించుక నాదు భూమీనిన విధము
చల్ల పిన్నమరాజు సరసుండు గదలె
వుల్లసంబుగ మంచి వీణె పాటలును
ప్రకటితముగ భోగ పాటకత్తెలును
సకల విద్యలవారు సందడి గొనగ
అట్టహాసంబుగ అన్నదమ్ములును
పట్టభద్రులు నిత్య పావనోత్తములు
బావను గనుగొని పల్లకీల్ డిగ్గి
భావంబుతో వచ్చి పదములకు
మ్రొక్కి
తమ్ములు తాను బతన్నను జూచి
క్రమ్ముక దుఃఖ సాగరమున నేడ్చి
"బాలప్రాయంబున బ్రహ్మదేవుండు
ఈలాగు తండ్రి మిము విడనాడ
వ్రాసె

తండ్రిగా రటువలె తమ్ముని విడచి
వుండక మరణముకు పూరెళ్ళి పోయిరి
పోయి మము బిల్వక పోట్లాడి తామె
ఆయెడ కైలాస మందె నైతన్న
మూడు తరముల బావ మూల
బ్రహ్మంబు
గాడి బల్లెపు పోట్లు కడితేరి వొచ్చి
మిమ్ము తోడ్కొని రాగ మీకడ్డమొచ్చె
యిమ్మధక్కమరాజు వీరభల్లాణు
పిన్న బాలల్లటంచు ప్రియమింత లేక
వెన్నంటి మీమీద విడుకొనినపుడు
మము బిల్వ కటుయేల మరచితో
యన్న ?
మిము చేయనిత్తుమా మిగుల కార్యంబు
బాలరాజులు మీరు పగ కెదురించి
చాల శాత్రవులను చంపి మీకీర్తి
ఆవుల వారింటి కపకీర్తి లేక
నీవు నిల్పిన కీర్తి నిండె లోకములు
అయితన్న!మాకెందు కని లేక చిక్కె
కయితప్పు చేసితి కల బిల్వలేక
చాలు బతన్న నీ సాహసము వింటి
మేలు మన వంశమును మించితి ప్రజ్ఞ
మామలందరిని సీమల పాలు జంపి
క్షేమమున బావ మము జేర వచ్చితివి
మార్నేడు చెల్లెనా మరి పోలినేడ!
నిర్ణయంబుండెనా నీవు పోట్లాడ
మా మామ చెల్లెనా మరిది పుత్తన్న!
ఆమాట బల్లికురువందుల నిలచి! ,,

అటు సాగి తల్లికి అత్తకు మ్రొక్కి
కటకటా దుఃఖంబు కన్నీరుదుడిచి
అందలాల్ దెప్పించి అతివ లందరిని.
ముందుగ నెక్కించి మ్రొక్కి
వస్తువులు
అత్తకు తల్లికి అర్పణము జేసి
వుత్తముల కిప్పించె వుచిత వస్తువులు
బావకు పచ్చల పల్లకిప్పించె
పావనమైనట్టి పదకంబు లిచ్చె
ముందర పల్లకి మోతాదు జేసి
అందులో నెక్కించె అయిత
భూవరుని ,
పంచవన్నెల తేజి బత్తినన్నయకు
కొంచక ఎక్కించి గొడుగు బట్టించె,
ముత్యాల తేజిపై ముమ్మయను నిల్పి
ముత్యాల గొడుగు లిమ్ముగను
బట్టించె,
తగువైన మరుదులకు తగు
వాహనములు
తగవొప్ప నిప్పించె తమ్ములు దాను,
మదినుబ్బి సంతోష మార్గంబుగాను
పదిలముగ దళముల బారు సాగించి
యాదవ సింహులు యలమంచి
బయలు
సాదనల్ సేయుచు సంతోషపడుచు
తురగముల్ హొయ్యాళి ధుమికించు
కొనుచు
తరుచుగా కత్తులు తాటించు కొనుచు

బంధువర్గము రాజు పల్లకిచుట్టు
అందంబుగా వారు అశ్వాల నెక్కి
అష్టదశవర్ణాల అసహాయ పరులు
నిష్ఠతో ఐతమ నృపతి గొల్చుచును
చనుదేర ముందర చల్ల పిన్నయ్య
చనువరుల్ తాను రాచన్నతో మాట
లాడుచు ముందర ఆటపాటలును

## అయితమరాజు నగర ప్రవేశము

పొడంగ యలమంచి పట్టద్వారంబు
చేరి పిన్నమరాజు చారుల బిలచి
కారుపోతుల జోళ్ల ఘనుని ముందరను
నరికించె పిన్నయ్య నయద్వారమందు
పరువడి నడిపించె పాలకీల్ ముందు
బలసమేతము నరపాలుండు రాగ
ఎలమంచి పురవీథి వెలదులందరును
అడుగడుగు నివ్వాళి హారతులివ్వ
పడుపు చెలులు నాటపాటలు బాడ
మేడలెక్కుక చూచు మెలతలు కొంత
గోడలెక్కుక చూచు కోమలుల్ కొంత
కలికి చక్కని రాచకన్నె భామినులు
చిలుక పల్కులు గుల్కు స్త్రీలును
గూడి
కనువిప్పి అయితన్న కంఠీరు జూచి
వనితలు నిలుచుండి వర్ణించువారు
"రాజులెందరు లేరు రాష్ట్రమున
అయిత
భోజునకు సరిరారు బోటి ముమ్మాటికి
ఈ చూపు ఈ తోపు ఈ రూపురేఖ
ఈ శాలు ఈ మేలు ఈ కాలువాలు
ఈ మోము ఈ గోము ఈ జోము
ప్రేము
సీమాధిపతులలో చూడలేదమ్మ!
ఈ ముక్కు ఈ చెక్కు లీ నొక్కు
లదరి
మేమెక్కడను జూడ మెలత నేజెల్ల!
ఈ తళుకు వగగుల్కు ఈ మెళుకు
గళము
వో తరుణి నే గాన వర భూపతులలో
ఈ బాహు లీ గేహు ఈ లాహు
నడుము
వో బాల నేనెరుగ నొక పురుషునైన!
ఈ పిరుదు ఈ బిరుదు ఈ అరుదు
నరుని
వో పద్మగంధి! యెవ్వరు లేరు జగతి

ఈ తొడల్ ఈ నడల్ ఏ రాజులందు
నాతోడు సీడః యెన్నగనైన వినముః
ఈ పిక్క లీ పెక్కు ఈ సొక్కు
మనుజు
నే పట్ల పరికించ నేణాక్షులార :
ఈ పాద మోపాద మేపాదునైన
చూడలేదమ్మ నరశూరు లెవరైనః
ఈ వ్రేళ్ళు ఈ గోళ్ళు ఈ మోము
కాంతి
భావాంతరమునైన పరికించమమ్మః
వాలురాజు పౌత్రుడట వో సఖులారః
వలరాజు దీటు సరివాడమ్మ యితడుః
పోలురాజుకు మధ్య పుత్రుడట
యితడు
చాల సోముని దీటు చాయ గలవాడుః
పరమేష్ఠి యెన్నాళ్ళు పనిబూని తీర్చె
సిరిదేవి గర్భమున శిశువు అనిపించెః
ద్వాపారమందు వసుదేవ దేవకికి
గోపాలకృష్ణుండు కొడుకయి పుట్టి
వ్రేపల్లిలో పెరుగు వెన్నయు మ్రింగి
గోపకాంతల నేలుకొన్న విధమును
ఆలాగె యీ పురుషుడది చేయగలడుః
కాలకంఠుడు నిక్కముగ సీవరకు
కావలసి బ్రహ్మకీ క్రమము వినుపింప
శివరంబుగ నితని తీర్చుటగాక

యెలమంచిలో నున్న వెలదుల చెరుప
తలపెట్టి వచ్చె ఐతమ రాజవరుడుః
వన్నెగల తేజిపైవాడు ఐత్తుండు
అన్న గావలెనట అలివేణులార :
ఎడమ భాగమందు నేగు ముమ్మన్న
తడయక యీ రాజు తమ్ముడు
సఖియః
పచ్చల పల్లకి పరతెంచువాడు
మెచ్చు లయితమరాజు మేనబావటనుః
సరసన నేతెంచు సాహసుల్ యెవరొ
మరియు ఐతమరాజు మరిది
యటకొమ్మ
మద గజంబుల దీటు మనుజ
వర్గంబు
కొదువ వారలు మెచ్చు కులబంధు
జనులు"
కలకంఠు లిటువలె కని మిగుల పొగడ
చెలరేగి సేసలు చల్లి దీవించి
శుభ జయమంగళ శోభనాల్ బాడ
విభవము రవి సోమ వీథులయందు
సకల మార్గంబుల చల్లపిన్నయ్య
ప్రకటమౌ యలమంచి పట్టంబు జొచ్చి
ఆస్థాన మంటపమందు సింహాస
నస్థలము దోడ్తెచ్చె నన్నదమ్ములను

## పల్లికొండ అయితమరాజును చల్ల పిన్నమనీని సింహాసనముపై కూర్చుండ బెట్టుట

అరఘడియ కూర్చుండి అటువెనుక లేచి
సొరిది దివాణముకు చొచ్చి పోదలచి
గహ్వరంబు ననుచు కడువేడ్క వచ్చి
సింహాసనము నుంచి క్షితిపాలు డనుచు
కరములు ముకుళించి కనుగీలె గురువు
తక్కిన రాజులు తమ బంధువరులు
మ్రొక్కిరి సభయంత మోదంబుతోడ
నాదించి భేరులు నరనాథు ముందు
బోధించి భటజనుల్ పొగడి రవ్వేళ
రంతులు ఛాలించి రఘుపతి నిలచి
పంతమున ఐత భూపాలునితో బల్కె
"వల్లవుల ఐతన్న! వంశ విస్తార!
బల్లికురువ రణశూర! భద్ర ప్రతాప!
సోమకుల గోత్ర! విస్తార ప్రతాప!
నా మనవి వినవోయి నరనాథచంద్ర!
పరగంగ యలమంచి పట్టంబు నీవు
కరుణతో పాలించ కారణముంది.
చల్ల పిన్నమరాజు, చల్ల గోవిందు,
చల్ల అచ్యుతుండు, చల్ల కోనేరు,
అటు చిన్న తమ్ముండు ఆల
వేంకటాద్రి
యిటువంటి బలవంతు లిట నేటినుండి
పట్టము పాలించ పనిలేదు, నీవె
పట్టభద్రుండవు బాల రాజేంద్ర!
దిటముగా" నని బల్క ధీరపుంగవులు
అటు విని పిన్నయ్య అన్నదమ్ములును
భావంబుతో తన బంటుతన మిడిచి
చావ కెదురుగ నిలిచి పలికె

పిన్నయ్య:

"బావ! నీ మనసులోపల వున్న
మహిమ
అవేళ కానలేనయితి నా మదికి
మోస మాయెను బావ ముందెరుగనైతి
ఈ సాహసోత్తముల్ యీ రాజవరులు
ఈ బంధువులు గోప వీర కుమాళ్ళు
నీ బలాబలములు నీవు మొదలుగను
చొక్కమౌ యలమంచి చొచ్చి
రాగలర?
అక్కరతో మనవారు అనుచు
తెలియకను
తమ్ములు నేను మీ తావు కెదురేగి
నమ్మి తోడ్కొని తెచ్చినంతుల కింత

పని చేయతలచితివి పల్లికొండయ్య!
మనమున సంతోషమందెనా నీకు?
నృపతి హరిశ్చంద్రునునకు కౌశికుడు
విపరితము గల్పించి వెలది సుతునమ్మి
మహిపాలుడును చెడ్డ మానవుల గొలిచి
మహికెక్కి తా కీర్తివంతు డయ్యెతడు!
దశకంఠు కొలువులో తమ్ముని దన్ని
రసికుండు ఎన్నాళ్ళు రాజ్యంబు నేలె?
ద్వాపర యుగమందు ధృతరాష్ట్రి
సుతుడు
ఆ పాండవుల జెఱచి అతడు
యేమాయె?
పాపపుణ్యంబులు బావయ్య నీవె!
కోపంబు మాకేల? గొడ్డగానేల?
మాపాలి జయపాల! మదన గోపాల!
భూపాలకులు మీరె! భూములు మీవె!
బాల లందరిని విభాగంబు చేయ
చాలగా పెంచితివి సర్వేశు కృపను
ఎత్తితివి పెంచితివి యేగురిని మమ్ము
పొత్తున పాలుగ్గు పోసి పెంచితివి
కాబట్టి మిమ్ము వెక్కసము లాడితిమి
రాబట్ట పోగొట్ట రాజవు నీవు!"
అనుచు నేగురు వచ్చి అడుగుల కెరగి
వినతులై నిలుచున్న నిటు జేరబిలచి
మరియాదతో వారి మందిరంబులును
దరిజూపి వారికి తగిన గ్రామములు
ఏగురికి నొకటొకటి యేర్పాటు చేసి
భాగించి అయిత భూపాలునికి జెప్పి
పరికించి యలమంచి పట్టణము గట్టి
హరిగురువు తమ మామ ఆనతి నిల్పి
మరి వేగ నుండె యలమంచి పట్టమున

—:o:—

# కాటమరాజుకు పట్నం కట్టిన కథ

## [కాటమరాజు పట్టాభిషేకము]

—: కృత్యాది :—

శ్రీమహాదేవుండు శ్రీమాధవుండు
కామిత వరదుండు కమల సంభవుడు
శంకరుడు సుహాలక్ష్మి శారదాదేవి
పంకజహితుడు కుముదబాంధవుడు
తాను
పవనజు డష్టదిక్పాలురు మరియు
నవగ్రహములు కథానాయకుం డైన
వానిని జంగమనువానిని బ్రోవ
మానితంబుగ నతని మహిమ
గొనియాడ
అతడున్న పట్టణం బతని వంశంబు
చతురత వర్ణింతు జగమెల్ల నెరుగ---
నెలకొని కృష్ణవేణి సాగరములు
కలసిన యచ్చోట గల దొక్క-
పురము'
బాంధవులు సకల సంపదలగూడి
చంద్రకరాధీశు పురవరం బనగ
కొడిలేని వాడలు కోడిగూడెములు
కడలేని శృంగారక వనములూను
పొడవు దేరినయట్టి బోర తలుపులును
ఎందు జూచినగాని అందె పట్నంబు
సందడింపుచు వేదశాస్త్రముల యందు
అందరు అంచరే ఆది భూసురులు
నగధైర్యముల ననేక శస్త్రముల
నెగడిన వారచటి నృప కులోత్తములు
విల[1] నెంచ గలిగిన కుబేర వల్లభులు
పలిమి కోటికి పడగెత్తిన వారు
పాడిపంటలచేత బలిమి కలుములను
పుడమిపై వైశ్య యాదవ
శూద్రులూను

---

1. 'ఇల'కు జానపదుల ఉచ్చారణ

మరియు తక్కిన జాతి
మానవులు గాగ
గురుమీర సకల దిక్కుల వారనంగ
బంగాళీ యవనులు పల్లె పఠాన్లు
ఇంగిలీసులు పరంగు లొళంగులును
దినమార్కులను నొక్క
దేశవాసులును
ఖాను పఠాణీలు కలువ దేహరులు
చాల గలిగినయట్టి జనపాలకుండు
ఆ పట్టణములోన యాదవోత్తముడు
శ్రీపతి దాసుండు చెలువైనవాడు
కోరి గంగాళపు కులపావనుండు
రామకృష్ణమ దాన రాధేయు డతని
కోమలి పెద్దమ్మ గురు దయాపూర్ణ
ఆ దంపతులకును అధిక పుణ్యుండు
యాదవాన్వయ మణి యెనయ
జన్మించి
రాగయ్య మిగుల అనురాగంబుతోఁ
భోగ దేవేంద్రుండు బుధ సన్నుతుఁడు
అతని సతులిద్దరు అంత్రెమ్మ ఎఱ్రమ్మ
పతిమెచ్చు సుదతులు భాగ్యలక్ష్ములును
ఆ సతులలోపల అంత్రెమ్మ కనియె
వసుమతిలో వన్నె వాసిగల సుతుల
అయ్యన మరి జంగమయ్య అనువారి
అంతట యఱ్రమ్మ అతిమర్లవారి
కాంత గంగాళివాలయము వెలయింగ

సౌరిది మన్మథుపంటి సుందరాకారు
నిరవుగా గురవయ్య నాయమ్మ
గనియె
సరసమై ముగ్గురు జగమెల్ల మెచ్చ
ఆతని సత్కీర్తి అరుషమై వెలయ
ఆ ముగ్గురిలోపల అర్థార్థులకును
కామిత ఫలదాన కల్పవృక్షంబు
రమణ యాదవులతో రాజపూజితుడు
గుణమణి కొమనాల గోత్రవల్లభుడు
జంగము సుజన ప్రసంగ విభవుండు
ఆ జంగమయ్యకు అర్థాంగలక్ష్మి
భూజనులు పొగిడేటి పుణ్యనిధియైన
పుసులూరి వంశాబ్ధి పూర్ణచంద్రుండు
నిజరాజు అక్కులు నెర సుజనుండు
అతని కాంత గురమ్మ అన్నపూర్ణకును
ప్రతిసేయ దగును ఈ పణతులలోన
ఘనత నా యిద్దరికి కరుణ గల గంగ
తనయురాలై పుట్టె తగ కీర్తిచేత
అత్తవారింటికిని అలర పుట్టింటికి
దిట్టతనమున వన్నె తెచ్చిన కాంత
చుట్టాల సురభి యని సుజనులు మెచ్చ
భట్టు బ్రాహ్మణులకు బంధు లర్థులకు
పిన్నచెయ్యెరుగని ప్రియము
కృపగలది
తనను భూజనులు చుట్టాలు పొగడంగ
ఆ కాంత గంగమ్మ కా జంగమయకు

చేకొని బ్రహ్మగూర్చె చేర్పు మీరంగ
ఆ యిద్దరెలమితో అధిక సంతోష
కాంతులై యుండి గంగాళ పురవరము
జలరాజు చంద్రుండు జంగ మొకనాడు
అలర తనయింటి మొగసాల
యందున్న
తమ్ములు బ్రాహ్మలు తన కులస్థులును
ఇమ్ముల గూర్చున్న ఎలమితో నడుమ
సరిగ చుక్కలలోన చంద్రునివంటి
ప్రియముగ తగిన కుర్చీపీటమీద
కూర్చుండి
తొల్లిటి యాదవుల వినుతించి
చతురుడై పలికె
తన బావమరిదిని – మారయ్యను –
తప్పక చూచి:
''ఎనయంగ కట్టెబోయిన వారియింట
మతిగల వాడవు మరి చెప్ప చదువ
అతి నేర్పుగలవాడ వమర మారయ్య!
సకల యాదవ కథలు చదివి చెప్పితివి
వకటి నిన్నడిగెద వనర గావించు
ఆవులన్నను కల్యాణమందుండి
ఏ విధంబున దెచ్చి రెవరింట పెండ్లి
ఏ విధంబున జేసి రెల్ల యాదవులు
సుముఖుడై, తొల్లి కృష్ణుడు దెచ్చినట్టి
తమ్ముక మెక్కించి రే తగవున నతని
పట్టంబు గట్టి రేపగిది చేపట్టి
ఆ కథ నాపేర అంకితముగాను
చేకొని చక్కంగ చెప్పింపు'' మనుచు
పొలుపొందు గంధ కర్పూర
తాంబూలాది
వలయు వస్తువు లతని వశమున నిచ్చి
మరి చాల నతని బహుమానంబు సేయ
అరుషించి మదిలోన నమరయ్య వచ్చి
బుధసన్నుతుడు పెదపూడి శాసనుడు
అధికుడు సింహాద్రి అప్పని పేర
అలరు యోగివరులు అందరు మెచ్చ
ఇల కవిత్వమంత ఎరిగినవాడు
అని తలచి గంగాళపు జంగమయ్య
వనర నిచ్చిన వస్తువులు వైనవైనాన
వారివారికి కొన్ని వరుస తానిచ్చె
యాదవుల కథ వివరమంత యెఱిగించె
అసమాన వరగుణ అంబుధి పేర
ఎసగ నా గంగప్రాణేశుని పేర
వరుస గంగాళపు వంశజుని పేర
గురుతైన కొమనాల గోత్రుని పేర
ధర నెంచ రాగయ్యతనయుని పేర
ఛప్పన్న దేశాది జంగము పేర
చెప్పె నిట్టు భువి ప్రసిద్ధంబుగాను
కాటమరాజుకు పట్నము కట్టిన
కథయు

వేమారు నాత్మలో వినుతి గావించి
కాశీపురాధీశు కాలకంధరుని
వినుత విశ్వేశ్వరుని ఏప్రొద్దు దలచి
నారద సన్నుతు నింద్రాది పూజితుని
అతిమేర లేని కామిత బలప్రదుని
అతి భక్తితో వినాయకుని పూజించి
శిరులిచ్చు యాదవ శ్రేష్ఠ గొనియాడి
ధరమీద వెలసిన తరుణు లందరను
శృంగారవతియైన చెరుకూరి కట్ట
గంగాభవానికి కడువేగ మ్రొక్కి-
అరసి కాటమరాజు ఆలమందలకు
గరిమతో పట్నంబు గట్టిన యట్టి
కథ వినిపించెద కడు వేడ్కతోను
బుధులైన పెద్దలు పుణ్యవర్తనులు
మదిలోన ధర్మంబు మరువని ఘనులు
చెదరక వినరయ్య చిత్తంబు లలర

## పల్లికొండ పోలురాజు పుత్రులను తీసికొని పంపాద్రికి వచ్చుట

చెరుకూర పోల్రాజు చెల్లినవెనుక
అలజడి గాకుండ ఆ వల్లికొండ
గోపాలకులు దాను గోవుల మందలు
కాపాడుకొని చాల గర్వంబునాను
జాగు సేయక రాచ సంపదలతోను
పగభూమిలో నుండ పాడి గాదనుచు
ముదితలను తరలించి మొదట
యలమంచి
పురమున కొత్తుమని భూరిసంపదల
తరలించుకొని వచ్చి తగ బల్లికుర
జగడ మెచ్చుగ జేసి చేరి బెజవాడ
తెరువున గౌతమీతీరంబు జేరి
ఆ మహానది దాటి అరుషంబుతోడ
బలుసంపదలు తాను పంపాద్రి చేరి
పంపాద్రి దుర్గకు ప్రస్తుతి జేసి
పంపాద్రిలో వారు పగలు రేయుండి
ఆ రాత్రి ఆడస్త్రీలు అంద రొకచోట
కూర్మతో నుండిరి కొమ్మలు తాను
అరలించి పంపాద్రి నందరు తమరు
పుడమి ఏడేండ్లు కాపుర మున్నలాగు
ముగుద లేవురు బసవ దేవరనోము
నూరాకు వెచ్చపడి నోచినలాగు
కారణము గూడి చికాకులయి తమరు
వానరంగ వోయిరి మొకము
గానకయు

అనువుగా కయిదుగురు అయిదు
తెరువులను
పోయిన లాగెల్ల పొగులుచు దలచి
కొమరగిరి మొదలయిన గోపకాంతలును
తరుణిమణు లందరును తరచుగ
వగచి
అడలుచు చిత్తములు ఆట్టట్టు బాయ
కడలుకొని దుఃఖసాగరమున మునిగి
తిరుగ నిట్లనియె సిరిదేవి తన యింటి
వేల్పును దలచి పదివేల విధములను
దూరుచు "మము నిన్ని తెరువులు చేయ
తలపోసి కదిసితే తరుణి శ్రీగంగః
వల్లవుల వారిల్లు ఎడబాసి పోతివి
నీపట్ల ధర్మంబు నీవె తప్పితివి
కోరి నాపట్లను కొరవ జేసితివి."
అని చాల సిరిదేవి ఆత్మలో వగచి
అంతట నిద్రించి రతివలు తాము

## సిరిదేవికి గంగ కలలో కనిపించుట

వనిత సిరిదేవి తెలవారు జామునను
కలగని మేలుకొని గరిత వెరగంది
కొమరగిరి మొదలైన కులబంధువులకు
కలకంఠి తాగన్న కల జెప్పదొడగె :
"కలగంటి వినరమ్మ కమలాక్షులార
నిద్రబోవగ వచ్చి నిజముగా నొక్క
ముదిత వక్కరితి నా ముందల నిలచె
ఎవరమ్మ నీవుః నీ వెచ్చటనుండి
ఏమి వచ్చితి'వన్న ఇంతి యిట్లనియె:
'అరుదుగా నేను కల్యాణమ్మునుంచి
వచ్చితి మీకొక్క వార్త నెరిగించ
[illegible] పోత్రరాజు ఇలమీద నొరిగె
ఆనాడె నలుగురు అతనివర్గంబు
వొక్క మూర్తమున వొరిగిరి వరుస'
ననిచెప్పె
చెప్పిన విని గుండె చెదర కిట్లంటి
'తప్పక పోత్రరాజు ధర నొరుగుటయును
నీవు చెప్పగ వలదు నేనె ఎరుగుదును.
మిగిలిన నలుగురు తెగిన చందంబు
ఎరిగింపు' మన్న నా యింతి యిట్ల
నియె ;
'హరి పరాక్రముడు సింహాద్రి
వల్లభుడు
జనులెల్ల మెచ్చంగ సింధుభల్లాణి

రాజుతో నెదిరించి రావుగా నతని
తోటి రాజుల నెల్ల ద్రుంచి చెండాడి
ఓడించి ఝాడించి ఉదుటున మించి
కాలిమూకల మదగజ గుఱ్ఱములను
మేలైన రవుతుల మెదడూడదన్ని
ప్రాకటంబుగ సింధు ఖల్లాణితోను.
ఏకాంగ వీరుడై ఇల గూలె ననియె
ఇలమీద ఎన్నగల ఎరనూక రాజు
కొలది ఏనుగనాథుని కొండ దాపునను
పుడమీశుడగు ఎర్రభూపతిని ఎదిరి
బడలుపడి చతురంగ బలములు
దునిమి
ఆ రాజు అతిఘోర యుద్ధంబు జేసె
ఘోరున రిపులతో పోట్లాడి వొరిగె.
నున్న భూపతితోడ నలనూక రాజు
ఎన్నికతో పోట్లాడె ఇల పన్నుకొరకు
ఆరీతి పోట్లాడి హతముగా గూలె
రమణిరో విను పెద్దిరాజుల మహిమ
సంగరములోపల సాహసంబునను
ధర వాలికేతవ రాజుమీద దండెత్తి
పోయి
గురుతరముగ ఏడు కుంభినీపతుల
అరిమి రాజులనెల్ల నని బారనీక
తరిమి రాజులనెల్ల తా చుట్టిపట్టి
వీరగల్లుగ బొడిచి విటతటము చేసి
ఆరీతి నందరికి అన్ని రూపముల
మెరసి తూమెడు జంజ్యాలకు పోట్లాడి
సొరిది నని పెద్దిరాజు సొరగూలెనే
ననియె.
'పరాక్రమశాలి పరులు ప్రాణాలకొరకు
ఈరీతి గూలిరి ఏగు'రని చెప్పె
'బలిమిగల యాదవుల పాలిటి వేల్పు
నలినాక్షి వినవమ్మ నాపేరు గంగ
ఈ వార్త మీకు నే నెరిగించుకొరకు
నే వొచ్చి యిచ్చటనే వుంటి నమ్మ'
అని చెప్పిన పన్నెండు హస్తములతోడ
అనువొంద నాగేంద్ర హారములతోడ
జడిగొని తలమీద జడలు తూగాడ
సరిచిన్ని వేలుపు జగమేలు మాత
తన నిజరూపెల్ల ధరియించి నాకు
కనపడి యిట్లనె కమలాక్షి గంగ :
'పలరాజు తనయులు వరుస నేవురును
ఇల తండ్రికన్నను ఎక్కువవారు
తమ తండ్రి చేసిన ధర్మకీర్తులకు
విమలంబుగా వన్నె బెట్టినవారు
పరోపకార సంపదలకు నెల్ల
మెరయ లోకము తెరుగు మీ యింటి
వరుస
వారికినై యేల వగచెదవమ్మ
వనిత మీ యిల్లెడబాసితి ననుచు
మనసున విచారించి మరుగంగ నేల.
మరి విను'మని పలికె'పుర్ల అమ్మన్న

గర్భాన జనియించి ఘనముగా నీకు
కోడిలి నగుచును కూడి తిరుగుదును
ఇక వగవకుము నీ యింట నే యుందు
నీవు తలచిన తలపు నీకు చేకూరె
చింతపడ వలదని' చెప్పి యిట్లనియె
'పతిలేని గర్భంబు పాడిగాదనుచు
మతిలోన అమ్మన్నను మరుగకు
మనుము
దైవమ్మ విధియని తరుణికి జెప్పి
తలపోయ వలదని బుజ్జగించు' మని
అదృశ్యమాయెను మరి మేలుకొంటి"
అన విని సతు లందరపు డిట్లుగనిరి
"కలగంటివి చక్కని కలగంటివమ్మ
కలలోన మనపాల గల వేల్పు గంగ
కలవార్త లెల్ల నిక్కము చెప్పె
మనకు
సొలపిక వలరాజు సుతులు ఏగురును
పంతపు రహుతులై పగవార్ని గూల్చి
ఇంతిలో సురలోక మేగుట నిజము
కాకుంటె బొంకునా గంగాభవాని
మాకెల్ల మనసులో మరి వకటి తోచె
మర్ల అమ్మన్న గర్భమునందు తాను
పుట్టెదనని చెప్పె పొలతి నీ కలను
తడవేల యీ వొచ్చు ధవళపున్నమికి
తప్పిన తప్పదు దైవంబు నిజము
ఇప్పుడు ఈమాట లిక యేల" యనుచు
అని నిశ్చయము జేసి రతివ
లందరును
హరిగురువు కెరిగించి రా రాత్రివేళ
హరిగురువు సుజ్ఞాని యవుట తా దెలిసి
మదిలోన చింతించి మగువల కనియె :
"విధి కల్ల గారాదు ఈ కల నిజము
గరిమతో బోరి మన కండ్లముందరను
పుడమీశు డటు చెప్పి పోలిసె
నాక్షణమె
అతనికి తక్కువా అతని అగ్రజులు
ఎందు బట్టిన నందె ఎదురు చెప్పరు.
కంపప కొండవంటి కండి లింగమ్ములు
అందరు నందరె అధిక విక్రములు
సుందరు వలరాజుసుతు లు ఏగురును
చింతింప వలదని" చెప్పె హరిగురువు

## పల్లికొండాదులు సర్వసిద్ధిలో నిలుచుట

అంతట ఏగిరి ఆలమందలును
అరుసాన యాదవులు ఆడస్త్రీలూను
సిరులతో జని సర్వసిద్ధిలో నిలిచి
కాలరి నొక్కణ్ణి గ్రక్కున బలిచి.
"వరస మనమందరము వచ్చినలాగు
ఎలమంచికిని బోయి ఎరిగించు మన్న"
గ్రక్కున కాలారి ఘనత యలమంచి
పురములోపల చల్ల భూపతిసుతుడు
పిన్నమనాయుండు పెద్ద కొలువున్న
ఆ కొలువులోపలకు అరిగె కాలారి
కరము లెత్తి మ్రొక్కిన గ్రక్కున
నిట్లనియె :
"ఎచ్చోటనుండి నీ వేగుదెంచితివి
వచ్చితి వంపిన వారెవరు నిన్ను"
అని యడుగ కాలారి అపు డిట్లగనియె
చల్ల పిన్నమనాయుని సముఖాన
నిలిచి :
"వినవయ్య యదువంశ విమల
చరిత్ర:
భూరివిక్రము లైన పోల్రాజుసుతులు
భక్తు డయితమరాజు బాల ముమ్మయ్య
ఎత్తులెరిగిన మంత్రి యిల పల్లికొండ
తక్కిన యాదవ తనయు లందరును
చేరి యిప్పుడు సర్వసిద్ధిలో నిలిచి
ఎలమి తమ రాక మీ కెరిగించు
మనుచు
పంపితే వస్తి నాపగిది చెప్పితిని'
అనిన పిన్నమనాయు డాత్మలో
వగచి
"అన్నలు ఏ త్రోవ నరిగి రా త్రోవ
అరిగెనో పోల్రాజు" అని చాల వగచి
తన వంశ పెద్దలకు తానిట్లు బలికె:
"బాలామణులతోడ బాలలతోడ
ఆలమందలతోడ ఆ పల్లికొండ
తనరాక చెప్పంపె దయతోడ మనకు
మరియు పన్నిద్దరు మల్లులు కూడి
వరుసతో పోల్రాజు వారిగిన మాట
ఘనవేగ చెప్పంపిన కారణంబునను
మనసు మనసునగుండి మట్టుపడదింక
విడువక ఈ మాట విన్నది మొదలు
కడుపులో చెయిబెట్టి కలిపి నట్లాయె
తడబాటుగా జేసి దయ యింత లేక
ఎడబాపి దైవంబు వెలితిగా జూచె
రారాజు సింహాద్రిరాజు మొదలైన
ఏగురు స్వర్గాని కేగిన మాట
ఇక విందుననగ నా కెంత దిగులుబ్టె"

అంతగా నడలుచు నాత్మ లోపలను
అనుచు విచారించి రందరు నపుడు
కరియావుల రాజు భట్టావుల రాజు
పరగ నా పిన్నభూపతి కిట్టులనిరి:
''అన్నలు ఏ త్రోవ నరిగిరో వారు
తమ్ములు నాత్రోవ తప్ప రాదనిరి
కాకున్న నీలాగు కర్మలు గలరె?'
అని అడలగ విని అచటి పెద్దలును
అందరిట్లాగనిరి ''అడలుట తగదు
రాజులకు విచారంబు రాగను తగునె
తగదు విచారింప తగ విను డొకటి
మగువలతో ఆలమందల తోడ
మడిగి వచ్చితిమన్న మాట
సందియము
మరివేరె తలపోయ మాకొకటి తోచె
వినుడు పురుషులకు వెలదులకు నెల్ల
సతిపతి న్యాయంబు సకలధర్మంబు
ఎరిగిన సిరిదేవి ఎలమి పతివెంట
అరుగక వచ్చునే అతివలు మరియు
కోమలీమణియైన కొమరగిరి మరియు
మరియు పన్నిద్దరు మల్లుల సతులు
అగుమంచి మొదలైన ఆడస్త్రీలెల్ల
పతులు చనిపోయిన ప్రాణాలు నమ్మి
బ్రతికి వత్తురె వీరు భామ లిందరును
తెగువతో వచ్చిరి తెలియంగ వలయు'
అనిన పిన్నమనాయు డనుజులు తాను

కాలరి కావార్త కడు విన్నవించిన
''వారు చెప్పంపిన వర్తమానంబు
మీ కెరిగించితి మిగుల కార్యములు
హరిగురువు చెప్పంగ అపుడు
వినియెదరు
నన్నడుగ నేమిటికి నాకు బోవలయు
నే బోయి వారితో నేమి చెప్పుదును?''
అనిన పిన్నమనాయు డా మాట
కపుడు
''ఇదె కదలి వచ్చితిమి ఎరిగింపు''
మనుచు
ఇరవుగా కట్నంబు లిచ్చి యంపినను
హరిగురువు కా వార్త ఆనతిచ్చినను
విని పల్లికొండ తా వివరంబు తెలియ
అయితమరాజుతో అపు డిట్టులనియె:
''వినవయ్య మును అర్ధవీట మీ తండ్రి
నిను ప్రేమ పట్నంబు నిలిపె
పోతురాజు
మరియు నదిగాక యలమంచి
పట్నంబు
అరయంగ మీదొట అందరెరు పదురు
అది గనక యలమంచి కరిగి
య చోట
పెద్దలున్నారని ప్రియము చేకొనక
గద్దెపై కూర్చొనుము ఘనత మీ కంగ''
అని తెలుపుకొనసాగె నట్లున్న నంత

# చల్ల పిన్నమనీడు పరివారముతో పల్లికొండాదులకు స్వాగత మొసగుట

మమత మీరగ యలమంచి
నుండియును
సరవరుడు పిన్నమనాయు డెదురేగు
తలపుతో నలుగురు తమ్ములు దాను
కదలిరి ఎదురుగా కరియావుల రాజు
వదలక భట్టావుల వల్లభన్న మొదలు
వీరనాయకుల కెదురు వీరనాయకులు
మంత్రి పురోహిత సామంత వర్గములు
చెలరేగుచును సర్వసిద్ధిలో నిలచి
తెలిసి కలుసుకొనిరి రెండు తెగల
వారపుడు
హరిగురువుకు భక్తిరన్నకు హస్త
ములు మొగిచి
తనకు మ్రొక్కినయట్టి తమ్ములలెల్ల
గారవంబున వారిని కౌగిట జేర్చె
ఈరీతి వరుసలు ఎరిగి అందరును
తమలోన ప్రియములు తగిన విధ
ములను
మన్ననలు చేసి బహుమానములచేత
సొరిదిగా నచట గూర్చుండి రందరును

పిన్నమనాయుడు ప్రియ భాషణముల
హరిగురువును జూచి అపు డిట్టు లనియె ;
"మా పూర్వపుణ్యంబు మహిమ
గాబోలు
పొసగ సందర మిమ్ము పొడగాన
గలిగె
కలిగినందుకు వకటి కడమయ్యె మాకు
అరిభయంకరుడైన ఆ పోలురాజు
పొలుపొందు కల్లందుల పోతినేడనగ
అనమల్లు పినమల్లు అధిక
యాదవవరులు
ముమ్మడ మల్లులు మొదలైనవారు
అడ్డగల కంపటము లాది యగువారు.
ఘనముగ కనరాని కారణంబునను
ఆడియనుగాక ఈ అతివలకెల్ల
అయిదువ లక్షణా లమరి నందులకు
సంతోషకరము విచారంబు నగుచు
ఎంతయు నున్నది ఏమి కారణము
తెలియ జెప్పగదయ్య ధీరాత్మ" యనిన
అతని మాటలు విని హరిగురువు బలికెః

## పల్లికొండ పిన్నమనేనికి పోలురాజువృత్తాంతము చెప్పుట

"మరి విను పోలురాజు మల్లులాదిగను
వరుస మీరడిగిన వారి విధమెల్ల
పంపాద్రినుంచి సంపదలతో గడిలి
పెంపుతో పోలురాజు భుజబలోత్తములు
భువన విఖ్యాతిగల పుణ్యనదులైన
గురుతెరిగి గౌతమీ కృష్ణలను దాటి
తగుభక్తి పర్వతాల మల్లేశ్వరుని
కపుడు
జగదీశునకు మ్రొక్కి సకల వస్తువులు
కానుక మాడలు కావించి రపుడు
మగిడి యా పర్వతము మరి
సమీపమున
విడచి మీరగ నర్థవీటిలో నిలచి
ఆ యర్థవీటిలో అయితమ రాజుకు
బాయని కడకతో పట్నంబుగట్టి
శ్రీరంగనాయకుల సేవింప దలచి
కోరిన భక్తితో చెరుకూరు నడచి
ఆవుల మందల నడుమ అడ్డగల
కంపటము
గోవుల వెంటను గొదగొని మేప
మేలైన వనములు మేలైన నదులు
మేలుగల పట్నాలు మేదిని గడచి
కనుగొని పోలురాజు కావేరి నడుమ
తనరంగ బింబ పద్మమ్మును దాటి
మేలైన ఫణిరాజుమీద పవళించి
ఇల జగములకెల్ల ఏలికయైన
శ్రీరంగ నాయకుని చెలువార గాంచి
అరయంగ బ్రాహ్మలకు అడుగడుగు
మ్రొక్కి
రాగమున కానుకలు రమణతో బెట్టి
ఆ పుణ్యభూమికి అతి దూరమునను
మేపు క్షేపుల కెరిగి మెల్లన తెలిసి
నయగుణశాలి నవనంది లింగంబు
కల్లలాడిన గోవుల గనుగొని తాము
పసిరికలు మేపుచు పసుల మందలకు
ఎసగ గోగణములు ఎలమి నుండగను

## పోలురాజు చోడరాజుకు కాలువద్వారా పాలుపంపుట

ఆలోన చోడాసి అను రాజు ఒకడు
పాలించు ఆ రాజు ప్రజలను బట్టి
పట్టి అందరిచేత పాలకావేరి
కట్ట వెట్టికి బట్టి కావింపుచుండె
పట్టి మమ్మును బెట్టిపనికి రమ్మన్న
నెట్టన పోలురాజు నిలిచి యాపనికి
రామని పలికిన పోలురాజు కతనికిని
వరుస నిద్దరికిలోన వాదు బుట్టినను
మదిలో సదాశివుని మరువని భక్తి
వదలక పోలురాజు వాదించి గెలిచె
గెలిచిన ఆ రాజు క్రిందపడి అడుగ
కాలువ త్రవ్వించి కావేరిదాక
పాలు కాలువలెంట పది యోజనములు
పారించి పారించి ప్రస్తుతి గాంచి
పగదళములను మించి ఎదురు లేకచట
కంచి పర్వతమున కదుపులు మేపి
అంచిత మహిమతో అచ్చోటు గడచి
తిరుగ జనుదెంచి యా తిరుపతి గాంచి
తిరుపతి వెంకటాద్రికి తిరుగ మ్రొక్కి
పాడిపంట లొసగి ప్రస్తుతి జేసి
వాచిగల భువన వల్లభు లెంచ
చిరకీర్తి సేవించి చెరుకూరు వచ్చి
చెలువైన శాఖలు గలుగు వృక్షంబు
పాతాళమున దాక బారి వూడలును
భేతాళ నిలయమై భీకరంబైన
చిలుకల మర్రి కడ చేరువైనంత
బలువైన చక్కని పంచలింగాల
కొండకు నడుమన గోకులము దించి
ఉండంగ మేలని ఉండేటి వేళ

## పోలురాజుకు అపశకునము లగుట

పక్షు లంతటిలోన బహుళమై మర్రి
వృక్షంబుపై నుండ విషమముగ బలికె
భూమి కంపించె వాపోయెను వరడు
మోములపై ధూళి మొత్తె సురగాలి
నిలిచె మేఘంబులు నెత్తురు చినికి
అంతట ధర నిమిత్తంబు లిట్లయిన
చిత్తంబు జల్లని చేరి నవనంది
లింగంబు జూచి ; "మేలిచ్చోట లేదు

అపశకున మాయె మన కపనిశ
వినుము
రంగుగా నిచ్చోట రాజులకు మనకు
సంగరం బయ్యెడు జయమింత లేక
భంగపడియెద రంచు పక్షులు పలికె.
మనరక్త మిచ్చోట మడుగు
లవుననుచు
లెరవయిన మేఘములు నెత్తురు చినికె
కడుమేను ఈ మంట గలిపెద రనుచు
సుడిగొని బూడిద సురగాలి చల్లె
తెరలి మీ శవము లిట తిన గలిగె
ననుచు
వరుస మనవెంటనే వరడు వాపోయె
ఈడుండకుండాను ఇల కంపటంత
వెడలవలె మన మర్థవీటి కందరము
కదలిపోదము ఈడ కాదు మన" కనుచు
మరిమరి చెప్పంగ మామ పోలురాజు
ఇరవంద నాతోడ నిట్లని పలికె:
"ఎన్నగల ముందలి ఎత్తు నీవెరిగి
నన్నెరిగి యుండుమా నామది నెరిగి
కలహ మిచ్చట నింక కలిగెడు ననుచు
పిరికిపారెదవేల బీద చందమున
కాగల పనులెల్ల కాకేలపోవు
రాగల మేలుకీడు రాకేల పోవు
ధరణి దూరిననైన తప్పునా గ్రహము
ఇల్లూరి మర్రిక్రింద విధిమాట వినవ
ఎల్లగా చెరుకూరి ఈ మర్రిక్రింద
చెల్ల ప్రాప్తంబుండ చింతింప వలదు
అల్లుడా ఇచ్చోట అనువు గాదనక
గొల్లెండ్లు ఎత్తించు గొబ్బున నిపుడు"
మామ అను మాటలకు మరి పల్లి
కొండ
ఏమనక గొల్లెండ్లు ఎత్తించె నపుడు
ధీరులై యిటు కొన్ని దినములుండగను

## చోడరాజు జంగాలకు వెట్టికై నిర్బంధించుట

అంతట నొకనాడు అచ్చోడభూమి
కాంతుడు కావేరి కట్ట వెట్టికని
ఎట్టివారినైన పట్టి తెమ్మన్న
ఆపద వచ్చెను హరహరా యనుచు
చెదబారి జోగులు సీమదాసరులు
వెడలి యా గడిభూమి వెళ్లబారగను
తరమి యా రాజదూతలు తమ్ము
బట్టి
అరుగుదేరగ భయమందె యచ్చోటి

## జంగాలు పోలురాజును శరణు జొచ్చుట

పడిగల కొందరు వారగ జడలా
ముడివిడి జార మొకములు చెమటగార
పడుచులతో మహా పరువున వచ్చి
జడిసి పోలురాజు శరణు జొచ్చుటయు
చొచ్చినవారిని చూచి పోలురాజు
అచ్చుగా కృపగాచె ఆ బాహుశాలి
ఆ జాడమీదనే అపుడు ఏతెంచి
రాజదూతలు పోలురాజు కిట్లనిరి:
"మీ బిడారములోకి -మా- మిండ జంగములు
రాబోలుదురుగాని వారు నీకేల
చెప్పరాదనకుండ చెప్పితిమి వేగ
వొప్పగింపగదయ్య వో పోలురాజ''
అనిన మారాడక అపు డిట్టులనియె:
''భయపడి జంగాలు పారి వచ్చినను
భయముడిపి వారి చేపట్టి కాచితిని
కాచిన వారిని కరుణ వుంచితిని
ఆశ్రితులగు వారి నగునె వొప్పింప''
అనిన నా దూత లిట్లనిరి యాతనికి:
''ఎరిగి మా రాజుకొలదెరిగుండు మయ్య
కొరవితోడను తల గోకికొన్నట్లు
నీకేల జంగాలు నీతులు విడిచి
మా కప్పగించు నీ మాటలు మాని
అప్పగించక చిక్కులాడితివైన
తప్పదు కలహము ధర్మంబు గాదు
జంగాలకై పూని చచ్చి ఈ పంచ
లింగాలలో నొక్క లింగ మయ్యెదవొ''
అని పెక్కుభంగుల నాడి ''చని యెదము
నీవద్ద జంగాలు నిలిచి యున్నారు
ఉన్నారు ఇందుకు ఉర్వి సాక్షిగను
ఎన్నాళ్ళకైన మమ్మేలిన రాజు
తెమ్మన్న హదురుకు తెచ్చి యిచ్చెదవు
దొమ్మి మాటలకు మీతోటి మాకేల?''
అని దూత లరిగిన అపుడు నేనంటి
మనవిగా పోలురాజు మామంక జూచి:
"మరియును చోడాని మండలేశ్వరుడు
మురసి నీవు నతడు మిత్రులై యుండి
విరసంబు గానేల విడువు జంగాల
వెట్టి మాత్రంబైతె వెరపేల నీకు
పట్టుక పోయిన ప్రాణభయ మెంతలేదు
చంపడు కాదంటె-యీ- జంగాల బట్టి
పంపినా శివభక్తిపరుడు ఆ రాజు
మన్నించు వీరిని మన మాటమీద
మన్నించకుండెనా మన్నోగరుండు

గంపలు మోయించి కడకు తోలెదరు
కొంపోవ నిమ్ము ఈ గోల యేమిటికి?
కొడిలేక గోవుల కొడిదిరుగు మనకు
కుడిచి కూర్చుండి ఈ గొట్టజంగాల
తోడు చాలు వారితో తోడు ఏల విడువు
విడిచిన ముడిబోదు వెలివెయ్య రెవరు
విను పరాక్రమ మేల వెలితియై పోదు
విను నీదు కీర్తికి వెలితి కాబోదు
మనవి చేకొనుము ఈ మాటల''
ననిన
ఘనుడు నవనంది నావంటిలింగము
నన్నుజూచి :
''విను హరిగురువ! నీ విన్నియు
నెరిగి

మనవెల్ల చెప్పి ననుమానంబు లేక
వెరచి యీ వొడియలు వేగాన వచ్చి
మరుగు కేతెంచ వొమ్మన నోరు రాదు
ఏమైన కానిమ్ము ఇలమీద ముందు
భూమెల్ల నెరుగగా భూసురుల కొరకు
రణవీథి నెదిరించి రాజుల వంచి
ప్రాణంబులను తృణప్రాయంబు చేసి
తలపోయ నేల ఎంతైన మా తండ్రి
వలురాజు చేసిన వార్త కీర్తికిని
పన్నుగా చేపట్టి భక్తుల గాచె
వన్నెగా వినిపింతు వసుధ లోపలను
ఇంతమాత్రానకు ఏల చింతింప
పంతంబు విడుచుట పాడియా మనకు''
అని నన్ను బోధింప అపుడు ఇట్లంటి;

## పోలురాజు జంగాలను శ్రీశైలమునకు పంపుట

'విను మామ నీలోని విధము
తెలియుటకు
తగదని చెప్పి ధర్మంబు కాదంటి
నీ దండి మదిలో నిశ్చయం బగుచు
తండ్రి కెక్కువయైన ధైర్యంబు నీది
మరి విను నీకొక్క మనవి చెప్పెదను
రంతు కానున్నది రాజులకు మనకు
పంతు గాదిచ్చోట భక్తుల వునికి

పర్వతానకు బెట్టి పంపంగ ఖలయు
సర్వదా ఈ ప్రొద్దె జంగమయ్యలను''
అని యెత్తు చెప్పిన అర్థించి నన్ను
కనుగొని యా పని గావించు మనిన
కావించి వారికి కడు తోడుగాను
భావించి మదిలోన బహుబలంబులను
మురువెరిగి ముగ్గురు ముమ్ములకును
పురణి కల్లందుల పోలినేనికిని

అరసి వడిగల కోడె లైదిటి నేర్చి
భరవసంబున మసిలినేనితో గూడ
ఏగురు జంగాల ఎలమి జతగూర్చి
బాగుగా జంగాల పర్వతంబంపి
గొబ్బున మము గలసుకొమ్మని
యనిన
నిబ్బరంబుగ వారు నెరి సాగి నడువ
పొరబడి తన్నెవరు పొమ్మనక ముందె
మురవుతో జనుదెంచి ముందర రెత్తెరిగి
బోరున వారితో బొల్లావు గూడి
వారు వీరద్దరయ పడి నేగి రంత
ఆలోన అంతలో ఆ చోడ భూపతి
దూతలు రాజుతో తురుతుగా జెపిరి :
"దేవతా!సీ ఆజ్ఞ తెరవు చొప్పునేను
భావించి జంగాల పట్టితెమ్మన్న
పట్టి తేబోతిమి బడుగు జంగాల
వెట్టికి రమ్మన్న ఇట్లు యదువంశ
రాజైన యా పోలురాజు కడకేగి
మరుగు జొచ్చిన నతడు మన్నించి
కాచె
కాచి యతడు మమ్మ కడకు
తోలినను
వెరచి వచ్చితి" మన్న విని చోడ
భూపతి
అగ్గిలో నెయ్యి బోసినట్లు కోపమున
భగ్గున మండి యపుడు వద్దనున్న
ఘనుడైన ముక్కంటి కాలవిట్టునిని
కనుగొని "యాదవ కువలయాధిపుని
కొదమణచి జంగాల గొంచురమ్మ"న్న
కదలి వచ్చెను భూమి కదలినట్లుగను
వాలు తోమర భిండివాలు చక్రములు
మేలైన ఖడ్గాలు మెరుగుటా
యుధములు
శరములు విండ్లు ఏంజామరంబులును
కాలమృత్యువునైన కదిసి పోట్లాడ
జాలిన వంటర్లు సామంతవరులు
కడు నేవళంబైన కాల్బలంబులును
గొడుగులు పడిగెలు కోటానకోట్లు
శూలాలు నేజాలు జూలుపక్కెరలు
తేజీలు పెద్ద మత్తేభములు నడువ
ఎచట జూచిన నేల ఈనిన యట్లు
అచలులై వారరుదెంచు నంతటను
రణభేరి ఘుమఘుమ రణ వాద్య
ములును
విని పోలురాజు ఆ విధమెల్ల గాంచి
'పగ నిజంబాయెను పసుల మందలను
ఎడగలగ దోలు"మని కంపటీలకు
జెప్పి
కడమ యాదవుల వంకను జూచి
పలికె:
"మన్నించి వినుడు నామాట
వకటింక

ఎన్న కీర్తుల నిల్పు నిదె వేళ మనకు
తరుణీమణుల మీద తనయులమీద
సురభుల మీదను సోదరులమీద
ధనములమీద బాంధవజనులమీద
మాణిక్యములమీద మమతలు విడిచి
ప్రాణములు మూర్ఛిల్ల బడిన వీరులకు
నెరవుగా నూరేండ్లు నిండిన వేళ
కాక ప్రాణములు తీపు గలిగిన వారు
గోకులము వెంటనే గొబ్బున జనుడు"
అనిన విని యాదవులు ఆ మాట
లకును
ఘనుడు పోలురాజుతో కనక ఇట్లనిరి:
"నీవు ఈరణములో నిలిచి ఎదిరించి
భావించి కైలాసపదము గోరితివి
ఇంతకాలము నిన్ను ఏమరక కొలచి
వంతు కెక్కుదురె ఏమరి నిన్ను విడచి
ఇంత వచ్చినయపుడు ఎడబాసినాను
ఇంతులు నగుదురు యముడు
పోనివడు
తరిమి పలికితిరి మాతగవు చూచుటకు
పరులైన పోదురే పగ డాసినపుడు
మావిధము వినవయ్య మరి నీవుచూడ
దేవతలు చూడంగ తెగ రణము చేసి
నీకన్న ముందుగా నిన్ను మెప్పించి
చేకొందు మందరము శివ విష్ణుపురము
అని యిట్లు పలికిన యాదవుల కెల్ల
వినయంబు లాడుచు వేడుకనున్న
ఆ సమయంబున అధిక సాహసులు
గోసంగి వీరు లెక్కువ పరాక్రమములు
భల్లూకపతి వంశ పావనోత్తములు
కల్లరి వైరిగజ కంఠీరవములు
కయ్యము కెంతయును కాలు
దువ్వుచును
చయ్యన దాటుచు సాము చేయుచును
కోరసిగలు పెద్ద కోర మీసములు
కాలినూళ్ళు పొట్లకాయ నామములు
ఎసగ భుజముల బారెడేసి కత్తులును
పసగల కయిజోర్లు పడిగె జమ
ధాళములు
కాటుక కొండ లాకార మైనట్లు
తేటైన నల్లని దీర్ఘ దేహములు
జాలువ బంగారు జమిలి మెడనూళ్లు
పాలైన బంగారు పరుజు బాకులును
పొసగ సందిళ్ల తామ్రపు కడియములు
మిసిమిగల గంధాలు మేని పైపూత
వింతలాగున మెరసి వివిధ మార్గముల
కెంపు లక్షణపాగు, కేతన పోగు,
రొంపిగందము జగ్గులు, రుద్రపాగు
ఎరుకు,
మెరుగుకత్తుల మల్లు, మేడ పాగెల్లు,
వైరిగంట సింగరి, వాలుగత్తి చెన్ను

బొడ్డుగంట మాధవి, బోదెపాగ
అమ్మలి,
అర్ధగత్తి రాఘవు, ఆడిదెల తిమ్మ,
గచ్చుటరిగెల భోగి, గందము మల్లు,
రుద్రపాగు అయ్యన రూపనపోగు
అమ్మన,
భద్రపాగు అవ్వన, పాప
హనుమంతు,
నిత్యకయ్యము భద్రి, నెలవారి పెద్ద
బచ్చతిరుమలి రాచ, బండిమాల పోగు,
పెద్దకత్తి చందన, బెబ్బులి సోము,
సదమందము లచ్చన, సంబయన
పాగు,
కదనమప్పన పాగు, కత్తికరి పోగు,
గండివిద్దెన పాగు, గజగంట సోము,
బండిచందన పాగు, బలభద్ర పోగు,
శిరిగంట సోములు, సిమ్మల పోతి,
విరులసింగరి పాగు, విద్యల రఘవు,
కలువల కత్తుల కాము, కర్రి
బొమ్మినీడు,
బొంబోతు సూరయ్య, బూపల సింగు,
చింబోతు వేమన, సెలగోల తెలగు,
జిల్లాల పావనుడు, బసువన పోగు
జల్లిగడల మాధవుడు, సమిడి
యాపాగు
వీరారి గంగన్న, విక్రమోన్నతులు

ధీరులు దారులు తెరువు గలవారు
గోసంగు లారువేలు గూడి వేడుకను
మెరవడి జనుదెంచి మెరసిన యట్లు
ఆరుగంగ ముందల అందరు నిలచి
మ్రొక్కిన సంతోషమున వారిని జూచి
చక్కని మాటల చమిరి పోలురాజు
మన్నించి వారిని మరియు నిట్లనియె
"ఎన్నిక నీసీమ నేలేటి రాజు
సరగున మనవెట్టి జంగమయ్యలను
మరి తిరుగనిమ్మన్న మన మివ్వకున్న
దండెత్తి మనమీద తగవు విడనాడి
దండుతో నెదిరె ఉద్దండవైరుల మీరు
అదలించి పోట్లాట కవసరం బయ్యె
చెదరక మదిలోన చేతుల తీట
తిరుగ బొడవక మనము తిరిగేది లేదు
తాకి రాజుల మాని దర్పించినారు
గురుతెరుగ కున్నారు క్రొవ్వి
భూపతులు
మరియాదచేకాని మరలడు
జననాథుడు
నిశ్చల శివపూజ నేర్మితో జేసి
వచ్చినదాక నా వసుధేశు దండు
నిలువరింపుడు మీరు నిజశక్తి మొరసి
బలువైన మశాన పాగిట లేదు
తలుపున నతడున్న తానెంతకు
నైన జాలు

అతడు లేడని వుండ అపకీర్తి గాద
అతిబలులు మీ రతనికన్న
సాహసుల్లు''
అన విని గోసంగు లపు డిట్లగనిరి :
''విను యాదవాధీశ వితరణధీర
వాగి మశానపాగు ఇట వున్న లేకున్న
తగు భక్తి వడిగలతనము వేబోయి
అరుల మర్దింతుము అహలివలిగాను
సురలోకమెల్లను చూరబట్టెదము
పొలుపొంద మీరు శివపూజకు జనుడ
నిలువరించెదము ఈనృపుల సేనలను''
అనిన విని పొలురాజు
అపుడిట్లగనియె:
వినయంబుతో వారినిట్లని పలికె :
''గానకొన్న కరుణతో గాదకాని
ఎదిర్చి
తాలిమిధైర్యంబు తలకొలిపె మదిని''
నిలచె శివపూజకై గొల్లెనలో నిఖిలం
బెరుంగ
నవనంది పద్మాసనమున గూర్చుండి
శివునికి శివపూజ చేయుచుండగను
సూటిగా గొల్లెన చుట్టూర తిరిగి
కోటగా నుండిరి గోసంగు లపుడు
ఆలోన రవి పశ్చిమాంబోధి కరిగె
చాల కలువలు నిక్కె జలజములు
స్రుక్కె
చుక్కలు గనుపించె చంద్రు
డుదయించె
చక్కగ వెన్నెల సాగి వెలిగించె
అంతట కాలవిట్టుని దండు అదిగని
గదిసె
రంతుసేయక వచ్చి రాజుల జంప
ముచ్చపాటుగ బడి మొత్తుదా మనుచు
హెచ్చైన గుర్రాలు ఏనుగుల తోటి
మీరి యాదవరాజు మీదికి డాగ
ధీరులై గోసంగులు తెగువరు లగుచు
ఘేరాలు బారుచు పెడబొబ్బ లిడుచు
శూరులై అవలివల సురసుర నెదిరి :
పొడువు పొడువని అరిచ్చి ఖ్ఖాంగులు
ఢాకి
వడి సముద్రరీతి వచ్చు సేనలకు
కడిమి చెలియలికట్ట కై వడి నిలిచి
ఎడకు రాకుండ – నవనందుల –
గొల్లెనకు రాకుండ
వీగి పారక నిలిచిరి విక్రమోన్నతులు
ఆగిన ఆగక ఆవీరు లంత :
''కదిసి మందల యెత్తుగానక క్రొవ్వి
తిమిరేటి మూకల తెగువు మాచేత
చావక మీరు వహ జంగాల నిచ్చి
పోవలసిన దిక్కు పొందు మీ''రనిన
విని నవ్వి అంతకు పీర గోసంగులు :
''వినుడిట్లు మీరు గర్వించి తగదనక
ఆడితి రీపాట లాడినందులకు
ఆడిన నోటిమీద అప్పుడు పొడుతు''
మనుచు

## చిలకలమఱ్ఱి పోట్లాట

అధిక సూరుని కొండ అవలివల నిల్చి
విదళించి కత్తుల విండ్లు తెగనరికి
గొడుగుకామలు ద్రుంచి గురుతైన
బిరుదు
పడిగలు తెగనరికి బలముష్టిపతుల
తలలు చదురుగ బొడిచి
తప్పదాటుచుమ
మొలల కైజారులు మోములమీద
గ్రుద్దినట్లురవడి గూడి పొడుచుచును
కొద్ది ఈటెల బొడిచి గ్రుచ్చి
యెత్తుచును
బల్లాల పొడుచుచు పార జిమ్ముచును
భల్లూకములవలె బట్టి చరచుచును
ఎక్కడ జూచిన ఎదిరి గోసంగుల
అక్కడ ధీరులై అట్టిట్టు సేయ
కనుగొని ఎదిరించ కరిలేక రిపుల
మనసులో భీతిల్లి మగిడి రందరు
భీకరగతి వచ్చు బెబ్బులి జూచి
చీకాకుగా లేళ్ళు చెదరినయట్లు
వీగిపారిన కాలవిట్టుండు జూచి
'పగవారి జగడంబు బలమాయె నింక
పొ'మ్మని తనవద్ద భూపతుల కనియె
'దండిమూకలు మీరు తరిమి ఈసారి
చెండాడి రమ్మ'ని సమరంబు కెదిరి
పముజులై పారుచు సాటివారి నెల్ల
మందలింపుచు బలికె మరియు
నిట్లనియె :
"తిరుగకండిక మీరు తీరుగా బోయి
మరి తల్లికడుపులో మనము
దూరెదమ
గోసంగులన నెంత గొల్లలన నెంత
వాసిగా మనసాటి వారెంత వారు
వారిచేతుల నెల్ల వాడికత్తులను
మీరు బట్టినవెల్ల మిండ కండలును
ఏల పారవేసెదరు. మీ కేల భీతిల్ల
కాలుడు విడుచునా కాలమొచ్చినమ
జమదార్లు గొని చంపు చావుకు వెరచి
సమరంబు సేయక సందు లీగినచో."
విని వీరపరివార మందరు దిరుగ
ఘనమైన రణభేరి కలసి మ్రోవంగ
కరి తురంగములును కాలిబలములును
ఉరవడి అందలా లొనర పల్లకులు
వింజామరంబులు వేటరుమాళ్ళు
కుంజరంబుల మీద కొమరు దీపింప
మెండుగా మేఘ డంబరములతోడ
మెరసి రాగ జూచి గోసంగు
లనుకొనిరి :
"నవనంది మనలావు నమ్మిక జేసి

భవుని పూజయందు భక్తి నున్నాడు
కరకంఠ పూజ విఘ్నంబు గాకుండ
తరుమవలె గొల్లెన దరి జేరకుండ
ప్రాణాలు మనలను బాసిన దాక
పోరాడుదము చనిపోయిన వెనుక
రాజు లెరుగుదురు పోలురాజెరుగుగాక
ఆజిలో నెదిరి పోరని దేహమేల''
అని దీర్చి ఆర్చిరి గోసంగు లందరును
మొనచేసి రాజులు మొన చెదరకుండ
వెంటను మరికూడ దంట రణభేరి
బంధురంబుగ మ్రోవ పటుగతిని దాక
పెంధూళికిని చంద్రబింబంబు గప్ప
కప్పిన పెంధూళి గళిత రక్తమున
అప్పుడు తడసిన అది యెల్ల నణగె
అణగిన నప్పుడె ఆరుల గురుతెరిగి
కణగి రాజుల దండు కదిసి
గోసంగులు
చేరి బల్లెంబుల శిరములు దునిమి
తూరి యా దొరలను తోమరంబులను
మరియు గెడ్డలతోడ మోముల చెక్కి
తరిమి బాకుల నురఃస్థళములు బగుల
నిగిడి కడుపులమీద నేజాలు వేసి
పగిది భుజదండలు బరిచీల జిమ్మి
ఆయుధాలు వడిద్రిప్పి ఆయములు
పొడిచి
నడిచెడక ఎప్పటివలె చంకజేరి

ఎరిగించి కొందరిని ఏపణగించి
గుములుగా కోలాల గ్రుచ్చి కొందరిని
చేరి కడాఅర్లు చేసి కొందరిని
తరుణతోడుత రక్తధార కొందరిని
ప్రక్కల ఈటెలు నాటి కొందరిని
గ్రక్కున శరణన్న గాచి కొందరిని
గ్రక్కున గోసంగు లొక కొంతసేపు
అక్కజంబుగ పోరి అపు డిట్టులనిరి :
"చిల్లరికాండ్లతో చెలగి పోట్లాడి
మానక చంపిన మనకు పేరేది
రణములో రాజాధిరాజుల మీద
ప్రణుతింప వారిపై బడి పోరి పోరి
చంపిన నది కీర్తి సాహసంబునను
చంపి చచ్చిననైన చంపంగ నెదిరి
చంపిననైనను జగతి మెచ్చంగ
చొచ్చి వీరందరు సురలోక మెల్ల
కల"దని తెలిసిరి ఘనులు గోసంగులు
పెళపెళ నారిచి పిడుగులరీతి
కరులపై వచ్చు భీకరమూర్తి నయిన
ధరణీశ్వరులమీద తలపడగలిగె
కరులతోనెక్కముగ కలవెంటనెక్కి
దొరలను మంత్రులను పొడిచి
పడద్రోచి
వింజామరంబులు విటతటము చేసి
కుంజరంబులమీది గొడుగులు దునిమి
ఉరవడి వారు వేటరుమాళ్ళు చించి

తరిమి రణభేర్లు బ్రద్దలుగాగ బొడిచి
జరజర బట్టి రాజుల నెత్తివేసి
వాటిపై తమరుండి వడి ద్రోలినట్లు
మేటి మూకలనెల్ల మెదగ ద్రొక్కించి
మేఘడంబరములు మెరుపులు నుర్మాడి
రాఘవు డలనాడు రాక్షసు:మీద
జాంబవంతులతో పోరిన చందంబు
మీరి
జాంబవ కులరత్న సముదయ మపుడు
రాజులతొ బోరిరి రాజులు తమరు
తేజంబు మాయక ధీరతతోను
ఘోటకంబులమీద గొదగొని పతుల
నోటపడ గొట్టిరి నురవడి మీర
పరిగెల కొట్లాడి బలువైనమేడ
సురియలతో బోరి స్రుక్కుచు వారు
గొల్లల బంట్లమని కోపించి తాకి
బల్లాలతో పోరి పడి కూలువారు
తూలిన మూకలతో పోరువారు
ఉల్లస మెడలించి ఒరిగేటివారు
పల్లకీ లందలాలు పైనమై వచ్చి
బలు భూపతులమీద బడి కూలువారు
తక్కిన యాదవులు ధాత్రిపై గూలి
ఒక్కరొక్కరిమీద వొరిగేటివారు
ఈరీతి జంభావు లెంచి కీర్తులను

భూరివిక్రము లగుచు పోట్లాడి పడిరి
తామసంబున వచ్చి ధారుణీశ్వరులు
సమరంబులో జంపి సాహసులైరి
ఘనకీర్తి తెలియ వెనుకకు రాక నిలిచి
తమ్ములు గోసంగులు తమ ఉగ్రబలిమి
కల్లుగా పోరిరి కదిసి రెట్టించి
ప్రిథివిపై నొరిగిరి -చల్ల- పిన్నమనేడు:
కరికరి నాటిన గాయాలతోను
కొలది చిలకలమ్రి కొమ్మల పొదుగు
బూరుగ పూచినయట్లు భూమిపై
వొరిగిరి
వెరగంది జనులెల్ల వినుతింపుచూను
మండలాధిపు దండు మహిమీద
వొరిగె
పంచలింగాల కొండ పాటిదాపునను
వరదలై రక్తంబు వాపోవసాగె
పంచలింగాల కొండకు రక్తపు
మడుగులు కైదట్టె
ఎంతని చెప్పుదు ఎంత వర్ణింతు
ఇంతింత యని చెప్ప ఎవ్వరి వశము
చల్ల పిన్నమనేడు: జాంబవుల మహిమ
ఎల్ల లోకములకు హెచ్చాయెనయ్య"
అని యిట్లు చెప్పిన ఆ చల్లఘనుడు
విని వెరగంది "ఆ వెనుక పోలురాజు

ఁననాథు లేమైరి సంగరంబునను"
అని యడుగ నిట్లనియె హరిగురువు
అపుడు:
'మరి వినుమా మామ మహిమ
యెరిగింతు
పరి పోరిరీ రిపులు జాంబవులతోను
కనుగొని ముక్కంటి కాలవిట్టుండు
తనమది గోపించి తనవద్ద నృపుల
జూచి యిట్లని పలికె: "శూరత మీర
భూచక్ర మేలేటి భూపతుల నెల్ల
గొల్లల గొలిచిన గోసంగు లిపుడు
పిల్లపిడుగుగ జంపి ప్రిథివిపై నొరిగిరి
గొల్లల జగడంబు కొంచమనరాదు
మళ్లించగా రాదు మళ్లంగరాదు
పచ్చ కాసులమీద బాలలమీద
ఇచ్చగల వారెల్ల ఇండ్లకు జేరుడి
చచ్చుటకు సిద్ధమైన జగడంబులోన
మచ్చరంబులు మాని మావెంట రండి''
ఆమాట కిట్లనిరి అవనీశులెల్ల:
"మా మనసు తెలియక కీమాట లాడితిరి
పుడమిలో రాజులై పుట్టినందులకు
రణములో జచ్చుట రాజధర్మంబు
సరిచేయ పోదురా సమర మున్నపుడు
వసుధేశ మీతోటి వారము మేము
పదుడు యాదవులపైబడి కొట్టవలెను
వృథయాళ్లకు బోయి పుట్టిపడ్డట్లు"

అనిన వారిని జూచి అరుషంబు నొంది
ఘనుడైన ముక్కంటి కాలవిట్టుండు
రథికులై కదిలిరి తురంగములతోను
కదిలె రణభేరీలు కాలిబలములును
ఉరవడి చనుదెంచె నుగ్రకోపమున
పురణింప పోలురాజు–శివ– పూజ
చాలించి
కదన సన్నాహంబు కావించువేళ
కదుపులు మేయంగ కడలి పొంగగను
అదురుపాటుగ వచ్చి అర్చె ముక్కంటి
కాలవిట్టుని దండు కదిసి బెట్టుగను
త్రుళ్లించి అంచచు –దండు– తుది
పదముగాను
తగిలి వేసిరి బాణతతి మీరి వచ్చి
నవనంది గొల్లైన నాటి యురవడిని
బలువుగా యాదవుల పైనిండ గాడి
గాడిన పోలురాజు కడిమి రెట్టించి
తోడేళ్ల సింహంబు తోలిన యట్లు
వాడి కోలల నేసి వైరిభూపతుల
పోరాడి విదళించె భూరివిక్రముడు
సుడివడి ఆలంబు చొచ్చినదాక
పొడిచి గగ్గోలుగా పొడిచి తానంత
మహిమీద తానిలిచె మల్లుదాపునను
నిలిచిన పగదండు నెరిశంక దీరి
తలకొని చనుదెంచి తలకింతలేక
బలవంతులైన తన బావలందరును

మంత్రి తిరుమందుల మల్లుభూపతియు
ఆదిగా తిరుమందు లందరు వరుస
వల్లవుల రాజులు వీరవిక్రములు
నెల్లను మొదలుగా నిఖిలయాదవులు
తన యిరువంకల దగిలి నడుపగను
ఎదిరించినప్పుడు ఎదిరి వైరులను
తూలించి శరములు తోమరంబులును
చక్రాలు నాడిదెలు జమదాళమూలు
విక్రములై తూరి వేయి విధములను
బల్లాల ఈటెల బంటుపంతముల
చెల్లుపోరున పొడిచి చీకాకుచేయ
అప్పుడు గోపాల్కు లాగ్రకోపమున
చిప్పకత్తుల బొడిచి సిరుల చెండాడి
ఆలంబులో చొచ్చి వెరపింతలేక
శూలాల కొందరిని గ్రుక్కి పొడిచినను
రోసాలు మిక్కిలై రూపులేకుండ
ప్రాసాయుధంబుల బయలుగా బొడిచి
ఎదిరించి కంపటీ లేకమై నడిచి
పొదపెట్టి వైరుల పోసిక కదిసి
ప్రబలి చేకత్తుల బద్దలుగ జీరి
రభసంబుతో మీరి రణరంగమందు
ఉభయంబు లోపల ఎనయంగ బోరి
ఆర్పులు బొబ్బలు అధిక
హుంకృతులు
నేర్పు తప్పక పోరె నేడః అచ్చోట
మరి వినవయ్యా తిరుమందుల మల్లు

లందరు ఏకమై హరులపై నిలిచి
కుంతాలతో బొడిచి గొడుగుల దునిమి
బంతులవలె దొలి పడనరికి తలలు
ఏగురి తలలు త్రిప్పి ఏనుగుల మొత్తి
కొమ్ముల తెగనరికి కోటానుకోట్లు
దుమ్ముస నలినలిగ తురుతుగా మొత్తె
మొత్తిన రవుతుల మొకములు బట్టి
నెత్తురు గారంగ నేలకు నొరిగిరి
ఒరిగిన బోసిక నూరార్లమీద
ఉరుకుచు నరుకుచు నుగ్గు జేయుచును
బిరుదులు విడిపించి బిరుదు రాజులకు
బిరుదులై పోరిరి పిన్నమనేడః
ఎంతని చెప్పుదు నే కండ్లజూచి
అంతయు జెప్పంగ ఆవంత గాదు
మల్లుల పోట్లాట మహినెంచ దరమ
చెల్లెను రణమింక చెప్పెద వినుము
వలరాజు వంశంబు వల్లవులంత
తాత తండ్రుల పగలు తరిమి
యాదవులు
యములవలె నెగసిరి ఏకబలమెల్ల
తరిమి చంపగ జూచి తమదండు
దూరి
సవరాల ముడిచిన చక్కని దిండ్లు
పయివిండ్లు గూర్చిన పముజులవంటి
(కోలలు)
పయిగూర్చి వేయుచు పైనార్చుచును

కరి తురగంబులు కాల్బలంబులును
రాజుల రవుతుల రణవీరభటుల
ఆజిలోపల దూరి అట్టిట్టు చేసి
మద గజ తురంగములు మడుగులో
జొచ్చి
పదపడి త్రొక్కెడు భంగి
నుప్పొంగి
చేతుల కెదిరించి చేతులు బట్టి
చేతులు ఖండించి శిరములు దునిమి
ప్రాణాలు తెగవేసి ప్రక్కలు చెండి
గొడుగులు దునుమాడి ఘోర
బాణముల
వింజామరంబులు విటతటము జేసి
కుంజరంబుల చెండి గుర్రాల బొడిచి
ఎదిరించు వైరుల నేక నుక్కడిని
పెళ్ళున రణములో భీతిల్లు రిపుల
గళ్లున తెగవేయ గ్రక్కున బొడువ
పొడిచిన మరి తీసిపోక ఎదిరించి
ధరణీశు బలము యాదవరాజు
బలము
తరువళ్ళు మరి బాకు దారుకత్తులను
పోరి చికాకుగా బిరుదు పోనీక
సరిమీరగా జంపి చావుగాయాల
పోలేక నిలిచిన పోలురాజపుడు
నెలకొని రణములో నిలిచి తనవద్ద
మంత్రికిట్లని పలికె మల్లుభూపతికి:
"పంతంబు గొని ప్రతాపంబులు
మెరసి
మమతలు పిడిచి తిరుమందుల దొరలు
అమితులై వల్లవు లందరు మరియు
వీరప్రతాపంబు విక్రమంబులను
వైరుల నురుమాడి వారిచెయి నొచ్చె
అలిసిరి వారితో నరుగంగ వలయు
కలచి యా ముక్కంటి కాలవిట్టునిని
పొలిజేతు రణములో పోనీక పట్టి
సరి యతని మంత్రితో సరిజంపు"
మనిన
అనవిని యా మల్లు లతిమోదమునను
తల్లడింపగ వైరి ధాత్రీశు లెల్ల
కేసరిపై నడువ కినుక రెట్టించి
కేసరి ఎదిరించి కేరెడు కరణి
స్పర్థించి మల్లుభూపతిపైన వేయ
సరగున గట్టిగా సరిదూరి పొడువ
అది వాడు పెడచేత అదలించి త్రోసి
పడకుండ మల్లుభూపతి రొమ్మంటి
పొడిచె
పొడిచి తానంతలో పోవ జూచినను
పొడిచి ఎక్కడికివు పొయ్యేవు అనుచు
పొడిచి అడ్డము దూరి భుజశక్తి
మెరసి
పొడిచిన ఆ వాక్కు పోటుతో నతడు
తూలెను సరి మత్తకుంజరము వలెను

మండిపడి లేచి ఆ మంత్రిమల్లంత
ఖండించి వైరుల గదిసె, ఎదురొమ్ము
గాయాల రక్తము కారె పోలురాజుకు
కనుగొని భుజశక్తి కలితులై మీరి
మరిమరి రాజుల మదము లణగించి
వేలాంబు దరమీరి వేలపై దరమి
కాలవిట్టుని గడచి కలహంబు పూని
ఏకాంగి వీరులై విభవంబు మెరసి
చేకొలది కత్తుల చిమ్ముటలాడుచును
డాయుచు వేయుచు దంపు దాటుచును
కాయుచు చేయుచు కరము కరమునను
త్రోయుచు వేయుచు తొలగి మీరుచును
పోరి రిద్దరును బెబ్బులుల చందమున
పోరుచు చెయిమించి పోలురాజు వేసి
వేసిన నా కాల విట్టు డంతటనె
వాసిగా కైజారు వడిదప్ప నూకె
తునకలై బల్లాల తూరి పొడిచినను
పొడిచిన బల్లాలు వీపున వెడలె
తరిమి రొమ్ముకు పరుజు తాకి ఎదురెక్క

## పోలురాజు కాలవిట్టుని సంహరించుట

కరికరి పోలురాజు ఖడ్గ మంకించి
చలమున కర్ణ భూషణములతో
కొలది చక్రాని మేన కుళ్లాయి తొడిగి
నేలపై పడి దొర్లి నిగుడ ముక్కంటి
కాలవిట్టుని శిరము ఖండించి వేసె
వేసిన జూచి దేవేంద్రాది సురలు
భూషించి నప్పుడు పోలురాజు ఘనుడు
సమరంబు చాలించి సంతోషమునను
కరవాలు భుజమున కదియించి చూచె
చెదరక పోలేక చచ్చె తురగములు
తొండాలు పాదములు తునియలై పోవ
పండగిల బడియున్న భద్ర గజములును
కదిలించిన మెదలక కదలంగ లేక
చెయిదీసి కూలిరి -వీర - సామంత వరులు
గడుసులై ఎదిరించి ఖడ్గాలచేత
నడుములు తెగిపడ్డ నాయకోత్తములు
శరము లురమున నాటి చచ్చి ధావకను

కొరప్రాణముల దన్నుకొనుచున్న
దొరలు
బెట్టుగా ఖడ్గాల పెనగి పోరాడి
కట్టలై కూచిన కాల్బలంబులును
తలలూడ నరికిన ధైర్యంబు లుడిగి
బలువుగా రణములో పడిన
మొండెములు
మొండెముల నెడబాసి మురిపెములు
దక్కి
పోలాడు మొండెములు పొర్లాడు తలలు
పిప్పిర్లు గట్టిన పీనుగులమీద
కుప్పలై పడియున్న
గుబ్బగొడుగులును
మెడలును నడుములు మీగాళ్ళు వ్రేళ్లు
తొడలును మడిమెలు తోరభుజములును
పిక్కలూ మోకాళ్ళు పిరుదు
నరములును
నక్కిళ్ల ముక్కలూ నరములును తెగి
పేగులు మాంసంబు పెనగొనియుండి
పోగులై రణమందు భూమిపై నుండె
కండలు రక్తము కాల్వలై పార
ఘన భీకరంబైన కాడె నేజాలు
వల్లవుల పోలురాజు వాలంబుతోను
మల్లులౌ తిరుమందులు మానవ దొరలు
మొదలైన గోపాలక మూర్తు
లందరును

కడుపులు రొమ్ములు కంఠములు గాడి
వేగమె రక్తములు వెడలె కండలును
ఎదురు గాయాలతో ఏకాంగి వీరులు
పదపడి రణమందు భాగంబు వెడలి
పాలించి అచ్చోట పాలటి దండు
లీలతో ఆ పంచలింగాల కొండ
చీకాకుగా చేరి చిలకల మర్రి
పరిచి పెట్టినయట్లు బలు మర్రిపొదవు
పూచిన మోదుగలు బూరుగులు నరికి
వేసినట్లైదువంశ వీరు లందరును
ముర్రాట లాడిన మూర్తి వహించి
మర్రికి రక్తము మడుగులై పార
పారేటి రక్తము పాలేట గలిసె
పారంగ యాదవ ప్రభువు లందరును
పడుగు పేకయుగాను పడియుండి
రపుడు
పడి పోలురాజు భూపతి కిట్లులంటి :
"బాణాలు నాటిన పంతంబుదాక
ప్రజలు నిలువరు ఆపదపడి ఝుంక
గాయాలు రొమ్ముల గాడ నోర్వజాల
వేవేగ ప్రాణములు విడిచెద" నంటి
మామ పోలురాజు నామాట కిట్లనియె :
'నీమేను గాయాలు నే మాన్పుతా
ననుచు
వివరించి తనచేతి విభూది చల్లి
కలిసిపో జేసెను గాయంబులన్ని

మరియు నిట్లని పలికె మమత పుట్టించి:
"గురువువు సెప్పు మా కులమున కెల్ల
ఎలమి ఆరువది యేండ్లు ఈ
భూమినుండి
తలచి మా యేగురి తనయుల నెల్ల
పిన్నలందరు వారి పెద్దల జేసి
మన్నించి యిక్కడ మా కప్పగించు
అంతట నీవు మే మందరము గూడి
కంతువిరోధి శ్రీకాంతు పురములకు
పయనమై పోదాము భక్తి నందరము
పయనముయ్యిన దాక పణతు
లందరును
అయిదువలై యుందు రందాక మేము
ఇక్కడ మీరాక కెదురు జూచుచును
లీలతో నీ పంచలింగాల కొండ
నుందుము విచారించ కుండు"మని
నాకు
పొందుగ మరికొన్ని బుద్ధులుజెప్పి
తన సతీసుతులను తగ మందలించు

## పోలురాజు రణరంగమున వరుగుట

అని పలికి మీరు ఆ యలమంచి కరిగి
మేలైన ఈ వార్త మీకు నెరిగించి
అడలకుండని మీరు అందరి కిట్టు
తడయక నాకన్ని దయబుట్ట జెప్పి
మరువకావేళ శివ మంత్రము జదివి
తరచుగా శివు దలచి దైవమును
గలసె.
వల్లవు లందరు వరుస నీరీతి
మల్లులు మొదలు తిరుమందు
లందరును
మొదలైన యాదవ ముఖ్యు లందరును
పదపడి వీర గోపాల్ల వర్గములు
సుదతుల తామును చుట్టాల విడిచి
చెదరక ప్రాణాలు చెల్లించి రపుడు
వారి నందర జూచి వగపులు మిగుల
వగచుచు మిక్కిలి వాపోవుకొనుచు
పొగులుచు నందర పోకడబెట్టి
గోవుల కాపున్న గోపాల్కులు నేను
గోవుల మళ్ళించుకొని క్షణమునను
వేగ నందర మర్థపీటి కేతెంచి
అయితమరాజుకు ఆడశ్రీలకును
ఈ తెరగంతయు నేర్పడ దెలుప
సిరిదేవి మొదలైన చెలియ లందరును
చిత్తంబులోపల చింతించి చాల

అగ్నిప్రవేశమున కాయ త్రపడగ
రమణులకు పోలురాజన్న మాటలను
చెప్పిన నమ్మరు చెప్పంగనేల
అప్పుడే కనపడునని యూరుకుంటి
ఎల్లగా గుండాలు ఏర్పాటుజేసి
వల్లవ స్త్రీలకు వరసతో కొన్ని
కోరి తిరుమందుల కొమ్మలకు కొన్ని
ఆరూఢి ద్రవ్వించి ఆ నట్టనడుమ
భేరి గుండమొకటి పెద్ద గావించి
రవులించి రపుడు ఘోరాగ్ని
గుండాలు
వివరించి యాదవ వెలదు లందరును
వచ్చి తమ గుండాలు వరుసన మెచ్చి
'హెచ్చైన గుండము ఎవరి'దని పలుక
తరుణుల కిట్లంటి తార్క్షణగాను:
'తల్లిదండ్రుల నెల్ల ధరణిలో గలియ
పసలేదు వీరితో పనిలేదు ఇకను
ఈ నసిగందుల బెంచ నెవ్వరి
తరము
నాచేత గాదని నాకు శిశువులకు
ఇచ్చోట గావించి తీ గుండ మొకటి
శిశువులనెల్ల నీ చిచ్చులో వేసి
శిశువుల పైబడి చెల్లుదు" నంటి
అన్నమాటలకు భూమ్యాకాశ మదలె
ఉన్నంత లోపల నుర్వి దద్దరిల్లె
గుబగుబా నీరుబ్బి గుండాలు నిండె
ఆ బాలలు చూడంగ అగ్ని చల్లారె
అప్పుడు జనులెల్ల ఆశ్చర్యపడగ
చెప్పితిమి ఆ మామ చెప్పినట్లెల్ల
ఆ మాట వినిరేమి అయిదువ లంత
ఏ మాట ఆడక హితవు గై కొనిరి
అంతట వారు మేమందరము గూడి

## పల్లికొండ పిన్నమనేనికి బల్లికురువ వృత్తాంతము చెప్పుట

హితమని అచ్చోట వీరులనెల్ల
తర్లించుకొని వచ్చి ఆ బల్లికురవ
ఊటిదాపున దిగియున్న దైవగతి
ఏపున నచ్చోట ఎడగొల్లకాళ్ళు
ఆడాడ వున్నట్టి అంత్రమన్నీలు
కూడి విచారించిరి 'గొల్లభూపతులు
తలచెడి పోలేరు తగిలి యందరును
బలావిడి చెరుకూర పసుల మందలను
నెట్టుకొని బాలకుల నెలతల సొమ్ము
పట్టిదోచగ చలపట్టి పదివేలు
తొట్టుకొని పోని త్రోవ లరికట్టి
ముట్టడిగా నేచి ముసురుకొని చేరి
చీమలు పట్టినట్టు చీకాకు చేసి
తామసులై పట్టి దట్టించి మరియు

పణతుల సొమ్ములు బాల
తొడుగులును
మణులును పశువుల మందలతోటి
నిండిన సిరులెల్ల నిపట దిగబెట్టి
పొండి ప్రాణాలతో పోవనిచ్చెదము
పోకున్న ప్రాణాలు పుచ్చుకొని
యెదము
చేకొనియెదము మీసిరులెల్ల' ననుచు
వీరులై మామీద విండ్లెక్కుపెట్టి
మీరిన బాణములు మించి వెయ్యంగ
బెగడి బాలకులెల్ల భీతిల్లిరంత
మగువలు జడిసిరి మందలు చెదిరె
అంతటయితమరాజు అనిచేయ బూనె
పంతమీరగ నన్ను పలికె నొకమాట
"ఇంతుల గావి నీ వేమరకుండు
కాలవిట్టుని మీద గడచి పోట్లాడి
ఆజిలో అరవైయ్యారు గాయముల
చాల నొచ్చితివి నా జగడంబు చూడు"
అనుచు విల్లెక్కించి అస్త్రములు పూని
చెణికెను వీరుల చీకాకుగాను
కొదమ సింహము రీతి కోపించి
మిగుల
ఎదిరించి కేకార్చి ఎలగోలు సేయ
నిలిచె నయితమరాజు నిజకార్య
మునను

## శ్రీశైలమునుండి గోసంగివీరులు, బొల్లావు బల్లికురువకు వచ్చుట

అంతలోపల మరియు నా శౌర్య
మొకటి
వింతగా జెప్పెద వినరయ్య మీరు
చాల దయమీరంగ జంగాలవెంట
పొలుపొంద జంగాల-వెంట-
పోయినవారు
పనివడి వైరుల పర్వతానకును
ఘనమందరము పోయి మల్లికార్జునుని
"ఓ పార్వతీశ్వర! ఉరగేంద్ర హార!
మా మనవి వినవయ్య మా పాలిదేవ
కరుణా కటాక్షక! గంగాధరుండ!
గిరిజా మనోహర! గీర్వాణ నాథ!"
అని విన్నపము చేయుచు అతిభక్తి
మ్రొక్కి
వినయాన గోసంగి వీరు లిట్లనిరి:
'జగదీశ మిముగూడి జంగమయ్యలకు

మతములో జంగాలకు మను తోడు
జేసి
నవనంది యంపించె-మీ-నగరికి"
ననుచు
ధవళ శంఖులు చిటితాళములు
మ్రోయ
కణిగి యాగుడి బెదిరె గట్టి శంఖులకు
''ఫణి భూషణుండ! నీ భక్తులై నట్టి
జంగాల దెచ్చి మీ సముఖంబునందు
అంగజహరుడ మీ కప్పగించితిమి"
అని యిట్లు మువ్మారటు అది దెల్పినాను
భవునకు జెప్పిన పలుకకుండినను
కోపించి యప్పుడు గోసంగులనిరి :
"బాపురే మేము మీ భక్తుల దెచ్చి
అప్పగింప వస్తిమయ్యా అరమర లేక
తప్పేమి మావల్ల దయవుంచు''
మనుచు
ఏగురు గోసంగులు ఎదురొమ్ములాను
వేవేగ కటార్లు వీపున వెడల
పడి మూర్ఛజెందిన పార్వతీ విభుడు
ఆడ ప్రత్యక్షమై అపుడిట్లగనియె :
''పరగ పోలురాజు నా భక్తుండు
గనుక
అరయ నాతని జగడ మాలకింపుచును
ఎరుగని సాహసం బేల చేసితిరి
[illegible]గ మీ ప్రాణాలు సేదదేర్చెదను
కోరుడు వర''మన్న గోసంగులనిరి:
'ఓ పార్వతీ నాథ! ఒక మనవి
వినుము
శ్రీపతిమిత్ర నిర్జిత పుర త్రినేత్ర
రాజశేఖర! రతిరాజ సంహార!
రాజిత గిరిచాప! రమణీయ రూప!
ఘోర దైత్యవిదార! కుధర సమధీర!
శరణు! కరుణ విలాస! శ్రీశైల వాస!
కరకంఠ మాకొక్క కరుణానతిమ్మ
సగర మా పోలురాజు జగడంబు మీరు
ఆలించితి మంటిరి అచటి వివరంబు
ఏలాగు ఈడేరె ఎరిగించు దేవ"
అనిన వారితో మల్లికార్జు డిట్లనియె :
వినుడయ్యా పోలురాజు విక్రమ మంత
సమరంబులో వైరి జనపతుల నెల్ల
క్రమమున పోరాడి కదిసి ముక్కంటి
కాలవిట్టుడు తాను కదిసి పోట్లాడి
తరిమి పోట్లాడి యిద్దరు ధర
గూలినారు
ఆరీతి యాదవులు అరుల మర్దించి
ఘోరాజిలో గూలిన కోపంబుతోను
గోపాలకుల తోటి గోవుల నెల్ల
చేపట్టుకొని వారిని చెదరి పోకుండ
హరిగురువు పచ్చె తా నర్ధపీటికివి
సిరులతో మరి ఆడశ్రీ లందరూను
కొనిపోయెనా బల్లికురవ దాపునను

ఘనముగా నేడు గొల్లకాండ్లణగించి    చనుదెంచి వచ్చి మీ జంగాల దెచ్చి
కలహించెదరు మీరు గ్రక్కున బోయి  మీకప్పగించితిమి మేమందరమును
కలుసుకొను'' డనిన శ్రీకంఠుని కపుడుమగిడి పోదలచిన మాలోన మేము
గోసంగు లిట్లనిరి కోరిక మీర ;    సగమైతిమిక నెట్లు సాగి నడచెదము
"వాసిగలయట్టి యదువంశాధికుండు    పరమేశ మేము మీ పాదసన్నిధిని
రణరంగమున వైరిరాజుల ద్రుంచి    పరగ ప్రాణము లిచ్చి పరము
కనకతో పోలురాజు కైలాస మరుగ    కేగెదము''
హరిగురువు కూడ బోనదియేల మాకు  దంటలై యేగురి దండు తామెరసి
పరగ మీ పన్నిధిని ప్రాణాల జెట్టి    వరలుదూసి కఠార్లు వురువున ననిన
గురుతుగా నవనంది కూడ బోయెదము  కరుల చందమున ధిక్కరించగాను
మీరిచ్చినట్టి వరము లివ్వి మా కేల    వారి సాహసములు వారి సద్భక్తి
ఆరూఢిగా నొక్క అవసరం" బనిన    వారి నిజములు జూచి వామదేవుండు
తిరముగా నప్పుడు దేవదేవుండు    వారి కిట్లని పలికె "వద్దు సాహసము
హరుటిగా వరమిచ్చి ఆలాగె ననిన    మీ సాహసములకు మెచ్చితి నేను
వరముగొని గోసంగులు    వాసిగల యదువంశ వల్లభులార ;
వారన్నదమ్ములు    చక్కంగ నిచట గోపంగుల కన్న
తరలి పొండని చెప్పితాము    ఎక్కువ ప్రిథివి గావించెద మీకు
తెగిరపుడు    నా దాసురాలైన నవనందిభార్య
తెగిన యా తెరువెల్ల తెలిసి మసిలినేడు  పోదెరువు గానక పుత్రులు దాను
ముగ్గురు ముమ్మలూ మురిపెమున    మీదిక్కు చూచుచు మీరాక గోరి
పోగ    ఏదిక్కు ఎరుగదు ఎదురు చూచెడిని
హరునికి సాగిలి అతిభక్తి మ్రొక్క    పొండింక మీరు గ్రక్కున
చరచి ఓదార్చెను శాశ్వతంబుగను    గూడికొనుడు
"కందర్పహర విష్ణుకాంత పరమేశ    పోరిలోపల మీరు పొలిసితిరైన
నందివాహన అనాథ భూతేశ    కోరిక మీ బల్లికురవ కెప్పుడును

సత్యంబు దప్పక జనలోక మెరుగ
ప్రతిపక్ష వీరులై ప్రబలిన భక్తి
విడువక యచ్చోట వెలసి యుండెదరు
పుడమి జనపతులచే పూజ గొనియెదరు
పొం' 'డని చెప్పిన బుద్ధి లోదెలిసి
చండ పరాక్రమము చేసెద మనుచు
వరములు గొని చాల వారిగర్వమున
తెలిసి యాముమ్ములాదిగ నైదుగురిని
ఏడెడ్లు బొల్లావు అరిగె నాక్షణమె

## యుద్ధ వర్ణన

వరుసన పక్షులు వ్రాలిన రీతి
స్థిరముగా చుక్కలు తెగిపడ్డయట్లు
పేర్చి వైరుల నెత్తి పిడుగులో యనగ
కార్చిచ్చు రిపులపై కదిసెనో యనగ
చేకొని వడివచ్చు సింహంబు లనగ
మాకు జూడగ చందమామలో యనగ
రాత్రి పగలనకుండ రణబలాధికులు
నేత్రోత్సవంబుగా నెలమి రెట్టింప
కడువడి నేడెడ్లు ఘన మశానపాగు
కనఁగొని బొల్లావు కల్లందుల
మారిసీడు
ముగ్గురు ముమ్ములు మొగసి
యందరును
వెగ్గలింపుచు వచ్చి కలసిరి మమ్మ
కలసిన దనుగొని కాంత సిరిదేవి
పొలుపొందు వేడుక బొల్లావు జూచి
కరములు ముకుళించి కదిసి
యిట్లనియె :
''నరసింహమూర్తివి నాతల్లి నీవు
నీకెదురు ఎవ్వరు నిలిచి రిచ్చోట
చేకొని నా బాలశిశువుల గాచి
పగవరుల ద్రోలి ఆపద గడుపు''
మనుచు
పొగడిన చెలరేగి బొల్లావు కణగి
కదిసిన మార్నేడు ఘనులు
ముమ్ములును
వేనందిరూపుల వైరి వీరులను
కణగి రొమ్ములమీద కణగున నేసె
పరిమార్చి వైరి భూపతుల నెల్లరను
చేతులు పాదాలు శిరములు దునిమి
వేసినంతట వీరుడై కణసి
ఫణిరాజువలె మశానపాగు కోపించి
ఆడఁజొచ్చిన నందరా గొల్లకాండ్లు
కడుదడి గోసంగులు కత్తుల నరికిరి
పొడిచి వైరుల జంపి పోగులు వేసి
పొడిచిన వైరుల పొట్టలు చిరిగి

చెదరక పోరాడి చేసిరందరును
వెరచిన ఆ మన్నెవీరు లందరిని
వెరవకు డని చేయి ఎత్తి మళ్ళించి
వెస ముందరికి మనము ఇందరము
గూడి
పసువుల కాపర్లు పరిణాన మనము
పుడవడి ఈపాలి ఏక మపుదాము
పొరిమార్చ శిరములు గొనిపోదు మని
తిరిగి
పేర్కొని రాజులు ప్రిథివి గంపింప
గొల్లరాజుల మీద కోపించి వేయ
వశము గాకుండగను వసుధేశవరులు

## మశానపాగు మార్నేడులు కూలుట

మశానపాగపుడు మళ్ళిన రిపుల
ఎదిరించి కొందరిని ఈటెల గుమ్మె
కదిసి కొందరి జంపి ఖడ్గంబు పూనె
తరిమి కొందరి – జమదాశముల బొడిచె
తరిమిన వైరులంతట ఎదురెక్కి
కరుకు ఈటెల మొనను కదిసి
పొడిచినను
ఎడలేని గాయాలు ఏనుగుల వలెను
నడికల్లిలో మీకు నమ్మిన బంటు
నిండిన ప్రాణాలు నెరి నప్పగించి
ఖండనమున మశానపాగు వడిగూలె
కూలిన మార్నేడు కోపించి అరిచె
మేలైన రాజుల మెడలు నడుములును
కుడి ఎడమగా దిరిగి కూలంగ వేసి
చేకొంది కత్తుల చెదరక దునిమి
భూలోక మందరిని భూమిపై గూల్చె
ఎధురొమ్ము గాయాల ఇలమీద వొరిగి
ఈరీతి మార్నేడు ఇలమీద వొరిగె.
కనుగొని కోపించె కడు
ముమ్మలపుడు
తూరి తుండెములుగా దొరలి కొందరిని
పుడమిపై ఎదిరిలచి పోక ముగ్గురును
ముగ్గురు మూర్తులు మొనకట్టినట్లు
కూడిన మన్నీల కుప్పలు పెట్టిరి
ఝాడించి రవుతుల సాగిపోనీక
సాహసులై చీలిచి సజ్జులతోటి
యాదవవీరుల నపుడు దునుమాడి
పేరాలు బారుచు బిరుదు బట్టించి
ధీరులై రణవీధి తెగి పోరి పోరిరి.
మొగములు వూరువులు భుజము
సందిళ్లు
పగతు లేసిన వీరబాణాలు నాటి
వొరిగిరి ముమ్మలు వుర్విపై సుతులు.
వొరిగిన ఎడ్లను వుగ్రకోపమున

చెరలించి మూకల డీకొని పొడిచి
పలికించి వైరుల పట్టి చెండాడి
మొరయుచు శత్రుల రొమ్ముల గూల
మొడిచి
కరులను పోరిమార్చి కాలరిమూక
ఉరువడి కొమ్ముల నుక్కణగించి
పగతుల తెగనరికి పగవారి నెల్ల
తలపడి చంపంగ ధట్టించి రిపుల
హతముగా మిగిలిన అవనీశు లెల్ల
మదిలోన కోపంబు మంట లెగయంగ
పుడమి పలబడిన దుప్పుల గుమ్మినట్లు
ఎడలేక చంపిరి ఏడెడ్ల నపుడు

## బొల్లావు యుద్ధము

ఎడ్లు చెల్లిన కోపమెత్తి బొల్లావు
గుడ్లు నిప్పులు రాల గోపించి చూచి
పైగొన్న వీరుల పంతంబు లణచి
గడిమన్నె రాజుల గర్వంబు లణగ
చేరిన రవుతుల శిరములు పగుల
మీరిన కాల్బలము మెదడూడిపడగ
ఎదిరిన బలముల ఎముకలు విరుగ
కదిసిన బలముల కంఠములు దునిమి
విరచించి మన్నీల వెన్నుల విరిచి
పోరిపోరి చెలరేగి భూపతుల నెల్ల
విరిగి పడగా దన్ని వెనక పాదముల
తూరి దొక్కుడుగ మట్టి తునకలు గాగ
వాలంబు శేషాహివలె నుండ ద్రిప్పి
మూలమూలకు ఇమ్ముల బారమోది
తూలించి కొందరిని త్రుళ్ళడగించి
భూలోక పతులను పోనీక పట్ట
[illegible]మ్మున గుచ్చెత్తి కొందరిని జంపి
కమ్మిన నెత్తురు కాలువలు మీద
పుడమిపై ద్రొక్కిన బురద గాకుండ
ఏమరక వైరుల నెల్ల బడద్రొక్కి
కాలు తడికాకుండ కదనరంగమున
కాళంగి తలమీద కమలనాభుండు
మట్టి తాండవమాడు మహిమచే మీరి
నట్టు వైరులమీద నాట్యంబు ద్రొక్కె
మందుకు లేకుండ మానవేశ్వరుల
అందరను పడజంపి అపుడు రక్షించి
కదుపులకు మాకునే కడమ లేకుండ
పొదుపు చేసెను మమ్ము బొల్లావు
వినుడ
ఆలోన అంతట సింహాద్రి భూమీశు
కూతురు చిటినూక కొడుకును గాంచి
తనపతి మాన్నేని తమరనలేక
ఆనల ప్రవేశంబు కాయత్తపడుచు

వరసుతుని బెంచ నెవ్వరి కిత్తుననిన
అగుమంచి పెంచుదు ననుచు తావొచ్చె
సరగున చట్టవారి చాన తావొచ్చె
ముగ్గురు వాదించ ముదితల జూచి
అప్పుడు చిటినూక అపుడిట్లగనియె :
"తెల్లని అక్షింతలు తెచ్చి ముగ్గురికి
ఇచ్చి బాలునిమీద ఇవి చల్లినంత
తగనెవ్వరి చేతి అక్షింతలు పచ్చనైన
వారి పిన్నవాడు వాడ"ని పలికె
ఆలాగె ముగ్గురూ అక్షంతలెయ్య
అగుమంచి చేతిప్రాలవి పచ్చనాయె
అయిన పచ్చందుల పోచయ్య అని
పేరు పెట్టిరి
అగుమంచి కిచ్చిరి ఆ బాలకూని

ఇంతలో మశానపాగు ఇల్లాలు కడిమి
పంతుగా మారంబ బాలుణ్ణి గనియె
కని మశానపాగుతో కడు చావదలచి
సిరిదేవి కనుగొని చెలియ మారాంబ
"నా తనయుని బెంచు నాతిరో నీవు
నీ తనయులలోన నెమ్మది నొకని
గా జూడు వీనిని గరుణతో బెంచు
చూచి చూడక మనుచు చులకని పనుల
తప్పక మీకు ముందర పనికి వచ్చు
మీబిరుదు లెల్లను మేదినిమీద
ఘనముగా చెల్లించ గలవాడు వీడు
బీరనాయుని పేర పెంచుమా వీని"
అని యిట్లు సిరిదేవి కపు డప్పగించె

## యాదవసతుల సాగుమానములు

మగనితో పయనమై మారాంబ నిలిచె
రమణతో ఎరనూక రాజు కొమార్తె
ప్రేమతో ఆవుల పినముమ్మి భార్య
అనముమ్మి భార్యయు అపు డరుదెంచె
నలనూకరాజు కొమార్తె పొటినూక
ఆవుల ముమ్మయ కూతురా భీకరమ్మ
తగ పయనమై వచ్చె దాడిముమ్మి భార్య
ఈ రీతి యేగురు ఈ బలమునను

కొదవేమి లేమి కుండగుండాల కురికి
పతులతో నేగిరి బలములు బెదిరె
ఆరీతి వైరుల నట్లు చెల్లించి
చేరి మిగిలిన ఆవసిరులు కదుపులును
కదలి వొచ్చితిమి కన మంగళాగిరికి
వడి కృష్ణదాటి బెజవాడ కేతెంచి
పొడగంటి మచ్చోట భూమండనాథు
సాకిరి నరసయ్య, సార్నల కేశవ,

బోడావుల కనకాద్రి, దండెబోయిన
ఎర్రు,
సాదము నరహరి, సంపత్తి మల్లు,
భూమాడి గంగులు, బొల్లావు మయిసు,
వుల్లాకుల రంగన, వుచేసు పోలయ్య,
మేడెబోయిన ఎంకయ్య, మేకల జగ్గు,
పండెబోయిన పాపయ్య, చట్ట నాగయ్య,
కావిటి లచ్చయ్య, కవ్వల జోగి,
సమిడబోయిన సింగు, తాడిపోయిన
ఎర్రు,
గొడ్డటి రంగయ్య, గోపిదేవి చెన్ను,
మల్లెబోయిన శరభు, మంధాడి బసువు,
భండారు రఘుపతి, పల్లెబోయిన
మొసలి,
వులిచి నారయ్య, వున్నతి మాధవు,
ఈరీతి యాదవులు వీరందరూను
తలిదండ్రు లందరు దైవమెందైన
కణిగి దుఃఖములతో కలసిరి మమ్ము
వారు మేమచట బెజవాడలో గూడి
వారిచే నలనూకరాజు వసుధేశు మాట
వింటిమి యామాట విను నీవు తెలియ

## పల్లికొండ పిన్నమనీనికి నలనూకరాజు వృత్తాంతము చెప్పుట

కంటక రిపురాజు కంఠీరవుండు
నలనూకరాజు సంతతి కొమరుండు
కలుగుట కొరకునై కాలకంధరుని
మరువక బెజవాడ మల్లికార్జునుని
వరము వేడెదమనుచు వచ్చి బెజవాడ
మల్లేశు బూజించి మమత బుట్టించె
మల్లికార్జుడు మెచ్చి "మగవాడు నీకు
కలుగు"నని ఆ బాల కలలోన జెప్పె
అప్పుడు నలనూకరాజానంద మొంది
అంత నతని కూలాంగి నలనూకసీత
సంతోష కార్యముతో చట్టమారంబ
పంతుమీరగ వారు వరములు దాల్చి
నెలలు తొమ్మిదిమోసి నిజసుతుల గనిరి
కన్నప్పు డంతలో కానకముందె
ఆలోన వేగ దైవానుకూలంబు
చాలక కాబోలు జగడంబు బుట్టె

## నలనూకరాజు పులులకు అభయమిచ్చుట

కారణంబున పులులు గ్రక్కున రెంతు
వేలంబులో నతని వెనక జొచ్చినను
వెంట తమకమున వెనువెంటనె తగిలి
పరువున నున్న భూపతి వాటిజాడ
చనుదెంచి పులులను సరగ నిమ్మనిన
నలనూకరాజు భూనాథునితో ననియె:
"పులులు ఎచ్చటికిని పోక నావెనుక
నిలిచిన గాచితి నే వాటి నిపుడు
ఇందరు గలిసి మీరేల వచ్చితిరి
పొందు గాదని పని పొండు మీ"రనిన
నున్న భూపతి నలనూకభూపతికి
తిన్నని పలుకుల తేర్చి యిట్లనియె:
"పులిమంచితనములు భూమిలో గలవె
పులుల ఎలుగులను పాములను
జూచినను
చలపట్టి పోనీక చంపుట నిజము
గోవులు గలవారు కోరి యాదవులు
గోవులకు వైరులు కౌరగావు పులులు
విడువు" మన్న నలనూక విభుడిట్లు
పలికె:
పులులకై నీవింత పొసగింప వలెన
"ఆవుం పులిజంపునని ఎమంగుదును
ఎరిగితే నేమాయె యీరెండు పులులు
మరుగుజొచ్చిన వాటి నెట్లు పట్టిత్తు
అడ్డమెంతయు లేక శరణు జొచ్చినవాటి
చెడ్డతన మెంతురే సీమలోపలను
కాకాసురుడు తొల్లి కడు రఘుపతికి
చేకొని యెగ్గు సేసి శరణన్న కాచి
కాచి రక్షించిన కథ మునుపు వినవె
అదిగాక చెడ్డవాడైన శరణన్న
మదిలోన గాచిన మృగపంత మవును
మరియును ఈ పులులు మనకేమి చేసె
పురణిలో వీటిని పుట్టించి బ్రహ్మ
అవనిపై పసుల నాహారంబు నేసె
కమలనాభుడు చేసిన కట్టడి గాక
నెరయంగ పులులకు నేరమెక్కడిది
హరునకు ప్రాణికోట్లన్నియు నొకటి
నామాట విని పొమ్ము నరనాథ నీవు
పులుల నిచ్చెడి మాట బొంకు
భూనాథ
భుజకంకణుడ నేను పులులను విడువ"

## పులుల కారణముగ నలనూకరాజునకు నున్నభూపతికి యుద్ధమగుట

అన విని కోపించి ఆగ్రహము పూని
ఆ నున్న భూపతి అపు డిట్లగనియె:
'నీవు గొల్లవు ఏల నీకు పంతంబు
చెల్లును రాజులకు చెల్లు నా'కనిన
ఆ మాటలకు యాదవాధిపుం డపుడు
''తగ నున్నభూమికి రాజువు నీవు
జగతి కంతటికి రాజువు నీవు కావు
ఇరవుగా నన్ను గురుతెరుగవు గాక
ధరణి కంతటికి యాదవరాజు నేను
నీకుతోడుగ నింక నిఖిల భూపతుల
తెచ్చినా నీ కెదురు తీసిపోవుదున
ఏమిటికి కలహంబు-మీ కేల మాతోను
వద్దుపొ'మ్మన్న భూవరుడు కోపించి
'నీమాత్రమునకునై నిఖిల భూపతులు
రావలెనె నీ కావరంబు నణంప
నేను చాలుదు నీకు నిలువు' మటంచు
ఏనుగులు గుర్రాలు ఏకమై నడువ
-ఈర-పరివారములు చాల బలిమితో నెదిరి
పరిఘలు ఈటెలు బాకు కత్తులును
బలువైన విండ్లతో బాణ జము దాళములు
తలపడి పోట్లాడి తరిమె యాదవుల
ఈరీతి ఎదిరించి విటతటముగాను
సురియల అంబుల శూలాలచేత
చాపచట్టుగ పోరి సరిచావులు గాను
వారు వీరందరును వసుధపైబడిన
పగమీర నున్న భూపతి మంత్రితోను
జగతి మెచ్చగ పోరి యిట్లు మార్కొ్నెడు
అతడు తానిద్దరు అవని గూలినను

## నలనూకరాజు వీరమరణమందుట

మదిలోన నలనూక పూనవేశ్వరును
నున్నభూపతిమీద నుగ్గునుగ్గుచేయ
చిందుబెందుగ జేసి చీకాకుపరచి
పురజితో వాక జాము పోట్లాట జేసి
ధర గూలిరిద్దరు ధారుణీశ్వరులు
కూలిన అంతట గురుతరంబుగను
రమణీయ నలనూకరాజేంద్రు సీత
జతనమై యప్పుడు చట్టుమారంబ
పతులతో నరుగంగ పయనమైరంత
తమకించి యెక్కిరి తమకంబు లపుడు

## నలసూకరాజు కుమారుని వృత్తాంతము

తమకంబుపై నున్న తరుణి సీతకును
బెజవాడ పూజారి ప్రియముతో వచ్చి
"నిజముగా బెంచెద ఇ"మ్మన్న
సుతుని
పూజారికిని ఇచ్చె పొలతి యా సీత
తేజమున మారంబ తెగువ నిద్దరును
వినుతింప అగ్నిప్రవేశము చేసి
కైలాస మరిగిరి కడమాట వినుము
అంతట పూజారి ఆ సుతుని గొంచు
సంతతికై చాల సంతోషపడుచు
పెంచుచు నొక రాత్రి ప్రేమతో
నడుమ
దంపతు లిద్దరు తగ నిద్రబోయి
సతిపతు లిద్దరు సమసిన శిశువు
బ్రతికియుండ వూరి ప్రజలెల్ల జూచి
"ఇదియేమి చిత్రమో ఈశిశువు తెరగు"
మహిమ మాటలు విని మదిలోన
ఆవూరి చాకిత అపుడిట్లగనియె
"వినరయ్య మొదలను వీని పుట్టుకను
జని కడవల బాసి సరిది వకనాడు
పిధికోకలు వుతుక వేసిన అగ్ని
వడి నేడు వాడలు వరుసతో గాలె
ఇరవుగా వీడు జన్మించిన వెనుక
పురిటికోకలు వుతుక పోగు వేసినను
ఆ వస్త్రములయందు అగ్ని సంధిల్లి
ఈ వీధివాడలు ఏడునూ గాలె
పుట్టేడు వాడలు పుట్టిక ఏడు
వాడలు గాల్చె నీ వల్లవులరాజు
పేరుపెట్టక మునుపె పెద్దలను జంపె
పెంచిన పూజారి పెండ్లము తాను
అశ్వీరము పొందిరి ఆ పాపడు వీడు
వలదు వీడుండిన వాడలు వూళ్ళు
చెడిపోవు నీబాల చెడ్డవా'డనిన
ఆ చాకిత మాటలు అవునని ప్రజలు
'వానిచంపగరాదు శిశుహత్య యగును
పోరి పశువులకాళ్ళ పోవలె' ననుచు
గురుతుగా నా వూరి గుమ్మాన వేసిరి
పశుల కాళ్ళను బోక బాలబ్రతికినను
ఆ పయిలకాపరి ఆ బాలను జూచి
చేపట్టి ప్రియముతో శిశువు గొనిపోయె
వాడు మూనాళ్ళకు వసుధపై నీల్గె
నీల్గిన ఆ బాల నిలకడ జూచి
ప్రజలెల్ల జడిసి ఆ బాల గొనిపోయి
మందసములో బెట్టి మరుగుపడ
మూసి
మందసము గొని కృష్ణ మడుగులో
వేసిరి
కని చెప్పగ మేము ఈ మాటలెల్ల

విని కృష్ణ మడుగునకు వేగానబోయి
మడుగులో దిగి వెలికి మందసము
తెచ్చి
తెరచిన అందులో తేటగానున్న
పిన్నవాడిని తెచ్చితిని వాడు వీడె
విండాది గంగల వినుత యాదవుల
బాలల నందరిని పరగ నీడేర్చ
గరిమ వీరందరికి కర్తవాదివిగ
జనులకు చల్లని చంద్రునివంటి
చల్లని వారగుట చల్లవారనగా
మీపోరు భూమిలో మిగుల విఖ్యాతి
బ్రతికిన మీకును బాలయాదవుల
నెనరున కలియును నేటి నుండియును
భారంబు నీ"దని పల్లికొండనిన

ఆమాటకు పిన్నమనాయు డిట్లనియె :
"చీకాకు గాకుండ శిశువులను మాకు
అందరిని గలిపితివి హరిగురువ నీవు
నీవు చేపట్టి కంటికి రెప్పవలెను
కాపాడి మమ్ముఁ గలిపితివి మాకు"
అని చాల గొనియాడి హరిగురువు
బొగిడి
హరిగురువు చెప్పిన అన్ని వివరములు
వరుసతో విని తెల్లవారిన దాక
పోలురాజు నలనూక భూపాలకుండు
మొదలైన వీరులతో మొనసి
రణముననను
ఖ్యాతికి నచ్చిరి ఘనతకు మెచ్చి
వగచిరి యెంతైన వారు వీరపుడు

## బాలరాజులు యలమంచి ప్రవేశించుట

తెగువతో ధైర్యములు తెచ్చుకొని
తిరుగ
మగిడి రందరు ఎలమంచికి వేగ
పొలుపొంప వచ్చి యా పురసమీపమున
బలువైన ధనముతో బలము దిగిరంత
గురులెరిగి పోలురాజు గుణ్ణాల కరిగి
కోడలు సిరిదేవి కొమరగిరిబిడ్డ
ఇద్దరు గుణ్ణాల కిరుగడల నిలిచి

కోడలిట్లని యేడ్చె కొమరగిరితోడ
''వల్లాంబ మీతల్లి వలరాజుతండ్రి
వెలది జన్మించితివి ఏగురి వెనుక
తనయులు పుట్టిన దయగల మీరు
ముద్దుగారంబున మురిపెమున బెంచి
పెరిగి అత్తవారింటికి పేరు తెచ్చితివి"
అని యిట్లు సిరిదేవి అడలుచుండగను
గొదకొని అప్పుడు కొమరగిరి అనియె

"మాటల తేటల ఆటపాటలను
నా ముద్దుగారవము నణగె మీతోటి
వొర్లుచు దుఃఖాన వొడిగట్టుకొంటి
తల్లిదండ్రులు మీరె దైవమిట్లైన
అన్నల జూచి నేనడలుచు వుంటి
అన్నలిట్లేగురు అడవి పాలైరి
ఈలాగు దుఃఖము ఎప్పటికైన
ఏరీతి నణిగేని ఎవ్వరున్నారు"
అని చాల అడలంగ అపుడు సిరిదేవి
చిచ్చుకడుపున చేట చెరిగినట్లైన
అడలుచు మామకు అత్తగారికిని
ఈవిధమున నప్పు డిట్లనిపలికె:
"ఓ అత్త ఓ మామ ఒనరంగ వినుడు
వినరయ్య విక్రమ వినుతప్రతాప
ఘనుడగు వల్లవుల కారణకర్త
సౌరిది మీ కడగొట్టు సుతుడు
పోలురాజు
విజయుడై శ్రీశైల విభుని పొడగాంచి
చల్లంగ శ్రీరంగ శాయిని జూచి
కొల్లగా త్రవ్వించె కోరి కావేరి
గట్టు పర్యంతంబు కాలువ త్రవ్వించి
వట్టినేలను పాలు వరద పారించి
ఆవులను కంచిపర్యంతంబు మేపి
భూపతు లెల్లను పోయి చెరుకూరి
మర్రిదాపున దిగిరి మందలు తాము
విశ్రమించుచునున్న వీరి వంశంబు
జంగాల కొరకునై జగడంబు పుట్టి
కదిసిన ముక్కంటి కాలవిట్టునికి
ఎదిరించి అతడిని ఏపణగించి
పరజనులు మిత్రులు బంధువులు తాను
సరగ ప్రాణములిచ్చె జంగాల కొరకు
కెరలి శిబి కర్ణుల కీర్తి వహించె
శివుడెరుగు నామది చింత యంతయును
ఎవరితోజెప్పుదు ఈ దుఃఖమంత
ఎవరు గలిగేరు నా అడలు వివరింప"
అని అత్తమామలకు అనురాగమునను
మొలకు పయ్యెదకొంగు మొగమున జేర్చి
వొలికేటి కన్నీరు వొత్తుచు బలికె:
"ఆ మొదలు పుట్టింటి అత్తవారింట
గుత్తమైనా గంగ గురుతెరిగినాను
చూచిన వారెల్ల శుభలక్షణాల
సిరిగల యీకాంత సిరిదేవి యనగ
సిరులు చీకటి పాలుచేసె విధాత
హరుడైన ఏగురి అన్నదమ్ములకు
పాయ దెరువులు చేసె బ్రహ్మదేవుండు
సరగున యలమంచి సంపదలు విడిచి
పంపాద్రి కడ కేగి బసవదేవుండు
తెగువతో వొక నోము తెలియక నీవు
నోమని వక నోము నోచెద మనుచు
నోమితిమి మరి నీవు నోమని నోము
నోమినా కొడిలేక నోమిన ఫలము
క్షేముల ఫాలంబునవే అత్తయ్య"

అని మదిలోపల అడలుచుండగను
వార్లుచు కన్నీరు వొలుకంగ నేడ్చు
సిరిదేవి దుఃఖంబు చింతగొల్పినను
వరస తిరుమందుల వల్లవుల సతులు
వల్లవుల వనితలు వక్క పెట్టునను
కన్నుల వుదకంబు కారంగ నేడ్చె
చన్నుల పైబడి జాలువారంగ
పేరెన్నికైనట్టి పెద్దగా జేసి
భూమి ఆకాశంబు పొగలంగ నేడ్చి
పొలతి తన గుండంబు పొగులుచు గాతె
రవిలి మండెను అన్ని రాశిగా నుండి
వల్లభూపతియును వల్లాంబికయును
తెలివిగా జూచిన దేహాలువేగ
నీళ్ళలో జూచిన నిండు వెన్నెలవలెను
కల్ల గాకుండగ కనపడి అచట
కుళ్ళుచు వలపోవు కూతురు జూచి
అప్పుడు ఇట్లనిరి అందరు వినగ:
"కూతురా నీమదిని కొదువ లేమిటికి
వనితరో రావమ్మ వల్లవుల చెల్లి
ఎండి పండంగను ఎవ్వరు నీకు
ఎత్తెరగక నీవు ఏడ్చెదవుగాక
వత్తురే చచ్చిన వారును నీకు
ధరణిపై అన్నలు తల్లిదండ్రులును
లేరని మరచి నీవు లేవమ్మ తల్లి
ఉన్నతంబైనట్టి ఒనర తల్లిదండ్రి
అన్నలేగురు వున్న అవునమ్మ నీకు
మము మరచిపోవమ్మ మామీది ప్రేమ
మగువ సిరిదేవిపై మానక చూపు
వావిరి సిరిదేవి వదినని యెంచకు
తనర నాసతి నీకు తల్లి నాతల్లి
అదిగాక నీకింక అడలేల మాను
మదిలోన సంతోషమై యుండవమ్మ"
అని కొమరగిరి దుఃఖ మపుడు చల్లార్చి
ఘనమైన శోకాన కంగుచునున్న
కడగొట్టు కోడలిని కరుణతో జూచి
"వడతి నీకేమిటికి పలుమారు నేడ్వ
వలదమ్మ సిరిదేవి వలదె నాతల్లి
వలదె నా వల్లవ వంశతిలకంబ
వినవమ్మ కోడల వినవమ్మ తెలియ
వాడలో నాయింట వన్నెవాసిగను
కోడలవై పుట్టి కొమ్మ నీనుండి
ఇరవుగా మాకెల్ల ఇహపరము గలిగె
నెలతరో—వినవమ్మ—తొమ్మిది నెలలును మోసి
కలిమితో కొడుకుల గందురు గాని
నీవు ఈశ్వరునైని నిజభక్తి నిలిపి
కొలది మీరగ పైటకొంగు లోపలను
కులముద్ధరించిన కొడుకును గంటివి
పతిపావనము ఇంక పడిన ఎందులకు
పతియనుచు లోచింత బాపిన యంత
పతినమ్మి మ్రొక్కిన పరమపతివ్రతవు

అతివ పతిబాసి నీవు అరవైయేండ్లు
బ్రతికి అయిదువనుచు భామవు నీవు
నీకెవరు సరిరారు నిఖిల భూమిలోన
అరయ తోడికోడండ్లు అయిదుగురు
మీరు
పరమభక్తిని నిన్ను పంపు చేయగను
భావించ ఏగురి బాలలకెల్ల
నీవె తల్లివని నిలిచి వుంటిమిగాని
నీసాటి వత్తురే నెలత లెవరైన
తనయుల నీనుండి తరుణ లెడబాపి
పరమపదముల త్రోవ బయలాయె
తమకు
అదిగాక మరి విను అడలేమి నీకు
బాలలకు మీకు నాపదలు లేకుండ
వదలక కనురెప్పవలె గాచుకొనగ
హరిగురువు వున్నాడు అన్నిటికి
అతడె"
అని చాల కోడలిని అపుడు భూషించి
హరిగురువును జూచి అప్పు డిట్లనియె:
"దైవిక మెల్లను తప్పిన వెనుక
నీ వుపాయముచేత నీ బుద్ధివలన
అరయుచు బాలల అతివలతోడ
వరసతోడను చల్లవారితో గలిపి
పోడిగా నొకచోట పొదుపు చేసితివి
మరియు వల్లవులు తిరుమందుల కెల్ల
కులముల కెల్లను కులగురువు నీవు
నీసాటి యెవ్వరు నిఖిలంబులోన"
అని యిట్లు పల్లికొండ కపుడిట్లు పలికె
నయముతో చల్లపిన్నపనేని జూచి
ప్రియవాక్యములచేత ప్రేమ నిట్లనిరి:
"మనమనులందరి జూడ మాకొక్క
సరియె
ఘనముగా నందరిని కాపాడుకొనుమ
నీదాపున బాలలు నిలిచిరి వీరు
పొదపుట్టకు విరువుపొద దాపినట్లు
అది గనకను మీరు అందరు గూడి
బలిమినుండిన మంచి పని" యని చెప్పె
"మరి విను యింక నొకమాట
వినిపింతు
రాజైన మన పెద్దిరాజుసుతుండు
భోజుడై కల్యాణపురము నున్నాడు
ఘన పరాక్రమశాలి కాటమరాజు
వొనర మీతో గూర్చుకొని పనులన్ని
చక్కగ రిపులపై చక్కబెట్టెదరు
గ్రక్కున నతనిని గలుపు "కొమ్మనుచు
అని చెప్పి వగవకు డప్పుడు మరియు
మనమలందరినంత మమత దీవించి
ఉబ్బుచ్చ జనులెల్ల నొగి తన్ను జూడ
మబ్బుగప్పిన నీడ మాసిన యట్లు
చేకొని వలరాజు, చెలియ వల్లాంబ
ఆకారము లణగిరి ఆ మాటతోను
అంతట పల్లికొండ అందరను జూచి

సంతోషములనూని చనుడు పురికనుచ
సిరిదేవి మొదలైన చెలియ లందరను
తర్లించె భక్తు డయితమరాజు తమరు
కదలి యలమంచికి ఘనవేగమునను
పిన్నమనాయని ప్రియసతి లక్ష్మి
గోవిందు భార్యయగు కులసతి గంగ
నారాయణుని భార్య నయముతో సోము
వరసతో కృష్ణుని వరసతి బామ
వెంకటాద్రిభామ వెలది వీరమ్మ
భట్టావుల వల్లభుని భార్య సూరమ్మ
కరియావుల రాజుభార్య కనకనాగమ్మ
వీరు మొదలైనట్టి వెలదు లందరును
నగరు వెడలి వొచ్చిరి నెలతలు కోడండ్లు
వాడని పద్మాలవంటి మోములును
బేడిసలకు బొమ్మబెట్టు కన్నులును
వడవడ వణుకులు వారు నడుములును
అదరు జక్కవల కీడైన చనులును
తడబడుచు కదలెడి స్తంభాల తొడలు
తొడరి కరులకు లింగ దోలిన నడలు
తుంగి సింగిణివిల్లు తులదూగు
బొమలు
జోకుచు మకరాంకు సురటీలనంగ
అతివలు సిరిదేవి ఆడుగుల కొరగి
మ్రొక్కిన కోడండ్లు మోదంబుతోడ
గ్రక్కున నందర్ని కమిగిట జేర్చి
చుట్టాల నందర్ని చూచి మన్నించి
దట్టమై ప్రజలెల్ల తనుగాంచి పొగడ
ఎడలేక సందడి ఇంపొంది మొదలు
నగరు ప్రవేశించి రందరు తాము
వరుసతో తమవారి వారి జాగాల
వరుసతో నెంచి వారందరిని వుంచ
ఆ రాత్రి వేగిన అట తెల్లవారె
తాల్మితో నలువురు తమ్ములు తాను
ప్రియము తోడుత చల్ల పిన్నమనేడు
ఘనకీర్తి నిజరాజు కరియావులరాజు
అతనంతవాడు భట్టావుల రాజు
శూరులు పోలురాజుసుతులు
ముగ్గురును
అధికముగ గలిగిన యాదవరాజు
తనయులు హరిగురువు తగిన
పెద్దలును
తెరుగొప్పగా రెండు తెగల
యాదవులు
చేరి యిరుగడల నాశ్రిత
పురోహితులు
బాంధవులు భట్లును పరివారజనులు
గంధర్వ సములైన గాయకుల నటుల
ధీరత తమరంత దేవుని కృపను
సవరాలు ముడిచిన సందువ లెరిగి
చవుక నింపొందిన జముకాణమూలు
రాయ తివాచీలు రత్న కంబళ్ళు

# పల్లికొండసూచనపై అయితమరాజు సింహాసనముపై కూర్చుండుట

పరుపులు వోరుగులు పరచి వున్నట్టి
ఆ రాచకొలువు కూటములోని కరిగి
హరిగురువు చెప్పిన ఆవిధము మదిని
తెలిసి అయితమరాజు డిగ్గున లేచి
కడ ముందుగా కొలువుగద్దె కూర్చుండె
కూర్చున్న నందరు గుజగుజ బోయి
నేర్చునా యితడు వారు నేర్పని బుద్ధి
అని పల్లికొండతో అప్పుడు చల్ల
పిన్నమనాయుడు పిలిచి యిట్లనియె:
"పెద్దలున్నారని ప్రియము చేకొనక
గద్దెపై కూర్చున్న కారణంబేమి?''
అనిన నామాటలకు హరిగురువు అనియె
"వినరయ్య పోలురాజు వివరించి అర్థ
పీటిలోపల నపుడు వివరంబు చేసి
పాటించి యితనికి పట్నంబుగట్టె
ఆతెరగున నిప్పు డయితమరాజు
మీతలంపెరుగక మెరసి కూర్చుండె''
అనవిని యందరు హావుగాక యనుచు
ఎలమి తమ మనసులో హితవు
గైకొనిరి
ఆలోన మరి మర్లఅమ్మన్న కాంత
నెలమీరి గర్భచిన్నెలు దినదినమ్ము

అధికముగా దోచె అప్పుడందరికి
సిరిదేవి మొదలైన సతులతో ననిరి
అపురూపమని తలచి ఆశ్చర్యపడుచు
'కలలోన పలికినా గంగా భవాని
పలికిన పలుకు నిబద్ధియాయె ననుచు
రమణులు ఆ పెద్దిరాజుల మాట
క్రమమున నిజముగా గైకొన దలచి
పల్లికొండకు చెప్పి పంపిన అతడు
వల్లవాధీశుల వల్లను విన్న
ఘనమైన పంపాది కలవిధము చెప్పి
"రణములోపల పెద్దిరాజుల మాట
అదియు తారాక్షణమాయె అమ్మన్న
వలన''
అని పెద్దిరాజులకు అందరు వగచి
చాలించి కొలువును చాలించిరంత
ఆరీతి కొన్నాళ్ళు అరిగిన పిదప
కోరి యావవులు మరి కొన్ని
దినములకు
చదురున కూర్చున్న సమ
యంబునందు
ఆనాటి దినమున అరుషంబుతోడ
మానిని మరి మర్లమల్లుయిల్లాలు

అమ్మన్న గనె నొక్క ఆడశిశువును.
సమ్మతి నామాట సభలోన వచ్చి
హరిగురువు కెరిగించె అతడు
వివరించె
ఆ దివస వారము లంతయు జూచి
"యథార్థమిది యర్థవీటి శ్రీగంగ
వంశాలు రెంటికి వరకీర్తి చేయ
ఘనముగా జన్మించె ఘనవేగముసను
ఎనయంగ గంగపేరిడు"డని చెప్పె
ఆమాట కందరు యాదవేశ్వరులు
పరమ సంతోషము పరము సిద్ధించు
పల్లికొండను బొగిడి బహు
విధంబులను
"ఇక మాకు ముందరి ఎత్తెరిగి నీవు
సకలమ్ము నడిపించు జనులెల్ల నెరుగ"
అని యాదవాధిపులు అందరచ్చోట
ఏడేండ్లు నిలిచిరి యెలమంచియందు
అంతట నొకనాడు యాదవులకెల్ల
కొలువులో పల్లికొండ గొబ్బున
నిట్లనియె:

## కల్యాణమునుండి కాటమరాజును తీసికొని రావలెనని పల్లికొండ ప్రతిపాదించుట

"పొందుగా అన్నదమ్ములు మీరు
మేము
కలుసుకొంటిమి గాని కడమయ్యె
నొకటి
తెలియజెప్పెద మీకు తెగువ కల్యాణ
పురములోపల కాటకోటేశ్వరుండు
కరమర్థి నున్నాడు కాటమరాజు
గురుతుగా మీ ఏగుర్ని గురుతెరుగ
డతడు
ఎరగడని మీరు మేమందరము ఎర్గి
తగవెరిగి తేకున్న ధర్మంబు కాదు
తెగువ నందరమును తేబోవవలయు
ఇదిగాక మరియును ఇచ్చోట మనము
కదుపులతో నుండ కారణము లేదు
అదిగనక పడమటికి అందరము మనము
కదిలిన జయమవును కాటమరాజును
కలుపుకున్న లెస్సగా నుండు"ననిన
ఆమాట కందరు అరుషంబు నొంది
ధీరులై వొక మంచి దినమొకటి చూసి
కదలి పోదమనిరి కడువేగ దలచి

# సింహాద్రిరాజుకొడుకులను యలమంచిలో నిలిపి యాదవులు బయలుదేరుట

పదపడి యలమంచి పాడుగాకుండి
పరగ సింహాద్రిభూపతికి సీతకును
తనయులై పుట్టిన ధర్మవర్తనుల
వరసతో ఆవుం బొలురాజు మనమ
లైన కతమన నపుడు ఆవుల వారి
పూనిక యలమంచి పురములో నిలిపి
కోరికతో నాటి కొలువు చాలించి
అయిదు ప్రొద్దులు నిలిపి ఆ
మరునాడు
తాతతండ్రుల పేర ధరణీశ్వరులకు
శీతలంబులు చేసి క్షేమంబుతోడ
పరగ నంబోధి నెడబాసియు వచ్చి
తరలక నిలిచిన తరళాక్షి గంగ
అని పలికి మ్రొక్కుచు హస్తంబు లెత్తి
కొనియాడి పర్వతం గొబ్బున జేరి
శ్రీగంగకును భక్తి సేవ చేయుచును
గోగణముల తోడ గొనుచు పోదలచి
కోరికతో పైడికొండ గుడారులెత్తి
బండిపై నెక్కించి భద్రకాళికను
బలములతో గూడ బంధువులతోడ
వేల సంపదలతో విభవంబుతోడ
పెట్టెలు గూడార్లు పెద్ద చందువలు
పట్టిచాలక మిగుల భరవాసులగుచు
వెండి బంగారములు వెలలేని మణులు
బండ్లవెంటను నడిచె పదివేలు గూడి
బండ్లపై ప్రవిద్ధులు బాలలతోడ
కడలేని బలముతో కడు వేగమీర
సుందరీ జనములతో సోదరులతోను
మందల దర్శించె మంచి త్రోవలను
కాడు జీవంబుల కడకు త్రోలుచును
ఆరు ఆమడ వెడల్పు అరిటి
పొడువునను
గోకులముతో కదిలి కొమరు దీపింప
కనకాంబరములతో కంపటీబెల్లి
వెంపర లాడుచు వివిధమున వారు
ముంపినట్లుగ జాలి ముచ్చట దెలిసి
ముదముతో యాదవ ముదిత
లందరును
కదిలిరి యలమంచి కడచేసి విడచి
నడిచి రడవి పుడమి నలినలిగాగ
కడగొడి లేకుండ కడుదారి యనుచు
ఎదురెక్కడ లేకుండ వెలితింతగాక
గొదగొని మిన్నెల్ల కావిరి గప్పెను
క్రేళ్ళురికి దాటుచు కేపలాడుచును

కాళ్ళనందెలు మ్రోవ కడుమేర లేక
తాళాలు మిక్కిలి తప్పెట్లు మ్రోవ
కొల్లకాళంబులు కొమ్ము లూదుచును
కలియుచు మెలియుచు గంతు
లేయుచును
తలకొని యాలపదాలు పాడుచును
సరవితో బోలేడు సాలెక్కి? భీమ
వర, సర్పవర, భావవరములు దాసి
మేయుచు కొండల మేలుశృంగాత
రాయన తిరుపతి రాజపొండియును
గట్లపుట్టిన చెమట గారంగ జొచ్చి
పట్టి మల్లటించి పడమటి మొకమాయెను
మార్కొండపతి రాజమహేంద్ర
మాదిగను
కోర్కొండ గిరిదాటి గోకులము దిగెను
పట్టిసము చని వీరభద్రుని జూచి
ఘట్టిగా నచ్చోటి గౌతమి దాటి
అచ్చోట నొక పూట అందరు నిలచిరి
మచ్చికతో ఆరాత్రి మరి వకబుద్ధి
తలపోసి "పసుల మందలకు
తరుణులకు
అలసటి పడి నడువ అడవుల వెంట
లేదీడ జాడ గొల్లైన బండ్లు నడువ
తోలుదాము అడవిత్రోవ పశువులను
ఎలమి సతులను బండ్లు
ఘడమ్మైపునను
తెగువడి బెజవాడ తేజస్తుపురము
మందలను అడవిని మన్యాలమీద
జాడల వెంబడి జనమెతక గలదు
నీరుసు గలదు ఏపెనీడలు గలవు
పుడమి నాత్రోవ యంబడి పోద"
మనుచు
అని బుద్ధి తలపోయ అటు తెల్లవారె
కదుపుల నెల్లను గాయంగ, ముష్ణ
పెద్దవిండ్లాకర్ల పెద్దల జేసి
ఘనముగా వక లక్ష కంపటీలకును
పనిబూని వారంత పసుల మందలును
కదిలిరి జలజాకరము కావరము దాటి
గొదగొని యా పాపికొండలు మీరి
భరవాసులై పంచ పర్ణశాలయును
అరయుచు గౌతమి అద్దరిద్దరిని
భద్రాచలము రామభద్రుని జూచి
మరి తంతి బలువైన మన్నెలు గడచి
ఘనభూములను దాటి కదుపులు తమరు
చనుదెంచి కాంచి యా జలజాకరములు
వనముల చేతను వసతియై యున్న
రమణమై ఆరుట్ల రమ్యకోనకును
విమలమై యుండంగ వేడుక పడుచు
"పశువులకు మెయ్యంగ పచ్చని
కసువు
మసలి దప్పికి త్రాగ మంచి
వుదకములు

మనము పశువులు వుండ మంచి గరువులును
కలిగెను ఇచ్చోట కాదనరాదు''
అని గోకులము తమరు అచ్చోట నిలిచిరి.
ఎనసి వుండిరి వీరి కెదురు జూచుచును
అంత నిక్కడ వల్లవా భూమిపతులు
సంతోష చిత్తులై సంపద బండ్లు
తర్లించి నడిచిరి తా మెదురులేక
ఘురియుచు గోపాళ మోహములు వీరు
భటు లారులక్షలు భావముల గొలువ
పటు చిత్రజల్లికి భారజల్లికిని
ప్రజలు వీక్షింపగ బగులు జేకొనుచు
బెజవాడ చని కొండపల్లి దడగడచి
వలను దప్పక వొచ్చి వచ్చి యా యెదుర
చిలుకలు కోయిలలు చెలరేగి కూయ
తుమ్మెదా గుంపులు దొమ్మిపడగాను
ఝుమ్మన అరవంగ సొంపు మీరంగ
కలకల నవ్వ శృంగార వనములును
కలువలు పద్మాలు గల కొలంకులును
గలిగి యెప్పుడు ఓరుగంటి చేరువన
కొమరు మిగులగ వుర్లు కొండవీటికి దండు
ఎల్లమీరుచు చాల విరివి గలిగున్న
వల్లవాధీశుల వైపు గొనియాడి
ఎల్లగా నచ్చోట ఎత్తి గుడార్లు
పట్టు గుడార్లకు పదికోసుల పొడుగు
కొలదిగా నావేళ రెండు పరుగుల మేర
సలుగు పెద్దను బండ్లు సకల సంపదలు
నిలిపిరి ఆయేటి నెలవు చేకొనుచు
విరివిగా నచ్చోట విడిమట్టి జేసిరి
మరునాడు లెగిచి శ్రీమంతులై కణిగి
హరిగురువు భక్తుండు అయితమరాజు
కరియావులరాజు ఘనుడు భట్టావుల వల్లభన్న
చల్ల పిన్నమనేడు సకల సామంతులు
అధికముగాగల పురోహితులతోను
యాదవాధిపులెల్ల అర్చించి యచట
వనగూడి హరిగురువు వకమాటపలికె

# ఓరుగంటి సమీపమున మరియొక యలమంచిలి నగరనిర్మాణము

'ఏర్పడ మనమీడ యెలమంచి పేర
పాళెంబు గావించ పంత మున్నాది'
అని జెప్పినా విని యాదవాధిపులు
పల్లికొండన్నట్లు బలవంతులైన
మంచిదిన మొకటి బ్రాహ్మల నడగ
వలెను
ఎంచి వేసిన భంగి నెలసూత్రపట్టి
మేడైన వాడలు మేడలు ఇండ్లు
నాణెంబుగా పెద్ద నగరు లేర్పరచి
అరుగులు సావిళ్ళు అంగళ్లు మిగుల
సొగసైన యా సూర్య సోమ
వీథులును
సొరది బంతైన రాజుల సొంపుమీర
విరివి గలిగిన మంచి విప్రుల యిండ్లు
తెరగొప్ప శివ విష్ణు దేవళంబులును
ప్రబలిన సంపదలు బలువు మీరంగ
సొగసైన యా మంచి శూద్రవాడలును
పాలెములు ప్రతిలేని బలువైన భటులు
ఇతరముగ జాతులనేకములు గలిగి
మిగుల కోటలు పొడుగు మిద్దె
గోడలును
తగు మంచి తలుపులు ద్వార
బంధములు
సొగుసైన వాకిళ్ళు సొరది పనులెల్ల
ఘనమైన సాదన గరిడి సాలలును
తనరెడు మేలు చిత్తరువు చవికెలును
జగతి పూజితమైన సరసమై మిగుల
యాల మగటము గలిగి యలమంచి
పేర
ధర్మమార్గంబున తగ విశ్వకర్మ
నిర్మించినట్లుగా నిలచె నా పురము
కనుగొని యాదవులు ఘనమైన మంచి
దినము చేకొని విప్రదీవెనల చేత
వరసతో తోరణాలు వనరంగ గట్టి
వల్లవాధీశులు వారివారిండ్లు
విరివిగా గృహప్రవేశము లయిరి
తరగని సంపదలు ధాన్యరాసులును
కలిగి మునుపటికన్న కలిమి రెట్టించి
వున్నపుడు ఆవూరి వుదకంబునాను
చెన్నుమీరగ మిగుల క్షేత్రంబు వాడ
నాడెంబుగా వీరనాయుని పేర
వోడక ఆయెదుట వుల్లవునివాడ
ఆ రెండు వాడలు ఆ పురంబునను
కోరికతో జూడ కోటలై యుండె
సొరిది రిపులకు తెలియ చూడంగరాదు
అనసలు పనసలు అరటి తోటలును
ననసిన మామిళ్ల నారికడియములు

పొంకముగ సురపొన్న పోక
బోదెలును
తిన్నగా దగినట్టి తీగ తోటలును
గరిమతో మేలు శృంగార వన
ములును
జువ్వలు మర్రిలు సోల్పురావులును
కలిగి యలమంచికి కడు రమ్య
మనుచు
వెలయంగ లక్ష్మికి విడిదిపట్టనుచు
కనుపట్టి కర్నాల కటకంబు లెంద
బోరు కలఃగుచు జనఃలు పొగడ
నెన్నుచును

ఆ యలమంచిలో నపుడు యదువంశ
భూపతు లందరు పొసగంగ నుండిరి
ధీరులై వక కొన్ని దినములు ఏలి
అంతట నొకనాడు అరుషంబుతోడ
పంతుగా దిక్కుల ప్రజలు వీక్షించ
అయితమరాజు మొదలైన రాజులును
జయము చేకొని కొలువు చవికెలో
నున్న
సమయంబు గని చెప్ప సమయమిది
యనుచు
కొమరొప్ప ఆ పల్లికొండ యిట్లనియె

## యాదవరాజులు ఆవుల మందలను చూడబోవుట

''భూలోక మెరుగంగ-చెరుకూర-
పోట్లాట చేసి
నవనంది చెల్లిన నాటినుండియును
మేలైన చెంగలి మేతలు లేక
ఆలమందలు క్రేపు లలసట బొంది
ఏమాయెనో మనము ఎరుగంగ
వలయు
శ్రీమంతులై మంద క్షేమంబు తెలియ
పోకున్న పాపంబు పుణ్యంబు లేదు
వేగు ప్రొద్దునలేచి వేగాన గదలి
పోవలె నన్నను పొంకంబుమీర''

ఆమాట కందరు హరిగురువు కనిరి
వీరనాయుని వారి వీరగోసంగులు
పూరికాపుగాను పుల్లవుని వుంచి
కదిలె అయితమరాజు కరియావుల
రాజు
వరసతో భట్టావుల వల్లభన్న కదిలె
పేర్మితో తగ చట్లపిన్నమనేడు
తమ్ములు గొలువంగ తా కదలివచ్చె
వచ్చె హరిగురువు తన వంశంబు
తాను
మచ్చికతో కొలువంగ మందలు చూడ

చనుదెంచి ఈలాగు సకల యాదవులు
సంతు మీరంగ లక్షల తరబడిగ
తాళాలు మేళాలు తప్పెట్లు మ్రోవ
గురుతుగాగ ననేక కొమ్ములు వాగ
అందమై మూడామడ లాప్రొద్దె కదిలి
సరగ నడిచిరి ప్రొద్దుజామున దాక
మందకు జేరి భూమండలము కదల
వంది జనములు చదువ వాద్యములు మ్రోగ
దారలు తప్పెట్లు తాళ శంఖములు
భేరినాదములు గంభీరంబుగాను
దిక్కులు పగులంగ తీవ్రమై మిగుల
వక్క బిగువుతొ మ్రోవ వైనవైనాన
ఆమోత వినెను బస్వాదేవు డపుడు
స్థిరముగా విని చాల దివ్యచిత్తమున
తనుజూడ యాదవులు తమరరిగి రనుచు
ఆకలి దప్పికలు అలిసి మేపంగ
కాటమరాజింక కదిలి రాడనుచు
ఎమ్మెతో నంతయు ఏష్యంబు తెలిసి
వనథంగ మందపట్టుకు వచ్చె బసవన్న
చెలరేగి అరుషంబు చెవులు రిక్కించి
ముందల నడువంగ మూప్రంబు కదలు
పాదాలుగల కొండ ప్రబలి చనుదెంచె
బసవదేవుని చుట్టు బలిసి యిరుగడల
రాణించి లక్షోపలక్ష మందలును
తరుణి కిరీటకంబులు దాచి కప్పంగ
వుప్పొంగి గోపాల్కు లురువడితోను
గరిమతో ఆ ప్రమథ గణము లందరును
అరయంగ సలుగుటెద్దులు తన్ను గొలువ
సొరదిగా నామంచి సరిసమానముల
అరయంగ గోపాల్కు లావెంట రాగ
చెలువైన ప్రియముతో చనుగెంచి రంత
వెలయంగ మళి కల్పవృక్ష సంతతులు
వెలలేని యాదవుల వెంటనే తిరుగ
కైలాసగిరి నుంచి కదలి వేగాన
బాలకుం డతనికి బసవరూపంబు
రాదలచి అయితమరాజు మొదలైన
పరగ యాదవులకు ప్రత్యక్షమై గంగ
ఈవిధము చనుదెంచె వినుత మార్గమున
కొసర కెత్తిన పట్టుగొల్లెన క్రింద
పరిచిన రత్నకంబళముల మీద
వీర తమకముమీద అపుడు బసవన్న
నిలిచెను ఇరుగడల నిలిచెను చాల
చల్లవారి పుల్లెద్దు మర్లవారి మట్టెద్దు
వారు ఇద్దరు వచ్చి వరుసను నిలిచిరి
సలుగు టెద్దును బాల ఎడసందు లేవు
కనుగొని భయభక్తి కడమ గాకుండ
అయితమరాజు మొదలైన యాదవులు
బసవన్న పాదాల పన్నీట గడిగి

తగ గంధపుష్పాక్షతల పూజజేసె
దొరకొని మయిసాక్షి ధూపంబు లిచ్చి
అలుక దీర వింజామరములు అమరంగ
విసరి
ఒనర నీరీతి సకలోపచారములు
చేసి అయితమరాజు చేరి నుతించె
"శ్రీమహాదేవు డాశ్రిత పారిజాత
సోమ జటాజూట సురసంవికూట
ఇంద్రాది సేవితుడ వినుత సాహసుడ
చంద్రార్క నలనేత్ర చారు శుభగాత్ర
కైలాస వైకుంఠ కరకంఠ రూప
ఫాలాక్ష శంకరా బ్రహ్మమునీంద్ర
నీవు మా మందలో నిజముగా బుట్టి
వావిణింగల బసప దేవుడవు నీవు
పొసగగా మాచేత పూజలు గొని నీవు
రసికత ముంగల రాజుపదవిచ్చి
మన్నించినీను మేము మరి
పొగడగలము
ఎన్నికచేసిన నీవు ఇంక మోక్షంబు
చలమున మాకిమ్ము సర్వేశ" యనుచు
మనవిగా జెప్పినను మన్నించి నంత
అని చాల వినుతించె అంతట మరియు
తిరుమందు లందరు తిరముగా నుండి
శంఖుచక్రాల గొల్లైన సరగ నెత్తించె

పొరుగున తివాచీలు పరచి వుండగను
కపినుండి మందలు కనిపెట్టియుండె
ఇరవుగా కార్యంబు లిన్నియు నెరిగి
వెడలి బొల్లావు ప్రవేశించె నపుడు
తిరుమందు లందరు ధేనువును చూచి
పాదాలు వుదకములపై బార గడిగి
పచ్చని అక్షింతలు పుష్పాల పూజచేసి
ధూపదీపంబులు తుదిమేర జేసి
రూపించి విష్ణుస్వరూపమై యున్న
బొల్లావు నప్పుడు పొగడంగ సాగె
తాల్మితో పల్లికొండ పుత్రమరాజు
అపుడు
ఇట్లని వినుతించిరి వినుతేజితోను:
"సదమల శుభాకార సమరోగ్రవీర
కమలాక్ష వైకుంఠ కందర్పజనక
నీవు గోరూపమై నిలిచి మాయింట
భావించి సిరులకు పట్టుగమ్మసుమ
దుర్జనుల బట్టి త్రుళ్లణగించి
సజ్జనుల రక్షించి సౌఖ్యంబు లొసగి
కర్తవైన నీవు మాకు కడమ నుతిసేయ
మాకు దోపదుగాని మమ్ము
దయజూడు"
అనుచు విష్ణుస్వరూపమై యున్న
బొల్లావు నప్పుడు పొగిడి నుతియించి

## ఆవులు పడమటి ముఖమై నిలచుట

వరస తిరుమందులు వల్లవులు ఇట్లు
పరగ బొల్లావుకు బసవదేవరకు
ఏగిన యందాక ఇలవేల్పు వనుచు
జాగరంబులు చేసి సన్నుతి చేయ
ఆ బసవేశ్వరుడు ఆ బొల్లియావు
సొరిదిగా గోపించి సొంపుననున్న
వెలగల సలుగుటెడ్లు విడి కోడెలూను
తరుపులు లేగలు ముత్తవపులతోను
మరి తెలియజూడని మందలారాత్రి
మసల కన్నియును పడమటి దిక్కు-
చూడ
ఆ లక్షణము చూచి అయితమరాజు
కొలది యెరుగక పల్లికొండ కిట్లనియె :
"తెలివితో శ్రీ బసువదేమునికి నేను
ఏగిన దాకను ఇలవేల్పు వనుచు
చాలవేడిన సరకు చేయనట్లుండె
నాభక్తి గైకొనక నడులింగమూర్తి
పడమర మొకమాయె భక్తవత్సలుడు
ఇదిగాక మరి వినుడి యిక నొకమాట
సలుగుటెడ్లును మంచి సంగడావులును
గంగిమైలావులు కపిలి ధేనువులు
జడదారు కోడెలు బసువముద్ర
ఎద్దులును
మరి పొల్లి ఈనని మట్టె ఆవులును
పోతుటెడ్లు అంకచూడని భోగపతి
నర్రాలు
పొసగ సతిపతులు మాసకమ్మలును
సన్యాసి ధేనువులు సమకూడి అన్ని
మస మొకముగాక పడమర చూడ
దొడగె
మావల్ల తప్పేమి మాతండ్రి
పోలురాజు
చెరుకూర పగరాజుల చాల జంపితివి
భక్తుల కొరకునై ప్రాణంబు లిచ్చి
ధరణి రాజులు మెచ్చ దనరి కైలాస
నగరంబు కరిగిన నాటినుండియును
నేటి పర్యంతంబు నేను బోనాడి
తమవెంట తిరుగక తమను విడిచియును
తమకుగల ఆకలి దప్పికలకును
అరయక ఎడజేసి నందుల నేమొ
కూడుకొని బసవన్న గోవు లన్నియును
కోపించె గాబోలు కొడి యెరగజెప్పు"
అని తనను బలికిన హరిగురువు పలికె

## కాటమరాజును తోడికొని రావలెనని పల్లికొండ తెలుపుట

"నన్ను అడుగగనేల నా ముద్దుమరది
అన్ని వివరంబు లతడెరిగి వున్నాడు
యతిరాజమూర్తి మీయన్న భక్తుండు
అతడెరుగు ఇన్నియు నే చెప్పెడిదేమి
అలనాడు ఆవుల వాలురాజు అటవ
పల్లాంబ పలికిన పలుకుల కొరకు
పాటించి ధేనవులు బసవేశ్వరుండు
కాటమరాజు రాకల కెదురు చూసేని
అతడు పడమటనుండె ఆ మొకమాయె
గోవులకు నీ మీద కోపంబు లేదు"
అని తెలియజెప్పి "మీ అందరిలోను
ఎరిగి కాటమరాజు నెవరు తేగలరు
పయనంబు గ"మ్మని పలికె నావేళ
సంతోషమందిరి సకల యాదవులు
ఆమాట కప్పుడు అయితమరాజు
తెగువ కాటమరాజును తెత్తునని పలికె
ధీరుడై శ్రీబసవదేవునికి మ్రొక్కె
మ్రొక్కిన బసవన్న మన
సుముఖుడగుచు
వురువడి ఖణెల్లున రంకెలు వేసె
ధేనువులును తూర్పుదిక్కు మొక
మాయె
చెంరేగి సంతోష చిత్తాన దలచి
అప్పు డయితమరాజు అన్నదమ్ములును
హరిగురువు మొదలైన యాదవాధిపులు
గోవుల గాచేటి గోపాల్కులును
మలిమంతుడైన భూమడి పోల్నెని
కర్తగా జేసి రక్కడి పనులకెల్ల
వల్లవాధిపు లెల్ల వచ్చి యలమంచి
పురములోపలకు ఆ ప్రొద్దు వేంచేసిరి
ఆ రాత్రి వేగిన అప్పుడు లెగిచి
వురువున కాలరిని వొప్పుగా దీర్చి
కొదవ లేమియు లేక కొలువుకూటమున
సకల జనులందరు సౌఖ్యంబుగాను
కొలువుండి యాదవ కులమెల్ల వినగ
రాజైన అయితమ రాజశేఖరుడు
కాటమరాజు నిక్కడికి గొనివచ్చి
వారివారము మనము వారితో ననుచు
తెలియక హరిగురువు దిక్కు జూచినను
తాను భక్తుని జూచి తగ నిట్లుబలికె :

## పల్లికొండ భక్తిరన్నను కల్యాణము పంపుట

''నీచేతి పని యిది నీకు దక్కంగ
వారుల చేతగాదు వో ప్రతాపరాయ
కర మర్థిగొని తెమ్ము కాటభూపతిని
వరుసతో బసువదేవర సముఖమందు
ఎరిగి నీ తమ్ముడాడిన మాట నిలుపు
నీవు సుజ్ఞానివి నీతిమంతుడవు''
అని కొనియాడిన హరిగురువుమాటకు
అడుగు దాటక భక్తుడవుగాక యనుచు
చిడిముడిపాటింత చిత్తమున లేక
తలపులోనను గూడి తగ బంధువుల
జెప్పి
ఎలమితో కొలువు చాలించి యింటికి
నరిగె
తానంత సిరిదేవి తల్లికి జెప్ప
మేనత్త కొమరగిరి మెలతకు జెప్పి
వీరులగు శిష్యులను వెంటబెట్టుకొని
పులితోలు చర్మనులు భుజమున వేసి
తలమీద జడలుసు తాలు తూలాడ
సన్న వలిపెములు కాషాయ వస్త్రములు
వున్నతమైనట్టి యోగవాగ్మములు
తరుచైన రుద్రాక్ష దండలు మెడను
గరిమతో విభూది కక్షపాలలును
కంఠమున వ్రేలాడుచున్న లింగాలు
సరవితో భుజముల చక్రాల గుదులు
కప్పెర వకచేత కనక త్రిశూలము
కాలియందెలు ఘల్లుఘల్లున మ్రోవ
ముదముతో ధరియించె
ముద్రికలుదాల్చె
పురణితో మేనున బూదిని పూసె
బిరుదులై అన్నియు భిక్షాటనముల
పరువు లెత్తుచు దూదిపావల మీద
గండ్రగొడ్డండ్లు చేకత్తులు బూని
మిండ జంగములతో మేదినిమీద
జనములు తమ జూచి సంతోష
పడగ
చనుదెంచి తటాక జలజాకరములు
వనములు నదులు కేవలముగా దాటి
కనుగొని రంతట కల్యాణ పురము
సలలితంబైనట్టి జంగమ రూపమున
వలనొప్ప శృంగార వనములమీద
కలకల బలుకుచు కనుగొని
చిలకలును
ఫలవృక్షములమీద పక్షులు బలికె
జలకూటముల నీదు చక్రవాకులును
కలికికాంతుల మీరు కలువ
పూవులును

జలపూర్ణమై యున్న జలజాకరములు
చూపట్టి కొమ్మలు చుక్కల లోటి
రాపాడు కోటలు రమణ నగరులు
మేడలు వాడలు మేటి అంగళ్ళు
కూడి సూడిచ పసుల కొలువు
సాపిణ్ణ
తోరమగు చక్కని దొంతర ఇండ్లు
పేరాళమై యుండి ఏడు వాకలును
మెరసి తక్కువగాక మీరి వెయ్యాయ
సొరిది కనపడు సూర్య సోమ
వీథులును
కంచికి గోరంత కడమగాకుండ
అంచితముగ శివుడు ఆసురించినట్లు
భూదేవి మణిమయ భూషణంబగుచు
కాదనక చక్కనగు కల్యాణపురము
భూలోక కైలాస భుజశక్తయనగ
అపురూపముగ జూచె అపుడు
భక్తుండు
మరియును మదిలోన మాటమాటకును
హరహరా శివశివా యనుచుండువారు
జంగంబు లింగంబు సరియొక్క
టనుచు
సంగతిగా జెప్పి చదివేటివారు
ఉరసజ్జు లోపల నున్న లింగాల
కరముల నిడి పూజ గావించువారు
తరుగని విభూతి రుద్రాక్షమాలికలు
ధరియించి శివభక్తి తరుగనివారు
క్షితిని ప్రపంచంబు శివమయంబనుచు
సతులును సుతులును సకలమగు
జనులు
ఈరీతి శివభక్తి వెలితయినవారు
వెదకినను లేక ఏ ఇంటిలోపలను
తనువున ఖండాలు తరిగి చిన్నముల
అనుదినము శంభునికి అర్పించువారు
నిరతమెరుగక గుండె నిలదీసిపెట్టి
పరమేశునకు సమర్పణ చేయువారు
చేకొని నాలుక చిగురులు గోసి
శ్రీకంఠునికి భక్తి చెల్లించువారు
కడిమితో చెలరేగి గండ్రకత్తెరల
తడబడక శిరములు తరుగుకొనువారు
తరిగిన మొండేల తలలు అతికించి
ఘనముగా విభూది కట్టెడివారు
కట్టినను ప్రాణాలు గ్రక్కునరాక
అట్టిట్టుగా వివిధాంగములు దాల్చి
పిక్కలు ప్రక్కలు ప్రేగులు
వాడిసి
ఎక్కువ పావడ లెత్తేటివారు
వారువీరనక పరివారమందరును
తెగువతో వీరుల తెరవునంతంత
ఎక్కడ జూచినను ఎక్కడనున్న
అక్కడ లింగడై అవనిపైనున్న
ఎక్కడ జూచినను ఘోషవకులము

మిక్కిలి సంతోష మీతులై యచట
కనపడ భక్తితో కల్యాణ బసవ
గుడికేగి మిక్కిలి కోరి నుతించె:
"భక్తజన మందార, భవరోగహార
ముక్తికి గురుతైన మురవైరి మిత్ర,
భూమీధర విహార, భుజగేంద్ర హార,
అమరేంద్ర నగచాప, అతిదయారూప
శమిత సేవకపాప, చంద్రకలాప,
ఫాలాక్ష, శంకర, ప్రణుతి దేవేశ"
అని చాల కీర్తించి అచ్చోటనుంచి

## భక్తిరన్న జంగమవేషమున కల్యాణనగరమున సంచరించుట

వెడలి ముందర గంగవిభుని మందిరము
కనుగొని పోదమని కదలి యేతెంచి
తను జూచి పురుషులును తరుణీ జనములు
ఇతడు కేవలమైన ఈశ్వరుడు మనను
బ్రతికించ వచ్చిన పగిది నున్నాడు
పుడమిపై కొందరు పొట్టకొరకు
ఉండెదరు వారికి ఒప్పు లేదనుచు
తమ చిత్తములయందు తాత్పర్య ముంచి
బ్రమసి కనగొని వచ్చి పాదాల కొరుగ
ఒరిగినవారికి వరుసతో నాసల
తరిమి పాపసభూతి ధరియింపజేసి
తిరమైన తాళాలు తిమిర శంఖులును
గరిమతొ మ్రోగెడు ఘంటారవములు
చెలగి పీకెలు పెద్ద శృంగనాదములు
కొలది తుడుములు కాలి కొమ్ములు మ్రోగ
పుడమిలో దగ నెమలిపురి చామరములు
బిరుదులు చాల గలిగి భీకరంబుగను
పట్టి చాలక రాజపథ మార్గమందు
నిండిన వారధి నీరు చందమున
ఆ రాచనగరి సింహద్వారమందు
భోరు కొలుపుచు నిలచి పుడమి మీరగను
నిలచి యంతట రాజు నెరి చూడగోరె
చొరబడి దర్వాజ చొచ్చి యా యెదుర
కడ దుందుభాలు బంగారు స్తంభాలు

పరమణి మాయమగుచు పలనొప్పు
కొలుపు
చావడి కరిగి నా సరుగున గంగ
భూపడు కొలువుండి పొసగ మూరాన
భక్తుని జూచి యా పరమ పుణ్యుండు
భక్తవత్సలుడైన పార్వతీవిభుని
తట్లదేరగ ఇంపు తర్కించి రాత్రి
పెండ్ల మర్పించిన బిరుదు గలవాడా?
కొడుకు నొకని గోసి కూరగా వండి
వండిన బోనము వడ్డించి వెనుక
చంచలం బందక శంకరాద్రికిని
కంచేడు వాడలు కదలించినతడా?
వెండికొండదాలక విరూపాక్షు తరిమి
దండెత్తి తగిలిన ధరణీశ్వరుండా?
శాంభవ వతికిని సరివచ్చు ననుచు
అంబలి పోయించిన అయ్య గాబోలు!
మోకాలు కుంచంబు ముదిత
చనుగుబ్బ
మేకపెంటిక లింగ మిదియని గొలిచి
వాసికెక్కిన యట్టి వారిలో నొకడు!
పాసి చనుదెంచెనో భక్తుల భక్తి
చూచి తానను చు ఇచ్చోటికి మనుడు
పూచిన అల కల్పభూజముల రీతి
ఇచ్చటికి ఏతెంచె నీ వింతతపసి
ఎచ్చటి వారలో యెరుగవలె ననుచు

## గంగభూపతి భక్తిరన్నను పూజించుట

గంగభూపతి కొలువు గ్రక్కున లేచి
సంగతితో నెదురుగా జనుదెంచి
చేకొని భక్తితో చేరి భక్తునికి
డాకొని సాగిలి దండంబు బెట్టి
అతివలు తాను పాదార్చనలు చేసి
మతినుబ్బి పొగడుచు మాటిమాటికిని
అతని కూర్చుండు మని అతివలు
తమరు
ప్రతిలేని రత్న కంబళములమీద
చతురుడై కూర్చుండి జననాథు
డనియె
''యతిపతులు మీరు మిమ్మెరిగి
నుతిసేయ
నేరము మీరు మా నేరమెన్నకుడి
నేరంబులెల్ల మీ నేర్పుతో గూడె
నీవు మా నగరికి నేడు వచ్చుటను
భావింప శంభుండు ప్రత్యక్షమగుట
శోభనకర మయ్యె చూడ నా గృహము

నా భాగ్య మీడేరె నాపూర్వపుణ్య
ఫలము సిద్ధించె నే పావనుడ నైతి
విలసిల్లి నా మదిని వెడలె పాపములు
అందమై మా వంశమది చాల సిద్ధి
పొందెను మీ కరుణ పొందె"నని
పలికి
మరియు భక్తునితోను మహిపతి
అనియె
"స్థిరముగా మీరు ఏ దేశాననుండి
వచ్చితి రిచటికి వార్త లేమేమి
"నిచ్చలంబుగ మాకు నెరిగింపు"మనిక
విని భక్తుడపుడు భూవిభుని కిట్లనియె
"వినవయ్య రాజ మా వృత్తాంతమెల్ల
ఒకదేశమని మాది, ఉనికిడి కాదు.
సకల దేశంబులు సకల తీర్థములు
సకల పుణ్యక్షేత్ర సముదాయ మెల్ల
తికమకలు గొని చాల
తిరుగుచుండుదుము
ఏవార్త లెరుగను ఏము సీకీర్తి
భావించి వినుదుము ప్రజలు రాజులును
భాసురంబుగ యతులు
బ్రహ్మచారులును
కాశి గయా ప్రయాగల కేగువారు
తిరుపతి మొదలైన దివ్యదేశములు
తిరుగాడుచుండెడి తీర్థవాసులును
సదమలాకారులు జంగమయ్యలును
మొదలైన వారలు మూకలు గూడి
నీదు ప్రతాపంబు నీ సద్గుణములు
నీ దానమహిమల నీదు శివభక్తి
నీదు సద్భావంబు నీ సత్యవ్రతము
మేదినీనాయక మేర లేకుండ
మెండుగా బొగడంగ మిము
జూడదలచి
కొండంత ఆశతో కోరి వచ్చితిమి
నిండుమనంబుతో నిన్ను జూచితిమి
దండిగా మాకు నీ దయ చాల గలిగె
జోకతో విని వచ్చి చూచినందులకు
మాకు సరి యెవరు నీ మహిమ
కెదురెవరు?"
అని వీరు వారును హర్ష వాక్యముల
ఒనర సంతోషముగ నున్నసమయమున

## పాపనూక యాదవగోత్రములు పాడుట

అంతటగంగ భూకాంతుని తనయ
చెంచిత తోడుగా సిరిపాపనూక
ఎంచగ సతులొక్క ఈడుజోడనుచు
కూడి బంగరు పొన్ను కోలాటకాండ్లు
పాడుచు దంపంగ పాపనూకపుడు
తలపోసి కాటభూపాల నాయకుడు
అలరి శ్రీకృష్ణుని అంశవాడగుట
తొల్లి వ్రేపల్లెలో తోడ కృష్ణునికి
చెల్లెలై పుట్టిన శ్రీయోగమాయ
దుర్గ కాటమరాజు తోడబుట్టుగను
అగ్గళమై పుట్టిన అతివ తాననుచు
తలచి మదిలోపల తా దుర్గ గనుక
ఎలమితో ముందరి ఏష్యంటు లెరిగి
ఈ విధమున వచ్చిన యోగివల్లభుడు
భావింప తమ యన్న భక్తుడని తెలిసి
తమ ఉనికి తెలుపంగ తలపోత చేసి
వరుస భక్తునికి వినవచ్చునట్లుగను
సకియ చెంచిత తాను జంగాల చూచి
పాడినట్టుల పాడె బ్రాహ్మణుల కొరకు
పోడిమి వైరుల పొంకమణగించి
మనులు మెచ్చగ స్వర్గమునకేగె
నసుచు
వనజాక్షి తన తాత పలురాజును పాడె
అధమురలేక సింహాద్రి భూపతియు
పరగ వైరులనెల్ల పట్టి వధియించి
పురణితో వైకుంఠ పురమేగె ననుచు
తరుణి తన పెదతండ్రిని తలచుకొని
పాడె
ఈరీతి అంకణా లెత్తి పుట్టిల్లు
వారినెల్లను చాన వరుస పాడంగ
విని రాజు తలచె "నీవెలది
యెన్నడును
పనిపడి తనవారిని పాడదెన్నడును
ఇచ్చోటనే పుట్టి ఇచటనే పెరిగె
ఎచ్చోట ఎరుగదు ఇపుడేల పాడె
ఇది యేమి ముందరి ఏష్యమో"
యనుచు
మదిని తలపోయంగ మమత రెట్టించి
పాపనూకను జూచి భక్తు డిట్లనియె:
"వెలదిరో నీపాట విన వేడుకాయె
వనిత ఈ తూరి వినవలె పాడు"
మనిన
ఆ మాట కెంతయు అతివ సిగ్గుపడి
తనపాట మాని అంతఃపురము కరిగె
అరిగి కల్యాణము వారందరు గొలువ
సురిపెమున పెందోట ముద్దమ్మ దేవి
కొలువున్న కడకేగి కొమ్మ యిట్లనియె:
"చెలియరో వినవమ్మ చెలులతో గూడి

పలుమారు రోకంటి పాట పాడగను
అలరుచు నా జంగమయ్యల గురువు
పిలిచి నాతో చాల ప్రియములు పలికి
పాడినది మరలను పాడుమని అడుగ
పాడక నే సిగ్గుపడి వచ్చినాను"
ఆమాటకేమనెను అపుడు ముద్దమ్మ:
"పాపమ్మ విను సిగ్గుపడగ నీకేల
నీ ముద్దు పలుకులు నీ పాట వినగ
అయ్యలకు సంతోష మాయె గాబోలు
ఏం వస్తివి పాడు మీతూరి" యనుచు
చాల బుజ్జగించి సమ్మతము చేసి
తలమీద పువ్వుల దండలు చుట్టి
తిలకంబు నొసలిపై దిద్ది పైతుడిచి
పసిమి దేరెడి పట్టుపంచ మొలగట్టి
మిసిమిగల బంగారు మెరుగులు తొడిగి
అంపిన చనుదెంచె ఆ పాపనూక
దంపుచు రోకలి తా చేతబట్టి
మగువలు వల్లవుల మరి తిరుమందుల
తగిలి మునుపటి వరుస తరుణులు
పాడ
విని భక్తుడావేళ వేడుకపడెను
జననాథు డెంతయు సంతోషపడెను.

## భక్తిరన్న పెద్దిరాజుబిడ్డలను తనవెంట పంపుమని గంగురాజు నడుగుట

తా బలికె భక్తు "డీ తరలాయతాక్షి
ఈ బాల మాబాల విను"మని మరియు
"ఈ బాలకొరకునై ఇట్లు వచ్చితిని
వచ్చినందుకు భాగ్యవశము చేకూడె
ఇచ్చట గనుగొంటి నీ బాల నింక
కనుగొనవలెను మా కాటమరాజును
జననాథ పిలువబంపు సరగున" ననిన
ఆ మాట విని వారి కవనీశు డనియె:
"మీమాట కాదనగ మేము చాలుదుమ
పౌలతియు ఈమె తోబుట్టిన యతడు
అరయంగ మీ వారలంటి రిందులకు
తిరముగా మాకు ప్రతిసాక్షి గావలయు
కోరి పెద్దమాదేవి గుణ్ణముదాపు
వరసాక్షి పలికించు వయిపెరిగితేను
పలికించుకొని పొందు బాలలను మీరు
పలికించలేకున్న బాలలనీము"
అన విని భక్తుండు అపు డిట్టులనియెం
"జననాథ వినవయ్య సత్యంబు తలప
కాని పని కేమిటికి గడువ నాడెదము
రానిమ్ము కాటమరాజు నిచ్చటికి,"

అనిన నా భూపతి ఆ మాటలకును
తనవద్ద మంత్రుల తా జూచి పలికె:
"రణవీరుడగు పెద్దిరాజుల సుతుని
మీరెరిగి ఈ కార్యమింతయు జెప్పి
గారవంబున దెండు కాటభూపతిని,,
అని చెప్పి పంపిన ఆ మంత్రు లరిగి
కనుగొని సాదనగరిడి లోపలను
సాము చేయుచునున్న సాహసవంతు
మన్మథాకారుని మంత్రులు చూచి :
"ఓ కాటభూపాల ఓ రాజతిలక
మీకొరకు ఇప్పుడొక మిండజంగంబు
తలపోయ మిము జూడ
దలచియున్నాడు
పద"మన్న కాటభూపాలకు డపుడు
చెదరక రాజాజ్ఞ చేయంగ దలచి
వరుస నయ్యల జూడవలెనని తలచి
విరివిగా తనవారి యింటి కేతెంచి
వారికందరకును వరుసగ జెప్పి
వారితో గుమిగూడి వచ్చెను సభకు
వినయంబు నేర్పు వివేకంబు మెరసి
తలపడి ఈడు సాదనకాండ్లు తాను
వడివడి పరువళ్ళు ద్రొక్కుచు వారు
జెనికి యాడుచు పెద్ద బెడిసిన రీతి
కదయుచు నట్టిట్టు గమకంబు మీర
ఎదురు చూచుచు నపకి పుటమెగచి
ధాటుచును
కుదురైన ఏనుగు గున్న చందమున
పొదలుచు చనుదెంచె భూనాథసభకు
చనుదెంచు నప్పటికి సభవారలెల్ల
కనుగొని సంతోషకలితులై చెలగ
జనపతి కా గంగజనపతి యనియె:
"అయ్యలు మావాడవని నిన్ను వీరు
చయ్యన నడిగిన సాక్షిగా నిపుడు
ఇరవుగా జగమెల్ల నెరుగంగ వారు
చెలగి పెద్దమాదేవి చెప్పిన యట్లు
పలికించు మన్న నా పగిదికి నొప్పి
పలికింతుమనిరి ఈ ప్రజలెల్ల చూడ
నిన్ను రమ్మంటిమి నీవును మేము
ఎన్నంగ వీరు మన మేకమై కదలి
కోరి పెద్దమాదేవి గుండము కడకు
చేరంగ వలె"నని చెప్పి అందరును
పురజను లందరును భూమిగలవారు
వరసి ధరణియెల్ల వడలిపడినట్లు
ఆబాలగోపాల మంతయు జూడ
చనుదెంచి అందరు చేరి రచ్చటికి
పొన్నలు తిన్నని పోకమ్రాకులును
గన్నేర్లు చక్కని గంగరావులును
రావులకడ మంచి రావి మర్రిలును
తావులై తులసి బృందావనంబులును
మల్లెలు, విరజాజి మల్లె పొదరిండ్లు
కలిగి గుండముకాడ కడువేడ్కనపుడు
నిలిచిరి ప్రజలెల్ల నిజరూపుగాను

## భక్తిరన్న పెద్దమ్మగుండమువద్ద సాక్షి పలికించుట

వావిరి తన శిష్యవర్గంబు గొలువ
బాలుడు చనుదెంచె భక్తుడు అపుడు
నిలిచి పెద్దమాదేవి నిజగుణ్ణమునకు
దండంబు పెట్టి ప్రదక్షిణము తిరిగి
బండారు కుంకుమబరిణ అక్షింతలు
పువ్వులు కర్పూరం పునుకవిభూతి
మవ్వపు గంబూర మరి ఫలంబులును
వన్నెగల నెమలిపురి విసనకర్రలును
పన్నీరు దొంతులు ప్రబలు దీపములు
అలరుచు ఇవి మొదలైన వస్తువుల
కొలతింతయును లేక గుండంబు మీద
కరుణతో భక్తుండు కానుకబెట్టె
పెద్దమాదేవుల పేరు వచియించి
తద్దయు పేరంటాళ్ళకు తా
పంచిపెట్టె
పిమ్మట భక్తు''డో పెద్దమాదేవి
ఈ కాటమరాజు ఈ పాపనూక
మావారలయిన నా మాటనిజమయిన
భూవరుండగు గంగభూనాయకునకు
కాటమరాజునకు కడమ రాజులకు
మేటియగు ప్రజలకు మిగుల
దొరలకును
ప్రత్యయంబగు విధము పాలించు''
మనుచు
సత్యంబు చెప్పుమని శంఖు నాదించె
ఆ శంఖనాదాల కవుడు చెలరేగి
వాసిగ నచ్చోట వారెల్ల జూడ
ప్రభగల గుణ్ణముపై నొప్పుమీర
గుభగుభ యెగసెను గుగ్గిలపు పొగలు
పొగ లెగసినంతలో పొంగి కలునంది
యుగ మెరుంగగ ఖణెల్మని రంకె
వైచె
మెరసి యాకాశమున మేఘాలు
ఉరిమె
వరుస తిన్నని మంచి వాయువులు
విసరె
పూసిన సంపెంగ పొన్న తరువులును
కాసిన మామిళ్ల కలసి పెనగూడె
పలుమారు వృక్షాల పైనుండి మరియు
కలకల పక్షులు కలియంగ బలికె
పలికిన విని జూచి ప్రజలెల్ల మెచ్చి
పలికిరి గంగభూపాలు డావేళ
మదిలోన సంతోషమానసుం డగుచు
"చేరి పెద్దమాదేవి చెప్పినయట్లు

కలునంది పలికెను గగనంబు ఉరిమె
వలనొప్ప చల్లని వాయువులు విసరె
కూడెను వృక్షాల పక్షులు పలికె
ఈడేరె నిపుడు మాయిద్దరి సందు''
అని యందరు భక్తుని అపుడు
గొనియాడి
తన నగరి కందరితొ తాను
యాదవుల
వినయాన గొనిపోయి విడిది గావించి

## కాటమరాజు గంగురాజుబిరుదులను స్వీకరించుట

జననాథు డప్పుడు జనులెల్ల మెచ్చ
తనవారి కందరకు తగ బాంధవులకు
ఘనమైన రత్నాల కానుకల నిచ్చి
తన సత్యమెంతయు తప్పక రాజు
ధనధాన్యములును రత్నాల హారములు
మదగజములు తేజీలు మంచి
అందలాలు
మొదలైన వస్తువులు మోదంబుతోను
బలువుగాని వొక్క భాగమీడేర్చి
చలమున తన యింటి సకల
బిరుదులును
ఒప్పుగా గొనితెచ్చి ఒకపాలు చేసి
అప్పుడు వివరించె ఆ గంగరాజు
కాటమరాజుతో గ్రక్కున ననియె:
''మేటిరాజుల గొట్టి మెలకువగ బట్టి
బిరుదుశ్రీ తెచ్చిన బిరుదుల పోగు
వరుసతో నా యింటి వస్తువులెల్ల
ఇరవుగా నొక పోగు పోయించినాడ
ఈ రెంటిలోపల నీ కిష్టమైనది
ఎలమితో ఒకపోగు ఎంచుకొమ్మ''నిన
అపుడు కాటమరాజు హర్షంబుతోడ
హృదయమున బిరుదులకు ఉద్ది
యేదనుచు
తన యన్న భక్తుని తప్పక చూచె
చూచిన భక్తుండు చూపులో తెలిసి
తమ్ముని మనసెరిగి తా నిట్లు పలికె
''ఎమ్మెతో ధనములు ఎవరికి లేవు
సరిగావు బిరుదులకు సకల వస్తువులు
వరుస బిరుదులు హెచ్చు వస్తు
వులకన్న
సాని గడియించదా సకల వస్తువులు
పూని ఈ బిరుదులు పుచ్చుకొమ్మ''నిన
''నా మదిని గలయట్లె నా యన్న
పలికె''

అనుచు కాటమరాజు అగ్గలంబైన
బిరుదులు చేకొనియె భీకరంబుగను
చేకొన్న బిరుదులు చెల్లించగలడు
కాటమరాజని గంగభూవిభుడు
మాటమాత్రము లోన మరి బిరుదు
ఒసగి
కాటమరాజును కౌగిట జేర్చి
వరుస పేరెన్నికగు వస్తువుల నిచ్చి
నవరత్న కలితమైనట్టి సొమ్ములును
పాపనూకకు చాల భక్తితో నొసగి
పల్లకీ ఎక్కించి పాపనూక నొగి
పనిచిన కనక బ్రేపల్లె కేతెంచి
పయనంబు గమ్మని బంధువుల కెల్ల
చెప్పించె అంతట చెవులగోపనకు
చెవుల పావడాలు చిన్నబోకుండ
పిలిపించి భక్తుండు ప్రియముతో
బలికె
"మనమిద్దరము గూడ మసల
కెలమంచి
కదలి పోవలెను ఇక్కడ నుండనేల
పైనంబు గండి మీ పడుచులు మీరు''
అని భక్తుడాడిన ఆ మాటలకును
విని వారు పలికిరి వివరించి తెలియ:
"విను మొదల పెద్దభూవిభుని
కలహమున
ఘర్షించి రాజుల ఏపణగించి

సొరిది కైలాసము చూరగొనునాడు
ఎదిరిన అతని కడ్డ ఎదురున పడక
తెగువలన్నియు మాని తిరిగి
చనుదెంచి
కలహము మా వడిగలతనము కెల్ల
అపకీర్తి చేసితిమి హాని బొందితిమి
తలయెత్త జాలక తలిగున్న మమ్మ
దైవవశంబున తలవవలెననిన
పెద్దమాదేవులు ప్రియము పోనాడి
కూడనడకతో మమ్మ కొదవ
పోనాడె
ఆడిన తలవంచి అపుడు బాసితిమి
పాసినవారము బంధువుల నడుమ
వాసివన్నెయు దరిగి వసుధ
లోపలను
మీలోన తలయెత్తి మెలగెద మెట్లు
మేము ఎక్కడనున్న మీవార మనుచు
మామీద దయయుంచి మమ్మ
రక్షించు
మాతప్పు లేమయిన మది తలపవలదు
ఘాతుకులము గాము కరుణించు''
మనుచు
అని తెగనాడిన ఆ చెవులవారి
మాటలకెల్లను మరి విచారించి
రాకుండ నిలిపి సరగున వారికిని
కరుణించి భక్తుండు కట్నంబు లిచ్చి

చెవులవారిని నుంచి జయ
ముహూర్తమున
పయనమై కనకరేపల్లె దిగనాడి
కదలిరి యాదవులు కాటమరాజు
మొదలైన వల్లపముగుద లందరును
గొడుగులు మొదలైన గొప్ప
టెక్కెములు
తుడుములు తప్పెట్లు తోరమై చెలగ
ఎడలేక రణభేరి ఏకమై మ్రోవ
వడి నేడు భేరీలు వాద్యములతోను
ఉక్కుగోరును పెద్ద ఉసురు
గాలంబు
వెక్కసంబుగ బండి వీర కొడవలిని
రట్టడి ఘనవీర రాయరంపంబు
గట్టిగా కానుక కత్తులబోను
గరిమనవి మొదలైన ఘనవీర
రాయ
బిరుదులు బట్టించి భీకరంబునను
బలిమితో దిక్కులు పగల
నార్చుచును
కోలాహలంబుగా కొమ్ము లూదుచును
చక్కని ఈటెలు సవరాల విండ్లు
ఒక్కమోపున ద్రిప్పుచు ఒగి
నేగుదెంచి
పట్టుచు గట్టుచు పంతమీడేరి

త్రుళ్లుచు నట్టువలు ద్రొక్కుచు
మరియు
పల్లవు లీభంగి వరుసతో గొలువ
కాటమరాజు శ్రీకరమూర్తి యగుచు
తేటతో కలియుగ దేవేంద్రు డనగ
చతురుడై నడువంగ సభయెల్ల జూచి
బల్లిదుడు గంగభూపతి ఎరుకలేక
కల్యాణపురమందు గల రాజులెల్ల
ఏకమైన బిరుదులన్నియు నితడు
చేకొని పోవంగ చెల్లునా యనుచు
తమ సత్తువెరుగక తామసంబునను
అమరిన మన బిరుదు లన్నియు
దొరలు
విడిపింతుమని కూడి వెయివేలు కదిసి
ఆయుధాలు త్రిప్పుచు అపుడు
రా జూచి
మేటి రాజులతోడి మేదినిమీద
కోటి మూకలనెల్ల గూల్చెద ననుచు
పంతాన కాటభూపాల నాయకుడు
పోటునకు నిలచిన పొగడి భక్తుండు
తమ్మని గనుగొని తా నిట్లు బలికె:
''ఎమ్మెతో నీకెదు రెవ్వరున్నారు
వారు మనను చూడ వచ్చినవారు
కోరి వీరులమీద కోపంబు తగదు
పద''మని తన కక్షపాల వీభూది

కదలి పొందనివేసె గజిబిజి దగిలి
రాజులు తమ పరాక్రమములు విడచి
జేజేలు పెట్టుచు చెలగి పోట్లాడ
చేతులాడగ తిరిగి జేజేకులగుచు
భీతిని పొందిరి పృథివిపతులెల్ల
అపుడు యాచవులెల్ల అద్భుతంబంది
కృపచేత భక్తుని కొనియాడు
కొనుచు
గ్రామాలు నడవలు గండశైలములు

## భక్తిరన్న కాటమరాజు పాపనూకలతో యలమంచి చేరుట

శ్రీమంతులై గడచి సిరిగల ఊళ్ళు
కొనియాడి ఎలమంచి గొబ్బున వచ్చి
చండపరాక్రములు చదురు
మామిడులు
గల తోటలోపల కడు వేగ దిగిరి
ఎలమితోడ గుడార్లు ఎవరెవరి వరుస
ఎరిగి వల్లవులరాజు ఎత్తించసాగె
గొప్పయిన గూడార్ల-పసిడి- కుండ
లెత్తించి
అప్పుడు తనవారిని అందముగ నిలిపి
సరగున భక్తుండు సంతోషమునను
తన తమ్ముడైన ఐతమరాజునకును
ఒనర నెరిగించుమని ఒక దూతనంపె
అతడు పురమున కేగి అయిత
భూపతికి
హరిగురువు మొదలైన యాచవులకెల్ల
చేతులు మొగడువు చేసి ఇట్లనియె
"మీ యన్న భక్తుండు మెరసి
కల్యాణ
పట్టణంబున కేగి ప్రజలు మెచ్చగను
పట్టుబడి కనక వ్రేపల్లెలో నున్న
వల్లవాధిపులకు వరుస నందరికి
వల్లపాధిప కాట వసుధేశ్వరునకు
పల్లవపాణియగు పాపనూకకును
గంగరాజులచేత కానుకలంది
అంపించుకొని వచ్చి అటు తోటలోన
వేడుకతో దిగి వేగాన ఇటకు
తమరు వచ్చిన వార్త దయతోడ మీకు
ఎరిగించుమన్న మీ కెరుగ జెప్పితిని''
అని విన్నపము జేయ అయితమరాజు

హరిగురువు యాదవులు అతి మోద
మునను
వచ్చిన దూతకు వాయువేగమున
సంతోషమున కట్నాలు చాల
దయచేసి
ఇంతి సిరిదేవికిని ఇల కొమరగిరికి
పంతుమీరగ నేర్పడ నన్ని చెప్పి
పురములోనికి కాట భూమీశ్వరుడిని
తోడి తెచ్చుటకునై తొడగిరందరును
పైనమై కాటభూపతి జూడగోరి
అన్నలు తమ్ములు హర్షంబుతోడ
తడవింతలేక యాదవ రాజసుతులు
గరిమతో మేన శ్రీగంధంబు పూసి
సరిపెద్ద ముత్యాల చౌకట్లు దాల్చి
బలువైన వజ్రాల పదకంబు బెట్టి
తళుకు పసిడి జిలుగు జమ
దాళములును
బెడిదపు వెలగల పెద్ద వజ్రాలు
కడియాలు ధరియించి- వీర-
కంకణంబులును
గరిమతో పచ్చల కట్టుంగరములు
మెరుగు బంగరు కుప్పె పెద్ద కటార్లు
కరముల ధరియించి కడకతో మించి

వరవుతో మిక్కిలి పురమత్తు తోను
సజ్జుతో మిక్కిలి సవరించిరంత
తులసిపూసల పేర్లు తోరణంబులును
కలికి తిరుమణి మంచి కావిదోవతులు
చేత బెత్తపుకోలలు- చెవుల తులిచెంట్లు
నీతిబుద్ధియు మంచి నిర్మల జ్ఞాన
మారూఢి రూపుగొన్నట్టి చందాన
హరుషించి ముందర హరిగురువు రాగ
చనుదెంచి రందరు క్షణములమీద
కొనపోగి మేల్పట్టు గొడుగుల నీడ
తెలివిగా కొందరు తేజీల నెక్కి
మరిమరి బిరుదు సామంతు లిరుగడల
వీరనాయకు లిట్లు విరివి చేకొనియు
గొనకొని మిగుల గోసంగులు కొలువ
బలువైన మేఘ డంబరములతోడ
విరివిగా జనుదెంచి వీర నాయకులు
కొమ్ములు తప్పెట్లు కూడినడుచుచును
ఇమ్ముల మ్రోవంగ ఏకమై కదలి
పొడవికొని చనుదెంచ—కాట—భూపతి
చూచి
మదిలోన హర్షించి మరిభక్తుగాంచి
"ఈ వచ్చువారలు ఎవ్వ"రని యడిగె:

# భక్తిరన్న కాటమరాజుకు బంధువుల పరిచయము చేయుట

కరమర్థితో నపుడు కాటభూపతికి
గురుతుగా జూపి భక్తుండిట్లు తెలిపె
"వీరు మన యదువంశ వీరవిక్రములు
ఆర్యులు నెను జూడ హర్షంబుతోడ
వచ్చిరి కనుగొను వరుస చెప్పెదను.
ఎంచిన కడకతో యాదవులకెల్ల
గురువితడు మనకును గురుతైన
మంత్రి
పల్లికొండమవాడు పరమ సుజ్ఞాని
అతని సరసనె వచ్చు అమరేంద్ర
భోగి
లతడు యాదవభర్త అయితమరాజు
కల్లరి వైరులకు కంటిలో నెరసు
చల్లభూపతి సుతుడు సమర
విక్రముడు
తరచుగ నలుగురు తమ్ములు కొలువ
బిరుదు వడిగలవాడు పిన్నమనేడు
పరగ సింహాద్రి భూపాలుని సుతుడు
కరమర్థితో పసిడి వింజామరములు
కలిగిన యాతడు కరియావులరాజు
రఘుణతో యెరనూకరాజు సుతుండు
ప్రమతిందు గొడుగుల పడిగెలతోడ
అతడె భట్టావుల– వల్లభుండు
అనుచుమ్మిరాజు
అతని దాపున వచ్చు అయితపడివాడు
కోరి మీ మేనత్త కొమరగిరిసుతుడు
భూరి విక్రమశాలి పుత్తమరాజు"
అని చెప్పి మరిచూపి అపు డిట్టు
లనియె:
"పొసగ పువ్వులపిన్న బొడ్డు
గంటలును
సొమ్ములు పట్టుగొడుగులు జుమ
జుమలతోను
కొమ్ముల బంగారు కుప్పెలతోను
ముత్యాల చేరులు ముదముతో దాల్చి
ఏడిక పొట్టేళ్ళ నెక్కి వేగముగ వచ్చు
వారి జెప్పెద విను వల్లవులరాజ
ఘనమైన పోలురాజు కడగొట్టు
సుతుడు
జననాథుడు ముమ్మయ్య చల్లమనేడు
తనయుడు ఎర్రయ్య ధర్మవర్తనుడు

నలనూక భూపతి నందనుం డతడు
ఎలమితో పెయ్యల ఎర్రియ్య ఇతఁడు
సిరిగల సింహాద్రిభూపతి కూతురు
కొనియాడు చిటినూక కొడుకు
పోచయ్య

కల్లందుల పోలినేని గారాబు సుతుడు
అతడు మీ ప్రియమైన మేనల్లుడతడు
చూచితివా" యని సౌరిది నంతటను
"రావర్క్కమున నధిరాజులు పొగడ
గోసంగులై పుట్టి గొబ్బున వినుమ'

x x x x x

[ఇక్కడ కొంత గ్రంథము నష్టమైనది]

## గంగా కాటమరాజుల వివాహ ప్రయత్నము

''శీతాంశు వదనమాల చెలియ గంగమ్మ
కాటమరాజుకై కలిగిన కాంత
పాటించి నాకులము భాగ్య మింతాయె
నేను చేసిన భాగ్య మెవరికి గలదు
పూని కల్యాణ మిప్పుడె చేయు"డనిన
చాల సంతోషించి సకల బంధువులు
తాలిమితో విప్రుల తగవేగ బిలిచి
ప్రేమతో కాటభూపాలుని పేర
కొమరొప్ప నా పెండ్లికూతురుపేర
పొలుపొందుగా రాశి పొంతనముచూచి
కలుషంబు లేకుండ గ్రహ
బలము చూచి
ఒక లగ్న మీడేర్చి ఒనరించు డనిన
సకలంబు వివరించి శాస్త్రపద్ధతిని
ప్రకటించి విప్రులు బలు
ముహూర్తంబు
పొలుపొందగా మాఘ పున్నమనాఁడు

వెలయంగ నారాత్రి వేకువజాము
మంచిది ఆవేళ మకర లగ్నంబు
శుభకరమైనది శోభనముచేయ
ఉభయంబునకు మంచి ఒనరంగ ననిన
విని యాదవేంద్రులు విప్రుల బొగడి
ఘనమైన వస్తువులు కట్నంబు లిచ్చి
భూసురుల నంపించె పురము లోపలికి
వాసివన్నెయుగల వల్లవాధిపులు
అందరు చెలగుచు అచ్చోట నుంచి
పొందుగా యాదవుల పురము
చనుదెంచి
సౌరిది లగ్నము కెదురు చూచు
చుండగను
పురము లోపలనున్న పొలతు
లందరును
కాటభూపతి జూడ కడు వేగమునను
నీటుగా సిరిదేవి నెలత అగుమంచి

కొమరగిరి మొదలైన గోపకాంతలును
అలరుచు పల్లకి లందలా లెక్కి
కడిమితో పల్లకీలు కడువేగ రాగ
ఘనముగా చనుదెంచి కాంతలందరును
అందలాలు పల్లకీ లతివేగ దిగిరి
కనుగొని రందరు కాటభూపతిని
కాటభూపతి చూచి కరుణతో లేచి
మగువల నెల్లను మరియు మన్నించి
తగవెరిగి అత్త పినతల్లులకు మ్రొక్కె,
మ్రొక్కిన గనుగొని ముదిత సిరిదేవి
అక్కకొడుకును ప్రియమున
అక్కున జేర్చి
గక్కున దీవించి గరిత యిట్లనియె:
"చెన్ను మీరగ నీదు క్షేమంబు మాకు
తంపోచ చేసి మీ తాతముత్తవలు
పల్లవుల వలురాజు వల్లాంబికయును
తెలిసికొమ్మని రాజును తెలివి మీరంగ
పొలుపొందు వజ్రాంగి పొందదు
నిజము
పుట్టిన పూర్వపు భూములు విడచి
ఎట్టడికి వస్తిమి ఏమి నీకొరకు
వచ్చిన మా పుణ్యవశమున నిన్ను
కన్నులు చల్లంగ కనుగొంటి మిపుడు
వంశంబు రక్షింప వలసి యా కృష్ణ
అంశగలవాడ'' అని అపుడు సిరిదేవి
భాషించి యాప్లైన "పాపనూకెచట
ఉన్నది'' యని దాది అన్నమ్మ నడుగ
తడయక ఆవేళ తోడుకొని వచ్చి
కోరి సిరిదేవితో గొబ్బున ననియె:
"చెలియ కాటమరాజు చెల్లెలికొమ్మ
తరుణి పెందోట ముద్దమ్మ నగరునను
ఈడేర్చి పెంచితి వింతగానేను"
అని తెల్పి అందించె ఆ పాపనూకను
అప్పుడు సిరిదేవికి అత్త కొమరగిరికి
మ్రొక్కిన దీవించి ముచ్చట పడిరి
గ్రుచ్చి కౌగిట జేర్చికొని ముద్దులాడి
పాపనూకతో ఇట్లు పలికె సిరిదేవి:
'సుదతిరో తొల్లికృష్ణుడు దుర్గయున్న
వదలక యాదవ వంశంబునందు
అలివేణి జన్మించినట్లు మీరిద్దరు
పొలుపొంద మా కులము పుట్టితిరి నేడు
అతివరో నీనుండి మీ యన్ననుండి
కలిమి యాదవకులము కడతేరు నింక''
అని అనాగత మెరిగి అపుడు
భాషించె
అంతట కాంతలు ఆ రాజును చూచి
సంతోషచిత్తులై సతులును తాము
"చక్కదనమున పుష్యచంద్రునిబోలు
ఎక్కువకీర్తిచే ఇల చంద్రుడితడు
ఏరాజులైన ఇతని సాటిరారు
ఈ రాజు గంగకు ఈడు జోడవును
గారవంబున నితడు గంగకు సాటి

కాకుంటె కూర్చునా కమలసంభవుడు"
అన విని అందరు ఆశ్చర్యపడిరి.
సతు లందలము లెక్కి సంతోషమునకు
అంతట నలనన్న ఆత్మననుకొనియె
"పరులకై వైరుల పంతంబు లణచి
ధరణిపై పడియున్న తమ తండ్రిని
వెదుక
పోతిని రణరంగ భూమిమీదికిని
గాయాల నెత్తురు గారు పీనుగల
పొర్లించు ఢాకినీ భూతాల చెరిమి
కొరివి భూతాలను కొట్టి భయపెట్టి
భేతాళుల నదలించి బెదరు పుట్టించి
భీతిల్లక యేడు కుంభినులంత వెదకి
కలను గాచిన భద్రకాళితో గడచి
వాదించి గెల్చిన వాటి నన్నిటిని
సతమతము చేసిరి సతులెల్లగూడి
ఇది కారణము లేక ఏల పలికెదరు!
అది జాత మిప్పుడు అన నేటి"కనుచు
మురుపక యా మాట మది నుంచు
కొనియె
మరి యంతలో మాఘ మాస
మరుదెంచ
అరుషించి పెండ్లికి ఆయత్త పడిరి
సరవితో వీథుల చక్కంగ
శృంగారించిరి
అరయ సంతట తోరణంబులు గట్టి
చీట సంతట పెద్దవీథుల నెల్ల
వెలయ కాటమరాజు వీథులదాక
ఘనమైన బిరుదులు వేగమున నెత్తించి
తరుచుగా పట్టుసంజ్యాలు కట్టించి

## గంగ అలంకరణ

వరుస నంతట మల్లవారి గంగకును
సరసిజాక్షులు వేగ సవరింప దలచి
రాజిత రత్నాభరణములు పెట్టి
కురులు నున్నగ దువ్వి కొప్పు
గదియించి
చేర్చుక్క నిడి పట్టుచీరెయు గట్టి
ధరణిపై బూసిన ధంగేషు రీతి
ఇంపుగా కై సేసి రింతు లందరును.
కుసుమగంధికి పెండ్లికూతురు కపుడు
పొలుపొందు నవరత్న భూషణంబులను
అలివేణి లుంచిరి అరుషంబుతోడ
రమణికి పీతాంబరంబు గట్టించి
అమర శృంగారించి రతివ లందరును
కొమరొప్ప ఆ పెండ్లికూతురు నపుడు

పల్లకీ యెక్కించి పణతు లందరును
గరిమతో సిరిదేవి కరియావుల నాగ
నైరె వల్లభన్నసూర, నేతివారి పోత,
చల్లవారి కోడంద్రుడు సరగ నేగురును
అందముగ కొమరగిరి అతి
వేడ్కతోను
పందుముల యరణప్ప, పణతి
అగుమంచి
మరియు పన్నిద్దరు మల్లుల సతులు
పరువడి యాదవులు పల్లకీ లెక్కి
తెగువ కొందరు పెద్ద తేజీల నెక్కి
దొరలెల్ల పెండ్లికూతురును తోడుకొని
తెచ్చి
భేరీలు మ్రోవంగ పెండ్లరుగుమీద
ఎలమితో దంపతుల నిద్దరిని ఉంచి
అపుడు విప్రులు లగ్నహవనంబు చేయ
ఘనముగా లగ్నాష్టకంబులు చదువ
మరువక శాస్త్ర క్రమంబులు నడిపి

## కాటమరాజుకు గంగ పండ్రెండు హస్తములతో దర్శనమిచ్చుట

పరువడి తలంబ్రాలు పళ్ళేల నపుడు
ఇరుగడల బట్టిన ఎలమి దంపతులు
తలంబ్రాల దోసిళ్ళ తడబాటుగాక
సలవంద నప్పుడు నలనన్న చేతి
తలంబ్రాలు దోసెడు తరుణితలమీద
చెలువార బోసిన శ్రీకరంబుగను
వెలదికి నడిజూడ వీరసేసాయె
వెలది తనచేతి ప్రాలు విభుని
శిరసుననను
ఎత్తిన యప్పుడే విభ జెయమనగ
ఎత్తెను పన్నెండు హస్తాలతోడ
కనిపించె నందరి కండ్లకు జూడ
కనిపించి నప్పుడు కాటమరాజు
చూచి వెరగంది యచ్చోట దలపోసి

## కాటమరాజు గంగను గుర్తించుట

"అలనాడు రణభూమి వెదికేటివేళ
కలనిలో ఆ రాత్రి గదిసినను గూడి
వాదించినట్టి యా వనిత గాబోలు
ఆ రణములో నప్పుడనుకొన్న మాట
నేడు నిజమాయెనని నిలచె నీ దుర్గ"
మదిలోన నీమె తన మాతయని తలచి
"ఇప్పుడు గట్టిన చేతి ఈ కంకణంబు
కడు విప్పనిక ప్రత్యూకాల మున్నాది"
అని తన మనసులో నపుడు తెగనాడి
దొరకబట్టిన తలంబ్రాలు దోసిలిబ్రేళ్ళ
చెదరక మ్రొక్కగా చేకొను మనుచు
పూజ పుష్పములుగా పోసె తలంబ్రాలు
గరిమ నంతట చేయగల పెండ్లిపనులు
అన్నియు చేకూర్చె నట తేర్చి మరియు
పిన్నలు పెద్దలు పృథివీశ వరులు
తలంబ్రాల నప్పుడు తరుణిపై పోయ
పొలుపొందు పన్నెండు భుజములం
తోను
వికృత ముగతలమీద వీరజడతోను
కనపడి యందరి కనులకు జూపె
కనపడగా వీరగంగ పేరిడిరి
పేరిడి యంతట పెండ్లికట్నాలు
ఘనమైన విప్రులకు గాయకర్చులును
కనక వసంతంబు గావించి మరియు
సువతీమణుల కిచ్చి చుట్టాల కిచ్చి
అడిగి అడుగని వారికందరకు నిచ్చి
అందరి దీవెనల నందిరి వేగ
తగ పెండ్లి ఈ రీతి ధర్మమార్గమున
జగమెరుగ-కాటమరాజు—జయప్రద
ము చేసి

## కాటమరాజు పగవారిని గెలుచువరకు వీరకంకణము విప్పననుట

మరువక ఒకనాడు మంచి దినమునను
విరివిగా కంకణము విడువ వచ్చినను
ఎరిగి కాటమరాజు ఇట్లని పలికె:
"కట్టిన ఈ వీరకంకణంబునను
నెట్టున విడువంగ నిది వేళగాదు
ఇటు చూచిన బిరుదు విడుచుటగదవే
సరఘితో పెండ్లియన సంతోషమెంతో

ఎంత దూరమైనగాని సంతో
షము నాకు
కదసి వైరులబట్టి కడతేరగొట్ట
కట్టితి ఈ వీరకంకణంబిపుడు
పగతుల సాధించి ప్రత్యాకాలమున
జగమెరుగ విడచెద సరగ కంకణము'
అని యిట్లు పలికిన అతని
పలుకులకు
అలరచు యాదవులు అతి సంతోష
పడిరి
కొన్నాళ్ళు గడచెను కొంతకాలంబు

అంతట నొకనాడు హర్షంబుతోడ
మరియును యాదవ మంత్రి
వరులును
ఎలమి పురోహితులు ఇతర
బంధువులు
బ్రాహ్మలు దీవింప భట్లు పొగడగను
నటులు గాయకులును నాయకోత్తములు
తనచుట్టు కొలువ నయితమ
రాజు నిండు
కొలువున కూర్చున్న గోపాలవరులు

## కాటమరాజును ఆవులమందకు పట్టము కట్టవలెనని పల్లికొండ ప్రతిపాదించుట

అందరు వినుడని ఆ పల్లికొండ
"విప్రులు తెలిపిన వివర మంతయును
పాటించి కాటభూపాలుని ఆపుడు
ఆలమందలకెల్ల అధిపతిని చేయ
మేల"ని పలికిన మెచ్చిరందరును
పట్టంబు గట్టి యాపగిది చేయగను

రట్టడి యదువంశ రాచకొమాళ్ళు
ఘన పరాక్రముడైన కరియావులరాజు
బహుబలశాలి యగు భట్టావుల రాజు
నేతివారి పిన్నమనేడు మొదలైన
వరుసతో నందరు వారు చింతించి
హరిగురువును జూచి అప్పు డిట్లనిరి:

## పిన్నమనేడు మొదలగువారు పల్లికొండను ఆక్షేపించుట

''తాతముత్తాతల తరముల నుండి
మాకందరకు నీవు మంత్రివై యుండి
వన్నెగల మా యిండ్లపరుస దప్పించి
చనవున మము నెందు సెలకట్టనీక
కాటమరాజు మన కందరకు పిన్న
వారిని రాజును చేయవలెనని తలచి
తగవు లేకాడితివి ధర్మంబు గాదు
మాట మీయందున దాటమని మేము
వడిగల తనయందు వాసిగల మాట
వరుస యెంతయు లేక వల్లవులు తమరు
వరలుచున్నారని ఉర్వి లోపలను
ఆవలీవలివారు అందరు జూచి
నవ్వగా పెద్ద పిన్నంతరము లేక
పిన్నను చేపట్టి పెద్దను చేసు
పిన్న చేస్తివి మమ్ము ప్రియమింత లేక
కొసరక యాదవ కులములో నీవు
ఎరిగి ఎరుగని భంగి ఏ పనులైన
పరగంగ నీమాట పారెడి ననుచు
చెల్లని పని చేయ చెల్లునా నీకు''
అని చాల దూషింప నా పల్లికొండ
విని కటకట యని వెత కుడువసాగె:
''వీరిట్లు పలికిరి వివరింపలేక
విధివశము గానక వెర్రివారలుగా
నేరంబు నామీద నిలిచె ఏలాగు
వివరింపగా లేక వీరాడినట్లు
త్రైలోకముల వారు తప్పియాడెదరు
నిండు లోకముల నేనెట్లు మెప్పింతు
కుండమూయ మూకుడు కుదురుగా గలదు
నోరుమూయ మూకుడు లోకాన లేదు
పాయని అపకీర్తి పాప మింతయును
తరతరంబున నాకు ధాత్రిపై తొల్లి
ప్రకటమౌ ఈ రట్టు బాయుట ఎట్లు?''
అనుచు శ్రీహరి దలచి హరిగురువు అపుడు
తననింద బాయగ తా జూచిపలికె:

## పల్లికొండ బసవన్న ఇష్టమును అనుసరింత మనుట

"ఓ రాజ మీకొక్క వార్త జెప్పెదను
మీరు కాదన నేను మిము దాటి పోను
కాటమరాజు మీకన్న కడు పిన్న
సరిరాడు మీతోడ జగమెల్ల యెరుగు
నేను ఎరుగన ఏమి నేడు నావలెనె
మీరు నన్నెరుగుదురు మిమ్ము
నేనెరుగుదు
వడిగలతనమున వన్నెవాసికిని
పుడమిపై మీకన్న పోటరు లెవరు
కులగోత్రములు కావు కోరి భాగ్యములు
కలుగును తమ పూర్వకర్మవశంబు
దాని నెవరెవరికి దైవంబు నొసల
వ్రాసినంతేగాని వచ్చునా మిగుల
ఏల మీరిన్నియు ఎరిగి యుండియును
ఈలాగు అననేల ఇక నొకటి వినుడు
పశువులతో మనపాలి దైవంబు
బసవదేవుడు వచ్చి భాగ్యవశమున
ఎరిగి మీలోపల నెవ్వరికైన
పట్టము గట్ట సమ్మతమౌనె మీకు॥"
అని యిట్లు హరిగురువు ఆడు
మాటలకు
విని రాజతనయులు వేడుకపడుచు
మరి సమ్మతించిరి మందకు పోవ
సకల యాదవులంత సంతోషపడుచు
ఇంపుతో కొలువు చాలించుకొని వేగ
మరునాడు కాట భూమండలేంద్రుండు
ఇన్ని వివరంబులు ఎరుకపడ జెప్పి
మందల జూడ శ్రీమంతులై రాజు
లందరు వ్రేపల్లె కరుగవలెననుచు
కడకతో పయనంబు గమ్మని చెప్పి
తెగువతో నా రాజు దేవియైనట్టి
మర్ల వీరగంగ మగువ పాపనూక
పసిడి యందలాల పణతులు గొలువ
చెలువ మీరగ వచ్చి సిరిదేవి నగర
తరుణులనిద్దరిని తగ నప్పగించి
హర్షంబులాడుచు యాదవాధిపులు
తమ నిజమంత్రులు ధరమీద గొలువ
పుర మేలుబడి చేసి భూసురోత్తములు
ముందు శుభవాక్యములు ముదమొప్ప
చదువ
పెనగి భట్లును తమ బిరుదులు చదువ
బలసి కొందరు బారుబారులు సేయ
కలకల ధ్వనుల మూకలు చెలరేగ
బిరుదులు చదుపుచు భీకరంబుగను
గొప్పైన జగజంపు గొడుగునీడలను
కడువేగ తప్పెట్లు కంచుకొమ్ములును
ఈరీతి కొలువంగ వేగంబె కదిలిరి
మరియు కాటమరాజు మరి చల్లభూపతి

ఘనుడు అనుతమరాజు కరియావుల
రాజు
బాలమ్మయ్య పోచయ్య భట్టావుల
రాజు
మొదలైన రాజులు మోదంబుతోను
తేజీలు అందలాలు తేజమై మెరసి
వల్లవులు తిరుమందులు వారు వీరనక
బహువిధంబుల వీర పరివార జనులు
తెరగొప్ప యాదవులు తెరువైనయట్లు
వెరగొంది భూజనులు వినుతి సేయంగ
లక్షణ మంత్రులు లక్షలు గొలువ
లక్ష భూపతులైన లక్ష్యంబుగాను
అక్షోహిణీశులై యాదవాధిపులు
దక్షులై గోకులదక్షులై మెరసి
మరి యేగ యెదురుగా మందకంపటీలు
సొగసైన పన్నెల సురటీలు విసర
తలచన్న విడితోపు తలసౌతనాలు
వెండి కట్లమరిన విల్లంబులూను
ఖండించు చక్రాలు గండ్రగొడ్డండ్లు
చెక్కెములు పడిగల దేవేంద్రుని
కొలువున
గ్రక్కున వడిగల గజ్జలు మ్రోప
వల్లె తోళ్ళురవడి వంక రుమాళ్ళు
విరజాజులుమ మేన వీరగంధాలు
మెలగిన వడిబట్టి మెడ విరిచివెప్ప్య
గొధకొని వెండిగొలుసు జాగిలాలు
తరుముకొని వెనువెంట తరలి రాగాను
బలువైన మూకలు బలములు వచ్చి
ఆవేళ యదువంశ భూపాలవరులు
మరి వేగ అందరిని మన్నించి వేగ
వారు వీరందరును వడి వేగ మంద
కడువేగ ఒకచోట కనుగొని నిలిచి
కూర్మితో నచ్చోట గొల్లెనెత్తించి
గొల్లెనమీద పసిడికుండ లెత్తించి
తివాసి జముకాణాలు తెరగొప్ప పరచి
వేసిన తివాసీలమీద కూర్చుండి
పసులమందల జూచి ప్రబలిన భక్తి
బసవదేవుని పాదపద్మముల కొరగి
భూపతు లెల్లను భూరి విభవముల
గొల్లెనలోపల కొలువు కూర్చుండి
ఆ రాత్రి నిద్రించి అపుడు వేగైన
సూర్యోదయంబునను సొంపుగా లేచి
భానుబింబము జూచి బలము
అందరును
జలకంబులాడి-శుద్ధ-వస్త్రములు
ధరియించి
భూషణంబులు పెట్టిరి పుడమి
నందరును
గంధంబు కస్తూరి కలయంగ బూసిరి
రాణింప యాదవ రాచకుమాళ్లు
భక్తితో మ్రొక్కిరి బసవధాయనికి

ముమ్మారు సాగిలి మ్రొక్కి
వినుతించి
పశువుల కన్నిటికి భక్తితో మ్రొక్కి
కొసరక నందరు గొల్లెనలోన
ఎలమితో కూర్చున్న ఎల్ల యాదవులు
బలములు నిరుగడల బారులు దీర
చూడవచ్చిన ప్రజలు చుట్టు
కొనియుండ
పసులమందలొ నిలచి బసవదేవరకు
చెయ్యెత్తి మ్రొక్కుచు చేరి హరి
గురువు
"శ్రీకంఠః కరకంఠః శివపార్వతీశః
వారిజాసనవినుతః వాసవప్రణుత
చరణః చంద్రకిరీటః జగమెల్లనెరుగః
శ్రీకరః జయకరః శ్రీ బసవదేవః
చేకొను నామనవి చిత్తాన నుంచు
మొదలనే పోలురాజు మునువైరగెలువ
నడిచేటి సమయమున నను బుజ్జగించి
అలసి తన సుతులను అన్నదమ్ములను
తగవెరుగ నందర నొక తావుకు చేర్చి
ఎలమి అరవయ్యేండ్ల కిటకు జనుదెంచి
మమ్ము గలువుమన్న మహిపాలకులను
తప్పకేగురు అన్నదమ్ముల సుతుల
ఇప్పుగా నందరను ఒక ధరికి జేర్చి
ఇప్పుడు వారిలో నేరాని సురిబి
చెప్పిన పగిది నే చేయగా దలచి
కాటమరాజును కనక పశువులకు
మందల కెల్లను మరి రాజు చేయ
అందరకా మాట అరుషంబు గాక
రాజనందను లెల్ల రవ్వగా నన్ను
పోనాడ దొడగిన బొంకు గాకుండ
ఈ బాలరాజుల నిందరను గొని
నీ సన్నిధికి వస్తి నిజలింగమూర్తిః
వీరిలో నెవ్వరు యుద్ధంబులోన
పారేటి జలనిధులు పర్వతాలనక
దూరేటి పొదలనక దొడ్డ ముళ్ళనక
కరులనక పులులనక కారడవులనక
తిరిగి మీ వెనువెంట దేశదేశముల
ఎండనక వాననక ఏర్చి తెచ్చితిని
జయము మీవల్లన జపతపం బెరిగి
దయయుంచి ఆకలి దప్పిక లెరిగి
పాలు నీరును వేరుపరచిన రీతి
నీవెరుగనిది లేదు నీలకంఠుండాః
వెరవుతో నొకరిని వీరిలోపలను
వరుస మీ చిత్తంబు వచ్చినవాని
ఒనర చేపట్టుమా ఓ బసవరాయః
నానింద బాపుమా నాగభూషణుడః"

## బసవన్న కాటమరాజును ఆవులరాజుగా ఎన్నిక చేయుట

అని వేడుకొనగను హరిగురువు వేగ
విని బసవరాయుడు వేగ కరుణించి
పుడమిపై ఉప్పొంగి పురము గాదలచి
కాలుదువ్వి ఉరిమినట్లు కణీలున
రంకెవేసెను
ధరణిపై పాదంబు ధర గోరదువ్వి
అవనిపై పాదంబు అట్టిట్టు విదచి
శివమూర్తి సురలోకము చిందు
వేసాయె
చనుదెంచి జనులెల్ల సంభ్రమము పడగ
బాలరాజుల నెల్ల పాలించి చూచి
నలనన్నను గనుగొని నాగభూషణుడు
అతని గాంభీర్యము అతని ధైర్యంబు
ఆతని భుజబలము అతని సాహసము
సూర్యకాంతి మోదమున సురలోక
మందు
బసవన్న వాపని బలిమికి మెచ్చి
మందల సదపించి మన్నించినాడు
మంద వైరుల భ్రమించి మద సుడగించి
కాచుకోగలవాడు గణముల నెల్ల
ఇచ్చగా భువిమేప పెదె దగ పదుచు
పాటించి వాకిలోపల మున్ముందుగనుచు

కాటమరాజును కరుణతో జూచి
వసపాద మాతని తలమీద నుంచి
నిలచున్న హరిగురువు నెరి నతని
శిరసు
తాగట్టుకోగను ధరణీశు తలకు
బాగొప్పగా నపుడు బసువపాదములు
తగ లంకెగా జుట్టి తత్తరపడక
బాలరాజుల జూచి పలికె నొక మాట
"ఓ రాజసుతులార ! ఓ అయ్యలార!
హరనాపలిరి బలపక్షము నన్ను
కంటిరా మీ మనసు కడమ గాకుండ
వింటిరా నా మాట విను బాలులార !
మానుడికనైన మీ మనసులో కొదువ
మీకు ఉందిన మీరు మరె యనకుండ
నేటికి కొదవలన్నిటి వెళ్ళనాడి
కల కొదవలెల్లను కడతీర్చుకొనుడు
పోరు మీలో లేక పులియైన యట్లు
వసుధలో నానింద వాసియుండియును"
అనుచు తెలియగనాడె హరిగురువు
అపుడు
చల్ల పిన్నమనేను చతురుడై పలికె:

# కాటమరాజు శ్రీకృష్ణుని తమకముపై కూర్చుండదగునని పిన్నమ నేడు సూచించుట

"బసవదేవుడు మనకు ప్రత్యక్షవేల్పు
తోడాయె మనకు భక్తుండు శివమూర్తి
మొదటనే శ్రీవిష్ణుమూర్తివి నీవు
తెలియరానివి మీకు తెలుసు ముగ్గురికి
తెలియును మీకన్ని తెలియవు మాకు
మాకు పతి తెలియదు మరియొకటి
గలదు
కోపగించక పల్లికొండ గొబ్బున వినుమ
మనయింట గలదిపుడు మంచి
తమకంబు
అది తొల్లి కృష్ణుండు అవనికి దెచ్చె
అతడొక్కడేగాని ఆ తమకమెక్క
ఎలమి నింకెవ్వరు ఎక్కినది లేదు.
వినుడు కాటమరాజు విష్ణ్వంశవాడు
అని చెప్పితివి గాన అయిన నాతనికి
సౌరిది తమకమెక్క చోద్యంబు గాదు
తమకముపైన నందరు జూడగాను
ఇచ్చట కాటమరాజు నెక్కించితేను
ప్రచరించు నాతడే ప్రభువని మాకు
పెద్దల మందరము పిన్నవాడనక
హద్దుగా నెలమితో నందరము
మ్రొక్కి
కొలచి యాతని మాటకొలది
దిరిగెదము"
అనుచు నీరీతి పిన్నమనేడు పలుక
విని యాదవేంద్రులు విని సకలజనులు
సంతోషచిత్తులై సకల యాదవులు:
"ఇంత ముందరియెత్తు ఎఱిగినయట్టి
పందుముల యా రఘుపతి పల్లికొండ
ఇది యెంతపని తమక మెక్కించ
గలడు
బలువైన వాడతడు పల్లికొండనగా"
అప్పుడు యాదవులు ఆ బాలరాజు
లందరు తెప్పించు మనిరి తమకంబు
పల్లికొండప్పుడు బలవంతులైన
సమరవిక్రముల గోసంగుల బిలచి
చెలువైన బోడావుల చెన్నయ్యను
బిలచి :
"పయనమై నీవు మన పట్నానికరిగి
ఇచ్చట బుట్టిన ఇన్ని వివరములు
హెచ్చుగా సిరిదేవి కిన్నియు జెప్పి
తమకంబు గొనిరమ్ము తడవుచేయకను
పొ''మ్మని యంపిన బోడావుల చెన్న

మూడువేల గోసంగులు ముద మొప్ప
నంత
కూడుకొని తనవెంట కొలచి రాగాను
ఆపొద్దు పట్నాని కరిగె చెన్నుండు
ఇన్ని మాటలు సిరిదేవి కెరిగించి
యపుడు
తా దిరిగి వెళ్ళెదను తమక మిమ్మనెను
దయచేయుమన్నను తరుణి సిరిదేవి
ఘనవీర తమకంబు కడువేగ దెచ్చి
గవిసెనలు విప్పించి కడు వేగమునను
పులికాపు చేయించి పూజ బూజించి
దివ్యతరముగ ధూపదీపాల నిచ్చి
నైవేద్యములు బెట్టి నగరెల్ల నంపి
బాజా భజంత్రీలు బలుపడి మ్రోవ
గుబ్బటిల్లగ గొప్ప కుంభాలు పోసి
కోర్కెతో దామెర గొర్ల గోయించి
బలిజల్లి తమకంబు బండియెక్కించి
సరవి పట్టుగొ సెనలు పరగ
మూయించి
సిరిదేవి బోడావుల చెన్నుతో ననియె
"అరుషంబుతో తమక మప్పగించినను
ప్రాణభయంబుగా బండి యిరుగడల
రాణింపుగా నడిచి రాజుసన్నిధికి
చోరులకు తెలియగ చూడరాకుండ
వైరుల కనువైన వైపు గాకుండ
కనుకలిగి మార్గమున కదలి
పొ"మ్మనెను
గొనకొని తమకంబు గొబ్బున దెచ్చి
మరివేగ యాదవుల ముందర నిలిపె.
నిలిపిన యాదవులు నేర్పుతో పొగడి
గురుతైన యాదవ కులమువారెల్ల
ఉరవడి బండిపై నున్న తమకంబు
సరగున గవిసెనలు చయ్యన దీసి
ధరమీద కుదురుగా తమకంబు దించి
కాటమరాజుతో గ్రక్కున ననిరి:

## తమకము చరిత్ర

"మేటి యా తమకంబు మించి
సురరాజు
పీటనుండగ తొల్లి వెలయ కృష్ణుండు
పారిజాతము సత్యభామ తెమ్మనెను.
వారిజనాభుడా వనితపై ప్రేమ
గలవాడు గనుక స్వర్గము చూరబట్టి
చలపట్టి దేవతా సార్వభౌముండు
పాకారి నోడించి పారిజాతకము

చేకొన వినతుడై చేరి సురరాజు
ఆదివేల్పు కృష్ణుడని సురలు తాను
పాదంబులకు మ్రొక్కి పరగ నీగద్దె
సూడిదగా నిచ్చె సురరాజు మొదలు
వాడించి ఈ గద్దె వసుదేవసుతుడు
ద్వాపరయుగమందు తా నెక్కినాడు
హేరాళముగ కృష్ణు డెక్కిన వెనుక
దీని భుజయంత్రము దేవరవలెను
ఎన్నడైన మరి మెవ్వరెక్కినది లేదు
ఎక్క నెవ్వరితరము ఇది నీకుదక్క
ఎక్కుమా శ్రీకృష్ణు డెక్కినరీతి
పాడియు పంతంబు పరాక్రమంబు
ఈడేరె మరి యేల ఎక్కు తమకంబు
తమక మెక్కిన ముహూర్తంబు తా
నిలుచు
తాతతండ్రుల పగలు తగ దీర్చగలవు
వైరుల తెగటార్చి వరద పుచ్చెదవు
పెంపుతో నీకీర్తి పృథివిపై వెలయు''
అని యాదవోత్తములు ఆత్మవర్గంబు
అన పల్లికొండ నలనన్నకు చెప్పి
సరగున తమకంబు సజ్జు చేయించి
పరువడి తమకంబు పరపు గావించి
మునుకొని ముత్యాల ముగ్గులమరించి
నవరత్న ఖచితమైనట్టి తమకంబు
సవరించి తెచ్చి యా సదురుపై నిలిపి
హరిగురువు రాజుతో అపుడిట్లగనియె

''వినవయ్యా తమకంబు ఇది
మూర్తబలము
ఎడసేయక తమక మెక్కు''మని
పలికె
తడబడక కాట వసుధాధిపు డపుడు
గౌతమీ నదిలోన ఘనతీర్థమాడి
ఎసగ శుద్ధవస్త్రము లేర్పడగట్టి
ఒడలెల్ల భూషణము లొనర ధరియించి
చెలువుగ మేనున శ్రీగంధ మలది
తలదిరుగ పువ్వుల దండలు గట్టి
పరుసగా భూసురవరుల పూజించి
భూది దశదానములు సొరిది నిప్పించి
గురుతెరిగి పదివేల గోవులిప్పించి
వనితలకు భూసురులకు వారుపీరనక
కనక వసంతంబుగను పంచిపెట్టి
ఫణిభూషణుండైన బసవదేవరను
ప్రణుతించి మరి చాల భక్తితో మ్రొక్కి
బంధువులు బ్రాహ్మలకు భక్తితో
మ్రొక్కి
సరగ హరిగురువునకు సాష్టాంగ
మ్రొక్కి
నయమున ప్రేమతో నందరకు
మ్రొక్కి
ఆవేళ నలనన్న అపుడిట్లగనియె:
'ప్రియమున మీకంటె పిన్నవాడను నేను
వయసున గుణమున వడిగలతనమున్న

బిగువుగా నాకన్న పెద్దలు మీరు
తగవుగా మీరెక్క దగుసు తమకంబు
మిమ్ము గాదని తమక మెక్కంగరాదు
సమ్మతమా మీకు సత్యముగాను'
అన విని యందరా నలనన్న మాట
ఘనుడు పిన్నమనేడు కరియావులరాజు
అయితమరాజు మొదలైన ఆ బాల
రాజులు
భూతలంబున జనులు పొగడ
నిట్లనిరి:
"విను కాట భూపాల వీరప్రతాప
పెనుగాడ మాకు మీకు భేదంబు లేదు
పరువడి మా మనసు పట్ట నాడితివి
వరుస మాకును నీకు భేదంబు లేదు''
భూమాడి పొలినేడు బుద్ధిమంతుండు
గురుతుగా నాతని గొనియాడి తెచ్చి
సరది కాటమరాజు సముఖాన నిలిపి
హరిగురువు రాజుతో అపు డిట్లగనియె:
'ఎరుగుదువు సకలంబు ఎరుగుదువు
నీవు
ఘనుడ నీవెరుగని ఘనబుద్ధి లేదు
వినుమ నీకొక మాట విన్నవించెదను
జననాథునికి బుద్ధి చాల గలిగినను
ఒనరంగ నీకు మంత్రి ఒకడుండవలెను
చేరి రాజును మంద చనుదెంచిన వెనుక
ఈ రెండు మనసులు మళ్లించేటందుకు
పొలినేడనువాడు బుద్ధిమంతుండు
పనిపడి ఇతని చేపట్టుకొని ప్రేలు'
అని అతని జూపిన ఆ కాటమరాజు
చూచిన యప్పుడా చూపుపై బారి
అచ్చోట కనుద్రిష్టి కానంగ లేక
కాము డీశ్వరదృష్టి కడతేరినట్లు
భూమడి పొలినేడు పొలిసె నా క్షణమె
అందుకు వెరగంది అలికి జనులెల్ల
సంతోష పడుచును సకల యాదవులు
అతని కార్యము లన్నియు దీర్చి
అధిక వివరముచేత హరిగురువు కనిరి:
'ఇక మంత్రితనమున కెవరు గలిగేరు?
ఇక నేను అడిగినను ఎట్లు నిల్చెదరు?
అనవిని పల్లికొండ అపుడిట్లగనియె:
'కనకధన మది అనగ కనక చింతించె
వినుడాతనికి మంత్రి వెదకేరు మీరు
ఘనుడొకడు ముంగల గలుగనున్నాడు
అతడితని ద్రిష్టికి ఆగగలవాడు
ఇతరులు నిలువరు ఇతని ముందరను'
అని పల్లికొండ ఇట్లు పలికె నావేళ
వినిపించె నంత ఈ విధమున నపుడు
విని సకల యాదవులు వివరంబు
నొంది
ఒనర యాదవులంత ఒక్కటై యుండిరి

చేకొన వినతుడై చేరి సురరాజు
ఆదివేల్పు కృష్ణుడని సురలు తాను
పాదంబులకు మ్రొక్కి పరగ నీగద్దె
నూడిదగా నిచ్చె సురరాజు మొదలు
వాడించి ఈ గద్దె వసుదేవసుతుడు
ద్వాపరయుగమందు తా నెక్కినాడు
పేరాళముగ కృష్ణు డెక్కిన వెనుక
దీని భుజయంత్రము దేవరవలెను
ఎన్నడైన మరి మెవ్వరెక్కినది లేదు
ఎక్క నెవ్వరితరము ఇది నీకుదక్క
ఎక్కుమా శ్రీకృష్ణు డెక్కినరీతి
పాడియు పంతంబు పరాక్రమంబు
ఈడేరె మరి యేల ఎక్కు తమకంబు
తమక మెక్కిన ముహూర్తంబు తా
నిలుచు
తాతతండ్రుల పగలు తగ దీర్చగలవు
వైరుల తెగటార్చి వరద పుచ్చెదవు
పెంపుతో నీకీర్తి పృథివిపై వెలయు''
అని యాదవోత్తములు ఆత్మవర్గంబు
అన పల్లికొండ నలనన్నకు చెప్పి
సరగున తమకంబు సజ్జు చేయించి
పరువడి తమకంబు పరపు గావించి
మునుకొని ముత్యాల ముగ్గులమరించి
నవరత్న ఖచితమైనట్టి తమకంబు
సవరించి తెచ్చి యా సదురుపై నిలిపి
హరిగురువు రాజుతో అపుడిట్లగనియె

''వినవయ్యా తమకంబు ఇది
మూర్తబలము
ఎడసేయక తమక మెక్కు''మని
పలికె
తడబడక కాట వసుధాధిపు డపుడు
గౌతమీ నదిలోన ఘనతీర్థమాడి
ఎసగ శుద్ధవస్త్రము లేర్పడగట్టి
ఒడలెల్ల భూషణము లొనర ధరియించి
చెలువుగ మేనున శ్రీగంధ మలది
తలదిరుగ పువ్వుల దండలు గట్టి
వరుసగా భూసురవరుల పూజించి
భూది దశదానములు సొరిది నిప్పించి
గురుతెరిగి పదివేల గోవులిప్పించి
వనితలకు భూసురులకు వారువీరనక
కనక వసంతంబుగను పంచిపెట్టి
ఫణిభూషణుండైన బసవదేవరను
ప్రణుతించి మరి చాల భక్తితో మ్రొక్కి
బంధువులు బ్రాహ్మలకు భక్తితో
మ్రొక్కి
సరగ హరిగురువునకు సాష్టాంగ
మ్రొక్కి
నయమున ప్రేమతో నందరకు
మ్రొక్కి
ఆవేళ నలనన్న అపుడిట్లగనియెః
'ప్రియమున మీకంటె పిన్నవాడను నేను
వయసున గుణమున వడిగలతనమున్న

# కరియావుల రాజు కథ

## -: కృత్యాది :-

శ్రీసతీ రమణాయ! శ్రితపారుజాత!
కేశవనాధునికి ఎంమితో మ్రొక్కి
వారిజగర్భునికి వందనము చేసి
శారదను గొనియాడి శంభుని దలచి
సరిమురి గణపతిని సయమొప్ప దలచి
గరిమతో ఎలమంచి గంగకు మ్రొక్కి
కొమనాల గోత్రుండు గుణవిశాలుండు
కొమరొప్ప యాదవ కుల భూషణుండు
..............................
ఆతనికి కులకాంతయగు చెన్నమాంబ
అంగన చెన్నమాంబకు వరసుతుండైన

ధీరుడైన సరువధీమణి సవుమిత్ర
ఆరూఢి పినయెల్లన అతి (ముదంబు)
నను
కరియావులరాజును ఘనతతో దలచి
రంగుగ కరియావులరాజు చరిత్ర
సంగతిగ చెప్పెను శ్రవణానందముగాను
కలియుగ భేతాళుడు, కన్నమాధీరుడు
రంపాల కేశవుడు రణశూరులు
ముగ్గురు
ఏకాంగి జగడము ఎదిరించి చేసిన
ఆ కథ వృత్తాంతము అది యెట్టిదనిన

## ఓరుగంటి బాచయ్య యాదవుల యలమంచిని దర్శించుట

వున్నతంబైనట్టి వుర్లకొండ యలమంచి
ఎన్నికతో అయితమరాజు
ఏలుచుండగను
వోరుగల్లు ఏలేటి వీరప్రతాపుడు

బాచయ్య యనువాడు బహు అశ్వగాడు
వేదాద్రి నరసింహుల వేడుకతో
సేవించి
మరల వోరుగంటికి మరి సాగిపోత

పరగంగ యలమంచి పట్టణము చూచి
తటాకములు మంచి తరుచైన మేడలు
చూచి
గోపురములు ఆటకూటములు చూచి
కొల్లారు మిద్దెలు కొలువుకూటములు
చూచి
చల్లని చిత్తరువు చవికెలు చూచి
వింతగా శృంగారపు వీథులు చూచి
బహు బంతికూటములు భద్రశాలలు
చూచి
సొంపైన సూర్యసోమ వీధులు చూచి
సున్నపు మేడలు చుట్టుకొల్లాలు
ఘనమైన సాధనగరిడీలు చూచి
కరియావులరాజు గరిడీకి కంఠీరవము
సింహపడిగె
అయితమరాజు గరిడీకి హనుమంతుని
పడిగె
భట్టావుల వల్లభన్న భేతాళుని గరిడీకి
చల్లవారి గరిడీకి చంద్రకావిపడిగె
కొమనాలవారి గరిడీకి కీర్తిముఖముల
పడిగె
మర్లవారి గరిడీకి పడిగె మువ్వన్నెడాలు
తక్కిన గరిడీలకెల్ల తెల్ల పతాకాలు
ఎక్కెంపు పడిగెలు దేవేంద్రుని
కొలువున
అలుగుల బడబాగ్ని ఆబోతులము...
సింహాల మునిమంద చెల్లించుకొనుచు
వారిస్తేను పోనివ్వరు వరుస మన్నీలు
భుజభుజము వారిస్తేను బుక్కాయి
రాలును
కత్తికత్తి వారిస్తేను వుక్కుపొడి రాలు
అటువంటి అసహాయ శూరుల చూచి
బాచన ఏమని పలికె నావేళ ?
బిరుదు పడిగెలతోను పెంపుమీరియున్న
ఆరీతి నున్నట్టి అన్నిదినుసు బిరుదులును
వారలపంక చూచి బాచన్న పలికె

## బాచయ్య యాదవవీరులకు ఓరుగంటి ముగ్గురు మాష్టీల వృత్తాంతము చెప్పుట

"ఈరీతి బిరుదులు యాదవులకు
చెల్లును
వీరికి వేదన నొకటి విశ్వాస గలద ?
కలరు వోరుగంటిలో కర్కోటకులు
ముగ్గురు
మాష్టీలు ముగ్గురు మదోన్మత్తులై
వున్నారు

కలియుగ భేతాళుడు, కన్నమాధీరుడు
రంపాల కేశవుడు రణశూరులు ముగ్గురు
కుంభిణిమీద సాధనకాండ్లకు గుండెలో దిగులనగ
గజబిరుదు వేలాడ కట్టించినారు
బండిబొమ్మలంతేసి పరుజులు చేయించి
గానుగ గరిమెంత కతారికోల
నారికేడంపు కాయలంతేసి నలభై యారు మువ్వలు
ఆ కతారికోలకు అమర గట్టించినారు
పట్టుతాళ్ల గట్టినారు బాగుమీరి యున్నారు
తోలు మోకులతోను తూగ వేయించినారు
మంచి మన్నీలకెల్ల పురవని పిడుగుల మనుచు
కక్కసంబున ఫేలాడ కట్టించినారు
మనుజేశు జీవునకు పీర్లకు మరణంబు లేదు
జన్మాంతురు నొక కొత్త జన్మాంతరము తొల్లి
ఘనుడు చాణూరుండు కలియుగ భేతాళుండు
కలియుగ భేతాళుండు కన్నమాధీరుడు
రంపాల కేశవుడు రణశూరులు ముగ్గురు

బలరాముడై నట్టి భట్టావుల వల్లభన్న
కమలనాథుడై నట్టి కరియావులరాజు
ఘనుడు చాణూరుండు కలియుగ భేతాళుడు
కరియావులచేత మడియ కట్టడి గలదు
రణధీరుడై నట్టి రంపాల కేశవుడు
వల్లభన్నచేత వసుధపై వొరుగును
మరియు కరియావుల రాజుచే
కన్నమాధీరుని మరణంబు అగును
ఇపుడు నీవడిగిన ఈ మూర్తఫలము
జయమవును మన కార్యము జనులెల్ల ఎరుగ"
అనిన అయితమరాజు అతిసంతసిల్లి
రాజులు పల్లికొండకు రయమున మ్రొక్కిరి
ఫణిరాజ శయనుండు పల్లికొండ రఘుపతి
"తీర్థము స్వార్థము తెరగొప్ప మనకు
శంభుని సేవింప సంతోష" మనిరి
"మాష్టీల చూచేంత మనసు యున్నాది
అనివేగమున అందరము మనము
తీర్థయాత్ర మనము తెరగొప్ప పోవలెను
పోయి వారిని చూడవలెను పుండరీకాక్ష
అని విన్నపము చేసి ఆ ఘనుడు

పయనమై వోరుగంటికి పట్నంబు
చూడ
అపుడు సవుబంతి అన్నము భోంచేసి
కర్పూర విడియములు కడు వేడ్క
నంది
పట్టుధట్టీలు వేసి బాగుగా గట్టిరి
పన్నీరు గంధము పైనిండ అలదిరి
హస్త కడియాలును అమరిన చవుకట్లు
వేళ్ళ వుంగరాలు వేడ్క ధరియించి
తాయితులు మెడనూళ్ళు తగు మంచి
తములు
తుమ్మెద గొలుసులు తోరంపు ముళ్లు
చాయగల బంగారు సందిటి కడియాలు
పచ్చల వడ్డాణము పరగ ధరియించి
అన్నలు దమ్ములు ఆత్మవర్గము తాము
బావలు మరుదులు బంధువర్గము తాము
పల్లికొండ రఘుపతి బంధువర్గంబు
ఆరీతి భూషణాలు పరగ ధరియించిరి
ఆరూఢి కదిలిరి అయితన్న కడకు
అడపవారి యల్లారి ఆకుచుట్టీయగా
సాహస ఘనులంత చాలుగా నిలచిరి
అప్పుడైతమరాజు అందరిని జూచి
మనసున వుప్పొంగి మరియు నిట్లనియె
మావకూళ్ళ మల్లరౌతును మరివేగ
పిలిపించె

## యాదవవీరులు ఓరుగంటి శంభుని తిరుణాలకు బయలుదేరుట

''మనము వోరుగంటికి పోవలె మంచి
మంచి అశ్వాలు
పల్లన కట్టించు''మని పలికె నా రాజు
మావకూళ్ళ మల్లరవుతు మర వేగ
మునను
కరములు ముకుళించు గ్రక్కున బలికె
''వో రాజనందనా! వొక విన్నపంబు
వోరుగంటి పట్నమంటే వో రాజ
వినుమ
ఎటువంటి తేజీల ఏరుపరుచవలెను?'.
అని విన్నవించిన అయితమరాజు
'వినర మావకూళ్ళ మల్లు! వాటి
వివరంబు చెప్పేను!

వేదావర్తము లేకున్న, వెన్నున సుడి
లేకుండ
శోకావర్తము గాకుండ, గళావర్తము
గాకుండ
పిండావర్తము గాకుండ, మస్తక
హీనము గాకుండ
వినదంతి గాకుండ, విషదంతి గాకుండ
తెగుబొల్లి గాకుండ, తీసికట్టు గాకుండ
అసునుకుట్టు గాకుండ, కూటావర్తము
గాకుండ
చినదంతి గాకుండ, ధసపల్ల గాకుండ
పింగళి గాకుండ, హీరాళి గాకుండ
శూలకుట్టు గాకుండ, సుంగిడి గాకుండ
పట్టెడసుడి లేకుండ, బొడ్డునను సుడి
లేకుండ
అధికదంతి కాకుండ, వర్జితముఖము
గాకుండ
కొంకిన సుడి లేకుండ, కొరలు
లేకుండ
బూడిద ముక్కు గాకుండ, బ్రుర
ముక్కు గాకుండ
బాషికముసుడి లేకుండ, నెత్తిన సుడి
లేకుండ
కంఠాభరణము దేవమణిగల అశ్వాల
పల్లన గట్టించు ఘనవేగిరమున
శౌర్యముగల అశ్వాల చెప్పేను తెండి

ఇంద్రనీలము తెండి, హిమగిరిని తెండి
కుంభిసింహమును తెండి, కుంభిణి తెండి
చోడాణి పంపిన జోగిని తెండి
భేతాళు డంపిన బెబ్బులి తెండి
తేజీల కన్నిటికి తెరగొప్ప మరియు
జల్లులు చవుకట్లు చాల శృంగారించు''
మనెను
అశ్వాల పల్లన గట్టించు మనెను
అయితమరాజు ఆడిన మాటలకు
రయమున అతడు
తేజీల కన్నింటికి వైనవైనాన
వాగి వన్నెతాళు వన్నె చవుకట్లు
బాగైన కంఠాన బన్నసరములును
పిగిలి తలాటములు బిరుదైన జల్లులు
మేలిమి బంగారు మెరుగు తాయితులు
బాలార్క బింబమైన పక్షిణి నేవళములు
పాలశంఖుల పేర్లు, పసుపు
రుమాలలును
ఎక్కువైన బిరుదులు ఎడమకాలందె
పసుపు పావడలు బాగైన హుమ్మాయి
పిట్టలు
పూరపిడుగులు వుక్కుజిరాలు
తలను బొమిడికెములు తగనొప్ప
ధరియించి
పుత్తమరాజు ఎక్కేటి పువ్వుల నీలనికిని
ఖళ్ళెం పళ్లెము ఖంచుపక్కెరయు

ముత్యాల మొఖమడాసు మూడు మొఖముల అందె
గొప్పైన జల్లులు గొలుసులు ఇరువంక
అయితమరాజు ఎక్కేటి అపరూప రాయునికి
పైడిది పల్లము పచ్చలది వాగె
రావిరేకలు మంచి రత్నాల భాషికము
ఘనమైన బాలసిరి జల్లులు
ఆరు మొఖముల ఆ...ధి హనుమంత కాశ
రంగైన మంచి రావిరేఖలును
వరశక్తి భట్టావుల వల్లభన్న తేజీకి
మెరుగైన నీలాలు మేలువాగె త్రాళ్ళు
పషిణిది పల్లము పచ్చలది వాగె
అల్లుదాడెన్న అశ్వానికి అమరిన పులితోలు
పల్లము సిరివాగె పషిణి తలాటములు
కరియావుల రాజు ఎక్కేటి గండగత్తెర తేజీకి
కక్కుల కళ్లెము కంచు పక్కెరయు
బిరుదైన జల్లులు పిగిలి కుంచెలును
తక్కిన గుర్రాలకెల్ల తగిన జంజోక
పక్కెర తేజీలకెల్ల పల్లాలు గట్టి
మావకూళ్ల మల్లరవుతు మరివేగ వచ్చి
వేవేగ రాజుకు విన్నపము చేసె:

"అయ్యా! మీరు చెప్పిన ఆనతి విని పోయి
అశ్వాల నన్నిటి ఆయత్తపరచి
వాస్తి"నని రాజుకు విన్నపము చేసె
అనిన సంతోషించి అయితమరాజు
ఆ రవుతుకు బహుమానము అతివేగ నిప్పించి
అయితమరాజు పాలకి అమరంగ నెక్కెను.
చనువరులైనవారు సరసను కదిలిరి
వుత్తమాశ్వాల కొందరు వొనరగ నెక్కిరి
భైరవుడనే తేజీని భట్టావుల రాజు ఎక్కెను
గండగత్తెరనే అశ్వాన్ని కరియావుల రాజు ఎక్కెను
గోడిగ నెక్కెను గోవిందు జగ్గన
సారంగు నెక్కెను చట్టమారయ్య
మించిన అశ్వాలమీద తెగనురికిన
పంచకల్యాణిని ఎక్కెను పయ్యావుల కోనేరు
చిలుకపన్నె తేజీని సింహంపు నడువు
పుల్లావుల వెంగళ బోరున ఎక్కెను
కడుమంచి అశ్వాల కంపటిలు ఎక్కిరి

అయితమరాజు పుత్తమరాజు ఎక్కేటి
అవి రెండు తేజీలు
పల్లకీల ముందర పడివాగె నడువ
నాచకూళ్ల నాయుడు నేతివారి
ముద్దయ్యను
ముమయ్యను పోచయ్యను ముదమొప్ప
పిలచి
"యాదవ బలముతో యలమంచి
పట్నమున
జతనమై వుండు"మని సమ్మతిగ
జెప్పి
వుంచి, సన్నాహముతో వున్నతము
మెరసి
మించిన పడిగెలు మీనుటెక్కెములు
వన్నెగల నేజాలు చిన్ని సురియలును
చేకత్తి మొనలు చిక్కుకఠార్లు
పంది వాట్లు చాల బల్లేలు ఈటెలు
వంకక తోలు ఫిరంగులు వడియ
చక్రములు
బిన్ని సురకత్తులు బిరుసు చక్రములు'
బంగారు చాయల బాకు జంజాళములు
అమ్మలు తరకసాలు హంసల పంజులు
ముమ్మరముగ కదిలెను మూకల బారు
పట్టుగల ఆయుధాలు పడిగెల గొరకులు
గండ్రగొడ్డండ్లు గచ్చుటరిగెలును
మేలైన సింగిళ్లు మెరుగుటమ్మలును
బాధాకత్తులు మంచి భద్రాయుధాలు
దండెత్తె అయితన్న ధర కక్కటిల్ల
వల్లవులు తిరిమందులు వరుసతో
కదిలిరి
వారికంటె ముందు వస్తువభూషణాలు
పేరుసాగి కదిలెను పెట్టెల సొమ్ములు
పెరికెల బియ్యాలు పెద రాగి
శరవలును
కావళ్లతో చమురు కాయకూరలును
కోకల దిండ్లును గుగ్గిలపు పెరికెలును
కోల కఠార్లు బోనకావళ్ల
కొం...తమ్ములు గుమ్మతి గుడార్లు
పాలకాయి గుడార్లు పట్టుగొడుగులును
కంచు దివిటీలు గచ్చుటరిగెలును
పషిణి జలతారు పట్టుతివాసీలు కదిలె
పసగల మంచి పండుటేకుల గుజ్జండ్లు
మంచి గంధము పన్నీరు విభూతి
గాజుగిన్నెల నిండ అగరు జవ్వాజి
కురువేరు ధవళము కుంకుమపువ్వు
పరిమెళము మంచి బాగుగా నడువ
నరగలు రుంజలు నఫిరీలు గిడిగిళ్లు
వీరణాలు డోలులు విరివి కైవళ్ల
బలువడి మ్రోయంగ భట్లు పొగడంగ
కదిలిరి యాదవ పతులు కడు
వేడ్కతోను

## యాదవవీరులకు శుభశకునము లగుట

గ్రక్కున వారు కదిలి రాంగాను
చుక్కల రాజుమీద క్షుతమాయె
నపుడు
అందుకై తమరాజు అడిగె పల్లికొండను
పందుముల వోబావ పల్లికొండ
రఘుపతి
బలువైన వాయిద్యములు బలములు
తాము
శుభమూర్తంబు కదలంగ క్షుతమాయె
నేమి
అడిగిన పల్లికొండ అష్టదిక్కులు
చూచి
జననాథునికి ఏమి తెలిపి చెప్పెను ?
చంద్రునిమీది శకునము సంతోషము
మనకు
అని మహా లెస్సాయె యని అటు
తర్లిపోగ
ఏడమనుండి కుడికి ఎగబార ధ్వజము
ఏగురు బ్రాహ్మలు ఎదురుగా వచ్చిరి
నల్లపక్షులు రెండు నయమొప్ప దీర్చి
తెల్లంగ బూసిన తంగేటి వాలె
పాలమోపుగ దీర్చి పచ్చని మాణిక్యము
గరుడుండు వలపట గ్రక్కున ఏతెంచె

"ఈ శకునపంతంబు ఎటువలె
నుండునో
భాసురంబుగ చెప్పవే బావరో!నీవు ?"
"బాలరాజు అయితన్న! ప్రతాపుండు
మనకు
చాల మంచితన మవును జననాథ!
మనకు,,
అని వేడ్క తానొంది అటు కదిలిపోగా
చెలగి సివంగులు రెండు సాహస
మెరసి
గ్రక్కున ఆ లేటి కడుపులపై నెగసి
వుక్కళించి వొచ్చి వొక మూటి బట్టె
సివంగుల వంక జూచి అయితన్న
పలికె
"ఈ శకునపంతము బావ! ఎటువలె
నుండును ?,,
"ధరణి ఈ శకునము తగ నొప్పు
వినుమ
ఆ లేళ్ల సివంగులు హతము చేయుటకు
కరియావుల రాజు ఘనుడు వల్లభన్న
సరగున మాష్టిల చంపనున్నారు.,,
అప్పుడు శకునమని తర్లిపోగాను
ఆ శకునము చూచి అట్లు తర్లిపోగాను

అపుడు వొక శకునము ఆయె నచ్చోట
ఘటముగా రెండు గండు తుమ్మెదలు
కొదమతుమ్మెద వెగసి గొబ్బున
వొరసి
వాటమున ఈలె వజ్రమున వ్రాలె
వ్రాలిన విధము రఘుపతితో చెప్పెను:
"పూసిన వనములు పొంగుచుండంగ
తేనెలు గ్రోలేటి తేటి తావచ్చి
ఆయుధాన నిలిచె అది యేమొ బావ''?
అడిగెను పల్లికొండ అవుడిట్లనియె:
"జననాథ! తుమ్మెదశకున మడిగితిని
తేటుల శకునము తెలివిగా నీకు
వైనముగ జెప్పేను వల్లవుల రాజ!
ప్రతాపరుద్రుండు భూపాలుండు మెచ్చి
వీరి సాహసంబు వీరి సత్యంబు
చూతాము అని వారు చోద్యంబుగాను
ఘనమై వుక్కుటలుగుల గద్దె పన్నించి
గొనకొని గద్దెపై కూర్చుండు మనిన
ముక్కంటి ఈశ్వరుని మూర్తి
కటాక్షమున
వుక్కుటలుగుల గద్దెపైన ఎక్కుమా
మరిది!
పువ్వుల పానుపవును భూపాలకుండ!"
అనిన సంతోషించి అటు తర్లిపోగా
నక్క ఎదురుగ వచ్చి సయము
తోడుతను
"నిక్కమన అశ్వాల వంక చూచిన
నేర్పు విను బావ!
అంబుజనాభుని కృపను ఆది
నారాయణమూర్తి!
తప్పక నాతోను తగ విన్నవించు"
అనిన పల్లికొండ అయితమ
రాజుతోను
కనుగొని యప్పుడు క్రమమెల్ల
చెప్పెను;
"నరనాథ! ఎదురుగా నక్క
యేతెంచినందుకు
సరుగున నిక్క చూచినందుకు
అలుగుల గద్దెపై నీవు అటువలె
వుండగాను
ప్రతాపరుద్రుండు భూపాలుండు మెచ్చి
అఖిల రవుతులకెల్ల అలవిగానట్టి
ఆ కంచర్లవారి అశ్వాలలోను
మంచైన వంటరి మావు దాటించి
కల్లరి అశ్వము కలిగేను నాడు
అశ్వము రూపు ఎటువంటి దంటేను
వొక చెవులో నలుపు వొక చెవులో
తెలుపు
మొకబొల్లి ఎకబొల్లి మూతి నలుపైన
కుడిచెక్కిట మంచి కుంచెత్తు వలెను
అటువంటి అశ్వము ఆ పురిలోను
అసహాయ శూరులకు అలివి గాకున్న

వోరుగంటి ప్రతాపరుద్రునికి వయ్యన
ఇచ్చిని
సరువ ప్రతాపరుద్రునికి స్వాధీనము
గాలేదు
ప్రతాపుడు అశ్వాన్ని పాగాన కట్టించి
పైన గోలెముతోను పాలు బోయించి
ఇనుప రాగోలల ఇత్తురు మేత
ముంగలవస్తే కరుచు వెనకవస్తే తన్ను
పైన చెయ్ వెయ్యనివ్వదు పల్లన
కట్టనివ్వదు
చారనివ్వదు వాగెలో చెయ్
వెయ్యనివ్వదు
అటువంటి అశ్వము ఎవ్వరికి
అలవిగాకున్న
మెచ్చేను ప్రతాపుండు ఇచ్చేను మనకు
పుత్తమరాజపుడు పువ్వుల నీలాన్ని
స్వాధీనంబు చేసేను జననాథ! వినుము
అపుడు సంతోషించి అరుషంబు నొంచి
ఘనమైన వేడుకతో కదిలి పోగాను
బలువైన బిందెలు పాలకావళ్లు
బాగుగా ఎదురాయె బాలరాజులకు
పాలకావళ్లు వంక పారంగ జూచి
"పంకజనాభుండ! పల్లికొండ రఘుపతి!
ఎదురుగా పాలకావళ్లు ఏతెంచినందుకు
ఈ శకునపంతాన ఏమి మేలు గలుగు?
రాస్యమున జెప్పవే రఘుపతి నీవు ?"
తన మనుసు తెలిసి తగ నానతిచ్చె

"అమిత విక్రమశాలి! అయితన్న!
వినుమ
ప్రతాపరుద్రుండు భూపాలు మెచ్చి
బంగారు పల్లకి ప్రజల కొందరిని
ముంగామురాలు ముదమొప్ప నిచ్చు
వారిని తోడ్కొని వైళంబె మన పురికి
ఈరీతి వొచ్చేము యదుకులాధీశ!"
అని యిట్లు యాడేడ ఆ శకునపంతంబు
తెలివిగా వానిని తెలుపుచు రాగ
వరుసతో పంచమా వాద్యములతోడ
కదిలి పరివారము తమకూడ
వేడుకతోను
కదిలిపోయి పట్నాన గ్రక్కున నిలచె
అపుడు అయితమరాజు
అన్నదమ్ములును
కపికులేశ్వరుని జూచి కడువేగ
మ్రొక్కి
వినయముతో వెయ్యారు విధమున వేడి
అంతట కదిలిరి ఆ మరునాడు
ఆచోట నిలిచిరి అతి సంభ్రమునను
చేరి యాపురి శంభుని సేవింప
సంగమదేవునికి ఆడ సమారాధన
చేయించి
బంగారు పువ్వుల పరగ పూజించి
వెయివేల విధముల వినతులు చేసి
గవిచెర్లకు పోయి కదిలి మరునాడు
బావలు మరదులు బంధువర్గమెల్ల
ఆవేళ నందరు అచ్చోట నిలచిరి

## అయితమరాజు ప్రతాపరుద్రునివద్దకు భట్టును పంపుట

అప్పుడై తమరాజు ఆ పల్లికొండ
అపురూప సరస్వతి అనే భట్టును బిలిచి
"ప్రతాప రాజేంద్ర భూపాలుని కడకు
అమిత విక్రమశాలి అయితమరాజు
యలమంచి ఏలేటి యాదవరాజులము
కులబాంధవులు పల్లికొండ గొబ్బున
మెరియు
సంతోషవినుతులై శంభుని వేడ
ఎంతయు వస్తున్నామని విన్నవించు"
మనిరి
ఆలస్యము శాయక అతివేగమున
పొ"మ్మనిరి
రాజు అనుమతి గొంచు రమ్మనిన భట్టు
సకల జనులు బంధువులు గనుక
పట్నంబు జొచ్చి భూపాలుని కడ నిలచి
"కుంజర మండలాధీశః కువలయాధీశః
కాకతి రాజేంద్రః కరుణాసముద్రః
ప్రతాప రాజేంద్రః పరిపూర్ణచంద్రః
అమిత పరాక్రమశాలిః యాదవ రాజులు
సంతోషమున దేవుని సేవింప వారు
వస్తున్నామని వైశంబె చెప్పిరి"
అనిన ప్రతాపుండు అపురూప
నరస్వతిని బిలచి
వేవేగ కర్పూర విడియంబు లిచ్చి
గిండి మాధవుండు, అడప కేశవుండు
ఇద్దరిని పిలిపించి ఇల నాథుడైన
"యాదవులకడకు మీరు ఎదురుగా
బోయి
వారిని తోడ్కొని వైశంబె వచ్చి
సూచితమైన జాగ చూపించి మీరు
చయ్యన ర"మ్మని జననాథు డంపె
పంపిన వారిద్దరు భట్టురాజు వెంట
అనోవేగమున వచ్చిరి యాదవుల
కడకు
వచ్చిన అయితమరాజు వారి కందరికి
తాంబూల కట్నాలు తగువేడ్క నిచ్చె
ఇచ్చిన గైకొని యాదవులతోటి
వచ్చిరి సకల వైభవముతోను
అందలాలు పాలకీలు అశ్వాలు
పరివారము
కంట్లాలు కోడెలు కావళ్లు బరువులు
పాంచాలిచెరువు వద్ద వైశంబె జూచి
గుంటిచెరువుకాడ గొబ్బున జూచి
చాలురావుల కాడ చయ్యన దిగిరి
బాలరాజు లచ్చోట పాలకీలు దిగిరి
ప్రతాపుని మనుసుల పట్నాని కంపిరి
గుడార్లు ఎత్తించిరి గొబ్బున వారు
పట్టు రావాటీలు పరచిరి వేగ

తివాసీలమీద తిరుమందులు వల్లవులు
పల్లికొండ అయితరాజు పరగకూర్చుండి
ఆటపాటల వార్ని ఆడించుకొనుచు
భారత పురాణాలు బాగొప్ప వినుచు
సురరాజు భోగంబు సొంపు తోడుతను
పురాణ సద్గోష్ఠి పొసగ వినుచుండ
చంద్రుడు గ్రుంకెను చీకటి గృహము చొచ్చెను
అంతట తెల్లవారె అర్కుడుదయించె
ఘన సూర్యుండు పొడిచెను కడు తెల్లవారె
అంతట యాదవులు అందరు నెల్ల
నీతితో బాలరాజులు పల్లికొండ నిద్ర మేల్కొనిరి
వరుసతో విభూతి వల్లవులు ధరియించిరి
మేనున శ్రీగంధం మెత్తేటివారు
హరిచందనం మేన అలదేటివారు
పట్టుచీరెలు లెస్స కట్టేటివారు
ధవళవస్త్రములు మేన ధరియించివారు
నెరులు నున్నగ దువ్వి నేర్పుతో శిఖలేసి
ధగధగ మవంగ తగుటు తలచుట్టువారు
ఆభరణంబులు మేన అలంకరించువారు
బుక్కాయి గంధము పూసేటివారు
సన్నంపు వలిపంబులు సవరించువారు
పక్షిణి పూల సెల్లాలు పైగప్పునారు
ఆయుధంబులు చల్లడాలు అమరించువారు
అటువలె నంతంత ఆయత్తపడగాను
కడు సాహస ఘనుడైన కరియావుల రాజు
ఝెట్టి కి స్త్రీదు లాగు చెలువొప్ప దొడిగి
పట్టుధట్టి కాసె బాగొప్ప గట్టెను
రంగుగా పచ్చల రత్నాలు దాపిన
బంగారు వడ్డాణము బాగొప్ప గట్టెను
పొందుగా నవరత్నాల భూషణాలు ధరియించె
అందెపెండెము పాదాన అలంకరించుకొని
గంధము కస్తూరి కలయంగ నలది
చంద్రకావి రుమాలు చెలువొప్ప గట్టెను
పరగ భూచక్రాల పచ్చడము గప్పెను

## కరియావుల రాజు ఒరుగంటి పట్నములోని కేగుట

పైగప్పుకొనెను పరగ యాదవరాజు
సురపతిఖడ్గ మనేది సూర్యకటారి
దీసుకొని
కరిఘటముల వైరు కరియావుల రాజు
పందుముల రఘుపతితో పలికె
నా వేళ :
"పల్లికొండ ఓ బావ పట్నంబులోకి
బోయి
మాష్టీల బోడికెల మాటలనేర్పున
మరియు
కటాంకోల విడువుమని కని చెప్పి
రావలెను
కాక మనతో అతడు కక్కసాలాడేని
ఏకాంగి జగడాన హింసింతు నతని
వారి పోట్లాట వైయాళిలో చూడు
తీర్థవాసులై తెరగొప్ప మీరు"
అని చెప్పి పల్లికొండకు హస్తము
లెత్తి మ్రొక్కె
తమ్ములకు మరుదులకు తగు
వేడ్కతో చెప్పె
గండగత్తెరనే అశ్వాన్ని కరియావుల
రాజు గ్రక్కున నెక్కెను
పేటు రుమాలకుచ్చులు వింజామరలు
వీవ
కొమరొప్ప జగజంపు గొడుగుల నీడ
పసుపు పావడాలు ముందరపట్టించుకొని
తన బొడికెలు తాను తగు వెంటతర్లిరి
పరగంగ వోరుగంటి పట్నంబు
జొచ్చెను
అశ్వంబుపై డిగ్గి ఆ పట్నంబు చూచి
మేరువ ఘనమైన మేడలు చూచి
కోటకొమ్మలు చూచి కొత్తడంబులు
చూచి
వాటముగ కట్టిన వంకదారలు చూచి
కనక మేడలు చూచి కవాటములు చూచి
ఘనమైన తోరణ స్తంభాలు చూచి
ఆ సింగమ భేతాళుడు అమరంగ
గట్టించిన
హనుమంతుని చవికెకాడ అశ్వాన్ని
దిగెను
భీకరమనే తేజిని పిల్లబంటుకు చెప్పె
ఆకురుమాలవాడు అందించె విడియంబు
హనుమంతుని చవికెలోను అతిపరా
క్రమశాలి
కూర్చుండె కరియావులరాజు గుణ
విశాలుండు
గంటగాలంబు గజ అంకుశ బిరుదు
వొంటుపడ కటారి వర్ణించినాడు

బండిబొమ్మలంతేసి పరుజు లున్నావి
తాటిగింజ లంతేసి తరుచైన మువ్వలు
గానుగ గరిమెంతేసి కఠారి
సింగమఘాత జేసె సింగమ భేతాళుడు
నాయొక్క హస్తానికి ఎదురుబంటు
లేడని
కలియుగ భేతాళుడు కట్టించినట్టు
కఠారి కోలచూచి కరియావులరాజు
భేతాళుని శిశువుల జూచి పేర్కొని
పలికె:
''ఓరీ ఇచ్చోట వున్న బోడికలార
ఈ కఠారికోల యెవ్వరు కట్టించినారు?
ప్రతాపుడు కట్టించెనో? మంత్రి
కట్టించెనో?
వర్జితుడు కట్టించెనో? వర్తకుడు
కట్టించెనో
మన్నీడు కట్టించెనో? మాష్టీడు
కట్టించెనో?
లేక వోరుగల్లు యేలేటి వీరప్రతాప
భూపాలుడు గట్టించెనో?
ఏమిటికి కట్టించిరి? ఏమి దీనిపేరు?
తలగడిమి పెండెమో? తాటిపట్టలో లేక
జారగాడివలె బలుగాడితోడి
అమరంగ కౌమరకొయ్య లందున్న
దేమో''
అమరంగ దానిపేరు అడుగంగ సాగె
అడిగిన భేతాళుని శిశువులు అప్పు
డిట్లనిరి:

## కలియుగ భేతాళుని బోడికలు తమగురువు పరాక్రమమును పొగడుట

'కఠారి కట్టించిన ఘనుని అడిగితివి
'ఈ భూమిని యేలేటి వీరప్రతాప
భూపాలుని మాష్టీడు
సీమలో మాష్టీల చెల్లించి చంపితేను
కొందరు మాష్టీలు అతని కోలకింద
వత్తురు
కొందరు మాష్టీలు కోక లందిత్తురు
గరిడికి వుళకెకట్టు తెప్పింతురు
ప్రారిగోడలు బెట్టి అతని పనులు
చెల్లింతురు
కటారు వేటుకి ఒక శలగ ఈ భంగి
చెప్పె
నూటికి ఒక శలగ వాటముగ చెప్పి
పట్టిన కఠారికోల ప్రజ్ఞకు తెచ్చి

గట్టిగ సింగము భేతాళుడు గండికొమ్మ యినాను
అష్టాదశ వర్ణాలవారు అతనిఆజ్ఞకులోనై
కసరక అతని కఠారికిందుగ కదలి రావలెను
వెరువక ఈ బిరుదులు విడిపించిన వాని
మరువక చంపుదు మా తండ్రి ఆన
బోడికెల కావలిబెట్టి పోయెను గరిడికి
కక్కస రిపులకు కంటిలో నెరసు
వెక్కస రిపులకు వెన్నుసంపెటీయు
చలమున శత్రువుల సంహరింపగలడు
చెణికిన మాష్టీలకు శిరసురంప మవుతాడు
వొరసిన వైరులకు వురవని పిడుగు
కలియుగ భేతాళుడు కన్నమాధీరుడు
రంపాల కేశవుడు రణశూరులు ముగ్గురు
కుంభిణిమీద సాదనకాండ్లకు గుండెలో దిగులు
ఎంతవాడు కఠారికోల చూచి ఏమని వర్ణించినాను
పంతాన గుండెలు పగలంగ పొడుతురు
ఎప్పటి వార్తలు యిటు మాకు చెప్పుమని
మమ్ముల వుంచినాడు మా పేర్లు వినుమ

ముద్దుబాలుడు వొకడు మురిపెగాడొకడు
గద్దరికాడొకడు ఘనసింహ మొకడు
రంతులభేరి యొకడు, రణశూరుడొకడు
పంచెరి వొకడు బలుదంతి వొకడు
రెక్కలపులి వకడు, రేమంతు వకడు
చింతనిప్పు వకడు, శిరసురంపము వకడు
వింతగా మాష్టీలకు వెన్నుసంపెటవకడు
అసహాయ శూరుడు, వకడు హనుమంతు డొకడు
కశినికోత వకడు, కాలయముడు వకడు
వుతకమంట వకడు, వురవని పిడుగు వకడు
గాదములో పెనుపాము గట్టినక్క వకడు
వురులతాచు వకడు, గుండెదిగులు వకడు
చేరిన రిపులకు సింహఘాత వకడు
గుండెగాలము వకడు, దండి శూరుడు వకడు
పిలచి జగడము చేసు పిల్లబంటు వకడు
అలుసుల చేసేటి ఆటవాది వకడు
రాజేటి నిప్పు వకడు, రాతిమెరుపు వకడు

నీ పేరు యెవ్వరు? నీది యే భూమి?
ఈ పట్టణము వచ్చి యీ బిరుదులు
చూచి
నిలచి పిలచి అడిగితివి నీచేత నవునా?
ఇలమీద కొన్నాళ్ళు నిలవ దలిచేవా?
వొక పట్టు చూచికొమ్మ వారిని
ఆడితివి"
అనిన కరియావుల రాజు అఙ్గన నవ్వె.
భేతాళుని శిషువులలోను పలికె నా రాజు:

## కరియావుల రాజు భేతాళుని బిరుదుల తొలగింపుమని చెప్పంపుట

"వోరి బోడికలార! యీ పుర్వి
లోపలాను
భేతాళుడు మహాఘనుడని పెద్దగా
చెప్పేవు
తాడితన్నిన వాని తలతన్నువాడు
అటువంటి ఘనులు జగతిలో గలరు
వేషాలు ఏమైన గ్రాసాలకొరకు
దేశాలుగల యట్టి తెలిసి చూచినాను
మాష్టిల జోగులు మరి సేవకులు
వేషాలు పన్నుకొని బిరుదులు ఎన్నైన
పెడతట వీపున పెరకట దూలవలెను
పుడమి తిరిగి యిటువలె పొట్టపోసు
కొందురు
కలియుగ బేతాళుడు కట్టితే మేలాయె
యలమంచి నేలేటి యావులము మేము
పయనమై మా బావ పల్లికొండ
రఘుపతి
శంభుదేవుని మేము సేవింప వస్తు
న్నామని
అతడు దేవాదిభక్తుడు ఆది
నారాయణమూర్తి
తిరుమణి తిరుచూర్ణముగల దివ్య
తేజుండు
పుట్టుశంఖుచక్రాల పుట్టినాడతడు
పుండరీకాక్షుని పుటక యట్లవును
తొడిబడి కటారి కిందుగా దూరి
వచ్చెనైన

కటారి కట్టిన మాష్టీనికి ఆయుస్సు
గ్రుంగు
పల్లికొండ పెరుమాళ్లు బంధువులు
తమరు
దేవుని సేవించి తిరిగిపోయిన వెనుక
కటారికోల తిరుగ కట్టుకుందురుగాని
గ్రక్కున విడిచి కట్టుకుందురుగాని
గ్రక్కున విడచి కడబెట్టు"మనెను
"వొయ్యన మీ గురువుకు వొక్క
మాటైన చెప్పుమనెను
యలమంచి ఏలేటి యాదవులము
మేము
పుట్టుక యలమంచి పూర్వము
ద్వారావతియు
వసలెడు నందవరము ఏలేటి వలురాజు
మనమడ
సింహాద్రిరాజు కొమరుడ నాపేరు
సింహపరాక్రముడు
పల్లికొండకు మరిదిని భత్తునికి
సైదోడను
కరిఘటముల వైరి నాపేరు కరియావుల
రాజు
గద్దరి మాష్టీల వైరిఘనుడు నాపేరు
కట్టిన బిరుదు విడచి కడబెట్టుమనెను
కలియుగ బేతాళునికి కని చెప్పిరండి"

అని చెప్పి కరియావుల రాజు
హనుమంతుని చవికెలో నుండె
అంతట బోడికెలు ఆవార్త గొంచు
ఎంతయు గరిడికి ఏతెంచి వచ్చిరి
తమ్ములు బేతాళుడు తమ శిషువులకు
నెల్ల
నెమ్మదిగా సాదనాలు నేర్పుచుండగను
గురువు చెప్పిన యట్టి గుణబుద్ధిచేత
పరిపరి విధముల పట్టి చేసేటివారు
ఎగసి కుప్పిగంతులు వేసేటివారు
జగడై త్యూలై జారేటివారు
వంటికత్తి సాధన వడి చేసువారు
మూట పరువడి చేసి మురిసేటివారు
లంకాణము సాధన లంఘించువారు.
కత్తెరడుగులు కట్టేటివారు
బొట్టెకోలల ధట్టింపుట ఎగుసువారు
ఏదుమురాళ్ల గోతము ఎగవైచువారు
మేలిమి కంబాల మెలిగేటివారు
అంతట మేడెములో అటు చేయువారు
బాకు జంజాళముల పట్టి చేసేటివారు
కదసి జోడు గడలు చేసేటివారు
చెరిమెన కత్తులసాధన చేసేటివారు
పట్టకత్తుల సాము పట్టేటివారు
ఆలాయుధము బాణా కోలలు పట్టి
అటుసేయువారు

దండి త్రోపులు త్రోయుచు దండములు
త్రోయుచు
మత్యకాడిటు మరి పట్టువారు
ఆరతి మండంగ ఆర్పు బోడికెలు
బలెర్ధించి గురువుకు పాదాలకు
మ్రొక్కి
అప్పుడు కరియావుల రాజు ఆడు
మాటలను
చెప్పిరి గురువుకు చేతులు ముకుళించి:
"వోయి మేదినికొమార: విశ్వ
భుజంగ!
గజసింహ పరాక్రమ: కలియుగ భేతాళ
నీవు కఠారికోలల కట్టించి మొదలు
ఎవ్వరు పాలించి అడుగంగ వెరతురు
వకడు గుర్రమునెక్కి వయ్యన వచ్చి
నీవు కట్టించిన కఠారికోలవంకతా చూచి
నీ సాహసంబు నీ పరాక్రమము
ఎరుగంగలేక
నిస్సారపు మాటలు పలికెను అతడు
యలమంచి ఏలేటి యాదవులు
పల్లికొండ
సహింప దేవుని సేవింప
వస్తున్నామనిరి
దేవుని చూచి తిరిగి పోయిన వెనుక
కట్టుకుండురుగాని విడిచి కడబెట్టు
మన్నెను

ఆతడు ఆడిన మాటలు అంతయు
మీకు
వినిపించ వస్తిమి ఈ వార్త మీకు"
ఆ మాటకు భేతాళుడు ఆగ్రహుడై
మండె:
"ఈ మాటలాడువాడు ఎంత వాడో
కాక
వుదయాద్రికి పడమట వుత్తర
దక్షిణాన
ఎదురు బంటులేడు ఏకడ తనకు
శరీర మంతయు జర్ర చారకుండ
ఇరవయ్యారు వేల మాష్టీల ఇలమీద
గూల్చి
మేటి మేటీలెల్ల మనకు వోడిపోగాను
ఎటువంటివాడు ఎదిరించినాడు తాను?
తనవంటివాడు నా ధాకకు
నిలువగలడ?
కులవర్ణముతో వెర్రి గొల్లలు గాక
పలకనేరక వాడు పలికె గాబోలు
ఏనుగకు బొమ్మలు ఎంత వచ్చినాను
బొమ్మన్న వెనుకకు పోవునా వెరచి?
వెయ్యవలసిన బిరుదు వేసినాము గాని
సామజమును నేను సకలజను
లెరుగుదురు
దోమమాత్రము వాడు దొడ్డటర నాకు
ఎరిగి ఆడినాడో ఎరగక ఆడినాడో

పడుచువాని చంప పాపంబు గాదు
గుణము ఎరుగని గొల్లవాడు గాగ
బొమ్మనుడీ మళ్ళి మాటలు పూని
వోరి బోడికలార! ఇక నొకవార్త
చెప్పరా పోయి
కుడిచేయి వానిది కుంభిణి
పిల్లలపిడుగు
ఎడమచేయి వానిది యముడనుడి వేగ
బ్రహ్మదేవుడు ఇచ్చిన ఆయుస్సు
ఆయెనా!
చేపట్టి అరిచేత చెరచగలవాడు
పోట్లాట అంటేను కుడుముల ఏట్లాట
కాదు
జగడమంటే మడుగు చల్లులాట కాదు
కరుగు ముద్దలు తిన్న కావర
మంతయు
బలుసుకూరయు తిన్న బలిసిన
మదములు
పులుసు విరవక పోనియ్యడని
పల్లదాలు భేతాళుడు పలుకుచున్నాడు
వోరి బోడికలార వయ్యనే పోయి
అతనికి ఈ వార్త అంతయు చెప్పుడీ"
అనిన భేతాళుని శిషువులు అతివేగమున
బోయి
ఆ కరియావుల రాజుతో అప్పుడిట్లనిరి:
"వోయి! సభలోనున్న బాహుబలశాలి
కలియుగ భేతాళుడు కలహాముకు
అతడు
వేవేగ సీహార్త ఎరిగించినపుడే
ఆవును చూచిన పులివలె మహా
ఆగ్రహుడై మండె
బంటు ఎదురు లేదు పాలించి
చూచినను
ఏనుగతో దోమ ఎదిరించినట్లు
తాను ఎంతటి వాడు నాథాకకు
నిలువ?
కులవర్ణములో వెర్రి గొల్లలుగాక
తమ తల్లితండ్రులు తమ అన్నదమ్ముల
కలుసుక తన ప్రయాణము
కాచుకొమ్మనుడ
ఏనుగుకు కొమ్ములు ఎంతవచ్చినగాని
బొమ్మన్న వెనుకకు పోవున వెరచి
పల్లికొండ వచ్చేది పెరుమాళ్లు వచ్చేది
కట్టినకోల విడచి కడబెట్టనన్నాడు
అని యిట్లు బోడికలు ఆడిన మాటలు
వినియు
కరియావుల రాజు కవకవ నవ్వి
దిగ్గున తా లేచి ధీరుడై నిలచి
అక్కడ వున్నవారు అందరు వినగాను
పలికె కరియావుల రాజు పంతంబు
మెరసి
వోరి బోడికలార! వోరి మీగురువు

తల క్రొవ్వి యిటువలె ఆడె కాబోలు
పుడమిని ఎటువలె పొట్ట పోసుకోక
బ్రతకనేరక వాడు విశ్వంబులోన
ఎదురులేని చోట ఏగు పట్రాయుధ
మన్నట్లు
కఠారి వేలాడ గట్టించినాడు
ఆడ కట్టితే మేలాయె అవనేలే రాజు
నే విడువుమని చెప్పితే తా
విడువనన్నాడు!
ఏనుగ తానెట్ల? నేను దోమనెట్ల
అయితాను?
ఏనుగకు కొమ్ములు ఎటువలె వచ్చునో
తన కొమ్ములు వెనుకకు తర్లిపోకుంటే
రాసి కోసివెయ్య నాచేత రంప
మున్నాది
నేనెంత చెప్పినా అతడు నేరడు బుద్ధి
తా నేలకూలకగాని తా విడువడు బుద్ధి
విడువకుంటే మేలాయె వకవిధమున
నేను
విడిపింతు చూడు"మని ఆదివిష్ణుకు
మ్రొక్కి

భుజముపైనున్న భూచక్రాల పచ్చడము
అడపవాని చేతికందిచ్చె నపుడు
చామపూకడియాలు చేతులకు
ఎక్కించె
వైడుత్ర జంజములు బాగుగా వేసి
అందెపెండెము పాదమున అమర
ధరియించి
అంజలిచేసి అనుమంతుని అపుడు
ప్రార్థించి
"కపికులాధీశ్వర! కరుణా సముద్ర!
తలిసి మా యాదవ తలగడగుండ
నిలిచి మా కార్యార్థమున నిర్మల
గుణధర
పాతాళలంక పరిపూర్ణకార!
లంకిణి సంహార! లంక నిర్ధామ!
వారధి గట్టిన వాయునందనుడ!
కొమార!
వాయువనందన! సకల వైభోగరాయ!
సాయము గమ్మ"ని అనుమంతుని
సన్నుతి చేసెను

## కరియావుల భేతాళుని బిరుదులను తన్నుట

బొల్లావు బసవన్నను బుద్ధిలొ దలచి
హరిగురువు పల్లికొండను అప్పుడు
తలచి
శివగురువును తలచి చివ్వున లేచి
రెక్కార్చి కరియావుల రాజు రివ్వున
ఎగసి
సాళువ మెలగిన చందాన మెలగి
తప్పక వాని బిరుదు తన్నె నా రాజు
కతారి వూచదన్నె కరియావుల రాజు
మొగసింహ బిరుదైన హుంకార
పరాక్రముండు
ఎగసి తన్నిన కతారి ఏడుతునియ
లాయె
కతారి ఏడు తునియలు గజ్జలు వక
తునియ
పరుజు రెండు తునియలై పడెను
ఆడాడ
కోటకొమ్మున కొన్ని కొత్తళములోకొన్ని
గజ్జెలు తునియలై పోయి ఆ గరిడిలో
పడెను
తన్నిన అన్నెన్ని తావుల బడెను

చివర తునియలై పోయి చిటిగోవు
కూటములో పడెను
గజ్జెలు పట్టుతాళ్లు గలగలా మ్రోయుచు
సింగమ భేతాళుడు వుండేడి సింహాల
గరిడి
ఘల్లు ఘల్లున బోయి గరిడిలో పడెను
ముంగల పడిన భేతాళుడు ముక్కరించి
చూచెను
కతారెపద్ద కావలవున్న బోడికలు
పరువున ఏతెంచి పలికి రావేళ:
"వోయి కలియుగ భేతాళ! కన్నమా
ధీరుండ!
రంపాల కేశవుండ! రణ శూరులార!
కరియావుల రాజు కడు క్రొవ్వినాడు
అపుడు మీరు చెప్పిన ఆనతిక్రమమున
చెప్పిన విని అతడు శీఘ్రమే లేచి
ఘనమైన బిరుదు గజ్జల కతారికోల
తృణముగా తన్నెను తునియలుగాను
ఎగసి తన్నెను కతారి ఏడు
తునియలుగాను
తన్నిన అన్నెన్ని తావుల బడెను

గజ్జెలు పట్టుతాళ్ల మన గరిడిలో పడెను తన సేవకులు తాను
అంతట కరియావుల రాజు
తగువెంటనున్నాడు"
హనుమంతుని చవికెలోను
అని యిట్లు బొడికలు ఆడిన వినియు
తన తొడ చరచుక తానప్పుడనియె:

## భేతాళుడు కరియావుల రాజుతో యుద్ధమునకు సిద్ధమగుట

"కలిగెరా నాకెదురు కలిగెరా యనుచు
కయ్యంబు సేయను కలిగెరా నేడు
కలిగెరా. నేడు నా కఠారికొంది
కదసి వాని గుండెలు కాడిపార
పొడుతును
కలియుగ నా కఠారి పోతురాజుకూను
కదసి వాని రక్తము గావుపట్టగలిగె."
అనుచు కోపాగ్ని అటు పట్టలేక
ఎదట వున్న వృక్షస్తంభము
పురవడిగ తన్ని
గాజుస్తంభము గుద్దెగణికెలగాను
బంగారు స్తంభము పడనైన విరచి
అంతట కోపము అటు పట్టలేక
బాకుసాధన చేసి భైరువ తిరిగి
అంతట కోపము అటు పట్టలేక
పీగాలి దుమ్ము మింటికి జిమ్ముకొనెను

మీసములు వెగవేసి మిక్కిలి దువ్వి
ఘ్రుక్కున శిషువులు తన గరిడికి వెళ్లిరి
తన కొలువుమొగసాల తగు వేడ్కతో
నిలిచి
వుభయ సమ్మతమనే భట్టును వయ్యాన
బిలిచి
అతనితో భేతాళుడు అపుడిట్లనియె
వోయీ! వుభయ సమ్మతమూ!
వొయ్యనే పోయి
వొక్కడు నెక్కటి నా కఠారికోల
తృణము మాత్రమున తన్నె తునియలు
గాను
వాడితోను పోట్లాడవలెను అతనికెదకు
వేగబోయి
అక్కడ బిరుదులు అనియేక
మార్గములు గలవు

భేతాళునితోను పోట్లాడ పయనమైనాడు
వేగంబె మనపురి వెళ్లిపోకుండ
పచ్చాటి బాగాలు పండు తెల్లనాకులు
పట్టుపచ్చడ మిచ్చి పంపె నావేళ
పంపిన కార్యముకు పయనమై భట్టు
అనుమంతుని చవికెకాడికి అతివేగ
వచ్చి
ఆవేళ కరియావుల రాజు అతి
పరాక్రమశాలి
అక్కడ వున్నవారి అందరిని చూచి
ఎక్కడనుంచి వచ్చెనోయి ఇంత
మహాఘనుడు
ఘనమైన గజ్జెల కఠారికోల
తృణమాత్రమున తన్నె తునియలుగాను
అనుమంతు డితడేమొ అనరాదుగాని
ఎన్ని నోములు నోమి ఇతని గన్నదో
తల్లి
ఎన్నడు ఎరుగము ఇంత మహాఘనుని
సభవారు అందరు సంతోషపడగ
వుభయ సమ్మతమనే భట్టు వొయ్యన
పలికె :
“ఓయి! సభలోనున్న బాహుబలశాలి!
కలియుగ భేతాళుడు కట్టించినట్టి
కఠారికోల తన్నిన ఘనుని పేరేమి?
భేతాళుడు అతడు బిరుదు మాష్టీడు
చేతికి కన్నులు వెలువొప్ప గ॥వాడు
మదగర్వమున ఇంత మాత్రమున వచ్చి
ఎదిరించి రిపుల ఏపణగించువాడు
పొదులుచు ఎరుగని పొట్టకావరమున
కదసిన శత్రువుల ఖండించగలవాడు
ఎంత సాధనకాండ్లకు ఎక్కువైనవాడు
బల్లిదుండైన కలియుగ భేతాళుడు
ఎక్కడ తనకు బంటు ఎదురులేడనగ
కక్కసమున తన్నితివి కఠారికోల,
అ మాట వింటానె అతివుగ్రు డగుచు
సామాజముపై వచ్చు సింహముకై వడి
కలియుగ భేతాళుడు కఠారికట్టి
వైళంబ అతడు వచ్చుచున్నాడు
అతనితో చేటుకై యుద్ధంబు చేసేవొ
చయ్యన వకవంక జరిగేవొ లేక
ఈ రెండువార్తలు ఇటు మాతు
చెపుమ,
కలియుగ భేతాళునికి కని చెప్పవలెను”
అపుడు కరియావుల రాజు అళ్లన నవ్వి
“చెండేసేర మీరు జగతి నందరిని
బంధువులమే గాని మేము పగవారము
గాము
అతడాడిన మాట అనతిచ్చితిరి
అతనికి మాతెరగు అంతయు తెలుపుడి
పుట్టుక యలమంచి పూర్వము
ద్వారావతి

వరలెడు నందాపురం ఏలేటి వలురాజు
మనమడను
సింహాద్రిరాజు కొమరుడ నాపేరు
సింహపరాక్రుండు
గద్దరి మాష్టీలవైరి నాపేరు కరియావుల
రాజు
వెనకటికి భేతాళుని సాధసకు ఏమని
చెప్పగాను
వాలాయముగ తాను వరిసి చూడ
వచ్చినాను
అనువైన ఆయుధాలు అమరించుకోని
అనారవేగమున రమ్మనె ఆలస్యము
శాయక''
అని చెప్పి భట్టుకు అస్త్రకడియాలిచ్చి
పషిణి నేవళములు పట్టుపచ్చడము
గప్పి
కర్పూర విడెమిచ్చి గ్రక్కున బంపె
వచ్చి భేతాళునికి వరుసతో చెప్పెను :
"కలియుగ భేతాళ!కన్నమా ధీర!
రంపాల కేశవ!రణ శూరులార!
అపుడు మీరు నాతోను ఆనతిచ్చినట్లు
చెప్పిన విని యతడు సంతోషపడెను
తన వంశావళి తన పేరు చెప్పె
మనసున వకయింత మరి శంకలేక
అనుమంతుని చవికెకాడ అతివేడుకతో
నున్నాడు

పోరి కరియావుల రాజుతో పోట్లాడుడి
మీరు"
అనిన ముగ్గురు లేచి అతివుగ్రులగుచు
కట్టాయత్తపడిరాను కదిలిరి
గృహముకు
వచ్చిన భేతాళునికి వనిత చిటిగోపు
పైడిచెంబుతో వుదకాలు పరువున
తెచ్చి
తన విభుని పాదాలు తగనొప్ప గడిగి
పళ్లెములో నివ్వాళి పట్టించి చిటిగోపు
తన పురుషుని మోము తప్పక చూచి
ఘనమైన భక్తితో కాంత యిట్లనియె:
''ఎన్నడు లేదు ప్రాణేశ!యింత
కోపంపు!
కన్నులు ఎర్రనైన కడు కోపముననను
సన్నంపు చెమట జారుచున్నాది
నీతి కార్యధురంధర!నిర్మల గుణనిధి!
ఆలాగె నాతోను ఆనతిమ్మనిన"
అని యిట్లు చిటిగోపు అడంగ నపుడు
తన సతితో భేతాళుడు తగ
నిట్లులనియె:
"వినవె చిటిగోపు వివరము చెప్పేను
ఎంతవాడు నాతోను ఎదిరించ
వెరచును
భీకరంబులు మాని ప్రియములు
పలుకుచు

తన కతారి కిందుగా తగ దూరి
వత్తురు
కరియావుల రాజట తగ క్రొవ్వినాడు
ఎగసి తన కతారిని వూడతన్నినాడు
వాని కావర మణచి వాని పొడిమార్చి
పూని వాని నా కతారికి పొలిచేసి
వత్తును
తలగడిగి దీవించి తన్నంపు" మనెను.
ఆ మాట వింటనే అతివ చిటిగోపు
వేవేగ వదనము వెలవెలబోయి
కాళ్లుచేతులు ఆడక కడుభీతి నొంది
మాటలు తడబడి మనసు చలించి
తన విభునితో తాను సతి
యిట్టులనియె :
''వినవయ్య ప్రాణేశ! విన్నవించెదను
చెనికిన మాష్టీల చెలగొందని
చంపితివి
పృథివి ఏనూరు కోట్ల భూమండలము
ఎరుగ
ఎదురుబంటు లేదు ఎక్కడనైన
బిరుదుమాష్టీల గొట్టి బిరుదు
విడుపించుకున్నావు
వెయ్యవలసిన బిరుదులు వేసినావుగాని
భుజమున వీరజంజములు భుజగ
తలాటములు
గజాంకుశము సురమాలి జల్లి
ఘంటగాలంబు ఘన పిగిలిజల్లి
పెద్ద జింజిడిగొలుసు పేరుగల
బిరుదులు
కాలికి వొరియంటి కంచుబొమ్మలును
ఇటువంటి బిరుదులు ఎన్నైన గలిగి
కతారి వేలాడగట్టింది మొదలు
కతారి కోలనుండి కయ్యంబు గలిగె
కతారికోల కట్టింది కంటసమాయె
జనులకు
ఎంతవాడు నీ కతారికిందుగా ఇటు
దూరి పోగాను
అతడు విరుగ దన్నినాడంటే అనుమా
నమయ్య
ఆ కరియావుల రాజు నీకన్న
అధికుడు కాబోలు
కాకుంటే తాను కయ్యానికి రాడు
హరియ రాజులు వారింట అవతార
మెత్తిరి
ఎంచి చూచినగాని పోరు ఎవ్వరికి
కొరగాదు
కొంచపు మాట లాడితినని కోపంబు
కాయకు
ఆ కరియావుల రాజుకడకు భట్టును
పంపుము
ధరలోన భేతాళ ఘనుడను నేను

నరుడు ఎంతటివాడు నాతోను
ఎదిరించ
భట్టుదేవరచేత భయము పుట్ట జెప్పి
నామాట మీరకు నరనాథ నీవు
కాస్తిని కరియావుల రాజును కన్న
వారిని కలియ బొమ్మనుము
రాచగురువు వలెను రమణతో
నుండు.''
ఆ మాటకు భేతాళుడు అప్పు
డిట్లనియె:
"ఇందుముఖి! చింత నీకు ఇందీవరాక్షి!
వనజాక్షి! ఈ మాట వారగాదు భట్టు
నంప
వెరుపన్న రూపులేని విక్రమశాలిని
వెరుపును భయమును వివరించి
చెప్పేవు
పిడుగుకు వారశూల పృధివిలో గలద?
మానవేశ్వరు లెరుగుదురు మనను
అంతయును
ఎక్కడైన బంటు ఎదురు లేదనగ
యాదవులైతేమి? ఎవ్వరైతేమి?
ఆదిమూర్తులు వారికి అటు
సాయమైతేమి?
ఎరగక నా కఠారి విరగ దన్నినవాని
గురిచేసి గుండెలు గుదులుగా పొడుతు
తటుకున వాడంత తర్లిపోక తొల్లి
చిటిగోపు! వేగంబె శిరసంటు తనకు"
అనిన చిటిగోపు అప్పు డిట్లనియె:
"మనవిగ సామెత మార్గంబు చెప్పేను
వో విభుడ! నా మనవి వొగి చిత్తగించు
రామణేశ్వరులకంటె రణశూరులు
గలర?
అంతవారితోను అధికుడై పోరాడి
పంతాన రాఘవుడు పడవేసి చంపె
వేయి హస్తాలుగల కార్తవీర్యుల బట్టి
రయమున ఆ పరశురాముడు త్రుంపడా?
ఎదురుబంటు లేదని యా సింహబలుని
వొదిలించడా భీముడు వసుధలోపలను
ఎంతవారమైన అంతవార మనరాదు
పంతమాడ వలదు ప్రాణేశా వినుము
కాదనక తగ్గవయ్య కలియుగ భేతాళ!

## భేతాళునిభార్య చిటిగోపునకు అపశకునము లగుట

అదిగాక నా మనము అనుమానమాయె
ఎన్నడు కల ఎరుగ ఇన్నాళ్లదాక
ఈ రాత్రి కలగంటి నీకు
విన్నవించెదను
వక మదగజంబు వచ్చి మన
పురి జొచ్చి
పొదులుచు మసిరి పురజనులు
చూడంగ
పన్నెండు కొమ్మల పటావృక్షము తా
గదిసి
కొమ్మలతో తా గ్రుచ్చి కూల్చివేసినట్లు
మూకలై కాకులు ముసురుకొని
వాలినట్లు
మరి వొగ యేనుగ మసలుచు పోగా
ఆరుగ్లు కోరాడి అవనిపై కూల్చినట్లు
ఈ శకునపంతంబు ఎటువలె నుండునో!
వొప్పదు జగడము వో ప్రాణనాథ!"
"ఇందుకు చింత నీకేటికే ఇందీవరాక్షి
అప్పుడు కరియావుల రాజు
అన్నదమ్ములు వచ్చిన
కుప్పించి పడదోతు కుంభిణిమీద
భయము నీకేటికి భామ చిటిగోపు!
తడప్ప శాయక వేగ తల అంటు" మనిన
అనిన మారాడక అతివ చిటిగోపు
మనసునతగ వకమరి శంకలేక
పుట్టిమీది చమురు వొయ్యన దించె
చిట్టిగిన్నెలో బోసి శిరసంట రాగ
దారబంధము తాకి తలచమురు చిందె
"ఇలమీద వొలికింది ఇది కానిశకునము
తప్పదు జగడము వో ప్రాణనాథ!"
ఆ మాట వింటానె అళ్లున నవ్వి.
"ఇందుకు భయమేల ఇంతిరో నీకు
అందరు చూడంగ అతనినే పొడిచి
నూనె చిలికించినట్లు వాని చిక్కని
రక్తంబు
బలియిత్తు ధరణికి భామరో! వినుమ!
అటుగనుక నీ మనసులో
అనుమానపడక
తటుకున ఇటు తెచ్చి తల
అంటు" మనెను
మారుమాటాడక మగువ తా లేచి
చిలుకల గద్దెపీట చెలువముగ దెచ్చి
వామాక్షి పట్టుచీర వనరంగ గట్టెను
జిలుగు వన్నెల రవికె చెలువొప్ప
తొడిగె

నెలత తన విభుని శిరసు
నేర్పుతో నంటె
కస్తూరితో నలుగులు కడువేగ బెట్టి
అస్త్రకంకణాల చేత ఆటుకలదీసి
తడి వస్త్రములు తెచ్చి తనవిభుని
కందిచ్చె
కడవలో వేణ్ణీళ్లు కాగులకు పోసి
చన్నీళ్ల కడవ సఖియ తా తేగ
పణతిచేత వూడి భగ్గున పగిలె
పడి వుదకము వరదలై వుర్విపై మీద
చేతికడవ జూచి చిన్నబోవుచును
నాతి యపుడు ప్రాణనాథ నాథునితో
ననియె:
"వినవయ్య ప్రాణేశ! విన్నపము వకటి
చన్నీళ్ల కడవ నే చయ్యన తేగ
వరదలాయె వుదకము వొప్పుదు
జగడము
కరియావుల రాజుతోను కయ్యంబు
వొద్దు"
ఆ మాటకు భేతాళుడు అప్పు డిట్లనియె:
"భామరో! ఈ శకునపంతంబు వినవె
కరియావుల రాజు గుండెలు కాడిపార
పొడుతు
వరదలై వాని రక్తము పారనున్నాది
నీళ్లకడవల శకునము నిజము నామాట
అలివేణి వుతకము అందియ్య" మనెను

పగడంపు పలువరుస పలుగర్ర చేసి
జాలారి బండ ఎక్కి జలకంబు చేసి
బంగారు దొగడల పావాలు తొడిగి
తల ఆర్చి వెనకశిఖ తగనొప్ప వేసి
తెలివైన అరిచేత తిరుమణి చాద
కొద్దిగా చిన్నెల కొమరొప్ప దిద్ది
అద్దములో నీడ అమరంగ చూచి
స్థిరముగ నెలవంక తిరుమణి తీర్చి
నారాయణుని తలచి సూర్యునికి
నయముతో మ్రొక్కి
భోరున అన్నము భోంచెయ్య
కూర్చుండె
పల్యాన అన్నము పణతి వడ్డించె
కాయకూరలు వడ్డించె కాంత తానపుడు
కంద చిక్కుడు పొట్లకాయ కాయ
కూరలును
చయ్యన వడ్డించి పప్పటికె తేగాను
చయ్యన చేజారె
తప్పున పప్పటికె ధరణిపై చిందె
అదిచూచి చిటిగోపు అప్పు డిట్లనియె:
"ఏది చూచినగాని అవుగాని శకునములు
కరియావులరాజుతో కయ్యంబు వద్దు"
అనిన భేతాళుండు అప్పు డిట్లనియె
"అందుకు అనుమానము అతివ నీకేల?
శౌర్యంబు మెరసి సూర్యకఠారి కొద్ది

పేరుచెప్పి పొడుతు వాని పెడతట
వెళ్ల
పప్పువలె వానిమెదడు పడు భూమి
మీద
తప్పదు ఈ శకునము తరుణి
చిటిగోపు''
అనిన తన మనసులో అనుమానపడుచు
వనిత అతనికి నెయ్యి వడ్డించసాగె
ఆలాగె వడ్డించగా అతివ చిటిగోపు
తన శిశువులు భేతాళుడు తగ
వేడ్కతోను
కూరగాయతో కొంత పెరుగుతో కొంత
పూరగాయతో కొంత వొప్పుగా
భోంచేసి
వేవేగ చెయిగడిగి విక్రమశాలి
బాగైన తివాసిమీద పరగ కూర్చుండి
వేవేగ కర్పూరవిడియము తెమ్మనిన
అనిన చిటిగోపు అతివేగవచ్చి
తాంబూలము కొంచు తన విభుని చేతికి
అంపించే సమయాన అవుశకునమాయె
వుమ్మ్రపులుగులు గుంర్రించె వుత్తరపు
దిక్కున
పులు 'పకూతలు విని పూబోణి పలికె:
''కష్టము వద్దయ్య కలియుగ భేతాళ
వుత్త రపుకాడ వుమ్మపులుగు పలికె
"నెత్తురుపంతంబు నేడు నా విభుడ.''
మందిరాక్షి శకునము పంతంబు వినవె

పరివారము ఎల్లను బలసి చూడంగ
కరియావుల రాజుతో కయ్యంబు వేళ
చిత్త విత్తుగాను చిమ్మించి పొడిచినను
నెత్తురు గ్రక్కుచు అతడు నేలపై
వారిగేను
తప్పదు శకునము తాంబూలము తేవె.''
అందించె తాంబూలము అతివ చిటిగోపు
వాసించిన బాగాలు విడియము చేయుచు
కాశ కట్టుకోను కడు వేగ లేచె
''కట్టువర్గము తేవె కట్టుకోవలెను
ధట్టి సుస్తీదు తేవె తరుణి చిటిగోపు''
కట్టువర్గములు కాంత అటుతేగ
నేలనుండి గవుళి చివ్వున నెగసె
గవుళి శకునము చూచి కాంత చిటిగోపు
వివరించి తన ప్రాణవిభునితో ననియె:
''కడనుండి కడదాక కాని శకునాలు
వాలాయముగ ఇది కీడు వద్దు పోకు''
మనెను
''చిటిగోపు ఈ శకునము చెప్పేవు
వినుమ
తటుకున కరియావుల రాజును ధరమీద
కూల్చితే
ఆరువేల వాని బాంధవులు అందరు
కూడి
కటకటాయని వగవ కట్టడివున్నది''
మదిరాక్షి! తెమ్మని మరివేగ నందుకొని

# భేతాళుడు యుద్ధమునకు ముస్తాబగుట

మైనపులాగు తొడుగుకొని మట్టకాశ
వేసుకొని
సూర్యపుటము గొణము సురిమావి
జల్లి
పచ్చిశిలల పట్టు పడిదశ వేసి
పసుపు దండనూలు బాగుగా చుట్టి
కుసుమపు పూలరుమాలు కొమరొప్ప
గట్టె
బాజుబందులు చేత బిగువార చుట్టె
గాజువేరువలె ఇనుప కడియాలు పెట్టె
వడలగంధము పూసె వాగెపట్టెడ వేసె
మెడన పూవులదండ మెచ్చుగా దాల్చె
కనుబొమల నడుమ కస్తూరి దిద్దె
అనియేక ఆయుధాలు అమరించుకొని
వంకతిరుమణికై జారు వలపట గట్టి
చేకత్తి ఎడమచాత చెలువొప్ప బట్టి
కాలికి వొరియెంటి కంచుబొమ్మలును
తగుటి పిగిలి జల్లులు పెట్టి జంజీరి
గొలుసు
దాపట వంకిణి వలపట చిల్లాణము
కదురుమట్టు కత్తిగుత్తి చేతబట్టి
ఫలచేత చక్రము వెన్నున ఆయుధము

పేగుల రంపమనే పెనుగద్దగోరు
చీకాకు పరిచేటి మోకాటికత్తి
మడిమె తిరుగుడుకత్తి మరి శిలకత్తి
కొమరొప్పు గోరుకత్తి గొడువరికత్తి
అయిదు జానల కతారి అమరించుకొని
పన్నెండు జానల పట్టాకత్తిపట్టి
మదగజమువలె భేతాళుడు మనలుచు
నిలచె
అతని తమ్ములు ఇద్దరు అతిపరాక్రమ
శాలులు
అతివేగ ఇద్దరు ఆయత్త పడిరి
శిశువు లందరు కావిచల్లాణములు
తొడిగిరి
పట్టుసీలి పసుపు కాశలు వేసిరి
కొప్పున గొజ్జంకలు కుళ్లాయిలు పెట్టిరి
అపుడు ఆయుధాలు అమరించుకొనిరి
చేకత్తులు చక్రాలు చిన్నిసురియలును
బాకులు జంజాళములు బూరదారలును
మొనకత్తి నిముషములు ముసిలి
భిండివాళములు
చిన్ని సురకత్తులు పెద్ద నేజాలు
గద్దరి గొరకత్తులు కోరసురియలును

గుజ్జరికత్తులు కఠార్లు గుమ్మడి
ఈటెలును
చిప్పకత్తులు, నేజాలు, చిక్కుపఠాలు
ఆలాయుధములు బాణాకోలలు
అంకనములును
వంకకత్తులు చిరుతకోలలు వొంకిణి
వాలపుకత్తులు
వొంకిణి నేజాలు వాలపు కత్తులు
వొంకిణి నేజాలు వాటుబల్లేలు
బిరుదు కఠారికోలలు బాగైన
బాటికోలలును
అరుదైన ఆయుధాలు అమరించుకొనిరి
భేతాళుని వుభయపార్శ్వముల నిలిచిరి
భేతాళుడు అపుడు పెండ్లి
సన్నాహముతోను
ముంజేత కంకణము ముదమొప్ప
గట్టుక
సేసబొట్టు నుదుట చెలువొప్ప నిమిడి
వకరి యిద్దరిచేత వుల్లెడ పట్టించుకొని
వగనిచేత గరిగె వయ్యాన పట్టించుకొని
గౌరికల్యాణము ఘనత పాడుచును
చేరి వుభయకడల సేసలు వేయగ
తన సతిచేతి దీవెన తానందుకొని
ఆ సన్నాహముతో కదిలిరి తన
అనుజులు తాను

ఇల్లు వెళ్లిపోగాను వీథిలోనుండి
భేతాళునికి ఇంగలపు పెంచు ఎదురాయె
పిల్లులు కాట్లాడి భేతాళుని కాళ్లకు
పెనిగె
కల్లగాదు ఈ శకునము కాకవచ్చింది
కరియావుల రాజుతో కయ్యంబు వద్దు
మళ్లి తిరిగి ర''మ్మని మనవిగా
చెప్పెను
అందుకు భేతాళుడు అప్పుడిట్లనియె :
''ఇందుముఖి! ఈ శకునము పంతంబు
వినవె
మారుజాలపు పిల్లవలె మరుగు
చొచ్చినాను
తరిమి కరియావుల రాజును ధరమీద
కూల్చేను"
అని మొరతోవున్న అతివ మాటలు
వినక
తన శిశువులు తాను ఇరుమేల రాగ
పట్టపగలు దివిటీలు పట్టింకుకోని
చేటలతో దుమ్ము చెరిగించుకొనుచు
''ఏడి బంటు తనకు ఎదురేడి",
యనుచు
''ఏడిరా నాతోను ఎదిరించిన వాడు ?
ఏడిరా! కఠారి విరగదన్నిన వాడు ?

ఏడిరా కరియావుల రాజు ? ఏడివా'' డనుచు
అనుచు మదగరువమున అటువలె రాగ
వోరుగంటి ప్రతాపరుద్రునికి వార్త జెప్పేటివాడు
బచ్చన ఎదురాయె బజారులోను
పట్టుధూళి బచ్చనపైబారె నపుడు
బచ్చన్న కోపించి పలికె నావేళ :
' పోతరమున మేకపోతు తుళ్లినట్లు
తుళ్లుచున్నావు తుళ్లకు వోరి
కావరమున కన్ను కానకున్నావు
పగలు దివిటీలు ఏమి? బహుచిన్నె ఏమి ?
చేటలతో దుమ్ము చెరిగించుట ఏమి ?
పుల్లెడ ఏమి ? నీ వొయ్యారమేమి ?
కలహముకు పోవుచు బాషికము కంకణము ఏమి !
మగువల పెండ్లాడితే మరి భోగముకద్దు
మొగవాని పెండ్లియాడితే ఏమందురు జనులు ?
చిన్ననాటి పెండ్లి చిటిగోపు నీవు
తలంబ్రాల బియ్యం తగ పోసికొంటిరి
కొరివితో తల గోకికొనినట్లు ఎట్లు
వాదిగివూరికే వుండనివ్వదు దైవము
ఘుమఘుమకులాధీశ్వరు డతడు యాదవరాజు
పిరికి మాష్టీల గొట్టి బిరుదు విడిపించు కున్నట్లు గాదు
ఆ కరియావుల రాజు నీకు జముకడు పొమ్మి''
బచ్చనమాటలు బాకులై తగిలె
అనిన భేతాళుడు అప్పుడిట్లనియె
"కానివ్వర బచ్చన్న నీవు కావరపు మాటలాడితివి
కదిసి కరియావులరాజును కాడిపార పొడుతును
వాని కండలు రక్తము గావుపట్టి
మెదడు కటారిపోతురాజుకు మేతగా బెట్టింతు
అప్పటికి భేతాళుడని పిలుతువుగాని''
అనుచు ప్రతిజ్ఞల బలికె అపుడు భేతాళుడు
తన కటారి పట్టుదాలాన ఆయుధము కొలిచి
బోడికలచేతికి భోరున యిచ్చి
"కరియావుల రాజుకడకైన పోయి
నీవు పొడువు కొలుచుకొని దీటైన ఆయుధము
సాధించుమని చెప్పి చయ్యన రాండి''
అనిన భేతాళుని శిశువులు అతివేగ వచ్చి
యాదవరాజుతో అప్పుడిట్లనిరి :

"వోయి కరియావుల రాజ! కలియుగ
భేతాళుడు
తన కఠారి పట్టుదారాన కొలుచుకొని
కురుచ ఆయుధమని నీవు కోసపారేవు
గాన
ఏడు జానల కఠారి ఇటు తెచ్చు
కొ"మ్మనెను
"కలిగితే మేలాయె కలుగ కుంటేను
కలియుగ భేతాళునికదకు బోడిక నంపు
ఏడుజానలకన్న ఎక్కువైన కఠారి
ఇట్టివి మా గురువువద్ద ఎన్నైన
గలవు"
అనిన కరియావుల రాజు అతి
పరాక్రమశాలి
తన మనసున వెరువక ధీరుడై పలికె
"కమలనాభుని కృపను కలిగివుంటేను
మేరువు తృణము గావచ్చు, తృణము
మేరువయవ్వచ్చు
ఏడు జానలుగాదు ఇక ఏడుజానలు
కఠారి యిటు తెచ్చుకొమ్మనుమీ!
అయిదు జానల కటారి ఆయుత్త
తనకు
అవును భేతాళుడు తనకు
అన్నగావలెను
తన తలదన్ని పుట్టిన తమ్ముడను నేను

తడవు శాయక తమ ఆయుధాలు
తగను పన్నించుక
గ్రక్కున మీ గురువును కదలి
రమ్మనుడు"
అనిన భేతాళుని శిశువులు అతివేగవచ్చి
తమ గురువుకు ఆ వార్త తగ
జెప్పగాను
ఆవేళ గండె మాధవుడు అడప
కేశవుడు
ఇద్దరు నట వచ్చి ఇల నాథుని కనిరి
వేవేగ ప్రతాపునికి విన్నపము చేసి
"సకల జననాథ! సంతత
పుణ్యాత్మ!
సకల శాస్త్రపురాణ సంపూర్ణ చంద్ర
శంభుని తీర్థము సేవింత మనుచు
వచ్చిరి యాదవులు వసుధ కంపింప
ఆ యాదవులలోను అతి పరాక్రమశాలి
కరియావుల రాజట మహకార్యావాదిట
కలియుగ భేతాళుడు కట్టించినట్టి
కఠారివంక చూచి కలకల నవ్వి
ఇలలోన మాష్టీనికి ఇది యెంత
గర్వమనుచు
భూపతులు మంత్రులు బుధులు
జనులెల్ల
ఈ బిరుదు కిందుగా వీగిపోచేసెను

హరివంశముహారము యాదవులము
మేము
చూడవచ్చి గవునిచూచి మెచ్చును
ఎగసి తన్నినాడట ఏడు తునియలుగాను
అందుకు భేతాళుడు అతిరోష పుట్టి

పోట్లాడ అతడు పోవుచున్నాడు"
అనిన ప్రతాపరుద్రుండు హరుషంబు
నొంది
తన మంత్రి వర్గముతో తలపొయ్యసాగె

## ప్రతాపరుద్రుడు భేతాళుని, కరియావుల రాజును తన సముఖమునకు పిలిపించుట

"వింటిరా! సభవారు వీరు వారనక
కంటసమున మాకు కలియుగభేతాళుడు
కట్టరాని బిరుదులు కట్టించినాడు
ఇతడు కట్టిన బిరుదులు అతడు కడకు
పడదన్నినాడు
అది యాల కట్టితివని అతని ననరాదు
ఇది యాల తన్నితివని ఇతని ననరాదు
కట్టించిన బిరుదులు కడకు పడదన్నిన
వాని
చూచి భేతాళుడు బిరుదు సూటిగా బట్టి
నాడు జగతిలో భేతాళుని సాధన
యెక్కువ అని చెప్పుదురు
ముగ్గురు యాకమై అతని మొనసి
భంగఫితేను

ప్రతాపరుద్రుని బలిమిన పోయి
యాదవుల చంపి హారని ఎన్నేరు జనులు
పాళిబెట్టించి అవుపాళి గాకుండ
పోట్లాడింతాము వారినని పోయి
తె"మ్మనెను
అని ఆనతిచ్చిన అడప కేశవుండు
ఘన వేగమున మాష్టీల కడకు నేతెంచి
"భేతాళుడు! మిమ్మున ప్రతాప
రుద్రుండు
తొలగక వేగమున తోడి తె"మ్మనెను
యాదవుల మిమ్ము"
అని మాష్టీలకు చెప్పి ఆ రాజుకడకు
అంపి తా కదిలెను అడప కేశవుడు
కరియావుల రాజు కడకు తానొచ్చి,

"యాదవేశ్వర! మిమ్ము నేను అడకు
తోడితెమ్మని
మా మేదినీశ్వరుడు మమ్మంపినాడు"
అనిన కరియావుల రాజు అతిపరాక్ర
మశాలి
పల్లికొండను అయితమరాజును
వల్లభన్నను
వేగమె రమ్మని విన్నవించె నపుడు
వైళమె కరియావుల రాజు వారిని
రప్పించి
ప్రతాపుని కడకు పంపె ముందుగాను
అంతట ప్రతాపుడు యాదవు లందరికి
పట్టు తివాసీలు పరిపించె నపుడు
కూర్మితో వారిని కూర్చుండ నుంచి
పల్లికొండను చూచి ప్రతాపరుద్రుడు
అప్పుడు ఈరీతి ఆడె నొకమాట:
"ఏ దేశమువారు యాదవులు మీరు?
తెరగొప్ప వస్తిరి తీర్థయాత్ర మీరు
వచ్చి మాష్టీలతో వాదు బెట్టుకొంటిరి
కలియుగ భేతాళుడు కన్నమా ధీరుడు
కలనైన పోరు కావలె నంటారు
కతారి తన్నిన కరియావుల రాజు
పోట్లాడకగాని పోనియ్యనంటాడు
యాదవుల గురువవు ఆదినారాయణు
డవు
ఏమి చేయవలెనో ఇపుడు ఎరిగించు"
మనెను
అతిధర్మ పరుడైన అ పల్లికొండ
ప్రభుని మనసుకు పల్లికొండ పలికె:
"శాంతిగుణములు గల సర్వజ్ఞ
మూర్తివి
కార్యసాధన ఎరిగిన ఘనుడవు నీవు
కలియుగ భేతాళుడు కరియావుల
రాజు
సరిశాయ ఇద్దరు వక్క సమానమే
మాకు
ఇతడు వూరుకుంటే అతడు ఏమీ
అనరాదు
కలియుగ భేతాళునితో చెలిమి
యేమిటికంటె
తెలిపి కరియావుల రాజును తిరుగ
నంపుదుము
కలియుగ భేతాళుడు పోరు
కావలెనంటె
ఇలలోన కరియావుల రాజు ఇతనికి
జంకడు
వద్దని చెప్పుడీ వసుధేశ్వరులు మీరు
బుద్ధిమార్గము తెల్ప పెద్దలు మీరు
అనిన ప్రతాపుండు అతిసంతసించి

తన ప్రధానులచేత భేతాళునికి
తగను చెప్పించె
ఎంతైన విడువనని పంతంబులాడె
ఆరీతి పల్లదాలు ఆడంగ వినియు
అపుడు పల్లికొండ ఆయితమరాజు
రప్పించిరి కరియావుల రాజశేఖరుని
కరియావుల రాజు గజకంఠీరవుండు
సరగున అనుమంతుని చవికెకాడనుండి
కాలనున్న అందె ఘల్లుఘల్లు అనగ
బాలపెద్దలతోను బాలరంబులు వేవ
వెనక వింజామరలు వేటు రుమాలలు
వేయ
ఘాటమైన మంచి గచ్చుటరిగెలు నడిచి
కలిగె సందడి భట్టు కైవారములు
సేయ
విలసిల్లు శృంగారపు వీథుల మెరసి
కదిలి వచ్చెనపుడె కరియావుల రాజు
వచ్చిన మాష్టీడు వసుశథ్వేరునికి
చెప్పె
"మచ్చరమున వక మేడము మరియు
పన్నించు
మేడెములో చొచ్చి మెరసి పోట్లాడు
తారని
చూడవచ్చేరు ప్రజలు చోద్యంబుగాను
మాఘెవాడ, అనుముకొండ మన్నీలు
వొచ్చేరు
కట్టడి కరియావుల రాజు పోట్లాటచూడ
మనుకోటగిరి. ఏజిపేట మగువలు
వొచ్చేరు
అంచితముగ వొచ్చేరు అటు వార్ని
చూడ
గవిచెర్ల, కొంగివాక ఘనులు వొచ్చేరు
రవితేజ ఘనుడైన కరియావుల రాజు
పోట్లాటచూడను
చుట్టుపట్లవారు చూడ వొచ్చేరు"
పురిలోనుకరియావులరాజుపోట్లాడచూడ
మేడలకు నిచ్చెనలు మెచ్చుగా చేర్చి
ఆడస్త్రీలు కొందరు ఆటు చూడగాను
మల్లెసాలలు ఎక్కి మరి మిద్దెలెక్కి
మదిరాక్షు లందరు మరి చూడగాను
ఆరీతి చూడంగ అపుడు భేతాళుడు
మదగజము రీతి వొచ్చి మేడెములో
చొచ్చి
చొచ్చి కరియావుల రాజును చూచి
యిట్లనియె :
మచ్చరంబున పిలిచి మరియు
రమ్మనెను
పిలిచిన అతడు మహాభీకరముగాను
కలియుగ భేతాళునితో కయ్యానకు
పోవుచు
అమిత విక్రమశాలి ఆ కరియావుల
రాజు

తమ బావకు దండప్రమాణము లగ
సమర్పించె.
కన్నుల మ్రొక్కిన కరియావుల
రాజును
మనసున దీవించి మరియు పల్లికొండ
పరమాత్ముడై నట్టి పల్లికొంత దీవెన
వరుసతో కరియావుల రాజుకు
వజ్రాంగిజోడాయె
అంతట కరియావుల రాజు ఆ
మేడెముమీదికి వొచ్చె
కరియావుల రాజు వొచ్చెననీ కలియుగ
భేతాళుడు
కత్తుల తోరణము కట్టించె నవుడు
కత్తుల తోరణము కట్టించ చూచి
అటు వకమేడెము అవతలపడ దుమికె
ఎంతైన భేతాళునికి ఎదిరెంచి నిలిచి
అటుపలె నిలిచిన అపుడు భేతాళుడు
పెటపెట పండ్లు పెదములు కొరికె
భేతాళుని గంతులు బెదరంగ నిపుడు
భేతాళుడు వొక బొబ్బ ఫెళ్లన నార్చె

## భేతాళునితో పోరనున్న కరియావుల రాజును చూచి పౌరకాంతలు చింతించుట

అతని ఢాకలకు అతని ఆర్బటములకు
కాంతలు పురుషులు కరియావుల
రాజును చూచి
"అయ్యయ్యో! బాలకుడా! ఇపుడు
భేతాళుని
కయ్యంబు నీకెట్లు కలిగెరా తండ్రి!
ఎన్ని నోములు నోమి ఎలనాగ మీ
తల్లి
వోరుగంటి గండికి కోరుబెట్ట కనెను
పున్నమా చంద్రుని పోలికె వున్నాది
నోచిన నోములన్ని వేముల పాలాయె
చందమామవంటి చక్కని కొడుకా!
వోరిస్తే పోట్లాడుదురు వోరుగంటిలోన
ఎరగక మీతల్లి ఎట్లంపెనో కొడుకా!
కన్నతల్లి నీకు కాదు కాబోలు
నిన్నంపి కంటికి నిదరెట్లు వచ్చును?
దయలేక మీతల్లి తమ బంధువులు
తాము
కైచేసి నిన్నెట్లు కయ్యానికి పంపిరి?
నీతల్లి చన్నిచ్చి నిన్ను ఈడేర్చి
కలియుగ భేతాళుని కఠారిచేత
ఖాలాయుష్షుగ బ్రహ్మ వ్రాసె కాబోలు

కావుంచె తోరణ స్తంభాలకు
కట్టించినట్లు
నిక్కమే తీర్థమనుచు నిన్నంపె
కాబోలు
ఇక్కడి కలహము ఎరుగదు కాబోలు
నీ చక్కదనమును నీ రూపురేఖ
చూచేనని మీతల్లి సంతోషపడునా
కలియుగ భేతాళుని కడు పాపకర్ముడని
ఎరగక కఠారి ఏటు కప్పగించె
ఎన్నెన్ని ప్రాణాలు గుత్తగొనెనో
భేతాళుడు
అన్యాయపు దైవము హతము చేయదు
కాబోలు"
అనుచు ఈ విధమున అడులుచూ
పొగులుచూ
వనితల కన్నీరు వరదలై పార
కూతుళ్ల కన్నట్టి కుసుమ సిరిగంధులు
చేతులు పిసుకుచు చింతింపసాగిరి
కొమాళ్ల కన్నట్టి కొమ్మ లందరును
కుమ్మరాము చిచ్చువలె కుమారిలసాగిరి
అన్నలు గలయట్టి అతివ లందరునూ
కన్నీరు పెట్టుచు కడు దైన్యపడుచు
తమలోన దుఃఖించుచు తల్లడిల్లసాగిరి

తమ్ములు గలయట్టి తరుణు లందరును
తగనొప్పు దుఃఖించి తల్లడించేరు
"వోరుగంటి శంభుడా వుగ్రమూర్తి నీవు
కలియుగ భేతాళుని కరియావుల రాజు
కడగెలిచి పోతేను కంబాన కోడెల
కట్టేము శంభుడ కడువేగ నీకు
కరియావుల రాజు భేతాళునితో కడు
గెలచిపోతేను
పందుము సెనగలు పందారము
సేయింతుము
కరియావుల రాజు భేతాళునితో కడు
గెలిచిపోతేను
ఏటేట తీర్థము వచ్చేము శంభుడ
కరియావుల రాజు భేతాళుని కడు
గెలిచిపోతేను
గుడితిరుగ బంగారు గుందుతీగ
తీయింతుమయ్యా
కరియావుల రాజు భేతాళునితో కడు
గెలిచిపోతేను
గండగత్తెరతో తలను కత్తిరించు
కునేము
పళ్ళెమున నివ్వాళి పట్టేము మేము"

## ప్రతాపరుద్రుని సమక్షమున భేతాళుడు, కరియావులరాజుల ద్వంద్వయుద్ధము

అనుచు పురకాంతలు అడలంగ మనము
పటుగతి భేతాళుడు పన్నెను కఠారి
కఠారి పన్నుకొని కలియుగ భేతాళుడు
అటు నిటు పరువళ్ళు అంతయు చేసె
పెళపెళ నార్చు పేర్వాలు ఝారుచు
వడిచేసి కరియావుల రాజుతో
వెరువక నిలచె
కఠారి పన్నుకొని కరియావులరాజు
గ్రక్కున నిలచె
నిలచిన రణరంగ నిత్యకరుణ చూచి
పలికెనా భేతాళుడు పల్లదా లపుడు:
"వోరోరి నాపేరు వొగి చెప్పగాను
ధారుణిలో మాష్టీలు దద్దరిల్లేరు
పచ్చిపాలు తాగిన నొచ్చు నోటి '
వాడవుగాక
మచ్చరంబున వచ్చి మాపురి చొచ్చితివి
కొరివితో తల గోకికొనన్నట్లుండె
యెరగక కఠారికోల యెట్లు తన్నినావు
కలియుగ భేతాళుని కఠారి పాలుగాకు
వ్రాతఫల ముండంగ వస్తివి యిటకు
నీ శుభఫలాలు నీకు సిద్ధించు

కాచుకో యెటువలె నీ ప్రాణి కాచు
కొమ్మ"నుచు
కలియుగ భేతాళుడు హుంకరించి
పొడిచె
పొడిచిన కనుగొని చేకత్తిన తప్పుకొని
అప్పటప్పటికి వొడిచేసి అదరించి
పొడిచిన
తప్పించుక కలియుగ భేతాళుడు తన
కత్తిచేత
ఆరీతి కరియావుల రాజు అపుడు
భేతాళుడు
పోరాడసాగిరి పృథివి కంపింప
హుంకారములు పెడబొబ్బలు
అంతింతకూను
ఘీంకారములు పెట్టుచు చేసిరి యుద్ధంబు
తొల్లి మరి దుర్యోధనునితో భీముడుపోరి
నయట్లు
కదసి భేతాళునితో పోరె కరియావుల
రాజు
బిరబిర పొడుచుచు బెరదాటి
ఝగ్గుచుచు

ధరణి కంపింపగ డాకలు చేయుచు
పరిపరి విధముల పట్టి చేయుచును
శరీరమున భేతాళునికి చెమటలు కురిసె
కలియుగ భేతాళుడు కడు సొమ్మసిల్లి
అలిసి నానాదిక్కుల అటు చూడసాగె
అటువలె భేతాళుడు అలుష వొచ్చి
నొంద
దీటు తప్పినవాని వలె దిక్కులు
చూడంగ
అపుడు కరియావుల రాజు ఆ
భేతాళుని చూచి
తప్పక వాని చూచి తా బలికె రాజు:
"కంటి కంటి భేతాళుని కాలి
పరువడి గంటి
కంటి కంటి భేతాళుని కఠారిసాము గంటి
కంటి కంటి భేతాళుని కాలిమెరువడి
గంటి
భేతాళ! ఇందాక పవురుషాలు ఆడితివి
మాతోను ఆడిన మాట లెటుబోయె?
గొల్లవాడని నన్ను పల్లదాలు ఆడితివి
గొల్లవాడను గాను నీపాలిటి పిల్లల
పిడుగును
మధురలో చాణూర మల్లులబట్టి
మద మణచినవాడు మా గొల్లకాడ?
రట్టడి తృణావర్తుల రయమున త్రొక్కి
మట్టగించిన– వాడు మా గొల్లకాడ?
ధట్టించి రాక్షసులనెల్ల ధరమీద గూల్చి
మరి కంసుని గూల్చినవాడు మా
గొల్లకాడ?
అతని వొంశము మాది అవని లోపలను
హతము గావింతును పల్లదా లాడిన
వార్ని
తప్పక పొడుతును తప్పించుకోర
చెప్పక పొడిచేటి చెయి నాదికాదు
చెప్పి పొడుతును వోరి శవిర్యంబు
మెరసి
చంపక విడువను చలపట్టి నిన్ను"

## కరియావులరాజు కలియుగ భేతాళుని సంహరించుట

అనుచు ప్రతిగ్నె పలికి అపుడు కరి
యావుల రాజు
ఘనుడు తన కతారి వరదూసి
ఝళిపించె
కాలనున్న అందె ఘల్లుమని మ్రోగెను
వాడినార్చి కాళవాటున చూపె
భేతాలుని కతారి తన చేకత్తిన
ఎగజిమ్మె
పేరుచెప్పి పొడిచెను జానెడు కతారి
పెడతట వెళ్లెను
పోరున వెనుదియ్యక పోటు కొసపారక

కరయావుల రాజును తన కతారిన
పొడిచె
పొడిచిన కరియావులరాజు పొంకముగ
ధట్టి
చూచి భేతాలుని ఎదురొమ్ము సూటిగా
పొడిచె
రెండు పోట్లు తాకి రెణవీథిలోను
కొండవలె భేతాలుడు కూలె నచ్చోట
కాళంగి రుద్రుడై కరియావుల రాజు
అతని కూలంగ పొడిచె అతివేగమునను

## కన్నమాధీరుడు కరియావుల రాజు నెదిరించుట

కార్చిచ్చువంటి వాడు కన్నమాధీరుండు
అన్నను చంపి క్రోయని అర్చిన
వాడనుచు
కన్నుల కోపంబు కణులుచు పలికె:
"వోరి ఎందు బోతావు వొరిగించి
మాన్నను
ధరమీధ ఖూల్చితినని ధట్టించి పలికెవి

అతడు వొరిగితే మేలాయె అతని
తమ్ముడ నేను
అతని చంపినయట్టి నిన్ను అవనిలో
విడువ
తనతోను పోట్లాడుమని తన పేరుచెప్పె
ఘనమైన సూర్యకతార్లు దీసుక
వొచ్చి మేడెము చొచ్చి వైరుకు నిలిచె
ఎచ్చుగా కథారి ఛెణుకుల్లు చేసె

## కరియావుల రాజు కన్నమాధీరుని వధించుట

చేసిన కరియావుల రాజు అతని
చెణుకులు తప్పి
చూచి కన్నమ ధీరుని రొమ్ము సూటిగా
పొడిచె
పొడిచిన కన్నమాధీరుండు పుడమిపై
ఎదురెక్కె
వడియెక్కి మాష్టీడు వచ్చుట జూచి
కేళించి శిరస్సు తన చేకత్తిన పొడిచె
కుంభిణిమీద అతని కూలంగ పొడిచె
కొండవలె కన్నమాధీరుడు కూలె
నచ్చోట
విలవిల తన్నుక విడిచె ప్రాణాలు
ఇద్దరిని పడపొడిచి ఇలమీద కూల్చి
పెద్దగా కరియావుల రాజు పెడబొబ్బ
నార్చె
కలియుగ భేతాళుడు కన్నమాధీరుడు
చలపోరి కరియావుల రాజుతో సమిసిరి
యిద్దరు
అతని తమ్ముడు రంపాల కేశవుండు
దండిగా కఠారి తీసుక తా కదిలివచ్చెను
ప్రతాపరుద్రుండు పల్లికొండ అయితమ
రాజు,

ప్రజలు చూడంగ పలుకుచు రాగ
గట్టిగా కరియావుల రాజుతో కయ్యానకు
రాగ
భట్టావుల వల్లభన్న చూచి పలికె
నావేళ :
"వోరి! పల్లదములు పలుక
వొప్పిదము గాదు
భూవల్లభుని ఎదుట భుజశక్తి మెరసి
బంటు సరిపోయె మరిబంటు అధిక
మాయె
బంటుపంతములు గావు వకరితో పట్టి
పలువురు—పోరాడ భావ్యంబు గాదు
పోరితే మేలాయె పుడమిలోపలను
వారివంశము వారిని వద్దనరాదు
అతని తమ్ముడవు నీవు ఇతని
తమ్ముడను నేను
కయ్యము చేయుము కదసి నాతోను"
అని వల్లభన్న అతివేగ లేచె
అపుడు మేడెము చొచ్చి అతడును
తాను
గజ్జెల కఠార్లు ఘల్లుఘల్లనగ
సజ్జముగ కఠార్లు ఝళిపించుకొనుచు

## భట్టావుల వల్లభన్న రంపాల కేశవుని చంపుట

కదిసిరి యిద్దరు కడుసాహసమున
బిరబిర పొడుచుచు బెరదాటి యెగుచుచు
చెలగి లంఘించుచు చేకత్తులు తప్పుచు
బలభద్ర రాముడు బలు ముష్టికునితో
చలమున మధురలో చలపోరినట్లు
పురజనులు మంత్రులు భూపాలు
చూడంగ
సరి పరాక్రములంత సాహసము మెరసి
అటువలె పోరాడి ఆ వల్లభన్న
తన కఠారితో అతని పుదరము
కాడిపార పొడిచె
పొడిచిన వడి నెగసి పుడమిపై నొరిగె
పడి ప్రాణములు విడిచె రంపాల
కేశవుండు
ప్రజలు చూడంగ భట్టావుల రాజు
రంపాల కేశవుని రణములో కూల్చి

వడినార్చె భట్టావుల వల్లభన్నయపుడు
అపుడు ఆ సభవారు అందరు చూడంగ
మాషీలు ముగ్గురు మడిసి రనియేరు
శంభుడు అటు వారి సాహసము మెచ్చి
కుంభిణిపై కురిపించె కుంభవర్షంబు
అపుడు ఆ సభవారు ఆశ్చర్యపడిరి
గుప్పుగుప్పున కొలుపు గొబ్బున లేచిరి
వీరప్రతాపుండు వచ్చె గృహముకు
నపుడు
వేగంచె యాదవులు వేంచేసిరి తమ
విడిదికి
భేతాళుని శిశువులు బెగడి యాడుచును
ఆ తావున వుండిరి అతని చుట్టువారు
బల్లిదుండైనట్టి భేతాళుని శిశువులు
అల్లకల్లోలముగా అడలుచు నుండిరి
అంతపురములోకి ఆ వార్తపోయి

# చిటిగోపు విలాపము

ఆవేళ చిటిగోపు అతివలు తాను
పరుగన నేతెంచి ప్రలాపించుచును
కలియుగ భేతాళుని కడకు తావచ్చి
సమర నిశ్శంకరుడు వున్న చందంబు
చూచి
తన విభునిపై నొరికి తా బడుకొనుచు
ఘనమైన ఎదురొమ్ము కరములుచూచి
కనుబొమ్మ చెక్కిళ్లు కనుక గళము
చూచి
వనజాక్షి ఇట్లని వలపొయ్యసాగె :
"ఏమి హోంకార! వో భానుతేజుండ!
వో విక్రమార్కుడ : వో
సాహసఘనుడ!
కరియావుల రాజుతో కయ్యంబు
వద్దని
పరిపరి విధముల భాషించి చెప్పితిని
నేనెంత చెప్పినా నామాట వినక
పూని కరియావుల రాజుతో పోట్లాడి
నావు
వధియించె నిన్నతడు వధియించగా
విభుడ
తారబుద్ధులు వినక తమ్మునితో వాలి
ఘోరాడి రాముచేత పొలిసెను తొల్లి
మండోదరి చెప్పిన మంచిమాటలు
వినక
కొండవలె రావణుడు కూలె రఘుపతి
చేత
కంసుడు సతిమాట కడు చిన్నబుచ్చి
చెల్లెలి శిశువుల చెనకి తా చచ్చె తొల్లి
అలాగె నామాట ఆలించి వినక
మడిసితివి కరియావుల మాధవుని చేత
తమ్ములు ఇద్దరు నినుగూడి ఇక్కడ
మడిసిరి
వ్రాతఫలము ఇట్లు వ్రాసెను బ్రహ్మ
పుడమిన మించినట్లు పోరిన
భుజబలమెల్ల
తొణికి కరియావుల రాజుచేత
త్రుంగెగా విభుడ!
శిశువులకు సాధనలు చెప్పిన హస్తాలు
వసుధపై విరుగంగ వాలెగా విభుడ!
కంబాల మెలిగేటి కడు మంచి
బాహులు
కుంభిణిమీదను కూలెనా విభుడ!
అందరు గుండలయిన అసహాయ
శూరుడవు

సరిపోరి కరియావుల రాజుచేత
సమిస్తివిగా విభుడ :
చుక్కలరాజువంటి చూడగల మోము
గ్రక్కున కళదప్పి కందెగా విభుడ :
మెరుగు టద్దముల వంటి మేలైన
చెక్కిళ్లు
ధరణి పాలయ్యెనా తగ నేడు
నావిభుడ ?
పుత్తడిబొమ్మను బోలు నీమోము
నెత్తురు జారెగా నేడు నావిభుడ :
నీ సాధన మెరువడి నీ భుజబలిమి
భూమి పాలయ్యెగా పోలిసి నావిభుడ :
భేతాళుడు ఇన్నాళ్ళు పక్షముగా నీకు
ఈలావున సాయము ఎట్లు
కూడదాయెను ?
కాని శకునాన వచ్చి కయ్యంబు చేసి
కరియావుల రాజుచేత మడిస్తివిగా
విభుడ :
నాకెదురు లేరని నిస్సారము చేసి
అ కరియావుల రాజుచేత
హతమైతివిగా విభుడ :
వొన్నెగల నిగనిగల నీవొళ్ళ జాలి
కుడిచె
అపుడు నీతోను అంతయును జెప్పితిని
నాకల నిత్యమాయె నా ప్రాణనాథ :
పోకుమనగా వొచ్చి పోలిస్తివి
నావిభుడ :
వుర్వి ప్రసిద్ధిగా నీపేరు వుండెగా
విభుడ!"
అని అని పలుమారు అతని పేర్కొని
వనజాక్షి మూర్ఛిల్లి వసుధపై నొరిగె,
చెల్లుగా మాష్టీల చంపివైచినయట్టి
బలిమెల్ల భూదేవి పాలాయె భేతాళ :
అనుచు ఆవిధమున అతని శిశువులెల్ల
అనియేక విధముల అడులుచు
నుండంగ
అపుడు చిటిగోపు అనియేక తడువున
అగ్గళంబుగ అపుడు అతని
పేర్కొనుచు
ఘనతతో నప్పుడు కాంత యిట్లనియె:
"అతి పరాక్రమశాలి:ఆహవఘనుడ :
అందరివైనట్టి అయ్య భేతాళ:
రాజాధిరాజులు ఇట్లు రమ్మనగా
తేజముగ వెలసిన ధీరుడవు నీవు
నీరూపు నీరేఖ నీచక్కదనము
ధారుణి లోపల దాగెనో విభుండ :
ఛప్పన్న దేశాలలో సాహసఘనుడవని

చెప్పుదురు మాహాత్మ్యము జనులు
ఎక్కువగాను
కలియుగ భేతాళుడవు కదన వీర
భద్రుడవు

వినుతింప సాహస విక్రమశాలి ;
వింతవానితో పోకున్న తనకు
విహితంబు గాదు"

## చిటిగోపు సాగుమానము

శిశువులచేత పట్టించె శ్రీఘ్రమే పతిని
మశానమునకు తన మరుదుల నంపించె
భూతలంబున చిటిగోపు భూమి
తాగానెను
శకరుల బిలిపించి త్రవ్వించె గుండను
చందనపు మాకులతో చితిని పేర్పించి

పొందుగా అగ్నిలో పురుషుని
దరికొల్పె
పుణ్యపు నీరాడి భూసురుల సతులకు
వస్త్రాలు మాడలు వయ్యన నిచ్చె
జనులెల్ల చూడగ చంపుతు కట్టెక్కి
తన విభునిపై వారిగె తరుణి చిటిగోపు

—: o :—

# పాపనూక కథ

## -: కృత్యాది :-

శ్రీ మించు గోపికా శ్రీహరికి మ్రొక్కి
భ్రమరాంబ శివులను ప్రార్థన చేసి
తామరసగర్భునకు దండంబు పెట్టి
అమరంగ శారదకు అంజలి చేసి
చింతలపాటి నూకలాంబను చిత్తాన
దలచి
సంతోషమున గణపతిస్వామిని దలచి
ఎలమంచి గంగను ఎదలోన దలచి
కలకంఠి దొనకొండగంగను వేడి
కవిరాజ చౌషష్టి ఘనులను దలచి

కదిరిమంగళము చినబసవయ్యసుతుడు
శేషవాల్మీకుడు చెలువొప్ప వెంకటాద్రి
చెలువొప్ప వెంకటాద్రి చెప్పిన కథయు
ప్రజలకు యింపుగా పాపనూక
కథయు
రాజితంబుగ ఈ కథ రచియమున
గూర్చి
చెప్పెను వినరయ్య చెవులపండుగగ
విన్నవారికి సకల విభవములు గలుగు
ధనధాన్య ఆచంద్ర తారార్కముగను

## పల్లికొండ దొనకొండలో కొలువు తీరుట

భావించ దొనకొండ పట్నంబులోను
విద్వాంసుడు పల్లికొండ వెలయ
కొలువుండి
అబ్ధిగాంభీర్యుండు అతి సంభ్రమునను

పుండరీకాక్షుండు బుద్ధులకు పెద్ద
దండనున్న పనులవారిని దాయంగ
పిలిచి
"గోత్రాం పెద్దలను గొబ్బున బిలుపించి

ధాత్రిలో తమసరి దాయాదుల నెల్ల
పనులవారిని బిలుచుక పరుగున రండి"
అని వేగ పల్లికొండ ఆనతి విని
పోయి
రాణివాసమునుండి రాజుల బిలిచేరు
పోణిమితో రేపల్లె బుద్ధిమంతులను
రామకులగోత్రమున రమ్మని పిలిచేరు
ప్రేమముతో అందరిని పేరుపేరునను
"మకటము మల్లయ్యా! మల్లె మల్లయ్యా!
నగధీరుడై నట్టి నాచకూళ్ల నన్నయ్య;
పల్లెబోయిన తల్లుః బండారు రామనః
పుల్లావుల భూపతిః భూమాడి పోలుః
దామసాని ద్రాత్రిః దండెబోయిన
మండలిః
చెముడావుల చెన్ను! చెవుల నారయ్యః
నేతివారి ముద్దయ్యః ఖ్యాతిగా రండిః
గోవుదార కోన్నయ్య గోదావరి
లచ్చుమయ్య!
శంఖుదార మల్లయః జడదారి భూపతిః
కొంకక రాశయ్యః గోవుదారి తిరుమలః
జెట్టిబోయిన చెన్ను! చెవ్వుల నారయ్యః
మట్టెవుల ఎగ్గెనః పెయ్యావుల
భాస్కరుడు
పెయ్యావుల పాపయ్య! బాగుగా రండిః
ల్లిఖ లింగనః గౌరిదేవి సాక్షి
కరిపరదు కనకనః గ్రక్కున రమ్మి
తరికోడి ధర్మజుః తమకము దత్రాత్రిః
కొమవాల గోవిందుః కొండెబోయిన
కదిరిః
రామనబోయిన రాగనః రాచూడి
లింగనః
రుద్రాక్ష మల్లయ్యః రుషికంటి
యాదన
భద్రాక్ష బసువయ్యః పల్లెబోయిన
సిద్దుః
మెడగోళ్ల పెద్దయ్యః మేకల నారయ్యః
పరువున రారయ్య! పల్లికొండ పిలిచేను
సాదము నరహరిః జక్కుము పోతుః
బుద్ధులకు పెద్దవాడుః బూదావుల చెన్ను!
చల్లవారి నారాయుడుః చెవుల
గంగయ్యః
పుల్లాకుల గంగనః పుచ్చ కోనేరుః"
వల్లవులు తిరుమందులు వచ్చిరి వేగ
గొబ్బున రారయ్య గోత్రాల పెద్దలు
విభుడు పల్లికొండ వున్న సమ్ముఖానికి
పెద్దల జూచి పల్లికొండ పేరుపేరున
పిలిచి
వద్దకూర్చుండుమనెను వసుసతో నపుడు
కర్పూర బాగాలు గ్రక్కున నిచ్చి
అప్పుడు పెద్దలతోను ఆ పల్లికొండ:

## పల్లికొండ పాపనూక వివాహ ప్రస్తావన చేయుట

"విన్నపము చెప్పేను వినరయ్య మీరు
నన్నము నాగినాయుని కొమారుడు
నాచకూళ్ల నాయినికి
నఱ్రావుల వారింటి నాతిని మనువడిగి
అరుదార కల్యాణము అందించవలెను
పరగ నాయడు పెండ్లి ప్రాయమైనాడు
చదువున సామున సామర్థ్యమునను
మదము ఏనుగరీతి మలయుచున్నాడు
ఈడేరి పాప వారియింట వున్నాది
వేడ్కతో పెండ్లి చేయవలయును వేగ
పప్పువంటకములు బంధువర్గంబు
మెప్పుగా భోంచేయవలెను మనమంత
సిరిదేవి నగరికి శ్రీఘ్రమే మనము
కదలి పోవలెను కడు సుముమూర్త
మిపుడు
పల్లికొండబుద్ధి విని బంధువు లందరును
ఎల్లుండి మూర్తము ఇది మంచిదనుచు
సంతోషగానిరి సకల యాదవులు
అంత సంతోషించిరి అతివేడ్కతోడ
వుల్లాసమున పెద్దలు వుప్పొంగుచు
వేగమె
అందరు ఏమి విచారములు లేక అరిగి
భోగభాగ్యము గలిగిన భూనాథు
నగరికి
తలసాలవద్ద నిలిచి దాదుల బిలిచి
అమరంగ మీరు అంతఃపురమునకు
పోయి
పల్లికొండబుద్ధి విని బంధువు
లందరును
వల్లవుల నగరికి వచ్చినారనియు
కర్పూరబాగాలు కాంతలకు నిచ్చి
ఇప్పుడే సిరిదేవికి వివరము చేయు
మనిరి
వేడ్కతో దాదులు వేగమే పోయి
దండిగా నగరికి తరుణు లేతెంచి
అమ్మకు అత్తకు హస్తములెత్తి
మ్రొక్కి
కమ్మకొని దాదులు కడువేగ జెప్పిరి:
"ఓ యమ్మ! వినవమ్మ ఒక
విన్నపంబు
రయమున పల్లికొండ రాముకుల
గోత్రము
వేగమే వచ్చినారు వెలది సిరిదేవిః
పల్లికొండ వచ్చినాడు పణతి సిరిదేవిః"
"నగరు శృంగారించుడు నాతులార
మీరు"
వేగంబె దాదులు విస్మయము పొంది
సిరిదేవినగరంబు శృంగారించ సాగిరి

జలతారు చీరేలు చందువలు కట్టిరి
స్తంభాల కలకనూలు గవిసెనలు
వేసిరి
చెంబుల పన్నీరు జవ్వాది గలిపి
చల్లిరి లోగిళ్ళ చెంబులతోను
చల్లని వాసన జవ్వాజి పుణుగు
ఘుమ్మున వాసించు కూజాలలోను
కొమరక్క సిరిదేవి కూటాలనడుమ
కుందనము చెక్కిన కుర్చీలు చవికెలు
పట్టు జముకాణము పరిపించి వేగ
పెద్దల పల్లికొండను ప్రియముతో
రమ్మనుచు
అతి ప్రియముగ దాదులకు చెప్పె
సిరిదేవి
అమ్మసిరిదేవి మాటలకు దాదులు
అతివేగ పోయి
రమ్మని పిలిచిరి రఘుపతి నపుడు
తిరుమండులు వల్లవులు సిరిదేవి
నగరికి
దరవాజ జొచ్చిరి తగ వేడ్కతోను
దండిబలగము జూచి తల్లి సిరిదేవి
వుండిరి అడ్డతెరల చాటున వణిత
లందరును
అల్లుడు పల్లికొండ యాదవులందరిని
కొలువు కూర్చుండుమనెను గోత్రాల
పెద్దలను
మహిపాలుడై నట్టి మాధవు
దయితన్నను
పిలిపించుకొనిరి ఆ పెద్దలందరును
ఆటపాటల వారు అందరు కొలువ
రేపటి కొలువున రేమంతుని పీర
బయట
భూపాలుడై నట్టి భోగదేవేంద్రుడు
పుర్వీశ్వరుడు కొలువై వుండె నావేళ
బారులై చతురంగ బలములు కొలువ
సాటువకెక్కిన సానికూతుళ్లు
భరతశాస్త్రము నెరిగి పాత్రలాడేరు
ధాత్రీశు కొలువున తగ వేడ్కతోను
దండిగా వీణెలు తాంబూరలు
వాయించుచు
మెండుగా నట్టువ మేళములు మ్రోవ
హితులు మంత్రులు పురోహితులు
సేవింప
సతిగూడి రాగముల్ సొరిది పాడగను
బలుమూక లొకవంక బలిసి
కొలువంగ
పటుభేరి మృదంగములు పరిపరి మ్రోవ
నటనతో కొలువున్న సన్నాహంబు
మెరసి
సంతోషచిత్తుడై సకల భోగముల
వింతగా కొలువున్న వేడ్క రంజిల్ల

అంత వేడుకతో నుండె అయితమ
రాజు కొలువున
వింతగా ఆటపాటలవారు అవనీశు కొలువ
దొనకొండ మేళంబు దోలువారి
బయ్యసాని
భూనాథు కొలువున భోరు కొలువంగ
సాధనకాళ్ళను బలుజెట్లు కొలువంగ
మేదినీపతులెల్ల మెండుగా గొలువ
భట్టులు చదువంగ బ్రాహ్మలు దీవించ
జెట్లును పెనగంగ చెలువంబు మిగుల
పిచ్చుక బిరుదుపోరు పిగుళ్ళ పోరు
మచ్చరంబున పోక మార్కొనువారు
వెలిచల పోరుపెట్టి వేడుక మించి
తలసాలవద్ద నిలచి తారసిలువారు
తగళ్ళ పోట్లాట తగ వేడ్కపెట్టి
తెగువతో ఇరువంక కొల్చేటివారు
అంగరంగ వైభవముతో అయితమ
రాజు కొలువున
రంగుగా కరియావుల రాజను ఘనుడు
దాపల తను దాయతమ్ములు గొలువ
గోపాలవర్గంబు కొలువ ఇరుగడల
అన్నలు తమ్ములు ఆత్మవర్గంబు
వున్నతంబైనట్టి వూడిగంబులును
మన్నీలు దొరలును మంత్రివర్గంబు
ఇల యేలు వైభవము దేవేంద్రు బోలి
బలములు ఇరుగడల బలిసి కొలువంగ

సంతోష చిత్తుడై సకల వైభవమున
అంత వేడుకనుండు అయితమరాజు
ఆ సమయమున అమ్మనగరున నుండి
ఎనయంగ కోలవారి ఎలనాగినేడు
వచ్చి కరములు మొగిచి వక వార్త
చెప్పె
"రాజాధిరాజ! రాజశేఖరుడ!
రాజిత గాంభీర్య! రాజ దేవేంద్ర!
కందర్ప జనకుండు పందుముల
రఘుపతి
అందరు పెద్దలు అతిసంభ్రమునను
ఏమి ప్రయోజనమో గాని యదు
కులాధీశ!
అలరంగ పిలువుమని అంపిరి నన్ను
వేవేగ యిప్పుడు వేంచేయు స్వామి!
బావ పల్లికొండ బంధువు లంపిరి."
కొలువు చాలించెను గోకులాధీశు
కవిగాయక భట్టులు మంత్రులు గొలువ
ఆటపాటలవారిని అందరిని బంపె
సాటువకెక్కిన జాణలు కొలువగా
మన్నీలు దొరలును మంత్రులు గొలువ
పున్నమా చంద్రుండు భూపాలకుండు
అతివేగమున వచ్చె అయితమరాజు
మితి మేరయును లేక మేళములు
మోవ
సొంపుతో తలసాల చొచ్చి రాగాను

కంపింప పెద్దలు గ్రక్కున లేచి
వందనము చేసిరి వయిన వయినాన
అందర్ని కూర్చుండమనెను అయిత
మారాజు
అరలేని భక్తితో ఆ పల్లికొండకు
కరములెత్తి మ్రొక్కె ఘనుడు
అయితన్న
హరిగురువు పల్లికొండ అతిభక్తితోను
కరుణతోడుత లేచి కమిగిట జేర్చి
చయ్యన కూర్చుండిరి జముకాణముమీద
అయితన్న కొలువున్న యాదవ
ఘనులు
అడాద కూర్చుండమనెను అయితమా
రాజు
కర్పూరబాగాలు కడు తెల్లనాకులు
అప్పుడు తాంబూలము అందరికినిచ్చి
గోకులపతియును గుణవిశాలుండు
తెగువతో గంధము తెప్పించె మరియు
జవ్వాజి కస్తూరి సంపూర్తిగాను
పల్లికొండ పెద్దలకు పశుపతిరాజు
అందరికి నిప్పించె అయితమారాజు
తుస్తరించి అందరని కూర్చుండనుంచి
"బంధువులు మీరును బలభద్రశయన!
అంచితంబుగ మీరు వచ్చిన పనులు
మాకు ఆనతిమ్మ"నెను
మకటకోట మల్లయ్య మర్ల మల్లయ్య
దిగ్గున తా లేచి చెయ్యెత్తి మ్రొక్కి
"మనవి వినవయ్య! వో మండలాధీశ!
మేము వచ్చిన వార్త మీకు విన్న
వింతుము
నచకూళ్ల నాయినికి నలినాక్షి పాపను
అంచితంబుగ మేము అడుగ
వచ్చితిమి"
ఆ మాటలకపుడు అయితమారాజు
"అమరంగ కొమరక్క మా(అ)త్త
వుండగను
శ్రీమించు మాతల్లి సిరిదేవి వుండగను
అశాడి పనులకు హరిగురువు
వుండగను
సంతరించి యాదేర్చి సరసాక్షులు
బలికి
పంతమాడి తెచ్చి మా(అ)న్న భక్తుడు
లేడు
కుంతనాలమ్మవద్దను మందలున్నావి
అంత కాటమరాజు అన్న విరనన్న
వుండగాను
పాపను వియ్యాను వుచితమా తనకు
కొమరగిరి వున్నాది అడగవలె మీరు"
ఆ మాటకు పనులవారు అందరు బోయి
పేరుపేరున కాంతల గ్రక్కున బిలిచిరి
ఎంతైన వేడుకతో యాదవస్త్రీల

"ఈడైన వియ్యమా ఇంద్రాక్షి మల్లమ్మ!
జోడైన వియ్యమా సుందరమించు మల్లమ్మ!
మకటకోట మల్లమ్మ! మర్ల ముళ్లారమ్మ!
ముక్కపద్మ రవణమ్మ! ముత్యంపు బొమ్మ
నెరవైన వియ్యామా నేతి మూర్తమ్మ!
శ్రీమించు వియ్యమా! సీతకు సరివొచ్చు
పాయరాని వియ్యమా పందుముల పాప!
దయగల వియ్యమా దామసాని తల్లమ్మ!
సరివచ్చు వియ్యమా సట్టు మారమ్మ!
దండిగల వియ్యమా దండెబోయన రంభ!
పుల్లాకుల భూపతమ్మ! భూమాడి పోలు!
మల్లెబోయిన రామక్క! మాసతి లక్షి!
ఆవపువ్వుల అమరమ్మ! అముర్తపు చింత!
చెవుల శంకరమ్మ! జెట్టిబోయిన గంగ!
గోవుదార లత్తుమమ్మ! గొబ్బున తిమ్మి

శివరాత్రి వెంగళమ్మ! చెప్పురాల బుచ్చమ్మ!
నాచకూళ్ల సందమ్మ! నేతి ముద్దమ్మ!
దాసిన వియ్యమా దాయాదులార
రారమ్మ మీరంత రాముకుల గోత్రము
చేరువ వియ్యమా జెట్టిబోయిన కొండ!
కొమరగిరి వోయక్క! గొబ్బున రారమ్మ
తామసించక మీరు తర్లి రారమ్మ
పులిముద్దుల దేశమ్మ! భూపతి అక్షమ్మ
ఇలధరుని చెంగమ్మ! ఇంద్రుని పోత!
చంద్రుని చెన్నమ్మ! శంకరుని మల్లు!
కనకనందుల కనక! గాలము లింగ!
సంగమేశ్వరుని సంగ! సారంగ రాము!
పొలతిపువ్వుల బంతి పుల్లావుల పుల్లు!
చెన్నకృష్ణుని చెన్ను! చెవుల నారమ్మ!
పందుముల పద్మక్క! బండారు జంగ!
చెల్లాలా రావమ్మ శంకరుని కొమ్మ!
ఆత్మబంధువులు మీరు ఆవపువ్వుల పీరమ్మ!
అంగనలు రారమ్మ అచ్యుతుని పేరు!
గోవిందుని కోనమ్మ! గొడ్డటి సిద్ద!
కొండగొడుగు గొల్లమ్మ! గోవుదార గోప!
మాధవుని గవరమ్మ! మచ్చావుల క్లేశమ్మ!

మల్లెబోయిన మాధవమ్మ! మట్టేవుల
కదిరి!
ధీమంతుని చెన్ను: దినకరు శోభు!
జొత్తుల జోగమ్మ! దొంతుల పోలు!
చింతల నారమ్మ! శ్రీధరుని సింగు!
భాగీరథుని చెంగమ్మ! పెయ్యావుల
రంగ!
జమ్ముల సానెమ్మ! సఖియ రావమ్మ!
పతిపాల సూరమ్మ! పశుపతి పాప!
పురుషోత్తము కృష్ణమ్మ!బుద్ధుల బూశు!
ఎల్లావుల ఎల్లమ్మ! ఎన్నముద్ద చెన్ను!
జిడ్డిబోయిన రొల్లమ్మ! జడదారు కోలు!
అవపువ్వుల చంద్రమ్మ! చుక్కావుల
సోము!
తరివారి తల్లమ్మ! జక్కము జన్న!
రుద్రాక్ష బసువమ్మ! రుద్రాక్ష చంద్ర!
పిన్నబోయిన చెన్ను! ప్రీతితో రమ్మ
తగనొప్ప బంధువులార! వో తరుణు
లారా!
అంచితంబుగ రారె వో అక్కలార!
సిరిదేవి రమ్మనెను శీఘ్రమే రాండి''
సిరిదేవి కోడండ్లు చిత్తరువు ప్రతిమలు
కొమరగిరి కోడండ్లు కొమ్మలందరును
ఎరణపు తల్లంపు యింతి అక్కన్న
భామ లందరు వచ్చి పాలకిలెక్కి
భామాళు అందరు వరుసతోడుతను

పన్నెండు పాలకీల నడుమ భామ
యరణప్ప
నిండిరి సిరిదేవి నగరంతా నెలత లావేళ
కొమరగిరి మొదలైన గోపికా స్త్రీలు
రమణులు సిరిదేవినగరంత నిండిరి
ఆరునూరు పెద్దలు అందరు నపుడు
సిరిదేవి మొదలుగా శీఘ్రమే వచ్చి
"కొమరగిరి వో యక్క!గోత్ర
చింతామణి!
కమనీయ నవరత్న గద్దెపై కూర్చుండం
మనిరి
పిన్నల పెద్దల పిలిపించుకొనిరి
వద్దనున్న పనులవారు వైళంబె పోయి
కల్యాణ పురోహితునికి కరములెత్తి
మ్రొక్కి
బల్లిదులైనట్టి బ్రాహ్మణోత్తముల
ఏరువ పురోహితుని ఎలమి రమ్మనిరి
పోలరాజునాటి పురోహితుని పొందుగా
బిలచిరి
కదలిరి పనులవారి వెంట గ్రక్కున
యపుడు
వడివడి తమ ఇండ్లకు వచ్చిరి వేగ
గడియలో బ్రాహ్మలు గంధమక్షింతలు
ధరియించి రందరు తగ వేడ్కతోను
పురోహితు లందరు పూని వేగంబె
పంచాంగములు చాత పట్టుకొని వేగ

మించిన వేడ్కతో మెరసి ఏతెంచిరి
ఎండపల్లెయలు ఏగురు పురోహితులు
దండిగా నగురుద్వారంబు జొచ్చిరి.
వచ్చిరి బ్రాహ్మలు వసుధేశు కడకు
బ్రాహ్మలకు దండమని పలికి
రందరును
బ్రాహ్మలు అక్షింతలు పల్లికొండకు
యిచ్చిరి.
ఆశీర్వదించిరి అయితమారాజును
భూసురోత్తము లయిన పురోహితులకు
నెల్ల
వాసిగా విడియంబు వారి కిప్పించిరి
"గాంభీర్యు లైనట్టి ఘనులార వినుడ
పల్లికొండ పెద్దలు పాప నడుగవచ్చి
నారు
పల్లవపాణైన పశుపతి చెల్లెలికి
నాచకూళ్ళ నాయినికి నలినాక్షిపాపకు
మంచి మూర్తము చూడుడా మరి
వేగ మీరు
ఎంచగలిగినయట్టి అగ్రజనులార
వైరివర్గము లేకుండ వరుస నిద్దరికి
అయ్యలార చూడుడా అయిన
లగ్నంబు
పేరుబలము నక్షత్రము పెంపు
మీరగను
వారికి మనకును వరుసతోడుతను
ఇచ్చినవారికి యిలమీద యిపుడు
పుచ్చుకున్నవారికి భూసురులార
అక్షయంబుగ చూడుడా అతిసొంపు
గాను"
అని యిట్లు అయితమరాజు అడు
మాటలకు
ఘనవేగమున చదివిరి ఘన
అష్టకములు
గిరిజా కొమారుని కీర్తన చేసిరి
వారిజగర్భుని వాణి ప్రార్థించి
వేదమంత్రములు చదివి వేవేగమును
ఆదిలక్ష్మిని స్తుతియించి అగ్రహంబు
లిచ్చి

# పాపసూకకు నాచకూళ్ళ నాయునికి పెండ్లిపొంతన కుదురునని బ్రాహ్మణులు చెప్పుట

పంచాంగములు చూచి బ్రాహ్మణోత్త
ములు
"అంచితంబుగ మీరు అందరు వినుడ
కొమరగిరి సిరిదేవి గుణమణులార
అమరంగ పల్లికొండ అయితమారాజా
నాయినికి పాపకు మంచిగా క్షేత్రము
వియ్యాలు సిరిదేవి వినగాను యపుడు
ఆరునూరు పెద్దలు అందరు వినగాను
కరియావుల రాజు కంపటము వినగాను
భట్టావుల వల్లభన్న ప్రజలంత
వినగాను
తమ్ములు అయితన్న తామంత
వినగాను
సమ్మతంబుగ బలికిరి సభయంత
వినగాను
సరిబలము ఇద్దరికి జననాథ వినుమా
పేరుబలము బాగు బృహస్పతిబలము
లెస్స
చంద్రతారబలము చాలియున్నాది
చంద్రశేఖరుండు జయమిచ్చు మీకు
జన్మనక్షత్రము జాతకము పుటక
ఇల యేలు రాజేంద్ర యెరుగము మేము
వ్రాసింది లేదయ్య ఓ పల్లికొండ"
భాషించి బ్రాహ్మలు పలికినందులకు
పల్లికొండ రఘుపతి పలికె నా వేళ
వల్లవుల పురోహితుడు వంశాబ్ధి
చంద్రుడు
"మాకావర్ఝుల మల్లయ్యను మరి వేగ
పిలువుడి"
అతివేగ పిలిచిరి ఆ పనులవారు
జాతకము చదివెను జనులెల్ల యెరుగ

## పాపనూక ఇల్లువెడలినచో పుట్టింటి సిరి పోవునని జ్యోతిష్కులు చెప్పుట

"కాటమరాజుపుటక కని వ్రాసినాను
నేటవును నామాట నిఖిలంబు లెరుగ
కల్యాణాన బుట్టెను కాటమరాజు
నల్లనివాడు నీలవర్ణము గలవాడు
కాటకోటి లింగముపేరు కాటమరాజు
కోటానకోట్లును కొలతురు అతని
తాతతండ్రులనాటి తరముగాని పగలు
భూతలంబున రిపుల పరిమార్చు నితడు
అప్పుడు వ్రాసినాను అవనెల్ల నెరుగ
పాపను గన్నతల్లి పణతి పెద్దమ్మ
ప్రేమతో సిరిదేవి పేరుబెట్టింది
పల్లవపాణి జన్మంబు ప్రజలార వినుడ
ఫాల్గుణమాసంబు బహుళ బుధ వారమునాడు
నాలుగో గడియ జమిలి నక్షత్రమూన
పుట్టుక బుధవారమునాఢు పట్టపగటివేళ
చెడ్డ నక్షత్రాన జన్మించె పాప
పుడుతానె పాపమ్మ భూమి దన్నింది
ధీరుత పెద్దరాజుకు భూమిగండ మాయె
అటువెనుక విషపు నక్షత్రమూన
పుడుతానె పాపమ్మ ధరణి దన్నింది
ధరావతి పెద్దమ్మకు ధరణిగండమాయ
పౌలతి నక్షత్రాన పులి అయి పుట్టెను
తల్లిగండాన తండ్రిగండాన
ధనముగండాన ధాన్యముగండాన
గోత్రముగండాన కులముగండాన
యిరవొరుల గండాన యింతి జన్మించె
ధాత్రీశ వకమాట తగనొప్ప వినుమ
ఆ పాప పుట్టిన అయిదు దినములకు
మీ అయిదుగురి తండ్రులకు అమ్మలు నాటి
చిత్రభాను సంవత్సరమున కత్తులు నాటి
చిత్రజల్లుగ పోరి చెల్లి రయిదుగురు
బుధవారంనాడు పుట్టెను భూపాల వినుమ
లేదనరాదు కీడు లెస్సగాధయ్యా
యిచ్చిన వారిండ్లు యిలమీద క్రుంగు
పుచ్చుకున్న వారిండ్లు భూమ్మీద కలుసు
ఎదురిండ్లు మనవు యేక పుణికె పాపకు

విధి యంశతో బుట్టెను వినవయ్యా
చెల్లెలు
మధ్యానాన పుట్టెను మగువ పాపన్న
కదయ్యా నగరు వెళ్ళనీయంగరాదు
మంచిది గాదయ్యా మనువిచ్చినప్పుడు
కొంచెపడుదురు మీరు గోకులాధీశ
ఇంటనే వుంచుకోండి యిలువెళ్లకుండ
మాటవాసి దక్కదు పెద్దరికము లేదు
రాజలక్ష్మి తొలుగు నగురెళ్ళినపుడె
పూజలక్ష్మి తొలుగు పుట్టింటివారికి
అత్తవారియిల్లు అభివృద్ధి అవును
చింతలు తోచును సిరి తొలగిపోవును
కడపదాటి పోతేను కన్న వారికి
నమ్మిరాదు
పుడమీశ పాపను పుట్టింటనే వుంచి
ఇల్లటముగా వుంచి యింటనే పెండ్లి
చెల్లెలు పాపకు పెండ్లిచేయుడి మీరు
ఇల్లటము వుంచితేను యిచ్చినవారికి
పుచ్చుకున్నవారికి చల్లగా వుండును
చల్లగావుండును సరిగాను యిండ్లు
నారికేళములకు నీరు నడిచిన యట్లు
తిరుమందులు వల్లవులు చిరకాల
ముందురు"
పౌరోహితుల మాటలకు భూపాలు
డైతన్న
"సిరిదేవి ఓ యమ్మ మీ చిత్త
మేమనుచు
ఏమి ముందరిబుద్ధి యెటువలె
వుండునో
సోమశేఖరుండు ఈరీతి జేసెను
పాపను
పాపపు బ్రహ్మదేముడు పాప
నూకమ్మకు
శాపంబు బెట్టెను చెల్లెలికి తొల్లి
ఎలమితో నా నగుర యిల్లటముగాను
చెల్లెలికి పెండ్లి సేయుదు తల్లి
కొమరగిరి వున్నాది అడుగవలె మీరు"

## నాచకూళ్ళనాయుని ఇల్లరికముంచుమని సిరిదేవి కొమరక్క నడుగుట

ఆ మాటలకు సిరిదేవి అడిగె
కొమరక్కను
"నామాట వినవమ్మ నలినాయతాక్షి
వల్లవుల గర్భమున వరుష బుట్టితివి
వుల్లములో వక బుద్ధి వకవార్త వినుమ
పుట్టితివి వోయక్క నా పురుషునితోడ
చుట్టాల సురభివి సుదతి కొమరక్క
చేకొని నామాట చేపట్టవమ్మ
అటువెనుక నీవు పుట్టి అత్త వారింటికి
మాటవాసి దెచ్చిన మగువ కొమరక్క
నోములు పంపాద్రిలో నోచిననాడు
అమితముగ నోమితిమి అప్పచెల్లెండ్లు
అడుగుదాటని యాజ్ఞ అక్క
కొమరక్క
కడువేడ్కతో పెండ్లిగాజేయవమ్మ
భక్తి వుంచు కొమరక్క పాపన్నమీద
నిమ్మళించి నామాట నీవు వినవమ్మ
గోత్రాలు పొడసు కొమారైను
యిచ్చెను
నడిపించు కొమరక్క న్యాయంబుగాను
పెంచినాతు పల్లికొండ ప్రేమమీరంగ
తల్లిదండ్రుల మారు దైవంబు మారు
యెంచను పని లేదు యెవ్వరము
మనము
రెండిండ్ల వారము లెస్సలై వుంటేను
నిండిన బలగము యెడబాయ లేరు
వుండవలె వో యక్క పుర్విలో
మనము
మండలపతులకైన మంచిది గాద
ఇంటనే వుంచి యిల్లటముగాను
బలిమిగా కలకాలము బ్రతుకవలె
మనము
నాయిని నానగుర నాతిపాపమ్మకు
వో అక్క యిల్లటము వుంచుమా
నీవు
యిచ్చిన వారును పుచ్చుకున్న వారు
ఎచ్చుగా బ్రదుకవలె యెల్లకాలంబు
కులమును గోత్రములు గుణములు
యెంచ
పరవారము గాము, పాపకు నాయినికి
వరుషతో యిద్దరికి యీడు జోడగును
యిల్లటము వుంచి యేలింతు భూమి
పదేడు క్రరోళ్ళ పాయకట్ట మొదలు
అర్ధిగా భూపాడు అమర యిచ్చేను

ముప్పైమూడు నేలకోటలు మూడు
గడిదుర్గాలు
యెచ్చుగా నాకొమాళ్ళు యేలుచున్నారు
పరగంగ దొనకొండ పారుపత్యమ్ము
సకల సంభారంబులిత్తు
అరమర లేదు వో అక్క కొమరక్క
పరగంగ చెరుకున పండు పండిన
యట్లు
వుంతును యిల్లటము వుంచు కొమరక్క
అనుమానపడవద్దు అక్కరో నీవు"
అని యిట్లు సిరిదేవి ఆడు మాటలకు
సిరిదేవి మాటలకు కొమరమ్మ-
శిర సెత్తి చూచి
చిచ్చువలె మండి చేసె కోపమ్ము

## కొమరక్క నిష్ఠురోక్తులాడి నిరాకరించుట

"ఏమి మాటలాడేవు యీరీతి సిరిదేవి
నేరని మాటలాడేవు నీతియు మరచి
పడుచు నడగ వస్తేను పంతమాడేవు
ఎడపగా కర్తూర్తి మాటలాడేవు
కలిమిగల వారయితె కడు పేదవార్ని
పలుచగా జూతురు బహువిధంబులను
వుదాసీన మాడేవు వుండదగదనుచు
అదిరిపడి అగ్నిలో నెయ్యి జల్లినయట్లు
చేసె కోపంబు కొమరమ్మ యెంతయిన
ఏమి మాటలాడెదవు నాతి సిరిదేవి
కలవారు కలవారు వియ్యమందితేను
కలిమితో కాకర కరనల్లినట్లు
కలవారు కలవారు వియ్యమందితేను
[illegible]
కలవారు కలవారు వియ్యమందితేను
రేలబూసి తంగేడు వరిగినయట్లు
కలవారు కలవారు వియ్యమందితేను
పాలలో పంచదార కలిపినట్లుండు
కలవారు పేదవారు వియ్యమందితేను
నయముతో నల్లచెరుకుగడకు చిరుచేదు
పుట్టును
కలవారు పేదవారు వియ్యమందితేను
అరిచేతి బెల్లము చిరుచేదులగును
కలవారు పేదవారు వియ్యమందితేను
పాలలో పచ్చివిషము కలిపినట్లుండు
న్యాయము గాదు నీకు సిరిదేవి
కలిమి బలిమి చేతకలిగినవారు
ఏలాగు నడిచిన యీడు జోడవ్వునా?

పంచదార పందిట పాలవాన కురిసిన
యట్లు
కొంచవడక మీరు కూడుండరమ్మ.
పేదవారముగాన నీకు ప్రియము
లేదాయె
కాదని సడువను కడవారమటవె
కాకుంటె నీవింత కాకపడనేల ?
నాకు నిష్ఠూరంబు వద్దు సిరిదేవి
మావంటి పేదవారు మాకు లేరయిర ?
మీవంటి కలిగినవారు మీకు కలరమ్మ.
చవుక చేస్తివి నన్ను యీ
సభవారిలోన

అన్నమారు అని నేను అడుగవస్తేను
చిన్నమాట లాడితివి సిరిదేవి నీవు
అడిగితే యిప్పుడు అయిన కొదవేమి ?
పుడమిని పల్లికొండకు బుద్ధి లేదాయె .
ఏనుగమీది వార్ని సున్న
మడిగినయట్లు
చనువులేని చంక యెక్కిన
సొమ్యమాయె నమ్మ
పంపాద్రిలో అన్నలకు పాయదెరువు
లాయె
పంపు లేర్పడి పోయిరి
పంచకాండాలకు

## కొమరక్క తన అన్నలను తలచుకొని వలపోవుట

శ్రీకూర్మము బోయెను సింహాద్రి
అన్న
శ్రీకూర్మ మనియేటి పట్నము కద్దు
ఆ శ్రీకూర్మములోన పెరుమాళ్ళు
అనే దేముడు గలడు
చోరులు దేముని సొమ్ము లెత్తుగపోగా
నంబుల వెనుకవేసుక పోట్లాడి చెల్లెను
సింహాద్రి అన్న
నా సైదోడు అక్కడ సమసిపోగాను
సాగెను నీమాట సాగలేదు నామాట

పోకుమన్న కల్యాణము పోయె
పెద్దన్న
కానుపులకొరకు కల్యాణమ్ము బోయిరి
కల్యాణము పోయిన వెనుక కలిగిరి
బాలలు
బాలలు కలుగుతానె బంధువుల
కలియడాయె
కులపగలు గావు అంశకు గోత్రపగలు
కావు
మారాచవారికై మరి దండువెడలి

వాలి కేతవరాజు మీద వరిగె పెద్దన్న
నా సైదోడు అక్కడ సమిసిపోగాను
సాగెను నీమాట సాగదు నామాట
ఏనుగనాథు కొండకు పోయెను యర
నూకఅన్న
ఏనుగనాథు కొండపడమట
ఎర్రభూపతి బలముమీద
ఎరుకల యేనాదుల యెనక వేసుకొని
వెంటబడ్డ బెబ్బులిని వెనకవేసుక
మరియు
మంద జొచ్చిన బెబ్బులిని
మళ్లిపట్టియ్యక
రాజరాజు కదసి రాంగ మధ్యకలన
ఏనుగ ఏనుగను ఎదిరించినట్లు
సామజంబులు రెండు సరిపోరినట్లు
చెలగుచు చెండాడి చేకత్తి నపుడు
వుర్విపై పుటమెగసి వురుకున వచ్చి
చిమ్మించి రొదచేసి చీకాకుపరచి
కేడించి యెర్రభూపతి చెయ్యి కళమున
దప్పక
కదిసి యెర్రభూపతి కదనవిక్రమశాలి
చేరి ఫిరంగిన నరికి చేకత్తి ని జాడించె
రెండుపోట్లు నాటి రొదబెట్టుచు ధర
మీద
కదిసి జముదాళమున పొడిచి క్రైవాలె
నమ్మ

సైదోడు అక్కడ సాగిపోగాను
సాగెను నీమాట సాగదు నామాట
నున్నబెజవాడ కొండకు పోయెను నల
నూకఅన్న
నున్నబెజవాడ యేలేటి నూకరాజుల
మీద
కంచుకు పెంచుకు అంకల గాజుకు
సుంకము లేకుండ పోట్లాడి చెల్లె
మాయన్న
నా సైదోడు అక్కడ సాగిపోగాను
సాగెను నీమాట సాగదు నామాట
అన్నలకు తమ్ముడు ఆ పోలురాజు
శ్రీరంగము పోయెను శిముడు
పోలురాజు
అల శిలావంతుల అతివేగముననను
ఎరవొప్ప చోడాని వెట్టికి బట్టె
వెట్టి శాయగలేక యేగురు జంగాలు
పోలురాజు మరుగుకు పొందుగా
వచ్చిరి
మరుగు జొచ్చిన జంగాల మళ్ల
బట్టియ్యక
మందకు వెనుబలిమియైన మసిలి
నాయని బిలిచి
ఏడు ఎద్దుల మరియును కల్లందుల
మరినాయుని బిలిచి
ఆదివిష్ణు బొల్లావును తోడైన గూర్చి

భక్తితో జంగాల పర్వతం బంపె
చోడాని మూకలు తొడరి మీదికి వచ్చె
మంచుదండి బోయమూక మంద
మీదికి వచ్చె
అశ్వాలు ఏనుగులు ఆదికొని దండు
పశువుల మందమీదికి పయనమై
వచ్చిరి
మందమీదికి వచ్చిన బాణములు
మర్రిమీద బడెను
మర్రిమీదికి వచ్చిన బాణములు మంద
మీద బడెను
మందమీద బడిన చిచ్చు చిలకల
మర్రి మీద బడెను
మర్రిమీద బడ్డ చిచ్చు మందమీద
బడెను
గౌరిసెలు కాలంగ ధేనువులు
కొమ్ములు వగ్గెను
కొమ్ములు కాలంగ ధేనువులు
గౌరిసెలు వగ్గెను
దొడ్డి దేవళము సందున దొడ్డరాజు
యుద్ధము
మంద దేవళము సందున మన్నె
తిరుమందులు వరిగిరి

కొమ్మల పొదవున గోపాలకులు
చెల్లిరి
ఆకుల పర్యంతము యాదవులు
చెల్లిరి
మర్రిపొదవునా పీనుగలు మడియ
పోట్లాడిరి
జంగాలకొరకు మంద లింగపీడు జేసె
బత్తులకొరకై మంద ప్రాణధార పోసె
శిలామంతుల కొరకు మంద శివ
ధార పోసె
వడియబత్తుల కొరకు మంద వరుగ
పోట్లాడి
నా సైదోడు అన్నలు అందరు
చల్లగా వుండేను
సాగును నామాట సాగదు నీమాట
సరిపాలు యిచ్చిరి సమముగా నాడు
నాటి చనుమానము నేడేల వచ్చు
అన్నలు వుండేను నాకెవరు అడ్డ
మాడేరు
మా అన్నలుంటె మిమ్మడగవలెనా ?
ఆయెను మీకింత అనుమాన మేల ?
ఇంటనే వుంచుకోండి యిలువెళ్ళకుండ

బంటుపంతము గాదు పాప నీయ
కుంటేను
చలిమిడి బలిమిడి చెల్లదెవ్వారికి
కలిమికొంది చిన్నెలు కాదటవె
భువిని"
అని కోపము జేసి కొమరక్క లేచి
గుణమాడుకోవమ్మ కొడుకు......
పల్లికొండ పెద్దలార పదరయ్య
యనుచు
వైళమే కొమరక్క వారినగరు
వెళ్లి పోగ
మర్లవారి పిచ్చయ్య మర్ల మల్లయ్య
కుస్తరించి కొమరక్కను కూర్చుండ
బెట్టిరి
సిరిదేవి అయితన్న చిన్నబోయిరంత
అరయంగ బ్రాహ్మణుల్ అడుగంగ
సాగిరి
"ఇల్లటమంటేను యిన్ని నేరములు
చెల్లబో కొమరక్క చేసె కోపంబు
మేనత్తగాగాను మెచ్చక పోయె
తాను యిటువలె పోను ధర్మము
యెట్లు
కాదనరమ్మ మీరు కల్లగలవార్ని
మన రెంకింద్లవారము లెస్స వుంటేను
నిండిన బలగము యెడబాయలేరు
తల్లిదండ్రులమారు తామని వుంటిమి
పల్లికొండ పాదమూన పాపనిచ్చేను
కొమరక్క యిటువలె కోపంబు జేసె
సీమలో యిల్లటము వుండేది లేదు
ముందర బుద్ధియేమి యెరిగింపరయ్య
పొంగుచు చెప్పరయ్య భూసురులార!
మూతోడి బెరిగిన గుణరత్ననిధిని
పుడమిని యీరీతి లేదాయె
భూ సురులార!
ఇందుకు బుద్ధియేమి యెరిగింపరయ్య"
పందుముల బావతో పరగ అయితన్న
సమ్మతముగా బలికె ధర్మసాక్షిగాను
అమ్మతో వకమాట అనుమానమేల
సమ్మతంబుగా బలికిరి ధర్మసాక్షి
యుగాను

## పాపనూకను మేడలోనుంచుమని బ్రాహ్మణులు అయితన్నకు చెప్పుట

"ఈదేరి పాప వారియింట వుండేను ఎడతెగదు దోషంబు యాదవరాజుకు

కన్నెముదిసి నగర వుంటేను కారాదు
మీకు
కన్నవారికి నమ్మిరాదు కడమేడ
వుంచుడు
నిమళమయ్యేరు నీతియు బోవును
ధర్మవర్తనగల తగ రాజుచెల్లెలు
వుసురుమనుచు నగర వుండగా రాదు
కసువుకుప్ప కాలిన కైవడినుండును
అప్పల చెల్లెండ్లకు అతిసొంపు లేదు
ఏప్రొద్దు యెడలేదు మగువ దుఃఖంబు
చెల్లెలిని మేడ బెట్ట"మని చెప్పిరి
బ్రాహ్మణులు

## పాపనూకకై అయితన్న దుఃఖించుట

వల్లవుల అయితన్నకు వచ్చె కన్నీరు
గోడుగోడున అడలి అయితన్న
కుంభిణిమీద వరిగె
వాపోవుచు అయితన్న వో చెల్లెలా!
యనుచు
పాపిష్టిదైవము పగవార్ని కలిసె
ఆపద బెట్టెను అయ్యయ్యో యనుచు
''ఇటువలె వ్రాసెనా ఈశ్వరుడు నీకు
కొమరక్క యిటువలె కోపంబు జేసె
సీమలో యిల్లటము వుంచింది లేదా?
ఇటువలె జెప్పిన వినదాయె కొమరక్క
బావరో వో బావ! బలభద్రశయన!
అనాగతము యేష్యము అంతయు
తెలుసు
తేటతెల్లముగాగ తెలిసినవాడవు
వినిపించు వో బావ వృత్తాంతమెల్ల
రక్షించ పోషించ రఘుపతివి నీవు
దీవించ బ్రతికించ దేవుడవు నీవు
తల్లిదండ్రులమారు తమ్ముల యీడేర్చి
వల్లవుల తిరుమందుల వరుషతో నీవు
బల్లిదుడ యీవరకు బ్రతికించినావు
ఇల్లట ముంచితే యెంత దోషంబు
రాబోదు వినవయ్య! రఘుపతి నీకు
అంబా! యని చెల్లెలు అడలంగ నేను
మేరువ చందనాలమేడ ఎట్లు పెడుదు
తొలగక తనకును దోషంబు వచ్చును''
అని కరకంఠుని దలచి అయితమరాజు
"ఎనయంగ సదాశివుని ఏమనవచ్చు?
ఎడజేసెను శివుడు ఇందరిలోన
పాపపు దైవంబు పాపనూకమ్మను
కాపాడక పోయెను కనకమేడ బెట్టెను

ఆవులన్న ఎరుకలేక అబ్బఁపు
చెల్లెలిని
భావించి మేడబెట్ట భావ్యంబుగాదు
కాటమరాజు ఎరుకలేక కవకమేడ
బెడితేను
మాట తనకు వచ్చెని మాధవునిచేత
తాలిమి గలయట్టి తన చెల్లెలిని
ఏలాగు మేడవుంతు ఎడబాసి చెల్లెలిని
అంౘ్రతమేడ నెట్లవుంతును వో యమ్మ
సిరిదేవి!
కౖత్రిని ఎరుకలేక కల్యాణపు చెల్లెలిని
తనకు మేడబెట్టేది ధర్మంబు గాదు
దొనకొండ వారెల్ల దోషమనగాను
బందికాన ఎట్లు ద్రోతు పాపము గట్టుక
అందలాలు పాలకీలు అశ్వములు గలిగి
బాలపాయమ్ముౕన పాపనూకమ్మకు
వాలాయముగ మేడనుండ వ్రాసెను
బహ్మ
అప్పలు చెల్లెండ్లు అందరు గలిగి
నిప్పుల బడద్రోయ విహితమటె తల్లి!
ఏమిమాట జెప్పవు వెలది సిరిదేవి
కటకటా యని పాప కన్నీరుబెట్టగాను
కూటాల దొంతులు కూలక వుండునే
మాతోడ బుట్టినందుకు మరి వేగ మేడ
సదాశివుడు పాపకు సమకూర్చె నేడు

శివ శివ యని పాప శివుని
దూరితేను
దండేల కోకలు తగలబడి కాలు
వుసురుమనగ మేడ వుంచిన యపుడె
వసుధలో వర్ధిల్లదు వో యమ్మ
సిరిదేవి
పాలించి తెచ్చిన బత్తుని ఎరుకలేక
తాలిమిగల చెల్లెలిని మేడబెట్ట ధర్మంబు
గాదు
వనర కాశి బోయెను వల్లవుల గురువు
పరిణాన వచ్చి పాప ఏదంటె
ఏమని చెప్పుదు అమ్మ సిరిదేవి
క్షేమాన వుండగా తెచ్చెను గురువు
ఆతని ఎరికలేక అమ్మ నే వెరుతు
చేతిలో చెయ్యిబెట్టి చెప్పెను నీకు
అత్తకు నీకు అతడు చెప్పి వప్పగించి
పోయె
మతిగల చెల్లెలు మందలించగాను
మందసాన వేయను మంచిదటవమ్మ
శివశివ యని పాప శివుని దూరితేను
ఆవులమందనున్న రాజు ఆందోళన
పడీని
ఆవులన్నకు జాబు లంపితే లెస్స
అందరి ఎరుకలేక అమ్మ నే వెరతు
బుద్ధిగల చెల్లెలు పొగలంగ నేను

మంటలో ద్రోసెను మంచిదటవే తల్లి?  హరుషంబు గాదు తనకు అమ్మ
కాటమ రాజుకు కమ్మలు గ్రక్కున  సిరిదేవి"
వ్రాయించి  ఆ మాటలకు తల్లి ఆ సుతునితో
మారు జాబులు రాక కాని మాయమ్మ  సనెను
వినవె

## మేడ కట్టించుమని సిరిదేవి అయితన్నకు చెప్పుట

"శ్రీమంతుడ! వినవయ్య చెప్పెద నీకు  నిమ్మళించి వుండదు నేడు తన
వుత్తరకాశి బోయెను వుత్తముడు  మనసు
గురువు  పురోహితుల మాటకు భూమ్మీద
గురువు ఎప్పుడు వచ్చునో  కాళ్ళ
ఎరుగంగరాదు  నిలువవు కొమార ! నేడు తనకనెను
తతికాలమురాక కాని తల్లి నాయయ్యా  ఎరవు పుట్టించె గుండె ఎరుర్లము చేత
అన్నాళ్ళు పాపను ఎట్లువుంతాము ?  కడుపులోపలి దిగులు కడతేరదు
మన్నీడు ఆవులన్న మలమీద  తనకు
వున్నాడు  కడువేగ అయితన్న కట్టించు మేడ"
కమ్మలు పొయ్యేది ఎన్నడు ?  అమ్మాడు మాటలకు ఆ రాజఘనుడు
కనకమేడ ఎన్నడు ?

## కాటమరాజు అనుమతి కావలెనని అయితన్న పలుకుట

"నమ్మినవారి నిటుచేయన్యాయమాతల్లి! సబబుగా వ్రాసి సరసంబుగాను
అరయంగ మేడబెట్ట అది నీతిగాదు  మంతనాలమ్మ వద్దను మందలున్నావి
పేరువేళ బట్టి పెంపాయె చెల్లెలు  కాంతు సంతటివాడు కాటమారాజు
జాబు లంపితేగాని సరిపోదు తనకు  అన్నపేరట జాబులు అంపేను తల్లి"

## సిరిదేవి కాటమరాజుకు కమ్మలు వ్రాయించుట

పున్నమా చంద్రుని వంటి పుత్రుని
మాటలకు
కరుణతో బిలిపించి కమ్మలు
వ్రాయించె
"శ్రీ పార్వతీదేవి శ్రీగంగ బోలు
మల్లప్పగన్నతల్లి మగువ సిరిదేవి
చల్లని గోధనసంపన్నుడయిన
సతుల వర్జితుండు సత్యచంద్రుండు
భూసురాశీర్వాద పుణ్యవర్తనుడు
బసువన్న శ్రీపాద సేవకుండైన
గోత్రాబ్ధిచంద్రుండు గుణసముద్రుండు
పుత్రుని కాటమరాజును భూపాలవరుని
దీవించి పంపిన జయరేఖవార్త
రవితేజు పల్లికొండ
రాముకులగోత్రము
కొమరగిరి అక్కను గోత్రాలపెద్దలు
నాచకూళ్ళ నాయినికి నలనాక్షిపాపను
అడుగంగ వచ్చిన ఆ బ్రాహ్మణు
లందరును
కడప దాటరాదని కళ్యాణపు
చెల్లిని
ఇల్లటముగాను ఇయ్యవచ్చు ననిరి
పల్లికొండ తనకు భార్యములేక

కొమరగిరి వున్నది అడుగుడని
పలికె
రఘుపతిమాటలకు రాశ్యము
అడిగితిమి
భగ్గుభగ్గున మంది పలికె
కొమరక్క
మేనవారిని ఇల్లటము మేముంచ
మనుచు
వినదాయె కొమరక్క విన్నవించినను
వినకుంటె మేలాయె
ఇల్లువెళ్ళ నీయలేదు
ఆమెతో అంటేను అలిగిపోయినది
ఆ మాటకు నీతమ్ముడు అంపించె
జాబులు
పురోహితులు పాపపుటక చెప్పగా
నేను
పొరపొచ్చము లేదు భూసురులవద్ద
కన్నవారి గండాన కాంత పుట్టింది
అన్నలకు తమ్ములకు అభివృద్ధి
సొంపు లేదు
ఆవులమందకు పురోహితులు అపజయ
మనిరి
నీవు ఏమి బుద్ధి నీతి జెప్పుదువో

మారు జాబులు వ్రాసి
మళ్ళన-పించు"
కమ్మలు వ్రాయించి కాలార్ని బిలిచి
పోయి మంతనాలకు ప్రొద్దున నీవు
కాలారి మారన్న ! గడియలో నీవు
మారుజాబులు తీసుక మళ్ళిరమ్మనిరి
పరువున రావోయి పయనమై నీవు
చేరివచ్చి కాలారి వందనము జేసి
కాలారి పయనమాయె గ్రక్కున
నపుడు
బావ పల్లికొండ బంధువులంత
"ఆవులన్నకు జాబు లంపితే మంచివి
కావలెనని వ్రాసునో కటమరాజు
మేడబెట్టు మనునో మేరగల చెల్లెలిని
ఇల్లటము వుంచుమనునో విపరమైన
చెల్లెలిని

ఈ రెండు విపరములు రేపు
విందాము"
అందరిని పొమ్మనెను అమ్మ సిరిదేవి
బంధువులనందరిని పంపె వారిండ్లకు
నందుల సిరిదేవి నగరువెళ్ళి వచ్చిరి
వామాక్షు లందరు వారిండ్ల కరిగిరి
కొమరగిరి తావున్న గోవింద
మండపముకు
యాదవులందరు వారిండ్లకు చనిరి
గ్రక్కున కమ్మలు కాలారికిచ్చిరి
కడి మాలచేత ఆయితన్న కమ్మలందిచ్చె
హస్తకంకణాలచేత అందెను కాలారి
ముత్యమంత చద్దిమూట అన్నము గట్టిరి
లెక్కబత్యము తీర్చి రేపుమాపటికి
తిరిగి రమ్మనిరి మారన్నను
త్వరితముగాను

## కమ్మలు గైకొని కాలారి ప్రయాణము

గడియ అలస్యము శాయక గ్రక్కున
వెడలె
పడమట అరజాము వేళ పట్నము
విడిచి కదిలె
గంగదేవళానికి వచ్చెను ఘనుడు
కాలారి
సవ్వ సూటిగా గంగసముఖాన నిలచి

"నమోశివాయ నారాయణాయ
ముద మొప్ప మాకును మొదటి
వేల్పువమ్మ
తొల్లి మా యాదవులకు తోడై వుంటివి
ఆవుల వల్లమ్మ కొలిచిన ఆదిమహాశక్తి
సిరిదేవి కొలిచిన చిత్రరువు ప్రతిమ
కొమరమ్మ కొలిచ్చిన కొంగుబంగారమ

అగుమంచి కొలిచిన ఆణిముత్యము
గంగ
ఆవులమందకు నేను అరుదెంచి పోయి
ఆవులన్నికు కమ్మకు అందించి నేను
మారుజాబులు గొంచు నేను మరివేగ
వస్తేను
ఎల్లుండి వేళకు దొనకొండ చేరితినైన
భాగీరథీ! నీకు పొరిగొర్ల జంపుదు
పొట్టేళ్ల బోనాలు పొందుగా జేతును"
అని యిట్లు కాలారి ఆ చోటు కదిలెను
అందుండి ఆ మరునాటి పొద్దున
అతిసంభ్రమునను
వోరుగంటి శంభుని దేవళానికి వొయ్యేన
వచ్చెను
సవుసూటిగా శంభుని సవుద్రిష్టిన
నిలిచి
"వోరుగంటి శంభుడా! వో స్వామి నీకు
ఆవులమందకు కమ్మలు అందించి నేను
ఎల్లుండి వెలివేళకు దొనకొండ
పట్నము చేరితినైన
ముందర మంటపమునకు మున్నూరు
దివ్వెలు
ఎనక మంటపమునకు ఏనూరు దివ్వెలు
ఏప్రొద్దు శివరాత్రి వేడ్క సేవింతు"
అని మ్రొక్కి కాలారి ఆ చోటు కదిలె
[illegible] ఆగుతున గునుకుపరుగునను

తన పొడవు తంగేళ్ల తను దాటుకొనుచు
గునుగు పేరెమున కాలారి గుండ్లకమ్మ
దాటి
కొచ్చెర్లకోటకు గొబ్బున వచ్చె
శితవులు కూసేటి చినలంకలో వెళ్ళి
బెబ్బుళ్ళు కూసేటి పెదలంకలో వెళ్ళి
చంద్రమాకులలో వెళ్ళి సాగెను
కాలారి
చిలకచర్ల పాయ, సిద్ధేశ్వరుని కనుమ
కుంతనాలమ్మ కనుమ, మరిక్రొర
పోలూరు
ఏనూతల పాయ, ఎలుగుల బయలు
చన్నీళ్ళ చెలమలకాడికి మారన్న
చయ్యనవచ్చె
అచ్చట కూర్చొనెను అపుడు కాలారి
దేవుని ఆవులు నీళ్ళకు వచ్చిన
జాడలు జూచెను అన్న కాలారి
మొఃఖమార్జనము జేసె కాలారి మారు
తిన్నగా తిలకము దిద్దెను నుడుట
ముత్యమంత సద్దిమూట అన్నము
విప్పెను
మూట అన్నము మూడుపాయలై
వుండె
వకపాయ అన్నము యర్రంగ వుండె
వకపాయ అన్నము పచ్చంగ వుండె
వకపాయ అన్నము భాగాను వుండె

అన్నమువంక జూచి కాలారి
ఆశ్చర్యపడెను
చెల్లబో యీ అన్నము యేమిసేతు
ననుచు
వకపాయ అన్నము జలధిలో గలిపెను
వకపాయ అన్నము పక్షుల కిచ్చినాడు
వకపాయ అన్నము మత్స్యాల కిచ్చెను
వకపాయ అన్నము తానారగించెను
సద్దిదిన్న గుడ్డ జలధిలో గలిపె
తెల్లని నీళ్ళ చెలమ చేకుల పాయ
కూరపెంట రాచయముల వద్ద
రాజుమంద లుండగాను
ఆవుల జాడలు జూచె అతివేగ కాలారి
అతివేగమున వచ్చెను ఆవులమందలోకి
తొంభైకోట్ల నల్లావుల తుల్లమిగ
జూచె
ఎనభైకోట్ల నల్లావుల వేగమె జూచెను
మూడుకోట్ల బోడావుల ముదమొప్ప
జూచి
ఆడాడ నిలచి వచ్చె అన్న కాలారి
బొల్లావు బసుపన్నను భోరున జూచి
చల్లవారి పుల్లఎద్దును చయ్యన జూచి
మర్లవారి మట్టెపెయ్యను మరి వేగ
జూచె
ప్రొద్దువంక చూడని భోగావతి
కన్నెల
ఎద్దువంక చూడని యాపారి కన్నెలు
ఆంబోతువంక చూడని అన్నెకారి
ఆవులు
అడుగుసన్నాలు అద్ది నల్లల జూచి
పిక్కలు సన్నాలు పిగిలిన నల్లలూను
కొమ్ములు సన్నాలు గోస నల్లలును
సన్నాసిఆవులు సలుగు చెద్దలును
మముచుల మాచకమ్మల మరి వేగ
జూచి
ఆవుల పెయ్యల అతివేగ జూచి
గోవుల గోపాలకుల గొబ్బున జూచి
నడిమందకు వచ్చే వేళకు నడిరాత్రి
యాయె
ఆవేళ కాలారి ఆలోచన జేసి
ఆవులన్నకు కమ్మలు ఈవేళ
అందియరాదు
రేపు ప్రొద్దున కమ్మలు యిత్తాము
అనుచు
ఆరాత్రి కమ్మ చెన్నమనాయునివద్ద
గ్రక్కున నిద్రించె కాలారి మారన్న
ఆ రాత్రి ఆవులమందలోన
కాటమరాజు
నలభైనాలుగు స్తంభాల నామదీరు
గుడారు
ఇరువైన నాలుగు స్తంభాల
హిమకై తరువు

పదహారు స్తంభాల పందిరిగుదారు
పందిటి గుడారుక్రింద
ముప్పైమూడు స్తంభాల ముత్యాల
పందిరి
ముత్యాలపందిరి క్రీనీడ దేవేంద్ర
అరుగు
దేవేంద్ర అరుగుమీద కొలువుదీరి
వుండెను
కాటమరాజు మరది పద్మనాయుడు
భట్లు చదువంగ బ్రాహ్మలు దీవించ
జట్లు తమలోన సాదనలు చేయ
రంభనాట్యములాడుచు
రమణతోడుతను
ఆటపాటలవార్ని అందర్ని రమ్మని
అంతట రెండుజాములు అటు
ప్రొద్దుపోయె
కొలువు చాలించెను కులదీపకుడు
జలక మొప్పగ నాడి శంభుని
పూజచేసి
విమర్శతో రాజు వియ్యాలు తాను
అమరంగ భోంచేసి అందరు లేచి
పరువమైన పువ్వుల పానుపుమీదను
వరుసతో కాటమరాజు వనర నిద్రించె
నీరుబుగ్గ కంటికొనలకు నిద్రయినవచ్చె
కలవలపంటి కన్నులకు కప్పెను నిద్ర
చేమంతిరేకుకన్నులకు చేటునిద్ర
వచ్చెను
వాలారికన్నులకు వచ్చెను నిద్ర

## కాటమరాజుకు దుస్స్వప్నమగుట

కలగని మేలుకొనె కాటమరాజు
నడుము నక్కున విరిగి నాయుని
బిలిచె
"నాయుడా వింటివా నా చిన్నిమరది
వో అయ్య వినవయ్య వొక
విన్నపంబు
కటార్ల బల్లావరము: కాణాచి
కా... యప్ప !
గూడూరు భండ, ఆత్మకూరు
బంతులు !
ఆశేటి మరది పద్మనాయుడా !
కులమున యెలమనాయుడ, చెలిమిని
గొల్ల
చెలికాండ్లచిత్తమా ! చెరుగునపైడి !
నాదిండ్ల పెండ్లికుమార నా చిన్నమరది
ప్రతికూలభైరవ, కమలనాధాయణా !

మంతనాలచిలుక,మరది పద్మరాఘవా!
ఎన్నడు కలగన్న వేగంబె మరతు
ఈరాత్రి కలగంటి యేమి చేయుదు
నాయుడా !
కలగన్నప్పటనుంచి కాలు నేల బొందదు
గుండె పగిలి కడుపు కో
గుబులుకుడిచీని
తలగడదిండ్లును త్రాచుపాములై
పొర్లెను
పరచిన మల్లెలు పాములై పొర్లెను
ఎడమకన్నదిరెను వెన్ను జాలపుట్టెను
కుడికన్ను అదిరెను గుండె జాలిపుట్టెను
జాముజాముకు వళ్ళు జాలుపుట్టింది
తనకు
కలగన్నప్పటినుండి కాలు నేలబొందదు
తనకు కన్నీరు తరగదు నాయుడా"
అని యిట్లు కాటమరాజు ఆడు
మాటలకు
విని యట్లు పద్మరాఘవుడు ఇట్లని
పలికె:
"బావరో ఓ బావ కాటమరాజా!
ఏమి వార్త వింటివి? ఏమి కలగంటివి
నీవు కన్న కలలు మాకు జెప్పినను
తెలివిగా విప్పేను తెలిసినట్లుగాను''
అని యిట్లు పద్మనాయుడు ఆడు
మాటలకు

కన్నకల చెప్పసాగెను కాటమరాజు
"ఏమి చెప్పుదు నాయుడ యేమందు
నేను
మన మందచుట్టూర గుడార్లు పన్న
కలగంటి
మన మందలో కోడెలు యెద్దులు
గుంపులుగూడ కలగంటి
ఆవులు పెయ్యలు అడల కలగంటి
మన మందమీద సన్నని సోనవాన
కురువ కలగంటి
మన మందకు తూర్పున బిళ్ళలబోడు
పుట్ట కలగంటిని నాయుడా నేను
మన మందలో వున్న ఆబోతుచెల్లెలు
అర్లచ్చ మట్టిపెయ్య
మందలోపల వెళ్ళి మళ్ళి మళ్ళి
చూచుచూ
ఎదురున్న బిళ్ళలబోడు ఎక్క
కలగంటి
అంతలోనె తాను ఆశ్చర్యముగాను
కల్యాణపు చెల్లెలు కన్నీరుబెట్టు
కలగంటి
తల్లిగర్భమున తాను జనియించి
ఎన్నడు నాచెల్లెలి గురుతెరుగను
నాయుడా
కన్నెప్రాయమున కటకట సురభి

బోడెక్కి అంబోయని బోపెట్ట
కలగంటి
తోళపు కలగాదు నీకుః తోచిన
మాత్రము
మన దేరాలచుట్టుక ధేనువులు
అడిలింది యేమో

నాయుడా ఆ కల నాతోను జెప్పుమా''
అని యిట్లు కాటమరాజు ఆడు
మాటలను
నడుము నక్కున విరిగి నాయు
డిట్లనియె:

## పద్మరాఘవుడు కాటమరాజుకు కల విప్పిచెప్పుట

"ఏమి జెప్పుదు బావ యేమందు నేను
మనమందకు దేరాలు పన్నినందులకు
మన అమ్మ వున్న ధనముకొండకు
పడెగదె కలలు
మన మందలో ఎద్దులు కోడెలు
గుంపులు కూడినందులకు
గు త్తమైన ధనముకొండ గుండుమూక
లగును
ఆవులు పెయ్యలు అడిలి నందులకు
పాపమ్మ చెలిక త్తెలు భామలందరును
లేతమామిడి చిలక,రెడ్డివారి కొండ,
కమ్మవారి గౌరమ్మ కాంతలాదిగను
ఎంతైన కోమటివారి యెలనాగ
మొదలు
చేడెల కన్నీరు చెరువులై నిండును
కాంతల కన్నీరు కాల్వలై పారు

మగువల కన్నీరు మడుగులై నిండు
మనమందకు తూర్పున బిళ్ళలబోడు
పుట్టినందులకు
ఆ బోడు మేడకు పడును భూపాల
చంద
మన మందన వున్న ఆబోతుచెల్లెలు
అర్ల చామటపెయ్య
మందలోపల వెళ్ళి మళ్ళి మళ్ళి
చూచుచు
ఎదురున్న బిళ్ళలబోడు యెక్కి
నందులకు
చెల్లెలు మేడయెక్క పంతమున్నాది".
కడువేగ నాయుడు కలవిప్పి నపుడె
తాగన్న కలలు చెల్లెలికి నాయుడా
తాహ్కాణమాయె

నిప్పులలోన నాయుడా నెయ్యి జల్లి
                                        నట్లాయె
తనలోన దుఃఖము తలపోయగాను
కలజెప్ప కలవిప్ప కడు తెల్లవారె
చంద్రుడు గూకెను చుక్కతాళి బొడిచె
కుక్కుటములు యెలుగెత్తి కూసె
                                        నంతటను
కొండతూర్పున నిలచె కోరి
                                        భాస్కరుడు
ఇనుడుదయాద్రి యెత్తిన యపుడు
యాదవకులపతి మొకమార్జనము జేసి
అతివేగ సంధ్య అనుష్ఠానము దీర్చి
తివాసిమీద ధీరుడు కూర్చుండగాను
దొనకొండ కాలారి తురుతురాగాను
రాచమంద కంపటీలు కాలారిని చూచి
రాజుతో చెప్పిరి రాచకంపటీలు
కాలారి వచ్చెనంటేను కాటమరాజు
తమ్ముడు సంతోషపు జాబులు తనకు
                                        అంపినాడనుచు
రమ్మని సెలవిచ్చె రాజునలనన్న
కాలారి మారన్న గ్రక్కున వచ్చె
ఆవులమందరాజుకు అస్తములెత్తి
                                        మ్రొక్కెను
ముకుళిత హస్తుడై ముందర నిలచె
కాలారిని జూచి కాటమరాజు:

"దొనకొండనుండి తురుతుగా వస్తివి
ఘనవేగ జెప్పుమా కాలారి నీవు
క్షేమాన వున్నార ధనముకొండ
                                        రాజులు
సోముకులగోత్రము శుభమై వున్నారా?
బంధువులు అయితన్న పల్లికొండ
                                        రఘుపతి
నందుల సిరిదేవి నాతి కొమరమ్మ
లెస్సగా వున్నార వోయి కాలారి
పోచయ్య ముమ్మయ్య పుత్తమారాజు
అన్నలు తమ్ములు అతిసంభ్రమునను
వున్నార క్షేమాన వోయి కాలారి
ప్రజలు ధనముకొండ పట్నపు
                                        వర్తకులు
విజయమున మంత్రులు వీరంత లెస్స
                                        వున్నారా ?
చెల్లెలు పాపన్న క్షేమమా కాలారి
తల్లి నాచెల్లెలిమీద దయవున్నదో
                                        లేదో ?"
ఆవులన్న అందరిని అడిగిన యపుడె
"దేవేంద్ర వైభోగ దినకరతేజ
వినవయ్య ధనముకొండ వీరు వారనక
జననాథ అందరు క్షేమాన వున్నారు
కడమవార్తలన్ని కమ్మలున్నావి"

## కాలారి కాటమరాజుకు కమ్మల నొసగుట

కడువేగ కమ్మల గ్రక్కున నందిచ్చె
లక్కముద్ర కమ్మలు దీసి రాజు
నలనన్న
చంద్రికవ్రాలాకు చయ్యన గీసి
చంద్రశేఖరు జూచి చదివె నావేళ
ధనముకొండ సమాచారపు కమ్మ
చయ్యన చదివె
పరువడి యాకమ్మ పారంగ చదివె
మనసున వుంచుకొని మాధవుడు రాజు
అమ్మవ్రాసిన కమ్మలకు ఆశ్చర్య
పడెను
పరకార్య మయితేను పల్లికొండ పేరు
నరనాథు అయితన్న నాపేరు వ్రాసు
వ్రాసింది సిరిదేవి వలపోతకమ్మ
తలపోసె నప్పుడు తన మదిలోన
మరివక కమ్మను మరివేగ నందుకొనె
బావ పల్లికొండ బలాధికులును
ఆరునూరు పెద్దలందరు నపుడు
గోత్రాల పశిణికుండ కొమరమ్మ
గనుక
వెండిది పోగునూలు వెయివేల వర
హాల ముడుపులు గాంచె

పైడిది పోగునూలు పదివేల వరహాల
ముడుపులు గాంచె
నూలుది పోగునూలు నూరువేల వర
హాల ముడుపులు గాంచె
పైడికడియాల చెల్లెలు పాపను
మనుమడగవచ్చిన జాబు మరివేగ
చదివె
కలకల నవ్వెను కాటమరాజు
పుక్కిట కర్పూరతాంబూరము
భూమిపై చెదరంగ నవ్వి
"నాయుడా వింటివా నా చిన్న
మరది
కన్నెపాయమున నా చెల్లెలికి కంక
ణము కలిగె
కాలిగోరు బోయె కల్యాణము కలిగె
బాసికము కలిగెను బ్రహ్మముడి కలిగె
వాలాయముగ చెల్లెలికి వ్రాసెను
బ్రహ్మ
సతిపతిసాయము చక్కనాయె
నాయుడా
కాశికావడి మోసిన కలుగు సొర్గంబు"
ఆత్మ సంతోషమున ఆ జాబు
చదివెను

సుడియవచ్చె మేలుకీడు కానంగలేక
మరివక కమ్మను మరివేగ నంది
చిటికెనేల యాకమ్మ జిర్రున దీసి
పెనుబాము యాకమ్మ పేరు సాగదీసి
బంతివెంటను వ్రాలు పారంగ జదివె
పాపను మేడబెట్టమన్నిన కమ్మను మరి వేగ జదివె
చదువలేక యాకమ్మ చదురుపై విడచె
కుమ్మరాము చిచ్చువలె కుమారిలసాగె
యరవలి తగిలించినట్లు యేడ్చెను రాజు
తాటేకు మంటవలె దరికొన సాగె.
మొగిలుమాని సొదవలె పొగలంగ సాగె

## కమ్మలు చదివి కాటమరాజు దుఃఖించుట

"కమ్మలు అనుకుంటి నాయుడా నేను
కమ్మలు కావు నాయుడా! కడలేని శోకము
మొవ్వాకు లనుకొంటి నాయుడా!నేను
మొవ్వాకులు కావు నాయుడా!మొగిలి మాను సొదలాయె
తాటేకు లనుకొంటి నాయుడా!నేను
తాటేకులు కావు తాచుపాము కూనలు
చిట్టాకు లనుకొంటి నాయుడా! నేను
చిట్టాకులు కావు నాయుడా? చీకిమాని సొదలు
దొనకొండకమ్మలు చదివి చదురుపై విడిచె
పెనగొని దుఃఖము పెళ్లగిలె నాయుడా!
కలగన్నందుకు కమ్మలు వ్రాసినందుకు
తలపోత లాయెను తల్లి చేసిన మేలు
నాయుడా వింటివా నా చిన్నమరిది!
చయ్యన వినరయ్య వక విన్నపంబు
వన్నెగా సోమప్ప వరమున బుట్టితిమి మేము
ఎడలేని శోకము ఇంత చేసెను బత్తుడు

# కాటమరాజు పద్మరాఘవునకు కల్యాణనగర వృత్తాంతము చెప్పుట

పరిణాన వుండగా తెచ్చి పాపము గట్టు
కొనెను
మా రాచవారితో మేము వుండితిమయ్య
పున్నెగురువు వచ్చి భూమి సంచరించి
కాణాచి సాక్ష్యము కల్యాణమున
వుంటిమి
కాశిబాటలు తప్పించి మాఅన్న
కల్యాణము వచ్చినాడు
కల్యాణపట్టణములోన ఘనుడు
జంగమయ్య
ఎఱ్ఱబొంత జంగాలు వెయ్యిలక్ష
వెయ్యి కోట్లు
పచ్చబొంత జంగాలు పదిలక్ష
పదికోట్లు
సూది దూరని బొంత సుంకు
మోయని జడలు
జడజడ కోటివేలు చంద్రకాంత
లింగాలు
జడజడ కోటివేలు సూర్యకాంత
లింగాలు
సూర్యకాంత లింగాలలో చూడగల
జంగము

జడజడ కోటివేలు భద్రకాంత లింగాలు
భద్రకాంత లింగాలలో బాలుడు
జంగము
కంచుగోచి పెట్టినాడు కాలాంత
పుణ్యుండు
చెవుల మద్దికాయలు గలిగిన చెన్న
సోమలింగము
వలచేత గంట డాచేత శంఖు
కల్యాణపట్నాన భిక్ష మడిగినాడు
అమ్మా! భిక్షమమ్మా! అక్కా
భిక్షమమ్మా!
తల్లీ!భిక్షమమ్మా! తాయీ భిక్షమమ్మా!
పిలిచి భిక్షముబెట్టిన తల్లి పిడికెడు
లింగాల బోలు
కోరి భిక్షము పెట్టిన తల్లి కోటిలింగాల
బోలు
ఇప్పటికి భిక్షము ముందరికి మోక్షము
ఏవేళ భిక్షము కాదనరమ్మ
అత్తమామకు వెరచిన అయిదువ
భిక్షము
సత్యంబు గలిగినట్టి సఖియలారా!
భిక్షము

ఇందుముఖులార!ఇదరమ్మ భిక్షము
మర్మంబు లేనట్టి మగువలారా!భిక్షము
సందెభిక్షము సప్తాకోటి లింగాల
ఫలము
దేశాంతికి భిక్షము తేరమ్మ తల్లి!
వల్లవుల వనితలార! తిరుమందుల
కాంతలార!
తేరమ్మ భిక్షము దేశాంతికిపుడు.
పట్టమని భిక్షము బెట్టిన పరమేశ్వరుని
కర్పితమవును
కొమ్మని భిక్షము పెట్టిన కోటియజ్ఞాల
ఫలమవును
భిక్ష మడిగిందేకాని భిక్షమందింది లేదు
అన్న మడిగిందేకాని అన్న మార
గించింది లేదు
వాడవాడలు తిరిగి వచ్చెను బత్తిరన్న
పెందోట ముద్దమ్మ నగరి ముందర
ప్రియముతో నిలిచి
అక్కడ భిక్ష మడగసాగె అన్న
జంగమన్న
తూరుపింటి తుంగభద్రమ్మ!
భిక్షమమ్మ!
పడమటింటి భాగ్యవతి అమ్మ!
భిక్షమమ్మ!
ఉత్తరపింటి ఉత్తమురాల అమ్మ!
భిక్షమమ్మ!

దక్షిణపింటి ధర్మదేవతా తాయీ!
భిక్షమమ్మ!
నడిచి భిక్షము పెట్టిన తల్లి నడలింగాల
బోలు
నారుభిక్షను పెట్టి నన్నంపరమ్మ!
ఈతీరుగా భిక్ష మడిగెను ఈశ్వరుడు
భక్తుడు
క్షేమాన మేముంటిమి నాయుడా!
ఇది సిద్ధించుకొరకు
వల్లవుల తిరుమందుల గోత్రాలు
పాప వైనవైనాన
పరిపరి విధముల పాడంగ వినెను
గోత్రాలు పాడంగ గురుతించె గురువు
పెందోట ముద్దమ్మనగరు జొచ్చి
ప్రేమతో బత్తుడు
వట్టివేళ్ళ చవికెలోన పల్లవుల గురువు
పులిచర్మము పరిపించె భూతేశ్వరుండు
తనచేతి గజాశూలము ధరణిపై దించి
అరచేతి కప్పెర అవనిపై దించెను
అక్కడ కొలువుదీరె అన్న జంగమన్న
పెందోట ముద్దమ్మ, పెద్ద గంధావతి,
పుష్పగంధావతి, భూలోకసిద్దు,
అలుగుల సురాదేవి, అక్కవల్లభురాలు
పిచ్చుగుంట్ల మహాదేవి,పిగుళ్ళ
లక్షుమమ్మ
భూలోక చెంచీత,భూవీరమల్లు

జలప్రావణ గంగు పద్మాల భాగీరథి
కమలాక్షు లేతెంచి గ్రక్కున నిలిచి
అల్లంతట నిలిచి అస్త్రములెత్తి
మ్రొక్కిరి
వార్ని చూచి బత్తిరన్న పైనపైనాన
దీవించి విభూతి ధరియించె గురువు
పెంతోలు ముద్దమ్మ ! పెద్ద గంధావతి !
ఇప్పుడు పాడిన పాటలు మళ్ళి
పాడించమనెను
పాడిన పాటలు మళ్లీ పాడుమన్నపుడే
నాగుబాామువంటి నడుము నక్కున
విరిగి
తనచేతి రోకలి ధరణిపై విడచి
వావారి లోపలికి వైదొలగి పోయె
వావారి లోపలికి పాపమ్మ
వైదొలగిపోయె
అప్పుడు మారాచ గంగన్న ఆడె
నొకమాట
రాచబాలల బట్టి పాటలు పాడుమనేవు
మాపాలి గురువా ! నిన్నుమారాడ
వెరతుము
పరదేశివి నీవు రాచబాలలు వారు
అన్నము వస్త్రము అడగవలె గాని
శిముడు సిరితొండ నడిగినట్ల
నరమాంస మడుగు
క్షేమము నీకు మేము శరణార్థి యనెను

అని యిట్లు మారాచ గంగన్న
ఆడుమాటలకు
పెందోట ముద్దమ్మ పేర్కొని బలికె
ఆడవారి తోడబుట్టు అన్న జంగమన్న
పాడవే పాపమ్మ నీకు భయమేమి
యనెను
పాడిన పాటలు మళ్ళి పాడించె
సువ్విపాట
రఘుపతి పల్లికొండ రాజులకు గురువు
నా భాగ్యవశమున రాగానె జూతు
శంఖు చక్రాలుండి సేనాధిపతులైన
పంకజ వల్లభులు పనిబూనిరాను
పచ్చల పాలకీలు పై దందలాలు
విచ్చైన సహోదరుడు యర్రయ్యరాను
బవిరి గడ్డము మంచి పషిణి బల్లేలు
రఘువతి పెద్దబాపకు రాచబిరుదులును
సందిట రుద్రాక్ష శంఖుగంటలును
నందుల పుణ్యగురువుకు నాయింట
విందు
పూసిన విభూతి పులితోలుకాశ
పుణ్యగురువు భత్తిరన్న రాగనే జూతు
దాయాదుల మీదనే దయగలవాడు
మాయన్న పర్వతాల మల్లప్పరాజు
దేవపూజ గలయట్టి దేవశాంతి గురువు
శివపూజ బత్తిరన్నకు చెల్లెలననెను
పల్లవ గోత్రాల వంశతిలకుండు

వాలుజడల బత్తిరన్న వచ్చెనని విందు
ఎలమంచి ధరావతి ఏలు తాత
వలురాజు
వల్లవభూపతి వార్ని పాడుదును
వివరము గలిగిన వో యింతులార !
రవిచంద్రులను బోలు రాజులకు
ప్రేమ
ప్రేమతో సింహాద్రి పెదతండ్రి తనకు
అవ్వమాంగణ వల్లమ్మ అతివ
మాయెడల
సిరిగలుగు సింహాద్రిసీత మరిది
కూతురను
భూమెల్ల తాల్మితో పుత్రులను గన్న
కొమరగిరి మేనత్త కోడలను నేను
విందు బుద్ధి గలయట్టి నీరజానేత్రి
దయగలుగు కొమరగిరికి
తమ్మునికూతురను
నా తండ్రితమ్ముడు నలనూకరాజు
భక్తితో నలనూకసీత బావకూతురను
లాజైన యరనూకరాజు మా
పినతండ్రి
ఆరాజు యరనూకసీతకు
అప్పకూతురను
ఆ రాజుకు తమ్ముడు ఆవుల
పిన్నయ్య
స........ పెద్దలు సప్ప ..........

ఆవుల పోలురాజు ఉన్నకూతురను
దేవతాపుత్రుల తెలివితో గన్న
నావాడ పినతల్లి నర్రావులనూక
తరివారి తిరమందుల దామసానివార్ని
మరువక పాడుదును మామలందరిని
చంద్రుని కళలను సింహబిరుదులూను
అందరిలో కరియావుల మాయన్న
బాడెను
నా తోడ బుట్టిన నలనన్న నీకు
నీతోడ సోమప్ప నీకు చెల్లెలను
మార్కొన్న శత్రులకు మహీపతిరాజు
కరుకు శాత్రవులను ఖండించగలిగిన
వల్లవుల వారింట వజ్రాయుధమైన
కళల చంద్రునివంటి కాంతిగలరాజు
బెజవాడ పెట్టుదాడి పెయ్యలెరణయ్య
విజయుడు నాయింట విందారగించు
పుట్టుభోగావతి పట్టపురాజు
కట్టాణి ముత్యముల కమ్మలే పంపు
కనక అందలాలు కాలిబలములును
తన యింటికి అయితన్న ధరణీశు రాను
పచ్చల కంఠము ఆ బాలలు గొలువ
రాచవిందుకు ముమ్మన్న రాగా నేజూతు
ఆర్గురు మామలకు గార్వటల్లుండు
పోరుమామిడిపంతు పోచయ్య రాను
వెన్నెల చీరెలు వెండిబొమ్మలును

అన్న కొమార్తె సిరిగిరమ్మ ఆడిరా జూతు
కలువపువ్వుల వంటి కాంతి గల అప్ప
ఆడతోడు అగుమంచి అనగ నే విందు
ఏడు తరాల వారిని ఎతకి పాడె పాపన్న
అయ్యవంకవారిని అందరిని పాడె
దయతోను బాడెను నా చెల్లెలు తల్లి దండ్రులను
అందలాలవారు అశ్వాలవారు
నందులచెరువు వెనక మూకలెవ్వరివి ?
పల్లవుల పెద్దురాజు వనిత పెద్దమ్మ
చెలియరో కైలాసము చేరుచున్నారు
వృక్షాల పొడుగున మండేటిమంట
విచిత్రముగ పెద్దమ్మకు వింజామరములును
తరువుల పొడుగునా మండేటిమంట
తరుణి మాపెద్దమ్మ తలమాలసేన
పన్నారు దొంతులు పట్టెమంచములు
యల్లా...డాలు యలమంచి పెద్దమ్మ
ఎర్రమంటలోన ఎగిసేటి మిణుగురులు
అవి యేమొ పెద్దమ్మకు అక్షింతలాయె
నిప్పులలోపల నిద్రించు తండికి
పుష్పాల బంతాయె పొలతి పెద్దమ్మ
పసుపతో గోత్రాలు పైనవైనాలుగా
పాడెను నాయుడా: పాపన్న నాడు
కల్యాణాననుండి కానక చేటుకు
పల్లవుల గోత్రాలు వరద కలియ పాడింది చెల్లెలు
తిరుమందుల గోత్రాలు తీర్చి నెలగలచి
కురుక్షేత్రముగ నేలకూల పాడింది చెల్లెలు
పందుములవారి గోత్రాలు పందిటి పాలుగాను
అందరిని యాల పాడింది ముందెరుక లేక
భూమినలేని చేటు నాయుడా: పుట్టుట ఎరుగక
కొమనాలవారి గోత్రాలు కొల్లపాలుగాను
కల్లందులవారి గోత్రాలు కల్లుగా బాడె
పులిముద్దులవారి గోత్రాలు భూమి పాలుగా పాడెను చెల్లెలు
తరువు నరికి మీదికి తా వేసికొనెను
ఎరుగక పాడెను గోత్రాలు యాల పాటను నాయుడా :
ఎక్కిన కొమ్మ విరిగె ఏమందు నాయుడా:
పట్టిన కొమ్మ విరిగె వో పద్మనాయుడా :

అత్తవారికి పుట్టింటికి కాని అక్కుపక్షి
ఆయెను చెల్లెలు
సంతోషమున బాడెనుఆసమయంబు వేళ
అంతట బత్తిరన్న అక్కడికి వచ్చెను
ముద్దమ్మ ఎదురుకొని ముదితలు తాను
పదివేల విధముల పాదములు గడిగి
మహిసాక్షి ధూపములిచి మంచిమాట
లాడి
అయ్యను కూర్చుండబెట్టి ఆరగించు
మంటేను
అపురూప దేశాంత్రి అప్పుడన్నమాట
పాప నా చెల్లెలు బలగముగలవారు
తమ్ముడు కాటమరాజు తనవారు వీరు
అమ్మ! పరులు కారు తనకైన తోడమ్మ
దేశాంత్రి యని మీరు తెలియక
పోనాడవద్దు
పోషించి వార్ని నేను తోడుకపో
వచ్చినాను
అనిన కల్యాణపువారు ఆగంబుగాను
విని విని విధియేమి విచిత్రమనుచు
పరదేశులు మీరు రాచబాలలు వారు
మరచి వచ్చి నీవు మావారు అనుట
మంచిపని కాదు
రాచకొమారుని రాచకొమార్తెను
నీకు చెల్లెలు అనకు గురువా నీతి
గాదయ్య

పట్టువస్త్రము లడుగు పదార్థము లడుగు
రాచబాలల అడుగకు రమణతో నీవు
భాషించి పలికేది ప్రమథుడవుగాక
మాపాలి గురువవని మారాడ
వెరతుము
పాపము గడించు భక్తులము మేము
అడివస్తువ మేము అర్పించవలెను
అడగరాని వస్తువలు అడగకుమయ్య
మాయా సిరితొండనివలెనే నరమాంస
మడుగు
చేయింతు మిప్పుడే శరణార్థి మీకు
ప్రాణమడిగినా యిత్తుము పరమేశ
మీకు మరి నీవు భూషణములు
మరువక అడుగు
వడలి చర్మము గనక వలచి
యిమ్మన్న
వోడక యిత్తుము వొప్పుకోవయ్య
వారు మీవారనుట వరుసగాదయ్య
వారును మేమును మీవారమే
కామ
అప్పుడు వారన్నమాటలకు అన్న
బత్తిరన్న ఏమనెను?
అప్ప! మీరు పుణ్యాత్ములు అవుగాక
యేమి?
నాతి పెద్దమ్మ నాతల్లి సిద్ధంబుగాను
తండ్రి పెద్దభూపతి ధర్మసాక్షిగాను

కాదని మముబాసి కల్యాణము
వచ్చెను మాతండ్రి
సంతానము గలిగిన వెనుక చని
పోయినారు
ఇంతలంతలవారిని ఈడేర్చవలె
ననుచు
సంతతివారము నాసైదోళ్లు వీరు
దాయాదిబలగము వీరు నాతమ్ముడు
రాజు
పాయరాని నీళ్ల పాలకులు వీరు
పాప నాచెల్లెలు బలగమునారు
అమ్మ! పరులుగారు తనకు అయిన
తోడమ్మ
ఎంతైనగాని ఈ బాలల విడిచిపోనమ్మ
కాంతసోముని తోడు గట్టిగా ననెను
అనెను భక్తిరన్న అతివేగమునను
కల్యాణపట్టణమంతా గగ్గోలుపడెను
పాలుపెట్టి తగువుగూర్చి భక్తిరన్నవార్ని
పరగ రమ్మనెను
యాదవరాజు ఆ కాటమారాజు
విధము తొల్లి చెప్పిన వివరము
వినగదరయ్య మీరు
వీరితండ్రి పెద్దిరాజు వీరకుంభిణిమీద
చేరి పగవారితో చెల్లినవెనుక
తన ప్రాణవిభునిమీద తల్లి పెద్దమ్మ
గొనకొని నిప్పులు గుండానకు బోవుచు.

ఏడేండ్ల కాటమరాజును ఏనాళ్ల పాపను
పడిబరచి యెత్తుక వప్పగిస్తాను
అయిదుగురు అన్నదమ్ములు యాదవ
రాజులు
పెద్దవాడు సింహాద్రిరాజు ఆ
పెద్దభూపతికి
యదుకుల్వేరుండు యరనూకరాజు
నలనూకరాజు పోలురాజు నామరుదులు
వీరు
వల్లవగోత్రము వంశమువారు
వలరాజుసంతతి వారమని వచ్చి
బాలల నిమ్మని పట్టిరా మిమ్ము
తా మణిగిన గుండేన అగ్గి పుట్టించి
తాము సాక్షి పలికించి తగవు మెప్పించి
కలుపొన్న పూయించి కలుకోడి
కూయించి
కలునంది రంకె గ్రక్కున వేయించె
నైన
మద్దులు మారేళ్ల మరి సాక్షి
ఇప్పించెనైన
వారికి ఇమ్మనె బాలల వో పుణ్యమూర్తి
అని గురికొంట్లు చెప్పి పెద్దమ్మ
నాడు గుండాన బడెను
వీరు మావారన విచారమెట్లు?
అన్నదమ్ములయితేను అనువాలేది?
చిన్నబాలల షేమము నీచేతి కెట్లిత్తుము?

నీవెవరు వారెవరు నీలకంఠుండ?
భావ్యమా ఇచ్చోట బాలల నడుగ?
పాలు గెలిపించు మరుపు బుట్టించు
అడిగిన గురికొంట్లు అవి మాకు
జెప్పితేను
ఇట్లైతె బాలలను ఇచ్చేము మేము
అని కల్యాణమువారు ఆడినందులకు
చనిపోయినవారిని సాక్షి పలికించు
మంటేను
పకపక నవ్వి భక్తిరన్న యిట్లు పలికె:
చక్కని పెద్దమ్మను సాక్షి పలికించి
గ్రక్కున బాలలు తాను కదిలి
పోయ్యేదనుచు
యలమంచి పెద్దమ్మ యేసునెను
మీతోను
పలికింతు గురికోంట్లు ప్రజలార వినుడ
కరకంతు పురమైన కల్యాణమందు
గురువారమునాడు గుండంబుకాడ
పులితోలు చర్మము భూమ్మీద పరచి
జపములు జేసెను భత్తిరన్న శంభుని
దలచి
శివపూజ జేయుచు శిశువులు దాను
అది విని కల్యాణమంత తీర్థమని
చూడ వచ్చిరి
మద్దులు పలగొని భత్తిరిన్న మారేళ్లు
తిరిగెను

అంతయు భస్మాంగము తరువులకు
అలిదె
కలకోడి కలపొన్న కలనంది కపుడు
తెల్లని విభూతి దీవించి పూసెను
ఆలింగనము జేసి అక్షింతలిచ్చె
కలంపూరి శంఖులు వాయించు
గంటలు
మహి సాక్షిధూపములు
మంగళార్తులును
అయ్యగుండమువద్ద అక్షింతలు వేసె
పుణ్యపుగుండాన పూలు పరిపించి
తనయుడా తండ్రికి తద్దినం జేసె
దండి వక్కపొద్దు తానుండె ఏనాళ్ల
మండల మెరుగ జంగమార్చన జేసె
తరువులు మద్దులు తావులు దర్లవు
పలుకవు మారేళ్లు పసలేదు సాక్షి
పలుకని కారణము పరగంగ
వినవయ్య
పలికితిమైన గురువు బాలల
దోడుకపోయి
జన్మదేశము బాలలు కడ
అయిరి అనుచు
బాలలు కల్యాణము బాసిపోయేరు
అనుచు
పలుకదాయెను మామీద పక్షంబు
గలిగి

కన్నవారిని కలుసుక బాలలు
కడతేరలేరనుచు
అన్నగూడి పలుకక అలిగి
వూరకుండెను తల్లి
యతి పట్టభద్రుండు మాఅన్న
భత్తిరన్నతో
గతాయేష్య మెరిగి కలపొన్న
పుయ్యేదు
కూతురు పాపమ్మకుమారి వీని
యనుచు
గోపాంగణాశ్రీ అయిన మాతల్లి
పెద్దమ్మ
మాట్లాడదాయెను మాతల్లి పెద్దమ్మ
ఆకాశమే యిల్లు పాపకు అలమట
యనుచు
సకలబుద్ధులు తెలిసిన తరుణి పెద్దమ్మ
వల్లవుల భత్తిరన్న అందరు చూడంగ
సోమవారమునాడు చోద్యంబుగాను
కల్యాణపు ప్రజలు కమ్మక చూడగ
గంటలు శంఖులు కలసినమోత
మింటికి ధ్వజమెత్తి మిగుల వడినంట
ఆలాపన జేసెను అమ్మగుండమువద్ద
తమవంశము పెద్దల తలిచెను
భత్తిరన్న
వలరాజు మనమలము వల్లవుల
తండ్రి

మీతమ్ముడు పోల్‌రాజుకు తనయుడ
నేను
మా తల్లి పెద్దమ్మకు మరిదిపుత్రుడ
నేను
భత్తుడు నాపేరు పలుకవే గురులు
తిరుమందులకు వల్లవులకు
దీక్షమోక్షములకు
గురుతులు పలకవే తల్లి గురువు నే
వస్తి
పచ్చనందుల కప్పెరలో
భస్మాంగమంది
కొంచక గంధము మీదగుప్పె విభూతి
ఓంకారము చేసి అదలించి గురువు
దీంకార రజమెత్తి వడపోవగాను
కలకోడి కూయదు కలనంది
రంకెవెయ్యదు
కలపొన్న పూయదు కదళివు తరువులు
కల్యాణపు ప్రజలు గంగురాజు
మొదలైనవారు
అల్ల భత్తిరన్నను జూచి అప్పుడిట్లనిరి
నందుల పుణ్యగురువా! నరసాక్షి
కాదు
నంది రంకెవెయ్యదు నమము
లేదనుచు
కలకోడి కూయద గంటలు పలుకవు
కల్లలాయెను సాక్షి కరకంఠునిలయః

పొగలదు గుండము పొన్న పూయలేదు
తగువేళ నవ్విరి తమలోన తమరు
పలికించి చూడుమనిరి భత్తుని
అపుడు
వారన్న మాటలకు భత్తిరన్న
ఆగ్రగుడై యపుడు
ఆలించి దేవతల నందరిని దలచి
గంగాధరుండు వీరకప్పెరచేత
విరివిగా బట్టి
రంగుగా లింగాలు రంతుగా మోప
తనదు శూలము బూని తప్పక
గుండంబు
తప్పక గుండంబు తలగడ నిలచి
ఇందరితోడ పలికె ఈశ్వరుడు భత్తుడు
పెదతండ్రి పెద్దయ్య పెద్దమాదేవులు
అదేమొ పలుకరు అలుకేల మీకు
వహిబడి కల్యాణము మీరు
వచ్చేటినాడు
దయతోను మాతల్లి తననెత్తుకొనెను
భత్తుని ఇచ్చెను బ్రతికించుకొమ్మట్టె
వో తల్లి నాడు నన్ను వల్లక వస్త్రి
నాడే వల్లవచ్చినాము నేడేల
అనుచున్నావ ?
పాలు గెలిపించు తండ్రి పగవాడనా
నీకు
పరదేశి జంగమని ప్రజలు నవ్వేరు

పరిదేశినిగాను నీ బాలలమే తండ్రి!
అరిచేతి పుష్పమువలెను ఆవులన్నను
పోషింతు
నాచెల్లెలిని నాకప్పగించు నమ్మ
నామాట
వాంఛ వున్నది నాకొప్పగించు
ననుగన్న తల్లి
పలికితే పలికినట్లు పలుకకుంటిరైన
తల్లిగుండమువద్ద తనయుని ప్రాణము
తానొప్పగింతు
గండకత్తెరలోన శిరసు వుత్తరించి
తనగుండెలు ధూపంబు గప్పున
వేయింతుననుచు
అని తనచేతనున్న బంగారము గజా
శూలము
మింటికి ఎగవేసె భత్తుడు
వచ్చెడి శూలానికి తన వక్షస్థలము
వడ్డెను
చక్కగా శూలము ఎదమధ్యను
మొనను నిలచె
అక్కడ గురికోంట్లు అననెల్ల ఎరుగ
కరియ బసవన్న రంకె ఘనతగా వేసె
అయమేరువలన్ని అట్టిట్టు కదిలె
కల్యాణమంతయు కలవలపడెను
బడబాగ్నిలో తామరలు పరగ
వాసించె

విరివైన కలపొన్న వికసించి పూచె
ధరా మిన్ను ఆకాశము తాళసంగతి
 మ్రోగె
కోడి గుర్రోయని కూసె కలకోడి
అక్కడ కలభేరి అవును అవునని
 మ్రోగె
సాక్షికి మద్దులు కదిలె చాపకట్టుగాను
వృక్షములు వేళ్ళతో విరవీగుచును
కల్యాణము బెదిరె కదిలెను తరులు
సాలుగా నిలచెను సాక్షులు బలికె
శోభనాల గుండము ఆగుబ్బుగాను
గుభగుభ యెగిసె గుగ్గిలపు పొగలు
మంచిగంధము మాకులనడుమ/అంచి
 తముగాను
పక్షమున పెద్దన్న పణతి పెద్దమ్మ
 నిలచి
హస్తకంకణాల చెయ్యి అంది
 లేవనెత్తి
వో పుణ్యమూర్తి! మా పుణ్యగురువ!
మా పుణ్య మీదేరె మముగన్న తండ్రి
నీవు రాగానే కలిగె పుణ్యంబు మాకు
నీ చెల్లెలు పాపనూకమ్మకు నీ
 తమ్ముడు కాటమరాజుకు
ఎలమి నీవే దిక్కు వో ఈశ్వర
 మూర్తి!
నయముతోడుత నీవు నడుపుము
 తండ్రి
పల్లికొండను నమ్మి భక్తుడా నిను
 నమ్మి
ఈలాగున నీకు ఇస్తిమి బాలల
ఈడేర్చుమీ నీవు ఇద్దరి బాలల
ఎడముగా చూడకుమను ఏరాలిబిడ్డలని
సంతానముకొరకు కాంతసోముడు
 వున్న
కాంతసోముడు వున్న కల్యాణమునకు
రాగాను ఆ పోలురాజు నూకమ్మ
అంగనామణితోను హస్తములు
 మొగచి
పొల పొల పొక్కి అడలి సిరిదేవి
చాల మనవులు చెప్పి సమ్మతబెట్టి
పుడమిలో తానుగన్న పుత్రుల నిచ్చి
కూడిరి చుట్టాలు కులకోటి బాంధవులు
నాకు ప్రియములు జెప్పె నర్రావుల
 నూక
ప్రాకటముగ వినక పట్టక వస్తిమి
అరుళము బోయెను అన్న మీతల్లికి
పేరుబెట్టితి ఈ పాపకు ప్రియము
 తోడుతను
నర్రావుల నూక పేరున పాపనూక
సిరిదేవికి ఈ మాటచెప్పి వప్పగించు.

పెద్దతండ్రియిల్లు నిలుపు పేరు
సీదనుచు
అదృశ్యమై పోయె ఆరెను గుండము
కల్యాణము దేవగిరి గంగురాజు
మొదలైనవారు
బాలలు మీరు వో పరమేశ్వరుండ!
ఇతని సత్యము గంటిమి ఇతడే
ఈశ్వరుండు
ప్రత్యక్ష వేల్పితడె పరమేశ్వరుం
డితడె
అని చెప్పి ముద్దమ్మ మము
వప్పగించె
చరణములకు వరిగి చెప్పి వప్పగించె
నాడు మీపెద్దమ్మ నా కొప్పగించె
నేడు నీకొప్పగింప నేనెంతదాన!
లక్ష కంపటము లక్ష గోకులము
లక్ష సిద్ధులలోన రక్షించు మనుచు
పాపన్న సంగటన వచ్చిన పణతులకు
నెల్ల
దాపు నీవే సుమ్మి ధర జేర్చవయ్య
దయతోడ గురువుకు తగ నొప్ప
గించిరి
నయముగా గురువునకు నమస్కరించి
రంత
కంధువతోన ఆ ఖాటమరాజును

ఘన పాలకి ఎక్కించి కరుణ
తోడుతను
అందలము లోపల పాపను అతి
మోదమున నుంచి
భీకర ముద్రపెట్టెలు బిరుదు
వాయిద్యములు
మూకలై వారును ముందర నడువగ
సరికొండ పడమట తూరుపు దిక్కున
తూరుపు చింతల తురంగిల బైట
తురుపుగుర్రము అడ్డమాయెను
నాయుడా!
పరమేశు కెవ్వరు ఈ బాలల నిచ్చుట
బాలలు కల్యాణము ఎడబాసిరనుచు
మరపించి రప్పించి మమత బుట్టించి
కొంచుపోయెను బాలల ఎవ్వడో
జంగము
వన్నెలక్షం గుర్రాలతో వైబడి వచ్చి
అరునూరు గుర్రములవారు అప్పు
డెదిరించి
అల్లరిమూకలు ఆయుధాలవారు
ఏనుగబారులు ఎంతయు కదిసె
గిపెట్టి ఏనుగలు గ్రిరుమని కదిసె
గుర్రపు పముజులు గుప్పించి దుమికె
పొడువు పొడువుమని పోట్లాడి నిలచిరి

ఏదిక్కు చూచినా దళములు ఎడ
యేమిలేక
భత్తిరన్న మీదికి కదిసె బహుళమైన
దళము
చాల ద్రవ్యము మాకు సమకూడె
ననుచు
పశువుల కొల్లలాడ బాగాయె ననుచు
వడియల జంగాలతో పోరేము అనుచు
ఆంది జగడము చేయు అశ్వముల
నెక్కి
బంధు సహోదరు బలముల మీద
నలనన్న మొదలైనవారు నందుల
పుణ్యగురువు
శూలము ఝళిపించె అన్నబత్తిరన్న
అందరు యాదవులు ఆర్చుచు
ఎదురెక్కి
చంద్రవంక గొడ్డండ్ల చెండు
బెండాడి
భత్తుడు గోరంత భస్మాంగమేయ
చిత్తశానవలె చిత్రబాణాలు తగిలె
బొబ్బలు బెట్టుచు తల్లడబొంది
వకకొంత విరిగిరి వకకొంత వరిగిరి
విడిచిరి ప్రాణాలు విడిచిరశ్వాలు
పడివాగె తేజీలు పరువడి నడిపించి
ముదమొప్ప నాకాశ ముస్తీదుతోను
యాదవ వీరవరులు వేడ్కతో నపుడు

ఎలమితో కల్యాణము ఎడబాసి మేము
కల్లరివైరుల కడకు బోదరిమి
మదహస్తి రవుతుల మన్నించి
గురువు
కవులు ఇచ్చి తెచ్చెను కరకంఠ
మూర్తి
ఛత్ర చామరములు ఆలవట్టములు
గొడుగులు అందలాలు గుఱ్రముల
వారు
విడువక కొలువంగ ఈశ్వరమూర్తి
వరుసతో పంచమహా వాయిద్య
ములతోను
కరుణతో భత్తిరన్న మమ్ము కాపాడు
కొరకు
విశ్వనాథుడు ఎలమంచిని విడిచె
సంపదలు
బసువవాహనుండు ప్రజలకు
నాయకుండు
పల్లికొండ అయితన్న బాలరాజులును
మాతల్లి సిరిదేవి యలమంచివారు
కొమరగిరి మొదలైన గోపికా స్త్రీలు
తమరంత యెదురుకొని తగ వాద్య
ములతోను
నిండు ఏగురు వచ్చి నివాళ్ళు యిచ్చిరి
కడలేని దయతోను కడు వేగమునను
కమిగిట జేర్చిరి కన్న బలగమును

అయ్యవంకవార్న్ గలిపె ఆత్మ
చల్లనాయె
సైదోళ్ళ గలి స్త్రిమి సంతోషమాయె
గురువు తల్లిని బిలిచి కూర్మితో
జెప్పెను
మరువకు నామాట వో తల్లినీవు
కారణజన్మమందె కాటమరాజు
హరుడె నిజము, అయితన్న కల్ల
అమ్మా! పాపనూక నిజము,
అగుమంచి కల్ల
నమ్మించి తెచ్చినాను నామాట వినుము
పెద్దమ్మ కని పాపపేరు పెట్టింది
వద్దికై వుండమని వప్పగించె తల్లికి
మోరుట ఈశ్వరుని మాట విని తల్లి
చేరవచ్చిన తావు చేట్లాయెను నాడు
పరగ దొనకొండ అయితన్నకు
పట్నంబు గట్టిరి
ఆరుట్లకోనను తనకు ఆవులమంద
పట్నమాయె
నేను ఏమందును నిన్ను వో నాయుడా!
అగుమంచిని మనువిచ్చిరి అయిన
తావులకు
అంతమేడను చెల్లెలిని అడలంగ
జేసిరి
గురెకుంట్ల ఇలికించి గురువు తా దెచ్చి

ప్రేమతో దెచ్చి మమ్ము భర్తుడు
పేరాపన జేసె
దయలేక చెల్లెలిని తల్లి సిరిదేవి
తాల్మితో మేడబెట్టుమని చెప్పె తల్లి
సిరిదేవి
ఎలమంచిచెల్లెలు ఎతకుడుచు నాయుడా
ఘనముగా బుట్టి మేము గారమున
బెరిగి
కనకమేడనుండ కట్టడి కాబోలు
భోగాన బెరిగిన చెల్లెలు పొడుగు
మేడమీద
అగ్నాత వాసమునుండ చెల్లెలికి
వ్రాసె కాబోలు
తనతోడ బుట్టినందుకు ధ ము
కొండలోన
కనకమేడనుండ కట్టడి కాబోలు
కొండమీద వుండిన కోకిల చందాన
వుండజేసెను కొమరగిరి వో పద్మ
నాయుడా!
వరసతో ధనకొండ వల్లవుల జూచి
ఎరుగక సిరిదేవి యింతజేసెను
నాయుడా
ఏరాలి బిడ్డలము గాన ఏరుబందము
జేసె
పడవేసె మంటలో పాపపు తల్లి

కడవారుగారు కల్యాణము
వియ్యకపోను
తన కలిమి పొయ్యానని తలచి
మేడబెట్టె
చనవు లేక చెల్లెలు సమిసెను
నాయుడా!
ఇసకలో కురిసిన ముసురువాన
వలెను
వాసిగల చెల్లెలిని వగ్గాన దోసిరి
మేనత్త కామరగిరి మెడబలి చూచుక
ఇల్లటము వుంచితే ఏమాయె తనకు
కొల్లారు మిద్దెలన్ని కొల్లబొయ్యానా
చెల్లెలిని మేడబెట్ట చేసెరుగరైరి
కలకాలము పాప కన్నీరుబెట్టితేను
సిరి తొలగునుగాదె చిన్ని నామరది!
సదాశివుడింత జేసెను నాయుడా
వొక్కతే చెల్లెలు వో పద్మనాయుడా!
పెక్కు రేగులలోన వక్క జిల్లేడు
విరిగిన చందమాయె నా చెల్లెలిబ్రతుకు
అప్పల చెల్లెండ్ల అందరి నెడబాపి
వొప్పుగా మేడమీద వుంచెను సిరిదేవి
మునుకొని దుఃఖాన మునుగుచు
నుండేను
తన సరివారెల్ల ధనముకొండలోన
నవ్వుచు వుండేటి నాతులజూచి
శివశివ యని పాప శివుని దూరిని

బావల మరుదుల బంధువుల దలచుక
కనకమేడమీద నుండి కన్నవార్ని
దలచుక
ఎన్నరాని దుఃఖాన ఎప్పుడు చెల్లెలు
అన్నల దలచుక అడలకుండీన?
మేలు గ్రహించి అయితన్న
మేడవద్దంటే
ఏమి జేసును తల్లి వెలది సిరిదేవి?
పల్లికొండ రఘుపతి పాపము వద్దంటే
పాపను మేడబెట్టునా పాపపు తల్లి?
ఇల్లటము వుంచక వారు ఎర్రి
తలపెట్టిరి
ఆపద బెట్టిరి అయ్యయ్యో!
నాయుడా!
పెందోట ముద్దమ్మ పెద్ద గంధావతి
అనుదినము బెంచెను అక్కమాదేవులు
తల్లిదండ్రాజులు చనిపోయినవెనుక
మల్లెల మహాదేవి మగువ తా బెంచె
వారిని తలచుక చెల్లెలు
వలపోవకుండీన
కడు ఏడు మేడల కనకమేడ
మీదనుండి
వుడుగరాని దుఃఖాన వోర్వంగలేక
గార్వపు చెల్లెలు కన్నీరు బెట్టినాను
తగులును సిరిదేవికి తన చెల్లెలి
వుసురు

ఎరిగివుంతు నాయుడా ఏడాదికాడికి
మరువక నాయుడా! నేనాడిన మాటలు
సీతవుసురు లంకకు తగిలి సిద్ధముగ
చెడెను
ఆరీతి అవును అమ్మ వున్న
ధనముకొండ
పాపవుసురు తగిలి భస్మమై పోవును
ద్వాపరమందు దేవకివుసురు తగిలి
మధురంతా హతమై పోయెను
నాయుడా!
సతిపతు లిద్దర్ని సంకెళ్ళు వేసి
చెల్లెలిని యమబాధ బెట్టించె కంసుడు
మధురాయె ధనముకొండ మరి
కంసుడు అయితన్న
సిద్ధము దేవకి నా చెల్లెలు పావ
సత్యముగల చెల్లెలు సరగ
దానకొండలోన
సతిపతు లిద్దరూ శపించినపుడె
సముద్రము ఎండినట్లు సిద్ధమగును
ధనముకొండ
ఏటిమీద ఆరునెలలకు యాదవులకు
చేటుబుట్టును

పోవును ధనముకొండ బొగ్గుల గలసి
చావు నిత్యమని ఎరగదు తల్లి
కటువుగా కట్టిన కనక మేడమీద
నుండి
సూటిమాటికి నాయుడా! మమ్ముల
దలచుక
అందరిని దలచుక అకలకుండీన?
వల్లవగోత్రాలు వంశ యముగాను
చెల్లెలు పాపమ్మ శపించకుండీన?
వింతవారిని చూచినట్లు తల్లి వేడుక
చూడదాయె
ఎంత జేసెను తల్లి ఈరీతి చెల్లెలిని?
సిరిదేవి స్రిష్టిపై చిరకాలముండి
ఏరువలు చల్లంగ ఏలితే చాలు
ఆపద వచ్చెను చెల్లెలికి
అనుభవించకతీరదు"
అప్పుడు పద్మనాయినితోను ఆ
రాజఘనుడు
తలపోత శాయంగ తా బలికె
నాయుడు :

## పద్మరాఘవుడు కాటమరాజును ఓదార్పుట

"కులపావనుండ ! యాదవ
గుణశేఖరుండ !
పలికి బొంకని యట్టి బసవశంకరుడ !
నలనన్న వినవయ్య నా విన్నపంబు
ఎవరిని దూరిన యేమి చేయగలరు ?
ఆవులన్న : పాపమ్మ అంశ యింతేను
బ్రహ్మ వ్రాసివుండగా భత్తుడేమి
జేసును ?
నీ తమ్ముడేమి జేసును, నీ తల్లేమి
జేసు ?
పల్లికొండ యేమిజేసును,
బంధువు లేమిజేతురు ?
వల్లవులరాజ కమ్మలు వయ్యన వ్రాసి
పంపించ వలెగాక పరితాపమేల ?
శివుడు వ్రాసిన వ్రాలు సిద్ధమగునుగాని
తప్పించగలరట్టి ధరణీశ వినుమ
సతులవర్జితుండ! సంగ్రామ విజయ!
యతిపట్టభద్రుండ! ఏల దుఃఖింప
చాటువకెక్కిన సత్యచంద్రుండ
రఘురామ చంద్రుండ! రాజ,
నలనన్న
పనిలేదు దుఃఖింప బాగుగాదయ్య
దేవతల విడిముళ్ళు జెప్పెద నీకు
నామాట వినవయ్య నరనాథచంద్ర!

## హరిశ్చంద్రుని చాటువ

కృతాయుగమునాడు కులములో నతడు
హరిచంద్ర మహారాజు అందరిలోన
కులసతి నొకచోట కొడుకు నొకచోట
తాను వకచోటను ధరణిమీదటను
వీరబాహువును కొలిచిన విధమెల్ల
వినుము
మాలని వెనువెంట మధుమాంస
ఘటము
కావడిగ మోయంగ కరుణించి యంత
కావడిగా మోసె గౌరీశ్వరుండు
వారికి బ్రహ్మ యిటువలె వ్రాసె
పశుపతిరాజు

# శ్రీరాముని చాటువ

త్రేతాయుగమునాడు దేవతలతోను
శ్రీరామచంద్రుండు సీతయు దాను
హారణ్యమందున అటు వుండగాను
మాయామృగంబును మరి వేగ బంపె
మోసము చేయించ ముదమొప్ప
రావణుడు
పరణశాలను లక్షుమన్నను పదిలాన
వుంచి
విల్లునంబులు బట్టి వేవేగ రాము
ధనుర్బాణము దొడిగె తా కదిలె
నపుడు
దవ్వున యా మృగమును తరుముక
పోయె
పోగాను శ్రీరామ భూపాలకుండు
ఎంత సేపాయెను ఇదియేమొ
లక్షుమన్న
వేగంబె బోయి మీయన్నను కలసి
రమ్మని
సెలవు యిచ్చెను వేగ శ్రీరాముసీత
ఆమాట విని పోయె ఆ లక్షుమన్న
తర్లెను అరణ్యముకు దాసి పోగాను
వచ్చి యా వునుకులు వనరంగ జూచి

మాయవేషము దాల్చి మరియు
రావణుడు
జటావల్కలములు తెరగొప్ప
ధరియించి
వచ్చి పరణశాల వాకిట నిలచి
చెరబట్టి రావణుడు సీతను అపుడు
రథము పై నిలిపెను రావణేశ్వరుడు
ఆకాశ వీథిన ఆ రథము దోలె
వచ్చెను లంకకు వాయు వేగమున
నిలిచెను లంకలో నిమిషమాత్రమున
మాయామృగంబును మరి వేగ జంపి
రామాలక్షుములు పరణశాలకు తర్లిరి
పరణశాల శ్రీరాము పారంగ జూచి
ఇది యేమి సోద్యమో విను
లక్షుమన్న
ఇది యేమి మీ వదిన యిచ్చట లేదు
అని పలికి రాముడు అటు మూర్ఛ
పోయె
తప్పక జూచి యా తమ్ముని బిలిచె
ఓ యన్న మూర్ఛిల్లి వగవ నీకేల
ఎవ్వాళ్ళు కాచెనో యెరుగము మనము
ఇద్దరము లేకున్న యిచ్చటికి వచ్చి

కొంచుపోయెను యెవ్వడో క్రూరుడై
వాడు
రాక్షసుల మాయలు నట్టి కానరాదు
ముదమొప్ప అపకీర్తి మూడు
లోకములను
ఎరిగి యెరుగక జేసి యెవ్వడోగాని
మహాలక్ష్మి మహిమ యెరుగంగలేక
కావరంబున వాడు కానకపోయె
నీచేత వాడును నేడు హతమగును
శ్రీరాము వినవయ్యా సీతను దెత్తు
అని పలికె లక్షుమన్న ఆ
వివరమంత
ఓ బావ నలనన్న వగవ పనిలేదు
ఎంతవారైన అ విధిని పడకిపుడు
కని నడచిన వారెవ్వరు కాటమరాజ !
లక్ష కొడుకుల గన్న రావణుదేడి ?
లక్ష కొడుకులు ఏరి ?
రావణుండేమాయె?
లంకాయె ధనముకొండ రాజ
వినవయ్యా
మేడబెట్టితే కీడు పోదు
ధనముకొండకు
కీడు దగిలి ధనముకొండ ధూళి
అయిపోవును.
ద్వారక మునిగినట్లు దొనకొండ
మునుగు

అగ్గిచేత ధనముకొండ హతమై
పోవును"
అని పలికె నాయుడు ఆ రాజుతోను.
మారుమాట జెప్పెను మాధవుడు
రాజు :
"ధైర్యము నిలువదు తనకు ఓ
నాయుడా !
రాతజేసిన గుండెటే రాక దుఃఖంబు
చెల్లెలిన తలుచుకుంటే చెదరు తన
మనసు
తల్లడింటెను గుండె తనకు వో
నాయుడా !
నిలుపలేను దుక్కము నేనేమి సేతు
సావు పుట్టుక రెండు సకల
జనులకును
అందరు ఎరుగుదురు అగును వో
నాయుడా !
ధర్మశాస్త్రములు తగనొప్ప యిప్పుడు
చెప్పేవారేగాని తెలియ దెవ్వరికి
వినలేద నాయుడా వివరంబుగాను
భారత భాగవత రామాయణ
ప్రబంధములు చదివి
తెలిసి తెలియనియట్టి తిక్కజీవులకు
ధర్మంబు తెలియక ధైర్యంబు
నిలువదు
పట్టలేను దుఃఖము పాపను దలచితేను

ఇప్పుడు నాయుడా నీవు యెంత
జెప్పినను
తప్పదు దుఃఖంబు తనకని బలికె
పరవారి కెవ్వరికి పని లేదు
నాయుడా!
వద్దనవచ్చునా వో పద్మనాయుడా!
అన్నతమ్ములెక్వరు నాయుడా
[illegible]
ఇద్దరము మేమును వినుమయ్య
నాయుడా!
ఎంత జేసెను తల్లి యేమి సేతును
నాయుడా!
వింటివా దుఃఖంబు వినవయ్య
నాయుడా!
ఇందరి నెడబాపి యెంత జేసెను
శివుడు
చలపట్టి యాబ్రహ్మ చంపకపోయె
ఒకనాడు రెన్నాళ్ళు వగతునా తాను
ఎంత జేసెను శివుడు యేమనవచ్చు!
తప్పదు దుఃఖంబు తలపోతజేసె!
బ్రహ్మ తా వ్రాసి పగవార్ని కూడె!
వర్లుచు వుండును వో పద్మనాయుడా!
ఎడలేని దుఃఖము ఎంత జేసెను
శివుడు
చెల్లెలి దుక్కము ఏమి జెప్పుదు
నాయుడ!

అన్నలని చెల్లెలు అడలకుండినా!
యమపురిలో ద్రోసిరి యేమి సేతును
నాయుడా!
యేరుబంధమున బందిగములో వేసిరి
పాపనూకమ్మను
కడుపునిండ బిడ్డలగన్న సిరిదేవి
పాపము గట్టుకొనెను పణతి సిరిదేవి
[illegible] సిరిదేవి కొలువులోనుండి
ఎం[illegible] జేసెనె యేమి జేతు
నాయుడా!
యేరుబంధమున గండపు పాప
నగరున వుండరాదనుచు
పంకించి సిరిదేవి పగదానివలెను
ఆ తల్లిమాటలు అతికిడువలేక
మాయజేసె చెల్లెలిని మరివేగ
అయితన్న
నేర్పున తల్లికి జెప్పను న్యాయము
గాదనుచు
పరవారైరి వారు పాపకు నాయుడా!
గంగురాజునగర మేము గార్వమున
వుంటిమి
ఎం కనీడకన్ను యెరుగక వుంటిమి
చలపట్టి బత్తుడు మమ్మ చంప
దెచ్చినాడు
తల్లికి వప్పగించి తా కదలిపోయె

ఎంత కీడు చేసెను ఏమి సేయుమ
నాయుడా!
పల్లికొండ రఘుపతి బంధువులు తాను
పట్టి చెరలో ద్రోసిరి పాపను
నాయుడా!
అన్నలు తమ్ములు అయితమారాజు
వగ్గాన దోసిరి వో పద్మనాయుడా!
పల్లికొండ బావై పాపనూకమ్మను
పులిబోన ద్రోసెను భూమెల్ల యెరుగ
ఈరీతి పెద్దలందరు విప్రులతో
జెప్పిన
విప్రులందరు గూడి వినవోయి
నాయుడా!
పరశురాముని నాడు భంగపరిపించి
ఎంతజేసిరి నాయుడా యా బ్రాహ్మ
లందరును
కర్మానికి వెరువని కటిక
బ్రాహ్మలును
వేదశాస్త్రములు వారు ఎంత చదివినను
పాపహేతువు మాటలు బాగుగ
జెప్పిరి.
పాపానికి ఒడిగట్టిరి ఆ బ్రాహ్మ
లందరును
కలిమిలేములు జెప్ప వారికి కారణ
మేమి?
బ్రహ్మత్య జేసేటి బ్రాహ్మలు వారు
అన్నింటి కెరువని అగ్రజనులు వారు
వేద బ్రాహ్మలు వారు వేదములు
చదివి
అందరు గుమిగూడి అప్పుడిట్లనిరి
ఓ యమ్మ సిరిదేవి వమ్మదని
పలికిరి
మేడబెట్టక కాని కీడు బాయదనిరి.
గండపు పాప మీకు కారాదు యనిరి
అని యిట్లు బ్రహ్మలు అందరు
జెప్పినను
ఈ పాప పుట్టనేల? యిండ్లు చెడనేల?
అందరిని పిలిపించి అపుడు
తలపోసి
తనకు వమ్మిరాదని తల్లి సిరిదేవి
కనకమేడ నుంచెను కాంత సిరిదేవి
ఎట్లు వోర్తును నాయుడా మాకెవ్వరు
దిక్కు?
యమురాలు కొమరక్క యెంత
మాయ పన్నెను!
బిడ్డలు లేనట్టి గొడ్రాలివలెను
ఈరీతి జేసెను వినవయ్య నాయుడా!
ఎంత దుఃఖపడ్డ మాకు యెవ్వరు
దిక్కు
దిక్కులేని చెల్లెలు దుక్కపడితేను
ఉండదు ధైర్యంబు ఓ పద్మ
నాయుడా!"

అని పలువరించు హా చెల్లెలాయనుచు
ఓహో యని చెల్లెలికై వగవంగ
సాగెను
నెత్తి ధరణిపై గొట్టి నేలపై వరిగె
రొమ్ములు గుద్దుచు రోషంబుతోను
చేతులు పిసుకుచు దేహంబు మరచి
నేలలు పుణుకుచు నిట్టూర్పు
లూర్చుచు
బాలరాజు శోకాన ప్రలాపింపగాను
కడలేని దుక్కాన కన్నీరు పెట్టె
నడుమ నెక్కాన విరిగె నాయున
కపుడు
ఎడమబరి నల్లగుండె ఏడు
వప్పులాయె
హాయని చెల్లెలికై అడలుచు రాజు
కొండలు ధ్వనులిచ్చి గుబ్బటిలినట్ల
సముద్రము గుబ్బటిల్లి తల్లడిల్లినట్ల
కావుకావున ప్రలాపించె కాటమారాజు
"కల్యాణము విడిచిననుండి కానను
చెల్లెలిని

పన్నెండు వేండ్లాయె దొనకొండ
పట్నంబు గట్టి
పదమూడో యేట మేడకు పైనంబు
గలిగె
ఏంటిమీద ఆరునెలలాయె యెడబాసి
చెల్లెలను
సన్నాసిచెల్లెలు నాయుడా శపించి
నపుడె
అదృశ్యమై ధనముకొండ అగ్గిబడి కాలు
ఇంత మాత్రానికి ఏమిటికి చింత
పంతము బలికెను పణతి సిరిదేవి
భాగ్యభోగ్యంబులు పట్నంబు గలిగి
అందణాలు పాలకీలు అశ్వములు
కలిగి
ధనధాన్య వస్తువలు దండిగా గలిగి
తామరతంపమై దండిగా మీరు
ఉండవలె సిరిదేవి పుర్విలో మీరు
సన్నాసులమై మేము ఉండంగ తాను
ఓర్వలేక
చేయను యింతపని చెల్లునా తనకు
సాంబ్రాజ్యము గలిగిన తల్లి సిరిదేవి

## దుర్యోధనుని చాటువ

అన్నల తమ్ముల అందరిని యెడబాపి
ద్వాపార యుగమందు దురియోధ నుండు
నూర్గురు తమ్ములు నూటొక్క తనయులు
ఇరవై యొక్క లక్ష బంధువర్గంబు ఇలమీద గూల్చి
ఆరుకోట్ల నియోగుల హతము సేయించి
పద్దెనిమిది కోట్ల మటమర్దనుల భగ్నంబు జేసి
పదకొండు అక్షోణిబలము భస్మంబు జేసి
ధర్మరాజులకు తాను భూమి పంచియ్యక
లక్కయిండ్లు కట్టించి రాజులకు నెల్ల
ధర్మరాజుల నుంచి ఆ యిండ్లు తగలబెట్టించె
కృష్ణాసహాయముచేత గెలిచిరి వారు
దుష్టపనులు చేయించ దుర్యోధనుండు
ఏమి కొంచుపోయె నాయుడ యిల మీద నతడు
ఎవ్వరు పాపంబు ఎంత జేసినను
కట్టి కుడుపకపోదు ఘనత వో నాయుడా
మాతల్లి సిరిదేవి మమ్మ గేలిజేసి
ఏమి సేయ దలచిందో యెరుగము నాయుడా
ఇంతకంటె తల్లి యిక యేమి జేసు?
కటకట మామీద కరుణ యింతలేక
[illegible] తల్లి ?
ఎన్నాళ్ళు బ్రతుకునో యెరుగము నాయుడా''
అని యిట్లు శోకించి ఆ రాజఘనుడు
నాయినిమందర నటు అధైర్యపడెను
జలజల కన్నీరు జారంగసాగె
దేహంబు బడలెను తేజంబు దప్పె
ముచ్చమణిగి రాజు మూర్ఛ తా బోయె
కురులు తూలాడంగ నేలపై వరిగె
పొర్లి పొర్లి యేడ్చుచు వో చెల్లెలా! యనుచు
"తల్లిదండ్రి వుంటేను తనకేల యీ దుఃఖము

వుండలేదు దుఃఖము వో పద్మ
నాయుడా!
చేకొని శివుడంత బ్రహ్మ.........
సకల విధముల మాకు సర్వేశ్వరుండు
మామీద దయలేక మమ్మింతజేసె
ఇకనేమి అనవచ్చు"నని విధిని మీద
దూరె

ఆకాశవాణి వో యమ్మ భూదేవి
కర్మల కన్నుల కానరా మీరు
అని పలువరించుచు హా చెల్లెలా!
యనుచు
వరిగెను ధరమీద వల్లవులరాజు

## దేవతలు కాటమరాజుతో చెల్లెలిపై ఆశ విడువుమని చెప్పుట

వేయి శిరసులు రెండువేల
జిహ్వలు గల
ఆదిశేషునిమీద అటు పవళించియున్న
వచ్చెను శ్రీహరియు వాసుదేవుండు
చతుర్ముఖములు గల శంఖుచక్రాల
స్వామి
ఇల వినోదంబున నిలచి తా జూచి
నాగకంకణుండు వచ్చె నంది
వాహనుడు
బాగుగా నచటకు ప్రమథులతోను
అంతలో బ్రహ్మ తా హంసవాహన
మెక్కి
తేజంబున వచ్చెను దివినుండి యపుడు
"వినవోయి కాటమరాజ! వితరణకార
పీరుడవు శూరుడవు వినవోయి రాజ!

వగవద్దు వో రాజ చెల్లెలికి వాంఛలు
విడువు"
అని యిట్లు దేవతలు అంతయు జెప్పి
అమరలోకమునకు అటు బోయిరంత
తెప్పరిలి యా రాజు దిగ్గున లేచి
పద్మనాయునివంక పారంగ జూచి
మరిది మీదను చెయ్యి వేసి మరి
కమిగిలించి
"నీలవంటి ప్రధానివి నీవు వో
నాయుడా!
ఎన్ని జూచినగాని యెవ్వరు లేరు''
అని యిట్లు భూషించె ఆ రాజఘనుడు
రాజును నాయుడు అటు గారవించి
"రాజ మహారాజ! రాజ మార్తాండ
రాజ వినవయ్య వో రఘురామచంద్ర

అయోధ్య రామునివవు ఆదివిష్ణువవు
వల్లవుల వో రాజా! వంశాబ్ధిచంద్ర
నిండి ఘనమాయెను నేడు నా అయ్య
చేసిన పాపంబు చెల్లె గో రాజ
కర్మదోషములు అంచితముగనైన
బోయె"
అని యిట్లు ప్రార్థించి ఆ పద్మనాయుడు

## పద్మరాఘువుడు కాటమరాజుకు తన వృత్తాంతము చెప్పుట

"వగవద్దు చెల్లెలికి వ్రాతఫల మింతే
నీ దుఃఖము రాజా నీవు చెప్పితివి
నా దుఃఖము చెప్పేను నలనన్న!
విసుమ:
ఏలూరు దొండలూరు ఏలితిమి మేము
బంతులూరు వింతలూరికాడ బంతు
లాడుదుము
కటార్ల బొల్లవరము కాణాచి మాకు
నాదిండ్లకాడ నా పెండ్లి అయిన
పిమ్మటను
నలభై నలుగురు సంగడీలు నన్ను
కొలిచి రాగాను
వెలయ డెబ్బదిరెండు వేల గోత్రాల
గోత్రాలవారు నన్ను కొలిచి రాగాను

## పద్మరాఘవుని చూచి ఆవులు బెదరిపోవుట

నల్లచెరువున నేను స్నానంబు లాడి
సూర్యప్రార్థన జేసే సమయంబునందు
అన్నకందు గోకళకు అది కానవచ్చె
నిత్యమని ఆ చెరువు నీళ్లకు వచ్చెను
గుభగుభ బెదిరెను క్షురసుక్షురావులు
సురభులు నీళ్లవంక జూచి సుక్షురన
స్రుక్కె
పెనుగుంపులై ధేనువులు బెదరి పోగాను
తొక్కులాడె పశువులలో తొంభన్నూరు
లేగలు చెల్లె
అరిచి యా పశువులు అడువుబు పట్టి
సురభులు నీళ్ళు చూడక స్రుక్కి
పశువులును
పుడిసెడు నీళ్ళను పుచ్చుకోకపోయె.

ఈ పశువులు నీళ్ళు తాగని పాప
మేమనుచు
మాకు కలిగిన గురువును కమలనాభుని
గ్రక్కున బిలిచి
"పశువులు నీళ్ళు తాగక పోయిన
పాపము ఏమయ్య ?
మాకు తెలియజెప్పు మా పాలి గురువ?"
అనాగత ఏష్యము తెలిసిన ఆ కమల
నాభుడు
మనసున తలపోసి మరియు నిట్లనియె

"వన్నెవన్నె తెల్లని వస్త్రములు చూచి
పెనుగుంపులై ధేనువులు బెదరె
కాబోలు
అని మరుగుబెట్టి కమలనాభుడు
మందలించగను
మరుగు లేకుండ చెప్పవయ్య మాస్వామి
నీవు
ఏమి చెప్పుదు నాయుడా ! ఏమందు
నిన్ను !

## పద్మరాఘవుని తాత నానినాయుడు గోహత్య చేయుట

అలనాడు మీతాత నానినాయుడు
మీఅవ్వ నాగమ్మ
గ్రహణకాలమందు గంగానదిలోన
సతిపతు లిద్దరూ వక్కవలువ గట్టి
సరిగంగ లాడేటి సమయంబునందు
గంగిగోవు అక్కడికి నీళ్ళకు వచ్చెను
మీ తాతపైన వున్న పట్టుపచ్చడము
అచ్చమైన గంగమైలావు ఆ పచ్చడము
చెరుగు తా నమిలె
అంతట మీతాత చంద్రాయుధము
తీసుక
గంగిగోవును రెండు తునియలుగా
నరికె

పట్టుశాల్వకు సురభి ప్రాణంబు లిచ్చె
ఆ హత్య మీయింట విడువక వుండె
ఆ హత్య బాపేటందుకు మీ తండ్రి
విప్పర్ల పోతినాయుడు
విప్పర్ల గోత్రము వృద్ధి పొందించే
ననుచు
వేగంబె వెండిగోవుల వెయివేలు
చేయించినాడు
పైడిగోవుల పదివేలు చేయించినాడు
వేయింటికి బ్రాహ్మల వేగమె పిలిపించె
వరహాలు మాడలు వందలకొలది
ధారబోసి గోవుదానంబు లిచ్చె
బ్రాహ్మణుల హస్తాలలోన

పైడిగోవుల వెండిగోవులు బాగుగా
నుంచిరి
వుంచిన గోవుల బ్రాహ్మలు వైనాన
జూచిరి
పచ్చిరక్తము పశువుల మొండెములై
పారాడ సాగె
దానములు బ్రాహ్మలు ధరపై విడిచిరి
హరహర యని బ్రాహ్మలు ఆందోళ
పడుచు
శివశివ యని బ్రాహ్మలు చింతింప
సాగిరి

ఆ హత్య మీనగర నిత్యమై వున్నది
మూడు తరములనాటి హత్య
మునుగుచు నున్నది
తాతనాటి గోహత్య తగిలెను మీకు
ఏనుగతొండములావు పాపము వేగుచు
నున్నాది
ఆ పాపము ఎటువలె బాసును అయ్యా!
తనకు?
అని యడిగిన కమలనాభుడు
అతి వేగ బలికె:

## కాటమరాజు అవుల మందను సేవించుమని పద్మరాఘువునకు గురువైన కమలనాభుడు చెప్పుట

"వినవయ్య నాయుడా! వివరంబుగాను
చాల గోవులుగల రాజుతోడ
కలియ సంగడంబు చేస్తివైనాను
ఆంబోతులనెల్ల తండ్రిగా భావించి
ఆవులనెల్లను తల్లిగా వర్ణించి
ఆవులలో వున్న కోడెలు అన్న
తమ్ములమారు
ఆవులలో వున్న పెయ్యలు అప్ప
చెల్లెండ్లమారు
పొరుగూరివారు నీకు సైదోడుమారు

సతుల వర్జించి సన్నాసిపట్నము
గట్టుకొని
పశువుల రక్తము రక్తపాలేరుకై
తొట్టి పారిన నాటికి
సత్యము పాతాళము చదరంగ
పాలేరు
నిత్యము ఎరగడ్డపాడు నిజము
లింగాలకొండ
దాక్షలు ఎరగడ్డపాడు దండునిల్చ
లింగాలకొండ

మోత్ష మెరగడ్డపాడు మొగనిల్వ
లింగాలకొండ
కోమలేరు తూమలేరు కొప్పుకొండమేర
నీళ్ళవలె రక్తంబు నిండిపారేను
కలసి పారవలెను వో పద్మనాయుడా
చార్తుల గుడారు సంపెంగమానికింద
గుండెలు పేగులు గుదులు గుదులుగాను
సొంగలకొండ పిల్లాపేటికి రక్తము
పెళ్ళగించవలెను
దంగురా రక్తంబై కొట్టి పార
వలెను
భాగీరథమ్మ గుంటికి రక్తము
ప్రదక్షిణమై పారి
అయ్మ పోల్‌రాజు వుండేటి పంచ
లింగాలకొండకు రక్తము
దిన్నెలకు ఎడగారి తెప్పలుగట్టి
కన్నెకల గుండానికి రక్తము
త్రైవాలినను
కొండమీద వుండిన శిలలు గోవింద
గోవింద యనుచు
మునిగి రక్తములోన మొరబెట్ట
వలెను
వాగులు దప్పితే వరదలు బట్టి

అల్లివాగు నెల్లివాగు కూడలి నేరెళ్ళ
వాగు
పిల్లకాల్వలు నిండి పెరిగి ఈదులు
గాను
రక్తంబు ఏరులై పారిన నాటికి
ఆ పాపంబు నీకు పరిహారంబు
కలుగును
అని యిట్లు కమలనాభుడు
ఆనతిచ్చినను
ఏల భూములులేక ఎక్క అశ్వములు
లేకపోయెనా తనకు?
అల్లితామరవంటి అన్నదమ్ముల విడిచి
బలభద్రసేనులవంటి బావమరుదుల
విడిచి
నీతోడి సంగానికి నేనేల వస్తిని బావ?
నీవు చూచి కొన్నాళ్ళు ఆవుల
మేపినాను
నీవు చూడక కొన్నాళ్లు ఆవుల మేపితి
యాడవాడో పొలపరివాడు నా మంద
లోకి వచ్చినాడనుచు
నెట్లు నెట్లుబడ నెట్టిస్తివి నన్ను
సంగడానికి నేను నిలబడి వుంటి

## గొడ్డుటావుల పాలు పితుకుమని కాటమరాజు పద్మరాఘవు నాజ్ఞాపించుట

ఒకనాటి దినమున వనరంగ నీవు
మందముచ్చుల మాచకమ్మల మరి
వేగ నీవు
బ్రొద్దువంక చూడని భోగావతి
కన్నెల
ఆబోతువంక చూడని అన్నెకారి
ఆవులను
తాడుకోల ఎరగని ధర్మసురభులను
గురుతు ఎరగనియట్టి కుచ్చితపు
నర్రావులను
అమృవంటి ధేనువుల పాలు పితక
మంటివి నన్ను
మరుపుచు ధేనువుల మందలో నిలచి
పేరైన ఆవులను పేరుపేరున పిలచి

సురభిధేనువ రావె: సుదతిరో రావె:
గరుడునితల్లి రావె: గంగానది రావె:
పాలవెల్లి రావె: పాంచాలి రావె:
చాల కొడుకుల తల్లి ధర్మదేవత రావె
కంచికామాక్షమ్మ రావె: గవిరి
దేవమ్మ రావె:
తొలుచూలు కొడుకుతల్లి రావె: దొడ్డి
గంగ రావె:
రా: మందమారుతి రావె: రా:
ముద్దువెన్నెల:
రాజుల చెల్లెలా రావె: రాజహంస రావె
పేరు కల ఆవుల పేరుపేరున
పిలిచితి

## పద్మరాఘవుడు గొడ్డుటావుల పాలు పితుకుట.

ఆ లేగకు ఆతల్లి అలుముకున్నట్లు
గొడ్డుబోతులు గోవుకర్రలు
మందముచ్చులు మాచకమ్మలు
ఒర్లుకొని ధేనువులు పాలీయసాగెను

ఆరుకాగుల పాలు అతివేగ పితికి
మూడుకాగులకు ఆ పాలు ఇగుర
కాపించి
పాలు అన్నము భోంచేయబెట్టి

పాయరాని సంగడం పట్టితి నేను.
నీ తోటి సంగడానకు నేనేల వస్తి
నాభార్య మీమేనత్త కొమరక్క యింట
కోటరికము చేయనేల బావ కాటమరాజ !

## మారుజాబులు వ్రాసి పంపుమని పద్మరాఘవుడు కాటమరాజుకు చెప్పుట

శివుని వ్రాతకు మారు చింతింపరాదు
బ్రహ్మ వ్రాతకు మారు పలుకంగరాదు
ఎంత చింతించిన వైరితనము బావ
మారుజాబులు వ్రాయించి మళ్ళనంపించు
వారిమీద భారముంచి వో నలనన్న నీవు
సర్వకాలము సర్వేశ్వరుని దూరితేను
పూర్వకృతము తనను పొందకపోదు
వెనక జేసిన ఫలము ముందుండగాను
అందరిని దూరితే అవున వో బావ
భానుకులాధీశ పట్టాభిశేఖర !
దొడ్డకొండవారిని దూర పంతులేదు
నొసట వ్రాసిన వ్రాలు నేడు పోదయ్యా!
విచారపడవద్దు విధి గెలువరాదు
గోకులరక్షకుండ ! కులవర్ధనుండ
లోకాన కొదువలు నోచిన వారికి
అనుభవించక తీరదు హరిహరాదులకైన
భూనాథ వినవయ్య పుడమిలో జనులకు
కీర్తి వచ్చినను అపకీర్తి వచ్చినను
అనుభవించక తీరదు అధికులకైన
స్త్రీలకు పురుషులకు చింతింపనేల
నీళ్లమీదిటి బుగ్గనీరు చందమున
ఎంచనేమి వుండాది ఇలమీద నెవరు ?
కాటకోటేశ్వరుని వరము కొమారుడవు కాటమరాజ
సాటువకెక్కిన సత్యచంద్రుడవు
జగములో నీకీర్తి జను లెన్నగలరు
వగవద్దయ్య చెల్లికి వాంఛ పనిలేదు
వుత్తర యెలమంచిని వుంటిమి కొన్నాళ్లు
తమకాలము వచ్చె దక్షిణదేశానకు వస్తిమి
వచ్చినామని బావ వగవ పనిలేదు
ఆపద వచ్చిన హరిహరులకు తీరదు
చింతించ నీకేల శంభుడవు నీవు
ముదమొప్ప ఈరీతి ముందర ఎరిగి

ఉదయాద్రి సాక్షిగా వుంచేది లెస్స
వేయిగర్భములందు వెడలి జన్మించిలి
దయగలిగి వుండగా తల్లికై తేను
పిన్నల పెద్దల నెరిగి పెంపొంద నీవు

మాధవుడ : కమ్మలు వ్రాయించి
మళ్ళిపంపించు
రాఘవుని మాటవిని రాజు నలనన్న
వేవేగ కమ్మలు వ్రాయించె నపుడు

## కాటమరాజు సిరిదేవికి తిరుగుకమ్మలు వ్రాయించుట

"శ్రీగంగ పార్వతి సీతకు సరియైన
శృంగారలక్ష్మికి చెలువంబు మిగుల
సత్యభామా చంద్ర సాటైన తల్లి
నిత్యము జంగమార్చన నెమ్మది
చేయించు
కొమరగిరి సిరిదేవి గుణామణుల
కపుడు
అతుల సత్యవ్రతులకు ఆ రాజఘనుడు
తల్లికి మేనత్తకు దండంబు బెట్టి
తల్లిరో ఈవరకు తాను క్షేమంబు
పల్లికొండకు సాష్టాంగము పదివేల
మనువులు
వల్లవగోత్రాల వసుధేశులాకు
అన్నలకు తమ్ములకు
అయితమారాజుకు
పన్నుగా దీవించి పంపిన కమ్మ
గట్టిగా ఈమాట గైకొని వినుడ
పట్టభద్రుడు అయితన్న పల్లికొండ
గాక

అయ్యలమాట [illegible] వున్నాది
దయగల సిరిదేవి తల్లి తానెరుగు
చెల్లెలిమాట నన్నడుగ చెల్లునా మీకు?
తలపోసి నన్నడుగ ధర్మమా మీకు ?
ఎక్కువ మీకన్న ఎరుగుదునా తాను?
తమను తీర్చినట్టి తల్లివి నివు
పుణ్యపాపంబులు భువిలోన గలవు .
కడవారము కాము కలిసినవారము
ఏమి కార్యమైన ఎరుగరా మీరు ?
సమముగా నందరిని సాకేటి భారము
తల్లి నీకే తెలుసు ఆ ధర్మాధర్మంబు
చెల్లెలిని మనువిచ్చినా మీరే మన్నించినా
మీరే
మేడబెట్టినా మీరే మేలు గ్రహించినా
మీరే
కల్లలాడిన మీరె కడమేడ బెట్టిన మీరె
అలుగుల పాకనాట ఆవుల మేపిననాడు
కరుణించినా మేలె ఖండించినా మేలె
కాయా కొడవలి మీచేతి కప్పగింనాను

కరుణించి మీరందరు ఆ కాయ
కాచినా మేలె
తతికొని ఆ కాయ తరిగినా మేలె
కీర్తులు అపకీర్తులు అమ్మకయితన్నకు
ఆమీద పనులన్ని హరిగురువు ఎరుగు
తానేమి చెప్పదు తమరు వుంశంగ
మాటవాసి కొమరక్క మా అయ్యల
మారు
కాటమరాజు ఈపట్ల కడజేసె ననుచు
నిండు ఏగురు నామీద నిష్ఠూరమేల?
గండపు పాప నగర వుండరాదనుచు
అందరు మీరు అనగాను అపుడు
అల సూర్యుడు చంద్రుడు అవనియు
మిన్ను
కలంతకాలము కలియుగములోన
చల్లగా మీరుంటిరైన చాలునే తల్లి:
ఎనయంగ వో తల్లి వివర మింతేను"
అని కమ్మలు వ్రాయించి కడు
వేగమునను
కాటమరాజు ఆ పద్మనాయుడును
ధరణియించి లేఖను ధరణిపై వరగిరి
మారుకమ్మలు వ్రాయించి మాధవు
డపుడు
గారవించి కాలారికి కట్నంబులిచ్చి
తశిరీబు లిప్పించి దయజేసి రాజు
బసువన్న ఆవులు పరిణాన వున్నాపి
క్షేమమని ఈవార్త చెప్పుమా కాలారి
తమ యోగక్షేమంబు తగ విన్నవించు
గొల్లలు కంపటీలు గోవులు లెస్స
వున్నావి
బొల్లావు ఎద్దులు క్షేమమని చెప్పుమా!
చల్లవారు క్షేమమని చెప్పుమా కాలారి
చాల విన్నపములు తల్లికి సమర్పణము
గాను
కాలారి నీవు చెప్పుమని కమ్మలందిచ్చె
కడువేగ కాలారి కదిలెను వేగ
ధనముకొండకు కాలారి గ్రక్కున
కదిలె
ఆవులమందనుండి అరుదెంచి కాలారి
మెండుగా ధనముకొండకు మెగసి
యేతెంచె
మండలపతియైన మాధవుడయితన్నకు
అతివేగ చెప్పిరి ఆరకార్లు వచ్చి
ఆవులమందనుండి కాలారి
అరుదెంచినంట
భయభక్తితో అయితన్నపరగంగ లేచి
జయరెక్క లందుకొనెను జగదీశు
డపుడు
కన్నుల అద్దుకొనెను ఘనుడు
అయితన్న
బాలసరస్వతి అనే కరణాన్ని
గ్రక్కున బిలిపించె

అందించె జాబులు అతిసంభ్రమునను
బంధువులందర్ని పరగ బిలపించి
కొమరగిరి సిరిదేవి కొలువుదీరి
వుండగాను
అందరు వినగాను అప్పుడు చదివెను

## కాటమరాజు కమ్మలను సిరిదేవి చదివించుకొనుట

"శ్రీగంగ పార్వతి సీతకు సరియైన
శృంగారలక్ష్మికి చెలువంబు మిగుల
అలర సత్యభామకు సాటైన తల్లి
నిత్య జంగమార్చన నెమ్మతిగ
జేయించు
కొమరగిరి సిరిదేవి గుణామణులకూను
అమర సత్యవ్రతులకు ఆ దాజఘనుడు
తల్లికి అత్తకు దండంబు బెట్టితి
తల్లిరో ఈవరకు తాను క్షేమంబు
పల్లికొండకు సాష్టాంగములు పదివేల
మనువులు
వల్లవగోత్రాల వసుధేశులాకు
అన్నలు తమ్ములు ఆయితమారాజుకు
పన్నుగా దీవించి పంపిన కమ్మ
గట్టిగా ఈమాట గైకొని వినుడ
పట్టభద్రుడు అయితన్న పల్లికొండగాక
అయ్యలమారు కొమరక్క మాయత్త
వున్నాది
దయగల సిరిదేవి తల్లి తానెరుగు
చెల్లెలి మాట నన్నడుగ చెల్లున మీకు:
తలపోసి నన్నడుగ ధర్మమా మీకు:
ఎక్కువ మీకన్న ఎరుగుదున తాను:
తమకందరికి నీవు తల్లి వో యమ్మ:
పుణ్యపాపంబులు భువిలోన గలవు
కడవారము గాము కలిసి సవారము
ఏమి కార్యమైన ఎరుగరా మీరు ?
సమముగా అందరిని సాకేటి భారము
తల్లి నీకే తెలుసు ఆ ధర్మాధర్మంబు
చెల్లెలిని మనువిచ్చినా మీరె: మన్నించినా
మీరె :
మేడబెట్టినా మీరె: మేలు గ్రహించినా
కల్లలాడిన మీరె: కడమేడ బెట్టినా
మీరె :
అలుగుల పాకనాట ఆవుల మేపిననాడు
కాయా కొడవలి మీచేతి కప్పగించినాను
కరుణించినా మేలె ఖండించినా మేలె
కరుణించి మీరందరు ఆ కాయ
కాచినా మేలె
తతిగొని ఆ కాయ తరిగినా మేలె
కీర్తులు అపకీర్తులు అమ్మవి
అయితన్నవి

ఆమీద పనులన్ని హరిగురువు ఎరుగు
తానేమి చెప్పదు తమరు వుండంగ
మాటవాసి కొమరక్క మాఅయ్యల
మారు
కాటమరాజు ఈపట్ల కడజేసె ననుచు
నిండు ఏగురు నామీద నిష్ఠూరమేల ?
గండపు పాప నగర వుండరాదనుచు
అందరు మీరు అనగాను అపుడు
అల సూర్యుడు చంద్రుడు అవనియు
మిన్ను
కలంత కాలము కలియుగములోన

చల్లగా మీరుంటి రైన చాలునే తల్లి!
ఎనయంగ వో తల్లి! వివర మింతేను"
అని యిట్లు కమ్మలు అప్పుడు
చదివిరి
మెచ్చిరి రాజును మేలు మేలనుచు
రక్షకుండు ఇంతటి రాజు లేడనిరి
సంతోషమందిరి సకల జనులెల్ల
ఇంతటి రాజు ఇలలోన లేడనుచు
న్రావుల సిరిదేవి నతివేగమ్మునను
ఏరువలు చల్లంగ ఏలుమనిరంత
తన కొమారుని బిలిచె తల్లి సిరిదేవి

## మేడ కట్టించుమని సిరిదేవి అయితమరాజు నాదేశించుట

పున్నమాధిచంద్రుడ! భూమేలు రాజ!
విన్నపము జెప్పేను వినవయ్య రాజ!
మహిలోన పాపకు మంచిమూర్తమున
కట్టించు అయితన్న గ్రక్కున మేడ
వెట్టి ఏమనవద్దు వేడుకమేడ
పిలిపించు రెడ్లను ప్రియముగా జెప్పి
అలరంగ భోంచాయ అన్నంబు పెట్టి
తశరీబు లిప్పించి సంతోషపరచి
శశిమించు చందనపు చావకూర్చాలు
కనకమేడ గట్టించు అయితన్న కడు
సొంపుగాను

ఘనమైన వృక్షాలు గ్రక్కున తెప్పించి
మేదినీశ్వరుని చెల్లెలికి మేడగట్టించు
మఱి తల్లి మాటలకు మండలేశ్వరుడు
కృపనందుల సిరిదేవిని కోపమేల
తనకు
శ్రీపతి పోలురాజు సిరిదేవి వినుమ!
బుద్ధిమంతులగన్న పొలతి సిరిదేవి
కందుకూరి కాపులతో కన్నతల్లి!
వడబరచి తెచ్చినాను వోరుగంటి
కాపుల
వారు ఏమందురో వో యమ్మ సిరిదేవి

నమ్మించి తెచ్చినాను నాతివాడ కాపుల
ఎంతయు నమ్మించినాను ఏరువరెడ్ల
గడిభూమి కాపులకు కవులిచ్చినాను
నడిభూమి కాపుల నమ్మించినాను
కోటదూపాటి కాపుల గుణమాడి
తెచ్చినాను
వెట్టి యేమిలేకుండ ఇచ్చినాను కవులు
ఆడిన మాట తప్పలేను అమ్మ సిరిదేవి
ఆడాడ కాపులు అడుకొనేరు
బదులుమాట నీకు ప్రతిజెప్ప వెరుతు
మాధవుని గన్నతల్లి మరివేగమునను
పేరుపేరున కాపుల పిలుపించు మని
పలికె
అనిన ఆరీతి పసులవారు అతివేగ
పోయి
ఏరువరెడ్లను ఎవ్వరెవ్వరిని
పిలిచిరి కాపుల పేరుపేరునను
కలనైన బొంకని ఘనశూరులార!
కంభము గంగిరెడ్డి, కాకర్ల పోతిరెడ్డి
కంభిరెడ్డి దాసరి, ఘనులార రమ్మ
పొట్టపాడి పొదిలె పొన్నారెడ్డి
కనిగిరిమాధిరెడ్డి, ఘనవేగ రండి!
వడ్డాల బసిరెడ్డి వోరుగంటి
నరసారెడ్డి
కడువేగ రారయ్య కాపులార మీరు!
నాతివాడ పెదకాపు, నల నాగిరెడ్డి

ఎంతైన ఏరువ ఎలమంచి పెదకాపు
అయిన
అక్కిరెడ్డి మాదిరెడ్డి అమ్మసిరిదేవి
పిలిచీని
గక్కున రారయ్య కాపులారమీరు
అని యిట్లు పసులవారు ఆడు
మాటలకు
విని యపుడు కాపులు ఇట్లని పలికిరి
ఇంతకాలమాయె చాల మాయ
ఎన్నడు అయితమరాజు పిలువ
నంపలేదు
అన్ను లేకుండ పన్ను లేకుండ
కలుపుసమురు లేకుండ కాయకూరలు
లేకుండా
వెట్టిలేకుండ కొట్నము లేకుండా
ఏకచక్రముగా భూమి అయితన్న
ఏలుచునుండె
కవులిచ్చి తెచ్చె ఘనుడు అయితన్న
నేడేమి పని గలిగె తెస్సాయె పసులు?
అని యిట్లు కాపులు అతివేగమునను
ఏలికి వేయివరహాల జాలెలు
పాలికి పదినూర్లు వరహాల జాలెలు
పరకకు ఆరునూరు ముడుపులు
గొంచూను
పసులవారి వెంట ప్రజలు అందరూను
చనువున సిరిదేవి సముఖాన నిలచిరి

కాపుల నందరిని గ్రక్కున నపుడు
చొప్పుగా కూర్చుండ మనెను వల్లవుల
సిరిదేవి
వయ్యన భోంచాయ మని చెప్పెను
వామాక్షి యపుడు
వచ్చిరి అంతట వైనవైనాన
అరిటాకు నవితెలు ముందర నిడిరి
రసిరసాసావిళ్లు రాజాన్నములును
పరమాన్నములు కూరగాయలు
బహు పిండివంటలు
అరిసెలు పెసరుబప్పు అల్లముమొదలు

పేరిన నేతులు బెల్లపుచారులు
వాసిగల సిరిదేవి వారికి అన్న
మొడ్డించె
భోంచాయమని సెలవిచ్చె పొలతి
సిరిదేవి
భోంచేసి కాపులు పొంగుచు లేచిరి
విభూతి పూయించె పొలుపు మీరంగ
పట్టుపచ్చడములు కాపులకు పైబార
గప్పించె
భ్రాంతిబడి విడియంబు ప్రజలకు
నిప్పించె

## మేడకట్టుడని సిరిదేవి కాపుల నాజ్ఞాపించుట

ప్రజలార!వినరయ్య!పాపవృత్తాంతము
విన్నారుగద మీరు వివరమంతయును
మేనమామలు అందరూ ప్రజలార
వినుడ
మీ మేనకోడలికి మేడ కావలెను
ఏమైన ఇది మీకు వెట్టికాదయ్య
బాంధవులు మీరంత ప్రజలు
అందరును
కందువతో మేడ కట్టించరయ్య
అని యిట్లు సిరిదేవి ఆడుమాటలకు
వినయమున కాపులు ఇట్లని పలికిరి:

వెండి స్తంభాలు దెప్పింతుము వెలది
మేడకును
పైడిపట్టెలు దేచ్చేము పాపమేడకూను
కెంపులు పచ్చలు మేపైన మాని
క్యాములతోను
వెండిబంగారముతో మేడ వేరు
పరచేము
వెండి సిరిదేవి
అని యిట్లు కాపులందరు ఆడు
మాటలకు
మాకులు కావలెను మా యన్నలార

చేకొని తెప్పించరయ్య శావమాకులును
ఎలికొండ యేపెలు సలికొండ
సందనాలు
తెప్పించమని చెప్పె తల్లి సిరిదేవి
వచ్చిరి ప్రజలందరు వుడగరుగప్పుక
బండ్లకు ముస్తీదు జేసి పయనమైరంత
ఇండ్లలోపలి కలప వెళ్లదీయించి

కాళల వడ్రంగుల గ్రక్కున బిలిపించి
తళిరీబు లిప్పించి తల్లి సిరిదేవి
కొపులు మీరు కలసి కలప
పట్టించుకోని
రేపట మాపట బండ్లు ధనముకొండకు
మళ్ల రమ్మనెను

## కలపకై అడవులకు బండ్లు బయలుదేరుట

గుఱ్ఱము గొడుగుగలవాడు గుండోజి
బ్రహ్మ
అందలము కానుదిష్ట గలవాడు అల
గోజిబ్రహ్మ
నందుల సిరిదేవి నగరు వెళివచ్చె
సోముల పెద్దబయట సొరది
కొలుములు బెట్టిరి
ఆమనిగా బండ్ల నమరించసాగిరి
ఇరుసులు పోయిన బండ్లకు ఇరుసు
లమరించిరి
బొమ్మలు పోయిన బండ్లకు బొమ్మ
లమరించి
కమ్మలు బోయిన బండ్లకు కమ్మ
లమరించినారు
బలువైన నొగలు బండ్ల కమరించి
పలకలు జెక్కించి పరపించి వేగ

మెండుగా శిలలు బండ్ల కమరించి
బలువైన గొడ్డండ్లు పదినూర్లు వెంట
కడు సన్నబియ్యము పట్టిరి గోనెల
ఆడాడ దినదినము భత్యము అమరించి
వేగ
బాడిశలు గొంచు వడ్లంగులు పయనమై
వచ్చిరి
పొడజాల బూదమట్టెద్దుల బండ్ల
కేర్పరచి
ఎఱ్ఱవి పుల్లవి ఎరజాల మట్టెద్దులు
కొమ్మలు సన్నాలు గొజ్జంగి నఱ్ఱలు
అడుగులు సన్నాలు ఆదివఱ్ఱెద్దులు
ఎరజాల బూదమట్టెద్దుల బండ్ల
కేర్పరచి
అతిసొంపుగా ఎద్దులను
ఆభరణములును

వన్నెగా భూషణములు వైన వైనాన
ధరియించిరి కొమ్ములకు
బంగారుకుప్పె లమర్చి
రావిరేక గొలుసులు రత్నాల జోళ్లు
చిన్నవి గంటలు శిలమోరతాళ్లు
పక్కెర బొడ్డుగంట పైమెత్తజాలు
రావిరెక్కలకు రత్నాల కుచ్చులు
కేశబందు పట్టెళ్లు బిరుదు కాళలును
వురస్థలము తిరుగాడ వురిగజ్జెపేర్లు
గంగడోలు తిరిగిరాను గంటలపేర్లు
మోపురము తిరుగార మువ్వలపేర్లు
నాలుగు పాదములకు నాగుటందెలును
శృంగారించి ఎద్దులకు సొంపు మీరంగ
వితరణచతురుడై వీడ్యంబు లిచ్చి
ఎనయంగ మనయింట ఎన్నగల
ఎద్దుల
కనుగొని తెప్పించి కాండ్లు గట్టించి
చయ్య బండ్లను సాగించు మనియె
అని వీడుకొల్పిన నంతలో వారు
పేరుపేరున ఎద్దుల పిలిచి రీరీతి
అందెల బసువన్న! ఆదినాథుండ!
నందుల పిడిగంట నాగవాసయ్య!
గోవుల విటకాడ గోగు బయ్యన్న!
వంటరి పులిజంకు వర పెరుమాళ్లు!
కట్టని కలకోట కలునంది వేగ!
అకళంక కగాత్రుడా! అంబుధిశయనా!
బిరుదు గరుత్మంత! భీముని గజము!
గోవర్ధనాచల! గోపాలదేవ!
కరినంది బసువన్న! కంచి వరదప్ప!
నెల బాలచంద్రుడ! నీలవర్ణుండ!
జల్లుల ధర్మజ! జయ కంఠనాథ!
వైకుంఠవాసుడ! వాసుదేవయ్య!
పుట్టల భూపతి! పులులకు పెద్ద!
ఇంద్రుని వజ్రమ! ఇప్పగిరీశ!
గోగు భైరవమూర్తి! గోవింద రాజ!
చెంచుల వోబయ్య! చెన్నమల్లయ్య!
కంచి యేకాంబర! కాశికానాథ!
మధురాపురీ ప్రియ! మహా నందినాథ!
కాముడ! సోముడ! కాయజవరద!
రాముడ! భీముడ! రంకెల సలుగ!
ఇటువలె బిలిచితే నేర్పు మీరంగ
వచ్చిన ఎద్దుల వరుసతో జూచి
వన్నెల గురుతులు వడి జెప్పికొనుచు
నెత్తురు కొమ్ముల నేరైన ఎద్దుల
గణుపతోక ఆమంచి గరుడ బొల్లెద్దుల
అచ్చుగా కరివన్నె లమరిన ఎద్దుల
మూపురంబులతోడ మొనసిన ఎద్దుల
నుదుట చుక్కలుగల నునుపైన ఎద్దుల
తెల్లని వన్నెల తెలివైన ఎద్దుల
పచ్చని వన్నెల ప్రబలిన ఎద్దుల
ఇటువంటి ఎద్దుల నేర్పడ బిలచి
గంటలు గజ్జెలు ఘల్లుఘల్లున మ్రోయ

గణగణ మ్రోవంగ గ్రక్కున దెచ్చిరి
కాండ్లును గట్టిరి ఎద్దుల వేగ
మోకులు బంధించి ముందుగా నపుడు
పంచవన్నెల మాడు పైబార తివిచె
కంణము దర్శించె కమలనాథుండు
మత్రివేములపాట మండలేశ్వరుడు
గునుగు మద్దనులతో గుమ్మడిపాట
నుండి కదలి
అంతట కొందరు కాపులు అతి
సంభ్రమునను
ఎడములేక బండ్లకు ఎద్దుల గట్టిరి
పయనమై అందరు బండ్లు సాగదోలిరి
పొట్లపాటినుంచి మున్నూఱు బండ్లు
పొదిలెనుంచి తర్లెను నన్నూరు బండ్లు
పోతకము బండ్లు పొందుగా దర్లె
కందుకూరి బండ్లు కదిలె నావేళ
కాకర్లబండ్లు కడువేగ కదిలె

అన్నిదిక్కుల బండ్లు అధిగొని వచ్చె
ధనముకొండ బండ్లు తర్లెను వేగ
మోయీను జేసిరి ముస్తీదుగాను
ఏయించి ఏనూరు దున్నలు ఎగ
దోలించిరి
ఏయించి ఏనూరు కొమ్ముతగుళ్లు
ఎయించి ఏనూరు గొడ్డుగొర్ల ఎగ
దోలించి
బండ్లకు బారికరతను పరగంగ అపుడు
దండెబోయిన ఎర్రను దాయంగ బిలచి
మండలేశ్వరుండు మాధవుడయితన్న
పరగంగ వుదయరాగ పట్టుపచ్చడము
కప్పి
తెరగొప్ప వకమంచి తేజీని ఇచ్చి
బండ్లవెంటను నీవు పయనమై పొమ్మని
చండ్ల ఈ తెలవార్ని వెంటనే పొమ్మని
వేగంబె పంపె

## బండ్ల ప్రయాణము

దండెబోయిన ఎర్రయ్య తా కదలివచ్చె
ఎడములేక బండ్లకు ఎద్దుల గట్టిరి
బారుసాగి నడిచిరి ప్రజలును బండ్లు
[illegible]వేరుని చింతకాడ కూడిపారెను బండ్లు

పరమట అరజాము పొద్దున పయనమై
బండ్లు
చాకిచెర్లకు వెళ్లి సాగెను బండ్లు
వేడుకతో బండ్లు ఇండ్లచెరువున నిలచె

విఘ్నేశ్వరుని జూచి వేడంగసాగెను
అగణిత శివపుత్ర! అమరుల మిత్ర!
గురువవు నీవు గుజ్జురూపమున
పార్వతీ వరపుత్ర! పశుపతి నేత్ర!
ఎలికవాహన మెక్కి ఇలలోన నిక్కి
పలుకు విద్యల సార్థ ప్రత్యక్షమూర్తి
మలకుపోయిన బండ్లు రేపట మాపట
మళ్లి వస్తేను
వుండ్రాళ్లు బోయింతు వో స్వామి నీకు
సెనగల పందేరము సేయింతు నీకు
అని మ్రొక్కిరి కాపులు అందరు
ఎర్రయ్య
బండ్లు అచ్చోట నుండి బహువేగ తర్లి
మరునాడు ఆ బండ్లు మార్కా-
పురమున నిలిచె
చేతి సన్నుతిచేసి చెన్నరాయలకు
కోదండ రఘురామ! గోపాలమూర్తి!
మాధవ శ్రీకృష్ణ! మాయా-వినోద!
పర బ్రహ్మవు నీవు బ్రహ్మాండము
నీవు
నారాయణోద్ధార! నరసింహమూర్తి!
మలకు పోయిన బండ్లు ధనము
కొండకు మళ్ళి వస్తేను
చెలువంబుగా నీకు సేవ జేయింతు
అని మ్రొక్కిరి కాపులు అచ్చోటు
తర్లిది

బొడ్డుచెర్ల బూదనపాట నిలిచెను
బండ్లు
అంజలి జేసి మ్రొక్కిరి ఆంజ
నేయునికి
అంజనీదేవి పుత్ర! హనుమంత వీర!
సంజీవి దెచ్చిన సాహసఘనుడ!
భీతిల్లగా లంక భస్మంబు జేసిన
నీతిగల హనుమంత! నీవాడ నేను
మల పర్వతాలకు పోయిన బండ్లు
ధనముకొండకు వెళ్ళి వస్తేను
ఆకుపూజ గప్పింతు అంజనేయ నీకు
అని మ్రొక్కి బండ్లు అచ్చోట తర్లి
తర్లుబాటును నిలిచె .ధర్మజుడు
ఎర్రన్న
నాగవారపమ్మను నరనాథు వేడె
జగమెరుగ నిజరాణి జమదగ్ని రాణి
భూకాంతపై కొంత భూలోక మాత!
ఏకముగ వెలసిన ఏకవీరాంబ!
కాకితరాజుల గర్వంబు లణచి
పూజచేసిన వారిన్ని పోషింతువమ్మ!
ఆదిశక్తి నీవు అమ్మ శరణార్థి!
మలకు పోయిన బండ్లు మళ్ళి వస్తేను
కలకంఠి జాతర ఘనతతో జేతు
అని మ్రొక్కిరి బండ్లు అచ్చోట
తర్లించి
ముదముతో చవునేము ముందర నిల్చి

నారసింహుల చూచి వేడె ఎర్రయ్య
పరగంగ ప్రహ్లాదుకు ప్రత్యక్షమైతివి
హిరణాక్షుని చీరి ఇలమీద వెలసి
మకరిని ఖండించి మత్తేభము కాచిన
సకల జీవ పరమూర్తి! శరణయ్య
నీకు
మలకు పోయిన బండ్లు మళ్ళి వస్తేను
చెలువంబుగా నీకు సేవ జేయింతు
అని మ్రొక్కిరి వేగ అచ్చోట దర్లిరి
కంభాన నిలిచెను ఘనుడు ఎర్రయ్య
వీరభద్రుని జూచి వేడెను తాను
వీరభద్రావతార ! విధి గర్వదూర!
మలకు పోయిన బండ్లు మళ్ళి వస్తేను
విభూతి ధారణ సేయింతు నీకు
అని మ్రొక్కి బండ్లు అచ్చోట తర్లె
కలువొన్న నందుకూర కలిసె
నంతటను
పోతురాజును జూచి పొగడంగ సాగె
భూతకోట్లకు వైరు ! పోతుల రాజ !
అక్కలకు తమ్ముడా! మిక్కిలి
పోతన్న !
మలకు పోయిన బండ్లు మళ్ళి వస్తేను
పొలుపు మీరగ యాట బోనము
జేయింతు
అని మ్రొక్కి బండ్లు అచ్చోట దర్లె
ఢుణ ఢుణమని ధర తల్లడిల్లంగ

గుమ గుమ ధ్వనులతో గుబ్బటిల్లంగ
వాగనక మిర్రనక వచ్చెను బండ్లు
త్రోవల చెట్ల నరికి త్రోలిరా బండ్లు
పరమట ఆరజాము ప్రొద్దున అర్ధ
వీడును జేరిరి
కనుగొని గంగకు కళము లెత్తి
మ్రొక్కి
మంగళమూర్తిని మరిమరి వేడె
నపుడు
ఆదికాలమునాడు హరిహరులచేత
పూజలు గొంటివి పొలుపు మీరంగ
గొల్లలు కొలిచిన కోమలి వీరగంగ !
తొల్లి మా యాదవులకు తోడైన
తల్లివి
ఆవుల వల్లమ్మ కొలిచిన ఆది
మహాశక్తి !
సిరిదేవి కొలిచిన చిత్తరువు ప్రతిమ!
కొమరమ్మ కొలిచిన కొంగు
బంగారమ!
అగుమంచి కొలిచిన ఆణి ముత్యపు
గంగ
మలకు పోయిన బండ్లు మళ్లి వస్తేను
బోనాలు పొంగళ్లు పొందుగా
చేయింతు
బారిగొర్ల పొడిపింతు భాగీరథి నీకు

ఆని మ్రొక్కి బండ్లు అచ్చోట
దర్లెను
తెలతెల్ల వారంగ తెరువుసాగి నడిచెను
చల్లని పయనాన సరసంబుగాను
ప్రొద్దున ఆ బండు బొల్లుపల్లె జేరె
నల్లకొండలకు వెళ్ళి నడిచెను బండ్లు
బంగారు కురువన బండ్లు వేవేగ
వాగనక మిర్రనక వచ్చెను బండ్లు
శృంగారముగ గుండ్లమం చొచ్చిరావేళ
ఎల్లావుల చెలికెలోన విడిచిరి బండ్లు
మెల్లనే చేలవెంట మేపిరి ఎద్దుల
మాపటికి అందరు మట్టుపడి యుండిరి
మల్లమ్మకు కుంభాలు ఆ దుప్పటికి
పోసిరి
బలిజల్లి మలకు బారిగొర్రెల కోసిరి
గుడార్లు ఎత్తించిరి పర్వతాల ఎత్తు
కొదువ లేకుండ
కొలువుగుడారున కూర్చుండి యపుడు
కాపుల ఎర్రన్న గక్కున పిలచి
రారయ్య కాపులార! నాతిమేడకును
తెగువతో నరుకుడీ చేకుమాకులును
ఎక్కువతో నరుకుడీ వేగిమాకులును
ఎర్రయ్య సెలవిచ్చినప్పుడే వేగమే
కాపులు

గుండ్లమల ఎక్కిరి గొబ్బున కాపులు
వాటముగ జూచిరి వైనవైనాన
తేటపారుగ జూచిరి శలుగు వృక్షాలు
తెగువతో నరికిరి చేకుమాకులును
డీకొని వచ్చి కాపులు చేలలో జేర్చి
ఏపెలు పనసలు పేరాళముగ
నరికిరి
కుదురైన మంచి కూచందనములు
పెద్దమాకులు నరికిరి పెంపు మీరగను
వాత్రైన బీట్లు తరువులు నరికి
వాగుల పరిణీన వేగిశ మాకులును
గంధపుమాకులు పొందుగా నరికిరి
ఘనసింహములు వున్న కోనలు జొచ్చి
కొండలమీది మాకులు గొబ్బున నరికి
వంతుమీరగ నరికిరి బారపట్టెలును
బొటకరి మాకులు పొందుగా నరికిరి
విరివిగా నరికిరి స్తంభాలు వెస
దీసినట్లు
సరిగొండ చందనాలు చయ్యన
నరికిరి
గుండ్లమల గుంపెనలు గురుడుగా
నరికిరి
ఎక్కిపోయి నరికిరి ఏగి స్తంభాలు
దిగివచ్చి నరికిరి దివ్యే స్తంభాలు

తిప్పల పొడువున వేసిరి తెప్పలుగాను
బండ్లకు సూటిగాను పారజెక్కించి
ఆరజెక్కి స్తంభాలు ఆయత్తపరచి
బలువైన స్తంభాలు బండ్లపై జేర్చిరి
మోయాను జేసిరి ముస్తీదుగాను
అప్పుడు కాపుల అతివేగ బిలిచి
కాపులతో ఎర్రన్న గ్రక్కున బలికె

## స్తంభపు మ్రానుకొరకై కాపులు వెదకుట

వినరోయి కాపులార! మా యన్నలార!
వంటి స్తంభము మేడకు వనరంగమీరు
చక్కని స్తంభము చయ్యన వెతకి
వనరంగ నరుకుడీ వామాక్షి మేడకు
ఎర్రయ్య చెప్పిన మాటలు కాపులు వేగంబె వినిరి
భోంచేసి కాపులు పొంగుచు లేచి
వాసైన మాను వనరంగ వెతకిరి
గట్లలోపలి కొండగవులెల్ల వెతకి
చెట్లలోపలి కొండసెలలెల్ల వెతకి
ఎందు వెతకిన వ్రిక్షము ఏర్పడక పోయె
చెంచులున్న కోనలు శీఘ్రాన జొచ్చిరి
కాపులజూచి చెంచులు గభగభా చేరి
విల్లునంబులు వెక్కుపెట్టి
వేయను గమకించి వేగంబె వచ్చిరి
వచ్చిన చెంచుల కాపులు వైనాన జూచి
ఎర్రయ్యను జూచి ఏమని పలికిరి ?
ఏవూరు ? ఏభూమి ? మీరు ఇచ్చటికి రాను
ఏమి పనికి వస్తిరి ఎరిగింపరయ్య ?
అప్పుడు ఎర్రయ్య అతివేగ పలికె :
వినవయ్య చెంచుపోతినాయుడా ! వివరంబుగాను
కల్యాణపురాజు చెల్లెలికి కాంత పాపమ్మకు
వొంటి స్తంభముమేడకు వొయ్యనమీరు
చక్కని స్తంభము చూపవలెను మాకు
విని చెంచునాయుడు అవెబార్లున ఆదలి
పాపపు బ్రహ్మదేవుడా పాప నూకమ్మను
కాపాడకపోతివి కనకమేడ వ్రాస్తివి
ఆవులన్న చెల్లెలికి అంత్రమేడాయెనా!
కాట్రేని చెల్లెలికి కనకమేడాయెనా !
అని యిట్లు చెంచునాయుడు ఆదలంగనపుడు

విని యపుడు ఎఱ్రన్న ఇట్లగని పలికె వగవకు చెంచునాయుడా ! వగవకు
దుఃఖము నీకేల చెంచునాయుడా! మని
దుగదాయ మేల? కర్పూర తాంబూళము ఇప్పించె
చింతింప నీకేల !శివుని దూరనేల ! తగ వేడ్కతోను
మసిబొట్టు కాగాను మాపితే పోవునా? దిట్టమైన మాను తేటబడ జూపుడీ మాకు
కాటికచుక్క కాగ కడిగితే పోవునా ? ఆ మాటలకు చెంచుపోతినాయుడు
బ్రెహ్మ వ్రాతకు మారు పలుకంగ రాదు అతివేగమునను

## చెంచునాయుడు స్తంభపుమ్రాను చూపించుట

ఎఱ్రమలకు పంపెను ఏడువేల చెంచుల
పచ్చమలకు పంపెను పదివేల చెంచుల
నల్లమలకు పంపెను నాలుగువేల
చెంచుల
ఆరూఢిగా వెతకిరి ఆ చెట్లు పెద్దమలను
అకుల సన్నాలు అందమైన వ్రిక్షము
కొమ్మలు సన్నాలు గోబుణి తరువు
ఆకులు సన్నమైన ఆడవ్రిక్షంబు
కొమ్మలు సన్నమైన కోడెవ్రిక్షంబు
కాపులు ఎఱ్రన్న కడువేగ చూచిరి
ఆశ్చర్యపడిరి ఆ మాను చూచి
ఏగి యెక్కడ బెరిగె? ఏనూన వచ్చు ?
భూకాంత వాసిని పుట్టింది తరువు
ఇంజాద్రి గిరులకు ఈడైన తరువు
పెంజెర గున్నలకు పెనుబాములకును
తాచులకు నాగులకు తావైన తరువు

బిట్టు జీనువాయ పొట్టిపిట్ట
నెట్టుకొని వుండేటి నెరవైన తరువు
కబోదపక్షులు కలిగున్న తరువు
గంధంగి పొన్నంగి గూబ గండంగి
కల్లేడు లావుక కలిగున్న తరువు
అప్పుడు కాపులు అర్చించి మాను
ఎనభై ఎనిమది మ్రూళ్ల కొలిచిరి
ఎక్కిపోయి మాను
ఏగి నరుకంగాను ఎటుగాను వారుగునో
అమ్మ యేలు ధనముకొండలోన
వనదేవతని చాల వర్ణించవచ్చును
పోగువారి మాను పోతుకాలు జుట్టి
కుంభాలు పోసిరి కూర్మితో నపుడు
వరికూటి కుంభాలు వాముల పొడవు
జొన్నకూటి కుంభాలు చొప్పవాముల
పొడవున

ఆరికికూటి కుంభాలు అడ్డతిప్పల
పొడవు
కొర్రకూటి కుంభాలు కొండల
పొడవున
పోయించి రప్పుడు పొందుగా వారు
వేయిన్ని ఏనూరు దున్నల వేయించి
రపుడు
వేయిన్ని ఏనూరు కొమ్ముతగుళ్లు
వేయిన్ని ఏనూరు గొడుగొర్ల వేగ
సాధించి
బారిగొర్ల పొడిపించి బలి జల్లిరపుడు
నరికిరి కొమ్మలు సరసంబుగాను
నాలుగుదిక్కుల జేరి నరుకంగ సాగిరి

## మ్రాను నరుకగా రక్తము కారుట

మల్లడించి యా మాను మంటలై మండె
భోంపెట్టి యా మాను భూమి దద్దరిల్లె
కాటుకాటున రక్తము కమ్మంగసాగె
చెట్టున నిప్పులు చెదరంగసాగె
కొడుకులు గలవారు మానివంక జూచి
గోడుగోడున అడలి కుమలంగసాగిరి
కూతుళ్ల గలవారు కుమారిలసాగిరి
నరికేటి గొడుండు ధరణిపై విడచిరి
ఇదియేమి చోద్యము ఎరకొన్న మేము
ఎన్నడు ఎరుగము కనిపెంచేవారము
ఎర్రన్న ఈ కర్మము చూడలేము
అని యిట్లు కాపులు ఆడుమాటలను
చాపకట్టుగ నేల సరసముగా పడెను
భోంపెట్టి యా మాను భూమిపై వరిగె
వుత్తరాన ఆ మాను వుర్విపై వరిగె.
భీతిల్లి కాపులు ప్రియముతో నడిగిరి
కాటు కాటుకు రక్తము కమ్మిన
వివరమేమొ ?
చెట్టున నిప్పులు చెదిరిన వివరమేమి ?
ఎర్రయ్య కాపులతోను ఇట్లని పలికె:

## ధనముకొండ నాశనమగునని ఎర్రయ్య కాపులతో చెప్పుట

కాటుకాటుకు రక్తము కమ్మినందులకు
అన్నలు పోట్లుబడి అందలాలకు
వొరుగుదురు
తమ్ములు పోట్లుబడి తమకాలకు
వొరుగుదురు
అంభోయని మాను అరిచినందులకు

ప్రాణముగల పరియంతం పాపకు నేడు
కడలేని దుఃఖమున పాప కడతేరదనెను
భోపెట్టి యా మాను భూమిపై
వొరిగినందులకు
పాపకు దుఃఖము ప్రజలార ః వినుడు
వొంటిగా ఆ మాను వొరిగినందులకు
ఏటిమీద ఆరునెలలకు యాదవులకు
చేటు బుట్టును
చెట్టున నిప్పులు చెదరినందులకు
అదృశ్యమై ధనముకొండ అగ్గిబడి కాలు
సిరిదేవి చిత్రకూటాలు చిచ్చులుబడును
కొమరక్కకూటాలు కొల్లబోవునయ్య
అగుమంచికూటాలు అగ్గులై మండు
లక్కసిరికూటాలు రాచలోగిళ్ల
ధూళియై పోవును ధనముకొండ అంత
అగ్గిబడి ధనముకొండ హతమై పోవును
కల్యాణపు చెల్లెలి కనుకమేడ కాలి
హతమై పోవును
కల్యాణపు చెల్లెలి కనకమేడ కాలి
కటకటా యని పాప మేడ మీద
కాలిని వినుడ
బొగ్గుల గలసిపొయ్యాని ధనముకొండ
గుత్తమైన ధనముకొండ గుంపులు
గూడు

కంచెంత ధనముకొండ కాలిపోవునయ్య
పాలవెల్లిగోత్రము బసువశంకర
బిరుదు
పాలీట వరగవలసిన పంతు వున్నాది
అచ్యుతగోత్రము ఆదినారాయణ
వంశము
పాలేట వరగవలసిన పంతువున్నాది
అల్లివాగు నెల్లివాగు నెరానేరేళ్ళ వాగు
పాలేటి సంగాన రక్తం పారవలసిన
పంతు వున్నాది
ఏమి సేయుదు కాపులారః యేమందు
నేను
పుణ్యపాపములు సిరిదేవికెగాని
మనకు పనిలేదనెను అపుడు యెర్రన్న
అని యిట్లు యెర్రన్న ఆడుమాటలకు
కాపులందరు విని గ్రక్కున లేచి
బాడిసెలు గొంచు వడ్లంగులు
పయనమై వచ్చిరి
సవుపానముగ మాను చక్కగా దీర్చిరి
ఆరజెక్కి పనులవారు ఆయత్తపరచి
జారకుండ మాను బండ్లపై జేర్చిరి
వనర తొంభన్నారు బండ్లమీద
స్తంభము వనరుగా
నిలపిరి

## బండ్ల తిరుగు ప్రయాణము

గుండ్లబ్రహ్మేశ్వరుని బోనాలు బోసిరి
ఎడములేక బండ్లకు ఎద్దుల గట్టిరి
బారుసాగి నడచిరి ప్రజలును
బండ్లు
కూతలు జేసిరి గుండ్లమల దిగిరి
త్రోవల చెట్లు నరికి తోలిరా బండ్లు
వాగనక మిర్రనక వచ్చెను బండ్లు
బంగారముకురువ దాటి బండ్లు వేవేగ
పడమట అరజాముప్రొద్దు అర్ధవీడు
ధనముకొండ పడమట నిలచె
కనుగొని గంగకు కరములెత్తి
మ్రొక్కిరి
పొంగుచు నందరు గంగకు బోనాలు
బెట్టిరి
కాపులు యెర్రన్న కడు వేడ్కతోను
భోజనము చేసిరి పొందుగా నపుడు
ఎడము లేక బండ్లకు యెద్దుల గట్టిరి
బారు సాగి నడచిరి ప్రజలును బండ్లు
కలపోన్న కందుకూర కలసిరంతంత
పోతురాజుకు యేట బోనము చేసిరి
అచ్చోటు దర్లి బండ్లు ఆదికొని వచ్చె
కంభాన నిలచెను ఘనుడు ఎర్రన్న
కంభాము వీరభద్రుని జూచి వేడె
యర్రయ్య
విభూతి తారణ జేయించె నపుడు
పందుము సెనగలు పలారము
సేయించె
ఆడ నుంచిబండ్లు అచ్చోట దర్లె
ముదముతో సవునేరు ముందర నిలచె
నారసింహ్వాల జూచి నరనాథు వేడె
చెలువముతో నారసింహ్వాలకు సేవ
జేయించి
ఆడ మ్రొక్కిరి బండ్లు అచ్చోట
దర్లెను
బోడుచర్ల భూపనపాట నిలచెను
బండ్లు
అంజలి చేసి మ్రొక్కిరి
ఆంజనేయునికి
ఆకుపూజ గట్టించె ఆంజనేయునికి
ఆడ మ్రొక్కిరి బండ్లు అచ్చోటి దర్లిరి
తర్లుబాటను నిలచెను ధర్మజుడు
యెర్రన్న
నాగవారపమ్మను నరనాథు వేడె
కలకంఠి జాతర ఘనతతో జేసిరి
మదిని గంగ వచ్చు మరి గుండ్లకమ్మ
కాపులు యెర్రన్న గ్రక్కున
స్నానంబు జేసి
పొంగుచు నందరు భోజనము చేసిరి

ఆడనుంచి బండ్లు అచ్చోట దర్లెను
మరివేగ యా బండ్లు మారుక
పురమున నిలచె
చేరి సన్నుతి చేసిరి చెన్నరాయులకు
చెలువముతో చెన్నరాయులకు సేవ
జేయించి
అనిమ్రొక్కి బండ్లు అచ్చోటు దర్లె
వేడుకతో బండ్లు విండ్లచెరువున నిలచె
విఘ్నేశ్వరుని జూచి వేడె యెర్రన్న
ఉండ్రాళ్ళు బోయించె
విఘ్నేశ్వరునికి
పందుము సెనగలు పలహారము
జేయించె
ఆడనుండి బండ్లు అచ్చోట దర్లె
సోకిచర్లకు వెళ్ళి సాగెను బండ్లు
ముందరి బండ్లు మునిముందున నిలచె
అందముగ కొన్ని బండ్లు
అతివేగమునను
కుబేరుని చింతకాడ కూడి పారెను
బండ్లు
పెయ్యలతిప్పముందర పెద్దాదిబయట
ఆదిగాని నిలచెను ఆ బండ్లు వేగ

బండ్లు ధనముకొండ ప్రజలు చూడంగ
దండెబోయిన యెర్రయ్య తా కదలి
వచ్చె
మండలేశ్వరునితో మరి విన్నవించె
మాకులు దెస్తిమి మమ్మేలు రాజ
అన్నంత సంతోషపడె అయితమారాజు
మెచ్చెను యెర్రయ్యను మేదినీశ్వరుడు
ఇప్పించె సొమ్ములు వివరంబుగాను
చయ్యన ఇప్పించె వసుధేశ్వరుండు
వేడ్కతో సిరిదేవి వివరించి పలికె
వినవయ్య కొమార అయితమారాజ!
మానులు వచ్చెను మరి వినవయ్య
కట్టించు అయితన్న గ్రక్కున మేడ
అని పసులవారిని అతివేగ బిలచి
కాశరి వుప్పర్ల గ్రక్కున బిలచి
వాసిగా విడియంబు వారికిప్పించి
కట్నాలు ఇప్పించె ఘనుడు
అయితన్న
పట్నానికి మించుగా పాపకు మేడ
కట్టించవలె మీరు కడువేగమునను
భూమండలముమీద భూజన్లు లెరుగ
వాడవాడలు చాటించి వారు వీరనక

# ఊరిబయట ఒంటిస్తంభపు మేడ నిర్మాణము

మేరువు పొడువున మేడ కట్టించవలెను
పురోహితుల మంత్రుల పెద్దల
బాంధవుల బిలచె
ధారుణీశ్వరుండు తావు చూతమనుచు
పయనమయిరప్పుడు బాంధవులు
తాము
పంచ మహావాయిద్యములు పరిపరి
మ్రోవ
కొంచక యాదవ గురుతయిన పెద్దలు
అందరు వచ్చిరి అతిసంభ్రమునను
నల్లజెరువుకు దక్షిణాన నగరికి
పడమట
మెల్లనె చూచేరు మేడకు తావు
పెయ్యల తిప్పకు తూర్పున పెద్దాది
బయట
ఆ పణతిమేడకు అరువు చూచేరు
పాలగుంట నట్టబయట పాపన్న మేడ
పాలించి స్తంభము ప్రతిష్ఠ జేసిరి
వినయముతో నందరు వెలదిమేడకును

దినశుద్ధి బరచిరి దైవంబు సాక్షిగను
శుక్రవారమునాటి దినము చేపట్టి
విక్రమాశాలులు వీరనాయకులు
కాసెల పద్దంగుల ఘనత వుప్పర్లకు
వాసిగా విడియంబు వారికిప్పించె
అష్టదిక్కులు చూచి అమరంగ
మరియు
కైవారము గట్టిరి గచ్చుబెందలితోను
సృష్టిగా మేడగట్టిరి శ్రీపతిచెల్లెలికి
అయిదు నిలువుల లోతు అడుగేరుపరచి
శనివారమునాడు సేనలు గూడి
ఘనరాజు చెల్లెలికి మేడ కట్టించసాగిరి
ఆదివారమునాడు అంతరువు లమర
మేదినీశు చెల్లెలికి మేడగట్టేరు
సోమవారమునాడు సొబ్బణాలు దీర్చిరి
సోమసూత్రము నల్లచెరువుకు చూపిరి
మంగళవారమునాడు పట్టుక
ప్రమాణము డిగ్గిరి

చక్కల పొడువున నిలిపిరి మేడ
వి స్తీర్ణమైనట్టి వెలది మేడకును
సన్న విసుక సున్నము
సందుసందులాను
వన్నెల గూర్చిరి వరుస నంతంత
ఆరచెక్కిన స్తంభాలు అమరంగ
నంత
శార్దూలముల మంచి శరభసింహముల
మలచిరి
శరభ శార్దూల గండభేరుండముల
వ్రాసిరి
పొందుగా అట్లాడ చెల్లెలికి బోదెలు
తీర్చిరి
చక్కని కంబాలు సవుసూటిగాను
మిక్కిలి తాపిరి మేలైన మణులు
బార పట్టిల వెంట పావురాయిలు
వ్రాసిరి
తోరముగ కంబాల దువ్వులమర్చించిరి
దంతపు తలుపులు ద్వారబంధముల
వింతగా రత్నాలు వేడ్కతో దాపిరి
చి త్తర్వు మేడకు విచిత్రముగాను
మ త్తేభములు వ్రాసిరి పాపమేడచుట్టు
కలియుగమున నిలపిరి
ఒంటి స్తంభము మేడ
లక్షణశుభముల రంగైన మేడ
తీక్షణంబుగ మంచి చిలుకల వ్రాసిరి

వకయంతర్వు గట్టిరి వారలు దీర్చిరి
ఆడాడ వ్రాసిరి అంచపక్షులను
రెండో యంతర్వు గట్టిరి రేఖలు దీర్చిరి
మెండైన యేనుగులమేడను వ్రాసిరి
ఆడాడ వ్రాసిరి యిర్రికొదమలను
వనరంగ గట్టిరి వాకిళ్ళు దీర్చిరి
మూడో యంతర్వ గట్టిరి ముత్యాలు
దాపిరి
దండైన వజ్రాలు తళుకులు జెక్కిరి
మెండుగా జెక్కిరి మెరియ వాకిళ్ళకు
నాలుగో యంతర్వు గట్టిరి
నాతిమేడకును
నల్లచెరువు యాడ, నడిమేడ యాడ
నల్లచెరువు నీళ్లు పైమేడకు రా
దీర్చినారు
అలివేణిమేడ గట్టిరి అంతస్థులు దీర్చిరి
ఐదో యంతర్వు గట్టిరి అష్టదిక్కులు
కానరాగాను
కైనారము గట్టిరి గవాక్షులు దీర్చిరి
ఆరో యంతర్వు గట్టిరి ఆడప్రతిమలు
చకోరములు వ్రాసిరి
ఏడో యంతర్వు కట్టిరి ఝుక
చాలుననిరి
చేకొని చూచిరి చెల్లెలిమేడ
చూడ చోద్యమైన సొంపైన మేడ
పాప వుండే అంతరువ పక్షిణిజలపోత

గోపురములు గట్టిరి పక్షిణికుండ లెత్తిరి
పూబోణి మేడకు పుత్తళ్ళి చెక్కిరి
తళుకు తళుకున మెరియ దంతపు తలుపులమరించి
పగడపు గవాక్షులు బాగుగా దీర్చిరి
నిగనిగ మనియేటి నీల స్తంభాలు
దిగదిగ మనియేటి దివ్వె కంబాలు
పొందుగా గట్టిరి చెల్లెలికి భోజనపు శాలలు
సందువ పసుదాలు సందుగా గట్టిరి
సంగతిగల రాజు చెల్లెలికి స్తంభాల సొంపైన
రత్నాలు కెంపులు దాపిరి రమ్యంబుగాను
చెలువముతో గట్టిరి చిత్తరువుమిద్దె
అవులన్న చెల్లెలికి అమరికగాను
భవంతి మిద్దె గట్టిరి పంచలు విడిచిరి
పచ్చలు దాపిరి పక్షిణి కంబాలకు
హెచ్చైన సున్నపు గచ్చు చేయించిరి
పన్నెగా బంగారు వున్నతముగాను
పన్నుగా ఎత్తిరి బంగారముకుండలు
పావమేడచుట్టు పగడాలు దాపిరి
ధాత్రిపై మేడకు దృష్టికుంభాలు
అష్టదిక్కుల బోయించిరి అమరంగ నంత
దృష్టి తీసిన మేడ తేజంబు లమర
హరిహరులకు సమము అనవచ్చు మేడ
దీపించ సాంబ్రాణి ధూపములు వేసిరి
కల్యాణపు చెల్లెలి మేడ కనకాద్రికి సాటి
వేళమె పనులవారు వేగమే వచ్చిరి
చల్లని వట్టి వేళ్ళ చవికలో వామాక్షి తాను
కొలువై వుండగాను గొబ్బున వచ్చి
వల్లవుల సిరిదేవికి వందనము చేసిరి
ఆరునూరు పెద్దలు అయితమరాజు
కురివెలు చవికెలోన కొలువై వుండగాను
మేలైన చెల్లెలికి మేడ గట్టితిమి
అందముగా ఆది యేడు అంతరువుల మేడ
బంధుజనపోషణా:పట్టాభిశేఖర!
అనిన పనులవారిని మెచ్చి అయితమా రాజు
ఘనమైన భూషణములు కట్నాలు ఇప్పించె
అయితన్న తమ తల్లితో అప్పుడిట్లనియె
వో యమ్మ మేడ వుర్వి గంపింప
కమ్మిక పనులవారు కావించినారు

సీమలో అపకీర్తి సిద్ధముగ నీకు
వెలిసె
కొమారుని మాటలకు కృప నందుల
సిరిదేవి
పెద్దలతోడను అప్పు డిట్లనియె
చిత్తారుమేడలోన జననాథుచెల్లెలు
నిత్యముగ పాపన్న నిద్రపోగాను
పాపను నిద్రలేపను ఎవరిని పంపవలె
ననిరి
గోపకాంతల బంపితే కోపగించీని
దాదుల బంపితే దైన్యపడీని
ఆవులన్న వీరగంగను అంపవలెననిరి
దేవతాస్త్రీలకు తెలివైన వీరగంగ
పశుపట్టభద్రుని పణతి వీరగంగ
దశరాజు ఆవులన్న తరుణి వీరగంగ
మన్నెరాజు ఆవులన్న మర్లవారి గంగ
శ్రీరాముడావులన్న సీత వీరగంగ
రఘురాము డావులన్న రంభ
వీరగంగ
పరమాత్మ డావులన్న పణతి
వీరగంగ
కట్టమీద నల్లమొయిలు కాటమ
నలగంగ:

పనిబూని నీవు బోయి పాపను నిద్ర
లేపి
ఘనవేగమున తోడుక రావమ్మ
గంగరో నీవు
సిరిదేవి మాటలకు శీఘ్రాన లేచి
కట్టిన మాందూళి పట్టుశాలవ
కాళ్లకు పెనగొనగా
చెంగల్వాలు కొప్పువూడి చెంప
తూలాడ
మల్లెల కొప్పు వూడి మంచి తామరలు
చింద
అటునిటు ముత్యాల హారములు జార
అడుగులు తడబడి అందెలు మ్రోవ
కడు భీతినొంది గడగడ వణుకుచూను
వెలది కొప్పువీడి వీపుమీద జార
తులకింప వెంట్రుకలు తుళ్లాడగాను
పెదవులు తడిలేక భీతి తా నొంది
పాదముల వుండేటి బంగారము
అందెలు
ఘుమ్మున మ్రోవంగ గ్రక్కున
వచ్చెను గంగ

# వీరగంగ పాపనూకను నిద్ర లేపుట

వావారిలోన వయ్యాన నిలిచె గంగ
కురివెలు చవికెలోన గొబ్బున
అప్పుడు
నిత్యముతో పాపమ్మ నిద్రబోగాను
ముత్యాలు చెక్కిన ముక్కాలిమీద
అలర కొలువుదీరి కూర్చుండెను
మగువ వీరగంగ
కొలుకుల కన్నీరు గోళ్ల జిమ్ముచును
పురమున చెయివేసి వూచి వూచిలేపె
కడియాలచేతను కదిలించి లేపె
అంతట నిద్రమేలుకోదాయె అలివేణి
పాపన్న
భక్తిగల మరదలా!పాప!లేవమ్మ!
ఉత్తముల చెల్లెలా! పాప లేవమ్మ!
మాధవుని చెల్లెలా!మగువ లేవమ్మ!
అంటేను మేలుకోదాయె అలివేణి పాప
చెట్టు ఎరుగక నిద్ర ఏల పొయ్యేవు
పుట్టిన నీవింత భోంచేయ గలిగె
నీనిద్ర నీరాయె లేవె నీరజగంధి!
మదిరాక్షి పాపమ్మ!మగువరో లేవె
సంతోషపు నిద్రటే సకియరో పాప
ఇంత నిద్ర నీకు ఏల లేవమ్మ!

నీభోగము పొల్లాయె పొలతి పాపమ్మ
సంగ్రామవిజయుని చెల్లెలా! చాలునిక
నిద్ర
ఎలనాగ నీనిద్ర ఏల లేవమ్మ
సుఖమైన నిద్రటే సకియరో నీకు
మేడ గట్టించినారు మేరుచందనాల
ఆమీద నిన్నువుంచ మీయమ్మ
సిరిదేవి పిలిచేవి
అంటేను పాపమ్మ అదిరిపడి లేచె
గ్రక్కున పాపమ్మ కనువిచ్చి చూచె
కన్నెత్తి మర్లవారి గంగవంక మరి
వేగ చూచె
వున్నతముగ వదినెను పద్ద కూర్చుండ
మనెను
కర్పూరవిడియంబు లిచ్చి మేన
కస్తూరి బూసె
ముచ్చటైన వార్తలు ముద్దుగ నడిగె
కలకంఠి పాపమ్మ గంగతో ననెను
ఎన్నడు పిలువరావు ఏమి వీరగంగ
అప్పుడు వదినెతోను ఆడె నొకమాట
మాయన్న కాటమరాజు
ఆవులమందలో నుండి

అరుదైన సొమ్ములు అంపితే తెస్తివా
ఏమి సొమ్ములంపెను వదినె వీరగంగ
బోయమలను ధేనువల మేపి
మాయన్న
బోయవారి సొమ్ములు తనకు
అంపినాడ ?
చెంచుమలను ధేనువల మేపి మాయన్న
చెంచువారు గట్టేటి పారుటాకు చీరెలు
మాకు అంపినాడ ?
పాలమలను మాయన్న ధేనువల మేపి
పాలపండ్లు పనసపండ్లు మాకు
అంపినాడ ?
కొమ్మ పనసపండ్లు గుండు నెమణాలు
వేరుపనసపండు వెలలేని సొమ్ములు
ముంగాముఱువుల తీగె, ముత్యాల
సరులు
చేతుల బంగారం గాజులు చిలకల తాళి
బంగారిగాజులు పాపటబొట్టు
అసియాడు నడుముకు అమిరిన
వడ్డాణం
బవిరెలు కంకెండ్లు బన్న సరులూను
ఏమి సొమ్ములు పంపె వదినె వీరగంగ
పచ్చల కడియములు బాంబూరి
దండలు
కూర్చిన ముత్యాలు గుండునెమణాలు
హెచ్చైన సొమ్ములు అంపితే తెస్తివా?
అమ్మను కానకుండ తెస్తివటే వదినె?

వున్నతముగా నీ నగర వుంచలేవైతివి
పనియేమి కలిగెనో పలుకరించ తల్లికి?
పన్నుగా నీవు వచ్చిన పనియేమి
జెప్పవమ్మ
మరదలి మాటలకు మర్లవారి గంగ
అష్టదిక్కులు జూచి అరుదైన
మాటాడె
నీ సొమ్ములు చూరబోయె పాపమ్మ
నీ సొంపు కొల్లబోయె పాపమ్మ
కమ్ముకొని నీ సొమ్ములన్నీ కాలె
లేవమ్మ
మునుకొని నీ సొమ్ములన్నీ మణిగె
లేవమ్మ
మంటలో నీ సొమ్ములు మటుమాయ
మాయె
పొగలోన నీ సొమ్ములు పొలిసె
లేవమ్మ
పాప నీ సంతోషము పాడాయె పదవె
పాపానకు నోచినావు పాపరో నీవు
చేపట్టి సిరిదేవి చిచ్చులో నిన్ను
దండిగ ద్రోయను తలచి వున్నాది
అంటేను పాపమ్మ ఆశ్చర్య పడెను
ఏమి చెప్పితివి వీరగంగ! ఎన్నడు
వినలేదు!
ఆ మాటలకు వీరగంగ అడులుచు
బలికె

## వీరగంగ పాపకు మేడవృత్తాంతము చెప్పుట

మేడ గట్టించినారు మేరువచందనాల
పొడవున
ఆమీద నిన్నుంచ మీ అమ్మ పిలచీని
భామరో! యిప్పుడు పయనమై రావె
ఆమాటల కప్పుడు పాప
ఆందోళపడెను
ఎన్నడు ఈవార్త వినలేదు గంగ
ఈపనులు వినలేదు వివరమంతయును
కన్నీళ్లు కురువంగ కాముని వీరగంగ
చిన్నమరదలితోను చెప్పంగసాగె
శిరసంటి నిన్ను సిరిదేవినూకాంబ
వరగంగ మేడకు పంప బిలచీని

## పాపనూక దుఃఖము

అంటేను పాపమ్మ ఆందోళపడెను
కంటకంట పుట్టెడు కన్నీరు నించె
ప్రలాపించుచు పాప తనభాగ్య
మింతేను
పొలపొల పోవుచు పొగలి దుఃఖాన
నేనేమి సేతును? నాకెవరు దిక్కు?
ఎవరిని దూరుదు? ఎవ్వరున్నారు?
తాను నోచిన నోము తనకు సిద్ధించె
శిముడు ఈరీతి జేసెను తనకు
అమ్మలేక అయ్యలేక అడలంగసాగె
బ్రెహ్మ వ్రాసిన వ్రాతకు పలుకంగ
నేల ?
పూర్వకాలము పుట్టినయప్పుడు
భామ జేసిన పూజ తప్పునా తనకు?
పూజకు మిక్కిలి నడచునా తనకు?
తప్పునా వీరగంగ! తానెంత
వహించిన?
వొప్పుగా బ్రెహ్మదేవుడు వ్రాసిన
వ్రాలు
అతికీడు వచ్చును హరిహరులకైన
వెతపడి యిక్కడ ఎంత దూరినను
తల్లిదండ్రి వుండంగ దయవచ్చు
నటవె ?
తల్లడించగ ఎవరు మాపేరు వదినె?
పిన్నమ్మ ఏమి జేసినా పడక
తీరదమ్మ !
మాధవుడు వుండంగ మందలించనేల ?
అయితన్న సిరిదేవి ఆలోచన జేసి

బయలుపుచ్చక పోయె పల్లికొండ
రఘుపతి
ఎరగరటే మీరు ఎరణప్ప
మొదలుగాను
అరుధాంగ లక్ష్మి అక్క కొమరక్క
విచారము గాబోలు వదినె పీరగంగ
వల్లభన్న,కరియావులరాజు,ఘనుడు
అయితన్న
పోచయ్య, ముమ్మయ్య,పుత్తూరాజు
ధనముకొండపెద్దలు,తల్లి సిరిదేవి
ఎడపక విచారము ఇంతచేసిరి వదినె:
అని యిట్లు పాపమ్మ అడలుచు
దుఃఖాన
కన్నులనీళ్లు కాల్వలై పారె
చిన్నబోయి పాప సిరిదేవి
సముఖమాయె

మదిరాక్షి పాపమ్మ, సుర్లవారిగంగ
కొదవలేని దుఃఖాన తల్లికొలువులో
నిలిచిరి.
కులకోటి బాంధవులు కొలువై
వుండగాను
వల్లవుల సిరిదేవికి వచ్చి యాపాప
అలివేణి తా మ్రొక్కి అపుడు
కూర్చుండి
కొలకుల కన్నీరు గోళ్ల జిమ్ముచును
వెతపడి దుఃఖమున వేగమే తండ్రిని
మదిలోన దలచుక మల్లడించసాగె
తల్లిని దలచుక దరికొనసాగె
తలవంచి నప్పుడే తరుణి కన్నీరు
జాలువారిన రీతి ధరమీద కురిసె
కురువంగ చూచెను కృప నందుల
తల్లి

## సిరిదేవి పాపనూకకు ధైర్యము చెప్పుట

నారీమణి పాప:నాతల్లి నీకు
పగవ నీకేల? దుఃఖము వచ్చిన
కొదవేమి?
పలుకరించ నీవద్దను పాటలు బాడను
బ్రహ్మణ సతుల పంపేను తోడు
సామ్రాజ్య పదవితో సకల నేర్పులను

వమ్మదని చెప్పంగ మేడ
వుంచబడెగాక
పాప నీవు మాకు పగదానివటవో!
కోపము శాయకు కూతురా నీవు
పావురాయలు పక్షులు పాప నీవెంట
కావిలి వుంచేను కన్నీరు బెట్టకు

హంసల కోవిలల అంపేను తల్లి
క్షేమము నీవార్త చెప్పేటందుకును
అంపుచున్నాను మెడకు మాయమ్మ
దుఃఖింపకు
కమ్మకొని మేడచుట్టు కావిళ్లు
వుంతును
సకియల నంచేను సరసముగా నేను

పగలు రేయు నిన్ను పరమాచికె
తీసుకుందు
మరచి వుండను నాకు మనుసెట్లు
వుండుః
వెరవు కూతురాః వెరవు నీకేలః
అమ్మరో నీకు అన్నప్రాణాదులు
బ్రహ్మణ అతివలచేత అంపింతు నీకు
సిరిదేవి మాటలకు సిరసెత్తి చూచి

## పాపనూక గోడు

మారుమాట నీతోను మందలించ
వెరుతును
వంటిగా మింటను ఎవరమ్మతోడుః
అంటివి మాటలు అమ్మ సిరిదేవి
అంపుచున్నానంటివి అన్నము నీవు
ఇంపుతో అంపంగ ఇందినటవే
అన్నము
తనతోడి చెలికత్తెలు ధనముకొండలో
వుండగాను
తనకు తోడెవ్వరు తల్లి సిరిదేవి ?
పురహరుని దయ తప్పె తనపూజ
ఇంతేగాక
మీరేమి జేతురు నా కర్మఫలము ?
తనకర్మ మీరీతి వుండగాను తమ
మేడ జెట్టితిరి

పూర్తిగా కాటమరాజుతోడ పుట్టినందు
లకు
వగవ కారణమేమి వో యమ్మ
సిరిదేవిః
పగవారమైతిమి నీకు బంధువులము
కాము
తల్లివెనక తల్లివని చాల నమ్మితినమ్మ
చెల్లబో ఈరీతి చేసేది యెరుగః
అక్కన్న మీది దయ అమ్మ నామీద
వక్కనాడైనను వుంచకపోతివి:
ఆడ ఎవరున్నారుఃఅడివిపుట్టుక నాదిః
చెడ్డవారముగాగ ఇంత జేస్తివే తల్లి:
పంతమాడి తెచ్చిన మాయన్న భక్తుడు
లేడు

పగవారి బిడ్డలమంటూ పాపము గట్టు కొంటిరి
ఇంతకు నోచుకుంటిమి వో యమ్మ సిరిదేవి:
కద్దటే యింత పాపము కాంత సిరిదేవి
బుద్ధులు జెప్పను పోషించను నీవు
వలపక్షపు తల్లివైతివి వో యమ్మ నీవు:
విని తల్లి మదిలోన విచారముతోచి
వున్నతముగా పాపను పూరడించసాగె
పలువరింపుచు తల్లి పాపపైమీద వరిగె

## పాపనూకకు శిరసంటుటకు సిరిదేవికోడళ్ళు నిరాకరించుట

కొలువులలో తనకోడండ్ల గొబ్బున బిలచి
అరచేతి దేవపూజ ఆరువేల ప్రాణ లింగము
ముంజేత దేవపూజ మూడువేల ప్రాణ లింగము
శిరసెల్ల లింగాల శివభక్తురాల:
పచ్చాకు బొట్టుపెట్టి భక్తుని నల్లమేడ:
మెచ్చుగా మరదలికి శిరసంటవమ్మ
కొలువులో వున్న కోడలు గొబ్బున లేచి
అత్తరో వినవమ్మ! ఆమెను అంట దోషంబు
వుత్తరకాశి బోయిన వుత్తముని తోడబుట్టు
కాశాత్ర బోయిన ఘనుడు తేబట్టి
చిత్తములో పాపకు చిచ్చులై మండగా
పాపకు శిరసంట భావ్యంబు గాదు
ఆ పణతి మాటలకు అమ్మ సిరిదేవి
మరివక కోడలిని మరివేగ పిలిచె:
కమ్మలు కంకణములు కడునొప్ప ధరియించి
కరకంచు చీరెలు కట్టుదువు కరియావులనాగ!
తరుచైన సొమ్ములు బెట్టే తరుణి రావమ్మ!
పురువున రావమ్మ పాపశిరసంట
కొలువులో వున్న కోడలు గొబ్బున లేచి
అత్తకు మ్రొక్కి అమరంగ జెప్పెను:
ముత్యాల ఆ కురులు ముడివిప్పనేర
పగడంపు ఆ కురులు పట్టి అంటనేర

మతిగల చెల్లెలు మాధవుని మారు
అతివేగ శిరసంట అత్త నే వెరతు :
మరివక కోడలిని బిలిచె మగువ
సిరిదేవి
వైనవైన సొమ్ములు బెట్టుదువు
వల్లభన్నసూర :
రావమ్మ కోడలా రా చిలుకబొమ్మ :
సిరిగల పాపమ్మకు శిరసంటవమ్మ :
కొలువులో వున్న కోడలు గొబ్బునలేచె
అత్తకు మ్రొక్కి అప్పు డిట్లనియె :
పెదమామ కూతురిని అంట దోషము
అత్త
ఆమెకు శిరసంట అత్త నే వెరతు
ఆ పణతిమాటలకు అమ్మ సిరిదేవి
మరివక కోడలిని బిలిచె మగువ
సిరిదేవి
నెలతీరు బొట్టు పెట్టుదువు నేతివారి
పోత :
రావమ్మ కోడలా రా చిలుకబొమ్మ :
సిద్దెల నూనెలు చిట్టిగిన్నెల వొంచి
భక్తితో మరదలకి శిరసంటవమ్మ :
కొలువులో వున్న కోడలు గొబ్బున లేచి
తరుచైన ఆ కురులు తానంటలేను
పట్టపురాజు చెల్లెలు పాపనూకమ్మను
పట్టి శిరసంట పాపమే అత్త :

అని యా కోడలు కడకు వైదొలిగి
మరివక కోడలిని బిలిచె మగువ
సిరిదేవి
ఏరువ రామచిలక : ఎరనన్న భయ్యా :
మరివేగ శిరసంట మాయమ్మ రావె :
కొలువులో వున్న కోడలు గొబ్బున లేచి
అత్తగారికి మ్రొక్కి అప్పు డిట్లనియె
సన్నాసి పట్టపురాజు సైదోడు పాపకు
వున్నతముగ శిరసంట అత్త
నే వెరతు :
మరివక కోడలిని మరి వేగ బిలచె
రంభ పుత్తళిబొమ్మ : రా చిలుక
కొమ్మ :
వరుసతో ముమ్మన్న ఇల్లాల రమ్మి :
ముత్యాల సొమ్ముల బెట్టుదువు
ముమ్మన్న చినమల్లు :
నీరజాక్షిపాపకు శిరసంటరమ్మ :
కొలువులో కోడలు గొబ్బున లేచి
అత్తరో : నీకు మ్రొక్కెను
అమ్మరో : వినవె :
కల్యాణపురాజుచెల్లెలు కాంత
పాపమ్మకు
హస్తాల శిరసంట అత్త నే వెరతు
మరివక కోడలిని మరివేగ బిలచె

మన్నెరాజశ్రీల మర్లవారి గంగ ! అత్తాడుమాటలకు అతివేగ లేచి
వుచితముగ పాపకు శిరసంటవమ్మ ! ఆవులన్న వీరగంగ అప్పుడిట్లనియె :

## వీరగంగ పాపనూకకు శిరసంటుట

దేవుని ప్రార్థించి దైపంబు వేసి
పాపనూకమ్మకు మీరు పనిలేనివారు
నేను తప్పించుకుంచేసు తనకు పోరాదు
పప్పుగా శిరసంట వచ్చెను వీరగంగ
బంగారముగిన్నెలో సపరు గొబ్బని
సంగతిగా దెచ్చెను సంపెంగనూనె
తరుణివంక జూచి దైన్యపడి గంగ
అప్పుడు వీరగంగ అతివేగమునను
తలనెరులు ముడివిప్పి దైన్యపడి గంగ
కొలుకుల కన్నీరు గోళ్లజిమ్ముచును
నీ నోము నా నోము నేడు వకటాయె
పనికిరాని బూరుగఫలమాయె
గదవమ్మ !
దిక్కు నీకు ఎవ్వరు ? దేవుడే తోడు !
ఎక్కడి తల్లితండ్రి ? ఎక్కడి
అన్నలు ?
మక్కువ వీరగంగ మగువ మాటలకు
గ్రక్కున పాపమ్మ గంగతో ననెను
చక్కని ఆవులన్న సతి వీరగంగ !
కలిగెనే వీరగంగ కంకణము నీకు
కాలిగోరు పోయె కంకణము గలిగె

బాసికము గలిగె బ్రెహ్మముడి గలిగె
బాలాయముగ నీకు వ్రాసెను బ్రెహ్మ
సతిపతి నాయము చక్కనాయెను
వదినె
కాశికావిడి మోసినంత కలుగు
సౌర్గంబు
బాల పాయమున నీకు వ్రాసెను
బ్రెహ్మ
నాకు నీకు సాటి అవునా వదినె ?
అనిన వీరగంగ ఆందోళపడెను,
బాసికము గట్టి బ్రెహ్మముడి వేసింద
కాని
భావించి మీ యన్నను చూడలేదమ్మ !
కాలుతొక్కి తన చేతి కత్తికి
తలంబ్రాలు పోసిందేకాని
కన్నెత్తి మీ యన్నను చూడలేదమ్మ!
అప్పటి ఋణము ఆ విధమున నుండె
ఇంకా వక ముచ్చట చెప్పేను
వినవమ్మ నీవు
దక్షిణ దేశానకు మందలు తర్లి
పోయేటి నాడు

ఆరవెల్లికాడ అతి రాచకుంభాలు
పోయించినాడు
క్రొరకూటి కుంభాలు కొండల
పొడవు
వరికూటి కుంభాలు వాముల
పొడవు
జొన్నకూటి కుంభాలు చొప్పవాముల
పొడవు
అరికెకూటి కుంభాలు అడ్డ తిప్పల
పొడవు
కుంభాలు పోయించె కులదీపకునుడు
అతివేగ ధనముకొండనున్న అండ
శ్రీశైల్ల
ఆవుల మందను చూడను అందరు
పోగాను
వారితో కూడాను తాను వయ్యాన
బోతి
మీ యన్నను చూడవలెనని అతి
ప్రేమతో పోతినమ్మ !
పాపపు బసువన్న నా పాలాటి
వాడాయెనమ్మ
రాజును రామవుని వర్ణించేటి వేళ
ఇద్దరి నడుమ బసువన్న అడ్డము
వచ్చెనమ్మ !
గోపురము మింటికి ఎగబెరిగె నమ్మ
గంగడోలు భూమికి దిగబడె నమ్మ

ఎటు మళ్ళి చూచినా ఆ బసవన్న
అడ్డమే వచ్చెనమ్మ !
ఆడ మీ అన్నను చూడను రుణము
లేదాయె
అని యిట్లు వీరగంగ ఆందోళ
పడెను
శిరసంటు వో గంగ చింతించనేల?
తలకురులు ముడివిప్పి తరుణి
వీరగంగ
తుమ్మెద రెక్కలబోలు కొమ్మ
తలకురులు
కమ్మక శిరసంటె కదసి వీరగంగ
గజరాజు చెల్లెలికి కాముని వీరగంగ
తెగువతో శిరసంటె దేమని వీరగంగ
నున్నంగ తలకురులు దువ్వి
నూనెముడి వేసి
సమురు చేతను ముఖము చయ్యాన
దుడిచి
మగువ లందరు వచ్చి మరి గుంపులు
గూడి
శృంగారపు తోటలో రంగు మీరంగ
అంగనలు జాజికాయ అటికెల నలిచిరి
అతివేగ సీకాయ అందమైన పసుపు
వేడ్కతో పాపకు పెట్టిరి నలుగు
చేకొని పన్నీరు చెంబులతో నిచ్చిరి
గ్రక్కున జలకమాడె కాంత
పాపమ్మ !

## పాపనూకను అలంకరించుట

తెల్లని వస్త్రమున దేహంబు తుడిచి
కలకంఠి వస్త్రము గ్రక్కున గట్టి
సంగతిగా వ్రాత పెన్నె చీర తా గట్టి
అంగనామణికి అతిసొంపుగాను
గంధ కస్తూరి ఘనత పరిమళములు
అందముతో నలదిరి అతివేడ్కనపుడు
తిన్నని తిలకము దిద్దిరి నుదుట
పట్టు చీరయును బాగుగా గట్టిరి
మల్లెలు మొల్లలు మరి విరజాజులు
అందమైన మొగిలి రేకులు అమరిన
సంపెంగలు
తలనిండ ముడిచిరి తరుణి
పాపమ్మకు
ఆవులన్న వీరగంగయు అతివ
లందరును
కస్తూరి గంధము గ్రక్కున నలదిరి
విస్తీర్ణమైనట్టి వెలది కన్నులకు
కాటుక దీర్చిరి కాంతకు నపుడు
అలివేణి పాపమ్మకు అందమైన
సొమ్ములు
ఆభరణములు దెచ్చిరి అమ్మనగరు
నుంచి
అబ్బురపు చెల్లెలికి అమరంగ
ధరియించిరి

ముంగా మురువుల తీగె ముత్యాల
బొట్లు
శృంగారించి రంత పాప చెలికత్తె
లందరు
చెక్కిన మాణిక్యాలు చేమంపు
కడియములు
ఎక్కువగా మంచి హేమంపు
మణులు
పచ్చల కడియములు బాగైన
సొమ్ములు
కూర్చిన ముత్యాలు గుండు
నెమణాలు
చేతుల బంగారి గాజులు, చిలుకలతాళి
అరుదైన బంగారు అందె లమరించిరి
సందిట జాజిబందులు సరసముగ
గట్టిరి
ఘనమైన ముత్యాల కమ్మలు బెట్టిరి
గొప్పైన సొమ్ములు గోమేధికములు
జమిడి ముత్యాల దండలు దయ్యాన
వేసిరి
పైనపైనవు సొమ్ములు వనరంగ
ధరియించిరి
శృంగారించుక పాపచెలికత్తె లందరు
పయనము జేసుక పణ్ణతు లందరును

అందముగ శిరిదేవి ముందర నిలిపిరి
అబ్బురపు కూతుర్ని అమ్మ తా జూచి
నిబ్బరముగ తల్లి నివ్వాళి దెప్పించి
గొబ్బున పట్టించె కూతురికి అపుడు
ద్రిష్టి తీయించెను తెలివిమీరంగ
మిత్తి దీయించెను మిగుల సొంపుగను
అప్పుడు సంతోషించి అమ్మ సిరిదేవి
కొమరగిరి అక్కతో గొబ్బున పలికె
ఇదే సంబరము ఇదే శోభనమనుచు
ఇదే పెండ్లి పాపకు ఇంతి కొమరక్క!
ప్రేమతో పాపకు ఇదే పెండ్లియనుచు
అక్కరో నీ మనుసు వక్కపైతేచాలు
భోంచాయ మని చెప్పె పొలతి
సిరిదేవి
వాసిగల తిరుమందులు వల్లవులకూను
అష్ట అవిశ్వర్యం గలిగిన
అయితన్నతల్లి
బుజ్జగించి పాపను భూషించె తల్లి
సజ్జన బుద్ధులు చెప్పె సఖియ
పీరగంగ
భక్తిగల మరదలిని భక్తితో నీవు
పొత్తుల బెట్టుక భోంచాయవమ్మ
ఆరగించను కూర్చుండిరి
అతిషలందరును
అరుధాంగలక్ష్ములు అప్పలు చెల్లెండ్లు
యరణప్ప, తల్లప్ప యింతి అక్కన్న
సిరిదేవి కొమరక్కను శిరసెత్తి
జూచి
నీరాడు అవిసినట్లు నిండె కన్నీరు
గోడుగోడున అడలి పాప
కోపానపలికె:

## పాపనూక గోడుగోడున ఏడ్చుట

నన్ను గన్నతల్లి ! నాతి సిరిదేవి !
కానక వస్తిని కల్యాణాననుంచి
మీలోకి వచ్చినందుకు మేలు
గ్రహించకపోతివి
తాలిమితో మేడబెట్ట తలిస్తివే తల్లి!
పురోహితుల మాటలకు పులిబోన
దోస్తివి
ఈరీతి చేయను విహితమటె తల్లి
తరమునాటి బంధువుల దాయాదుల
బాసి
వగలంగ మేడను వుంచేవు తల్లి!
బ్రాహ్మల మాటలకు బందిగాన
దోస్తివి

ప్రలాపించంగ మేడబెట్ట భావ్యమటె
తల్లి !
అన్నల తమ్ముల అందరి నెడబాసి
ఆపదబెట్టేటి మీకు న్యాయమటే అమ్మ
సిరిదేవి !
కరుణ యింతయు లేక కనకమేడ
నుంచేది
ఎంత దయ లేదు వో యమ్మ
సిరిదేవి !
ధనముకొండవారిని దాయాదుల బాపి
చిచ్చులో ద్రోయను సిరిదేవి నీకు
వప్పితమాయెనా వో యమ్మ నీకు
ఏరాలి బిడ్డలము గాగ ఏరుగా
జూస్తివి
పాలివారి బిడ్డలముగాగ
పాయదెరువులు జేస్తివి
చెరబందికమున యాల దోసెదవు
తల్లి ?
దాయాదిబిడ్డలము గాగ దయ
యింతలేక
పాయదెరువులు చాయ పాపమే తల్లి
బావబిడ్డయని భక్తి ఇంతలేక
అడలంగ మేడబెట్ట ఆది నీకు
మంచిదా ?
అక్కన్న మీది దయ అమ్మ నామీద
వక్కనాడైనను వగవవే తల్లి !

కడవారి మాటలకు కనకమేడ బెట్టేది
వరలంగ ఆకాశమున వుంచేది మేల ?
అన్నకు అడివిల్లాయె తనకు
ఆకాశమాయె
చెట్లే చుట్టాలు మాకు ఈ గట్లు
బాంధవులు
ఆకాశమే తండ్రి! అవనియే తల్లి !
మానులే అయ్యలు మరి వేగమునను
కంబస్తంభాలన్ని కనకమేడతోడు
మేడనున్న దూలాలు మేనత్తలమారు
అన్నదమ్ములు లేక అప్పలు లేక
దాయాది బలగము దగ్గర లేరమ్మ
అడలు నీకు లేదాయె అమ్మ సిరిదేవి
మాకీడు మామేలు మరి వేగ నీవు
దాచలేనయితివి తల్లి సిరిదేవి
పేరుబెట్టినంమకు పెద్దమాదేవులు
బూరుగమాని చందమాయె తల్లి
సిరిదేవి
అని యిట్లు దుఃఖపడి అలివేణి పాప
తన దుఃఖము తానిట్లు పలికె
కొమరగిరి అత్తను జూచి కొంతసేపు
అడిలె
కొమరగిరి వో యక్క గోత్ర
చింతామణి
తండ్రిలేడని నిన్ను తగ నమ్మివుంటి
మండువేసంగిలో మంటిలో ద్రోయ

వసితమాయెనా వో యమ్మ నీకు
మూలవున్న వారిని ముంగిళ్ళ వేస్తిరి
యాల కట్టుకుంటివి అత్తా యింత
దోషంబు
పల్లికొండకు యేమి పాపంబు జేస్తిమి
చెల్లంటో మా బావ యింత జేసేది
యెరుగ
పెండ్లి లేకుంటిమానె ప్రేమతో మిమ్ము
ఇందరిని చూపెట్టుక వుండలేనయితినా
ఆర్ల పెంటరణములో మాఅయ్యా
పెదయ్యా
దురముతో పగతుల తునియలుగ
నరికి
అరిమాని వీర వైరియాలి బయట
సరసముగ చెల్లెను మాతండ్రి పెద్దయ్యా
మాయన్న కాటమరాజు ఏడేండ్లవాడు
తండ్రి చెల్లెనంటేను దైన్యపడక పోయె
పోయి రణమెలికి తండ్రి పొందుగా
గనుగొనెను
అచ్చటనుండి తమతండ్రిని అతివేగ
దెచ్చెను
అచ్చుగా మాతండ్రిని ఆ తల్లి
వెదికిదెచ్చెను
వచ్చిన పురుషుని మా తల్లి వయ్యేన
జూచి

కలకల నవ్వుచు కాంత యేతెంచె
కుంకుమ వసంతము కొల్లలాడుచూను
పొంకముగ తముకమెక్కి పొలతి
పెదమ్మ
చిచ్చుల కాయత్తపడెను తల్లి పెద్దమ్మ
పున్నెపు నీరాడి పొలతిపెద్దమ్మ
పొందుగా తన వళ్ళు పోలెమంతయు
దీసి
బ్రాహ్మణసతులకు పంచిపెట్టెనమ్మ
పసుపురవికె తొడిగి పట్టుచీర గట్టి
యెసగంగ కాటమరాజును శెట్ట
బట్టుకొనెను
వడి బాలగిన్నెవలె నన్ను వడిజార
గట్టుక
మడెమెతో వురువున వచ్చెను
మాయమ్మ పెద్దమ్మ
కుడిచెయ్యి లోగాను గుండంబు చుట్టి
ప్రదక్షిణము తిరిగె పణతిపెద్దమ్మ
దాయంగ బిలచెను తరుణిపెద్దమ్మ
మారాచ అప్పకు మమ్మప్పగించె
నయమెరిగి గుండాన నన్ను
వెయ్యదాయె
పుట్టగానె నన్ను పుడిమి చంపదాయె
కర్మడు బ్రహ్మదేవుడు కట్టడి జేసె
గాబోలు

గుప్పున గుండాన నన్నేల వెయ్య
దాయె
వడ్లవారికి నన్నేల వప్పగించిపోయె
కల్యాణాన మాపేరు హతమణిగి
పోతేను
ఎల్ల లోకములకు ఏలికగాను
తల్లిపుట్టిలు దరులేని తోడు
మల్లడ గొనగాను కల్యాణాన మమ్మ
వప్పగించె
అద్దము నిమ్మపండు అగ్గిలో వేసినట్లు
నయమెరిగి గుండాన నన్ను వెయ్యక
పోయె
నమ్మించి వారిచేతికి మమ్ముల యిచ్చి
సభవారికి మ్రొక్కి సకియ పెద్దమ్మ
నిప్పులగుండాన గుప్పున దుమికి
అగ్గులపాలయి నాడు హతమాయె తల్లి
తల్లిదండ్రిలేని బాలలని దయయుంచి
మమ్మ
కల్యాణపువారు మమ్మ కరుణతో
బెంచిరి
కానివారు మేలెరి కాంత కొమరక్క
తండ్రి చనిపోయిన మాకు తల్లయిన
వుండవలెను
తల్లి చనిపోయిన తండ్రయిన
వుండవలెను

తొల్లిటి దోషంబు మాకు తోడ సిద్ధించె
కులకోటి బాంధవులలో కూన్మిచుట్టా
లలోన
యేరుబందము చేస్తివి వెలది
కొమరక్క
యెండనీడకన్ను యెరగక వుంటిమి
పాపాత్ముడు భర్తుడు దెచ్చి మమ్ము
పలాములు జేసె
కుందెనలో వర్రిపాలు గుప్పించి పోసి
కలికిచందనమనే గజము చయ్యన
దీసుక
అందరి గోత్రలు అతివేగ బాడితి
కాశినుండి వచ్చెను ఘనుడు భర్తిరన్న
పాడిన పాటలు బాగుగా వినెను
గురుతించి గరువు గొబ్బున నిలచి
సాక్షులు పలికించి సభను మెప్పించి
బ్రతికించేనని తెచ్చి పాపము గట్టు
కొనెను
వాదించి తెచ్చి పగవారికి వప్పగించె
యీలపోయెను తాను వుత్తరకాశిః
వప్పగించినందుకు మీరిందరు గూడి
నట్టేట పుట్టిముంచితివి నాతి సిరిదేవి
చుట్టాల బాంధవుల చూచినందులకు
ప్రాణంపదంబైన బంధువులు మీరు
చెదరినవారిని చేపట్టరైతిరి

ఇంగలాన దోస్తిరి మీరిందరు గూడి
మాయన్న కాటమరాజును మరివేగ
మీరు
ఆవులమందపట్నము గడితివి
అన్యాయపు తల్లి

నీవయిన వొకమాట జెప్పవయితివి
అత్త
కన్నవారు గారైరి కటికవారైతిరి
పాలుగెలిపించి తెచ్చి పగవారి
కప్పగించె
తెచ్చినవారికి తనకొలలు గుప్పన
దల్లిరి

## పాపనూక బంధువర్గమును శపించుట

పుత్తరకాశిలో మాయన్న వుడిగెనని
విందునా?,
మాయన్న భత్తుచేతి కప్పెర
పప్పులై వరిగెనని విందునా
వో యత్త కొమరక్క మాయన్న
భత్తుడు
వుండేటి వియాతి మండువాలన్ని
పాడుబడ్డాయని యెన్నడు విందునే
వో యత్త కొమరక్క వసరంగ నేను
కవకొని మాయాన్న వుండే మహలు
ఎన్నడు కాలెనని విందునే అత్త
కొమరక్క
సారంగమతమంత సద్దణిగెనని
విందునటే నాతల్లి సిరిదేవి
సిరిదేవి నీనగరు చిచ్చుతగులుక
మండంగ జూతునా మహిమీద నేను

కొమరమ్మ కొలువుకూటాలు కొల్ల
బోయెనని విందునా
అగుమంచి వుండేటి ఆటకూటాలు
అగ్గులు తగిలి మండి
సిరిగిరమ్మ వుండే చిత్రకూటాలు
చిచ్చుల దగిలి
కులకోటి బంధువులు కూరిమిచుట్టాలు
యెన్నగ బంధువులు యేకమై వాపు
కంచెంత ధనముకొండ కాలిపోగా
జూతునా వో కన్నవార
పుత్తమమైన ధనముకొండ రుత్తలయి
పోగాను
కన్నులార జూతునా వో కన్నవార
గుండపు ధనముకొండ గుంపులు కూడ
గాసు
యెన్నడు జూతునే యరణప్ప నేను

అంతలో యరణప్ప ఆడె నొకమాట
తిట్టకు తిట్టకు చెల్లె అన్నల దీవింప
వమ్మ
అన్నల దూరితే ఆపుసటే చెల్లెలా
అన్నల దీవించిన మనకు అభివృద్ధి
యపును
ఆ మాటలకు పాప ఆందోళనపడెను
అన్న లెవరున్నారు ఆకాశపక్షికి
మా యన్న గారికి అందరికి యెరగడ్డ
పాట
ముమ్మయ్యా, పోచయ్యా,
పుత్త మారాజుకు,
ఆయితన్న, కరియావులరాజుకు,
ఘనుడు వల్లభన్నకు, బాలరాజులకు
పోట్టుబడి పాలేట వరిగిరన్నవార్త
యెన్నడు విందునే యరణప్ప నేను
మా పెదబావ పల్లికొండ యెక్కేటి
శంఖు
చక్రాల పాలకీ కుప్పలుగ విరిగి
తెప్పలుగ రక్తాన తేలెనన్న వార్త

యెన్నడు విందునే యరణప్ప నేను
వదినగార్లందరు పట్టుచీరలమీద
పట్టుచీరలమీద పసుపుచీరలు గట్టుక
యెసగంగ గుండాలను యేగంగ
జూతురా
అని యిట్లు దుఃఖించి పాప అవనిపై
వరిగె.
బావ పల్లికొండ బాంధవు లందరును
అన్నలు తమ్ములు అందరు వేగ
అందరికి ఆంటోళము వచ్చి అప్పు
డిట్లనిరి:
శాపంబు బెట్టేను చెల్లెలు అనుచు
భూపాలు డయితన్న పుత్తమారాజు
కరియావుల రాజు ఘనుడు
ముమ్మన్న
అందరికి దుఃఖము అవని కంపింప
తామరాకులో నీళ్ళపలె తల్లడించిరి వారు
కొమరక్క సిరిదేవి కొంతసేపు
అడిలిరి.
రాముకుల గోత్రము రమణు లందరును
వలపోపుచు దుఃఖాన వాపోవ సాగిరి.

## పాపనూకను మేడలో ప్రవేశపెట్టుట

ఇక ఆలసించగరాదు అమృత
గడియందు
పాలవెల్లిగోత్రము పాపనూకమ్మను
పయనమై మేడకు పదమనిరంత

వైనవైనాన వచ్చిరి వల్లవుల కాంతలు
ఆదివారము అమావాస్యనాడు
అప్పలు చెల్లెండ్లు అమ్మ సిరిదేవి
పదమని పాపను పయనము జేసిరి.
దండయిన సొమ్ములు దట్టమయిన చీరలు
మెండుగా పెట్టెల నించిరంతటను
బచ్చెనపెట్టెలు పాపవెంట నడిచిరి.
పాలకిలోపల పాపనుంచుకొనిరి
మేదిని చెల్లెలిని మేడకు పంపను
మాధవుం డయితన్నను మరి పల్లి కొండను,
సిరిదేవిని, కొమరక్కను,శీఘ్రమే జూచి
చెల్లెలు అందరికి చెయ్యెత్తి మ్రొక్కె.
పాలకి యెక్కెను పాపనూకమ్మ.
పాపను చూడను ప్రజలంత వచ్చిరి
చుట్టువూళ్ళవారు చూడవచ్చినారు
పాపచెలికత్తెలు బాగుగా వచ్చిరి.
బ్రాహ్మణవారి పద్మక్క,బలిమి శివక్క,
రాచవారి రంగమ్మ,రమణి యెలమక్క,
యెంతయిన కోమటివారి యెలనాగ మొదలు
ఫణతులు పాపమ్మను అతివేగమునకు
పట్నము వెళ్ళివచ్చె పాపనూకమ్మ
పండిన పనసలు,పాలమాని బయట
పల్లకి దిగెను పాపనూకమ్మ
కన్నవారందరిని కన్నుల జూచి
అందరు వుండండి అమ్మలార మీరు
బంధువులందరు పరిణాన వుండుడి
కీడు మేలు ఖోంచేసి కీర్తులు దెచ్చుక.
పిన్నల పెద్దల పిలచి తానంపె
చెలికత్తెల నందరిని పాప చెట్టాపట్టి పట్టుక
చెలికత్తెల తిరుగనంపె. చెప్పెనంపరికి
పదివేలకు దీరిన పాలమాని నిచ్చెన
వెయివేలకు దీరిన వేగిమాని నిచ్చెన
నిచ్చెనలు జేర్చిరి వెలదిమేడకును.
పక్కయంతరువ యెక్కిరి వామాక్షులు తాము
చేకొని దుఃఖాన చేడెలందరును
తలనెరులు వీడంగ నిలిచెను పాప
మర్లవారి మల్లమ్మను జూచి మందలించసాగెను.
రెండో యంతరువు యెక్కిరి
రేమంతుని వీరబయలు జూచిరి.
నిండిన దుఃఖాన నెలత లందరును
తల్లడించసాగిరి దామసాని తల్లమ్మను జూచి

మూడో యంతరువ యెక్కిరి
ముదితలందరును
వజ్రపు తళుకు మెరుపులు జూచి
ఈకాలపు విశ్వబ్రహ్మ వీడెంతవాడో
గాని
సూత్రాన గట్టినాడు సుదతికిమేడ
పట్టించి కట్టినాడు వంటిస్తంభముమేడ
తమ తల్లిని తలచుక తలపోయసాగె.
నాలుగో యంతరువ యెక్కిరి నారీ
శిరోమణులు
నల్లచెరువునీళ్ళు అవుతుకాణ సూత్రము
జూచిరి.
ఇది చోద్యమనిరి యింతు లందరును
పులిముద్దుల దేశమ్మను జూచి
పొగలంగసాగె
అయిదో యంతర్వు యెక్కిరి
అతివలందరును
అష్టదిక్కులు చూచి అంసలజూచి
ఆయితన్న ధనమ కొండ అంగళ్ళు
చూచి
మకటకోట మల్లమ్మను చూచి
చెల్లెలు మందలించసాగె
ఆరో యంతర్వు యెక్కిరి
అతివలందరును
ఆడప్రతిమల చూచిరి చకోరముల
చూచిరి.

ఆడాడ వ్రాసిన అంసల జూచిరి.
పైనాన వ్రాసివుండిన వల్లవుల తండ్రి
గారిని
సిరిగలవాడు సింహాద్రిరాజు
ఆడ పెదతండ్రిని జూచి ప్రేమతో
బలికె
యిలలోన తండ్రి మమ్మ యీరీతి
జేసి
పాపాత్మురాలి మేడన యాల
వెలసిరి ? మీరు ?
అని యిట్లు కొంతసేపు అడలంగసాగె.
పెట్టెల సొమ్ములు పెద్దలందరూను
ఆ యంతర్వున అతివెలు వుంచిరి.
ఆరో యంతర్వు ఆవులన్న కెదురు
ఏడో యంతర్వు యెక్కిరి
వెలదులందరును
పగడంపు చిత్తారు బాగుగా చూచిరి.
భవంతి మిద్దెపంచలు చూచిరి.
తండ్రి పెద్దయ్యను, తల్లి పెద్దమ్మను,
అచ్చట వ్రాసినారు అమరంగ
మేడను.
వారిని చూచి కొంతసేపు
వలపోవసాగె.
నిమ్మళించి అందరు నిలచి
కూర్చుండిరి.
పందముల యరణప్ప పైడిపాటితల్లి
అందరు పెద్దలు అంత నిట్లనిరి;

## పాపనూకను మేడలో విడచి యాదవకాంత లందరును దిగివచ్చుట

"అమ్మరో! పాపమ్మ! అతివేగ నీవు
సెలవిచ్చి పంపవే చెల్లెలా నీవు"
అప్పల మాటలకు పాప అతివేగ బలికె:
"పోరమ్మా పెద్దలార!
పొలతులందరును
అడివిపక్షిని గూడి అమ్మలార మీరు
యాల వున్నారమ్మ! వేగమే
పోరమ్మ!"

అతివలకు సెలవిచ్చె అలివేణి పాప.
పాప సెలవు ఇచ్చిన పణతులందరు
వచ్చిరి.
అంగనలు మేడదిగి అతివలందరు
వచ్చిరి.
వారివారి యిండ్లకు వైనాన బోయిరి.

—— o ——

# కరియావుల రాజు కథ

[ప్రత్యంతరము]

.............................................

.............................................

.............................................

.............................................

## ఓరుగంటి రాయబారులు యాదవులకడకు వచ్చుట

విని యపుడు వోరుగంటి రాయబారులు
ఇట్లగని పలికిరి
"వక పనికి మేమొచ్చి వకటడుగరాదు
మేము వచ్చిన వార్త మీకు
విన్నవించేము
మేము వచ్చిన పనులు మీకు
సమకూడివస్తే
అటుతరువాత బహుమానం
అడిగేముగాని
మీరు వచ్చి నిన్నటి దినం వుదయ
కాలంబునందు
మీ సంపద గుడార్లలోను
మీరు కదిలించిన కంచు రెణభేరీలు
రాయరణభేరీలు ఈ రంగమధ్యమునను
మూడు వందల రెణభేరీలు వక్క
ముమ్మరంబునను

వక్క గెడియారమందు మీరు
వాయించినందులకు
తమికెసు వోరుగల్లు తారుమారాయె
అదిరిపడి వోరుగల్లు అట్టిట్టు కదిలె
వుక్కు కోటలు తర్లటించి వూగె
వోరుగల్లు
రాతి కోటలు తర్లటించె రాజులు
బ్రెమసినారు
పుట్ట కోటలు తర్లటించె భూపాలకులు
బెదరినారు
పట్టపగలు మిట్ట మధ్యాహ్నము వేళ
వాసులు వోరుగల్లు వలసలు దీసె
తామరాకులో నీళ్ళు తర్లటించినయట్లు
తర్లడంబొంది వోరుగల్లు దరికొని
సాగె
పగరాజు వచ్చెనని పౌరుషంబు మించి

కత్తులు ఝుళిపించి ఖడ్గములు పట్టి
మీసములు వడి[ద్రి]ప్పి మిణుకుచున్నారు
మీరు ఏ సీమరాజులో? ఏ
భూమివారో?
ఏ రాయ కళింగాలవారో? ఏ రత్న
కళింగాలవారో?
కంచు కళింగాలవారో? గజా
కళింగాలవారో?
మీ కులావళి మీ గో[త్రా]వళి మా రాజు
తెలిసి రమ్మనెను
మీరు యాల భూములు లేక ఎక్కను
అశ్వాలులేక
మన్యభూములు లేక మన్యదళాలు లేక
మా మన్యభూములు మీరు యాల
వచ్చినారో?

సూ[త్రా]న వోరుగల్లు చూత వచ్చినారో?
కపుతుకాస వోరుగల్లు కట్టుకో
వచ్చినారో?
పంతాన వోరుగల్లు పాడుకాయ
వచ్చినారో?
దోషాన వోరుగల్లు దోసకపో
వచ్చినారో?
శంభుని తిరణాల సెల్లింప
వచ్చినారో?"
అని యిట్లు వోరుగంటి రాయబారులు
ఆడు మాటలు విని
అపుడు గొల్లరాజులవారి భట్టు
విట్లగని పలికె

## శంభుని తిరుణాల చూచుటకు వచ్చితిమని యాదవులు ఓరుగంటివారికి చెప్పుట

"మా కులావళి మా గో[త్రా]వళి
మా వంశావళి మా నామావళి
వినరయ్యమీరు
వీరి వింటిపేరు ఆవులవారు
ఆదినారాయణ బిరుదుగలవారు
అచ్యుతగో[త్ర]ము అత్రిముని మనమలు

పూర్వాన [క్రి]ష్ణమ్మకు పుట్టింటి ఘనులు
గోవర్ధనగిరి పర్వతం కొంచు
గొడుగు చెల్లించుకొన్న గోపాలకులు
యయాతి కులసంతతి యదువంశము
మాది

సంద్రప్రతిష్ఠ గలిగిన నందవంశము
మాది
శుక్రాచార్యులకు మునిమనములు
సూర్య చంద్ర వంశధారులు
సింహాద్రిరాజు కొమాళ్ల మొగసింహపు
రాజులు
పెద్దరాజు కొమాళ్ల పెట్టని కలుకోటలు
యరనూకరాజు కొమాళ్లు ఎంచగల
బలము
నలనూకరాజు కొమాళ్ల నయముగల
ధీరులు
పోలురాజు కొమాళ్ల భోగదేవేంద్రులు
పందుముల పల్లికొండకు ఈరంతా
బావమరుదులు
యలమంచి తుమ్మపూక్షి ఏరువ
కాణాచి
ధనముకొండ వేలేటి గొల్లరాజులు వీరు
వోరుగంటి శంభుని వారము
కొమారుడు
మాయన్న అయితమరాజు
శంభుని తిరణాల వేడ్క సేవించి
తీర్థవాసులై మా యలమంచిపట్నానికి
తిరిగి పొయ్యేము
మీ సీమభూములు సింహాసనములు
మేము ఏల రాలేదు
సూస్తన వోరుగల్లు చూడ రాలేదు
కవుతుకాన వోరుగల్లు కట్టుకో
రాలేదు
జోషాన వోరుగల్లు దోసుకపో రాలేదు
పంతాన వోరుగల్లు పొడుశాయ
రాలేదు"
నోరు నాక్కించి నోట్నిండా చక్రాంగి
రూకలు పోసి
దీవించి రాయబారుల వోరుగంటికి
తిరగ సంపించిరి
ఆడనుండి రాయబారులు ఆడకొనివచ్చిరి
నాయకులు దొరలు పతాభిరుద్రుడు
అతి వేడ్కతోను కొలువుండిరి
అతిసంభ్రమునను
ఆ సమయమున రాయబారు లదికొని
వచ్చిరి
ముకుళిత హస్తులై రాజుముందర
నిలచిరి
"సన్నజంబుల వీరబైటకి చయ్యేన
బోతిమి"
అని యిట్లు రాయబారులు
ఆడుమాటలకు
ఆద కాయాయనా ? పండు ఆయెనా?
ఘనరాజువారి బంటు!
అని యిట్లు వోరుగంటిరాజు
ఆడినందులకు
"విన్నవించెద వినుడి విర్తాంతమెల్ల

కాయ వారి మందలో కాచివున్నాది
పండు వారిమందలో పండివున్నాది
కాయపండు తరగను మనవద్ద
కర్తలున్నార ?
పప్పు అప్పశాలకు పనికొచ్చే
బ్రాహ్మలున్నారు
తెగువతో వచ్చేటి తుపాకిగుండ్లు
విరజాజి మొగ్గలు వేట్లాడగాను
రారాజు కొమారుడు భోగదేవేంద్రుడు
కలిమెంత బలిమెంత ఆ రాజు
కపటమది యెంత
అదురు బెదురు లేక ఆ రాజఘనుడు
అలుగుల పారాలో అతడు వున్నాడు
వారి తండ్రిగారు పెంచినారట
వైరముగల బంటు
మతంగి బంటు వక్కడు మన్నీడు
బీరన్న
మడికాలికి సొలవు మన్నెదళాలు
యలమంచి తుమ్మపూడి ఏలేటివారు
గొల్లరాజులు వారు గోయింద
మూర్తులు"
అనిన వోరుగంటివారు అళ్ళున నవ్విరి
సప్పజేసుక నవ్విరి సప్పట్లు గొట్టిరి
గొల్లవారు అనగాను కొట్టినపిండి
అంటిది

గొల్లవారు అనగాను గోగుమీద బచ్చలి
అంటిది
వూరులోపల మాను వుండు
చందమాయె
అణకములో పోక వుండుచందమాయె
చిక్కములో పిట్టనలెను చిక్కిరి మనకు
వంటయింట్లో కుందేలు మనకు వుండు
చందమాయె
చిక్కిరి గొల్లరాజులు మనకు దక్కె-
భూషణాలు
పెద్దలనాడు పోయిన బిరుదులు
బిరుదావళ్లు
చిన్నలనాడు మన దివాణమునాడు
కదలివచ్చి వున్నవి
మన దివాణము వచ్చిన బిరుదులు
మళ్లి పోనియ్యరాదు
వుదయాన బారులు వెయ్యేరుపరచి
కదసి గోసంగిబలము కల్లుగా జంపి
మరిపోయి గొల్లరాజుల మంద
చుట్టుకొని
చెరా చూరగా బట్టి ఎసగంగ
వోరుగల్లు
ఎసగంగ వోరుగల్లు ఏలనేవలయు
అని కోకలు గిరదాయించి వారిమీద
కోపంబు జేసిరి

## పట్టాభిరుద్రుడు యాదవులకు మోసము చేసి చంపనెంచుట

ఆ తట పట్టాభిరుద్రుడు ఆడె నొక మాట
అంత వారు తామవుదురోయి అన్నలార మీరు
వార్ని వైరంబు చేసి మనము జయించలేము
నామాట వినరోయి నా యన్నలార!
వారి కులావళి వారి గోత్రావళి మనకు తెలిసింది
మన కులావళి గోత్రావళి వారికి తెలిసింది

కోటలోకి వొకరొకరిని రప్పింతు నేను
కోటలు పధ్నాలుగు కొత్తళంబులు వొకలక్ష
అరవయ్యారు గమళ్లు ముప్పైమూడు దిడ్డిగంతలు
తక్షణంబున తలుపులేయండి
కోటలోపల వార్ని పరిమార్చవలెను
అని ఎక్కడవారిని అక్కడ సద్దణిచినాడు
అంగిరేకుల మారన్న ఆడప కేశవుడు
రాయశృంగావళి భట్టును రమ్మని పిలిచె

## పట్టాభిరుద్రుడు యాదవవీరులను ముగ్గురిని మాత్రము కోటలోనికి రమ్మనుట

"వినరోయి రాయబారులార! వీరశూరులార!
సన్నజంబుల వీరబయలు మీరు చయ్యన బోయి
శంభుని తిరణాం సేవించవలెనండే

ముదమొప్ప ముగ్గురు రాయమాన్య కొమాళ్లను
మన పట్నానికి తర్లిరమ్మనుడ
రూకలు ఎచ్చుగా బోసి గుళ్లకట్టించినాము

గుడిమీద పుణ్యంబు గొల్లరాజులది
ఎచ్చైన పుణ్యంబు గొల్లరాజులది
కానవచ్చిన పుణ్యంబు గొల్లరాజులది
కానరాని పుణ్యంబు కడమంత మంది
మీకు మాకు వక వైరవర్గములేదు
వో పెద్దలార!
మీ యలమంచి పట్నంబు మాది
మా వోరుగంటిపట్నంబు మీది
వాదు భేదము లేదు వో యన్నలార!
ముదముతోడుత వచ్చి మీరు ముగ్గురే
వచ్చి
శంభుని తిరుణాల సేవించమనుడి
ఇంతకు మినహాగ మీదళాలకు
విడుదులు చాలవు మన పట్నంబులోన
అశ్వానికి రౌతు గరిడికి బంటు
చెదురు సింహాసనానికి పట్టపుదొర
కదిలి రమ్మనుడి వార్ని మీరు
గ్రక్కున బోయి"
అని యిట్లు పట్టాభిరుద్రుడు
ఆనతిచ్చినను
ఆ మాటలకు రాయబారులు
అతివేడ్కతోను
సన్నజంబుల వీరబైటకి చయ్యన
వచ్చిరి
ఆయితమరాజు గరిడికి అతివేగ
వచ్చిరి

పదివేల విధముల ప్రస్తుతి చేసిరి
"వినవయ్య మా మనవి వీరకోంకార!
మా మనవి చేకొని మమ్ము రక్షించు
పనిబడి చెప్పేను పాలింపవయ్య
నిన్న మీరు వేయించిన రాయరణ
భేరీల మోతలకు
తమికెను వోరుగల్లు తారుమారాయె
తామరాకులో నీళ్ల తల్లడించినయట్లు
మీరు శంభుని తిరణాల సేవించినట్లు
అశ్వానికి రౌతు గరిడికి బంటు
సదురు సింహాసనానికి పట్టపుదొర
ముదమొప్ప ముగ్గురు వచ్చినట్లయితే
మీరున్ను మేమున్ను కలసి మెలసి
శంభుని తిరుణాల సేవించి మీరు
తీర్థవాసులై మీ యలమంచిపట్నానికి
తిరిగి పొయ్యేరుగాని
ఈ వార్త మా పట్టాభిరుద్రుడు మీతో
విన్నపము శాయమనెను
మీకు మాకు వక వైరవర్గము లేదు
వో రాజులార!
సంపద గుడార్లు మావి, వోరుగంటి
పట్నము మీది."
అని యిట్లు రాయబారులు ఆడు
మాటలకు
ఆ వార్తలకు పల్లికొండ అప్పు
డిట్లనెను

"ఆటువలెనే ముగ్గురు త్రయిమూర్తుల
వలె
మీ పట్నానికి తర్లివచ్చేము గాని
వుండుగల ఎచ్చరికతో వారిని
వుండమని చెప్పుడా!"
అని నోరునొక్కించి నోట్నిండా
చక్రాంగిరూకలు పోసి
దీవించి రాయబారుల తిరుగ నంపించిరి
ఎఱ్ఱంగ పండిన కొఱ్ఱఎన్నువలె
అయితమ రాజు తల వాలవేసెను
తమలపాకువలె అయితమరాజు తల
వాలవేసెను
అది చూచి పల్లికొండ ఆడె నొక
మాట
"వల్లవుల నామరిది!వలురాచమరిది!
చెవున ఇల్లుగట్టుక చెప్పితినోయి
మరిది
చిలుకవలె బుద్ధి నీకు చెప్పితినోయి
మరిది
వోరుగంటి ప్రయాణము మనకు వమ్మి
గాదంటి
నామాట కడద్రోసి నీవు కదిలి
వచ్చినావు
వచ్చినందుకు మనకు జయమేగాని
అపజయము లేదు

ఏనుగకు కొమ్ముమవస్తే ఎనక్కితోస్తే
పోవునా?
మసిబొట్టు కాగాను మాపితే పోవునా?
నొష్ట వ్రాసిన వ్రాత నేడు పోదయ్య
బ్రహ్మవ్రాతకు మారు పలుకంగరాదు
దూరంగ వుంటేను పిరికితనము
వుండవలెను
దగ్గిరికి వొచ్చినప్పుడు పొడిచిన
పొడవకున్న
బంట్రోతు మర్యాదగా బంటు
వుండవలెను
అని యిట్లు పల్లికొండ ఆడు మాటలకు
"వినవే వో బావ!నా విన్నపము నీవు
తరాతరము పూ తాత తండ్రుల
తరము
భట్లకు బ్రాహ్మలకు
ప్రాణమియ్యవలెను
శరణం అంటే కాయవలెను
అభయం అంటే ఎనక ఏసుకోవలెను
సెరలు బట్టినవార్ని సెరలు విడిపించ
వలెను
నారు వుపకారమునకు పోరు వుద్ధరించి
నారు
జపములు తపములు సిద్ధించు మనకు
అందుకు సందేహము అనుమానమేల?

పోట్లాట అంటేను కోటిలాభమందు
కలహానికి కాలమిత్రుడని అందు
చావు అంటే చావుకు సంతోషపడుదు
చావనివాడు ఎవ్వడు
ఈ జగతిలోపలను
పుట్టినపుడే బ్రహ్మ గిట్ట వ్రాసినాడు
వాడు పోడుస్తాడు గెలుస్తాడని
భయపడలేదు
వాడు బలవంతుడని నేను
భయపడలేదు
అస్తులు బాలలు ఆడస్త్రీలతోను
చిన్నవారు బాలలు శిశువులతోను
మూసిన గముళ్లు ముంజేతులిచ్చి
పసిబిడ్డలకు సన్నుబాలిచ్చుకొనుచు
విలుతీర్థము వస్తినే బావ పల్లికొండ!
ముదమొప్ప ముగ్గురు రాయమాన్య
కొమాళ్ల
వాలిపట్నానికి తర్లరమ్మన్నారు
ఎవ్వరు పొయ్యేరు ఎరుగింపు బావ!
సంపద గుడార్లుకాడ ఎవ్వరు ?
వారి పట్నానికి ఎవ్వరు?"
అని యిట్లు అయితమరాజు ఆను
మాటలకు

విని యపుడు పల్లికొండ విట్లగని పలికె
"అశ్వానికి రౌతు నా తమ్ముడు
పుత్తమరాజు
గెరిడికి జంటు సీ తమ్ముడు
కరియావులరాజు
వుగ్రగిరి రాయసింహాసనమునకు
అధిపతివి నీవు
మీరు ముగ్గురు బోయి శంభుని
తిరణాల సేవించి రండి"
అని యిట్లు పల్లికొండ ఆడె నొక
మాట
విని యపుడు అయితమరాజు ఇట్లుగని
పలికె
"ముదమొప్ప మేము ముగ్గురు
తర్లిపోయేము బావ
శంభుని తిరణాల సేవింపగలము
కావలసిన పనులెల్ల కాచుకొనేము
నీవురాని కార్యాలు మాకు పెక్కైన
సమకూడివచ్చునా?
ఆ మాటలకు పల్లికొండ ఆడె
నొక మాట

## పల్లికొండ, అయితమరాజు, పుత్తమరాజులు కోటలోనికేగ నిశ్చయించుకొనుట

"నేను వొచ్చేను వోరుగంటికి
పదవయ్య మరిది
అధిక సంతోషమాయెను అయితమ
రాజుకు
"నీవు నేను వోరుగంటికి తర్లిపోతేను
సంపద గుడార్లుకాడ కాసి వుండేటి
బంటు ఎవరయ్యా?"
"ఎనవయ్య నా మరది నీకు
విన్నవించేను
బుద్ధిగల నా తమ్ముడు పుల్లావుల
కేశవయ్య
కాంతి గలిగిన నీ తమ్ముడు
కరియావులరాజు
ఈరిద్దరికీ గుడార్లు ఇల్లడిజేస్తేను
మన ఇద్దరూ గుడార్లుకాడ మరిది!
వున్నట్లే
పదివేలు వొచ్చినా పర్వా శాయరయ్య
నూరువేలు వొచ్చినా వెనక
తియ్యరయ్య"
అనిన మాటలకు అయితమరాజు
అనె నొకమాట

"బుద్ధిగల నీ తమ్ముడు పుల్లావుల
కేశవయ్య
నీ మాట వినును నిదానముగల రాజు
నీ తమ్ముడు నీ ఆజ్ఞ మీరడు
నా తమ్ముడు కరియావులరాజు
మహా కర్కోటకుడు
నా మాట వినడు నా బుద్ధి వినడు
కచ్చకు కాలు దువ్వు నా కరియావుల
రాజు
పొద్దేడు కలహములు పొద్దేడు
జగడములు
పొద్దేడు కలహములు లేకుంటే
నా తమ్మునికి భోజనము అరగదు
అటువంటి కాలాంతకుడు
నా తమ్ముడు కరియావులరాజు
ఎదట నిలిచి మాట్లాడను వెరుతునే
బావ!"
అనిన మాటలకు పల్లికొండ అప్పు
డిట్లనియె
"నీ బుద్ధి నీ మాట వినకపోతే
నా బుద్ధి నా మాట వినకపొయ్యేనా?

పోదాము రావయ్య! కరియావులరాజు
కొలువుకు"
ఆకులు పోకలు అగరు జవ్వాజి
గంధము కస్తూరి గాజుగిన్నెలతోను
రంపాన తరిగిన రామగిరి వొప్పులు
వుల్లిపూ శాల్వాలు వుడగరుల
గప్పించుకొని
దుత్తెడంతేసి దూదిపావాలు తొడిగి
పక్షిణిబెత్తము వక చేత పట్టభద్రుడు
పల్లికొండ అయితమరాజు
పయనంబులైరి
కరియావులరాజు కొలువుకు కదలి
తా వచ్చిరి
కరకంచు గుడార్లలోను
కరియావులరాజు
పుల్లావుల కేశవయ్య బుద్ధిగల మరిది
బారాపగడసాల పందెముపట్టె
ఆడగాను
ఆడేటి పగడసాల పట్టె చాలించి
కాలినడల పట్టపుదొరలు కదలివచ్చేటి
రాకలు కన్నుల జూచెను కరియావుల
రాజు
తిమురుచు లేచెను ధీరత సింహంబురీతి
"పుల్లావుల కేశవయ్య! నా బుద్ధిగల
మరిది
ఏమి కార్యమొగాని ఎరుగంగ రాదు

గుడార్లను కట్టాకడాన మన గుడారు
పుప్పది
ఏది సుద్ది ఏది వార్త మనకు
తెలియకపోయె
వరసి వక రాజు వాదుకు వచ్చెనో
కదిసి వక రాజు కయ్యానికి వచ్చెనో
కాలినడల పట్టపు దొరలు కదిలి
వొస్తూవున్నారు
మనకు సదురు సింహాసనము చెల్లదే
మరిది!"
అని చదురు దిగ్గున లేచి చవుకళించె
రారాజు
"ఇప్పుడు నేబోయి ఇంద్రాదిశూరుడై
వోరుగల్లు నేజొచ్చి వానిమీద శోధింతు
గవిలికొండ నే జొచ్చి వాని కావులు
శోధింతు"
అని యిట్లు కరియావులరాజు ఆడు
మాటలకు
దాదాసి పెద్దలు దగ్గిరికి వచ్చిరి
ఎదురేగి బాలలు ఏతెంచిరి వాపు
అల్లడజేసి వారు అయితమరాజుకు
మ్రొక్కిరి
పల్లడజేసి వారు బావ పల్లికొండకు
మ్రొక్కిరి
ముకుళిత హస్తులై రాజు ముందర
నిలిచిరి

వచ్చిన బాలరాజుల వనర దీవించిరి
వురువాన ఎత్తి దరిణాన దించి
చెక్కిళ్లు తా రెండు చేర్చి ముద్దాడి
కరియావులరాజు వుండేటి కరకంచు
గుడారు
కరకంచు గుడారుకు తగ దర్లి వచ్చిరి
అచ్చట కొలువు అయిరి అతిసంబ్రమము
నను
పల్లికొండ పెనుతొడలు సదురు
గావించిరి

పల్లికొండ ఎదురొమ్ము బారుగుదిండ్లు
గావించి
చయ్యన కరియావులరాజును చదురు
మీద వుంచి
పల్లికొండ అప్తాన పరిమళాములాను
కరియావులరాజుకు గంధంబు నలది
వులిపూశాల్వాలు వుడగరులు గప్పి
తాంబూలం యిచ్చెను తగు
వేడ్కతోను

## కరియావులరాజు, పుల్లావుల కేశవయ్యలను సంపదగుడార్లకు కావలి యుంచుట

"సింహాద్రిరాజుకొమార! మొగసింహపు
రాజ!
పిన్నమామలకు అల్లుడ! బిరుదుగల
రాజ!
పెద్దమామలకు అల్లుడ! పేరుగల రాజ!
లేతమామిడి చిలుక! లేదోట మొలక!
వినవయ్య నా మాట నీకు
విన్నవించేను
ముదమొప్ప ముగ్గురు రాయమాన్య
కొమాళ్ళ

వోరుగంటికి రమ్మని వచ్చి రాయ
బారులు
రాయబారులు వచ్చి చెప్పిపోయినారు
చెప్పి పోయిన వెనుక మనము
తామసింపరాదు
మీ యన్న అయితమరాజు,
నాతమ్ముడు పుత్తమరాజు
నేను వోరుగంటికి తర్లిపొయ్యేము
పాలకీలు ఉన్నావి పశువు లున్నావి
ఆడవారు వున్నారు,అర్థమున్నాది.

ధనధాన్య వస్తువలు దండిభాగ్యం
వున్నాది.
పదిలాన కాపాడు నా చిన్నమరది."
అని యిట్లు పల్లికొండ ఆడు మాటలకు
విని యపుడు కరియావులరాజు
ఆగ్రగుడై మండి
సౌకశించి రాజు చదురు దిగ్గున లేచె
మండికాలిమిద మడిమలు తిరుగుకోని
తండ్రి సింహాద్రిరాజుపట్టిన
మూడుజానల ముప్పిరి సురియ
నడిమేలు వుంగరమునందున్న సురియ
ఆరాటమున తాను అందుకొని సురియ
పల్లికొండను జూచి పట్టెను అస్త్రంబు
కుస్తరించి మరిదిని కూర్చుండనుంచి
మరిదిమీదను చెయివేసి మరి కౌగలించి
"అందరు వినగాను బావ
ఆడితివి మాట
మరివొక రైతేను మామాట వినవే
తలత్రెల్ల గుట్టలుగ తరుగుదునే బావ
చెల్లునా దేవేంద్ర దేవతలకైన
మందలాదేవితమ్ముడా మా మాట
వినవె
అలనాడు మాతండ్రి అతిపుణ్యశాలి
వారది చెరకూర వరగిననాడు
ఏడునూర్ల రెండు సింహతలాటాల
బిడారులు

గుడారు బోనకావిళ్ళు
సామిన గుర్రాలు సౌరాజ్యములు
పెట్టెల్లో సొమ్ములు పెద్దగుర్రాలు
అయిదునెలల బాలలు
ఆరునెలలు బాలల
పదినెలల బాలలు పట్టి యీడేర్చి
ఇంతలింతల వారిని యీడేర్చి
నీచేతికి అందించి నీకు వప్పగించి
అలనాడు మాతండ్రి అదృశ్యమాయె.
గిన్నికూటి బాలకు గీము
ఏరుపరచినావు
వల్లపులవారి యింట వనితలు
జన్మించినాను
తిరుమందుల వారికిచ్చి శ్రీకల్యాణము
అందించినావు
తిరుమందులవారి యింట దివ్యగోపికలు
జన్మించినాను
వల్లవుల వారికిచ్చి శుభశోభనములు
గావించినావు
పరస ప్రమాణం తప్పకుండ
వడుగులు పెండిండ్లు గావించినావు
నాటినుండి నేటిదాకాను
నాస్వామి నీవు
పెంచి యీడేర్చి పెండ్లిండ్లు జేసినావు
ఆ మందమేళము చాత యింతలేసి
మాటలాడితివి

మరి వక రైతేను మాట్లాడగలరా ?
ఇప్పుడు నేబోయి ఇంద్రాది శూరుడవై
నేను
వోరుగల్లు నే జొచ్చి వానివాడ
శోధించి
పానగల్లు నే జొచ్చి వానిపట్నము
శోధింతు
గవిలికొండ నే జొచ్చి వాని గవులు
శోధింతు
వరసి భేతాళుని చంపి వాదు యిప్పుడు
తుడుస్తునే బావ !
బేతాళుని పొడిచిన పోటు
గుంటె గుండా దూరి వెళ్లివస్తునే బావ!
వోరుగంటిదళాలు తెచ్చి మీ వలసమీద
విడుతునే బావ!"
అని యిట్లు కరియావులరాజు
ఆగ్రుడై మండెను
నిప్పువంటి రాజువద్ద నీరువంటి ప్రధాని
పల్లి కొండ
అగ్గివంటి రాజువద్ద అమృతమువాడు
పల్లికొండ
చదురు దిగ్గున లేచి చయ్యన వచ్చి
వురువార యెత్తి దరిణాన వంచి
కుస్తరించి రాజును కూర్చుండ నుంచెను
పిన్నమామలకు అల్లుడా! బిరుదుగల
రాజు!
పెద్దమామలకు అల్లుడా! పేరుగల
రాజు !
వినవయ్యా నా మరిది నీకు విన్నవించేను
ఆజ్ఞాక్రమున వక రాజుకు అగ్రువంచ
రాదు
సావిడిన వక రాజుకు సలాము
శాయరాదు
యలమంచిపట్నము యేలితిమి
యిదివరకు
వోరుగంటి శంభుని తిరుణాల మనము
సేవించ వస్తిమి
ఆడశర మొగశర శరాసూరగా
కొల్లబెట్టి
పారిపోయి కొందరు వలసగాడేరు
రచ్చను మనమాట యిచ్చనాడేరు
సభయందు మనమాట సొకజేసేరు
పాలకీలు కొల్లబోయినా పశువులు
కొల్లబోయినా
అందలాలు కొల్లబోయిన అర్థము
కొల్లబోయిన
మీవంటి రాచకొమాళ్ళకు అపకీర్తిగాక
మావంటి స్థిరషండులవారికి మరియేమి
లేదు
ఆ మాటలకు కరియావులరాజు తల
వాలవేసె

"సురియను గుడార్లుకాడ వుంచి
వొరలు వోరుగంటి తర్లిపోతేను
వొరల మీదికి వక రాజు వాదుకు
వస్తేను
సురియలేని వొరకు ఏపాటి కాంతి
వుండునే బావ"
"నీవు సురియవంటివాడవు కాగానే
మరది
గుడార్లుకాడ వుంచగలిగింది
మేము వొరలుకాగానే మరది
వోరుగంటికి తర్లిపోయేది"
"చంద్రుని గుడార్లు కాడ వుంచి
సుక్కలు వోరుగంటికి తర్లిపోతేను
చంద్రుడు లేని సుక్కలకు ఏపాటి
కాంతివుండునే బావ!"
"నీవు చంద్రుడంటి వాడవు కాగానే
మరిది
గుడార్లుకాడ వుంచగలిగింది
మేము చుక్కలు కాగానే మరిది
వోరుగంటికి తర్లిపోయ్యేది

"ఎన్ని దినములు చూతు బావ! ఎన్ని
గెడియలు చూతు బావ!"
"మూడు దినములు చూడు మరిది,
మూడు గెడియలు చూడు మరిది
అయిదు దినములు చూడు మరిది,
అయిదు గెడియలు చూడు మరిది"
"మూడుదినములు చూడనే బావ,
మూడు గెడియలు చూతుగాని
అయిదు గెడియలు చూతుగాని,
అయిదు దినములు చూడను బావ
ఏడు దినములు చూడను బావ, ఏడు
గెడియలు చూతునుగాని
ఎనిమిదో గెడియకు రాకపోతిరైన
తొమ్మిదో గెడియ సొరిది చొచ్చేటివరకు
వొరలు బోయిన జాడన సురియవంటి
వాడు
సురియవంటివాడు శూరుడు వచ్చేని"
పుల్లావుల కేశవయ్యకు కరియావుల
రాజుకు
సన్నజంబుల వీరబయట గుడార్లుకాడ

ఇల్లడజేసె బావ పల్లికొండ
పాలకీలు వున్నావి పశువులు వున్నావి
ధనధాన్య వస్తువులు దండి భాగ్యం వున్నాది
నిండిన సంపదలు దండి భాగ్యములు
సన్నజంబుల వీరబైట సంపద గుడార్లు చాల వున్నావి
ఆడవారున్నారు, అర్థం వున్నాది
బాలబుద్ధులు విడచి బంధువుల పోషించు
కదసి వక రాజు కయ్యమునకు వచ్చును
పెనగి వక రాజు పెనుపోరుకు వచ్చును
వరసి వక రాజు వాదుకు వచ్చును
నన్ను కాదని వుండు నా చిన్నమరది
వయిగోపరాజులు పయికొని వచ్చిన
నన్ను కాదనివుండు నా చిన్నమరదీ"
అని పిలచి బుద్ధులు చెప్పి ప్రియములు నొసగి

## యాదవవీరులు ఓరుగంటి శంభుని సేవింప బయలుదేరుట

ఆడనుండి అయితమరాజు తగదర్లి వచ్చి
స్వామికి వస్తువాహణాలు తర్లించుకోని
మూడు లక్షల వరహాలు మూడు వేల ఆవులు
మూడు పోతుటెద్దులు మున్నూరు కోడెలు
పందుము బంగారి పువ్వులు స్వామి పాదకానిక కదిలె
ఏడుకట్ల బిల్వపత్రి యేదుము మహిసాక్షి
వదలక శివలింగ పస్త్రాలు మొదలు
గంగమైలావులు కోడెలు కదిలె
స్వామికి కానుకమాడలు తర్లించుకోని
పాలాభిషేకానికి పశువులు కదిలె
స్వామివస్తువాహణాలు తర్లించుకొని
అయితమరాజు యెక్కెను అంసలపల్లకి
పల్లికొండ యెక్కెను పచ్చలపల్లకి
పుత్తమరాజు యెక్కెను పూవల నీలాన్ని

## పట్టాభిరుద్రుడను యాదవవీరులకొరకు అలుగుల సింహాసనము నేర్పాటుచేయుట

వోరుగంటి పట్నానికి వచ్చేవరకు
వోరుగంటివారు, పొనుగంటివారు
గవిలికొండ వారు, గవిచెర్లవారు
గబ్బివిరోధులు,
హజ్జారము కొలువుచావడి ముందర
మూడు నిల్వాలలోతు క్రుంగ తొవ్వించి
అలుగులు మీదుగాను, పరుజులు
కిందుగాను
అలుగుల వీరధర్మ సింహాసనము
మైదుగావించి
అలుగులమీద మంచి సన్నజముకాణము
పరచి
మల్లెలు మొల్లలు మంచి విరజాజులు
చామంతి రేకులు చెండుమల్లెలూను
పువులతో ధర్మ సింహాసనము
మైదుకావించి
ఏనుగుపొడువు అడ్డతెర పట్టించినారు
పదహారుమంది మంచి బోడికెల
కావిళ్ళు పెట్టించి
వోరుగంటివారు యెవ్వరైన వచ్చి
పువ్వుల ధర్మసింహాసనము యెక్కి
తావుపాతర్లోను దుముకపోతారని

కావిలవారికి కని చెప్పినారు.
ఎర్రి గొల్లరాజులు యేరి యేరనుచు
ఎర్రి గొల్లరాజులు యింకా రాకపోయిరి
శంభుని తిరుణాల చాలునని మళ్ళి
తిరిగి పోయినారేమో
ఎల్లచేనుగుమీద రయితాంగ మాయెను
పట్టాభిరుద్రుడు
పుట్టకోట బయటికి భూపతి ఎదురేగి
వచ్చెను
సాదండ పాలకిలు తగ్గించినారు
పట్టపేనిగెను దిగెను పట్టాభిరుద్రుడు
స్త్రిరమందులవారు దిగిరి పాలకీలు
జముకాణము పరపించి చదురు
ఏరుపరచి
వారిచేతి తాంబూలం వీరందుకొనిరి
వీరిచేతి తాంబూలం వారందుకొనిరి
అంతట పట్టాభిరుద్రుడు ఆడె
నొకమాట
"మీరున్ను మేమున్ను
గోత్రదాయాదులము
ఆవులపోలురాజు మాకు అయ్య
గానలెను

అయితమరాజు మాకు అన్న గావలెను
స్తిరమందుల పల్లికొండ మాకు బావ
గావలెను
పుత్రమరాజు మాకు మరది గావలెను"
అని వరసక్రమాలు అటు తెలుపుకోని
సౌదండ పాలకీలు తర్లించుకోని

వోరిగంటి పట్నానికి వొచ్చిరి రాజులు
అజ్జారం సావిడికి అతివేగ వొచ్చిరి
పువల సింహాసనముకాడ నిలిచిరి
రాజులు
అంతట పట్టాభిరుద్రుడు ఆడె నొక
మాట

## పట్టాభిరుద్రుడు యాదవవీరులతో కపటప్రీతితో మాటలాడుట

"వినవోయి బావ! బావ పల్లికొండ!
వినవోయి అన్న! అయితమరాజు!
శివనందులగలవాడు శిముడు పోలురాజు
దేవపూజలు గలవాడు దేముడు
పోలురాజు
మనతండ్రి పోలురాజు మనభూమికి
వచ్చిననాడు
ఈ పూవుల వీరధర్మ సింహాసనము
ఎక్కి

ఏడుగడియలు వోరుగంటి పట్నము
ఏలినాడు
మగిడి వారిపట్నానికి పోయిన
నాటినుండి
అటువంటి పోలురాజు ఎక్కిన
సింహాసనము
మేము ఎక్కరాదనుచు
ఈతీరున పూవులతో పూజ
చేస్తూవున్నాము

## సింహాసనముపై కూర్చుండుడని పట్టాభిరుద్రుడు యాదవవీరులను ప్రార్థించుట

వారిసంతతి మీరు తర్లి వచ్చినారు

ఈ పూవుల వీరధర్మ సింహాసనం
ఎక్కి

వోరుగంటి పట్నం ఏడు గడియలు
ప్రతిపాలన శాయవలె మీరు"
శిఖావుంగరము తీసి అనుతమరాజు
ఓటికినేల వుంచి
పట్టపుకత్తి తన చేతికి అందిచ్చినాడు
అంతట పువుల వీరధర్మ అలుగుల
సింహాసనం
కన్నుల జూచెను హరిగురువు పల్లికొండ
అలుగులయింది పల్లికొండకు తన
ఆత్మమందు తెలిసి

అస్త్రకాండ్యాల పరిగిస వారి అయ్యల
దలచి
షేడెప వరిగిస వారి మామల దలచి
తన మెడనున్న తొలసి వనమాల
ముమ్మారు చెంబులో అది ముంచినాడు
ముమ్మారు అందులోని జలము
ప్రోక్షించినాడు
బొల్లావు బసవన్నను బోరున దలచి

## పల్లికొండ అలుగుల సింహాసనమును పూవుల సింహాసనముగా మార్చుట

వినవోయి పగవారి పుక్కుటలుగులారా!
మాలో ఎంత పదును వున్నదో
మీలో ఎంత తెగువ పరాక్రమం వున్నదో
వాదించిన విశ్వకర్మ తానెరుగు
ఇతరులు నీ పదును ఎరుగచెప్పతును
అని యిట్లు అలుగుల ఆడినాడు
హరిగురువు పల్లికొండ
అలుగులు తిరిగి చక్రబాణాలాయె
అలుగులు శిలద్దాయె పరుజులు షీదాయె

శనేశ్వరుడు నేడిచట బద్ధవారికి పెరిగి
సాహాయ్యమైవచ్చును
వలపట పుత్తమరాజు దాపట పల్లికొండ
నందిదేవుని వలెను నడమ అనుతమ
రాజు
ముంటిమీద పువులు మొలచినరీతి
పుక్కుటలుగుల మేడెము వురువడిన
భూమికి క్రుగ్గద్రొక్కినాడు

# అయితమరాజు ఓరుగంటి సింహాసనమెక్కి ధర్మ పరిపాలన చేయుట

పగవారి భూమంత ప్రతిపాలిస్తూ
వున్నారు
విప్ర మానేలు పురోహిత మానేలు
రెడ్డిమానేలు తలారిమానేలు
పగవారి భూమంత పట్టిస్తూ వున్నాడు
ధారాగ్రములుగా ధర్మజుడు అయితన్న
వూళ్ళు వూళ్ళుగానే పల్లెలు పల్లెలుగానే
పట్నాలు పట్నాలుగానే పట్టిస్తువున్నాడు
ధారాగ్రతములు పట్టిస్తువున్నాడు
ధర్మరాజు అయితన్న
కాయకూరలు లేక కలుపుసముర్లు లేక
కావిలి రుసుములేక కరిణీక వర్తనలేక
వెట్టికొట్నంబు ఏమిలేకుండ
ఏకచక్రాధీశ్వరుడై ఏలెన భూమి
ఆ పట్నము ఏలేటి సవరణ జూచి
అంతట పట్టాభిరుద్రుడు ఆలోచన
చేస్తూవున్నాడు

ఇంతకూ గొల్లరాజుల హారిమైన
శయరాదు
ఇప్పుడు గొల్లరాజుల హారిమైన
చేస్తిమైన
మన పట్నానికి మోసమొచ్చునో
మనకు మోసమొచ్చునో
ఇంతకు గొల్లరాజుల గుట్టుగా
పోని స్తిమైన
మన పట్నానికి జయమౌను; మనకు
జయమౌను
అని యిట్లు పట్టాభిరుద్రుడు అనిన
మాటలకు
దాడికోరువాడు గతిలికొండ
నలసింగిరాజు తగ దర్లివచ్చి
పట్టాభిరుద్రునితో ఆడె నొకమాట

## ఓరుగంటివారు యాదవవీరులకు విషాన్నము పెట్ట దలచుట

"వుక్కుటలుఁగులు గాగ వారికి
సహాయమైవచ్చెను
వారికి వీక నొక్క సూత్రమున్నది
రూక రూకెత్తు విషాలు గొని
వీరావులవారి దిమాణమందు విందు
కావి స్తిమైన
విషాలు జోంచేసి గొల్లరాజులు
విడుతురు ప్రాణాలు
అని యిట్లు నలసింగిరాజు ఆడె
నొకమాట
రూక్కు రూకెత్తు పావుకు పావెత్తు
మాడకు మాడెత్తు వరాకు వరాఎత్తు
వరాహాలు ఎచ్చుపోసి విషాలు గొనిరి
మీగడ పెరుగులు మిరిపాంబరములు
కమ్మని కజ్జాయము పిండివంటలును
రసిరస సావిళ్ల రాజ అన్నమూలు

పరమాన్నములు కూరకాయలు బహు
పిండివంటలు
అరిసెలు పెసలపప్పు అల్లము
మొదులు
పేరిన నేతులు బెల్లపు చారులు
వీరావులవారి దిమాణమందు
కాలకోటి విషాలతో అన్నిము
కావించినారు
కజ్జాయముతో అన్నము కావించినారు
కూరకాయల్లో విషాలు కుంచెరుగులో
విషాలు
కాలకోటి విషాలతో అన్నము
కావించినారు
విషాలకు ప్రాణం వున్నదో లేదో
అని
ఎలక్కాయంత అన్నము ముడి
గట్టించినారు

## విషాన్నము తిని పట్టాభిరుద్రుని పట్టపుటేనుగు చచ్చుట

ఏడు తరాలనుండి పట్టాభిరుద్రుని
పట్టపున వున్నది ఎల్ల వేనుగ

ఏనుగతొండానికి అన్నము
అందించినారు

తొండాన దీసుక ఏనుగ
భుజియించగాను
ఎలికొండ పర్వతంవలె ఏనుగ కూలె
తన్నుక తన్నుక తాను పొర్లాడి
కన్నులప్రాణము గ్రక్కున విడిచె
అంతట వోరుగంటివారు గల్లున
నవ్విరి
సప్పట్ల గొట్టిరంత జాతకము లాడిరి
ఎలకా యంత అన్నము తిని ఏనుగ
కూలె
విషాలు బోంచేసి గొల్లరాజులు
విడుతరు ప్రాణాలు
చిక్కిరి గొల్లరాజులు మన చేతులో
దక్కె భూషణాలు
అని యిట్లు పట్టాభిరుద్రుడు నలసింగి
రాజు ఆలోచన జేసిరి
వంటయింట్లో కుందేలు మనకు
వుండు చందంబాయె
అని యిట్లు వోరుగంటివారు
ఆడు మాటలకు

అజ్జారము కొలువు చావిడికొచ్చెను
పట్టాభిరుద్రుడు
"వినవె వో బావ!బావ పల్లికొండ!
వినవే వో యన్న! అయితమరాజా!
ముందు మీ పెద్దలూ మా పెద్దలూను
పీరావులవారి ధిమాణమందు
పుల్లకూర అన్నము బోంచేసినారు
ఇప్పుడు మీరున్న మేమున్న
సవబంతిగా అన్నము బోంచేయవలెను
అని యిట్లు పట్టాభిరుద్రుడు అనిన
మాటలకు
అంతట పల్లికొండ ఆలోచనచేసి
పగవాడు అన్నము పెట్టుతామంటేను
బోంచేయవలెను
అని చదురు గుప్పున దుమికిరి
ముగ్గురురాజులు
పీరావులవారి దిమాణానికి తగదర్లి
వచ్చిరి

## ఓరుగంటివారు దివాణము వాకిండ్లముందు కావుపాతర్లు త్రవ్వించుట

పీరావులవారి దిమాణానికి ఏడు
దరవాజులు గలవు
ఏడు దరవాజులుకాడ ఏడు
కావుపాతర్లు తొవ్వించినారు

వొక్కొక్క దరవాజకాడ పదహారు
మంది బోడికెలు కావిళ్లు పెట్టించినారు
ఇనపరోకళ్ళ వారిచేతికి అందిచ్చినారు
అక్కడ విషాలు బోంచేసి గొల్లరాజులు
ప్రాణాలు పోయిపోక
మత్తున గొల్లరాజులు సొక్కుతూ
వస్తువుంటేను
ఇనప రోకళ్ళతో కొట్టి కాపు
పాతళ్ళలో పడదోస్తి రణన
వారి వొళ్ళనున్న సొమ్ములు మీకు
దక్కాలు అనిరి
ఆడనుండి గొల్లరాజులు
జలకము కూటానికి తగ దర్లి వచ్చిరి
జలకము కూటమున జలకమాడినారు
నామతీర్థము కూటాన నామతీర్థము
లాడినారు
సంధ్యజపము కూటమున సంధ్య
జపములు తీర్చిరి
భోజనపు శాలలకు పొందుగా వొచ్చిరి

అందముగా అరిటాకులు ముందర
నిడిరి
పప్పుతో పదివేలు శాకపు కూరలు
కావించినారు
నూనెతో నూరువేలు పిండివంటలు
కావించినారు
అన్నము వడ్డించిరి అతివేడ్కతోను
వోరుగంటివారు ప్రత్తేకం వొక భంతి
యలమంచిరాజులు ప్రత్తేకం భంతి
విషాలు అన్నము గొల్లరాజులకు
అమృతాన అన్నము వోరుగంటివారికి
ఇక్కడ వడ్డించినవారు అక్కడ
వడ్డించినట్టే వున్నది
అక్కడ వడ్డించినవారు ఇక్కడ
వడ్డించినట్టే వున్నది
కలసి మెలసినట్లు అన్నము
వడ్డించినారు
అన్నానికి సెలవు హరిగురువు
పల్లికొండ

## పల్లికొండ విషాన్నమును అమృతాన్నముగా మార్చుట

అన్నమువంక చూచెను హరిగురువు
పల్లికొండ

విషమయింది పల్లికొండకు తన
ఆత్మయందు తెలిసి

అస్త్రకాండేల వరిగిన మేనమామల
దలచినాడు
కాండ్యాన వరిగిన కన్న తండ్రిని
తలచెను
దూర్వాసు మహాముని శాపముచాత
త్రుళ్ళితిరి మీరు
నీరు తుంగయు చాత మీరు
నిర్మాలమయితిరి
తొల్లి ద్వారకాపురము నేలిన
దోర సైన్యములార
పగవారి భూమిన మీరు మాపాల
రావలెను
అని బొల్లావు బసవన్నను భోరున
తలచెను
శ్రీకృష్ణరాయుణ్ణి ముందుగా వేడి
కంసబాధలు పడలేక కడు
వేడ్కతోను
రేపల్లెవాడలో దాగేటినాడు
బూతకి చనుమొనలను విషాలు గొంచు

కాలకోటి విషాలు చన్నులకు
కూర్చుకొని
వలవేసి రేపల్లెవాడ శోధించి
చన్నిచ్చి నిన్ను చంపవలెనని
వచ్చిననాడు
నీకు విషాలు విరిగి అమృతాన ఎట్లా
కలసివచ్చెనో
ఆవిధాన మాకు విషమిరిగి అమృతాన
కలసిరావలెను
అని తనమెడనున్న తొలసి వనమాల
ముమ్మారు చెంబులో ముంచి ముమ్మారు
అన్నముమీదను ప్రోక్షించినాడు
విషాలు విరిగి అమృతాన కలసివచ్చెను
వారికి
అన్నము బోంచేసి అస్త్రములు కడిగిరి
వయ్యాన ఎంగిళ్ళు వడిచిన వెనుక
తాంబూలం అందరికి తగవేడ్కతోను
అందిచ్చిరి
చదురు సింహాసనానికి వారు తర్లి
వొస్తూవున్నారు

## కావుపాతర్లకు కావలియున్న బోడికలు తామే అందుకూలుట

వారు వచ్చేటి సింహరాకడ చూచి
కావుపాత ర్లకాడ కావుళ్లు వున్న
బోడికెలు

వారివారి కావుపాతర్లో వారు
దుముకుతున్నారు
సందుగొందులు జరగబోయినను

తలుపురెక్కలు తగిలి తలలూడి
మొండెములు
పీటుపోటు లేక కత్తినరుకు లేక
వాకొక్క ధరవాజాకాడ
పదహారుమంది బోడికెలువారిగిరి
ఆడనుండి గొల్లరాజులు పువ్వుల
పీరధర్మ సింహాసనానికి
ధర్మ సింహాసనానికి తగదర్లి వచ్చిరి
సింహాసనమెక్కిరి ముగ్గురు రాజులు
అంతలో పట్టాభిరుద్రుడు
ఆలోచనపడెను
"పెద్దలనాటి వుక్కుటలుగులు వూరికే
పోయె
ఏడు తరాల నుంచి వున్న ఎల్లబేనుగ
వారిగె
ఇంతకు గొల్లరాజుల హరిమైన
చేస్తిమైన
మనకు మోసమొచ్చునో మన
పట్నానికి మోస మొచ్చునో"
అని యిట్లు పట్టాభిరుద్రుడు అనిన
మాటలకు
గవిలికొండ నలసింగరాజు వగ
దర్లివచ్చి
"వినవోయి పట్టాభిరుద్రుడ : నా
విన్నపము నీవు
అమరులే యాదవులై పుట్టినారు

సురులే గొల్లలు సురకాంతలే
గోపికాస్త్రీలు
పంచమహావేదములు కామధేనువులై
పుట్టెను
వేదాలే కామధేనువులు వేదసారము
లేగలు
ఆదివిష్ణువు వారి మందలో ఆవు
అయిపుట్టెను
మల్లికార్జుని కోడె మచ్చలఋసవన్న
పుట్టి వున్నది
మంచిమంచి మలలు జొచ్చి
మదసమైన వేళ్లు
తెచ్చి నమిలి మింగిన గొల్లరాజులు
వారు
శీతాకాలం ఆర్నెల్లు వారిమందలు
కొండలు కులగిరి పర్వతాలయందు
వుండును
వేళకు వారికి భోజనము లందరక
చెట్టుకు బొక్కడాకు చెలముకు
గుక్కెడు నీళ్లు
తాగి బతికిన గొల్లరాజులు వీరు
ఏ చెట్టాకుబలమో ఏ చెలమునీళ్ళ
బలమో
వారికి విషాలు విరిగి అవప్రాన
కలసి వచ్చింది
వారికి ఇక నాకక్క సూత్ర మున్నది

వారు మగ్గురున్నారు
వకడు అసాయశూరుడు ఆజానుబాహు
డొకడు
అలోచనపరు డొకడు
వాణ్ణి గనుక మన వుక్కురెక్కల
గరుడా గంధర్వ తేజీమీద
ఎక్కిస్తిమైనే
ఏడుఏడు సముద్రాలకు ఎగిసి
ఎగిసి ఎక్కడనైనా ఎళ్ళి వస్తాది
వాటికి తలుపుదీసిన తెరవౌను
సన్నజంబుల వీరబయలు"
అని యిట్లు నలసింగిరాజు ఆడు
మాటలకు
వోరుగంటినిగల మంగలకత్తులు
దెప్పించినారు
కొత్తసానలు బట్టించి కత్తులు పల్లడా
గావించినారు
ఈకె ఈకె సందునా రెక్క రెక్క
సందునా
మంగలకత్తులు దాపించినారు
జాతుమెత్త పల్లము చీకుది కళ్లెము
ఎక్కినపుడు పల్లము జారిపోవలెను
కళ్ళెము తెగిపోవలెను
కత్తికొక కండగాను కొండవతె
ఆ రాజు
మన కండ్ల ముందరనే కూలి
పోవలెను

## ఓరుగంటివారు యాదవవీరులను గరుడాగంధర్వ తేజీఅశ్వాన్ని ఎక్కమనుట

అని అశ్వాన్ని శృంగారించినారు
వోరుగంటివారు
అశ్వానికి రౌతు ఏడి? హరిగురువు
పల్లికొండ?
అశ్వానికి రవుతు నా కొలువున
వున్నాడు
అశ్వాన్ని దెప్పించు అజారముసావిచికి
అని యిట్లు పల్లకొండ ఆడు
మాటలకు
పదహారుమంది బోడికలు
పట్టుతాళ్లతో అశ్వాన్ని పట్టించుకోని
మోకాళ్లతో అశ్వాన్ని నడిపించు
కొంటూ

అజారము కొలువుకు అశ్వాన్ని
దెచ్చిరి.
అశ్వాన్ని కన్నుల జూచెను
హరిగురువు పల్లికొండ
నలుగుర్లో కూర్చుండే నా చిన్న
తమ్ముణ్ణి
లేలెమ్మంచే ఏమి కోపమొచ్చునో గాని
మంచితనానికి లేలెమ్మన్న కోపమేను
చెడుతనానికి లెమ్మన్న కోపమేసు
అని తమ్ముని మొకారబించము[1]
తప్పక చూచెను

## అశ్వమునెక్కుటకు పుత్తమరాజు సిద్ధమగుట

అన్న చూచిన చూపులకు పుత్తమ
రాజుకు తన ఆత్మయందు తెలిసి
తిమురుచు లేచి పుత్తమరాజు ధీరత
సింహమురీతి
లగువు చల్లడము బిగువుగా
దొడిగినాడు
కనక పూవల దట్టి కాశగా గట్టి
వలపట పైడికుప్పె వంకిమర జెక్కి
దాపట పైడికుప్పె జముదాళము
తొడిగి
చంద్రకావి రుమాల చాతబట్టినాడు
అన్నకొలువుకు పుత్తమరాజు అధికొని
వచ్చె
మరి రెండు అస్త్రాల మనిమికి నిలచి
'వినవోః వో యన్నః అన్న పల్లికొండః
పగవాడి తేజికడకు పాలుపడి పోతాను
ఏడుగెడియలకు వస్తునే అన్న
పల్లికొండః
ఏడుగెడియలకు నేను రాకుంటినైన
నాకు ఎత్తించివుండేటి కత్తుల గుడారి
మీద
కాకులు మూకలై వురులాడునన్న
చేకొని పుత్తమరాజు అశ్వముమీద
చెల్లెనని మన్నించవన్నః
అదిగాక నేను ఎక్కేటి ఇంద్రనీలము
వున్నది అన్నః
నేను ఎక్కేటి పువ్వులనీలము వున్నాది
పదిలముగా సీతావున భద్రము
శాయవన్నః
సీతావున తేజీని భద్రము
శాయ లేకుంటే

1. ముఖారవిందము

సన్నజంబుల పీరజయిటికి
కరియావులరాజు కొలువుకు పట్టి
పంపించవన్న
ఆటకు పంపించను నీకు ఎఱము
లేకుంటె
నీచాత వుండేటి మూడుజానల
ముప్పిరి సురియతోను
ఏటారు తునియలుగా అశ్వాన్ని
తెగటార్తు వుగాని
పగవాడిచాత అశ్వము పట్టుబడితేను
మన పంతానికి తక్కువ మన
సూరోత్మానికి[1] తక్కువ
మన బంట్రోతు మర్యాదకు తక్కువ
చేతిలో చెయ్యిబెట్టి అశ్వాన్ని చెప్పి
వప్పగించె
చెంబులో వుతకంబు చాత ప్రోక్షించి
పగవాడి తేజీకడకు పాలుపడి వచ్చెను
కుడిచెయ్యి లోగాను వలంపూరి
తిరిగెను
వారి పోసి అశ్వానికి వందనము చేసి

"వుక్కు రెక్కల గరుడ
గంధర్వ తేజీ:
వినవో పగవారి అశ్వమా:
నీలో ఎంత సూరింత్రము[2]న్నదో
నీలో ఎంత పరాక్రమున్నదో
నీలో ఎంత కోపమున్నదో
అంత పరాక్రమం నామీద వుండ
జూపుదువుగాక
ఇతరమైన పిలికిపట్టు పట్టబో"కనెను
అని అశ్వాన్ని ఎకెను పుత్తమరాజు:
అంకెములో పాదము
కుదరదొక్కినాడు
కుడి అంకెములో పాదము కుదితి
కుదరక తలకె
పదారుమంది బోడికలు పట్టుతాళ్లు ఆడ
సళ్లు విడిచినారు
రెపరెపా అశ్వము రెక్కలు వార్చి
నాది
సురగాలికి వొగురాకు ఎగురు
చందమున
ఎగిరెను అశ్వము సతాఏడు యోజనముల
పొడుగు
అంబరీదులకు[3] పోయిన తర్వాత

1. శూరత్వానికి 2. శూరత్వము
3. అంబరవీథులకు

## పుత్తమరాజు అశ్వము నెక్కుట

కుడి అంకెము పాదము కుదర
దొక్కినాడు
ఎక్కినపుడు చూచినారు వోరుగంటి
వారు
ఎగిరినప్పుడు చూడలేదు
వడివిడిచి తొలకరి మెరుపాయె
అశ్వము
తనచాత కంసి దీసుకోని
చటీన చటీన చెటించగాను
గిరగిర తిరిగెను అశ్వము కిందు
మీదుగాను
గతిని కుమ్మరిసారెవలె తిరిగెను
అశ్వము
నటునాలుగు సముద్రాలు
వక్కతివ్వన తిప్పుకొచ్చె
అందున వదలడు పుత్తమరాజు
బల్లివలె ఎన్నున పాకెను రాజు
తనచేతి కంసి దీసుకోని
చెట్టీ చెటీన చెటించెను రాజు
అలసి సొలసి తేజి అపుణ్యడాయె
మొయిటలో సిల్లతాగె మొక్కళపు
తేజి
పంబగాళ్లతో అశ్వము పాతుకొని
నిలచె
కొండవల ఈ రాజును ఇక్కడ
కోలుపుచ్చలేము
అని అశోనచ చేసి రెక్కల తేజి

## అశ్వము పుత్తమరాజును సప్తసముద్రాలు త్రిప్పుట

తూర్పుసముద్రాలకు అవుతల పాల
సముద్రము కద్దు
పాలసముద్రాల జివ్విగెడ్డన
గండభేరుండాల పక్షులు గలవు
గండు తుమ్మెదలు ఏనుగను ఏనుగ
మీది మావటీణి
పిల్లమేతలకు తన్నుకపోవును
అటువంటి గండభేరుండాలకు గండు
తుమ్మెదలకు

పిల్లమేతలకు ఇచ్చిపస్తును
ఈ పుత్తమరాజును
అని తూర్పుసముద్రాల బాటలు
పట్టెను రెక్కల అశ్వము
అశ్వము ఆలోచన పుత్తమారాజుకు
తన ఆత్మమందు తెలసి
తన పాలపూరి మెట్ల చెన్నురాయుని
భజన జేసినాడు
వో హో నిటనకూరి శ్రీచెన్న కేశవ
నమ్మినాను నీ నామము
నమ్మినాను నీ నామము పట్టినాను
నీ పాదము
పట్టినాను నీ పాదము పెట్టినాను
నీ తిరుమణి
నారాయణ నీ తోటి నామము చేసి
నియ్యదు దివ్వెతిరుమణి
నీవు ఇుచ్చిన ప్రాణాలు నీకు
వప్పగించెదను
అని యిట్లు పుత్తమారాజు ఆత్మ
తలపోయగాను
తూర్పుసముద్రాన ప్రత్యక్షమై
వున్నాడు
పుత్తమారాజు ఆలాపన పూరిమెట్ల
చెన్నుడికి
సన్నప యేజునాగమై యానుల
బడ్డాది

నా వరాన పుట్టిన నరపుణ్య చిలుక
నా కుమారుడు పుత్తమారాజుకు
ఏమి ఆపద వచ్చెనో! ఏమి ప్రాణానికి
వొచ్చెనో!
నన్ను భజన చేస్తూ వున్నాడు అని
పచ్చని చిలుక రూప మెత్తి రివ్వున
వచ్చి
రాజుకుడిభుజమున వ్రాలె
పూరిమెట్ల చెన్నరాయుని కులాంగి
పక్షిణి తుమ్మెదరూప మెత్తి
రివ్వున వచ్చి యెడనుభుజమున వ్రాలె
ఎత్తి ఏడు మణువులు అశ్వముమీద
ఏసినట్లాయె
ఏడుకొండలు దీసి అశ్వముమీద
ఏసినట్లాయె
తూర్పుసముద్రాలకు పోయేటి
రెక్కల అశ్వాన్ని
వాగములో చెయివేసి వోరుగంటి
బాటలు చూపెను
దాని కండలు గుండెలు కసిగండ
లాయెను
గుండెలు పేగులు పగిలి గుమ్మడి
దబ్బలవలె కుదపలు
వోరుగంటి పట్నాన దుముకుతున్నవి
ముక్కున కండ్లను ముకినెత్తురుబ్బి
ఏనుగుతొండము లావున రక్తధారలు

భూమికి లోకిస్తు వున్నాది
టంగువారు బిగువ పటమోపున
వోరుగంటికి అశ్వము వస్తువున్నాది
వోరుగంటివారు పానుగంటివారు
పట్టాభిరుద్రుడు గవికొండ
నలసింగిరాజు
అలోచన చేస్తువున్నారు
కొండవల యీ రాజును ఎక్కడనో
కోలుపుచ్చి వస్తు వున్నాది
ఏ వరకాన ఏసెనో, ఏ వాగున
ఏసెనోకాని
ఏ మానిమీద ఏసెనో,ఏ మండ మీద
ఏసెనో
ఆ రాజు కండలు గుండెలు దుముకు
తున్నావి
ఆ రాజు రక్తధారలు భూమిమీద
దుముకుతున్నావి
వాడు వక్కడే వుండింది అసహాయ
శూరుడు
ఆలోచన తెలిసినవాడు ఆజాన
బాహుడొక్కడు
ఆ వొక్కడు తేజిమీద చెల్లి
పోయినాడు
ఇక తలుపుతీసిన తెరపు సన్నజంబుల
వీరబయలు

ముగ్గుర్లో వకడు పోయె,యిద్దరు
ఇక్కడ చిక్కారి
ఎదిరించే బంటు లేడు,సదరాన జెట్టి
లేడు
సన్నజంబుల వీరబయలు అని
చరాసూరగా
సన్నజంబుల వీరబయలు కొల్లబెట్ట
వలెనని
అయుధ ము స్త్రీబు అవుతు వున్నారు
వోరుగంటి వారు
అ సమయమున ఏడు గెడియలు మిత
వుంచి పుత్తమరాజు
ఆరో గెడియకు అశ్వాన్ని అజ్ఞారాన
దుమికించె
అన్నకొయివుకు పుత్తమరాజు ఆదికొని
వచ్చెను
అలసితివో తమ్ముడా:సొలసితివో
యనుచు
తన చాతవున్న చంద్రకావి రుమాల
తొను చిరిచెమటలు తుడిచి
కుస్తరించి తమ్ముణ్ణి కూర్చుండనుంచి
పదహారుమంది బోడికెలు వచ్చి
అన్నాన్ని చెప్పేటివరకు

## పుత్త్రమరాజును మోయలేక ఉక్కురెక్కల అశ్వము చచ్చుట

తన్నుక తన్నుక తాను పొర్లాడి
కన్నుల ప్రాణము తేజి గ్రక్కున విడిచె
విలవిల తన్నుక అశ్వము విడిచె ప్రాణాలు
మక్కువతో పట్టాభిరుద్రుడు మంముసుకు పెట్టెను
తలుపు తీసిన తెరవాయె వోరుగంటి పట్నంబు
అప్పుడు పట్టాభిరుద్రుడు గోడుగోడున అడిలె
ఏడునెల్ల పిండాన్ని తెచ్చి ఎత్తిపెంచితిని
పాలు తాగేనాడు పాలు పోసి సాకితిని
వుగ్గు తాగేనాడు వుగ్గు బోసి సాకితిని
కూడు తినేనాడు కూడు పెట్టి సాకితిని
సాధ్యానికి రాని కులపగలు నా
రెక్కలతేజి సాధ్యానికి తెచ్చును
ఏ డెబ్బైయేడు దేవదుర్గాల వారు వచ్చిన
ఏ అరవై ఆరు కరపట్నాల వారు వచ్చిన
ఏ నుప్పైమూడు మన్యసావిళ్ళవారు వచ్చిన
ఏ కంచు కణింగాల [1]వారువచ్చిన
ఏ గజా కళింగాలవారు వచ్చిన
ఏ రాయకణింగాలవారు వచ్చిన
ఏ రత్నకణింగాలవారు వచ్చిన
ఆ తేజివార్త వింటేను
పడిగుడిగి వారి మందిరాన వుండంగ సాగిరి
వోరుగంటి మీద కత్తి వెత్తనే వెరుతురు
సాడికోరు చెప్పిన నలసింగి రాజుకున్ను
యలమంచి గొల్లరాజులకున్ను
బారిగొర్రె ఆయెను నా రెక్కలతేజి
ఏడుతరాలనాటి ఎల్లటేనుగ వరిగె
వోరుగంట నగుర వున్న వుక్కు సురియలు అన్ని పాడాయె

1. కళింగాల

సీమ భూములు అన్ని ధారాగ్రతాలకు
పోయెను
ధన కళజాలు ధాన్య కళజాలు
ధారాగ్రతాలకు పోయెను

అని గోడుగోడున పట్టాభిరుద్రుడు
గోడు కుడవసాగెను
కుడికంటి పుతకము కుంభద్వార
మాయెను
ఎడమకంటె పుతకము ఏరులై పారె

## పట్టాభిరుద్రుడు శంభుని సేవకు యాదవవీరులకు సెలవొసంగుట

వో వో యని పట్టాభిరుద్రుడు
వలపోవ సాగె
సచ్చిన తన సౌద్దాగ మృతము గావలె
బ్రతికిన తన సౌద్దాగ బ్రతకవలె
సోడికోరు మాట లినరాదు
వింతకు గొల్లరాజుల హరిమొన
కాయరాదు
యలమంచి గొల్లలకు శంభుని
తిరుణాలకు శలవు శలవు అని పలికె
శలవన్న తర్వాత కూలిసింహాసనం
మీద కూర్చుండ తగదని
పట్టాభిరుద్రుడు యిచ్చిన శికాయ
వుంగరము, పట్టపు కత్తి
కాశీ చదురుమింద పారవైచినారు
చతురు గుప్పున దుమికిరి ముగ్గురు
రాజులు

స్వామికి వస్తువాహనాలు తర్లించుకొని
సన్నుత వీథులగుండ రాజులు తర్లి
వస్తువుండగాను
అలనాడు మార్కండల మునేశ్వరుడు
శాపదత్తము చాత
గచ్చగోరింత కదనల్లి వున్నది
శివుని గాలిగోత్రాలు కానరాలేదు
పేముబెత్తము పెనగొని వున్నది
శివుని గాలి గోత్రాలు కానరాలేదు
మూడు వేల కామాటాన్ని ముందర
విడిచినాడు
గచ్చగోరింత కడబడ శోకిస్తు
వున్నాడు
అయితమరాజు పోయినంతదూరము
మారుకొండల మునేశ్వరుడు శాపము
తొలగి పారిపోతు వున్నాది

## యాదవవీరులు శంభుని సేవించుట

శంభుని దేవళం ద్వారంబు జొచ్చిరి
పదివేల విధముల శివున్ని
అయితమరాజు ప్రార్థన శాయగాను
తొలగెను దోషములు వచ్చె పుణ్యములు
యాపకాయంత లింగిమై ఘోరుగంటి
శంభుడు
అయితమరాజుకు ప్రత్యక్షమాయె
పానవట్టముతోను పరమేశ్వరుని యెత్తి
యేదంవు జమకాణము వెలయ
పరపించి
జముకాణముమీద శంభుని వుంచి
హోమ కలశములతోను అగ్నిములు
దెచ్చి
అమరేశ్వరునకు జలకంబు లార్చి
సాంబ్రాణి ధూపములు చయ్యన
వేసిరి
పాతపూజలు దించిరి పరమేశ్వరునకు
కొత్తపూజలు జేసిరి కొమరప్ప
శంభునికి
కట్టించిరి వస్త్రములు ఘనత తోడుతను
సాంబ్రాణి పొగలు సొమండలాలు
గప్పెను

గుగ్గిలపు పొగలు గుళ్లకెగదట్టె
కర్పూరపు మంటలు గాలిగోప్రాలు
దాటె
కానుకమాడలు పోయించినారు
స్తంభాన కోడెల కట్టించినారు
పాలాభిషేకానికి పశువుల తోలిరి
మూడు లక్షల వరహాలు ముడుపులు
చెల్లించిరి
మూడు వేల ఆవుల దేవళానికి దోలిరి
ముందర మండపమున మున్నూరు
దివ్వెలు ఎత్తించినారు
ఎనక మండపమున ఏనూరు దివ్వెలు
ముట్టించినారు
నడిమి మండపాన నన్నూరు దివ్వెలు
ఏప్రొద్దు శివరాత్రి జాగారము
ఏడ్కతో సేవించి
నందుల నిలిపినారు సందుసందులాను
ఆలాటి వడ ఒడికెలు అలనాటి
మొక్కుబళ్ళు అటుతీర్చినారు
తీర్థప్రసాదాలు అందిరి వల్లవుల
అయితమరాజు

స్తిరమందుల పల్లికొండ, పుత్త్రమరాజు ఆ రాత్రి శయనుని దేవళాన
భోజనాలు జేసిరి పొందుగా నపుడు నిద్రించినారు

## కరియావులరాజు తమవారిని వెదకికొనుచు బయలుదేరుట

తల్లన తెల్లవారి బాలసూర్యుడు
వుదయించేవరకు
సన్నజంబుల వీరబయళ్లకు తరలి
వచ్చేటివరకు
సన్నజంబుల వీరబయట
కరియావులరాజుకు
ఇచ్చిన మితము అటు తప్పిపోయె
తిమురుచు లేచెను ధీరత సింహంబురీతి
బుద్ధిగల నా మరిది పుల్లావుల
కేశవయ్య
వోరుగంటు ఏమి కాగాక పనులు
ఆయనో యెరుగ
ఏమి దుర్మార్గములు నడిచెనో యెరుగ
ఏమి కలహాలు పుట్టెనో తెలియలేదు
వారలు పోయి వోరుగంటు పట్టుబడ్డారు
వారల శేషకొచ్చేను వో చిన్నమరది
పాంతీలు వున్నావి పశువు లున్నావి
తవధాన్య వసువులు దండిభాగ్యం
వున్నాది

ఆడవారు వున్నారు అర్థమున్నాది
నిండిన సంపదలు సన్నజంబుల
వీరబయట వున్నావి
పదిలాన కాచుకుండు నా చిన్నమరిది
చుట్టు పగవారు నడమ వోరుగల్లు
వోరుగంటి సరసన మన
వలసలున్నావి
వరసి వక రాజు వాదుకు వచ్చును
కదిసి వక రాజు కలహానికి వచ్చును
పెనగి వక రాజు పెనుపోరుకు
వచ్చును
నన్ను కాదని వుండు నా చిన్నమరది
అని పుల్లావుల కేశవయ్యకు
సన్నజంబుల వీరబయలు విల్లడ[1] జేసె
చెంబుతో[2] పుటకంబు చాత[3]
ధూపంబు
పిల్లబంటును పిలచి భీకర తన తేజీని
తేతెమ్మని విన్నవించె

1. ఇల్లడ, 2. చెంబు, 3. చేత

పదహారుమంది బోడికెలు పరువున
వచ్చి
పట్టుతాళ్లతో అశ్వాన్ని తెస్సి
బంధించుకోని
మోతాళ్ళతో అశ్వాన్ని నడిపించుకోని
కరియావులరాజు సముఖానికి
అశ్వాన్ని దెచ్చిరి
కుడిచెయ్యి లోగాను వలంపూరి తిరిగి
వారు పోసి అశ్వానికి వందనము జేసి
అంకెములో పాదమేసి అశ్వాన్ని
యెక్కెను
ఢమ్మన కరియావులరాజు
డాల్గడ యెత్తించినాడు
ఫెల్లున కరియావులరాజు పెట్లు ముట్టిం
చినాడు
వట్టిమందు బోసి పెట్లు కాల్పించె
గుబుల్ గుబుల్ మని మందు పొగ
గుప్పించగాను
మందుపొగలో అశ్వాన్ని మరియు
దుమికించె
దుమికించె అశ్వాన్ని దుమ్ములు యెగర
దుముకు జజౌకు అశ్వాన్ని దుమికించు
కొంటు
మచ్చరమున తేజీని మసిలించుకొంటు
పొదదుప్పి పిల్లవలె పొదిలించుకుంటు
మచ్చల మేకపోతువలె మసిలించు
కుంటు
ఆడ ఆడకు తేజీని ఆడించుకొనుచు
కచ్చకు కాలుదువ్వుతు వస్తువున్నాడు
కరియావులరాజు
ఏ పాలిగాడు కండ్లబడిన ఏ పాలికాపు
కండ్లబడిన
ఏ పసలవాడు కండ్లబడిన
కొట్టి పేనబోరు పెట్టవలెననుచు
అని కరియావులరాజు కదిలి రాగాను
పాలిగాడు కండ్ల పడలేదు,
పసలగాడు కండ్ల పడలేదు
పాలికాపు కండ్ల పడలేదు
సీమకు దొడ్డవాడు సింగమ
భేతాళుండు
సింగమభేతాళుండు వేయించిన చిన్న
పువ్వులతోట
రాజు వచ్చేటి రాధారికి అడ్డముగా
వుండెను
తోటకాడ ఏ విధాన వున్నదంటేను
గురువు బేతాళుడు తోటకు యేతాలు
యెత్తెటివారు
గురువు బేతాళుడుకి పువులు కోసేటి
వారు

గురువు బేతాళునికి పువులు చెండ్లు
కట్టేటివారు
ఆ పూల తోట జొచ్చి రాజు ఎత్మున
సవ్వె
కలిగెరా కయ్యము పెనిగెరా పోరు

పెనిగెరా పెనుపోరు యీ పూపల
తోటలోను
అని కంచెవార అశ్వాన్ని గ్రక్కున
నిలిపినాడు.

## శంభుని సేవకు పువ్వుల నిమ్మని కరియావులరాజు బేతాళుని తోటకాపరుల నడుగుట

వోరి తోటబోడికెలార! వోరన్నలార !
నా కన్న చిన్నలారా! నా తమ్ములార!
నాకన్న పెద్దలార! నా యన్నలార!
పువ్వలకు నేను మహ యేడుకకాణ్ణి
వోరన్నలార!
అదిగాక శంభుని తిరుణాల
సేవించపోతాను
శంభునికి వక చెండు నాకు వక
చెండు
నాకు వక చెండు, నా అశ్వానికి వక
చెండు
పూవుల చెండు కట్టి యిమ్మనెను
అని యిట్లు కరియావులరాజు
ఆడినందుధులకు

అదిరిపడి బోడికెలు ఆకాశమందిరి
మిట్టిపడి బోడికెలు మిన్ను
అందుకొనిరి
ఎవడోకాని వంటిగుర్రపు రవుతు
వక్కడెవడయా వచ్చి
పువ్వల తోటకాడ మహ
కేరుచున్నాడు
మాటకుమాటకు రారా పోరా అనే
వాక్యమే కాని
ఇతరమైన మాటలు లేవు ఆ రాజుకు
బేతాళుడు తోట వెళ్ళింది మొదలు
మనము కావిలి కాసింది మొదలు
మన తండ్రి బేతాళుని పరాక్రమము
చూచి

మనముల రారా పోరా అని పిలసింసి
లేదు
అని యిట్లు కొందరు బోడికెలు
కంటసము లాడిరి
అందులో కొందరు బోడికలు
యిట్లగని పలికిరి
రారా పోరా అంటేను మన వాసి
తరగదు
రారా పోరా అంటేను అన్నతమ్ముని
మారు
రావోయి పోవోయి అంటేను
బావమరదుల మారు

దీనికి కొరత యేమి వోరన్నలారా!
చెప్పగ వినలేదేమో ఆ రాజుకు
చెవుల పండువుగాను
బేతాళుడు వేయించిన పూవల తోట
వైనము ఆ రాజుతో జెప్పి
బేతాళుని పరాక్రము[1] బేతాళుని
పటోతాపము[2]
ఆ రాజుతో చెప్పి, వచ్చిన దోవ
పట్టుక తర్లి పొమ్మనుడా!
దాదాసి బోడికెలు దగ్గిరికి వచ్చిరి

## బేతాళుని బోడికలు కరియావులరాజుకు పువ్వుల నియ్య నిరాకరించుట

వంటిగుర్రపు రవుతువు, వక్కడవు
రాజు!
పసిబిడ్డ బాలుడవు, బాలరాజువు నీవు
ఈ తోట పువ్వులు అడగ నీకేల?
వాదు నీకేల? వద్దు పోవయ్య!

చావు నీకేల? చాలు పోవయ్య!
వచ్చిన దోవ బట్టుక నీవు తర్లి
పోవయ్య!
తూర్పున వున్నాడు! తుమ్మి బళవి
రాజు

1. పరాక్రమము. 2. ప్రతాపము

శంభుని తిరుణాల సేవించ వచ్చును
తోట వరుసుక వచ్చును, తోట
వరుసుక పోవును
ఆ రోజు యీతోట పువులు
అడిగింది లేదు
ఇందమని యీ తోట పువులు
మేము యిచ్చింది లేదు
పడమట వున్నాడు బళ్ళాని రాజు
శంభుని తిరుణాల సేవించ వచ్చును
తోట వరుసుక వచ్చును, తోట
వరుసుక పోవును
ఆ రోజు యీతోట పువులు
అడిగింది లేదు
ఇందమని యీ తోట పువులు
మేము యిచ్చింది లేదు
వుత్తరాన వున్నాడు వురి బీమరాజు
శంభుని తిరుణాల సేవించవచ్చును.
తోట వరుసుక వచ్చును తోట
వరుసుక పోవును

ఆ రాజు యీతోట పువ్వులు అడిగింది
లేదు
ఇందమని యీ తోట పువులు మేము
యిచ్చింది లేదు
దక్షిణాన వున్నాడు ధర్మచోడాని
శంభుని తిరుణాల సేవించ వచ్చును
తోట వరుసుక వచ్చును తోట
వరుసుక పోవును
ఆ రాజు యీతోట పువులు అడిగింది
లేదు
ఇందమని యీ తోట పువులు మేము
యిచ్చింది లేదు
బేతాలుని పరాక్రమము బేతాలుని
పటోతాపము తెలిసి
వచ్చిన దోవ బట్టుక వారు తర్లి
పోయినారు
పువులు చాలు నీ పుణ్యము చాలును
నీవు వచ్చిన పని చూచుక తర్లి
పొమ్మనిరి

## కరియావులరాజు బోడికలను పడగొట్టి పూలు కోయించుకొనుట

ఆ మాటలకు కరియావుల రాజు
ఆగ్గుడ్డై మండి
తెల్లని కన్నులకు తెచ్చె రక్తంబు
వెండి గాచి సెవల్లో* పోసినట్లాయె

---

* చెవులలో

గుప్పించి శూలాల గుమ్మినట్లాయె
తరమి శేషని తోక త్రొక్కినట్లాయె
కాలు సయిగజేసి అశ్వాన్ని కంచె
దుమికించె
పదహారుమంది బోడికెల పట్టి
వక్క పెడచాత విసరె
నెత్తురు గ్రక్కుచు బోడికెలు నేలపై
వరిగిరి
కళదెలసి బోడికెలు గ్రక్కున లేచి
మరి రొంతు అస్త్రాల మనిమికి
నిలిచిరి
తన దగ్గిర వున్న పిల్లబోడిక చాత
నెటు నెట్లుమని మెడబట్టి నెట్టించినాడు
పోయి మీయబ్బ బేతాళునికి
చెప్పుకొమ్మనెను
అందరిని పువలతోట గమిని యెల్ల
నెట్టించినాడు
తన దగ్గిర వున్న పిల్లబోడికె చాత
కంటికి కోరిన పువులు కోయించినాడు

గుణము శాలలు మంచి గుజ్జుమాడి
కింద
రత్నకంబళి పరచి
రత్నకంబళి మీద పువులు రాసి
పోయించి
ముదమొప్ప అ రాజు మూడు
చెండ్లు తా గట్టె
తన అశ్వానికి చెండు తన
ఆయుధానికి చెండు
వోరుగంటి శంభునికి వక చెండు
మూడు చెండ్లు గట్టి కడగ వర్జించి
చిక్కి మిగిలిన పువులు పొన్నుగా
బోయించి
అశ్వాన్ని సవారి విడిచె నారాజు
వుప్పునీళ్ళ బావులు వుళ్ల
ద్రొక్కించినాడు
మంచినీళ్ళ బావులు మ్రగ్గ
ద్రొక్కించినాడు

## బేతాళుని పువ్వులతోటను కరియావులరాజు ధ్వంసము చేయుట

పొన్నలు, పొగడలు, పోకవృక్షాలు.
అరటి, కొమ్మ్రపనస, అల్లనేరేడు
మోదుగ, కలజువ్వి. మొగలి' సంపంగి
నారికేళపు వృక్షాలు, దేవదారి, వారిజము
దేవకాంచనము

దానిమ్మ, గజనిమ్మ, ద్రాక్ష, రుద్రాక్ష'
మందార, బూరుగ, మహిసాక్షి తరులు
మారేడు, వెలగ, కణగి, చింతయు' మోము
బొండు మల్లె, లన్నిట బొగ్గుల గలసెను
గుజ్జుమావిళ్లు నేల కూల త్రొక్కించి
మారేళ్ల నేరేళ్ల మట్టిపాలు జేసి
శ్రీరామ మాల్యవనము చిందిందులాయె
ఎలరేగి యేడు చాళ్ల దున్నిన దుక్కివతెను
తోట నేలపాలు జేసె
ఎనకటికి తొలకరించి వానలు గురిసి
ఏర్లు విడిచి విగిరించి పూవులు పూసి
పువులు జేతాళునికి తర్లిపోతాయని
చిక్కి మిగిలిన మొక్కలు వేళ్లతో తీయించి
పడమట గెడ్డపై వేయించె రాజు
అశ్వాన్ని గుజ్జుమామిగికింద లాయాన కట్టించె
వువ్వుల పాన్పుమీద పవళించె రాజు
పదహారుమంది బోడికెలు వోరుగంటి పట్నానికి తర్లి పోయినారు
బేతాళుడు సాముచేసేటి గరడి మొగసాల
గరడి మొగసాల గమిని ముందర నిలచి
అగ్గులు గురియించు బోడికెలు అడె రొకమాట
చదువేల? బేతాళు!సాము నీకేల?
ఇద్దేల?బేతాళ!బుద్ధి నీకేల?
పంజబంటుకు నీకేల బవిరి గెడ్డంబు?
కోనబంటుకు నీకేల కోరమీసంబు?
రోతబంటుకు నీకేల రొమ్మున జంజంబు?
పిరికి బంటుకు నీకేల తోడుపు జముజాలి?
యవ్వడోకాని వంటిగుర్రపు రవుతు వక్క దే వడియ
వచ్చి నీ పూవల తోటకాడ కేరుచున్నాడు
భేతాళుని వాసమంటే బెదరించినాడు
గొప్పమాటలు ఆడితే ముమ్మల కొట్ట వచ్చినాడు
అని యిట్లు బోడికెలు ఆడు మాటలకు
అదిరిపడి బేతాళుడు ఆకాశ మంటెను
మిట్టిపడి బేతాళుడు మిన్నందుకొనెను
కొలువులో కొందరిని కొట్టి దుమికించి
వురువున పందిళ్లు వూచి పడదోసె
జారుబండన జారి జీరుబండన నిలచి

జీరుబండన జారి జారుబండన ద్రొక్కి
తొమ్మిది మూళ్లది తోడుపు జముజాలి
కరువాలు వరదీసి కత్తి జళిపించె
కలిగెరా నా సురియకు నరామాంసంబు
నేడు
వాడు ఏ రూపు ఏ రేక
ఏ చక్కదనము
ఏ ప్రాయము గలవాడు ఎగిరింపు
మనిన
ఎంచంగ పెంచంగ ఏడేళ్ల బాలుడు
పక్కలు మీటితే వానికి పాలుగారీని
చెక్కిళ్లు మీటితే తేనె లొలికీని
నొసలు మీటితే బాలుడికి చిన్నప్పుడు
తాగిన వసలు గారీని
పసిబిడ్డ బాలుడు ఆ బాలరాజు
వడసి పట్టుకుంటే వక చేతిలోకి
చాలడయ్యె
ఎనకటికి నీచేత ఏమి వుపద్రవం
వచ్చునో యనుచు
నీ తావుకు వచ్చి మనవి చేసినాము
అని యిట్లు బోడికెలు అనతీయగాను

## కరియావులరాజును పట్టి తెమ్మని బేతాళుడు బోడికల నాజ్ఞాపించుట

ఎత్తితే సరీసమానమైన వారిమీద
కత్తి యెత్తవలెను
పసివానిమీద కత్తి ఎత్తేది ధర్మంబు
గాదు
పసికాయ కొరికితే ఫలమేమి లేదు
ముదురుకాయ కొరకవలెను ముచ్చట
తీరవలెను
పండుకాయ కొరకవలెను దాని ఫలము
చూడవలెను
వానికి పంచయిదు ప్రాణాలు గలవు
నాలుగు ప్రాణాలు నా తోటకాడ
వప్పగించండి
వొంటి వూపిరితోను తలకాయ చిక్కి
వుండేటట్టుగా తాపము సేయుడా
వాడి శిరసుమీద నా పాదాలు వుంచి
శ్రీరామ మాల్యవనానికి నేను తర్లి
వచ్చేను
ఏడు సెలవులిచ్చి ఎర్రపోగులు ఇచ్చె
మూడు సెలవులిచ్చి తన వేలి ముద్దు
టుంగర మిచ్చె

తాంబూల మిచ్చి బోడికల తర్లి
పోమ్మనెను
ఆడనుండి బోడికలు అతివేగ వచ్చిరి
ఏదుల పోలిసెట్టి యింటికి ఏతెంచి
వచ్చిరి
శీకాయ వుంగరము లక్కడ
కుదవుంచినారు
తాంబూలమందిరి తగ వేడ్కతోను
ఆడకాడకు బోడికలకు మరో
ఆలోచన పుట్టెను
రాగాను రాగాను బోడికలకు మాటలె
మెండాయె
అందులో కొందరు బోడికలు
ఆడిరొక మాట
ఇనరోయి తమ్ములార! నా
యన్నలార !
బేతాళుని తోట వేసిందిమొదలు మనము
కాసిందిమొదలు
ఎన్నడు గజనిమ్మ వృక్షము పూత
పుయ్యలేదు
కాయ కాయలేదు పండు పండలేదు
పండు పండలేదు మన ఫలానికి
రాలేదు
నేటికి పూతపూసి, కాయ కాసి,పండు
పండింది

ఆ పండును వకరిని కాదని వకరు
ముచ్చలించకుండ
వకరిని కాదని వకరు దొంగిలించరాదు
వకరిని కాదని వకరు అటవరించరాదు
వకరిని కాదని వకరు ఆరగించకుండ
బ్రాహ్మడి పాదములు ముట్టి బలిపీట
గొట్టిరి
బాస ప్రమాణాలు చేసుకున్నాను
వాని శిరస్సునకున్న కిరీటము
మారి స్త్రిమయిన
వోరుగంటి ప్రతాపరుద్రుని తూర్పు
దోవన పంపించి
వోరుగంటి పట్నము దొరతనము
శాయగలము మనము
ఆ రాజు బుజమున వున్న భుజకీర్తులు
మారి స్త్రిమైన
పన్నెండువేల సిబ్బంది మనముల
పట్టి కొలిచేరు
ఆ రాజు ఎండుత్ర[1] పై దుత్ర[2]జంజాలు
మారి స్త్రిమైన
ఇరువయినాలుగు వేల శిబ్బెంటీలవారు
మనముల పట్టి కొలిచేరు
ఆ రాజు అయిదువేళ్ల వుంగరములు
అ స్త్రకడియాలు మారి స్త్రిమైన

1. వెండి ఉత్తర. 2. పైడి ఉత్తర.

అరవై వేల గై జీతము అండబాయక
యందురు
ఆ రాజు చిటికినేల వున్న శికాయ
వుంగరము మారి స్త్రిమైన
అలుబిడ్డలు గలవారికి అరవై అయిదు
వేలకు గ్రాసానకు చాల వున్నది
అని యిట్లు బోడికలు పూవుల తోట
కాడికి వచ్చిరి
పువ్వులతోలు బోడికలు కన్నుల జూచిరి
అల్లకల్లోలమై పూవలతోట అపసి
కృంగింది
తరాలనాటి పూవలతోట ధరణి
పాలాయె
పెద్దలనాటి పూవలతోట పెనురవ
ధూళి యెగిరె

చిన్నలనాటి మాల్యవనము
చిందింధులాయె
పడమటగాలికి పూవల తోట రవధూళి
యెగురుతున్నది
కన్నులార చూచిరి పదహారుమంది
బోడికలు
ఎదానవున్న నల్లగుండెలు బోడికలకు
ఏడుదబ్బలై పగిలి
రాజు పవళించి వుండేటి గుజ్జుమామిడి
కాడికి తగ దర్లి వచ్చిరి
త్రుళ్లిపడి మేలుకొని రాజు తునియుడై
లేచి
చానాసేపు నిద్రబోతిమే యనుచు
అల్లంత ప్రొద్దున అరిజాము వేళ
కొండంత ప్రొద్దున గోత్రాది వేళ
మాయన్న సముఖానకు పోవలెననుచు

## బోడికలు కరియావులరాజుతో కయ్యమునకు సిద్ధమగుట

అంకెములో పాదమేసి అశ్వాన్ని
ఎక్కబోగాను
కళ్లెములో చెయివేసి బోడికలు
కదలకుండ బట్టిరి

"వచ్చినందుకు పోయినందుకు గురుతు
వుండవలెను"
అని యిట్లు బోడికలు ఆడుమాటలకు

"ఏమి గురుతు వుండవలెనోయి
వోరన్న బోడికలార?"
"ఈడైన పందెము మాకు ఈడు
కట్టవలెను,
జోడైన పందెము మాకు జోడు
కట్టవలెను"
"ఏమి పందెము వొప్పమంటారోయి
వోరన్న బోడికలార?"
అనిన మాటలకు బోడికలు
అప్పుడిట్లనిరి
"పిడుగుద్దులాటకు వచ్చేవా వో
బాలరాజు?
వంటరి జగడానికి వచ్చేవా వో
బాలరాజు?
దొమ్మిపోట్లుకు వచ్చేవా
కరియావులరాజు?
కత్తిసాధనకు వచ్చేవా
కరియావులరాజు?
గరిడి పరువడికి వచ్చేవా వో
బాలరాజు?
పిల్లపట్లుకు వచ్చేవా వో బాలరాజు?"
అని యిట్లు బోడికలు ఆడు మాటలకు
ఆ మాటలకు కరియావులరాజు
అప్పుడిట్లనియె.
"పిడుగుద్దులాట అనేది నేను చూడనే
లేదు
వంటరి జగడ మనేది మా వంశాన
లేదు
దొమ్మిపోట్లు అనేది ఆ దోవ నాకు
తెలియదు
కత్తిసాధన అనేది నాకు కలలోన
లేదు
గరిడి పరువడి అనేది ఆగాయకము
నాకు తెలియదు
పిల్లపట్టు అని వకటి చెప్పితిరి మీరు
మీరు చెప్పిన పంద్యములు నాకు
వక్కటి తెలియలేదు
పిల్లపట్టు అనేది కొంచెము తెలిసి
తెలియక వున్నాది
అది యెట్లాగు అంటేను, మేము
కొలాన గొల్లవారము
శీతకాలము ఆరునెలలు మా మందలు
కొండలు కులగిరి పర్వాతాల యందు
వుండును
ఎండకాలము ఆరునెలలు మా మందలు
వూరిదాపున వుండును
ఇంటికాడ నుండి మందకాడికి
పోదును
వంగి జవురుకుంటె అయిదారు పిల్లలు
చిక్కును
మా మందకాడనుంచి మా యింటి
కాడికిన్ని

మా యింటికాడనుంచి మందకాడికిన్ని
వక సంకన ఆయిదుపిల్లలు వక
సంకన అయిదుపిల్లలు
రోషాన బట్టుమను రొమ్ము నారుపిల్లల
పదహారు పిల్లల పట్టి మోసుంటిగాని
ఇతరమైన పిల్లపట్టులు నే నెరగ" ననెను
'గొల్లడు గొల్లడు' అని బోడికలు
గల్లున నవ్విరి
సప్పట్లు గొట్టిరంత జాతకము లాడిరి
"వూరులో మాను మనకు వుండు
చందమాయె
అణకములో పోక ఆయె నీ రాజు
చిక్కములో పిట్టవలెను చిక్కెను
గొల్లరాజు
చిక్కెను గొల్లరాజు మన చేతులో
దక్కె భూషణాలు
వంటింట్లో కుందేలు వుండు
చందంబాయె
ఎమ్మెలకు బెట్టినాడు ఇన్ని
భూషణములు
కలిగి వుండంగ బెట్టినాడు ఇతడు
గంపెడు సొమ్ములు
తల్లిదండ్రికి యీడు వక్కడే
వసిగొయ్య
మందకాడ బెట్టినారో యే బందికాడ
బెట్టినారో

అంత రొఖ్ఖం ఖర్చుచేసి ఈ అశ్వాన్ని
కొన్నాడు
తల్లి దండ్రి మాటలినక భూమ్మీద
తర్లి వచ్చినాడు
పూవల తోటకాడ మన చేతులో
సచ్చుటకొరకు
బ్రహ్మ వ్రాసెనేమో
యీ బాలరాజుకు"
అని యిట్లు బోడికలు ఆలోచన చేసిరి
"ఆ పిల్లపట్టు పట్టు తావుమాకు సెలవు
ఇస్తావు" అనిరి
"చిన్నప్పుడు పట్టిన పట్టు నాకు తెలిసి
తెలియక వున్నాది
'తిరుగార మకరపట్టు 'పట్టు"మనె
రాజు
కాలుసయిగ కనుసయిగ జేసుకున్నారు
పట్టిన పట్టుతోనే యీ రాజు ప్రాణము
గడచి పోవలెను
ఈ రాజు వల్లనున్న సొమ్ములు మనకు
దక్కాలు కావలెను
అని 'తిరుగార మకరపట్టు' అనే
పిల్ల పట్టు పట్టిరి గొల్లరాజును
హరి అనలేదు, శివా అనలేదు
నారాయణ అనలేదు నరసింహా
అనలేదు
అమ్మా అనలేదు అబ్బా అనలేదు

తనపాలి కాగొర్ల తెలుగురాయుణ్ణి
మతిని దలచినాడు
పులి దాకిన గూటము వలెను పూగ
కుండాను
మలచి వేసిన రాయివలె మాట్లాడ
కుండ
కదలక మెదలక కాళ్లాడకుండ
పూరికే వుండెను ఆ బాలరాజు
వారు పట్టిన వక మకరపట్టు బిగువుకు
వారి వారి శరీర రోమాలగుండా
చిల్లుచిల్లున రక్తము చిమ్మించి పారె
వారి వారి చేతులు బిగువులు బిట్టినావి
వారి వారి పట్లు వారు సళ్ల బడచినారు
నరుడు గాడురా యీడు
నర పెరుమాళ్లు ఏమో
నరుడు గాడు యీడు
నరసింహమూర్తి
గొల్లడు గాడు యీడు
గోపాలకృష్ణుడేమో
గొల్ల గాడురా యీడు
గోయిందమూర్తి
ఈ రాజుచాత వక బాస
ప్రామాణకము
తీసుకోక యితని జోలికి పోరాదు
అనుచు

ఎదురేగి ఏడు అడుగులు ఏతెంచి
వచ్చి
మరి రెండు అస్త్రాల మనివంకి నిలచి
బోడికలు ఆడి రొక మాట
"వినుమీ వో బాలరాజు విక్రమశాలి!
మీకు ప్రాణానికి వస్తేను మీరు ఏమన
వలెను?
మాకు ప్రాణానికి వస్తేను మేము
ఏమనవలెను?"
అని యిట్లు బోడికలు ఆడు మాటలకు
"నాకు ప్రాణముమీదికి వస్తేను
మేవు మేవు అందును
నాపట్లు సల్లరోయి నాయన్నలార!
మీకు ప్రాణానికి వస్తేను మేవు మేవు
అనుడి
మీపట్లు సల్లువిడిచేను నిజముతా నేను"
అని తలమీద సెయ్యి వుంచె
ఆ బాలరాజు
సత్యంబు జేసెను ఇక తప్పడు రాజు
అని తిరుగార మకరపట్టు పట్టిరి
రాజును
ఎడమ అస్త్రము ఎడమ పాదము
ఎలిగడ వుంచినాడు
కుడి అస్త్రము కుడి పాదము లోగడ
వుంచినాడు

అస్త్రకాండ్యాల చెల్లిన వారి అయ్యల
దలచినాడు
మేడేన వరిగిన మేనమామల
దలచినాడు

బొల్లావు బసవన్నను బోరున దలచె
తనపాల కాగొర్ల తెలుగురాయుణ్ణి
భజన జేసినాడు

## కరియావులరాజు బేతాళుని బోడికలను చంపుట

కుడి సంకన అయిదుగుర్ని కుదరంగ
బట్టి
ఎడమ సంకన అయిదుగుర్ని
ఏడ్కృతో జేర్చి
రోషాన జేర్చెను రొమ్ము నాఢుగుర్ని
తల్లిదండ్రి చేసిన ధర్మంబు వలన
ఆలుబిడ్డలు చేసిన అదృష్టంబు వలన
సందు సంకగుండ వక బోడికను
జారవిడచినాడు
పదియేను మందిని పట్టుబట్టేటివరకు
వారి యెముకలు విరిగెను, గుండెలు
పగిలెను
మ్రేవు మ్రేవు అనే కూత మరి
వెళ్లకుండ
ములక్కాయలు వలె గుడ్లు
వెళ్లనొక్కినాడు
పెరుగు బుడ్లువలె శిరసులు పగల
వత్తినాడు

ఝల్లున బోడికల ధరణిపై విడిచె
పడమట తలవాలుగ బోడికల
పండబెట్టినాడు
వుంచి జోలలు పాడి వొచ్చి
జోగొట్టగాను
ఈ పూవలతోట ఏసింది మొదలు
మీరు కావిలి కాసింది మొదలు
మీరు కంటార నిద్ర ఎరుగరు మా
యన్నలార !
కరియావులరాజును చంపేటి వరకు
కంటికి నిద్ర మీకు పట్టక పోయెనా?
కరియావుల రాజును చంపితిరి మీరు
ఇకనైన కన్నులార నిద్రించండోయి
వో రన్న బోడికలార
అని వూచి జోలలు పాడి, వూచి
జోకొట్టగాను
పదియేను మందిని పూవల తోటలో
బోడికల గోరీలు పెట్టించినాడు

సందు సంకగుండ పక బోదికను
జారవిడిచినాడు
ముందర వున్న మెడపూస ఎనక్కు
తిప్పినాడు
మీ యబ్బ బేతాళునితో
జెప్పుకొమ్మనెను
స్నానమాడు జలధిలోకి తాను
పోయినాడు
స్నానమాడి రాజు చెంగావి ధోవతులు
కట్టి
అంకెములో పాదమేసి అశ్వాన్ని
ఎక్కెను
కాలు సయిగజేసి అశ్వాన్ని కంచె
దుమికించె
వాగెతాళ్ల జవురించి వోరుగంటి బాటలు
చూపెను అశ్వానికి
వోరుగంటివారు పానుగంటివారు
గవిలి కొండవారు గవిచెర్లవారు
వై యాలు తోలేటి వై యాలు
వీరబయిటికి
వీరబయటికి విడిచెను అశ్వాన్ని
మింటికి రవధూళి జంటగా గమ్మె
ముత్యాల అంగళ్లమీద ముంచె
రవధూళి
వజ్రాల అంగళ్లమీద వాలె రవధూళి
పగడాల అంగళ్లమీద పట్టె రవధూళి

రత్నాల అంగళ్లమీద రాలె రవధూళి
చేడెల జల్లిపావట్లమీద చేరె రవధూళి
కాంతల కొప్పులమీద కమ్మె రవధూళి
వోరుగంటి [illegible] వొచ్చె
రవధూళి
బేతాళుడు సాము జేసేది కత్తుల
గెరిడికి కమ్మె రవధూళి
రవధూళె కాని రాజును కానరాలేదు
మహంధూళె కాని మన్మథుని
కానరాలేదు
వోరుగల్లు ఏలేటి పట్టాభిరుద్రుడు
వాన గాలి లేని వట్టి రవధూళి కప్పిన
కారణమేమో
వాయువేగమున బోదికను కోటబురుజు
ఎక్కి చూడమన్నాడు
"వాన గాలి లేదు వట్టి రవధూళికాని
రవధూళికాని రాజును కానరాలేదు
మహంధూళికాని మన్మథుని
కానరాలేదు"
అని యిట్లు బోదిక అతివేగ జెప్పెను
ఆడనుండి కరియావులరాజు అతి
వేడ్కతోను
శూరుల గమినికాడికి అశ్వాన్ని
సూత్రానపట్టి విడిచినాడు
చుక్కవలె విడిచెను చక్కని అశ్వాన్ని

## బేతాళుని బిరుదులవద్ద కరియావులరాజు అశ్వము ఆగిపోవుట

నీచుడ కట్టిన బిరుదులు అశ్వముమీద
నీడలు పారెను
పంబ కాళ్లతో అశ్వము పాతుకొని
నిలచె
కాలు సయిగ జేసె కరియావులరాజు
ఎనక లగువే కాని అశ్వానికి ముందర
లగువు లేదు
కమిచి సయిగ జేసె కరియావులరాజు
ఎనక లగువే కాని అశ్వానికి ముందర
లగువు లేదు
కాలు సయిగ జేస్తే అశ్వం కంచి ఏడు
పట్నాలు
కంచి ఏడు పట్నాలు కాల్చి ధ్వంసము
చేసి వచ్చును
వాగెతాళ్ల సళ్ల విడిస్తేను అశ్వం
వారధులు దాటును
అలనాడు వోరుగంటికి వచ్చేటినాడు
పారు లేదు
వోరుగల్లు పసలవాడు బంటు అని
చెప్పెను బావ పల్లికొండ
బావమాటలు ఈ తేజికి బాకులై
నాటెనేమోను
చేకట్టు వాకట్టు కలవారు వోరుగంటి
వారు అని చెప్పిరి
కీలుకీలు అశ్వాన్ని బంధించిరేమో
పగవాడు భూమిలో నన్ను పాతుతాయ
దలచాడు
అని కరియావులరాజుకు కోపంబువచ్చె
తెల్లని కన్నులకు తెచ్చె రక్తంబు
వెండి గాచి చెవుల్లో పోసినట్లాయె
ఇంతట అశ్వాన్ని వుంచనే తగదు
ఏటూరు తునియలుగా అశ్వాన్ని
తెగటార్తుననుచు
తనకు పట్టి వుండే భూచక్రగొడుగులు
కడకు వర్జించి అశ్వాన్ని ఖండించ
బోగాను
సన్నపు పైరగాలి ఆకాశవీథిన రివ్వున
దోలెను
గంటలు మువ్వలు అందెలు ఘణఘణ
వాగెను
నాలుగు దిక్కులు చూచి రాజు నటు
మిర్రు చూచె
నీచుడు గట్టిన బిరుదుల నీడలుచూచెను
అశ్వాన్ని కడబడ దుమికె నా రాజు

చెక్కిళ్ల తా నొక్కి చేరి ముద్దాడె
కంఠంబు తా గొట్టి కడు మెచ్చుకొనెను
నాకు దెలియని ఏకాంతము నీకు
తెలిసెనే జక్కిదేవతా!
నాకు తెలియని మనోభావము నీకు
తెలిసెనే జక్కిదేవతా!
నాకు తెలియని ఆలోచన నీకు
తెలిసెనే జక్కిదేవతా!
శిరసున సింహకిరీటము గల రాజును
నేను
పగవాడి బిరుదుకింద దూరి పోతూ
వుంటిని
అని తనదగ్గర వున్న పిల్లబంటును
పిలిచి
అనుమంతుని జీవళాన అశ్వాన్ని
కట్టివేయించె రాజు
వోరుగంటివారు పానుగంటివారు
పగడసాలాడేటి పగడసాల సావిళ్లకు
వచ్చెను
వారితో పందెము వప్పె నారాజు
వొకటి రెంటున వారిని వోడనే దోలి
"వినరోయి అన్నలార! నా యన్నలార!
గమిడిన కట్టివున్న దాని పేరేమి?
అలగాడి కాదు,పలగాడి కాదు
కొత్తగా గట్టిన మరి పేటి కోడెల
గాడి కాదు

తలుపు పలకలు గాదు,దారబంధాలు
కాదు
బోనగిరి కొయ్య కాదు బోనకావిడి కాదు
గొంకబెదరు కాదు కోళ్లబెదురు కాదు
కుక్కబెదరు కాదు నక్కబెదరు కాదు
గమిడిని కట్టివున్న దాని పేరు చెప్పమని
పలికె
దానితో పోరేలనయ్యా? దానితో
పొందు నీకేలనయ్యా?
దానితో మాట నీకేలనయ్యా?
ఆడుమా పగడసాల ఆడుమని
పలికిరి
అదికాదు అన్నలార నామనవి వినుడీ
మాయన్న అయితమరాజు, మాబావ
పల్లికొండ
నామరది పుత్తమరాజు
శంభుని తిరుణాల సేవించ
పోయినారు
వారి తావుకు నేను తర్లిపోవలెను
దానిపేరు నాకు చెప్పమని పలికె
దానిపేరు మేము చెప్ప వెరుతుమయ్యా
దాని కట్టించినవాని పేరు చెప్ప
వెరుతుమయ్యా
ఆ గమినికాడ వున్నారు
పదహారుమంది బోడికలు

వారి తావుకు పోయి అడుగుమని
పలికిరి
అడనుండి కరియావులరాజు
తగదర్లి వచ్చె
శూరుల గమినికాడ శూరుడై నిలచె
రారోయి నాకన్న చిన్నలార!
నా తమ్ములారా!
నాకన్న పెద్దలార! నా యన్నలార!
తాంబూలమిస్తాను తర్లిరమ్మనెను
గయ్యాళి కాడయ్యె కరియావులరాజు
వద్దికతో బోడికల దగ్గిరికి బిలిచి
దాదాసి బోడికలు దగ్గిరికి వచ్చిరి
కుస్తరించి బోడికల కూర్చుండమనెను
"తాంబూల మిచ్చెను తగవేడ్కతోను
గమిడిన కట్టివున్న దానిపేరు
చెప్ప"మని పలికె
"దాని పేరు అటువెనుక చెప్పేము
కాని
మా పేరులు ముందర అడగక పోతివి
రాజా!"
"అయితే మరియేమాయె మీపేరులు
చెప్ప"మన్నాడు
"మా తల్లిదండ్రులు పెట్టిన
నామములు చెప్పమంటారా?
మా బేతాళుడు పెట్టిన నామములు
చెప్పదుమా మేము"

"మీ తల్లిదండ్రి పెట్టిన నామములు
కడగ వర్జించి
మీ సింగమబేతాళుడు పెట్టిన
నామములు చెప్ప"మన్నాడు
"దాలికాడ మొద్దు వక్కడు,
దయ్యాల గంప వక్కడు,
పలికికాడ చేట వక్కడు, వల్లకాడు
వక్కడు,
కాలికాలని కట్టికొరవి కరిమొద్దు
వక్కడు,
రేమంతుని నెత్తిపిడుగు రేచుకుక్క
వక్కడు
మదురు గోడమీద బోలె వక్కడు,
మంగలపు పెంకు వక్కడు,
వోరుగంటి కోటచుట్టు మేటివంటి
వక్క వకడు,
ఏగుచుక్క వకడు, పగులుచుక్క
వకడు,
నీళ్ళలో ముల్లు వకడు, నిబ్బరపు
తునక వకడు
పందిరిమీద గుండు వకడు, పైబడ్డ
పిడుగు వకడు
కలిగింది కలిగినట్లు చెప్పేటందుకు
నా పేరు కన్యబోడికను"
అనియిట్లు బోడికలు అనిన మాటలకు

"మీ బేతాళుడు మహ దొడ్డవాడు
గనక
విహితమైన పేళ్ళు వహించినాడు
గమిడిన కట్టివున్న దాని పేరేమి?"
"గానిగ కలమాను చెక్కించి గజ్జెల
కటారి చేయించినాడు
బండిబొమ్మలు చెక్కించి పరుజులు
అమర్పించినాడు
తాటికాయలకైన తరుచైన మువ్వలు
ఏనుగతలలంతేసి యేకాండ్ర మువ్వలు
నారికేళపు కాయలంతేసి
నలభైనాలుగు మువ్వలు
గంగగాలము గజ్జె అంకించె బిరుదు
సాధనకాండ్లకు మంచి సరిపెన
గొలుసు
సరిపెన గొలుసులు సమిడి
బొమ్మలూను
వాదించి కటారుకు వాలు పెట్టించినాడు
పూజించి కటారుకు పువ్వులు
వేయించినాడు
తన యింటి మొగసాల కాదు తన
యింటి తరుసాల కాదు
అష్టాది వర్ణాల రాజులు వచ్చేటి
ఆదిమార్గాన
తోరణ స్తంభాన బిరుదులు తూలాడ
వేయించినాడు
కరణ కఠోరమైన బిరుదు తూలాడ
వేయించినాడు
వున్నాడు బేతాళ వుచితంబుగాను"
అని యిట్లు బోడికలు ఆడు మాటలకు

## బేతాళుని బిరుదులు తొలగించుడని కరియావులరాజు బోడికలతో చెప్పుట

"గడియసేపు ఆ బిరుదులు కడగ
వర్జించుడా!
నేను పోయిన తర్వాత మీరు తిరుగ
కట్టుకుందురుగాని
శిరస్సున సింహకిరీటము కలిగిన
రాజును నేను
నీచుడు కట్టిన బిరుదుల కింద దూరి
పోరాదు"
అని యిట్లు కరియావులరాజు ఆడు
మాటలకు

"అబ్బబ్బా, ఏమాటన్న
చెప్పుదువుగాని ఆమాట
చెప్పవద్దు" అనిరి.
"మాతండ్రి బేతాళుడు సెలవులేక
బిరుదులు యిప్ప వెరతుము, తిరుగ
కట్టా వెరుతు" మనిరి
"సింగమ బేతాళుడికి చిన్నతమ్ముడిని
ముచ్చుగా శూరుడికి ముద్దుతమ్ముడిని
కన్నమా ధీరుడికి చిన్నతమ్ముడిని
రంపాల కేశవయ్యకు రాయతమ్ముడిని
మీ తమ్ముడు కరియావులరాజు
వచ్చి వున్నాడు
శూరుల గమినికాడ నిలచి వున్నాడు
మీరు కట్టిన బిరుదులకింద దూరి
పోరాదని
గడియసేపు ఆ బిరుదులు కడగ
వర్జించుమన్నాడు
నేను పోయిన తర్వాత తిరుగ
మారుకట్టుకుందురుగాని
ఈ వార్త గురువు బేతాళునితో
విన్నపము సేయు"మని పలికె
బేతాళుని తావుకు బోడికల అంపించె
రాజు
ఆడకాడకు బోడికలకు మహా
ఆలోచన పుట్టెను
బేతాళుని బిరుదులు కట్టించె మొదలు
మనముల ఇక్కడ కావిలి పెట్టింది
మొదలు
అన్యము చూడలేదు వక పుణ్యము
చూడలేదు
తేరులు చూడలేదు, తిరుణాల
చూడలేదు
బేతాళుడు ఇందమని చెప్పుటమేగాక
ఇక్కడ మనముల కావిళ్ళు
పెట్టింది మొదలు
మనము కన్నులార చూడలేదు
ఇపుడు ఈ రాజుకున్నూ బేతాళుడికిన్నీ
విరుద్ధాలు పొందించి గొప్ప గుడి
గోప్రాలు యెక్కి
వీరి యుద్ధము మనము కన్నులార
చూడవలెను"
అని బేతాళుడు సాము చేసేటి గెరిడి
గమిని మొగసాల నిలచి
"చాలించు, చాలించు బేతాళనీ
చదువులు మాను
సాములేల బేతాళ! నీ సాహసంబేల?
విద్యలేల బేతాళ! బుద్ధి నీకేల?
పంజబంటుకు నేకేల బవిరిగడ్డంబు?
కోనబంటుకు నీకేల కోరమీసంబు?
రోతబంటుకు నీకేల రొమ్మున
జంజ్యము?

పిరికిబంటుకు నీకేల తొడుపు
జముజాలి ?
ఎవ్వడోకాని వంటిగుఱ్రపు రవుతు
వక్కడే వడియ
పసిబిడ్డ బాలుడు ఆ బాలరాజు వచ్చి
శూరుల గమినికాడ నిలచి వున్నాడు
విడువు, కడగావించు అనే వార్తలే
గాని
ఇతరమైన మాటలు లేవు ఆ
రాజుకుగాని
అదేమయ్యా అంపేను మమ్ముల
అదలించినాడు
గొప్పమాట లాడితే మమ్ముల కొట్టి
వచ్చినాడు"
అని యిట్లు బోడికలు అనిన మాటలకు

## బేతాళుడు కరియావులరాజును తిరిగి పొమ్మనుట

"పువ్వులతోటలో కేరిన గొల్లడు వీడు
వాదు గొల్ల మెండేమెండు గుణములు
రొండు
ముఱ్ఱుపాలు తాగిన మూర్ఖపు గొల్ల
మూర్ఖాన వక మాట ఆడె కాబోలు
పచ్చిపాలు తాగిన పౌరుషపు గొల్ల
పవురుషాన వక మాట ఆడె కాబోలు
కాంగుబాలు తాగిన కావరపు గొల్ల
కక్కసాన వక మాట ఆడె కాబోలు
మహామర్కటము భుజంగముచెత్త
నాకు పర్వకాదు
ఉగ్రసింహముకోర ఊప తన వశమా?
బెబ్బులిమీసాలు పెరక తన వశమా?
కొండమీద పిడుగు పడి గోత్రించి
నట్లు
చెండాడి యాదవుల పట్టేది
యెరుగడేమో
తిరుణాల చాలును ఆ రాజును తిరిగి
పొమ్మనుడా
వాదు తనకేలను వద్దు పొమ్మనుడా
పుణ్యము చాలును ఆ రాజును మళ్ళి
పొమ్మనుడ
గట్టిగ తిరుణాల కావలెనంపేను
తీరుల గెమినిగుండ తిరిగి రమ్మనుడు
తీరులగెమినిగుండ తిరిగి రాలేకపోతె
నక్కవలె నాబిరుదుకింద నక్కి
రమ్మనుడ
నక్క ఏమైన నారసములాడినా
కక్కింతు రక్తము గమినిముందరను

ఈగవలె నా బిరుదుకింద యీగి
రమ్మనుడా
ఈగ యేమైన యీరసము లాడిన
ఇలలోన చంపుదు కదలకుండాను
ఇల్లివలె నా బిరుదుకింద బాగి
రమ్మనుడీ
దోమవలె నా బిరుదుకింద దోగి
రమ్మనుడీ
లేకుంటె ఆ రాజును వచ్చిన దోవ
పట్టుక తిరిగి పొమ్మనుడా"
అని యిట్లు బేతాళుడు ఆనతియ్యగాను
ఆదనుంచి బోడికలు శూరుల గమిని
కాడికి తరలి వచ్చినారు
కరియావుల రాజు కొలువున గ్రక్కున
నిలచిరి
"వినవయ్యా కరియావులరాజు మా
విన్నపము నీవు
నీవు ఎంతమాట సెలవిచ్చినావో
అంతమాట
మా తండ్రి బేతాళునితో మనవి
చేసినాము
పువ్వులతోటకాడ కేరిన గొల్లవు
నీవన్నాడు
నీవు గొల్ల, నీకు మెండేమెండు
గుణములు రెండన్నాడు

ముర్రుపాలుతాగిన మూర్ఖపు
గొల్లవన్నాడు
మూర్ఖాన వక మాట ఆడితివన్నాడు
పచ్చిపాలు తాగిన పౌరుషమన్నాడు
పవురుషాన వక మాట అడితివన్నాడు
పొంగుపాలు తాగిన పోసరమన్నాడు
పోసరమున వక మాట ఆడితివన్నాడు
కాంగుపాలు తాగిన కక్కస మన్నాడు
కక్కసాన వక మాట ఆడితివన్నాడు
వేండిపాలు తాగిన వేగ్రమన్నాడు
వేగ్రాన వక మాట ఆడితివన్నాడు
మహామర్కటము,భుజంగము,చెత్త,
తనకు పర్వకాదన్నాడు
వృగసింహపు కోర వూప నీవశము
కాదన్నాడు
బెబ్బులి మీసాలు పెరక నీవశము
కాదన్నాడు
కొండమీద పిడుగుపడి గోత్రించినట్లు
చెండాడి యాదవుల పట్టేది
యెరుగవన్నాడు
తిరుణాల చాలును నిన్ను తిరిగి
పొమ్మన్నాడు
వాదు నీకేలను వద్దు పొమ్మన్నాడు
పుణ్యము చాలును నిన్ను మళ్ళి
పొమ్మన్నాడు

గట్టిగా తిరణాల కావలెనంటేను
తీరుల గెమినిగుండా తిరిగి
రమ్మన్నాడు
తీరుల గెమినికుండా తిరిగి రాలేకపోతే
నక్కవలె వాని బిరుదుకింద నక్కి
రమ్మన్నాడు
నక్క యేమన్నా నారసము లాడిన
కక్కింతు రక్తము గమినిముంద
రన్నాడు
ఈగవలె వాని బిరుదుకింద యీగి
రమ్మన్నాడు
ఈగ యేమన్నా యీరసము లాడిన
ఇలలోన చంపుదు కదలకుండ
నన్నాడు
బల్లివలె వాని బిరుదుకింద బాగి
రమ్మన్నాడు
దోమవలె వాని బిరుదుకింద దోగి
రమ్మన్నాడు
లేకుంటె నిన్ను వచ్చినదోవ పట్టుక
తిరిగి పొమ్మన్నాడు"

ఆ మాటలకు కరియావులరాజు
అప్పుడు సవ్వె
"వినరోయి వోరుగంటి
వీరపరివారము
తానెంత నేనెంత, తగదు
పొమ్మనరాదా
ఇంతేసి పల్లపాలు ఆడ తనకేల?
వాడు గొల్ల మెండేమెండు గుణములు
రెండు అన్నాడా?
మాకులమెరిగి తిట్టిన కోపంబు లేదు
పచ్చిపాలు తాగిన పౌరుష మన్నాడా?
మా తల్లిగర్భమందు జన్మించిన
నాటనుండి
పచ్చిపాలు, కాంగుపాలు, వేడిపాలు
తాగి బ్రతికినవారము
వాడితల్లి గర్భమందు జన్మించిన
నాటనుండి
జంతువుపాలు తాగి బ్రతికినాడేమో

## కరియావులరాజు బోడికలకు మహామర్కటం చాటువ చెప్పుట

మహామర్కటం, భుజంగము చెత్త
వాడు నాకు పర్వకాదన్నాడా

మహామర్కట మంటేను కోతికి
బడుసు

కోతి అనగాను అనుమంతుడు గాడా
చూచి రమ్మన్న లంకాపురిపట్నము
కాల్చి మూటగట్టి
వనమెల్ల పెకలించి వనపాలకుల జంపి
అక్షయకుమారుని హతము గావించి
సీతమ్మవారికి ఆనవాలు చూపి
రామలక్ష్మణులకు వర్తమానము
చెప్పిన అనుమంతుడు గాడా?
అంతవానిని నేను కా వేనురన్నా
అంతకు ప్రతిబంటు అవుదు నాపేరు
భుజంగం అంచేను పాముకు బడును
ధరణెల్ల మోసెను ధర కక్కటిల్ల
విష్ణుకు పాన్పాయె, ఈశ్వరునికి
భూషణమాయె
అంతవానిని నేను కాలేనురన్నా

అంతకు ప్రతిబంటు అవుదు నాపేరు
చెత్త అంచేను పూరికి బడును
ఆ పూరి ఆ గోవు ఆరగించలేదా?
అంతట ఆ యావు పాలివ్వలేదా?
అలర దేవేంద్ర దేవతలకు అర్పితం
కాలేదా?
అంతవానిని నేను కాలేనురన్నా
అంతకు ప్రతిబంటు అవుదు నాపేరు
వ్యాగ్రసింహము కోర వూప నావశము
కాదన్నాడా?
రాచి కొయ్యను నాచేత రంపమున్నాది
బెబ్బులి మీసాలు పెరక నా వశము
కాదన్నాడా?
కాల్చి కమిలించ నాచేత కట్టికొరివి
వున్నాది

## కరియావులరాజు బోడికలకు నక్కచాటువ చెప్పుట

వక్కవలె వాని బిరుదుకింద నక్కి
పొమ్మన్నాడా?

నక్క యేమైనా నారసములాడిన
కక్కించే మన్నాడ రక్తంబు
గమిడిముందరను?

నక్కకు వచ్చిన వృత్తాంతము
విన రోయి నాయన్నలార
నక్కనారాయణుడు హరిభక్తి
శివభక్తి ఆచారభక్తి
కోరి బాగుగా వచ్చెను
బ్రహ్మపట్నానికి
వో హో బ్రహ్మదేవుడా!
వో స్వామినాథా!
చతురుముఖములు గల శారదాపతిని
అంసవాహనము నెక్కిన అయ్య
శరణార్థి
నా మనవి చేకొని నన్ను రక్షించు
అని యిట్లు నక్కనారాయుడు
అటు వేడగాను
నక్క నారాయణతో బ్రహ్మ ఆడె
నొకమాట
ఏమి పనికి వస్తివి ఎరిగింపమనిన
వినవయ్య వో స్వామి నీకు
విన్నవించేను
హరిభక్తి శివభక్తి ఆచారభక్తి
గోరంత తిరుమణి మాడంత రుద్రాక్ష

యాపకాయంత లింగము కోరి వస్తిని
విని యపుడు ఆ బ్రహ్మ యిట్లగని
పలికె
హరిహరాదులకు అలివిగాని పదవి
సురులకు ముక్కోటి దేవతలకు
సూక్ష్మమైన పదవి
సూర్య చంద్రాదులకు సూత్రమైన
పదవి
యతులకు యేకాంగులకు
యోగ్యమైన పదవి
గరుడ గంధర్వాదులకు ఘనమైన
పదవి
పొట్టపట్టా నక్రటకాయలు బక్షించే
నక్కనారాయుడికి
యోగ్యత మవునే నక్కనారాయణా
కల్లమాటలు నీవు కానకాడితివి
గోరంత తిరుమణి మాడంత
రుద్రాక్ష
యాపకాయంత లింగము
నక్కనారాయణా నీకు అందరాని
పదవి

అలివికాదు పో పొమ్మనెను
ఆ మాటకు నక్క పొలపొల పొక్కి
పొగిలి దుఃఖాన భోరున పలికె
మర్కటమునకు కొంత మరి
మోక్షంబు గలిగె
కబోది పక్షులకు కలిగెను పదవి
ఏనుగ యెలుకలకు యేక సొగణం
బాయె
పుష్పజాతులు వేరు, పూజంత వక్కటి
జాతినీతులు వేరు, జన్మంతా వక్కటి
కుండలంతా వేరు,మృత్తికంతా వకటి
ఆవులంతా వేరు,పాలంతా వకటి
సొమ్ములంతా వేరు,సొర్ణమంతా వకటి
అని జ్ఞానమును పలికె
నక్కనారాయణుడు
ఇంత జ్ఞానము యింత వివేకము
గలిగిన నక్కనారాయణునికి
ఏ వరంబడిగిన దయసేతు యిప్పుడు
గోరంత తిరుమణి మాడంత రుద్రాక్ష
యాపకాయంత లింగము కోరిన వరము
కొంగున బంగారమిచ్చెను కొదవ
లేకుండ
దీవించి గంధము ధరియించె బ్రహ్మ
నక్కనారాయుడికి చాల
సంతోషమాయె

వుకో్క వుకో్క యని వక్క పూళ
తా వేసె
వో వో బ్రహ్మదేవుడా నా పాలిటి
దైవమా!
దీవించి తిరుమణి ధరియించినావు
గుల్లలు నత్రకాయలు పొట్టపట్టా
బోంచేయ వచ్చునా సెలవు యివ్వండి
అనిన మాటలకు బ్రహ్మ ఆడె
నొకమాట
ఇంత మాత్రమునకు నీ గుణములు
తెలిసె
నీ నిలకడ తెలిసె నీ నియోగము
తెలిసె
నీ సాంఖ్యము తెలిసె నీ నీతియు
తెలిసె
హరిభక్తి శివభక్తి ఆచారభక్తి తెలిసె
గోరంత తిరుమణి మాడంత రుద్రాక్ష
యాపకాయంత లింగము యిట్ల
నీచపుజాతికి నీకేల నక్కనారాయణా!
నా వరములు నాకు యిట్ల యియ్యమని
పలుకగాను
"వో గురుస్వామి! మీవద్ద బోధపడక
పోతే
ఇక యెవ్వరిచేత బోధ తెలియబోతుంది

అని మనవి చేస్తిగాని యిప్పు డే
మాయెనుః"
"నీ నీచపు మాటలు నాకు తెలుసును
నేను యిచ్చిన శివపూజలు నాకు
యి"మ్మని పల్కగాను
"నీవు ఏమి సెలవులు యిస్తువో అని
ఆ వస్తువులు మనవి చేస్తిగాని
యిపుడేమాయెనుః
నీ సెలవు ప్రకారం జరుపుకోగల
వాడిని''
ఆ మాటలకు బ్రహ్మ యోచన చేసి
వీని భక్తి కనవలెనని మనసులో
వుంచి
''పండ్లు ఫలాదులు కాయకసురులు
చక్కగా భోంచేసి సంతసమున సెలిపి
చిరకాలజీవిగా చక్కగా వర్ధిల్లు
చక్కగా వర్ధిల్లు నక్కనారాయణాః"
సంతోషమునను భక్తిచేత
నక్కనారాయుడు
బ్రహ్మలోకమునుండి బయలుదేరాడు
బ్రహ్మ వరము తీసె పండ్లుఫలాదులు
కాయకసురులు కందమూల
ఫలాదులు
తన కర్మవశమున యెక్కడా యేమీ
దొరకవాయె
కొండలు కులగిరి పర్వతములు తిరిగి
మలలు మాల్యవంతములు తిరిగి
నల్లమల ఎర్రమల పచ్చమల
తిరిగి తిరిగి
అలసి సొలసిపోయె నక్కనారాయణ
"వుండి వుండి నాప్రాణానికి యెసరు
పెట్టుకొంటిని
హరిభక్తి కోరినందుకు ఆహారం
లేకనేపోయె
శివభక్తి కోరినందుకు శివుడు
చింత కలగజేసె
ఆచారము కోరినందుకు అనాచారం
కలిగెను"
అని మనసున తలపోసి మరి
దుఃఖమునను
పక్క వూపిరితోను నక్కినన
మానికింద పడెను
అంతట ఆ బ్రహ్మ మాయవేషమున
చచ్చిపోయిన గంగగోవు రూపమున
పడి వుండెనంత
అకలిచేత నక్కనారాయుడు
అసురుసురు అనుచు
సొక్కుతు సోలుతు లేచి
నక్కనారాయణ
తూర్పు దక్షిణం వుత్తరం చూచె
ఏమీ కానరాదాయె నక్కనారాయుడికి

పడమటి దిక్కు చూచె పడివున్నాది
ఆవు
నక్కనారాయుడు చాల
సంతోషపడెను
దేవపూజ చూసి దేవుడు మెచ్చె
శివపూజ చూసి శివుడు మెచ్చె
హరిపూజ చూసి హరిహరుడు
మెచ్చినాడు
ఆచారము చూసి అమరులు
మెచ్చినారు
అందున మనకు ఆహారం కలిగె
అని నక్కనారాయుడు ఆవుదగ్గిరికి
వచ్చె
నాలుగు ప్రక్కలు చూచి తోక
మూచూచె
చాల సంతోషపడెను
నక్కనారాయుడు
గోరంతతిరుమణి గరుకులరాతికి
రుద్దెను
మాడంత రుద్రాక్ష వృక్షమునకు
గట్టి
యాపకాయంత లింగందీసి నీళ్ళలో
వేసె
చచ్చిపోయిన ఆవు తలగడల నిలచి
ఆడె నొకమాట

"సౌర్గలోకము చేరిన ఆవుగనక్కైతే
వకచెవు తాటిస్తుంద
సౌర్గలోకము చేరని ఆవుగనక్కైతే
రెండుచెవు లాడిస్తుంది."
నక్కజిత్తున పలికె నా యావుతోను
మాయకు లోబడి ఆవు వకచెవి
తాటించెను
తాటించినప్పుడు అల్ల పుట్టుదుమికి
ఆడె నొకమాట
"నాడు తెలియక మోసపోయి వుంటి
నేడు తెలిసి మోసపోతు వుంటి"
అని నక్కనారాయణ గొప్పగొప్ప
అడవుల దోవలు బట్టెను.
అప్పుడు బ్రహ్మ ఆవురూపము విడచి
తనరూపు గైకొని
నీచపు జాతి సాంగత్యము నీరుగట్టిన
మూట
పామరుల మాటలుఫలము బూరుగ
జూచి భ్రమసినట్లు
గుణహీనుల పొందు గొడ్డుగోవుల
పాలు కోరినట్లు
గోరంత తిరుమణి మాడంత రుద్రాక్ష
యాపకాయంత లింగము
యిట్ల యిమ్మనె బ్రహ్మ

ఆ వాక్యములకు నక్క మలల
మాల్యవంతములను
లగువులు యేస్తూ ముందర పోతూ
వున్నాది
చీమలు దూరని చిట్టడవి దాటెను
కాకులు దూరని కారడవి దాటెను
ఏమీ దూరని యెంపళ్ళు దాటెను
చందన, ఖర్జూర, జంబు, జంబీర
మందార, బూరుగ, మహిసాక్షి తరులు
మద్ది, పాలయు, గొట్టి, మారేడు,
వెలగ
వద్ది, పాపట, జమ్మి, మిలింత,
పూదగ,
వుంద్ర, చంద్ర, కొండగోగు,
వాకలియు,
కోరింద, పుష్టియు, పేముబెత్తము
వుండే
అరణ్యములో నక్క పోతూ
వుండగాను
కొరిందముల్లు తగిలి కొనగుడ్డు
చొనకారి పోయె
గిర్రున తిరిగి నక్క గుడ్డికన్ను
మూసుకొని
మంచికన్ను చూపున
మందలించసాగెను
"ఏవ్వూరు నీవూరు యింత దూరంబు
కాలముకాక, పిట్ట మనిషి రానిచోట
ఏమి తప్పు చేస్తివి
యెరిగింపవయ్యా?"
అందుకు బ్రహ్మ అప్లన నవ్వి
"నాలుగుకాళ్ళ జీవాలలోకి నక్క
మహా టక్కరి
రెండుకాళ్ళ జీవాలలోకి కాకి మహా
కల్లరి
దీనితో పోరు పౌరుషము మనకేల?"
ననుచు
మనసున వుంచెను ఆ బ్రహ్మదేవుడు
అంతట నక్కనారాయుడు
గోడుగోడున పొగిలె దుఃఖాన
నక్కదుఃఖము చూచి బ్రహ్మ
నమ్మున పలికె
"దుఃఖము నీకేల? సంపదాయ మేల?
గోరంత తిరుమణి, పూడంత రుద్రాక్ష,
యాపకాయంత లింగము యిస్తే
మేము పోతాము"
అందుకు నక్కనారాయుడు బోరున
పలికె
"తరాతరము మా తాతతండ్రుల
తరము
నక్కకంటి చూపేగాని రెండుకన్నుల
చూపు లేదు

నా తరము మరియును ఏడు
దినములనుండి
నా నయనము చెడి ఈ పొదలోను
వున్నాను
గోరంత తిరుమణి,మాడంత రుద్రాక్ష
యాపకాయంత లింగము నాకేడిది?
అని గుడ్డికన్ను మూసుకొని
మంచికన్ను చూపె
కుడికంటి పుతకము కుంభద్వారములై
పారె
ఎడమకంటి పుతకము ఏరులై పారె
వో వో యని నక్కనారాయుడు
అడలంగ జూచి
"గుడ్డినక్కను నేను గుత్తెరగనయ్యా
మంచినక్కకు యిస్తి మాడంత
రుద్రాక్ష"
అని బ్రహ్మ అదృశ్యమాయె
బ్రహ్మలోకమునకు
అంతట పరమట దేశాన శాంబ్రము
వచ్చెను
వాన పరుషములు లేక చెరువులు
గుంటలు
కాల్వాలు పైరులు పంటలు నీళ్ళు లేక
శాంబ్రము దొణికె
నక్కనారాయుడికి భోజనము
లేకపోయె

తూర్పురాజ్యమున నెలకు మూడు
వర్షాలు కురిసి
చెరువులు నిండి గుంటలు నిండి
కాల్వాలు పారి
చెరువులకిందను మాగాణములు పండి
సుష్టుగా నుండెను తూర్పురాజ్యంబు
తల్లిదండ్రుల విడచి దాయాదుల
విడచి
అన్నదమ్ముల విడచి ఆత్మబంధువుల
విడచి
పెండ్లాము బిడ్డల విడచి తాను వుండే
స్థళగృహములు విడచి
వాన కురిసిన దేశానకు వచ్చెను
నక్కనారాయణ
పదికాళ్ళ జీవాలు పాతాళ మృగములు
పట్టి భక్షించి కందమూల ఫలాదులు
తిని
పొట్టపట్ట యేరుక తిని చెరువునీళ్లు
తాగి
ఆకలి దాహము తీరి అలసట మాని
సరిగొట్టిన నారకట్టవలె నక్క తా
బలిసె
కరువు శాంబ్రము తీరెను
నక్కనారాయుడికి
చల్లని శ్రీపొన్న వృక్షాలకింద
నిద్రపోతుండెను

నక్కనారాయణ అన్నలు తమ్ములు
ఆలుబిడ్డలు
కలలో మనసుకు పొడగట్టిరి
కలవరించెను తమవారిని
కలియబోదామని
కదిలెను నక్కనారాయణ తమ
దేశమునకు
మలలు మాల్యవంతములు మరివేగ
దాటిరాగాను
మలలో వున్నాది మగసింహ మొకటి
ఏడుదినముల నుండి ఆహారము లేక
ఏమీ దొరకక ఎతుకుత వస్తూవున్నాది
నక్కనారాయణ ఎదురాయె
నట్టడివిలోన
సింహాన్ని చూచి నక్కనారాయణ
నెత్తిన తాటికాయ పడిన చందాన
కాళ్ళాడక నక్క గడగడ వణికి
తన పాలిటి శ్రీహరిని దలంచి
అవుధైర్యమున బలికె ఆ
సింహముతోను
"దండమో సింహాలబావ! దండ"మని
పలికె
శిరస్సు సాష్టాంగముగా వొర్లి
దండములు పెట్టి
"వుండి వుండి నా పాదాలు వులమంట
లెత్తె
చూచి చూచి నా నయనము చెడెను"
అని
కోరిందమల్లు తగిలిన గుడ్డికన్ను
చూపెను
నక్కను చూచి సింహము నాలుకలు
గోయుచు
పోకుండ నక్కను పొట్టలో
ఏసుకొందు ననుచు
వుండెను సింహాంబు వుదరంబుతోను
సింహాన్ని బొంకించి తమవారిని
చేరుదుననుచు
ఆలోచన చేసి నక్కనారాయణ
అప్పుడిట్లనియె :
"నన్ను భక్షించిన నీ ఆకలి తీరదు
బావరో వినుమ!
నాకన్న దొడ్డది నీకన్న దొడ్డది
నీలగిరి మృగము పాడుబావిలోను
నిద్రబోవుచున్నాది
దాని తలకాయ నాకివ్వండి
గుండెలు మాంసము గురుతుగా మీకు
పోదాము రావయ్య వో స్వామినాథ!
ఆశ పుట్టి సింహము అప్పుడిట్లనియె:
"నమ్ముదున నీమాట
నక్కనారాయణ"
చిక్కెను సింహము మన చేతిలోన
దక్కెను కందలని నక్కనారాయణ

"వో సింహాలబావ! కల్ల కాదు ఈ
భూదేవితో"డని
తన శిరస్సు భూమ్మీద
టొక్కు టొక్కున టోకించె నపుడు
నమ్మెను సింహము నక్కటక్కులకు
అబద్ధమైతే అక్కడనే నక్కను
భక్షింతు ననుచు
ముందర పదరా! నక్కనారాయణ
నీవు
నక్క ముందర సింహము వెనక
పాడుబావికాడికి వచ్చిరి
బావి బారెడు దూరము వుండంగానే
"వోయి సింహాల బావ! వో
మేనమామ!
సింహగాలి మహా దొడ్డది అన్నారు
నీవు ఇంతటనే వుండు నేను
వుండజూచి వచ్చేను"
సింహము నిలచెను నక్క బావికాడికి
వచ్చెను
తూర్పువొద్దుకు వచ్చి నక్క
తొంగి తొంగి చూచె
పొద్దుకు ఎదురు నీడ కానకపోయె
పొద్దుకిందుగా వచ్చి మెట్టుమీద
కాలు వూనతొక్కినాది
తోక జల్పించి వొళ్ళు జుంజరించి
చెవులు బిక్కరించి పళ్ళు యీలకించి
కండ్లు వురిమి చూచి బావిలో
తొంగి తొంగి చూచె
సగముబావికి సరిపోయె దాని నీడ
కొండవలె సింహరాజును బావిలో
ఇరగదొయ్య గలనని
సింహముకాడికి నక్క తర్లి వచ్చినాది
"ఇప్పుడిట్లు నీలగిరి మృగము
నీళ్ళపైన మేస్తూ వున్నాది బావ!
నేను ఎట్లు పోయి చూ స్తినో
అట్లనే నీవు పోయి చూడమనెను"
సింహాలరాజు బావికాడికి వచ్చి
మెట్టుమీద కాలు వూనదొక్కి
చెవులు బిక్కరించి తోక జల్పించి
వొళ్ళు జుజ్జరించి గుడ్లు దిక్కరించి
పండ్లు యీలగించి బావిలో తొంగి
చూచేటప్పటికి
తననీడ తన కన్నులకు మహా
దొడ్డమృగముగా వుండెను
"వున్నాదోయి నక్కనారాయణా!"
"ఆహా సద్దుశాయకు బావ!
నీ అలుకుడు విని అది లోపలికి పోతే
నన్ను పట్టి భక్షింతామని వున్నావ నీవు?
ఎనకకు ఏడడుగులు వచ్చి
ముందరికి మూడు లగువులు వేసి
బావిలో గుబుళ్ళున దుమకవయ్యా!"

నక్క చెప్పినట్టు బావిలో సింహము
గుబుక్కున దుమికెను
ఆదరి ఈదరి గెడ్డ లెస్సగ
పట్టుకున్నాడు
పట్టుచిక్కక సింహరాజు
"నమ్మితిరో నక్కనారాయణ!
నమ్మంగనే నిన్ను, నాలుగు
దోవలు చేసింది"
"నమ్మితే ఏమాయె నా మేనమామ!
ఆగెడ్డ ఈగెడ్డ లేసుకొట్టుకోరేదా?
కండలు గుండెలు నీకు కసిగండలు
కాలేదా?
ఆలుబిడ్డలమీద ఆశల విడిచి
హరిహరో యనుచు
అడుగుజారవయ్యా!
నీకు హరిపురము గలుగును
నన్ను నమ్మినవారికి నరలోకము
లేదు
నన్ను నమ్మినవారికి నాగలోకము
లేదు
మోక్షలోకము వారికి మొనసి
వుండునన్నా"
బావిగెడ్డన నక్క గంతులు వేసి
పూల తావేసి
తనకులము వారందరు గుంపులు
గూడిరి
తానే ఒక సింహము నేనే ఒక నక్క
నక్కచేతిలో సింహము చిక్కింది
ఎరుగడేమో!
అంతవాణ్ణి నేను కాలేనురన్న
అంత ప్రతిబంటు అవును నా పేరు

## కరియావులరాజు బోడికలకు ఈగచాటువ చెప్పుట

ఈగవలె వాని బిరుదుకింద ఈగి
రమ్మన్నాడా?
ఈగకు వచ్చిన వృత్తాంతము వినరోయి
నా అన్నలారా!
చెంచుల వాళ్ళమ్మ చెంచుల
పోతినాయుడు
కొండపుట్టగానే చెంచుల
పోతినాయుడు పుట్టెను
పోతినాయుడు పుట్టగానే కోన పుట్టింది
ఆ కోన పుట్టగానే చెంచుల వాళ్ళమ్మ
పుట్టింది
చెంచుల పోతినాయుడికి వాళ్ళమ్మకు

సంతానము లేక వారు చాల దుఃఖమున
రాయిగాని రాయంతా శిలగాను నోమి
చెట్టుగాని చెట్టంతా పత్రిగా పోమి
నిండుబిందెలు నోమి నాకేళ్ల నోమి
ఎక్కిపోయి కొన్నాళ్లు ఏలేశ్వరములు నోమి
దిగివచ్చి కొన్నాళ్లు దీపాంత్రాలు నోమి
గంగవుతకాలు కలపొన్నలకు నోమిరి
చిన్నేటి వుతకాలు పెన్నేటికి నోమిరి
పెన్నేటి వుతకాలు చిన్నేటికి నోమిరి
ఎందునా వారికి గర్భం ఫలించక పోయె
సగముప్రాయము పోయెను సంతానము వుడిగెను
వక వక వెంట్రుకా నెరసె వళ్లు రవిదీసె
అంతట గోడికఈశ్వరుని కొలిచి పూజచేసె
గోడిగఈశ్వరుని వరాన పుత్రుండు గలిగె
ఆ కొండగృహములలో వుండే ఆ చెంచువారికి
ఆముదము లేదు నూనె దొరకదు
తలకు తేనె, వొళ్ళకు తేనె, కడుపుకు తేనె, పైకి తేనె
తేనెతో కొన్నాళ్ళు కాలము గడుపుచు నుండిరి
తేనె తాగిన బాలుడు నానాటికి తీసి చిక్కిపోతాడు
వకనాటి దినమందు చెంచుల వళ్లెమ్మ
"నా పున్నపెన్నెలా! నా జోగుకోడె!
కలవల చెలికాడా! కాంతిగల రాజ!
లేకలేక కన్నాము శోకరక్షకుణ్ణి
గోడుండి కన్నాము గోవు అవుకోడెను
తేనె తాగిన బాలుడు చిక్కిపోతాడు
నూనె తాగిన బాలుడు నునుపు పెరుగును
తేనెకు నూనెకు సరిమార్చుక ర" మ్మనెను
అంతట పోతినాయుడు అతి వేడ్కతోను
రొండు కొడుములకు తేనె పోసుకొని
పారుటాకు పోసి వాసెనలు కట్టి
ఎదురుచట్టె గోటికావిడిగా గట్టెను
ఏట జాగిలన్ని ఎంటబెట్టుకొని
చిలకల మలబాకు మొలచ వేసుకొనెను
జమదగ్ని పట్నానికి తర్లి వచ్చినాడు
సందులు గొందులు వీధులు బజార్లు
ఎరుకల బాసన ఏనాది బాసన
మధువో మధువో యని మధువమ్మ సాగెను
మధువయింది ఎవరికీ తెలియంగలేక
పిలిచింపె లేదు వకరు అడిగింది లేదు

ముయ్యేడు వీధులు తిరిగి చాలించి
కులగిరి పట్నానికి తర్లి వచ్చినాడు
కులగిరి పట్నం ముయ్యేడు వీధులు
తిరిగి
బాజారమ్మ టే మధువు మధువు అని
అమ్ముతా వచ్చె
చదువు శాస్త్రములు చదివినాడు
యామల పోలిసెట్టి
మధువు అంటేను ఏనాది బాసన తేనె
అనుకొని
తన దివాణముకాడికి పిలిపించెను
చెంచుల పోతినాయుని
ఈ తేనెకావిడి ఇక్కడ దించమన్నాడు
పారుటాకుల వాసెనలు ఇప్పమన్నాడు
తేనె పలచంగా వున్నదో చిక్కగా
వున్నదో అని
గోటి పెనికిన తీసి గోడకు మీటెను
చుక్కవలె ఆ తేనె చక్కగా నిలచె
ఆ తేనెకు వక ఈగ వాలె
ఈగకు ఈగపులి పొంచె
ఈగపులికి పరడ పొంచె
పరడకు బల్లి పొంచె
బల్లికి ఎలుక పొంచె-
ఎలుకకు యామల పోలిసెట్టి
పునుగుపిల్లి పొంచె
యామల పోలిసెట్టి పునుగుపిల్లికి
చెంచుల పోతినాయుని జాగిలము పొంచె
ఈగను ఈగపులి చంపె
ఈగపులిని పరడ చంపె
పరడను బల్లి చంపె
బల్లిని ఎలుక చంపె
ఎలకను యామల పోలిసెట్టి పునుగు
పిల్లి చంపె
యామల పోలిసెట్టి పునుగుపిల్లిని
చెంచువారి యాటజాగిలము చంపె,
దినము వకటింటికి నూరువరాలు
పునుగాటి తెచ్చును నా పునుగుపిల్లి
అటువంటి పిల్లిని యాటజాగిలము
చంపెనని
తూచేటి తూనికకట్టె తీసుకొని
యాటజాగిలాన్ని తరిమి తరిమి
కొట్టంగసాగె :
"వినవయ్యా యామల పోలిసెట్టి నా
విన్నపము నీవు
కొండగృహములలో వుండే చెంచు
వారము మేము
యాటజాగిలము మాకు తోడు
మేము యాటజాగిలానికి తోడు
యాటజాగిలాన్ని కొట్టవద్దురయ్యా !
నల్లమలకు పోయి నాలుగువేల
పునుగుపిల్లులు తెచ్చి ఇచ్చేను

ఎఱ్ఱమలకు పోయి ఏడువేల పునుగు
పిల్లుల తెచ్చి యిచ్చేను
పచ్చమలకు పోయి పదివేల పునుగు
పిల్లుల తెచ్చి యిచ్చేను
అని కోపము చల్లార్చెను యామల
పోలిసెట్టిని
దిమాణముకాడ కూర్చుండ బెట్టుకొని
తేనెకు నూనెను సరిమార్చుకుంటూ
వుండిరి
ఆ సమయమున యాటజాగిలము
వచ్చి
చెంచుల పోతినాయుని తొడలమీద
ఆదమరచి నిద్రపోతూ వుండెను
తూచేటి తూనికకట్టె తీసుకొని
యాటజాగిలాన్ని అట్టే కణతలకు
పట్టికొట్టెను
విలవిల తనుక యాటజాగిలము
విడిచె ప్రాణములు
చెంచుల పోతినాయుడికి వుగ్రకోపంబు
వచ్చెను
మొనసి కోమటిబుద్ధికి ఇంత
పోసంబు లేదు
ఇంత మనివి చెప్పి సముదాయిస్తి నేను
రాజు మొకమున పొడవగా రాని
కోపంబు
ఈపు పొడవగా రాదు అని

అన్యాయముగా నా యాటజాగిలాన్ని
చంపితివి నీవు
అని చిలకలమొలబాకు చిలుకు ధట్టించి
యామల పోలిసెట్టి ఎదరొమ్మున
బొడిచె
దూదిపాన్పువలె వాడు భూమ్మీద
దుడ్డున పడెను
బజారమ్మడె చెంచులపోతినాయుడు
తర్లిపోతూ వుండగాను
యామల పోలిసెట్టిభార్య లక్ష్మిదేవమ్మ
అంగడికాడికి తర్లివచ్చినాది
తమపురుషుడు పడివున్నపాటు కన్నుల
జూచెను
మొ్ఱోయని లక్ష్మమ్మ ఏడ్వంగ
సాగెను
ఇంత అన్యాయముగదా ఈ
కులగిరిపట్నమందు
ఇంత దిక్కుదెస లేదా ఈ కులగిరి
పట్నాన
అని యిట్లు లక్షువమ్మ అరవంగసాగె
కో అంటే కోటికి కూడిరి కోడెకోమిట్లు
వారి వారి ఆయుధములు వారు
అందుకొని
సంచులు, అడ్డలు, పళ్లు,ఎంచెంచి
కొలిచేటి పిచ్చమానికలు

తూంచేటి గుండ్లు దూనెకట్టెంతో
చెంచువాణ్ణి దూలనే కొట్టిరి
అడ్డలతో చెంచువాణ్ణి అణగ గొట్టినారు
మానికలతో చెంచువాణ్ణి మగ్గవే
గొట్టిరి
పళ్లతో చెంచువాణ్ణి పవ గొట్టినారు
సంచులతో చెంచులవాణ్ణి చావగొట్టినారు
చెంచులవాడిని యాటకాగిలాన్ని
కాలి వరియెంటిగట్టి గవినికవతల
వేసిరి పాడుబావిలోన
అంత వాల్లెమ్మ మూడు గెడియలు
చూచెను
మూడు దినములు చూచెను
మూడు గెడియలకు రాకపోయ
మూడు దినములకు రాకపోయ
ఏది సుద్ది ఏది వార్త తెలియక పోయ
ననుచు
దాసాని పువ్వులు కోసి గంపకు
పెట్టుకోని
పొడుగాటి ఎదురుచట్టెకు కుమారుని
పుయ్యాలతొట్టె తగిలించి
పువ్వులమ్ముతా వచ్చెను పూబోణి
వాల్లెమ్మ
కులగిరి పట్నానికి తర్లి వచ్చినాది
మగువలు నీళ్ళకు వచ్చేటి నీలాటి
రేవుకు తర్లివచ్చినాధి

యాల వస్తివమ్మ ఈ అన్యాదారి
పట్నానికి ?
ఎవరో నిన్ను మధ్యాహ్నమువేళ
మధువో మధువో యని సంధువమ్ముతా
వచ్చె
నో అంటే కోనకి కూడినావు నీవె
కోమట్లు
యాటకాగిలాన్ని చెంచువాణ్ణి
చావగొట్టి పాడుబావిలో అటు
వేసినారు
అని యిట్లు ఆ మగువలు
ఆనతివ్వగాను
దాసాని పువ్వులగంప ధరణిపై విడచి
గుప్పుగుప్పున రొమ్ము గుద్దుక ఇంతి
కొప్పూడి వెంట్రుకలు కొట్లుమిట్లాడ
ఆహా యని పురుషుపైని మోహమునను
కుండల ఆమంటు కుమిలిన యట్లు
కుమ్మరావము చిచ్చువలె కుమారిలసాగె
తన పుణ్యపురుషుని కడకు తగ
దరలివచ్చె
బావిలో పడివున్న పురుషుని జూచి
పడి పొర్లాడుచు పణతి మూర్ఛిల్లె
నేలపై పురుషుని పెట్టి నెలత
భ్రమజెందె
వాలుకన్నుల నీళ్ల వరదలై పారె

కుడిచెయ్యి లోగాను తన పురుషునికి
వలంపూరి తిరిగి
తొణకి తమ పురుషుని తొడల
జేర్చుకొనెను
వో హో యని వొళ్లెమ్మ వలపోవ
దొడిగె
కొండ గృహములలో పుట్టి
మలల మాల్యవంతములలో పెరిగి
ఈ కులగిరిపట్నమందు కోమట్ల
చేతిలో
చావను వ్రాసినాడా బ్రహ్మ ?
........................
.............నో కొడుకును
అని గంధపుచెక్కలు తెప్పించి
కాష్టము ఏరుపరచి
పురుషుణ్ణి యాటజాగిలాన్ని దహనము
చేపించె
ఆడనుంచి చెంచుల వొళ్లెమ్మ
నల్లమలకు వచ్చెను నాలుగువేల
చెంచుల గూర్చెను
ఎఱ్ఱమలకు పోయి ఏడువేల
చెంచుల కూర్చెను
పచ్చమలకు పోయి పదివేల చెంచుల
కూర్చెను
చెంచువారి దండు ఎంటబెట్టుకొని
కులగిరి పట్నానికి తర్లివచ్చెను
చెంచుల వొళ్లెమ్మ

"వినరోయి అన్నలార! నా
తమ్ములార!
చీరగట్టిన ఆడకూతురు మనకు
తోబుట్టుమర్యాద
మొలతాడుగట్టిన మొగవాడు మనకు
బావమరిది మారు
మొలతాడు గట్టిన మొగవాడు లేకుండ
ఏరు పిడకలు ఏరినట్లు ఏరవలె మీరు"
అని చెంచువారి దండుకు సెలవు
ఇచ్చినాది
గోయిందా యని కులగిరిపట్నం
కోటలు జొరబడిరి
సందుగొందులు చాట్లు జొరబడిన
ఎందెందు జొచ్చినా ఎతికి పోనీక
లుంగల బొడిచిరి కత్తులతో నరికిరి
మొలతాడు గట్టిన మొగవాడు
ప్రాణలింగమాయె
ఏడుపుట్ల నల్లగాజులు ఏడుపుట్ల
నల్లపూసలు
ఏడుపుట్ల లక్కాకు ఈ
వక్కదినవారమందు
నీలాటి రేవులో ముండమోయించె ఆ
ఈగ కాదంటవయ్యా
అంతవాణ్ణి నేను కాలేనురన్న
అంతకు ప్రతిబంటు అవుదు నాపేరు

## కరియావులరాజు బోడికలకు బల్లిచాటుప చెప్పుట

బల్లివలె వాని బిరుదుకింద బాగి
రమ్మన్నాడా?
బల్లికొచ్చిన వార్త వినరా
నాయన్నలార!
కాళ్లుచేతులు లేని ఎఱ్ఱగగీత జోరీగల
బంట్రోతు
దినము వకింటికి గుక్కెడు రక్తం
బొక్కెడు కండ
ఆహారం తెచ్చి పెట్టతూ వుండెను
జీవరాసులు గోవులు మేకలు
పశువు లన్నియును పూర్జివ మాయె
వకనాటి దినమందు మనిషిరక్తమున్ను
మనిషికండ తెచ్చియిచ్చెను
వుప్పుపులుసు తినేటి శరీరం
మహారుచిగా నుండును
"వినవో జోరీగ బంట్రోత!
ఇన్నాళ్లు తెచ్చినది
చప్పిడి రక్తం చప్పిడి మాంసం
ఈనాడు మహారుచిగా వున్నది
ఇకమీద ఇటువంటి మాంసం
ఇటువంటి రక్తం తెమ్మని పలికె
"అట్లానే తెస్తాను సామీ" యనెను
జోరీగబంట్రోతు

తర్లిపోతూ వుండెను జోరీగ
బంట్రోతు
బల్లి దరవాజాలో కాచుకొని వుండెను
"ఏమోయి జోరీగబంట్రోత!
బిరబిర పొయ్యేవు?
"దొరవారి భోజనానికి నరులరక్తం
నరమాంసం
కొంచుకపోతూ వున్నాను"
"నాకు వినపడలేదు, ఇంకిట్ల వచ్చి
చెప్ప"మన్నాడు
వక అడుగువచ్చి మాటచెప్పెను
"పెద్దమనుష్యుణ్ణి, వినబడలేదు
చెవుకాడికి వచ్చి చెప్ప"మన్నాడు
చెవికాడికి వచ్చి చెప్పబోగాను
జోరీగను బట్టి నోట వేసుకొనెను
నరుల బతికించిందే బల్లి కాదంటయ్యా?
అంతవాణ్ణి నేను కాలేనురన్న
అంతకు ప్రతిబంటును అవుదును నేను
చీమవలె వాడి బిరుదుకింద చేరి
రమ్మన్నాడా?
చీమపేరు గట్టిగా వినరా
సీమభూములను

....................

అని యిట్లు కరియావులరాజు
ఆనలేయగాను
అనుమంతు సంజీవరాయుడు
దేవళానికి తర్లివచ్చినాడు
"వినవయ్య సంజీవి దేవపుత్ర!
అనుమంతుపీ:!
సంజీవి తెచ్చిక సాహసఘనుడ
అనుమంతుని వంశమువాణ్ణి నేను
అనుమంతా! నీవాడను నేను
నీచుడు గట్టిన బిరుదులు నీమీద
నీడలు పారుతున్నావి
నీవక్క బాహుబలిమిన వక్క లగువు
సత్తవ
నాకు ఇచ్చినట్లు అయితే
నీచుడు గట్టిన బిరుదులనీడలు
విడిపిస్తా" ననెను
అని యిట్లు కరియావులరాజు
ఆంజనేయుని వేడెను
అనుమంతు సంజీవరాయుడి మోప్రాన
వున్న
పువ్వులతోమాల రాజుకుడిబుజమున
వ్రాలె
అనుమంతు లగువు చిక్కెను రాజుకు
ఆడనుండి కరియావులరాజు శూరుల
గెమినికాడికి వచ్చెను.

## కరియావులరాజు బేతాళుని బిరుదులను విరుగదన్నుట

"వినరోయి వోరుగంటివార! వీర
పరివారమా!
కత్తిన కోసీననియేరు, కటారున
పొడిచి నేలతోసీ ననియేరు
ముడియిప్పి నేలతోసీ ననియేరు
బేతాళుడు కట్టిన బిరుదులు కముజు
కావలెను
నా యెడమకాలి బొట్నేలు వక్క
డేగ కావలెను
బేతాళుడు కట్టించిన బిరుదులు వక
సాతికొంగ కావలెను
నా యెడమకాలి బొట్నేలు వక్క
సాల్వ కావలెను"
అని అస్త్రకాండ్యాల చెల్లిన వారి
అయ్యల దలచినాడు
మేదేన వరిగిన మేనమామల
దలచినాడు

కాండేన వరిగిన కన్నతండ్రిని
తలచినాడు
బొల్లావు బసవన్నను బోరున తలచి
తనపాలి కాగొర్ల తెలుగురాయుణ్ణి
మతిన వేడినాడు
ఎగసెను కరియావులరాజు సతావీడు
యోజనాల పొడుగు
సాతికొంగమీద సాల్వ సంధించినట్లు
కముజుమీద డేగ వడిసిన రీతి
తన్నెను వాని బిరుదులు తావులు
తర్ల లేకుండ
పీనిగ తలకాయలంతేసి బిరుసు
మువ్వల ఎగర తన్నినాడు
గానిగ కలమానులంతేసి గజ్జెల
కటారు విరగ తన్నినాడు
నూనూలు మోకులు తెగి నుగ్గునుగ్గు
లాయె
తోలుమాకులు తెగి తొంచుకులాయె
వినప గొలుసు తెగితెగి విరిగె
కతారు
బారిమోకులు తెగిపడె భూమిమీద
సాపసుట్టుగ వాడి బిరుదులు ధరణిపై
వ్రాలె
ఈదిన వక తునక విరుసున వక
తునక
సదుర్న వక మువ్వ సావిడిన వక
మువ్వ

గుండిచెరువున వక మువ్వ
గుప్పలెప్పున దుముకె
గుండిచెరవు పచ్చాలు తల్లడిల్లపోవగె
బేరాళుడు సాము జేసేటి కిత్తుం
గరిడిలో వకమువ్వ గల్లున పడెను
వోరుగంటి పట్టాభిరుద్రుని
సమరున వక మువ్వ జల్లునపడెను
సాపసుట్టుగ వాడి బిరుదులు
ధరణిపై వ్రాలె
ఆడ కావిల్లవున్న బోడికలు
విరిగిన దునసులు సుడిసులు మోపులం
గట్టుకొని
బేలాళుడు సాముచేసేటి గెరిడి
మొగసాల
గెరిడిమొగసాల గెమిసినసుంపర
పసిరి
"చాలించు చాలించు బేతాళ! నీ
చదువులు మాను
పీరసాలు ఆడితివి బేతాళ! ఇదిగో
విరిగె కటారు
పవురుషాలు ఆడితివి బేతాళ! నీ
బలుబిన్నె తొలిగె
తన్నెను నీబిరుదులు తావులు తర్లు
లేకుండ
సాపసుట్టుగ నీబిరుదులు ధరణిపై
వ్రాలె"
అని యిట్లు బోడికలు ఆడు మాటలకు

## బేతాళుడు కరియావులరాజుతో పోట్లాటకు సిద్ధమగుట

పెటపెట దంతములు పెట్టార్చి
కొరికెను
అదిరిపడి బేతాళుడు ఆకాశమంటెను
మిట్టిపడి బేతాళుడు మిన్నందుకొనెను
కొలువులో కొందర్ని కొట్టి
దుమికించె
వురువున పందిళ్లు వూచి పడదోచె
జారుబండన జారి జీరుబండన నిలిచె
జీరుబండన జారి జారుబండన నిలిచె
తొమ్మిదిమూళ్ళది తొడుపు జముజాలి
కరువాలు వొరదీసి కత్తి జళిపించె
అప్పుడు బేతాళుడు ఆడె నొకమాట
"కలిగెరా నా సుకియకు నరా
మాంసంబు నేడు
బిరుదు తన్నినవాణ్ణి ఎక్కడికి
పోకుండనైన
కనిపెట్టుక నుండుడా మీరు
మా తల్లి దీవెనానికి పోయి
సె పు సుకొని ద్దా కి నేను తర్లి
వస్తాను"
అని ట్టు బేతాళుడు ఇరిగిన తునకలు
మొత్త మోటులు కత్తు గెమిడికాడ
కట్టించె
తల్లిదీవెనానికి తర్లి వచ్చినాడు

ముందర దరవాజాకాడికి వచ్చేటప్పటికి
ముత్యాల ఆరతులు తెచ్చిరి
ఎనక దరవాజాకాడికి వచ్చేటప్పటికి
ఎర్రకూడు తీసినారు
మూడో దరవాజాకాడికి వచ్చేటప్పటికి
మిత్తికూడు తీసినారు
నాలుగో దరవాజాకాడికి వచ్చేటప్పటికి
పచ్చకూడు తీసినారు
అయిదో దరవాజకాడికి వచ్చేటప్పటికి
మగువలు ఆరతులు పట్టిరి
తల్లితావుకు వచ్చెను ప్రదక్షిణము
తిరిగి
తల్లికి పడి సాగిలి మొక్కి
మరిరెండు అస్త్రాల మనిమికి నిలిచెను
కొమారుని మొకారబిందము తల్లి
తప్పక చూచెను
"సిరిగల మొకారబిందము సిరులు
తొలగినాది
కాంతిగల మొకారబిందము కళలు
తొలగినాది
వడిగల మొకారబిందము వసివాడ్లు
వాడినాది
ఎవ్వరితో యుద్ధం వొప్పితివి కొడుకా?

ఎవ్వరితో కార్యం వొప్పితివి
కొడుకా ?"
అని యిట్లు లింగమాదేవి
అడిగినందులకు
"దక్షిణాది నుంచి కరియావుల నేనాగ
కన్య వచ్చినాది
కన్యను పెండ్లాడ కదిలి పోవలెను
దీవించి నను బంపు ధీరునిమీదికి
అక్షించి నను బంపు అమరునిమీదికి"
అని యిట్లు బేతాళుడు అనిన
మాటలకు

## బేతాళునితల్లి గొల్లవారితో విరోధము వద్దని కొడుకుకు చెప్పుట

కాంగనే కొమారు ! నేనొక్క కాని
కంగంటి
వుత్తరాది నుంచి వొక కొమ్ము టేనుగ
వచ్చె
దక్షిణాదినుంచి వొక కొమ్ము టేనుగ
వచ్చె
రెండు వేనుగులు నడివీధిలో గిరిబడె
దక్షిణాది కొమ్ము టేనుగ వుత్తరాది
కొమ్ము టేనుగను
కుంబ స్తలమున బొడిచి కూలంగ
దోసె
వల్లకాడు పోట్లాడ వద్దురా కొడుకా !
గొల్లవారితో విద్ధము వద్దురా కొడుకా!
గొల్లవారితో జగడము వొద్దురా
కొడుకా!
గొల్లవారితో పోరు వొద్దురా కొడుకా!
ఎలమంచి గొల్లలు కొడుకా!
ఎద్దెమచ్చరీలు
పంపాద్రిగొల్లలు కొడుకా !
పట్టుమచ్చరీలు
ద్వారావతిగొల్లలు కొడుకా!
తావుమచ్చరీలు
వడ్డార మంటేను అడ్డాము నడుతురు
చలమంటేను చత్రాత నార
తీసేటివారు
మేకపెంటిక దీవి గన్న రాజులు వారు
మన పానుగంటికి పరదక్షిణాన
శనేశ్వరుడు అనే చట్టబండకింద
రాజనం మేసేటి రాజనం కోడిపుంజు
వుండెను

పంటవారి చిన్నది
భామనాయకురాలితో
కోడిబందెము వొప్పెను
బ్రహ్మనాయుండు
జెట్టిపెరుమాళ్లు చెవులగోపన్న
ఇద్దరూ వచ్చి
వురవాళ్లు వేసి గుండు వుర్లదీసినారు
తలకోలలు వేసి గుండు తర్లదీసినారు
కలకోడి పుంజును కాంచక
పోయేటినాడు
మీతండ్రి రాయబేతాళుడు దళములు
తీసుకొని
రాళ్ళదిడ్డి బైరావ' అనే
రాతికనుమకాడికి అడ్డముపోయెను

కత్తిన నరుకలేదు కటారున
పొడవలేదు
వలచాత వొంచుకొని దాచేత మర్దించి
ధరణిపై త్రోసినారు
అటువంటి వారితో యుద్ధం వద్దురా
కొడుకా:"
అని యిట్లు లింగమాదేవి అనిన
మాటలకు
"అంపినా నేను పోదును అంపకున్నా
నేను పోదును"
అని యిట్లు బేతాళుడు అనిన
మాటలకు

## భార్యఅనుమతి గైకొని యుద్ధమునకు పొమ్మని బేతాళునికి తల్లి చెప్పుట

"వినరా! నా కొమార! విన్నపము
నీవు
పెండ్లి ప్రయోజనము కాకముందు
తల్లితండ్రి దీవెన
పెండ్లి అయినతరువాత నీకు
కులాంగనదీవెన
మగువ చిటిగోపు తావుకు తర్లి
పొమ్మనెను

ఆడనుంచి బేతాళుడు చిటిగోపునగరికి
తర్లివచ్చినాడు
పంగళా త్రైలు తీసుక మగువ
చిటిగోపు
దరవాజకాడికి ఆ త్రైలు తెచ్చెను
ఆ త్రైలు పట్టించె అతి వేడ్కతోను
పురుషుని మొకారబిందము తప్పక
చూచెను

"ఎవరితో యుద్ధము వొప్పితివి
ప్రాణేశ:
ఎవరితో కార్యము వొప్పితివి
ప్రాణేశ :
ఎవరితో జగడము వొప్పితివి
ప్రాణేశ :
నీ సిరిగల మొకారబిందము సిరులు
తొలిగి వున్నాది
కాంతిగల మొకారబిందము కళలు
తొలిగి వున్నాది''

అని యిట్లు చిటిగోపు ఆడుమాటలకు
''దక్షిణాదినుంచి కరియావులరాగ లనే
కన్య వచ్చి వున్నాది
కన్యను పెండ్లాడ నేను కదిలి
పోవలెను
నీకు సవితిపోరు తెస్తునే మగువ
చిటిగోపు:''
అని యిట్లు బేతాళుడు ఆడు వార్తలకు

## బేతాళునిభార్య చిటిగోపునకు అపశకునము లగుట

''కాంగనే నా పుణ్యపురుషుడా:
నేనొక్క కానికల గంటి
దక్షిణాదినుంచి వక్క కొమ్ముటేనుగ
వచ్చె
మన వూవలతోటలో వుండే
వూడలమ్రిని
కుంబస్థళమున పొడిచి
కూలంగదోసెను
మొనలు కిందాయె మోటులు మీదాయె
వల్లకాదు పోట్లాట వద్దు ప్రాణేశ:''
'దక్షిణాది కొమ్ముటేనుగ కరి
యావులరాజు

పూసపుస్తె నేను, కంటోని
కాలమైన వారికి కాలాన చావు
లేదు'
'చెడిపోయి నేను వద్దవారింట
పడియేకులు వడక కలగంటి
వల్లకాదు పోట్లాట వద్దు ప్రాణేశ:'
'కరియావుల రాజును కత్తుల
గెరిడిలో చంపిన వెనుక
అతని భార్య వద్దవారింట వడియేకులు
వడక పంతమున్నాది భామ:'
పప్పుతో పదివేలు శాకాపకూరలు
కావించినాది

చారెడు బియ్యము చేటకొమ్మన
బోసుకొని
బేతాళుని వంటకు దంచబోగాను
కాకిమూకలు గూడి బియ్యము కవురు
లాడి పోయె
''వల్లకాదు పోట్లాట వద్దు ప్రాణేశ!''
"కరియావులరాజు బలగము కాకిగుంపు
కద్దు
కాకులకు కూడువేసి వారు కన్నీరు
పెట్టేరు"
కడిగి గాలించి బియ్యము వంటశాయ
పోగాను
వకపక్క వుడికి వకపక్క వుడకక
ముప్పాలు బియ్యమై పోయెను వంట
పప్పుచట్టి పగిలి మూడు కుప్పలై
పడెను
"వల్లకాదు పోట్లాట వద్దు ప్రాణేశ!"
'వినవె చిటిగోపు! నీకు విన్న
వించేను

కత్తుల గెరిడిలోను కరియావులరాజు
శిరసు
గాజు స్తంభానికి వేసి నొక్కిన వెనుక
వాని తలమెదుడు మూడు కుప్పలై
నిలుచు పంతమున్నాది'
వంటచేయు చిటిగోపు వర్ణించినాది
వుట్లమీద నూనె సిద్దెలకు వంచి
సిద్దెలనూనె సిరిగిన్నెలకు వంచి
సిరిగిన్నెలో నూనె శిరసు అంటపోగాను
దారబందము తాకి తలవమురు ఒంపెను
'వల్లకాదు పోట్లాట వద్దు ప్రాణేశ
అనేకవిధముల అవుశకున మాయె'
అని యిట్లు చిటిగోపు ఆడు మాటలకు
'కత్తుల గెరిడిలో వాని శిరస్సు
వుత్తరించిన వెనుక
వాని రక్తంబొట్లు నేల బడను పంత
మున్నాది'

## చిటిగోపుహితవు వినక బేతాళుడు పోట్లాటకు బయలుదేరుట

అని యిట్లు బేతాళుడు అనిన
మాటలకు
అందముగా అరిటాకు సుందర నిమిడి
అన్నము వడ్డించె అతివ చిటిగోపు

అన్నము భోంచేసి హస్తములు కడిగి
వయ్యన ఎగుళ్లు వడచిన వెనుక
లగువు చల్లాతము బిగువుగా
తొడిగినాడు

శిరసున కట్టినాడు కిసురుకత్తులును
రొమ్మున కట్టినాడు రోషదిష్ట
కత్తులూను
ఈపున కట్టినాడు విసురు కత్తులూను
ముంజాత కట్టినాడు కురచ బాకులూను
మోకాలు కట్టినాడు మోపుదిడ్లు కుత్తులు
వకచెంప వెం|ౖటుక దిగ గొరిగించినాడు
పసుపు పూసి కుంకముబొట్లు
పెట్టినాడు
వకచెంప స్త్రీరూపు వకచెంప పురుష
రూపు
ఏదుపందిరూపు వేషమేసినాడు
దట్టెముపై రెండు ఆయుధాలు
ధరియించినాడు
తన దగ్గిరవున్న పిల్లబోడికలకు
మీసాలు దిగ గొరిగించినాడు చీరలు
కట్టించినాడు
పసువుబూసి కుంకము బొట్లు
పెట్టించినాడు
అరివేణిబుడ్లు వారిచేత అందిచ్చినాడు
ఇరుపార్శ్వాలా గౌరికల్యాణం
పాడించుకుంటూ
విసురిసురు కోపాన వీథులకు వచ్చెను
సాములు పరవళ్లు చేస్తూ భేతాళుడు
సాగివస్తూ వుండెను
ఏడి కరియావుల రాజు? ఏడి ఏడి?
యనుచు కలవరిస్తూ వచ్చెను

తిమురుచూ లేచెను కరియావుల రాజు
ధీరత సింహమురీతి
ఎదురేగి ఏడు అడుగులు ఏతెంచి
పోయెను
ఏడి ఏడని నీవు కలవరిస్తూ వచ్చినావు
ఏడిది ముట్టరాదు ఉడుకుది అంటరాదు
ఏడిదిగాక నీపాలిటి కరియావుల రాజు
సద్ది అనుకుంటివా ?
అని యిట్లు కరియావులరాజు అనిన
మాటలకు
ఎదురొమ్మున వున్న నల్లగుండె ఏడు
దబ్బలై పగిలె
అప్పుడు బేతాళుడు ఆడె నొకమాట:
'సింహరాహు గలవాడు కరియావుల
రాజు
పంజమాటలు ఆడి నన్ను పారి
పొమ్మనక
సింహముముందర తెచ్చి
తోస్తిరా నన్ను
కోసమాటలు అడి నన్ను పారి
పొమ్మనక
రోషాలు ఎక్కించి బాలుడంటిరి మీరు'
అని యిట్లు బేతాళుడు బోడికలమీద
దూరెను
అప్పుడు బేతాళుడు ఆ కరియావుల
రాజు
అన్నలు తమ్ములుగా భావించుకొనిరి

# బేతాళుడు కరియావులరాజు ద్వంద్వ యుద్ధమునకు సిద్ధమగుట

"యాడ పోట్లాడదాము తమ్ముడా!
కరియావుల రాజ ?"
"అన్నవు నీవు ఎక్కడ సెలవిస్తే
అక్కడ నే"ననెను
"ఈథిన పోట్లాడదామా కరియావుల
రాజ ?
"ఈథిన పోట్లాడితే ఇల్లాళ్లు మెచ్చరు"
"చదుర్న పోట్లాడదామా కరియావుల
రాజ?"
"చదుర్న పోట్లాడితే సభవారు
మెచ్చరు"
"రచ్చన పోట్లాడదామా కరియావుల
రాజ ?"
"రచ్చన పోట్లాడితే రాజులు మెచ్చరు"
"బజార్న పోట్లాడదామా కరియావుల
రాజ ?"
"బజార్న పోట్లాడితే బావలు
మెచ్చరు"
"ఎక్కడ చెప్పినాను అక్కడ
వోషములు తెస్తూన్నావు
ఇక యాడ పోట్లాడదాము కరి
యావుల రాజ ?"

"కోటి గెరిడీలలోను మేలైన గెరిడి
కతుల గెరిడిలో వక చెయ్యి ఇచ్చేను
పదర !"
కత్తుంగెరిడి అనగాను బేతాళుడు
గల్లున నవ్వెను
ఏకత్తి సందునైనా తొలగదోసి
సంహారం చేస్తానని ధైర్యము
పుట్టెను
బేతాళుడు ముందర రాజు వెనక
వీథిఃమ్మిడి తర్లి వస్తూ వుండగాను
వోరుగంటి ప్రజలు వో వో అని
అడలంగ సాగిరి
కూతుళ్లు గలవారు రాజును చూసి
కుమారిల్లసాగిరి
కొడుకులు గలవారు రాజును చూసి
గోడున అడిలేరు
సూర్య చంద్రులకు వోషము వున్నాది
ఈ రాజుకు వోషము లేదు
రామ లక్షుమణులకు వోష మున్నాది
ఈ రాజుకు వోషము లేదు
కంచమున కుడిచి వారితల్లి మంచాన
పడినా

మల్లెల పాన్పుమీద వాకిటల్లికి
మనసెట్లు పొందెను ?
ఏటి ఇసుకనైనా ఎంచంగవచ్చును
బేతాళుడు చంపిన మాష్టీం నెంచంగ
రాదు
తల ఎంట్రుకలైనా ఎంచంగ వచ్చును
బేతాళుడు చంపిన వారిని ఎంచంగ
రాదు
మింటిమీది చుక్కలైనా ఎంచంగవచ్చు
బేతాళుడు చంపిన వారిని ఎంచంగ
రాదు
ఆకాశవాణి మింటికి ఎగదియ్యరాదా
ఈ రాజును ?
భూమమ్మ పాయిచ్చి కొంచక పోరాదా
ఈ రాజును ?
"అక్కలారా ! నా చెల్లిండ్లలారా !
అలివేణులారా !
దుఃఖము నీకేల? దుగుదాయ మేల !
చింతింప నీకేల ? శివుని దూరనేల ?
గెడియకెల్ల కత్తుల గెరిడిలో బేతాళుని
పొడిచి
కొవ్వుల కండలుగా భూతాలకు విందు
పెట్టి
గెరిడెల్లి వచ్చేటి రాజును నేను"
అని సకల జనులకూ శోకము
మాన్పెను కరియావుల రాజు

బేతాళుడు మునుపర రాజు వెనక
కత్తులగెరిడికాడికి వచ్చి వచ్చినారు
"పదవోయి కరియావుల రాజ
గెరిడిలోకి నీవు"
"నీవు ముందర పదవయ్య నేను
వెనక వచ్చేను"
అని యిట్లు రాజు అను మాటలకు
తాను గట్టిన బిరుదుకింద తాను
సిగ్గుపడక దూరెను బేతాళ
అనుకుంతు లగువుజేసి కరియావుల
రాజు
కత్తుల గెరిడిలో గల్లున ఎగిరి
దుమికెను
కోటానకోట్లు ఆ గెరిడిలో కోర
దానవులు
కరియావుల రాజుమీదికి గ్రక్కున
వచ్చిరి
ఎడమచేత మర్దించి ధరణిపై
వొంచినాడు
గెడియసేపు నిదానించుడి భూత
రాక్షసులార !
బేతాళుని పొడిచి కొవ్వుల కండలుగా
బూతాలకు ఇందుపెట్టి
గెరిడెల్లి పోయేను అని యిట్లు
బూతాలకు ఆనతి జెప్పెను

అప్పుడు బేతాళుడు నాలుగు అల్లలు
గీసె
తమ్ముడా ! కరియావులరాజు అల్ల
వొప్పుకోమనెను
నీవు అన్నవు ముందర వొప్పుకుంటే
చిక్క మిగిలిన అల్లలు నా పాలు
అనెను
వుత్తరపుతట్టు అల్ల వొప్పుకొనెను
అన్న బేతాళ
అప్పుడు కరియావులరాజు ఆళ్లన నవ్వి
"నాలుగు అల్లలు వుండంగ బేతాళ !
వుత్తరపు అల్ల వొప్పుకుంటివి ?
వూరికి వుత్తరాన కాదు అన్నారు
కాదు వొప్పుకుంటివి నీకు కాడే
గెతి గదర !"
"నీవి ఎన్ని అస్త్రాలు ? ఎన్ని
ఆయుధములు ?"
అని అడిగెను బేతాళుడు

"నీవు అన్నవు ముందర జెప్పితేను
అటువెనక చెప్పుతా" ననెను
"నావి ధట్టెముపై రెండాయుధాలు
మూడు అస్త్రాలు
తొమ్మిదిమూళ్లది తొడుపు
జముదాళి వకటి"
అని యిట్లు బేతాళుడు ఆడు మాటలకు
"వినరా!బేతాళ!విన్నపము నీవు
దేవేంద్ర దేవతలు అష్ట దిక్పాలకులు
ఇచ్చిన అస్త్రాలు రెండు
మాతంగ్రడి సింహాద్రినాటి మూడు
జానల ముప్పిరి సురియ వకటి
నీవక్క అస్త్రము నీవక్క సురియ
నామీద వుండజూపు"మన్నాడు
"ముందర ముప్పైమూడు ఆయుధాలు
మూడు అస్త్రాలు
నామీద వుండ జూపు" మన్నాడు

## పోట్లాట

జాకు సాధన పరువళ్లతోను
కరియావులరాజు మీదికి కదిసెను
బేతాళ
ఎదురొమ్మున బొడిచెను రాజును
బేతాళుడు

అల్లవేసి కటారు అటుఎగర జిమ్మె
పోటులేదని మచ్చపుటమ తానెగసి
శిరసున కట్టివున్న కిసురుకత్తులు
తీసినాడు
ఘాత మీదను ఘాత గగ్గోలుపరచి

కరియావుల రాజును గరీన పొడిచె
ఎడమచేత కత్తులు ఎగరదట్టి వేసె
పోటులేదని మచ్చపుటము తానెగసె
ఈపున కట్టివున్న ఇసురుకత్తులు
తీసినాడు
దక్షిణంవున్న కరియావుల రాజును
వుత్తరం తోలినాడు
కరియావుల రాజును కటారున
పొడిచినాడు
ఎడమచేత కటారు నెగదట్టినాడు
రొమ్మున గట్టివున్న రోషబిళ్ల కత్తులు
తీసినాడు
వుత్తరంవున్న కరియావులరాజును
దక్షిణం తోలినాడు
కరియావుల రాజును ఘల్లున పొడిచెను
ఎడమచేత కత్తులు ఎగర తట్టినాడు
పోటులేదని మచ్చపుటము తానెగసె
ముంజేత గట్టివున్న మురుగుబిళ్ల
కత్తులు తీసినాడు
దక్షిణంవున్న కరియావులరాజును
తూర్పు దిప్పినాడు
ఘాతజేసి కరియావుల రాజును ఘల్లున
పొడిచినాడు
ఎడమచాత కత్తులు ఎగర తట్టినాడు
మోకాటికి కట్టివున్న మోపుదిండ్ల
కత్తులు తీసినాడు

ఘాతమీదను ఘాత గగ్గోలుపరచి
కరియావులరాజును పక్కన
పొడిచినాడు
పక్కన పొడిచినకత్తులు కదబడ
జిమ్మినాడు
పోటులేదని మచ్చపుటము తానెగసె
తొమ్మిదిమూళ్లది తొడుపు జముదాళి
తీసినాడు
సాములు చేయుచు పరువళ్లతోను
నాలుగు మూలల తిప్పెను
కరియావులరాజును
కత్తులగెరిడి కనబడకుండాను
రపధూళి ఎగిరెను
ఎఱ్ఱగావు కప్పెను కత్తుల గెరిడంతా
వోరుగంటి ప్రజలు బేతాళుని
బోడికలు
గొప్పైన గుడిగోప్రాలు ఎక్కి కోట
బురుజులు ఎక్కి
బేతాళుని విధము చూస్తూ వున్నారు
రవధూళి ఎగిరెను రాజును
బేతాళుడును కానరాలేదు
అప్పుడు బేతాళుడు ఆదె నొకమాట
"నాదట్టి ముప్ఫైరెండు ఆయుధాలు
అయింది
మూడు అస్త్రాలు అయింది
నీ వక అస్త్రము నీవొంటి సురియ

నామిద వుండజూప"మనెను
"వినరా!అన్న బేతాళ!నీవలె ఎడమ
దట్టెమున చూపి
కుడిదండెమున జూపే రాజులము
గాము
కుడిదండెమున జూపి ఎడమన జూపే
రాజులము గాము
సూర్యచంద్రములకు వోక్షము వున్నాది
నా అస్త్రానికి వోక్షము లేదు
రామలక్షుమణులకు వోక్ష మున్నాది
నా అస్త్రానికి వోక్షము లేదు
నడిమేలు వుంగరముసందుల నల
సురియ వస్తాది

సూసి తప్పించుకోరా అన్న బేతాళ!
పుడతానే పుట్టింది నొష్ట సుక్కబొట్టు
వకటి
పుట్టుమచ్చకు నా సురియ మసులు
చున్నాది
సూటిగా బెట్టింతు నీనొష్ట సుక్క
బొట్టు వకటి
నీ సుక్కబొట్టుకు నా సురియ
మసులుచున్నాది
అని ఎడమకాలి బొట్నేలు దుమ్ము
ఎగరజిమ్మినాడు
బేతాళుడి నొష్టదుమ్ము చుక్కవలె
నిలిచె

## కరియావుల రాజు భేతాళుని వధించుట

ఘాతమీదను ఘాత గగ్గోలుపరచి
ఎడమపాదమున బేతాళుని కుదర
దొక్కినాడు
బేతాళుడి సుక్కబొట్టుకు సురియ
సురియ సూటిగా విడిచినాడు
పొడిచెను కరియావులరాజు పోటు
గెండిగుండ ఎళ్ళవచ్చె
మతిదప్పి బేతాళుడు మానై
కరియావుల రాజుమీద వరగ
బోగాను

దాచేత మర్దించి ధరణిపై తోసెను
మూడు దోసిళ్ల రక్తము ఎత్తి
వోరుగంటి శంభునికి కానుక
బెట్టినాడు
కొలువుకండలుగా భూతాలకు
సెలవిచ్చినాడు
వోరుగంటి ప్రజలు బేతాళుని బోడికలు
బేతాళుని వరసవార్లు బేతాళుడు
వరగగాను
అతిక సంతోషమున అళ్లున నవ్విరి

అప్పుడు కరియావులరాజు ఆడె
నొకమాట
"బేతాళునికి పరసదార్లు వున్నట్లయితే
వానికి అన్నలు తమ్ములు,బావలు
మరుదులు
ఏడుతరాల దాయదాయాదులు
ఎవరైనగాని
వున్నట్లయితే ఇప్పుడే రండి ఈకత్తుల
గెరిడికి
లేకుంటే మానుకోని వుంటాడా మీరు
సురియకు నిమ్మకాయలు దారబు
విడచి

పరలో వుత్తరెస్తినైన సురియను వేసేటి
రాజునుగాను"
అని యిట్లు కరియావులరాజు
ఆశిసంయుంకు
"వానికి అన్నలులేరు తమ్ములు లేరు
దాయాదిబలగము లేదు
వాడు వక్కడే వుండెను పసిగొయ్య
ఈ పట్నాన వాడు
వక్కడుగా నీచేతిలో చచ్చెను"
అని యిట్లు వోరుగంటివారు అనిర
మాటలకు
కత్తులగెరిడి గల్లున ఎగిరిదాటి

## కరియావుల రాజు బేతాలుని తమ్ములను చంపుట

నడివీథిగుండా రాజు నడచిరాగాను
వాడికి గల తమ్ముడు
ముచ్చుకాసూర్యుడు
ముద్దుబేతాళ అనువాడు
"మా యన్నను చంపి నువ్వు
ఎందుబోతావు ?
తిరుగు నామీదికి తిరుగు" అన్నాడు
తిరిగి చూచి కరియావుల రాజు ధీరుడై
నిలచి

ఇంత మోసము వున్నది
వోరుగంటివారిలోను
ఏమి వుండినా నన్ను ఏమి
చేయగలవని
జుట్టు బట్టుకొని నేలకు వంచినాడు
పిడిగుద్దులు గుద్దినాడు
ముచ్చుకాసూర్యుణ్ణి
నెత్తురు గక్కుచు ముచ్చుకాసూర్యుడు
నేలపై వరిగెను

మరి మూడడుగులు రాజు
మొనసిరాగాను
వాడిగల తమ్ముడు రంపాల కేశవయ్య
రాయబేతాళుడు
"మా యన్నల ఇద్దర్ని చంపి నీవు
ఎందుబోతావు!
తిరుగు నామీదికి యుద్ధానికి
తిరగమన్నాడు"
కన్నుల చూచెను కరియావులరాజు
చెయ్యి బట్టుక వాడి నెత్తిన గుద్దగాను
జానెడు పొడువు నాలిక తెరిచెను
వాడి శిరసు పగిలి మెదుడు కుప్పలుగా
పడెను
ముగ్గురి మాష్టీల కొట్టెను వక్క
ముమ్మరమ్మనను
ఆడనుంచి కరియావులరాజు తర్లి
వొస్తూవుండగాను
స్తానమాడు జలధిలోకి తానుపోయినాడు
స్తానమాడి రాజు ధవళవస్త్రము గట్టి
వీథూది పూసెను ఆ రాజఘనుడు
సంతవీధులగుండా రాజు
తర్లివచ్చినాడు

## కరియావుల రాజు శంభుని సేవించుట

శంభుని దేవళానికి చేరంగ వచ్చెను
ప్రదక్షిణం తిరిగి పరమేశ్వరు చూచి
శంభునికి శివపూజలు కావించినాడు
పందుము సెనిగెలు పలారను
చేయించె
శివపూజలు చేసి శివుని మెప్పించి
అన్నలు పోయిన దోవ తమ్మునికి
తెలియక
అనుమంతు సంజీవరాయుడు దేవళానికి
తగ దర్శివచ్చె
అంజలి జేసి మ్రొక్కె ఆంజనేయునికి
పిల్లబంటుని పిలిచి భీకరంబున
తన తేజీని తెమ్మని విన్నవించెను
కరియావుల రాజుకొలువుకు అశ్వాన్ని
తెచ్చెను
అశ్వాన్ని ఎక్కెను ఆ రాజఘనుడు
ఈదులు బజార్లు విడిబడి రాజు
సన్నజంబుల వీరబయటికి తర్లి
వచ్చినాడు
తమకు ఎత్తించి వుండేటి కరకంచు
గుడారులో కొలువుదీరినాడు
అంతట వోరుగంటివారు
పానుగంటివారు

గవిలికొండవారు గవిచెర్లవారు
కొలువుచావిడిగా కొలువై కూర్చుండిరి

ఆ పట్నము ఏలేటి పట్టాభిరుద్రుని
కొలువుకు పిలిపించుకొని
అందరుగూమిగూడి ఆలోచన చేసిరి

## పట్టాభిరుద్రుడు కరియావుల రాజుపై అయితమరాజుకు పితూరీ చెప్పుట

"భూమిలో యాదవులు పుణ్యాత్ములని
చెప్పుదురు
శరణంటే కాస్తురు అభయమంటే
వెనకేసుకొస్తురు
శరణంతా బిరుదులు వారిమందన
చెల్లివున్నాది అని చెప్పుదురు
తిరుణాళ్ళని మాభూమికి మీరు
తర్లివచ్చినారు
తిరుణాళ్ళ సేవించి మీరు తిరిగి
పోకుండ
మీతమ్ముడు కరియావుల రాజు
అనేవాడు వచ్చి
మా పట్నమంతా అల్లకల్లోలము చేసి
బేతాళుడు కట్టించిన బిరుదులు
వేగిరం తన్ని
ముగ్గురు మాష్టీలను పక్క
ముమ్మరంబున జంపి

మా పట్నమంతా రూఢిపరచి
మీ తమ్ముడు కరియావులరాజు
తర్లివచ్చినాడు" అని
నెత్తురు తడిసిన కోకలు హర్కార్ల
చేత
సన్నజంబుల వీర బయటికి
అంపించినారు
ఆడనుంచి హర్కార్లు తగ దర్లివచ్చిరి
అయితమరాజు కొలువుకు అతివేగ
వచ్చిరి
నెత్తురుకోకలువారు అయితమరాజు
ముందర వుంచిరి
నెత్తురుకోకలు చూచి రాజు ఆగ్రుడై
మండెను
కన్నుల కోపంబు గదలుకొనంగ
భగ్గుభగ్గున మండి పల్లికొండను పిలిచె

## అయితమరాజు కరియావులరాజునుచంపుట కాజ్ఞయొసంగుట

"వినవే విద్దముల ఇలగురువ :
ఇల్లటవు అల్లుడా :
పందముల పల్లికొండ : బంధు
సహోదరుడ :
నా తమ్ముడు కరియావులరాజు
అయినచోట వాడు కానితనము
తెస్తాడు
కలహము లేనిచోట కలహము
తెస్తాడు
పోరు లేనిచోట పోరు తెస్తూవున్నాడు
జగడము లేనిచోట జగడము తెస్తాడు
ఎన్నాళ్లకైనా మనకు మోసమేను మన
పట్నానికి మోసమేను"
అగ్గులు గురియుచు బగ్గుబగ్గున మండి
"ఈ రాజును పెట్టుకొనేద అగ్గులు
వాడిగట్టినట్టు
బావ రావే పల్లికొండ : కరియావుల
రాజును చంప
నెత్తురుకోకలు వోరుగంటికి
అంపించు బావ :"
ఆ మాటలు విని పల్లికొండ బగ్గుబగ్గున
మండి ఆడె నొకమాట
"వినవయ్యా నా మరది: అయితమరాజ
పగవారి మాటలు విని నీ సైదోడును
చంపుమనేవు మరిది ముందువెనుక
తెలియక :
కరియావుల రాజును చంపుమంటివి
నా చిన్నమరిది :
ముందువచ్చే యోచన తెలియక పోయె
నా చిన్నమరిది :"
అని యిట్లు పల్లికొండ ఆడుమాటలకు
ఆగ్రుడై మండి అయితమరాజు ఆడె
నొకమాట
చేసెను కోపంబు శంకలేకుండ
"నెత్తురు కోకలు వోరుగంటికి
అంపించవే బావ
లేకుంటే బావ పల్లికొండ : ఆయుధం
మీద ప్రాణం వొప్పిస్తూ వున్నాను"
"వల్లవుల నా మరిది: వలురాచమరిది:
మీకు పట్టపుదొరలకు ఇంత కోపంబు
యాల ?
మేము ఏమి శాయగలము ?
మంచి"దని వప్పుకొనెను మరి
పల్లికొండ :
ఆడనుండి వచ్చెను మరి పల్లికొండ
ఏడు నిలువులలోతు కావుపాతర
కావించినాడు

అశ్వానికి గెడ్డి కవళం ఆ కావు
పాతరలో కావించినాడు
ఆ రాజుకు అన్నములు ఆ కావు
పాతరలో వుంచెను
ఆ కావుపాతరమీద పలకలు
పరిపించినాడు
కరియావుల రాజుకొలువుకు వచ్చెను
బావ పల్లికొండ
"మా మనవి చేకొని మమ్ము
రక్షించవయ్యా
పిన్నమామలకు అల్లుడా : విరుదుగల
రాజ :
నిన్నటి దినము మేము వోరుగంటికి
పోయిన వెనుక
మరిదీ : కరియావుల రాజ : సన్న
జంబుల వీరబయలు విడిచి
వోరుగంటికి వొచ్చినారని పట్టాభి
రుద్రుడు కమ్మలు పంపెను
కమ్మ చదువగాను వోరుగల్లంతా
అలాకు పరచినట్లు వుండెను
అంతట మీయన్న అయితమరాజు
కొలువుకు
వోరుగంటివారు పానుగంటివారు
గవిలికొండవారు గవిచెర్లవారు
నెత్తురుకోకలు అంపించినారు
అది చూచి మాయన్న ఆగ్రహుడై వుండి
వల్లవుల నా మరిది : పలరాచమరిది:
కాకులు దూరని కారడవిలోను
చీమలు దూరని చిట్టడవిలోను
నిను చంపి నెత్తురుకోకలు
వోరుగంటివారికి అంపించమన్నాడు
ఎంత జెప్పిన వినలేదు మీయన్న
అయితమరాజు
నా మనవి నీవు చిత్తగించినట్లయితే
ఏదుగెదియలు నిన్ను కావుపాతర్లో
వుంచి.
ఎనిమిదో గెడియకు మరిది
కరియావులరాజ
మీ అన్న అయితమరాజుకొలువుకు
నిన్ను తెచ్చేను నా చిన్నమరది"
అని కరియావుల రాజుకు మనవి
చెప్పినాడు
కోపమున లేచి కరియావులరాజు
ఆగ్రహుడై వుండెను
తెల్లని కన్నులకు తెచ్చె రక్తంబు
గరగర అంబులు నాటినట్లాయెను
అంతట బావ పల్లికొండ ఆడె
నొకమాట